స్త్రీల సమస్యల సర్వస్వమనదగిన పుస్తకం

# స్త్రీ - పురుష అసమానతా సమస్యలు

కె.యస్. రెడ్డి

# స్త్రీ-పురుష
# అసమానతా సమస్యలు

రచన

కె.యస్. రెడ్డి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

ప్రజాశక్తి బుక్ హౌస్

1-1-298/4, స్ట్రీట్ నెం. 1, అశోక్‌నగర్,

హైదరాబాద్ - 500 020. ఫోన్ : 7665420

WI-B7
Prasanthi Nilayam
Anantapur Dist. (A.P.)
Pin Code : 515 134

**వెల : రూ. 250/-**

*పుస్తకాలు దొరకుచోటు :*

ఈ పుస్తకపు ప్రతులు దిగువ పేర్కొన్న
నగరాలలోని ప్రజాశక్తి బుక్‌హౌస్ వారి
బ్రాంచీలలో కూడా లభిస్తాయి

- హైదరాబాదు • హనుమకొండ • నల్గొండ
- ఖమ్మం • విజయవాడ • విశాఖపట్టణం • తిరుపతి

*టైప్ సెట్టింగ్ :*
వి.యస్.యస్. లేజర్ గ్రాఫిక్స్
హైదరాబాద్ - 500 004.
ఫోన్ : 3325979

*ముద్రణ :*
ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాదు - 500 004.

*పిన్న వయసులో వైధవ్యం ప్రాప్తించగా*
*ఆవిడను కష్టాల కడలి చుట్టుముట్టింది.*
*పసిగందునైన నన్ను వీపుకు గట్టుకొని*
*అకుంఠిత ధైర్యంతో*
*ఆ కడలినీది నన్ను గట్టెక్కించిన*

మా అమ్మ
కోలా పుల్లమ్మ
దివ్యస్మృతికి



"....కుటుంబ వస్తుసముదాయంలోనూ, వనరులలోనూ స్త్రీ-పురుషులు, ఎవరు ఎంత పరిమాణాన్ని వినియోగించుకొంటున్నారు అని గాక, మానవ జీవనానికి అత్యంత సహజము, కీలకము అయిన ఆరోగ్యప్రదమూ, గౌరవప్రదము అయిన జీవనం, సృజనాత్మక శక్తుల వికాసం వంటి వాటిని వారు అనుభవించటంలోని అసమానతలను పోల్చి చూడటం ద్వారా మనం స్త్రీ-పురుష అసమానతలను బాగా అర్థం చేసుకోవటానికి వీలుంటుందని నేను వాదిస్తాను. తరచి చూడగా స్త్రీ-పురుష అసమానత్వం వారనుభవించే స్వాతంత్ర్యాల భిన్నత్వంగా గోచరిస్తుంది.

నోబెల్ బహుమతి గ్రహీత

ప్రొఫెసర్ అమార్త్య సేన్

# విషయ సూచిక

# ముందు మాట

రాజమండ్రిలోని ఒక కాలేజీలో బి.ఎ. చదువుతున్న నారాయణరావు, శీతాకాలపు సెలవులకు స్వగ్రామమైన ముంగొండ అగ్రహారాని కొచ్చాడు. వీరి భార్య సత్యవతి. కాపురాని కొచ్చింది వీరి అన్న వెంకటేశ్వర్లు; వారి భార్య సుందరమ్మ; ఆ అవిభక్త కుటుంబంలో పెద్ద కోడలు; సత్యవతికి తోటికోడలని వేరుగా చెప్పనవసరం లేదు.

సుందరమ్మ తొలి కాన్పుకు ఆడపిల్ల పుట్టింది. పుత్రోదయం ఇంకా, కావలసే ఉంది. మరది ఎపుడు ఇంటికొచ్చినా సాదరంగా పలకరించటం సుందరమ్మకు అలవాటు. అటువంటి సుందరమ్మ, ఇవాళ నారాయణరావును పలకరించలేదు సరిగదా, ఆయన కంట కూడా పడలేదు. రాత్రి పడుకోబోయే ముందు భార్య సత్యవతిని నారాయణరావడిగాడు . "వదిన ఎక్కడా జాడలేదు; నేను వస్తే కనుపించకుండా ఉండేదిగాదు; ఆ వీధి పుట్టింటి కెళ్ళిందా యేమిటి?" అని. "లేదు, ఆవిడ ఇంట్లోనే ఉన్నది. పొద్దున్న అత్తగారు ఎందుకో కోపపడి కొంచెం తిట్టారు. అందు మీద కోపం వచ్చి పొద్దుణ్ణుండీ అన్నం తినకుండా గదిలో ముసుగు పెట్టుకొని కింద పడుకుంది. నేను యెన్ని విధాల బ్రతిమాలుకొన్నా అన్నానికి లేచిందిగాదు" అంటూ సుందరమ్మ కనుపించని కారణాన్ని సత్యవతి వివరించింది. "అసలు ఇవాళ కజ్జా ఎందుకొచ్చింది?" అని నారాయణరావు అడిగాడు. దానికి కారణాన్ని సత్యవతి ఇలా వివరిస్తుంది : "ఇవాళ యెవరో మన యింటికి చంటి పిల్లవాణ్ణి యెత్తుకు వచ్చినారట. యేదో మాటా మంతీ వచ్చి "మీ కందరికీ పనసపండువలె కొడుకులు పుడతారు. మా నిర్భాగ్యురాలు యెందుకూ పనికిరాని ఆడముండను కన్నది. ఆడచెత్త యెందుకు? నా కొడుకు చేసుకొన్న ప్రాలుబ్ధం కొద్దీ యిటువంటి పెండ్లాం దొరికింది" అని అత్తగారేమో అన్నారట. అంచుమీద అక్కయ్యకు వుడుకుమోత్తనం వచ్చి "ఆడది పుడితే నేను యేం చేస్తాను? కావలిస్తే మీ కొడుకు లోపం గాని నా లోపం యేమీ లేదు" అనేటప్పటికి యిద్దరూ అంటుకొని ఖజ్జా ఆడినారు".

ఈ ఘట్టాన్ని, ఇటీవలె ప్రచురితమైన కథలోనిదనో, నవలలోనిదనో భ్రమపడకూడదు. స్త్రీ జనోద్ధరణకు సర్వస్వాన్నీ అర్పించిన సంఘ సంస్కర్త కీ॥శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు 1883వ సంవత్సరంలో వ్రాసిన నవల "సత్యవతీ చరిత్రము" లోనిది.

ఈ నవలా రచన తర్వాత నూట పదహేరు సంవత్సరాలు గడచినా, స్త్రీ శిశువు ఇంకా "ఆడచెత్త"గానే పరిగణనకు వస్తున్నది. పసికందులు విలపిస్తూనో, విగత జీవులుగానో చెత్తకుండీలలో కనుపిస్తూండటమే ఇందుకు తిరుగులేని నిదర్శనం. నాగరికత పెరుగుతున్నా, ఆధునిక విజ్ఞానం విస్తరిస్తున్నా, మనుషుల మనసుల ఆధునీకరణ జరుగుతున్న సూచనలు కనుపించటం లేదు. "ఆడ చెత్తను" విరగడ చేసుకోవటానికి ఆధునిక విజ్ఞానాన్ని విస్తృతంగానూ, విశృంఖలంగానూ వినియోగించటం మాత్రం సర్వత్రా కనుపిస్తున్నది. "వంశోద్ధారకుని" కనలేని పాపానికి కోడండ్రు, అత్తల ఆరళ్ళకు, భర్తల బెదరింపులకూ గురవుతూనే ఉన్నారు; గృహబహిష్కారాన్ని పొందుతున్న అభాగినులూ ఉన్నారు కాలం మారుతున్నా పురుషుని కంటే స్త్రీ తక్కువది అన్నభావం మాత్రం సామాజికులలో అంతరించటం లేదు.

1994వ సంవత్సరం వేసవిలో నేను అమెరికా వెళ్ళే కాలానికే, స్త్రీ-పురుష అసమానతా సమస్యాధ్యయనానికి నాలో ప్రేరణ గలిగింది. కాలానుగతంగా అధ్యయనాసక్తి పెరుగసాగింది. అమెరికాలో ఏ పుస్తకాల షాపుకు పోయినా, ఏ గ్రంథాలయానికి వెళ్ళినా, ఈ అంశం మీద ఏమయినా సమాచారం లభిస్తుందేమోనని వెదుకుతూండేవాడిని. క్రమంగా దొరికిన సమాచారాన్ని సేకరించే ప్రయత్నం కూడా ప్రారంభించాను. ఈ సాహిత్యంలో భిన్న దృక్పథాలు కనుపించాయి. ఏది వాస్తవానికి దగ్గరగా ఉన్నది, ఏది ఆచరణీయము అన్న అంశ నిర్ధారణ నాకు చాలా కష్టమైన పనైంది. భిన్నాభిప్రాయాల కీకారణ్యంలో ఉన్నట్లనిపించింది. ఈ మానసిక స్థితిలో నున్న కాలంలో, హార్వర్డులో, లేమాంట్ యూనివర్శిటీ ప్రొఫెసర్‌గా ఉన్న అమార్త్య సేన్ 1990వ సంవత్సరంలో వ్రాసిన "మోర్ దాన్ హండ్రెడ్ మిలియన్ ఉమెన్ ఆర్ మిస్సింగ్" అన్న వ్యాసాన్ని చదివే అవకాశం లభించింది. ఇది అత్యంతాసక్తి దాయకంగా ఉండి, నా అధ్యయనాసక్తిని పెంచింది. జండర్ ప్రోబ్లమ్స్ మీద ప్రొఫెసర్ సేన్ వ్రాసిన కొన్ని వ్యాసాలను చదువగోరి, నాలుగు పరిశోధక పత్రాల కాపీలను పంపమని అర్థిస్తూ వారికి జాబు వ్రాశాను. నేను కోరిన నాలుగు పత్రాల కాపీలను వారు సాదరంగా పంపించారు. వీరు వ్రాసిన ఇనీక్వాలిటీ రిఎక్జామిన్డ్ అన్న రచన యొక్క పేపర్‌బాక్ ఎడిషన్‌ను హార్వర్డు విశ్వవిద్యాలయం వారు 1995లో ప్రచురించారు. ఇంతకు పూర్వమే నేను చేసిన నా అభ్యర్థనను గుర్తుంచుకొని ప్రొఫెసర్ సేన్ దాని ప్రతినొక దానిని పంపారు. వారి ఇతర రచనలను కూడా చదివి, స్త్రీ పురుష అసమానతా సమస్యల మీద వారి భావాలను ఆకళింపు జేసుకోవటానికి శ్రమించాను. వీరి సాహిత్యాధ్యయనం తర్వాత, ఈ సమస్య మీద ప్రకటితమవుతున్న భిన్నాభిప్రాయ కీకారణ్యం నుండి బయటబడే మార్గం నాకు కనుపించింది. ఏ సమాజంలోనూ, అది యెంతటి అభివృద్ధిని సాధించినదయినా, పురుషునితో సమానమైన స్థానం స్త్రీకి లభిస్తూండకపోవటం, కుటుంబ వనరులను పురుషునితో సమంగా వాడుకొనే అవకాశాలు స్త్రీకి ఉండకపోవటం, స్త్రీ అనుభవించవలసి వస్తున్న బాధలకు మూలమని ప్రొఫెసర్ సేన్ ప్రతిపాదించారు. ఈ రెంటిలో మొదటి దానిని "ఇనీక్వాలిటీ"గానూ, రెండవ దానిని "డిప్రీవియేషన్"గాను వారు పేర్కొన్నారు. ఇనీక్వాలిటీ రిఎక్జామిన్డ్ అన్న రచనలో ఈ అంశాన్ని మరింత సూక్ష్మీకరించారు. స్త్రీ-పురుష అసమానతలను, స్త్రీలు, పురుషులు అనుభవిస్తున్న స్వాతంత్ర్యాల భిన్నత్వంగా నిర్వచించారు.

స్త్రీ-పురుష అసమానతా దుష్ఫలితాల మీద ప్రవాహంలా సాహిత్యం వస్తున్నది. ఈ విషయం మీద వస్తున్న పుస్తకాలలో అత్యధిక భాగం ఏ ఒక్క అంశానికో పరిమితమై యుంటున్నాయి. పైగా ఈ సాహిత్యమంతా ప్రధానంగా ఇంగ్లీషులో ఉంటున్నది. తెలుగు మాత్రమే చదువ నేర్చిన స్త్రీలు దీని ప్రయోజనాన్ని పొందలేకపోతున్నారు. ఇంగ్లీషు భాషా జ్ఞానం ఉన్నవారిలో చాలా మందికి ఈ సాహిత్యాన్ని సేకరించే అవకాశాలుండటం లేదు. వీరి ప్రయోజనానికి ఈ అంశం మీద పుస్తకం వ్రాస్తే బాగుంటుంది అన్న ఆలోచన పొటమరించింది. ఈ ఆలోచన కాలానుగతంగా బలపడి, ఈ రచనకు దారిదీసింది.

ప్రొఫెసర్ అమార్త్య సేన్ ప్రతిపాదించిన సూత్రీకరణలను మార్గదర్శకాలుగా పెట్టుకొని స్త్రీ - పురుష అసమానతా సమస్యల పరిశీలనకు పూనుకొన్నాను. వివిధ రంగాలలో స్త్రీ పురుష అసమానతా రూపాలు, స్థాయి, పరిమాణము ఎంత, దానివల్ల స్త్రీ ఎలా నష్టపడుతున్నది, కుటుంబము, సమాజము ఎంత నష్టపోతున్నది వంటి అంశాలను పరిశీలనకు తీసుకొన్నాను. పురుషాధిక్యతా భావం వల్ల తాము ఎలా నష్టపడుతున్నదీ పురుషులకు కూడా తెలియజెప్పే ప్రయత్నం చేశాను. తమ బాధలకు మూల కారణాలను తెలుసుకోవటం స్త్రీలకు ఎంత అవసరమో, పురుషాధిక్యతా భావపు అమలువల్ల తాము ఎంతగా నష్టపోతున్నదీ, సమాజం ఎంతగా నష్టపడుతున్నదీ తెలుసుకోవటం పురుషులకు కూడా అంత అవసరమని తెలియజెప్పే ప్రయత్నం చేశాను. స్త్రీ పురుష అసమానత్వం చట్టాల అమలు వల్ల మాత్రమే నిర్మూలించ సాధ్యమైనది గాదని గత శతాబ్దపు చరిత్ర నిరూపించింది. ఈ భావ నిర్మూలనకు పురుషుల సహకార సాధన కూడా అవసరమని, వారిని చైతన్యవంతులను చేయటానికి ప్రయత్నించాను.

ప్రపంచ బ్యాంకు, ఐక్యరాజ్యసమితి, యు యన్ డి పి (UNDP), యునిసెఫ్ (UNICEF), ప్రపంచ ఆరోగ్యసంస్థ (WHO), ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ (ILO) వంటి ఐక్యరాజ్యసమితి అనుబంధ సంస్థలు ప్రచురించిన పలు రిపోర్టులు, పరిశోధనా పత్రాలు, ఇతర ప్రచురణలు ఈ రచనకు మూలాధారాలు. ప్రొఫెసర్ అమార్త్య సేన్ రచనలు కూడా అధికంగా తోడ్పడ్డాయి. ఇవిగాక, నాకు తోడ్పడిన రచనలు అసంఖ్యాకంగా ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఎందరో పరిశోధకులు, ఆయా విషయాలలో నిపుణులయిన మహానుభావులు ఎంతో వ్యయ ప్రయాసల కోర్చి సేకరించిన సమాచారమూ, వారి విశ్లేషణా ఫలితాలూ ఈ రచనకు ఉపకరించాయి. ఈ సమాచారాన్ని నాకు ఉచితమని తోచిన రీతిని తిరుగ వ్రాశాను. పూదోటలో పలురకాల పూలు పూస్తాయి. వాటిని సేకరించి తోటమాలి అందమైన మాలను అల్లుతాడు. నేను చేసిన కృషి కూడా అటువంటిదే. తోటమాలి తోటలోని పూలనేరి మాలను అల్లితే, విజ్ఞాన పూదోట నుండి అక్షర కుసుమాల నేరి అక్షరమాల నల్లి పాఠకలోకానికి, ముఖ్యంగా మహిళా లోకానికి సమర్పిస్తున్నాను. ఈ రచయిత లందరకూ, నేను ఎంతగానో రుణపడి ఉన్నాను. అడిగినదే తడవుగా, తమ రచనలను పంపి తోడ్పడిన నోబెల్ బహుమతి గ్రహీత ప్రొఫెసర్ అమార్త్య సేన్‌కు, ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉన్న బ్రిటిష్ ఎకనామిస్ట్ ప్రొఫెసర్ జీన్ డ్రేజ్‌కు, హార్వర్డ్ ఇన్స్టిట్యూట్ ఫర్ ఇంటర్నేషనల్ డెవలప్‌మెంట్ సంస్థలో డెవలప్‌మెంట్ ఎడ్వయిజరుగా పనిచేస్తున్న మార్తా ఆల్టర్ చెన్‌కు ఎంతగానో రుణపడి

ఉన్నాను. స్త్రీల ఆరోగ్య విషయాలకు సంబంధించిన సమాచారాన్ని వరల్డ్‌బ్యాంకు ఎక్స్‌పర్ట్ డాక్టర్ ఏనీ టింకర్ రచనల నుండి, ఆవిడ సంపాదకత్వాన వెలువడిన పలు ప్రచురణల నుండి ప్రధానంగా సేకరించాను. వీరికి కూడా నేను అధికంగా రుణపడి ఉన్నాను. హెచ్ ఐ వి / ఎయిడ్స్, సుఖరోగాల లక్షణాలకు సంబంధించిన సమాచారాన్ని మెర్క్ మెడికల్ మాన్యువల్ - 1998 నుండి తీసుకొన్నాను. మరెందరో మహానుభావుల రచనలు నాకుపకరించాయి. వారి పేర్లను రచనలో ఆయా సందర్భాలలో ఉదహరించాను. వీరందరికీ నేను రుణపడి ఉన్నాను.

ఈ పుస్తకాన్ని సామాన్య పాఠకులను దృష్టిలో పెట్టుకొని వ్రాశాను వారి అవగాహనా స్థాయికి దగ్గరగా విషయాన్ని వివరించటానికి తాపత్రయ పడ్డాను. వీలయినంత సరళమైన భాషలో విషయాన్ని వివరించే ప్రయత్నం చేశాను.

సంఖ్యా వివరాలను చూస్తేనే కొందరకు తలనొప్పి వస్తుంది. వాటిని చూచి ఈ పుస్తకం మనకు తగనిదని సామాన్య పాఠకులు భావించే అవకాశాలున్నాయి. సంఖ్యా వివరాలు అవసరం లేదు అని అనుకొన్నవారు, వాటిని వదలివేసి చదివినా, విషయావగాహనకు ఎలాంటి లోపమూ ఉండదు. అదనపు సమాచారాన్ని కోరేవారు పట్టికలను వివరంగా పరిశీలించవచ్చు. కొన్ని పట్టికలలోని అంశాలను పాఠ్యభాగంలో ప్రస్తావించకపోయినా, కావాలనే వాటిని ఇచ్చాం. విషయాసక్తి గల వారికివి అధికంగా ఉపయోగపడతాయని భావించాం రచనలోని సంఖ్యా వివరాలు, ఒకే విషయానికి సంబంధించినవి, కొన్ని సందర్భాలలో భిన్నంగా కనుపించవచ్చు. ఆయా సంఖ్యా వివరాల సేకరణలో అవలంబించిన విధానాల వలన ఇలాంటి తేడాలు కనుపిస్తాయి. అందువల్ల సంఖ్యా వివరాలను కొలమానాలుగా గాక, అల్పం, మధ్యమం, అధికం అనే స్థూలమైన సూచికలుగా పరిగణించగోరుతున్నాను.

స్త్రీలలో అత్యధిక సంఖ్యాకులకు గ్రంధ పఠనకు తగినంత కాలవ్యవధి లభించటం కష్టం. ఒక్క బిగువున పుస్తకాన్ని ఆది నుండి అంతం వరకూ చదువగలిగినంతటి కాలవ్యవధి లభించగల అవకాశాలు ఉన్నవారు అతి తక్కువ మంది మాత్రమే ఉంటారు. తీరిక దొరికినపుడల్లా, ఒక్క అధ్యాయాన్నైనా పూర్తిగా చదువగల అవకాశాలు లభించే పాఠకుల ప్రయోజనాన్ని కోరి, ప్రతి అధ్యాయము స్వయం సంపూర్ణంగా ఉండేట్లు చూశాను. ఇందువల్ల వెనుకనున్న ఒక అధ్యాయాన్ని చదవనందున ఈ అధ్యాయంలోని విషయం అర్థం గాలేదు అనే బాధ పాఠకుల కుండదు. ఈ కారణం చేతనే, పూర్వం ఒక అధ్యాయంలో వివరంగా ఉన్న విషయాన్ని, సందర్భశుద్ధిని గోరి సంక్షిప్తంగానైనా తరువాతి అధ్యాయాలలో ప్రస్తావించక తప్పలేదు. అత్యధిక పాఠకుల మేలుగోరి పాటించిన ఈ పునరుక్తి "దోషం", చురుకైన పాఠకులకు, విషయ పరిజ్ఞాన స్థాయి అధికంగా ఉన్నవారికి చిరాకును గలిగించటం సహజం. అశేష పాఠకుల ప్రయోజనాన్ని కోరి నేను చేసిన ఈ "తప్పిదానికి" మన్నించమని కోరుతున్నాను.

ఈ రచనలో "ఈ శతాబ్దము" అని వచ్చినచోట్ల దానిని 20వ శతాబ్దముగా పరిగణించగోరుతున్నాను. మనం త్వరలో 21వ శతాబ్దంలో ప్రవేశించబోతున్నాం గనుక ఈ విజ్ఞాపన అవసరమవుతున్నది.

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాను అమెరికాగా రచనలో పేర్కొన్నాను. వెనుకబడిన దేశాలు, అభివృద్ధి చెందిన దేశాలవంటి వర్గీకరణల కిందకు వచ్చే దేశాల లిస్టునూ, వివిధ భౌగోళిక మండలాల కిందకు వచ్చే దేశాల పేర్లను, ఆయా వర్గీకరణల వారీగా వ్రాసి, పుస్తకం చివర అనుబంధంగా ఇచ్చాం.

ఈ రచనకు మా కుటుంబీకులు ఎవరికి చేతనయిన సహాయాన్ని వారు చేశారు. ఈ విషయాధ్యయనానికి, రచనకూ అవసరమైన సకల సదుపాయాలనూ మా చిన్న కుమారుడు చిరంజీవి శ్రీనివాస్ సమకూర్చాడు. వీడి సహకారం లేకుండా ఈ పుస్తక రచన నాకు సాధ్యమయ్యేది గాదు. అమెరికన్ మెడికల్ అసోసియేషన్ ప్రచురించిన సమాచారాన్ని, వైద్య వృత్తిలో నున్న మా పెద్దవాడు చిరంజీవి రమేష్ సేకరించి ఇచ్చాడు. నాదస్తూరి బాగుండకపోవటం చేత మా ఆవిడ శ్రీమతి కన్యాకుమారి శుద్ధప్రతిని వ్రాసి ఇచ్చింది. ప్రూఫ్ రీడింగ్ భారాన్ని కూడా తానే తీసుకొని నా శ్రమను బాగా తగ్గించింది. వీరికి కూడా నేను ఋణపడి ఉన్నాను.

రచనను 1998వ సంవత్సరం జూలైలోనే ముగించగలిగినా, పుస్తక ప్రచురణకు పధ్నాలుగు మాసాలు పట్టింది. ఇందులో తొమ్మిది మాసాలు ప్రచురణకర్తల కోసం వెదుకులాటలో పోయింది. ఈ ప్రయత్నం ఫలించకపోవటం వల్ల మనోవ్యాకులతలో పడిన నన్ను శ్రీ పరుచూరి హనుమంతరావు, శ్రీమతి సీతాలక్ష్మిగార్ల కుమారుడు, ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత చిరంజీవి నరేంద్ర ఆదుకొన్నారు. పుస్తకం యొక్క సామాజిక ప్రయోజనాన్ని గుర్తించి, ప్రింటింగ్ బిల్లును చెల్లించగల నా శక్తిని కూడా అంచనా వేసుకోకుండా దీనిని అతి స్వల్ప కాలంలోనే గాకుండా, అందంగా కూడా ముద్రించి ఇచ్చారు. వీరికి కూడా నేను ఎంతగానో ఋణపడి ఉన్నాను.

నాబోటి సామాన్యునకు ఈ రచన భారమైన పని. ఎందరో మిత్రులు, శ్రేయోభిలాషులూ నా కృషికి తమకు చేతనయినంత సహాయాన్ని చేశారు. వీరందరనూ ఇచ్చట పేర్కొనక పోయినంత మాత్రాన వారి సహాయాన్ని రచయిత మరచినట్లు భావించవద్దని నా మనవి.

అందుకే చెబుతున్నాను

*"ఎందరో మహానుభావులు*
*అందరికీ నా వందనములు"*

– కె.యస్.రెడ్డి

ప్రశాంతి నిలయం
అక్టోబరు, 1999

# 1

## కుటుంబంలో కల్పవల్లి

మధ్య తరగతి కుటుంబానికి చెందిన ఇల్లాలిని "అమ్మా మీ వారేం చేస్తూంటారు" అని అడిగామనుకోండి. "మావారు ఉద్యోగం చేస్తున్నారు, నేను మాత్రం ఇంటిపట్టున ఉంటూ పిల్లలను చూసుకొంటూ ఉంటాను" అని ఆవిడ సమాధానం చెబుతుంది. గృహ కృత్యాలలో మునిగి, భర్త కంటె ఎక్కువ కాలమే తాను పనిచేస్తున్న విషయాన్ని ఆవిడ గ్రహించలేక పోతున్నది. తాను చేస్తున్న పని భర్త చేస్తున్న పనంత ముఖ్యమైనదేనన్న అంశాన్ని ఆవిడ తెలుసుకోలేక పోతున్నది. ఆయన సంపాదన రొఖ్ఖరూపంలో కనుపించటం, తనపనికి అటువంటి ప్రతిఫలం లభించక పోతూండటం వల్ల, వారినే సంపాదనా పరునిగా ఆ ఇల్లాలు భ్రమిస్తున్నది తాను వారిచేత "భరింపబడేవ్యక్తి" నన్న భావం ఆవిడలో జీర్ణించింది.

ఇలాంటి ప్రశ్ననే వ్యవసాయ కుటుంబానికి చెందిన ఇల్లాలిని అడిగామనుకోండి. ఆవిడ కూడా "మావారు వ్యవసాయపు పనులు చూస్తూంటారు, నేను ఇంటిపట్టున ఉంటాను" అని చెబుతుంది. రైతు కుటుంబాలకు చెందిన మహిళలు ఇంటి పట్టున ఉన్నా, భర్తల కంటే ఎక్కువ కాలమే పనిచేస్తుంటారు.

ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ వారు నల్లగొండ జిల్లాలోని భువనగిరి తాలూకాకు చెందిన రాయగిర్, కూనూర్, సురేంద్రనగర్ గ్రామాలలో చిన్నరైతులు (సన్నకారు రైతులు), వ్యవసాయ కూలి కుటుంబాల మీద జరిపించిన సర్వేలో కూడా ఈ విషయం రుజువైంది. వ్యవసాయ కూలీ కుటుంబానికి చెందిన స్త్రీలు ఉదయం నాలుగు లేక ఐదుగంటల నుండి, రాత్రి ఎనిమిది గంటల వరకూ విరామంలేకుండా పనిచేస్తూంటారని సర్వేయర్లు రికార్డు చేశారు. వ్యవసాయ పనులు ముమ్మరంగా జరిగే రోజుల్లో, రోజుకు పదిహేను గంటల వరకూ వీరు పనిచేస్తున్నట్లు సర్వే వెల్లడించింది. మగవారు మాత్రం రోజుకు సగటున ఎనిమిది గంటల కాలం పనిచేస్తున్నట్లు తేలింది. సన్నకారు రైతు కుటుంబాలకు పశువులుంటాయి గనుక ఇంటిపట్టున ఉండే ఇల్లాలికి కూడా పని ఎక్కువగానే ఉంటుంది.

భార్యా భర్తలు ఇద్దరు ఉద్యోగాలు చేసుకొంటున్నా, లేక కూలి-నాలి చేసుకొంటున్నా, పని నుండి వచ్చిన తరువాత, పనికి వెళ్ళేముందు, ఇంటిపనులను ఇల్లాలే చేసుకోవలసి

వస్తుంది. పనిచేసే కాల పరిమాణాన్ని మనం పరిగణనకు తీసుకొంటే, ఇలాంటి కుటుంబాలలో పురుషుల కంటే మహిళలే ఎక్కువ కాలం పనిచేస్తున్నట్లు స్పష్టమవుతుంది.

మన సమాజంలో వేతనార్జనకు (లేక రొఖ్ఖరూప సంపాదనకు) మాత్రమే "పని" గా గుర్తింపు లభిస్తున్నది ఇందువల్ల డబ్బు సంపాదనను తెస్తున్న పురుషునకే కుటుంబంలో ప్రాధాన్యత, ఆధిక్యతలు లభిస్తున్నాయి. మగవారి కంటే ఎక్కువ కాలము, అతి కష్టమైన పనులను ఇంటిపట్టున ఉండే ఇల్లాలు చేసినా, ఆవిడ శ్రమకు గుర్తింపు రావటం లేదు. కుటుంబపోషణకు ఆవిడ పడే శ్రమకు, కుటుంబీకులకు రోగాలు వచ్చినపుడు ఆవిడ చేసేసేవలకు, పిల్లల పెంపకంలోనూ, సంరక్షణలోనూ ఆవిడచూపే శ్రద్ధాసక్తులకు, తాను హారతి కర్పూరంలా హరించుకు పోతూ కూడా కుటుంబీకులకు పంచి ఇచ్చే ప్రేమాభిమానాలకూ విలువ లేకుండా పోయింది. ఆవిడ పంచి ఇచ్చే ప్రేమాభిమానాలకు విలువగట్ట గల షరాబులు కూడా లేరన్న అంశాన్ని సమాజం,

ఒకటవ పట్టిక

కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలలో స్త్రీ పురుషుల పని భార పరిమాణం

| దేశము | సర్వే సంవత్సరం | పనికాలపరిమాణము రోజుకు నిమిషాలు | | | పురుషుల కంటె స్త్రీలు మోస్తున్న అధిక భారం (శాతాలలో) |
|---|---|---|---|---|---|
| | | సగటు | స్త్రీలు | పురుషులు | |
| పట్టణప్రాంతం | | | | | |
| కొలంబియా | 1983 | 378 | 399 | 356 | 12 |
| ఇండొనేషియా | 1992 | 382 | 398 | 366 | 9 |
| కీన్యా | 1986 | 581 | 590 | 572 | 3 |
| నేపాల్ | 1978 | 567 | 579 | 554 | 5 |
| వెనిజులా | 1983 | 428 | 440 | 416 | 6 |
| స్త్రీ పురుషుల పని భారపు వాటాల సగటు (శాతాలలో) | | | 51 | 49 | |
| గ్రామీణ ప్రాంతం | | | | | |
| బంగ్లాదేశ్ | 1990 | 521 | 545 | 496 | 10 |
| గ్వాటెమాలా | 1977 | 629 | 678 | 679 | 17 |
| కీన్యా | 1988 | 588 | 676 | 500 | 35 |
| నేపాల్ | 1978 | 594 | 641 | 547 | 17 |
| మెట్ట ప్రాంతాలు | 1978 | 639 | 692 | 586 | 18 |
| పర్వత ప్రాంతం | 1978 | 592 | 649 | 534 | 22 |
| గ్రామీణ పర్వత ప్రాంతం | 1978 | 552 | 583 | 520 | 12 |
| ఫిలిపీన్స్ | 1975-77 | 499 | 546 | 452 | 21 |
| స్త్రీ పురుషుల పనిభారపు వాటాల సగటు (శాతాలలో) | | | 55 | 45 | |
| దక్షిణ కొరియా | 1990 | 479 | 488 | 480 | 2 |
| పైన పేర్కొన్న అన్ని శాంపుల్సుకు చెందిన స్త్రీ పురుషుల పని భారపు వాటాల సగటు (శాతాలలో) | | | 53 | 47 | |

*హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995*

## రెండవ పట్టిక
## పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల స్త్రీ పురుషుల పనికాల పరిమాణాలు

| దేశము | సర్వే సంవత్సరం | పనికాలము రోజుకు నిమిషాలు | | | పురుషుల కంటె అధికంగా ఉన్న స్త్రీల పని కాలము (శాతాలలో) |
|---|---|---|---|---|---|
| | | సగటు | స్త్రీలు | పురుషులు | |
| ఆస్ట్రేలియా | 1992 | 443 | 443 | 443 | 0.0 |
| ఆస్ట్రియా | 1992 | 416 | 438 | 393 | 11.5 |
| కెనడా | 1992 | 430 | 429 | 430 | -0.2 |
| డెన్మార్క్ | 1987 | 454 | 449 | 458 | -2.0 |
| ఫిన్లండ్ | 1987-88 | 420 | 430 | 410 | 4.9 |
| ఫ్రాన్స్ | 1985-86 | 409 | 429 | 388 | 10.6 |
| జర్మనీ | 1991-92 | 441 | 440 | 441 | -0.2 |
| ఇజ్రాయెల్ | 1991-92 | 376 | 375 | 377 | -0.5 |
| ఇటలీ | 1988-89 | 419 | 470 | 367 | 28 1 |
| నెదర్లాండ్స్ | 1987 | 361 | 377 | 345 | 9.3 |
| నార్వే | 1990-91 | 429 | 445 | 412 | 8.0 |
| యునైటెడ్ కింగ్డం | 1985 | 412 | 413 | 411 | 0.5 |
| అమెరికా | 1985 | 441 | 453 | 428 | 5.8 |
| అన్నిదేశాలసగటు | | 419 | 453 | 408 | 5 8 |
| మొత్తంపనిలో స్త్రీపురుషుల వాటాల శాతం | | | 51 | 49 | |

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995*

ఆవిడసేవలను పొందే భర్త, ఇతర కుటుంబ సభ్యులు కూడా గుర్తించటం లేదు. ఇందువల్ల అమూల్యమైన సేవలనందించే ఇల్లాలు ''భరింపబడే'' భార్యగానే మిగిలిపోయింది; పరభాగ్యోపజీవిగా పరిగణనకు వస్తున్నది!

స్త్రీ సేవలకు సమాజంలోనే గాదు, ప్రభుత్వ వ్యవహారాలలో కూడా గుర్తింపు లభించటం లేదు. ఇటీవలి కాలంలో సాంఘిక శాస్త్ర నిపుణులలోనూ, అర్థశాస్త్ర వేత్తలలోని ఒక వర్గం వారిలోనూ ఈ విషయం మీద పునరాలోచన ప్రారంభమైంది. స్త్రీ శ్రమకు పరిగణన లభించక పోవటం చేతనే కుటుంబంలోనూ, సమాజంలోనూ, ప్రభుత్వ వ్యవహారాలలోనూ ఆవిడకు తగినంత ప్రాధాన్యత లభించటంలేదన్న అంశాన్ని గుర్తించారు. స్త్రీజనోద్ధరణ కృషికి ఇదిపెద్ద అవరోధంగా తయారైన విషయాన్నెరిగి, వారిసేవల పరిమాణపుటంచనాలకు కృషి ప్రారంభించారు.

ఈ విషయంలో యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం చేస్తున్న కృషిని ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉన్నది. (ఈ సంస్థ పేరును ఇక మీదట "యు.ఎన్.డి.పి" అన్న సంక్షిప్త నామంతో వ్యవహరిస్తాం). రోజులోని 24 గంటల కాలంలో, స్త్రీ పురుషులలో ఎవరు ఎంత కాలం పని చేస్తున్నారు; వీరు చేసిన పనిలో ఎంత పనికి వేతనరూప ప్రతిఫలం లభిస్తున్నది అన్న వివరాలను ఈ సంస్థ నిపుణులు సేకరించారు. ఈ విషయ నిర్ధారణకు ప్రత్యేకంగా సర్వేలను జరిపించలేదు వివిధ దేశాలలోనూ ఈ అంశంమీద జరిగిన సర్వేలను, ఇతర పరిశోధిత సమాచారాన్ని సేకరించారు. స్థూలంగా పొల్చదగినది, వాస్తవానికి దగ్గరగానున్నది అని అనుకొన్న సమాచారాన్ని పరిగణనకు తీసుకొన్నారు. ఇలా 31 దేశాలకు

సంబంధించిన సమాచారాన్ని పరిశీలనకు ఎన్నిక చేశారు. ఈ దేశాలలో 14 పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలున్నాయి.; తొమ్మిది అభివృద్ధి చెందుతున్న దేశాలు, ఎనిమిది తూర్పు యూరపు దేశాలు, రష్యా- దాని అనుబంధిత రిపబ్లిక్కులున్నాయి. (రష్యా- దాని అనుబంధిత రిపబ్లిక్కులను ఇపుడు "కామన్వెల్త్ ఆఫ్ ఇండిపెండెంట్ స్టేట్స్" అని వ్యవహరిస్తున్నారు. "సి.ఐ.ఎస్" దీని సంక్షిప్తనామం).

పారిశ్రామికంగా ఆభివృద్ధి చెందిన నాలుగు దేశాలకు- కెనడా, నార్వే, స్వీడన్, యునైటెడ్ కింగ్డంలకు కొంచెం దీర్ఘకాలిక సమాచారం లభించింది. అభివృద్ధిచెందుతున్న దేశాలలోని కీన్యా, వెనిజులా దేశాల సమాచారాన్ని నిపుణులు కొంచెం వివరంగా పరిశీలించారు. తూర్పుయూరపు దేశాల సమాచారాన్ని, నార్డిక్ దేశాలలో ఒకటయిన ఫిన్లండుతో పోల్చిచూపారు.

పరిశీలనకు తీసుకొన్న సమాచారం పలువురు సేకరించినది ఒక్కొక్కరు ఒక్కొక్క అంశవు నిరూపణకు తగినట్లు సమాచారాన్ని సేకరించారు కనుక, ఎన్నికచేసిన సమాచారమంతా ఏక దృక్పథాన్నిగాని, అవసరమైన అన్ని అంశాలను గాని చిత్రించే అవకాశాలు లేవు. పరిశీలనకు తీసుకొన్న సమాచారాన్ని విశ్లేషించిన తరువాత లభించిన ఫలితాలు, స్థూలంగా మాత్రమే పరిస్థితిని సూచిస్తాయి. ఇచ్చిన సంఖ్యా వివరాలను పరిస్థితుల కొలమానాలుగా తీసుకోకూడదని, స్థూలమైన సూచికలుగా మాత్రమే పరిగణించాలని యు.ఎన్.డి.పి నిపుణులు హెచ్చరిస్తున్నారు. స్త్రీ పురుషుల పని భారాన్ని తెలియజేసే సంఖ్యా వివరాలను ఈ నిపుణులు ఇచ్చారు. వాటిని ఒకటవ, రెండవ పట్టికలలో చూడవచ్చు.

ప్రతిదేశంలోనూ - అభివృద్ధి చెందినది, అభివృద్ధి చెందుతున్నది అన్న తేడా లేకుండా - పురుషుల కంటే, స్త్రీలే ఎక్కువ కాలం పనిచేస్తున్నట్లు యు.ఎన్.డి.పి నిపుణులు నిరూపించారు. అభివృద్ధి చెందిన దేశాలలో మహిళలు మొత్తం పని భారంలో నూరింట 51 వంతులను, అభివృద్ధి చెందుతున్న దేశాలలో 53 వంతులను భరిస్తున్నట్లు వెల్లడించారు. అభివృద్ధి చెందిన దేశాలకంటే అభివృద్ధి చెందుతున్న దేశాల మహిళలు అధిక పనిభారాన్ని మోస్తున్నట్లు వీరి విశ్లేషణలు నిరూపిస్తున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో గ్రామీణ మహిళలు మొత్తం పనిలో నూరింట 55 వంతులను చేస్తున్నట్లు తేలింది; పట్టణప్రాంతపు మహిళలు మొత్తం పనిభారంలో 51 వంతులను మాత్రమే మోస్తున్నారు.

### పారిశ్రామిక దేశాలలో....

అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో ప్రజలు రోజుకు సగటున ఏడు గంటల చొప్పున పనిచేస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాల పనికంటే ఇది ఇరవైశాతం తక్కువ. ఈ దేశాలన్నింటిలోనూ పనికాల పరిమాణం ఒకే విధంగా లేదు. నెదర్లండ్స్ లో రోజుకు ఆరుగంటల చొప్పన పనిచేస్తుండగా, డెన్మార్క్ లో ఏడున్నర గంటల చొప్పన పనిచేస్తున్నారు. ఈ వర్గపు దేశాలలో మొత్తం పనిలో 51 శాతాన్ని స్త్రీలు చేస్తుండగా, పురుషులు 49 శాతపు పనిని చేస్తున్నారు.

ఈ దేశాలన్నిటిలో కంటే ఇటలీ దేశపుస్త్రీలు ఎక్కువ కాలం పనిచేస్తున్నారు. ఈ దేశంలో రోజుకు సగటున ఏడూ ముప్పావు గంటలు (ఏడు గంటల నలభయ్యేదు నిమిషాలు) వీరు పనిచేస్తున్నారు. ఈ దేశాలలో అన్నింటిలో కంటె నెదర్లెండ్సులో స్త్రీ పురుషుల పని కాలపరిమాణం తక్కువగానున్నది.

ఆస్ట్రేలియా, కెనడా, జర్మనీ దేశాలలో స్త్రీ పురుషుల పనికాల పరిమాణం దాదాపు సమంగానే ఉన్నది. ఇటలీలో స్త్రీల పనికాల పరిమాణం, పురుషుల పనికాల పరిమాణం కంటే 28 శాతం అధికంగా ఉన్నది. ఆస్ట్రేలియాలో ఇది 12 శాతము, ఫ్రాన్స్‌లో పదకొండు శాతం అధికంగా ఉన్నది. డెన్మార్క్‌లో స్త్రీల కంటే పురుషులే ఎక్కువ కాలం పనిచేస్తున్నట్లు సంఖ్యా వివరాలు తెలియ జేస్తున్నాయి. ఇది అంత ముఖ్యమైనంత పరిమాణం కాదని యు.ఎన్.డి.పి. నిపుణులు భావించారు.

నార్వే, యునైటెడ్ కింగ్‌డంలకు కొంచెం పూర్వకాలపు సమాచారం లభిస్తున్నది. దీనిని బట్టి ఆదేశాల వారి పనికాలం - స్త్రీ-పురుష భేదం లేకుండా - తగ్గిపోతున్నట్లు కనిపిస్తుంది. అంతేకాదు; వీరిద్దరి పనికాల పరిమాణంలోని వ్యత్యాసం కూడా తగ్గుతూండటం కనుపిస్తున్నది.

కెనడా, నార్వే, యునైటెడ్ కింగ్డంలలో, వంటా-వార్పులకు ఖర్చుచేసే కాల పరిమాణం కూడా తగ్గుతున్న సూచనలున్నాయి. వంటా-వార్పూ, బట్టలుతకటం ఇంటికి అవసరమైన రిపేర్లు చేయటం, ఇంటిని శుభ్రపరచటం వంటి పనులకు పట్టేకాలం తగ్గింది; కాని ఇంటి మేనేజిమెంటు నిర్వహణకు, షాపింగుకు పట్టే కాలం పెరిగింది. పిల్లల పెంపకం యెడల పురుషులు ప్రదర్శించే శ్రద్ధాసక్తులు పెరిగాయి, వంటా-వార్పు, ఇంటిని శుభ్రంచేయటం, ఇతర ఇంటి పనులను వీరు చేయటం కూడా ఎక్కువైంది

ఈ విషయం మనకు విపులంగా తెలియటానికి వీలుగా నిపుణులు స్వీడన్‌లోని ఇటీవలి పరిణామాలను వివరించారు ఈ దేశంలో స్త్రీ పురుషుల పనికాల పరిమాణం క్రమంగా సమానమవుతున్నది. 1984వ సంవత్సరంలో పురుషుల కంటే స్త్రీలు వారానికి నాలుగు గంటలు ఎక్కువ పనిచేసేవారు. 1993 వ సంవత్సరం వచ్చేసరికి ఈ వ్యత్యాసం గంటా నలభయ్యైదు నిమిషాలకు తగ్గింది. ప్రస్తుతం, పురుషులు వారానికి 45 గంటల చొప్పున పనిచేస్తుండగా. స్త్రీలు నలభయ్యారున్నర గంటల చొప్పున పనిచేస్తున్నారు స్త్రీలు ఇంటి పనులకు వినియోగించ వలసిన కాల పరిమాణం తగ్గటం వలన స్త్రీ-పురుషుల పనికాల పరిమాణాల లోని వ్యత్యాసం తగ్గింది. ఇదివరకటి కంటే ఇపుడు పురుషులు ఇంటి పనులు చేయటానికి ఒక గంట కాలాన్ని అధికంగా వినియోగిస్తున్నారు. అయినా, ఇపుడు స్త్రీలు ఇంటి పనులు చేయటానికి, వారంలో వినియోగించే కాలం కంటే వీరు ఇందుకు వినియోగించే కాల పరిమాణం ఇంకా పదిన్నర గంటలు తక్కువగానే ఉన్నది! ఆధునిక గృహోపకరణాల వాడకం వలన వంటకూ, అంట్లు తోమటానికి, బట్టలు ఉతకటానికి పట్టేకాలం తగ్గుతున్నది. అయినా ఈదేశపు ఇల్లాండ్రు, వారానికి ఇరవైగంటల ముప్పై నిమిషాల కాలాన్ని ఈ పనులకు వినియోగించ వలసి వస్తున్నది.

బట్టలుతకకుండా ఇంకా మగవారు ఎగవేస్తూనే ఉన్నారు. వారంలో ఇరవై నిమిషాలు ఇందుకు ఖర్చు చేస్తున్నారేమో! ఈ పనికి ఇల్లాలు వారానికి రెండు గంటల కాలాన్ని వినియోగిస్తున్నది పిల్లల పెంపకంలో, మగవారు వినియోగించే కాలానికి రెట్టింపు పరిమాణాన్ని ఇల్లాలు వినియోగిస్తున్నది పిల్లలను కనకపూర్వం కంటే రోజుకు రెండు గంటల కాలాన్ని అధికంగా శిశు సంక్షేమానికి వినియోగించవలసి వస్తున్నది ఇదే వయసులో నున్న పురుషులు, ఇందుకు వినియోగిస్తున్న కాలాన్ని అరగంట కంటే ఎక్కువే తగ్గించు కొన్నారు

విరామ కాలం స్త్రీ పురుషులిద్దరకు కూడ కొంచెం పెరిగింది ఈ పెరుగుదల ఇద్దరకూ సమంగా లేదు! స్త్రీ విరామకాలం కంటే పురుషుల విరామకాలం పదిన్నర శాతం అధికంగా ఉన్నది! విరామకాలం పెరగటం వలన టి.వి. ప్రసారాలను చూచే కాలం పెరిగింది స్త్రీలు వారానికి పద్నాలుగున్నర గంటల కాలాన్ని ఇందుకు వినియోగిస్తే, పురుషులు నలభయ్యేడున్నర గంటల కాలాన్ని వినియోగిస్తున్నారు చదివే కాలం బాగా తగ్గింది. ఈ కాలపరిమితి స్త్రీలకు 12 శాతం తగ్గగా, పురుషులకు 26 శాతం తగ్గింది! విరామం దొరికినపుడు, దానిని మానసిక వికాసానికి పనికివచ్చే చదువుకు వినియోగించకుండా కాలక్షేపానికి ఖర్చుచేయటం పెరిగింది ఇది విజ్ఞులకు ఆందోళన కారక మవుతున్నది.

ఐక్యరాజ్యసమితి వారు ప్రచురించిన "ది వరల్డ్స్ ఉమెన్ - 1995 " అన్న ప్రచురణలో స్త్రీ పురుషుల పనిభారానికి సంబంధించిన అంచనాలను ఇచ్చారు. ఈ అంశాలను సంక్షిప్తంగా వివరిస్తాం :

ఒక వ్యక్తి తన పనికాలాన్ని ఎలా వినియోగిస్తాడు అనే అంశం వారి జీవిత దశను బట్టి ఉంటుంది. ఇంటి పరిస్థితుల ప్రభావం కూడా దీని మీద ఉంటుంది. ఆర్థిక, సాంఘిక, సంప్రదాయ, సంస్కృతులు కూడా తమ ప్రభావాన్నీ అంశం మీద చూపుతాయి. ఏ సమాజాన్ని పరిశీలనకు తీసుకొన్నా, స్త్రీ పురుషులు పనికాల వినియోగం ఒకే రకంగా ఉన్నట్లు కనుపించదు. వారి పనికాల వినియోగం భిన్నంగానే ఉంటుంది. ఈ విషయ చిత్రణకు "ది వరల్డ్స్ ఉమెన్-1995 " సంపాదకులు మూడు అంశాలను ఉదహరించారు.

(1) పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ కాలం పనిచేస్తున్నారు. 20వ శతాబ్దపు 80వ, 90వ దశాబ్దాల పరిస్థితులను పరిశీలిస్తే, పదమూడు అభివృద్ధి చెందిన దేశాలలోని స్త్రీలు, వారానికి పురుషుల కంటే రెండు గంటలు

ఎక్కువ పనిచేస్తున్నారు. ఐదునుండి పది గంటల కాలం అధికంగా పనిచేస్తున్న సందర్భాలు కూడా మనకు కనుపిస్తాయి. ఐదు దేశాలలో మాత్రం స్త్రీ పురుషులిద్దరి పనికాల పరిమాణంలో పెద్ద తేడాలు కనుపించటంలేదు. ఒక్క అమెరికాలో మాత్రం స్త్రీ కంటే పురుషుల పనికాల పరిమాణం మూడు గంటలు ఎక్కువగా ఉన్నట్లు 1986వ సంవత్సరపు సర్వే ఫలితాలు వెల్లడించాయి.

బాల్టిక్, తూర్పుయూరపు, మధ్యయూరపు దేశాలలో (బల్గేరియా, హంగరీ, ఇటలీ, లట్వియా, లిథూనియా, పోలెండ్ దేశాలలో), స్పెయిన్, యునైటెడ్ కింగ్డంలోనూ కూడా, స్త్రీలు, పురుషుల కంటే వారానికి ఐదు గంటలకు మించే అధికంగా పనిచేస్తున్నారు. ఇటీవలి కాలంలో, స్త్రీ-పురుషుల పనికాల పరిమాణం మధ్యనున్న వ్యత్యాసం తగ్గటం కూడా కనుపిస్తున్నది. ఇందుకు సంపాదకులు ఫిన్లెండు, జర్మనీ, సోవియట్ రిపబ్లిక్కులను ఉదహరించారు.

(2) స్త్రీలు వేతనార్జనకు వినియోగించే కాలపరిమాణం కంటే, ఇంటి పనులకు ఎక్కువ కాలాన్ని వినియోగిస్తున్నారు. కొన్ని దేశాలలో మాత్రం పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నది. ఫిన్లండు దేశపు మహిళలు ఇంటిపని కంటే వేతనార్జనకు ఎక్కువ కాలాన్ని వినియోగిస్తున్నారు. కొన్ని బాల్టిక్ దేశాలలోనూ, కొన్ని తూర్పుయూరపు దేశాలలో కూడా పరిస్థితి ఇలాగే ఉన్నది. పురుషులు తమ పనికాలంలోని అత్యధిక భాగాన్ని వేతనార్జనకు వినియోగిస్తున్నారు. అన్నిదేశాలలోనూ వీరి పరిస్థితి ఇలాగే ఉన్నది. చాలా దేశాలలో స్త్రీల యొక్క వేతనం లభించని పనికాల పరిమాణం, పురుషుల వేతనం లభించని పనికాల పరిమాణం కంటే,రెండు రెట్లు - అంతకు మించే ఉన్నట్లున్నది. జపాన్‌లో ఈ భేదం తొమ్మిది రెట్లు అధికంగా ఉన్నది.

(3) వేతనార్జనకు గాని, వేతనంలేకుండాగాని, పురుషులు వినియోగించే పనికాల పరిమాణం వారి జీవితం లోని అన్ని దశలలోనూ ఒకే విధంగా ఉంటున్నది. స్త్రీల పనికాల పరిమాణంలో వారి జీవితదశలను బట్టి భేదాలుంటున్నాయి. ఈ భేదం, కొన్ని దశలలో అత్యధికంగా కూడా ఉంటున్నది. వేతనార్జనకు వెళ్ళే మహిళ, ఉద్యోగం చేస్తూ, ఇంటిపనులను, పిల్లల పెంపకాన్ని కూడా చూడ వలసి ఉంటుంది. ఆవిడ జీవన దశ లన్నింటిలో కంటే ఈ దశ అత్యంత భారమైనది. ఉదాహరణకు ఫిన్లండు దేశపు మహిళల అనుభవాలను చూడవచ్చు. ఇరవై - ఇరవైనాలుగు మధ్య వయసున్న యువతి, వేతనం లభించని పనులకు (అంటే ఇంటి పనులకని మనం చెప్పుకోవచ్చు ) వినియోగించే కాల పరిమాణం రోజుకు ఒక గంటా ముప్ఫయ్యారు నిమిషాలుంటుంది. ఆవిడ గృహ నిర్వహణనూ, చిన్నపిల్లల పెంపక భారాన్ని కూడా చూడ వలసిన పరిస్థితి వచ్చినపుడు, ఈ పనికాల పరిమాణం ఆరుగంటలా ఆరు నిమిషాలకు పెరుగుతున్నది! యువకునకు వివాహమై సంసారభారం నెత్తినబడి, పిల్లలను కన్నతరువాత, అతని వేతనం లభించని పనికాల పరిమితి ఇంతకు పూర్వం రోజుకు ఒక గంటా 24 నిమిషాలున్నది, ఇపుడు రెండున్నర గంటల కాలానికి మాత్రమే పెరిగింది. ఫ్రాన్సులో పురుషులు, అవివాహితులుగా ఉన్నా, వివాహమైన తర్వాతా వారు ఇంటిపని చేస్తున్న కాల పరిమాణం రోజుకు రెండు గంటలు మాత్రమే. పురుషుని జీవిత దశలు మారినా, వారు చేసే ఇంటి పని కాలపరిమాణం లో మార్పులేదు; అది స్థిరంగానే ఉన్నది. స్త్రీలు, వివాహం కాకపూర్వం, వివాహమైన తర్వాత పిల్లలు కలుగనంత కాలం, ఇంటిపని రోజుకు 3 గంటల 24 నిమిషాలుంటుంది. వారు సంతాన వతులయిన తర్వాత ఇంటిపని కాలపరిమితి నాలుగున్నర గంటలకు పెరుగుతున్నది. అధికసంఖ్యాక దేశాలలో పురుషుల విరామకాలము, స్వంతపనులు చూచుకొనే కాలము, స్త్రీల కంటే అధికంగానే ఉన్నట్లు, లభిస్తున్న సమాచారాన్ని బట్టి తెలుస్తున్నది.

అభివృద్ధి చెందిన దేశాలలో ఇంటిపనులలో మూడింట రెండు వంతుల నుండి, నాల్గింట మూడువంతుల వరకు మహిళలే చేస్తున్నారు. అధిక సంఖ్యాక దేశాలలో మహిళలు ఇంటిపనులకు వినియోగిస్తున్న కాలపరిమాణం వారానికి ముప్పై గంటలకు మించే ఉంటున్నది. పురుషులు ఇందుకు వినియోగిస్తున్న కాలపరిమాణం 10-15 గంటలు మాత్రమే ఉంటున్నది.

చాలా దేశాలలో, ఇంటి పనుల విభజనలో మార్పులు కనుపించటం లేదు. చాలామంది పురుషులు బట్టలుతకరు; ఇల్లు శుభ్రం చేయరు; బట్టలను ఇస్త్రీ చేయరు; ఇంటికి

అవసరమైన చిన్నచిన్న రిపేరు పనులను కూడా వీరు ఆడవారికి వదిలి వేస్తున్నారు! కెనడాలో ఉద్యోగం చేస్తున్న ఇల్లాండ్రలో నూరింట 52 మంది, ఇంటిపనులన్నింటినీ వారే చేసుకొంటున్నట్లు ఇటీవల జరిగిన సర్వేఫలితాలు సూచించాయి; వీరిలో నూరింట 28 మందికి భర్తల సహకారం నామమాత్రంగానే లభిస్తున్నది, నూరింట పదిమంది ఇల్లాండ్ర భర్తలు మాత్రం, ఇంటిపనులను భార్యలతో సమంగా చేస్తున్నారట!

పిల్లలు లేని ఇల్లాలికి, వంటా-వార్పూ, ఇంటిని శుభ్రంగా ఉంచుకోవటం ప్రధాన పనులుగా ఉంటున్నాయి ఈ పనికి వారు సుమారుగా రోజుకు రెండు గంటలు ఖర్చు చేయవలసి వస్తున్నది. ఐదు సంవత్సరాలలోపు వయస్సు గల పిల్లలున్నపుడు, వారికే (ఈ పిల్లలకే) ఇంత కాలాన్ని వినియోగించవలసి వస్తున్నది. వంటకూ, ఇంటిని శుభ్రం చేయటానికి అవసరమైన పనులకు పురుషులు రోజుకు అరగంట కాలాన్ని మాత్రమే వినియోగిస్తున్నారు.

వ్యక్తి జీవితదశను బట్టి వారి పనిస్వభావమూ,దాని పరిమాణమూ మారుతూ ఉంటాయని ఇంతకు పూర్వం చెప్పాం వ్యక్తికి పెండ్లి కాక పూర్వము, పెండ్లయిన తర్వాత, పిల్లలు పుట్టిన తర్వాత, వయసు మళ్ళిన తర్వాత, వారు చేసే పనులలోనూ, కార్యభారంలోనూ వస్తున్న మార్పులు అందరకూ తెలుసు. యువతీ యువకుల వివాహానంతరం, కుటుంబంలో పురుషాధిక్యత రాజ్యం చేయనారంభిస్తుంది. యువతి వివాహం కాకపూర్వం కంటే ఎక్కువ పని భారాన్ని మోయ వలసి ఉంటుంది. ఆవిడ తొలిసారి పురుషాధిక్యతా ప్రభావపు తీవ్రతను చవిచూస్తుంది. పురుషులస్థితి ఇందుకు భిన్నంగా ఉంటుంది. వివాహానంతరం, వివాహపూర్వపు కాలంలో కంటే అదనంగా చేయవలసిన ఇంటిపనులను చేసే మనిషి వారికి లభిస్తుంది. కనుక ఇంటి పనుల భారం వీరి మీద పడదు.

కుటుంబ నిర్మాణ స్థితి (అంటే దంపతులకు పిల్లలుండటం, ఉంటే వారి వయః పరిమాణపు భేదము, ఇల్లాలి అత్తమామలు, భర్త సోదరులు, లేక ఆడబిడ్డ లుండటం వంటి స్థితి) ఇంటిపనుల భారాన్ని ప్రభావితం చేస్తుంది. ఐదు సంవత్సరాల లోపు వయసు పిల్లలున్న ఇల్లాలు, ఇంతకంటే పెద్దపిల్లలు ఎక్కువ మంది ఉన్న ఇల్లాలి కంటే కూడా అధికపనిభారాన్ని మోయవలసి ఉంటుంది. పసిపిల్లలు లేని, నలభయ్యైదు సంవత్సరాల లోపు వయసున్న ఇల్లాలి పనిభారం కంటే, పసిబిడ్డలున్న ఇదే వయసు గల ఇల్లాలి ఇంటిపనిభారం రెట్టింపు అధికంగా ఉంటుంది: మూడు రెట్లు అధికంగా ఉండే అవకాశాలు కూడా ఉన్నాయి. సంతానం లేని 45 సంవత్సరాల లోపు వయసున్న ఇల్లాలు. ఇంటి పనులకు వారానికి 12 నుండి 15 గంటల కాలాన్ని వినియోగిస్తుంది: ఇంతే వయసుండీ, ఐదు సంవత్సరాల లోపు పసిబిడ్డలు ఉన్న ఇల్లాలు, ఇంటి పనులకు వారానికి 25 నుండి 35 గంటల వరకూ వినియోగించవలసి వస్తున్నది. పిల్లలున్నపుడు, భర్తలు చేయవలసిన ఇంటి పనుల భారం కూడా కొంచెం పెరుగుతున్నది. నార్డిక్ దేశాలలోనూ, అమెరికాలోనూ భర్తలు భార్యల ఇంటి పని భారాన్ని కొంచెం ఎక్కువగా పంచుకోవటం ఇటీవల కనుపిస్తున్నది. పిల్లల వయసు పెరుగుతున్న కొలదీ ఇల్లాలి ఇంటిపని భారం తగ్గటం కనుపిస్తున్నది.

## మాజీ కమ్యూనిస్టు దేశాలలో.....

మాజీ కమ్యూనిస్టు దేశాల పరిస్థితి, పారిశ్రామికంగా అభివృద్ధయిన దేశాల పరిస్థితికి భిన్నంగా ఉన్నది. బల్గేరియాలో 1977 వ సంవత్సరంలో స్త్రీల పనిభారం కంటే పురుషులు చేసే పని పరిమాణం పదిహేను శాతం కంటే తక్కువగానే ఉన్నది. 1988 వ సంవత్సరం వచ్చేసరికి పురుషుల పనిభారం మరికొంచెం తగ్గింది. ఈ సంవత్సరంలో వారు స్త్రీలకంటే పదిహేడు శాతం తక్కువ భారాన్ని మాత్రమే మోస్తున్నారు. 1977 వ సంవత్సరంలో స్త్రీలు చేసే ఇంటిపనిలో 52 శాతాన్ని మాత్రమే పురుషులు చేస్తున్నారు. 1988 వ సంవత్సరం వచ్చేసరికి ఈ పరిమాణం 48 శాతానికి తగ్గింది ఇల్లాలి పనిభారం పెరుగుతుండగా, మగవారి పనిభారం తగ్గుతున్నది.

ఫిన్లండులో కంటే బల్గేరియాలో స్త్రీ పురుషులు ఎక్కువ కాలం పనిచేస్తున్నారు. ఈ పోలికలను చూచేటపుడు, ఫిన్లండు బల్గేరియా కంటే సంపన్న దేశం అన్న విషయాన్ని మరచి పోకూడదు. బల్గేరియా దేశంలో స్త్రీల పనిభారం పురుషుల కంటే 21 శాతం అధికంగా ఉన్నది (1987 -88లో). ఫిన్లండులో ఈ పరిమాణం ఎనిమిది శాతం మాత్రమే ఉన్నది. అంతేకాదు, ఫిన్లండు స్త్రీల కంటే, బల్గేరియా పురుషులు ఎక్కువ కాలం పనిచేస్తున్నారు.

ఫిన్లండు మహిళలు రోజుకు ఆరున్నర గంటలు మాత్రమే పని చేస్తుండగా, బల్గేరియా పురుషులు ఏడుగంటల చొప్పున పనిచేస్తున్నారు.

పనికాలాన్ని, శ్రమను తగ్గించే అంట్లుతోమే యంత్రాలు (డిష్‌వాషర్సు), వాషింగ్ మెషిన్ల వంటి ఆధునిక గృహోపకరణాల వాడకం, బల్గేరియాలో తక్కువగా ఉన్నది. అందువల్ల బల్గేరియా మహిళలు ఫిన్లండు మహిళల కంటే వంటా-వార్పూ, బట్టలుతకటం వంటి పనులకు ఎక్కువ కాలాన్ని వినియోగించ వలసి వస్తున్నది. బల్గేరియా మహిళలు తమ ఇంటికి అవసరమైన ఆహార పదార్థాలలో కొంత భాగాన్ని పండించు కొంటారు; దుస్తులు కూడా కుట్టుకుంటారు. పురుషుల వలె ఇంటికి అవసరమైన రిపేర్ల వంటి పనులను కూడా మహిళలు చేస్తున్నారు. ఇందువల్ల స్త్రీ పురుషుల పనిలో అసమానతా పరిమాణం పెరుగుతూండగా, వారు చేయవలసిన మొత్తం పని పరిమాణం కూడా పెరుగుతూనే ఉన్నది.

ఇతర తూర్పు యూరపు దేశాలలోనూ, కామన్వెల్తు ఆఫ్ ఇండిపెండెంట్ స్టేట్స్ పేరిట రష్యాతో కలసి ఉంటున్న దేశాలలోనూ, 20వ శతాబ్దపు యనభయ్యవ దశాబ్దంలో పరిస్థితులు ఇలాగే ఉన్నాయి. హంగరీ, లట్వియా, లిథూనియా, పోలెండ్, కామన్వెల్త్ ఆఫ్ ఇండిపెండెంట్ స్టేట్స్ లో (సి.ఐ యస్. దేశాలలో) స్త్రీలు, పురుషులు కూడా ఎక్కువ కాలం పనిచేయవలసి వస్తున్నది. పురుషుల కంటే స్త్రీలు వారానికి ఐదున్నర గంటల కంటే ఎక్కువ కాలం పనిచేస్తున్నారు. ఈ గ్రూపు దేశాల మహిళలు పురుషుల కంటే సగటున తొమ్మిది శాతం ఎక్కువ కాలం పనిచేస్తున్నారు. పశ్చిమ యూరపు దేశాలలో స్త్రీ పురుషుల పనికాల పరిమాణాల మధ్య నున్న తేడా కంటే ఇది అధికం. అన్ని దేశాలలో కంటే పోలెండు లోని మహిళల పనికాల పరిమాణం పురుషుల పనికాలం కంటే పదేహేను శాతం అధికంగా ఉన్నది.

తూర్పు యూరపు మహిళల పరిస్థితి కంటే సి.ఐ.యస్. దేశాలలోని స్త్రీల పని పరిస్థితి హీనంగా ఉన్నట్లు కనుపిస్తుంది. ఈతేడాలు కూడా కొట్టవచ్చినట్లు కనుపిస్తున్నాయి. బల్గేరియా మహిళల పరిస్థితే అసంతృప్తి కరంగా ఉన్నదనుకొంటే మాల్డోవా మహిళ పరిస్థితి మరింత నాసిగా ఉన్నది. ఇది వ్యావసాయిక దేశం; వ్యవసాయమే ప్రజల ప్రధానవృత్తి.

బల్గేరియా మహిళలు వారానికి 59 గంటల చొప్పున పనిచేస్తూంటే, మాల్డోవా మహిళలు డెబ్భైమూడున్నర గంటల చొప్పున పనిచేస్తున్నారు మాల్డోవా వర్కర్లలో మహిళలు అధిక సంఖ్యాకులుగా ఉన్నారు వేతనార్జనా వృత్తితో పాటు, ఇంటి పనులను కూడా చేయవలసి రావటం చేత వారి పనికాల పరిమాణం అధికంగా ఉంటున్నది. మాల్డోవా పురుషులు వేతనార్జనకు వారానికి యాభైయొక్క గంటల చొప్పున పనిచేస్తున్నారు; ఇంటి పనులకు పదకొండు గంటల కాలాన్ని వినియోగిస్తున్నారు.

కిర్గిజ్‌స్థాన్‌లో పనిభారం ఇంతకంటే కూడా అధికంగా ఉన్నది. ఈ దేశపు మహిళలు వారానికి డెబ్భయ్యారు గంటల ఇరవై నిమిషాల చొప్పున పనిచేస్తున్నారు; పురుషుల పని కాలం యాభై తొమ్మిది గంటల ఇరవయ్యారు నిమిషాలు మాత్రమే ఉన్నది. వేతనార్జనకు వెళుతున్న మహిళల పనికాలం, 1980-1990 మధ్యకాలంలో, ఒకటిన్నర శాతం పెరిగింది. ఇంటి ఆర్థిక పరిస్థితులు నీరసించటంవల్ల మహిళలకు ఇంటిపనులకు పట్టేకాలం పెరిగింది. మార్కెట్లో ఆహార పదార్థాలు అవసరాలకు తగినట్లు, అవసరమైనపుడు లభించకపోవటం, సులభంగా వండటానికి తగిన రూపంలో లభించే ఆహార పదార్థాలు తగినంతగా అందక పోవటం వంటి కారణాలవల్ల ఇల్లాండ్ర గృహ నిర్వహణాభారం పెరిగింది. 1980-1990 సంవత్సరాల మధ్యకాలంలో వంటా-వార్పులకు పట్టే కాలపరిమాణం పన్నెండు శాతం పెరిగింది!

**అభివృద్ధి చెందుతున్న దేశాలలో....**

యు.యన్.డి.పి. నిపుణులు, అభివృద్ధి చెందుతున్న పదమూడు దేశాలకు చెందిన సర్వేలను పరిశీలనకు తీసుకొన్నారు. ఇందులో నాలుగు నేపాల్ దేశానికి సంబంధించినవి; ఈ నాల్గింటిలో ఒకటి మాత్రం పట్టణ ప్రాంతానికి చెందినది; మిగిలిన మూడూ, మూడు రకాల గ్రామీణ ప్రాంతాల మీద జరిగిన సర్వేలు. కీన్యాకు చెందిన రెండు సర్వేలలో ఒకటి పట్టణ ప్రాంతానికి, రెండవది గ్రామీణ ప్రాంతానికి సంబంధించినది. దక్షిణ కొరియా సర్వేమాత్రం ఆదేశానికి అంతటికీ సంబంధించినది.

ఈ సర్వేలన్నీ ఒకే విషయ నిర్ణయ ప్రాతి పదిక మీద జరగక పోవటం చేత, వాటిని పోల్చి చూడటంలో ఇబ్బందులు

ఎదురయినట్లు నిపుణులు వెల్లడించారు. కొన్ని దేశాల వివరాలు ప్రభుత్వచట్ట ప్రకారం ప్రకటితమైన "పని దినాలకు" మాత్రమే సంబంధించినవిగా ఉన్నాయి. శలవుల కాలపు పనిని ఈ సర్వేలు పరిగణనకు తీసుకోలేదు శలవు దినాలలో పురుషులకు పని తప్పినా, ఇల్లాండ్రకు పనితప్పని విషయం జగద్వితం. ఇలాంటి సందర్భాలలో స్త్రీల పనికాలంలో కొంత భాగం పరిగణనకు వచ్చే అవకాశంలేదు. ఇందువల్ల కొన్ని దేశాలలో స్త్రీల పనికాలంగా ఇచ్చిన అంచనాలలో స్త్రీల పనిభారమంతా ప్రకటితం గావటం లేదు కొన్ని సర్వేలు పగటి కాలపు పనులనే పరిగణనకు తీసుకొన్నాయి ఇందువల్ల ఇల్లాండ్రు వేకువ ఝామున, ప్రొద్దుక్రుంకిన తరువాత చేసే పనికాలం పరిగణనకు రావటం లేదు. గ్రామీణ ప్రాంతాల మహిళలు ఈ రెండు కాలాలలోనూ పనిచేస్తుంటారు. పరిగణనకు తీసుకొన్న సమాచారంలో ఇలాంటి లోపాలున్నా, యు.ఎన్.డి.పి నిపుణులు ఆ సమాచారంతోనే ఈ అధ్యాయంలోని పట్టికలను రూపొందించారు. ఇన్ని లోపాలు సమాచార సేకరణలో ఉన్నా, పురుషుల కంటే అధిక పనిభారాన్ని మహిళలు భరిస్తున్నట్లు ఆ సంఖ్యా సమాచారం స్పష్టంగా సూచిస్తున్నది

ఈ సర్వే ఫలితాలను పరిశీలించినపుడు, అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలలోనూ స్త్రీ పురుషుల పనిభార పరిమాణం ఒకే రకంగా లేదని స్పష్టమవుతుంది. వారు మోసే పనిభార పరిమాణంలో కూడా వ్యత్యాసాలున్నాయి. ఉదాహరణకు కొలంబియాలో పనికాల పరిమాణం రోజుకు ఆరుంపావు గంటలుంటుంది; గ్వాటేమాలాలో ఇది పదిన్నర గంటల వరకూ ఉన్నది దక్షిణ కొరియాలో స్త్రీ పురుషుల పనిభారపు వ్యత్యాసం ఎనిమిది నిమిషాలు మాత్రమే ఉన్నది. నేపాల్ లోని పర్వత ప్రాంతాలలో పురుషుల కంటే స్త్రీల పనికాలం రోజుకు రెండు గంటలు, కీన్యాలో మూడు గంటలూ అధికంగా ఉంటున్నది. ఇలాంటి అత్యధిక వ్యత్యాసాలు కనుపించినపుడు, ఆ ఫలితాలను జాగ్రత్తగా పరిశీలించాలని కూడా యు.ఎన్.డి.పి. నిపుణులు హెచ్చరించారు. (ఒకటవ పట్టికను చూడండి)

సర్వే ఫలితాలలో ఇలాంటి తేడాలున్నా, అన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ కాలం పనిచేస్తున్నట్లు స్పష్టమవుతున్నదని నిపుణులు అభిప్రాయపడ్డారు. మొత్తం పనిభారంలో 53 శాతాన్ని స్త్రీలు మోస్తుండగా, పురుషులు 47 శాతం పనిభారాన్ని మాత్రమే మోస్తున్నట్లు వీరు అంచనా వేశారు. గ్రామీణ మహిళలు ఇంకా అధిక భారాన్ని మోయవలసి వస్తున్నది. మొత్తం పనిలో 55 శాతాన్ని స్త్రీలు చేస్తున్నారు; పురుషుల వంతు 45 శాతంగా మిగిలింది

పనిభార పంపకంలో పట్టణ, గ్రామీణ ప్రాంతాల మధ్య వ్యత్యాసాలున్నాయి. పట్టణ ప్రాంత స్త్రీ పురుషుల కంటే, గ్రామీణ ప్రాంతం వారి పనిభారం ఇరవై శాతం వరకూ అధికంగా ఉన్నట్లు నిపుణులు నిర్ధారణ చేశారు. గ్రామీణ ప్రాంత మహిళలు, పురుషుల కంటే ఇరవై శాతం కాలం అధికంగా పనిచేస్తున్నారు. పట్టణప్రాంత స్త్రీలు, పురుషుల కంటే ఆరుశాతం కాలం మాత్రమే అధికంగా పనిచేస్తున్నారు

బాల్యదశలో కూడా స్త్రీల పనిభారం పురుషుల కంటే అధికంగా ఉంటున్నది. బంగ్లాదేశ్‌లో ఐదు సంవత్సరాల వయసును మించిన బాలికలు వారానికి 53 గంటల చొప్పున పనిచేస్తుంటే, బాలురు 46 గంటల చొప్పున మాత్రమే పనిచేస్తున్నారు. పని విభజనలో స్త్రీ పురుషుల మధ్య తేడాలు కూడా బాల్యం నుండే ఉంటున్న విషయాన్ని మనం మరువకూడదు కీన్యా సర్వే కూడా ఈ విషయాన్ని నిరూపిస్తున్నది.

మహిళల పనికాల పరిమాణాలను, పని స్వభావాన్ని చిత్రించటానికి యు.ఎన్.డి.పి. నిపుణులు కీన్యా, వెనిజులా దేశాల అనుభవాలను వివరించారు. వాటి నిచట సంక్షిప్తంగా వివరిస్తాం.

కీన్యా దేశంలో గ్రామీణ మహిళలు వారానికి సగటున యాభయ్యారు గంటల చొప్పున పని చేస్తున్నారు. పురుషులు సగటున 42 గంటలు మాత్రమే పని చేస్తున్నారు. ఎనిమిది-పదహారు సంవత్సరాల మధ్య వయసు గల బాలబాలికలు కూడా ఎక్కువ కాలమే పనిచేస్తున్నారు. బడికి వెళ్ళి చదువుకొనే కాలాన్ని కూడా కలిపి లెక్కిస్తే ఆడపిల్లలు వారానికి 41 గంటలు, బాలురు 35 గంటల చొప్పున పనిచేస్తున్నట్లు తేలింది. వంట చెరకు సేకరణ, ఇంటి అవసరాలకు తగినంత నీరు తేవటంతో సహా, ఇంటి పనిలో అత్యధిక భాగం ఇల్లాలి మీదే పడుతున్నది ఆడవారు చేసే ఇంటి పని పరిమాణంలో పదవ వంతు కూడా మగవారు చేయటం లేదు. స్త్రీలు

పురుషుల కంటే అధిక గృహ నిర్వహణా భారాన్ని మోస్తున్నట్లే, బాలికలూ బాలురకంటే అధిక పనిభారాన్ని మోస్తున్నారు. మగపిల్లలు చేసే ఇంటిపని పరిమాణం కంటే, 3.7 రెట్లు అధికమైన పనిని బాలికలు చేస్తున్నారు.

పట్టణ ప్రాంతాలలో స్త్రీ పురుషుల పనిభారంలో ఇంత అధిక వ్యత్యాసం ఉండటం లేదు. స్త్రీలు వారానికి 49.2 గంటల చొప్పున పనిచేస్తుంటే, పురుషులు 47.7 గంటల చొప్పున పనిచేస్తున్నారు

పురుషుల శ్రమలో ఎనభైశాతానికి వేతనం లభిస్తుంటే, స్త్రీల శ్రమలో 41 శాతానికి ఇది లభిస్తున్నది. బాలికలు కుటుంబానికి అన్నదాతలుగా రూపొందారు. ఉదరపోషణకు బాలురు చేసే బయట పనులకు వినియోగించే పనికాలానికి, పదిరెట్లు అధిక కాలాన్ని బాలికలు వినియోగిస్తున్నారు. వేతనార్జనకు వెళ్ళే స్త్రీ పురుషులు, ఇలా వెళ్ళని వారికంటే ఎక్కువ కాలమే పనిచేస్తున్నారు. వీరిద్దరి పనికాల పరిమాణాల భేదం, అధికంగానే ఉంటున్నది. (మహిళ ఉద్యోగపు పనినే గాక, ఇంటి పనిని కూడా చేయవలసి రావటం, భర్తలు చేసే ఇంటిపని నామమాత్రంగా ఉండటం అందరకూ తెలిసిందే) మహిళలు వారానికి 75 గంటల చొప్పున పనిచేస్తుంటే, పురుషులు 61 గంటలు చొప్పున మాత్రమే పనిచేస్తున్నారు. స్వయంఉపాధి పనులను చేసుకొనే మహిళల పనికాల పరిమాణం గ్రామీణ మహిళల పనికాలం కంటే అధికంగా ఉంటున్నది.

వెనిజులా దేశంలో, మహిళలలో వేతనార్జనకు వెళ్ళేవారు తక్కువగానే ఉన్నారు. అయినా వారు పురుషుల కంటే అధిక పనిభారాన్ని మోస్తున్నారు. ఆదేశపు సెంట్రల్ బ్యాంకు జరిపిన సర్వేవల్ల ఈ విషయం వెల్లడైంది. ఈ సర్వే జరిపినవారు, పనులను ఐదు రకాలుగా విభజించారు; 1. వేతనార్జన పనులు, 2. ఇంటిపనులు, 3. వ్యక్తిగత పనులు, 4. చదువు, 5. సాంఘిక సేవలు, విశ్రాంతి.

పురుషులు వేతనార్జనా పనులకు రోజుకు ఆరుగంటల చొప్పున వినియోగిస్తున్నారు. స్త్రీలు ఇందుకు వినియోగిస్తున్న కాలపరిమాణం 2.25 గంటలు మాత్రమే. ఇంటి పనులలో, పురుషులు చేసే పనికి 11.5 రెట్ల అధిక పరిమాణాన్ని మహిళలు చేస్తున్నారు.

వేతనార్జనకు వెళ్ళే స్త్రీ పురుషులు ఇంటి పనులకు వినియోగించే కాలపరిమాణంలో విపరీతమైన భేదం కనుపిస్తున్నది. పురుషులు రోజుకు అరగంట కాలాన్ని మాత్రమే ఇంటి పనులకు వినియోగిస్తున్నారు, స్త్రీలు మూడు నుండి నాలుగున్నర గంటల కాలాన్నిందుకు వినియోగిస్తున్నారు. ఇందువల్ల వేతనార్జనకు వెళ్ళే స్త్రీలకు ఇరుగు పొరుగు వారితో మాట్లాడటం, ఇతర సాంఘిక కార్యక్రమాలలో పాల్గొనటం, విశ్రాంతి వంటి వాటికి తగినంత సమయమే ఉండటం లేదు. వేతనార్జనకు వెళ్ళని మహిళల కంటె వీరి పనిభారం అధికంగా ఉంటున్నది.

పురుషులు, వివాహితులయినా, కాకపోయినా వారు చేసే ఇంటిపని రోజుకు అరగంట మాత్రమే. అంటే వివాహనంతరం వారి ఇంటి పని కాలంలో ఏ మాత్రం పెరుగుదల లేదన్నమాట కాని స్త్రీ పరిస్థితి మాత్రం ఇందుకు భిన్నంగా ఉంటున్నది. వేతనార్జనకు వెళ్ళే అవివాహిత యువతి ఇంటిపనులకు రోజుకు 162 నిమిషాల కాలాన్ని వినియోగిస్తున్నది. వివాహానంతరం ఆవిడ ఇంటిపనికి, 211 నిమిషాలు వినియోగించ వలసి వస్తున్నది. అంటే వివాహానంతరం ఆవిడ ఇంటి పనిభారం ముప్పైశాతం పెరిగిందన్నమాట! పిల్లలు పుట్టిన తర్వాత ఇల్లాలు ఈ పనికి 246 నిమిషాలు అంటే నాలుగు గంటలు అదనంగా వినియోగించవలసి వస్తున్నది.

1988 వ సంవత్సరంలో పురుషుల మొత్తం పని కాలాన్ని 970 కోట్ల గంటలు గానూ, స్త్రీల పనికాలాన్ని 1,240 కోట్ల గంటలు గానూ సర్వేయర్లు అంచనా వేశారు. ఈ అంచనాల ప్రకారం మొత్తం పని పరిమాణంలో, ఈ దేశపు పురుషులు 44 శాతాన్ని మాత్రమే చేస్తూండగా, స్త్రీలు 56 శాతపు పనిని చేస్తున్నట్లు స్పష్టమవుతున్నది.

### భారత దేశంలో....

భారతదేశంలోనూ పరిస్థితి ఇందుకు భిన్నంగా లేదు. పురుషులకంటే ఎక్కువ కాలమే స్త్రీలు పనిచేస్తున్నారు. లేబర్ మార్కెట్‌కి వెళ్ళి వేతనాన్ని ఆర్జించే స్త్రీలు, స్త్రీల జనాభాలో చాలా తక్కువగా ఉన్నట్లు జనాభా లెక్కలలో కనుపిస్తారు. పురుషుల జనాభాలో వేతనాన్ని ఆర్జించే వారి సంఖ్యా

పరిమాణం చాలా అధికంగా ఉంటుంది. "జెండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా" అన్న పేరిట ప్రపంచ బ్యాంకు ప్రచురించిన రిపోర్టులో ఈ అంశాన్నిలా వివరించారు. "స్త్రీలలో 27 శాతం మంది మాత్రమే లేబర్ మార్కెట్‌కు వెళ్ళి వేతనాన్ని ఆర్జిస్తుండగా, అరవై శాతం మంది వేతనం లభించని కుటుంబపు పనులు చేస్తున్నారు. అధికార పదజాలంలో "లేబర్ ఫోర్సు" అనే వర్గం క్రిందకు వచ్చే స్త్రీలు 38 శాతం మంది మాత్రమే ఉన్నారు వేతనం లభించకుండా, కుటుంబపు పనులు చేసే స్త్రీలే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు పురుషులలో ఇరవై సంవత్సరాల వయసు మించిన తర్వాత కుటుంబపు పనులు చేసే వారి సంఖ్య బాగా తగ్గిపోతున్నది. వర్క్ ఫోర్స్‌లో నున్న అత్యధిక సంఖ్యాక స్త్రీలు వేతనం లభించని కుటుంబ సేవకులుగానే జీవితాంతం పనిచేస్తున్నారు"

ఈ రిపోర్టును రూపొందించిన నిపుణులు, భారతీయ మహిళలు ఏయే రంగాలలో ఎంతమంది పనిచేస్తున్నదీ అంచనా వేయటానికి ప్రయత్నించారు. భారతీయ జనభాలెక్కలు గాని, నేషనల్ శాంపుల్ సర్వేలు గాని, ప్రచురించిన వివరాలు యదార్థాన్ని స్పష్టంగా ప్రతిబింబించటం లేదని, పనిచేస్తున్న స్త్రీల సంఖ్యనివి తక్కువగా అంచనా వేస్తున్నాయన్న అభిప్రాయానికి వారు వచ్చారు. ఈ విషయ సమర్థనకు, నల్గొండ జిల్లాలో 1987 వ సంవత్సరంలో అంతర్జాతీయ లేబర్ ఆర్గనైజేషన్ జరిపించిన సర్వేలోని దిగువ అంశాన్ని వారు ఉదహరించారు "1971 వ సంవత్సరపు జనాభా లెక్కలు వర్క్ ఫోర్స్‌లో నున్న మహిళల సంఖ్యను తక్కువగా అంచానా వేశాయని, ఆంధ్రప్రదేశ్‌కి చెందిన నల్గొండ జిల్లాలో జరిగిన సర్వే నిరూపించింది అరవై నాలుగు శాతం మంది పురుషులు, ముప్పయ్యారు శాతం మంది స్త్రీలు వర్క్‌ఫోర్సులో ఉన్నట్లు జనాభా లెక్కలు సూచించాయి. వివరంగా సర్వే జరిగిన తర్వాత, పురుషులలో 93 శాతం మంది, స్త్రీలలో 78 శాతం మంది వర్క్ ఫోర్సులో ఉన్నట్లు తేలింది. అంతేకాదు: దేశం మొత్తం వర్క్‌ఫోర్సులో సగం మంది వరకూ (46 శాతం) స్త్రీలుంటారని చెప్పవచ్చు".

పలుసంస్థలు ప్రచురించిన మహిళల వర్క్ ఫోర్సుకు సంబంధించిన అంచనాలు, పలువిధాలుగా ఉండటం వల్ల అవి వాస్తవాన్ని ప్రతిబింబించటం లేదని ప్రపంచ బ్యాంకు నిపుణులు భావించారు అందుచేత వర్క్ ఫోర్సును అంచనా వేయటం కంటే, స్త్రీ పురుషులలో రోజుకు ఎవరు ఎంతకాలం పనిచేస్తున్నారో, ఏమి పనులు చేస్తున్నరో చూడటం వల్ల స్త్రీల పని పరిమాణానికి సంబంధించిన వాస్తవమైన అంచనాలను రూపొందించ వచ్చునని, తద్వారా వర్క్ ఫోర్సులోని స్త్రీల పరిమాణపు అంచనా (వాస్తవానికి దగ్గరగా ఉన్నది) లభించగలదని ఈ నిపుణులు భావించారు. ఇందుకు 1985వ

మూడవ పట్టిక

రాజాస్తాన్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలోని గ్రామాలలో స్త్రీ పురుషుల పనికాలపరిమాణాలు

| వయసువారి వర్గాలు | రాజాస్తాన్ గ్రామాలలో పనికాలము - గంటలలో | | పశ్చిమ బెంగాల్ గ్రామాల్లో పనికాలము - గంటలలో | |
|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 5-9 సంll మధ్య వయస్కులు | 1.83 | 5.50 | 2.06 | 0.79 |
| 6-14 సంll మధ్య వయస్కులు | 2.98 | 7.66 | 5.68 | 4.61 |
| 14-19 సంll మధ్య వయస్కులు | 5.24 | 7.91 | 4.83 | 6.06 |
| 19-34 సంll మధ్య వయస్కులు | 6.24 | 8.83 | 6.66 | 7.99 |
| 34-44 సంll మధ్య వయస్కులు | 8.99 | 10.01 | 8.27 | 8.02 |
| 44-70 సంll మధ్య వయస్కులు | 5.99 | 7.93 | 6.39 | 5.65 |

*గమనిక : జెండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా రిపోర్టులోని పట్టికల ఆధారంతో దీనిని రూపొందించాం*

## నాల్గవ పట్టిక

### పశ్చిమ బెంగాల్ గ్రామాలలో స్త్రీ పురుషులు పనిచేస్తున్న కాల పరిమాణము (రోజుకు - గంటలలో)

| స్త్రీ పురుషులు చేస్తున్న పనుల స్వభావము | 5-9 సం॥ లమధ్య వయస్కులు | | 6-14 సం॥ల మధ్య వయస్కులు | | 14-19 సం॥ల మధ్య వయస్కులు | | 19-34 సం॥ల మధ్య వయస్కులు | | 34-44 సం॥ల మధ్య వయస్కులు | | 44-70 సం॥ల మధ్య వయస్కులు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 1. వ్యవసాయ పనులు | 0 14 | 0.05 | 1.87 | 0.38 | 0.47 | 0.24 | 4.12 | 0.59 | 4.54 | 0.49 | 3.77 | 0 07 |
| 2. వ్యవసాయానుబంధపనులు | 1.58 | 0.14 | 3.36 | 0.80 | 3.15 | 0.30 | 0.77 | 0.27 | 0.47 | 0.69 | 0.37 | 0.41 |
| అ) వ్యవసాయము, దాని అనుబంధ పనులకు (1,2 ఐటముల మొత్తం) | 1.72 | 0 19 | 5.25 | 1.18 | 3.62 | 0.54 | 4.89 | 0.86 | 5.01 | 1.18 | 4.14 | 0.48 |
| 3. వ్యవసాయేతర పనులు | 0.21 | 0.18 | 0.31 | 1.72 | 0.99 | 1.44 | 1.62 | 1.20 | 2.58 | 0.76 | 2.16 | 1.59 |
| ఆ) ఆర్థికాదాయం లభించగల పనులకు వినియోగించిన మొత్తం కాలం (1,2,3 ఐటముల మెత్తము) | 1.93 | 0.37 | 5.54 | 2.90 | 4.61 | 1.98 | 6.51 | 2 06 | 7.59 | 1.94 | 6.30 | 2.07 |
| 4. ఇంటి కవసరమైన నీరుతేవటానికి | - | 0.05 | 0.06 | 0.27 | 0.07 | 0.59 | 0.01 | 0.39 | - | 0.29 | - | 0.18 |
| ఇ) పైనాలుగు ఐటములకు పట్టిన మొత్తము కాలము | 1.93 | 0 42 | 5.60 | 3.17 | 4.68 | 2.57 | 6.52 | 2.45 | 7.59 | 2.23 | 6.30 | 2.25 |
| 5. ఇంటిపనులు | 0.13 | 0.37 | 0.08 | 1.44 | 0.15 | 3.49 | 0.14 | 5.54 | 0.68 | 5.79 | 0.09 | 3.40 |
| పైన పేర్కొన్న ఐదు పనులకు పట్టిన కాలము | 2.06 | 0.79 | 5.68 | 4 61 | 4.83 | 6.06 | 6.66 | 7.99 | 8 27 | 8.02 | 6.39 | 5.65 |

*ఆధారం : జెండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా లోని విపుల మైన పట్టిక కిది సంక్షిప్తరూపం*

## ఐదవ పట్టిక

### రాజస్థాన్ గ్రామాలలో స్త్రీ పురుషులు పనిచేస్తున్న కాల పరిమాణము (రోజుకు-గంటలలో)

| స్త్రీ పురుషులు చేస్తున్న పనుల స్వభావము | 5-9 సం॥ లమధ్య వయస్కులు | | 6-14 సం॥ల మధ్య వయస్కులు | | 14-19 సం॥ల మధ్య వయస్కులు | | 19-34 సం॥ల మధ్య వయస్కులు | | 34-44 సం॥ల మధ్య వయస్కులు | | 44-70 సం॥ల మధ్య వయస్కులు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 1. వ్యవసాయపు పనులు | 0.51 | 1.63 | 1.38 | 3.06 | 2.00 | 2.98 | 2.75 | 2 44 | 6.31 | 3.62 | 4.04 | 3 05 |
| 2. వ్యవసాయానుబంధపనులు | 1.15 | 1 28 | 0.94 | 1.60 | 1.28 | 1.09 | 0 68 | 1 13 | 1 38 | 1.38 | 1 21 | 1 43 |
| అ) వ్యవసాయము, దాని అనుబంధ పనులకు (1,2 ఐటముల మొత్తం) | 1.66 | 2.91 | 2.32 | 4.66 | 3 28 | 4 07 | 3.43 | 3.57 | 7.69 | 5.00 | 5 25 | 4 48 |
| 3. వ్యవసాయేతర పనులు | - | - | 0.16 | 0 04 | 1.76 | 0.04 | 2.70 | 0.10 | 1.00 | 0.04 | 0 37 | 0 09 |
| ఆ) ఆర్థికాదాయం లభించగల పనులకు వినియోగించిన మొత్తం కాలం (1,2,3 ఐటముల మొత్తము) | 1.66 | 2.91 | 2.48 | 4.70 | 5.04 | 4.11 | 6.13 | 3 67 | 8 69 | 5.04 | 5 62 | 4 57 |
| 4. ఇంటి కవసరమైన వంటచెరకు, నీరు తేవటానికి | - | 0 17 | 0.03 | 0.43 | 0.00 | 0.56 | 0.00 | 0.60 | 0 01 | 0 50 | 0 02 | 0 32 |
| ఇ) పైనాలుగు ఐటములకు పట్టిన మొత్తము కాలము | 1.66 | 3.08 | 2.51 | 5.13 | 5.04 | 4.67 | 6.13 | 4.27 | 8 70 | 5.54 | 5.64 | 4.89 |
| 5. ఇంటిపనులు | 0.17 | 2.42 | 0 47 | 2.53 | 0.20 | 3 24 | 0 11 | 4.56 | 0.29 | 4.47 | 0 35 | 3 04 |
| (ఈ) నిర్వహిస్తున్న మొత్తం పనిభారం (పై ఐదు ఐటముల మొత్తము) | 1.83 | 5.50 | 2.98 | 7.66 | 5.24 | 7.91 | 6 24 | 8.83 | 8.99 | 10 01 | 5 99 | 7 93 |

*ఆధారం జెండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా లోని విపుల మైన పట్టిక కిది సంక్షిప్తరూపం*

సంవత్సరంలో రాజస్తాన్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలోని గ్రామాలలో జరిపిన సర్వే సమాచారాన్ని విశ్లేషణకు తీసుకొన్నారు ( ఆ సమాచార ప్రాతిపదిక మీద నిపుణులు తయారు చేసిన సంఖ్యా వివరాలకు ఈ అధ్యాయంలోని మూడవ, నాల్గవ, ఐదవ పట్టికలను చూడండి)

ఈ పట్టికలలోని సమాచారం, పురుషుల కంటే స్త్రీలే అధికకాలం పనిచేస్తున్నట్లు స్పష్టంగా నిరూపిస్తున్నది. రాజస్తాన్ గ్రామాల మహిళలు, పురుషుల కంటే అధిక కాలం పనిచేయటమే గాదు, పశ్చిమ బెంగాల్ మహిళల కంటే కూడా ఎక్కువ కాలం పనిచేయటం కనుపిస్తుంది. రాజస్తాన్ గ్రామాలు మెట్ట ప్రాంతాలకు చెందినవి కావటంచేత, ఆ ప్రాంతంలో పేదరికపు బాధ అధికంగా కూడా ఉండటం సహజం. జీవన పరిస్థితులు ఎంత బాధాకరంగా ఉంటే, అంతగా మహిళల పని భారం పెరుగుతుందనటానికి ఈ వివరాలు నిదర్శనం పశ్చిమ బెంగాల్ గ్రామాలు మాగాణి ప్రాంతాలు గనుక, రాజస్థాన్ గ్రామీణుల పరిస్థితికంటే, వీరి జీవన పరిస్థితులు మెరుగుగా ఉండటం సహజం.

రాజస్తాన్ గ్రామాలలో ముక్కు పచ్చలారక పూర్వమే బాలికలు, బాలుర కంటే ఎక్కువ కాలం పని చేస్తూండటాన్ని కూడా పట్టిక చిత్రిస్తున్నది. ఐదు - తొమ్మిది సంవత్సరాల మధ్య వయసులోని బాలురు రోజుకు 1.83 గంటలు మాత్రమే పనిచేస్తుండగా బాలికలు 5.50 గంటలు పనిచేయటం కనుపిస్తున్నది. ఆరు - పద్నాలుగు సంవత్సరాల మధ్య వయస్సుగల బాల బాలికలలో, బాలురు 2.98 గంటలు మాత్రమే పనిచేస్తుండగా బాలికలు 7.66 గంటలు పనిచేయటాన్ని గమనించవచ్చు. మొత్తం పనిని గాని, ఆర్థికాదాయం లభించగల పనులను మాత్రమే గాని పరిగణనకు తీసుకొన్నా, బాలురకంటే బాలికలు ఎక్కువ కాలం పనిచేస్తూండటాన్ని చూడవచ్చు.

పశ్చిమ బెంగాల్ గ్రామాలలో, ఆర్థికాదాయానికి సంబంధించిన పనుల వరకే పరిగణనకు తీసుకొంటే, స్త్రీల కంటే పురుషులే అధిక కాలం పనిచేస్తున్నట్లు కనిపిస్తుంది. కాని, ఇంటి పనులను కూడా పరిగణనకు తీసుకొన్నపుడు, పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ కాలం పనిచేయటం కనుపిస్తుంది.

ఈ సమాచార విశ్లేషణా ప్రాతిపదిక మీద, "దక్షిణాసియాలోని ఇతర దేశాలలో వలె, భారతదేశంలో కూడా స్త్రీలు, పురుషుల కంటే అధిక కాలం పనిచేస్తున్నారు" అని రిపోర్టును రూపొందించిన నిపుణులు స్పష్టం చేశారు.

## స్త్రీల అదృశ్య పనిభారం

పురుషులకంటే స్త్రీలే ఎక్కువ కాలం పనిచేస్తున్నట్లు, ఇందుకు సంబంధించిన సర్వేలన్నీ నిరూపిస్తున్నాయి. స్త్రీలు చేసే పనులలో ఇమిడి ఉన్న శ్రమ భారము, పనివత్తిడి, వైవిధ్యం వంటి విషయాలను సర్వేల సంఖ్యా సమాచారం ప్రతిబింబించటం లేదు.

"పనులు" అంటే ఒక దాని తర్వాత మరొకటిగా చేయదగినవి అన్నది సాధారణాభిప్రాయం. ఈ వర్గానికి చెందిన పనులన్నీ సామాన్యంగా పురుష కార్యాలే అయి ఉంటాయి ఈ సూత్రం ఇంటి పనులు చేసే స్త్రీలకు వర్తించదు. వారు రెండు - మూడు పనులను కూడ ఏక కాలంలో చేయవలసి వస్తుంది; దేనినీ వాయిదా వేసే వీలుండదు. ఉదాహరణకు ఒకవంక బిడ్డ ఏడుస్తూ ఉంటుంది, మరొక వంక పొయ్యి మీద వంటకం మాడుతున్నట్లు వాసన వస్తుంది. వీటిలో దేనిని ఇల్లాలు వాయిదా వేయగలదు? మరొక పని ఏదయినా చేస్తూ, పొయ్యి మీద వంటకాన్ని కనిపెట్టి ఉండాలి. లేదా ఇంటి పనిని చేస్తూ, అదే బిడ్డ మీద ఒక కన్నేసి ఉంచాలి. ఇంటి పనితో సతమతమవుతూ ఉంటే, "ఆఫీస్ టైం అయింది, అన్నం పెట్టు; టిఫిన్ కట్టివ్వు" అని అధికారయిన భర్త హెచ్చరికలు అందుతుంటాయి. వ్యవసాయ కుటుంబానికి చెందిన ఇల్లాలిని, "ఇప్పటికే పొద్దెక్కింది; చద్దికట్టు, ఇంకెంత సేపు" అని భర్త తొందరపెడుతూంటాడు. ఇంతవరకూ మనం పరిశీలించిన సంఖ్యా వివరాలు పనిచేయటానికి పట్టే కాలాన్ని చిత్రించగలుగుతున్నాయి గాని, పలురకాల ఇంటిపనులలో, అడకత్తెరలో పోకచెక్కగా నలుగుతున్న ఇల్లాలి బాధను అంచనా వేయలేకపోతున్నాయి. ఈ శతాబ్దపు యనభయ్యవ దశాబ్దంలో అమెరికాలో, ఒక సర్వే నిర్వాహకులు ఈ విషయాన్ని అంచనా వేయటానికి ప్రయత్నించారు. ఒకే సమయంలో రెండు - మూడు పనులను చేయటం అనేది పురుషులలో కంటే స్త్రీలలో అధికంగా కనుపిస్తున్నట్లు ఈ సర్వే నిర్ధారణ చేసింది. చేయవలసిన ఇంటి పనులలో నాల్గింట మూడు వంతులను,

ఒకేసారి ఒకటికి మించి చేయవలసి వస్తున్నట్లు సెయింట్ లూసియా గ్రామీణ ప్రాంతంలో జరిగిన ఒక సర్వే నిరూపించింది.

కొన్ని రకాల పనులను, వాయిదా వేయటానికిగానీ, చేయకుండా వదలి వేయటానికి గానీ వీలులేదు. ఇలాంటి వాటిలో చెప్పదగినవి వంట, పిల్లలకు సంబంధించిన పనులు ఎన్ని ఇబ్బందులున్నా, ఈ పనులను సకాలంలో చేయక తప్పదు పొయ్యిలోని పిల్లిని లేపకపోతే భర్త, కుటుంబీకులు ఊరుకోరు; ఏడ్చేబిడ్డను సముదాయించకపోతే మాతృహృదయం ముక్కలవుతుంది! ఇందులో ఇల్లాలు ఏ పనిని మానగలదు?

అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాల సర్వేలను పరిశీలిస్తే, అధికార పనిదినాలలో స్త్రీ పురుషుల పనికాల పరిమాణాలలో పెద్దగా తేడాలు కనుపించవు. శలవు దినాలయిన శని, ఆదివారాలలో పురుషులకు పని ఉండదు. ఇందుకు అనుగుణంగా ఇల్లాలి ఇంటి పనులకు శలవుంటుందా? ఉండదు. ఈ రెండు రోజులలో ఇల్లాలికి రోజుకు రెండు గంటలకు తగ్గని అదనపు పని ఉంటుంది. బిడ్డలున్న ఇల్లాలు ఇంతకాలం కంటే ఎక్కువే పనిచేయవలసి వస్తుంది

అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ చేయవలసిన ఇంటి పనుల స్వభావంలో భేదాలున్నాయి. వంటకు ఆధునిక పరికరాలుంటాయి; బట్టలుతికే యంత్రాలుంటాయి; వండిన ఆహార పదార్థాలు, టిన్నులలో నిల్వచేసినవి మార్కెట్లో లభిస్తాయి. వీటిని నిమిషాలమీద వెచ్చచేసి వడ్డించవచ్చు. కొన్ని రకాల ఆహార పదార్థాలు, వెచ్చచేయకుండా కూడా తినదగినవి మార్కెట్లో లభిస్తాయి, ఇల్లు శుభ్రం చేయటానికి వాక్యూం క్లీనర్లుంటాయి. నడుములు పోయేట్లు ఊడ్చి ఎత్తిపోసి, తుడవ వలసిన అవసరం లేదు. ఈ విధంగా అభివృద్ధి చెందిన దేశాల మహిళలకు పనిత్వరగా అవుతుంది; శ్రమ భారం చాలా వరకు తగ్గుతున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాల స్త్రీల పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉన్నది. పైన పేర్కొన్న పనులకు అధిక కాలమే కాదు; అధిక శ్రమ కూడా అవసరమవుతున్నది. వంట చెరకుకు, నీటికి కూడా కొరత ఉంటే, స్త్రీలు పనిచేయవలసిన కాలం పెరగటం మాత్రమే కాక, అధికంగా శ్రమించవలసి వస్తుంది స్త్రీల ఈ శ్రమ భారం సంఖ్యాపరమైన అంచనాలలో కనుపించటం లేదు. హృదయమున్న వారికి మాత్రమే దీని లోతు తెలుస్తుంది.

రోజుకు ఉండేది ఇరవై నాలుగు గంటలు మాత్రమే ఇల్లాలు చేయవలసి ఉండే పనికి ఈ కాలవ్యవధి చాలదంటే ఆశ్చర్యపడనవసరం లేదు చేయవలసిన పనినంతటిని ఇల్లాలు ఈ కాల వ్యవధిలో (నియమిత కాలవ్యవధిలో) చేయవలసి రావటం చేతా. చేయవలసిన పనులలో వాయిదా వేయటానికి వీలులేనివి అధికంగా ఉండటం చేతా, విపరీతమైన శారీరక శ్రమకే గాక, మానసిక వత్తిడికి కూడా గురవుతున్నది. కుటుంబం పేదదయినపుడు ఆ కుటుంబపు ఇల్లాలి బాధ వర్ణనాతీతంగా ఉంటుంది

పని వత్తిడి, భారాలవల్ల ఇల్లాలికి తీరిక ఉండదు. అధిక పనిభారము, శ్రమ, వత్తిడివల్లా, విశ్రాంతి లేకపోవటం చేతా ఆరోగ్యం చెడే ప్రమాదముంటుంది దీనికి తోడు పోషణాలోపం కూడా తోడయితే ఆవిడ స్థితి మరింత బాధాకరంగా రూపొందుతుంది. ఈ అంశాన్ని కూడా సర్వే సంఖ్యా సమాచారం వెల్లడించటం లేదు. ఇదంతా సామాజికులకు అదృశ్యంగానే ఉంటున్నది ఈ స్థితిని గుర్తించగలిగిన భర్త లెందరో తెలియదు. స్త్రీల శ్రమకు విలువగట్టినా, దానిని ఆవిడ పనికాల పరిమాణ ప్రాతిపదిక మీద నిర్ణయిస్తున్నారు; పై అంశాలు పరిగణనకు రావటం లేదు; ఈ సేవలు అమూల్యము!

పరియావరణ పరిస్థితి క్షీణించటంవల్ల మహిళల పనిభారం పెరుగుతున్నది. కలప పరిశ్రమ, పశుపాలనా, పాడి పరిశ్రమ పెరగటంవల్ల మగవారికి ఉపాధి అవకాశాలు అధికమవుతాయి. కాని అడవులు నాశనం గావటంచేత వంట చెరకుకు కొరత ఏర్పడుతుంది. పశువులు అతిగా మేయటం వల్ల నేల కోత బడటం ఎక్కువవుతుంది ఇందువల్ల నీటి కొరత ఏర్పడుతుంది. వంట చెరకు సేకరణ, నీరు తేవటం ఆడవారి పనులు. వీటి కొరతవల్ల, వీటి సేకరణకు ఎక్కువ కాలం పడుతుంది. ఇందువల్ల మగపిల్లల కంటే ఆడపిల్లలు పనిచేసే కాలం కూడా పెరుగుతుంది. ఉదాహరణకు కీన్యాలో వంటా వార్పుకు, వంట చెరకు, నీటి సేకరణకు, పొలం పనులకు, మహిళలు వారానికి 45 గంటల చొప్పున కాలాన్ని

వినియోగించవలసి వస్తున్నది. పురుషులు ఈ పనులకు ఇరవై గంటల కాలాన్ని మాత్రమే వినియోగిస్తున్నారు. మగపిల్లల కంటే ఆడపిల్లలు కూడా ఎక్కువ కాలాన్ని ఈ పనులకు వినియోగించవలసి వస్తున్నది. వంటచెరకు, నీటి సేకరణకు, పురుషులకంటే స్త్రీలు పదిరెట్ల కాలాన్ని అధికంగా వినియోగి స్తున్నట్లు యు.ఎన్.డి.పి. నిపుణులు అంచనా వేశారు. ఆడపిల్లలు, ఈ పనులకు మగవారికంటే ఏడురెట్లు, తోటి మగపిల్లలకంటే మూడున్నర రెట్ల కాలాన్ని వినియోగిస్తున్నారు. మగవారి కంటే, స్త్రీలు ఎక్కువ కాలం పనిచేయటం అనేది, బాల్యం నుండే ప్రారంభమవుతుందని ఈ విషయం సూచిస్తున్నది !

ఇతర దేశాలలోనూ పరిస్థితి ఇలాగే ఉంది. పెరూ దేశంలోని మహిళలు వంట చెరకు సేకరణకు రోజుకు సుమారుగా రెండున్నర గంటల కాలాన్ని వినియోగించవలసి వస్తున్నది. భారతదేశంలోని గుజరాత్ రాష్ట్రంలో మహిళలు రోజుకు మూడు గంటల కాలాన్నీ పనికి వినియోగిస్తున్నారు. హిమాలయ పర్వత పాదవాసులు, పూర్వతరం వారికంటే రోజుకు రెండుగంటల అధిక కాలాన్ని వంట చెరకు సేకరణకు వినియోగించవలసివస్తున్నది. అడవులు అంతరించటంవల్ల, వీరు కొండమీదకు వెళ్ళి వంటచెరకును సేకరించవలసి వస్తున్నది. ఇందువల్ల ఇపుడు వంటచెరకు సేకరణకు ఒకరోజు పడుతున్నది. సుడాన్‌లో పదేండ్ల క్రితం కంటే, ఇపుడు నాలుగురెట్ల అధిక కాలాన్ని వంట చెరకు సేకరణకు వినియోగించక తప్పటం లేదు. మొజాంబిక్‌లో మహిళలు వారానికి పదిహేను గంటల కాలాన్ని ఇంటివాడకానికి అవసరమైన నీరు తేవటానికి వాడుతున్నారు. సెనెగల్‌లో ఈపనికి వారానికి పదిహేనున్నర గంటలు పడుతున్నది. ఎడారి విస్తరిస్తున్న ప్రాంతాలలో నీరు తేవటానికి స్త్రీలు రోజుకు నాలుగు గంటల కాలాన్ని వాడుతున్న సందర్భాలు కూడా ఉన్నాయి.

### లెక్కకురాని స్త్రీల శ్రమవిలువ పదకొండు లక్షల కోట్ల డాలర్లు !

పురుషుని కంటే స్త్రీ ఎక్కువ కాలం పని చేయటాన్నీ, అతిభారమైన పనులను మాత్రమే గాక, ఒకే కాలంలో పలురకాల పనులను ఆవిడ చేస్తున్న తీరును చూచాం. ఆవిడ బాధపడుతూ, అధిక భారాన్ని మోస్తూ కూడా, బహుపాత్రాభినయం చేయగల తన శక్తి యుక్తులను చాటుతున్నది. పశ్చిమాద్రికి పయనించే దినకరునితో పోటీ పడుతూ, అవసరమైన అన్ని ఇంటి పనులనూ సకాలంలో చేయటానికి పరుగులు దీస్తూంటుంది భర్తవలె ఉద్యోగం చేస్తున్నా, లేక కూలి-నాలి చేస్తున్నా, పనికి వెళ్ళే ముందూ, పని నుండి వచ్చిన తర్వాత ఒంటి చేతి మీదుగా ఇంటి పనులను చేసుకొంటుంది. ఇటువంటి ఇల్లాండ్రకు చేయి అందించే భర్తలు అతికొద్ది మంది మాత్రమే కనుపిస్తారు. అయినా పురుషుని పోషణలోని వ్యక్తిగానే ఆవిడను సమాజం పరిగణిస్తున్నది; పురుషునితో సమానమైన స్థానాన్నీయటం లేదు.

ఉద్యోగం చేస్తున్న అవివాహిత యువకుడు, అవివాహితైన యువతిని ఇంటిపనులు చక్కబెట్టటానికి, వేతన ప్రాతిపదిక మీద నియమించాడని అనుకొందాం. వంటా-వార్పూ-వడ్డనా వంటి పనులతోపాటు అన్ని రకాల గృహ కృత్యాలనూ ఆవిడ చేస్తూంటుంది. ఆవిడ చేసే శ్రమకు మార్కెట్ రేటున లెక్కగట్టి వేతనాన్నతడు చెల్లిస్తుంటాడు. ఆవిడ మంచిదనీ, చక్కగా ఇంటిపనులను చక్కబెట్టగలదనీ మెచ్చి, ఆ యువకుడు, ఆ యువతిని వివాహమాడాడను కొందాం. వివాహమైన మరునాటి నుండి ఆవిడకు ఇంతవరకూ గిడుతున్న వేతన చెల్లింపు ఆగిపోతుంది. ఇందువల్ల ఆవిడ సంపాదనను కోల్పోతుంది. కథ ఇంతటితో ఆగదు ఆ యువకునకు ఆవిడ మీద, ఇంతకు పూర్వం లేని అధికారం లభిస్తుంది. ఆమె పిల్లలను కంటే, ఇంతకు పూర్వం కంటే ఎక్కువ పనిని చేయవలసి ఉంటుంది. తనకేది కావాలన్నా భర్తగారి దయాధర్మాలమీద ఆధార పడవలసి ఉంటుంది వివాహానికి పూర్వం అనుభవించిన ఆర్థిక స్వాతంత్ర్యం వివాహానంతరం అంతరిస్తున్నది. ఆవిడ పూర్తిగా అస్వతంత్ర అవుతున్నది. జీవితాంతం భర్త దయమీద ఆధారపడవలసి వస్తుంది; పరాధీనగా జీవించవలసి ఉంటుంది.

మనం సంప్రదాయబద్ధులం. వివాహానికి పూర్వం స్త్రీ తలిదండ్రుల రక్షణలో ఉండాలి. అనంతరం భర్త రక్షణకు ఆవిడ బదిలీ అవుతుంది. నాటి నుండీ వారి అడుగుజాడలలో ఆవిడ నడవవలసి ఉంటుంది. వారి పోషణలో ఉంటూ, వారి రక్షణ క్రింద తల దాచుకోవలసి ఉంటుంది. ఈ సంప్రదాయం

మనలో (స్త్రీ-పురుషులందరిలో) జీర్ణించింది అందుచేతనే వివాహానికి పూర్వం స్వతంత్ర జీవనాన్ని రుచిచూసిన యువతి కూడా, వివాహానంతరం దానిని కోల్పోవటాన్ని గుర్తించలేకపోతున్నది. కొందరు సంప్రదాయబద్ధత వల్ల తలవంచుతున్నారు మరి కొందరు అమాయకత్వం వల్ల జరిగిన మార్పును గుర్తించలేకపోతున్నారు. ఇలా ఉండటం - రాజీపడటం - "ధర్మపత్ని" లక్షణంగా సమాజం భావిస్తున్నది

ఎంతటి సంఖ్యా సమస్యలనైనా చిటికలో పరిష్కరించ గల అర్థశాస్త్ర నిపుణులు కూడా ఈ అమాయకులవలె ప్రవర్తించటం మనకు కనుపిస్తుంది. సంప్రదాయబద్ధతే వారి ఆలోచనలకు కూడా సంకెలలు వేస్తున్నదేమో! జాతీయా దాయాన్ని అంచనా వేసేటపుడు, ఇల్లాలు చేసే ఇంటి పనులకు శ్రమ విలువ కట్టటం లేదు వారి దృష్టిలో "ఆర్థిక విలువలేని శ్రమ" గానే అదిమిగులుతున్నది. ఇందువల్ల సంపదోత్పత్తి, ప్రధానంగా పురుషుల కృషీఫలితంగా జాతీయాదాయపు టంచనాలలో కనుపిస్తున్నది. ఆవిడ శ్రమకు విలువ లభించే సందర్భాలలో కూడా ఆవిడ శ్రమ యొక్క నిజమైన విలువల పరిగణన జరగటం లేదు. పురుషునితో సమానమైన పనిని చేసినా, వారితో సమానమైన వేతనం ఆవిడకు లభించటం లేదు ఈ అసమాన వేతనమే జాతీయాదాయపు టంచనాల్లోనికి వస్తున్నది. అందువల్ల ఆవిడ మార్కెట్ శ్రమవల్ల జాతీయాదాయానికి వస్తున్న పరిమాణం కూడా తక్కువగా కనుపిస్తున్నది. పురుషులు చేసే ఇంటి పనులకూ, సామాజిక సేవలకూ కూడ జాతీయాదాయపు టంచనాలలో స్థానం లభించటం లేదు. ఇందువల్ల జాతీయాదాయపు టంచనాలు వాస్తవ విరుద్ధంగా ఉంటున్నాయి. స్త్రీల శ్రమలోని అత్యధిక భాగానికి విలువ లభించకపోవటం చేత ఆవిడ సేవలకూ, సమాజంలోని ఆవిడ స్థానానికీ విలువ లభించటం లేదు. రెక్కలు ముక్కలు చేసుకొన్నా, ఆరోగ్యాన్ని నాశనం చేసుకొన్నా ఆవిడ సేవలకు పరిగణన లభించటం లేదు. ఆవిడ వ్యక్తిత్వానికి విలువ లభించటం లేదు. అవసరమై అప్పుకుపోతే, హామీదారు లేకుండా ఆవిడకు అప్పుకూడా పుట్టటం లేదు ! కుటుంబంలో పరాధీనగా జీవించవలసి వస్తున్నది.

జాతీయాదాయపు టంచనాల తయారీకి "సిస్టం ఆఫ్ నేషనల్ అకౌంట్స్" పేరిట కొన్ని మార్గదర్శక సూత్రాలున్నాయి. (ఈ విధానాన్ని ఎస్.ఎన్.ఎ. అన్న సంక్షిప్త నామంతో వ్యవహరిస్తున్నారు) ఉత్పత్తై మార్కెట్‌కు వస్తున్న సంపదతోపాటు, దాని తయారీకి వినియోగపడిన మానవ శ్రమకు కూడా విలువగడుతున్నారు. ఇందువల్ల మార్కెట్‌కు వచ్చే మానవ శ్రమ విలువలు మాత్రమే జాతీయాదాయపు టంచనాలలో చేరుతున్నాయి ఇంటి పనులకు, కుటుంబ సేవలకు ఆర్థిక విలువల నివ్వకపోవటం చేత, ఈ అంచనాలలో ఇవి ప్రతిబింబించటం లేదు ఈ భేదాన్ని చూపటం కోసం యు యన్.డి పి. నిపుణులు జాతీయాదాయంలో చేరుతున్న మానవ శ్రమను "ఎస్.ఎన్.ఎ." గాను చేరని శ్రమను "నాన్-ఎస్.ఎన్.ఎ" గాను పేర్కొన్నారు పాఠకుల సౌలభ్యం కోసం మొదటి దానిని "వేతనం లభిస్తున్న శ్రమ"గానూ, రెండవ దానిని "వేతనం లభించని శ్రమ" గానూ మేము పేర్కొన్నాం

కొన్ని దేశాల సర్వేల ఆధారంతో, యు.ఎన్.డి.పి. నిపుణులు ఈ రెండు వర్గాల క్రిందకు వచ్చే శ్రమ పరిమాణపు టంచనాలను రూపొందించారు ఈ వివరాలను తెలియజేసే పట్టికలను అభివృద్ధి చెందిన దేశాలకు, అభివృద్ధి చెందుతున్న దేశాలకు వేరువేరుగా ఈ అధ్యాయంలో ఇచ్చాం. వివిధ దేశాలలోని స్త్రీ పురుషులు, పలురకాల పనులను చేయటానికి వినియోగిస్తున్న కాల పరిమాణాలను ఈ అంచనాల తయారీకి ప్రాతిపదికలుగా నిపుణులు తీసుకొన్నారు. (ఆరవ, ఏడవ పట్టికలను చూడండి)

వీరు రూపొందించిన అంచనాల ప్రకారం, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆర్థిక విలువల నీయదగిన మొత్తం పనిలో, స్త్రీలు 53 శాతం పనిని, పురుషులు 47 శాతం పనిని చేస్తున్నారు. సిస్టం ఆఫ్ నేషనల్ ఎకౌంట్స్ మార్గదర్శక సూత్రాల ప్రకారం స్త్రీల శ్రమలో 24 శాతం మాత్రమే ఆర్థిక విలువ గలిగిన (ఎస్.ఎన్.ఎ.) శ్రమగా పరిగణనకు వచ్చింది. మిగిలిన 66 శాతం పనికి ఆర్థిక విలువను వారు ఇవ్వలేదు. ఇది స్త్రీల శ్రమలో "వేతనం లభించని" భాగంగానే మిగిలింది. పురుషుల మొత్తం శ్రమలో 76 శాతానికి ఆర్థిక విలువల నిచ్చారు; మిగిలిన 24 శాతానికి అర్థిక విలువల నీయలేదు. (నాన్ ఎస్.ఎన్.ఎ.గా మిగిలింది)

యు.ఎన్.డి.పి. నిపుణుల అంచనా ప్రకారం అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో ఆర్థిక విలువ నీయదగిన

ఆరవ పట్టిక
పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన కొన్ని దేశాలలో స్త్రీ-పురుషుల పనికాల పరిమాణంలో, వేతనం లభించే, వేతనం లభించని భాగాలు (అంకెలు పని కాలపు శాతాలను సూచిస్తున్నాయి)

| దేశము | సర్వే సంవత్సరం | మొత్తం పని కాలపరిమాణం | | స్త్రీల పనిలో | | పురుషుల పనిలో | |
|---|---|---|---|---|---|---|---|
| | | వేతనం వచ్చేది | వేతనం రానిది | వేతనం వచ్చేది | వేతనం రానిది | వేతనం వచ్చేది | వేతనం రానిది |
| ఆస్ట్రేలియా | 1992 | 44 | 56 | 28 | 72 | 61 | 39 |
| ఆస్ట్రియా | 1992 | 49 | 51 | 31 | 69 | 71 | 29 |
| కెనడా | 1992 | 52 | 48 | 39 | 61 | 65 | 35 |
| డెన్మార్క్ | 1987 | 68 | 32 | 58 | 42 | 79 | 21 |
| ఫిన్లెండ్ | 1987-88 | 57 | 49 | 39 | 61 | 64 | 36 |
| ఫ్రాన్స్ | 1985-86 | 45 | 55 | 30 | 70 | 62 | 38 |
| జర్మనీ | 1991-92 | 44 | 56 | 30 | 70 | 61 | 39 |
| ఇజ్రాయెల్ | 1991-92 | 51 | 49 | 29 | 71 | 74 | 26 |
| ఇటలీ | 1988-89 | 45 | 55 | 22 | 78 | 77 | 23 |
| నెదర్లెండ్స్ | 1987 | 35 | 65 | 19 | 81 | 53 | 48 |
| నార్వే | 1990-91 | 50 | 50 | 38 | 62 | 64 | 36 |
| యునైటెడ్ కింగ్డం | 1985 | 51 | 49 | 37 | 63 | 68 | 32 |
| అమెరికా | 1985 | 50 | 50 | 37 | 63 | 63 | 37 |
| అన్ని దేశాల సగటు | | 49 | 51 | 34 | 66 | 66 | 34 |

*హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995*

మొత్తం పనిలో 51 శాతాన్ని స్త్రీలు చేయగా, 49 శాతాన్ని పురుషులు చేస్తున్నారు. జాతీయాదాయపు టంచనాలలో పురుషుల మొత్తం పనిలో 66 శాతానికి ఆర్థిక విలువ లభించింది; మిగిలిన 34 శాతాన్ని వేతనం లభించని పనిగా పరిగణించారు. స్త్రీల మొత్తం పనిలో 34 శాతానికి ఆర్థిక విలువలు లభించాయి; మిగిలిన 66 శాతం, వేతనం లభించని శ్రమగానే మిగిలింది.

అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలలోకంటే ఆఫ్రికా దేశాలలో, వేతనం లభించే స్త్రీల శ్రమ పరిమాణం అధికంగా ఉన్నది. వారి మొత్తం శ్రమలో 44 శాతానికి వేతనం లభిస్తున్నది. వ్యవసాయం ప్రధానంగా మహిళల మీదే ఆధారపడి ఉండటం ఇందుకు కారణం. లాటిన్ అమెరికా దేశాలలో స్త్రీల శ్రమలో వేతనం లభించే భాగం, 28 శాతంగానూ, ఆసియాలో 36 శాతంగాను ఉన్నది 20వ శతాబ్దపు అరవయ్యవ దశాబ్దానికి, తొంభయ్యవ దశాబ్దానికి మధ్య నున్న కాలానికి సంబంధించిన పద్దెనిమిది దేశాల సర్వే సమాచారాన్ని యు.యన్.డి.పి. నిపుణులు సేకరించి పరిశీలించారు. ఈ దేశాలన్నిటిలో కంటే, తూర్పు యూరపు దేశాలలో (బల్గేరియా, మాజీ జకస్లోవాకియా, మాజీ తూర్పు జర్మనీ, హంగరీ, పోలెండ్, మాజీ యుగోస్లావియా దేశాలలో) వేతనం లభించని స్త్రీ శ్రమ విలువ అధికంగా ఉన్నట్లు వీరు తేల్చారు. నార్డిక్ దేశాలలో కంటేనూ, ఉత్తరమెరికా, ఆస్ట్రేలియా, ఇజ్రాయెల్ దేశాలలో కంటేనూ, ఆర్థిక విలువలు లభించని స్త్రీల శ్రమ విలువ పశ్చిమ యూరపు దేశాలలో అధికంగా ఉన్నట్లు వీరు సూచించారు.

కొన్ని అభివృద్ధి చెందిన దేశాల నిపుణులు, జాతీయ ఆదాయపు టంచనాలలోనికి రాకుండాపోయిన స్త్రీ, పురుషుల శ్రమ ఎంత ఉంటుందో చూడటానికి అంచనాలు వేశారు. లెక్కకు రాకుండా పోయిన మొత్తం శ్రమ విలువ, దేశపు

మనలో (స్త్రీ-పురుషులందరిలో) జీర్ణించింది అందుచేతనే వివాహానికి పూర్వం స్వతంత్ర జీవనాన్ని రుచిచూసిన యువతి కూడా, వివాహానంతరం దానిని కోల్పోవటాన్ని గుర్తించలేకపోతున్నది. కొందరు సంప్రదాయబద్ధత వల్ల తలవంచుతున్నారు మరి కొందరు అమాయకత్వం వల్ల జరిగిన మార్పును గుర్తించలేకపోతున్నారు. ఇలా ఉండటం - రాజీపడటం - "ధర్మపత్ని" లక్షణంగా సమాజం భావిస్తున్నది

ఎంతటి సంఖ్యా సమస్యలనైనా చిటికలో పరిష్కరించ గల అర్థశాస్త్ర నిపుణులు కూడా ఈ అమాయకులవలె ప్రవర్తించటం మనకు కనుపిస్తుంది. సంప్రదాయబద్ధతే వారి ఆలోచనలకు కూడా సంకెలలు వేస్తున్నదేమో! జాతీయా దాయాన్ని అంచనా వేసేటపుడు, ఇల్లాలు చేసే ఇంటి పనులకు శ్రమ విలువ కట్టటం లేదు వారి దృష్టిలో "ఆర్థిక విలువలేని శ్రమ" గానే అదిమిగులుతున్నది. ఇందువల్ల సంపదోత్పత్తి, ప్రధానంగా పురుషుల కృషిఫలితంగా జాతీయాదాయపు టంచనాలలో కనుపిస్తున్నది. ఆవిడ శ్రమకు విలువ లభించే సందర్భాలలో కూడా ఆవిడ శ్రమ యొక్క నిజమైన విలువల పరిగణన జరగటం లేదు. పురుషునితో సమానమైన పనిని చేసినా, వారితో సమానమైన వేతనం ఆవిడకు లభించటం లేదు ఈ అసమాన వేతనమే జాతీయాదాయపు టంచనాల్లోనికి వస్తున్నది. అందువల్ల ఆవిడ మార్కెట్ శ్రమవల్ల జాతీయాదాయానికి వస్తున్న పరిమాణం కూడా తక్కువగా కనుపిస్తున్నది. పురుషులు చేసే ఇంటి పనులకూ, సామాజిక సేవలకూ కూడ జాతీయాదాయపు టంచనాలలో స్థానం లభించటం లేదు. ఇందువల్ల జాతీయాదాయపు టంచనాలు వాస్తవ విరుద్ధంగా ఉంటున్నాయి. స్త్రీల శ్రమలోని అత్యధిక భాగానికి విలువ లభించకపోవటం చేత ఆవిడ సేవలకూ, సమాజంలోని ఆవిడ స్థానానికీ విలువ లభించటం లేదు. రెక్కలు ముక్కలు చేసుకొన్నా, ఆరోగ్యాన్ని నాశనం చేసుకొన్నా ఆవిడ సేవలకు పరిగణన లభించటం లేదు. ఆవిడ వ్యక్తిత్వానికి విలువ లభించటం లేదు. అవసరమై అప్పుకుపోతే, హామీదారు లేకుండా ఆవిడకు అప్పుకూడా పుట్టటం లేదు ! కుటుంబంలో పరాధీనగా జీవించవలసి వస్తున్నది.

జాతీయాదాయపు టంచనాల తయారీకి "సిస్టం ఆఫ్ నేషనల్ అకౌంట్స్" పేరిట కొన్ని మార్గదర్శక సూత్రాలున్నాయి. (ఈ విధానాన్ని ఎస్.ఎన్.ఎ. అన్న సంక్షిప్త నామంతో వ్యవహరిస్తున్నారు) ఉత్పత్తై మార్కెట్‌కు వస్తున్న సంపదతోపాటు, దాని తయారీకి వినియోగపడిన మానవ శ్రమకు కూడా విలువగడుతున్నారు. ఇందువల్ల మార్కెట్‌కు వచ్చే మానవ శ్రమ విలువలు మాత్రమే జాతీయాదాయపు టంచనాలలో చేరుతున్నాయి ఇంటి పనులకు, కుటుంబ సేవలకు ఆర్థిక విలువల నివ్వకపోవటం చేత, ఈ అంచనాలలో ఇవి ప్రతిబింబించటం లేదు ఈ భేదాన్ని చూపటం కోసం యు యన్.డి పి. నిపుణులు జాతీయాదాయంలో చేరుతున్న మానవ శ్రమను "ఎస్.ఎన్ ఎ." గాను చేరని శ్రమను "నాన్-ఎస్.ఎన్ ఎ" గాను పేర్కొన్నారు పాఠకుల సౌలభ్యం కోసం మొదటి దానిని "వేతనం లభిస్తున్న శ్రమ"గానూ, రెండవ దానిని "వేతనం లభించని శ్రమ" గానూ మేము పేర్కొన్నాం

కొన్ని దేశాల సర్వేల ఆధారంతో, యు.ఎన్ డి.పి. నిపుణులు ఈ రెండు వర్గాల క్రిందకు వచ్చే శ్రమ పరిమాణపు టంచనాలను రూపొందించారు ఈ వివరాలను తెలియజేసే పట్టికలను అభివృద్ధి చెందిన దేశాలకు, అభివృద్ధి చెందుతున్న దేశాలకు వేరువేరుగా ఈ అధ్యాయంలో ఇచ్చాం. వివిధ దేశాలలోని స్త్రీ పురుషులు, పలురకాల పనులను చేయటానికి వినియోగిస్తున్న కాల పరిమాణాలను ఈ అంచనాల తయారీకి ప్రాతిపదికలుగా నిపుణులు తీసుకొన్నారు. (ఆరవ, ఏడవ పట్టికలను చూడండి)

వీరు రూపొందించిన అంచనాల ప్రకారం, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆర్థిక విలువల నీయదగిన మొత్తం పనిలో, స్త్రీలు 53 శాతం పనిని, పురుషులు 47 శాతం పనిని చేస్తున్నారు. సిస్టం ఆఫ్ నేషనల్ ఎకౌంట్స్ మార్గదర్శక సూత్రాల ప్రకారం స్త్రీల శ్రమలో 24 శాతం మాత్రమే ఆర్థిక విలువ గలిగిన (ఎస్.ఎన్.ఎ.) శ్రమగా పరిగణనకు వచ్చింది. మిగిలిన 66 శాతం పనికి ఆర్థిక విలువను వారు ఇవ్వలేదు. ఇది స్త్రీల శ్రమలో "వేతనం లభించని" భాగంగానే మిగిలింది. పురుషుల మొత్తం శ్రమలో 76 శాతానికి ఆర్థిక విలువల నిచ్చారు; మిగిలిన 24 శాతానికి అర్థిక విలువల నీయలేదు. (నాన్ ఎస్.ఎన్.ఎ.గా మిగిలింది)

యు.ఎన్.డి.పి. నిపుణుల అంచనా ప్రకారం అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో ఆర్థిక విలువ నీయదగిన

## "ప్రభువెక్కిన పల్లకి కాదోయ్, అది మోసిన బోయీ లెవ్వరు?"

మనము పండించాలంటే, పొలము, పెట్టుబడి మాత్రమే ఉంటే చాలదు. ఆ పొలంలో మొక్కల పోషణకు తగినంత భూసారం ఉండాలి, తగినంత వర్షము లేక సాగునీరు అందుబాటులో ఉండాలి; వంటలు పండించటానికి చేయవలసిన సేద్యపు పనులకు మానవ శ్రమశక్తి ఉండాలి.

బొంబాయి నుండి అమెరికాలోని షికాగోకు 36 గంటలలో వెళ్ళగలం. ఈ ప్రయాణం నిరంతరాయంగా సాగటానికి విమానం ఉంటే మాత్రమే చాలదు. రాత్రి పగలు అన్నబేధం లేకుండా విమానయానానికి అవసరమైన పలురకాల సేవలు చేయటానికి సిబ్బంది శ్రమ కూడా అవసరం.

మనకు పంటలు పండించటానికి అవసరమైన టెక్నాలజీ ఉంది. షికాగో నగరానికి మనను 36 గంటల లోపల చేర్చగల విమానమనే టెక్నాలజీ ఉన్నది. ఈ టెక్నాలజీని పనిచేయించి, కార్యాన్ని సాధించగల సిబ్బంది శ్రమ, తగిన వసతుల ఏర్పాటు కూడా అవసరం. దీనినే కారల్ మార్క్స్, "టెక్నాలజీ, వివిధ ఉత్పత్తి ప్రక్రియల అనుసంధానం"గా చిత్రిస్తూ, ఈ అనుసంధాన ప్రక్రియకు "సోషల్ హోల్" (social whole) గా నామకరణం చేశారు కనుక మనం టెక్నాలజీ ఫలితాలను చూచేటపుడు, వాడే టెక్నాలజీని మాత్రమే గాకుండా, ఉత్పత్తి సాధనకు ఉపకరించిన అనుసంధిత సామాజిక వనరుల వినియోగాన్ని కూడా పరిగణనలోనికి తీసుకోవాలి అన్నది వారి భావన.

ఈ సూత్రాన్ని ప్రొఫెసర్ అమార్త్య సేన్ స్త్రీ పురుష పని విభజనకు అన్వయించారు. అధికోత్పత్తి లేక అధిక ఫలిత సాధనకు అవసరమైన విధంగా కుటుంబీకులు, చేయవలసిన పనులను విభజించుకొంటారు. కుటుంబ సభ్యులు చేసే పనుల విశ్లేషణలో, టెక్నాలజీని మాత్రమే పరిగణిస్తూ, ఆ టెక్నాలజీ వల్ల జరిగిన ఫలిత సాధన కుపకరించిన ఇతరుల శ్రమ, లేక వనరుల వినియోగాన్ని వదలి వేస్తున్నారు. మానవజాతి మనుగడ నిరంతరాయంగా జరుతుగుతూండాలంటే స్త్రీ, సంతానాన్ని కంటూ ఉండాలి; బిడ్డల పోషణను, సంరక్షణా భారాన్ని కూడా మోయాలి. ఇలా జరుగనపుడు, వంశాలు అంతరిస్తాయి. సమాజోత్పత్తికి అవసరమైన మానవ శ్రమ లభించదు. మానవ జాతే క్రమంగా అంతరించే ప్రమాదముంటుంది ఈ దృష్టితోనే స్త్రీని "మాతృమూర్తి"గా మనం కీర్తిస్తుంటాము పోషణ విషయానికొస్తే "కన్నతల్లి" "అన్నపూర్ణ" అంటూ వర్ణిస్తాం. కుటుంబంలోని వ్యక్తుల సంపాదన పరిగణనకు వచ్చినపుడు మాత్రం, ఈ "మాతృమూర్తి", "అన్నపూర్ణ"ల సేవలకు ఆర్థిక విలువల నివ్వటం లేదు పైగా వారిని "భరింపబడే" వర్గంలో చేర్చుతున్నాం. సంపాదనలో పురుషుని ప్రాధాన్యతను గుర్తిస్తూ, అతడు సంపాదనకు వెళ్ళటానికి, వంశోద్ధరణకు, కుటుంబీకుల సంక్షేమానికి ఇల్లాలు చేస్తున్న సేవలకు ఆర్థిక విలువల నివ్వకపోవటమే గాదు; దయాధర్మంగానైనా, వాటికి పరిగణన నివ్వటం లేదు. ఇల్లాలి శ్రమను, సంపదోత్పత్తి విలువలో చేర్చదగిన దానినిగా కూడా అర్థశాస్త్ర నిపుణులు పరిగణించటం లేదు !

ఈ దృష్టితోనే ప్రొఫెసర్ అమార్త్య సేన్ "సంప్రదాయ సమాజంలోగాని, ఆధునిక సమాజంలో గాని, కుటుంబోత్పత్తిని పరిశీలించేటపుడు, ఇంటా, బయటా స్త్రీ పురుషులు చేసే అన్ని రకాల పనులను అనుసంధించి చూడటం అత్యంత ముఖ్యమైన అంశంగా ప్రతిపాదించారు. కుటుంబంలోని స్త్రీ-పురుషులు, కుటుంబీకుల పోషణ, సంరక్షణ, మనుగడలకు చేస్తున్న శ్రమంతటికీ విలువనీయాలి. పురుషుని సంపాదనను మాత్రమే పరిగణనకు తీసుకొని, స్త్రీ కుటుంబానికి చేసే సేవలనూ, ఆవిడ మోస్తున్న గృహ నిర్వహణ, సంతానోత్పత్తి భారం వంటి కీలకాంశాలకు విలువ నీయకపోవటం ఉచితంగాదన్నారు. స్త్రీ-పురుష సంబంధాలను పరిశీలించేటపుడు ఈ రకమైన పరిశీలనా దృష్టికి ప్రాధాన్యత లభించాలని ప్రొఫెసర్ సేన్ సూచించారు.

ఇదే సత్యాన్ని మహాకవి శ్రీశ్రీ, మనస్సుకు హత్తుకొనేట్లు చెప్పారు; ప్రభువెక్కిన పల్లకీని కాదు, దానిని మోసిన బోయీలెవరో చూడమన్నారు.

ప్రొఫెసర్ అమార్త్య సేన్ వ్రాసిన "ఉమెన్, టెక్నాలజీ అండ్ సెక్సువల్ డివిజన్" అన్న వ్యాసం దీనికాధారం.

మనలో (స్త్రీ-పురుషులందరిలో) జీర్ణించింది అందుచేతనే వివాహానికి పూర్వం స్వతంత్ర జీవనాన్ని రుచిచూసిన యువతి కూడా, వివాహానంతరం దానిని కోల్పోవటాన్ని గుర్తించలేకపోతున్నది. కొందరు సంప్రదాయబద్ధత వల్ల తలవంచుతున్నారు మరి కొందరు అమాయకత్వం వల్ల జరిగిన మార్పును గుర్తించలేకపోతున్నారు. ఇలా ఉండటం - రాజీపడటం - "ధర్మపత్ని" లక్షణంగా సమాజం భావిస్తున్నది

ఎంతటి సంఖ్యా సమస్యలనైనా చిటికలో పరిష్కరించ గల అర్ధశాస్త్ర నిపుణులు కూడా ఈ అమాయకులవలె ప్రవర్తించటం మనకు కనుపిస్తుంది. సంప్రదాయబద్ధతే వారి ఆలోచనలకు కూడా సంకెలలు వేస్తున్నదేమో! జాతీయా దాయాన్ని అంచనా వేసేటపుడు, ఇల్లాలు చేసే ఇంటి పనులకు శ్రమ విలువ కట్టటం లేదు వారి దృష్టిలో "ఆర్థిక విలువలేని శ్రమ" గానే అదిమిగులుతున్నది. ఇందువల్ల సంపదోత్పత్తి, ప్రధానంగా పురుషుల కృషిఫలితంగా జాతీయాదాయపు టంచనాలలో కనుపిస్తున్నది. ఆవిడ శ్రమకు విలువ లభించే సందర్భాలలో కూడా ఆవిడ శ్రమ యొక్క నిజమైన విలువల పరిగణన జరగటం లేదు. పురుషునితో సమానమైన పనిని చేసినా, వారితో సమానమైన వేతనం ఆవిడకు లభించటం లేదు ఈ అసమాన వేతనమే జాతీయాదాయపు టంచనాల్లోనికి వస్తున్నది. అందువల్ల ఆవిడ మార్కెట్ శ్రమవల్ల జాతీయాదాయానికి వస్తున్న పరిమాణం కూడా తక్కువగా కనుపిస్తున్నది. పురుషులు చేసే ఇంటి పనులకూ, సామాజిక సేవలకూ కూడ జాతీయాదాయపు టంచనాలలో స్థానం లభించటం లేదు. ఇందువల్ల జాతీయాదాయపు టంచనాలు వాస్తవ విరుద్ధంగా ఉంటున్నాయి. స్త్రీల శ్రమలోని అత్యధిక భాగానికి విలువ లభించకపోవటం చేత ఆవిడ సేవలకూ, సమాజంలోని ఆవిడ స్థానానికీ విలువ లభించటం లేదు. రెక్కలు ముక్కలు చేసుకొన్నా, ఆరోగ్యాన్ని నాశనం చేసుకొన్నా ఆవిడ సేవలకు పరిగణన లభించటం లేదు. ఆవిడ వ్యక్తిత్వానికి విలువ లభించటం లేదు. అవసరమై అప్పుకుపోతే, హామీదారు లేకుండా ఆవిడకు అప్పుకూడా పుట్టటం లేదు ! కుటుంబంలో పరాధీనగా జీవించవలసి వస్తున్నది.

జాతీయాదాయపు టంచనాల తయారీకి "సిస్టం ఆఫ్ నేషనల్ అకౌంట్స్" పేరిట కొన్ని మార్గదర్శక సూత్రాలున్నాయి. (ఈ విధానాన్ని ఎస్.ఎన్.ఎ. అన్న సంక్షిప్త నామంతో వ్యవహరిస్తున్నారు) ఉత్పత్తై మార్కెట్‌కు వస్తున్న సంపదతోపాటు, దాని తయారీకి వినియోగపడిన మానవ శ్రమకు కూడా విలువగడుతున్నారు. ఇందువల్ల మార్కెట్‌కు వచ్చే మానవ శ్రమ విలువలు మాత్రమే జాతీయాదాయపు టంచనాలలో చేరుతున్నాయి ఇంటి పనులకు, కుటుంబ సేవలకు ఆర్థిక విలువల నివ్వకపోవటం చేత, ఈ అంచనాలలో ఇవి ప్రతిబింబించటం లేదు ఈ భేదాన్ని చూపటం కోసం యు యన్.డి పి. నిపుణులు జాతీయాదాయంలో చేరుతున్న మానవ శ్రమను "ఎస్.ఎన్ ఎ." గాను చేరని శ్రమను "నాన్-ఎస్.ఎన్.ఎ " గాను పేర్కొన్నారు పాఠకుల సౌలభ్యం కోసం మొదటి దానిని "వేతనం లభిస్తున్న శ్రమ"గానూ, రెండవ దానిని "వేతనం లభించని శ్రమ" గానూ మేము పేర్కొన్నాం

కొన్ని దేశాల సర్వేల ఆధారంతో, యు.ఎన్.డి.పి. నిపుణులు ఈ రెండు వర్గాల క్రిందకు వచ్చే శ్రమ పరిమాణపు టంచనాలను రూపొందించారు ఈ వివరాలను తెలియజేసే పట్టికలను అభివృద్ధి చెందిన దేశాలకు, అభివృద్ధి చెందుతున్న దేశాలకు వేరువేరుగా ఈ అధ్యాయంలో ఇచ్చాం. వివిధ దేశాలలోని స్త్రీ పురుషులు, పలురకాల పనులను చేయటానికి వినియోగిస్తున్న కాల పరిమాణాలను ఈ అంచనాల తయారీకి ప్రాతిపదికలుగా నిపుణులు తీసుకొన్నారు. (ఆరవ, ఏడవ పట్టికలను చూడండి)

వీరు రూపొందించిన అంచనాల ప్రకారం, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆర్థిక విలువల నీయదగిన మొత్తం పనిలో, స్త్రీలు 53 శాతం పనిని, పురుషులు 47 శాతం పనిని చేస్తున్నారు. సిస్టం ఆఫ్ నేషనల్ ఎకౌంట్స్ మార్గదర్శక సూత్రాల ప్రకారం స్త్రీల శ్రమలో 24 శాతం మాత్రమే ఆర్థిక విలువ గలిగిన (ఎస్.ఎన్.ఎ.) శ్రమగా పరిగణనకు వచ్చింది. మిగిలిన 66 శాతం పనికి ఆర్థిక విలువను వారు ఇవ్వలేదు. ఇది స్త్రీల శ్రమలో "వేతనం లభించని" భాగంగానే మిగిలింది. పురుషుల మొత్తం శ్రమలో 76 శాతానికి ఆర్థిక విలువల నిచ్చారు; మిగిలిన 24 శాతానికి అర్థిక విలువల నీయలేదు. (నాన్ ఎస్.ఎన్.ఎ.గా మిగిలింది)

యు.ఎన్.డి.పి. నిపుణుల అంచనా ప్రకారం అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో ఆర్థిక విలువ నీయదగిన

# 2

## వెన్నాడుతున్న అసమానతలు

సాంకేతికంగా ఎన్నోమార్పులు శరవేగంతో సంభవిస్తున్న కాలమిది. గ్రహాంతరయానం విమానయాన మంత సుగమమైంది. అయినా ఏ సమాజంలోనూ స్త్రీకి పురుషునితో సమానమైన స్థానం లభించటం లేదు. ఇది ఇంకా "పురుషాధిక్య" సమాజంగానే ఉండిపోయింది. పురుషునకు ఏ మాత్రమూ తీసిపోకుండా తన శ్రమను ధారబోస్తున్నా, స్త్రీకి లభిస్తున్న అవకాశాలు అల్పంగానే ఉంటున్నాయి.

కొన్ని శతాబ్దాలుగా స్త్రీలు నిరాదరణకు గురవుతున్నా, గత రెండు-మూడు దశాబ్దాల కాలంలో వారి అభివృద్ధికి కొంత కృషి జరుగుతున్నట్లు కనుపిస్తున్నది. ఇందువల్ల స్త్రీల విద్యా వైద్య సదుపాయావకాశాలు మెరుగయినాయి. వారి సృజనాత్మక శక్తుల పెంపుదలకు కొంతమేరకు అవకాశాలేర్పడ్డాయి.

కొన్ని దేశాలలో సాంఘిక సేవా కార్యక్రమాలకు బడ్జెట్ కేటాయింపులను పెంచటం వల్లా, మరికొన్ని దేశాలలో స్త్రీజనోద్ధరణాశక్తితో రాజకీయ పరమైన కృతనిశ్చయ ప్రదర్శనవల్లా ఈ అభివృద్ధి సాధ్యమైంది. చాలా దేశాలు నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని ప్రవేశపెట్టాయి. అరబ్బు దేశాలలో కూడా స్త్రీ విద్య త్వరిత గతిని విస్తరిస్తున్నది. 1970-1990 సంవత్సరాల మధ్య కాలంలో స్త్రీల అక్షరాస్యత రెట్టింపైంది ఆసియా, లాటిన్ అమెరికా దేశాలలో కూడా ఇటువంటి అభివృద్ధి కనుపిస్తున్నది. ఆగ్నేయ ఆసియా దేశాలలో 1970 వ సంవత్సరంలో నిరక్షరాస్యులైన స్త్రీలు దేశజనాభాలో 45 శాతం వరకూ ఉండేవారు; 1990 వ సంవత్సరానికి ఈ పరిమాణం 19 శాతానికి తగ్గింది. పసిఫిక్, లాటిన్ అమెరికా దేశాలలో నిరక్షరాస్యత 1970 లో 30 శాతం వరకూ ఉండేది; 1990 వ సంవత్సరానికిది 17 శాతానికి పడిపోయింది. ఇదేకాలంలో దక్షిణ ఆసియా దేశాలలో స్త్రీల నిరక్షరాస్యతా పరిమాణం 81 శాతం నుండి 67 శాతానికి మాత్రమే తగ్గింది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రాథమిక, సెకండరీ విద్యాలయాలలో చేరే బాలికలనందరనూ కలిపి చూచినపుడు, 1970 వ సంవత్సరంలో 38 శాతం బాలికలే ఈ స్కూళ్ళలో చేరి చదువుతూ ఉండేవారు; 1992 వ సంవత్సరం వచ్చేసరికి వీరి సంఖ్యా పరిమాణం 68 శాతానికి పెరిగింది. తూర్పు ఆసియా, లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతాలలో ఈ పరిమాణం 87 శాతానికి పెరిగింది. ఈ విషయంలో

ఈ ప్రాంతాలు అభివృద్ధి చెందిన దేశాల స్థాయిక్ (97 శాతం) చేసువవుతున్నాయి

అరబ్బు దేశాలలో ప్రాథమిక, సెకండరీ స్కూళ్ళలో చేరే బాలికల సంఖ్య రెట్టింపైంది. 1970వ సంవత్సరములో 32 శాతం ఉన్న ఈ స్కూళ్ళలో చదివే విద్యార్థినుల సంఖ్య 1992 వ సంవత్సరానికి 60 శాతానికి పెరిగింది సబ్ - సహారన్ ఆఫ్రికా దేశాలలో ఈ విద్యార్థినుల సంఖ్యా పరిమాణం 49 శాతానికి. దక్షిణాసియాలో 55 శాతానికి మాత్రమే పెరిగింది అభివృద్ధి చెందిన దేశాల స్థాయికి చేరటానికి, ఈ దేశాలకు ఇంకా చాలా కాలం పడుతుంది.

పేదరికం వల్లనే ఈ దేశాలు స్త్రీ విద్యా వ్యాప్తిలో వెనుకబడ్డాయని భావించనవసరం లేదు దేశం సంపన్నమైనప్పుడే స్త్రీ విద్యావ్యాప్తి జరుగుతుందని భ్రమించ నవసరం లేదు కొన్ని పేదదేశాలు, స్త్రీల అక్షరాస్యతను గణనీయమైన పరిమాణాలకు పెంచగలగటమే ఇందుకు నిదర్శనం వనరులు తక్కువగా ఉన్నా, ఇందుకు అవసరమైన రాజకీయ దీక్షను ప్రదర్శించ గలగటం వల్లనే చైనా, శ్రీలంక, జింబాబ్వే వంటి దేశాల స్త్రీల అక్షరాస్యత 70 శాతం వరకూ పెరుగ గలిగింది. 1992 లో, దేశ ప్రజల తలసరి జాతీయాదాయం 480 డాలర్లుగా ఉన్న చైనా, మహిళల అక్షరాస్యతను 70 శాతానికి, 560 డాలర్లున్న శ్రీలంక 86 శాతానికి, 580 డాలర్లున్న జింబాబ్వే 78 శాతానికి పెంచాయి తలసరి జాతీయాదాయం 4,220 డాలర్లున్న గబన్ మహిళల అక్షరాస్యతను 48 శాతానికి, తలసరి ఆదాయం 7,780 డాలర్లున్న సౌదీ అరేబియా స్త్రీల అక్షరాస్యతను 46 శాతానికి మాత్రమే పెంచగలిగాయి. ఆర్థిక వనరులు తగినన్ని లేకపోయినా, సోషలిస్టు దేశాలు, స్త్రీల సృజనాత్మక శక్తుల అభివృద్ధికి శక్తి వంచన లేకుండా పని చేశాయి; కార్యసాధనకు సాంఘిక సంఘటిత శక్తులను ప్రయోగించాయి. ఇందువల్ల ఆదేశాలలో విద్యా, వైద్యం, ఆర్థిక, రాజకీయ రంగాలలో స్త్రీలకు సముచిత స్థానం లభించగలిగింది.

### క్యూబా ఆదర్శం

అతి చిన్న దేశమయిన క్యూబా, 1959 వ సంవత్సరంలో కమ్యూనిస్టులు అధికారాని కొచ్చిన తర్వాత అన్ని రంగాలలోనూ స్త్రీలకు సముచిత స్థానాన్ని కల్పించటానికి కృషిచేయ నారంభించింది పురుషులతో సమానమైన స్థానాన్ని పొందటం స్త్రీ హక్కుగా ఆ దేశ ప్రభుత్వం ప్రకటించింది. దీని ఉల్లంఘనను శిక్షార్హమైన నేరంగా నిర్ణయించారు.

1960 వ సంవత్సరంలో ఫెడరేషన్ ఆఫ్ క్యూబన్ ఉమెన్ అన్న పేరుతో మహిళా సంఘాన్ని నిర్మించారు. స్త్రీలలో విద్యావ్యాప్తిని సాధించటానికి. వారి నొక నిర్మాణయుతమైన సాంఘిక శక్తిగా తయారు చేయటానికి ఈ సంస్థ కృషి చేయనారంభించింది. ఈ సంఘ సభ్యత్వం 1962 వ సంవత్సరంలో నాలుగు లక్షలుండేది, 1990 వ సంవత్సరానికి ముప్ఫైరెండు లక్షలకు పెరిగింది. మహిళలకు సంబంధించిన ప్రభుత్వ పాలసీలను ప్రభావితం చేయగల శక్తి ఈ మహిళా సంఘానికున్నది. దేశంలోని ప్రతి రంగంలోనూ స్త్రీలు సముచిత పాత్రను నిర్వహించటానికి ఈ సంఘం పనిచేస్తున్నది.

చట్ట సభలలో గాని, రాజకీయ రంగంలో గాని, స్త్రీలకు, అభివృద్ధి చెందిన దేశాలలో కంటే, క్యూబా అధిక ప్రాతినిధ్యాన్నిస్తున్నది. 1994 వ సంవత్సరంలో ఏర్పడిన పార్లమెంటులో ఇరవై మూడు శాతం మేరకు స్త్రీ సభ్యులున్నారు. దీనికి పూర్వపు సభలో మహిళా సభ్యత్వం 34 శాతం వరకూ ఉండేది. పాలనాయంత్రాంగంలో, పరిపాలనా సంబంధమైన పోస్టులలో నూరింట ఇరవయ్యైదు మంది వరకూ స్త్రీలున్నారు. నిరక్షరాస్యతా నిర్మూలనా కార్యక్రమంలో మహిళలు ప్రధానమైన శక్తిగా రూపొందారు ఈ కార్యక్రమ నిర్వహణకు మహిళా సంఘంలో ప్రత్యేక విభాగం ఉన్నది. ఇందులో పధ్నాలుగు లక్షల మంది మహిళలు పనిచేస్తున్నారు!

ఆరోగ్య, పారిశుధ్య రంగాలలో వీరు కీలకపాత్రను నిర్వహిస్తున్నారు. ఆరోగ్య రక్షణా దళాలలో అరవైవేల మంది మహిళలు వనిచేస్తున్నారు. రోగనిరోధక కార్యక్రమ నిర్వహణలోనూ, కాన్సర్‌ను ప్రారంభదశలోనే గుర్తించటం లోనూ, తల్లుల ఆరోగ్య రక్షణలోనూ వీరు గణనీయమైన కృషి చేస్తున్నారు. ఆ దేశంలోని డాక్టర్లలో 48 శాతం మంది వరకూ మహిళలున్నారు. వైద్యశాలల అధినేతలలో 47 శాతం మంది స్త్రీలున్నారు. ఫామిలీ డాక్టర్ స్కీం క్రింద పనిచేసే పన్నెండు వేల మంది డాక్టర్లలో నూరింట 61 మంది మహిళలున్నారు.

స్త్రీలు గర్భవతులుగా నున్న కాలంలోనూ, పిల్లలకు చనుబాలిస్తున్న దశలోనూ, వారికి ఉచిత వైద్య సదుపాయం లభిస్తున్నది. పిల్లల తల్లులకు పోషకాహార పదార్థాలను కూడా ఉచితంగా ఇస్తున్నారు. అన్ని దేశాలలో కంటె, క్యూబా లో సంభవించే శిశుమరణాలు అతి తక్కువగా ఉన్నాయి లక్షజననాలకు ఇరవయ్యేడుగురు శిశువులు మాత్రమే చనిపోతున్నారు! సంతానవతులు కాగల స్త్రీలలో నూరింట 70 మంది సంతాన నిరోధక విధానాలను అవలంబిస్తున్నారు.

పురుషులతో సమంగా స్త్రీలు కూడా విద్యావంతులు కావాలన్న ప్రభుత్వ దీక్ష వల్ల విద్యావిషయాలలో స్త్రీ పురుష సమానత్వం నెలకొన్నది. ఉన్నత విద్య నభ్యసిస్తున్న వారిలో నూరింట 58 మంది వరకూ స్త్రీలున్నారు. పెండ్లి కావటం వల్లగాని, పిల్లలను కనవలసిరావటం చేతగాని, మధ్యలో చదువును ఆపినవారు, అనుకూల పరిస్థితులేర్పడగానే చదువును కొనసాగించే సదుపాయాన్ని కల్పించారు.

రాజకీయపరమైన కార్యదీక్షను క్యూబా ప్రభుత్వం ప్రదర్శించటం వల్లనే, అది పేద దేశమైనా అన్ని రంగాలలోనూ స్త్రీలకు, పురుషులతో సమానమైన స్థానాన్నివ్వగలిగింది. స్త్రీ పురుష సమానత్వ సాధనకు, దేశం విధిగా సంపన్నమై యుండవలసిన అవసరంలేదు అని క్యూబా అనుభవం చాటుతున్నది.

## చైనా అనుభవం

చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడగానే స్త్రీ జనోద్ధరణకు కృషి ప్రారంభమైంది. ఈ ప్రభుత్వం స్త్రీ జనోద్ధరణకు చేపట్టిన తొలిచర్య, ఉంపుడుగత్తెలను తీసుకోవటాన్ని నిషేధించటం. స్త్రీలకు పురుషులతో సమానమైన ఆస్తి హక్కుల నిచ్చారు. యువతులు తమకు నచ్చిన వారిని వరించటానికి, దంపతులుగా సహజీవనం చేయడం సాధ్యంగానపుడు విడాకులను పొందటానికి వసతులు కల్పించారు. "రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సాంఘిక రంగాలలోనూ, కుటుంబంలోనూ, స్త్రీకి పురుషునితో సమానమైన హక్కు ఉన్నది" అని ఆ దేశపు రాజ్యాంగ చట్టం నిర్దేశిస్తున్నది. చైనా ప్రభుత్వం కూడా రాజకీయ పరమైన కార్యసాధనా దీక్షను ప్రదర్శించటం వల్లనే స్త్రీలకు సమాజంలో సముచితమైన స్థానం లభించింది. 1992 వ సంవత్సరానికి స్త్రీల అక్షరాస్యతా పరిమాణం 70 శాతానికి పెరిగింది. విద్యాలయాలలో చేరే బాలికల సంఖ్య పదిరెట్లు పెరిగింది. స్త్రీల ఆరోగ్య ప్రమాణం కూడా గణనీయంగా పెరిగింది. వీరి జీవిత కాల పరిమాణం 1970 వ సంవత్సరంలో 63 సంవత్సరాలుగా ఉన్నది. 1992 వ సంవత్సరానికి 70 సంవత్సరాలకు పెరిగింది పురుషుల జీవితకాల పరిమాణం కంటే ఇది అధికం.

శిశుజననాల రేటు తక్కువ కాలంలో తగ్గించ గలిగిన ఖ్యాతి కూడా చైనాకు దక్కింది. 1960 వ సంవత్సరంలో స్త్రీ సగటున ఐదారుగురకు జన్మనిస్తూండేది 1992 వ సంవత్సరం వచ్చే సరికి శిశు జననాల రేటు రెండుకు తగ్గింది. పిల్లలను కనిపెంచే వయసులో నున్న వివాహిత మహిళలలో నూరింట 83 మంది కుటుంబ నియంత్రణా విధానాలను పాటిస్తున్నారు. ఇంత పెద్ద సంఖ్యలో ఈ విధానాలను మరేదేశంలోనూ వాడటం లేదు! దంపతులు ఒక్క బిడ్డను మాత్రమే కనాలి అన్న "ఏక శిశు సూత్రాన్ని" అమలు జరుప నారంభించిన తర్వాత కొన్ని అవాంఛనీయపరిణామాలు చోటు చేసుకొన్నట్లు తెలియవస్తున్నది. ఆడపిల్ల పుడితే పురిటిలోనే చంపటం, గర్భస్థ శిశువు ఆడపిల్ల అని పరీక్షలో తేలితే గర్భస్రావం చేయించుకోవటం వంటివి జరుగుతున్నట్లు వార్తలొస్తున్నాయి.

"అన్ని రంగాలలోనూ స్త్రీలుండాలి; అన్ని అవరోధాలనూ వారు దాటగలగాలి" అన్న చైనా ప్రభుత్వ నిర్ణయం వల్ల, పలురంగాలలో స్త్రీలు పనిచేయటం పెరిగింది. వస్త్ర పరిశ్రమలోనూ, ఫైనాన్స్ రంగంలోనూ, వ్యాపార రంగంలోనూ, రెడీమేడ్ దుస్తుల తయారీ పరిశ్రమలలోనూ, పనిచేస్తున్న వారిలో నూరింట యనభైమంది వరకూ మహిళలున్నారు. ఇంజనీర్లలో ఐదవ వంతు మంది, శాస్త్ర సాంకేతిక రంగాలలో పనిచేసే వారిలో మూడవ వంతు మంది మాత్రమే స్త్రీలున్నారు. మేనేజిమెంటు పోస్టులలో అధిక సంఖ్యాకులుగా ఇంకా పురుషులే ఉన్నారు.

స్త్రీ పురుష సమానత్వ సాధనా సమస్య జటిలమైనది. అందుచేత పరిష్కార కృషిలో ఎంత సాధించ గలిగినా, సాధించవలసినదే సాధించిన దాని కంటే అధికంగా ఉంటుంది. కొన్ని సోషలిస్టు దేశాలలో, కమ్యూనిస్టు ప్రభుత్వాలు కూలిపోయిన తర్వాత, మార్కెట్ విధానానికి వీలుగా ఆర్థిక

వ్యవస్థాపునర్నిర్మాణం జరుగుతున్నది ఈ పరిణామ క్రమంలో స్త్రీ జనాభివృద్ధి కృషి బాగా దెబ్బతిన్నది. ఇప్పటికి కనుపిస్తున్నంత వరకూ, ఈ పరిణామం వల్ల పురుషుల కంటే, స్త్రీలే అధికంగా నష్టపోతున్నట్లు స్పష్టమవుతున్నది.

అరబ్బు దేశాలు ఇంతకు పూర్వం కంటె స్త్రీ విద్య మీద ఎక్కువ సొమ్మును ఖర్చు చేస్తున్నాయి. స్త్రీలు కూడా సంప్రదాయాన్ని దాటి చదువులకు వెళుతున్నారు అయినా, ఆదేశాల సంపద పెరుగుదల రేటు కంటే, స్త్రీల విద్యావ్యాప్తి పరిమాణం తక్కువగా ఉంటున్నది. పురుషులతో సమానమైన అవకాశాలు, మహిళలకు, ఉపాధి విషయంలో లభించటం లేదు. ఇందువల్ల వారు సాధించిన సృజనాత్మక శక్తుల అభివృద్ధి సమాజానికి వినియోగపడటం లేదు

మహిళల ఆరోగ్య, పోషణాది విషయాలలో కొంత అభివృద్ధి సాధన జరగటం వల్ల వారి ఆయుర్దాయ పరిమాణం పెరిగింది 1970 వ సంవత్సరంలో యాభైనాలుగు సంవత్సరాలుగా ఉన్న జీవితకాల పరిమాణం 1990 వ సంవత్సరానికి అరవైమూడు సంవత్సరాలకు పెరిగింది అభివృద్ధి చెందుతున్న దేశాలలో, వివాహితలైన స్త్రీలలో దాదాపు సగం మంది మహిళలు కుటుంబ నియంత్రణ విధానాలను పాటిస్తున్నారు ఇందువల్ల స్త్రీలకు సంతానోత్పత్తి మీద కొంత మేరకు అదుపు లభించింది. అనుకూలమైనపుడే కనే అవకాశాలు లభిస్తున్నాయి.

సంపన్న దేశాలలోని వారికి మాత్రమే కుటుంబ నియంత్రణ విధానాలను పాటించటం సాధ్యమవుతుందని భావించటం పొరపాటు. అన్ని దేశాల కంటే, తలసరి జాతీయాదాయం తక్కువగా నున్న చైనాలో, అన్ని దేశాలలో కంటే అధిక సంఖ్యాక మహిళలు (83 శాతం మంది వరకు) కుటుంబ నియంత్రణా విధానాలను అవలంబిస్తున్నారు. ప్రపంచ వ్యాప్తంగా చూచినపుడు, శిశు జననాల రేటు క్రమంగా తగ్గుతూ ఉండటం కనుపిస్తుంది. స్త్రీలు తమ సృజనాత్మక శక్తులను పెంచుకొంటున్నారు. తమ కిష్టమైన జీవన విధానాన్ని ఎన్నుకొనే అవకాశాలు వారికి పెరుగుతున్నాయి. కాన్పుల భారము, దానివల్ల మరణించే ప్రమాదం కూడా తగ్గుతున్నది. బాలింతల మరణాల సంఖ్యనూ, కాన్పుల వల్ల స్త్రీలకు సంక్రమించే బాధలనూ తగ్గించే వసతులు ఏర్పడ్డాయి. ఈ రెంటి తగ్గింపు జరిగినపుడే స్త్రీల ఆరోగ్య విప్లవం సంపూర్ణమూ, సంపన్నమూ అవుతుంది

### తరుగుతున్న వ్యత్యాసాలు

మానవ సృజనాత్మక శక్తుల అభివృద్ధి స్థాయి తక్కువగా నున్నపుడు, ఆరోగ్యం, విద్యా విషయాలలో స్త్రీ పురుషుల మధ్య నుండే వ్యత్యాసాలు అధికంగా ఉంటాయనీ, సామాజికాభివృద్ధి జరిగే కొలదీ, ఈ వ్యత్యాసాల పరిమాణాలు తగ్గుతూంటాయని నిపుణులు సూచిస్తున్నారు. గత ఇరవై సంవత్సరాల కాలంలోనూ స్త్రీల సృజనాత్మక శక్తుల అభివృద్ధి, పురుషుల కంటే వేగంగా జరిగిందని చెప్పవచ్చు. ఇందువల్ల వీరి మధ్య నున్న వ్యత్యాసాలు కూడా తగ్గటం కనుపిస్తున్నది అభివృద్ధి చెందుతున్న దేశాలలో, 1970-1990 సంవత్సరాల మధ్య కాలంలో వయోజన అక్షరాస్యత రెట్టింపుకు పెరిగింది. విద్యాలయాలలో చేరే విద్యార్థీ విద్యార్థినుల సంఖ్య కూడా రెట్టింపుకు పైగా పెరిగింది. 1970 వ సంవత్సరంలో పురుషులలో అక్షరాస్యతా రేటులో, స్త్రీల అక్షరాస్యతారేటు 54 శాతం మాత్రమే ఉండేది.; 1990 వ సంవత్సరానికిది 74 శాతానికి పెరిగింది. 1970లో ప్రైమరీ, సెకండరీ విద్యాలయాలలో చేరుతున్న మగపిల్లల రేటులో 67 శాతం మాత్రమే ఉండేది; 1990 వ సంవత్సరానికి ఈ పరిమాణం 86 శాతానికి పెరిగింది. అభివృద్ధి చెందుతున్న దేశాలను మొత్తంగా పరిగణనకు తీసుకొన్నపుడు, ప్రాథమిక విద్యాలయాలలో చేరిన బాలుర సంఖ్య, 1970-1990 సంవత్సరాల మధ్య కాలంలో సాలుకు 1.2 శాతం చొప్పున మాత్రమే పెరిగింది, బాలికల సంఖ్య 1.7 శాతం చొప్పున పెరిగింది. కమ్యూనిస్టు పాలనలో నున్న తూర్పు యూరపు దేశాలలో, 1990వ సంవత్సరానికి ప్రాథమిక పాఠశాలలో చేరుతున్న బాలికల సంఖ్య, బాలుర సంఖ్యను మించిపోయింది. 1970 వ సంవత్సరం నాటికే ఈ విద్యాలయాలలో చేరుతున్న బాలబాలికల సంఖ్య మధ్య వ్యత్యాసం నామ మాత్రంగానే ఉన్నది.

ఉన్నత విద్య విషయం లోనూ ఈ వ్యత్యాసం త్వరితగతిని తగ్గనారంభించింది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉన్నత విద్యాభ్యాసానికి కాలేజీలలో చేరుతున్న విద్యార్థినుల సంఖ్య, 1970 లో బాలుర సంఖ్యలో సగం మేరకు మాత్రమే

ఉండేది. 1990 వ సంవత్సరానికి ఈ పరిమాణం 70 శాతానికి చేరింది. ముప్పై రెండు దేశాలలో, ఉన్నత విద్యాలయాలలో చేరుతున్న బాలికల సంఖ్య, బాలుర సంఖ్య కంటే అధికంగా ఉన్నది.

మహిళలకు విద్యార్జనావకాశాల కల్పన అవసరమే; కాని వారిని శక్తి మంతులను చేయటానికి అదొక్కటే చాలదని అనుభవం నిరూపిస్తున్నది. తాము సముపార్జిస్తున్న సృజనాత్మక శక్తుల వినియోగానికి తగిన అవకాశాలను కూడా కల్పించటం అవసరం. గత ఇరవై సంవత్సరాల కాలంలో జరిగిన అభివృద్ధి వల్ల స్త్రీల సృజనాత్మక శక్తుల పెంపునకు అవకాశాలేర్పడ్డాయి. వాటి వినియోగానికి తగిన అవకాశాలు మాత్రం అంత త్వరితగతిని పెరగలేదు. స్త్రీ పురుష అసమానతలు కొన్ని తరాలుగా ఉంటున్నాయి. అవి అంత తక్కువ కాలంలో సమసిపోవు. వర్తమాన సామాజిక వ్యవస్థా, సాంఘిక, ఆర్థిక, లీగల్ విధానాలూ మహిళలకు పురుషులతో సమానమైన అవకాశాలు లభించకుండా నిరోధిస్తున్నాయి. ఇందువల్ల స్త్రీలకు పురుషులతో సమంగా జీవించే అవకాశాలు ఏర్పడలేదు. వారికి సంబంధించినంతవరకిది ఇంకా "అసమాన" ప్రపంచంగా, "పురుష ప్రపంచంగా" మాత్రమే ఉన్నది.

## శక్తి సముపార్జనకు అవరోధాలు

వర్తమాన ప్రపంచంలో చదువు రానివారు తొంభైకోట్ల మంది ఉంటారని అంచనా. వీరిలో మూడింట ఒక్క వంతు మంది పురుషులు; రెండు వంతుల మంది స్త్రీలున్నారు. ప్రాథమిక విద్యార్జనకు కూడా నోచుకోని పిల్లలు పదమూడు కోట్ల మంది ఉన్నారు. వీరిలో బాలురకంటే బాలికలే అధిక సంఖ్యాకులు. పెరుగుతున్న విద్యార్జనావకాశాల కంటే, జనాభా పెరుగుదల రేటు అధికంగా ఉన్నది. ఇందువల్ల, అభివృద్ధి చెందుతున్న దేశాలలో మహిళా నిరక్షరాస్యుల సంఖ్య పెరుగుతున్నట్లు కనుపిస్తున్నది. 1970-1990 సంవత్సరాల మధ్య కాలంలో, విద్యార్జనా విషయంలో ఉన్న స్త్రీ పురుష అసమానత సగం వరకూ తగ్గింది. మిగిలిన సగం కూడా తగ్గటానికి, జనాభా పెరుగుదల బాగా మందగిస్తే, ఇంకొక ఇరవై సంవత్సరాల కాలం పడుతుందని అంచనా వేస్తున్నారు. సాంకేతికాభివృద్ధి శరవేగంతో జరుగుతున్న ఈ రోజులలో, స్త్రీ పురుష సమానత్వ సాధనకు మరొక ఇరవై సంవత్సరాలు ఆగటమంటే, అది దీర్ఘకాలమే అవుతుంది.

పోషణలో కూడా ఆడపిల్లలకు అన్యాయం జరుగుతున్నది. ఈ విషయాన్ని సంఖ్యాపరంగా రుజువు చేయగల పరిశోధనా ఫలితాలు అధికంగా లభించటం లేదు. లభిస్తున్న కొద్ది సమాచారమూ, ఈ అంశాన్ని నిస్సందేహంగా సూచిస్తున్నది. "పిండి కొలది రొట్టె" అన్న సామెత అందరకూ తెలిసిందే పోషణను బట్టి వ్యక్తి యొక్క ఆరోగ్య స్థితి ఉంటుంది. ఇది శాస్త్రీయ సూత్రం. మగపిల్లలలో కంటె ఆడపిల్లలలో అధికంగా కనుపించే పోషణాలోప సూచనలే ఈ అంశానికి తిరుగులేని రుజువు.

ఆడపిల్లలకంటే, మగ పిల్లలకే పోషణలో అధిక ప్రాధాన్యత లభిస్తున్నది. ఈ వివక్ష ప్రపంచంలోని విస్తృత ప్రాంతాలలో కనుపిస్తున్నది లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాల బాలురలో, ఆరోగ్య సూత్రాల ప్రకారం ఉండవలసిన దానికంటే తక్కువ బరువున్న వారు 17 శాతం మేరకున్నారు; ఇలాంటివారు ఆడపిల్లలలో 31 శాతం మంది వరకూ ఉన్నారు. బంగ్లాదేశ్‌లో పోషణాలోప సూచనలు, మగపిల్లలలో కంటె ఆడపిల్లలలో అధికంగా కనుపిస్తున్నాయి. బాలురలో సవరించ వీలులేని పోషణా లోపానికి గురవుతున్నవారు 56 శాతం మేరకు ఉంటే, బాలికలలో ఇటువంటి వారు 59 శాతం మేరకున్నారు. పురుషులతో పోల్చితే 88 శాతం మంది మహిళలకే తగినంత పోషణ లభిస్తున్నట్లు ఒక పరిశోధనలో రుజువైంది. స్త్రీలలోని పోషణాలోపం, వారు పిల్లలను కనిపెంచే రోజులలో ప్రస్ఫుటంగా కనుపిస్తున్నది. చూలాలు యాభై కిలోగ్రాముల కంటె తక్కువ బరువుండ కూడదన్నది ఆరోగ్య సూత్ర నియమం. మధ్య తరగతి కుటుంబాలకు చెందిన చూలాండ్రలో 77 శాతం మంది, అల్పాదాయ వర్గాలకు చెందిన కుటుంబాల వారిలో 98 శాతం మంది ఇంతకంటే తక్కువ బరువుంటున్నారు.

మనదేశంలోని పంజాబులో జరిగిన ఒక సర్వేలో, పోషణాలోపం వల్ల, మగపిల్లల కంటే ఆడపిల్లలు అధికంగా నష్టపడుతున్నట్లు తేలింది. అల్పాదాయ కుటుంబాలకు చెందిన బాలికలలో 21 శాతం మంది తీవ్రమైన పోషణాలోపానికి గురవుతుంటే, అదే కుటుంబాలకు చెందిన బాలురలో మూడు శాతం మంది మాత్రమే పోషణా లోపానికి గురవుతున్నారు.

అధికాదాయ కుటుంబాల లోని ఆడపిల్లలకంటే, అల్పాదాయ కుటుంబాలలోని మగపిల్లల పోషణా స్థితిగతులే మెరుగుగా ఉన్నట్లు కొన్ని సర్వే ఫలితాలు సూచిస్తున్నాయి!

సబ్-సహారన్ ఆఫ్రికా లోని పరిస్థితి ఇందుకు భిన్నంగా కనుపిస్తున్నది. పిల్లల వయసును బట్టి, వారి బరువు ఎంత ఉండవలసినది వైద్య శాస్త్ర సూత్రాలు సూచిస్తున్నాయి ఉండవలసిన దానికంటే తక్కువ బరువున్న ఆడపిల్లలు పదిహేడు శాతం మంది మాత్రమే ఉండగా, మగపిల్లలు 32 శాతం మంది వరకూ ఉన్నారు ఈ ప్రాంత దేశాలలో కుటుంబ పోషణా బాధ్యత స్త్రీలది కుటుంబావసరాలకు తగిన పంటలను పండించే బాధ్యత కూడా వీరిదే తల్లుల పెత్తనం క్రింద, ఆడ పిల్లలు పోషణా లోపాన్ని, బాలురకంటే అధికంగా తప్పించుకో గలుగుతున్నారు. ఇది ఈ ప్రాంత వాసుల ప్రత్యేకత.

పెద్దవారిలో పురుషుల కంటే స్త్రీలు అధికంగా పోషణా లోపానికి ఎరవుతున్నారు. అయొడిన్ లోపము, పోషణలో ఇనుము లోపించటం వల్ల వచ్చే అనీమియా, మాంసకృత్తులు - శక్తి జనక పోషక పదార్థాల లోపం వల్ల శరీరపు పెరుగుదల గిడసబారటం వంటివి పురుషులలో కంటే స్త్రీలలో అధికంగా కనుపిస్తున్నాయి. ఇనుము లోపించటం వలన వచ్చే అనీమియా 24 కోట్ల మంది పురుషులలో కనుపిస్తుండగా, 46 కోట్ల మంది స్త్రీలు దీనికి లోనవుతున్నారు. మాంసకృత్తులు - శక్తి జనకాల లోపం నలభైకోట్ల మంది పురుషులలో కనుపిస్తుండగా ఇది నలభైయ్యేదు కోట్ల మంది స్త్రీలలో కనుపిస్తున్నది. శరీరపు పెరుగుదల మందగించటం వలన వ్యక్తులు మరణించే ప్రమాద పరిమాణం, అభివృద్ధి చెందిన దేశాలలో ఉన్నంతే అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా ఉండాలి అని అనుకొంటే, అభివృద్ధి చెందుతున్న దేశాలలో, 15-59 సంవత్సరాల మధ్య వయస్కుల మరణాలలో సుమారుగా మూడు లక్షల వరకూ ఈ కారణం చేతనే సంభవిస్తున్నాయని భావించ వలసి ఉంటుందని యు.ఎన్.డి.పి. నిపుణులు సూచించారు.

ప్రపంచ స్త్రీల జీవిత కాల పరిమాణం 65 సంవత్సరాలనీ, పురుషుల జీవితకాల పరిమాణం 62 సంవత్సరాలనీ అంచనా వేస్తున్నారు. పురుషులతోసమానమైన పోషణ, వైద్య సదుపాయాలూ లభిస్తున్నచోట్ల, జనాభాలోని ప్రతి వందమంది పురుషులకూ 106 గురు చొప్పున స్త్రీలున్నారు సబ్-సహారన్ ఆఫ్రికాలో కూడా వందమంది పురుషులకు 102 మంది చొప్పున స్త్రీలున్నారు. పురుషులతో సమానమైన ఆదరణ లభించని చోట్ల జనాభాలో పురుషుల కంటే స్త్రీలు తక్కువగా ఉండటం కనుపిస్తున్నది. చైనాలోనూ, ఆసియా ఖండంలోని దక్షిణ, పశ్చిమ ప్రాంతాలలోనూ జనాభాలోని ప్రతి వందమంది పురుషులకూ 94 గురు మాత్రమే స్త్రీలున్నారు అనాదరణకు గురవుతూండటం వల్లనే. సంఖ్యా పరిమాణంలో పురుషుల కంటే స్త్రీలు తక్కువగా ఉంటున్నారు అభివృద్ధి చెందిన దేశాలలోవలె, వందమంది పురుషులకు 106 మంది స్త్రీలుండాలని కాకపోయినా, సబ్- సహారన్ ఆఫ్రికాలో వలె వందమంది పురుషులకూ 102 మందయినా స్త్రీలుండాలి అని భావించి అంచనాలు రూపొందిస్తే, చైనాలో, ఉండవలసిన దాని కంటే ఐదు కోట్ల స్త్రీ జనాభా తక్కువబడుతుంది ఈ సూత్రం ప్రకారం ఉత్తర ఆఫ్రికా, చైనా, దక్షిణ ఆసియా, ఆగ్నేయ ఆసియా దేశాల మొత్తం జనాభాలో, ఉండవలసిన దానికంటే స్త్రీ జనాభా పదికోట్ల వరకూ తక్కువగా ఉన్నట్లు కనుపిస్తుంది. ప్రఖ్యాత సోషల్ సైంటిస్టు, ప్రొఫెసర్ అమార్త్య సేన్ ఈ అంచనాలను చూపుతూ లెక్కకు తక్కువ బడిన స్త్రీలను "అదృశ్యులు" గా పేర్కొన్నారు; వీరు లింగవివక్షకు గుఠయి కాలగర్భంలో కలిసిపోయినట్లు ప్రొఫెసర్ సేన్ నిర్ధారణ చేశారు.

మగ పిల్లలలో కంటే జీవశక్తి, ఆడపిల్లలలో అధికంగా ఉంటుంది అన్నది జీవశాస్త్ర నిర్దేశం. కాని, ఐదు సంవత్సరాల లోపు వయసు పిల్లల జనాభాను తీసుకొని చూస్తే, మరణిస్తున్న బాలుర కంటే బాలికలే అధిక సంఖ్యాకులుగా కనుపిస్తున్నారు. మగపిల్లలతో సమంగా, పోషణ, ఆరోగ్యరక్షణ, సంక్షేమ వసతులు ఆడపిల్లలకు లేక పోవటం చేతనే ఇలా జరుగుతున్నదని స్పష్టమవుతున్నది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో బాలింతల మరణాలు ఆందోళన కలిగించేంత అధికంగా సంభవిస్తున్నాయి. ఈ మరణాలు ఆసియాఖండపు దేశాలలో అధికంగా ఉంటున్నాయి. ఈ ప్రాంతాలలో యేటా సుమారుగా మూడున్నర లక్షల మంది బాలింతలు మరణిస్తున్నారు. వీటిలో అత్యధిక మరణాలు దక్షిణ ఆసియా దేశాలలో

సంభవిస్తున్నాయి. భారతదేశము, బంగ్లాదేశ్, పాకిస్తాన్ - ఈ మూడు దేశాలను కలిపి చూచినపుడు ప్రపంచ శిశు జననాలలో 28 శాతం ఇచ్చట సంభవిస్తున్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేసింది. ప్రపంచపు బాలింతల మరణాలలో 46 శాతం వరకూ ఈ మూడు దేశాలలోనే సంభవిస్తున్నాయి! ఈ విషయంలో రెండవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది ఆఫ్రికా. ఆఫ్రికాలో సాలుకు లక్షన్నర మంది వరకూ బాలింతలు మరణిస్తున్నారు. బాలింతల మొత్తం మరణాలలో అధిక భాగం ఆసియా ఖండంలో సంభవిస్తున్నాయి; సబ్-సహారన్ ఆఫ్రికాలో బాలింతల మరణరేటు ఇతర అన్ని ప్రాంతాలలో కంటే అధికంగా ఉన్నది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో బాలింత మరణాలు అరుదుగా సంభవిస్తున్నాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో మహిళల అవసరాలకు తగినంతగా ఆరోగ్య రక్షణా వసతులు లేవు. శిక్షణ పొందిన మంత్రసానులు తగినంత మంది ఉండటం లేదు. గర్భవతులకు, బాలింతలకు అవసరమైన ప్రత్యేక సేవా సదుపాయాలు తగినంతగా లేవు ప్రసవ సమయంలో ఏదయినా ఇబ్బంది ఏర్పడితే, తక్షణమే తగిన వైద్య సదుపాయం లభించే అవకాశాలు లేవు. చాలా పేద దేశాలలో, కాన్పు కష్టంకావటం వల్ల, ఎక్కువ మంది చూలాండ్రు చనిపోతున్నారు. స్త్రీల మరణాలలో అధిక భాగం, వారు పిల్లలను కని పెంచే దశలోనే అధికంగా సంభవిస్తున్నాయి. చూలు - కాన్పు సంబంధమయిన కారణాలవల్ల, ఈ దేశాలలో యేటా ఐదు లక్షల మంది వరకూ చనిపోతున్నారని అంచనా వేస్తున్నారు. శోకోదయం వల్ల పరవశురాలు గావలసిన మాతృదేవత, మృత్యుదర్శనంతో భయకంపిత అవుతున్నది!

హృదయాన్ని కలచివేయగల మరికొన్ని వాస్తవాలను చూడండి :

అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో ప్రతికాన్పుకు తర్ఫీదు పొందిన వైద్య సిబ్బంది సహాయం లభిస్తున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో, సగం కంటే తక్కువ కాన్పులకే ఇటువంటి సహాయం లభిస్తున్నది. దక్షిణాసియాలో మూడవ వంతు కాన్పులకు మాత్రమే తర్ఫీదు పొందిన వైద్య సిబ్బంది సహాయం లభిస్తున్నది.

చూలు వల్లా, కాన్పు కష్టంగావటం వల్ల స్త్రీ చనిపోయే ప్రమాదం పశ్చిమ యూరపు దేశాలలో కంటే ఆఫ్రికాలో 180 రెట్లు అధికంగా ఉన్నది !

కొన్ని ఆఫ్రికా దేశాలలో స్త్రీ సగటున ఏడుగురను కంటుంది. బాలింతలలో ప్రతి యాభై మందికి ఒకరు, పురిటి రోగాలకు లోనయ్యే ప్రమాదం ఉన్నది. పిల్లలను కనిపెంచే వయసులోని ప్రతి ఆరుగురు స్త్రీలలో ఒకరికి ప్రాణగండం పొంచి ఉంటున్నది.

## సంపాదనావకాశాల లేమి

విద్య, సుపోషణ, ఆరోగ్యరక్షణ ఇత్యాదుల ద్వారా స్త్రీల సృజనాత్మక శక్తుల పెంపుకు, లింగ భేదం అవరోధంగా ఉన్నది. ఇదే అపరాధమని అనుకొంటుంటే, మహాపరాధం అనదగినది మరొకటి మనకు కనుపిస్తున్నది. స్త్రీల ఆర్థికాదాయార్జనకు, సమాజంలో నిర్ణయాత్మక పాత్రా నిర్వహణకు కూడా లింగ వివక్ష అడ్డు పడుతున్నది.

ప్రపంచంలో దారిద్ర్యంలో కూరుకుపోయిన జనాభా 130 కోట్ల వరకూ ఉంటుందని అంచనా వేస్తున్నారు. వీరిలో నూరింట డెబ్భై మంది స్త్రీలున్నారు! ఈ కారణం చేతనే సమాజంలో పలు అవకాశాలు వారికి అందకుండా పోతున్నాయి. గత ఇరవై సంవత్సరాల కాలంలోనూ దుర్భర దారిద్ర్యంలో కూరుకుపోయిన గ్రామీణ మహిళల సంఖ్య నూరింట యాభైవంతులకు పెరిగినట్లు ఐక్యరాజ్య సమితి అంచనాలు తెలియజేస్తున్నాయి. లింగ పరంగా కూడా, దారిద్ర్యం స్త్రీ రూపాన్ని పొందినట్లుంది!

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల స్త్రీలకు కూడా దారిద్ర్యపు బాధ తప్పటం లేదు. ఈ దేశాలలో కూడా స్త్రీ దారిద్ర్యం పెరగటం కనుపిస్తున్నది. ఉదాహరణకు ప్రపంచాధినేతగా చలామణీ అవుతున్న అమెరికా దేశపు మహిళల స్థితిని చూడవచ్చు. 1940వ సంవత్సరంలో దారిద్ర్యంలో చిక్కిన జనాభాలో నూరింట 40 మంది వరకూ స్త్రీలున్నారు. 1980 నాటికి వీరి సంఖ్య 62 కు పెరిగింది.

స్త్రీలలో అధికులు దారిద్ర్యాన్ని అనుభవిస్తుండటానికి ప్రధాన కారణాలివి : 1. లేబర్ మార్కెట్‌లో స్త్రీలకు పురుషులతో సమానావకాశాలు, వేతనాలు లభించటం లేదు; 2. సామాజిక

ఒకటవ పట్టిక

వ్యవసాయేతర రంగంలో పురుషులకంటే తక్కువగా ఉంటున్న స్త్రీల వేతన పరిమాణాలు

| దేశము | 1994 వ సం॥లో పురుషుని వేతనంలో స్త్రీకి లభిస్తున్న పరిమాణ శాతం | దేశము | 1994 వ సం॥లో పురుషుని వేతనంలో స్త్రీకి లభిస్తున్న పరిమాణ శాతం | దేశము | 1994 వ సం॥లో పురుషుని వేతనంలో స్త్రీకి లభిస్తున్న పరిమాణ శాతం |
|---|---|---|---|---|---|
| టాంజనియా | 92.0 | ఈజిప్టు | 79.5 | స్పెయిన్ | 70.0 |
| వియత్నాం | 91.5 | జాంబియా | 78.0 | యునైటెడ్ కెంగ్డం | 69.7 |
| ఆస్ట్రేలియా | 90.8 | గ్రీస్ | 78.0 | హాంకాంగ్ | 69.5 |
| శ్రీలంక | 89.8 | పోలెండ్ | 78.0 | ఐర్లెండ్ | 69.0 |
| స్వీడెన్ | 89.0 | ఆస్ట్రేలియా | 78.0 | తాయ్‌లెండ్ | 68.2 |
| నార్వే | 86.0 | ఫిన్లెండ్ | 77.0 | స్విట్జర్లెండ్ | 67.6 |
| బెహరీన్ | 86.0 | నెదర్లెండ్స్ | 76.7 | లెగ్జెంబర్గ్ | 65.2 |
| కీన్యా | 84.7 | పోర్చుగల్ | 76.0 | ఆర్జెంటీనా | 64.5 |
| కొలంబియా | 84.7 | బ్రెజిల్ | 76.0 | ఈక్వెడార్ | 63.7 |
| టర్కీ | 84.5 | పెరాగ్వే | 76.0 | కెనడా | 63.0 |
| జోర్డాన్ | 83.5 | జర్మనీ | 75.8 | బొలివియా | 62.3 |
| కోస్టారికా | 83.0 | అమెరికా | 75.0 | ఫిలిపీన్స్ | 60.8 |
| డెన్మార్క్ | 82.6 | మెక్సికో | 75.0 | సైప్రస్ | 60.8 |
| హంగరీ | 82.0 | బెల్జియం | 74.5 | చిలీ | 60.5 |
| మారిషస్ | 81.3 | ఉరుగ్వే | 74.5 | సిరియా | 60.0 |
| ఫ్రాన్స్ | 81.0 | స్వాజీలాండ్ | 73.0 | చైనా | 59.4 |
| న్యూజిలెండ్ | 80.6 | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 72.6 | దక్షిణ కొరియా | 53.5 |
| ఇటలీ | 80.0 | సింగపూరు | 71.1 | బంగ్లాదేశ్ | 42.0 |
| *- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995 నుండి* | | | | సగటు వేతనం | 74.9 |

సంక్షేమ సదుపాయాలు వారికి తగినంతగా లభించటం లేదు, 3. కుటుంబంలో వారికి పురుషులతో సమానమైన హోదా, అధికారం ఉండటం లేదు. మగవారు లేకపోవటం చేత, కుటుంబ సంరక్షకురాలిగా బాధ్యతలను వహిస్తున్న స్త్రీల సంఖ్య అమెరికాలోనూ, అభివృద్ధి చెందుతున్న ఇతర దేశాలలోనూ పెరుగుతున్నది. (వీరిని "సింగిల్ పేరెంట్స్" అని వ్యవహరిస్తున్నారు విడాకులు తీసుకోవటం అధికంగావటం చేతా, అవివాహితలు పిల్లలను కనటం చేతా, స్త్రీ కుటుంబ పోషకురాలిగా, సంరక్షకురాలిగా వ్యవహరించవలసి వస్తున్నది. (సంపాదన కోసం భర్తలు దేశంలోని ఇతర ప్రాంతాలకో, ఇతర దేశాలకో వెళ్ళినపుడు కూడా స్త్రీ మీద ఈ బాధ్యత పడుతుంది.) స్త్రీలు కుటుంబ సంరక్షకులుగా వ్యవహరిస్తున్న కుటుంబాలలో సగం వరకూ దారిద్ర్యంలో చిక్కినట్లు, లభిస్తున్న అంచనాలు తెలియజేస్తున్నాయి. అభివృద్ధి చెందిన అమెరికాలోనే మహిళల స్థితి ఇంత దయనీయంగా ఉంటే, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ పేద దేశాలలోను ఉన్న స్త్రీల పరిస్థితి ఎంత హృదయవిదారకంగా ఉంటుందో ఊహించవచ్చు.

### ఉపాధి, వేతనార్జనలలో అసమానతలు

స్వతంత్ర సంపాదనావకాశాలు కూడా అధిక సంఖ్యాక

మహిళలకు ఇంకా దూరమవుతూనే ఉన్నాయి. 1970 వ సంవత్సరంలో, స్త్రీ జనాభాలో 35.6 శాతం మంది వేతనార్జనలో ఉన్నారు. 1990 వ సంవత్సరానికి ఈ పరిమాణం39.5 శాతానికి మాత్రమే పెరిగింది. అంటే ఇరవై సంవత్సరాలలోని పెరుగుదల కేవలం 3.9 శాతం మాత్రమే! ఈ విషయంలో అభివృద్ధి చెందుతున్న దేశాలకూ, అభివృద్ధి చెందిన దేశాలకూ మధ్య పెద్దగా తేడా కనుపించటం లేదు. పురుష జనాభాలో నూరింట 58 మంది వేతనార్జనలో ఉన్నారు వేతనార్జనలో మహిళలు ఎంత వెనుకబడి ఉన్నదీ ఈ సంఖ్యా వివరాలు వెల్లడిస్తున్నాయి. లాటిన్ అమెరికా, కరిబియన్, అరబ్బు దేశాలలో ఈ విషయంలో స్త్రీ పురుషుల మధ్య వ్యత్యాసం కొంచెం తగ్గుతున్నట్లు కనుపిస్తున్నది. స్త్రీ విద్యావ్యాప్తి పెరుగుదలకు తగినంతగా, స్త్రీలకు ఉపాధి అవకాశాలు లభించటం లేదని మాత్రం చెప్పవచ్చు.

నిరుద్యోగం కూడా పురుషులలో కంటే స్త్రీలలో అధికంగా కనుపిస్తున్నది. దేశంలో ఆర్థిక పరిస్థితులు సంక్షుభితమైనపుడు, తొలుత ఉద్యోగాలను కోల్పోయేది మహిళలే. ఇంతకు పూర్వం కమ్యూనిష్టుల పాలనలో నున్న తూర్పు యూరపు దేశాలలోనూ, రష్యా దాని అనుబంధ రిపబ్లిక్కుల లోనూ జరుగుతున్న పరిణామాలే ఇందుకు సాక్ష్యం.

పురుషులతో సమానమైన పనిని స్త్రీలు చేసినపుడు, వారికి పురుషులతో సమానమైన వేతనం లభించటం లేదు. టాంజనియా, వియత్‌నాం, ఆస్ట్రేలియాలలో మాత్రమే పురుషులకు లభిస్తున్న వేతనంలో తొంభైశాతం వరకూ స్త్రీలకు లభిస్తున్నది వెనుక బడిన దేశాలలోనే ఇలాంటి అసమానత లున్నాయని భావించ నవసరం లేదు. అభివృద్ధి చెందిన దేశాలలోనూ ఈ వివక్ష కనుపిస్తున్నది. కొన్ని అభివృద్ధి చెందిన దేశాలలో, పురుషులతో సమాన పనిని స్త్రీ చేస్తున్నపుడు, ఆవిడకు లభిస్తున్న వేతన మెంతో ఇచ్చట, చూడవచ్చు. పురుషునకు లభిస్తున్న వేతనంలో, స్త్రీకి, నార్వేలో 89 శాతమూ, స్వీడన్‌లో 89 శాతమూ, డెన్మార్క్‌లో 82.6 శాతమూ, ఇటలీలో 80 శాతమూ, నెదర్లెండ్స్ లో 76.7 శాతమూ, జర్మనీ లో 75.8 శాతము; అమెరికాలో 75 శాతము, యునైటెడ్ కింగ్డంలో 69 7 శాతము, హాంకాంగ్‌లో 69.5 శాతము, కెనడాలో 63 శాతము, దక్షిణ కొరియాలో 53.5 శాతము లభిస్తున్నది. వ్యవసాయేతర వృత్తులలో పురుషులకు లభిస్తున్న వేతనంలో నూరింట 75 వంతులు మాత్రమే మహిళలకు లభిస్తున్నదని చెప్పవచ్చు. ఈ విషయంలో దేశాల మధ్య తేడాలు అధికంగానే ఉన్నాయి టాంజనియాలో, పురుషులకు లభిస్తున్న వేతనంలో స్త్రీలకు 92 శాతము వరకూ లభిస్తున్నది. ఈ పరిమాణం అమెరికాలో 75 శాతము, బంగ్లాదేశాలో 42 శాతము మాత్రమే ఉన్నది. (ఒకటవ పట్టికను చూడండి)

సంఘటిత రంగంలోని వేతన వ్యత్యాసమే ఇంతగా ఉన్నపుడు, అసంఘటిత రంగంలో ఇవి మరెంత అధికంగా ఉంటాయో ఊహించవచ్చు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో మహిళలలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నారు. వేతన వ్యత్యాసం వల్ల వీరు ఎంతగా నష్టపడుతున్నారో ఊహించటం కష్టంగాదు.

పురుషులతో సమానమైన పనిని చేస్తున్నపుడు, స్త్రీకి వారితో సమానమైన వేతనం లభించక పోవటానికి చాలా కారణాలున్నాయి. వాటిలో ఇవి కొన్ని: 1. నైపుణ్యం అంతగా అవసరంలేని పనిని స్త్రీలు చేస్తూండటం; 2. సంఘటితమై, అధికవేతనాలకు ఆందోళన చేయగల స్థితిలో వీరు లేకపోవటం; 3. ప్రసూతి శలవును ఇవ్వాలి అని యజమానిని ఆదేశించే చట్టాలు లేక పోవటం; ఉన్న చోట్ల యజమానులు డొంక తిరుగుడుగా వాటిని తప్పించుకొనే మార్గాలను అవలంబిస్తూండటం; 4. కొన్ని కారణాల మూలంగా, కొన్ని రకాల ఉద్యోగాలలో స్త్రీల ప్రవేశంపై నిషేధాలుండటం, 5. పురుషులతో కలిసి పనిచేయటానికి కొందరు స్త్రీలకు ఇష్టం లేక పోవటం.

## గుర్తింపును పొందని స్త్రీ ప్రజ్ఞ

దాదాపు అన్ని రంగాలలోనూ స్త్రీలకు పురుషులతో సమానమైన అవకాశాలు లభించటం లేదని ఇప్పటికే స్పష్టమైంది. ఇది చాల దన్నట్లు, వారి ప్రజ్ఞకు కూడా గుర్తింపు లభించటం లేదు. ప్రపంచ మంతటా ఇదే పరిస్థితి కనుపిస్తున్నది.

ఉదాహరణకు నోబెల్ ప్రైజ్ గ్రహీతల వివరాలను పరిశీలిద్దాం, నోబెల్ ప్రైజులను ప్రకటించటం 1901వ సంవత్సరంలో ప్రారంభమైంది. 1993 వ సంవత్సరానికి మొత్తం

## ఆటల పోటీలలోనూ లింగవివక్ష

"ఇందు గల డందులేడ"ని భగవంతుని గురించయినా చెప్పవచ్చునేమోగాని, లింగవివక్షను గురించి ఇలా చెప్పే అవకాశాలులేవు. ఇది సర్యాంతర్యామి "ఎందెందు వెదకి చూచిన అందందే కలదు" అని మనం చెప్పవచ్చు! ఇంట్లో, వెలుపల, వేతనార్జనకు పని చేసే ఫాక్టరీలో లేదా కార్యాలయంలో, చివరకు క్రీడా ప్రాంగణంలో కూడా ఈ దేవత ప్రత్యక్షమవుతుంది!

ఆటలాడలేని వాడిని ఆడపిల్లతో పోల్చుతారు; శరీర దార్ఢ్యాన్ని పెంచుకొని క్రీడా రంగంలో దిగిన ఆడపిల్లను తోటియువకులు "మగరాయడు" అని వెక్కిరిస్తారు. ఈ వెక్కిరింతలకు భయపడకుండా యువతులు క్రీడారంగంలో తమ ప్రతిభను ప్రదర్శిస్తుండబట్టే ఈ వివక్షా దేవత క్రమంగా వెనుకడుగు వేస్తున్నది. ఒలింపిక్స్ లో పాల్గొనే అర్హతను స్త్రీలు సంపాదించ గలగటం ఇందుకు ఉదాహరణ!

అంతర్జాతీయ ఒలింపిక్ కమిటి 1894వ సంవత్సరంలో ఏర్పాటైంది. 1981వ సంవత్సరానికి గాని, (యనభయ్యేడు సంవత్సరాల తర్వాతగాని) తొలిమహిళకు దానిలో స్థానం లభించలేదు! 1996వ సంవత్సరంలో ఈ కమిటీలో 106 మంది సభ్యులున్నారు. ఇందులో స్త్రీల సభ్యత్వం ఏడు మాత్రమే.

ఆటల పోటీలలో గెలిచిన వారికిచ్చే బహుమతుల పరిమాణాలలోనూ స్త్రీ - పురుష వివక్షా ప్రదర్శన జరుగుతున్నది. యేటా ఇంగ్లండ్‌లో జరిగే వింబుల్డన్ టెన్నిస్ పోటీలను ఇందుకు ఉదహరించవచ్చు. 1996 వ సంవత్సరంలో మెన్స్ సింగిల్స్ పోటీలో విజేతకు బహుమతిగా 5,92,675 డాలర్ల నిస్తే, ఉమెన్స్ సింగిల్స్‌లో గెలిచిన మహిళకు 5,33,030 డాలర్లను మాత్రమే ఇచ్చారు! మేల్ సింగిల్స్ రన్నర్సప్‌కు 2,96,337 డాలర్ల నిచ్చారు; స్త్రీల సింగిల్స్‌లో రన్నర్సప్‌కు 2,66,515 డాలర్లను మాత్రమే ఇచ్చారు మెన్స్ డబుల్స్‌లో విజేతలకు 2,66,515 డాలర్లనిస్తే, స్త్రీల డబుల్స్ విజేతలకు 2,09,950 డాలర్లను మాత్రమే ఇచ్చారు.

1998వ సంవత్సరంలో ఉమెన్స్ టెన్నిస్ అసోసియేషన్ వారు, ఈ వివక్షను అంతం చేసి, తమకూ పురుషులతో సమానంగా బహుమతి సొమ్మును ఇవ్వాలని వింబుల్డన్ ఛైర్మన్ జాన్ కర్రీకి విజ్ఞాపన పత్రాన్నిచ్చారు. "పురుషులతో సమంగా బహుమతి మొత్తాన్నిమ్మని "డిమాండ్" చేసే హక్కు వారికి లేదు; కేవలం "విజ్ఞప్తి " చేయవచ్చు నని జాన్ కర్రీ రుసరుస లాడారు. "1998లో జరిగిన పోటీలలో పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ బహుమతి సొమ్మును సంపాదించారు. వీరికి పెంచవలసిన అవసరం ఏమిటి" అని కర్రీ ప్రశ్నించారు! మగవారు సింగిల్స్ మాత్రమే ఆడివెళ్ళి పోతారట. స్త్రీలు సింగిల్స్ మాత్రమే గాక, డబుల్స్‌లో కూడా పాల్గొని ఎక్కువ మొత్తాలు పట్టుక పోతారట! కనుక పురుషులతో సమంగా స్త్రీలకు బహుమతి సొమ్మును ఇవ్వనవసరం లేదు అని కర్రీ స్పష్టం చేశారు.

1999 వ సంవత్సరం పోటీలకు బహుమతిగా ఇచ్చే సొమ్ము మొత్తాన్ని 10 శాతం పెంచారు. ఈ పెంపుదల వల్ల పురుష విజేతలకు లభించే సొమ్ము 4.9 శాతం పెరిగింది; స్త్రీలకు ఇచ్చే మొత్తంలో 6.2 శాతం పెరుగుదల ఉన్నా, స్త్రీల బహుమతుల పంపకంలోని లింగవివక్ష మాత్రం అంతరించలేదు! పురుష విజేతలందరకూ మొత్తం 4,55,000 పౌండ్లులభించగా, స్త్రీ విజేతలకు లభించే మొత్తం ఇంతకంటే తక్కువగానే (4,09,500 పౌండ్లు) ఉండటం గమనించ దగిన అంశం సంప్రదాయం అంత త్వరగా అంతరిస్తుందా!

గత సంవత్సరపు (1998) యు.యస్.ఓపెన్లో స్త్రీ పురుష విజేతలకు సమానమయిన మొత్తాలను బహుమతులుగా ఇవ్వటం కూడా గమనించదగిన అంశమే!

*- ది స్టేట్ ఆఫ్ ఉమెన్ ఇన్ ది వరల్డ్ అట్లాస్, హిందూ దినపత్రిక 30-4-99 తేదీ సంచికలో వచ్చిన రిపోర్టు ఆధారంతో*

634 బహుమతుల పంపకం జరిగింది. ఇందులో కేవలం 28 మంది మహిళలకు మాత్రమే ఈ ప్రైజులు లభించాయి! మొత్తం బహుమతి గ్రహీతలలో మహిళల శాతం కేవలం 4 4 మాత్రమే ఉన్నది. బహుమతులు లభించిన ఈ 28 మంది మహిళల లోనూ పదహారుగురుకే పూర్తి ప్రైజు లభించింది. మిగిలిన పన్నెండు మందికి, పురుషుల భాగస్వామ్యంతో నోబెల్ ప్రైజు లభించింది

మహిళా నోబెల్ ప్రైజు గ్రహీతలలో అధికులకు లభించింది "పీస్ ప్రైజ్". మొత్తం తొమ్మిదిమంది మహిళలకు ఈ ప్రైజు లభిస్తే, ఇందులో మూటిలో పురుషుల భాగస్వామ్యం ఉన్నది! మొత్తం ప్రకటితమైన పీస్ ప్రైజులు 80; ఇందులో కేవలం తొమ్మిది మాత్రమే స్త్రీలకు లభించాయి.

దీని తర్వాత, అధికంగా నోబెల్ ప్రైజులు మహిళలకు లభించింది సారస్వతంలో (లిటరేచర్). ప్రకటితమైన మొత్తం తొంబై యొక్క ప్రైజులలోనూ మహిళలకు ఎనిమిది లభించాయి. ఇందులో ఒక దానిలో పురుష భాగస్వామ్యం ఉన్నది.

సైకాలజీ, మెడిసిన్ లకు ఇచ్చిన ప్రైజులు మొత్తం 158. ఇందులో మహిళలకు లభించినవి ఐదు మాత్రమే. ఈ ఐదింటిలోనూ నాల్గింటిలో పురుషభాగస్వామ్యం ఉన్నది.

కెమిస్ట్రీకి ప్రకటితమైనవి 121 ప్రైజులు. వీటిలో నాలుగు స్త్రీలకు వచ్చాయి. ఇందులో రెంటిలో పురుష భాగస్వామ్యం ఉన్నది.

ఫిజిక్స్‌లో ఇద్దరు మహిళలకు మాత్రమే ప్రైజులు లభించాయి. ఈ రెంటిలోనూ పురుష భాగస్వామ్యం ఉన్నది. వీరిలో ఒకరు ఫ్రాన్సుకు చెందిన మేరీ క్యూరీ; వీరికి బహుమతి 1903 వ సంవత్సరంలో లభించింది అటుతర్వాత చాలా కాలానికి, 1963 వ సంవత్సరంలో నోబెల్ ప్రైజు పొందిన మరొక మహిళ, అమెరికాకు చెందిన మేరియా జి. మేయర్.

ఎకనామిక్స్ లో 38 ప్రైజులను ప్రకటించారు. వీటిలో ఒక్కటి కూడా, మహిళలకు రాలేదు. ఈ రంగం పూర్తిగా పురుషులకే పరిమితమైనట్లున్నది.

## గగన కుసుమాలుగా మారిన కీలక పదవులు

పరిపాలనా సంబంధమైన పదవులు ఆ రంగంలో పనిచేస్తున్న మహిళల సంఖ్యకు తగినట్లుగా లభించటం లేదు. అట్లని పరిస్థితి లోగడ కంటే మెరుగుపడలేదని భావించ నవసరం లేదు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో గత ఇరవై సంవత్సరాలలో మేనెజీరియల్ పదవులలోనూ, పరిపాలనా సంబంధిత పదవులలోనూ పనిచేస్తున్న స్త్రీల సంఖ్య రెట్టింపైంది. 1970 వ సంవత్సరంలో 14 శాతం పోస్టులలో మాత్రమే మహిళలున్నారు. 1990 వ సంవత్సరం నాటికి ఈ పరిమాణం 28 శాతానికి పెరిగింది. ఆస్ట్రేలియా, కెనడా, హంగరీ, ఐర్లెండు దేశాలలో ఈ పదవులలో నున్న మహిళల సంఖ్య 1970-1990 సంవత్సరాల మధ్య కాలంలో మూడు రెట్లు పెరిగింది అభివృద్ధి చెందుతున్న దేశాలలోను, తూర్పు ఆసియా ప్రాంతపు దేశాలలోనూ, ఈ పోస్టులలో పనిచేస్తున్న స్త్రీల సంఖ్య త్వరిత గతిని పెరుగుతున్నది. ఈ పెరుగుదల ప్రధానంగా, దక్షిణ కొరియా, సింగపూర్, తాయ్‌లాండ్ దేశాలలో కనుపిస్తున్నది.

ఉత్తరయూరపుకు చెందిన నార్వే, స్వీడన్, ఫిన్లెండు దేశాలలో మహిళలు ఈ పదవులలో అధిక సంఖ్యలో పనిచేస్తున్నారు, అరవైరెండు శాతం పోస్టులలో మహిళలున్నారు. కెనడా, అమెరికా దేశాలలో సగానికి పైగానే ఈ పోస్టులు మహిళలకు లభించాయి. వృత్తి పరమైన ఉన్నత పదవులలోనూ, సాంకేతిక పరమైన పోస్టులలోనూ చేరుతున్న మహిళల సంఖ్య క్రమంగా పెరుగుతున్నది. అలాగే గుమాస్తాలుగా, సేల్స్ వర్కర్లుగా పనిచేసే మహిళల సంఖ్య కూడా బాగా పెరుగుతున్నది. కాని తొలుత పేర్కొన్న వృత్తి పరమైన (ప్రొఫెషనల్), సాంకేతిక రంగాలలో ప్రవేశించే మహిళల సంఖ్య గణనీయంగా పెరగటం లేదు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ ధోరణి స్పష్టంగా కనుపిస్తున్నది. దక్షిణాసియా దేశాలలోనూ, అరబ్బు దేశాలలోనూ పరిపాలనా సంబంధమైన పోస్టులలోనూ, మేనెజీరియల్ పోస్టులలోనూ పనిచేస్తున్న మహిళల సంఖ్య, మొత్తం పోస్టులలో పదిశాతానికి మించటం లేదు. అభివృద్ధి చెందిన దేశాలయిన జపాన్, స్పెయిన్, లెగ్జెంబర్గ్ దేశాలలో కూడా మహిళల స్థితి ఇలాగే ఉన్నది; పదిశాతం పోస్టులలోనే మహిళలున్నారు. మహిళల అభ్యున్నతి కున్న అన్ని అవరోధాలను తొలగించటానికి కంకణం గట్టుకొని పనిచేస్తున్న ఐక్యరాజ్య సమితి, దాని అనుబంధ సంస్థలలోని సీనియర్

మేనేజిమెంటు పోస్టులలో 11.3 శాతం మాత్రమే మహిళలకు లభించటం గమనించదగిన విషయం. ప్రొఫెషనల్ పోస్టులలో మాత్రం మూడవ వంతు మంది మహిళలున్నారు.

మొత్తం ఉన్న పరిపాలనా సంబంధమైన పోస్టులలోనూ, మేనెజీరియల్ పదవులలోనూ మహిళలు పనిచేస్తున్న వాటి పరిమాణం, ప్రపంచంలోని పలు మండలాలలో ఇలా ఉన్నది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో 27.7 శాతం, లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతాలలో 18.8 శాతం. సబ్-సహారన్ ఆఫ్రికాలో 9 6 శాతం; తూర్పు ఆసియాలో 11 3 శాతం; దక్షిణాసియాలో 3.1 శాతం ప్రపంచంలోని మొత్తం పోస్టులను పరిగణనకు తీసుకొని చూచినపుడు 14 శాతం పోస్టులలో మాత్రమే స్త్రీలు పని చేస్తున్నారు

అత్యధిక వేతనం లభించే పోస్టులు మహిళలకు లభించటం చాలా తక్కువగా ఉన్నది. అభివృద్ధి చెందిన దేశాలలోనూ మహిళల స్థితి ఇలాగే ఉన్నది. ఆర్థిక వ్యవహారాలలో స్వేచ్ఛగా వ్యవహరించే అవకాశాలు స్త్రీలకు లభించటం లేదు "సెక్రెటరీ" అనే గౌరవప్రదమైన పోస్టు ఏదయినా ఉంటే, అది పురుషుల సొత్తయ్యే అవకాశాలే అధికంగా ఉంటాయి పొరపాటున అది మహిళలను వరిస్తే, పురుషులతో సమానమైన వేతనం వారికి లభించదు!

వ్యవసాయ రంగంలో...

తర తరాలుగా వస్తున్న సంప్రదాయం ప్రకారం వ్యవసాయం జీవన విధానంగా మారటంచేతగాని, ఆర్థికావసరాల వల్లగాని, ఈ రంగంలో స్త్రీలు గణనీయమైన పాత్రను నిర్వహిస్తున్నారు. ఆఫ్రికా ఖండంలో మహిళలే ఆహారోత్పత్తికి బాధ్యత వహిస్తున్నారు. వీరు తమ స్వంత కమతాలలో పనిచేయటమే గాకుండా, ఇతరుల పొలాలలో కూలీలుగా పనిచేయటానికి కూడా వెళుతూంటారు. అభివృద్ధి చెందుతున్న పలుదేశాలలో స్త్రీలకు కమతాల మీద చట్టబద్ధమైన ఆస్థి హక్కులు ఉండటం లేదు. పురుషులు లేకపోవటం చేత కుటుంబ సంరక్షణా భారాన్ని మహిళలు మోస్తున్న సందర్భాలలో కూడా, వారికి భూమి మీద ఆస్థి హక్కు లుండటం లేదు.

ఆఫ్రికా ఖండంలో 80 శాతం మంది మహిళలు ఆహారోత్పత్తిలో పాల్గొంటున్నా, వారికి భూమి మీద చట్టబద్ధమైన హక్కులు లేవు ఇటీవల అమలు జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాల వల్ల, భూముల పంపకం జరుగుతున్నా, అవి పురుషుల పేరిట లభిస్తున్నాయి లాటిన్ అమెరికా దేశాలలో 1960 నుండి భూసంస్కరణలు అమలు జరుగుతున్నా. మహిళలు మాత్రం దీనివల్ల లాభించటం లేదు. కుటుంబ సంరక్షకులుగా సామాన్యంగా పురుషులే ఉంటారు గనుక, వారి పేరిటే పంపకాలు జరుగుతున్నాయి. ఈ పంపకం వల్ల లబ్ధిపొందిన మహిళలు నాలుగు నుండి ఇరవయ్యైదు శాతం వరకూ ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు.

అసంఘటిత రంగంలో ...

అసంఘటిత రంగాన్ని గురించిన సమాచారం చాలా తక్కువగా ఉంటున్నది. సంఘటిత రంగంలో కంటే అసంఘటిత రంగంలోనే అధిక సంఖ్యాక మహిళలు పనిచేస్తున్నారు. ఈ రంగంలో పనిచేసే వారికి, ఉన్న ఉద్యోగం ఎపుడు ఊడుతుందో తెలియదు. కనీస వేతనాలు కూడా వీరికి లభించవు. పని పరిస్థితులు దారుణంగా ఉంటాయి. అయినా, కుటుంబ పోషణ కోసం చాలా మంది మహిళలు ఈ రంగాన్ని ఆశ్రయిస్తున్నారు. వీరి నిస్సహాయ స్థితిని యజమానులు స్వలాభానికి వినియోగించుకొంటున్నారు.

కాంగో, జాంబియా దేశాలలో, రవాణా గాక, ఇతర సర్వీసెస్ సెక్టార్లో పనిచేస్తున్న మొత్తం ఉద్యోగులలో మూడింట రెండు వంతుల వరకూ మహిళలే ఉన్నారు. బొలివియాలో 1988 వ సంవత్సరపు అంచనాల ప్రకారం, పట్టణ ప్రాంత అసంఘటిత రంగంలో పనిచేస్తున్న వారిలో సగం మంది వరకూ స్త్రీలున్నారు. ఉపాధిలో నున్న స్త్రీలలో నాల్గవ వంతు మంది మాత్రమే సంఘటిత రంగంలో పనిచేస్తున్నారు. బోట్స్వానాలోని పట్టణ ప్రాంతంలో 1984-85 వ సంవత్సరంలో, వేతనార్జనలో నున్న మహిళలలో సగం మంది అసంఘటిత రంగంలో పనిచేస్తున్నారు. పనిచేస్తున్న పురుషులలో పదవవంతు మంది మాత్రమే అసంఘటిత రంగంలో ఉన్నారు. ఈ శతాబ్దపు 80వ దశాబ్దంలో, పెరూలోని లిమా పట్టణంలో ఆర్థికాదాయాన్ని సంపాదిస్తున్న మహిళలలో నూరింట 80 మంది వరకూ, వాణిజ్యము, సర్వీసెస్ రంగాలలోనూ, ఇంటిపనివారుగానూ

ఉన్నారు. నైజీరియాలో, వీధులలో ఆహార పదార్థాలను అమ్మేవారిలో నూరింట 94 మంది వరకూ స్త్రీలున్నారు.

నిరుద్యోగ సమస్య మూలంగా గాని, తగినంత పని లభించక పోవటం చేతగాని, కొన్ని వృత్తులలో మహిళలకు ఉపాధి లభించే అవకాశాలు లేకపోవటం చేతగాని, మహిళలు సాధారణంగా అసంఘటిత రంగంలో పని చేయటానికి వెళతారు. అసంఘటిత రంగంలో పనిచేసే వారిలో అధికులు, ఇంటి పనివారు గానో, లేక గృహస్తులకు అవసరమైన ఇతర సేవలను అందించే వారుగానో ఉంటారు కొంతమంది చిన్న వ్యాపారాలు చేయటమో, అటువంటి వారి వద్ద పనివారుగా ఉండటానికో వెళతారు. దుస్తుల తయారీ, ఆహారపదార్థాల ప్రాసెసింగ్ వంటి పరిశ్రమల్లో చేరుతుంటారు.

స్వయం ఉపాధికి మహిళలు చిన్న చిన్న పరిశ్రమలను నిర్వహిస్తుంటారు; వ్యాపారాలను ప్రారంభిస్తారు వీరికి లభించే పరపతి కూడా తక్కువగా ఉంటుంది; వారి ఉత్పత్తి విధానాలు సాంకేతికంగా ఉన్నతమైనవిగా ఉండవు. ఇందువల్ల వారికి లభించే ఆదాయం కూడా తక్కువగానే ఉంటుంది

గత పదిహేను - ఇరవై సంవత్సరాల నుండి అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ఈ రంగంలో మహిళలు ప్రవేశించటం అధికమైంది. ఆర్థిక సంక్షోభం, ఆర్థిక నిర్మాణ పరమైన సర్దుబాట్లు, ఆర్థిక సరళీకరణ విధానాల అవలంబన వంటి పరిణామాల వల్ల సంఘటిత రంగంలో మహిళలకు ఉపాధి అవకాశాలు సన్నగిలాయి. కుటుంబపోషణకు అదనపు సంపాదన అవసరమైంది. విధిలేని పరిస్థితులలో మహిళలు ఈ రంగాన్ని ఆశ్రయిస్తున్నారు. కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలలో, అసంఘటిత రంగ సంపాదనే కుటుంబాదాయంలో సగానికి మించి ఉంటున్నది.

### పరపతి పుట్టని పరిస్థితులు

వేతనం సంపాదించే వారికి, ఆస్థి హక్కులు ఉన్నవారికి మాత్రమే బ్యాంకుల రుణాలు లభిస్తున్నాయి. ఈ సూత్రం వల్ల రుణంగా లభిస్తున్న మొత్తం సొమ్ములో అత్యధిక భాగం పురుషులకే దక్కుతున్నది. పలుదేశాలలోను పరిస్థితి ఇలాగేఉన్నది. మహిళల స్వంతం అనేది ఏదయినా ఉంటే అది బంగారము, వెండి నగల రూపంలో ఉంటుంది. మహిళలు వాటిని తాకట్టు పెట్టి రుణాలను పొందాలన్నా, మరొకరి చేత హామీనిప్పించాలి (నేపాల్‌లో ఇటువంటి నియమం లేదట!) తగినంత మంది మహిళలు విద్యావంతులు గాకపోవటం, రుణాల నిచ్చే సంస్థలు నిర్దేశించే వ్యవహార విధానం సామాన్యులకు అర్థం గాని స్థితిలో ఉండటం, బ్యాంకులు నివాసాలకు దూరప్రాంతంలో ఉండటం వంటివి మహిళలకు అదనపు అవరోధాలుగా రూపొందాయి.

ఇందువల్ల బ్యాంకుల నుండి గాని, ఇతర చట్ట బద్ధమైన సంస్థల నుండి గాని రుణాలను పొందగలుగుతున్న మహిళల సంఖ్య చాలా తక్కువగా ఉంటున్నది. లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతాలలో బ్యాంకుల నుండి రుణాలను పొందుతున్న వారిలో మహిళలు ఏడునుండి పదకొండు శాతం మేరకే ఉన్నారు. భారత దేశంలో 38 బ్యాంకు బ్రాంచీల మీద జరిపిన ఒక సర్వేలో, వాటి నుండి రుణం పొందిన వారిలో మహిళలు పదకొండు శాతం మంది మాత్రమే ఉన్నట్లు తేలింది. స్త్రీల కంటూ ప్రత్యేకంగా యేర్పాటు చేసిన ఒక బ్యాంకు బ్రాంచిలో, రుణం తీసుకొన్న వారిలో మహిళల కంటే పురుషులే అధిక సంఖ్యాకులుగా ఉన్నారట! ఆఫ్రికాలోని జయర్ లో (దీనినిపుడు డెమొక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ కాంగో అని అంటున్నారు) బ్యాంకు రుణాలను పొందిన వారిలో స్త్రీలు 14 శాతం మేరకున్నారు. అభివృద్ధి చెందుతున్న ఇతర దేశాలలో కూడా పరిస్థితి ఇలాగే ఉన్నది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళలలో అత్యధిక సంఖ్యాకులు గ్రామీణులు. వీరికి లభించే బ్యాంకు రుణం నామ మాత్రం గానే ఉన్నది. ఆఫ్రికాలో వ్యవసాయ కూలీలలో నూరింట అరవై వంతుల మంది మహిళలున్నారు; మొత్తం ఆహారోత్పత్తిలో యనభైశాతం వరకూ మహిళల వల్లే లభిస్తున్నది. అయినా పంపిణీ అవుతున్న వ్యవసాయ రుణపు మొత్తంలో ఒక్క శాతం మాత్రమే వీరికి లభిస్తున్నది. సన్నకారు రైతులకు లభిస్తున్న రుణాలలో, ఈ తరగతికి చెందిన మహిళా కర్షకులలో పదవ వంతు మందికే ఇవి లభిస్తున్నాయి. అంతర్జాతీయ ద్రవ్య సంస్థల నుండి, గ్రామీణులకు రుణంగా ఇవ్వటానికి లభిస్తున్న సొమ్ము పంపకంలో కూడా ఈ వివక్ష అధికంగా ప్రదర్శిత మవుతున్నది. 1990 వ సంవత్సరంలో,

500 కోట్ల డాలర్ల వరకూ రుణాలుగా పంపిణీ జరిగితే, దానిలో ఐదు శాతం మాత్రమే స్త్రీలకు లభించింది.

### ఆర్థిక సంస్కరణల ప్రభావం

ఆర్థిక సరళీకరణ విధానాలు, ప్రైవేటీకరణ, గ్లోబలైజేషన్ పేరిట ఇటీవలి కాలంలో జరుగుతున్న ఆర్థిక విధాన మార్పులు మహిళలకు పలురకాల ఇబ్బందులను తెచ్చి పెడుతున్నాయి పేద కుటుంబాలకు చెందిన మహిళలు అందరికంటే అధిక ఇబ్బందులకు గురవుతున్నారు ఈ విధానాలు పురుషుల కంటే స్త్రీలను అధికంగా ప్రభావితం చేస్తున్నాయి మారిన పరిస్థితులకు అనువుగా జీవిత విధానాలను మార్చుకోవటం పురుషుల కంటే స్త్రీలకు కష్టంగా ఉంటుంది కుటుంబీకులకు వండి పెట్టేది మహిళ. ఆదాయాలు తగ్గి, వాడకం వస్తువుల ధరలు పెరిగినపుడు, ఇల్లు గడవటం కష్టమైనపుడు బాధపడ వలసి వచ్చేది మహిళ. తగ్గిన ఆదాయాన్ని పూడ్చు కోవటానికి అదనపు భారాన్ని నెత్తిన వేసుకొనేది మహిళ ఇంటి పనులను చూసుకొని కూలికి వెళ్ళిగాని, ఇంట్లో ఉండి చేయదగిన పనిని తెచ్చుకొని గాని, అదనపు సంపాదన కోసం తాపత్రయపడుతుంది. ఈక్వెడార్‌లో ఆర్థిక సంస్కరణలు అమలు జరుగుతున్న కాలంలో, అదనపు ఆదాయార్జన కోసం అధిక సంఖ్యాక మహిళలు వేతనార్జనకు పనిచేయటం ప్రారంభించారు. 1970 వ సంవత్సరంలో 40 శాతం మంది స్త్రీలు మాత్రమే వేతనార్జనకు పనిచేస్తూండేవారు. 1988 వ సంవత్సరానికి వీరి సంఖ్యా పరిమాణం 52 శాతానికి పెరిగింది. ఆరోగ్య రక్షణ, శిశు సంక్షేమం, ఫామిలీ ప్లానింగు, విద్య వంటి సామాజిక సంక్షేమ కార్యక్రమాలకు ప్రభుత్వం ఖర్చు చేసే మొత్తాలు క్రమంగా కోత బడుతున్నాయి. ఇందువల్ల అధికంగా నష్టపడుతున్నది మహిళలు. ఇంతకు పూర్వం "తీరినవి" అని అనుకొన్న ఇబ్బందులు వారిని తిరిగి చుట్టు ముడుతున్నాయి. ఉదాహరణకు జింబాబ్వే పరిస్థితిని చూడవచ్చు. ఈ దేశంలో ఆర్థిక సరళీకరణ విధానాలను ప్రవేశపెట్టిన తర్వాత ప్రభుత్వం ప్రజారోగ్యం మీద ఖర్చు చేస్తున్న మొత్తంలో మూడవ వంతును తగ్గించింది. ఇందువల్ల మహిళలు బాధపడవలసి వస్తున్నది. రెండు సంవత్సరాల తర్వాత, జింబాబ్వే రాజధాని హరారేలో కాన్పు కాలంలో చనిపోతున్న తల్లుల సంఖ్య రెట్టింపుకు పెరిగింది.

ఆర్థిక సరళీ కరణ విధానాలను అమలు జరపటం ప్రారంభం కాగానే ప్రభుత్వాలు తీసుకొనే తొలిచర్య, బడ్జెట్ లోటును తగ్గించటం కోసం ఆహార సబ్సిడీలతో సహా ఇతర రకాల సబ్సిడీలను కత్తిరించటం ఇందువల్ల అధికంగా బాధపడవలసి వస్తున్నది పిల్లలతల్లులు, ఆడపిల్లలు.

### రాజకీయ రంగం ఇంకా పురుష భూమే !

రాజకీయ రంగం పౌరులందరిదీ. కాని ఇది సూత్ర ప్రాయంగానే మిగిలింది. ఈ రంగం "పురుష భూమి" గానే మిగిలిపోయింది. ప్రపంచ పార్లమెంట్లలో పదమూడుశాతం సీట్లు మాత్రమే స్త్రీలకున్నాయి. మంత్రి వర్గాలలో వారికి ఏడు శాతం పోస్టులు మాత్రమే లభిస్తున్నాయి సమాజంలో సంభవించే మార్పులన్నీ రాజకీయ పరిణామాల వల్లనే సంభవిస్తుంటాయి. ఇంతటి ముఖ్యమైన రంగంలో స్త్రీలకు నిర్ణయాత్మక పాత్ర లభించటం లేదు. ప్రభుత్వ విధానాలను ప్రభావితం చేయగలగాలంటే శాసన సభలలో స్త్రీలకు కనీసం మూడవ వంతు స్థానాలయినా ఉండాలన్నది బహు జనాభిప్రాయం. ఈ గమ్యానికి మహిళలు చాలా దూరంలోనే ఉన్నారు. ప్రభుత్వాధి నేతలుగా ఉన్న మహిళలు ఇరవయ్యొక్క మందికి మించి లేరని తేలుతున్నది.

### హక్కుల అమలులోనూ, ఆత్మరక్షణలోనూ అసమానతలే

చట్టాలు అందరకూ సమానమైన హక్కుల నిస్తున్నాయని మనం అనుకొంటూ ఉంటాం. వీటి అమలులో కూడా లింగవివక్ష కనుపిస్తున్నది. దీనిని "చట్టపరమైన" వివక్షగా చెప్పవచ్చు. ప్రస్తుతపు చట్టాలలో నున్న వివక్షను తొలగించి నూతన చట్టాలను చేసినా, ఆ హక్కులు స్త్రీలకు ఆచరణలో ఉపకరించటానికి మరెన్ని సంవత్సరాలు పడుతుందో! చట్టపరమైన అవరోధాలు తొలగితే తప్ప, స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు లభించవు. "మహిళల యెడల ప్రదర్శితమవుతున్న అన్ని రకాల వివక్షను తొలగించాలి" అన్న నినాదంతో, ఐక్యరాజ్య సమితి చొరవతో, జరిగిన సదస్సు 1979 వ సంవత్సరం డిశంబరు 18వ తేదీన ఒక ప్రకటనను ఆమోదించింది. స్త్రీల యెడల ప్రదర్శిత మవుతున్న వివక్షను "మానవ హక్కుల హరణం"గా ఈ ప్రకటన పేర్కొన్నది. 1981వ సంవత్సరం సెప్టెంబరు మూడవ తేదీన

ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ "అంతర్జాతీయ ఒప్పందం"గా ఈ ప్రకటన అమలు లోనికి వచ్చినట్లు ప్రకటించింది. నూట ముప్పై తొమ్మిది దేశాలు ఈ ప్రకటనను ఆమోదిస్తూ సంతకాలు చేశాయి; 43 దేశాలు కొన్ని మినహాయింపులను సూచిస్తూ, అంగీకారాన్ని తెలిపాయి; 41 దేశాలు దీనిని అంగీకరించలేదు. ఈ ప్రకటన ఆమోద సమయంలో ప్రదర్శితమైన ఉత్సాహం, దాని అమలులో కనుపించటం లేదు. ఈ ప్రకటనను ఆమోదించిన దేశాలలో కూడా మహిళల యెడల ప్రదర్శిత మవుతున్న వివక్ష అంతరించలేదు. ప్రకటనకూ, కార్యాచరణకూ సమన్వయం గోచరించటంలేదు. చాలా దేశాలలో మహిళలు చట్టపరమైన వివక్షకు ఇప్పటికీ గురవుతూండటమే ఇందుకు నిదర్శనం. ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, మతపరమైన భేదాలు వీటి మధ్య ఎంత తీవ్రంగా ఉన్నా, పురుషులతో సమానమైన హక్కులను స్త్రీలకు ఇవ్వవలసి వచ్చేటప్పటికి, ఇందుకు వ్యతిరేకంగా ఇవన్నీ ఒకటవుతున్నాయా అని అనిపించేట్లు వ్యవహరిస్తున్నాయి. వివాహం, విడాకులు, ఆస్థిహక్కులు, ఉపాధి, పౌరసత్వం, ప్రయాణం వంటి పలు విషయాలలోనూ మహిళల యెడల వివక్ష ప్రదర్శిత మవుతూనే ఉన్నది మచ్చుకు కొన్ని అంశాలను చూద్దాం.

- పశ్చిమాసియా లోనూ ఉత్తర ఆఫ్రికాలోనూ మహిళ మరొక దేశపు పౌరుని వివాహమాడితే, భర్తకు ఆవిడ దేశపు పౌరసత్వం లభించదు. పురుషుడు, పరాయి దేశపు స్త్రీని పెండ్లి చేసుకొంటే మాత్రం, అతని భార్యకు తన దేశపు పౌరసత్వం లభిస్తుంది!
- కొన్ని దేశాలలో వివాహిత స్త్రీ శాశ్వతంగా భర్తమీదే ఆధారపడవలసి ఉంటుంది. వారికి భర్త ఆస్థి మీద మేనేజిమెంటు చేసే అధికారం లభించదు. ఇలాంటి వివక్ష చీలీ, బోట్స్‌వానా, నమీబియా, స్వాజీలాండ్, లెసోతో దేశాలలో ఉన్నది.
- గ్వాటెమాలా, సిరియా, బొలీవియా దేశాలలో మహిళలు భర్త అంగీకారం లేకుండా ఉపాధిని వెతుక్కునే అవకాశం లేదు.
- అరబ్బు దేశాలలో విదేశీ ప్రయాణానికి అవసరమైన పాస్ పోర్టును మహిళలు పొందటానికి, వ్రాత పూర్వకమైన ఆవిడ భర్త అంగీకారం కావాలి. భర్తలకు మాత్రం ఆ విషయంలో భార్యల అంగీకారం అవసరం లేదు. ఇరాక్ మహిళలు తమ భర్తల అనుమతి లేనిదే దేశం విడిచి పోకూడదు.

దేశపు సంస్కృతి, మత సంప్రదాయాలకు అనుగుణం గానే చట్టాలను రూపొందిస్తున్నారు. సంప్రదాయాల పాటింపు వల్లనే చట్టాల రూపకల్పనలో, స్త్రీ పురుష వివక్షతా బీజాలు పడుతున్నాయి. సంస్కృతి సంప్రదాయాలను, తమ అవసరాలకు, ఆశయాలకు అనుగుణంగా ఎలా మార్చుకోవచ్చును అని స్త్రీ పురుషులిద్దరూ సమన్వయ దృష్టితో ఆలోచించాలి. దురదృష్టవశాత్తు, మహిళలకు ఇలాంటి స్వేచ్ఛ లభించటం లేదు. రాజకీయ విధానాలను రూపొందించటంలోనూ, చట్టాలను చేయటంలోనూ మహిళలకు సముచిత పాత్ర లభించటం లేదు. దాదాపు అన్ని దేశాలలోనూ పరిస్థితి ఇలాగే ఉన్నది. ఈ పరిస్థితులు మారే వరకూ, "మహిళల జీవితాలను ప్రభావితం చేసే చట్టాల రూపకల్పనలో వారు సముచిత పాత్రను నిర్వహించారు, ఆ చట్టాల పరిధిలోనే స్త్రీలిపుడు జీవిస్తున్నారు" అని చెప్పుకొనే అధికారం ఏ సమాజానికీ లభించదు.

### అడుగడుగునా గండాలే

తల్లి గర్భంలో పిండంగా అవతరించిన దగ్గరనుండి కాటికి పోయే వరకూ స్త్రీ రకరకాల హింసలకు (మానసిక, శారీరక హింసలకు) గురవుతున్నది. ఈ హింసకు భౌగోళిక, సాంస్కృతిక, జాతి, మత, కుల, వర్గ భేదాలు లేవు. ఇదొక ప్రపంచ సమస్యగా రూపొందింది. నాగరికతతో పాటు స్త్రీహింస పెరుగుతున్నది; హింసా రూపాలు మారుతున్నాయి గాని, అది అంతరించే ఆశలు కనుపించటం లేదు. హింస నుండి వీరిని రక్షించే చట్టాలున్నప్పటికీ, అవి వారికి కవచాల్లా ఉపకరించటం లేదు. భర్త, భార్యను హింసిస్తే, అది కుటుంబపు వ్యవహారంగా పరిగణనకు వస్తున్నది! ఇందులో చట్టంగాని, భద్రతా సిబ్బంది గాని జోక్యం గలిగించుకోవటానికి వీలులేని పరిస్థితి దాపురించింది.

హింస నుండి స్త్రీని రక్షించగల చట్టాలు కొన్ని దేశాలలో లేవు. ఉదాహరణకు లాటిన్ అమెరికా దేశాల స్థితిని చూడవచ్చు. తన భార్యను, పరపురుషునితో ఉండటాన్ని

చూచినపుడు, ఆవిడను చంపే హక్కు ఆవిడ భర్తకు ఉంటుంది ఇది చట్టరీత్యా శిక్షార్హమైన నేరం కాదు. ఇదే స్థితిలో తన భర్తను, వారి భార్య చూచి అతనిని చంపినపుడు అది శిక్షార్హమైన నేరమవుతుంది! ఆవిడకు చట్టబద్ధమైన రక్షణ లభించదు!

స్త్రీ మానభంగానికి గురయితే ఆ నేరాన్ని నిరూపించవలసిన బాధ్యత ఆవిడ మీదే ఉంటుంది. ఈ బాధ పడలేక, అసంఖ్యాక బాధిత మహిళలు పోలీసులకు రిపోర్టులు కూడా ఇవ్వటం లేదు. పలుదేశాలలో, మానభంగపు కేసుల విచారణ సందర్భంలో, మానభంగానికి గురయిన స్త్రీ ప్రవర్తనకు సంబంధించిన పూర్వాపరాలు కూడా పరిగణనకు వస్తున్నాయి.

ఇంటా బయటా కూడా స్త్రీ వేధింపులకు గురవుతున్నది. దీనిని శిక్షార్హంగా నిర్ణయించగల చట్టాలున్నా, అవి వారికిస్తున్న రక్షణ నామ మాత్రమే. ఈ చట్టాల మీద స్త్రీ ఆధారపడటానికి వీలు లేకుండా పోయింది. అన్ని వర్గాల వారి కంటే, పేద కుటుంబాలకు చెందిన స్త్రీలు అధికంగా హింసకూ, అత్యాచారాలకు గురవుతున్నారు. వారు ఆర్థికంగా, సాంఘికంగా బలహీనులు కావటమే ఇందుకు ప్రధాన కారణం.

స్త్రీ హింసా, అత్యాచారాలకు సంబంధించిన వివరాలు చాలా తక్కువగా మాత్రమే వెలుగుకు వస్తున్నాయి. చట్టపరమైన రక్షణైనా తమకు లభించదన్న నిరాశా భావంతోనో, విషయం బైటకు పొక్కితే పరువు పోతుందన్న భయంతోనో, చాలా మంది స్త్రీలు జరిగిన అత్యాచారాన్ని బయటకు చెప్పటం లేదు. స్త్రీల అత్యాచారాలకు సంబంధించిన సమాచారం వెలుగుకు వస్తున్నదాని కంటే, వెలుగును చూడనిదే అధికంగా ఉంటున్నది.

స్త్రీ, తల్లి గర్భంలో పిండంగా అవతరించిన నాడే హింసాపర్వం ప్రారంభమవుతుంది. కొన్ని దేశాలలో, గర్భస్థ శిశు లింగనిర్ణయం కోసం పరీక్షలను నిర్వహిస్తున్నారు. పుట్టబోయేది ఆడపిల్లని తేలితే, గర్భస్రావ ప్రయత్నాలు జరుగుతాయి.

యవ్వన దశకు చేరీ - చేరక పూర్వమే స్త్రీ హింస ప్రారంభమవుతుంది. చిన్న పిల్లలు, యవ్వన దశకు వస్తున్న ఆడపిల్లలు సెక్సు పరమైన హింసకు గురవుతున్నారు. సాలుకు పది లక్షల మంది ఆడపిల్లలు, ప్రధానంగా ఆసియా దేశాలనుండీ పడుపు వృత్తి కేంద్రాలకు చేరుతున్నారు: పదికోట్ల మంది జననాంగ వక్రీకరణ ఆపరేషన్లకు గురవుతున్నారు. (ఈ ఆపరేషన్‌ను "జెనిటల్ మ్యూటిలేషన్" అని "ఫిమేల్ సర్కంసిషన్" అని వ్యవహరిస్తున్నారు)

స్త్రీ హింస, వైవాహిక జీవితభాగంగా రూపొందుతున్నది. చిలీ, మెక్సికో, పాపు న్యూగినీ, దక్షిణ కొరియా దేశాలలో, వివాహిత మహిళలలో మూడింట రెండు వంతుల మందో, ఇంకా అంతకు మించో, కుటుంబంలో హింసకు గురవుతున్నట్లు అంచనా వేస్తున్నారు జర్మనీలో నలభై లక్షల మంది వివాహిత స్త్రీలు కుటుంబీకుల హింసకు (ముఖ్యంగా భర్తచేతిలో హింసకు) గురవుతున్నారు

మానభంగ రూపంలో స్త్రీ హింస కనుపించటం కూడా అతి సాధారణమైంది కెనడా, న్యూజిలెండ్, యునైటెడ్ కింగ్డం, అమెరికా దేశాలలో ఆరుగురకు ఒకరి చొప్పున స్త్రీలు, తమ జీవితంలో ఏదో ఒక దశలో, మాన భంగాలకు గురవుతున్నట్లు జరిగిన సర్వేలు తెలియజేస్తున్నాయి.

స్త్రీహింస ముదిరితే, అది హత్యారూపాన్ని పొందవచ్చు. బంగ్లాదేశ్, కీన్యా, పాపు న్యూగినీ, తాయ్‌లాండ్ దేశాలలో జరిగే స్త్రీ హత్యలలో, స్త్రీ యొక్క ప్రస్తుత సెక్సు భాగస్వామి గాని, మాజీ భాగస్వామి గాని చేసినవే, సగానికి పైగా ఉంటాయని పరిశీలనా సమాచారం వెల్లడిస్తున్నది.

స్త్రీహింస ఆత్మహత్యా రూపధారణను కూడా పొందవచ్చును. ఆఫ్రికా, దక్షిణ అమెరికా, అమెరికాలలో భర్తలు భార్యలను హింసించటమే స్త్రీ ఆత్మహత్యలకు ప్రధాన కారణమని సర్వేలలో తేలింది.

యుద్ధము, దేశంలో అంతఃకలహం వంటి సంఘర్షణలొచ్చినా, అధిక హింసకు గురవుతున్నది మహిళలే. ఈ దశాబ్ద ప్రారంభంలో జరిగిన యుద్ధాలలో మరణించిన వారిలో పౌరుల పరిమాణం, పదిశాతం వరకూ ఉంటుందని అంచనా వేశారు. వర్తమాన కాలంలో పౌరుల యుద్ధకాలపు మరణాలు 90 శాతం వరకూ ఉంటున్నట్లు అంచనా వేస్తున్నారు. యుద్ధకాలంలో అధిక బాధలకు గురయ్యేది

కూడా స్త్రీలే. ఐక్య రాజ్య సమితి సహాయాన్ని పొందుతున్న కాందిశీకులలో, నూరింట 80 మంది వరకూ స్త్రీలు, పిల్లలూ ఉన్నట్లు ఐక్యరాజ్యసమితి వారి కాందిశీక వ్యవహారాలను చూచే కమిషనర్ అంచనా వేశారు.

యుద్ధకాలం లోనేగాదు, శాంతియుత పరిస్థితులుండే కాలంలో కూడా, స్త్రీ, హింసను అనుభవిస్తూనే ఉంటుంది. ఇప్పటి సామాజిక, సంస్కృతి - సంప్రదాయాలు మారనంత కాలము స్త్రీ హింసకు అదుపుండదు.

ఈ విధంగా అన్ని రంగాలలోనూ అసమానతలు స్త్రీని వెన్నాడుతున్నాయి. కుటుంబం పాలిటి కల్పవల్లికి లభిస్తున్న సత్కారమిది!

స్త్రీల యెడల ప్రదర్శిత మవుతున్న వివక్ష ఏరూపంలో ఉంటున్నది, ఏపరిమాణంలో ఉంటున్నది రేఖా మాత్రంగా చూచాం. కొన్ని అంశాలలో ఈ వివక్షా తీవ్రత ఎంతో, దాని ఫలితాలు ఎంత బాధాకరంగా ఉన్నాయో కొంచెం వివరంగా పరిశీలించుదాం.

# 3

## అదృశ్య స్త్రీల 'రహస్యం'

జనాభాలో సగం మంది వరకూ స్త్రీలుంటారన్నది సాధారణ విశ్వాసం. కాని పురుష జనాభా కంటే స్త్రీ జనాభా తక్కువగా ఉన్నది !

ప్రపంచంలోని పలుదేశాలలోనూ, ఒక దేశంలోని పలుప్రాంతాలలోనూ ఉన్న స్త్రీ-పురుష జనాభా పరిమాణాలలో వ్యత్యాసాలున్నాయి. ఉదాహరణకు చూడండి యూరపులోనూ, ఉత్తర అమెరికాలోనూ ప్రతివంద మంది పురుష జనాభాకు 105 గురు స్త్రీల చొప్పున ఉన్నారు. దక్షిణాసియా, పశ్చిమాసియా, చైనాలలో ప్రతి వంద మంది పురుష జనాభాకు, స్త్రీలు 94 గురు మాత్రమే ఉన్నారు! స్త్రీ పురుషుల మనుగడలోని తేడాలవల్ల, జనాభా పరిమాణాలలో భేదాలు కనుపిస్తున్నాయి. జీవ ధర్మం ప్రకారం ప్రతి వంద మంది ఆడపిల్లలకూ 105 - లేక - 106 గురు మగ పిల్లలు పుడుతున్నారు. జననాలకు సంబంధించినంత వరకూ ఈ నిష్పత్తి అన్ని దేశాలలోనూ కనుపిస్తున్నది. కాని ఈ పిల్లలు పెరిగి పెద్ద వారయ్యే సరికి ఈ నిష్పత్తి తారుమారవుతున్నది.

పురుష జనాభా కంటే, స్త్రీ జనాభా తక్కువగా ఉండటం అనేది ప్రధానంగా ఆసియా, ఉత్తర ఆఫ్రికాలలో అధికంగా కనుపిస్తున్నది. కొంత మేరకు లాటిన్ అమెరికాలో కూడా ఈ తేడాలు మనకు కనుపిస్తాయి. దుర్భర దారిద్ర్యం, ఆకలి బాధ, కరువు-కాటకాలకు నిలయమైన సబ్-సహారన్ ఆఫ్రికాలో మాత్రం ఇందుకు పూర్తిగా భిన్నమైన పరిస్థితి మనకు కనుపిస్తుంది. ఈ ప్రాంతంలో ప్రతి వంద మంది పురుషులకు 102 మంది వరకూ స్త్రీలున్నారు !

ఆగ్నేయ ఆసియాలో, చైనాలో తప్ప మిగిలిన తూర్పు ఆసియా ప్రాంతంలో కూడా స్త్రీ జనాభా, పురుష జనాభాకంటే అధికంగానే ఉన్నది. ఈ ప్రాంతంలో ప్రతి వంద మంది పురుషులకు 101 మంది వరకూ స్త్రీలున్నారు. దక్షిణాసియాలోని పాకిస్థాన్, భారతదేశం, బాంగ్లాదేశ్‌లలో ప్రతి వందమంది పురుషులకు స్త్రీల సంఖ్య 90 నుండి 94 వరకూ ఉన్నది. భారతదేశంలో (1991వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం) ప్రతి వందమంది పురుషులకూ తొంభై ముగ్గురు మాత్రమే స్త్రీలున్నారు. దేశంలోని పలు రాష్ట్రాలలో స్త్రీ పురుష జనాభా వ్యత్యాసాలు ఇంతకంటే అధికంగా కూడా ఉన్నాయి. పంజాబ్, హర్యానా రాష్ట్రాలు మనదేశంలో సంపన్నమైన రాష్ట్రాల క్రింద జమ. ఇచ్చటి స్త్రీ జనాభా, దేశపు సగటు అంచనాల కంటే

## 1వ పట్టిక
## స్త్రీ పురుష జనాభా నిష్పత్తి : "అదృశ్య" స్త్రీల అంచనా - 1986

| ప్రాంతము | ప్రతి వెయ్యిమంది పురుషులకూ ఉన్న స్త్రీల సంఖ్య | సబ్-సహారన్ ఆఫ్రికా స్త్రీ-పురుష నిష్పత్తిలో, స్త్రీ జనాభా ఉండటం ఉచితం అని అనుకొన్నపుడు, ఉండవలసిన దాని కన్న తక్కువగా ఉన్న స్త్రీ జనాభా | |
|---|---|---|---|
| | | "అదృశ్య" స్త్రీల సంఖ్య (లక్షలలో) | ఆ ప్రాంతపు స్త్రీ జనాభాలో అదృశ్య స్త్రీల శాతం |
| యూరపు | 1,050 | | |
| ఉత్తరమెరికా | 1,047 | | |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 1,022 | | |
| ఆగ్నేయ ఆసియా | 1,010 | 24 | 1.2 |
| లాటిన్ అమెరికా | 1,000 | 44 | 2.2 |
| ఉత్తర ఆఫ్రికా | 984 | 24 | 3.9 |
| పశ్చిమ ఆఫ్రికా | 948 | 43 | 7 8 |
| ఇరాన్ | 942 | 14 | 8.5 |
| చైనా | 941 | 4,40 | 8 6 |
| బంగ్లాదేశ్ | 940 | 37 | 8.7 |
| భారతదేశము | 933 | 3,69 | 9.5 |
| పాకిస్థాన్ | 905 | 52 | 12.9 |

*- జీన్ డ్రేజ్, ప్రొఫెసర్ అమార్త్య సేన్‌లు వ్రాసిన "హంగర్ అండ్ పబ్లిక్ ఏక్షన్" (1989) నుండి*

కూడ తక్కువగా ఉన్నది. హర్యానాలో ప్రతి వంద మంది పురుషులకు 87 మంది చొప్పునా, పంజాబులో 88 మంది చొప్పునా స్త్రీలున్నారు! వీటికంటే పేద రాష్ట్రమయిన కేరళలో, యూరపు, ఉత్తర అమెరికా, జపాన్లతో సమానమైన నిష్పత్తిలో స్త్రీ పురుష జనాభా ఉన్నది. (ప్రతి వంద మంది పురుషులకూ 103 మంది వరకూ స్త్రీలున్నారు)

ఐక్యరాజ్యసమితి, దాని అనుబంధ సంస్థలు, ప్రపంచ బ్యాంకు 1986లో ప్రచురించిన జనాభా లెక్కల ప్రాతిపదిక మీద, స్త్రీ జనాభా ఉండవలసిన దానికంటే ఎంత తక్కువ ఉన్నదీ, ఇలా తక్కువగా ఉండటానికి గల కారణమూ తెలుసుకోవటానికి ప్రొఫెసర్ అమార్త్య సేన్ కృషి చేశారు. (వీరి అంచనాలను ఈ అధ్యాయంలోని ఒకటవ పట్టికలో చూడవచ్చు). ప్రొఫెసర్ సేన్ అంచనాల ప్రకారం యూరపు, ఉత్తర అమెరికాలలో స్త్రీ జనాభా పురుష జనాభా కంటే ఎక్కువగా ఉన్నది. సబ్-సహారన్ ఆఫ్రికా, ఆగ్నేయాసియా, లాటిన్ అమెరికాలలో స్త్రీ పురుష జనాభా సమంగా ఉన్నది. ప్రపంచంలో మిగిలిన ప్రాంతాలలో పురుష జనాభా కంటే స్త్రీల జనాభా తక్కువగా ఉన్నది. ఒకదేశంలోనో, లేక ఒక ప్రాంతంలోనో ప్రతి వంద మంది పురుషులకు 94 మంది స్త్రీలున్నారంటే, పురుష జనాభా కంటే స్త్రీ జనాభా ఆరు శాతం తక్కువున్నట్లు లెక్క. అభివృద్ధి చెందిన యూరపు, ఉత్తర అమెరికా దేశాలలో వలె, అన్ని దేశాలలోనూ ప్రతివంద మంది పురుషులకు 105 గురు చొప్పున స్త్రీలుండాలి అన్న ప్రాతిపదిక మీద అంచనా వేస్తే, స్త్రీ జనాభా మరొక ఐదు శాతం తక్కువగా ఉన్నట్లు కనుపిస్తుంది. ఈ సూత్రం ప్రకారం ఈ దేశాలలోని స్త్రీ జనాభా, పురుష జనాభా కంటే పదకొండు

శాతం తక్కువగా ఉన్నట్లు తెలుతుంది ఈ నిష్పత్తి ప్రాతిపదిక మీద అంచనా వేస్తే, ఒక్క చైనా దేశంలోనే ఐదు కోట్ల స్త్రీ జనాభా తగ్గినట్లు కనుపిస్తుంది ఈ జనాభా మనకు లెక్కలలోనే కనుపిస్తుంది. నేల మీద కనుపించదు. దక్షిణాసియా, పశ్చిమాసియా, ఉత్తరాఫ్రికా దేశాలలో కూడా తగ్గిన స్త్రీ జనాభా పరిమాణాన్ని, తగ్గిన చైనా జనాభాతో కలిపి చూస్తే, సుమారుగా పదికోట్ల మంది స్త్రీలు మనకు కనుపించరు! ఈ కనుపించని స్త్రీ జనాభాను ప్రొఫెసర్ సేన్ "అదృశ్య" స్త్రీలుగా పేర్కొన్నారు వీరంతా ఏమయినారు? దీని వెనుక నున్న రహస్యం ఏమిటి?

పురుషుల కంటే స్త్రీలకు మనుగడశక్తి అధికమని జీవశాస్త్రం చెబుతున్నది పురుషులతో సమానమైన పోషణా, ఆరోగ్య రక్షణా, ఇతర సామాజిక, జీవన వసతులు కూడా వీరికి లభిస్తే, వారు పురుషుల కంటే ఎక్కువ కాలం జీవించే అవకాశాలుంటాయి. పురుషుల కంటే వీరికి రోగ నిగ్రహ శక్తి అధికం; వత్తిడికి తట్టుకోగల శక్తి కూడా అధికంగా ఉంటుంది. సంతానాన్ని కనే కాలం ముగిసిన తర్వాత మాత్రమే గాదు, తల్లి గర్భంలో ఉన్నపుడు, పురిటిలో కూడా వీరు మగపిల్లల కంటే గట్టి ప్రాణులే. అప్రయత్నంగా జరిగే గర్భ స్రావాలలో అధిక భాగం పురుష పిండాలకు సంబంధించినవై ఉంటాయని వైద్య నిపుణులు అభిప్రాయపడుతున్నారు. పుట్టుకలో ఆడపిల్లల కంటే మగపిల్లల సంఖ్య అధికంగా ఉంటున్నది. ప్రతి వంద మంది ఆడపిల్లలకూ 105-106 మంది చొప్పున మగ పిల్లలు పుడుతున్నారని జనాభా లెక్కలు తెలియజేస్తున్నాయి. అయినా కొన్ని దేశాలలో పురుష జనాభా కంటే స్త్రీల జనాభా అధికంగా ఉండటం వారి జీవశక్తికి నిదర్శనం.

ఇంతటి మనుగడ శక్తి గలిగిన స్త్రీలు, కొన్ని ప్రాంతాల జనాభాలో పురుషుల కంటే తక్కువగా ఉండటానికి కారణం ఏమిటి? వారి మరణాలరేటు పురుషుల మరణాల రేటు కంటే అధికంగా ఉండటమే ఇందుకు కారణమని జనాభా లెక్కలు నిరూపిస్తున్నాయి. పుట్టిన దగ్గర నుండి, కాన్పు ఉడిగే దశ వచ్చే వరకూ, ఇదే వయసు పురుషుల మరణాల రేటు కంటే స్త్రీల మరణాలరేటు అధికంగా ఉంటున్నది. పురుషులతో సమానమైన పోషణ, ఆరోగ్యరక్షణ, ఇతర సేవలు స్త్రీలకు అందకపోవటం చేతనే వారు అకాలంగా మరణిస్తున్నట్లు ప్రొఫెసర్ సేన్ నిర్ధారణ చేశారు స్త్రీలు భయంకరమైన లింగ వివక్షకు, తీవ్రమైన అనాదరణకూ ఎరగావటంగా వీరు ఈ స్థితిని వర్ణించారు

భారతదేశంలో...

దక్షిణ ఆసియాలో పురుష జనాభా కంటే స్త్రీ జనాభా తక్కువగా ఉన్న దేశాలలో మనదేశం కూడా ఒకటి వందమంది పురుషులకు 93 మంది చొప్పున మాత్రమే స్త్రీలున్నట్లు 1991వ సంవత్సరపు జనాభా లెక్కలు తెలుపుతున్నాయి భారతదేశానికి సంబంధించిన ఈ సమస్యను జీన్ డ్రేజ్, ప్రొఫెసర్ అమర్త్య సేన్‌లు వివరంగా పరిశీలించారు. వారి పరిశీలనలో ఆసక్తి దాయకమైన అంశాలు వెలుగులోనికి వచ్చాయి. వాటి నిచ్చట వివరిస్తాం.

మనదేశంలో పురుషునితో సమానమైన స్థానం కుటుంబంలో గాని, సమాజంలో గాని స్త్రీకి లేదు. చదువు, సృజనాత్మక శక్తుల పెంపుదల వంటి వాటిలోనే కాదు; పోషణ, ఆరోగ్య రక్షణ వంటి అతి ముఖ్యమైన వాటిలో కూడా ఈ సమానత్వం లోపించింది.

అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చితే, మనదేశపు స్త్రీ-పురుష జనాభా నిష్పత్తి చాలా తక్కువగా ఉన్నట్లు లెక్క. పొరుగున ఉన్న పాకిస్థాన్లో పరిస్థితి, మనదేశంలో కంటే హీనంగా ఉన్నది ఈ దేశంలో ప్రతి వందమంది పురుషులకు 91 మంది మాత్రమే స్త్రీలున్నారు. మనదేశంలోని వివిధ రాష్ట్రాలలోని స్త్రీ-పురుష జనాభా పరిమాణాలలో తేడాలున్నాయి. ఉత్తర భారతంలోని అధిక ప్రాంతాలలో స్త్రీ జనాభా పురుష జనాభా కంటే చాలా తక్కువగా ఉన్నది. ప్రతి వందమంది పురుషులకు, హర్యానాలో 87 మంది, పంజాబులో 88 మంది, ఉత్తరప్రదేశ్‌లో 88 మంది, రాజస్థాన్‌లో 91 మంది మాత్రమే స్త్రీలున్నారు. దక్షిణ భారతంలో పరిస్థితి ఇంత దారుణంగా లేదు. తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లలో 97 మంది, కర్ణాటకలో 96 మంది స్త్రీలున్నారు. యూరపు, ఉత్తరమెరికా ప్రాంతాలలో ప్రతి వందమంది పురుషులకు 104 నుండి 105 మంది వరకూ స్త్రీలున్నట్లు చూచాం. మనదేశంలో, కేరళలో తప్ప, మరే రాష్ట్రంలోనూ స్త్రీ పురుష జనాభా నిష్పత్తి ఇంత అధికంగా లేదు. దీనిని బట్టి మనదేశంలో అమలు జరుగుతున్న లింగ వివక్ష ఎంత తీవ్రంగా ఉన్నదో ఊహించవచ్చు. ఈ

పరిస్థితి అన్ని రాష్ట్రాలలోనూ ఒకే పరిమాణంలో లేదు; తరతమ భేదాలున్నాయి. దేశంలోని వాయవ్య ప్రాంతంలో లింగ వివక్ష తీవ్ర స్థాయిలో నున్నట్లు ఆ ప్రాంతాల స్త్రీ పురుష జనాభాల నిష్పత్తి తెలియజేస్తున్నది. స్త్రీలను పురుషులతో కలవనీయకపోవటం, పనిపాటలలో స్త్రీలను అధికంగా పాల్గొన నీయక పోవటం, అక్షరాస్యతలో విపరీత వ్యత్యాసం ఉండటం ఆస్థిహక్కులు స్త్రీలకు నామమాత్రంగానే ఉండటం, కాన్పులో మగపిల్లలకు ప్రాధాన్యత లభిస్తుండటం, ఆడపిల్లల యెడల అధిక నిరాదరణ ప్రదర్శన, స్త్రీ మెట్టినింటికి వెళ్ళిన తర్వాత పుట్టినింటి వారితో సంబంధాలను తెంచుకోవలసి రావటం వంటి కట్టుబాట్లు ఈ ప్రాంతంలో కఠినంగా అమలు జరుగుతున్నాయి. ఈ పరిస్థితితో పోల్చితే, దక్షిణ భారతంలో ప్రదర్శితమవుతున్న లింగవివక్ష అంత కఠినమైనదిగా కనుపించదు. కేరళ రాష్ట్రంలోని మహిళల పరిస్థితి, దేశంలోని అన్ని రాష్ట్రాలలోని స్త్రీల పరిస్థితి కంటే ఎంతో మెరుగుగా కనుపిస్తుంది. స్త్రీలలో అక్షరాస్యత అధికంగా ఉండటం, రాజకీయ సాంఘిక రంగాలలో స్త్రీలు అధికంగా పాల్గొంటూ ఉండటం, కొన్ని కులాల వారిలో వంశపారంపర్య ఆస్థి హక్కులు తల్లి నుండి కూతుళ్ళకు సంక్రమిస్తూండటం వంటివి ఇందుకు కారణాలుగా చెప్పవచ్చునని ఈ పరిశీలకులు అభిప్రాయపడ్డారు.

పురిటిలో ఆడపిల్లలను చంపటం వల్లనే స్త్రీ-పురుష జనాభాల మధ్య వ్యత్యాసాలుంటున్నాయి అన్న వాదనను వారు అంగీకరించలేదు (ఇవి జరగటం లేదని కూడా వారు చెప్పలేదు). పురుష జనాభా కంటే స్త్రీ జనాభా తక్కువగా ఉండటానికి, బాల బాలికల మరణాలరేటులో వ్యత్యాసాలుండటాన్ని ఒక కారణంగా వీరు పేర్కొన్నారు. 1981వ సంవత్సరపు శాంపుల్ రిజిస్ట్రేషన్ సిస్టం క్రింద రికార్డయిన, ఐదు సంవత్సరాలలోపు వయసుగల బాలబాలికల జనన మరణాల ప్రాతిపదికమీద, ప్రతి వంద మంది బాలురకు 92 మంది బాలికలు మాత్రమే ఉన్నట్లు వీరు అంచనా వేశారు. స్త్రీశిశు మరణాలలో కొన్ని పురిటిలోనే పిల్లలను చంపిన సంఘటనా ఫలితాలు కూడా ఉండవచ్చునని వారు భావించారు. స్త్రీశిశు మరణాలు, ఒక సంవత్సరం వయస్సు నిండిన తర్వాత అధికంగా ఉంటాయి. చంపదలచిన వారు బిడ్డను పురిటిలోనే చంపుతారు గనుక, స్త్రీ పురుష జనాభా నిష్పత్తినిది ప్రభావితం చేయలేదని వారు భావించారు. 1981వ సంవత్సరపు అంచనాల ప్రకారం, పుట్టిన ప్రతి వెయ్యి మంది మగపిల్లలలో 113 మంది, సంవత్సరం వయస్సు నిండక పూర్వమే మరణించారు; ఇదే వయస్సు బాలికలలో, పుట్టిన వారిలో ప్రతి వెయ్యి మందికి, 115 మంది మరణించారు. చనిపోయిన వారు పోగా, మిగిలిన వారిలో 68 మంది బాలురు మరణించగా, బాలికలు 91 మంది మరణించారు. దీనిని బట్టి, సంవత్సరం వయస్సు నిండిన తర్వాతనే, బాలుర, బాలికల మరణాలరేటులో అధిక వ్యత్యాసం ఉంటున్నదనీ, కనుక పురిటిలోనే ఆడపిల్లలను చంపటం అనేది దీనిని ప్రభావితం చేయటం లేదనీ స్పష్టమవుతున్నది. మగపిల్లల మీది మోజుతో వారిని అన్ని విధాలా ఆదరిస్తూ, ఆడపిల్లలను నిరాదరణకు గురి చేస్తూండటమే, ఆడపిల్లల అధిక మరణాలకు కారణమని వీరు నిరూపించారు. ఆరోగ్య రక్షణ, పోషణ, పిల్లల ఇతర అవసరాల విషయంలో ప్రదర్శిత మవుతున్న లింగ వివక్షా ఫలితంగా దీనిని వీరు పేర్కొన్నారు.

"జెండర్ డిఫరెన్షియల్స్ ఇన్ చైల్డ్ మోర్టాలిటీ" అన్న పరిశోధనా పత్రంలో, పై విషయాన్ని ప్రస్తావిస్తూ, సునీతా కిషోర్ ఇలా వ్రాశారు. "బాల బాలికల మరణాలరేట్లలో వ్యత్యాసాలున్నాయనటానికి సందేహం లేదు. భారతదేశంలోని విస్తృత ప్రాంతంలో, ఆడపిల్లల ప్రాథమిక జీవనదశలో మరణాలరేటు, అదే వయస్సు మగపిల్లల రేటు కంటే అధికంగా ఉన్నది. తొలి సంవత్సరంలో కంటే ఐదవ సంవత్సరంలో బాలికల మరణాలరేటు, అదే వయస్సు మగపిల్లల మరణాలరేటు కంటే చాలా ఎక్కువగా ఉంటున్నది. ఈ విషయంలో రాష్ట్రాల మధ్యా, ఒకే రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల మధ్య కూడా వ్యత్యాసాలున్నాయి. ఒకటి నుండి ఐదు సంవత్సరాల మధ్య వయస్సుగల ఆడపిల్లల మరణాల రేటు, అదే వయస్సు బాలుర మరణాల రేటు కంటే అధికంగా ఉండటం అనేది, ఒక్క ఉత్తర భారతానికే పరిమితమై లేదు. ఇటువంటి ప్రాంతాలు దక్షిణాది రాష్ట్రాలలోనూ, తూర్పు ప్రాంతపు రాష్ట్రాలలోనూ ఉన్నాయి. ఉత్తర భారతంలోని మూడవ వంతు జిల్లాలలో ఆడపిల్లల మరణాలరేటు బాలుర మరణాలరేటు కంటే అధికంగా ఉన్నది".

హెన్రీ మోస్లే, లింకన్ చెక్‌లు, అభివృద్ధి చెందుతున్న దేశాలలో పిల్లల మనుగడ పరిశీలనకు ఒక ప్రాతిపదికను సృష్టించారు ఇందులో పిల్లల మరణాలకు దారితీస్తున్న వనుకొన్న అన్ని రకాల కారణాలను చేర్చి, వాటి దృష్ట్యా సర్వేలను నిర్వహించారు. మరణ కారణాలు ఆడపిల్లలకు, మగ పిల్లలకు ఒకే రకంగా ఉన్నప్పటికీ, ఆరోగ్య రక్షణ, పోషణ, సకాల వైద్య చికిత్స వంటివి ఆడపిల్లలకూ, మగపిల్లలకూ ఒకే పరిమాణంలో లభించటం లేదని వారు అభిప్రాయ పడ్డారు.

భారతదేశంలో ఈ విషయం మీద జరిగిన కొన్ని సర్వే ఫలితాలను సునీత పేర్కొన్నారు పంజాబులో 1965లోనూ, 1972వ సంవత్సరంలోనూ జరిగిన సర్వేలు, బిడ్డకు తల్లిపాలు మరపించే కాలంలో వచ్చే విరేచనాల వల్లా, పోషకాహార లోపం వల్లా మగపిల్లల కంటే ఆడపిల్లలు ఎక్కువగా బాధపడుతున్నట్లు రుజువు చేశాయి అదనపు పోషణ ఆడపిల్లల కంటే మగపిల్లలకే అధికంగా లభిస్తున్నట్లు కూడా సర్వే ఫలితాలు వెల్లడించాయి. 1982వ సంవత్సరంలో బంగ్లాదేశ్‌లో జరిగిన మత్లబ్ సర్వే, అదనపు పోషణ, నాణ్యతలోనూ, పరిమాణంలోనూ, ఆడపిల్లల కంటే మగపిల్లలకే అధికంగా లభిస్తున్నట్లు వెల్లడిచేసింది

పోషణలో లింగవివక్ష, బాల్యదశతో ఆగలేదనీ, పెద్దయిన తర్వాత కూడా స్త్రీలనది వెన్నాడుతున్నదన్న విషయాన్ని ఉత్తర భారతంలో జరిగిన నారంగ్‌వాలా స్టడీ సూచిస్తున్నది. పురుషులకు లభించే కాలరీలలో 86 శాతము, మాంసకృత్తులలో 84 శాతము, కాల్షియంలో 69 శాతము, ఇనుములో 88 శాతము, విటమిన్ "ఎ"లో 78 శాతము మాత్రమే స్త్రీలకు లభిస్తున్నట్లు ఈ అధ్యయనం వెల్లడించింది. మనదేశంలో జరిగిన మరికొన్ని సర్వేలు ఈ విషయాన్ని ధృవపరచాయి. లింకన్ చెన్, హక్, డి సూజాలు 1981లో బంగ్లాదేశ్‌లో జరిపిన సర్వే ఈ వివక్షను చక్కగా చిత్రించింది. ఈ సర్వేలో, 130 కుటుంబాలను ఎన్నుకొని, మాసానికి రెండుసార్ల చొప్పున మూడు మాసాల కాలం కుటుంబీకుల పోషణాంశాలను పరిశీలించారు. ఐదు సంవత్సరాలలోపు వయస్సుగల ఆడపిల్లలకూ, 45 సంవత్సరాల వయస్సును మించిన ఆడవారికీ, ఆ వయస్సు మగవారి కంటే తక్కువ పోషణ లభిస్తున్నట్లు ఈ సర్వే రుజువు చేసింది మరికొన్ని సర్వే ఫలితాల పరిశీలనానంతరం సునీత ఇలా వ్యాఖ్యానించారు; "పోషణా లోపానికి బాలురకంటే బాలికలు అధికంగా ఎరవుతున్నారు; పోషణ లేక చనిపోవలసిన పరిస్థితి ఏర్పడినపుడు, బాలురకంటే, బాలికలే అధికంగా మరణిస్తున్నారు పోషణాలోపం జరగకుండా, అన్ని వసతులు సక్రమంగా ఉన్నట్లయితే, స్త్రీ జీవశక్తి తన ఆధిక్యతను ప్రదర్శిస్తుంది; బాలికల మరణాలరేటు కంటే బాలుర మరణాలరేటు అధికంగా ఉంటుంది"

ఆరోగ్య రక్షణలో బాలబాలికల మధ్య ప్రదర్శిత మవుతున్న తేడాల ఫలితాలను సునీత పరిశీలించారు పోషణలో కంటే, ఆరోగ్య రక్షణ, వైద్య చికిత్సా విషయాలలో లింగ వివక్ష మరింత తీవ్రంగా ఉన్నట్లు, పలు సర్వేలు నిరూపించాయి. ఆడపిల్లల ఆరోగ్యరక్షణకు సకాలంలో తగిన చర్యలు తీసుకొంటే, పోషణా సంబంధమైన లోపాలున్నా, వారి మరణాలరేటును తగ్గించవచ్చునని మరొక పరిశీలకులు, అలకా బసు అభిప్రాయపడుతున్నారు. వీరు ఉత్తరప్రదేశ్‌లో ఒక దాని ప్రక్క మరొకటున్న రెండు జిల్లాలలోనూ, ఇలాగే ఉన్న తమిళనాడులోని నాలుగు జిల్లాలలోనూ పరిశీలనలు జరిపారు. రోగం వచ్చినపుడు వైద్య చికిత్సా సదుపాయం లభించని బాలురకంటే, బాలికలు అధికులుగా ఉన్నట్లు, లేదా చికిత్సార్హతలుగల వైద్యుని సేవలు బాలురకంటే బాలికలకు తక్కువగా లభించినట్లు అలకా బసు గమనించారు. తర్ఫీదు పొందిన డాక్టరు చికిత్సావసతి బాలికల కంటే బాలురకే అధికంగా లభించటాన్ని వీరు రికార్డు చేశారు బాల బాలికల మధ్య పోషణాలోప వ్యత్యాసాలుండటానికి, వారి మరణాలరేటుకు సంబంధం ఉన్నట్లు తాము భావించటం లేదని వీరు వెల్లడించారు. వైద్య చికిత్స, నాణ్యమైనది, సకాలంలో లభించనందుననే బాలికల మరణాలరేటు బాలుర రేటు కంటే అధికంగా ఉంటున్నట్లు వీరు అభిప్రాయపడ్డారు.

కెల్లీ నరేందర్, డాక్టరేట్ పట్టాకోసం, స్త్రీ-పురుష జనాభా నిష్పత్తిపై సాంఘిక, సాంస్కృతిక పరిస్థితుల ప్రభావం అనే అంశం మీద థీసిస్‌ను వ్రాశారు. ఈ రచన కోసం వీరు పంజాబు, కేరళ రాష్ట్రాలలో సర్వేలను నిర్వహించారు (1975లో). కేరళలో స్త్రీ జనాభా పురుషజనాభా కంటే అధికంగా

ఉండటానికి, వారికి లభిస్తున్న వైద్య చికిత్సావసతులే ప్రధాన కారణమని వీరు నిర్ధారణ చేశారు. ఇటువంటి అంశం మీదనే సర్వేను నిర్వహించిన బార్బరా మిల్లర్, హాస్పిటల్‌లో చేరుతున్న స్త్రీ పురుషుల సంఖ్యా వివరాలను పరిశీలించారు. ఉత్తర భారతంలో వైద్య చికిత్స కోసం చేరే ప్రతి ఆడపిల్లకూ, ఇద్దరు చొప్పున బాలురు వైద్యశాలలో చేరుతున్నట్లు వీరు గమనించారు. దక్షిణ భారతంలో ప్రతి పదిమంది ఆడపిల్లలకూ, 12 మంది మగపిల్లలు హాస్పిటల్‌లో చేరుతున్నట్లు తేలింది. బొంబాయి నగరంలోని వైద్యశాలలో చేరుతున్న వారిలో కూడా ఆడవారి కంటే మగవారే అధికులుగా ఉంటున్నట్లు మరొక సర్వే వెల్లడించింది. ఈ విషయంలో పిన్నలకు, పెద్దలకూ తేడాలు లేవు. బిడ్డ జీవితపు తొలిదశలో వైద్య చికిత్స నిమిత్తం చేసే ఖర్చు, బాలికల చికిత్స కంటే బాలుర చికిత్సకు 2.34 రెట్లు అధికంగా ఉంటున్నట్లు, పంజాబులోని కొన్ని గ్రామాలలో మోనికా దాస్ గుప్తా జరిపిన సర్వేలో (1987) తేలింది. ఇదే ప్రాంతంలో 1962వ సంవత్సరంలో ఒక సర్వే జరిగింది తీవ్రమైన అనారోగ్యానికి గురయిన వారిలో చికిత్స పొందే స్త్రీల కంటే, పురుషులే అధికులుగా ఉంటున్నట్లు రుజువైంది. అంతేకాదు; స్త్రీల కంటే నాణ్యమైన చికిత్స పురుషులకు లభిస్తున్నట్లు కూడా సర్వేయర్లు గుర్తించారు. చనిపోయిన ఆడపిల్లలలో 48 శాతం మందికి, రోగమాసించిన 24 గంటలలోపల చికిత్సా వసతి లభించగా, ఇంత తక్కువ

## 2వ పట్టిక
## కొన్ని రాష్ట్రాలలో స్త్రీ పురుష జీవిత కాల పరిమాణము, మరణపురేట్ల అంచనాలు

| రాష్ట్రం | జీవితకాల పరిమాణం (1990-92 సం॥ అంచనా) | | మరణాలరేటు : ప్రతి వెయ్యి మంది జనాభాకు (1992 సం॥పు అంచనాలు) | | | ప్రతి వంద స్త్రీ మరణాలకు పురుష మరణాలు | ఐదు సంవత్సరాలలోపు వయస్సు బాలుర ప్రతి వెయ్యి మరణాలకు సంభవిస్తున్న ఈ వయసు గ్రూపు బాలికా మరణాలు |
|---|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | స్త్రీ-పురుషులు | పురుషులు | స్త్రీలు | | |
| కేరళ | 68.8 | 74 4 | 6 3 | 7.5 | 5.2 | 144 | 911 |
| కర్ణాటక | 60.0 | 63.6 | 8.5 | 9.3 | 7.7 | 121 | 1,021 |
| పంజాబ్ | 65.4 | 67.5 | 8.2 | 8 9 | 7.4 | 120 | 1,179 |
| తమిళనాడు | 61.0 | 63.2 | 8.4 | 8 9 | 7 9 | 113 | 905 |
| పశ్చిమ బెంగాల్ | 60 5 | 62.0 | 8.4 | 8.8 | 8.0 | 110 | 1,020 |
| ఆంధ్రప్రదేశ్ | 59.0 | 61.5 | 9.2 | 9.6 | 8.9 | 107 | 906 |
| గుజరాత్ | 59.1 | 61.3 | 9.2 | 9.3 | 9.0 | 103 | 1,017 |
| హర్యానా | 62.2 | 63.6 | 8.7 | 8.8 | 8.6 | 102 | 1,067 |
| మహారాష్ట్ర | 63.1 | 64.7 | 7.9 | 7.9 | 8.0 | 98 | 1,050 |
| ఒరిస్సా | 55.9 | 54.8 | 11.7 | 11.4 | 11.9 | 95 | 1,010 |
| రాజస్తాన్ | 65.4 | 67.5 | 10.5 | 10.2 | 10.9 | 93 | 1,190 |
| మధ్యప్రదేశ్ | 54.1 | 53.5 | 12.9 | 12.3 | 13.5 | 91 | 1,099 |
| ఉత్తర ప్రదేశ్ | 56.8 | 54.6 | 12.8 | 11.9 | 14.0 | 85 | 1,157 |
| బీహారు | - | 58.3 | 10.9 | 10.0 | 11.9 | 84 | 1,187 |
| భారతదేశం | 59.0 | 59.4 | 10.1 | 10.0 | 10.2 | 98 | 1,074 |

స్త్రీ పురుషజీవితకాల పరిమాణాలను, ఐదు సంవత్సరాలలోపు బాలబాలికల మరణ వివరాలను డ్రేజీ, సేన్‌ల రచననుండీ, మరణరేట్ల అంచనాలను ఇంప్రూవింగ్ ఉమెన్స్ హెల్త్ ఇన్ ఇండియా నుండి స్వీకరించాం.

కాలంలో ఈ వసతి, చనిపోయిన బాలురలో 64 శాతం మందికి లభించినట్లు ఇంతకు పూర్వమే పేర్కొన్న నారంగ్‌వాలా స్టడీలో వెల్లడైంది.

ఇంతకు పూర్వమే ఒక ఆడపిల్ల పుట్టిన దంపతులకు పుట్టే రెండవ ఆడపిల్ల, చనిపోయే ప్రమాదం అధికంగా ఉంటుందని మోనికా దాస్ గుప్తా పంజాబు అధ్యయనం వెల్లడిస్తున్నది ఇప్పటికే ఇద్దరు ఆడపిల్లలు లేక మగపిల్లలున్న దంపతులకు పుట్టే ఆడపిల్లల సగటు బరువు. ఎత్తూ ఆరోగ్య సూత్రాల ప్రకారం ఉండవలసిన దానికంటే తక్కువగా ఉంటున్నదని నారంగ్వాలా అధ్యయనం పేర్కొన్నది. పుట్టిన మగ పిల్లవాడి వయస్సు మూడు సంవత్సరాలు నిండక పూర్వమే పుట్టే ఆడపిల్ల చనిపోయే అవకాశాలు అధికంగా ఉంటాయని ఉత్తరప్రదేశ్‌లో జరిగిన మరొక సర్వే పేర్కొన్నది. తనకంటే పెద్దవారయిన ఆడపిల్లలు తమ తల్లిదండ్రులకున్నపుడు, ఆ పిల్ల చనిపోయే ప్రమాదం 5.8 రెట్లు అధికంగా ఉంటున్నట్లు 1991వ సంవత్సరంలో బంగ్లాదేశ్‌లో జరిగిన ఒక సర్వే వెల్లడించింది. ఇపుడు అమలు జరుగుతున్న లింగ వివక్షా తీవ్రతను ఎంతమేరకయినా వర్ణించవచ్చు.

ముస్లిం సంప్రదాయ ప్రభావం అధికంగా ఉన్న ప్రాంతాలలో పురుష జనాభాకంటే స్త్రీ జనాభా తక్కువగా ఉంటున్నదన్న వాదనను కూడా డ్రేజ్, సేన్‌లు అంగీకరించలేదు. మనదేశంలోని వాయవ్య ప్రాంతాలు ముస్లిం దేశాలకు దగ్గరగా ఉన్నాయి; ఇవి కొంతకాలం ముస్లింల పాలనను కూడా అనుభవించాయి. కనుక వీటి మీద ముస్లిం సంప్రదాయ ప్రభావం ఉన్నది అన్న అంశాన్ని, వాదన కోసం అంగీకరిద్దాం. దక్షిణాదిన ఉన్న కేరళ, ముస్లిం సంప్రదాయ ప్రభావానికి లోనుగాలేదు. పైగా ముస్లిం జనాభా కూడా ఈ రాష్ట్రంలో పరిగణించదగిన పరిమాణంలో ఉన్నది. అయినా పురుష జనాభాకంటే స్త్రీల జనాభా ఎందుకు అధికంగా ఉన్నది? (1991 వ సంవత్సరపు జనాభా అంచనాల ప్రకారం ప్రతి వందమంది పురుషులకు నూట నలుగురి చొప్పున స్త్రీలున్నారు). పంజాబు రాష్ట్రంలో ముస్లిం జనాభా అతి తక్కువగా ఉన్నది; నూరింట ఒక్కరు మాత్రమే ఇచ్చట ముస్లింలున్నారు. అయినా ఈ రాష్ట్ర జనాభాలోని ప్రతి వందమంది పురుషులకు ఎనభయ్యెనిమిది మంది మాత్రమే స్త్రీలున్నారు. మనదేశంలోని

3వ పట్టిక
భారతదేశంలో వయస్సు గ్రూపువారి మరణాలు
(1989-91)

| వయస్సు గ్రూపు | ప్రతి వెయ్యి మంది జనాభాకు - మరణాలు | | ప్రతి 100 స్త్రీ మరణాలకు పురుష మరణాలు |
|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | |
| 0-4 | 26.3 | 28 9 | 91 |
| 5-9 | 2.4 | 3 0 | 82 |
| 10-14 | 1.4 | 1 5 | 94 |
| 15-19 | 1.7 | 2.5 | 69 |
| 20-24 | 2.4 | 3.2 | 75 |
| 25-29 | 2.7 | 3 7 | 89 |
| 30-34 | 3.2 | 2.8 | 112 |
| 35-39 | 4.0 | 3.4 | 119 |
| 40-44 | 5.5 | 4 1 | 134 |
| 45-49 | 9.0 | 5.9 | 153 |
| 50-54 | 13.3 | 9.0 | 147 |
| 55-59 | 20.7 | 14.0 | 148 |
| 60-64 | 31.6 | 23.2 | 136 |
| 65-69 | 47.1 | 37.6 | 125 |
| 70 తర్వాత | 94 2 | 81.1 | 116 |
| అఖిల భారతం | 10.0 | 9.8 | 102 |

*"ఇంప్రూవింగ్ ఉమెన్స్ హెల్త్ ఇన్ ఇండియా" (1996) అన్న ప్రపంచ బ్యాంకు ప్రచురణ నుండి*

అన్ని రాష్ట్రాలలో కంటే పురుష జనాభా, స్త్రీ జనాభా కంటే ఈ రాష్ట్రంలో అధికంగా ఉన్నది. దీని పొరుగునున్న హర్యానాలో, ముస్లిం జనాభా, రాష్ట్రపు మొత్తం జనాభాలో నాలుగు శాతం మాత్రమే ఉన్నది. అయినా ప్రతి వంద మంది పురుషులకూ 87 మంది చొప్పున మాత్రమే స్త్రీలున్నారు. ఈ అంశాల ఆధారంతో ఈ నిపుణులు, స్త్రీ జనాభా పురుష జనాభాకంటే తక్కువుండటానికి ముస్లిం సంప్రదాయ ప్రభావం కారణం కాదు అని రుజువు చేశారు. అంతేకాదు; లింగ వివక్ష, హిందువులలో కంటే ముస్లింలలో అధికంగా ప్రదర్శిత మవుతున్నది అన్న అంశాన్ని కూడా, అందుకు తగిన ఆధారాలు కనుపించటం లేదంటూ తోసిపుచ్చారు.

**1901 - 1991 సంవత్సరాల మధ్యకాలంలో క్రమంగా తగ్గుతున్న స్త్రీ-పురుష జనాభా నిష్పత్తి**




*- డా॥ ఏనీ టింకర్‌కు కృతజ్ఞతతో*

**నాల్గవ పట్టిక**

**వివిధ రాష్ట్రాలలో 1901-1991 సంవత్సరాల మధ్య కాలంలో తగ్గిన స్త్రీ పురుష జనాభా నిష్పత్తి**

| దేశము లేక రాష్ట్రము | జనాభాలో ప్రతి వెయ్యిమంది పురుషులకూ ఉన్న స్త్రీలు | | | దేశము లేక రాష్ట్రము | జనాభాలో ప్రతి వెయ్యిమంది పురుషులకూ ఉన్న స్త్రీలు | | |
|---|---|---|---|---|---|---|---|
| | 1901లో | 1991లో | ఈ సంవత్సరాల మధ్య కాలంలో పెరుగుదల (+) లేక తరుగుదల (-) | | 1901లో | 1991లో | ఈ సంవత్సరాల మధ్య కాలంలో పెరుగుదల (+) లేక తరుగుదల (-) |
| భారతదేశము | 972 | 927 | -45 | పశ్చిమ బెంగాల్ | 945 | 917 | -28 |
| బీహారు | 1,054 | 911 | -143 | ఉత్తరప్రదేశ్ | 937 | 879 | -58 |
| తమిళనాడు | 1,044 | 974 | -70 | అస్సాం | 919 | 923 | +4 |
| ఒరిస్సా | 1,037 | 971 | -66 | రాజస్తాన్ | 905 | 910 | +5 |
| కేరళ | 1,004 | 1,034 | +32 | హిమాచల్‌ప్రదేశ్ | 884 | 976 | +92 |
| మధ్యప్రదేశ్ | 990 | 931 | -59 | హర్యానా | 867 | 865 | -2 |
| ఆంధ్రప్రదేశ్ | 985 | 972 | -13 | పంజాబ్ | 832 | 882 | +50 |
| కర్ణాటక | 983 | 960 | -23 | ఇతర రాష్ట్రాలు, కేంద్ర పాలిత రాష్ట్రాలు కలిపి | 943 | 887 | -56 |
| మహారాష్ట్ర | 978 | 934 | -44 | | | | |
| గుజరాత్ | 954 | 934 | -20 | | | | |

*జీన్ డ్రేజ్, అమార్త్య సేన్‌ల "ఇండియా · కనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ అపర్ట్యునిటీ" (1995) నుండి*

## కాలగతిని తరుగుతున్న స్త్రీ జనాభా

ఈ శతాబ్ద ప్రారంభ కాలం నుండీ స్త్రీ పురుష జనాభా నిష్పత్తి నిరంతరాయంగా తగ్గుతూండటం కనుపిస్తున్నది. 1901వ సంవత్సరంలో ప్రతి వెయ్యిమంది పురుషులకు 972 మంది స్త్రీల చొప్పున ఉన్నారు. 1991వ సంవత్సరం వచ్చేసరికి, 90 సంవత్సరాల తర్వాత, స్త్రీల సంఖ్య 927కు దిగజారింది ! 1901వ సంవత్సరం నుండీ కూడా, దేశ వాయవ్య ప్రాంతంలో, ప్రతి వందమంది పురుషులకు ఉండే స్త్రీ జనాభా (స్త్రీ పురుష జనాభా నిష్పత్తి) దేశపు ఇతర ప్రాంతాల కంటే కూడా తక్కువగానే ఉంటున్నది. ఈ నిష్పత్తి దేశపు సగటుకంటే కొంచెం అధికంగా దక్షిణాది రాష్ట్రాలలో ఉంటున్నది. తూర్పు ప్రాంతపు రాష్ట్రాలలో ఈ నిష్పత్తి గణనీయంగా తగ్గింది (రాష్ట్రాలవారీ అంచనాలు నాల్గవ పట్టికలో ఉన్నాయి)

అన్ని రాష్ట్రాలలోనూ స్త్రీ పురుష జనాభా నిష్పత్తి ఒకేరకంగా (ఒకే పరిమాణంలో) లేదు. 1901వ సంవత్సరంలో కొన్ని రాష్ట్రాలలో స్త్రీ పురుష జనాభా నిష్పత్తి అధికంగా ఉన్నా, కాలక్రమేణా అది తగ్గ నారంభించింది. ఆదిలో స్త్రీ పురుష జనాభా పరిమాణాలలో తేడాలు తక్కువున్నా, కాలగతిని అవి పెరుగసాగాయి. ఒక్క కేరళ రాష్ట్రంలో మాత్రం ఇలాంటి తగ్గుదల కనుపించదు. 1901వ సంవత్సరంలో ఈ రాష్ట్రంలో ప్రతి వెయ్యిమంది పురుషులకూ 1004 చొప్పున స్త్రీలుండే వారు. 1991వ సంవత్సరం వచ్చేసరికి స్త్రీల సంఖ్య 1036కు పెరిగింది. ఈ తొంభై సంవత్సరాల కాలంలో ఏ దశాబ్దంలోనూ, స్త్రీ జనాభా పురుష జనాభా కంటే తగ్గలేదు. నిరంతరాయంగా ఇది పెరగటమే కనుపిస్తుంది.

ఉత్తర ప్రదేశ్‌లో దీనికి భిన్నమైన పరిస్థితి కనుపిస్తున్నది. 1901వ సంవత్సరంలో ప్రతి వెయ్యిమంది పురుషులకు 937 మంది స్త్రీలుండేవారు. 1991వ సంవత్సరం వచ్చేసరికి స్త్రీల సంఖ్య 879కి తగ్గింది. బీహారు, ఒరిస్సా, తమిళనాడు, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో స్త్రీ జనాభా తగ్గింది. ఈ ఆరు రాష్ట్రాలలోని తగ్గుదలను, దేశంలోని స్త్రీ జనాభా తగ్గుదలలోని అత్యధిక భాగంగా చెప్పవచ్చునని డ్రేజ్, సేన్‌లు సూచించారు. బీహారు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల తగ్గుదల, భారతదేశపు మొత్తం స్త్రీ పురుష జనాభా నిష్పత్తి తగ్గుదలలో సగభాగం వరకూ ఉంటుందని కూడా వీరు అంచనా వేశారు.

పిల్లలను కనే వయస్సు దాటిన తర్వాత 30-35 సంవత్సరాల వయస్సు నిండిన తర్వాత - స్త్రీల మరణాలరేటు పురుషుల మరణాలరేటు కంటే తక్కువగా ఉంటున్నట్లు జనాభా లెక్కలు సూచిస్తున్నాయి (3వ పట్టికను చూడండి) అయినా, ఈ వయస్సు దాటిన తర్వాత కూడా, స్త్రీ పురుష జనాభా నిష్పత్తి తక్కువగానే ఉంటున్నది. దీనిని బట్టి, కనుపిస్తున్న ఆర్థికాభివృద్ధి, ఆచరణలోని కొస్తున్న ఆధునిక వైద్య చికిత్సా సదుపాయాల ప్రయోజనం పురుషులకు చేకూరినంతగా స్త్రీలకు అందటం లేదని భావించవలసి వస్తున్నది. ఆధునిక వైద్య చికిత్సా విధానాలు కూడా, హృద్రోగ చికిత్స వంటి ప్రత్యేకతలుగానే ఉంటున్నాయి; స్త్రీలకు వచ్చే ప్రత్యేక రోగాల నివారణకు అవసరమైన చికిత్సా వసతులు, వారి అవసరాలకు తగినంతగా ఏర్పడటం లేదు. దీనిని బట్టి స్త్రీలు సంతానాన్ని కనటం మానినా, వారి జీవితం మెరుగుపడటం లేదని, లింగ వివక్ష వారిని విడనాడటం లేదని స్పష్టమవుతున్నది. (ఈ అంశాల మీద అదనపు సమాచారాన్ని, స్త్రీల ఆరోగ్యము, ఉపాధికి సంబంధించిన అధ్యాయాలలో చూడవచ్చు)

## లింగ వివక్ష : కులము

వెనుకబడిన కులాల వారి జనాభాలో స్త్రీ-పురుష నిష్పత్తి, మొత్తం జనాభా యొక్క స్త్రీ-పురుష నిష్పత్తి కంటే ఎక్కువగా ఉన్నట్లు, మనదేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం ప్రచురితమైన జనాభా లెక్కలు తెలియజేస్తున్నాయి. కాని 1991వ సంవత్సరం వచ్చేసరికి ఈ పరిస్థితి మారిపోయింది ! దేశ జనాభాలో ప్రతి వెయ్యి మంది పురుష జనాభాకు 927 మంది స్త్రీలుంటే ఈ కులాల జనాభాలో 922 మంది మాత్రమే స్త్రీలున్నారు. వెనుకబడిన కులాల వారనుకొన్న వారిలోనూ పరిస్థితులు మారిపోతున్నాయి. వారూ "అగ్ర" వర్ణాల వారి లాగే తయారవుతున్నారు; వారికి ఏమాత్రమూ వీరు తీసిపోలేదు! ఈ విషయ చిత్రణకు, డ్రేజ్, సేన్‌లు ఉత్తరప్రదేశ్ అనుభవాన్ని వివరించారు. వీరి పరిశీలనవల్ల కొన్ని ఆసక్తికరమైన అంశాలు వెలువడ్డాయి.

ఉత్తరప్రదేశ్‌లోని షెడ్యూల్డు కులాల జనాభాలో చామర్లు అత్యధిక సంఖ్యాకులుగా ఉన్నారు. 1901వ సంవత్సరంలో, ఈ రాష్ట్ర జనాభాలో ప్రతి వెయ్యిమంది

**5వ పట్టిక**

**1901-1981 సంవత్సరాల మధ్యకాలంలో ఉత్తరప్రదేశ్‌లోని కొన్ని కులాల జనాభాలో స్త్రీ-పురుష నిష్పత్తి**

| కులము లేక మతము | | ప్రతి 1000 మంది పురుషులకూ ఉన్న స్త్రీ జనాభా | |
|---|---|---|---|
| | | 1901 | 1981 |
| 1. | షెడ్యూల్డు కులాలు | | |
| | చామరులు | 986 | 880 |
| | అన్ని షెడ్యూల్డు కులాలు | 970 | 892 |
| 2. | క్షత్రియులు, రాజపుట్‌లు, రాకూరులు | 887 | 878 |
| 3. | ఇతర హిందువులు | 929 | 878 |
| | మొత్తం హిందువులు (పైన పేర్కొన్న అన్ని కులాల వారు కలిసి) | 935 | 881 |
| 4. | ముస్లింలు | 957 | 903 |
| 5. | ఇతరులు | 783 | 884 |
| 6. | మొత్తం దేశ జనాభా | 972 | 934 |
| 7. | ఉత్తరప్రదేశ్ | 937 | 879 |

*డ్రేజ్, అమార్త్య సేన్‌ల ఇండియా: ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ ఆపర్చ్యునిటీ నుండి*

పురుషులకూ 937 మంది చొప్పున స్త్రీలుండగా, ఈ కులం వారిలో 986 మంది వరకూ స్త్రీలున్నారు. రాష్ట్రపు సాధారణ జనాభాలో కంటే, వీరిలో స్త్రీ పురుష నిష్పత్తి అధికంగా ఉన్నదన్నమాట. 1981వ సంవత్సరం వచ్చేసరికి - అంటే యనభై సంవత్సరాల తర్వాత - వీరి జనాభాలోని స్త్రీ పురుష నిష్పత్తి, ఆ రాష్ట్రపు సాధారణ జనాభా యొక్క స్త్రీ-పురుష నిష్పత్తితో సమంగా తయారైంది. రాష్ట్రంలోని అన్ని షెడ్యూల్డు కులాల జనాభాలో ఇటువంటి పరిణామమే కనుపిస్తున్నది. 1901వ సంవత్సరంలో రాష్ట్రపు ముస్లిం జనాభాలో ప్రతి వెయ్యిమందికి 957 మంది చొప్పున స్త్రీలుండగా, 1981వ సంవత్సరం వచ్చేసరికి, వీరి సంఖ్యా పరిమాణం 903కు తగ్గిపోయింది. సమాజంలో స్త్రీ-పురుష సంబంధాల విషయంలో "వెనుకబడిన" కులాల వారనబడేవారు వెనుకబడలేదు; "అగ్ర" వర్ణాల వారితో సమంగా 'యెదిగారు' ! డ్రేజ్, సేన్‌లు నిర్ధారించిన వాటిలో ఇదొక ముఖ్యమైన అంశం. (సంఖ్యా వివరాలకు 5వ పట్టికను చూడండి)

ఇపుడు షెడ్యూల్డు కులాల వారిని, "సైనిక కులం" గా వ్యవహరించబడుతున్న క్షత్రియ కులస్తులతో పోల్చి చూద్దాం. క్షత్రియులు ఉత్తర భారతంలో రాచరికాన్ని చలాయించారు. ఈ కులాని కొక చరిత్ర, సంస్కృతి ఉన్నది. ఈ కులానికి చెందిన కుటుంబాలలో పితృస్వామికం (పురుష పెత్తనం అని కూడా చెప్పవచ్చు) భయంకరంగా ఉంటుందని చెబుతుంటారు. ఆడపిల్లలను పురిటిలో చంపటం, బాల్య వివాహాలు, పరదా చాటున స్త్రీల నుంచటం, వరకట్నాల వసూళ్ళు, సతీ సహగమనం (సతి), చనిపోయిన పురుషుని సోదరుడు వీరి భార్యను పత్నిగా స్వీకరించటం, బహు భార్యాత్వం వంటి పురుషాధిక్యతా విధానాలు అదుపులేకుండా ఈ కులం వారిలో చలామణీ అవుతుంటాయి. ఈ కులం వారిలో, 1901వ సంవత్సరం నాటికే, ప్రతి వెయ్యి మంది పురుషులకూ 887 మంది మాత్రమే స్త్రీలున్నారు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత స్త్రీ పురుష జనాభా నిష్పత్తిలో వచ్చిన మార్పు నామమాత్రమే. క్షత్రియ కులస్తుల పురుషాధిక్యతా సంప్రదాయం, షెడ్యూల్డు కులాల వారికి కూడా క్రమంగా ప్రాకినట్లు ఈ నిపుణులు సూచించారు. "అగ్ర"కులాల వారికి తాము "ఏవిధంగానూ తీసిపోలేదు" అన్నట్లు వీరు వ్యవహరించటం కనుపిస్తున్నది. దారిద్ర్యం నుండి బయట బడి సంపన్నులవుతున్నవారు, రెక్కలొచ్చినట్లు వ్యవహరించబూనటం సహజం ! వీరు ప్రదర్శించే దర్పం కూడా అతిగానే ఉంటుంది. ఈ ధోరణి, సంపన్నతను సాధిస్తున్న షెడ్యూల్డు కులాల వారిలో త్వరితగతిని వ్యాపిస్తున్నది. "అగ్ర" కులాల వారు వితంతు వివాహాలను అనుమతించరు. ఆర్థికంగా పైకి వస్తున్న వెనుకబడిన కులాలవారు కూడా ఇంతవరకూ తమలో లేని ఈ నూతన సంప్రదాయాన్ని పాటిస్తున్నారు ! ఈ విషయం మీద జరిగిన కొన్ని సర్వేలు దీనిని వెలుగుకు తెచ్చాయి. వరకట్నాచారం కూడా ఈ వర్గం వారిలో ప్రబలుతున్నట్లు సాక్ష్యాధారాలున్నాయి. ఈ పరిణామానికి, ప్రొఫెసర్ ఎం.ఎన్. శ్రీనివాస్ట్ "శాన్స్క్రిటైజేషన్" (సాంస్కృతీకరణం) అని నామకరణం చేశారు !

స్త్రీ పురుష జనాభా నిష్పత్తిలో తేడాలు అన్ని కులాల వారిలో ఉన్నాయి "అగ్ర" కులాల వారిని "తక్కువ" కులాలవారు అనుకరించటం ఒక్కటే కారణం గాదు. మనదేశంలో పేద కుటుంబాల వారిలో పురుషాధిక్యతా ప్రభావపు తీవ్రత తక్కువగా ఉంటుందని చెపుతారు. దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న కుటుంబంలో, స్త్రీ పురుషులిద్దరూ జోడెద్దులవలె సంసార శకటాన్ని లాగవలసి ఉంటుంది. కనుక వీరిలో, సంపన్న కుటుంబీకులలో కంటే స్త్రీ-పురుష సమానత్వం అధికంగా ఉంటుంది. దారిద్ర్యం, స్త్రీకి కుటుంబంలో పురుషునితో సమానమైన స్థానాన్నీయటానికి ప్రయత్నిస్తున్నపుడు, ఆర్థికాభివృద్ధి, దారిద్ర్యపు తగ్గుదల, కుటుంబంలో స్త్రీ-పురుష సమానత్వాన్ని తగ్గించటం సహజం. ఇంతకు పూర్వం లేని లింగ వివక్షా తీవ్రతను ఇపుడు స్త్రీ అనుభవించవలసి వస్తుంది. దేశంలో జరుగుతున్న ఆర్థికాభివృద్ధి వల్ల, షెడ్యూల్డు కులాల, గిరిజనుల జీవన పరిస్థితులు క్రమంగా మెరుగుపడుతున్నాయి. ఇందువల్ల, ఇంతవరకూ ఈ కుటుంబాలలో మనుతున్న స్త్రీ-పురుష సమానత్వ స్థాయి నీరసించి, తదనుగుణంగా పురుషాధిక్యత పెరుగుతున్నది. ఈ తరగతుల వారి జనాభాలో స్త్రీ- పురుష జనాభా నిష్పత్తి తగ్గుదలకు ఈ పరిణామం తోడ్పడుతున్నది.

ఉత్తరప్రదేశ్‌లో మాత్రమే సంభవించిన పరిణామంగా దీనిని పరిగణించనవసరం లేదు. దీనిని అఖిల భారత స్థాయీ పరిణామంగానే స్వీకరించవచ్చు. ఈ శతాబ్దారంభం నుండీ దేశంలో స్త్రీ జనాభా పురుష జనాభా కంటే క్రమంగా తగ్గుతూ వస్తున్నట్లు ఇంతకు పూర్వమే చూచాం షెడ్యూల్డు కులాలు, గిరిజన జనాభాలో కూడా, పురుష జనాభా కంటే, స్త్రీ జనాభా తగ్గుతూ వస్తున్నా, ఆ తగ్గుదల, "అగ్ర" వర్ణాల వారిలో ఉన్నంత అధికంగా లేదు. 1961వ సంవత్సరం తర్వాత మాత్రం, ఈ కులాల, తెగల స్త్రీల జనాభాలో అధిక తగ్గుదల స్పష్టంగా కనుపిస్తున్నది. 1961వ సంవత్సరంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్ర మొత్తం జనాభాలో, ప్రతివెయ్యి మంది పురుషులకూ 909 మంది స్త్రీలుండగా; షెడ్యూల్డు కులాల జనాభాలో ప్రతి వెయ్యి మంది పురుషులకూ 941 మంది స్త్రీలున్నారు. ముప్పై సంవత్సరాల తర్వాత, అంటే 1991వ సంవత్సరానికి, షెడ్యూల్డు కులాల స్త్రీ పురుష జనాభా నిష్పత్తి రాష్ట్ర జనాభా స్థాయికి దిగజారింది! 1991వ సంవత్సరంలో రాష్ట్ర జనాభాలో, ప్రతి వెయ్యి మంది పురుషులకూ 879 మంది స్త్రీలుండగా, షెడ్యూల్డ్ కులాల జనాభాలో 877 మంది మాత్రమే స్త్రీలున్నారు! 1961వ సంవత్సరంలో 941 మంది వరకూ ఉన్న స్త్రీ జనాభా, ముప్పై సంవత్సరాలకే - (1991కి) 877కు తగ్గిపోయింది. ఇదే పరిణామం, అఖిల భారత స్థాయిలో కూడా కనుపిస్తుంది. 1961వ సంవత్సరంలో భారతదేశ జనాభాలో ప్రతి వెయ్యి మంది పురుషులకూ 941 మంది స్త్రీలున్నారు: షెడ్యూల్డు కులాల జనాభాలో 957 మంది స్త్రీలున్నారు ఈ సంవత్సరంలో, దేశ జనాభాలో కంటే, ఈ కులాల జనాభాలో స్త్రీలు అధికంగానే ఉన్నారు. 1991వ సంవత్సరం వచ్చేసరికి, దేశ జనాభాలో ప్రతి వెయ్యి మంది పురుషులకూ ఉన్న స్త్రీల సంఖ్య కంటే, షెడ్యూల్డు కులాల జనాభాలో స్త్రీల సంఖ్య తక్కువగా ఉంది! దేశ జనాభాలో 1991వ సంవత్సరంలో ప్రతి వెయ్యిమంది పురుషులకు 927 మంది స్త్రీలుండగా, షెడ్యూల్డు కులాల జనాభాలో 922 మంది మాత్రమే స్త్రీలున్నారు! ఆర్థికాభివృద్ధి జరుగుతున్నా, స్త్రీ పురుష నిష్పత్తి స్థాయీ తగ్గుదల ఆగలేదు: ఈ పరిణామం దృష్ట్యా చూచినపుడు, దేశంలో ఆర్థికాభివృద్ధి జరిగినంత మాత్రాన స్త్రీకి లింగవివక్ష నుండి విముక్తి లభించదు, స్త్రీ పురుష సమానత్వం నెలకొనదు అని డ్రేజ్, సేన్‌లు స్పష్టం చేశారు ఈ పరిణామాన్ని, సమాజం ఒక హెచ్చరికగా పరిగణించాలని కూడా వారు హితవు చెప్పారు. ఆర్థికాభివృద్ధి జరుగుతున్న కొలదీ, లింగ వివక్షా స్థాయి కూడా పెరిగే ప్రమాదమున్నట్లు వారు అభిప్రాయపడ్డారు.

దీనికి ఉదాహరణగా వారు మనకు పంజాబు, హర్యానాల అనుభవాన్ని చూపారు. తలసరి ఆదాయం దృష్ట్యా చూస్తే మనదేశంలోకెల్లా సంపన్నమైన రాష్ట్రాలివి. ఈ రెండు రాష్ట్రాలలోనూ, అధిక దిగుబడి నిచ్చే వంగడాలరాక తర్వాత (1961వ సంవత్సరం తర్వాత) సంపదోత్పత్తి త్వరిత గతిని పెరిగింది. ముప్పై సంవత్సరాల అభివృద్ధి తర్వాత కూడా ఈ రాష్ట్రాలలో స్త్రీ పురుష నిష్పత్తి పెరుగకపోగా, తగ్గింది. దీనిని బట్టి ఆర్థికాభివృద్ధి సాధనకూ, లింగ వివక్ష నుండి స్త్రీ విముక్తికి సంబంధం ఉన్నట్లు కనుపించటం లేదు. సమూలమైన సామాజిక మార్పులు రాకుండా స్త్రీకి లింగ వివక్ష నుండి విముక్తి లభించదని స్పష్టమవుతున్నది.

### లింగవివక్ష : స్త్రీశిశు మరణాలు

లింగవివక్షకు స్త్రీలు అధికంగా గురవుతున్న భారతదేశము, పాకిస్థాన్, బంగ్లాదేశ్, చైనా, పశ్చిమాసియా దేశాలలో ఐదు సంవత్సరములలోపు వయస్సుగల ఆడపిల్లలు, ఆ వయస్సుగల మగపిల్లల కంటే అధికంగా చనిపోతున్నారు అభివృద్ధి చెందిన యూరపు, ఉత్తరమెరికా దేశాలలో కంటేనే గాదు, ఆఖరుకు వెనుకబడిన సబ్-సహారన్ దేశాలలో కంటే కూడా ఆడపిల్లల మరణాలరేటు పైన పేర్కొన్న దేశాలలో అధికంగా ఉన్నది మగపిల్లలకంటే అధిక జీవశక్తిని సంతరించుకు పుట్టిన ఆడపిల్లల మరణాలు బాలుర మరణాల కంటే అధికంగా ఉండటం అనే అంశం గమనార్హమైనది. భారతదేశంలో చనిపోతున్న ప్రతి వెయ్యిమంది బాలురకు, 1074 మంది చొప్పున ఆడపిల్లలు చనిపోతున్నారు. దేశంలోని కొన్ని రాష్ట్రాలలో ఆడపిల్లల మరణాలరేటు ఇంతకంటే కూడా అధికంగా ఉన్నది. చనిపోతున్న ప్రతి వెయ్యిమంది బాలురకు, బీహారులో 1187 మంది, మధ్యప్రదేశ్‌లో 1099 మంది, పంజాబులో 1179 మంది, రాజస్థాన్‌లో 1190 మంది, ఉత్తరప్రదేశ్‌లో 1157 మంది చొప్పున ఆడపిల్లలు మరణిస్తున్నారు. (అదనపు వివరాలను భారతదేశంలో స్త్రీల ఆరోగ్యానికి సంబంధించిన అధ్యాయంలో చూడవచ్చు)

మమతా మూర్తి ప్రభృతులు, ఆడ-మగ పిల్లల మరణాల రేట్లలో వ్యత్యాసం ఉండటానికి గల కారణాలను సాకల్యంగా పరిశీలించారు. వీరి పరిశీలనా ఫలితాలు 1995లో ప్రచురితమైనాయి. స్త్రీలలోని అక్షరాస్యత, స్త్రీల వేతనార్జన, దారిద్ర్యం, పోషణా స్థితి వంటి పలు అంశాలను పరిగణనలోనికి తీసుకొన్నారు. స్త్రీల అక్షరాస్యత, వేతనార్జనా శక్తి ఆడపిల్లల మరణాలరేట్లను తగ్గించగల అవకాశాలున్నట్లు వీరు నిర్ధారణ చేశారు. ఆడపిల్లల మరణాలరేటును తగ్గించే ఇతర కొన్ని అంశాలు కూడా ఉన్నట్లు వీరు గమనించినా, పైన పేర్కొన్న రెండు, మరణాలరేటు మీద అత్యధిక ప్రభావాన్ని చూపగలుగుతున్నట్లు అభిప్రాయపడ్డారు. ఆధునిక నాగరికత, ఆర్థికాభివృద్ధి విస్తరించిన చోట్ల కూడా, ఇంతకు పూర్వమే మేము సూచించినట్లు, లింగవివక్ష అంతరించలేదు; ఆడపిల్లల మరణాలరేటు, బాలుర మరణాలురేటు కంటే అధికంగానే ఉన్నది. ఆర్థికాభివృద్ధి, సాంకేతిక ప్రమాణాల అభివృద్ధి మాత్రమే లింగవివక్షను అంతం చేయలేవని వీరి అధ్యయనం కూడా నిరూపించింది. స్త్రీ అక్షరాస్యత, వేతనార్జనా శక్తితోపాటు, వారి ఆస్థి హక్కులు, సంస్కృతి, ఆలోచనా సరళి, కులాంతర వివాహము, లేక ఇంతకు పూర్వం సంబంధం లేని క్రొత్త కుటుంబీకులను పెండ్లి చేసుకోవటం, వివాహానంతరం స్త్రీకి పుట్టినింటి వారితో ఉండే సంబంధం వంటి అంశాలు కూడా స్త్రీశిశు మరణాలరేటును ప్రభావితం చేయగలవని, కొన్ని పరిశీలనలు సూచించాయి

ఈ అంశాల దృష్ట్యా ప్రొఫెసర్ అమర్త్య సేన్ కొన్ని దేశాల అనుభవాలను పరిశీలించి కొన్ని నిర్ధారణలను చేశారు వాటి నిచట సంక్షిప్తంగా వివరిస్తాం

### ఆర్థికాభివృద్ధి : స్త్రీల మరణాలు

పురుష జనాభాకంటే స్త్రీ జనాభా తక్కువగా నున్న దేశాలన్నీ పేదవే. ఆర్థికంగా అభివృద్ధి చెందిన ఏ దేశంలోనూ పురుష జనాభా కంటే స్త్రీ జనాభా తక్కువగా లేదు అన్న అంశాన్ని ఇంతకుముందే చూచాం. దీనిని బట్టి ఆర్థికాభివృద్ధి సాధనతో, స్త్రీ జనాభా కూడా పురుష జనాభాతో సమంగా పెరుగవచ్చునన్న అభిప్రాయం గలగటం సహజం. దేశం అభివృద్ధి చెందిన కొలదీ వైద్య సదుపాయాలు విస్తరిస్తాయి; ఆధునిక వైద్య చికిత్సా విధానాలు అమల్లోకి వస్తాయి ఇందువల్ల శిశుమరణాలు, పురిటిచావులు తగ్గవచ్చునన్న భావం అంకురించటం సహజం. కాని ఇలాంటి పరిణామాలు, అభివృద్ధి సాధనా పరిమాణాలకు తగినంతగా సంభవించటం లేదని అనుభవం రుజువు చేస్తున్నది.

కొన్ని దేశాలు, అవి పేదవయినా, పురుష జనాభా కంటే, ఆ దేశాలలో, స్త్రీ జనాభా తక్కువగా లేదు. ఇందుకు సబ్-సహారన్ ఆఫ్రికాను ఉదహరించవచ్చు. ఈ ప్రాంతం విస్తృతమైన భూఖండం; ఆర్థికంగా వెనుకబడిన ప్రాంతమిది. అయినా ఈ ప్రాంతంలో పురుషులకంటే స్త్రీలు అధికులుగా ఉన్నారు. (సంఖ్యాపరిమాణంలో). ప్రతి వెయ్యిమంది పురుషులకూ 1002 మంది చొప్పున స్త్రీలున్నారు. చైనాలో తప్ప, మిగిలిన తూర్పు ఆసియా ప్రాంతంలో కూడా, ఇలాగే, పురుషులకంటే స్త్రీలు అధికంగానే ఉన్నారు.

పురుష జనాభా కంటే స్త్రీ జనాభా తక్కువున్న

భారతదేశపు స్థితిని చూద్దాం. 1901వ సంవత్సరం నుండి, దేశంలో ఆర్థికాభివృద్ధి జరుగలేదని చెప్పలేము అలాగే వైద్య చికిత్సా వసతులు, వాటి సాంకేతిక స్థాయి పెరుగలేదని కూడా వాదించలేము. అయినా, 1901వ సంవత్సరంలో ప్రతి వెయ్యిమంది పురుషులకు 972 మందిగా ఉన్న స్త్రీ జనాభా, 1991వ సంవత్సరం వచ్చేసరికి (తొంభై సంవత్సరాల తర్వాత), పెరుగకపోగా 927కు తగ్గింది దేశం అభివృద్ధిని సాధిస్తున్నా, ఈ పరిణామం సంభవించింది; స్త్రీల మరణాలరేటు, పురుషుల మరణాలరేటుకంటే తగ్గకపోయినా దానికి సమమైన స్థాయికి కూడా చేరలేదు; ఇంకా అధికంగానే ఉన్నది.

చైనా దేశపు అనుభవాన్ని చూచినా, మనకు ఇటువంటి పరిస్థితే కనుపిస్తుంది. ఈ దేశంలో 1979వ సంవత్సరంలో ఆర్థిక సంస్కరణలు ప్రారంభమైనాయి. 1979వ సంవత్సరంలో ప్రతి వెయ్యి మంది పురుషులకూ 943 మంది స్త్రీలుండేవారు; 1985వ సంవత్సరం వచ్చేసరికి స్త్రీల సంఖ్య 935కి తగ్గిపోయింది. అమెరికాలోని స్టాన్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రచురించిన చైనా జనాభా అంచనాల ప్రకారం, 1978వ సంవత్సరంలో 66 సంవత్సరాలుగా ఉన్న స్త్రీల జీవితకాల పరిమాణం; 1984వ సంవత్సరం వచ్చేసరికి 64.1 సంవత్సరాలకు తగ్గింది. పురుషుల జీవితకాల పరిమాణం, ఈ కాలంలో ఇంతగా తగ్గలేదు; పైగా కొంచెం పెరిగింది. 1978వ సంవత్సరంలో 64.1 సంవత్సరాలుగా ఉన్న వీరి జీవితకాల పరిమాణం 64.9 సంవత్సరాలకు పెరిగింది, సంస్కరణ మార్గాన్ని చేబట్టిన తర్వాత చైనా ఆర్థికాభివృద్ధి, శరవేగాన్ని అందుకొని ఆర్థిక నిపుణులను కూడా ఆశ్చర్యంలో ముంచెత్తిన విషయం జగద్విదితం. ఇలాంటి విప్లవాత్మక పరిణామం ఆర్థికాభివృద్ధితో సంభవించినా, మహిళల మనుగడ పరిమాణం మాత్రం వెనుకడుగు వేసింది ! ఆర్థికాభివృద్ధి ఎంత త్వరితగతిని, ఎంత అధికంగా జరిగినా, అదొక్కటే లింగ వివక్షను అంతరింపజేసి, స్త్రీ జనోద్ధరణను సాధించలేదు అన్న అంశాన్ని చైనా అనుభవం కూడా నిరూపించిందని ప్రొఫెసర్ సేన్ సూచించారు. అంతేకాదు; ఆర్థికాభివృద్ధి ఫలితాల ప్రయోజనం కూడా, పురుషులకు లభించినంత పరిమాణంలో స్త్రీలకు లభించదనీ, స్త్రీ పురుష మరణాల రేటు మధ్యనున్న వ్యత్యాసం కూడా పెరుగవచ్చునన్న అభిప్రాయాన్ని వీరు వ్యక్తం చేశారు. (స్త్రీల మరణాలరేటు పెరగవచ్చునని వీరి భావం).

## కుటుంబంలో సహకారము : సంఘర్షణ

సమాజంలో స్త్రీ అనుభవిస్తున్న అసమానతనూ, లింగవివక్షను ఒక్క ఆర్థిక దృక్పథంతో మాత్రమే చూస్తే చాలదు: సాంఘిక, సాంస్కృతిక దృష్టితో కూడా పరిశీలించాలి. కుటుంబంలో స్త్రీ స్థానం అన్ని ప్రాంతాలలోనూ ఒకే రకంగా లేదు: తేడాలున్నాయి. మహిళ, వేతనార్జనకు తగిన ఉపాధిని పొందగలిగినపుడు, ఆస్తి హక్కులు కూడా దీనికి తోడయినపుడు, కుటుంబంలో ఆవిడకు పురుషునితో సమానమైన అధికారము, స్వేచ్ఛ లభిస్తాయి. ఈ అంశాలు కుటుంబ జీవనంలో కీలకపాత్రను నిర్వహిస్తాయి కుటుంబ వనరులలో స్త్రీ ఎంత భాగాన్ని అనుభవించగలదు అనేది, ఈ అంశాల మీద ఆధారపడి ఉంటుంది

సమాజంలోని సభ్యులందరూ ఒకే విధంగా ఆలోచించరు; వ్యవహరించరు. ఎవరి మంచిని వారు కోరుకొంటారు. ఒక వర్గం వారికి మేలుగా పరిణమించిన అంశం, మరొక వర్గం వారికి నష్టకరం గావచ్చు. ఇందువల్ల సమాజంలో కొన్ని అంశాలమీద ఐక్యత ప్రదర్శితమైనా, మరికొన్ని అంశాలమీద భేదాభిప్రాయాలుండి, సంఘర్షణా పరిస్థితి ఏర్పడవచ్చు. సహకారం - సంఘర్షణ అనేది సామాజిక నైజం. (మానవునిలోని స్వార్థం అనేది అంతరించనంతవరకూ ఇది ఉంటుంది)

ఇందుకు మనం పరిశ్రమలలోని యజమానుల - కార్మికుల సంబంధాలను ఉదాహరణగా తీసుకోవచ్చు. ఫ్యాక్టరీలో ఉత్పత్తి పడిపోతే యాజమాన్యం ఆర్థికంగా నష్టపడుతుంది; ఇందువల్ల కర్మాగారం మూతబడుతుంది. కార్మికులు ఉపాధిని కోల్పోతారు. ఇది ఇద్దరకూ నష్టకరమే కనుక కర్మాగారం నడవటానికి రెండు వర్గాల మధ్య ఐక్యత అవసరం. కనుకే రెండు వర్గాల వారు ఈ విషయంలో ఐక్యతా ప్రదర్శనకు ఉత్సాహాన్ని చూపుతారు. లాభాల పంపకం వచ్చేసరికి ఈ ఐక్యత సడలిపోతుంది; సంఘర్షణ ప్రారంభమవుతుంది. ప్రతి వర్గమూ, వచ్చిన ఆదాయంలో వీలయినంత అధికభాగము తమకే దక్కాలని కోరుతుంది. దీనితో సంఘర్షణా పరిస్థితి ఏర్పడుతుంది. ఉత్పత్తిలో ప్రదర్శితమయిన ఐక్యత, వినియోగదశలో అదృశ్యమవుతుంది. ఇలాంటి సంఘర్షణా పరిస్థితి వ్యవసాయోత్పత్తిలోనూ

కనుపిస్తుంది. ఈ రంగాలలో ఇది అనివార్యమైన స్థితి; రాజీ లేని పోరాటానికిది దారి దీయవచ్చు.

సహకారం - సంఘర్షణా ధోరణి, కుటుంబాలలోనూ కనుపిస్తుంది. జాయింటు కుటుంబాలలో అన్నదమ్ములు, తోటికోడండ్ర మధ్య, అత్తమామలు - కోడండ్ర మధ్య ఇది పొడసూపవచ్చు. భార్యాభర్తలు కూడా ఇందుకు అతీతులు కారు. ఈ వైరుధ్యం, పరిశ్రమ యజమాని-కార్మికుల మధ్య రేగే వర్గవైరుధ్యం వంటిదిగాదు ఇచ్చట రాజీలేని సంఘర్షణకు అవకాశాలుండటం అరుదు. భార్యాభర్తల మధ్య ప్రేమానుబంధాలుంటాయి; బిడ్డలకు - దంపతులకు మధ్య అనుబంధాలుంటాయి. వాటిని తెగగోసుకోవటానికి ఉభయులూ సంకోచిస్తారు, రాజీకే తాపత్రయపడతారు.

వర్తమాన సమాజంలో భార్యాభర్తలమధ్యనున్న సంబంధాలను తరచిచూస్తే, భార్యకంటే భర్త బలవంతుడని చెప్పవలసి ఉంటుంది. భర్తకంటే భార్య ఆర్థికంగా బలహీనురాలు; పురుషుడు చేయగల కొన్ని పనులను ఆవిడ చేయలేదు. పైగా స్త్రీ సహజమైన సంతానోత్పత్తి భారాన్నావిడ మోయవలసి ఉంటుంది. పురుషుని సంపాదన మీద ఆధారపడవలసి ఉంటుంది. తరతరాలుగా వస్తున్న సంప్రదాయం, సాంస్కృతుల ప్రభావాలవల్ల, భర్త తన "పోషకుడనీ" తాను వారి "రక్షణలో" తలదాచుకొనే "సహధర్మచారిణి"ని అన్న భావం స్త్రీలో జీర్ణించింది. భర్తను వ్యతిరేకించటం "సంప్రదాయ విరుద్ధం"; వ్యతిరేకించే ఇల్లాండ్రను సమాజం "మర్యాదగా" చూడదు. ఈ మానసిక స్థితివల్ల తనకు కుటుంబంలో అన్యాయం జరుగుతున్నా, స్త్రీ సహించి ఊరుకొంటుంది. కొందరు ఇల్లాండ్రు తాము అనుభవిస్తున్న తీవ్రమైన లింగవివక్షను కూడా గుర్తించలేనంత అమాయకుల్లా ఉంటారు. లింగపరమైన ఈ అసమానతలను, ఈ సంప్రదాయ బద్ధత, చావకుండా, తరతరాలుగా పెంచుతూ, పోషిస్తూ ఉంటుంది. ఇందువల్లనే, కుటుంబ వనరులను అనుభవించటంలో (ముఖ్యంగా పోషణ, ఆరోగ్యరక్షణ, విద్యార్జనా సదుపాయం, సంక్షేమం వంటి విషయాలలో) భార్యాభర్తల మధ్య, వారి సంతానమైన ఆడపిల్లలు-మగ పిల్లల మధ్యనున్న తేడాలు మనుగడ సాగిస్తున్నాయి. అంతేకాదు; ఇవి కొన్ని సందర్భాలలో స్త్రీల జీవితాన్ని బాధామయం చేస్తున్నాయి. ఎవరెంత సంపాదిస్తున్నారు అన్నది నేడు ప్రధానాంశం గావటంచేత, కన్నబిడ్డలే, స్త్రీ జన్మనెత్తిన పాపానికి లింగవివక్షను, దాని దుష్ఫలితాలను, పుట్టినింట కూడా అనుభవించక తప్పటం లేదు! స్త్రీ, సంపాదనా పరురాలైనపుడు, ఆస్థి హక్కులను కూడా అనుభవించగల అవకాశాలు ఉన్నపుడు, ఆవిడకు భర్తతో సమానురాలిగా వ్యవహరించగల అవకాశాలుంటాయి.

మగపిల్లలు సంపాదనాపరులయి, వయస్సు మళ్ళిన స్థితిలో తమను పోషిస్తూ సంరక్షకులుగా వ్యవహరించగలరని భావించి వారి అభివృద్ధికి కృషీలోపం జరుగకుండా తల్లిదండ్రులు చూస్తారు పైగా పుత్రుడు తండ్రిని పున్నామనరకం నుండి తప్పిస్తాడన్న నమ్మకం కూడా మనకున్నది. కొడుకే తన చితిని అంటించాలని తండ్రి కోరటం కూడా సంప్రదాయంగా వస్తున్నది. కనుక కొడుకు మీదే అధికంగా పెట్టుబడిని పెట్టటం లాభకరమన్న భావం కొనసాగుతున్నది. ఆడపిల్ల మీద ఎంత పెట్టుబడిపెట్టి, ఆవిడను వృద్ధి చేసినా, చివరకు "ఒకయ్య చేతిలో పెట్టవలసిందే" కనుక ఆవిడ మీద పెట్టిన పెట్టుబడి వృథాగా పోతున్నట్లు భావిస్తున్నారు. దానికి తోడు, పెరుగుతున్న కట్న పిశాచం, ఈ దురభిప్రాయాన్ని పెంచుతున్నది. మగపిల్లలైతే కట్నాలు తేగలరు గనుక, వారు వారి అక్క చెల్లెండ్ర కంటే అధికులుగా తల్లిదండ్రులకు కనుపిస్తున్నారు! ఇందువల్ల, దంపతులు, ఆడపిల్లలను కనటం కంటే, మగపిల్లలను కనటానికే అధికాసక్తిని ప్రదర్శిస్తున్నారు. ఈ భావమే ఆడపిల్ల పుడుతుందని తెలిస్తే, గర్భస్రావానికి పాల్పడటానికి, ఆడపిల్ల పుడితే పురుటిలోనే చంపటానికి పురికొల్పుతున్నది. ఈ ధోరణి ఆసియా ఖండంలో ప్రస్ఫుటంగా కనుపిస్తున్నది. పోషణ, ఆరోగ్య రక్షణ, విద్యార్జనావకాశాల కల్పనవంటి విషయాలలో మగపిల్లలకు లభించిన ప్రాధాన్యత ఆడపిల్లలకు లభించటం లేదు. ఆడపిల్లలకు అన్యాయం జరుగుతున్నది. కుటుంబంలో అంకురించే ఈ సంఘర్షణకు ఒక్క ఆర్థిక విషయాలే కాదు; సామాజిక, సాంస్కృతికాంశాలు కూడా వీటికి తోడవుతున్నాయి. ఈ సంఘర్షణా రూపం ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగాను, ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క రూపంలోనూ కనుపిస్తూ ఉంటుంది.

ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలోనూ కుటుంబంలోని

స్త్రీ స్థానం ఒకే విధంగా లేదు ఆవిడ అధికార, స్థాయీ విషయాలలో భేదాలున్నాయి ఆర్థికాంశాలను ప్రత్యేకంగా గాక, సాంస్కృతిక, సామాజిక, సంప్రదాయాంశాలతో జోడించి, కుటుంబంలోని స్త్రీ పురుష సంబంధాలను సమగ్రంగా పరిశీలించాలి. అట్లని ఆర్థిక సంబంధాలను నిర్లక్ష్యం చేయవచ్చునని భావించనవసరం లేదు. స్త్రీ వేతనార్జనా శక్తి, ఆవిడకున్న ఆస్థి హక్కులు, కుటుంబంలో ఆవిడ ఆర్థికాధికారాన్నీ, ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ప్రతిబింబిస్తాయి స్త్రీ పురుషుల మధ్య కుటుంబ వనరుల పంపకం మీద ఈ అంశపు ప్రభావం ఉంటుంది వనరుల కొరత ఉన్నా, ఉన్న కొద్ది వనరులనే పురుషునితో సమంగా అనుభవించే శక్తి స్త్రీకి లభిస్తుంది.

కుటుంబంలో కొన్ని విషయాల మీద నిర్ణయాలు తీసుకొనేటపుడు, భార్యా-భర్త లిరువురకూ సమానమైన సంతృప్తి కలుగవచ్చు. కొన్ని విషయాలు వివాదాస్పదం గావచ్చు. ఈ వివాద పరిష్కారం ఎలా జరుగుతుంది అనే దానిని బట్టి స్త్రీకి లభించే లాభనష్టాలుంటాయి. అంకురించిన వివాదాన్ని సుహృద్భావంతో, సహజీవనాభిలాషతో పరిష్కరించుకోగలిగితే, స్త్రీ-పురుషులిద్దరకూ క్షేమం చేకూరుతుంది. ఇంతకు పూర్వమే చెప్పినట్లు, ఈ సందర్భంలో సంస్కృతి, సంప్రదాయాలు కీలకపాత్ర వహిస్తాయి. కుటుంబంలో ఎవరు ఎంతగా పనిచేస్తున్నారు, అన్న విషయాన్ని సామాన్యంగా అంచనా వేయరు. పురుషుని సంపాదన వల్లనే కుటుంబ పోషణ జరుగుతున్నదన్న భావం మనకు సంప్రదాయంగా సిద్ధించింది. కనుక భార్య "భరించబడే" వ్యక్తిగానే వర్ణితమవుతున్నది. కాని భర్తకంటే భార్య, ఇంటి పనులలో, వారి కంటే ఎక్కువకాలం, అధిక భారమైన పనులను చేయటమేగాక, ఒకే కాలంలో రెండు-మూడు పనులను కూడా చేస్తూ, బహుపాత్రా నిర్వహణ చేస్తున్న విషయాన్ని మనం విస్మరిస్తున్నాం. ఈ భారాన్ని స్త్రీ భరించకపోతే, పురుషుడు బయటకు వెళ్ళి ఎలా ఉద్యోగం చేయగలడు అన్న విషయ విచారణ తెరమరుగవుతున్నది. ఇది ఎంతో ముఖ్యమైన అంశం. ఈ అంశపు విస్మరణే కుటుంబంలో స్త్రీ బాధలకు మూలం.

వేతనం లభించని, నడుములు విరిగే బండెడు ఇంటి పనిని చేయటం కంటే, ఎంతకష్టమైనా లేబర్ మార్కెట్ కెళ్ళి, రొఖ్ఖరూప వేతనం లభించే ఏ పనిని చేసినా కుటుంబంలో స్త్రీ హోదా గణనీయంగా పెరుగుతుంది లింగ వివక్షా ప్రభావం ఇందువల్ల పూర్తిగా తొలగిపోక పోయినా, దాని తీవ్రతైనా తగ్గుతుందని నిపుణులు జరిపిన పలు సర్వేలు, పరిశీలనలు రుజువు చేశాయి. అలహాబాదులోని బీడీ కార్మికుల మీద జరిపిన సర్వే ఫలితాలను విశ్లేషిస్తూ జరీనా బత్తి ఇలా వ్రాశారు. "స్త్రీ ఆర్థికంగా నిర్వహించే పాత్ర కుటుంబంలో ఆవిడ హోదాను పెంచుతుంది పరిశ్రమలో పనిచేస్తున్న మహిళలలో చాలా మందికి కొంచెం ఎక్కువ ఆదాయమే వస్తున్నది: తమ కిష్టమైన అవసరాలకు ఆ సొమ్మును వాడుకొనే అవకాశాలు వారికి లభించాయి. కుటుంబ వనరులలో దేనికి ఎంత వాడాలి ఎవరికి ఎంత వాడాలి అన్న విషయ నిర్ణయంలో స్త్రీల నిర్ణయాలకు కూడా ఇపుడు ప్రాధాన్యత లభిస్తుండటం ముఖ్యమైన అంశం కుటుంబానికి అదనపు ఆదాయాన్ని స్త్రీ తెస్తున్నది గనుక, ఇపుడు ఆవిడను కుటుంబీకులు గౌరవప్రదంగా చూస్తున్నారు ఆర్థిక విషయాలలో స్వేచ్ఛ ఉండాలంటే, తాము వేతనాలను ఆర్జించటం అవసరమని చాలమంది మహిళా కార్మికులిపుడు గుర్తిస్తున్నారు... తమ కుటుంబానికి తాము చేయగలుగుతున్న మేలు యొక్క ప్రాధాన్యతను వారు గుర్తిస్తున్నారు. కుటుంబంలో తమ స్థాయి పెరగటాన్ని కూడా గుర్తించారు."

స్త్రీ బయట పనిచేస్తేనే చాలదు. ఆవిడ తెచ్చే ఆదాయ రూపం మీద కూడా కుటుంబంలో ఆవిడకు లభించే విలువ ఆధారపడి ఉంటుందని మేరియా మైస్ అంటున్నారు. వీరు 1982వ సంవత్సరంలో పశ్చిమ గోదావరి జిల్లాలోని నర్సాపూరులో లేస్ కార్మికుల మీద సర్వే జరిపారు. ఈ పనిని కొందరు వ్యాపారులు గృహిణులకు కాంట్రాక్టు పద్ధతిని అప్పగిస్తారు. ఇల్లాలు ఇంటి పనులు చూసుకొంటూ, తీరిక సమయాల్లో లేసులల్లే పనిని చేస్తూంటుంది. కనుక వీరికి అతి తక్కువ రేట్లను వ్యాపారులిస్తుంటారు. అల్లిన లేసు వస్తువులను వ్యాపారులు విదేశాలకు ఎగుమతి చేసి అధిక లాభాలను ఆర్జిస్తున్నారు. తన అల్లికలు విదేశాలకు ఎగుమతవుతున్నట్లుగాని, వాటిని అధిక ధరలిచ్చి విదేశీయులు కొంటున్నట్లు గాని, వాటిని అల్లిన ఇల్లాలికి తెలియదు. తాను చేసిన పని యొక్క ప్రాధాన్యతను ఇల్లాలు

గుర్తించలేకపోతున్నది. ఇల్లాలి అమాయకత్వాన్ని ఆధారంగా చేసుకొని, వర్తకులు ఆవిడ శ్రమను దోచుకొంటున్నట్లు మేరియా మైస్ పేర్కొన్నారు. ఈ అమాయకత్వం వల్లనే ఆవిడ అధిక కూలి రేటును అడగలేకపోతున్నది; ఆర్థికంగా నష్టపడుతున్నది. ఇంత నాణ్యమైన పనిచేస్తూ కూడా, తన సంపాదన చన్నీటికి వేడినీటి తోడు వంటిదిగా ఆవిడ భావిస్తున్నది. భర్త సంపాదన ప్రధానమైనది కాగా, తనది అత్యల్పమని ఆవిడ భావిస్తున్నట్లు మేరియా మైస్ వ్రాశారు. ఇందువల్ల ఆవిడ కుటుంబంలో ముఖ్యమైన వ్యక్తిగా గుర్తింపును పొందటం లేదనీ, తన అమాయకత్వంవల్ల ఆవిడ రెండు విధాలుగా నష్టపోతున్నదనీ మేరియా మైస్ వివరించారు : 1. అధికవేతనాన్ని పని ఇచ్చిన వారి నుండి ఆవిడ పొందలేక పోతున్నది; 2. కుటుంబంలో భర్తతో సమానమైన ఆర్జనాపరురాలుగా గుర్తింపును పొందలేకపోతున్నది. తన అమాయకత్వం వల్ల అదనపు పనిని చేస్తూ కూడా, ఇల్లాలు లింగ వివక్షా భారాన్ని మోయవలసి వస్తున్నది!

కుటుంబ వనరుల పంపకంలో గాని, లేక వినియోగంలోగాని, పురుషునితో సమానమైన హోదాను పొందటంలోగాని స్త్రీ ఎదుర్కొనవలసి వచ్చే ప్రతికూలతా తీవ్రత, బయటకు వెళ్ళి రొఖ్ఖరూప వేతనం సంపాదించటంవల్ల తగ్గుతుందని చెప్పటానికి ప్రొఫెసర్ అమార్త్య సేన్ నాలుగు కారణాలను సూచించారు :

1. ఇంటి బయటకు వెళ్ళి, వేతన రూప ప్రతిఫలం లభించే ఉపాధిని చేబట్టటంవల్ల, తన అవసరాలకు తగినట్లు డబ్బును వాడుకొనే అవకాశం స్త్రీకి లభిస్తుంది. కుటుంబంలో అంకురించే వత్తిడులను తట్టుకొనే శక్తి ఆవిడకు లభిస్తుంది; 2. వేతనార్జనవల్ల ఆవిడ కూడా కుటుంబ పోషకురాలుగా కనుపిస్తుంది, కుటుంబ క్షేమానికీ, భద్రతకూ ఉపకరిస్తున్న వ్యక్తిగా గుర్తింపును పొందుతుంది. ఇందువల్ల కుటుంబంలో, సమాజంలో ఆవిడ హోదా పెరుగుతుంది. కుటుంబ వనరుల వినియోగంలో సమాన భాగస్వామినయ్యే హక్కు తనకూ ఉన్నదని రుజువు చేసుకోగలుగుతుంది. 3. బయటి ఉపాధి ఉండటం వల్ల ఆవిడకు సాంఘిక భద్రత, చట్టబద్ధమైన రక్షణ కూడా లభిస్తుంది. ఇందువల్ల లింగవివక్షా తీవ్రతను ఆవిడ చాలా వరకు ప్రతిఘటించి నెగ్గగల అవకాశాలుంటాయి. 4 బయటకు వెళ్ళి ఉద్యోగం చేయటంవల్ల (కూలి కూడా ఇందులో భాగమే) లోకం పోకడను అర్థం చేసుకొనే అవకాశాలు స్త్రీకి లభిస్తాయి కుటుంబంలో తన స్థానాన్ని రక్షించుకొనగోరే ఇల్లాలికిది సాంఘికంగా అతి ముఖ్యమైన లాభం. కనుక బయటకెళ్ళి ఉద్యోగం చేయటాన్ని అనుభవ విద్యార్జనగా మనం పరిగణించవచ్చు.

కుటుంబంలో స్త్రీ స్థానం ఎపుడయితే బలపడుతుందో అపుడే ఆడపిల్లల మీది "చిన్నచూపు" కూడా అంతరించే అవకాశాలుంటాయి. పుట్టినప్పటి నుండి ఆడపిల్లలను కూడా మగపిల్లలతో సమంగా చూడటానికి తగిన ప్రోత్సాహం లభిస్తుంది. సంప్రదాయంగా వస్తున్న మగపిల్లల మీది మోజు బలహీనపడుతుంది. ఆడపిల్లలకు కూడా కుటుంబంలో మగపిల్లలతో సమానమైన ప్రతిపత్తి లభిస్తుంది.

## మహిళల మనుగడ మీద ఉపాధి ప్రభావం

మహిళలు బయట పనిచేసి వేతనాన్ని ఆర్జించగలగటం వల్ల కుటుంబంలో వారి స్థానం బలపడుతుంది, లింగవివక్షా తీవ్రత తగ్గుతుంది; ఇందువల్ల స్త్రీ సంక్షేమానికి భద్రత ఏర్పడుతుంది. ఆవిడ మనుగడ కూడా బలపడుతుంది. ఈ విషయాలను ఇంతకు పూర్వమే చూచాం. స్త్రీల వేతనార్జనాశక్తి సాధన, వారి మనుగడ మీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతున్నది గమనించటానికి ప్రొఫెసర్ అమార్త్య సేన్ ప్రయత్నించారు. స్త్రీ జీవితకాల పరిమాణపు పెంపుకూ, ఉపాధికి సంబంధం ఉన్నట్లు వీరి పరిశీలనలు వెల్లడించాయి. (ప్రపంచంలోని పలుమండలాలలో (చైనాను మినహాయించి) వేతనార్జనలో నున్న స్త్రీల సంఖ్యా పరిమాణాన్ని, వారి జీవితకాల పరిమాణాన్ని పోల్చిచూపే పట్టికను వీరు రూపొందించారు. దానిని ఆరవపట్టికగా ఈ అధ్యాయంలో ఇచ్చాం)

సబ్-సహారన్ ఆఫ్రికా ప్రాంతంలో ఒకే వృత్తిలో పనిచేస్తున్న వారిలో, ప్రతి వెయ్యి మంది పురుషులకూ 645 మంది స్త్రీలున్నారు. ఈ పురుషుల జీవితకాల పరిమాణం వంద సంవత్సరాలని అనుకొంటే, స్త్రీ జీవితకాల పరిమాణం 107 సంవత్సరాలుగా తేలుతున్నది. పనిచేస్తున్న స్త్రీల సంఖ్యా పరిమాణం, పురుషుల సంఖ్యా పరిమాణం కంటే తగ్గుతున్న కొలదీ వారి జీవితకాల పరిమాణం కూడా తగ్గుతూండటాన్ని ఆరవ పట్టికలోని సంఖ్యా వివరాలు చిత్రిస్తున్నాయి.

6వ పట్టిక
వేతనార్జనకు పనిచేస్తున్న స్త్రీ పురుషుల సంఖ్యా పరిమాణాలు - వారి జీవితకాల పరిమాణాలు

| ప్రాంతము | ఒకే వృత్తిలో నున్న ప్రతి వెయ్యిమంది పురుషులకూ ఉన్న స్త్రీల సంఖ్య | | పురుషుల జీవితకాల పరిమితి 100 సం॥లు అని అనుకున్నపుడు స్త్రీ జీవితకాల పరిమాణము (సం॥) | |
|---|---|---|---|---|
| | స్త్రీల సంఖ్య | ర్యాంకు | సంవత్సరాలు | ర్యాంకు |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 645 | 1 | 107 | 1 |
| తూర్పు ఆసియా, ఆగ్నేయ ఆసియా | 610 | 2 | 106 | 2 |
| పశ్చిమాసియా | 373 | 3 | 105 | 3 |
| దక్షిణాసియా | 336 | 4 | 99 | 5 |
| ఉత్తరాఫ్రికా | 158 | 5 | 104 | 4 |

*- ప్రొఫెసర్ అమార్త్య సేన్ వ్రాసిన జెండర్ అండ్ కో-ఆపరేటివ్ కాన్ఫ్లిక్ట్స్ (1987) అన్న వ్యాసం నుండి*

ఉదాహరణకు దక్షిణాసియా పరిస్థితిని చూడవచ్చు. ఒకే వృత్తిలో నున్న వారిలోని ప్రతి వెయ్యి మంది పురుషులకూ, స్త్రీలు 336 మంది చొప్పున మాత్రమే ఉన్నారు, వీరి జీవితకాల పరిమాణం కూడా తక్కువగానే (99 సంవత్సరాలుగా) ఉండటాన్ని చూడవచ్చు.

ఆసియా ఖండమంతటా పరిస్థితి ఇలాగే లేదు; ప్రాంతీయ బేధాలున్నాయి. ఈ ప్రాంతంలోని అభివృద్ధి చెందిన జపాన్, దక్షిణ కొరియా, సింగపూర్, మలేషియాలున్న తూర్పు, ఆగ్నేయ ప్రాంతాలలో ఒకే వృత్తిలో నున్న ప్రతి వెయ్యిమంది పురుషులకూ 610 మంది స్త్రీలున్నారు. ఈ ప్రాంతాలలోని పురుషుల జీవిత కాల పరిమాణం వంద సంవత్సరాలు అని అనుకొంటే స్త్రీ జీవితకాలం 106 సంవత్సరాలుగా కనుపిస్తున్నది వేతనార్జనతో స్త్రీల జీవితకాల పరిమాణం పెరుగుతుంది అని చెప్పటానికి ఇదొక్కటే కాక, ఇతర అంశాలు కూడా తోడ్పడతాయన్న విషయాన్ని ప్రొఫెసర్ సేన్ విస్మరించలేదు. దీనిని సాధారణ సూచికగా మాత్రమే వారు పేర్కొన్నారు. స్త్రీ సంక్షేమాన్ని సాంఘిక, సంప్రదాయ, సాంస్కృతికాంశాలు కూడా ప్రభావితం చేస్తాయన్న విషయాన్ని ఇంతకు పూర్వమే పేర్కొన్నాం.

వీరి సూత్రీకరణను భారతదేశపు పరిస్థితులకు అన్వయించి చూద్దాం మనదేశంలోని అన్ని రాష్ట్రాలకంటే పంజాబు సంపన్నమైనది. ఈ రాష్ట్ర జనాభాలో ప్రతి వెయ్యిమంది పురుషులకూ 832 మంది స్త్రీలు మాత్రమే ఉన్నారు. అంతేకాదు; స్త్రీలలో వేతనార్జనాపరుల పరిమాణం కూడా తక్కువగానే ఉన్నది (నూరింట ముగ్గురు స్త్రీలు మాత్రమే వేతనార్జనలో ఉన్నారు) జనాభాలో పురుషుల కంటే స్త్రీలు తక్కువగా ఉండటాన్ని బట్టి, పురుషుల కంటే స్త్రీలు తక్కువకాలం జీవిస్తున్నట్లు స్పష్టమవుతున్నది. (పురుషుల జీవితకాల పరిమాణం 67.5 సంవత్సరాలు; స్త్రీల జీవిత కాల పరిమాణం 65.4 సంవత్సరాలుగా 1990-1992లో నమోదైంది.) కుటుంబంలో నిర్ణయాత్మక పాత్ర లేని స్త్రీల సంక్షేమం ప్రమాదాలలో చిక్కటం సహజం. పోషణా, ఆరోగ్య రక్షణా, సంక్షేమ లోపాలు అకాల మృత్యువుకు ఆహ్వానాలు! పలువురు పరిశీలకుల సర్వేలు ఈ అంశాలను రుజువు చేశాయి.

## చైనా అనుభవాలు

స్త్రీల సంక్షేమానికి, సంపన్న దేశాలు కూడా చేయలేనంత కృషి చేసిన చైనా, అద్భుతమైన ఫలితాలను సాధించింది. 1979వ సంవత్సరంలో ఆర్థిక సంస్కరణలను ఆ దేశం చేబట్టిన తర్వాత స్త్రీల సంక్షేమం దెబ్బతిన నారంభించింది; స్త్రీ పురుష

7వ పట్టిక

వివిధ ప్రాంతాలలో మరణాలరేట్లు, జీవితకాల పరిమాణం

| వివరము | చైనా | భారతదేశం | కేరళ | దక్షిణ కొరియా | శ్రీలంక |
|---|---|---|---|---|---|
| శిశు మరణాలు (ప్రతి వెయ్యి జననాలకు) | | | | | |
| 1960 | 150 | 165 | 93 | 85 | 71 |
| 1981 | 37 | 110 | 37 | 33 | 43 |
| 1991 | 31 | 80 | 16 | 23 | 26 |
| 1981-1991 సం॥ల మధ్య మరణాల తగ్గుదల శాతం | 16 | 27 | 57 | 30 | 40 |
| జీవిత కాల పరిమాణం (సంవత్సరాలలో) | | | | | |
| 1960 | 47 1 | 44.0 | 50.3 | 53.9 | 62.0 |
| 1981 | 67.7 | 53.9 | 66.9 | 66 | 69 |
| 1991 | 69.3 | 59.2 | 71.5 | 70 | 71 |
| 1981-1991 సం॥ల మధ్యకాలంలో జీవితకాలపు పరిమాణపు పెరుగుదల (సం॥లలో) | 1.6 | 5.3 | 4.6 | 4 | 2 |

*- డ్రేజ్, సేన్‌ల ఇండియా · ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ ఆపర్చ్యునిటీ నుండి*

జనాభా వ్యత్యాసం కూడా పెరుగనారంభించింది. పౌరహక్కుల హరణం జరుగుతున్నదంటూ, చైనాలో ఆందోళన జరుగుతున్న విషయాన్ని పత్రికలు రిపోర్టు చేస్తున్నాయి; కాని స్త్రీ సంక్షేమం దెబ్బతింటున్నదంటూ స్త్రీలు ఆందోళనకు దిగినట్లు మాత్రం తెలియటం లేదు. ఇదొక సాంఘిక, రాజకీయ సమస్యగా ఇంకా పరిగణనకు రాలేదు. చాప క్రింది నీరులా విస్తరిస్తున్న ఈ సమస్యను కొంత మేరకు తడివి చూద్దాం.

చైనాలో కమ్యూనిష్టు విప్లవం జయప్రదమైన తర్వాత, లింగవివక్ష తొలగింపుకు ప్రభుత్వం దీక్షతో పనిచేసింది. "ఆకాశంలో సగభాగానికి స్త్రీలే ఆధారం" అన్న నినాదానుసారం, పురుషులతో సమానమైన హక్కులను స్త్రీలకు ఇవ్వటానికి ప్రభుత్వం కృషి చేసింది. ఉంపుడుగత్తెల విధానాన్ని రద్దు చేశారు; స్త్రీలకు రాజ్యాంగబద్ధమైన హక్కుల నిచ్చారు. "రాజకీయాలలోనూ, ఆర్థికరంగంలోనూ, సాంస్కృతిక, సాంఘిక, కుటుంబ విషయాలలో పురుషులతో సమానమైన హక్కులు స్త్రీలకున్నాయి" అనిచైనా రాజ్యాంగ చట్టం పేర్కొంటున్నది లింగ వివక్షా తొలగింపుకు ప్రభుత్వం కృతనిశ్చయంతో పనిచేసింది.

ఇందువల్ల రాజకీయరంగంలోనూ ఆర్థిక రంగంలోనూ స్త్రీలకు సముచిత పాత్ర లభించింది. వేతనార్జనా వృత్తులలో స్త్రీల ప్రవేశం పెరిగింది. కుటుంబంలో పురుషునితో సమానమైన స్థానం స్త్రీలకు లభించింది. గ్రామాలకు కూడా వైద్య చికిత్సా సదుపాయాలు విస్తరించాయి. పోషణా నాణ్యత పెరిగింది. ఈ కృషి ఫలితంగా స్త్రీల జీవితకాల పరిమాణం పెరిగింది. 1979వ సంవత్సరంలో చైనా ఆర్థిక సంస్కరణా పథాన్నిపట్టే నాటికి, అది పలు సంపన్న దేశాలకంటే కూడా స్త్రీ జన సంక్షేమ సాధనలో ముందున్నది.

ఆర్థిక సంస్కరణల అమలు ప్రారంభమైన తర్వాత, స్త్రీజన సంక్షేమం నీరసించసాగింది. యనభయ్యావ దశాబ్దంలోనే, పురుషుల జీవితకాల పరిమాణంకంటే, స్త్రీల జీవితకాల పరిమాణం తగ్గింది. చైనా వ్యవసాయోత్పత్తి శరవేగంతో పెరుగ నారంభించింది. చూపరులకు ఆశ్చర్యం కలిగించే రేటున దేశ ఆర్థికాభివృద్ధి సాధన జరిగింది. ఇంతటి ఆర్థికాభివృద్ధి జరుగుతున్న కాలంలో స్త్రీజన సంక్షేమం నీరసించటం

గమనించదగిన అంశం.

చైనా ప్రభుత్వ నాయకత్వం, దేశ ఆర్థికాభివృద్ధికిస్తున్న ప్రాముఖ్యాన్ని స్త్రీల సంక్షేమానికి ఇస్తున్నట్లు లేదని భావించవలసి వస్తున్నది. పాశ్చాత్య నిపుణులొకరు ఈ స్థితిని "వాయిదా పడిన విప్లవం"గా వర్ణించారు! ఈ పరిస్థితికి దారితీసిన కారణాలేమిటో చూద్దాం.

1979వ సంవత్సరం నుండి, చైనా ప్రభుత్వం కుటుంబ నియంత్రణను కట్టుదిట్టంగా అమలు జరుపనారంభించింది. దంపతులు ఒక్క బిడ్డను మాత్రమే కనాలి అని ప్రభుత్వం ఆదేశించింది. మన దేశంలో వలె చైనాలోనూ మగపిల్లల మీద మోజు అధికంగా ఉన్నది. కనుక, కనే ఒక బిడ్డ మగవాడుకావాలని తల్లిదండ్రులు కోరటం ఆశ్చర్యకరమైన అంశం కాదు ఇందువల్ల ఆడపిల్లలు అనాదరణకు గురయ్యే ప్రమాదం ఏర్పడింది. గర్భస్థ శిశువు ఆడపిల్లని పరీక్షలో తేలితే, దొంగ చాటుగా గర్భస్రావానికి పూనుకోవటం, పుట్టినది ఆడపిల్లయితే పురిటిలోనే బిడ్డను చంపటం వంటివి సంభవిస్తున్నట్లు రిపోర్టు లొస్తున్నాయి. శిశు మరణాలలో ఆడపిల్లల మరణాలు అధికంగా ఉండటం అనేది, ఆర్థిక సంస్కరణలు ప్రారంభమైన తర్వాతే కనుపించనారంభించింది. 1978వ సంవత్సరంలో పుట్టిన ప్రతి వెయ్యిమంది ఆడపిల్లలకు 38 మంది చొప్పున మరణిస్తుండేవారు; ఈ పరిమాణం 1984వ సంవత్సరం నాటికి 67కు పెరిగింది !

ఆర్థిక సంస్కరణల అమలును చేబట్టిన తర్వాత నష్టపడిన ఒక రంగము ప్రజారోగ్యము-వైద్యచికిత్స వ్యవసాయ కమ్యూన్లు పనిచేస్తున్న కాలంలో ఈ రంగానికి కొంచెం ఎక్కువ నిధులను ఖర్చు చేస్తూండేవారు. కమ్యూన్లు అంతరించి, "స్వంత బాధ్యత మీద వ్యవసాయ" విధానం ఆరంభమైన తర్వాత, ఈ ప్రజా సంక్షేమ కార్యక్రమానికి నిధుల కొరత ఏర్పడింది. కమ్యూన్ విధానవు వ్యవసాయం వల్ల వ్యవసాయోత్పత్తి గణనీయంగా పెరుగకపోయినా, ప్రజలకు సుపోషణా, ఆరోగ్య రక్షణా వసతులుండేవి. వైద్య చికిత్సా సదుపాయాల తగ్గుదల వల్ల స్త్రీ పురుషులిద్దరకూ సమాననష్టం జరుగుతుందనేది సాధారణ అభిప్రాయం. ఇది యదార్థంగాదు; భ్రమ మాత్రమే. ఈ లోపం వల్ల అధికంగా నష్టపోయేది స్త్రీలు-పసిపిల్లలు. ఈ విషయం మీద కూడా ఆర్థిక, సాంస్కృతిక, సంప్రదాయ ప్రభావం ఉంటుందనే అంశాన్ని మనం మరువకూడదు

"స్వంత బాధ్యత మీద" జరిగే వ్యవసాయంలో, స్త్రీల వేతనార్జనావకాశాలు తగ్గిపోతున్నాయి సంప్రదాయ మహిళలవలె "ఇల్లాండ్రుగా" వీరు మనవలసి వస్తున్నది. ఆర్థిక రూప సంపాదనను కోల్పోయి "సంపాదించి తెచ్చే" భర్త మీద ఆధారపడవలసి వస్తున్నది. దీనితో చస్తున్నదనుకొన్న పురుషాధిక్యత తిరిగి ప్రాణం పోసుకో నారంభించింది. ఆర్థికపరమైన సంపాదన తేలేకపోవటంచేత కుటుంబంలో స్త్రీ స్థానం బలహీన పడటం ప్రారంభమైంది. కుటుంబ వనరుల వినియోగంలో లింగవివక్షా ప్రదర్శనకు అవకాశాలు ఏర్పడ్డాయి. పారిశ్రామిక రంగం, గ్రామీణ మహిళల కందరకూ ఉపాధినిచ్చే దశకు రాలేదు. కొన్ని ప్రాంతాల వారికి మాత్రమే దానివల్ల ఉపాధి ప్రయోజనం లభించింది. అసంఖ్యాక గ్రామీణ మహిళలకు వేతనార్జనావకాశాలు సన్నగిలాయి. ఈ పరిస్థితులు లింగవివక్షా తీవ్రతకు తోడ్పడుతున్నాయి.

కమ్యూన్లు అంతరించటంవలన వయసు మళ్ళిన వారి సంక్షేమం దెబ్బతిన్నది. లేవలేని స్థితిలో పోషించటానికి, సేవలు చేయటానికి, లేక చేయించటానికి, సంపాదనాపరుడైన పుత్రులను తల్లిదండ్రులు ఇందుకే కోరుకొంటారు. పైన పేర్కొన్న పరిణామం వలన పుత్ర సంతానం మీద మోజు పెరిగింది. దీనివల్ల స్త్రీ శిశువుల యెడల అనాదరణా ప్రదర్శన అధికమైంది.

ఆర్థికాభివృద్ధి తనంతతానుగా స్త్రీ జనోద్ధరణ కుపకరించదు. ఇందుకు ప్రత్యేక శ్రద్ధాసక్తుల ప్రదర్శన అవసరమని చైనా అనుభవం కూడా రుజువు చేస్తున్నది.

## స్త్రీ జనోద్ధరణతో ముడివడిన ఆర్థిక, సాంస్కృతికాంశాలు

ప్రపంచంలోని విస్తృత ప్రాంతంలో లింగవివక్ష, స్త్రీల మనుగడను ఎలా దెబ్బదీస్తున్నదో చూచాం. ఇందుకు గల కారణాలను విచారించేటపుడు మనం ఆర్థిక, సాంస్కృతిక, సంప్రదాయాంశాల మధ్యనున్న అవినాభావ సంబంధాన్ని విస్మరించకూడదు. లింగ వివక్షను, తూర్పు, పశ్చిమ దేశాల మధ్యనున్న సంప్రదాయ భేదంగానో, లేక దేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందటం, అభివృద్ధి చెందకపోవటం వంటి భేదంగానో భావించకూడదు. ఈ రకమైన చర్చలు మనను

8వ పట్టిక

భారతదేశము, చైనా, కేరళలలో అక్షరాస్యతా పరిమాణాలు

| దేశము లేక రాష్ట్రము | అక్షరాస్యుల శాతం 1981-82 | | | | అక్షరాస్యుల శాతం 1990-91 | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 15 సం॥ల వయసును మించిన వారు | | 15-19 సం॥ల మధ్య వయస్కులు | | 15 సం॥ల వయసును మించిన వారు | | 15-19 సం॥ల మధ్య వయస్కులు | |
| | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు |
| భారతదేశం | 26 | 55 | 43 | 66 | 39 | 64 | 52 | 74 |
| చైనా | 51 | 79 | 85 | 96 | 68 | 87 | 92 | 97 |
| కేరళ | 71 | 86 | 92 | 95 | 86 | 94 | 98 | 98 |

*- డ్రేజ్, సేన్ల "ఇండియా : ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ అపర్చ్యునిటీ" నుండి*

పరిష్కారమార్గానికి దూరం చేస్తాయి. సమాజంలోనూ, కుటుంబంలోనూ స్త్రీ స్థానాన్ని బలపరచేవి, వారి అక్షరాస్యత, వేతనార్జనాశక్తి వీటిని మనం ఆర్థిక, సాంస్కృతికాంశాలతో జోడించి చూడాలి.

స్త్రీ వేతనార్జనాశక్తికి, ఆవిడ మనుగడకు సంబంధం ఉన్నది అని చెబుతున్న దానిని, అతి సాధారణమైన జనన మరణాల సమస్యగా మాత్రమే పరిగణించకూడదు. ఇలా చూచినపుడు, స్త్రీ పురుష జనాభా పరిమాణ భేదాలకు కారణం ఆర్థికంగా కనుపిస్తుంది. ఇది ఒక్క ఆర్థికాంశానికి సంబంధించిన విషయం కాదని పైన చెప్పాం. ఉత్తర ఆఫ్రికా దేశాలలోకంటే సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలలో స్త్రీలు అధిక సంఖ్యలో వేతనార్జనకు వెళుతున్నారు. లేదా కుటుంబ పోషణకు అవసరమైన వ్యవసాయోత్పత్తిలో నిర్ణయాత్మక పాత్రను నిర్వహిస్తున్నారు. దక్షిణ ఆసియా, పశ్చిమాసియా దేశాలలో కంటే ఆగ్నేయ ఆసియా, తూర్పు ఆసియా దేశాలలో స్త్రీలు అధిక సంఖ్యలో వేతనార్జనకు వెళుతున్నారు. ఈ తేడాలకు కారణం - సాంస్కృతిక, మత సంప్రదాయాలు, కుటుంబ వనరులలో స్త్రీల వినియోగానికి లభించేవాటా, కుటుంబంలో ఆవిడ స్థానము, కుటుంబాదాయానికి ఆవిడ తెస్తున్న సంపాదన, తన సంపాదన కూడా పురుషుని సంపాదన వంటిదేనని గుర్తించగలిగిన ఆవిడ పరిజ్ఞానము, తన స్థాన రక్షణాసక్తి, అందుకు అవసరమైన దీక్ష - వీటన్నిటి మీద ఆధారపడి ఉంటుంది. ఇందువల్ల, స్త్రీల వేతనార్జన అనే ఆర్థికాంశాన్ని, సాంఘిక, సాంస్కృతికాంశాలతో జోడించి చూస్తే తప్ప, స్త్రీజన విముక్తి సమస్యల లోతులు తెలియవు.

భౌగోళిక లేక మండల ప్రాతిపదిక మీద లింగ వివక్ష నుండి స్త్రీల విముక్తి సమస్యను పరిశీలించటానికే, ఆర్థిక, సాంస్కృతికాంశాలను జోడించి చూడాలని భావించనవసరం లేదు. ఒక దేశాన్ని తీసుకొన్నా, లేక దేశంలోని ఒక ప్రాంతాన్ని తీసుకొన్నా, లేదా ఒక కులాన్ని, తెగను, వర్గాన్ని తీసుకొన్నా మన పరిశీలనాదృష్టి ఇలాగే ఉండాలి. ఒక సమాజంలో మనుగడ సాగించే మానవులకు, ఆర్థిక జీవనమని, సాంస్కృతిక జీవనమని రెండు రకాల జీవన విధానం ఉండదు. ఈ రెంటిని విడదీసి చూడటానికి వీలులేదు. ఇవి రెండూ పరస్పర ఆధారభూతాలు. అనారోగ్యం విషయంలో గాని, మరణాలరేటు విషయంలో గాని ఉన్న భేదాల పరిశీలనకు కూడా ఆర్థిక, సాంస్కృతికాంశాల జోడింపు అవసరం. ఇవి రెండూ విడదీయ వీలులేనివి.

స్త్రీల మనుగడకు తోడ్పడుతున్న వేతనార్జన అనే ఆర్థికాంశానికే ప్రాధాన్యతనిస్తూ, కుటుంబంలో స్త్రీ స్థాన భద్రతా సమస్య పరిశీలన జరిగింది. స్త్రీల మనుగడకూ, భద్రతకూ తోడ్పడే ముఖ్యాంశాలలో ఇది ఒక్కటి మాత్రమే. విద్య, ఆర్థిక, ఆస్థి హక్కులు కూడా ఇంత ముఖ్యమైన అంశాలే.

వీటి ప్రభావ పరిశీలనకు మనం కేరళ అనుభవాన్ని

చూద్దాం ఇంతకు పూర్వమే కేరళ విషయ ప్రస్తావన జరిగింది పురుష జనాభా కంటే స్త్రీ జనాభా అధికంగా ఉండటం ఈ రాష్ట్రపు ప్రత్యేకత. అంతేకాదు, ఈ ఆధిక్యత అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలకు దాపులో ఉన్నది. యూరపులో వందమంది పురుషులకు, స్త్రీలు 105 మంది చొప్పున ఉన్నారు; కేరళలో 103 మంది చొప్పున ఉన్నారు (చైనా, పశ్చిమాసియా, భారతదేశాలలో వందమంది పురుషులకు 94 మంది చొప్పున మాత్రమే స్త్రీలున్నారు.) 1981వ సంవత్సరానికే స్త్రీ జీవితకాల పరిమాణం 68 సంవత్సరాలకు చేరింది; పురుషుల జీవిత కాల పరిమాణం కంటే ఇది 4 సంవత్సరాలు అధికం 1990-92 సంవత్సరాల మధ్య కాలానికి స్త్రీ జీవితకాల పరిమాణం 74 4 సంవత్సరాలకు, పురుషుల జీవితకాల పరిమాణం 68.8 సంవత్సరాలకు చేరింది. కేరళలో వేతనార్జనలో నున్న స్త్రీల సంఖ్యా పరిమాణం అంత తక్కువగా లేదు. పంజాబులో కంటే చాలా ఎక్కువగా నున్నట్లు చెప్పవచ్చుగాని, భారతదేశంలోని ఇతర రాష్ట్రాలన్నింటి కంటే తక్కువగా నున్నట్లు చెప్పటానికి వీలులేదు. అక్షరాస్యతా విషయంలో కేరళను తప్పకుండా చెప్పవలసి ఉంటుంది. ఈ విషయంలో భారతదేశంలోని అన్ని రాష్ట్రాలకంటే, చైనా కంటే కూడా కేరళ ముందున్నది. మహిళల అక్షరాస్యతా పెంపు విషయంలో చైనాను కూడా మించిపోయింది. (8వ పట్టికను చూడండి)

కేరళ రాష్ట్రం తిరువాన్కూరు - కొచ్చిన్ సంస్థాన ప్రాంతాలతో అవతరించిన విషయం పాఠకులకు తెలుసు తిరువాన్కూరు-కొచ్చిన్ రాజ్యాధీశులు పంథొమ్మిదవ శతాబ్ద ప్రారంభకాలం నుండే ప్రజలలో విద్యావ్యాప్తికి కృషి చేయ నారంభించారు. ఈ ప్రాంతాన్నేలిన రాణి గౌరి పార్వతీబాయి 1817వ సంవత్సరంలో జారీ చేసిన రాజపత్రంలో ఇలా ఆదేశించారు : "ప్రజల వెనుకబాటు తనం అంతరించి వారు విజ్ఞానవంతులు గావటం అవసరం. ఇందుకు విద్యావ్యాప్తి జరగాలి. విద్యావ్యాప్తి వలన ప్రజలు ఉత్తమ పౌరులుగా రూపొందుతారు; సమర్థులయిన ఉద్యోగులు ప్రభుత్వానికి లభిస్తారు. తద్వారా రాజ్యం ప్రతిష్ఠాత్మకమైన పురోగతిని సాధిస్తుంది కనుక విద్యావ్యాప్తి కయ్యే ఖర్చు నంతటినీ ప్రభుత్వం భరిస్తుంది" రాచరికపు పట్టుదల వలన కేరళలో విద్యావ్యాప్తి ఇతర ప్రాంతాలలో కంటే అధికంగా జరిగింది. దీనివలన స్త్రీలు కూడా లాభించారు.

ఇంతేకాదు; కేరళలోని కొన్ని ప్రాంతాలలో వారసత్వపు ఆస్థిహక్కులు స్త్రీలకు సంక్రమింపజేయగల ఆచారమున్నది దీనికి తోడు ఈ రాష్ట్రంలో గ్రామ ప్రాంతాలకు కూడా వైద్య చికిత్సా వసతులు విస్తరించాయి దీనివలన కూడా స్త్రీలు లాభించారు ఈ పరిణామాలలో ఏది ఎంత మేరకు లింగవివక్ష నుండి స్త్రీని విముక్తి చేయగలిగింది అని స్పష్టంగా చెప్పటం కష్టమే. కాని ఈ వసతుల విస్మరణ వలన కంటే వీటి పరిగణన వలననే ఈ సమస్యా పరిశీలనకు సమగ్రత చేకూరుతుంది. కనుక ఈ అంశాలనన్నిటినీ పరిగణనకు తీసుకోవటం అవసరం.

ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని సువిశాల ప్రాంతాలలో స్త్రీలు తీవ్రమైన లింగవివక్షననుభవిస్తున్నారు. ఇందువల్ల వారి మనుగడకే ప్రమాదం ఏర్పడింది. వీరి విముక్తి జటిలమైన సమస్యగా రూపొందింది దీనికి పరిష్కార మార్గాలను వెదికేటపుడు ఈ అంశాలన్నిటి పరిశీలన అవసరం. స్త్రీలకు, పురుషులకూ సమానమైన పోషణ, ఆరోగ్య రక్షణ, సాంఘిక సంక్షేమ వసతులు లభిస్తూ, పురుషులతో సమానమైన స్థానం స్త్రీలకు (కుటుంబంలోనూ, సమాజంలోనూ) లభించినపుడు, కోట్లాదిమంది మహిళల "అదృశ్యం" జరుగనవసరం లేదు. దురదృష్టవశాత్తు ఇలాంటి అనుకూల పరిస్థితులు స్త్రీలకు లభించకపోవటం చేతనే కోట్లాది మంది స్త్రీలు అకాల మరణం పాలవుతున్నారు.

స్త్రీ తన జీవితంలోని పలు దశలలో అత్యంత ప్రమాదకరమైన పరిస్థితుల నెదుర్కొనవలసి వస్తున్నది. ఆవిడను మృత్యువు జీవితాంతం వెన్నాడుతున్నట్లే కనుపిస్తుంది. ఇది చాలదన్నట్లు లింగవివక్ష కూడా ఆవిడను జీవితాంతం వెన్నాడుతున్నది. ఇందువల్ల కోట్లాది మంది స్త్రీలు అకాలమరణం పాలవుతున్నారు.

# 4

## మృత్యునీడలో జీవనయాత్ర

స్త్రీల జీవిత కాల పరిమాణం పురుషుల కంటే ఎక్కువగా ఉండటాన్ని చూచి, పురుషులకంటే వారు ఆరోగ్యవంతులని అనుకొంటుంటాం. ఇది భ్రమ మాత్రమే. ఇటీవలె రాండ్ కార్పొరేషన్ నిర్వహించిన సర్వే, పురుషుల కంటే స్త్రీలు అధిక అనారోగ్యంతో బాధపడుతున్నట్లు, దానివల్ల జీవితాంతం వారు శక్తిహీనతకు లోనవుతున్నట్లు రుజువుచేసింది. ఈ సర్వే బంగ్లాదేశ్, జమైకా, మలేషియా, అమెరికాలలో జరిగింది. అనారోగ్యానికి సంబంధించిన శారీరక బాధలు పురుషులకంటే స్త్రీలకే అధికమని కూడా ఈ సర్వే సూచించింది. స్త్రీల జీవితారంభంలోనే అంకురించే అనారోగ్య సమస్యలు వృద్ధాప్యంలో కూడా వారిని విడిచిపెట్టవు.

ప్రపంచబ్యాంకు ప్రచురించిన 1993వ సంవత్సరపు వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు, అనారోగ్య కారణంగా వ్యక్తులు శక్తి హీనతను పొందటం, అకాల మరణం వలన నష్టమవుతున్న జీవితకాలాన్ని అంచనావేసే ప్రయత్నాన్ని చేసింది. దీన్ని "రోగభారపు అంచనా"గా ఆ సంస్థ నిపుణులు పేర్కొన్నారు. అకాల మరణాల వల్ల పురుషుల జీవిత కాలం అధికంగా నష్టమవుతూ ఉంటే, స్త్రీల జీవితకాలం, అనారోగ్యం వల్ల సంక్రమించే అశక్తత వల్ల ఎక్కువగా నష్టమవుతున్నట్లు ఈ అంచనాలు తెలుపుతున్నాయి. అనారోగ్యంతో పురుషులకంటే అధికంగా స్త్రీలు బాధపడుతూ ఉండటాన్ని కూడా ఈ రిపోర్టు ప్రచురించిన సంఖ్యా వివరాలు సూచిస్తున్నాయి. (వాటిని ఈ అధ్యాయంలో ఒకటవ పట్టికగా ఇచ్చాం) పురుషుల కంటే స్త్రీలు అనారోగ్యాన్ని అధికంగా అనుభవిస్తూ ఉండటం, అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందుతున్న, లేక వెనుకబడిన అన్న బేధం లేకుండా, అన్ని దేశాలలోనూ, అన్ని ప్రాంతాలలోనూ తరతమ బేధాలతో కనుపిస్తున్నది.

అభివృద్ధి చెందిన దేశాలలోని పదిహేను - నలభై నాలుగు సంవత్సరాల మధ్య వయసు స్త్రీల జీవిత కాలంలో మూడవవంతు మేరకు చూలు - కాన్పులకు సంబంధించిన రోగాల వల్లే నష్టమవుతున్నట్లు అంచనా వేశారు. (చూలు-కాన్పుల సందర్భంలో ఎదురయ్యే అనారోగ్య సమస్యలు, సెక్సు సంపర్కం వల్ల సంక్రమించే సుఖవ్యాధులు, ఎయిడ్స్, జననాంగాలకు, మూత్రాశయానికి వచ్చే రోగాలు, ఈ రోగ భారానికి కారణాలవుతున్నాయి.) స్త్రీలు అనుభవించవలసి వచ్చే శారీరక, మానసిక హింసలవల్లా, మానభంగాలకు

గురికావటంవల్లా మరొక ఐదు శాతపు జీవితకాలం హరించుకుపోతున్నది. ప్రధానంగా స్త్రీలకు మాత్రమే వచ్చే రోగాలవల్ల, నలభయ్యైదు - యాభై తొమ్మిది సంవత్సరాల మధ్య వయసు స్త్రీలు, రోగభారం వల్ల నష్టమవుతున్న మొత్తం జీవితకాలంలోని ఐదవవంతును నష్టపోతున్నట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు అంచనావేసింది.

స్త్రీల ఆరోగ్యం మీద జీవశాస్త్ర సంబంధమైన కారణాలో, సాంఘిక కారణాలో, వారి జీవిత కాల మంతటా, తమ ప్రభావాన్ని చూపుతున్నాయి. ఒక అనారోగ్య కారణం మరొక అనారోగ్యం రావటానికీ, లేక అప్పటికే అనుభవిస్తున్న రోగాన్ని తీవ్రతరం చేయటానికీ ఉపకరిస్తూంటుంది. ఈ పరిణామం దాదాపు స్త్రీ జీవిత కాలమంతా సంభవిస్తూండటంవల్ల, ఆవిడ జీవనం నరకప్రాయమవుతున్నది. బాల్యంలో పోషణాలోపాన్ని అనుభవించిన ఆడపిల్లలలో శరీరపు

ఒకటవ పట్టిక

అనారోగ్యంవల్ల సంక్రమించిన శక్తిహీనత, అకాల మరణాలవల్ల ప్రతి వెయ్యిమంది స్త్రీ, పురుషుల జీవితకాల నష్టపరిమాణాలు

| ప్రాంతము | నష్టమవుతున్న మొత్తం కాలము (సం॥) | | అనారోగ్యంవల్ల నష్టమవుతున్న కాలం (సం॥) | | అకాల మరణం వల్ల నష్టమవుతున్న కాలము (సం॥) | |
|---|---|---|---|---|---|---|
| | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 36 | 36 | 15 | 10 | 21 | 26 |
| ఆసియా | 89 | 86 | 46 | 35 | 43 | 51 |
| మధ్యప్రాచ్యం | 15 | 15 | 7 | 5 | 8 | 10 |
| లాటిన్ అమెరికా | 16 | 21 | 8 | 5 | 8 | 16 |
| మాజీ సోషలిస్టు దేశాలు (యూరపులోనివి) | 6 | 11 | 4 | 3 | 2 | 8 |
| అభివృద్ధి చెందిన దేశాలు | 11 | 16 | 6 | 5 | 5 | 11 |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | 155 | 158 | 77 | 64 | 78 | 94 |

*- వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1993లోని సమాచారం ఆధారంతో ఈ పట్టిక రూపొందింది.*

గమనిక : 1. 1990వ సంవత్సరపు అంచనాల ప్రాతిపదిక మీద ఈ సంఖ్యా వివరాలను రూపొందించారు.

2. స్త్రీ, పురుష జనాభాలోని 15-44 సంవత్సరాల మధ్య వయసుగలవారిని పరిగణనకు తీసుకున్నారు.

3 స్త్రీల జీవితకాలం అనారోగ్యంవల్ల సంక్రమించిన అశక్తతకు అధికంగా ఎరవుతూ ఉంటే, పురుషుల జీవితకాలం అకాల మరణాలవల్ల అధికంగా నష్టమవుతుండటాన్ని గమనించవచ్చు.

పెరుగుదల ఆరోగ్య సూత్రాలు సూచించి నట్లుండదు. శరీరం గిడసబారిపోతుంది. ఈ లోపంవల్ల, ఆవిడ పెరిగి, చూలాలయినపుడు, కాన్పు కష్టమవుతుంది. మర్మాంగపు వక్రీకరణకు జరిగే ఆపరేషన్‌కు (దీనిని జెనిటల్ మ్యూటిలేషన్‌గా ఇంగ్లీషులో వ్యవహరిస్తున్నారు) గురయిన బాలిక, తన జీవితాంతం, శారీరక అనారోగ్యానికి, మానసిక వ్యథకూ, శారీరక బాధకూ, గురిగావలసి వస్తుంది. శైశవావస్థ నుండి వృద్ధాప్యం వరకూ ఉన్న పలుదశలలోనూ, పలురకాల అనారోగ్యాన్ని, పోషణా లోపాన్ని స్త్రీ అనుభవించవలసి వస్తున్నది. గర్భస్థదశ నుండీ, కాటికిపోయే వరకూ స్త్రీ, మృత్యునీడలో పయనిస్తూండటం మనకు కనుపిస్తుంది. కంట కావృతమైన ఆవిడ జీవితంలోని వివిధ దశలలోనూ అనుభవించే బాధలను, ఎదుర్కొనవలసి ఉండే ప్రమాదాలనూ పరిశీలించుదాం.

### శైశవ, బాల్యదశలలో....

ఆడపిల్లలకు, పసితనంలో మగపిల్లలతో సమానమైన పోషణ, నైపుణ్యమైన వైద్య చికిత్స సకాలంలో లభించినపుడు, వారు బాల్యాన్ని దాటి బ్రతికే అవకాశాలు అధికంగా ఉంటాయి. పసితనాన్ని దాటి బ్రతికేశక్తి బాలురలో కంటే బాలికలలో అధికంగా ఉంటుంది. ఇది ప్రకృతి సిద్ధంగా బాలికలకు లభించిన శక్తి. పోషణ, ఆరోగ్యరక్షణ విషయాలలో ఆడపిల్లలు అనాదరణకు గురయినపుడు, (బాలురతో సమానంగా ఇవి లభించనపుడు) చనిపోయే బాలికల సంఖ్య బాలురకంటే అధికంగా ఉంటుంది. ఈ విషయ నిర్ధారణకు ఇటీవలె ఇరవై తొమ్మిది దేశాలలో సర్వేలు జరిగాయి. వీటిలోని పదిహేడు దేశాలలో, నాలుగు సంవత్సరాలలోపు బాలికల మరణాలరేటు, బాలుర మరణాలరేటు కంటే అధికంగా ఉన్నట్లు రుజువైంది. అభివృద్ధి చెందిన దేశాలయిన అమెరికా, నార్వే, స్విట్జర్లండులలో ఇందుకు భిన్నమైన పరిస్థితులున్నాయి. బాలుర మరణాలరేటు బాలికల మరణాల రేటు కంటే అధికంగా ఉంది. బాలురతో సమానమైన పోషణ, ఆరోగ్య రక్షణ లభిస్తే, బాలుర కంటే బాలికలే బాల్యదశను దాటి బ్రతికే అవకాశాలు అధికమని ఈ దేశాల అనుభవం నిరూపిస్తున్నది.

కొన్ని దేశాలలో బాలురకున్న విలువ బాలికల కుండటం లేదు. ఇటువంటి పరిస్థితులలో బాలికలను పాఠశాలలకు పంపరు; పంపినా త్వరలోనే చదువు మాన్పిస్తారు. పొయ్యి కిందకు పుల్లలేరుకురావటం, నీరు తేవటం, ఇంట్లో తమ కంటే చిన్న పిల్లల అవసరాలను తీర్చటం లేదా గొడ్లను కాయబోవటం వంటి, వారి శక్తికి మించిన పనులను చేయవలసి ఉంటుంది. వయసుకు మించిన పనులను చేయవలసి రావటం, కుటుంబంలో బాలురతో సమానమైన విలువలేకుండా పోవటంవల్ల, బాలుర కంటే బాలికలు త్వరగా రోగగ్రస్తులయ్యే అవకాశాలు అధికంగా ఉంటాయి.

అభివృద్ధి చెందుతున్న పలుదేశాలలో, మగపిల్లల కంటే ఆడపిల్లకే అధికంగా మరణించే అవకాశాలున్నట్లు ఇటీవలి పరిశీలనలు రుజువు చేశాయి. ఇందుకు ఒక కారణం తక్షణమే అవసరమైన వైద్యాన్ని వీరికి చేయించకపోవటం. కొలంబియాలో జరిగిన ఒక సర్వేలో జ్వరానికి, ఊపిరితిత్తులకు సంబంధించిన రోగాల చికిత్సకు వైద్యశాలకు తీసుకుపోయిన పిల్లలలో, బాలికలకంటే బాలురు 12-13 శాతం అధికంగా ఉన్నారు. దక్షిణాసియా దేశాలలోనూ, ఇతర దేశాలలోనూ జరిగిన సర్వేలలో కూడా వైద్య చికిత్సలో బాలికలు వివక్షకు గురవుతున్నట్లు రుజువైంది

బాలికలు పోషణ, ఆరోగ్యరక్షణా విషయాలలో వివక్షకు గురవుతూ ఉండటమేగాదు; హింసకు, సంప్రదాయం పేరిట జరిగే దుర్మార్గాలకూ ఎరవుతున్నారు. కొన్ని దేశాలలో ఆడపిల్లలు యోని వక్రీకరణకు దారిదీసే బలవంతపు కోతకు గురవుతున్నారు. పలురకాల హింసకు, దెబ్బలకూ గురవుతున్నారు. ఇలాంటి దుర్మార్గాల వల్ల మరణం సంభవిస్తే, దాన్ని "ఆత్మహత్య"గా చిత్రిస్తున్నారు. కొన్ని సందర్భాలలో వీరికి బాల్య వివాహాలు తప్పటం లేదు. మరికొందరు విధి లేకనో, మోసపోవటం చేతనో వేశ్యావాటికలను చేరుతున్నారు. ఇందువల్ల బాలికలు చదువుకొనే అవకాశం లేకుండా పోతున్నది. ముక్కు పచ్చలారని దశలోనే పునరుత్పత్తికి సంబంధించిన రోగాలకు ఎరగావలసి వస్తున్నది. శారీరక హింసను తప్పించుకొన్నామనుకొన్న వారికి ఆ ఆనందం ఎంతో కాలం నిలవటం లేదు. మానసిక హింసకు, అవమానాలకు గురవుతున్నారు. కుటుంబీకులే వీరిని పనికిమాలిన వారుగాను, బాలురకంటే హీనులుగానూ చూస్తున్నారు. అవసరమైన పోషణ, ఆరోగ్యరక్షణ లోపిస్తున్నది, మానసిక హింసనూ, శారీరక హింసనూ బాల్యదశలోనే బాలికలు అనుభవించవలసి వస్తున్నది. ఈ బాధల ఫలితం జీవితాంతం వారిని వేధించే అవకాశాలున్నాయి. వీరు నీతి బాహ్యమైన ప్రవర్తనకు లోనయ్యే ప్రమాదం కూడా ఉంటుంది. మాదక ద్రవ్యాల వాడుకకు దాసులుగా కూడా వీరు మారవచ్చు.

### శైశవ దశలోనే లింగ వివక్ష

స్త్రీ యెడల ప్రదర్శితమయ్యే లింగవివక్ష శైశవదశలోనే ప్రారంభమవుతుంది. కొన్ని దేశాలలో తల్లులు ఆడపిల్లల కంటే మగపిల్లలకే ఎక్కువ సార్లు, ఎక్కువ రోజులు చనుబాల నిస్తారు. "అయ్యో ఆడపిల్ల పుట్టిందే! మగవాణ్ణి త్వరగా కనాలి" అనే తాపత్రయంతో, త్వరగా గర్భవతి గావటానికి పిల్లకు చనుబాల నివ్వటాన్ని కొందరు తల్లులు మానేస్తారు. ఇందువల్ల పుట్టిన ఆడపిల్లకు పోషణా లోపం ఏర్పడుతుంది. మరికొన్ని దేశాలలో పోషణలో తల్లులు పక్షపాతాన్ని చూపెడతారు. మగపిల్లలకు

పెట్టినదానికన్న తక్కువ ఆహారాన్ని ఆడపిల్లలకు పెడతారు.

పోషక విలువలున్న పదార్థాలను ఆడపిల్లల కంటే మగపిల్లలకు ఎక్కువ పెడతారు. ఇందువల్ల, పెరిగే దశలో ఆడపిల్లలు పోషణాలోపానికి గురవుతారు.

పోషణాలోపానికి పిల్లలు గురయినపుడు అంటు రోగాలు, ఇతర వ్యాధులు సులభంగా వస్తాయి. పెరుగుదల మందగిస్తుంది. వయసుకు తగిన శారీరక అభివృద్ధి సంభవించదు. పెరుగుదల మూడు సంవత్సరాల వయసు లోపల మందగిస్తే అటు తర్వాత ఎంత మంచి పోషణను ఇచ్చినా, ఆ లోప సవరణ జరుగదు. శరీరపెరుగుదల వయస్సుకు దగిన పరిమాణంలో లేని స్త్రీలు, పిన్న వయసులోనే గర్భవతులు గావటం, దానికి తోడు, చూలుకాలంలో పెరుగవలసినంత బరువు పెరుగకపోవటం కూడా జరిగితే, ప్రసవ సమయంలో శిశువు బయటకు రావటం కష్టమవుతుంది. పుట్టిన బిడ్డ చనిపోయే అవకాశాలు కూడా అధికంగా ఉంటాయి.

## గర్భస్థదశలోనే ప్రాణ గండం

కొన్ని దేశాలలో మగపిల్లలకు అత్యధిక ప్రాధాన్యత లభిస్తున్నది. పుట్టబోయేది ఆడపిల్లని రుజువయితే, తల్లులు గర్భస్రావం చేయించు కొంటారు; విధిలేక కనవలసివస్తే పుట్టిన పిల్లలకు ఆదరణ లభించదు; ఆ బిడ్డ చావుకు ఎదురు చూస్తూ ఉంటారు! చైనా, భారతదేశము, దక్షిణ కొరియా దేశాలలో, గర్భస్థ శిశువు ఆడోమగో తేల్చటానికి అల్ట్రాసౌండ్ టెస్టు, ఎమ్నియోసెంటెసిస్ చేయించుకోవటం, పుట్టబేయేది ఆడపిల్లని రుజువైతే గర్భస్రావం చేయించుకోవటం, బిడ్డను కనక తప్పనిసరి పరిస్థితి ఏర్పడితే దానిని పురిటిలోనే చంపటానికి పాల్పడటం జరుగుతున్నది. ఇందువల్ల ఆ దేశాలలో స్త్రీ, పురుష జనాభా పరిమాణాలలో అత్యధిక వ్యత్యాసం కనుపిస్తున్నది. 1960వ సంవత్సరంలో, చైనా దేశంలో ప్రతి వందమంది మగపిల్లలకు, 106 చొప్పున ఆడపిల్లలు పుడుతూ ఉండేవారు. 1991వ సంవత్సరం వచ్చే సరికి, పుట్టే మగపిల్లల సంఖ్య (వందమంది ఆడపిల్లలకు) నూటపదికి పెరిగింది.

## మర్మాంగాల వక్రీకరణ

స్త్రీ మర్మాంగ వక్రీకరణకు గురయిన వారి సంఖ్య

**బాల్యంలో పోషణా లోపానికి గురయిన పిల్లల మేధాశక్తి వారు పెద్దవారయిన తర్వాత కూడా సక్రమంగా వికసించదు.**

పిల్లల మానసిక గ్రహణశక్తి, వారు బడికి వెళ్ళటానికి ముందు నుండి పెరుగనారంభిస్తుంది. పిల్లలు తల్లి గర్భంలో పిండంగా ఉన్న కాలంలోనూ, చనుబాలుకుడిచే కాలంలోనూ, వారి తల్లి అనుభవించిన పోషణ, ఆవిడ ఆరోగ్య పరిస్థితి వారి మేధాశక్తి పెరుగుదలను ప్రభావితం చేస్తుంది అంతేగాదు. పసితనంలో అనుభవించిన పోషణ, ఆరోగ్య రక్షణ, బిడ్డలకు విషయ గ్రహణశక్తి వికసిస్తున్న కాలంలో వారి మేధాశక్తి పెరుగుదలను ప్రోత్సహిస్తుంది.

ఈ విషయ పరిశీలనకు, గ్వాటేమాలాలో దీర్ఘకాలిక ప్రాతిపదిక మీద ఒక ప్రయోగం జరిగింది. తల్లి గర్భంలో పిండంగా ఉన్న దశలో గాని, పుట్టిన తర్వాత బాల్యదశలో గాని, బిడ్డ మాంసకృత్తుల పోషణా లోపానికి గురయినపుడు దాని దుష్ఫలితాలు బిడ్డ మేధాశక్తి పెరుగుదలను ప్రభావితం చేయగలవని ఈ ప్రయోగం రుజువు చేసింది. ప్రాయోజకులు, కొందరు చూలాంత్రకు అధిక పరిమాణంలో మాంసకృత్తులను, శక్తి జనకాలను ఇచ్చారు. ఏడు సంవత్సరాల లోపు వయసు పిల్లలను ఎన్నుకొని, వారికి ఈ పోషక పదార్థాలనిచ్చారు. చూలాంత్రు కన్న బిడ్డల మేధాశక్తి, బాల్యంలో ఈ పోషక పదార్థాల నిచ్చిన పిల్లల మేధాశక్తితో పోల్చి చూచారు.

చూలాలిగా ఉన్న దశలో మాంసకృత్తుల పోషణను అనుభవించిన స్త్రీలు కన్న బిడ్డలు, కౌమారదశకు ఎదిగేసరికి, జనరల్ నాలెడ్జి, సంఖ్యా గ్రహణం, రీడింగ్, భాషాజ్ఞాన విషయ పరీక్షలలో, ఇలాంటి పోషణను బాల్యదశలో మాత్రమే అనుభవించిన పిల్లల కంటే అధిక మార్కులను సాధించగలిగారు. ఈ పోషక పదార్థాలను, పిల్లల జీవిత ప్రారంభదశలో, వీలయినంత ముందు కాలంనుండే,(తల్లి గర్భంలో పిండంగా రూపొందినప్పటి నుండే) ఇవ్వగలిగినపుడు ఆ పోషణా ప్రభావం వారి మీద అధికంగా ఉండగలదని ఈ ప్రయోగం రుజువు చేసిందని ప్రయోజకులు ప్రకటించారు.

పోషణా లోపానికి గురయిన పిల్లల పాఠశాలా ప్రవేశం, పై పిల్లలవలె, సక్రమ పోషణను పొందగలిగినవారికంటే ఆలస్యంగా జరుగుతుందని ఘనా, పాకిస్తాన్, ఫిలిపీన్స్‌లో జరిగిన పరిశోధనలు నిరూపించాయి.

*- వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1998-1999*

ఎనిమిదిన్నర నుండి పదకొండు కోట్ల వరకూ ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు. ఈ ఆపరేషన్‌ను జెనిటల్ మ్యూటిలేషన్ లేక ఫిమేల్ సర్కంసిషన్ అని అంటున్నారు. ఈ ఆపరేషన్‌ను శస్త్ర విద్యానిపుణులు చేయరు. వంశాను గతంగా ఈ వృత్తిలో ఉండేవ్యక్తి ఈ పనిని చేస్తాడు. అశుభ్ర పరిస్థితులలో, అనాగరిక పరికరాలతో చేస్తారు.

దీని వల్ల సంక్రమించగల దీర్ఘకాలిక బాధలు కూడా ఉన్నాయి. సెక్సు సంపర్క సందర్భంలో స్త్రీ విపరీతమైన బాధకు లోనవుతుంది; కాన్పు సందర్భంలో ఇబ్బందులు రావచ్చు; ఈ ఆపరేషన్‌కు గురయిన స్త్రీ గొడ్రాలుగా కూడా మారవచ్చు; తరచూ మూత్రనాళ సంబంధమైన అంటురోగాలకు గురిగావచ్చు.

### సెక్సు హింస - అత్యాచారాలు

యుక్త వయసు కూడారాని పిల్లలు సెక్సుహింసకు, అత్యాచారాలకు బలవుతున్నారు. ఇలాంటి సంఘటనలన్నీ సక్రమంగా రిపోర్టు కావటం లేదు. కనుక ఇది ఎంత పెద్ద సమస్యో అర్థంగాని పరిస్థితి ఏర్పడింది. పరిశీలనకు తగినంత శ్రద్ధను ప్రదర్శించక పోవటం కూడా దీని కొక కారణమే. లభిస్తున్న తక్కువ పరిశీలనల ఫలితాలు కూడా, ఈ దురాగతం ఎంత విస్తృత ప్రాంతంలో జరుగుతున్నదీ, తెలియజేస్తున్నాయి. ఈ దురాగతానికి ప్రాంతీయ, సంస్కృతీ సంప్రదాయ భేదాలు అడ్డు రావటం లేదు. ఇది సర్వాంతర్యామిగా చెలామణీ అవుతున్నది. సెక్సు సంబంధిత దుర్మార్గానికి బలవుతున్న స్త్రీలలో నూరింట పద్ధెనిమిది మంది తొమ్మిది సంవత్సరాల లోపు వయసు పిల్లలని మలేషియా, పెరూ దేశాలలో జరిగిన పరిశోధనలు నిర్ధారించాయి. అమెరికాలోనూ, మెక్సికో నగరంలోనూ ఈ దుర్మార్గానికి ఎరయిన స్త్రీలలో నూరింట ఇరవైమంది పది సంవత్సరాల లోపు పిల్లలని రుజువైంది. నైజీరియాలో సుఖవ్యాధుల చికిత్స కోసం వెళ్ళిన మహిళలలో నూరింట పదహారుగురు ఐదు సంవత్సరాల లోపు పిల్లలనీ మరొక ఆరుగురు,ఆరు నుండి పదిహేను సంవత్సరాల మధ్య వయస్కులని ఒక పరిశీలనలో వెల్లడైంది. పెరూ, కోస్టారికాలలో ప్రసవించిన 12-16 సంవత్సరాల మధ్య వయస్కులలో, నూరింట 90 మంది తమ తండ్రుల చేతిలోనో, లేదా దగ్గరి బంధువుల చేతిలోనో మానభంగానికి గురయినట్లు ఒక పరిశోధన నిరూపించింది! సెక్సు హింసకు గురయిన వారికి గర్భధారణ జరగవచ్చు; సుఖవ్యాధులు సోకవచ్చు. అంతేకాదు; ఇందువల్ల స్త్రీ జీవితాంతము శారీరక బాధలను అనుభవించవలసి రావచ్చు; మానసిక వ్యధకు గురికావచ్చు సెక్సు హింసకు గురయినవారికి తగిన సలహాలనిచ్చే సదుపాయాలు అభివృద్ధి చెందుతున్న దేశాలలో - చాల వాటిలోనూ - అతి తక్కువగా ఉన్నాయి

### కౌమార దశలో.......

తల్లి గర్భంలో పిండంగా ఉన్నప్పుడే హత్యకు గురిగాకుండా తప్పించుకొన గలిగిన జీవి "స్త్రీ"గా భూమి మీద అవతరిస్తుంది. పురుటిలో జరిగే హత్యా ప్రయత్నాన్ని జయించి, అటు తరువాత పోషణ, సంరక్షణలలో ప్రదర్శితమయ్యే లింగ వివక్షను నిగ్రహించి, సెక్సు హింసను, అత్యాచార ప్రయత్నాలనూ అధిగమించ గలిగిన ఆడపిల్ల కౌమార దశలో ప్రవేశిస్తుంది. (వ్యక్తి జీవితంలోని పదకొండు – పంధొమ్మిది సంవత్సరాల మధ్య వయసును కౌమారంగా వ్యవహరిస్తున్నారు. ఇంగ్లీషులో ఈ వర్గం వారిని 'టీనేజర్స్'అని, ఈ జీవిత దశను "ఎడొలెసెన్స్" అని వ్యవహరిస్తున్నారు.) ఈ దశలో ఆడపిల్లలను పొంచి ఉన్న ప్రమాదా లేమిటో చూద్దాం.

ఆడపిల్లలు పది నుండి పంధొమ్మిది సంవత్సరాల మధ్య వయసులో సామాన్యంగా ఆరోగ్యంగా ఉంటారు. ఈ దశలో వారు అనుకోకుండా గర్భవతులుగావచ్చు; ఇందువల్ల లేబ్రాయంలోనే తల్లులవుతారు. ఎవరికీ తెలియకుండా గర్భస్రావం చేయించుకొనే ప్రయత్నంలో వీరు ప్రమాదాలకు గురికావచ్చు; ఎయిడ్స్‌తో సహా పలురకాల సుఖరోగాలకు ఎరగావచ్చు. ఇందువల్ల ఆడపిల్లల జీవితంలో ఈ దశ అత్యంత కీలకమైనదనే గాక, అత్యంత ప్రమాదకరమైనదని కూడా చెప్పవచ్చు. వీరు చిన్న పిల్లలూ కాదు; పెద్దలూ కాదు. తెలిసీ తెలియని దశ. అందువల్ల ఈ దశలో వారు అనారోగ్య ప్రమాదాలకు గురయ్యే అవకాశాలు అధికంగానే ఉంటాయి.

### చిన్నతనంలోనే సంతాన ప్రాప్తి

సాధారణంగా ఆడపిల్లలు ఏ వయసులో పిల్లలను కనటం ప్రారంభిస్తున్నారు అన్నది పలుదేశాలలో పలురకాలుగా ఉంటున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో, కనేవారిలో పది

నుండి యాభై శాతం మంది వరకూ, పంథొమ్మిది సంవత్సరాల లోపే తొలిశిశువును కంటున్నారు. ప్రపంచ వ్యాప్తంగా క్రమంగా జననాల రేటు తగ్గుతున్నా, యవ్వన ప్రారంభదశలో బిడ్డను గనే వారి రేటు మాత్రం తగ్గటం లేదు. గ్రామీణ ప్రాంతంలో నివాసం, అతి తక్కువ చదువు, అల్పాదాయం, చిన్న వయసులోనే సెక్సు కార్యానికి అలవాటు బడటం వంటివి ఇందుకు కారణమని చెబుతున్నారు.

తక్కువ వయసులోనే పెండ్లయితే, త్వరగానే ఆమె చూలాలయ్యే అవకాశాలుంటాయి. ఈ దశలో నున్న పిల్లలు, పెండ్లి కాకపూర్వమే పిల్లలను కనటం కూడా పెరుగుతున్నది. పిన్న వయసులోనే రజస్వల గావటం, ఆలస్యంగా పెండ్లి చేసికోవటం దీనికి తోడు పట్టణ నాగరికత విస్తరిస్తూ ఉండటం, తద్వారా పిల్లలు సామాజికులతో కలిసి స్వేచ్ఛగా తిరగటానికి అధికావకాశా లేర్పడటం - ఇవన్నీ పెండ్లి కాకపూర్వమే సెక్సు కార్యకలాపాలలో యువతులు పాల్గొనటానికి మార్గం సుగమం చేస్తున్నాయి. పత్రికలు, టివీలు, సినిమాలు, సమవయస్కుల ప్రోత్సాహం వంటివి సామాజిక, నైతిక ప్రమాణాలను మార్చి వేస్తున్నాయి. కొన్ని ప్రాంతాలలో యువతులు తమ అవసరాలను తీర్చుకోవటానికి సెక్సును పణంగా పెడుతున్న సందర్భాలు కూడా ఉన్నాయి.

ఈ వయసు ఆడపిల్లలు, ఆరోగ్యరీత్యా అత్యంత ప్రమాదకరమైన జీవనదశలో ఉంటారు. వీరిలో అధికులకు ఆత్మ రక్షణకు సంబంధించిన అవగాహన ఉండదు. అవివాహితలకు చూలు, సెక్సు రోగాలను గురించిన పరిజ్ఞానం ఉండదు. వాటి నిరోధానికి ఉన్న సర్వీసులను, సదుపాయాలను గురించి వారికి తెలియదు. గ్వాటెమాలా, కీన్యాలలో జరిగిన ఒక పరిశీలనలో, రెండు బహిష్టులకు మధ్య నున్న కాలంలో, గర్భధారణ జరగటానికి అవకాశమున్న రోజులేవి అన్న విషయం ఎంతమంది అవివాహిత యువతులకు తెలుసో కనుక్కోవటానికి ప్రయత్నం జరిగింది. పదిమందికి ఒక్కరు కూడా ఈ ప్రశ్నకు సరియైన సమాధానాన్ని చెప్పలేక పోయారు! అభివృద్ధి చెందిన దేశాలలోని యువతులలో దాదాపు అందరకూ గర్భనిరోధక మార్గాలు ఉన్నట్లు తెలుసు; కాని, వాటిని గురించిన పరిజ్ఞానం గాని, వాడే విధానం గాని చాల మంది యువతులకు తెలియదు పదిహేను నుండి పంథొమ్మిది సంవత్సరాల మధ్య వయసు యువతులలో నాల్గవ వంతుమంది ఏకాకులుగా జీవిస్తున్నారనీ, వారికి సెక్సు అనుభవం ఉన్నదనీ, వారిలో అతికొద్ది మంది మాత్రమే గర్భనిరోధక పద్ధతులను అనుసరిస్తున్నారనీ, బోట్స్వానా, ఘనా, కీన్యా, జమైకా, లైబీరియా దేశాలలో జరిగిన జాతీయ పరిశోధనలు వెల్లడించాయి. గర్భనిరోధక విధానాలను అనుసరిస్తున్న కొద్ది మంది "రిదమ్" పద్ధతి వంటి సంప్రదాయ విధానాలను వాడుతున్నారు. గర్భనిరోధక సాధనాలున్నట్లు తెలిసిన వారికి వాటిని సంపాదించటం కష్టమైంది. అవి దొరికినా, వాటి వాడకం వల్ల ఎటువంటి విపరీతాలు సంభవిస్తాయోనని భయపడుతున్నారు. వారి సెక్సు భాగస్వాముల అభ్యంతరం, మత ఛాందసం కూడా వీటి వాడకాన్ని నిరోధిస్తున్నాయి గర్భధారణ జరగకూడదు అన్న కృతనిశ్చయాన్ని అవివాహితలు ప్రదర్శించటం లేదు. వివాహానంతరం, త్వరగా బిడ్డలను కనమని పెద్దలు ప్రోత్సహిస్తూంటారు

పెండ్లయినా, కాకపోయినా, పిల్లలను కనే ఇరవై సంవత్సరాలు నిండని యువతులు, ముఖ్యంగా పదహారు సంవత్సరాల లోపువారు, అతిపెద్ద అనారోగ్య ప్రమాదాల నెదుర్కొన వలసిరావచ్చు. చూలు రావటం వల్ల వచ్చే రక్తపు పోటు (హైపర్‌టెన్షన్), పోషణాలోపం, బయటకు రావలసిన బిడ్డతల కంటే మలుగుల వెడల్పు తక్కువగా ఉండటం (సెఫెలోపెల్విక్ డిస్‌ప్రపోర్షన్), యోనికి, మూత్రాశయానికి మధ్యనున్న పొరగాని, యోనికి, పురీషనాళానికి మధ్య నున్న పొరగాని చినిగి కన్నంబడటం (వెసైకోవెజైనల్ లేక రెక్టోవెజైనల్ ఫిశ్చులా), కాన్పు కష్టం గావటం, పిండం సక్రమంగా యెదగక పోవటం, నెలలు నిండకుండానే కాన్పు జరగటం, పుట్టిన బిడ్డ బరువు ఉండవలసిన దాని కంటే తక్కువగా ఉండటం, ఇరవయ్యెనిమిది వారాల చూలు కాలం తర్వాత పిండం చనిపోవటం లేదా కాన్పు జరిగిన వారం రోజులలోపునే బిడ్డ చనిపోవటం వంటివి సంభవించవచ్చు.

ఇరవై-ఇరవైనాలుగు సంవత్సరాల మధ్య వయసున్న గర్భవతులలో మూడు శాతం మంది మాత్రమే గర్భధారణ వల్ల వచ్చే హైపర్‌టెన్షన్‌తో బాధపడవలసి వస్తే, పద్నాలుగు సంవత్సరాల వయసున్న చూలాండ్రలో 17 శాతం మంది దీనితో బాధపడుతున్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ నైజీరియాలో జరిపిన

ఒక సర్వేలో తేలింది. యువతుల ఎత్తు పెరుగుదల ఆగిపోయిన తర్వాత రెండు-మూడు సంవత్సరాలకు గాని మలుగు ఎముకల పెరుగుదల పూర్తిగాదు. ఇందువల్ల అల్ప వయసులో గర్భధారణ జరిగినపుడు, ఆ చూలాలిలో మలుగులు బిడ్డ బయటకు రావటానికి తగినంత వెడల్పుగా పెరుగవు; కాన్పు కష్టం గావటానికిది ప్రధాన కారణం. కాన్పు కష్టమైనపుడు, యోనికి, మూత్రకోశానికి మధ్య నున్న పొరగాని, యోనికి పురీష నాళానికి మధ్య నున్న పొరగాని చిరిగి కన్నంబడే ప్రమాదం ఉంటుంది ఇలా పొర చిరిగిపోయిన సందర్భాలలో, దానికి శస్త్ర చికిత్స చేసి సరిచేయనపుడు, మలంగాని మూత్రంగాని కొంచెం కొంచెం, అపుడపుడు యోని నుండి వెలికి వస్తూంటుంది (అంటే బట్టలో పడుతూ ఉంటుందన్న మాట). ఇందువల్ల వారి నుండి దుర్గంధం వెలువడుతూ ఉంటుంది. కనుక వారి నెవరూ దరికి రానీయరు. భర్త ఆవిడ దీనస్థితిని అర్థం చేసుకోగల దయామయుడు గాకపోతే, ఆవిడ విడాకులకు గురిగాక తప్పకపోవచ్చు. నైజీరియాలో, కాన్పుకాలంలో ఇటువంటి ప్రమాదానికి గురైన మొత్తం బాలింతలలో, నూరింట 33 మంది పదహారు సంవత్సరాల లోపు వయస్కులున్నారు, నైజర్లో పదిహేను-పంథొమ్మిది సంవత్సరాల మధ్య వయస్కులలో ఇలాంటి ప్రమాదానికి గురయినవారు ఎనభైశాతం మంది వరకూ ఉన్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ 1989 లో నిర్వహింప జేసిన సర్వేవెల్లడించింది.

చిన్న వయసులోనే బిడ్డను కనవలసి రావటం చేత, చూలుకు సంబంధించిన కారణాలవల్ల స్త్రీ చనిపోయే అవకాశాలు అధికంగా ఉంటాయి. బాగా ఎదిగిన మహిళలలో కంటే, పదిహేను నుండి పంథొమ్మిది సంవత్సరాల మధ్య వయస్సున్న చూలాండ్రు, చూలుకు సంబంధించిన కారణాల వల్ల చనిపోయే ప్రమాదం, ఇంతకంటే అధిక వయస్సున్న చూలాండ్రకంటే, ఇరవై నుండి రెండు వందల శాతం వరకూ అధికంగా ఉంటుంది. చూలాలు వయసు ఎంత తక్కువగా ఉంటే ఆవిడ చనిపోయే ప్రమాదం అంత అధికంగా ఉంటుంది. ఉదాహరణకు జమైకా, నైజీరియా దేశాల అనుభవాన్ని చూడవచ్చు. పదిహేను - పంథొమ్మిది సంవత్సరాల మధ్య వయసుగల చూలాండ్ర కంటె, పదిహేను సంవత్సరాల లోపు వయసున్న చూలాండ్రు గర్భవతిగా నున్నపుడో, కాన్పు జరిగేటపుడో చనిపోయే అవకాశాలు నాలుగు నుండి ఎనిమిది రెట్ల వరకూ అధికంగా ఉంటున్నాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ సర్వేవల్ల తెలియవస్తున్నది.

వయసు ముదిరిన స్త్రీలకు పుట్టిన బిడ్డల కంటే, చిన్న వయసులోనే (కౌమారదశలో) ఉన్న యువతులకు పుట్టిన పిల్లలు చనిపోయే ప్రమాదం అధికంగా ఉంటుంది. చావును తప్పించుకోగలిగిన పిల్లలను తీవ్రమైన అనారోగ్యం పీడించే అవకాశాలున్నాయి. బురిండి, ఘనా, కీన్యా, లైబీరియా, మాలి, నైజీరియా, సెనెగల్, జింబాబ్వే దేశాలలో జరిగిన సర్వే ఫలితాలను చూద్దాం. ఇరవై- ఇరవైతొమ్మిది సంవత్సరాల మధ్య వయస్కులకు పుట్టిన బిడ్డల కంటే పదిహేను - పంథొమ్మిది సంవత్సరాల మధ్య వయస్కులకు పుట్టిన బిడ్డలు, సంవత్సరం వయసు నిండక పూర్వమే చనిపోయే ప్రమాదం ఇరవై నుండి అరవై శాతం వరకూ అధికంగా ఉంటుందని ఈ సర్వే నిర్ధారించింది. బంగ్లాదేశ్, కొరియా, మలేషియా, పాకిస్తాన్, తాయ్‌లాండ్ దేశాలలోనూ పరిస్థితి ఇందుకు భిన్నంగా లేదు. ఇరవై సంవత్సరాల వయసు నిండిన వారికి పుట్టిన పిల్లల కంటే, పంథొమ్మిది సంవత్సరాల లోపు వయస్కులకు పుట్టిన బిడ్డలు, సంవత్సరం నిండక పూర్వమే చనిపోయే ప్రమాదం కనీసం యాభై శాతం అధిక మని మరొక సర్వే సూచించింది.

## గర్భ విచ్ఛిత్తికి ప్రాకులాట

అవివాహిత యువతి అనుకోకుండా గర్భవతి అయితే, కుటుంబీకులు కోప్పడతారు; సామాజికులు వెక్కిరించ నారంభిస్తారు. ఈ అవమానకర పరిస్థితి దాపురించకుండా చూచుకోవటానికి ఆయువతి గర్భ విచ్ఛిత్తికి తాపత్రయపడటం సహజం. గర్భవిచ్ఛిత్తి చట్టబద్ధమైన దేశాలలో, గర్భవిచ్ఛిత్తికి వెళ్ళేవారిలో నాల్గవ వంతు వరకూ పంథొమ్మిది సంవత్సరాల లోపు వయసు వారుంటున్నట్లు అంచనా వేస్తున్నారు. గర్భవిచ్ఛిత్తి చట్టబద్ధం గాని దేశాలలో, దొంగచాటుగా ఈ కార్యసాధనకు ప్రయత్నిస్తారు. ఇలా ఎవరికీ తెలియకుండా గర్భవిచ్ఛిత్తికి పాల్పడేవారు సాలుకు, పది లక్షల నుండి నలభైఅయిదు లక్షల మంది వరకూ అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు.

దొంగ చాటుగా గర్భవిచ్ఛిత్తి జరగాలి గనుక, ఇందుకు

అనుకొన్న దానికన్న అధిక కాలవ్యవధి పట్టవచ్చు ఇందువల్ల గర్భవిచ్ఛిత్తి చేయదగిన చూలుకాలం దాటిపోవచ్చు. గర్భవిచ్ఛిత్తి జరిగిన తర్వాత ఏదయినా అనారోగ్య పరిస్థితి ఏర్పడితే దానికి సక్రమమైన చికిత్స చేయించుకోవటానికి వీలుండక పోవచ్చు. ప్రతికూల పరిస్థితులలో గర్భవిచ్ఛిత్తికి ప్రయత్నించ వలసి రావటం చేత, స్త్రీకి రక్తస్రావం, రోగకారక సూక్ష్మజీవులు రక్తంలో చేరటం వల్ల అది విషపూరితం గావటం (సెప్టిసేమియా), అనీమియా, గర్భసంచి ముందు భాగంగాని, యోనిగాని చీరుకుపోవటం, పొత్తికడుపులో, మలుగుల మధ్య చీము చేరటం, గర్భ సంచికి గాని, ప్రేవులకు గాని చిల్లులు బడటం, టెటనస్ సోకటం, ఇకమీదట సంతానప్రాప్తికి అవకాశాలు ఉండకపోవటం వంటివి సంభవించే ప్రమాదముంటుంది. ఇరవై సంవత్సరాలలోపు వయస్సున్న స్త్రీలు ఇంతకంటే ఎక్కువ వయస్సున్న వారికంటే ఈ సమస్యలను అధికంగా ఎదుర్కొన వలసి వస్తున్నది. గర్భ విచ్ఛిత్తి వల్ల అంకురించే అనారోగ్య సమస్యల కారణంగా చికిత్సకోసం వైద్యశాలలకు వస్తున్న పేషెంట్లలో 38 నుండి 68 శాతం మంది వయసు ఇరవై సంవత్సరాల కంటే తక్కువగానే ఉన్నట్లు కాంగో, కీన్యా, లైబీరియా, మాలి, నైజీరియా, జయర్ (ఇపుడు దీన్ని రిపబ్లిక్ ఆఫ్ కాంగో అని పిలుస్తున్నారు) దేశాల వైద్యశాలల రికార్డుల పరిశీలనలు వెల్లడించాయి. ఇటువంటి పేషెంట్ల సంఖ్యా పరిమాణం మలేషియాలో 25 శాతాన్ని మించే ఉన్నది. బ్రెజిల్, చిలీ, గ్వాటెమాలా, పెరు, తాయ్‌లెండ్ దేశాలలో వీరి సంఖ్యా పరిమాణం పదిశాతానికి మించే ఉన్నది. పదహారు సంవత్సరాల వయసును మించిన స్త్రీల కంటే, ఇంతకంటే తక్కువ వయస్సున్న వారు, గర్భవిచ్ఛిత్తి ప్రయత్నంలో ఎదురయ్యే అనారోగ్య ప్రమాదాలను మూడురెట్లు అధికంగా ఎదుర్కొన వలసి ఉంటుందని యునైటెడ్ కింగ్డంలో జరిగిన ఒక సర్వే వెల్లడించింది.

## చుట్టు ముట్టే సుఖరోగాలు

సుఖరోగాల వ్యాప్తి పిన్న వయస్కులలో అధికంగా ఉంటున్నది. ఉదాహరణకు యుగాండా పరిస్థితిని చూడవచ్చు. ఆ దేశ జనాభాలో పదిహేను నుండి పంథొమ్మిది సంవత్సరాల మధ్య వయస్కులలో ఈ రోగాల వ్యాప్తి అత్యధికంగా కనుపిస్తున్నది. పునరుత్పత్తిలో ఉపకరించే అవయాలు, బాగా ఎదిగిన పెద్ద వారిలో కంటే, పంథొమ్మిది సంవత్సరాల లోపు వారిలో సుఖరోగాలకు సులభంగా ఎరయ్యే అవకాశమున్నట్లు జీవశాస్త్రం చెబుతున్నది. సుఖరోగాలే గాదు "హెచ్ ఐ వి " కూడా వీరికి సులభంగా సోకవచ్చు (హ్యూమన్ ఇమ్యునొడెఫిషియెన్సీ వైరస్ కు హెచ్ ఐ వి సంక్షిప్త సంకేతం. ఈ వైరస్ సోకటం వల్ల ఎక్వైర్డ్ ఇమ్యూన్ డిఫిషియెన్సీ సిండ్రోమ్ అనే జబ్బు వస్తుంది దీని సంక్షిప్త సంకేతం ఎయిడ్స్). వయసు వచ్చిన మగవారు సాధారణంగా వయసు తక్కువున్న ఆడపిల్లల కోసం గాలం వేస్తూంటారు ఇందువల్ల పిన్న వయస్కులయిన స్త్రీలకు ఈ రోగాలు సులభంగాను, అధికంగాను సోకే అవకాశాలున్నాయి మగపిల్లల కంటె ఆడపిల్లలకు ఈ రోగాలు ఎక్కువగా వచ్చే అవకాశం కూడా ఉన్నది

లైంగిక సంపర్కానికి ఒడిగట్టే జంటలలోని భాగస్తుల మధ్య వయః పరిమితి తేడాలు అధికంగా ఉండటం వల్ల, పెద్దవారు (మగవారు) చెప్పినట్లు మైనరు భాగస్తురాలు వినవలసి వస్తుంది. ఇందువల్ల, యువతి క్షేమకరమైన సెక్సు పద్ధతులను అనుసరించగోరినా, పురుషుడు వ్యతిరేకిస్తే ఆవిడ లోబడక తప్పదు. ఆఫ్రికా, మధ్యప్రాచ్యంలోని కొన్ని దేశాలలో వరుడు, కన్యాశుల్కాన్ని చెల్లించే ఆచారమున్నది. వరుడిచ్చే అధిక శుల్కానికి ఆశపడి ఆడపిల్ల తలిదండ్రులు, మంచి చెడులను విచారించకుండా వారికిచ్చి వివాహం చేస్తారు. వయసు ముదరని యువకులలో కంటే వయసు ముదిరిన మగవారిలో సుఖవ్యాధులు అధికంగా ఉంటాయి. ఇందువల్ల యువతి త్వరగా ఈ రోగాలకు గురయ్యే అవకాశాలుంటాయి. దారిద్ర్యం కొందరు యువతులను సెక్సు వ్యాపారానికి నెడుతున్నది. ఇందువల్ల కూడా యువతులలో సుఖవ్యాధులు, ఎయిడ్స్ అధికంగా వ్యాపిస్తున్నాయి. వీరితోడి లైంగిక సంపర్కం వల్ల పురుషులకు ఇవి సోకుతాయి; వారి ద్వారా వారి భార్యలకు ఈ రోగాలు సంక్రమిస్తాయి. తాయ్‌లాండ్ దేశంలో, పడుపు వృత్తి చేసుకొంటున్న మహిళలలో, ఇరవై సంవత్సరముల వయస్సు కూడా నిండని వారు ఎనిమిది లక్షల మంది వరకూ ఉన్నట్లు అంచనా వేస్తున్నారు. వీరిలో నాల్గవ వంతు మంది పధ్నాలుగు సంవత్సరాల లోపు వయసువారే! వీరిలో మూడవ వంతు మందికి హెచ్ ఐ వి సోకిందట! ఇది హృదయ విదారక పరిస్థితి.

హెచ్ ఐ వి వయసు ముదిరిన వారికంటే పిన్న వయస్కులలో కనుపించటం అతి సాధారణమైంది. తక్కువ వయస్సున్న ఆడపిల్లలలో, మగపిల్లలలో కంటె అధికంగా కనుపిస్తున్నది. ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనాల ప్రకారం ప్రపంచంలోని హెచ్ ఐ వి రోగులలో సగం మంది ఇరవయ్యైదు సంవత్సరాల లోపువారే.

## పోషణా లోపాలు

దారిద్ర్య బాధ వల్లా, కుటుంబం పాటించే కొన్ని సంప్రదాయాలు, నెలకొన్న అలవాట్ల వల్లా (కుటుంబీకు లందరకూ) ఆహార పదార్థాల సమాన పంపకం లేకపోవటం, కొన్ని రకాల ఆహార పదార్థాలను తినకూడదన్న ఆచారం లేక అలవాటు వంటి వాటివల్లా, పెరిగే వయస్సులోనున్న ఆడపిల్లలకు తగినంత పోషణ లభించటం లేదు. ఆడపిల్ల రజస్వల అయిన తర్వాత, ఆవిడ శరీర అవయాల పెరుగుదల రేటు, సంవత్సరం వయసు దాటిన పిల్లలలో జరిగిన దాని కంటే త్వరితగతిని జరుగ నారంభిస్తుంది. సుమారుగా 14 సంవత్సరాల వయసు వచ్చే సరికి పెరుగుదల వేగం మందగించినా, పొడవు ఎముకల పెరుగుదల పద్ధెనిమిది సంవత్సరాల వరకూ కొనసాగుతుంది. ఇరవయ్యైదు సంవత్సరాల వయసు వస్తేగాని, ఎముకలు ఆ వయసుకు ఉండవలసినంత బరువుకు పెరుగవు. ఇందువల్ల శరీర పెరుగుదలకు కావలసినంత పోషక పదార్థాల అవసరం యువతికి దాదాపు ఇరవయ్యైదు సంవత్సరాల వరకూ ఉంటుంది. ఈ దశకు ముందే ఆవిడ గర్భంధరించి ఉన్నట్లైతే, ఇటు తన శరీర పెరుగుదలకు, తాను భరిస్తున్న పిండం అవసరాలకు కూడా తగినంత అధికంగా పలుపోషక పదార్థాలు అవసరమవుతాయి. చూలు వెంట వెంటనే వస్తూంటే వీటి అవసరం మరింత అధికమవుతుంది.

యువతి రజస్వల అయిన తర్వాత ఆమెకు ఇనుము (పోషక పదార్థం) అంతకు ముందుకంటే అధికంగా కావలసి ఉంటుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో మలేరియా, కొంకి పురుగు వంటి పరాన్న జీవుల వల్ల వచ్చే అనీమియా ప్రమాదం తీవ్రమయ్యే అవకాశాలున్నాయి. అనీమియా వల్ల మనుషులు త్వరగా అలసిపోతారు; ఆకలి మందగిస్తుంది; విద్యార్జనలో వెనుక బడతారు; ప్రేవులకు, నరాలకు సంబంధించిన రోగాలకు గురయ్యే అవకాశాలున్నాయి. ఇరవై సంవత్సరాలు దాటిన తర్వాత మగవారిని అయొడిన్ లోపం అంతగా బాధించదు. కాని స్త్రీలకు దీని అవసరం పెరుగుతుంది. ఇందువల్ల పిల్లలను కనే దశలో వీరిలో అయొడిన్ లోపం అధికంగా కనుపిస్తుంది. చూలాలు ఈ పోషక పదార్థలోపాన్ని అనుభవించ వలసి వస్తే ఆవిడకు పుట్టే బిడ్డ మానసికంగా సక్రమంగా ఎదగకపోయే ప్రమాదం ఉన్నది.

పోషకాహార లోపం వల్ల వ్యక్తి అస్థిపంజరం సక్రమంగా పెరుగదు కొందరు లేతవయసులో పోషణా లోపానికి గురయినా, తరువాతి దశలో తెప్పరిల్ల గలుగుతారు. ఇందుకు వారు బలవర్థకమైన పోషణను పొందగలిగినంత ఆదాయం గలవారై యుండాలి. కనుక పేదలకు బాల్యంలో పోషణాలోపం వల్ల జరిగిన నష్టం తరువాతి కాలంలో తీరటం కష్టం అస్థి పంజరం సక్రమంగా ఎదగక పోవటం వల్ల మలుగులు చిన్నవిగా ఉండి ప్రసవ సమయంలో బిడ్డ సులభంగా వెలికి రాలేదు; ఆటంకం ఏర్పడుతుంది. ఇందువల్ల ప్రసవం కష్టమూ, ఆలస్యమూగావచ్చు. శరీర పెరుగుదల సక్రమంగా లేని వారికి, అస్థిపంజరం సక్రమంగా పెరుగని వారికి కాన్పు ఆనంద దాయకం గావటానికి బదులు ప్రాణగండంగా పరిణమించవచ్చు.

## కొత్త రుచులకు ప్రాకులాట

కౌమార దశలోని యువతీ యువకులకు సాహస చర్యలకు పాల్పడాలని, కొత్త రుచులు చూడాలని అనిపించటం సహజం. ఈ దశలోని వారు పెద్దల మాటను పెడచెవిని బెట్టి, స్వతంత్రంగా వ్యవహరించటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. అటు సంపన్నతకూ, ఇటు దారిద్ర్యానికి మధ్యనున్న దేశాలలోని యువతీ యువకులు పొగతాగటానికి, మద్య పానానికి, మాదకద్రవ్యాల వాడుకకు అలవాటు పడటం కనుపిస్తున్నది. తక్కువ వయసులోనే ప్రారంభమైన ఈ దురలవాట్లు త్వరితగతిని విస్తరిస్తున్నాయి. వారు జీవితాంతం ఈ దుర్గుణాలకు బానిసలవుతున్నారు. వయసు ముదిరిన కొలదీ వీరు రోగ పీడితులవుతున్నారు; చివరకు దుర్మరణం పాలవుతున్నారు. పొగతాగటానికి అలవాటు పడిన స్త్రీలు ఊపిరితిత్తుల కాన్సరుకు గురయ్యే అవకాశాలున్నాయి. వీరి ఎముకలు బలహీనపడి సులభంగా విరిగే అవకాశాలుంటాయి.

పొగతాగటం వలన సెర్విక్స్ కాన్సరుకు కూడా గురికావచ్చు. అధికంగా పొగతాగటానికి అలవాటుపడి, గర్భనిరోధక మాత్రలను సేవించే, ముప్ఫై సంవత్సరాలకు పైబడిన వయసు వారికి, గుండెజబ్బులు అధికంగా వచ్చే ప్రమాదం ఉన్నది. పొగతాగటానికి అలవాటుపడిన చూలాండ్రకు చనిపోయిన బిడ్డపుట్టవచ్చు, నెలలు నిండ కుండానే కాన్పురావచ్చు; పుట్టిన బిడ్డ ఉండవలసిన దానికంటె తక్కువ బరువుండవచ్చు, ఇక మీదట సంతాన ప్రాప్తి ఉండక పోవచ్చు.

మాదక ద్రవ్యాల వాడకం, స్త్రీలలో కంటే పురుషులలో అధికంగా ఉన్నది ఈ దురలవాటు ఈ రెండు వర్గాల వారిలోనూ త్వరిత గతిని వ్యాపిస్తున్నది. మాదక ద్రవ్యాల వాడకానికి అలవాటు పడిన పురుషులు, స్త్రీల యెడల దురుసుగా వ్యవహరిస్తారు. సెక్సు సంబంధాల వల్ల సుఖరోగాలను తెచ్చుకొంటారు. మాదక ద్రవ్య వాడకానికి అలవాటు పడిన చూలాండ్రకు అంగవైకల్యం పొందిన బిడ్డ పుట్టే ప్రమాదం కూడా ఉన్నది.

## మాతృత్వ దశ

కౌమార దశలోని ప్రమాదాలను గడిచి గట్టెక్క గలిగితే స్త్రీకి వివాహమై మాతృత్వదశలో ప్రవేశిస్తుంది. ఇది ఆవిడ జీవితం లోని అత్యంత ప్రమాదకరమైన దశ. ఈ ప్రమాదాల స్వరూపాన్నీ, వాటి ఫలితాలను చూద్దాం

అభివృద్ధి చెందుతున్న దేశాలలో 15-34 మధ్య వయసు గలిగిన మహిళలకు, మనిషిని అశక్తునిగా చేయగల రోగాల పాలయ్యే అవకాశం, పురుషుల కంటే అధికంగా ఉన్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. బిడ్డలను కనవలసి రావటమే ఇందుకు ప్రధాన కారణం. అనారోగ్య కారణాలవల్ల మనిషి జీవితంలో కొంతకాలం వ్యర్థమవుతుంది. అలాగే అకాల మరణం వల్ల కొంత నష్టమవుతుంది. ఈ కాల పరిమాణంలో, కాన్పువల్ల వచ్చే అనారోగ్యంతో బాధపడే కాలం 18 శాతము, హెచ్ ఐ వి, సుఖరోగాల వల్ల బాధ పడవలసి వచ్చే కాలపరిమాణం మరొక పదహారు శాతము ఉంటుందని ప్రపంచ బ్యాంకు నిపుణులు అంచనా వేశారు. క్షయ, మానసిక రోగాలు, ఆత్మహత్య వంటి స్వయంహింసల వల్లా, ఊపిరితిత్తుల సంబంధమైన రోగాల వల్లా, మహిళలు పరిగణించదగిన సంఖ్యలో అకాలంగా మరణించటమో, లేదా అశక్తులుగా మారటమో జరుగుతున్నది. అనీమియా వల్ల కూడా ఈ పరిణామాలు సంభవించవచ్చు ఈ పరిస్థితి నుండి మహిళలను రక్షించే అవకాశాలున్నాయి. రక్షణ లభించక పోవటంచేతనే ఈ దుష్పరిణామాలు సంభవిస్తున్నాయి.

## కోరని చూలు తెస్తున్న ప్రమాదాలు

అభివృద్ధి చెందుతున్న దేశాలలో సంభవిస్తున్న జననాలలో ప్రతి ఐదింటిలోనూ ఒకటి తల్లి కోరకుండానే సంభవిస్తున్నది. అభివృద్ధి చెందుతున్న అధిక సంఖ్యాక దేశాలలో వివాహిత మహిళలలో ఇరవై నుండి ముప్ఫై శాతం వరకూ, "సంతానం ఇకవద్దు" అని అనుకొన్నా, బిడ్డను ఎత్తుకోక తప్పటం లేదని ఒక సర్వేలో తేలింది. సంతానోత్పత్తి శక్తి గల ఇటువంటి మహిళలు కోటి ఇరవై లక్షల మంది వరకూ ఉండవచ్చని అంచనా. వీరు గర్భనిరోధక మార్గాలను అనుసరించక పోవటమే ఇందుకు కారణం. కొందరు అవివాహితలు సంతానవతులవుతున్నారు; గర్భనిరోధక సాధనాల సక్రమ వాడక విధానం తెలియక, కొందరు తల్లులవుతున్నారు. కొందరు గర్భధారణ జరిగినట్లు తెలిసిన తర్వాత గర్భ విచ్ఛిత్తికి తాపత్రయపడుతున్నారు. ఈ వర్గాల వారిని కూడా పరిగణన లోనికి తీసుకొంటే, "వద్దు" అని అనుకొన్నా, బిడ్డలను కంటున్న స్త్రీల మొత్తం సంఖ్య, పై అంచనా కంటే ఎంతో అధికంగా ఉంటుంది

ప్రపంచంలో చూలాండ్రవుతున్న మహిళలలో సుమారుగా నాల్గవ వంతు మంది క్షేమకరంగాని గర్భవిచ్ఛిత్తి విధానాలను అనుసరిస్తున్నారు. వీరి సంఖ్య నాలుగు కోట్ల నుండి అరవై కోట్ల వరకూ ఉండవచ్చు. ఇందులో సగం మంది, ఇతరులకు తెలియకుండా రహస్యంగా గర్భవిచ్ఛిత్తికి పాల్పడుతున్నట్లు పాప్యులేషన్ క్రైసిస్ కమిటీ అంచనా వేసింది.

చూలుకు సంబంధించిన రోగాలు రావటానికి గాని, లేదా చూలాలి మరణానికి గాని ప్రధానమైన కారణాలలో క్షేమకరంగాని గర్భవిచ్ఛిత్తి మార్గాల అనుసరణ ఒకటి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో చాలా వాటిలోనూ, ఇందువల్ల మరణిస్తున్న మహిళల సంఖ్య సాలుకు లక్షన్నరనుండి రెండు

లక్షల వరకూ ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు. సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలలో, చనిపోతున్న చూలాంగ్రలో ప్రతి ముగ్గురి లోనూ ఒకరు గర్భవిచ్ఛిత్తి ప్రయత్నం వల్ల చనిపోతున్నారు. దక్షిణ ఆసియా, లాటిన్ అమెరికా దేశాలలో చూలు వల్ల మరణించే ప్రతి నలుగురులోనూ ఒక్కరు క్షేమకరంగాని గర్భ విచ్ఛిత్తి వల్ల చనిపోతున్నారు. మధ్య ఆసియా లోని దేశాలలో గర్భవిచ్ఛిత్తికి వసతులున్నాయి; కాని అవి ఆరోగ్య ప్రమాణాలకు తగిన స్థాయిలో లేవు. పైగా గర్భనిరోధక సాధనాలు అందుబాటులో ఉండటం లేదు. ఇందువల్ల చూలాంగ్ర మరణాల రేటు ఈ దేశాలలో కూడా అధికంగా ఉన్నది. చూలాంగ్ర మరణానికి దీనిని రెండవ ప్రధాన కారణంగా పరిగణిస్తున్నారు. గర్భవిచ్ఛిత్తిని చట్ట బద్ధంగా నిషేధించటం, లేదా పరిమిత పరచటం, గర్భనిరోధక సాధనాలు సులభంగా దొరకక పోవటం జరుగుతున్న దేశాలలో చూలాంగ్ర మరణాల రేటు అధికంగా ఉంటున్నది.

ప్రపంచంలోని నలభై శాతం జనాభా నివసిస్తున్న ప్రాంతంలో గర్భవిచ్ఛిత్తికి స్వేచ్ఛ ఉన్నది; 23 శాతం మంది నివసిస్తున్న దేశాలలో సాంఘిక కారణాల వల్ల గాని, ఆరోగ్య కారణాల వల్ల గాని గర్భవిచ్ఛిత్తిని అనుమతిస్తున్నారు; పన్నెండు శాతం జనాభా నివసించే ప్రాంతంలో కాన్పువల్ల తల్లి ప్రాణానికి ముప్పువస్తుందని గాని, చూలాలి ఆరోగ్యం దెబ్బ తింటుందని గాని, పిండానికి దెబ్బతగిలినట్లు గాని రుజువయినపుడు గర్భవిచ్ఛిత్తిని అనుమతిస్తున్నారు; ఇరవయ్యైదు శాతం జనాభా నివసించే ప్రాంతంలో తల్లి ప్రాణానికి కాన్పువల్ల ముప్పువస్తుందని నిర్ధారణైతేనే గర్భవిచ్ఛిత్తికి అనుమతిస్తారు. మరే కారణం వల్ల కూడా గర్భవిచ్ఛిత్తిని అనుమతించరు.

గర్భవిచ్ఛిత్తిని అనుమతించక పోయినా, గర్భనిరోధక సాధనాలు అందుబాటులో లేకుండా చేసినా సంభవించే పరిణామాలు ఎంత హృదయ విదారకంగా ఉండగలవో రొమేనియా అనుభవం మనకు ప్రదర్శిస్తున్నది. 1966 వ సంవత్సరంలో రొమేనియా ప్రభుత్వం గర్భ విచ్ఛిత్తినీ, గర్భనిరోధక సాధనాల వాడకాన్ని నిషేధించింది. ఇందువల్ల గర్భస్రావం వల్ల సంభవించే మరణాలు అకస్మాత్తుగా పెరిగాయి! 1965 లో లక్ష జననాలకు గర్భ స్రావం వల్ల చనిపోతున్న స్త్రీల సంఖ్య లక్షకు 19 చొప్పున మాత్రమే ఉండేది. 1989 వ సంవత్సరానికీ పరిమాణం 145 కు పెరిగింది! 1990 వ సంవత్సరంలో గర్భ విచ్ఛిత్తి మీదా, గర్భనిరోధక సాధనాల వాడకం మీదా నిషేధాన్ని తొలగించారు. ఇందువల్ల బాలింత మరణాలు బాగా తగ్గాయి. 1991వ సంవత్సరంలో గర్భవిచ్ఛిత్తి వల్ల చనిపోయిన బాలింతల సంఖ్య లక్షజననాలకు 40 మాత్రమే ఉన్నది!

క్షేమకరంగాని గర్భ విచ్ఛిత్తి తల్లి శారీరక, మానసిక ఆరోగ్యాలను దెబ్బ దీస్తుంది. ఇటువంటి గర్భస్రావం తర్వాత ఇక సంతాన ప్రాప్తి జరుగక పోవచ్చు; దీనివల్ల సమాజం మీద కూడా కొన్ని దుష్ఫలితాలు కనుపించవచ్చు. క్షేమకరం గాని గర్భవిచ్ఛిత్తి వల్ల చెడిన ఆరోగ్యాన్ని బాగుచేయటానికి చాలా సొమ్ము ఖర్చవుతుంది. క్షేమకరంగా గర్భస్రావం చేయించుకొనే వసతుల కల్పనకు ఇంతకంటే ఎంతో తక్కువ ఖర్చవుతుంది. క్షేమకరంగాని గర్భస్రావం వల్ల తల్లులకు వచ్చే ఆరోగ్యసమస్యల పరిష్కారానికే, హాస్పిటల్ బడ్జెట్‌లో దాదాపు సగం వరకూ ఖర్చవుతుందని, ప్రపంచ ఆరోగ్య సంస్థకు చెందిన పలువురు నిపుణులు అంచనా వేశారు!

గర్భస్రావాన్ని కోరేవారు "ఆర్‌యు- 486" అనే మందును గర్భధారణ జరిగిన తర్వాత 63 రోజుల లోపలే వాడితే మంచి ఫలితాలు కనుపిస్తాయి. ఈ మందు ఖరీదు అధికం, పైగా వైద్య నిపుణుల పర్యవేక్షణలో ఈ మందును వాడవలసి ఉంటుంది. కనుక అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా వాడకానికి ఈ మందును ఇంకా సూచించటం లేదు.

## ప్రసవంలో ఎదురయ్యే ప్రమాదాలు

అభివృద్ధి చెందుతున్న దేశాలలో సాలుకు పదిహేను కోట్ల మంది స్త్రీలు గర్భవతులవుతున్నట్లు అంచనా వేస్తున్నారు. గర్భధారణ వల్ల వచ్చే చిక్కుల వల్ల సాలుకు ఐదులక్షల మంది మరణిస్తున్నారు! సంతానవతులు కాగల వయసులోని స్త్రీల మరణాలలో నాల్గవ వంతు వరకూ, గర్భధారణ వల్ల అంకురిస్తున్న సమస్యల వల్ల సంభవిస్తున్నాయి. ఈ మరణాలకు ప్రధాన కారణాలు ఐదు :

1. రక్తస్రావం; 2. క్షేమకరంగాని గర్భవిచ్ఛిత్తి;
3. రక్తపు పోటువల్ల వస్తున్న కొన్ని ఇబ్బందులు;
4. అంటురోగాలు (ఇన్‌ఫెక్షన్స్)
5. కాన్పు కష్టం గావటం.

**ప్రపంచంలో సాలుకు సగటున సంభవిస్తున్న బాలింతల మరణాలు 5,85,000**

ప్రపంచంలో సాలుకు సగటున 5,85,000 మంది బాలింతలు చనిపోతున్నట్లు యునిసెఫ్ సేకరించిన అంచనాలు సూచిస్తున్నాయి. యూరపులో, మధ్య ఆసియాలో, రెండు అమెరికా ఖండాలలో రోజుకు 8 నుండి 65 మంది బాలింతలుగాని చూలాండ్రు గాని చనిపోతుండగా ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలో 818 మంది వరకూ చనిపోతున్నారు! ప్రాంతీయ వివరాలను దిగువనిస్తున్నాం

| ప్రాంతము | సాలుకు సంభవిస్తున్న బాలింత మరణాలు | రోజుకు సగటున సంభవిస్తున్న చూలాండ్ర, బాలింతల మరణాలు |
|---|---|---|
| యూరపు | 3,000 | 8 |
| మధ్య ఆసియా | 14,000 | 39 |
| అమెరికాఖండం | 23,000 | 65 |
| మధ్య ప్రాచ్యము, ఉత్తర ఆఫ్రికా | 35,000 | 98 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 2,19,000 | 615 |
| ఆసియా, పసిఫిక్ | 2,91,000 | 818 |

*యునిసెఫ్ ప్రచురించిన "ది ప్రోగ్రెస్ ఆఫ్ నేషన్స్-1996" నుండి*

అన్ని దేశాలలో కంటే ఆఫ్రికాలోని సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలలో బాలింతల మరణాల రేటు (ప్రతి లక్ష సజీవ జననాలకు చనిపోయే బాలింతల సంఖ్య) అధికంగా ఉంది. అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో కంటే, ఈ రేటు, సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలలో రెండు వందల రెట్లు అధికంగా ఉన్నది. ఈ రెండు వర్గాల దేశాల మధ్య మానవ అభివృద్ధిలోని వ్యత్యాసం ఎంత అధికమో ఈ వివరం సూచిస్తున్నది. చూలాలి ఆరోగ్యం, చూలాండ్ర మరణాల విషయంలో అభివృద్ధి చెందుతున్న దేశాలకూ, అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలకు మధ్య ఎంత అంతరం ఉన్నదో చూడటానికి, గర్భధారణ వల్ల స్త్రీ మరణించే అవకాశాలు ఎంత అధికంగా ఉన్నదీ రెండవ పట్టిక చిత్రిస్తున్నది ఆఫ్రికా ఖండ దేశాలలో చనిపోతున్న ప్రతి ఇరవయ్యొక్క మంది మహిళలకు ఒక్కరు చూలు, కాన్పు, గర్భవిచ్ఛిత్తి-వీటి మూలంగా సంభవించే ప్రమాదాల వల్ల చనిపోతున్నారు; ఉత్తరయూరపులో చనిపోయే స్త్రీలలోని ప్రతి పదివేల మందికి ఈ కారణాల వల్ల చనిపోతున్నది ఒక్కరు మాత్రమే!

గర్భ ధారణ వల్ల సంభవిస్తున్న ప్రమాదం ఒక్క చూలాలి మరణమే కాదు అభివృద్ధి చెందుతున్న దేశాలలో గర్భస్రావం, గర్భవిచ్ఛిత్తి - తదితర కారణాల వల్ల అంకురిస్తున్న ఆరోగ్య సమస్యల కారణంగా గర్భవతులలో నలభైశాతం మంది వరకూ అనారోగ్యం పాలవుతున్నారు తల్లికి, బిడ్డకు కూడా శాశ్వత శక్తి హీనత సంప్రాప్తిస్తున్నది. చూలాలికి వచ్చే అనారోగ్యం వలనా, చూలు కాలంలో తీసుకోవలసిన జాగ్రత్తలను పాటించక పోవటంచేతా సాలుకు డెబ్బైలక్షల మంది వరకూ పిల్లలు పురిటిలోనే చనిపోతున్నట్లు అంచనా వేస్తున్నారు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో అధిక సంఖ్యలో బాలింతలు మరణించటానికీ, చూలుకు సంబంధించిన పలురకాల బాధలు వారికి సంక్రమించటానికీ, చూలాలి రక్షణకు తగినంత వైద్య సహాయ సదుపాయాలు లేక పోవటం, సదుపాయాలున్న చోట్ల తగినంత నాణ్యమైన సేవలు వారికి లభించక పోవటం ముఖ్య కారణం.

మూడవ పట్టిక లోని వివరాలను పరిశీలిస్తే, అభివృద్ధి చెందుతున్న దేశాలలో మొత్తం చూలాండ్రలో సగం మందికి మాత్రమే ఆరోగ్యరక్షణా సేవలు లభిస్తున్నట్లు తెలుస్తుంది. అభివృద్ధి చెందిన దేశాలలో దాదాపు చూలాండ్రందరకూ ఈ సేవలు లభిస్తున్నాయి; అన్ని కాన్పులకూ తర్ఫీదు పొందిన వైద్య సిబ్బంది సహాయం లభిస్తున్నది. మాజీ సోవియట్ యూనియన్లో ఈ సేవలు ఇంతకంటే మెరుగ్గా ఉన్నట్లు ఈ పట్టిక లోని వివరాలు తెలియజేస్తున్నాయి. దక్షిణాసియాగా వ్యవహరితమవుతున్న ప్రాంతంలో పాకిస్తాన్, భారతదేశము, బంగ్లాదేశ్, శ్రీలంకలున్నాయి. ఈ ప్రాంతంలో ఈ సేవలు మొత్తం చూలాండ్రలో మూడవ వంతు మందికి మాత్రమే లభిస్తున్నాయి. లాటిన్ అమెరికా, ఆగ్నేయ ఆసియా, పశ్చిమ ఆసియా ప్రాంత దేశాలలో బాలింతల మరణాల రేటు తగ్గినట్లు

## మూడవ పట్టిక
## ప్రపంచంలోని పలు మండలాలలో లేక ప్రాంతాలలో ప్రసూతి సేవల వినియోగ పరిమాణాలు

| మండలము లేక ప్రాంతము | చూలుకాలంలో వైద్య పరీక్షలు చేయించుకొన్నవారు | | వైద్యశాలలో కాన్పు జరిపించుకొన్నవారు | | కాన్పు కాలంలో తర్ఫీదైన మంత్రసాని సేవలను పొందినవారు | |
|---|---|---|---|---|---|---|
| | సంఖ్య లక్షలలో | శాతం | సంఖ్యలక్షలలో | శాతం | సంఖ్య లక్షలలో | శాతం |
| ప్రపంచం | 9,06.91 | 64 | 6,24.53 | 44 | 8,60 18 | 60 |
| అభివృద్ధి చెందిన ప్రాంతం | 1,68.18 | 98 | 1,63.13 | 95 | 1,70.43 | 99 |
| అభివృద్ధి చెందుతున్న ప్రాంతం | 7,38.73 | 59 | 4,61 40 | 37 | 6,89 75 | 55 |
| ఆఫ్రికా | 1,67.11 | 59 | 97.42 | 34 | 1,19.29 | 42 |
| తూర్పు ఆఫ్రికా | 65 38 | 68 | 28.23 | 30 | 33.46 | 35 |
| మధ్య ఆఫ్రికా | 13.93 | 43 | 14.00 | 43 | 14.25 | 44 |
| ఉత్తర ఆఫ్రికా | 24 50 | 49 | 15.57 | 31 | 26.43 | 53 |
| దక్షిణ ఆఫ్రికా | 12.10 | 89 | 11.49 | 85 | 11.60 | 86 |
| పశ్చిమ ఆఫ్రికా | 51.21 | 55 | 28.13 | 30 | 33.54 | 36 |
| ఆసియా | 4,80.35 | 57 | 2,81.06 | 33 | 4,74.71 | 56 |
| తూర్పు ఆసియా | 2,24.07 | 87 | 1,21.97 | 48 | 2,43.52 | 95 |
| ఆగ్నేయ ఆసియా | 88.28 | 70 | 49.92 | 39 | 73.36 | 58 |
| దక్షిణ ఆసియా | 1,42.69 | 35 | 84.84 | 21 | 1,26.44 | 31 |
| పశ్చిమ ఆసియా | 25.31 | 54 | 24.33 | 52 | 31.39 | 67 |
| లాటిన్ అమెరికా | 89.85 | 72 | 81 92 | 66 | 94.74 | 76 |
| కరిబియన్ | 7.47 | 89 | 6.13 | 73 | 7.54 | 90 |
| మధ్య అమెరికా | 24.92 | 71 | 20.18 | 57 | 26.00 | 74 |
| దక్షిణ అమెరికా | 57.46 | 71 | 55.61 | 69 | 61.20 | 76 |
| ఉత్తర అమెరికా | 37.74 | 95 | 37.74 | 95 | 39.56 | 99 |
| యూరపు | 63.05 | 99 | 60.48 | 95 | 63.34 | 99 |
| ఒషీనియా | 1.42 | 70 | 1.00 | 49 | 1.01 | 50 |
| మాజీ సోవియట్ యూనియన్ | 50.65 | 100 | 48.12 | 95 | 50.65 | 100 |

వివరణ :

1. రెండవ కాలంలోని చూలాండ్రు చూలు కాలంలో ఒక్కసారి వైద్యపరీక్ష చేయించుకున్నవారు కూడా ఉన్నారు.
2. చివరి కాలంలోని కాన్పు కాలంలో తర్ఫీదు పొందిన మంత్రసాని సేవలు · స్థానికంగా ఉంటూ సంప్రదాయంగా కాన్పులు చేయించే మంత్రసాని, ఆధునిక పద్ధతులలో తర్ఫీదును పొంది ఉన్న మంత్రసాని సేవలు కూడా చేరి ఉన్నాయి.
3. తూర్పు ఆసియా అంచనాలలో జపాన్, ఆస్ట్రేలియా, న్యూజీలెండ్ ల వివరాలు చేరిలేవు. కాని అభివృద్ధి చెందిన ప్రాంతాల అంచనాలలో వీటి వివరాలు చేరి ఉన్నాయి.
4. పట్టికలోని వివరాలు 1993 వ సంవత్సరపు అంచనాలు
   - కవరేజ్ ఆఫ్ మెటర్నిటీ కేర్ : ఎ టాబ్యులేషన్ ఆఫ్ ఎవైలబుల్ ఇన్ఫర్మేషన్ అన్న ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రచురణ నుండి.

కనుపిస్తున్నది; కాని ఆఫ్రికాలోనూ, దక్షిణ ఆసియాలోనూ ఈ రేటు పెరుగుతున్నది! ప్రపంచ వ్యాప్తంగా చూస్తే చూలువల్లగాని, కాన్పువల్ల గాని మరణించే ప్రమాదం ఇటీవల తగ్గుతున్నది. కాని కనే వయసులోని మహిళల సంఖ్య పెరుగుతూ ఉండటం చేత, చూలుకు, కాన్పుకు సంబంధించిన మరణాల సంఖ్య పెరుగుతూనే ఉన్నది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో సంభవిస్తున్న, పిల్లలను కనే వయసుగలవారి మొత్తం మరణాలలో నాల్గవ వంతుకు పైగానే, చూలు లేక కాన్పు కారణాల వల్ల సంభవించే మరణాలుంటున్నాయి. ఈ మరణాలలో ప్రతి ఐదింటిలోనూ ఒక్కటి, కాన్పు కష్టం గావటం వల్ల సంభవిస్తున్నది. రక్తస్రావం వల్ల ఒక శాతము, రోగపు అంటువల్ల సుమారుగా 15 శాతం, క్షేమకరంగాని గర్భవిచ్ఛిత్తిని పొందటం వల్ల 13 శాతము, అధిక రక్తపు పోటువల్ల 12 శాతము, పిండం బయటకు రావటంలో అవరోధం ఏర్పడటం వల్ల సుమారుగా యెనిమిది శాతం మంది చనిపోతున్నారు. మలేరియా, వైరస్ సోకటంవల్ల కాలేయం రోగపీడితం గావటం (వైరల్ హెపటైటిస్), మధుమేహము లేక డయాబిటిస్, అనీమియా, రుమాటిక్ ఫీవర్ వల్ల వచ్చే హృద్రోగం వంటి వాటివల్ల చూలాంధ్ర మరణాలు మరికొన్ని సంభవిస్తున్నట్లు వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ సూచించింది. (వివరాలకు ఈ సంస్థ ప్రచురించిన మెటర్నల్ మోర్టాలిటీ : ఎ గ్లోబల్ ఫాక్ట్ బుక్ చూడండి)

### స్త్రీని జీవితాంతం బాధించగల కాన్పు కాలపు సమస్యలు

కాన్పు అయిన తర్వాత, కాన్పు వల్ల సంక్రమించిన పలురకాల శారీరక సమస్యలతో స్త్రీ జీవితాంతము బాధపడవలసి వస్తుంది. గర్భ సంచి యోని గుండా ముందుకు పొడుచుకు రావటం లేదా లోపలికి ముకుళించుకు పోవటం (యుటరొ-వెజైనల్ ప్రోలాప్స్), గర్భసంచి ముందు భాగం చీరుకు పోవటం, యోనిని పురీష నాళంతో గాని, మూత్రాశయంతో గాని కలిపే మార్గమేర్పడటం (కాన్పు కష్టం గావటం చేతగాని, మర్మాంగ వక్రీకరణకు ఆపరేషన్ జరిగినపుడు గాని ఈ ప్రమాదం సంభవించే అవకాశాలుంటాయి), అనీమియా వంటివి సంక్రమిస్తాయి. గొడ్రాలితనం కూడా సంప్రాప్తించవచ్చు. ఇవన్నీ స్త్రీని జీవితాంతం పీడించే సమస్యలే.

కొలంబియా, పాకిస్తాన్, ఫిలిపీన్స్, సిరియా దేశాలలో 45 సంవత్సరాల లోపు మహిళలలో 9 నుండి 25 శాతం మంది వరకూ యుటరీన్ ప్రోలాప్స్‌కు గురవుతున్నారు. కాన్పుకష్టం గావటం వల్ల చూలాలు అతిగా ముక్క వలసిరావటం చేతా, ప్రసవ సయమంలో శాస్త్రీయ పద్ధతులను అవలంబించక పోవటం చేత, అల్ప వయస్సులోనే చూలు రావటం, లేదా కాన్పుల మధ్య తగినంత కాలవ్యవధి లేక పోవటం చేతా ఇది సంభవించే అవకాశాలుంటాయి. యుటరీన్ ప్రోలాప్స్‌కు గురయినవారు శారీరకంగా అసౌకర్యాన్ని అనుభవించవలసి వస్తుంది; దీని వల్ల శరీర విధి నిర్వహణకు అంతరాయం ఏర్పడుతుంది; పలురకాల అనారోగ్య సమస్యలు ఉత్పన్నమయ్యే అవకాశాలుంటాయి. చిన్న తనంలోనే బిడ్డలను కనవలసి వచ్చినపుడు, అధిక సంతాన ప్రాప్తికి ఆదరణ ఉన్నచోట్ల ఈ సమస్య విస్తృతంగా కనుపిస్తున్నది. సంతానవతులు కాగలిగిన ఈజిప్టు స్త్రీల జనాభాలో సగం మందికి పైగానే ఈ బాధకు గురయినట్లు ఇటీవల జరిగిన సర్వే ఒకటి వెల్లడించింది. కాన్పు వల్లనే ఇది సంభవించినట్లు కూడా బాధితలలో అధికులు ఎరుగరట!

రాకూడని సమయంలో చూలు రావటం, సంతానం వద్దను కొన్నా చూలు రావటం వల్లా, స్త్రీకి అనారోగ్యం ప్రాప్తించే అవకాశాలు అధికంగా ఉంటాయి; అకాల మరణ ప్రమాదం కూడా పొంచి ఉంటుంది. ఇంతేకాదు; ఇందువల్ల సామాజిక, ఆర్థిక నష్టాలు కూడా ఉంటాయి. చిన్న వయసు లోనే చూలు వస్తే, దాని ఫలితాలు దారుణంగా ఉంటాయని ఇంతకు పూర్వమే చూచాం. నైజీరియా దేశంలో, బాలింతల మరణాలు 20-24 సంవత్సరాల మధ్య వయస్కులలో కంటే, 15 సంవత్సరాల లోపు వయస్సు వారిలో ఏడు రెట్లు అధికంగా ఉంటున్నట్లు ఒక సర్వే పేర్కొన్నది ఇరవై-ఇరవై నాలుగు సంవత్సరాల మధ్య వయస్సు గలిగిన వారిలో కంటే, నలభై సంవత్సరాలకు పైబడిన వయస్సు గల వారిలో బాలింత మరణాలు ఐదురెట్లు అధికంగా ఉంటున్నట్లు జమైకాలో జరిగిన ఒక సర్వే వెల్లడించింది. వద్దను కొన్నా చూలువచ్చిన వారు, క్షేమకరంగాని గర్భ విచ్ఛిత్తి విధానాలకు గురిగావటం వల్ల, అటువంటి వారిలో అధికులు మరణించటాన్ని రొమేనియా అనుభవం చిత్రిస్తున్నది. 1988వ సంవత్సరంలో ప్రతి లక్ష సజీవ జననాలకూ, 159 మంది బాలింతలు మరణించారు. గర్భ విచ్ఛిత్తికి అవాంఛనీయ విధానాల వాడుక

వల్లనే వీరిలో 83 శాతం మంది మరణించినట్లు నిర్ధారణైంది.

చూలు రావటం వల్లా, రోగ నిగ్రహశక్తి బలహీన పడటం వల్లా, మొండి రోగాల వల్లా స్త్రీలు అధికంగా బాధపడవలసి వస్తుంది. వీటి తీవ్రత అధికంగా ఉంటున్నట్లు అనుభవం చాటుతున్నది ఉదాహరణకు మలేరియాను చూడండి మామూలు మహిళల కంటే చూలాంగ్రకు ఇది అధికంగా వస్తుంది ఇది తొలి చూలు కాలంలో రావటం అతి సాధారణం స్త్రీకి పుట్టుకతో వచ్చిన ఈ రోగాన్ని నిగ్రహించే శక్తి, 14 వారాల చూలు కాలంలో తగ్గిపోతుంది. కాలేయం రోగపీడితంగావటం (వైరల్ హెపటైటిస్) మామూలు మహిళలలో కంటే చూలాంగ్రలో అధికంగా కనుపిస్తుంది. దీని వల్ల మామూలు మహిళల కంటే చూలాంగ్రు మరణించటం అనేది మూడున్నర రెట్లు అధికమని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్ధారించింది. ఈ రోగం తీవ్రంగా ఉన్నపుడు రావలసిన దానికంటే ముందుగా (అకాలంగా) కాన్పు రావచ్చు, కాలేయం పనిచేయటం మానవచ్చు; లేదా తీవ్ర రక్త స్రావం జరుగవచ్చు.

ఇది చాలదన్నట్లు, చూలాంగ్రలో హెచ్ ఐ వి సోకిన వారి సంఖ్య పెరుగుతూ ఉండటాన్ని వైద్య పరీక్షలు సూచిస్తున్నాయి ఇది ఎయిడ్స్ యొక్క ప్రాథమిక దశ. సబ్-సహారన్ ఆఫ్రికాలో ముప్పైలక్షల మంది మహిళలు ఎయిడ్స్‌కు గురయినట్లు అంచనా వేస్తున్నారు. 1990 లో, జాంబియా లోని లుసాకాలో గల మెటర్నిటీ వైద్య కేంద్రాలకు వచ్చే చూలాంగ్రలో నాల్గవ వంతు మందికి ఎయిడ్స్ ఉన్నట్లు పరీక్షలలో తేలింది. 1985 వ సంవత్సరంలో 8 శాతం మంది చూలాంగ్రలో మాత్రమే ఈ రోగం కనుపించింది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని చూలాంగ్రలో అరవై నుండి డెబ్బై శాతం మంది చూలాంగ్రు అనీమియాకు గురవుతున్నట్లు అంచనా వేస్తున్నారు. గర్భంలోని బిడ్డ తనకు అవసరమైన ఇనుమును తల్లి నుండి తీసుకోవటం వల్ల, తల్లికి ఆ పోషకపదార్థం కొరవడుతుంది ఇందువల్ల ఆవిడ అనీమియాకు గురవుతుంది. దీని ఫలితంగా తల్లి యొక్క రోగనిగ్రహశక్తి, రక్తస్రావాన్ని తట్టుకోగల శక్తి నీరసిస్తుంది. ఇందువల్ల కాన్పు సమయంలో తల్లి చనిపోయే అవకాశాలు నాలుగురెట్లు పెరుగుతాయి.

## పుట్టే బిడ్డపై తల్లి చూలు సమస్యల ప్రభావం

చూలు ఇద్దరకు - తల్లికి-బిడ్డకు - సంబంధించిన విషయం. తల్లి పడే అనారోగ్య సంబంధమైన బాధల ప్రభావం బిడ్డ మీద కూడా ఉంటుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో సాలుకు కోటి ముప్పై లక్షల మంది పిల్లలు ఐదేండ్లు నిండకుండానే మరణిస్తున్నారు వీరిలో ముప్పై లక్షల మంది పుట్టిన వారంరోజుల లోపుననే చనిపోతున్నారు. వీరు గాక మరొక 40 లక్షల వరకూ బిడ్డలు తల్లి గర్భం నుండి వచ్చే టప్పటికే చనిపోయి ఉంటున్నారు కాన్పు కష్టంగావటం, కాన్పు సమయంలో అనుసరించే పద్ధతులు సక్రమమైనవి గాక పోవటం, చూలాలి ఆరోగ్యం సరిగా లేక పోవటం, చూలు కాలంలోనూ, అంతకు ముందూ, పోషణా లోపానికి చూలాలు గురికావటం వంటివి, అభివృద్ధి చెందుతున్న దేశాలలో డెబ్బైలక్షల శిశు మరణాలకు (పుట్టిన వారంలోపలే మరణించే పిల్లలు నలభై లక్షలు, చనిపోయి పుట్టేవారు ముప్పై లక్షలు) కారణ మవుతున్నాయి (ఇవన్నీ ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనాలు).

పురుటిలో తల్లి చనిపోతే, ఆవిడ బిడ్డ జీవితం అత్యంత ప్రమాదకరమైన పరిస్థితులలో చిక్కుకొనే అవకాశాలుంటాయి. కాన్పు సమయంలో చూలాలు మరణిస్తే, బిడ్డ చనిపోయి పుట్టవచ్చు; లేదా పుట్టిన వారంలోపలే బిడ్డ మరణించవచ్చు. పురిటిలో తల్లి చనిపోయిన బిడ్డలలో తొంభై శాతానికి మించే, సంవత్సరం తిరుగ కుండానే మరణిస్తున్నారు.

అదృష్టవశాత్తూ కాన్పు కాలంలో చావును తల్లి తప్పించుకో గలిగినా, కాన్పు కాలంలో అంకురించే అనారోగ్య సమస్యల ప్రభావం, అటు తర్వాత తీవ్రంగా ఉంటుంది. కాన్పుకు ముందు జరిగిన రక్తస్రావం, ఎక్లెంప్సియా వంటి అనారోగ్య సమస్యల ఫలితంగా తల్లి గర్భంలోనే పిండము చనిపోవచ్చు, శిశు జననం సంభవిస్తే ఆబిడ్డ పుట్టిన వారం రోజులలోనే చనిపాయే అవకాశాలుంటాయి. ఇలాంటి శిశుమరణాలు అభివృద్ధి చెందిన దేశాలలో సాలుకు 15 లక్షల వరకూ ఉంటున్నట్లు అంచనా వేస్తున్నారు. ప్రీ -ఎక్లెంప్సియాకు గురయిన స్త్రీకి పుట్టిన బిడ్డ చనిపోయే అవకాశాలు, దీనికి గురిగాని స్త్రీ, కన్న బిడ్డల కంటే నాలుగు లేక ఐదురెట్లు అధికంగా ఉంటుందని నిపుణులు చెబుతున్నారు. తల్లికి వచ్చిన

ఈ రోగాల ప్రభావపు తీవ్రత, బిడ్డమీద ఎంత అధికంగా ఉంటుందో ఈ విషయం చిత్రిస్తున్నది. ఈ ప్రమాదాలను తప్పించుకొని బ్రతికిన బిడ్డలు మానసికంగానూ, శారీరకంగానూ సక్రమంగా యెదగరు; పలురకాల బాధలకు లోనవుతారు. కాన్పు కాలంలో తల్లికి నొప్పులు వస్తున్న సమయంలోనూ, బిడ్డ బయటకు వస్తున్న కాలంలోనూ సక్రమమైన పద్ధతులను కాన్పు చేయించే వారు అనుసరించక పోవటం చేత, అదనంగా పదిహేను లక్షల మంది వరకూ పిల్లలు పురుటిలోనే చనిపోతున్నారు. ఇంతకంటే అధిక సంఖ్యాకులు పెరుగుదలకు సంబంధించిన లోపాలకు గురవుతున్నారు. ఉదాహరణకు చూడండి: బిడ్డ పుట్టే ముందు గాని, లేక పుడుతూండగా గాని ప్రాణవాయు లోపం సంభవిస్తే ఆ బిడ్డ మరణించవచ్చు; లేదా బిడ్డ మెదడు దెబ్బ తినవచ్చు. ఇందువల్ల సెరెబ్రెల్ పాల్సీ వస్తుంది. (ఇదొక రోగం కాదు. నిర్ణీత అవయవాల కండరాలను పనిచేయించ గల మెదడు భాగాలు దెబ్బ తినటం వల్ల, అవి వ్యక్తి స్వాధీనంలో ఉండవు. పక్షవాత రోగ పరిస్థితి కనుపిస్తుంది. ఈ స్థితి బిడ్డ తల్లి గర్భంలో ఉన్నపుడు గాని, జనన కాలంలో గాని, పుట్టిన తర్వాత ఐదు సంవత్సరాల లోపల గాని సంభవించవచ్చు.) అభివృద్ధి చెందుతున్న దేశాలలో సాలుకు ఇరవై లక్షల మంది పిల్లలు ఈ దుష్ఫలితాన్ని అనుభవిస్తున్నట్లు అంచనా వేస్తున్నారు.

చూలు కాలంలో తల్లి అనారోగ్యం పాలు గావటం వల్ల, చూలు యొక్క చివరి దశలోనో, లేక పుట్టిన వారం లోపుననో మరణిస్తున్న పిల్లల సంఖ్య అభివృద్ధి చెందుతున్న దేశాలలో ముప్ఫై లక్షలకు మించే ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు; వీరు గాక, శైశవ దశలోనే మరెందరో మరణిస్తున్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేసింది. ఈ అవాంతరాలను అధిగమించి బ్రతుక గలిగిన లక్షలాది పసివారు తల్లి అనారోగ్య ఫలితాలను అనుభవిస్తున్నారు. సబ్-సహారన్ ఆఫ్రికాలో మలేరియాతో బాధపడుతున్న తల్లులు కన్న పిల్లలలో ముప్ఫై లక్షల మంది వరకూ, పుట్టినపుడు, ఆరోగ్య సూత్రాల రీత్యా ఉండవలసిన దాని కంటే తక్కువ బరువుంటున్నట్లు యు ఎస్ ఎయిడ్ సంస్థ నిపుణులు అంచనా వేశారు.

స్త్రీ శరీర పరిమాణం తక్కువగా ఉండటం, చూలు కాలంలో ఉండవలసిన దానికన్న తక్కువ బరువుండటం, పెరుగవలసినంత పరిమాణంలో బరువు పెరుగక పోవటం, అనీమియాతో బాధపడుతూ ఉండటం మాత్రమేగాక, తీవ్రమైన పోషణా లోపాలకు గురిగావటం, పునరుత్పత్తి అవయవాలకు చూలుకు ముందే ఇన్‌ఫెక్షన్ సోకి ఉండటం లేదా చూలు కాలంలో వాటికి ఇన్‌ఫెక్షన్ రావటం వంటి వాటికి గురయిన చూలాండ్రకు పుట్టిన బిడ్డలు, పుట్టినపుడు ఉండవలసిన దాని కంటే తక్కువ బరువుంటారు. పుట్టినపుడు ఉండవలసిన దానికంటే తక్కువ బరువున్న పిల్లలు ప్రపంచలో సాలుకు రెండున్నర కోట్ల మంది పుడుతున్నట్లు అంచనా వేస్తున్నారు. వీరిలో అత్యధిక సంఖ్యాకులు - రెండు కోట్ల నలభైలక్షల మందివరకూ – అభివృద్ధి చెందుతున్న దేశాలలో పుడుతున్నారని ప్రపంచబ్యాంకు, యునిసెఫ్ సంస్థలు అంచనా వేశాయి. ఉండవలసినంత బరువుండి, పిండంగానో, వారం రోజుల వయస్సును మించ కుండానో చనిపోయే వారికంటే, బరువు తక్కువ ఉన్న పిల్లలు, పురిటిలో చనిపోయే అవకాశం ఐదు నుండి ముప్ఫై రెట్లు అధికంగా ఉంటుంది. ఉండవలసిన దానికంటే తక్కువ బరువున్న పిల్లలు చావును తప్పించుకో గలిగినా, వారు తీవ్రమైన నరాల సంబంధమైన సమస్యలకు గురికావచ్చు; వినికిడి, చూపు, తక్కువగా ఉండవచ్చు. పెరుగుదల మందంగా సాగవచ్చు.

తక్కువ బరువున్న పిల్లలలో మగపిల్లల కంటే ఆడపిల్లల పరిస్థితి దయనీయంగా ఉంటుంది. తగ్గిన బరువును పూరించుకోగల శక్తి మగపిల్లలలో కంటె ఆడపిల్లలలో తక్కువగా ఉంటుంది. కుటుంబంలో ఆడపిల్లలు పోషణ విషయంలో వివక్షకు గురవుతారు. మగపిల్లల పోషణకు చూపినంత శ్రద్ధను వీరియెడల చూపరు. లేత వయస్సు లోనే పెండ్లవుతుంది. బరువైన పనులను చిన్నప్పటి నుండే చేస్తూ ఉంటారు. వారి జీవితంలో చాలా భాగము చూలులోనూ, పిల్లలు పుట్టిన తర్వాత చనుబాలివ్వటం, పోషణ, సంరక్షణలకు పోతుంది. ఇందువల్ల వారు తీవ్రమైన పోషణా లోపానికి గురవుతారు; పైగా చేయవలసిన పనులకు శక్తి అధికంగా ఖర్చవుతుంది. ఆరోగ్య సూత్రాల ప్రకారం ఉండవలసిన దాని కంటే తక్కువ బరువున్న పిల్లలుగా పుట్టిన ఈ తల్లులు కనే పిల్లలకు కూడా ఈ లక్షణం (తక్కువ బరువుండే పిల్లలను కనటం) సంక్రమిస్తుంది.

హెచ్ ఐ వి సోకిన చూలాలికి పుట్టే బిడ్డలకు, పిండంగా ఉన్న దశలోనో, లేక కాన్పు సమయంలోనో ఇది సోకే అవకాశాలు 25 నుండి 40 శాతం వరకూ ఉండవచ్చునని నిపుణులు చెబుతున్నారు. పుట్టే బిడ్డలలో ఈ అంటురోగపు వ్యాప్తికి 25 శాతం వరకూ అవకాశాలున్నాయన్న ప్రాతిపదిక మీద చూస్తే, 1992వ సంవత్సరాంతానికి సబ్-సహారన్ ఆఫ్రికాలో 40 లక్షల మంది బిడ్డలు, హెచ్ ఐ వి సోకిన తల్లులకు పుట్టి ఉంటారని ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేసింది వీరిలో పది లక్షల మందికి ఇది పుట్టుకతో సంక్రమించి ఉండవచ్చునని భావిస్తున్నారు. చిన్న పిల్లలకు హెచ్ ఐ వి సోకిన తర్వాత అది ఎయిడ్స్‌గా మారటాన్ని తెలిపే అంచనాలు - పెద్దల విషయంలో లభించినంత స్పష్టమైనవి, ఇలాంటి పిల్లలకు ఇంకా లభించటం లేదు. పుట్టినపుడే హెచ్ ఐ వి సోకిన పిల్లలలో 25 శాతం మందికి, సంవత్సరం వయస్సు వచ్చే లోపలే ఎయిడ్స్ వచ్చినట్లు నిర్ధారణవుతుంది; ఎనభైశాతం మందికి నాల్గవ సంవత్సరం నిండే లోపల ఈ రోగ సూచనలు స్పష్టంగా కనుపిస్తాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిపుణులు సూచించారు. ఆఫ్రికాలో, పిల్లలలో ఎయిడ్స్ సోకినట్లు నిర్ధారణైన సంవత్సరంలోపల మరణం నిశ్చయమని నిపుణులు చెబుతున్నారు. ఈ సూత్రం ప్రకారం, పుట్టుకతో ఈ రోగం సోకిన పిల్లలలో ఎనభై శాతం మంది - సుమారుగా ఎనిమిది లక్షల మంది - ఐదవ సంవత్సరం నిండే లోపలే మరణించే అవకాశాలున్నట్లు జేమ్స్ చిన్ అనే నిపుణులు అంచనా వేశారు.

చూలు దశలో తల్లి అనారోగ్యం పాలబడితే, పుట్టే బిడ్డల (భావి పౌరుల) స్థితి ఇంత హృదయ విదారకంగా తయారవుతుంది

## సమాజం పై తల్లి చూలు సమస్యల ప్రభావం

చూలు సమస్యల ప్రభావం తల్లి మీద ఎలా ఉంటుందో, ఆవిడ కనే బిడ్డల మీద ఎలా ఉంటుందో చూచాం. ఇక దీని ప్రభావం సమాజం మీద ఎలా ఉంటుందో చూద్దాం.

స్త్రీ, భరింపబడే వ్యక్తి కాదని, కుటుంబపోషణ, సంరక్షణలలో పురుషునికి ఏ మాత్రము తీసిపోని పాత్రను నిర్వహిస్తున్నదని ఇంతకు పూర్వమే చూశాం. కని-పెంచే వయస్సులో ఉన్న స్త్రీ మరణం కుటుంబాన్ని ఆర్థికంగా దెబ్బ దీస్తుంది . దారిద్ర్యాన్ని అనుభవించే కుటుంబాలు ఇంకా ఎక్కువ బాధపడతాయి కుటుంబ పెద్దలుగా పురుషులు వ్యవహరించే కుటుంబాలలో దాదాపు నాల్గవ వంతు కుటుంబాల సంపాదనలో ఇల్లాలి సంపాదన సగానికి మించి ఉంటుందని బీనా అగర్వాల్, వారి సహచరులు అంచనా వేశారు. కుటుంబ పెద్ద మహిళే అయినపుడు, ఆవిడమరణం వల్ల కుటుంబం ఇంకా అధికంగా బాధపడవలసి ఉంటుంది. ప్రపంచలోని కుటుంబాలలో నాల్గవ వంతు నుండి మూడవ వంతు వరకు పూర్తిగా స్త్రీ సంపాదన మీదనే ఆధారపడి ఉంటున్నాయి ప్రపంచ బ్యాంకు అంచనాల ప్రకారం దారిద్ర్యంలో మునిగి ఉన్న కుటుంబాలలో దాదాపు మూడవ వంతు కుటుంబాల నిర్వాహకులు మహిళలే!

గృహిణి మరణించటం వల్ల ఆవిడ తెచ్చే ఆదాయాన్ని మాత్రమే కుటుంబం కోల్పోవటం లేదు. ఆవిడ కుటుంబానికి చేసే పలు రకాల సేవలు (గృహ నిర్వహణ, పిల్లల పెంపకం, రోగం వచ్చిన కుటుంబీకులకు, అత్త మామల వంటి వయోవృద్ధులకు చేసే సేవలు), అంతరిస్తాయి. మహిళ కుటుంబానికి చేసే సేవలను కూడా లెక్కలోకి తీసుకొంటే, దేశపు జాతీయ ఆదాయంలో సగభాగం వరకూ వీరివల్ల లభిస్తున్నదని ఇంతకు ముందే చూచాం. ఈ దృష్ట్యా చూచినపుడు ఇల్లాలి అకాల మరణం ఆవిడ కుటుంబానికే గాదు, సమాజానికి కూడా ఎంత నష్టదాయకమో అర్థమవుతుంది.

## పోషణా లోపం : దాని దుష్ట ప్రభావం

పసితనంలో మాంసకృత్తులు - శక్తిజనక పోషక పదార్థలోపం వల్ల, అభివృద్ధి చెందుతున్న దేశాలలో సుమారుగా 45 కోట్ల మంది స్త్రీలు పెరుగుదల తగినంత లేక గిడసబారి ఉంటున్నారు; మరింత మంది ఇనుము లోపం వల్ల అనీమియాకు గురవుతున్నారు; సుమారుగా ఇరవయ్యైదు కోట్ల మంది స్త్రీలు అయొడిన్ లోపానికి ఎరవుతున్నారు; మరికొన్ని కోట్ల మంది "ఎ" విటమిను లోపించటం వల్ల గుడ్డి వారవుతున్నారు. దక్షిణాసియా, సబ్- సహారన్ ఆఫ్రికాలోని స్త్రీలు, ప్రపంచంలోని ఇతర ప్రాంతాల వారి కంటే విపరీతమైన పోషణా లోపానికి గురవుతున్నారు.

పురుషులలో 15-59 సంవత్సరాల మధ్య వయస్కులలో ఇరవయ్యారు శాతం మంది మాత్రమే అనీమియాతో బాధపడుతున్నారు; స్త్రీలలో 15-49 సంవత్సరాల మధ్య వయస్కులలో నలభై శాతం మందిలో అనీమియా కనుపిస్తున్నది. ఇనుమును (పోషక పదార్థంగా) తగినంత తీసుకోక పోవటం చేతా, తీసుకొన్నా, అవసరమైనంత మేరకు శరీరంలో అది జీర్ణం కాకపోవటం చేతా, రుతుస్రావం, చూలు, కాన్పువల్లా, మలేరియా, కొంకి పురుగు వంటి పరాన్న జీవుల పీడనవల్లా శరీరంలోని ఇనుము తరిగిపోతూ ఉండటం చేతా పురుషులలో కంటే స్త్రీలలో అనీమియా అధికంగా కనుపిస్తుంది. అనీమియాకు గురయినవారు తీవ్రమైన అలనటకు గురవుతారు; వారిలో పనిచేయగల శక్తి, అధ్యయనాసక్తి తగ్గిపోతుంది; కాన్పు, లేక గర్భస్రావ కాలాలలో జరిగే రక్తస్రావాన్ని తట్టుకోలేరు.

అయోడిన్ కొరత పురుషులలో కంటే స్త్రీలలో అధికంగా కనుపిస్తుంది. ఈ పోషక పదార్థలోపం వల్ల థయిరాయిడ్ వాపు వస్తుంది. ఈ స్థితిని గయిటర్ అని అంటారు. దీనితో బాధపడే మహిళలు మందకొడిగా ఉంటారు. వీరికి పుట్టిన బిడ్డల మానసిక వికాసం దెబ్బతింటుంది. ఈ పోషక పదార్థలోపానికి గురయిన చూలాలికి గర్భస్రావం జరిగే అవకాశాలుంటాయి; లేదా చనిపోయిన బిడ్డ పుట్టవచ్చు; లేదా పుట్టిన బిడ్డ బరువు, ఉండవలసిన పరిమాణంలో ఉండకపోవచ్చు విటమిన్ 'ఎ' లోపించటం వల్ల రేచీకటి వస్తుంది; శరీరపు రోగ నిగ్రహ శక్తి తగ్గుతుంది. ఈ విటమిన్ లోపానికి గురయిన మహిళకు చూలు వచ్చినపుడు, దీని లోప పరిమాణం మరింత అధికమవుతుంది. శరీరపు లోపలి భాగాల మీద నున్నని, మెత్తని పొర (మ్యూకోసా) ఏర్పడి ఉంటుంది. ఈ పొర సక్రమంగా ఏర్పడనపుడు అంటురోగం ముఖ్యంగా జననాంగాలకు సులభంగా సోకే అవకాశాలుంటాయి. 'ఎ' విటమిను లోపం వల్ల ఇంత ముఖ్యమైన "మ్యూకోసా" సక్రమంగా ఏర్పడదు.

తగినంత ఆహారాన్ని తీసుకోలేక పోవటం చేతా, కుటుంబంలోని వారి కందరకూ, ఉన్న ఆహారపదార్థం సక్రమంగా (సమంగా) పంపకం కాకపోవటం చేతా, ఆహార పదార్థాలను శాస్త్రీయంగా నిల్వచేయక పోవటం వల్లా లేక చక్కగా వండక పోవటం చేతా, పోషక పదార్థాలను గురించి తగినంతగా తెలియక పోవటం వల్లా, తీసుకొన్న ఆహార పదార్థాలను శరీరం సక్రమంగా వినియోగించుకోలేక పోవటం చేతా పోషణా లోపాలు సంభవిస్తాయి. కుటుంబంలో ఆహార పంపకం స్త్రీ పురుషుల మధ్య సమంగా ఉండక పోవటం చేతా, స్త్రీలకు అవసరమైన ప్రత్యేక పోషణావసరాలకు తగినంత గుర్తింపు లభించక పోవటం చేతా, పురుషుల కంటే స్త్రీలే అధికంగా పోషణా లోపానికి గురవుతూ ఉంటారు. బిడ్డలను కని పెంచే వయసులోని స్త్రీలకు, ప్రత్యేకంగా వారు కాయకష్టం చేసే వారయినపుడు, అధిక పోషణ అవసరమవుతుంది. చూలు కాలంలోనూ, పిల్లలకు చనుబాలిచ్చే కాలంలోనూ వారికి అదనపు ఆహారం (పోషణ) అవసరం.

చనుబాలివ్వటం తల్లికి, తన ఆరోగ్య రీత్యా, భారమైన పనే. కాని ఇందువల్ల తల్లికీ పిల్లకూ కూడా లాభాలున్నాయి బిడ్డ కోరినపుడల్లా (రాత్రి వేళల కూడా) తల్లి పాలివ్వటం వల్ల ఆవిడకు బహిష్టు రావటం అలస్యమవుతూ ఉంటుంది. ఇందువల్ల, కన్న ఆరు మాసాల లోపల ఆవిడకు చూలు వచ్చే అవకాశాలుండవు. పిల్లకు చనుబాలివ్వటం వల్ల చనుకట్టుకు కాన్సరు వచ్చే అవకాశాలు తగ్గవచ్చు. తల్లిపాలు బిడ్డకు చక్కగా తగిన పోషక పదార్థం; అంతేకాదు; వీటిని తాగటం వల్ల బిడ్డకు పలురోగాల నుండి రక్షణ లభిస్తుంది. బిడ్డ కోరినపుడల్లా (రాత్రి వేళల కూడా) తల్లి చనుబాలను మాత్రమే ఇవ్వాలనీ, తొలి కుడుపు పాలలో "కొలొష్ట్రం" అనే పదార్థం ఉంటుంది గనుక, ఆ పాలను పిండివేయకుండా బిడ్డకు తప్పక కుడపాలనీ, బిడ్డకు ఆరు మాసాల వయస్సు వచ్చే వరకూ, పోతపాల వంటి వాటిని, ఆఖరుకు నీటిని కూడా తాపకుండా పూర్తిగా తల్లిపాల మీదనే పెంచాలని నిపుణులు సూచిస్తున్నారు.

వ్యక్తుల ఆహారపుటలవాట్ల మీద సాంఘిక, సాంస్కృతిక ప్రభావాలుంటాయి. స్త్రీ చూలాలుగా ఉన్నపుడు, పిల్లలకు చనుబాలిచ్చే కాలంలో, ఆవిడకు సుపోషకము, అధిక శక్తి జనకములు అయిన ఆహార పదార్థాలు అవసరం. ఆ కాయ తింటే "వేడి", ఈ కూర తింటే "జలుబు చేస్తుంది" అనే దురభిప్రాయాల వల్ల కొన్ని సుపోషక మయిన ఆహార పదార్థాలను చూలాలికి పెట్టరు. కొన్ని కుటుంబాలలో స్త్రీలకు కోరినవి తినే స్వతంత్రం ఉండదు. ఇందువల్ల సుపోషకమైన ఆహార పదార్థాలు వారికి, వారి పిల్లలకు అందవు. కొందరు

చూలాండ్రు బాగా తింటే పెద్ద సైజు పిల్లలు పుడతారనీ, ఇందువల్ల కాన్పు కష్టమవుతుందని భయపడుతూ ఉంటారు. ఈ భయంతో వారు సక్రమంగా తినరు; ఇందువల్ల వారు పోషణా లోపానికి గురవుతారు.

పోషణా లోపానికి గురయినపుడు శరీరం క్రమంగా పెరుగదు. ఇలాంటి పెరుగుదల లోపించిన స్త్రీకి కాన్పు కష్టమవుతుంది. చాల ప్రమాదకరమైన స్థితిలో వీరు చిక్కే ప్రమాదం ఉన్నది. బిడ్డ వెలికి రావటం కష్టం గావటం చేతా, బిడ్డ రావటంతో ఏర్పడే వత్తిడివల్ల అబ్‌స్టేరిక్ ఫిశ్చులా సంక్రమించవచ్చు. పుట్టే బిడ్డకు మెదడు దెబ్బ తినవచ్చు. తల్లి ప్రాణానికి ముప్పు కూడా ఏర్పడవచ్చు. పుట్టినపుడు బిడ్డలు ఉండవలసినంత బరువుండక పోవటానికి ప్రధాన కారణం తల్లి చూలాలుగా ఉన్నపుడు పోషణాలోపానికి గురికావటం. ఎముకలు బలంగా ఉండటానికి, నలభై సంవత్సరాల వయస్సు నిండేటప్పటికే తగినంత కాల్షియంను తీసుకోవటం అవసరం. స్త్రీ, ఈ జాగ్రత్తను తీసుకోనపుడు, కని పెంచే వయస్సు దాటిన తర్వాత ఎముకలు బలహీన పడతాయి; అవి సులభంగా విరిగే అవకాశాలుంటాయి.

లాటిన్ అమెరికా దేశాలలోనూ, కొన్ని ఇతర ప్రాంతాలలోనూ పట్టణ ప్రాంత స్త్రీలు బరువు పెరుగుతూ ఉండటం అధికంగా కనుపిస్తుంది. మొండి రోగాలు అధికంగా వస్తున్నాయనటానికి, దీన్ని సూచనగా తీసుకొమ్మని నిపుణులు హెచ్చరిస్తున్నారు.

## జననాంగాలకు వచ్చే అంటురోగాలు

ఎయిడ్స్, సుఖరోగాలు, జననాంగాలకు సోకే ఇతర అంటు రోగాలు స్త్రీ ఆరోగ్యాన్ని తీవ్రంగా చెడగొడతాయి; ఆవిడ సాంఘిక స్థితిని కూడా ప్రభావితం చేస్తాయి. సుఖరోగాలు పురుషులకంటే స్త్రీలకే సులభంగా సోకుతాయి. స్త్రీకి సుఖరోగం సోకినా, ఆ రోగ సూచనలు కొన్ని సందర్భాలలో ఆవిడకు తెలియకుండా ఉంటాయి. సుఖరోగాలకు సకాలంలో చికిత్స చేయించుకోకపోవటం చేత, పురుషుల కంటే తీవ్రమైన సమస్యలను స్త్రీలు ఎదుర్కొనవలసి వస్తుంది.

ప్రపంచంలో సాలుకు ఇరవయ్యైదు కోట్ల మంది స్త్రీలకు సుఖరోగాలు సోకుతున్నట్లు ప్రపంచ బ్యాంకు అంచనా వేసింది జననాంగాలకు అంటురోగాలు ఒక్క సెక్సు సంబంధం వల్లనేరావు; ఇందుకు ఇతర కారణాలు కూడా ఉన్నాయి. గర్భ విచ్ఛిత్తి యత్నంలోనూ, "ఐయుడి"లను సక్రమంగా పెట్టుకోలేకపోవటం, అనారోగ్యకర పరిస్థితులలో ప్రసవం జరగటం, కాన్పువల్లా, సంప్రదాయానుసారం జననాంగాల వక్రీకరణకు (సర్కంసిషన్) ఆపరేషన్ జరగటంవల్ల కూడా జననాంగాలకు అంటు రోగాలు సంప్రాప్తించవచ్చు.

జననాంగాలకు రోగపు అంటు సోకటంవల్ల పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్ వచ్చే వీలుంటుంది. (రోగ కారక బాక్టీరియా సోకటంవల్ల ఫెలోపియన్ ట్యూబ్స్, ఓవరీస్, గర్భ సంచి వాపుకు గురవుతాయి. ఓవరీస్‌ను అండాశయంగా చెప్పవచ్చు. ఇచ్చట విడుదలైన అండం ఫెలోపియన్ ట్యూబ్ ద్వారా గర్భసంచిని చేరుతుంది. ఈ అవయవాలు పునరుత్పత్తిలో అత్యంత కీలకమైన పాత్రను నిర్వహిస్తాయి) ఈ రోగాలవల్ల గొడ్రాలి తనం కూడా సంప్రాప్తించవచ్చు. గర్భస్రావ ప్రమాదముంటుంది. ఎక్టోపిక్ ప్రెగ్నెన్సీ రావచ్చు. (గర్భసంచి వెలుపల, సామాన్యంగా ఫెలోపియన్ ట్యూబులో పిండం నిక్షిప్తంగావచ్చు ఇది చూలాలికి అత్యంత ప్రమాదకరమైన పరిస్థితిని తెచ్చిపెట్టవచ్చు) చనిపోయిన బిడ్డ పుట్టవచ్చు; లేదా పుట్టిన బిడ్డ బరువు ఉండవలసిన దానికంటే తక్కువుండవచ్చు, నెలలు నిండకుండానే కాన్పు జరుగవచ్చు; రోగపు అంటుతో బిడ్డ పుట్టవచ్చు. పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్ మూలంగా మలుగుల మధ్య చికిత్సకు లొంగని నొప్పి ఉంటుంది; తరచూ ఇన్‌ఫెక్షన్ వస్తూంటుంది.

ఆసియా, లాటిన్ అమెరికా, తూర్పు మెడిటరేనియన్ ప్రాంతాలలోని స్త్రీలకు, సంతాన ప్రాప్తి కలుగని కేసులలో, నలభై శాతానికి, వారి జననాంగాలు రోగ పీడితం గావటమే కారణమని ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించింది. ఇటువంటి కేసుల పరిమాణం ఆఫ్రికాలో ఎనభై శాతం వరకూ ఉండవచ్చునని కూడా ఈ సంస్థ అంచనా వేసింది ప్రపంచంలో ఉన్న సంతానవతులు గాదగిన స్త్రీలలో, ఎనిమిది నుండి పదిశాతం మందిలో, జీవితంలోని ఏదో ఒక దశలో, ఏదో ఒక రూపంలో ఈ సమస్య కనుపిస్తున్నది. సంతాన నిరోధక విధానాలను వరుసగా, నిరంతరాయంగా పన్నెండు మాసాలకాలం వాడక పోయినా, సంతానప్రాప్తి కలుగని కేసులకు

కారణాన్ని, "ఇన్‌ఫెర్టిలిటీగా" ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్వచించింది. ఓవరీ నుండి విడుదలయిన అండము ఫెలోపియన్ ట్యూబు ద్వారా గర్భసంచిని చేరవలసి ఉంటుంది. సంతాన ప్రాప్తి జరుగకపోవటానికి, ఫెలోపియన్ ట్యూబ్‌లో అండపు పయనానికి అవరోధం గలగటంగాని, లేదా అదిచెడిపోయి ఉండటంగాని, అభివృద్ధి చెందుతున్న పలుదేశాలలో కనుపిస్తున్న అతి సాధారణ కారణంగా చెబుతున్నారు. కొందరకు ఒక బిడ్డ పుట్టిన తర్వాత ఇక సంతాన ప్రాప్తి ఉండదు. ప్రసవం చేయించటంలో సక్రమమైన విధానాలను పాటించకపోవటం, దీనివల్ల సంభవించే పరిణామాలూ ఇందుకు కారణమవుతున్నాయి. కమరూన్‌లో జరిగిన పరిశీలనలో కొన్ని వివరాలు వెల్లడైనాయి. మూడు నుండి 17 శాతం మందికి అసలు సంతానప్రాప్తి అర్హతే ఉండటం లేదు; 14 నుండి 39 శాతం మంది ఒక బిడ్డ పుట్టిన తర్వాత సంతాన ప్రాప్తికి అర్హతను కోల్పోయారు. సంతానప్రాప్తి జరుగకపోవటాన్ని అతి సాధారణ అంశంగా భావించకూడదు. దీనివల్ల సాంఘిక సమస్యలుత్పన్నమవుతాయి. సంతానం కనలేని భార్యకు భర్త విడాకులివ్వవచ్చు; లేదా వదలివేయవచ్చు. తన తప్పిదం లేకపోయినా, గొడ్రాలుగా సమాజం ఆవిడకు ముద్రవేస్తుంది ! ఆవిడ భర్త చర్యను సమర్థిస్తుంది !

హెచ్ ఐ వి లేక ఎయిడ్స్ ప్రధానంగా లైంగిక సంబంధం వల్ల సంక్రమిస్తుంది. ఇది స్త్రీలలో త్వరితగతిని ప్రాకటం ఆందోళనను గలిగిస్తున్నది. (ఎయిడ్స్‌కు, సుఖరోగాలకు సంబంధించిన వివరాలను సుఖవ్యాధుల అధ్యాయంలో చూడవచ్చు).

స్త్రీలకు జననాంగ సంబంధమైన రోగాలు సోకటానికి ప్రధానమైన కారణాలు మూడున్నాయి.

1. సమాజంలో పురుషుని కున్నంత హోదా స్త్రీలకు లేదు; వారికంటే వీరు "తక్కువవారు!" ఇందువల్ల వారికి సుఖరోగాలు గాని, హెచ్ ఐ వి లేక ఎయిడ్స్ రావటం సులభమైంది.

2. వీరికి జననాంగ రక్షణా విషయాలలో తగినంత జ్ఞానం లేదు. సెక్సును గురించి అవసరమైనంతగా తెలియదు. సంప్రదాయం పేరిట అనుసరిస్తూ వస్తున్న కొన్ని విధానాలు కూడా ఈ రోగాల రాకకు కారణమవుతున్నాయి.

3 స్త్రీలు ఆర్థికంగా బలహీనులైనా, పేదరికం అనుభవించవలసి వచ్చినా, కుటుంబ పోషణకో, వ్యక్తిగత అవసరాలను తీర్చుకోవటానికో పడుపు వృత్తికి పాల్పడక తప్పటం లేదు. ఈ వృత్తిలో నున్న వారికి పలువురితో లైంగిక సంబంధాలుండక తప్పదు గనుక సులభంగా ఈ అంటు రోగాలకు బలవుతున్నారు

**కాన్పుడిగిన తర్వాత....**

ప్రపంచంలో యాభై సంవత్సరాల వయస్సు దాటిన మహిళలు 46 కోట్ల 70 లక్షల మంది ఉన్నారని అంచనా. వీరిలో అత్యధిక సంఖ్యాకులు అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉంటున్నారు. 2020వ సంవత్సరం వచ్చేసరికి, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళల జనాభాలో ప్రతి ఐదుగురకు ఒక్కరి వంతున 50 సంవత్సరాల వయస్సు నిండిన వారుంటారని అంచనా వేస్తున్నారు. వీరిలో ఉండే అంటు రోగాలను, మొండిరోగాలను నివారించి వారి జీవితాన్ని కొంత మేరకైనా మెరుగుపరచాలంటే చాలా డబ్బు అవసరం, ఎంతో కృషి కూడా అవసరమే.

యాభై సంవత్సరాల వయస్సు మించిన మహిళలకు ఎక్కువగా మొండి రోగాలుంటూ ఉంటాయి. వెన్ను నొప్పి, కాన్సరు, హృద్రోగం, కీళ్ళ నొప్పులు-వాపులు, మధుమేహం- వీటి నిందుకు ఉదాహరణలుగా చెప్పవచ్చు. వయస్సు ముదిరినవారు గాయపడటం కూడా సులభమే. వీరు మనోవ్యాధికి గురయ్యే అవకాశాలు అధికం అల్పాదాయ ప్రాంతాలలో అంటురోగాలు, పరాన్న జీవుల పీడన కూడా అదనంగా దాపురిస్తుంది. వీరి చూపు, వినికిడి తగ్గుతాయి. ఎముకలు బలహీనపడటం, పోషకాహార లోపము, అనీమియా వంటివాటివల్ల వారు సులభంగా రోగాలకు గురయ్యే వీలుంటుంది ఎముకలు బలహీన పడటం, కీళ్ళ నొప్పులు, చూపు-వినికిడి తగ్గటం వంటివి, మనిషి శరీరం కృశిస్తున్న కొలదీ పెరుగుతూ ఉండటం సహజం. రోగ నివారణా వసతులు, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని వారికి తగినంతగా ఉండటం అరుదు; ఉన్నా, చికిత్సకు కూడా ఎక్కువ సొమ్మును రోగి ఖర్చు చేయవలసి ఉంటుంది. కనుక ఈ చికిత్స సామాన్యులకు అందుబాటులో ఉండదు.

సంపాదన కోసం గ్రామాల నుండి పట్నాలకు ప్రజలు తరలి వెళ్ళుతున్న రోజులివి. పైగా కుటుంబ నిర్మాణంలో కూడా మార్పు లొస్తున్నాయి. జాయంటు కుటుంబాలు అంతరించాయి; దీనితో బంధువర్గపు మమకారాలూ అంతరించాయి. "ఎవరి బాగు వారిది" అని అనుకొనే రోజులొచ్చాయి. ఈ సామాజిక వాతావరణంలో వయసు మళ్ళినవారు నిరాదరణకు గురవుతున్నారు. ఈ పరిణామం వల్ల అధికంగా బాధపడుతున్నది మహిళలు. స్త్రీ పుట్టిన దగ్గర నుండి వివక్షకు గురవుతూ ఉంటుంది. ఇందువల్ల ఆవిడ, పోషణా లోపాన్ని పుట్టిన దగ్గర నుండే అనుభవించవలసి వస్తున్నది. ప్రమాద భరితమూ, భారము అయిన పనులను చేయవలసి ఉంటున్నది. ఏక కాలంలో పలురకాల పనులను చేయక తప్పని స్థితిలో "బహుపాత్రాభినయం" చేస్తున్నది. కాన్పు తర్వాత కాన్పు తప్పనిది. కుటుంబంలోనూ, సమాజంలోనూ ఆవిడ ఆత్మ గౌరవంతో తలయెత్తుకు తిరుగగల స్థితిలేదు. ఇలాంటి శారీరక, మానసిక పీడనా భావం వల్ల యాభయ్యేండ్లు నిండేటప్పటికే, స్త్రీ శారీరకంగానూ, మానసికంగానూ కృశించిపోతున్నది. దీనికితోడు వైధవ్యం సంప్రాప్తించినా, కుటుంబీకుల నిరాదరణకు గురికావలసి వచ్చినా ఆవిడ వీధిపాలుగాక తప్పటం లేదు.

స్త్రీలు తమకంటే పెద్దవారిని పెండ్లి చేసుకోవటం సంప్రదాయంగా వస్తున్నది. పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ కాలం జీవిస్తారని జీవశాస్త్రం చెబుతున్నది. కనుక, సంఖ్యా పరిమాణంలో, పురుషుల కంటే స్త్రీలే వైధవ్యాన్ని అనుభవించవలసి రావటం అధికంగా కనుపిస్తున్నది. జాయంట్ కుటుంబాలు అంతరించటంవల్ల, కుటుంబ పరంగా వీరికి రక్షణ లభించటం లేదు. తమంత తాము బ్రతకవలసిన స్థితి ఏర్పడుతున్నది. సహచరుడైన భర్తపోవటం, ఏకాకిగా జీవించవలసి రావటంవల్ల శారీరక, మానసిక ఆరోగ్యం దెబ్బతినే ప్రమాదం ఉన్నది. పోషణా లోపం, రక్షణలేమి ఎంతటి మనిషినైనా కుంగదీయటం సహజం. వీరు దారిద్ర్యంతోనూ, అనారోగ్యంతోనూ దిక్కులేని వారుగా బ్రతకవలసి వస్తున్నది. ఏ అనాథ శరణాలయానికో చేరవలసి వస్తున్నది.

స్త్రీల జీవన కాల పరిమాణం అధికం గనుక చాలమంది మహిళలు "మెనోపాజ్" దశ తర్వాత (మాసం-మాసం వచ్చే రుతుక్రమం నిలచిపోయిన తర్వాత) కొన్ని దశాబ్దాలపాటు జీవించి ఉండే అవకాశాలున్నాయి బహిష్ఠు (రుతుక్రమం) ఉడిగిన తర్వాత "ఓవరీ"లోని హర్మోన్ పరిమాణం తగ్గుతుంది. ఇందువల్ల అస్థిపంజరము, హృదయము, నరాలు, చర్మము, జననాంగం, మూత్ర విసర్జన, పొట్ట-ప్రేవుల పని పరిస్థితిలో మార్పులొస్తాయి వీటిలోని కొన్నిటిలో మార్పులు కనుపించినపుడు, అవి "మెనోపాజ్" వల్ల సంభవించినట్లు భావిస్తారు. కాని వీటిలో కొన్ని జీవ సంబంధమైనవి గావచ్చు, మరికొన్ని మానసిక సంబంధమైనవి గావచ్చు. మహిళ నివసించే పరిసర పరిస్థితుల ప్రభావం వల్ల కూడా కొన్ని మార్పులు కనుపించవచ్చు. స్త్రీలో "మెనోపాజ్" దశ రావటానికి ముందుగాని, తరువాత గాని కనుపించే మార్పులకు కారణాలు ఏవైనా గావచ్చు కాని ఈ మార్పుల వల్ల ఇంట్లోగాని, పనిచేసే చోట గాని, పనిచేయగల ఆవిడ శక్తి తగ్గిపోతుంది.

స్త్రీల ఆయుర్దాయం అధికమని పైన పలుసార్లు చూచాం. వారు ఎక్కువ కాలం జీవించిన కొలదీ ఓవరీల స్టీరాయిడ్స్ లోప ప్రభావంవల్ల కొన్ని రకాల రోగాలు వస్తాయి. ఎముకలు బలహీనపడి సులభంగా విరిగే అవకాశాలుండటం, హృద్రోగం, రక్తనాళాలకు సంబంధించిన జబ్బులు ఇందువల్ల వచ్చే వాటిలో కొన్ని. ఇవి మొండిరోగాల కింద లెక్క. వీటికి దీర్ఘకాలిక "థెరపీ" చికిత్స అవసరం. వయస్సు మళ్ళిన తర్వాత రాగల అనారోగ్యపరిస్థితిని అధిగమించే మార్గాలను యువతులకు బోధించటం అవసరం; ఈ అనారోగ్య పరిస్థితిని తట్టుకొంటూ, వారు పనిచేయటానికి - కనీసం తమ దినచర్యల మేరకయినా - సహాయపడే కార్యక్రమాలు అమలు పరచటం అవసరం.

### కాన్సరు ప్రమాదం

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళలలో పొట్టలోనూ, గర్భసంచికి, చనుకట్టుకు కాన్సరు రావటం సాధారణంగా కనుపిస్తున్నది. అభివృద్ధి చెందిన దేశాలలో చనుకట్టుకు, పురీషనాళానికి, మలద్వారానికి ఊపిరితిత్తులకు కాన్సరు రావటం అతి సాధారణంగా కనుపిస్తున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళలకు వచ్చే కాన్సరు కేసులలో నూరింట 27 వంతుల వరకూ జననాంగాలకు (గర్భసంచికి, దాని ముందు భాగానికి (సెర్విక్సుకు), ఓవరీస్‌కు) చనుకట్టుకు

వచ్చే కాన్సరు యొక్క రోగ సూచనలు, స్త్రీ కాన్పుల సమయంలోనే అంకురించి ఉండవచ్చు. కాని మెనోపాజ్ తర్వాత అవి అధికంగా ప్రకటితమవుతాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో యేటా, సాలుకు నాలుగు లక్షల మందికి సెర్విక్సు కాన్సరు వస్తున్నట్లు అంచనా వేస్తున్నారు, దీనివల్ల సాలుకు 1,83,000 మంది మరణిస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు అంచనాలు సూచిస్తున్నాయి. ఆఫ్రికాలోని తూర్పు, మధ్య ప్రాంతాలలోనూ, కరిబియన్, దక్షిణ అమెరికాలోని ఉష్ణమండల ప్రాంతాలలోనూ, ఆసియా ఖండంలోని కొన్ని ప్రాంతాలలోనూ సెర్విక్సు కాన్సరు, ఇతర ప్రాంతాలలో కంటే అధికంగా కనుపిస్తున్నది ఒక స్త్రీకి పలువురు పురుషులతో లైంగిక సంబంధాలున్నపుడు గాని, ఒక మహిళ భర్తకు పలువురు స్త్రీలతో లైంగిక సంబంధాలున్నపుడు గాని ఆ స్త్రీకి గర్భసంచి కాన్సరు వచ్చే ప్రమాదం అధికంగా ఉంటుంది. ఈ రోగాన్ని ప్రాథమిక దశలో గుర్తించగలిగితే, నివారించటం సామాన్యంగా సాధ్యమవుతుంది. అభివృద్ధి చెందిన దేశాలలో పాప్ స్మియర్ పరీక్ష ద్వారా రోగాన్ని నిర్ధారణ చేసే అవకాశాలు అధికంగా ఉన్నాయి. ఇందువల్ల కాన్సరు మూలంగా సంభవించే మరణాలను చాలా వరకు నివారించగలుగుతున్నారు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో యేటా 2,29,000 మందికి చనుకట్టు కాన్సరు వస్తున్నట్లు, వీరిలో 1,58,000 వరకూ మరణిస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు అంచనాలు తెలియజేస్తున్నాయి. స్త్రీ ఎంత వయస్సులో రజస్వలైంది, ఏ వయస్సులో చూలు వచ్చింది, ఏ వయస్సులో "మెనోపాజ్" వచ్చింది అనే అంశాలకు, చనుకట్టు కాన్సరు రాకకు సంబంధం ఉన్నట్లు నిపుణులు భావిస్తున్నారు. ఈ కాన్సరు ఎందుకు వస్తుందో ఇంతవరకూ సరిగా తెలియటం లేదు; అందువల్ల స్పష్టమైన నిరోధక మార్గాలు కూడా రూపొందలేదు. ప్రస్తుతం చనుకట్టు కాన్సరును, స్పర్శ ద్వారా గాని, మెమొగ్రఫీ ద్వారా గాని నిర్ధారణ చేస్తున్నారు. రోగపు రాకను పసిగట్టటానికి ఇపుడున్నవి ఈ రెండు పద్ధతులే.

ఊపిరితిత్తుల కాన్సరువల్ల సంభవించే మరణాలు అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఇతర ప్రాంతాలలో కంటే తక్కువగా ఉంటున్నాయి; ఈ కాన్సరు పురుషులకే అధికంగా వస్తున్నది. స్త్రీలలోనూ పొగతాగే అలవాటు పెరుగుతూ ఉండటంవల్ల దీనివల్ల మరణించే స్త్రీల సంఖ్య కూడా పెరుగవచ్చు. అభివృద్ధి చెందుతున్న దేశాలలోని స్త్రీలలో 5 నుండి 7 శాతం వరకూ పొగతాగుడుకు అలవాటు పడినట్లు అంచనా వేస్తున్నారు. అతికొద్ది దేశాలలో (ఉదాహరణకు-బొలివియా, బ్రెజిల్, నేపాల్, పాపూ న్యూగిని, స్వాజిలాండ్, టర్కీ) స్త్రీ జనాభాలో సగానికి పైగానే పొగతాగటానికి అలవాటుపడినట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేసింది. పొగతాగటానికి అలవాటు పడిన స్త్రీలు సంతానోత్పత్తికి సంబంధించిన ఆరోగ్య సమస్యలను ఎదుర్కొనవలసి రావచ్చు; సెర్వికల్ కాన్సరు కూడా రావచ్చు ఊపిరితిత్తులకు సంబంధించిన రోగాలు, గుండె, రక్తనాళాలకు సంబంధించిన జబ్బులు రావచ్చు. ఇంట్లో పొయ్యి నుండి వచ్చే పొగను పీల్చటంవల్లా, ఇతరులు పొగతాగేటపుడు విడుదలయ్యే పొగను పీల్చవలసి రావటం చేతా మహిళలకు ఊపిరితిత్తుల కాన్సరు వచ్చే ప్రమాదమున్నది.

### గుండె జబ్బులు

అభివృద్ధి చెందుతున్న దేశాలలో అరవయ్యేదు లేక అంతకు మించిన వయస్సున్న స్త్రీలకు గుండె-రక్త నాళాలకు సంబంధించిన కార్డియోవాస్క్యులర్ సమస్యలుగాని, మెదడు-రక్తనాళాలకు సంబంధించిన సెరబ్రోవాస్క్యులర్ సమస్యలు గాని వచ్చే అవకాశాలుంటాయి. ఇవి మనిషి ప్రాణం దీయగల రోగాలన్నది జగద్విదితం. ఈ మరణాలే చైనాలోని మొత్తం మరణాలలో సగభాగానికి కారణమవుతున్నాయి. ఈ రోగాల వల్ల, పురుషుల కంటే స్త్రీలే అధికంగా చనిపోయే అవకాశాలున్నాయి. మద్యపానము, పొగతాగుడు వంటి దురభ్యాసాలు త్వరితగతిని విస్తరించుతూ ఉండటంవల్ల, అభివృద్ధి చెందుతున్న దేశాలలో హృదయము, రక్తనాళాలు, రక్తప్రసరణకు సంబంధించిన రోగాల వల్ల మృతి జెందే వారి సంఖ్య పెరిగే అవకాశాలున్నట్లు భావిస్తున్నారు. ఉండవలసిన దానికంటే శరీరపు బరువు అధికంగా ఉండటం వల్ల, హృద్రోగాలతో స్త్రీలు మరణించే ప్రమాదం పెరుగుతున్నది. ఇలాంటి ప్రమాదానికి గురిగాకుండా ఉండాలంటే, శరీరపు బరువు తగ్గటానికి, రక్తపుపోటు పెరుగకుండా చూడటానికి, పోషణలో అవసరమైన సర్దుబాట్లు చేసుకోవాలనీ, వ్యాయామం చేయాలనీ నిపుణులు సూచిస్తున్నారు.

### మధుమేహం

అభివృద్ధి చెందుతున్న దేశాలలో మధుమేహం (డయాబిటిస్) రావటం తక్కువగా ఉన్నట్లు కనుపిస్తున్నది. ఆసియా, మధ్యప్రాచ్యం, లాటిన్ అమెరికా, కరీబియన్‌లలోని పట్టణ ప్రాంతాలలో ఈ వ్యాధి రావటం అధికంగా కనుపిస్తున్నది తీసుకొనే ఆహారంలో చక్కెర, క్రొవ్వు పదార్థాలు అధికంగా ఉండటం, వ్యాయామం చేయకపోవటం వల్ల ఈ రోగం ఎక్కువగా వచ్చే అవకాశాలుంటాయి. లాటిన్ అమెరికాలోని పదమూడు దేశాలలో (ఈ ఖండంలో మొత్తం 18 దేశాలున్నాయి) సంభవిస్తున్న మరణాలకు మధుమేహం కూడా ముఖ్యమైన కారణంగా చెబుతున్నారు కరిబియన్ ప్రాంతంలోని ఆరుదేశాలలో (ఈ ప్రాంతంలో మొత్తం పదిదేశాలున్నాయి) కూడా ఇదే పరిస్థితి కనుపిస్తున్నది. మధుమేహం ఉన్న వారికి గుండెజబ్బులు రావచ్చు; చూపు మందగించవచ్చు; మూత్రపిండాలు చెడిపోవచ్చు, శరీరంలో దిగువనున్న అంగాలు చెడవచ్చు. చాలా దేశాలలో ఈ రోగం మగవారికంటే ఆడవారికే అధికంగా రావటం కనుపిస్తున్నది. ఈ రోగ నిరోధానికి శరీర బరువు, పరిమితికి మించి పెరుగకుండా చూచుకోవాలి; నిత్యవ్యాయామం అవసరం.

### వృద్ధాప్యంలో పోషణాలోపం

దక్షిణాసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలలో వయస్సు మళ్ళిన స్త్రీలు పోషణా లోపానికి గురవుతూండటం అతి సామాన్యమైన విషయం. గ్రామీణ ప్రాంతాలలోనూ, పట్టణ ప్రాంతాలలోనూ మహిళలు నవమాసాలు మోసి పిల్లలను కనవలసి రావటం, పోషణకు అవసరమైన ఆహారానికి నోచుకోకపోవటం వల్ల, వీరు తీవ్రమైన పోషణా లోపాలకు గురవుతున్నారు; అనీమియాకు ఎరవుతున్నారు. ఈ దుస్థితి వారిని ముసలితనంలో కూడా వెంటాడుతున్నది. ఇంతేకాదు, చాలా మందికి అవసరమైన పరిమాణంలో మాంసకృత్తులు,విటమినులు, ఖనిజలవణాలు లభించటం లేదు. వీరి వంట్లో నీరు తగ్గటం అతి సామాన్యంగా కనువిన్తున్నది. అల్పాదాయ వర్గాలలో అనీమియా తీవ్రరూపంలో ఉంటున్నది. కడుపునిండా తినటానికి లేకపోవటం, కాన్పుల మధ్య తగినంత కాల వ్యవధి ఉండకపోవటం చేతా అనీమియా ప్రమాదం వీరికి అధికంగా ఉంటున్నది.

### ఎముకలు బలహీన పడటం

అరవై సంవత్సరాల వయస్సు దాటిన స్త్రీలలోని పది శాతం మందికి ఎముకలు బలహీన పడటం ప్రారంభమవుతుంది ఈ స్థితిని వైద్యులు ఆస్టియోపోరోసిస్ అని వ్యవహరిస్తున్నారు ఎముకల మందం తగ్గి నొప్పులు, పనిచేయలేని స్థితి దాపురిస్తుంది. ఎముకలు సులభంగా విరిగే అవకాశాలుంటాయి. మెనోపాజ్ తర్వాత ఎముకలు క్షీణించటం ప్రారంభిస్తాయి ఇది వయస్సు ముదిరిన స్త్రీలలో కనుపించటం అతి సామాన్యం. శరీరంలో హార్మోన్ల ఉత్పత్తి తగ్గుదల, పిన్న వయస్సులో నున్నపుడు కాల్షియం తగినంతగా తీసుకోకపోవటం, సూర్యరశ్మి శరీరానికి తగినంతగా సోకకపోవటం, శారీరక శ్రమ చేయక పోవటం వల్ల ఈ దుస్థితి దాపురిస్తుంది.

### కీళ్ళ నొప్పులు

మెనోపాజ్ దశను దాటిన మహిళలకు, కీళ్ళకు పలుసార్లు దెబ్బలు తగిలిన వారికి కీళ్ళనొప్పులు రావటం అతి సామాన్యంగా కనుపిస్తున్నది. ఈ పరిణామాన్ని ఆస్టియోఆర్థ్రైటిస్ అని సాంకేతిక పరిభాషలో వ్యవహరిస్తారు. కాలం గడిచిన కొలదీ దీని బాధ పెరుగుతూంటుంది. నొప్పి, వాపు అధికమవుతూ, చివరకు కీళ్ళు వంగని స్థితి దాపురిస్తుంది. ఇందువల్ల ఒక దశలో వ్యక్తి తన నిత్య కృత్యాలను కూడా చేయలేని స్థితికి రావచ్చు. ఏకాంత వాసానికి గురయిన మహిళలకు, అదీ వృద్ధాప్యంలో, ఈ రోగం వస్తే, వారి జీవనం బాధాకరంగా తయారవుతుంది. దీనికి నివారణ అంటూ ఏదీలేదు. ఉపశమన మార్గాలు మాత్రమే ఉన్నాయి. వీరు బరువు పనులు చేయకూడదు; శరీరబరువు మితిమీరి ఉంటే, తగ్గటానికి ప్రయత్నించాలి; నొప్పులు తగ్గటానికి తగిన మందులను తీసుకోవాలి.

స్త్రీలను సెక్సు హింస, మానసిక రోగాలు జీవితాంతం వెంటాడుతూ ఉండటం కనుపిస్తున్నట్లు పైన చూచాం. వృత్తుల వృత్తి స్వభావం వల్లా, వారు నివసించే పరిసరాల వల్లా కొన్ని ప్రమాదాలు సంభవిస్తాయి. వీటిని కూడా విజ్ఞులు ఆరోగ్య సమస్యలు గానే పరిగణిస్తున్నారు. వీటిని నిరోధించటానికి చర్యలు తీసుకోవటం కూడా అవసరమని చెబుతున్నారు.

### సెక్సు హింస

స్త్రీని శారీరకంగా, మానసికంగా, సెక్సుపరంగా హింసించటాన్ని సెక్సు హింసగా పరిగణిస్తున్నారు సెక్సు హింస అన్ని సమాజాలలోనూ కనుపిస్తున్నది; ఇది "సర్వాంతర్యామి". స్త్రీల అకాల మరణాలకూ, వారు రోగం పాలబడటానికి ఇదొక ముఖ్య కారణం. సెక్సు హింస వల్ల దానికి గురయిన స్త్రీ మానసికంగా తీవ్రమైన దెబ్బను తింటుంది; అవమాన భారంతో క్రుంగి పోతుంది; ఆవిడ శారీరకంగా గాయపడవచ్చు; సుఖ రోగాలకు గురికావచ్చు; హత్యకు లోనుగావచ్చు; లేదా తానే ఆత్మహత్యాపరంగా చావును కొనితెచ్చుకోవచ్చు. ప్రపంచం మోస్తున్న మొత్తం రోగ భారంలో ఐదు శాతానికి మానభంగాలు, స్త్రీ హింస కారణమవుతున్నట్లు ప్రపంచ బ్యాంకు అంచనా వేసింది. అయినా సమాజాలు స్త్రీ హింసను తీవ్రమైన అంశంగా పరిగణించటం లేదు. సమాజంలోని నాయకులు, పాలసీ నిర్ణేతలకు ఇది సామాన్యమైన అంశంగానే కనుపిస్తున్నది! స్త్రీ హింసను గుర్తించలేని చట్టం, దానిని కొన్ని సందర్భాలలో, చట్ట సమ్మతమైనదిగా వదలి వేయటం కూడా కనుపిస్తున్నది.

### మానసిక రోగాలు

స్త్రీలలో కంటే పురుషులకే మానసిక రోగాలు అధికంగా వస్తున్నాయి. ఇలాంటి పురుషులు మద్యపానానికి, మాదక ద్రవ్య వాడకానికి అలవాటు పడటం వల్లా, మూర్ఛల వల్లా స్త్రీకంటే అధిక బాధలకు గురవుతారు. భయకంపిత అయ్యే సంఘటనను ఒకసారి స్త్రీ అనుభవిస్తే, అది గుర్తుకు వచ్చిన ప్రతిసారి ఆవిడ ఆ తొలినాటి వలె భయవిహ్వల అవుతుంది. మనోవైకల్యం సంభవించవచ్చు. ఈ స్థితి పురుషులలో కంటే స్త్రీలలో తీవ్రంగా ఉంటుంది. (దీన్ని సాంకేతిక పరిభాషలో పోస్టు-ట్రమటిక్ స్ట్రెస్ డిజార్డర్ అని అంటున్నారు). స్త్రీలలో మానసిక వ్యథవల్ల రోగాల పాలయిన వారు ఆరునుండి 35 శాతం వరకూ ఉన్నట్లు, పురుషులలో ఈ తరగతివారు రెండు నుండి ముప్ఫయొక్క శాతం మాత్రమే ఉన్నట్లు, ముప్ఫైమూడు దేశాలలో ఈ అంశ నిర్ధారణకు 1993లో జరిగిన సర్వేలో తేలింది. ఆత్మహత్యా ప్రయత్నాన్ని చేయటంలో స్త్రీల సంఖ్య అధికంగా కనుపిస్తున్నా, ఈ ప్రయత్నంలో చనిపోయేవారి సంఖ్య పురుషులలో అధికంగా ఉన్నట్లు అదే సర్వేలో వెల్లడైంది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో సంతానవతులు కాగల వయసులోని స్త్రీలకు వచ్చే అనారోగ్యంలో పన్నెండు శాతం వరకూ మానసిక - శారీరక సమస్యల వల్ల (న్యూరోసైకియాట్రిక్ ప్రోబ్లమ్స్ వల్ల) వస్తున్నట్లు ఇందులో సగభాగం వరకూ మానసిక వ్యథా, విరక్తి భావాల వల్ల వస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు నిపుణులు అంచనా వేశారు. ఇదే వయస్సుగల మహిళలలో ఊపిరితిత్తుల రోగాలతో గాని, రోడ్డు ప్రమాదాలలో గాని మరణించే వారి సంఖ్యా పరిమాణం కంటే, ఆత్మహత్యలవల్లే అధికులు చనిపోతున్నట్లు ప్రపంచ బ్యాంకు నిపుణులొకరు అంచనా వేశారు. మానసిక వ్యథ ఒక సారి మనిషికి వస్తే అది తొలగిపోవటం అరుదు. కొంత కాలం అది లేకపోయినా తర్వాత మరొక వయస్సులో రాదన్న నమ్మకం లేదు. అందువల్ల మానవ జీవితాన్నిది కష్టాలపాలు జేస్తుంది. ఇలాంటి మానసిక వత్తిడులకు గురయినవారు పనిమీద మనస్సును కేంద్రీకరించ లేరు. ఏ వయస్సులో నున్న స్త్రీలనైనా మానసిక వ్యథ పీడించవచ్చు.

సాంఘిక, సాంస్కృతిక జీవన సంబంధమైన కారణాల వల్ల మానసిక సమస్యలుత్పన్న మవుతాయి. సెక్సుహింస, మానభంగం, దెబ్బలు తినవలసి రావటం, సెక్సుపరమైన పీడన, సంతానం వద్దని తాపత్రయ పడుతున్న కాలంలో గర్భధారణ, సంతాన ప్రాప్తి లేకపోవటం, సుఖరోగాల భయం, హెచ్ ఐ వి, ఎయిడ్స్ వల్ల కలిగే భయం, ఇంట్లో, వెలుపలా పనిభారపు పెరుగుదల, (ఇంట్లో గృహిణిగా వెలుపల ఉద్యోగినిగా ద్విపాత్రాభినయం చేసే వారిని ఉదాహరణగా చెప్పవచ్చు). సమాజంలో తక్కువ వారిగా పరిగణనకు రావటం, స్త్రీగా వివక్షను అనుభవించ వలసి రావటం, కాన్పు తర్వాత వచ్చే అనారోగ్యం, మెనోపాజ్, దానితో వయస్సు ముదిరిన కొలదీ వచ్చే సమస్యలు ఇవన్నీ స్త్రీలకు మానసిక రోగాలు రావటానికి కారణాలవుతున్నాయి.

### వృత్తిలో ఎదురయ్యే సమస్యలు

స్త్రీలు పలువృత్తులలో ఉన్నారు. ఇందువల్ల వీరు రసాయన విషాలకు, ధార్మిక కిరణ ప్రసరణకు, చెవులు చిల్లులు పడే ధ్వనికి, అధిక ఉష్ణోగ్రతలకు, ప్రమాదాలకు, సెక్సు పీడనకు, సెక్సు పరమైన హింసకు గురిగాక తప్పటం లేదు. పని

పరిస్థితులను చట్టబద్ధంగా నియమిత పరచని పరిశ్రమలలో ముఖ్యంగా వస్త్ర, పాదరక్షల, ఆహారోత్పత్తుల, ఎలక్ట్రానిక్, కుటీర పరిశ్రమల వంటివాటిలో స్త్రీలను మాత్రమే నియమిస్తూంటారు. తక్కువ వేతనాలకు అంగీకరించటం, చేతి నైపుణ్యము, ఓర్పు, దీక్ష, తిరుగబడని మనస్తత్వం గలవారని, వీరిని యజమానులు కోరతారు కుటుంబపోషణా భారాన్ని మహిళలు వహించవలసి వచ్చే చోట్ల, అధిక వేతనం, వసతిగా పనిపరిస్థితులు కావాలని కోరగల శక్తి స్త్రీల కుండదు. కుటుంబ పోషణ జరుగదన్న భయంతో ఎంత తక్కువ వేతనం ఇచ్చినా పనిచేయటానికి సిద్ధంగాక తప్పటం లేదు. వేతన పెంపును కోరే శక్తి, ధైర్యం వీరి కుండదు స్త్రీలు పనిచేసే పరిశ్రమలు సాధారణంగా చిన్నవి గనుక పని పరిస్థితులు నికృష్టంగా ఉంటాయి. ప్రమాదాలు జరిగే అవకాశాలు కూడా అధికంగా ఉంటాయి. ఈ పరిశ్రమలలో అవసరమైన యంత్ర పరికరాలు కూడా తగినన్ని ఉండవు. ఇందువల్ల మహిళా కార్మికులు తక్కువ వేతనాలకు పనిచేయవలసి రావటమే గాక, పనిలో పలురకాల ప్రమాదాలకు గురవుతూ, అధిక పనిభారాన్ని మోయవలసి వస్తుంది.

పరిశ్రమలో పని పరిస్థితులు తగినట్లు లేకపోవటం చేత కార్మికులు అంగవైకల్యాన్ని అనుభవించ వలసినంతటి పెద్ద ప్రమాదాలకు కూడా లోనవుతూ ఉంటారు. ఇందువల్ల జీవితాంతం అవిటి బ్రతుకును వెళ్ళదీయవలసి ఉంటుంది ఇది చాలదన్నట్లు వీరు మొండి రోగాలకు ఎరవుతారు. పనిభారం వల్ల వెన్ను నొప్పికి గురిగావచ్చు; ఒకే రకమైన పనిని త్వరిత గతిని చేయవలసి రావటం వల్ల (ఉదాహరణకు కన్వేయరు బెల్టుమీద వచ్చే పాకెట్ల ప్యాకింగు) ఆ పని, శారీరకంగా భారమని పిస్తుంది. జాగ్రత్తగా చూపును కేంద్రీకరించి చేసే పనులవల్ల కండ్లకు విపరీతశ్రమ గలుగుతుంది. అధిక శబ్దం వల్ల  వినికిడి తగ్గవచ్చు; లేదా చెముడు రావచ్చు. ఇలాంటి వాటివల్ల కార్మికులు తాత్కాలికంగానో, శాశ్వతంగానో పనిచేయటానికి పనికి రాని వారుగా తయారయ్యే ప్రమాదమున్నది. ఎలక్ట్రానిక్ పరిశ్రమలలో పనిచేసే కార్మికులకు చూపు దెబ్బతింటున్నది. వస్త్ర పరిశ్రమలో పనిచేసే కార్మికులకు ఊపిరితిత్తులకు సంబంధించిన రోగాలు వస్తున్నాయి; చేతులకు గాయాలవుతున్నాయి; వెన్నునొప్పి వస్తున్నది. విషపూరిత రసాయనాలు సోకటంవల్ల కాన్సరు, చర్మరోగాలు రావచ్చు: గర్భస్రావం జరుగవచ్చు; పుట్టే బిడ్డకు అంగవైకల్యం సంప్రాప్తించవచ్చు కొన్ని జీవసంబంధమైన కారణాల వల్ల. మహిళలు మాత్రమే కొన్ని రసాయన విషాలకు ప్రభావితులు గావచ్చు.

అధిక పనిభారము, అనేక రకాల పనులను - అదీ ఒకే కాలంలో అన్నింటిని చేయవలసి రావటం వ్యవసాయ కుటుంబాలలోని స్త్రీల అనారోగ్యానికి ప్రధాన కారణాలు గ్రామీణ మహిళలు శక్తికి మించిన శ్రమను చేయవలసి ఉంటుంది. కుటుంబంలో, వారి కుండే స్వల్ప ఆర్థిక వనరుల మీద వీరికి అజమాయిషీ ఉండదు. ఇందువల్ల వారి అవసరాలకు తగినంత పోషణ లభించదు. తగినంత విశ్రాంతి లభించదు; ఆరోగ్య రక్షణకు అవకాశం ఉండదు; చికిత్సకు పోయే స్వాతంత్ర్యం కూడా ఉండదు. పొలం పనులు చేసేటపుడు ఎరువులు, పురుగు మందుల విష ప్రభావానికి లోనయ్యే ప్రమాదం ఉన్నది.

పుల్లల పొయ్యి మీద వంటా-వార్పు చేయవలసి రావటం, ఇంటి అవసరాలకు నీటిని, వంట చెరకును సేకరించి మోసుకురావటం వంటి పనులు వారి ఆరోగ్యాన్ని భంగ పరచవచ్చు. ఈ పనులను చేస్తూ, వారు గాయపడే ప్రమాదమున్నది. భారత దేశంలోని గ్రామాలలో మహిళలు గాలి, వెలుతురు చొరని గుడిసెలలో, పూరిండ్లలో పొయ్యి దగ్గర పనిచెయ్యటం వల్ల పొయ్యి నుండి వచ్చే పొగను పీల్చవలసి వస్తున్నది. "హానికరం కాదు" అని ఆరోగ్య సూత్రాల ప్రాతిపదిక మీద నిర్ణయించబడిన పరిమాణానికి, వందరెట్లకు మించే స్త్రీలు పొయ్యి నుండి వచ్చే పొగను పీల్చుతున్నట్లు డాక్టర్ మీరా ఛటర్జీ అంచనా వేశారు. భారత దేశంలో పొయ్యి పొగలో పనిచేసే వ్యక్తి, రోజుకు ఇరవై పెట్టెల సిగరెట్లు తాగటం వల్ల జరుగ గలిగి నంతటి నష్టానికి గురవుతున్నట్లు పాట్రీసియా స్మిత్ అనే మహిళా శాస్త్రవేత్త అంచనా వేశారు! కుటుంబంలోని పురుషుల కంటే, పొయ్యి దగ్గర పనిచేసే మహిళలు ఆరురెట్లు అధికంగా ఈ పొగను పీల్చుతున్నారని కూడా ఈ శాస్త్రవేత్త వెల్లడించారు. ఆరోగ్య పరిమితిని మించిన పరిమాణంలో పొగను పీల్చిన పసి పిల్లలకు ఊపిరితిత్తులకు సంబంధించిన రోగాలు తీవ్రమైన పరిమాణంలో రావచ్చు. పెద్దవారికి కూడా

ఊపిరితిత్తులకు సంబంధించిన రోగాలు రావచ్చు. ఈ స్థితిలో జీవించవలసి వచ్చే చూలాలికి పుట్టే బిడ్డ బరువు, ఉండవలసిన దానికంటే తక్కువ ఉండవచ్చు; లేదా చనిపోయిన బిడ్డ పుట్టవచ్చు. భారతదేశంలోనూ, చైనాలోనూ మహిళలలో సగం మంది (పొగతాగటానికి అలవాటు పడిన వారితో సహా) ఊపిరితిత్తులకు, హృదయానికి సంబంధించిన మొండి రోగాలతో బాధపడుతున్నట్లు కిర్క్ స్మిత్, లూ-యోచెంగ్ అనే శాస్త్రవేత్తలు అంచనావేశారు. చైనాలోని తీన్‌జీన్ పట్టణ మురికి వాడలలో వంట చెరకుగానూ, గదిని వెచ్చ చేయటానికీ ఖనిజపు బొగ్గును (కోల్‌ను) దీర్ఘకాలంగా వాడుతున్న స్త్రీలకు, కోల్‌ను వాడని వారికంటే అధికంగా ఊపిరితిత్తుల కాన్సరు వస్తున్నట్లు మేరి యాంగ్, బెర్‌ట్రూడ్‌లు సూచించారు.

ఈ విధంగా స్త్రీలు తల్లి గర్భంలో పిండంగా అవతరించిన నాటి నుండీ, కాటికి పోయే వరకూ ప్రాణ గండాలను ఎదుర్కొంటున్నారు. అవి తప్పితే అనారోగ్య బాధను, అందునా నిరోధించగలిగిన అనారోగ్యాన్ని అనుభవిస్తున్నారు.

పిండంగా తల్లి గర్భంలో ఉన్నపుడు జరిగే లింగ నిర్ణయ పరీక్షలో నెగ్గలేక పోతే (ఆడజన్మ నెత్తుతూంటే), తల్లికి జరిగే గర్భ విచ్ఛిత్తి ప్రయత్నంలో మరణించే ప్రమాదాన్ని స్త్రీ ఎదుర్కొన వలసి వస్తున్నది. ఈ పరీక్షలో నెగ్గి నేలమీద పడితే, "వంశోద్ధారకుడు", "పున్నామనరకం నుండి తండ్రిని రక్షించ గలవాడు" అయిన మగపిల్లవాడి కంటే "తక్కువ" ది గనుక, పోషణ, సంరక్షణలలో ఆవిడ వివక్షను అనుభవించ వలసి వస్తున్నది. ఇలాంటి వివక్షను అనుభవిస్తున్న తల్లికి పుడుతున్నట్లయితే చూలు, కాన్పుల కాలంలో ప్రాణ గండాలను ఎదుర్కొన వలసి వస్తుంది. వీటిని గడచి కౌమారంలో ప్రవేశించ గలిగితే, తగని వయస్సులో గర్భధారణ ప్రమాదం ఉంటున్నది. చూలు కాన్పులలోని ప్రమాదాలను అనుభవించ వలసి వచ్చే అవకాశాలుండగా, సుఖవ్యాధులు, ఎయిడ్స్, భర్త చేతిలో శారీరక, మానసిక హింస, అనారోగ్యం, మెట్టినింటి వారి వంట ఇంటిలో "అగ్ని ప్రమాదాలకు" గురయ్యే అవకాశాలు పంచపాళీ లోని పాముల్లా పొంచి ఉంటున్నాయి. ఈ దశను గడచి గట్టెక్క గలిగితే, శరీర ఆరోగ్యానికి తగినంత విరామం లభించకుండా వరుసగా వస్తూండే చూలు, కాన్పులు, వాటిలో వచ్చే ప్రమాదాలు, అనారోగ్య బాధలు అగ్నికి ఆజ్యంలా తోడ్పడుతుంటాయి. ఇల్లాలిగా పెనుభారాన్ని మోయక తప్పదు. ఉద్యోగం కూడా చేయవలసి వస్తే, రెండు షిఫ్టుల పనిని ఒక్కతే చేయవలసి ఉంటుంది

భూదేవిలా ఓర్పు వహించి మెనోపాజ్ దశలో ప్రవేశించ గలిగితే కాన్సరు, హృద్రోగాలు, మధుమేహం, ఎముకలు బలహీన పడటం, కీళ్ళ నొప్పులు, శుక్లాల వంటి మొండి రోగాలతో బాధపడక తప్పదు. ఇది చాల దన్నట్లు కుటుంబీకుల అనాదరణ కూడా తోడయితే, పోషణా లోపమూ, మానసిక వ్యధా సంక్రమిస్తాయి.

ఈ విధంగా స్త్రీ జీవితాంతం ప్రాణ గండాలనూ, పోషణా లోపాన్ని ఎదుర్కొంటూ, అనారోగ్యంతో బాధపడవలసి వస్తున్నది. మనిషన్న తర్వాత రోగాలు రాకుండా ఉండని మాట నిజం. అతి స్వల్ప ఖర్చుతో నిరోధించ దగిన రోగాలకు, అనారోగ్యానికీ స్త్రీ గురవుతూండటం బాధాకరంగా కనుపిస్తుంది. మెనోపాజ్ దశ తర్వాత స్త్రీ, పురుషుని కంటే ఎక్కువ కాలం జీవించ గలిగినా, వారి కంటే అధిక అనారోగ్య భారాన్ని మోయ వలసి ఉంటుంది; కుటుంబీకుల అనాదరణకు గురయ్యే ప్రమాదమూ ఉంటుంది. ఇంత కాలమూ అనుభవించిన లింగ వివక్షా దుష్ఫలితం చాలదన్నట్లు, ఇది ఆవిడ అనుభవించవలసి వస్తున్న అదనపు శిక్షలా కనుపిస్తుంది. ఈ విధంగా స్త్రీ జీవితాంతము ప్రాణ గండాలను ఎదుర్కొంటూ పురుషుని కంటే అధికకాలం పనిచేస్తూ, అనారోగ్య భారాన్ని వారికంటే అధికంగా మోస్తూ సమాజపు మనుగడకు అవసరమైన భావి పౌరులను ప్రసాదిస్తూనే ఉన్నది; కుటుంబీకులకు, భర్తకు పలురకాల సేవల నందిస్తూనే ఉన్నది. తాను మాత్రం మృత్యునీడలో పయనిస్తూ, ఈ కృషీ నిర్వహణలో హారతి కర్పూరంలా హరించుకు పోతున్నది.

ప్రపంచ వ్యాపిత పరిస్థితుల దృష్ట్యా మనకు కనుపించే స్త్రీ జీవన చిత్రమిది. భారత దేశంలోని స్త్రీల పరిస్థితి ఎలా ఉన్నదో చూద్దాం.

# 5

## భారత దేశంలో స్త్రీల ఆర్థిక సాంఘిక పరిస్థితులు

భారత దేశంలో అధికులు పేదలు, ఉన్న వైద్య చికిత్సా వసతులు కూడా స్వల్పమే. ఇందువల్ల దేశంలోని అధిక జనాభా ఇబ్బందులు పడుతున్నది. ఇటీవలి కాలంలో పరిస్థితులు కొంత మెరుగు పడుతున్నా, పురుషుల పరిస్థితులలో కనుపించి నంతటి అభివృద్ధి స్త్రీల జీవనంలో కనుపించటం లేదు. ముఖ్యంగా ఆడపిల్లలు, ముప్పై సంవత్సరాల లోపు మహిళలు అధిక బాధలను అనుభవించవలసి వస్తున్నది. స్త్రీలు సంతానాన్ని కనవలసి రావటం వారి దుస్థితికి ప్రధాన కారణమవుతున్నది ప్రపంచంలో చూలు - కాన్పుకు సంబంధించిన మరణాలు అధికంగా ఉంటున్న దేశాలలో మనదీ ఒకటి. దక్షిణ భారతంలో కంటే ఉత్తర భారతంలో ఈ రకమైన మరణాలు అధికంగా ఉంటున్నాయి.

వివాహము, కుటుంబం, వారసత్వం వంటివి సంప్రదాయ బద్ధమైనవి. ఇందులో ఉత్తర భారతం, దక్షిణ భారతం లేక హిందూ ముస్లిం అనే భేదాలు లేవు. ఎవరి సంప్రదాయాలు వారివి. ఎవరి సంప్రదాయాలను వారు పాటిస్తున్నా, స్త్రీని, సమాజంలోనూ, కుటుంబంలోనూ అధమ స్థానానికి తరమటంలో మాత్రం ఏక సూత్రాన్ని పాటిస్తున్నారు! ఇది పలు సామాజిక అనర్థాలకు దారి దీస్తున్నది.

పురుష ద్వేషంతో ఫెమినిస్టులు చేసే ఆరోపణలుగా ఈ వాదాన్ని తొలగదోయవచ్చు. మానవ స్వేచ్ఛకు మూలమైనవి, రెండు అంశాలున్నాయి. 1. బయటి ప్రపంచంతో సంబంధం. పురుషుని ఎస్కార్టు లేకుండా సమాజంలో సంచరించే అవకాశాలు స్త్రీలకు కూడా ఉండాలి. ఇందువల్ల నిత్య జీవితంలో తాను వినియోగించుకో దగిన వనరు లేమిటో, వాటిని ఎలా పొందాలో వారికి తెలుస్తుంది; 2. వారికి ఇంటా బయటా కూడా స్వేచ్ఛ ఉండాలి. ఇంటా బయటి స్వేచ్ఛను, ''కనుపించిన వాడితో నల్లా లేచిపోయే స్వేచ్ఛగా'' సంప్రదాయబద్ధులు వక్రీకరించటం సహజం. ఇది పొరపాటు. తాము కోరిన చోటకు వెళ్ళగలగటం, చేయదగిన ఉద్యోగాన్ని చేయటం, ఆర్జించిన దానిని తన కుచితమని తోచిన రీతిని కుటుంబానికి ఖర్చుచేయటం, తాను కోరినపుడు సెక్సును అనుభవించటం, తన ఆరోగ్య పరిస్థితిని బట్టి సంతానాన్ని పొందటం, తన పుట్టినింటి వారితో, తాను కోరిన పక్షంలో సన్నిహిత సంబంధాలను కలిగి ఉండటం వంటి వాటిని స్వేచ్ఛకు నిర్వచనాలుగా చెప్పవచ్చు. తాను కోరినపుడు పెండ్లి

చేసుకోవటం, కుటుంబ నియంత్రణ విధానాల అవలంబనకు స్వేచ్ఛ కూడా వారి కుండాలి. ఇలాంటి పరిస్థితులలో మాత్రమే పురుషులతో సమానమైన స్వేచ్ఛను, సమాజంలోనూ, కుటుంబంలోనూ స్త్రీ అనుభవించ గలుగుతుంది.

కుటుంబంలో ఇంతటి స్వేచ్ఛను అనుభవించగల అదృష్టం భారతీయ మహిళలలో అత్యధికులకు అబ్బలేదు. దక్షిణ భారతంలో కంటే ఉత్తర భారతదేశపు స్త్రీల స్థితి అత్యంత దయనీయంగా ఉన్నది. ఈ ప్రాంతపు సమాజాలలో, తరతరాలుగా వస్తున్న సంప్రదాయాలను, నియమం తప్పకుండా పాటిస్తున్నారు. తండ్రి నుండి వారసత్వం కుమారునకు వస్తుంది; కుటుంబంలో పురుషునిదే అధికారం; వివాహానంతరం స్త్రీ తన పుట్టినింటి వారితో సంబంధాలను పూర్తిగా తెంచుకోవాలి. భర్త మరణానంతరం, తనను చూచే దిక్కులేని స్థితిలో కూడా ఆవిడ పుట్టినింటి వారి పంచకు చేరకూడదు.

వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకోవటంలో వారు పాటించే సంప్రదాయాలను చూస్తే, స్త్రీలు ఎంతటి బాధలను అనుభవించ వలసి వస్తున్నదీ అర్థమవుతుంది. సామాజిక సంప్రదాయం నిర్ణయించిన హద్దులను మీరి వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకోకూడదు. కులాంతర వివాహాలు నిషిద్ధం. పెండ్లి సంబంధాన్ని కుదుర్చుకోవటంలో వధువుకే కాదు, వరునకు కూడా సంబంధం ఉండదు. పెద్దలు నిర్ణయించిన వారిని వారు చేసుకోవాలి. ఇంతకు పూర్వమే బంధుత్వ సంబంధం ఉన్న కుటుంబాల వారి మధ్య వివాహాలు జరుగకూడదు. బయటి సంబంధాన్ని నిశ్చయం చేసుకోవాలి. ఇల్లరికాలు నిషిద్ధం. అంతే గాదు; ఆడపిల్ల స్వగ్రామంలో అల్లుడు కాపురం కూడా ఉండకూడదు. పిల్లనిచ్చేవారిని, తమ కంటే తక్కువ వారినిగా మగపెండ్లి వారెంచుతారు! తమ ఈ ఆధిక్యతను వినియోగించుకొని, వధువు తలిదండ్రుల నుండి అధిక పరిమాణంలో కట్నాలు-కానుకలను పిండుతారు. పెండ్లయిన వెంటనే వధువు కోడరికానికి వెళ్ళాలి. ఇందువల్ల ఆవిడ తలిదండ్రులు, ఇంట్లో పనికి ఉపకరిస్తున్న ఒక మనిషిని కోల్పోవటమేగాక, ఇంటిని గుల్ల చేయగల మేరకు కట్నాల చెల్లింపును అత్యధికమైన భారంగా ఎంచుతున్నారు. కడుపు తీపిని కూడా మరచి, ఆడపిల్ల పుట్టటాన్ని శాపంగా యెంచుతున్నారు.. తమకూ మగపిల్లలే ఉంటే ఎంత బాగుండేది అనే భావనలో పడుతున్నారు. ఇలా తలిదండ్రులు ఆడపిల్ల పుట్టుక మీదే విరక్తులవుతున్నారు! పుట్టినింటి వారితో సంబంధాలను తెంచుకోవలసి రావటం (అదీ అకస్మాత్తుగా) వధువుకు ఎంత బాధాకరంగా ఉంటుందో ఊహించవచ్చు.

వధువుకు పుట్టినింటి వారితో సంబంధాలు తెగిపోయినాయి; ఆవిడకు మెట్టినిల్లంతా క్రొత్తే. అత్తగారి పెత్తనం కింద మెలగాలి; కుటుంబ ప్రతిష్ఠను "ఇనుమడింప చేసేట్లు" ప్రవర్తించాలి; అపకీర్తి తేకూడదు; కుటుంబంలోనూ, కులంలోనూ, పురుషుల మధ్య నున్న అనుబంధం, స్త్రీల వల్ల చెడకూడదు. ఈ దృష్టితోనే భార్యా భర్తలను పెద్దలు అత్యంత సన్నిహితంగా మెలగనీయరు. ఇతర మగవారికి కూడా వీరు దూరంగా ఉండాలి. ముఖం మునిగే మేరకు కొంగు కప్పుకోవాలి. పరాయి మగవారికి మొగం కనుపించకూడదు. పేరుకు పరదా గాక పోయినా, ఇది అలాంటిదే. ఇలాంటి అవరోధాల వల్ల దంపతులు కుటుంబ నియంత్రణను గురించి, వారి వ్యక్తి గత సంబంధాలను గురించి స్వేచ్ఛగా మాట్లాడుకొనే అవకాశాలుండవు. తన క్షేమం కంటే, తన భర్త క్షేమం, కుటుంబ గౌరవం ప్రధానమైనవిగా ఇంటి కోడలు ఎంచాలి; ఈ అవసరాలకు తాను లోబడి ఉండాలని తెలుసుకోవాలి. వారసత్వం నిలువబెట్టగల మగసంతానాన్ని కనటమే తన బాధ్యతగా ఆవిడ భావించాలి. సంప్రదాయ బద్ధమైన కుటుంబ జీవనంలో స్త్రీల స్థితి ఇలాగే ఉంటుంది.

దక్షిణ భారత దేశంలో స్త్రీల స్థితి ఇంత బాధాకరంగా కనుపించదు. మేనరికాలు చేసుకోవటం ఈ ప్రాంతపు సంప్రదాయం. మేనరికం జరిగే వీలుండక పోయినపుడు, బంధుత్వం కలిసిన వారితో వియ్యమందటం ఆచారంగా వస్తున్నది. (ఈ స్థితి ఉత్తర భారతంలో అనూహ్యం !) అయిన వారితోడి వియ్యాలున్నాయి గనుక, స్త్రీకి వివాహానంతరం పుట్టినింటి వారితో సంబంధాలు కొనసాగుతాయి; వియ్యాలవారు ఒకరి నొకరు సమానులుగా చూచుకొంటారు. సమాజంలో సంచరించే స్వేచ్ఛ కూడా ఈ ప్రాంతపు స్త్రీలకు అధికం. ఉత్తర భారతంలో ఆడపిల్ల తలిదండ్రులు, వరునకు కట్నాలు, కానుకలు సమర్పించవలసి ఉండగా, దక్షిణాన

మగపెండ్లివారు వధువు తల్లి దండ్రులకు కన్యాశుల్కం చెల్లించ వలసిన ఆచారం ఉండేది. పెండ్లి సంబంధం సంభవించేది సన్నిహిత బంధువుల మధ్య గనుక, ఈ శుల్కపు మొత్తాలు కూడా నామమాత్రం గానే ఉండేవి.

కాల గమనంతో సంప్రదాయాలకూ కాలం చెల్లిపోతున్నది. దక్షిణ భారతంలో పరిస్థితి ఇపుడిలా లేదు. అయిన వారితో సంబంధాలు చేసుకోవటం అంతరిస్తున్నది. కాని వారితో వియ్యమంది, పెద్ద యెత్తున కట్నాలను రాబట్టే ఆచారం అవతరించింది! వధూవరుల ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా పెండ్లిండ్లు చేసే ఆచారం త్వరితగతిని వెనుకడుగు వేస్తూండటం ముదావహం "గొప్పింటి" వారికిచ్చి చేయటం వల్ల పిల్ల సుఖపడుతుందన్న ఆశ, వధువు తలిదండ్రుల కున్నా, కట్నాల చెల్లింపుతో ఇల్లు గుల్లవుతున్నది. కట్నాల చెల్లింపు విషయంలో ఉత్తర, దక్షిణ భారతాల మధ్య సారూప్యమున్నా, వధూవరుల ఇష్ట ప్రకారం పెండ్లి సంబంధం కుదుర్చు కోవటం, వివాహానంతరం, వధువు తన పుట్టింటి వారితో సంబంధాలను కొనసాగించే అవకాశాలుండటం, కుటుంబంలోనూ, సమాజంలోనూ పరిమితంగా నైనా స్వేచ్ఛను అనుభవించే విషయంలో మాత్రం, ఉత్తర, దక్షిణ భారతాల మధ్య అంతరం కనుపిస్తున్నది. ఇందువల్ల, ఉత్తర భారత స్త్రీల కన్న, దక్షిణ భారత స్త్రీల పరిస్థితి మెరుగని చెప్పవలసి ఉన్నది.

దేశం ముస్లిం చక్రవర్తుల పాలన కిందకు రాకపూర్వమే, ఈ రెండు ప్రాంతాల మధ్య సంస్కృతీ, సంప్రదాయాలలో తేడాలున్నాయని చరిత్రకారులు చెబుతున్నారు. ఆర్య ద్రవిడ సంప్రదాయ భిన్నత్వానికిది ప్రతిరూపమా అన్న అంశం మీద పలురకాల అభిప్రాయాలు వ్యక్త మవుతున్నాయి. వర్తమాన పరిశోధకులు ఇందుకు ఆర్థిక కారణాలను చూపుతున్నారు. దక్షిణ భారతంలో వరిపైరును పండించటంలో స్త్రీల శ్రమ కీలకపాత్ర వహిస్తూండటం, ఉత్తర భారతంలో పండే గోధుమకు ఇంత అధికంగా స్త్రీల శ్రమ అక్కర లేకపోవటం కారణం గావచ్చునని ప్రణాబ్ బర్ధన్, బార్బరా మిల్లర్, పాల్.టి. షూల్జులు అభిప్రాయ పడుతున్నారు. ఉత్తర, దక్షిణ భారత స్త్రీల సామాజిక, ఆర్థిక స్థితి గతులలోని తేడాలకు, ప్రాంతీయ, ఆర్థిక సాంఘికాంశాలు కారణంగావు అనే వాదం కూడా ఉన్నది; సాంస్కృతిక భిన్నత్వమే ఇందుకు కారణమని సూచిస్తున్నారు. ఈ వాదానికి రుజువుగా ప్రపంచ బ్యాంకు రిపోర్టు* అలకా బసు పరిశోధనా ఫలితాలను ఉదహరించింది. 1989వ సంవత్సరంలో వీరు ఉత్తర ప్రదేశ్ నుండి, దక్షిణాదిన ఉన్న తమిళనాడు నుండి ఢిల్లీకి వలస వచ్చిన కూలీల స్థితి గతులను బసు పరిశీలించారు. ఈ రెండు ప్రాంతాల వారు ఒకేరకమైన పరిసరాలలో, ఒకే రకమైన పనులను చేస్తూ పొట్టబోసుకొంటున్నారు. ఉత్తరప్రదేశ్ నుండి వచ్చిన స్త్రీల కంటే, తమిళనాడు నుండి వచ్చిన స్త్రీలు అధిక స్వేచ్ఛను అనుభవిస్తున్నట్లు వీరు గమనించారు. తమిళనాడు నుండి వలస వచ్చిన స్త్రీలలో నూరింట 64 మంది కూలి పనులకు వెళుతుండగా, ఉత్తర ప్రదేశ్ నుండి వచ్చిన వారిలో కేవలం నూటికి ఆరుగురు మాత్రమే కూలిపనికి పోతున్నట్లు వీరు గుర్తించారు. రెండు ప్రాంతాల కుటుంబీకుల ఆర్థిక పరిస్థితులు ఒకే రకంగా ఉన్నపుడు, ఒక ప్రాంతపు స్త్రీలు అధికంగాను, మరొక ప్రాంతం వారు తక్కువ గానూ కూలీపనులకు పోతూ ఉండటాన్ని బట్టి, దీనిని సంస్కృతీ భేదంగా అలకా బసు నిర్ణయించారు. తమిళ స్త్రీలు అధికంగా పనులకు వెళ్ళటం వారి ఆర్థిక స్వేచ్ఛకు ప్రతిబింబం; బయటి ప్రపంచంతో సంబంధాన్ని పెంచుకోవటం కుటుంబంలో వారికున్న స్వేచ్ఛకు సంకేతం. ఇలా స్త్రీలు వేతనార్జనకు బయటి ప్రపంచంలోకి వెళ్ళటం వల్ల, తమ జీవితం మెరుగుగావటానికున్న వసతుల గుర్తింపుకు వీలుంటుంది. ఇందువల్ల వారి ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. అంతేగాదు; ఈ రెండు ప్రాంతాల వారి ఆరోగ్యంలో కూడా ఈ స్వేచ్ఛా పరిమాణ ప్రభావం కనుపిస్తున్నది. ఉత్తర ప్రదేశ్ స్త్రీల సంతాన ప్రాప్తి రేటు, మరణాల రేటు కూడా తమిళ స్త్రీల కంటే అధికంగా ఉన్నది; నాలుగు సంవత్సరాల లోపు ఆడపిల్లల మరణాలు మగపిల్లల మరణాల రేటు కంటే అధికంగా ఉన్నది. తమిళనాడు నుండి వచ్చిన వారిలో, నాలుగు సంవత్సరాలలోపు వయస్సు వారిలో మగపిల్లల మరణాల రేటు ఆడపిల్లల మరణాల రేటు కంటే అధికంగా ఉన్నది. స్త్రీల స్వేచ్ఛలోని భిన్న పరిమాణాలు, వారి ఆరోగ్యం విషయంలోకూడా భిన్నత్వాన్ని ప్రదర్శిస్తున్నట్లు అలకా బసు అభిప్రాయపడ్డారు.

* ఇంప్రూవింగ్ ఉమెన్స్ హెల్త్ ఇన్ ఇండియా

ఉత్తర భారతంలోని స్త్రీలు, దక్షిణ భారతంలోని స్త్రీలు అనుభవిస్తున్న స్వేచ్ఛ, సమానత్వాలలో భిన్నత్వం ఉన్నంత మాత్రాన, దక్షిణ భారత స్త్రీలు స్వర్గ సుఖాల ననుభవిస్తున్నట్లు భావించవలసిన అవసరం లేదు. రెండు ప్రాంతాలలోనూ స్త్రీలకు లభిస్తున్నది దిగువ స్థానమే ఇందువల్ల, పుట్టిన నాటి నుండి కాటికి పోయేవరకూ ఆవిడను అనారోగ్యం వెన్నాడుతూనే ఉంటున్నది; ఆడపిల్లలు, గుదిబండలు గానూ, మగపిల్లలు పోషకులు, సంరక్షకులు గానూ చిత్రితమవుతున్నారు! తలి దండ్రులు ఆడపిల్లలకు బదులు మగపిల్లలకే అధిక ప్రాధాన్యత నిస్తున్నారు. భారం వదిలించుకోవటానికా అన్నట్లు యుక్త వయస్సు రాకముందే "ఒకయ్య చేతిలో బెట్టి" చేతులు కడుగు కొంటున్నారు. పోషణ, ఆరోగ్యం, విద్య, జీవన వనరులు, వసతుల విషయంలో తీవ్రమైన లింగవివక్ష ప్రదర్శిత మవుతున్నది. వయస్సు మళ్ళిన తర్వాత, లేక వైధవ్యప్రాప్తి తర్వాత ఆవిడ స్థితి అత్యంత దయనీయంగా మారిపోతున్నది. సమాజంలో చలామణీ అవుతున్న పురుషాధిక్యత, స్త్రీని ఇలా అననుకూల పరిస్థితికి నెట్టి వేస్తున్నది.

### మగసంతానం పై మోజు

ఆడపిల్లను కని, పోషించి, పెంచి, చదివించి చివరకు, కట్నాలు-కానుకలతో సహా ఒకయ్య చేతిలో పెట్టటం నష్టదాయకమైన వ్యాసంగం కావటంతో సంపాదించి, పోషించి రక్షించే వాడుగా కొడుకు పరిణమించటంతో, మగ సంతానం మీద మోజు పెరుగుతున్నది. ఈ మోజు తీవ్రమైనపుడు, ఆడపిల్లను పురుటిలోనే చంపటం జరుగుతున్నది. ఆధునిక టెక్నాలజీ ఫలితంగా, ఎమ్నియోసెంటెసిస్, అల్ట్రాసౌండ్ పరీక్షలు వినియోగంలోనికి రావటంతో, గర్భస్థ శిశువు లింగ నిర్ణయం చేసి, పుట్టబోయేది ఆడపిల్లని నిర్ధారణైతే, గర్భస్రావానికి పూనుకొంటున్నారు. ఈ కార్యపు స్థాయి దేశంలోగాని, పలు ప్రాంతాలలో గాని, ఎలా ఉన్నదీ నిర్ణయించటానికి తగినంత సమాచారం లభించటంలేదు. పురుటిలో ఆడపిల్లలను చంపుతున్నట్లు పలువురు జరిపిన పరిశీలనలు ధృవ పరుస్తున్నాయి. తమిళనాడులోని డిండిగల్, అన్నా, పెరియార్, ఉత్తర, దక్షిణ ఆర్కాట్ జిల్లాలలో స్త్రీశిశు హత్య జరుగుతున్నట్లు కొందరు పరిశోధకులు రిపోర్టు చేశారు. బీహారు, ఉత్తర ప్రదేశ్‌ల నుండి ఇలాంటి రిపోర్టులున్నాయి. ఇంతకు పూర్వమే పుట్టిన ఆడపిల్లల సంఖ్యను బట్టి, దంపతుల విద్యాస్థాయిని బట్టి, ప్రాంతీయ పరిస్థితులను బట్టి ఈ హత్యల పరిమాణం ఉంటున్నట్లు కొందరు పరిశీలకులు భావిస్తున్నారు.

ఇటీవలి కాలంలో, ముఖ్యంగా సంపన్న కుటుంబీకులు, లింగ నిర్ణయానికి, ఎమ్నియోసెంటెసిస్, అల్ట్రాసౌండ్ పరీక్షలను వినియోగించుకొంటూ, పుట్టబోయేది ఆడపిల్లని తెలితే గర్భస్రావానికి పూనుకొంటున్నట్లు మరికొందరు రిపోర్టు చేశారు. బొంబాయి లోని ఒక వైద్యశాలలో, ఆడపిల్ల పుడుతుందని ఈ పరీక్షలలో నిర్ధారణైన కేసులలో, నూరింట తొంభయ్యారు మంది తల్లులు గర్భస్రావం చేయించుకొన్నట్లు, మగపిల్లలు పుట్టే కేసులలో నామ మాత్రపు గర్భస్రావాలు జరిగినట్లు పరిశోధకు లొకరు రిపోర్టు చేశారు. హర్యానాలో సంభవిస్తున్న జననాలను పరిశీలిస్తే, ఆడపిల్లల కంటే మగపిల్లలే అధికంగా పుడుతున్నట్లు తేలుతున్నది. 1981-91 సంవత్సరాల మధ్య కాలపు స్త్రీ జననాల అంచనాలను పరిశీలించిన తర్వాత, పుట్టవలసిన స్త్రీ శిశువులలో నూరింట తొంభైతొమ్మిది మంది పుడుతుండగా, ఒకరు గర్భస్రావ ప్రయత్న ఫలితంగా అంతరిస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు సూచించింది. ఇదే కాలంలో, ఈ రూపంలో జరుగుతున్న గర్భస్థ శిశు హత్యలు, దక్షిణ కొరియాలో, నూరు స్త్రీశిశు జననాలకు ఐదు చొప్పున ఉంటున్నట్లు అంచనా వేస్తున్నారు. ఈ విషయంలో భారతదేశం కూడా దక్షిణ కొరియా సరసన నిలుచుండే రోజు దాపురించే అవకాశాలున్నట్లు కూడా రిపోర్టు సూచించింది. ప్రస్తుతం మగపిల్లల మీద మోజు ఇలాగే పెరుగుతూ పోతే, స్త్రీ శిశువు గర్భస్థ దశలో ఉన్నపుడే, ఆవిడ పుట్ట కుండా "కట్టుదిట్టమైన చర్యలను" తీసుకోవటం అధికంగావచ్చునని, ఢిల్లీలోని నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రిశర్చి సంస్థ అసోసియేట్ డైరెక్టర్ మోనికా దాస్ గుప్తా సూచిస్తున్నారు.

లింగ నిర్ణయ ప్రాతిపదిక మీద జరిగే గర్భస్రావాలను అదుపు చేయటానికి భారత ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఏంటీనేటల్ డయాగ్నాస్టిక్ టెక్నిక్స్ (రెగ్యులేషన్ అండ్ ప్రివెన్షన్ ఆఫ్ మిస్ యూస్) ఆక్టును 1994 లో చేశారు. దీని ప్రకారం, లింగ నిర్ణయ ప్రాతిపదిక మీద జరిగే గర్భస్రావం చట్ట

వ్యతిరేక మవుతుంది. చట్టాలు బాల్య వివాహాలను ఆపలేదు. వరకట్న సంప్రదాయాన్ని తుద ముట్టించలేదు. ఇపుడది కోట్ల రూపాయల స్థాయికి పెరగటం అందరకూ తెలుసు. కనుక ఈ చట్టం స్త్రీ శిశు హత్యలను ఆపగలదని ఆశించటం కూడా పొరపాటే అవుతుంది. ఆంధ్రప్రదేశ్ లోని కొన్ని సంపన్న కోస్తా జిల్లాలలో అల్ట్రాసౌండ్ స్కానింగ్ యూనిట్లు తామర తంపరగా పెరుగుతున్నట్లు మద్రాసు నుండి వెలువడుతున్న ప్రముఖ దినపత్రిక ఒక రిపోర్టును ఇటీవల ప్రచురించింది. ఆసక్తి గల మహిళా కార్యకర్తలు ఈ యూనిట్ల పనిని ఒక కంట కనిపెట్టి ఉండటం లాభదాయకం.

స్త్రీశిశువును భూమి మీద పడకుండానే, గర్భస్థ దశలోనే అంతం చేస్తూండటం నేటి సమాజంలో స్త్రీకున్న స్థానాన్ని స్పష్టంగా చిత్రిస్తున్నది; అధిక వివరణలతో పనేలేదు. పురుష శిశువుల మరణాల కంటే అధికంగా సంభవిస్తున్న స్త్రీ శిశు మరణాలు - ముఖ్యంగా కుటుంబంలో రెండవ స్త్రీ శిశువుగా జన్మించిన ఆడపిల్ల మరణావకాశాలు అధికంగా ఉండటం- మగపిల్లవాని మీద మోజు తీవ్రతకు రుజువులు. మొనికా దాస్ గుప్తా, 1987 వ సంవత్సరంలో, పంజాబులోని లూధియానా జిల్లాలో ఒక సర్వేను నిర్వహించారు. నాలుగు సంవత్సరాల లోపు వయస్సు పిల్లల మరణాలలో, బాలుర మరణాల కంటే బాలికల మరణాలు అధికంగా ఉన్నాయి. స్త్రీలో జీవశక్తి పురుషులలో కంటే ఎక్కువగా ఉంటుంది అన్న ప్రాథమిక శాస్త్రీయ సూత్రానుగుణంగా ఈ పరిణామం లేనట్లు వారు భావించారు రెండవ కాన్పు, అటు తర్వాత పుట్టే ఆడపిల్లల మరణాలు, మగపిల్లల మరణాల కంటే మరికొంచెం అధికంగా ఉంటున్నట్లు వీరు గుర్తించారు. తొలి కాన్పులో మగబిడ్డ పుట్టిన తర్వాత, రెండవ బిడ్డగా పుట్టిన ఆడపిల్ల, ఎక్కువ కాలం జీవించే అవకాశాలు లేవని మొనికా దాస్ గుప్తా సూచించారు. ఇవన్నీ, తలిదండ్రులకు ఆడపిల్లల యెడల ఉన్న విరక్తి భావానికి కొలమానాలు.

**పోషణలో వివక్ష**

పోషణలో కూడా, బాల్యం నుండి స్త్రీ వివక్షకు గురవుతున్నది. మగపిల్లలకు చనుబాల నిచ్చినంత ఎక్కువ కాలం ఆడపిల్ల కివ్వటం లేదు; ఆడపిల్లలను త్వరగా తల్లి పాలు మాన్పిస్తున్నారు. మగపిల్లలకు సగటున 25.3 మాసాలు చనుబాల నిస్తుంటే, ఆడపిల్లలకు 23.6 మాసాలు మాత్రమే ఇస్తున్నట్లు ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ సైన్సెస్ 1992-93 వ సంవత్సరపు సర్వేపేర్కొన్నది. తల్లి బిడ్డకు చనుబాలిస్తున్నంత కాలము చూలు వచ్చే వీలుండదు. వెంటనే చూలు వస్తే, ఉన్న మగబిడ్డకు పాలు చాలవని, పిల్లవాడు బలకరంగా ఉండాలని, వీలయినంత ఎక్కువ కాలం చనుబాల నిప్పిస్తారు. ఆడపిల్ల పుడితే, అది తొలికాన్పు ఫలితమై యుంటే, త్వరగ మగపిల్లవాడు కలగాలని, పిల్లకు చనుబాల నీయటాన్ని వీలయినంత త్వరగా మాన్పిస్తారు ఈ ధోరణి దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ కనిపిస్తున్నది. ఈ విషయంలో పరిశీలకులంతా ఏకాభిప్రాయాన్ని ప్రకటించారు. భారత ప్రభుత్వ రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయపు రిపోర్టులు కూడా ఈ అంశాన్ని ధృవ పరుస్తున్నాయి.

ఇంట్లో వండిన వంటకాల పంపకంలో కూడా లింగ వివక్ష పాటింపు కనుపిస్తున్నది. ఆడపిల్లలలోనూ, స్త్రీలలోనూ పోషణా లోపం మగవారిలో కంటే అధికంగా అన్ని ప్రాంతాలలోనూ కనుపిస్తున్నది. ముఖ్యంగా ఉత్తర భారతంలో మగవారి కంటే స్త్రీలు తక్కువ పోషణను అనుభవిస్తూండటాన్ని పలువురు రిపోర్టు చేశారు. ప్రపంచ బ్యాంకు రిపోర్టు రచయితలు, ఉత్తర ప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులలో జరిగిన సర్వేలు పరిశీలించి, ఈ రాష్ట్రాలలో కుటుంబపు ఆహార పంపకంలో ఆడపిల్లలకు అన్యాయం జరుగుతున్నట్లు ధృవపరచారు. పంజాబులో జరిగిన సర్వే, మగపిల్లలు, ఆడపిల్లలు దాదాపు సమంగా తింటున్నా, మాంసం వంటి మేలి పోషక పదార్థాలను మగపిల్లలు, ఆడపిల్లలకంటే ఎక్కువ తింటున్నట్లు పేర్కొన్నది. ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ సైన్సెస్ 1992-93 లో జరిపిన సర్వే, మగ పిల్లల కంటే ఆడపిల్లలు అధిక పోషణా లోపానికి గురవుతున్నట్లు తేల్చి చెప్పింది.

భారతీయ మహిళల పోషణాలోపానికి ప్రధాన కారణం, వారికి తగినంత ఆహారం లభించక పోవటాన్ని కారణంగా రిపోర్టు చూపుతున్నది. జరుగుబాటుకు లోటు లేక పోయినా, కుటుంబీకుల మధ్య జరుగుతున్న ఆహార పంపకపు పద్ధతులవల్ల ఇలా జరుగుతున్నట్లు రిపోర్టు గుర్తించింది. కుటుంబంలో ముందు పురుషులు, మగపిల్లలు భోజనాలు

చేస్తారు. తర్వాత మహిళలు తింటారు. కోడరికానికి లోనవుతున్న కోడలు, ఆడబిడ్డలు, అత్తగారు తిన్న తర్వాతే తినవలసి ఉంటుంది. ఇందువల్ల చివర తినే వారికి సామాన్యంగా కావలసినంత ఆహారం మిగలకపోయే అవకాశాలుంటాయి. ఇందుకు రెండు కారణాలు కనిపిస్తున్నాయి: 1 ముందు తినే మగవారు, తర్వాత తినవలసిన ఆడవారికి, పిల్లలకు తగినంత మిగులుతున్నదా లేదా అని చూడకుండా తింటూండవచ్చు; 2. లేదా కుటుంబం గడవని స్థితిలో ఇల్లాలు ఉన్నంత మేరకు వండి, భర్తకు మగపిల్లలకు తిన్నంత పెట్టి, మిగిలిన దానిని తాను, ఆడపిల్లలు తింటూ ఉండవచ్చు. భార్యాభర్తల మధ్య సదవగాహన ఉన్నపుడు ఇటువంటి లోపాలుజరుగవు; అది లేక పోవటం చేతనే స్త్రీలు ఇలా పోషణా లోపానికి గురవుతున్నారు. స్త్రీల పోషణా లోపానికి కారణాలేమయినా, బిడ్డలను కని, వారికి చనుబాల నివ్వవలసి ఉండటం చేత, ఈ పోషణాలోపం వారి ఆరోగ్యాన్ని చెడగొడుతున్నది; ఇది మాత్రం తిరుగులేని సత్యం. ఆకలి ఆరేంత మేరకు తింటున్నాంగదా? ఇంకా పోషణాలోప మేమిటి అన్న సందేహం కొందరకు రావచ్చు. వారు సుపోషకమైన ఆహార పదార్థాలను తింటూ ఉండక పోవచ్చు. తృణధాన్యాల లోనూ, కూరగాయల లోనూ ఉన్న ఇనుము ఎక్కువగా వంటబట్టదు; మాంసంలోని ఇనుము ఎక్కువగా వంటబడుతుందని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఎందరు తగినంత మేరకు మాంసాహారాలను తినగలుగుతున్నారు? అంతే గాకుండా పొట్టలో పరాన్న జీవులు చేరి ఉండవచ్చు; లేదా మలేరియా వస్తుండవచ్చు. ఇందువల్ల శరీరం మరింత పోషణాలోపానికి గురవుతుంది స్త్రీ, బిడ్డలను కని, వారికి చనుబాల నివ్వవలసి రావటం చేతా, కుటుంబంలో పురుషులతో సమానమైన హోదా లభించక పోవటం చేతా, భార్యాభర్తల మధ్య సదవగాహనా లోపం వల్లా, తీవ్రమైన పోషణా లోపాలకు గురవుతున్నది; అది కొన్ని సందర్భాలలో ఆవిడ ప్రాణానికి ముప్పును కూడా తెస్తున్నది.

### ఆరోగ్య రక్షణ

కుటుంబపు ఆహార పంపకంలో స్త్రీ వివక్షకు గురవుతున్నదా లేదా అన్న విషయంలో పరిశీలకుల మధ్య ఏకాభిప్రాయం లేదు; కాని, ఆరోగ్యరక్షణా విషయంలో స్త్రీ వివక్షకు గురవుతున్నది అన్న అంశాన్ని అంతా అంగీకరిస్తున్నారు. ఈ విషయంలో ప్రొఫెసర్ అమార్త్య సేన్ సూచన గమనార్హం. వ్యక్తి యొక్క ఆరోగ్యం, వారికి లభిస్తున్న పోషణకు కొలమానంగా యెంచాలని వీరు సూచిస్తున్నారు. పోషణ సక్రమంగా ఉన్న వారి ఆరోగ్యం సక్రమంగానే ఉంటుంది; ఇది సహజం. ఈ సూత్రం ప్రకారం అనారోగ్యం అధికంగా కనుపించటం, పోషణాలోప పరిమాణానికి కొలమానమయి తీరుతుంది. కనుకే భారతీయ స్త్రీలు, కుటుంబంలో పోషణా విషయంలో లింగ వివక్షకు గురవుతున్నారని వీరు నమ్ముతున్నారు. ఇందుకు అవసరమైన పలురుజువులను వారు తమ రచనలలో చూపారు. బాల్యంలో మగపిల్లలకు లభించినంతటి ఆరోగ్య రక్షణ ఆడపిల్లలకు లభించటం లేదని మన దేశంలో పలు ప్రాంతాలలో జరిగిన సర్వేలు నిరూపించాయి.

మూడు సంవత్సరాల లోపు వయస్సు మగపిల్లల కంటే, ఆడపిల్లలకు తక్కువ వైద్య చికిత్స లభిస్తున్నట్లు, లభించే చికిత్స కూడా నాణ్యమైనది గానట్లు పంజాబులోని లూధియానాలో జరిగిన ఒక సర్వే సూచించింది. రెండు దశాబ్దాల తర్వాత కూడా ఈ పరిస్థితి మారలేదని మోనికా దాస్ గుప్తా రిపోర్టు చేశారు. 1992 వ సంవత్సరంలో, లూధియానా లోని ఒక వైద్యశాలకు చెందిన కేసులను పరిశీలించిన సర్వేయర్లు, అనారోగ్య తీవ్రత వల్ల, హాస్పిటల్‌లో చేర్పించ వలసి యున్న ఆడపిల్లలలో నాల్గింట మూడు వంతుల మందిని చేర్పించలేదు అని సూచించారు కర్నాటక లోని ఒక గ్రామీణ ప్రాంతపు ప్రాథమిక వైద్యశాలకు, బాలికల కంటే రెట్టింపు సంఖ్యలో బాలురు చికిత్సకు వస్తున్నట్లు మరొక సర్వే తెలియజేస్తున్నది. ఉత్తర ప్రదేశ్ లోని పశ్చిమ ప్రాంతం లోని ఒక ప్రైమరీ హెల్తు సెంటర్‌కు వచ్చే పేషెంట్లను సర్వేయర్లు ఒక వారంపాటు గమనించి చూశారు. బాలికల కంటే, మూడు రెట్ల మంది మగపిల్లలను చికిత్స కోసం ఈ వైద్యశాలకు తీసుకు వచ్చినట్లు సర్వేయర్లు రిపోర్టు చేశారు.(ఇది 1994 లోని పరిస్థితి) భారత దేశంలో 1992-93 వ సంవత్సరంలో, వాక్సినేషన్ చేయించుకొన్న పిల్లలలో బాలికల కంటే బాలుర సంఖ్య అధికమని, శ్వాసకోశ సంబంధిత రోగాలు, జ్వరాలకు చికిత్స చేయించుకొన్న వారిలో అధిక సంఖ్యాకులు బాలురేనని, ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్

పాప్యులేషన్ సైన్సెస్ సర్వే తెలియజేస్తున్నది.

వైద్య చికిత్స విషయంలో ఆడపిల్లల వలె, స్త్రీలు కూడా లింగ వివక్షకు గురవుతున్నారని రిపోర్టు వెల్లడించింది కుటుంబ ప్రాతిపదిక మీద జరిగిన సర్వేలు పురుషుల కంటే స్త్రీలు అధిక అనారోగ్యాన్ని అనుభవిస్తున్నట్లు నిరూపిస్తున్నాయి మనకు తెలియవస్తున్న దాని కంటే అధిక పరిమాణపు అనారోగ్యాన్ని భారతీయ స్త్రీలు అనుభవిస్తూ ఉండవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. ఇందుకు పలుకారణాలను చూపవచ్చు: 1. చాలా మంది మహిళలు వాస్తవాలను వివరంగా సర్వేయర్లకు, చెప్పరు. ఇంటి గుట్టు బయటివారికి తెలియకూడదన్న సంప్రదాయం, తన భర్త లోకుల దృష్టిలో చులకనవుతాడన్న భయం వీరిని మనస్సు విప్పి మాటాడ నీయదు, 2. వంట్లో బాగుండలేదని పడుకొంటే ఇల్లు ఎలా గడుస్తుంది అన్న భావంతో కొందరు తమ అనారోగ్య విషయాలను ఎవరికీ తెలియనీయరు

పురుషులు పొందుతున్నంత పరిమాణంలో స్త్రీలకు, చికిత్స లభించకపోవటమే వారి అధిక అనారోగ్యానికి కారణమని కమ్యూనిటీ ప్రాతిపదిక మీద జరిగిన సర్వేలు ధృవ పరచాయి. ఔట్ పేషెంట్లుగా వైద్యశాలలకు వస్తున్న రోగుల సంఖ్యను, వైద్యశాలలో చికిత్స నిమిత్తం చేరిన వారి సంఖ్యను, వారి స్త్రీ పురుష విభజననూ పరిశీలిస్తే, స్త్రీల కంటే పురుషులే ఈ వసతులను అధికంగా అనుభవిస్తున్నట్లు స్పష్టమవుతుంది. మహిళలు తమ అనారోగ్య నివారణకు గృహ వైద్య విధానాలనో, చిట్కాలనో వాడుతున్నట్లు సర్వేలు సూచిస్తున్నాయి. పురుషులు మాత్రం అధిక ఖర్చులతో కూడిన ఆధునిక వైద్య చికిత్సకు వెళుతున్నారు. ఈ విషయంలో సర్వేలన్నీ ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

పురుషులు రోగసూచనలు కనుపించగానే చికిత్సకు వెళుతున్నారు; స్త్రీలు మాత్రం రోగం ముదిరిన తర్వాత, దాదాపు ప్రాణాపాయ స్థితిలో చికిత్సకు వెళుతున్నారు. ఇందువల్లనే, చికిత్సకు, వైద్య శాలలో చేరిన రోగులలో పురుషులకంటే, స్త్రీలే అధికంగా చనిపోతున్నారు. స్త్రీలకే వచ్చే రోగాల విషయంలోనే గాక, స్త్రీ పురుషులిద్దరకూ రాగల వాటి విషయంలో కూడా, స్త్రీల మరణాలు పురుషుల మరణాల కంటే అధికంగా ఉంటున్నాయి. స్త్రీలకు తరచూ చికిత్సకు వెళ్ళే అవకాశాలు లేవు. వెళ్ళినా, ఆధునిక చికిత్సను రోగం అంతరించే వరకూ చేయించుకోవటం లేదు; రోగం ముదిరిన తర్వాత వెళ్ళటం వల్ల, చికిత్స జరిగినా వారికి ప్రాణాపాయ స్థితి తప్పటంలేదు పురుషుల స్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా ఉన్నది. కుటుంబాలు పురుషుల ఆరోగ్య రక్షణకు పెట్టినంత ఖర్చును, తీసుకొన్నంత శ్రద్ధను గాని, స్త్రీల ఆరోగ్య రక్షణ యెడల ప్రదర్శించటం లేదు.

## చదువు సంధ్యలు

భారత దేశంలో స్త్రీలు పురుషుల కంటే చదువులో, అధిక అననుకూల పరిస్థితిని ఎదుర్కొంటున్నారు. దేశంలోని స్త్రీ పురుషుల అక్షరాస్యతా అంచనాలు ఈ అంశాన్ని ధృవ పరుస్తున్నాయి స్త్రీలలో అత్యధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులు; దేశంలోని నిరక్షరాస్యులలోనూ స్త్రీలే అధికంగా ఉన్నారు! దేశపు 1991వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, ఏడు సంవత్సరాలకు పైబడిన వారిలో, పురుషులలో నూరింట 64 మంది అక్షరాస్యులు కాగా, స్త్రీలలో 39 మంది మాత్రమే అక్షరాస్యులుగా ఉన్నారు. ఈ జనాభా లెక్కల ప్రకారం దేశంలో 32.40 కోట్ల మంది నిరక్షరాస్యులున్నారు, వీరిలో నూరింట 61 మంది బాలికలు, స్త్రీలు ఉన్నారు!

మనదేశంలో గ్రామీణ ప్రాంతంలోని ప్రాథమిక పాఠశాలలలో బోధనా వసతులు సక్రమంగా ఉండటంలేదు. ఆశలకూ, ఆచరణకూ సమన్వయం లోపించటం వల్ల లక్ష్యసిద్ధి, అందని మావిపండులాగే ఉన్నది ఇందుకు ప్రధాన కారణాలివి: 1. పిల్లలను చదివించటానికి అధిక సొమ్ము అవసరమవుతున్నది, ముఖ్యంగా పేదలకు ఇది భారమవుతున్నది; 2. పేదలకు ఆడపిల్లలు కూడా పనిచేస్తేనే గాని ఇల్లు గడవదు; పిల్లలను బడికి పంపటం కంటే, పనికి పంపటమే వారికి లాభకరంగా కనుపిస్తుంది; 3. ఆడపిల్ల చదువుకు ఎంత ఖర్చు చేసినా, ఆవిడకు వివాహం చేసి మెట్టినింటికి పంపవలసిందే. ఇందువల్ల కుటుంబానికి ఖర్చేగాని, లాభం ఏమీ లేదు. పైగా అంతంత మాత్రంగా ఉన్న ఆర్థిక వనరులను ఆడపిల్ల చదువుకు వాడి అధిక భారాన్ని మోయవలసి వస్తుంది. 4. బయటి మగపిల్లలతో కలిసి తిరగవలసి రావటం చేత, తమ బిడ్డల కన్యాత్వం చెడవచ్చునని తల్లిదండ్రులు భయపడుతూ ఉంటారు. తమ బిడ్డ ఒక్క సంవత్సరంలో సెకండరీ విద్యను పూర్తి చేసే

అవకాశాలు ఉన్నా, ఆవిడ రజస్వల కాగానే తల్లి దండ్రులు చదువు మాన్పిస్తారు. జె.సి.కాడ్వెల్, పి.హెచ్.రెడ్డి ప్రభృతులు ది కాజెస్ ఆఫ్ మేరేజ్ ఛేంజ్ ఇన్ సౌత్ ఇండియా అన్న వ్యాసంలో వివరంగా ఈ అంశాలను చర్చించారు. (స్త్రీలు చదువు కోవలసిన అవసరాన్నీ, చదువుకోవటంలో ఆవిడకు ఎదురవుతున్న లింగవివక్షా పరమైన ఆటంకాలను మరో అధ్యాయంలో వివరించాం)

### యుక్త వయస్సు రాకముందే వివాహాలు

బాల్య వివాహాల సంఖ్య తగ్గినా, వయస్సుతో సంబంధం లేకుండా రజస్వల కాగానే వివాహాలు చేయటం పెద్ద యెత్తుననే కొనసాగుతున్నది. పద్ధెనిమిది సంవత్సరాలు నిండిన తర్వాతే ఆడపిల్లలకు వివాహాలు చేయాలని చట్టం నిర్దేశిస్తున్నా, 1992-93 వ సంవత్సరంలో ఐ.ఐ.పి యస్. సర్వే జరిగే నాటికి 20-24 సంవత్సరాల వయస్సున్న యువతులలో నూరింట యాభైమందికి పద్ధెనిమిది సంవత్సరాలు నిండక పూర్వమే పెండ్లిండు జరిగాయి. ఉత్తర భారతంలో పరిస్థితి మరీ అన్యాయంగా ఉన్నట్లు ఈ సర్వే ఫలితాలు వెల్లడిస్తున్నాయి. సర్వే కాలంలో 25-29 సంవత్సరాల వయస్సులో మున్న స్త్రీలలో, నిరక్షరాస్యులకు పదిహేను సంవత్సరాలు నిండక పూర్వమే పెండ్లి జరిగినట్లు తేలింది. చదువుకొన్నవారు పెండ్లి చేసుకొన్న సగటు వయస్సు 22 సంవత్సరాల వరకూ ఉన్నట్లు స్పష్టమైంది. వయస్సు నిండ కుండానే పెండ్లి కావటం వల్ల, చూలు-కాన్పుల సందర్భాలలో వచ్చే ఇబ్బందులను ఇతర అధ్యాయాలలో వివరించాం.

### వనరుల వినియోగంలో అవరోధాలు

కుటుంబంలో స్త్రీలకు ఆర్థిక వనరుల వాడుకలో స్వేచ్ఛలేదు. తనకు, బిడ్డలకు ఆరోగ్య రక్షణావసరాలకు కూడా వీరు మగవారి మీద ఆధారపడవలసి ఉంటుంది. ఉత్తర భారతంలో స్త్రీలను మగడాక్టర్ల వద్దకు పంపటం అరుదు. స్త్రీలు తమంత తాము వెళ్ళే అవకాశాలు ఉండనే ఉండవు. భర్తగాని, అత్తమామలు గాని అనుమతించాలి. పుట్టింటివారి సహాయాన్ని కోరే అవకాశాలు కూడా ఆవిడ కుండవు.

### వేతనార్జనలో స్త్రీలు

స్త్రీలు పిల్లలను కనటం పెంచటమే గాక, సామాజిక ఉత్పత్తిలో కూడా జీవితాంతం పాల్గొనవలసి ఉంటుంది. పేదలకు ఇది తప్పని స్థితి; వారి పిల్లలు, ముఖ్యంగా ఆడపిల్లలు ముక్కు పచ్చలారకముందే పనిలోకి దిగవలసి ఉంటుంది. పునరుత్పత్తి, సామాజికోత్పత్తి లేక సంపదోత్పత్తి విడదీయ వీలులేని అంశాలు. ఇవి పరస్పర ఆధార భూతాలు. భారత దేశంలో వేతనార్జనలో పాల్గొంటున్న స్త్రీల పరిమాణం, అభివృద్ధి చెందుతున్న దేశాలతో పోల్చినా తక్కువగానే ఉన్నట్లు ప్రపంచబ్యాంకు రిపోర్టు పేర్కొన్నది. వేతనార్జనకు వెళుతున్న మన దేశ జనాభాలో పిల్లలను వదలి వేసి పెద్దలను మాత్రమే పరిగణనలోనికి తీసుకొన్నపుడు 24 శాతం మంది మాత్రమే స్త్రీలున్నారు. కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ పరిమాణం 35 శాతానికి తక్కువ లేదు. మనదేశంలో ఈ విషయంలో ప్రాంతీయ భేదాలు కూడా ఉన్నాయి. ఉత్తర భారతంలో స్త్రీలను బయటి పనులకు పోనీయరు. కుటుంబ గౌరవానికి భంగకరంగా దీనిని పరిగణిస్తున్నారు. ఆర్థిక పరిస్థితులు అనువుగా లేని కుటుంబాల స్త్రీలు మాత్రమే బయటి పనులకు వెళతారు. పేదలకు కాయకష్టం చేయటం తప్పదు; స్త్రీల సంపాదన కుటుంబ పోషణకు అత్యంత కీలకమైనది.

ఇటీవల వచ్చిన పచ్చని పైరుల విప్లవం, కుటుంబ స్త్రీల శ్రమ భారాన్ని తగ్గించటానికి ఉపకరించక పోగా, వారి భారాన్నిది పెంచింది! వ్యవసాయ పనిముట్లలో వచ్చిన టెక్నాలజీ పెంపు కూడా వ్యవసాయ కుటుంబాల స్త్రీల పనిభారపు తగ్గింపుకు ఉపకరించలేదు. వ్యవసాయ యోగ్యమైన భూముల ఆక్రమణ తీవ్రతరమవుతున్న కొలదీ, పశువుల మేత నిచ్చే భూములు తగ్గిపోతున్నాయి. ఇందువల్ల వాటిని పశువుల శాలలో కట్టి మేపవలసి వస్తున్నది. పశువులకు గడ్డి కోసుకొచ్చే భారం ఇపుడు అదనంగా స్త్రీల మీద పడింది. వంట చెరకు సేకరించి తేవటం, ఇంటి అవసరాలకు తగిన నీటిని తేవటం ఇంతకు పూర్వమే స్త్రీల బాధ్యతగా ఉన్నది. విదేశాలలో వలె, వంట ఇంట్లో పని భారపు తగ్గింపుకు ఆధునిక పరికరాల వాడుకకు వీలుండటం లేదు. నాట్లకు, పైరు కోతలకు యంత్రాలు వాడుక లోనికి వచ్చినా, అది పురుషులకు లాభదాయకంగా ఉంటుంది; ఇవి స్త్రీల పనిని తగ్గించి, వారి నిరుద్యోగాన్ని పెంచుతాయి.

స్త్రీలు ఎక్కువ కాలం పనిచేయటం మాత్రమే గాదు, వారు చేసేది భారమైన పనికూడా కుటుంబంలో పురుషులతో సమానమైన పోషణ వీరికి లభించటం లేదని చూచాం ఇంటి పనిని, పొలం పనిని కూడా చేసే స్త్రీకి, ఆ కుటుంబంలోని పురుషుల కంటే అధిక శక్తి నిచ్చే ఆహారం అవసరమని సర్వేలు నిరూపిస్తున్నాయి ఇంతకు పూర్వమే పోషణా లోపానికి గురవుతున్న స్త్రీ ఈ పనిభారం వల్ల అదనపు లోపానికి గురవుతున్నది.

బిడ్డలను కనే స్త్రీల పరిస్థితి మరింత విషమంగా ఉంటుంది. కనే రోజు వరకూ పేద కుటుంబాల స్త్రీలు పనిచేస్తూనే ఉంటారు. వారికి అదనంగా అవసరమైన పోషణ గాని, విశ్రాంతి గాని లభించదు బిడ్డను కన్న తర్వాత కోలుకొనే వ్యవధి కూడా ఉండదు. ఇందువల్ల వారి శరీరం కృసిస్తుంది; పని చేయలేని స్థితికి వస్తారు; ఇలాంటి స్థితిలో బిడ్డను కనవలసి రావటం వల్ల, బిడ్డకూ, తల్లికి కూడా ప్రమాదం జరిగే అవకాశాలు ఉంటున్నాయి ఈ అంశాలను పలు సర్వేలు ధృవ పరచాయి.

## అనారోగ్యం చాలదన్నట్లు దారిద్ర్యభారం

అనారోగ్యంతో బాధపడుతున్న స్త్రీని, దారిద్ర్యం మరింత కృంగదీస్తున్నది. ఆర్థికంగా వెనుకబడిన వర్గాల స్త్రీలు అనారోగ్యం బారి నుండి విముక్తి పొందే అవకాశాలే లేకుండా పోతున్నాయి ఆరోగ్యంగా ఉన్నపుడే మనిషి అధికంగా పనిచేయగలడు, సంపాదన కూడా అధికంగా లభించే అవకాశాలుంటాయి, కడుపు నిండా తినే వీలుంటుంది. మనిషి అనారోగ్యంగా ఉన్నపుడు, అధికంగా పనిచేయలేడు. పనికి పోని రోజు సంపాదన ఉండదు; కనుక తినటానికి తిండికి కూడా ఇబ్బంది పడవలసి వస్తుంది. గృహ నిర్వహణ, పిల్లల పోషణ, సంరక్షణ చేస్తూ వేతనార్జనకు వెళ్ళవలసిన మహిళ ఇటువంటి పరిస్థితులలో చిక్కితే ఆవిడ జీవితం నరక ప్రాయంగా తయారవుతుంది. అనారోగ్యం నుండి ఆవిడకు విముక్తి లభించే అవకాశాలే ఉండవు. దారిద్ర్యం, అనారోగ్యాలు ఆవిడ పాలిటి విషవలయంగా రూపొందుతున్నాయి. కుటుంబీకుల ఆరోగ్యాన్నీ, పిల్లల మనుగడను కూడా నీరసింప చేస్తున్నాయి.

కుటుంబం గడవాలి గనుక ఆడపిల్లలను కూడా పనులకు పంపక తప్పదు. ఇందువల్ల బడిలో ఉండవలసిన వారు పొలాలలో, పొలం పనులు చేస్తూనో, గొడ్లను కాస్తూనో కనుపిస్తారు. బాల్యం నుండి అధిక శ్రమను చేస్తూ పోషణా లోపాన్ని అనుభవించవలసి వస్తున్న ఈ పిల్లలు, శారీరకంగా సరిగా యెదగరు పెద్దవారై, నీరసించిన శారీరక స్థితిలోనే సంతానాన్ని కనవలసి ఉంటుంది పోషణా లోపానికి గురయ్యే వారికి కాన్పు కష్టం గావచ్చు. పుట్టే బిడ్డ బరువు ఉండవలసిన దాని కంటే తక్కువ ఉండవచ్చు పురుటి నుండి క్షేమంగా బయట బడగలిగినా, బిడ్డ పోషణాలోపానికి, తన తల్లివలె, గురిగావలసి ఉంటుంది ఇలా దారిద్ర్యం విడవకుండా తరతరాలనూ వెన్నాడుతూ ఉంటుంది.

దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారే ఆడపిల్లలను సంపన్నుల కంటే దయగా చూస్తున్నారేమోనని అనిపిస్తున్నది. అల్పాదాయ వర్గాలకు చెందిన కుటుంబాలలోనూ, దళిత వర్గాల కుటుంబాల లోనూ, ఆడపిల్లల పోషణలో లింగవివక్ష అంతగా కనుపించటం లేదు, ఇది అన్నీ ఉన్న సంపన్న కుటుంబాలలోనే అధికంగా కనుపిస్తున్నదని, ఉత్తరప్రదేశ్‌లో 1989వ సంవత్సరంలో జరిగిన సర్వే నిరూపించినట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు పేర్కొన్నది. పేదల పిల్లలు సంపాదనా పరులు గనుక, తల్లిదండ్రులు వారిని జాగ్రత్తగా, పెంచుతారని సర్వేయర్లు అభిప్రాయ పడ్డారు. కనుకే స్త్రీ సంపాదనా శక్తికి, కుటుంబంలో ఆవిడకు లభించే ప్రతిపత్తికి అనుబంధం ఉన్నదని పరిశోధకులు భావిస్తున్నారు.

ఉత్తర భారతంలో స్త్రీని బయటకు పంపటాన్ని కుటుంబ గౌరవానికి భంగకరమైన అంశంగా పరిగణిస్తున్నారు. ముందు లేకున్నా, మధ్యలో సంపాదించి పైకి రాగలిగిన వారు, కుటుంబ స్త్రీలను ఇక బయటకు పోనీయరు. ఇలాంటి వారిని "కార్యశూరులు"గా సమాజం పరిగణిస్తున్నది! పరిశోధకులు బాధాకరమైన ఒక విషయాన్ని కూడా వెల్లడించారు. పురుషాధిక్యత పీఠం వేసుకు కూర్చున్న ఉత్తర భారత సమాజ సంస్కృతిలో, వేతన్నానకు వెళ్ళే పేద కుటుంబాల స్త్రీలు, అగ్రవర్ణాల వారి సెక్సుపరమైన వేధింపులకు గురయ్యే ప్రమాదమున్నట్లు కొందరు రిపోర్టు చేశారు.

దారిద్ర్యం అనుభవిస్తున్న కుటుంబాలలో, ఆ కుటుంబాలలోని స్త్రీలు, ఇతరుల కంటే అధిక దారిద్ర్య

భారాన్ని మోస్తున్నారు. దీనిఛాయలు భారత దేశంలో సర్వత్రా కనుపిస్తాయి.

వైధవ్యము: వృద్ధాప్యము

వైధవ్యము, వృద్ధాప్యము స్త్రీలను అధికంగా వేధించగల సమస్యలు. ముప్ఫై సంవత్సరాలలోపు వయసు పురుషుల మరణాల రేటు కంటే, ఇదే వయసు స్త్రీల మరణాల రేటు అధికంగా ఉంటున్నది. అటు తరువాత, పురుషుల మరణాల రేటు పెరుగుతూ, స్త్రీల మరణాల రేటు తగ్గనారంభిస్తుంది. ఇందువల్ల భారతీయ స్త్రీకి ముప్ఫై సంవత్సరాల వయసును దాటిన తర్వాత వైధవ్యం ప్రాప్తించే అవకాశాలు అధికంగా ఉంటాయి. స్త్రీల జనాభాలోని అరవై సంవత్సరాల వయసును మించిన వారిలో నూరింట అరవైమంది వితంతువులున్నారు డెబ్భై సంవత్సరాలు అంతకు పైబడిన వయసు స్త్రీలలో నూరింట ఎనభై మంది వరకూ వితంతువులున్నారు. పోషకుడు, సంరక్షకుడు అయిన భర్త పోవటంతో, స్త్రీ జీవితం చెట్టు కూలిన పక్షుల చందమవుతుంది. ఆవిడ జీవితం అస్తవ్యస్థమై, నానాబాధాలు పడవలసిన రోజులు దాపురిస్తాయి. సాంఘికంగా కూడా ఆవిడ పరిస్థితి దిగజారి పోతుంది. పోషణ, సంరక్షణ, మానసిక శాంతి కరువై వారు అధికంగా చని పోతూంటారు. ముత్తైదువుల మరణాల రేటు కంటే వితంతువుల మరణాలరేటు అధికంగా ఉన్నట్లు పరిశోధకులు నిరూపించారు.

ప్రస్తుతపు లీగల్ వ్యవస్థ, స్త్రీలకు ఆస్థిహక్కులు సంక్రమించటంలో చిక్కులను కల్పిస్తున్నది. దీనికి తోడు, అత్తమామలు, బావ మరదులు, వారసత్వపు ఆస్థి నీయటంలో పెట్టే పేచీలు అదనంగా ఉంటాయి. ఇలా స్వంత వనరులు లోపించటం వల్ల వితంతువు మరొకరి ఆశ్రయాన్ని, రక్షణను కోరవలసి వస్తుంది. కనుకే స్త్రీ పుత్ర సంతానం కోసం పరితపిస్తుంది. ఈ విధంగా, స్త్రీ పురుష అసమానత్వానికి, ఇటువంటి అసమానతా దుష్ఫలితాలను అనుభవిస్తున్న స్త్రీ కూడా, కొంత మేరకు కారణమవుతున్నది!

వృద్ధాప్యంలో స్త్రీ జీవితం ఇంత కంటే కూడా బాధాకరంగా ఉంటుంది. ఆదరణకరువై, శారీరక, మానసిక ఆరోగ్యాలు చెడతాయి. ఒకరి అండ, ఆదరణ లేకుండా రోజు గడపవలసిన స్థితిలో ఉంటుంది. పుట్టిన వెంటనే అమ్మ పొత్తిళ్ళను కోరి ప్రారంభమైన కన్నీటి జడివాన, కాటికి కాళ్ళు చాచుకొన్న దశలో కూడా ఆగదు! స్త్రీ వృద్ధాప్యంలో ఇంతగా బాధపడుతుంది గనుక, ఆవిడ కుమారుల అండకు పరితపిస్తుంది. పుత్ర సంతాన ప్రాప్తికి ప్రాకులాడుతుంది. ఈ విధంగా స్త్రీ తనకు తెలియకుండానే లింగ వివక్షా పెంపులో పాలు పంచుకొంటున్నది. స్త్రీ జీవితంలోని దురదృష్టకర ఘట్టాలలో ఇదొకటి !

ఇటువంటి ఆర్థిక సాంఘిక పరిస్థితులలో జీవిస్తున్న భారతీయ మహిళ ఎంతటి అనారోగ్య భారాన్ని మోయవలసి వస్తున్నదో చూద్దాం.

# 6

## భారతదేశంలో స్త్రీల ఆరోగ్య పరిస్థితులు

మానవజాతిలో స్త్రీశిశు జననాల కంటె, పురుషశిశు జననాలు అధికంగా ఉండటం సహజం. మానవ జీవితంలోని ప్రతిదశలోనూ స్త్రీల మరణాలరేటు కంటే పురుషుల మరణాలరేటు అధికంగా ఉంటుందని చెబుతున్నారు. జనాభా మరణాలరేట్లు తక్కువగా ఉండే ప్రాంతాలలో, వ్యక్తి వయసు సుమారుగా యాభై సంవత్సరాలు వచ్చే వరకూ స్త్రీ జనాభా కంటే పురుష జనాభా అధికంగా ఉంటుంది. అటు తర్వాత, క్రమంగా స్త్రీ యొక్క జీవాధిక్యత ప్రదర్శితం గావటం ప్రారంభిస్తుంది ఇందువల్ల మొత్తం జనాభాలో పురుషులకంటే స్త్రీలు అధికంగా ఉంటారు. మనదేశంలో మాత్రం 30-35 సంవత్సరాల వయసు వరకూ, పురుష మరణాల రేటు కంటే స్త్రీల మరణాలరేటు అధికంగా ఉంటున్నది.

భారతదేశంలో స్త్రీ జనాభా, పురుష జనాభా కంటే తక్కువగా ఉన్నది. (ఒకటవ పట్టికను చూడండి) ఇలాంటి స్థితి మరికొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ కనుపిస్తున్నది. 1991వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం ప్రతి వెయ్యిమంది పురుషులకూ 927 (తొమ్మిది వందల ఇరవయ్యేడు మంది మాత్రమే) స్త్రీలు ఉన్నారు! (ఇటీవలె ఐక్యరాజ్య సమితి ప్రచురించిన అంచనాల ప్రకారం, ఆగ్నేయ ఆసియాలోని పలుదేశాలలోనూ, చైనాలోనూ. ప్రతి వెయ్యిమంది పురుషులకూ 920 నుండి 940 మంది వరకే స్త్రీలున్నారు. శ్రీలంకలో స్త్రీ-పురుష జనాభా సమంగా ఉన్నది; ఇండోనీషియాలో ప్రతివెయ్యిమంది పురుషులకూ 1,001 మంది స్త్రీలున్నారు; నైజీరియాలో 1,002, జపాన్‌లో 1,004 మంది స్త్రీలున్నారు).

భారత జనాభా లెక్కల ప్రకారం చూస్తే, ఈ శతాబ్ద ప్రారంభ కాలం నుండీ, పురుష జనాభా కంటే స్త్రీ జనాభా క్రమంగా తగ్గటం కనుపిస్తుంది. 1971వ సంవత్సరం వరకూ, ఈ అంశాన్ని ఎవరూ తీవ్రమైనదిగా పరిగణించలేదు. జనాభా లెక్కల సేకరణ సక్రమంగా జరుగక పోవటమో, లేక ప్రజలు వలసపోవటమో ఇందుకు కారణంగా ఊహిస్తూ వచ్చారు. 1971వ సంవత్సర జనాభా లెక్కల పరిశీలన తర్వాత, ప్రవీణ్ విసారియా, "ది సెక్స్ రేష్యూ ఆఫ్ ది పాప్యులేషన్ ఆఫ్ ఇండియా" అన్న మోనోగ్రాఫ్‌ను ప్రచురించారు. పురుష జనాభా కంటే, స్త్రీ జనాభా తగ్గిపోతున్నది అన్న అంశాన్ని వీరు ఈ రచనలో స్పష్టంగా నిరూపించారు. నాటి నుండి ఈ అంశానికి

## ఒకటవ పట్టిక

### వివిధ రాష్ట్రాలలో స్త్రీ-పురుషుల జీవిత కాల పరిమాణము : వెయ్యిమంది పురుషులకు ఉన్న స్త్రీ జనాభా పరిమాణం

| రాష్ట్రం పేరు | జనాభా (కోట్లలో) 1991 | జీవిత కాల పరిమాణపు అంచనా (1990-92) | | ప్రతి 1000మంది పురుషులకు ఉన్న స్త్రీ జనాభా (1991) |
|---|---|---|---|---|
| | | స్త్రీలు | పురుషులు | |
| కేరళ | 2.91 | 74.4 | 68.8 | 1,036 |
| హిమాచల్ ప్రదేశ్ | 0 52 | - | - | 976 |
| మహారాష్ట్ర | 7 89 | 64.7 | 63.1 | 934 |
| తమిళనాడు | 5.59 | 63.2 | 61 0 | 974 |
| పంజాబు | 2 03 | 67.5 | 65.0 | 882 |
| గుజరాత్ | 4.13 | 61.3 | 59.1 | 934 |
| పశ్చిమబెంగాల్ | 6.81 | 62.0 | 60 5 | 917 |
| కర్ణాటక | 4.50 | 63.6 | 60.0 | 960 |
| అస్సాం | 2 24 | - | - | 923 |
| హర్యానా | 1.65 | 63.6 | 62.2 | 865 |
| ఒరిస్సా | 3.17 | 54.8 | 55.9 | 971 |
| ఆంధ్రప్రదేశ్ | 6.65 | 61.5 | 59.0 | 972 |
| మధ్యప్రదేశ్ | 6.62 | 53.5 | 54.1 | 931 |
| ఉత్తరప్రదేశ్ | 13.91 | 54.6 | 56.8 | 879 |
| బీహారు | 8.64 | 58.3 | - | 911 |
| రాజస్థాన్ | 4 40 | 57.8 | 57.6 | 910 |
| భారతదేశం | 84.63 | 59.4 | 59.0 | 927 |

- ఈ పట్టికలోని సమాచారానికి జీన్ డ్రేజ్, అమార్త్య సేన్‌ల సమాచారం ఆధారం.

గమనిక : అన్ని రాష్ట్రాలలోనూ స్త్రీల జీవిత కాలపరిమాణం పురుషుల కంటె అధికంగా ఉంటున్నా, జనాభాలో పురుషుల కంటె స్త్రీ జనాభా సంఖ్యా పరిమాణంలో తక్కువగా ఉండటాన్ని గమనించవచ్చు. ఒక్క కేరళ రాష్ట్రంలో మాత్రమే స్త్రీ జనాభా పురుష జనాభా కంటె పరిగణించదగిన పరిమాణంలో అధికంగా ఉన్నది. ఈ విషయంలో కేరళ, అభివృద్ధి చెందిన దేశాల స్థాయికే దీటుగా నిలిచింది.

### 1991వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం భారత దేశంలో బాలుర కంటే బాలికల జనాభా అతి తక్కువగా నున్న జిల్లాలు

| జిల్లాపేరు | ఆరు సంవత్సరాలలోపు వయసు గల ప్రతి వెయ్యిమంది బాలురకు, అదే వయసులో నున్న బాలికల సంఖ్య |
|---|---|
| హిస్సార్ (హర్యానా) | 867 |
| కురుక్షేత్ర (హర్యానా) | 867 |
| బఠిండా (పంజాబు) | 866 |
| ఫరీద్‌కోట్ (పంజాబు) | 863 |
| అమృతసర్ (పంజాబు) | 861 |

| జిల్లాపేరు | ఆరు సంవత్సరాలలోపు వయసు గల ప్రతి వెయ్యిమంది బాలురకు, అదే వయసులో నున్న బాలికల సంఖ్య |
|---|---|
| జింద్ (హర్యానా) | 858 |
| కైథల్ (హర్యానా) | 854 |
| జైసల్మేర్ (రాజస్థాన్) | 851 |
| భింద్ (మధ్యప్రదేశ్) | 850 |
| సేలం (తమిళనాడు) | 849 |

- రిపోర్ట్ ఆఫ్ ది ఇండిపెండెంట్ కమిషన్ ఆన్ హెల్త్ ఇన్ ఇండియా నుండి

**రోగభారం వల్ల భారతీయ స్త్రీల మొత్తం జీవిత కాలంలో నష్టమవ్వుతున్న కాలము : దాని నిరోధ ప్రయత్న ప్రతిఫలం (1990)**

| రోగాలు లేక గాయాలు | నష్టమవుతున్న డాలీస్ (DALYS) | నివారణ కోసం పెట్టే పెట్టుబడులకు లభించే ప్రతిఫలం |
|---|---|---|
| చూలు, కాన్పు, అటు తర్వాత రాగల అనారోగ్యం | 2,09,03,000 | అధికం |
| శ్వాసకోశ సంబంధిత రోగాలు | 1,81,92,000 | అధికం |
| విరేచనాలు | 1,54,20,000 | అధికం |
| మసూచి, తట్టు వంటివి | 91,78,000 | అధికం |
| క్షయ | 50,16,000 | అధికం |
| సూక్ష్మ పోషక పదార్థ లోపం | 39,94,000 | అధికం |
| సుఖరోగాలు, హెచ్ఐవి/ఎయిడ్స్ | 37,78,000 | అధికం |
| శుక్లాలు | 12,81,000 | అధికం |
| గర్భ సంచికి వచ్చే కాన్సరు | 7,61,000 | అధికం |
| మానసిక రోగాలు | 51,02,000 | మధ్యమం |
| హృద్రోగాలు | 45,28,000 | మధ్యమం |
| మోటారు వాహన ప్రమాదాలు | 17,45,000 | మధ్యమం |
| మధుమేహం (డయబిటిస్) | 11,54,000 | మధ్యమం |
| ఉబ్బసము, ముదిరిన బ్రోంకైటిస్ వంటి వ్యాధులు | 11,03,000 | మధ్యమం |
| లాభదాయకంగా నివారించదగిన రోగాల వల్ల నష్ట పడుతున్న స్త్రీల జీవిత కాలపు మొత్తం | 9,42,21,000 | |

గమనిక : (1) డాలీస్ : రోగాలవల్ల సంభవిస్తున్న అకాల మరణాలు, లేక సంక్రమిస్తున్న శక్తిహీనతవల్ల వ్యక్తి నష్టపడుతున్న లేక కోల్పోతున్న మానవ జీవిత సంవత్సరాలు

(2) వంద డాలర్ల ఖర్చుతో ఒక్క డాలీని పొదుపు చేయగలిగిన చికిత్సకు లభిస్తున్న ప్రతిఫలాన్ని "అత్యధికం" గానూ, 100 నుండి 999 డాలర్ల వరకూ ఖర్చు చేయవలసి వచ్చిన దాని ఫలితాన్ని "మధ్యమం"గానూ వర్గీకరించారు.

– ప్రపంచ బ్యాంకు రిపోర్టు నుండి.

పరిగణన లభించటం ప్రారంభమైంది. ఇంత కాలమూ ఈ అంశం మీద జరుగుతున్నది ఊహాగానమేనని రుజువైంది. మనదేశంలోని సామాజిక పరిస్థితులే ఈ అవాంఛనీయ పరిణామానికి కారణమని కూడా వారు సూచించారు. దీనినే సామాన్యుల పరిభాషలో చెప్పాలంటే, స్త్రీల యెడల సమాజం ప్రదర్శిస్తున్న నిర్లక్ష్య ఫలితమే ఇది.

ఈ అంశం మీద కొంతమంది సామాజిక శాస్త్రవేత్తలు కొన్ని ఆసక్తిదాయకమైన విషయాలను నిర్ధయించటానికి ప్రయత్నించారు. వీరిలో ప్రొఫెసర్ అమార్త్య సేన్ ప్రథములు. స్త్రీ జనాభా తగ్గుదల పరిమాణాలను ప్రాతిపదికగా తీసుకొని,

### రెండవ పట్టిక

### ఆయా వయస్సు గ్రూపుల వారిలో ప్రతివెయ్యిమంది జనాభాకు సంభవిస్తున్న మరణాల సంఖ్య (1989-91)

| వయసు గ్రూపు | మొత్తం భారతదేశము | | | గ్రామీణ ప్రాంతం | | | పట్టణ ప్రాంతం | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషుల మరణాలు | స్త్రీల మరణాలు | ప్రతి వెయ్యి స్త్రీ మరణాలకు సంభవిస్తున్న పురుష మరణాలు | పురుషుల మరణాలు | స్త్రీల మరణాలు | ప్రతి వెయ్యి స్త్రీ మరణాలకు సంభవిస్తున్న పురుష మరణాలు | పురుషుల మరణాలు | స్త్రీల మరణాలు | ప్రతి వెయ్యి స్త్రీ మరణాలకు సంభవిస్తున్న పురుష మరణాలు |
| 0-4 | 26.3 | 28.9 | 910 | 28.9 | 32.1 | 900 | 15.6 | 16.4 | 950 |
| 5-9 | 2.4 | 3.0 | 820 | 2.7 | 3.4 | 810 | 1.4 | 1.5 | 940 |
| 10-14 | 1.4 | 1.5 | 940 | 1.5 | 1.8 | 870 | 0.9 | 0.9 | 1,001 |
| 15-19 | 1.7 | 2.5 | 690 | 1.8 | 2.8 | 640 | 1.4 | 1.5 | 940 |
| 20-24 | 2.4 | 3.2 | 750 | 2.6 | 3.5 | 740 | 1.8 | 2.2 | 830 |
| 25-29 | 2.7 | 3.0 | 890 | 2.9 | 3.3 | 860 | 2.3 | 2.0 | 1,160 |
| 30-34 | 3.2 | 2.8 | 1,120 | 3.3 | 3.2 | 1,040 | 2.5 | 1.7 | 1,530 |
| 35-39 | 4.0 | 3.4 | 1,190 | 4.3 | 3.7 | 1,140 | 3.4 | 2.4 | 1,470 |
| 40-44 | 5.5 | 4.1 | 1,340 | 5.9 | 4.6 | 1,280 | 5.1 | 3.1 | 1,670 |
| 45-49 | 9.0 | 5.9 | 1,530 | 9.3 | 6.2 | 1,500 | 8.3 | 4.9 | 1,760 |
| 50-54 | 13.3 | 9.0 | 1,470 | 13.4 | 9.4 | 1,430 | 12.6 | 7.7 | 1,640 |
| 55-59 | 20.7 | 14.0 | 1,480 | 20.6 | 14.2 | 1,450 | 21.0 | 13.2 | 1,620 |
| 60-64 | 31.6 | 23.2 | 1,360 | 31.7 | 23.8 | 1,330 | 31.0 | 20.9 | 1,490 |
| 65-69 | 47.1 | 37.6 | 1,250 | 47.4 | 38.5 | 1,230 | 46.0 | 33.9 | 1,360 |
| 70- ఆపైన | 94.2 | 81.1 | 1,160 | 95.3 | 82.4 | 1,160 | 90.0 | 76.1 | 1,190 |
| అన్ని గ్రూపులు | 10.0 | 9.8 | 1,020 | 10.8 | 10.7 | 1,010 | 7.5 | 6.6 | 1,130 |

గమనిక : రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయం వారి అన్ని సంవత్సరాల అంచనాలు ఒకే చిత్రాన్ని గాకుండా, భిన్న ధోరణులను ప్రతిబింబిస్తున్నట్లు దీని నివారణకు కొన్ని సంవత్సరాల అంచనాల సగటును స్వీకరించినట్లు రిపోర్టు పేర్కొన్నది

- రిజిస్ట్రార్ జనరల్ ఆఫ్ ఇండియా వారి పలుసంవత్సరాల అంచనాలతో ప్రపంచబ్యాంకు రిపోర్టు "ఇంప్రూవింగ్ ఉమెన్స్ హెల్త్ ఇన్ ఇండియా" ప్రచురించిన పట్టిక

1986వ సంవత్సరంలో స్త్రీ జనాభాలో ఉండవలసిన మూడు కోట్లా డెబ్భై లక్షల మంది "కనుపించటం లేదు" అని రుజువు చేశారు. స్టీవెన్ క్లాసెన్ అనే మరో సోషల్ సైంటిస్టు భారతదేశంలో "అదృశ్య స్త్రీల'' సంఖ్య మూడున్నర కోట్ల వరకూ ఉండవచ్చునని 1994లో అంచనా వేశారు. భారతదేశపు అదృశ్య స్త్రీల జనాభాను అంచనా వేయటానికి ఇతరులు కూడా ప్రయత్నించారు. భారతదేశపు అదృశ్య స్త్రీల జనాభా రెండు కోట్ల ముప్పైలక్షల నుండి నాలుగు కోట్ల ఇరవై లక్షల వరకూ ఉండవచ్చునని వీరి అంచనాలు సూచిస్తున్నాయి.

ఆఫ్రికా, లాటిన్ అమెరికా, ఆగ్నేయ ఆసియా దేశాలతో సహా, ప్రపంచంలోని అత్యధిక దేశాలలో, ఆయా వయస్సుల వారీగా పరిశీలించగా, ప్రతి దశలోనూ, స్త్రీల కంటే పురుషుల మరణాల రేటు అధికంగా ఉండటం కనుపిస్తుంది. భారతదేశంతో సహా, పలు దక్షిణ ఆసియా దేశాలలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నది. ముప్పై సంవత్సరాల వయస్సు వచ్చే వరకూ పురుషుల కంటే స్త్రీల మరణాల రేటు అధికంగా

## మూడవ పట్టిక
## భారతదేశంలోనూ, వివిధ రాష్ట్రాలలోనూ స్త్రీ-పురుష మరణాల రేట్లు (1992)

| రాష్ట్రం | స్త్రీలు పురుషులు కలిపి | పురుషులు | స్త్రీలు | ప్రతి వెయ్యి స్త్రీ మరణాలకు సంభవిస్తున్న పురుష మరణాలు |
|---|---|---|---|---|
| భారతదేశం | 10.1 | 10.0 | 10.2 | 980 |
| కేరళ | 6.3 | 7.5 | 5.2 | 1,440 |
| కర్ణాటక | 8.5 | 9.3 | 7.7 | 1,210 |
| పంజాబు | 8.2 | 8.9 | 7.4 | 1,200 |
| తమిళనాడు | 8.4 | 8.9 | 7.9 | 1,130 |
| పశ్చిమబెంగాల్ | 8.4 | 8.8 | 8.0 | 1,100 |
| ఆంధ్రప్రదేశ్ | 9.2 | 9.6 | 8.9 | 1,070 |
| గుజరాత్ | 9.2 | 9.3 | 9.0 | 1,030 |
| హర్యానా | 8.7 | 8.8 | 8.6 | 1,020 |
| మహరాష్ట్ర | 7.9 | 7.9 | 8.0 | 980 |
| ఒరిస్సా | 11.7 | 11.4 | 11.9 | 950 |
| రాజస్థాన్ | 10.5 | 10.2 | 10.9 | 930 |
| మధ్యప్రదేశ్ | 12.9 | 12.3 | 13.5 | 910 |
| ఉత్తరప్రదేశ్ | 12.8 | 11.9 | 14.0 | 850 |
| బీహారు | 10.9 | 10.0 | 11.9 | 840 |

*- రిజిస్ట్రారు జనరల్ కార్యలయం వారి 1994 వ సంవత్సరపు అంచనాల ఆధారంతో ప్రపంచబ్యాంకు రిపోర్టు ఇచ్చిన పట్టిక*

గమనిక : భారతదేశాన్ని మొత్తంగా చూచినపుడు, స్త్రీల మరణాల కంటే పురుష మరణాలు తక్కువగా ఉన్నట్లుతేలుతున్నది. పట్టికలోని చివరి ఐదు రాష్ట్రాలలో ముఖ్యంగా "బీమారు" రాష్ట్రాలలో స్త్రీల మరణాల కంటే పురుష మరణాలు చాలా తక్కువగా ఉండటాన్ని గమనించవచ్చు.

ఉంటున్నది. 20 వ శతాబ్దానికి పూర్వం, మెడిటరేనియన్ సముద్రం నుండి ఆసియా ఖండపు తూర్పు చివరి వరకూ, వ్యవసాయమే ప్రధాన వృత్తిగా ఉండేది. అత్యధిక జనాభాకు ఇదే జీవనాధారం. 20వ శతాబ్దంలో ఆర్థిక, సాంఘిక మార్పులు వచ్చేంత వరకూ, ఈ ప్రాంతంలో పురుషుల మరణాల రేటు కంటే స్త్రీ మరణాలరేటు అధికంగానే ఉండేది. స్త్రీల మరణాల రేటు భారతదేశంలో అధికంగా ఉండటానికి, బలమైన సాంఘిక కారణాలున్నాయి. వాటిని పరిష్కరించటం కూడా కష్టం. నూతన సాంకేతిక విధానాలు ఉత్పత్తి రంగంలో వస్తున్నా, స్త్రీల పట్ల ప్రదర్శిత మవుతున్న అనాదరణ, లింగ వివక్ష అంతరించటం లేదు. అంతేగాదు; చూలాలికి పుట్టబోయేది మగబిడ్డ కాదని తేలితే, ఈ అభివృద్ధి చెందిన టెక్నాలజీని వినియోగించి, గర్భస్రావం జరిపిస్తున్నారు!

స్త్రీ-పురుష మరణాల రేటులో తేడా ఉండటం, స్త్రీలు మోస్తున్న అనారోగ్య భారానికి సూచన ఈ అంశం మీద భారత దేశంలో తగినంత పరిశోధనా సమాచారం లభించటం లేదు. ఇటీవల ప్రపంచబ్యాంకు, ప్రపంచ ఆరోగ్య సంస్థలు కలిసి, ప్రపంచ జనాభా యొక్క అనారోగ్య భారాన్ని అంచనా వేశాయి. ఈ అంచనాలను బట్టి భారతీయ స్త్రీలు మోస్తున్న అనారోగ్య భార పరిమాణాన్ని తెలుసుకునే అవకాశం కలిగింది. మనదేశంలోని స్త్రీలు పురుషుల కంటే అధిక అనారోగ్య భారాన్ని మోస్తున్నారు; సక్రమమైన వైద్య చికిత్స లోపం నుండి

కాపాడే వాక్సినేషన్సు వంటి ప్రాథమిక చర్యలు కూడా లోపించటం వల్ల పలువురు అకాల మరణం పాలవుతున్నారు. నిరోధించ దగిన అనారోగ్య భారాన్ని పురుషుల కంటే స్త్రీలే అధికంగా అనుభవించవలసి వస్తున్నట్లు స్పష్టమవుతున్నది. ఐదు సంవత్సరాల లోపు ఆడపిల్లలు, 15-44 సంవత్సరాల మధ్యవయస్సు గల మహిళలు అధిక అనారోగ్య భారాన్ని మోస్తున్నారు.

## మరణాల రేట్లలో ప్రాంతీయ భేదాలు

స్త్రీ పురుష మరణ రేట్లలో తీవ్రమైన ప్రాంతీయ భేదాలు కనుపిస్తున్నట్లు ఈ అధ్యాయంలోని రెండవ పట్టిక నిరూపిస్తున్నది. నాలుగు సంవత్సరాల లోపు వయస్సు వారిలోనూ, సంతాన ప్రాప్తిని పొందగలిగిన వయస్సు స్త్రీలలోనూ, మరణాల రేటు, ఈ వయస్సు పురుషుల మరణాల రేటు కంటే అధికంగా ఉంటున్నట్లు కూడా ఈ పట్టికలోని సంఖ్యావివరాలు స్పష్టం చేస్తున్నాయి.

జనాభా మరణాల రేట్లలోనూ, జనాభా సమస్యకు సంబంధించిన ఇతర అంశాలలోనూ, తీవ్రమైన ప్రాంతీయ భేదాలుండటం భారతదేశపు ప్రత్యేకత వలె కనుపిస్తున్నది. సంతానప్రాప్తి, మరణాల రేటు, నిరక్షరాస్యత వంటివి ఉత్తర భారతంలోని బీహారు, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో, భారతదేశంలోని ఇతర రాష్ట్రాలలో కంటె అధికంగా ఉన్నాయి. వీటి రోగగ్రస్థ స్థితికి సూచనగా ప్రొఫెసర్ అషీష్ బోస్ వీటికి బీమారు (BIMARU) రాష్ట్రాలని పేరు పెట్టారు. (BIhar లోని "BI" లను, Madhya Pradesh లోని "MA" లను, Rajastan లోని "R" ను, Uttar Pradesh లోని "U" ను తీసుకొని "BIMARU" ను రూపొందించారు. హిందీలో బీమారు అంటే అనారోగ్యంతో బాధపడటం అని అర్థం). కేరళ జనాభా స్థితిగతులు అభివృద్ధి చెందిన దేశాలతో సమంగా ఉన్నాయి. జనాభా మరణాల విషయంలో ఉత్తర భారతానికి, దక్షిణ భారతానికి ఏ మాత్రం పోలికలు కనుపించటం లేదు. 1992వ సంవత్సరపు అంచనాల ప్రకారం ఉత్తరప్రదేశ్‌లో ప్రతివెయ్యిమంది జనాభాకు పదముగ్గురు చొప్పున చనిపోతున్నారు. దక్షిణ భారతంలోని కేరళలోని మరణాల రేటు ఇందులో సగం మాత్రమే ఉన్నది ! (వెయ్యికి ఆరు). స్త్రీల మరణపు రేటులో కూడా, ఉత్తర, దక్షిణ భారతాలకు వ్యత్యాసం కనుపిస్తున్నది. అధిక పరిమాణంలో ఉన్న దారిద్ర్యం, నిరక్షరాస్యత, ప్రజారోగ్యానికి ప్రభుత్వాలు స్వల్ప మొత్తాలను ఖర్చు చేస్తూండటం, సామాజికాభివృద్ధి సాధన యెడల కార్యదీక్ష లేకపోవటం, ఇందుకు అవసరమైన స్థోమత ప్రభుత్వాలకు లేక పోవటం ప్రధాన కారణాలుగా, భారత స్త్రీల ఆరోగ్య పరిస్థితుల మీద 1996 వ సంవత్సరంలో ప్రపంచ బ్యాంకు "ఇంప్రూవింగ్ ఉమెన్స్ హెల్త్ ఇన్ ఇండియా" అన్న పేరిట ప్రచురించిన రిపోర్టు పేర్కొన్నది. ఇకముందు దీని ప్రస్తావన అవసరమైన చోట్ల "రిపోర్టు"గా పేర్కొంటాం. (స్త్రీ-పురుష మరణాల రేట్ల వ్యత్యాసాన్ని మూడవ పట్టికలో చూడవచ్చు.)

దేశంలోని వివిధ రాష్ట్రాల మధ్య మాత్రమే గాదు: ఒకే రాష్ట్రం లోని, గ్రామీణ, పట్టణ ప్రాంతాల మధ్య కూడా స్త్రీలు మోస్తున్న అనారోగ్య భార పరిమాణంలో వ్యత్యాసాలున్నాయి. జనాభా మరణాల రేటు, గ్రామీణ ప్రాంతాలలో కంటే పట్టణ ప్రాంతాలలో తక్కువగా ఉన్నది. పట్టణ ప్రాంతాల స్త్రీలు అనుభవిస్తున్న అననుకూలతల కంటే, గ్రామీణ స్త్రీలు అధిక బాధలకు గురవుతున్నారు. అభివృద్ధి చెందుతున్న ఇతర దేశాలలో కూడా ఇదే స్థితి కనుపిస్తున్నది. జనాభాలోని ఏ వయసు గ్రూపులను పరిశీలించినా, గ్రామీణ జనాభా మరణాలు, పట్టణ ప్రాంతంలో కంటే అధికంగా ఉన్నాయి. 1989-91 సంవత్సరాలలో పట్టణ ప్రాంత స్త్రీల మరణాల రేటు వెయ్యికి ఏడు మాత్రమే ఉండగా, గ్రామీణ మహిళల మరణాల రేటు పదకొండుగా ఉన్నది! (రెండవ పట్టికను చూడండి).

గత కొన్ని దశాబ్ద పరిమాణాలను పరిశీలిస్తే, పురుషుల జీవితకాల పరిమాణం కంటే, స్త్రీల జీవిత కాల పరిమాణం కొద్దిగా పెరిగినట్లు కనుపిస్తున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో పురుషుల జీవితకాల పరిమాణం 62 సంవత్సరాలుంటే, స్త్రీల జీవిత కాల పరిమాణం 63 సంవత్సరాలున్నది. అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో ఈ పరిమాణం పురుషులకు 73 సంవత్సరాలు, స్త్రీలకు 80 సంవత్సరాలున్నది! భారత రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయపు అంచనాల ప్రకారం 1961-70 సంవత్సరాల కాలంలో పురుషుల జీవిత కాల పరిమాణం ఇంతకంటే తక్కువగా (44.7 సంవత్సరాలు) ఉన్నది. 1986-90 సంవత్సరాలలో ఈ పరిమాణం పురుషులకు

## నాల్గవ పట్టిక
## 1972-1992 సంవత్సరాల మధ్యకాలంలో శిశుమరణాలు (వెయ్యి సజీవ జననాలకు)

| సంవత్సరం | బాల బాలికలు | బాలురు | బాలికలు | ప్రతి వెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
|---|---|---|---|---|
| 1972 | 139 | 132 | 148 | 890 |
| 1974 | 126 | 132 | 135 | 980 |
| 1976 | 129 | 124 | 134 | 930 |
| 1979 | 120 | 119 | 121 | 980 |
| 1980 | 114 | 113 | 115 | 980 |
| 1981 | 110 | 110 | 111 | 990 |
| 1982 | 105 | 106 | 104 | 1,020 |
| 1983 | 105 | 105 | 105 | 1,000 |
| 1984 | 104 | 104 | 104 | 1,000 |
| 1985 | 97 | 96 | 98 | 980 |
| 1986 | 96 | 96 | 97 | 990 |
| 1987 | 95 | 95 | 96 | 990 |
| 1988 | 94 | 94 | 93 | 1,020 |
| 1989 | 91 | 91 | 90 | 1,020 |
| 1990 | 80 | 78 | 81 | 960 |
| 1991 | 80 | 81 | 80 | 1,010 |
| 1992 | 79 | 79 | 80 | 990 |

- ప్రపంచ బ్యాంకు రిపోర్టు నుండి

## ఐదవ పట్టిక
## 1972-1992 సంవత్సరాల మధ్యకాలంలో నాలుగు సంవత్సరాలలోపు వయసు పిల్లల మరణాలు
## (ఈ వయసులోని ప్రతి 1000 మందికి - మరణాల సంఖ్య)

| సంవత్సరం | అఖిల భారతం | గ్రామీణ ప్రాంతం | పట్టణ ప్రాంతం |
|---|---|---|---|
| 1972 | 57.3 | 62.7 | 32.3 |
| 1973 | 52.3 | 56.8 | 31.4 |
| 1974 | 50.0 | 54.8 | 27.3 |
| 1975 | 55.0 | 60.3 | 31.7 |
| 1976 | 51.0 | 55.2 | 29.7 |
| 1977 | 50.9 | 56.1 | 27.1 |
| 1978 | 48.3 | 53.2 | 26.3 |
| 1979 | 45.7 | 50.6 | 23.9 |
| 1980 | 41.8 | 46.1 | 22.2 |
| 1981 | 41.2 | 45.5 | 20.4 |
| 1982 | 39.1 | 43.9 | 20.9 |
| 1983 | 37.6 | 41.8 | 21.4 |
| 1984 | 41.2 | 46.2 | 23.2 |
| 1985 | 38.4 | 43.3 | 20.7 |
| 1986 | 36.6 | 40.8 | 20.9 |
| 1987 | 35.2 | 39.7 | 18.2 |
| 1988 | 33.3 | 35.7 | 18.7 |
| 1989 | 29.9 | 33.2 | 16.9 |
| 1990 | 26.3 | 29.1 | 15.1 |
| 1991 | 26.5 | 29.1 | 16.0 |
| 1992 | 26.5 | 29.1 | 15.6 |

- రిజిస్ట్రారు జనరల్ ఆఫ్ ఇండియా కార్యాలయం అంచనాల ప్రాతిపదిక మీద ప్రపంచబ్యాంకు రిపోర్టు ఇచ్చిన పట్టిక

## ఆరవ పట్టిక
## భారతదేశంలోని ప్రధాన రాష్ట్రాలలో 1992లో, సంవత్సరంలోపు వయసు శిశుమరణాలు
## ప్రతి వెయ్యిసజీవ జననాలకు - మరణాల సంఖ్య

| రాష్ట్రం | బాల బాలికలు | బాలురు | బాలికలు | ప్రతి వెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
|---|---|---|---|---|
| అఖిల భారతం | 79 | 79 | 80 | 990 |
| కేరళ | 17 | 21 | 12 | 1,750 |
| కర్ణాటక | 73 | 77 | 67 | 1,150 |
| మధ్యప్రదేశ్ | 104 | 109 | 98 | 1,110 |
| పశ్చిమబెంగాల్ | 65 | 67 | 62 | 1,080 |
| ఆంధ్రప్రదేశ్ | 71 | 73 | 68 | 1,070 |
| మహారాష్ట్ర | 59 | 61 | 57 | 1,070 |
| హిమాచల్‌ప్రదేశ్ | 67 | 67 | 66 | 1,010 |
| ఒరిస్సా | 115 | 114 | 116 | 980 |
| తమిళనాడు | 58 | 58 | 59 | 980 |
| బీహారు | 73 | 71 | 74 | 960 |
| గుజరాత్ | 67 | 66 | 69 | 960 |
| రాజస్తాన్ | 90 | 80 | 92 | 960 |
| హర్యానా | 75 | 73 | 78 | 940 |
| పంజాబ్ | 56 | 54 | 60 | 900 |
| ఉత్తరప్రదేశ్ | 98 | 92 | 105 | 880 |

- రిజిస్ట్రారు జనరల్ ఆఫ్ ఇండియా వారి సమాచార ప్రాతిపదిక మీద ప్రపంచబ్యాంకు రిపోర్టు ఇచ్చిన పట్టిక

ఏడవ పట్టిక
1972-1992 సంవత్సరాల మధ్యకాలంలో సంవత్సరంలోపు వయసు శిశుమరణాలు
(ప్రతి వెయ్యి సజీవ జననాలకు - మరణాల సంఖ్య)

| సంవత్సరం | బాల బాలికలు | బాలురు | బాలికలు | ప్రతి వెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
|---|---|---|---|---|
| 1972 | 139 | 132 | 148 | 890 |
| 1974 | 126 | 132 | 135 | 980 |
| 1976 | 129 | 124 | 134 | 930 |
| 1979 | 120 | 119 | 121 | 980 |
| 1980 | 114 | 113 | 115 | 980 |
| 1981 | 110 | 110 | 111 | 990 |
| 1982 | 105 | 106 | 104 | 1,020 |
| 1983 | 105 | 105 | 105 | 1,000 |
| 1984 | 104 | 104 | 104 | 1,000 |

| సంవత్సరం | బాల బాలికలు | బాలురు | బాలికలు | ప్రతి వెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
|---|---|---|---|---|
| 1985 | 97 | 96 | 98 | 980 |
| 1986 | 96 | 96 | 97 | 990 |
| 1987 | 95 | 95 | 96 | 990 |
| 1988 | 94 | 94 | 93 | 1,020 |
| 1989 | 91 | 91 | 90 | 1,020 |
| 1990 | 80 | 78 | 81 | 960 |
| 1991 | 80 | 81 | 80 | 1,010 |
| 1992 | 79 | 79 | 80 | 990 |

*- ప్రపంచ బ్యాంకు రిపోర్టు నుండి*

58.1 సంవత్సరాలకు పెరుగగా, స్త్రీలకు 59.1 సంవత్సరాలకు పెరిగింది. ఈ పెరుగుదల వల్ల 30 సంవత్సరాల లోపు వయస్సు గల స్త్రీలు లాభించలేదు. పసిబిడ్డలు, ఆడపిల్లలు, సంతానవతులు కాగల వయస్సు లోని స్త్రీలు, చికిత్సతో నివారించదగిన రోగాలతో కూడా, వయస్సు మళ్ళిన స్త్రీల కంటే అధికంగా మరణ ప్రమాదానికి గురవుతున్నారు.

## పెరుగుతున్న స్త్రీ శిశు మరణాలు

1989-91 సంవత్సరాల మధ్యకాలంలో, నాలుగు సంవత్సరాలు, అంతకు తక్కువ వయసున్న ఆడపిల్లలలో, ప్రతి వెయ్యిమందికి 28.9 మంది చొప్పునా, మగపిల్లలలో ప్రతి వెయ్యి మందికి 26.3 చొప్పున మరణించారు. ఈ ప్రాతిపదిక మీద చూచినపుడు మగపిల్లల మరణాల కంటే, ఆడపిల్లల మరణాలు పదిశాతం వరకూ అధికంగా ఉన్నాయి; ఐదు - తొమ్మిది సంవత్సరాల మధ్య వయస్సు గల బాలబాలికల గ్రూపులో, ప్రతి వెయ్యి మందికి ఆడపిల్లల మరణాలు మూడుగాను, మగపిల్లల మరణాలు 2.4 గాను ఉన్నాయి. ఈ గ్రూపులో బాలుర మరణాల కంటే బాలికా మరణాలు 25 శాతం వరకూ అధికంగా ఉన్నట్లు కనుపిస్తున్నాయి. ఇరువురూ 10-14 సంవత్సరాల వయస్సు దశకు వచ్చే సరికి, వారి మరణాల రేటు దాదాపు సమాన స్థాయికి వచ్చింది. బాల్యదశను అధిగమించి, 10-14 సంవత్సరాల వయస్సులో ప్రవేశించిన వారు బాల్యంలోని గండాలను గడిచి గట్టెక్కినట్లు లెక్క. అందువల్ల బాల బాలికా మరణాల రేటు దాదాపు సమాన స్థాయికి వచ్చింది. బాలికలు ఇక ముందు చూలు, కాన్పులకు సంబంధించిన ప్రమాదాలను ఎదుర్కొన వలసి ఉంటుంది. అందువల్ల, ఈ వయస్సు దశ దాటిన తర్వాత స్త్రీల మరణాల రేటు, పురుషుల మరణాల రేటు కంటే అధికంగా ఉంటుంది. (రెండవ పట్టికను చూడండి)

పసిబిడ్డలు, చిన్న పిల్లల మరణ పరిమాణాలు జనాభా ఆరోగ్య స్థితికి కొలమానాలు. గత రెండు దశాబ్దాల అంచనాలను పరిశీలిస్తే సంవత్సరం లోపు వయస్సు గల పసిబిడ్డల మరణాలు, నాలుగు సంవత్సరాలు - అంతకంటే తక్కువ వయస్సున్న చిన్న పిల్లల మరణాల రేటు కూడా తగ్గుతూండటం కనుపిస్తుంది. భారత రిజిస్ట్రార్ జనరల్ అంచనాల ప్రకారం, సంవత్సరం వయస్సు లోపు శిశు మరణాలు, 1972-74

సంవత్సరాల కాలంలో, ప్రతి వెయ్యి శిశు జననాలకు 139గా ఉన్నాయి; 1990-92 సంవత్సరాల కాలానికివి 79కి తగ్గాయి. ఇదే కాలంలో నాలుగు సంవత్సరాలు అంతకు తక్కువ వయస్సున్న చిన్న పిల్లల మరణాలు 57.3 నుండి 26.5కు తగ్గాయి. (నాల్గవ, ఐదవ పట్టికలను చూడండి) ఈ రేట్లు అన్ని రాష్ట్రాలలోనూ ఒకే పరిమాణంలో లేవు; తేడాలున్నాయి. ఉదాహరణకు ఒరిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో శిశు మరణాల రేటు వెయ్యిమందికి నూటికి పైగా ఉండగా, కేరళలో పదిహేడు మాత్రం గానే ఉన్నది. దేశంలోని అన్ని రాష్ట్రాలలో కంటే పిల్లల మరణాల రేటు ఈ ఒక్క రాష్ట్రం లోనే తక్కువగా ఉన్నది. (ఆరవ పట్టిక చూడండి)

ఇంతకు పూర్వమే చెప్పుకొన్నట్లు, పురుషులలో కంటే, స్త్రీలలో జీవశక్తి అధికంగా ఉంటుంది. ఈ సూత్రం ప్రకారం, మగ శిశు మరణాలు ఆడ శిశు మరణాల కంటే అధికంగా ఉండాలి. కాని మనదేశంలో ఈ రెండు రేట్లు ప్రస్తుతం దాదాపు సమంగా ఉన్నాయి. (ఆరవ, ఏడవ పట్టికలను చూడండి). ఒక్క కేరళలో మాత్రమే ఈ సూత్ర ప్రభావం కనువిస్తున్నది. మగశిశువులు వెయ్యికి 21 మంది మరణిస్తుండగా, స్త్రీశిశువులు కేవలం పన్నెండు మంది మాత్రమే మరణిస్తున్నారు. 1992వ సంవత్సరపు అంచనాల ప్రకారం దేశంలో స్త్రీశిశు మరణాలు పురుషశిశు మరణాల కంటే అధికంగానే ఉన్నాయి.

పుట్టిన తర్వాత శిశువు 28 రోజులలోపు మరణించటాన్ని పురుటి చావుగా పరిగణిస్తారు. తర్వాత సంభవించే మరణాలను శిశుమరణాలుగా భావిస్తున్నారు. మన దేశంలో రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయం ఈ రెంటినీ కలిపి, శిశు మరణాలుగా ప్రకటిస్తున్నది. పురుటి మరణాలు సామాన్యంగా టెటనస్, నెలలు నిండకుండానో లేక అంగవైకల్యంతోనో బిడ్డ పుట్టటం వంటి కారణాల వల్ల సంభవిస్తాయి. ఇవి స్త్రీ, పురుష శిశువులను ఒకే విధంగా ప్రభావితం చేస్తాయి. ఈ దశ దాటిన తర్వాత సంభవించే మరణాలు, సామాన్యంగా అంటురోగాల వల్ల సంభవిస్తాయి. రోగ నిరోధక టీకాలను ఇప్పించటం, బిడ్డ ఆరోగ్య రక్షణకు తగిన చర్యలు తీసుకోవటం, పోషణా లోపం జరుగకుండా చూడటం వంటి వాటివల్ల ఈ రోగాలు ముదరకుండా, బిడ్డ మరణానికి దారి తీయకుండా చూడవచ్చు. లింగ వివక్షా భావంతో ఆడపిల్లల పోషణ, ఆరోగ్య రక్షణల యెడల అశ్రద్ధ ఎచ్చట ప్రదర్శిత మవుతుందో ఆ ప్రదేశంలో ఆడపిల్లల మరణాలు మగపిల్లల కంటే అధికంగా ఉంటాయి. కనుక చనిపోతున్న వారిలో ఆడపిల్లలు ఎక్కువ మంది ఉంటున్నారా, మగపిల్లలు ఎక్కువ మంది ఉంటున్నారా అని పరిశీలించటానికి ఆడపిల్లలకు, మగపిల్లలకు విడివిడిగా అంచనాలుండాలి. కాని రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయం ఇలాంటి అంచనాలను రూపొందించటం లేదు కాని కొందరు పరిశోధకులు సేకరించిన సమాచారం, ఆడ, మగ పిల్లల మరణ రేట్లలో వ్యత్యాసం ఉన్నట్లు సూచిస్తున్నది. ఈ విషయంలో మాత్రం ఉత్తర దక్షిణ భారతాల మధ్య వ్యత్యాసం కనుపించటం లేదు. 1965-84 సంవత్సరాల మధ్య జరిగిన సర్వేల ప్రకారం పురుటి చావులు ఆడపిల్లల కంటే మగపిల్లలవే ఎక్కువగా ఉన్నాయి. పుట్టిన 28 రోజుల తర్వాత నుండి సంవత్సరం వయస్సు నిండే లోపల సంభవించే మరణాలలో మాత్రం మగపిల్లల కంటే ఆడ పిల్లలవే అధికంగా ఉంటున్నాయి. ప్రచురితమయిన పరిశోధనా ఫలితాల ప్రకారం మరణిస్తున్న ప్రతి వెయ్యి మంది ఆడపిల్లలకు, మగ పిల్లల మరణాలు 530 నుండి 800 వరకూ ఉన్నట్లు ఈ సమాచారం సూచిస్తున్నది.

నాలుగు సంవత్సరాల లోపు వయస్సుగల చిన్న పిల్లలలో, మగ పిల్లల మరణ రేటు కంటే, ఆడ పిల్లల మరణరేటు అధికంగా ఉంటున్నట్లు ఈ అధ్యాయంలోని ఎనిమిది, తొమ్మిది పట్టికలు చిత్రిస్తున్నాయి. కేరళ, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రలలో మాత్రం ఈ వయస్సు మగపిల్లల మరణరేటు, ఆడపిల్లల కంటే అధికంగా ఉన్నది. దీనిని అభివృద్ధి చెందిన దేశాల పరిస్థితికి అనుగుణంగా ఉన్నట్లు భావించవచ్చు. 1994వ సం॥రంలో ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ స్టడీస్ వారు, పాప్యులేషన్ రిసర్చి సెంటర్ వారు ఉత్తర ప్రదేశ్‌లో కొన్ని పరిశీలనలను నిర్వహించారు. ఆడపిల్లల పరిస్థితి అత్యంత దయనీయంగా ఉన్నట్లు వారు ప్రకటించిన ఫలితాలు సూచించాయి. పుట్టిన 28 రోజుల తర్వాత, సంవత్సరం వయస్సు నిండే లోపల మరణిస్తున్న ప్రతి వంద మంది మగపిల్లలకు 124 మంది చొప్పున ఆడపిల్లలు మరణిస్తున్నారు. సంవత్సరం - ఐదు సంవత్సరాల

## ఎనిమిదవ పట్టిక

### నాలుగు సం॥రాలలోపు వయసు పిల్లల మరణాలు (1972-1992) (ప్రతి వెయ్యిమంది పిల్లలకు)

| సంవత్సరం | బాలురు | బాలికలు | ప్రతి వెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
|---|---|---|---|
| 1972 | 58.5 | 67.2 | 870 |
| 1973 | 53.1 | 60.8 | 870 |
| 1974 | 51.5 | 58.5 | 880 |
| 1975 | 57.2 | 63.5 | 900 |
| 1976 | 49.6 | 51.9 | 960 |
| 1977 | 47.5 | 54.5 | 870 |
| 1978 | 44.7 | 52.1 | 860 |
| 1979 | 43.8 | 47.7 | 920 |
| 1980 | 40.1 | 43.5 | 920 |
| 1981 | 39.2 | 43.3 | 910 |
| 1982 | 37.9 | 40.5 | 940 |

| సంవత్సరం | బాలురు | బాలికలు | ప్రతి వెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
|---|---|---|---|
| 1983 | 36.5 | 38.7 | 940 |
| 1984 | 39.5 | 43.0 | 920 |
| 1985 | 36.6 | 40.4 | 910 |
| 1986 | 34.7 | 38.6 | 900 |
| 1987 | 33.6 | 36.8 | 910 |
| 1988 | 31.8 | 34.9 | 910 |
| 1989 | 28.5 | 31.4 | 910 |
| 1990 | 24.8 | 27.9 | 890 |
| 1991 | 25.6 | 27.5 | 930 |
| 1992 | 24.9 | 28.2 | 880 |

*- రిజిస్ట్రారు జనరల్ ఆఫ్ ఇండియా కార్యాలయం అంచనాల ప్రాతిపదిక మీద ప్రపంచ బ్యాంకు రిపోర్టు ఇచ్చిన పట్టిక*

## తొమ్మిదవ పట్టిక

### 1982-1984,1992 సంవత్సరాల మధ్య కాలంలో నాలుగు సంవత్సరాలలోపు వయసు పిల్లల మరణాలు

| రాష్ట్రము | 1982-1984 | | | 1992 | | |
|---|---|---|---|---|---|---|
| | బాలురు | బాలికలు | ప్రతివెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు | బాలురు | బాలికలు | ప్రతివెయ్యి బాలికా మరణాలకు బాలుర మరణాలు |
| భారతదేశం | 38.0 | 40.7 | 930 | 24.9 | 28.2 | 880 |
| కేరళ | 11.5 | 9.6 | 1,200 | 5.0 | 2.7 | 1,850 |
| కర్ణాటక | 26.5 | 24.0 | 1,100 | 22.6 | 20.7 | 1,090 |
| ఆంధ్రప్రదేశ్ | 28.6 | 26.7 | 1,070 | 20.2 | 19.8 | 1,020 |
| మహారాష్ట్ర | 26.0 | 26.2 | 990 | 16.0 | 15.9 | 1,010 |
| పశ్చిమబెంగాల్ | 31.5 | 32.6 | 970 | 18.4 | 18.4 | 1,000 |
| తమిళనాడు | 29.9 | 31.9 | 940 | 15.0 | 15.7 | 960 |
| గుజరాత్ | 38.1 | 40.0 | 950 | 22.8 | 24.7 | 920 |
| మధ్యప్రదేశ్ | 26.0 | 52.4 | 970 | 36.8 | 40.3 | 910 |
| ఒరిస్సా | 46.2 | 44.2 | 1,050 | 31.7 | 35.2 | 900 |
| పంజాబ్ | 21.7 | 26.1 | 830 | 16.5 | 18.3 | 900 |
| రాజస్థాన్ | 43.7 | 48.7 | 900 | 31.2 | 36.3 | 860 |
| హర్యానా | 27.4 | 34.0 | 810 | 21.0 | 24.8 | 850 |
| బీహార్ | 42.2 | 45.7 | 920 | 24.2 | 29.6 | 820 |
| ఉత్తరప్రదేశ్ | 52.8 | 62.5 | 840 | 33.1 | 43.1 | 770 |

*- ప్రపంచబ్యాంకు రిపోర్టు నుండి*

పదవ పట్టిక
వివిధ రాష్ట్రాలలో 20-24 సంవత్సరాల వయస్సు స్త్రీ-పురుష మరణాలు (ప్రతివెయ్యిమందికి-1990-92)

| రాష్ట్రం | పురుషులు | స్త్రీలు | ప్రతి వెయ్యి స్త్రీ మరణాలకు పురుష మరణాలు |
|---|---|---|---|
| భారతదేశం | 2.4 | 3.2 | 750 |
| పంజాబ్ | 4.0 | 1.7 | 2,370 |
| కేరళ | 1.4 | 0.9 | 1,460 |
| ఆంధ్రప్రదేశ్ | 2 9 | 2.9 | 1,000 |
| తమిళనాడు | 2.7 | 2 7 | 1,000 |
| కర్ణాటక | 2.2 | 2.4 | 920 |
| హర్యానా | 2.1 | 2.8 | 760 |
| ఒరిస్సా | 3.0 | 4.0 | 760 |
| పశ్చిమబెంగాల్ | 2.1 | 2.7 | 760 |
| మహారాష్ట్ర | 1.7 | 2.5 | 700 |
| గుజరాత్ | 1.9 | 2.9 | 670 |
| ఉత్తరప్రదేశ్ | 2.6 | 3.9 | 660 |
| బీహార్ | 2.5 | 3.9 | 630 |
| మధ్యప్రదేశ్ | 2.7 | 4.3 | 620 |
| రాజస్థాన్ | 2.2 | 3.7 | 590 |

*- ప్రపంచ బ్యాంకు రిపోర్టు నుండి*

మధ్య వయస్సు వారిలో, ఆడపిల్లల మరణాలు మగపిల్లల మరణాల కంటే చాలా అధికంగా ఉన్నాయి. మరణిస్తున్న ప్రతి వందమంది మగ పిల్లలకూ, 170 మంది చొప్పున ఆడపిల్లలు మరణిస్తున్నారు. ప్రస్తుతం ఉన్న, నాలుగు సంవత్సరాలు అంతకు లోపు వయస్సు పిల్లల మరణాల రేటును ఇప్పటి కంటే తగ్గించటం సాధ్యం గాదని అనుకొందాం. దానినే ప్రాతిపదికగా తీసుకొంటే ఈ పరిశోధకులు విడుదల చేసిన అంచనాల ప్రకారం, మరణించ వలసిన దాని కంటే సాలుకు లక్ష మందికి మించే ఆడపిల్లలు అదనంగా చనిపోతున్నట్లు తేలుతున్నది. వీరి అకాల మరణాలను లింగ వివక్షా ప్రదర్శనా ఫలితంగా ప్రపంచబ్యాంకు రిపోర్టు పరిగణించింది.

మరికొంచెం లోతుగా పరిశీలిస్తే మరింత బాధాకర మైన అంశం కనుపిస్తుంది. మగపిల్లల మరణాల రేటు కంటె ఆడపిల్లల మరణాల రేటు అధికంగా ఉండటాన్ని, ఆడపిల్లలు అనుభవించ వలసి వస్తున్న ప్రతికూల పరిస్థితులను చూచాం. 1983వ సంవత్సరం వరకూ ఆడపిల్లల మరణాల రేటు, మగపిల్లల మరణాల రేటు కంటే అధికంగా తగ్గుతూ వచ్చింది. అటు తర్వాత బాల బాలికల మరణాల రేట్లు తగ్గుతూండటం కనుపిస్తుంది. మగ పిల్లల మరణాల రేటులో కంటే ఆడపిల్లల మరణాల రేటులో ఈ తగ్గుదల తక్కువగా ఉన్నది ఈ తరుగుదల ఫలితం మగ పిల్లలకు దక్కినంత అధిక పరిమాణంలో ఆడపిల్లలకు లభించలేదు! ఇందువల్ల ఇరువురి మరణరేట్ల మధ్యనున్న వ్యత్యాసం తగ్గకపోగా పెరిగింది దీని ఫలితంగా మగపిల్లల మరణాల రేటు కంటే ఆడపిల్లల మరణాల రేటు మరికొంచెం పెరిగింది 1982-84, 1990-92 సంవత్సరాల మధ్య కాలంలో భారతదేశంలో మగపిల్లల మరణాల రేటు 36 84 శాతం తగ్గగా, ఆడపిల్లల మరణాల రేటు 30.71 శాతం మాత్రమే తగ్గింది. 1982-84వ సంవత్సరాలలో దేశంలో ప్రతివెయ్యి బాలుర మరణాలకు 1071 చొప్పున బాలికా మరణాలున్నాయి; 1990-92వ సంవత్సరం వచ్చేసరికివి 1133కు పెరిగాయి! ఆరోగ్యపు పెంపుదల ఫలితం బాలబాలికలు ఇరువురకూ సమంగా లభించలేదని, బాలికలు అనుభవించవలసి వస్తున్న ప్రతికూలతలు పెరుగుతున్నాయనీ ఈ సంఖ్యా వివరాలు రుజువు చేస్తున్నాయి. (తొమ్మిదవ పట్టికను చూడండి) ఈ కాలంలో బాల బాలికా మరణాల మధ్య వ్యత్యాసం కొన్ని రాష్ట్రాలలో అధికంగా పెరగటం కనుపిస్తుంది. ఒరిస్సా. బీహారు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో ఈ వ్యత్యాసపు పెరుగుదల దేశంలోని ఇతర ప్రాంతాలలో కంటే అధికంగా ఉన్నట్లు ఈ వివరాలు స్పష్టం చేస్తున్నాయి. 1982-1992 సంవత్సరాల మధ్యకాలంలో దేశంలో సంవత్సరంలోపు వయసు గల శిశు మరణాలు తగ్గుతున్నట్లు కనుపించినా, ఈవయస్సులోని బాల బాలికా మరణాల మధ్య వ్యత్యాసం తగ్గుతున్నట్లు కనుపించటం లేదు. ఇది పరిశీలించవలసిన విషయం.

నాలుగు సంవత్సరాలు - అంతకు తక్కువ వయస్సు పిల్లల మరణాల రేటు ఇటీవల తగ్గుముఖం పట్టినట్లు కనుపిస్తున్నా, ఐదు సంవత్సరాల లోపు వయసు వారిని పరిగణనకు తీసుకొంటే, దేశంలో సంభవిస్తున్న మొత్తం

మరణాలలో ఈ గ్రూపు వారివే 30 శాతం (మూడవ వంతు వరకూ) ఉంటున్నట్లు తెలుతున్నది. స్త్రీ-పురుషుల జీవిత కాల పరిమాణాన్ని పెంచటానికి, ఇరువర్గాల మరణాల రేట్లను ఇంకా తగ్గించవలసి ఉంటుందని రిపోర్టు సూచించింది. ఈ విషయ నిరూపణకు, 1941-1970 సంవత్సరాల మధ్య కాలంలో శిశు, బాల బాలికా మరణాల రేట్ల తగ్గుదల స్త్రీ పురుష జీవితకాల పరిమాణపు పెంపులో 40 శాతం వరకూ కారణమైనట్లు రిపోర్టు పేర్కొన్నది ఐదు సంవత్సరాల లోపు వయస్సు వారి మరణాల రేటు తగ్గించటానికి, భారత ప్రభుత్వం ఇరవయ్యవ శతాబ్దాంతానికి నిర్ణయించిన లక్ష్య సాధనలో కృతకృత్యురాలైతే, ప్రజల జీవితకాల పరిమాణం మరో మూడు సంవత్సరాలు పెరిగే అవకాశాలున్నట్లు కూడా రిపోర్టు భావించింది. ఇతర వయస్సు గ్రూపుల మరణాల రేటును కూడా తగ్గించ గలిగితే మరో సంవత్సరం, ప్రజల జీవితకాల పరిమాణం పెరుగగలదని ఇది భావించింది.

### సంతాన ప్రాప్తి దశలో పెరుగుతున్న మరణాల రేటు

బిడ్డలను కనే వయస్సులో స్త్రీలకు మరణ ప్రమాద మధికమని ఇంతకు పూర్వమే చూచాం. 10-14సంవత్సరాల వయస్సులో కంటే, బిడ్డలను కనే వయస్సులో మరణ ప్రమాదం రెండు రెట్లు అధికంగా ఉన్నట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు అంచనా వేసింది. (రెండవ పట్టికను చూడండి). భారతదేశంలో అన్ని వయస్సులలోని వారి కంటే, 15-24 సం॥రాల మధ్య వయస్సు స్త్రీల మరణాలు అధికంగా ఉంటున్నాయి. 20-24 సంవత్సరాల వయస్సు గల స్త్రీలు, తమ జీవిత కాలంలో అధికంగా సంతానాన్ని కనే కాలం కింద లెక్క. ఈ వయస్సు పురుషుల, మరణరేటు కంటే స్త్రీల మరణపు రేటు నూరింట 25 వంతులు అధికమని ప్రపంచ బ్యాంకు రిపోర్టు అంచనా వేసింది. అత్యధిక సంతానాన్ని కనగల వయస్సును దాటితే, కాన్పు వల్ల ప్రాణాపాయం జరిగే ప్రమాదం నుండి స్త్రీకి విముక్తి లభించినట్లే భావించ వచ్చు. అటుతర్వాత కాలంలో స్త్రీ జీవశక్తి తన ప్రభావాన్ని ప్రదర్శిస్తుంది. 29 సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత, స్త్రీల మరణాల రేటు కంటే, పురుషుల మరణాల రేటు అధికంగా ఉంటున్నది. 1989-91 సంవత్సర కాలానికి భారతీయ స్త్రీ ఈ దశను చేరినట్లు రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయపు అంచనాలు సూచిస్తున్నాయి.

స్త్రీ జీవితకాలంలో అత్యధిక సంతానాన్ని కనే 20-24 సం॥రాల మధ్య వయస్సు స్త్రీల మరణాల రేటు విషయంలో రాష్ట్రాలలో భిన్న పరిస్థితి కనుపిస్తుంది. ఈ వయస్సు స్త్రీల మరణాల రేటు  కేరళలో వెయ్యికి ఒక్కటి కంటె కూడా తక్కువగా ఉండగా, మధ్యప్రదేశ్‌లో 4.3గా ఉన్నది. ఒక్క కేరళ, పంజాబు రాష్ట్రాలలో మాత్రమే ఈ వయస్సు స్త్రీల మరణాల రేటు, పురుషుల మరణాల రేటుకంటే తక్కువగా ఉన్నది. మిగిలిన అన్ని రాష్ట్రాలలోనూ అధికంగా ఉన్నది. ఉత్తర భారతంలోని రాష్ట్రాలలో పురుషుల మరణాల రేటు కంటే స్త్రీల మరణాల రేటు మరింత అధికంగా ఉన్నది. (పదవ పట్టికలో “బీమారు” రాష్ట్రాల పరిస్థితిని చూడండి) పట్టణ ప్రాంతాలలో మాత్రం, 20-24 సంవత్సరాల వయస్సు దశను దాటిన తర్వాత నుండే పురుషుల మరణాలరేటు కంటే, స్త్రీల మరణాల రేటు తక్కువగా ఉంటున్నట్లు అంచనాలు సూచిస్తున్నాయి. (రెండవ పట్టికను చూడండి)

సమాజంలో స్త్రీ గౌరవము, హోదా పెరుగుతున్న దానికి అనువుగా, స్త్రీ మరణాల రేటు తగ్గుతూ ఉంటుంది ఇది సాధారణంగా ప్రపంచంలోని పలు దేశాలలో ప్రదర్శిత మవుతున్న ధోరణి. దేశపు ఆర్థికాభివృద్ధి, అత్యంత సాంకేతిక ఉత్పత్తి వాడుక విధానాల అమలు వంటివి పురుషుల మనుగడకు తోడ్పడినంత అధికంగా స్త్రీలకు తోడ్పడవు. ఈ అభివృద్ధి పురుషుల మరణాల రేటు తగ్గుదలకు ఉపకరించి నంతగా స్త్రీ మరణాల రేటు తగ్గుదలకు తోడ్పడదు ఈవిషయంపై డ్రేజ్, అమార్త్య సేన్‌ల విశ్లేషణను ఇంతకు పూర్వమే వివరించాం. ఆర్థికంగా, సాంఘికంగా, వైజ్ఞానికంగా స్త్రీ ఎదగగలిగినపుడే, శిశు మరణాలు తగ్గుతాయి; లింగ వివక్ష తగ్గిపోతుంది. ఈ విషయాన్ని శ్రీలంక అనుభవం ప్రదర్శిస్తున్నది. 20వ శతాబ్దపు యాభయ్యవ దశాబ్దంలో, స్త్రీ-పురుష మరణాల రేట్లు ఈ దేశంలో కూడా భారత దేశంలో వలె ఉండేవి. స్త్రీలలో విద్యావ్యాప్తి జరిగి, కనే సంతానం పరిమితమై, చూలు-పురుటి చావుల రేట్లు తగ్గటంతో, సాధారణ మరణాల రేటు తగ్గటమే కాదు; పురుషుల కంటే స్త్రీలు అధికంగా చావటం కూడా తగ్గింది. ఈ పరిణామ క్రమంలో, తొలుత 10-14 సంవత్సరాల మధ్య వయస్సు వారి మరణాల రేటు తగ్గించి, తర్వాత సంతానాన్ని కనే వయసును దాటిన వారి

మరణాల రేటు తగ్గింది; అటు తర్వాతనే యువతుల, సంతానవతులు కాగల వయస్సు స్త్రీల మరణాల రేటు తగ్గింది. మన దేశంలోని కొన్ని రాష్ట్రాలలో కూడా ఇలాంటి ధోరణి కనుపిస్తున్నట్లు రిపోర్టు భావిస్తున్నది ప్రభుత్వాలు స్త్రీ సంక్షేమ కార్యక్రమాలను అమలు జరుపుతూ, ఈ పరిణామ వ్యాప్తిని ప్రోత్సహించాలని రిపోర్టు సూచిస్తున్నది.

అంటురోగాలు, చూలు, కాన్పు, నంబంధిత మరణాలు, శక్తి హీనతలకు దారిదీయగల స్త్రీల అనారోగ్యం, వారి మొత్తం అనారోగ్య భారంలో 68 శాతం మేరకు కారణమవుతున్నట్లు ప్రపంచబ్యాంకు జరిపించిన పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. ఈ అనారోగ్య భారంలో అత్యధిక భాగాన్ని సులభంగా అందుబాటులో నున్న వసతులతో, స్వల్ప ఖర్చుతో లభించగల విధానాలతో నిరోధించవచ్చు. చైనాలో, పైన పేర్కొన్నటువంటి అనారోగ్యభారం, స్త్రీలు భరిస్తున్న మొత్తం అనారోగ్య భారంలో 27 శాతం మేరకు మాత్రమే ఉండటం గమనించదగిన అంశం.

భారతదేశంలో చిన్న పిల్లలు, అనారోగ్యం వల్ల శక్తి హీనులు గావటానికి, అకాలంగా మరణించటానికి, శ్వాసకోశ సంబంధిత రోగాలు, విరోచనాలు, గాయాలు, పోషణా లోపము, మసూచి, తట్టువంటి అంటురోగాలు, టెటనస్ ప్రధాన కారణాలుగా కనుపిస్తున్నాయి. పుట్టినపుడు బిడ్డ ఉండవలసిన దానికంటే తక్కువ బరువుండటం కూడా ఈ గ్రూపు వారి అనారోగ్య భారానికి ముఖ్యమైన కారణమే. ఇవన్నీ, తల్లి ఆరోగ్యం చెడుతూ ఉండటానికీ, చూలు కాలంలోనూ, కాన్పు కాలంలోనూ తగినంత నాణ్యమైన వైద్యసేవలు ఆవిడకు లభించక పోవటానికీ నిదర్శనాలు. పదిహేను-నలభై నాలుగు సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీల అనారోగ్యభారానికి, చూలు, కాన్పు కాల పరిస్థితి, తీవ్రమైన మానసిక సంక్షోభం, గాయాలు, సుఖరోగాలు, క్షయవంటివి ప్రధాన కారణాలు. నలభయ్యేదు సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత హృద్రోగాలు వారి చావుకు ప్రధాన కారణమవుతున్నాయి. కాన్పులుడిగిన తర్వాతి జీవిత దశలో, శ్వాసకోశ సంబంధిత అంటురోగాలు, కాన్సరు, ట్యూమర్సు లేక గడ్డలు, గర్భసంచి కాన్సరు, శుక్లాలు, ఈ గ్రూపు స్త్రీల మరణాలకు కారణాలుగా కనుపిస్తున్నాయి.

ప్రపంచ బ్యాంకు నిపుణులు, స్త్రీల మరణాలకు సంబంధించిన గ్రామీణ, పట్టణ ప్రాంత సమాచారాన్ని, రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయం నుండే గాక ఇతర వనరుల నుండి కూడా సేకరించి, దాని విశ్లేషణకు ప్రయత్నించారు. స్త్రీల మొత్తం మరణాలలో బాల్యము, సంతాన ప్రాప్తిదశ, వృద్ధాప్యం - వీటికి సంబంధించిన రోగాలు గాక, శ్వాసకోశ వ్యాధులు 30 శాతం వరకూ, రక్త ప్రసరణానికి సంబంధించిన రోగాలు పదహారు శాతం వరకూ, కారణమవుతున్నట్లు వీరు సూచించారు; ప్రమాదాలు పదిశాతం మేరకు, ఇతర కారణాలు మరో పది శాతం వరకూ కారణమవుతున్నట్లు భావించారు. స్త్రీలకు మాత్రమే పరిమితమైన చూలు, కాన్పులకు సంబంధించిన రోగాలు తప్ప, స్త్రీ పురుషుల మరణాలకు దారిదీస్తున్న మిగిలినవన్నీ ఒకటిగానే ఉన్నాయని వీరు భావించారు. చూలు, కాన్పు కాలపురోగాలు స్త్రీల మీద అదనపు అనారోగ్య భారాన్ని వేస్తున్నాయి. దేశంలో సంభవిస్తున్న మొత్తం మరణాలలో, చూలు - కాన్పు సంబంధిత రోగాల వల్ల, నూరింట ఒకటి సంభవిస్తున్నది. ఈ చావులు ఉత్తర భారతదేశంలో అధికంగా ఉంటున్నాయి. ఒరిస్సాలో 1.8, రాజస్థాన్‌లో 1.7, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్‌లలో 1.4 శాతం మేరకున్నాయి.

## చూలు - కాన్పు సంబంధిత మరణాలు

చూలాండ్ర, బాలింతల అనారోగ్య పరిమాణాన్ని, రూపాన్ని, అందుకు గల కారణాలను గురించి భారతదేశంలో ఇపుడున్న అవగాహన "సమగ్రము", "సంతృప్తికరము" అయినది గాదు అని ప్రపంచ బ్యాంకు రిపోర్టు పేర్కొన్నది. పసిపిల్లల మరణాల అంచనాలను సేకరిస్తున్న రిజిస్ట్రార్ జనరల్ కార్యాలయం, అదేవిధంగా క్రమ పద్ధతిలో చూలాండ్ర, బాలింతల మరణాల వివరాలను సేకరించటం లేదని రిపోర్టు అభిప్రాయపడింది. దీనికితోడు, మనదేశంలో ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో జనన మరణాలు సక్రమంగా రిజిష్టరు గావటం లేదన్నది యథార్థం. ఇందువల్ల మన దేశంలో ఈ అంశం మీద లభిస్తున్న ప్రభుత్వ సమాచారం వాస్తవాన్ని ప్రతిబింబించటం లేదు; యథార్థం చాలా వరకు మరుగున పడుతున్నది. ఇపుడు భారత దేశంలో లభిస్తున్న అంచనాలు వాస్తవానికి దగ్గర్లో లేవని భావించినా, బాలింతలు, చూలాండ్ర మరణాలు చాలా అధికంగా ఉన్నట్లే అవి స్పష్టంగా

భారతదేశంలో ప్రతి లక్ష సజీవ జననాలకు సంభవిస్తున్న మెటర్నల్ మరణాలు : అంచనాలను వేసిన వారి వివరాలు

| ప్రాంతం | సంవత్సరం | ప్రతి లక్ష సజీవ జననాలకు సంభవిస్తున్న మెటర్నల్ మరణాలు | | అంచనాలను వేసిన వారి వివరం |
|---|---|---|---|---|
| | | సర్వే ద్వారా వేసిన అంచనాలు | హాస్పిటల్ ఆధారిత అంచనాలు | |
| భారత దేశము | 1980-87 | 500 | | యునిసెఫ్ 1990 |
| భారత దేశము | 1982-86 | 555 | | మారీ భట్ ప్రభృతులు 1992 |
| భారత దేశము (గ్రామీణ ప్రాంతం) | 1982-86 | 619 | | |
| భారత దేశము (పట్టణ ప్రాంతం) | 1982-86 | 373 | | |
| భారత దేశము | 1978-79 | | 703 | భాస్కరరావు 1980 |
| రాష్ట్రాలు | | | | |
| 1. ఆంధ్ర ప్రదేశ్ | | | | |
| అనంతపురం (గ్రామీణ ప్రాంతం) | 1984-85 | 830 | | భాటియా 1988 |
| అనంతపురం (పట్టణ ప్రాంతం) | 1984-85 | 545 | | " |
| 2. బీహార్ : పాట్నా | 1976-80 | | 553 | సిన్హా 1986 |
| 3. హర్యానా (రొహటక్) | 1978-88 | | 1,606 | తివారీ, గులాతీలు 1990 |
| | 1978-83 | | 2,243 | |
| | 1984-88 | | 1,071 | |
| 4. మధ్యప్రదేశ్, రీవా | 1975-80 | | 1,315 | అగర్వాల్ ప్రభృతులు 1982 |
| 5. మహారాష్ట్ర | 1983 | 333 | | చంద్రిక కపూర్, రంగనాధన్‌లు 1985 |
| బొంబాయి | 1974-83 | | 994 | లోపెజ్ ప్రభృతులు 1986 |
| పూనె | 1980-85 | | 315 | పంత్, మహెండల్ 1987 |
| 6. తమిళనాడు | 1981-85 | | 224 | నసీఫా బీబి 1987 |
| 7. పశ్చిమబెంగాల్ | 1975-79 | | | రాయ్‌చౌదరి ప్రభృతులు 1982 |
| | 1975 | | 997 | |
| | 1976 | | 1,047 | |
| | 1977 | | 677 | |
| | 1978 | | 1,157 | |
| | 1979 | | 2,000 | |
| కలకత్తా | 1974-80 | | 1,053 | మిత్రా, ఖరేలు 1983 |
| 8. ఉత్తరప్రదేశ్ | 1975-79 | | 1,025 | మాథుర్, రొహటగిలు, 1981 |
| 9. ఢిల్లీ | 1983-84 | | 650 | సెన్‌గుప్తా, గొడెల్, 1988 |
| | 1975-83 | | 705 | |
| | 1979-87 | | 638 | రాయ్‌చౌదరి ప్రభృతులు'90 |
| | 1979 | | 825 | |
| | 1987 | | 484 | |

- షిరీన్ జె. జిజిభాయి, సౌమ్యారామారావుల వ్యాసం : అన్‌సేఫ్ మదర్‌హుడ్ : ఎ రివ్యూ ఆఫ్ రిప్రొడక్టివ్ హెల్త్ నుండి

సూచిస్తున్నాయి "ప్రపంచ జనాభాలో భారతదేశపు జనాభా పదిహేను శాతం ఉన్నది; కాని ప్రపంచంలో సంభవిస్తున్న మొత్తం చూలాంద్ర, బాలింతల మరణాలలో భారతదేశంలో సంభవిస్తున్న వీరి మరణాలు ఇరవై శాతాన్ని మించి ఉన్నాయి" అని ప్రపంచ బ్యాంకు రిపోర్టు వెల్లడించింది.

భారత దేశంలో సంభవిస్తున్న ప్రతి లక్ష సజీవ జననాలకు, 437 మంది చొప్పున తల్లులు చనిపోతున్నట్లు ఇటీవలె (1990-91లో) నేషనల్ ఫామిలీ హెల్త్ సర్వే అంచనా వేసింది ఈ అంచనా లోగడ లభించిన అంచనాల కంటే తక్కువగానే ఉన్నది. ఇటీవలి కాలంలో జననాల సంఖ్య క్రమంగా తగ్గుతూ వస్తున్నది. ప్రమాదకరంగా భావించ వలసి వచ్చే తక్కువ వయస్సు స్త్రీల కాన్పుల సంఖ్య కూడా తగ్గిపోతున్నది అయినా, ఇంతమంది తల్లులు చనిపోతూ ఉండటం ఆశ్చర్యకరంగానే ఉంది. లక్ష సజీవ శిశు జననాలకు 437 మంది చూలు - కాన్పు కాలాలలో మరణిస్తూండటాన్ని, సంతానాన్ని కనగల వయసులో ఉన్న 15-49 సంవత్సరాల మధ్య వయస్సు గల స్త్రీలలోని ప్రతి లక్షమందికి, 55 మంది, చూలు లేదా కాన్పు సంబంధమైన ఇబ్బందుల వల్ల మరణిస్తున్నట్లు చెప్పవచ్చునని ప్రపంచబ్యాంకు రిపోర్టు వివరించింది. సంతానవతులు కాగల వయస్సున్న వారి మొత్తం మరణాలలో, పదిహేను శాతం వరకూ, చూలు, కాన్పులు కారణమవుతున్నట్లు కూడా ఈ రిపోర్టు సూచించింది. అభివృద్ధి చెందిన దేశాల పరిస్థితితో మన దేశపు పరిస్థితిని పోల్చి చూస్తే, అతి బాధాకరమైన చిత్రం కనుపిస్తుంది. అభివృద్ధి చెందిన దేశాలలో సంభవిస్తున్న ప్రతి లక్ష సజీవ శిశు జననాలకు మరణిస్తున్న తల్లుల సంఖ్య కేవలం పది. ఈ పదికి, భారత దేశపు 437 మరణాలకు అంతరం ఎంతో ఊహించటం కష్టంగాదు. "సాధారణ భారతీయ మహిళ గర్భవతి అయ్యే అవకాశం ఎంత అధికమో, గర్భధారణ తర్వాత ఆవిడ మరణించే ప్రమాదమూ అంత అధికంగా ఉంటుంది. చూలు, కాన్పు

పదకొండవ పట్టిక

కాన్పు కాలంలో సంభవిస్తున్న మొత్తం మరణాలలో ఆయారోగాల కారణంగా సంభవిస్తున్న మరణ శాతాలు

| మరణ కారణం | అనంతపురం జిల్లా గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో 1984-85 | కర్ణాటక రాష్ట్ర గ్రామీణ ప్రాంతంలో 1989 | భారతదేశ గ్రామీణ ప్రాంతంలో 1991 | భారతదేశ గ్రామీణ ప్రాంతంలో 1993 | భారత దేశ పట్టణ ప్రాంతంలో 1985 | నిర్దిష్ట వైద్యశాలలో 1978-81 | ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిశర్చి 1983-1984 |
|---|---|---|---|---|---|---|---|
| కాన్పుకు సంబంధించిన ప్రత్యక్ష కారణాలు | | | | | | | |
| అధిక రక్తస్రావం | 7 4 | 19.7 | 19.5 | 22.6 | 15.2 | 17.3 | 12.8 |
| గర్భ స్రావం | 11 9 | 4.5 | 10.8 | 11.7 | 16.9 | 15.1 | - |
| స్వతహాగా జరిగిన గర్భస్రావం | | 1.5 | | | | | |
| చేయించుకున్న గర్భ స్రావం | | 3.0 | | | | | |
| ఇన్‌ఫెక్షన్ | 25.0 | 24.3 | 12.7 | 12.5 | - | 17.2 | 17.3 |
| కాన్పు కష్టంగావటం | 5.3 | - | 11.6 | 5.5 | 3.3 | 5.0 | - |
| ఎక్లెంప్సియా | 9.2 | 15.2 | 8.8 | 12.8 | 13.0 | 10.7 | 12.0 |
| ఇతర ప్రత్యక్ష కారణాలు | 9.1 | 10.6 | 16.7 | 14.6 | 36.3 | 11.5 | 8.3 |
| కాన్పుకు సంబంధించిన పరోక్ష కారణాలు | | | | | | | |
| అనీమియా | 9.2 | - | 19.9 | 20.3 | | 7.8 | - |
| లివర్‌వాపు, హృద్రోగాలు | 9.8 | - | - | - | - | 15.4 | 22.5 |
| ఇతర పరోక్ష కారణాలు | 14.1 | - | - | - | 15.1 | - | - |

- ప్రపంచ బ్యాంకు రిపోర్టు నుండి

కారణాల వల్ల అభివృద్ధి చెందిన దేశాల స్త్రీ చనిపోవటం కంటే, భారతీయ సామాన్య మహిళ, ఈ కారణాల వల్ల చనిపోవటానికి వందరెట్ల అధికావకాశాలున్నాయి"అని ప్రపంచ బ్యాంకు రిపోర్టు వెల్లడించింది!

## మరణాలకు కారణాలు

భారత దేశంలో చూలు-కాన్పు సంబంధిత మరణాలకు (మెటర్నల్ మోర్టాలిటీకి)ఆరింటిని ప్రధాన కారణాలుగా రిపోర్టు పేర్కొన్నది. అవి : అనీమియా, అధిక రక్తస్రావం, ఎక్లెంప్సియా, కాన్పు కష్టం గావటం, రోగపు అంటు లేక ఇన్‌ఫెక్షన్, గర్భస్రావం. భారత దేశంలో ఏటా సంభవిస్తున్న చూలు-కాన్పు సంబంధిత (మెటర్నల్) మరణాలలో ఎనభై శాతానికి ఈ ఆరింటిలోనూ ఏదోఒకటి కారణమవుతున్నట్లు రిపోర్టు సూచించింది. రిజిస్ట్రార్ జనరల్ ఆఫ్ ఇండియా 1991వ సంవత్సరంలో జరిపించిన సర్వే ప్రకారం, అత్యధిక మెటర్నల్ మరణాలకు అధిక రక్తస్రావం కారణమని తేలింది. సంభవిస్తున్న మెటర్నల్ మరణాలలో, 23 శాతం వరకూ అధిక రక్తస్రావం వల్లా, ఇరవై శాతం అనీమియా వల్లా, ఆరు శాతం కాన్పు కష్టం గావటం వల్లా, పన్నెండు శాతం గర్భస్రావం వల్ల సంభవిస్తున్నట్లు ఈ సర్వే నిరూపించింది. ఇటువంటి పరిస్థితులే అభివృద్ధి చెందుతున్న ఇతర దేశాలలోనూ కనుపిస్తున్నాయి. వివిధ వైద్యశాలలలో నమోదైన వివరాల ప్రకారం, అధిక రక్తస్రావం, ఇన్‌ఫెక్షన్, ఎక్లెంప్సియా, అనీమియాలు మెటర్నల్ మరణాలకు ప్రధాన

పన్నెండవ పట్టిక

అనంతపురం జిల్లా సర్వేలో నిరోధించదగినవిగా తేలిన మెటర్నల్ మరణాలు : నిపుణులు సూచించిన చికిత్సా విధానం

| నివారణకు తగిన చికిత్సా విధానం | మరణ కేసుల సంఖ్య | నిరోధించ దగిన మరణాల శాతం | మొత్తం మెటర్నల్ మరణాలలో వీటి శాతం |
|---|---|---|---|
| చూలు కాలంలో తీసుకోదగిన చర్యలు | | | |
| అనీమియా నివారణ | 26 | 12.8 | 9.2 |
| చూలు యొక్క ప్రాథమిక దశలో తీసుకో దగిన చర్యలు | 18 | 8.9 | 6.3 |
| చూలుకాలంలో హెపటైటిస్ నివారణ చికిత్స | 7 | 3.4 | 2.5 |
| చూలు రాకుండా గర్భనిరోధం లేక రక్తపు పోటుకు చికిత్స | 7 | 3.4 | 2.5 |
| టెటనస్ నిరోధక టీకాలు | 6 | 3.0 | 2.1 |
| మొత్తం | 64 | 31.5 | 22.5 |
| పెద్ద ఆసుపత్రికి పంపదగిన కేసులు | | | |
| ఏంటిబయొటిక్ మందులతో ఇన్‌ఫెక్షన్ నిరోధము | 44 | 21.7 | 15.5 |
| సకాలంలో వైద్యశాలలో చేర్పించి తగిన చికిత్సను చేయించటం | 42 | 20.7 | 14.8 |
| వైద్యశాలలో కాన్పు చేయించటం | 18 | 8.9 | 6.3 |
| రక్తాన్ని పేషెంటుకు ఇవ్వటం | 18 | 8.9 | 6.3 |
| అవసరమైన ద్రవపదార్థాలను రక్తంలోనికెక్కించి శరీరంలోని నీటి పరిమాణం తగ్గకుండా చూడటం | 10 | 4.9 | 3.5 |
| త్వరగా సిజేరియన్ సెక్షన్ చేయటం | 7 | 3.4 | 2.5 |
| మొత్తం | 139 | 68.5 | 34.2 |
| నిరోధించదగిన మొత్తం మరణాలు | 203 | 100.0 | 71.5 |

గమనిక :వివరమైన సమాచారం లభించిన కేసులలో 221 లేక 78 శాతం మరణాలను నిరోధించ గలిగినవిగా నిర్ణయించారు. ఇందులో 18 మరణాలు లేక మొత్తం మెటర్నల్ మరణాలలో ఆరుశాతం గర్భస్రావం ప్రయత్నంలో సంభవించినవి. తర్ఫీదు పొందిన వైద్యుల సహాయంతో నిరోధించ గలిగినవిగా ఈ మరణాలను భాటియా వర్గీకరించారు.

- భాటియా సర్వే రిపోర్టు నుండి ప్రపంచ బ్యాంకు రిపోర్టు స్వీకరించిన సమాచారం

కారణాలనీ, చనిపోతున్న తల్లులలో నాల్గింట మూడు వంతుల మంది వీటివల్లే మరణిస్తున్నారనీ, లభిస్తున్న పలు సర్వేల ఫలితాలు సూచిస్తున్నాయి.

ప్రపంచ ఆరోగ్య సంస్థ, బెంగుళూరులోని ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్మెంట్కు చెందిన జగదీష్ భాటియాతో అనంతపురం జిల్లాలో 1984-85వ సంవత్సరంలో చూలాండ్ర, బాలింతల ఆరోగ్య పరిస్థితుల మీద ఒక సర్వేను జరిపించింది. ఈ సర్వే "సమగ్ర ప్రణాళికానుసారంగా," "అత్యంత జాగరూకతతో" జరిగినందున, దాని ఫలితాలు "విలువైనవిగా" రిపోర్టు పరిగణించింది సర్వే జరిగిన కాలంలో సంభవించిన సంతానవతులు కాగల వయస్సులో ఉన్నవారి (15-49 సంవత్సరాల మధ్య వయస్సులో నున్న వారి) మొత్తం మరణాలలో 36 శాతం మరణాలు, కాన్పు కాలంలో ఏర్పడిన ఇబ్బందుల వల్ల సంభవించినట్లు భాటియా రికార్డు చేశారు. ఈ లెక్క ప్రకారం, జిల్లాలో సంభవిస్తున్న ప్రతి లక్ష సజీవ జననాలకు 800 మంది చొప్పున తల్లులు చనిపోతున్నట్లు వీరు అంచనావేశారు ఈ అంచనా ప్రకారం, కనే వయస్సులో నున్న స్త్రీ జనాభాలో, ప్రతి లక్ష మందికి 120 మంది చొప్పున చనిపోతున్నట్లు కూడా వీరు సూచించారు. భారత దేశంలో ఈ అంశం మీద జరిగిన ఏ సర్వేలోనూ మెటర్నల్ మరణాలు ఇంతటి అధిక పరిమాణంలో రికార్డు కాలేదు! భారతదేశంలో, గత దశాబ్ద కాలంలో నిరంతరాయంగా చూలాండ్ర, బాలింతల మరణాలు అధిక పరిమాణంలో- ఆఖరుకు దక్షిణ భారతంలో కూడా-సంభవిస్తున్నాయి అని చెప్పటానికి ఈ అంశాన్ని రిపోర్టు ఆధారంగా స్వీకరించింది.

ఏయే కారణాల వల్ల ఈ మెటర్నల్ మరణాలు సంభవిస్తున్నదీ తెలిపే అంశాలను కూడా భాటియా రికార్డు చేశారు తల్లుల మరణాలలో మూడింట రెండు వంతులు కాన్పులో ఎదురైన ఇబ్బందుల వల్ల సంభవిస్తున్నట్లు తేల్చారు. ఇన్ఫెక్షన్ అత్యధిక మరణాలకు, అధిక రక్తస్రావం తక్కువ మరణాలకు కారణమవుతున్నట్లు సర్వేనిర్ణయించింది. (పదకొండవ పట్టికను చూడండి). అధిక రక్తస్రావం అత్యధిక మరణాలకు కారణమవుతున్నట్లు కొన్ని సర్వేలు పేర్కొన్నాయి. భాటియా సర్వేలో గర్భస్రావం వల్ల సంభవిస్తున్న మరణాలు పదిశాతంగా రికార్డయినాయి. జరిగిన గర్భస్రావాలలో మూడింట రెండు వంతులు కావాలని చేయించుకొన్నవేనని వీరు సూచించారు. మరణించిన తల్లులలో నాల్గవ వంతు మంది విషయంలో, వారికి మరణ ప్రమాదం ఏర్పడింది అనే విషయాన్ని కూడా వారి బంధువులు గుర్తించలేక పోయినట్లు భాటియా వెల్లడించారు; నాలుగు శాతం కేసులలో, తల్లి యొక్క ప్రమాదకర పరిస్థితిని బంధువులు గుర్తించగలిగారు. కాని వారు వైద్య సహాయాన్ని కోరలేదని కూడా వీరు సూచించారు.

బాలింత మరణాలు సంభవించటానికున్న కారణాలను స్పష్టంగా తెలుసుకోవటానికి, భాటియా, కాన్పులో మరణించిన స్త్రీలు నివసిస్తున్న ప్రాంతంలో, ఆవిడ జీవించిన ఆర్థిక. సాంఘిక పరిస్థితులలో జీవిస్తూ, సుమారుగా అదే కాలంలోనే పురుడు పోసుకొన్న కేసులను పోల్చి చూచారు వారి వయస్సు, కాన్పుల సంఖ్య, వారి అనారోగ్యానికి దారిదీసిన కారణాలు, వారి కుటుంబ నిర్మాణము-వీటిని పోలికలకు ఎన్నుకొన్నారు. కాన్పు తర్వాత ఒకరు జీవించటానికి, మరొకరు మరణించటానికి కారణాలను విచారించారు. ఈ రెండు గ్రూపుల మహిళల సాంఘిక, ఆర్థిక జీవన పరిస్థితులు ఒకే విధంగా ఉన్నాయి. చూలు కాలంలో ఇద్దరూ ఒకేరకమైన జాగ్రత్తలను తీసుకొన్నారు. ఈ విషయంలో పెద్ద తేడాలు కనుపించలేదు. చనిపోయిన స్త్రీలు, జీవిస్తున్న స్త్రీల కంటే కొంచెం ఎక్కువ పరీక్షలను చూలు కాలంలో చేయించుకొన్నారు. కాని వారి గర్భధారణల సంఖ్య, అనారోగ్యం సంక్రమించగల అవకాశాలూ, కుటుంబ నిర్మాణం మాత్రం భిన్నంగా ఉన్నాయి. చనిపోయిన వారిలో అధికులకు, ఇంతకు పూర్వం కాన్పులో ఇబ్బందులు ఎదురైనాయి; వారి ఆరోగ్య పరిస్థితి బాగుండక పోవటమో, లేక చూలు కాలంలో ఆరోగ్య పరిస్థితి చెడటమో జరిగింది. చనిపోయిన వారిలో అధికులకు ఇంతకు పూర్వమే, ఈ గ్రూపు వారి సగటు కాన్పుల కంటే ఎక్కువే అయినాయి; కాని వారికి బ్రతికి ఉన్న సంతానం సంఖ్య, సగటు సంతానం కంటే తక్కువగా ఉన్నది. దీనిని బట్టి, వారు కన్న వారిలో అధికులు మరణించినట్లు తేలింది. కాన్పు తర్వాత బ్రతికి ఉన్న తల్లులకు సగటున 2.9 మంది పిల్లలున్నారు; మగ పిల్లలు 1.4 మేరకున్నారు. చనిపోయిన తల్లులకు సగటున 2.4 మంది పిల్లలు మాత్రమే బ్రతికున్నారు. వారిలో 0.9

**మొత్తం చూలాంౘ్రలో ఆయా సేవలను పొందిన చూలాంౘ్ర శాతాలు (1992-1993)**

| దేశము/రాష్ట్రము | చూలు కాలంలో డాక్టర్లతో వైద్య, పరీక్షలను చేయించుకొన్నవారు | హెల్త్ వర్కర్ విజిట్ లభించిన చూలాంౘ్రు | రెండు డోస్‌ల టెటనస్ టాక్సాయిడ్ వాక్సిన్ తీసుకొన్న వారు | ఇనుము, ఫోలిక్ ఏసిడ్ మాత్రలను పొందిన వారు |
|---|---|---|---|---|
| భారతదేశము | 49.2 | 21.0 | 53.8 | 50 5 |
| గ్రామీణ ప్రాంతం | 41.1 | 24.3 | - | - |
| పట్టణ ప్రాంతం | 76.8 | 9.8 | - | - |
| కేరళ | 96.6 | 26.5 | 89.8 | 91.2 |
| పంజాబు | 85.9 | 7.8 | 82.7 | 73.6 |
| తమిళనాడు | 78.2 | 40.4 | 90.1 | 84.1 |
| మహారాష్ట్ర | 69 4 | 23.3 | 71.0 | 70.6 |
| పశ్చిమబెంగాల్ | 68 4 | 13.7 | 70.4 | 56.3 |
| హర్యానా | 67.0 | 11.9 | 63.3 | 59 9 |
| ఆంధ్రప్రదేశ్ | 65 6 | 41 0 | 74.8 | 76.4 |
| కర్ణాటక | 64.8 | 41.9 | 69.8 | 74 9 |
| గుజరాత్ | 50.0 | 36.6 | 62.7 | 69.3 |
| ఒరిస్సా | 38.4 | 53.8 | 53.8 | 49.9 |
| మధ్యప్రదేశ్ | 36.3 | 19.7 | 42.8 | 44.3 |
| ఉత్తరప్రదేశ్ | 30.2 | 16.5 | 37.4 | 29 5 |
| బీహారు | 26.4 | 11 1 | 30.7 | 21 4 |
| రాజస్తాన్ | 23.1 | 11.5 | 28.3 | 29.2 |

*- ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ సైన్సెస్ సేకరించిన సమాచారం ఆధారంతో ప్రపంచబ్యాంకు రిపోర్టు ఇచ్చిన పట్టిక*

మంది మాత్రమే మగపిల్లలున్నారు. బ్రతికి ఉన్న మగ పిల్లలసంఖ్య కూడా తక్కువగా నున్నది చనిపోయిన వారిలో నూరింట యాభయ్యేదు మందికి మగపిల్లలు పుట్టినా, వారు చనిపోయారు. బ్రతికిఉన్న తల్లులలో 25 శాతం మందికి మాత్రమే పుట్టిన మగపిల్లలు చనిపోయారు. దీనిని బట్టి మగపిల్లలు లేని తల్లులు, తమ కాన్పు ప్రాణగండం కారణం కాగలదని తెలిసినా, మగపిల్లవాడిని కనాలన్న తాపత్రయంతో అందుకు పూనుకొన్నట్లు భాటియా నిర్ధారించారు. మగపిల్ల లను కనాలన్న వత్తిడి, భారతీయ స్త్రీల మీద ఎంత అధికంగా ఉన్నదో చూపటానికి దీనిని కొలమానంగా ప్రపంచబ్యాంకు రిపోర్టు తీసుకొన్నది

ఈ దర్యాప్తులో రికార్డయిన తల్లుల మరణాలలో నూరింట 72 వరకూ నిరోధించ సాధ్యమైనవేనని రిపోర్టును పరిశీలించిన నిపుణులు అభిప్రాయపడ్డారు. (క్షేమకరమైన గర్భస్రావానికి శాస్త్రీయ విధానాల అవలంబన ద్వారా నిరోధించదగిన మరణాల సంఖ్య, పై అంచనాలలో లేదు). నిరోధించ సాధ్యమైన ఈ మెటర్నల్ మరణాలలో కాన్పు చేయించటానికి శాస్త్రీయమైన విధానాల అవలంబన వల్ల 32 శాతం మరణాలనూ, కష్టమైన కాన్పులను చేయించటానికి అవసరమైన వైద్య సదుపాయాలున్న మెటర్నిటీ వైద్యశాలలకు చూలాలిని సకాలంలో చేర్చటం ద్వారా అరవై తొమ్మిది శాతం మరణాలను నిరోధించ వీలున్నదని వీరు అభిప్రాయ పడ్డారు. దేశంలో జరిగిన పలు సర్వేలు కూడా మనదేశంలో సంభవిస్తున్న మెటర్నల్ మరణాలలో అధిక భాగాన్ని నిరోధించే అవకాశాలున్నట్లు నిర్ధారణ చేశాయి. అనంతపురం జిల్లా సర్వేలో, నిరోధించదగినవిగా ఎన్నికైన 203 మెటర్నల్

మరణాలను నిరోధించటానికి అవలంబించదగిన చికిత్సా విధానపు వివరాలను పన్నెండవ పట్టికలో చూడవచ్చు.

అనంతపురం జిల్లాలో సంభవించిన మరణాలు, ఏ ప్రదేశంలో సంభవించాయి అన్న పరిశీలన ముఖ్యమైనది మరణించిన వారిలో దాదాపు సగం మందిని, ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి తరలించారు; అచ్చట వారు మరణించారు. కాన్పు ఇంట్లో జరుగుతుండగా, అది ప్రమాదకరంగా తయారైనదని తెలిసిన వెంటనే, దాపు లోని వైద్యశాలకు పేషెంటును తరలించటానికి అవసరమైన రవాణా సదుపాయం లేకపోవటం వల్లా, సదుపాయం ఉన్నా, ఆర్థికంగా శక్తిలేకపోవటం చేతా, ఎంతమంది చనిపోయినదీ తెలియటం లేదనీ, దీని అంచనాకు అవకాశం లేక పోయిందని భాటియా సూచించారు

గర్భస్రావం

భారతదేశంలో 1971వ సంవత్సరంలో మెడికల్ టెరిమినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ ఆక్టు పేరిట గర్భస్రావాలను చట్ట సమ్మతం చేశారు. అటు తర్వాత చట్టబద్ధంగా జరుగుతున్న గర్భస్రావాల సంఖ్య త్వరితగతిని పెరుగసాగింది. కాని ఇటీవలి కాలంలో ఇవి ఆరు లక్షలకు చేరి, అటు తర్వాత పెరగటం మానేశాయి 1992వ సంవత్సరం నుండీ ఈ అంచనా అలాగే ఉంది. చట్టబద్ధంగా గర్భస్రావాన్ని చేయించుకొనే వారిలో కొందరు ప్రైవేట్ వైద్యశాలలకు వెళుతున్నట్లు భావిస్తున్నారు. ఇవి గాక, ప్రభుత్వ లైసన్సు లేకుండా గర్భస్రావాన్ని చేసేవారు కూడా మనదేశంలో ఉన్నారు. ఈ రెండు రకాల గర్భస్రావాల సంఖ్య ప్రభుత్వ అంచనాలలో చేరటం లేదు. వీటి సంఖ్యా పరిమాణపు టంచనాలు కూడా అందటం లేదు. చక్కని సదుపాయాలున్న వైద్యశాలలో గాకుండా, ప్రైవేట్ వ్యక్తులు చేస్తున్న గర్భస్రావం వల్ల, స్త్రీలకు అనారోగ్యం, కొన్ని సందర్భాలలో జీవితాంతం వీడని అనారోగ్యం ప్రాప్తిస్తున్నది. 1988వ సంవత్సరంలో, గర్భస్రావ ప్రయత్నంలో ఇన్‌ఫెక్షన్‌కు గురయి ఒక వైద్యశాలలో చేరిన వారిలో చనిపోయిన వారి సంఖ్యా పరిమాణం, ఆ వైద్య శాలలో సంభవించిన మెటర్నల్ మరణాలలో 26 శాతం వరకూ ఉన్నాయట. ఆ వైద్యశాలలో సంభవించిన మొత్తం స్త్రీల మరణాలలో ఈ మరణాలు 18 శాతం మేరకున్నట్లు అంచనా వేశారు. ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాలలో వేసిన అంచనాల ప్రకారం, దొంగచాటుగా జరుగుతున్న గర్భస్రావ ప్రయత్నం వల్ల సంభవిస్తున్న మరణాలు, మొత్తం మెటర్నల్ మరణాలలో ఆంధ్రలో ఆరు శాతము. కర్ణాటకలో మూడు శాతము ఉన్నట్లు తేలింది. భారత దేశంలో జరుగుతున్న మొత్తం గర్భస్రావాలలో మూడింట రెండు వంతులు, కోరి చేయించు కొనేవని, ఒక్కవంతు ప్రకృతి సిద్ధంగా జరుగుతున్నాయని అంచనా వేస్తున్నారు. అనంతపురం జిల్లా సర్వే ఫలితాలను బట్టి, గర్భవిచ్ఛిత్తి ప్రయత్నంలో సంభవిస్తున్న మరణాలలో సగభాగానికి అధిక రక్తస్రావము, మరొక సగభాగానికి ఇన్‌ఫెక్షన్ కారణమని భావిస్తున్నారు

హర్యానా, ఒరిస్సా, రాజస్థాన్, తమిళనాడు, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలలో, 1983-84 వ సంవత్సరంలో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిశర్చి, గర్భస్రావ ప్రయత్నాల మీద సర్వే జరిపించింది ఈ ఐదు రాష్ట్రాలలోని ప్రతి వెయ్యిమంది చూలాండ్రకు ఆరుగురి చొప్పున చట్టబద్ధంగానూ, పదమూడు మంది చొప్పున చట్ట వ్యతిరేకంగానూ గర్భస్రావం చేయించు కొంటున్నట్లు ఈ సర్వే నిరూపించింది. ఈ అంచనాను ప్రాతిపదికగా తీసుకొని, ప్రపంచ బ్యాంకు రిపోర్టు, భారత దేశంలో చట్టవ్యతిరేకంగా జరుగుతున్న గర్భస్రావాలను సాలుకు పదమూడు లక్షలుగా అంచనా వేసింది పై ఐదు రాష్ట్రాలలో జరుగుతున్న గర్భస్రావాలలో నూరింట 55, చూలు యొక్క తొలిమూడు మాసాలలో జరుగుతున్నట్లు, ఇందులో నాల్గవ వంతు మాత్రమే తర్ఫీదు పొందిన వైద్యుల పర్యవేక్షణలో జరుగుతున్నట్లు ఈ సర్వే నిర్ధారణ చేసింది. రహస్య గర్భస్రావ ప్రయత్నాలు ఎంత అధికంగా ఉంటే, ఆ ప్రయత్నంలో చనిపోయేవారి సంఖ్య కూడా అంత అధికంగా ఉంటున్నది.

ఫోర్డు ఫౌండేషన్ 1994వ సంవత్సరంలో రమీ ఛబేరియా, నూనా షీల్‌లతో ఒక సర్వేను జరిపించింది. ఇంతకు పూర్వం గర్భస్రావాల మీద మనదేశంలో జరిగిన సర్వేలు, వీటిని తక్కువ అంచనా వేసినట్లు ఈ సర్వే భావించింది. సాలుకు డెబ్బై లక్షల మంది గర్భస్రావం చేయించు కొంటున్నట్లు ఈ సర్వేయర్లు అంచనా వేశారు. ఈ అంచనాలను ప్రాతిపదికగా తీసుకొని, మనదేశంలో చట్టబద్ధంగా జరుగుతున్న ప్రతి ఒక్క గర్భస్రావానికి, పదిచొప్పున చట్ట వ్యతిరేకంగా గర్భస్రావాలు జరుగుతున్నట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు అంచనా వేసింది.

దేశంలో సంభవిస్తున్న మొత్తం మెటర్నల్ మరణాలలో నూరింట పదిహేను వరకూ గర్భస్రావ ప్రయత్నంలో సంభవించే మరణాలుంటాయని ఇంతకు పూర్వపుటంచనాలు తెలియ జేస్తున్నాయి. ఈ అంచనాలు అసలు సంభవిస్తున్న వాటి కంటే చాలా తక్కువగా ఉన్నట్లు ఫోర్డు ఫౌండేషన్ సర్వే భావించింది.

## చూలాంద్ర - బాలింతల అనారోగ్యం

చూలు కాలంలో వచ్చే అనారోగ్యం విధిగా ప్రాణాపాయకరం కాకపోవచ్చు. కాని అది ఆవిడను అశక్తురాలిగా చేయవచ్చు; లేదా జీవితాంతం బాధించవచ్చు. భారతదేశంలో అతి సామాన్యంగా వస్తుండే క్షయవంటి రోగాలకు గురికావచ్చు; కాన్పు కావటానికి ఎక్కువ కాలం పట్టవచ్చు; లేదా కాన్పు కష్టం కావచ్చు. గర్భసంచి, యోని నుండి బయటకు రావచ్చు; లేదా లోపలకు కుదించుకు పోవచ్చు; అబ్స్టేరిక్ ఫిశ్చులా రావచ్చు. విడవకుండా వెన్నాడుతూ ఉన్న అనారోగ్యం, చూలు రావటం వల్ల తీవ్రతరం గావచ్చు; ఆవిడ రోగ నిగ్రహశక్తిని బాగా బలహీన పరచవచ్చు. మలేరియా, లివర్ వాపు (హెపటైటిస్) భారతీయ చూలాంద్రలో అధికంగా కనుపిస్తున్నాయి. వీటివల్ల చూలాలికి కాన్పు కాలంలో ఇబ్బందులు ఎదురుగావచ్చు. భారతదేశంలోని చూలాంద్రలో నలభై శాతం మంది అనారోగ్యంగా ఉంటున్నారనీ, 15 శాతం మందికి ప్రాణాపాయ ప్రమాదం ఏర్పడే అవకాశాలున్నాయని, అభివృద్ధి చెందుతున్న దేశాల చూలాంద్ర పరిస్థితుల మీద జరిగిన ఒక సర్వే వెల్లడిస్తున్నది. జరుగుతున్న గర్భస్రావాలనూ, పిండం తల్లి గర్భంలో చనిపోవటాన్ని కూడా కలిపి చూస్తే, పై అంచనాలు బాగా పెరుగుతాయి. మన దేశంలో చూలాంద్ర అనారోగ్య పరిస్థితుల మీద తగినన్ని సర్వేలు జరుగ లేదు. అందువల్ల ఈ విషయం మీద లభిస్తున్న సమాచారం చాలా తక్కువగా ఉన్నది.

చూలాంద్ర అనారోగ్య పరిస్థితుల మీద తగినంత సమాచారం లభించక పోవటం చేత, ప్రపంచ బ్యాంకు రిపోర్టుకర్తలు రాజస్థాన్‌లో 1970వ సంవత్సరంలో జరిగిన ఒక సర్వేను పరిశీలించారు. ఇందులో కొన్ని వివరాలున్నాయి. స్త్రీ యొక్క కాన్పుల సంఖ్య పెరుగుతున్న కొలదీ ఆవిడ అనారోగ్యం అధిక మవుతున్నట్లు ఈ సర్వే సూచించింది. తొలి చూలు వారిలో 14 శాతం మంది, రెండవ చూలు వారిలో 30 శాతం మంది, ఐదవ చూలు అటు తర్వాత వారిలో 58 శాతం మంది వరకూ అనారోగ్యంతో బాధపడు తున్నట్లు రాజస్థాన్ రిపోర్టు వెల్లడించింది. కాన్పుల సంఖ్య పెరుగుతున్న కొలదీ చూలాలి అనీమియా పరిమాణం కూడా పెరుగుతూ ఉండటం కనుపించింది. చూలు కాలపు దుష్ఫలితాలు, కాన్పు, కాన్పు తర్వాత అనారోగ్యం, లేదా గర్భస్రావ ప్రయత్నం వల్ల సంక్రమించిన అనారోగ్యం వంటి వాటితో, చూలాంద్రలో 29 శాతం మంది బాధపడుతున్నట్లు ఈ సర్వేలో తేలింది. ఇరవయ్యారు శాతం మంది, కారణం తెలియని జ్వరంతోనూ, పదకొండు శాతం మంది ఇన్ఫెక్షన్, లేదా పరభాగ్యోప జీవుల పీడన వల్లా, ఎనిమిది శాతం మంది శ్వాసకోశ సంబంధిత రోగాల వల్లా, మరొక ఎనిమిది శాతం మంది చర్మరోగాల వల్లా బాధపడుతున్నట్లు సర్వే అంచనా వేసింది.

## చూలాంద్ర పోషణా స్థితి

చూలాంద్రు, పిల్లలకు చనుబాల నిస్తున్న తల్లులు, వారి బిడ్డలు తీవ్రమైన అనారోగ్యానికి గురవుతున్నారు. ఆడపిల్లలు, స్త్రీలు విపరీతమైన పోషణా లోపానికి గురిగావటమే ఇందుకు ముఖ్యమైన కారణం. పోషణా లోపాలకు గురవుతున్న తల్లులకు, తక్కువ బరువుండే బిడ్డలు పుట్టటం అతి సాధారణమైన విషయం. తల్లికి పుట్టిన తక్కువ బరువున్న బిడ్డ, దురదృష్టవశాత్తూ ఆడపిల్లే అయితే, ఆవిడ కూడా తల్లివలె, బాల్యంలోనూ, యవ్వనంలోనూ, ఎదిగిన తర్వాతా పోషణా లోపాన్ని అనుభవించక తప్పదు. పోషణాలోపాన్ని అనుభవించవలసి రావటంచేత ఆవిడ పునరుత్పత్తి శక్తి దెబ్బ తింటుంది; పుట్టిన బిడ్డకు తగినన్ని చనుబాలు ఆవిడ వద్ద ఉండవు. జీవనాధారమైన అంశాలే ఇంత అధ్వాన్నంగా ఉన్నపుడు, ఆవిడ సమగ్ర వ్యక్తిగా అభివృద్ధి చెందటాన్ని గురించి చెప్పనే అవసరం లేదు.

భారతదేశంలో చూలాంద్రు, పిల్లలకు చనుబాల నిస్తున్న తల్లులు, ముఖ్యంగా ఆర్థికంగా వెనుకబడిన వర్గాల వారు, శరీర పోషణకు తగినంత మాంసకృత్తులను, శక్తినిచ్చే ఆహార పదార్థాలను అనుభవించే అవకాశం లేదు. చూలాంద్రకు, పసిబిడ్డలకు చనుబాల నిస్తున్న తల్లులకు, మామూలు స్త్రీల కంటే అధిక పోషణ అవసరం. మామూలు రోజుల్లో తగినంత

### బాల్యం నుండి అనీమియాను అనుభవిస్తున్న భారతీయ మహిళ

అనీమియా భారతీయ స్త్రీలకు ప్రధాన అనారోగ్య కారణంగా పరిణమించింది. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిశర్చి 1982వ సంవత్సరంలో హైదరాబాదు, న్యూఢిల్లీ, మద్రాసు, కలకత్తా నగరాల్లో ఈ అంశం మీద సర్వేను నిర్వహించింది. ఈ సర్వేలో, 1-14 సంవత్సరాల మధ్య వయస్సు ఆడపిల్లలలో నూరింట అరవయ్యైదు మంది అనీమియాకు గురయినట్లు తేలింది!

**నాలుగు నగరాలలో అనీమియాకు గురైన పిల్లలు**

| నగరము | 1-5 సం॥రాల మధ్య వయస్సు గల బాలబాలికల శాతం | 6-14 సం॥రాల మధ్య వయస్సు గల బాలికల శాతం |
|---|---|---|
| హైదరాబాదు | 65.5 | 66.7 |
| కలకత్తా | 94.4 | 95.3 |
| మద్రాసు | 23.3 | 18.3 |
| న్యూఢిల్లీ | 57.1 | 73.3 |

చూలు కాలంలో స్త్రీకి, పోషణలో ఇనుము అవసరం ఐదురెట్లు పెరుగుతుంది. దీని లోపం వల్ల చూలాండ్రలో అనీమియా అధికంగా కనుపిస్తున్నది. భారతదేశంలో, చూలాండ్రు, ముఖ్యంగా చూలు యొక్క చివరి మూడు మాసాల కాలంలో అత్యధికులు అనీమియాకు గురవుతున్నట్లు పలు సర్వేలు నిరూపించాయి. గుజరాత్, మహారాష్ట్రలలోని గ్రామీణ ప్రాంతాలలో జరిగిన ఒక సర్వే, ఆ ప్రాంతపు చూలాండ్రలో నూరింట 90 మంది అనీమియాకు గురైనట్లు వెల్లడించింది. మనదేశంలో చూలాండ్రలో నూరింట 50 నుండి 90 మంది వరకూ అనీమియాకు ఎరయినట్లు పలు సర్వేల వల్ల స్పష్టమవుతున్నది. పంజాబులో 1995వ సంవత్సరంలో జరిగిన ఒక సర్వే, చూలాండ్రలో నూరింట 86 మంది అనీమియాకు గురయినట్లు, వారిలో నూరింట 56 మందికి అనీమియా తీవ్ర రూపంలో ఉన్నట్లు వెల్లడించింది. ఈ సర్వే జరిగిన ప్రాంతం లోని ఒక వైద్యశాలలోని కేసులను పరిశీలించినపుడు, ఆ వైద్య శాలలో సంభవించిన కాన్పు కేసుల మరణాలలో నూరింట 35 మందికి, ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని అనీమియా కారణమని తేలింది!

*- ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ సైన్సెస్ సేకరించిన సమాచారంతో ప్రపంచబ్యాంకు రిపోర్టు రూపొందించిన పట్టిక*

పోషణను అనుభవిస్తున్న వారిలో కూడా ఈ కాలాలలో తగినంత అదనపు పోషణను పొందలేక పోవటం చేత, పోషణా లోప ప్రభావాలు తీవ్ర రూపంలో కనుపిస్తాయి. పుట్టిన దగ్గర నుండి పోషణా లోపానికి గురవుతున్న వారు, ఈ దశలో మరింత లోపానికి గురవుతారు. ఇందువల్ల చూలు కాలంలో పెరుగవలసినంతగా వారి బరువు పెరుగదు; వారికి తక్కువ బరువున్న బిడ్డలు పుడతారు. (పుట్టినపుడు బిడ్డ బరువు 2,500 గ్రాములకు తగ్గకుండా ఉండాలి. ఇది ఆరోగ్య శాస్త్ర నియమం) ఉత్తర ప్రదేశ్‌లో, భరద్వాజ్ ప్రభృతులు చూలాండ్ర స్థితిగతుల మీద ఒక సర్వేను 1990వ సంవత్సరంలో నిర్వహించారు. చూలు కాలంలో పేద వర్గాలకు చెందిన చూలాండ్రు, 6.3 కిలోగ్రాముల బరువు పెరిగారు; సంపన్న కుటుంబాలకు చెందిన వారు 7.7 కిలో గ్రాములు బరువు పెరిగారు. ఇతర సర్వేలు కూడా దాదాపు ఇటువంటి పరిమాణాలనే సూచించాయి. ఫిలిపీన్స్, తాయ్‌లాండ్ దేశాలలో చూలాండ్రు తొమ్మిది కిలోలు, అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలోని చూలాండ్రు పన్నెండు కిలోలు బరువు పెరుగుతున్నట్లు సర్వేలు తెలియజేస్తున్నాయి.

భారతదేశంలో ఇనుము లోపం వల్ల వస్తున్న అనీమియా మూలంగా చూలాండ్రు అనారోగ్యం పాలవు తున్నారు; మరణాలకు కూడా ఇది దారిదీస్తున్నది. పోషణా లోపానికి చూలాండ్రు గురిగావటం వల్ల, అధిక రక్తస్రావం, ఇన్ఫెక్షన్, ఎక్లెంప్సియాల వల్ల అధికులు మరణిస్తున్నారు. అనీమియాకు గురయిన వారిలో దాదాపు 40 శాతం మంది

**కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకొంటున్న వారిలో నూరింట 90 మంది మహిళలే !**

కుటుంబ నియంత్రణ పాటింపు క్రమంగా ప్రజాదరణను పొందుతున్నది. నూరింట పదిమంది దంపతులు మాత్రమే 1970వ సంవత్సరంలో కుటుంబ నియంత్రణ పద్ధతులను అనుసరిస్తూండే వారు; ఈ పరిమాణం 1992-93 నాటికి 40 శాతానికి పెరిగినట్లు ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ పాప్యులేషన్ సైన్సెస్ వారి 1992 - 93 సంవత్సరపు నేషనల్ ఫామిలీ హెల్త్ సర్వే తెలియజేస్తున్నది దీని పాటింపు అన్ని రాష్ట్రాలలోనూ ఒకే పరిమాణంలో లేదు. మహారాష్ట్రలో యాభై శాతం మంది దంపతులు పాటిస్తుంటే, పంజాబు, ఉత్తరప్రదేశ్, బీహారు రాష్ట్రాలలో కేవలం ఇరవై శాతం మంది మాత్రమే అనుసరిస్తున్నారు.

కాన్పుల మధ్య తగినంత ఎడం ఉండటానికి, కోరినపుడే చూలు రావటానికి వీలయిన గర్భనిరోధక సాధనాల వాడుక కంటే, పిల్లలు పుట్టకుండా చేయించుకొనే అపరేషన్ల సంఖ్య అధికంగా ఉన్నట్లు ఈ సర్వేఫలితాలు తెలియజేస్తున్నాయి 1992-93వ సంవత్సరంలో ఐదు శాతం మంది ఐయుడిని, ఏడు శాతం మంది కండోమ్‌లను, మూడు శాతం మంది మాత్రలను వాడుతుండగా 85 శాతం మంది ఆపరేషన్లు చేయించుకొన్నారు! ఈ ఆపరేషన్లు చేయించుకొన్న వారిలో నూరింట తొంభై మంది స్త్రీలు! స్త్రీల కంటే పురుషులు అపరేషన్లు చేయించుకోవటం చాలా సులభం. కోలుకోవటానికి కూడా అతి తక్కువ కాలం పడుతుంది. ఆపరేషన్ దుష్ఫలితాలు వీరిలో కానరావటం అరుదు. అయినా ఆడవారే ఆపరేషన్లకు అధికంగా వెళుతూ ఉండటం వాంఛనీయం గాదు.

దీనికి ప్రపంచ బ్యాంకు రిపోర్టు మూడు కారణాలను చూపింది. : (1) ఇందుకు సంబంధించిన ప్రభుత్వ యంత్రాంగం, కుటుంబ నియంత్రణ సాధనాలను గురించి దంపతులకు తెలియజేయటానికి శ్రద్ధను ప్రదర్శించ లేదు. నియమిత ఆపరేషన్లు జరిపించి తీరాలి అని ప్రభుత్వం సిబ్బందికి కోటాల నిచ్చి బలవంతం చేయటమే ఇందుకు కారణం. కుటుంబ నియంత్రణ సిబ్బందికి, కుటుంబ నియంత్రణ సాధనాల వాడుకను గూర్చి దంపతులకు ఆమోద యోగ్యమైన రీతిలో ప్రచారం చేయగల శక్తి లేదు; వాటి వాడకం వల్ల కనుపించే దుష్ఫలితాల నివారణా శక్తి కూడా లేదు. (2) ప్రచారమంతా కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల మీదనే కేంద్రీకృతమైంది. (3) కుటుంబ నియంత్రణ సాధనాలను తగిన మేరకు సప్లయి చేయగల శక్తి గాని, వాటి పంపకపు ఏర్పాట్లు గాని తగినంతగా లేవు

చూలాండ్రు, కాన్పు కాలంలో హృదయచలన మాగి గాని, అధిక రక్తస్రావం వల్లగాని మరణిస్తున్నట్లు అంతర్జాతీయ రిపోర్టులు సూచిస్తున్నాయి. అనీమియాకు గురయిన తల్లి గర్భంలోని పిండం ఎదుగవలసి నంతగా ఎదుగదు; పైగా పుట్టినపుడు, ఉండవలసినంత బరువు ఉండదు; తల్లి వద్ద బిడ్డకు సరిపడినన్ని పాలుండవు.

## సంతాన ప్రాప్తి

చూలు కారణంగా సంభవించే మరణానికి గాని, అందువల్ల రాగల అనారోగ్యానికి గాని గల కారణాలను గురించి చర్చించేటపుడు ఆవిడ కనే సంతాన పరిమాణాన్ని కూడా మనం పరిశీలించటం అవసరం. అవసరమైన వైద్య సేవలను పొందలేక పోవటం చేతనే చూలాండ్రు - బాలింతలలో అధికులు మరణిస్తున్నారు. కొందరు పోషణాలోపానికి గురయి అనారోగ్యం పాలబడుతున్నారు కొందరు కోరకపోయినా గర్భవతులవుతున్నారు. వయస్సు ముదరక ముందూ అతి పిన్న వయస్సులో చూలు వచ్చినవారు, వారు కనే బిడ్డ మరణ ప్రమాదాన్ని ఎదుర్కొనే అవకాశాలు అధికంగా ఉన్నాయి. సంతానం కనే చివరిదశలో చూలు వచ్చిన వయస్సు ముదిరిన వారు కూడా ప్రమాదం పాలబడే అవకాశాలున్నాయి. కాన్పుల మధ్య తగినంత కాల వ్యవధి లేక పోయినా తల్లికి ప్రమాదం సంభవించే అవకాశా లుంటాయి. పలు కాన్పులకు లోనయిన వారిలో, గర్భధారణ శక్తి అందరి కంటే ముందుగా తగ్గిపోతుంది.

భారత దేశంలో పుట్టే బిడ్డలలో నాల్గింట మూడు వంతుల మంది 15-29 సంవత్సరాల మధ్య వయస్సు తల్లులకు పుడుతున్నారు. సంతాన ప్రాప్తి, 35-49 సంవత్సరాల వయస్సు

వారిలో, గత రెండు దశాబ్దాల కాలంలో సగానికి పైగా తగ్గిపోయింది. ప్రస్తుతం గ్రామీణ ప్రాంతాలలోనూ, పట్టణ ప్రాంతాలలోనూ కూడా ముప్పై తొమ్మిది సంవత్సరాల వయస్సుకు పైబడిన వారు కనే సంతానం, మొత్తం దేశంలో పుడుతున్న పిల్లలలో నూరింట పదివంతులు మాత్రమే ఉంటున్నది స్త్రీలు కనే సగటు సంతానపు సంఖ్య కూడా తగ్గుతున్నది 1970వ సంవత్సరపు అంచనాల ప్రకారం, మనదేశంలో స్త్రీలకు, సగటున ఒక్కొక్కరు సుమారుగా ఆరుగురను కంటున్నట్లు రికార్డైంది. ఈ రేటు 1992-93 వ సంవత్సరానికి 3 4కు తగ్గిపోయింది సగటు సంతానపు రేట్లు అన్ని రాష్ట్రాలలోనూ ఒకే రకంగా లేవు. రాజస్థాన్, మధ్యప్రదేశ్, హర్యానా, బీహారు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో సంతాన ప్రాప్తి రేటు దేశపు సగటును మించి ఉన్నది.

అతి పిన్న వయస్సులోనే స్త్రీకి గర్భధారణ జరిగే అవకాశాలు కూడా క్రమంగా తగ్గుతున్నాయి కొంచెం వయస్సు పెరిగిన తర్వాతే ఆడపిల్లలు పెండ్లి చేసుకొంటున్నారు. ఇది శుభసూచకం పెండ్లి చేసుకొనే వయస్సు ఇంకా ప్రమాదభరిత దశను దాటలేదు. 20-34 సంవత్సరాల మధ్య వయస్సును గర్భధారణకు క్షేమకరమైన వయస్సుగా వైద్యులు సూచిస్తున్నారు. ఇంతకంటే చిన్న వయస్సులో కాన్పు రావటం వల్ల వారి ఆరోగ్యానికి ప్రమాదం సంభవించే అవకాశా లుండటమే గాక, వారి చదువులు, ఉద్యోగ సంపాదనా ప్రయత్నాలు దెబ్బ తింటాయి. ఇప్పటికీ 15-18 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలు, దేశంలో పుట్టే మొత్తం బిడ్డలలో, నూరింట పది మంది నుండి 17 మంది వరకూ కంటున్నారు

మన దేశంలోని మరో మంచి విషయం అవివాహితలు సంతానవతులు గావటం అత్యల్పంగా ఉండటం. కనుక స్త్రీ, సంతానాన్ని కనటం అనేది ప్రధానంగా వివాహం తర్వాతే జరుగుతున్నది. ఇతర దేశాలతో పోల్చితే మన దేశంలోని యువతులు పిన్న వయస్సు లోనే పెండ్లి చేసుకొంటున్నట్లు లెక్క. 1972వ సంవత్సరంలో 15-19 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలలో నూరింట 41 మంది పెండ్లి చేసుకొనేవారు. 1981వ సంవత్సరం వచ్చేసరికి, సగటు వైవాహిక వయస్సు 19 సంవత్సరాలకు పెరిగింది. 1994-95వ సంవత్సరపు అంచనాల ప్రకారం, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, బీహారు, హర్యానా, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో 15-19 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలలో నూరింట 40 మంది పెండ్లి చేసుకొంటున్నారు

స్త్రీ యొక్క పోషణా పరిస్థితి, ఆవిడ బిడ్డకు చనుబాల నిస్తుండటం, గర్భనిరోధక విధానాలను వాడుతూ ఉండటం వంటి వాటి మీద, ఆవిడ రెండు కాన్పుల మధ్య ఉండే కాల వ్యవధి ఆధారపడి ఉంటుంది. ఈ అంశపు నిర్ణయానికి మన దేశంలో తగినంత సమాచారం లభించటం లేదు రిజిస్ట్రార్ జనరల్ ఆఫ్ ఇండియా వారి 1992వ సంవత్సరపు అంచనాల ప్రకారం, కాన్పుల మధ్య నున్న కాల వ్యవధి 34 శాతం కేసులలో రెండు సంవత్సరాల కంటే తక్కువే ఉన్నది. రెండు కాన్పుల మధ్య తక్కువ కాల వ్యవధి ఉన్న కేసులలో తల్లి లేక బిడ్డల మరణ ప్రమాదం అధికంగా ఉన్నట్లు పలు పరిశీలనలు వెల్లడించాయి రెండు కాన్పుల మధ్య, నాలుగు సంవత్సరాల కాల వ్యవధి ఉన్న కేసులలో కంటే, రెండు సంవత్సరాల కంటే తక్కువ కాల వ్యవధి ఉన్న కేసులలో బిడ్డలు మరణించటం లేక తక్కువ బరువున్న బిడ్డ పుట్టే అవకాశాలుండటం రెండు రెట్లు అధికంగా ఉంటుందని పరిశోధనా ఫలితాలు సూచిస్తున్నాయి కనుక, రెండు కాన్పుల మధ్య కనీసం రెండు సంవత్సరాల కాల వ్యవధి అయినా ఉండాలని వైద్య నిపుణులు సూచిస్తున్నారు. ఈ కార్య సాధన కోసం, గర్భనిరోధక విధానాలు, సాధనాల వాడుక, అవసరమైన వారందరకూ వాటిని అందుబాటులో ఉంచటం అవసరం స్త్రీలు కూడా ఇరవై సంవత్సరాలు నిండక పూర్వం గర్భధారణ జరగకుండా తగిన జాగ్రత్తలను తీసుకోవటం ఉత్తమమని వైద్యులు సూచిస్తున్నారు.

భారతదేశంలో చూలాంత్రు అనారోగ్య పరిస్థితిని సూచించే రికార్డులు అసమగ్రంగా ఉన్నట్లు, స్త్రీల సాధారణ ఆరోగ్య పరిస్థితిని సూచించే అధికారిక అంచనాలు దాదాపు లేనట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు భావిస్తున్నది. కొన్ని వైద్య శాలల రికార్డులను, కొందరు జరిపిన సర్వేలు, పరిశీలనలను ఆధారంగా చేసుకొని, స్త్రీల సాధారణ ఆరోగ్య పరిస్థితులను రిపోర్టు పరిశీలించింది భారతీయ మహిళలు అధిక రోగ భారాన్ని మోస్తున్నట్లు, ఆడపిల్లలలోనూ, స్త్రీలలోనూ పోషణాలోపం అధికంగా కనుపిస్తున్నట్లు ఈ రిపోర్టులు సూచిస్తున్నాయి. శ్వాసకోశ సంబంధిత వ్యాధులు, విరేచనాలు,

చిన్న పిల్లల, స్త్రీల అధిక మరణాలకు కారణమవుతున్నట్లు కూడా ఈ పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. ఇనుము లోపకారణంగా వస్తున్న అనీమియా, పరాన్న జీవుల పీడన, శ్వాసకోశ వ్యాధులు, జననాంగాలకు, మూత్ర కోశము, మూత్ర నాళాలకు సోకుతున్న ఇన్ఫెక్షన్ వంటి పలురకాల రోగాలు స్త్రీలను పీడిస్తున్నట్లు ప్రపంచబ్యాంకు రిపోర్టు సూచించింది. ఇవి గాక, మలేరియా, కుష్టు, బోదకాలు వంటివి కొన్ని ప్రాంతాలలో విడవకుండా స్త్రీలను వేధిస్తున్నాయి.

**పోషణా లోపం**

మాంసకృత్తులు, శక్తిజనకాలు ఆడపిల్లల, మగపిల్లల, స్త్రీల పోషణలో లోపిస్తున్నట్లు పలు సర్వేలు నిరూపించాయి. గ్రామీణ, పట్టణ ప్రాంతాలన్న భేదం లేకుండా ఈ అవాంఛనీయ స్థితి సర్వత్రా కనుపిస్తున్నది. ఆడపిల్లలలో పసితనంలో ప్రారంభమైన పోషణాలోపం, వారి వయస్సుతో పాటు ఆ లోప తీవ్రత కూడా పెరుగుతూ ఉంటుంది. ఢిల్లీ ప్రాంతంలో ఒక్క సంవత్సరంలోపు ఆడపిల్లలలో 50 నుండి 65 శాతం మందికి తగినంత పోషణ లభిస్తూండటమో, లేక కొద్దిగా మాత్రమే పోషణా లోపం ఉండటాన్నో తాము గుర్తించినట్లు సర్వేయర్లు వెల్లడించారు. 5-9 సంవత్సరాల వయస్సు ఆడపిల్లలలో 30 నుండి 55 శాతం మందికి మాత్రమే అవసరమైనంత పోషణ లభిస్తున్నది. దీనిని బట్టి పోషణా లోపభారాన్ని, రోగభారాన్ని మగపిల్లల కంటే ఆడపిల్లలే అధికంగా భరిస్తున్నట్లు ప్రపంచబ్యాంకు రిపోర్టు భావిస్తున్నది.

భారతీయ స్త్రీలలో చాలామంది, శారీరకంగా వయస్సుకు తగినట్లు ఎదగటం లేదని కూడా రిపోర్టు గుర్తించింది. 20-24 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలలో అధిక సంఖ్యాకుల ఎత్తు 145 సెంటిమీటర్లు లేక 56 అంగుళాల కంటే తక్కువ గానూ, బరువు 38 కిలోలు లేక 86 పౌనుల కంటే తక్కువగాను ఉన్నట్లు సర్వేలు వెల్లడిస్తున్నాయి ఇలాంటి స్త్రీలు కనే బిడ్డలు సాధారణంగా ఉండవలసిన దానికంటే తక్కువ బరువుండే అవకాశాలుంటాయి. వీరిలో మలుగులు సరిగా యెదగక పోవటం చేత కాన్పు కావటానికి ఎక్కువ కాలం పడుతుంది. బిడ్డ వెలికి రావటం కష్టమవుతుంది. మలుగులు తగినంతగా యెదగక పోవటం చేత కాన్పులో తల్లికి ప్రాణాపాయం సంభవించే అవకాశాలు కూడా ఉంటాయి. స్త్రీ జనాభాలో నూరింట 12 నుండి 33 మంది వరకూ ఉండవలసిన సగటు ఎత్తు కంటే తక్కువగానూ, 15 నుండి 29 మంది వరకూ ఉండవలసిన సగటు బరువు కంటే తక్కువగానూ ఉంటున్నారు. చూలాలి వయస్సు ఇరవై సంవత్సరాల కంటే తక్కువగానూ, ఎత్తు, బరువు ఉండవలసిన దాని కంటే తక్కువ గాను ఉన్నపుడు, వారిని కాన్పుకు, అన్ని ఎమర్జన్సీ వసతులున్న వైద్యశాలలో చేర్పించటం క్షేమకరం. వీరి శరీరం కాన్పుకు తగినంతగా యెదిగి ఉండకపోవటం చేత ఇలాంటి అవసరమున్నట్లు నిపుణులు సూచిస్తున్నారు. ఉత్తర భారతంలో వివాహిత స్త్రీలలో అధిక భాగం పిన్న వయస్కులు; వారి శరీరం కాన్పుకు తగినంతగా ఎదగక పూర్వమే గర్భధారణకు లోనవుతున్నారు. ఇందువల్ల తల్లికి, పిల్లకూ కాన్పు సమయంలో ప్రమాదకర పరిస్థితి ఎదురవుతున్నదని రిపోర్టు వెల్లడించింది.

విటమిన్ "ఎ" లోపం పసిపిల్ల అనారోగ్యానికీ, అకాల మరణాలకు కారణమవుతున్నట్లు సర్వేలు తెలియ జేస్తున్నాయి. స్త్రీలకు శ్వాసకోశ సంబంధిత రోగాలు రావటానికి, జననాంగాలు, మూత్ర కోశము, మూత్ర నాళాలు రోగ పీడనకు గురికావటానికి, ఈ విటమిన్ లోపమే కారణమని కొన్ని పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. ఇనుము, కాల్షియం ఆడపిల్లలలోనూ, యువతులలోనూ, స్త్రీలలోనూ లోపిస్తున్నట్లు కొన్ని సర్వేలు తెలియజేస్తున్నాయి. ఆడపిల్ల రజస్వలయిన తర్వాత, వారి పోషణలో ఇనుము అధికంగా ఉండవలసిన అవసరం పెరుగుతుంది. పోషణలో ఇనుము ఉండవలసిన అవసరం, పురుషుల కంటే స్త్రీలకు రెట్టింపు అధికంగా ఉంటుంది. మలేరియా పీడిస్తున్నా, కొంకి పురుగుల వంటి పరాన్న జీవులు ప్రేవులలో ప్రవేశించినా, రక్తం లోని ఇనుము పరిమాణం తగ్గిపోతుంది. రుతుస్రావం మూలంగా కూడా ఇనుము లోపం పెరుగుతుంది. మాంసంలో ఉండే ఇనుములో అధిక భాగాన్ని శరీరం తీసుకోగలదు. కాని దేశంలో అధికులు పేదలు గనుక, వారు తరచుగానైనా మాంసంతినే అవకాశాలు లేవు. తృణ ధాన్యాలలోనూ, కూరగాయలలోను ఉండే ఇనుములో కొద్ది భాగాన్ని మాత్రమే శరీరం గ్రహించగలదు. ఇందువల్ల భారతీయ స్త్రీలలో అత్యధికులు, బాల్యంనుండి కూడా ఇనుములోప పోషణకు గురవుతున్నారని రిపోర్టు

వివరించింది.

ఆరు-పధ్నాలుగు సంవత్సరాల మధ్య వయస్సు పిల్లలలో అధికులు పోషణా లోపానికి గురవుతున్నట్లు మనదేశంలోని నాలుగు నగరాల సర్వే ఫలితాలు వెల్లడిస్తున్నాయి (ఈ అధ్యాయంలోని "బాల్యం నుండి అనీమియా" అన్న బాక్సును చూడండి). 15-24 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలలోనూ, 25-44 సంవత్సరాల మధ్య వయస్సు మహిళలలోనూ పోషణా లోప పరిమాణాలు దాదాపు ఇలాగే ఉంటున్నట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టు భావిస్తున్నది. అనీమియా వల్ల, స్త్రీకి కాన్పు కాలంలో ప్రాణగండం కూడా ఉండే ప్రమాదం ఉంటుంది. అంతేగాదు; ఆవిడలో రోగ నిగ్రహ శక్తి తగ్గి, క్షయవంటి రోగాలు త్వరగా రావచ్చు గృహ నిర్వహణకు, పిల్లల పోషణ, సంరక్షణకు తగినంత శక్తి ఉండదు. కాయకష్టం చేసుకొన వలసిన స్థితిలో ఉండేవారికిది శిక్షగా పరిణమిస్తుంది.

## జననాంగాల సమస్యలు

జననాంగాలకు సంబంధించిన స్త్రీల పరిస్థితిని, దేశపు ప్రాతిపదిక మీద తెలియజేసే సర్వేలు లేవు. ప్రపంచ బ్యాంకు ప్రచురించిన వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1993 అంచనాల ప్రకారం, సుఖరోగాల భారాన్ని, పురుషుల కంటే స్త్రీలే అధికంగా మోస్తున్నట్లు తెలుస్తున్నది. అన్ని రకాల కాన్సర్ల కంటే, స్త్రీల గర్భసంచి కాన్సరు వల్ల అధికులు మరణిస్తున్నారు స్త్రీల పునరుత్పత్తికి సంబంధించిన అవయవాలకు వచ్చే రోగాల నిర్ధారణ కష్టం గావటం చేత, ఇలాంటి సర్వేలు, కమ్యూనిటీ ప్రాతిపదిక మీద జరిగినవి మనదేశంలో అతి తక్కువగా ఉన్నాయి. మహారాష్ట్రలో 1989వ సంవత్సరంలో, రెండు గ్రామాలలో ఇలాంటి సర్వేను రాణీ బాంగ్ ప్రభృతులు నిర్వహించారు. ఈ రెండు గ్రామాలు గిరిజన నివాసాలు. కనుక ఈ సర్వే ఫలితాలు మహారాష్ట్ర గ్రామీణ ప్రాంత స్త్రీల పరిస్థితికి ప్రతిబింబంగాదని రిపోర్టు అభిప్రాయపడింది. అయినా, ఇంత పెద్ద యెత్తున జరిగిన సర్వే మరొకటి లేదు గనుక ప్రపంచబ్యాంకు రిపోర్టు రచయితలు, ఈ సర్వేను విపులంగా పరిశీలించారు.

సర్వేలో పరిశీలనకు వచ్చిన వారిలో నూరింట 55 మందికి జననాంగ సంబంధిత రోగాలున్నట్లు తేలింది. వీటిలో అధిక భాగం, బహిష్టు, తెల్లబట్ట, ఎర్రబట్ట, మూత్ర విసర్జన కాలంలో మంట బుట్టటం వంటివి ఉన్నాయి. కొంతమంది ఏ రోగ సూచనలను చెప్పలేక పోయినా, వీపు దిగువ భాగంలో నొప్పి అనో, పొత్తి కడుపులో నొప్పి అనో చెప్పారు.

గ్రామంలోని స్త్రీలందరికి జననాంగ పరీక్షలను వైద్యులు నిర్వహించారు. వారిలో నూరింట 92 మందిలో, జననాంగ సంబంధమైన రోగాలు గాని, సుఖరోగాలు గాని కనుపించాయి. ప్రతి స్త్రీలోనూ, సగటున 3.6 రోగాలున్నట్లు వైద్యులు నిర్ణయించారు! రోగ సూచనలున్నట్లు ఫిర్యాదు చేసిన స్త్రీలలో రోగం కనుపించటం ఆశ్చర్యకరంగాదు. తాము బాగానే ఉన్నాము అని చెప్పిన స్త్రీలలో నూరింట 85 మందిలో రోగాలు కనుపించాయి! ఇది ఆశ్చర్యకరమైన అంశం వీరిలో నూరింట 62 మందిలో బాక్టీరియల్ వెజైనైటిస్ కనుపిస్తే, 48 మందిలో సెర్విసైటిస్ కనుపించింది! 57 శాతం మంది బహిస్టు కాలంలో వచ్చే కడుపు నొప్పితో బాధపడుతున్నారు. ఏడు శాతం మందికి, స్వతహాగానో, మధ్య వచ్చిన అనారోగ్య సంబంధమైన ఇబ్బందుల వల్లనో సంతాన ప్రాప్తి శక్తి లేకుండా పోయింది. నూరింట పదకొండు మందిలో సిఫిలిస్ కనుపించింది.

ఈ సర్వేలో పాల్గొన్న స్త్రీలలో, నూరింట ఎనిమిది మంది మాత్రమే ఇంతకు పూర్వం, జననాంగ పరీక్షలు చేయించుకొన్నారు; వాటికి సంబంధించిన జబ్బులకు చికిత్స చేయించుకొన్నారు. స్త్రీలు తమ చికిత్సావసరాలను తెలుసుకోలేక పోవటానికి, తెలుసుకొన్నా, ఆర్థికంగా శక్తి లేక చేయించుకోక పోవటానికి ఇది నిదర్శనం. స్త్రీల జననాంగ ఆరోగ్య సమస్య ఇంత తీవ్రంగా ఉన్న స్థితికి కూడా గుర్తింపు రాలేదు అన్నది ఇచ్చట గమనించదగిన అంశంగా రిపోర్టు పేర్కొన్నది గ్రామీణ ప్రాంతంలోని స్త్రీల జననాంగ సమస్యలను గుర్తించి, వారికి అవసరమైన చికిత్సను చేయ గలిగినంత మంది లేడీ గైనకాలజిస్టులు దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో లేరు. పురుష డాక్టర్ల వద్ద స్త్రీలు తమ జననాంగ సమస్యలను వివరించటానికి వెనుకాడుతున్నారు. స్త్రీ నర్సులకు, అనుబంధ వైద్య సిబ్బందికి, ఈ రోగాల నిర్ధారణ విషయాలు తెలియవు; శాస్త్రీయంగా పరీక్షలను నిర్వహించగల లాబొరెటరీలు కూడా లేవని రిపోర్టు పేర్కొన్నది. ఇందువల్ల జననాంగ వ్యాధులతో బాధ పడుతున్న

గ్రామీణ స్త్రీలకు వైద్య చికిత్స గగన కుసుమంగా తయారైనట్లు ప్రపంచబ్యాంకు రిపోర్టు వివరించింది.

రాణీ బాంగ్ ప్రభృతుల సర్వే రిపోర్టు వివరిస్తున్నంతటి రోగ భారంతో స్త్రీ ఇంటి పనులను, పొట్ట కూటికి కాయకష్టాన్ని చేయటం ఎంత భారమైన పనో ఊహించటం కష్టం గాదు. సర్వేలో పాల్గొన్న వారిలో 30 శాతం మంది నడుము నొప్పి ఉన్నట్లు చెప్పారట! జననాంగ రోగాల వల్ల, పిండం చనిపోయి పుట్టవచ్చు; లేక నెలలు నిండక ముందే గర్భస్రావం జరుగ వచ్చు. పుట్టే బిడ్డకు రోగపు అంటు సోకవచ్చు; చికిత్సా వసతుల లేమి వల్ల ఉన్న ప్రమాదాలివి.

ఉన్న జననాంగ రోగాలు, కుటుంబ నియంత్రణ సాధనాల వాడుక వల్ల మరింత తీవ్ర రూపం దాల్చుతున్నట్లు కూడా సర్వే పేర్కొన్నది బహిష్టు సంబంధమైన సమస్యలు, గర్భసంచి సమస్యలు, పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజెస్ వంటివి, ఈ సాధనాల వాడుక వల్ల తీవ్రమవుతున్న సూచనలున్నట్లు సర్వేలు సూచిస్తున్నాయి వాడిన కుటుంబ నియంత్రణ సాధనం గాని, దానిని వాడిన విధానం గాని ఇందుకు కారణం గావచ్చు ఏది ఏమైనా, జననాంగ సంబంధమైన రోగాలుండటం చేత, స్త్రీ కుటుంబ నియంత్రణ సాధనాలను ఆవిడ కోరుకున్నా, వాడే వీలుండటం లేదు. కనుక కుటుంబ నియంత్రణ లక్ష్యం నెరవేరే అవకాశాలు తగ్గుతున్నాయి. అంతే గాకుండా ఈ రోగాలు స్త్రీ ఆరోగ్యాన్ని క్షీణింప చేయటానికి, ఆఖరుకు మరణ ప్రమాదాన్ని తెచ్చి పెట్టటానికి కూడా కారణమవుతాయి. కనుక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు స్త్రీ యొక్క చూలు, కాన్పుల విషయాలను మాత్రమే చూస్తే చాలదు, ఆవిడ జననాంగ ఆరోగ్య సమస్యల నన్నిటినీ పరిష్కరించ గలిగి ఉండటం అవసరం అన్న విషయం స్పష్ట మవుతున్నది. ఈ విషమ పరిస్థితి ఇలా ఉండగా, పులి మీద పుట్రలా హెచ్ ఐ వి/ఎయిడ్స్ మహమ్మారి ఇటీవల చెలరేగింది. ముందుకాలంలో ఇది భారతీయులకు అతి ప్రమాదకరమైన రోగాలలో ఒకటిగా పరిణమించ వచ్చునని ప్రపంచ బ్యాంకు రిపోర్టు హెచ్చరిస్తున్నది. అందుచేత స్త్రీ ఆరోగ్యాన్ని, ముఖ్యంగా జననాంగ సంబంధిత ఆరోగ్యాన్ని పటుతరంగా రక్షింప వలసిన అవసరాన్ని రిపోర్టు నొక్కి చెబుతున్నది.

## వృత్తి పరమైన ఆరోగ్య సమస్యలు

స్త్రీల వృత్తి పరమైన ఆరోగ్య సమస్యలను గురించిన సమాచారం మనదేశంలో తగినంత లభించటం లేదు. అధిక సంఖ్యాక మహిళలు అసంఘటిత రంగంలో పని చేస్తూండటం ఇందుకు ముఖ్య కారణం కావచ్చు. గ్రామీణ స్త్రీలలో అత్యధికులు వ్యవసాయ కులీలుగానో, లేక తదనుబంధ వృత్తులలోనో ఉంటున్నారు వరినాట్లు, కలుపుతీత, పంటకోతల వంటి పనులలో మహిళలు వంగి ఎక్కువ కాలం పనిచేయవలసి రావటం వల్ల కీళ్ళ నొప్పులు - వాపులు. నడుము నొప్పి వంటివే గాకుండా కొన్ని రకాల ఇన్ఫెక్షన్లు కూడా వస్తున్నాయి నడుము నొప్పి అనేది "స్త్రీ రోగంగా" పరిగణనను పొందే స్థితికి వచ్చింది! ఎక్కువ కాలం వంగి గాని నిలుచుండి గాని పని చేయవలసి రావటం, నెత్తిన పెట్టుకొని బరువులు మోయటం, పిన్న వయస్సులోనే కాన్పులు రావటం, ఎక్కువ కాలం పిల్లలకు చనుబాలివ్వ వలసి రావటం. దీనికి తోడు పిన్న వయస్సు నుండి పోషణా లోపానికి గురికావటం, అనారోగ్యం వస్తే అదునులో తగిన చికిత్సను పొందలేకపోవటం వంటి వాటివల్ల స్త్రీలు - ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో కాయకష్టం చేసేవారు, తీవ్రమైన అనారోగ్యం పాలవుతున్నారు.

పొగను అధికంగా విడుదల చేసే గడ్డి - గాదాన్ని వంట చెరకుగా వాడటం, ఇంట్లోని పొగ ధారాళంగా వెలికి పోయే అవకాశాలు లేక పోవటం (ముఖ్యంగా చుట్టు గుడిసెలలో ఇలాంటి పరిస్థితి ఉంటుంది), ఎక్కువ కాలం మహిళలు ఈ పొగలో ఉండి పనులు చేయవలసి రావటం వల్ల పొగ ద్వారా వచ్చే కాలుష్యానికి వారు ఎరవుతున్నారు. ఆరోగ్యానికి భంగకరంగాని పొగ పరిమాణాన్ని ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్ణయించింది. మనదేశంలోని ఒక ప్రాంతంలోని వంట ఇండ్ల మీద సర్వే జరిగింది (1983లో). ఆ సర్వేలో, ప్రపంచ ఆరోగ్య సంస్థ, నిర్ణయించిన కనీస పరిమాణానికి వంద రెట్లకు మించిన కాలుష్యానికి ఆ ఇండ్ల ఇల్లాండ్రు గురవుతున్నట్లు తేలింది! రోజుకు ఇరవై పాకెట్ల సిగరెట్లను తాగిన వారి ఆరోగ్యానికి ఎంత నష్టం జరుగుతుందో, అంతటి నష్టాన్ని కలిగించేంతటి పొగకు వంట ఇంట్లో పని చేస్తున్న వారు గురవుతున్నట్లు 1991 వ సంవత్సరంలో జరిగిన మరో

ఓర్వే వెల్లడించింది! కట్టెలు కాలుతున్నప్పుడు విడుదలయ్యే కాలుష్యం వల్ల శ్వాసకోశ సంబంధిత రోగాలొస్తాయని వైద్యులు సూచిస్తున్నారు ఈ రోగాలు గుండె మీద అదనపు భారాన్ని వేస్తాయి. పదిహేను సంవత్సరాల కాలపు ఆసుపత్రి కేసులను ఒక సర్వేలో పరిశీలించారు ఇండ్లలోని స్త్రీ పురుషులంతా ఒకే పరిమాణంలో శ్వాసకోశ వ్యాధులతో బాధపడుతున్నట్లు తేలింది కారణాలను పరిశీలించగా, పురుషులకు సిగరెట్స్ - చుట్టలు తాగటం వల్లా, స్త్రీలకు పొగపొయ్యి వద్ద పని చేయటం వల్లా ఈ రోగాలొచ్చినట్లు స్పష్టమైంది! పురుషుల కంటె స్త్రీలకు ఏన్న వయసులోనే శ్వాసకోశ సంబంధిత రోగాలు వచ్చే అవకాశాలు అధికంగా ఉంటాయి. పొగవల్ల ఆరోగ్యాన్ని నష్ట పోయిన వారిలో అత్యధికులు పేదవర్గాలకు చెందిన స్త్రీలు. మూడు సంవత్సరాల ఆడపిల్లల, స్త్రీల మరణాలకు శ్వాసకోశ వ్యాధులు ప్రధాన కారణాలలో ఒకటిగా కనుపిస్తున్నాయి పొగ యొక్క కాలుష్యానికి గురవుతుండే చూలాలి గర్భంలోని పిండం సక్రమంగా ఎదుగక పోవచ్చునని అనుభవం నిరూపిస్తున్నది భారతీయ మహిళలలో అత్యధిక సంఖ్యాకులు పోషణా లోపానికి గురిగావటంతో అనీమియా బారి నుండి తప్పించు కోలేక పోతున్నారు. అనీమియాకు తోడు, పొగ యొక్క కాలుష్యాన్ని కూడా చూలాలు అనుభవించ వలసి వస్తే, వారికి తక్కువ బరువు బిడ్డలు పుట్టవచ్చు; లేదా పుట్టిన బిడ్డ ఆరుమాసాలు నిండకుండానే మరణించవచ్చు నని నిపుణులు సూచిస్తున్నారు.

వస్త్ర పరిశ్రమ, జనపనార, కొబ్బరి పీచు పరిశ్రమల లోనూ, తీవాచీల నేత, బీడీలు చుట్టటం వంటి కుటీర పరిశ్రమలలోనూ కార్మికులు ధూళి, రసాయన కాలుష్యాలకు గురవుతున్నారు రెడీమేడ్ దుస్తులు, ఎంబ్రాయిడరీ పరిశ్రమల్లో పనిచేసే కార్మికులకు, యజమానులు సక్రమమైన వసతులను కల్పించక పోవటంచేత కండ్ల జబ్బులకు, వెన్ను నొప్పికి గురవుతున్నారు. పోషణా లోపానికి, అనీమియాకు, పలు కాన్పులకు గురవుతూ, ఎక్కువ కాలం పొట్ట కూటికి పనిచేయవలసి వచ్చే మహిళలకు, ఇలాంటి పని పరిస్థితులు పెనుభారమవుతున్నాయి. కాటికి బాటలు వేస్తున్నాయి.

## ఆరోగ్యాన్ని చెడగొడుతున్న సాంఘిక పరిస్థితులు

ఇతర దేశాల మహిళల వలె భారతీయ మహిళలు కూడా పలురకాల హింసకు గురవుతున్నారు మాన భంగాలు, వళ్ళు కాలి చనిపోవటం, భర్త చేతిలో శారీరక, మానసిక హింసలను అనుభవించటం తరచుగా మనకు కనుపిస్తున్న కొన్ని హింసా రూపాలు. కర్ణాటకలోని మూడు గ్రామాలలో 1993 వ సంవత్సరంలో, పిల్లలను కనగల వయస్సు స్త్రీల మీద ఒక సర్వే జరిగింది సర్వేలో పాల్గొన్న మహిళలలో నూరింట 23 మంది తమను భర్తలు కొడుతున్నట్లు చెప్పారు. సర్వే జరగటానికి పూర్వపు మాసంలో తమను తమ భర్తలు మూడు సార్లు కొట్టినట్లు నూరింట పన్నెండు మంది ఇల్లాండ్రు చెప్పారు. ఇలాంటి హింస వల్ల అధిక సంఖ్యాక స్త్రీలు మరణిస్తున్నారు కాని ఈ సమాచారం భారత ప్రభుత్వ అంచనాలలో కనుపించటం లేదు అని ప్రపంచ బ్యాంకు రిపోర్టు పేర్కొన్నది పట్టణ ప్రాంతపు వైద్యశాలలలో, గాయాలతో చేరుతున్న వారిలో, వళ్ళు కాలిన స్త్రీలు అధికంగా ఉంటున్నట్లు వైద్యశాలల రికార్డులు సూచిస్తున్నాయి. 1979వ సంవత్సరం తర్వాత వళ్ళు కాలటం వల్ల సంభవిస్తున్న స్త్రీ మరణాలు పెరుగుతున్నట్లు రిపోర్టు గమనించింది: కట్నాలు వ్యాపార స్థాయికి పెరగటం ఇందుకు కారణంగా ఈ రిపోర్టు పేర్కొన్నది.

ఈ అనారోగ్య భారం నుండి స్త్రీలను ఉద్ధరింపవలసిన అవసరమేమిటో, వారి ఉద్ధరణ సమాజానికి సౌభాగ్యంగా ఎలా రూపొంద గలదో చూద్దాం

# 7

## స్త్రీల ఆరోగ్యమే సమాజానికి సౌభాగ్యం

ప్రజల ఆరోగ్యాన్ని రక్షించగలిగినపుడే దేశం సౌభాగ్యవంతమవుతుందనీ, దారిద్ర్యం అంతరించి ప్రజలు సుఖపడతారన్నది ప్రపంచపు నలుచెరగులా రుజువైన సత్యం. 1993 వ సంవత్సరంలో ఆరోగ్య ప్రత్యేక సంచికగా వెలువడిన వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు అన్న ప్రపంచ బ్యాంకు నివేదిక ఈ సత్యాన్ని గణాంక వివరాలతో చిత్రించింది; స్త్రీల ఆరోగ్య రక్షణ, పోషణాదులు స్థిరమైన ఆర్థికాభివృద్ధికి సోపానాలుగా వర్ణించింది. ఈ కృషి మీద పెట్టుబడిగా పెట్టేసొమ్ము ఎంత ప్రయోజనకరంగా వినియోగపడగలదో కూడా వివరించింది.

1. ఆరోగ్య ప్రదమైన మహిళా జీవనం : పలు దేశాలలో మహిళలు పురుషుల కంటే అధికంగా అనారోగ్యాన్ని అనుభవిస్తున్నారు. వారు సంతానాన్ని కనవలసి రావటం చేతా, ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా లేక పోవటం చేతా సులభంగా నిరోధించగల రోగాలను కూడా అనుభవించవలసి వస్తున్నది. మహిళల ఆరోగ్యాభివృద్ధికి తగినన్ని నిధులను వెచ్చించగలిగితే, అనవసరంగా అనుభవించ వలసి వచ్చిన అనారోగ్యం నుండి వీరిని కాపాడవచ్చు. అకాల మరణాల నుండి రక్షించవచ్చు. సంపూర్ణ జీవితాన్ని అనుభవించే అవకాశాల నీయవచ్చు.

2. మహిళల ఆరోగ్య రక్షణ వల్ల బహుముఖ లాభాలు: మహిళ ఆరోగ్యాభివృద్ధి మీద పెట్టే పెట్టుబడి వల్ల స్త్రీకి అనారోగ్య బాధ నుండి విముక్తి లభిస్తుంది. ఇందువల్ల కుటుంబానికి, సమాజానికి, జాతీయ ఆర్థిక వ్యవస్థకూ లాభాలు చేకూరుతాయి. స్త్రీ ఆరోగ్యాభివృద్ధి ప్రభావం ప్రధానంగా శిశు మరణాల తగ్గింపు మీదా, కుటుంబ సంక్షేమాభివృద్ధి మీదా అత్యధికంగా కనుపిస్తుంది. ఇది భావి తరాల వారి ఆరోగ్యాన్ని, వారి ఉత్పత్తి శక్తినీ పెంచటానికి ఉపకరిస్తుంది.

3. పెట్టిన పెట్టుబడికి అధిక ప్రతిఫలపు గిట్టుబాటు : అధిక ప్రతిఫలం లభించే కార్యసాధనకు పెట్టుబడి పెట్టటం వల్ల, పెట్టుబడుల సామర్థ్యం, లభించే ఫలితాలు పెరుగుతాయి. మహిళల ఆరోగ్యాభివృద్ధి మీద పెట్టే ప్రతి రూపాయకు అధిక ప్రతిఫలం లభిస్తుంది. కనుక స్త్రీల ఆరోగ్య రక్షణా ఖర్చులను ఫలితమీయని ఖర్చుగా భావించకూడదు. నలభయ్యైదు సంవత్సరాల లోపు మహిళ జీవిత కాలంలో సగభాగం అనారోగ్యం వల్ల వృథా అవుతున్నట్లు అంచనాలు తెలుపుతున్నాయి. అతి తక్కువ ఖర్చుతో వీరిని కొన్ని రకాల

అనారోగ్యాల నుండి కాపాడే అవకాశాలున్నాయి గనుక, వీరి ఆరోగ్య రక్షణ మీద పెట్టిన ప్రతిరూపాయకు అధిక ప్రతి ఫలం లభిస్తుంది

## సమాజంపై స్త్రీల ఆరోగ్య రక్షణా ప్రభావం

స్త్రీల ఆరోగ్య రక్షణ, మానవతా విలువల దృష్టిలో మాత్రమే కాదు, సామాజిక క్షేమం దృష్ట్యా కూడా అవసరం. స్త్రీలకు అవసరమైన ఆరోగ్య రక్షణావకాశాలు లభించటం వల్ల, వారికి అనారోగ్యం నుండి విముక్తి లభించి, సుఖపడతారు. ఆరోగ్య ప్రదమయిన సంతానాన్ని కంటారు వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దగలుగుతారు. దేశ ఆర్థికాభివృద్ధికి తోడ్పడతారు.

పిల్లల సంక్షేమం తల్లి ఆరోగ్యం మీద ఆధారపడి ఉంటుంది. అభివృద్ధి చెందిన దేశాలలో, పురుటిలో తల్లి మరణించినపుడు, ఆవిడ కన్నబిడ్డ మరణించే అవకాశాలు కూడా అధికంగా ఉంటాయి. బ్రతికున్న ఆవిడ పిల్లల మీద కూడా దీని దుష్ట ప్రభావం ఉంటుంది. ఇటువంటి అంశపు పరిశీలనకు బంగ్లాదేశ్‌లో ఒక సర్వే జరిగింది. తల్లి మరణం తర్వాత, పది సంవత్సరాల వరకూ వయస్సున్న పిల్లల పరిస్థితిని పరిశీలించారు తల్లి మరణం తర్వాత, రెండు సంవత్సరాలలో ఆవిడ పిల్లలు మరణించే అవకాశాలున్నట్లు, ముఖ్యంగా ఆవిడ కన్న ఆడపిల్లలకు మరణావకాశాలు అధికంగా ఉన్నట్లు ఈ సర్వే నిరూపించింది. బ్రతికున్న తల్లి పిల్లల కంటే, మరణించిన తల్లి పిల్లలు రెండు సంవత్సరాల లోపల చనిపోయే అవకాశాలు మూడు రెట్లు అధికంగా ఉంటాయని కూడా సర్వేయర్లు అంచనా వేశారు తండ్రి మరణ ప్రభావం పిల్లల మీద, తల్లి మరణించినపుడు ఉండగల దానిలో సగం మేరకే ఉంటుందని కూడా ఈ సర్వే పేర్కొన్నది.

తల్లి గర్భవతిగా ఉన్నపుడు పోషణా లోపం ఏర్పడినా, అనారోగ్యంగా ఉన్నా, చూలు కాలంలో తరచూ డాక్టరుతో పరీక్షలను చేయించుకోక పోయినా, కాన్పు సందర్భంలో తర్ఫీదు పొందిన వైద్య సిబ్బంది సహకారం లోపించినా ఆవిడకు పుట్టిన బిడ్డ అనారోగ్యం పాలు గావచ్చు. అకాల మరణానికి లోను గావచ్చు చూలు కాలంలో తల్లికి లభించే పోషణ, ఆరోగ్య రక్షణల ప్రభావం పుట్టే బిడ్డ మీద అధికంగా ఉంటుంది. ప్రపంచంలో సాలుకు డెబ్బై లక్షల మంది పిల్లలు, పుట్టిన వారం రోజుల లోపలే మరణిస్తున్నట్లు, రెండు కోట్ల పది లక్షల మంది, బరువు తక్కువ పిల్లలు పుడుతున్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనాలు తెలుపుతున్నాయి. తల్లి ఆరోగ్య, పోషణాదుల విషయంలోనూ, చూలు, కాన్పుకు సంబంధించిన విషయాలలోనూ తగిన శ్రద్ధను ప్రదర్శించగలిగితే ఈ నష్టాన్ని చాలా వరకూ నివారించవచ్చునని ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించింది.

చూలు కాలంలో వచ్చే అనీమియాను నిరోధించాలి. శరీరం తగినంత పెరుగక ముందే చూలు వస్తే, కాన్పు కష్టమవుతుంది. ఈ కారణాల వల్ల తల్లీ, బిడ్డలకు కాన్పు కాలంలో ప్రాణగండం ఏర్పడే ప్రమాదముంటుంది. చూలు కాలంలో తల్లికి అయొడీన్ లోపిస్తే, ఆవిడకు పుట్టే బిడ్డలకు మానసికవికాస లోపం వంటివి సంభవించే అవకాశాలుంటాయి. యుక్త వయస్సు రాని వారికి కాన్పు వచ్చినపుడు, వారికి పుట్టే బిడ్డల బరువు తక్కువగా ఉండే అవకాశాలున్నాయి. తల్లి శారీరక పెరుగుదల ఆగిపోయే ప్రమాదం కూడా ఉంటుంది. సక్రమ పోషణ, అవసరమైన వైద్య చికిత్సావసతుల ఏర్పాటు ద్వారా ఈ లోపాలను సవరించవచ్చు.

కాన్పులను తగ్గించటం, స్త్రీల ఆరోగ్య రక్షణ వంటి చర్యల ద్వారా ఆవిడ ఉత్పత్తి శక్తిని పెంచవచ్చు. ఇందువల్ల కుటుంబ సంక్షేమం కూడా పెరుగుతుంది. ఇలాంటి వసతులు స్త్రీలకుండటంతోపాటు, వారి విద్యార్జనకు, ఉద్యోగాలకు అవకాశాలు కల్పించటం వల్ల దేశ ఆర్థికాభివృద్ధిరేటు పెరిగే అవకాశాలుంటాయి.

దేశాల జాతీయ ఉత్పత్తిలో, స్త్రీల కృషీ ఫలితం, ఇపుడు లభిస్తున్న అంచనాల వల్ల తేలుతున్న దానికంటే అధికంగానే ఉంటుందనేది అందరూ అంగీకరిస్తున్న అంశం. వారి సృజనాత్మక శక్తులన్నీ సామాజిక సంపదోత్పత్తికి వినియోగ పడటం లేదు. అభివృద్ధి చెందుతున్న దేశాల సాలుసరి ఆహారోత్పత్తిలో నాల్గింట మూడు వంతులకు స్త్రీ శక్తే కారణం. కొన్ని ఆఫ్రికా దేశాలు వాడుతున్న ఆహార పదార్థాలలో, నూరింట 80 వంతులను ఆదేశాల ఎగుమతులలో నూరింట యాభైవంతుల మేరకు స్త్రీలే ఉత్పత్తి చేస్తున్నారు! తాజా అంచనాల ప్రకారం ప్రపంచ లేబరు ఫోర్సులో మూడవ

వంతు వరకూ, పారిశ్రామిక కార్మిక వర్గంలో నాల్గవ వంతు వరకూ స్త్రీలున్నారు స్త్రీ ఇంట్లో పనిచేసినా, బయట పనిచేసినా ప్రతిఫలం రొఖ్ఖ రూప ఆదాయంగా కనుపించక పోవటం చేత, ఆవిడ శ్రమఫలితం ప్రభుత్వ అంచనాలలో కనుపించటం లేదు: అంతా పురుషుల ప్రజ్ఞగా ప్రదర్శితమవుతున్నది

స్త్రీల గృహనిర్వహణా భారం కంటికి కనుపించదు; అంకెల అంచనాలకు అందటం కష్టం. చూలు, కాన్పులు అతి ప్రమాదకరమైన ఆవిడ బాధ్యతలు అనారోగ్య పరిస్థితులలో ఇలాంటి భారాన్ని మోయటం కష్టం ఇందువల్ల ఆవిడ ఉత్పత్తి శక్తి తగ్గుతుంది శ్రీలంక, చైనా దేశాల అనుభవం ఈ విషయాన్ని నిరూపిస్తున్నది. ఈ దేశాలలోని వస్త్రపరిశ్రమలో పనిచేస్తున్న మహిళా కార్మికులకు ఇనుము పోషక పదార్థ లోపం ఏర్పడటం వల్ల, వారి ఉత్పత్తి శక్తి తగ్గినట్లు, దాని సవరణ వల్ల అది పెరిగినట్లు పరిశీలనలు వెల్లడించాయి. ప్రపంచ బ్యాంకు నిపుణులు డా॥ మీరా ఛటర్జీ భారతదేశంలోని ఒక ప్రాంతంలో జరిపిన సర్వేలో, అనారోగ్య ఫలితంగా, వేతనార్జనకు వెళుతున్న స్త్రీ కార్మికుల సంఖ్య ఇరవైరెండు శాతం వరకూ తగ్గినట్లు తేలింది. తరచూ వస్తూండే చూలు, అనారోగ్య ఫలితంగా స్త్రీల ఆరోగ్యం, నీరసించటమే గాకుండా, వారి దారిద్ర్యాన్ని కూడా అవి పెంచుతున్నాయి.

స్త్రీలు ఆరోగ్యంగానూ, బలంగానూ ఉన్నపుడే గృహ నిర్వహణా భారాన్ని మోయగలరు; అవసరమైతే వేతనార్జనకు వెళ్ళగలరు. ఇంట్లో వారు పిల్లల పోషణ, సంరక్షణలతో పాటు, కుటుంబం మీద ఆధారపడిన పెద్దల (వయోవృద్ధుల) సంరక్షణా భారాన్ని కూడా వహిస్తున్నారు ఇవి సమాజంలో అత్యంత కీలకమైన బాధ్యతలు. ఇంటికి అవసరమైన నీరు, పొయ్యి కిందికి పుల్లలు సేకరించి తెస్తారు ఇదేదో అతి తేలికైన పనిగా కనుపించవచ్చు. కొన్ని దేశాలలో ఇది భారమైన పనికిందే లెక్క. టాంజానియాలో మహిళలు, ఇంటికి అవసరమైన నీటిని తేవటానికి, వారు తిన్న ఆహారం ఇచ్చే శక్తిలో ఇరవై శాతం వరకూ ఖర్చవుతున్నట్లు ఒక పరిశోధకుడు అంచనా వేశాడు!

కుటుంబ ఆరోగ్య రక్షణకు మహిళలు చేస్తున్న కృషి, అంచనాకు అందనిది. వీరికి "హెల్తు వర్కర్లు" గా గుర్తింపు లభించకపోయినా అభివృద్ధి చెందుతున్న దేశాలలో, సమాజానికి అవసరమైన ఆరోగ్య సేవలలో నూరింట 70 నుండి 80 వంతుల మేరకు స్త్రీలే చేస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు నిపుణులు అంచనా వేశారు. సమాజానికి, కుటుంబానికి ఇంతటి మేలైన సేవలను చేస్తున్న మహిళల ఆరోగ్య రక్షణకు తగిన చర్యలను తీసుకోవటంతోపాటు, వారికి అంటురోగాల నిరోధం, నివారణ, పరిసరాల పారిశుధ్యం, కుటుంబ ఆరోగ్య, పోషణాది అంశాల మీద తగిన తర్ఫీదు నీయగలిగితే, వారి తర్ఫీదుకు పెట్టే ఖర్చుకు ఎన్నో రెట్లు విలువైన ప్రయోజనం చేకూరుతుంది కుటుంబంలో ఇంతటి కీలకమైన వ్యక్తి అనారోగ్యంతో మంచాన బడితే జరిగే నష్టం ఎంతో ఊహించటం కష్టం కాదు.

తల్లి ఆరోగ్య అనారోగ్యాలు ఆవిడ బిడ్డలను, అధికంగానూ, పలురకాలుగానూ ప్రభావితం చేస్తాయి. తల్లి మరణం వల్ల పిల్లల చదువు దెబ్బతింటుంది. టాంజానియాలో జరిగిన ఒక సర్వే, తల్లి మరణం వల్ల ఆవిడ పిల్లల చదువు ముఖ్యంగా, సెకండరీ స్థాయిలో దెబ్బతింటుందని నిరూపించింది. తల్లి మరణానంతరం పన్నెండు మాసాల కాల వ్యవధిలో, తల్లులు బ్రతికున్న పిల్లలు, స్కూలులో గడిపిన కాలంలో, సగం కాలాన్ని మాత్రమే తల్లి పోయిన పిల్లలు గడిపినట్లు కూడా ఈ సర్వే సూచించింది తండ్రి చనిపోయినపుడు మాత్రం వారి బిడ్డలలో ఇలాంటి మార్పు కనుపించలేదు.

కుటుంబ దారిద్ర్యపు తగ్గుదలకు కూడా స్త్రీ పోషణా ఆరోగ్య రక్షణా వసతులను పెంచటం అవసరం కుటుంబంలో దారిద్ర్యం ఉన్నపుడు, ఆ బాధను అధికంగా అనుభవించేది ఇల్లాలు. పేదలలో అక్షరాస్యత కూడా తక్కువగానే ఉంటుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో బడికి వెళ్ళే వయస్సుగల ఆడపిల్లలలో 80 నుండి 85 శాతం మంది వరకూ స్కూలుకు వెళుతున్నట్లు ప్రభుత్వ రికార్డులలో కనిపిస్తూంటుంది. స్త్రీలలో అక్షరాస్యత విషయం వచ్చేసరికి, అది 40-45 శాతానికి మించటం లేదు. అన్ని అర్హతలూ ఉన్న స్త్రీలు లేబర్ మార్కెట్‌కు వెళితే, అధిక వేతనం లభించే ఉద్యోగాలు దొరకటం కష్టంగా ఉన్నది. ఇందువల్ల కుటుంబ పోషకురాలు స్త్రీ అయినపుడు, ఆవిడ అధిక భారాన్ని కూడా మోయవలసి వస్తున్నది. ఆఫ్రికా, లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలలో స్త్రీ అధినేతగా ఉండే కుటుంబాల సంఖ్య త్వరిత గతిని

### అభివృద్ధి చెందుతున్న దేశాలలో రోగనివారణ వల్ల లభించే ఫలితం అధికంగానూ మధ్యమంగానూ ఉండే ప్రధాన ఆరోగ్య సమస్యలు

| వయసు గ్రూపు రోగభార కారణం | స్త్రీలలో మాత్రమే | స్త్రీలలో అధికం | స్త్రీ-పురుషులలో సమానం | పురుషులలో అధికం |
|---|---|---|---|---|
| 4 సంవత్సరాల వరకు | | | | |
| శ్వాసకోశ వ్యాధులు | | | అధికం | |
| పురుటి కాలపు సమస్యలు | | | అధికం | |
| విరేచనాలు | | | అధికం | |
| మసూచివంటి రోగాలు | | | అధికం | |
| మలేరియా | | | అధికం | |
| మాంసకృత్తులు-శక్తి జనక పోషక పదార్థ లోపాలు | | | అధికం | |
| విటమిన్ ఎ లోపం | | | అధికం | |
| అయొడిన్ లోపం | | | అధికం | |
| సుఖ రోగాలు | | | అధికం | |
| హెచ్ వి ఐ | | | అధికం | |
| 5-14 సంవత్సరాల వయస్సు | | | | |
| ప్రేవులలో పరాన్న జీవులు | | | అధికం | |
| మసూచి వంటి రోగాలు | | | అధికం | |
| శ్వాసకోశ వ్యాధులు | | | అధికం | |
| విరేచనాలు | | అధికం | | |
| క్షయ | | | అధికం | |
| మలేరియా | | | అధికం | |
| అనీమియా | | అధికం | | |
| సుఖరోగాలు, హెచ్.ఐ.వి. | | | అధికం | |
| 15-44 సంవత్సరాల వయస్సు | | | | |
| చూలు కాన్పు సమస్యలు | అధికం | అధికం | | |
| సుఖరోగాలు | | | | |
| క్షయ | | | అధికం | |

| వయసు గ్రూపు రోగభార కారణం | స్త్రీలలో మాత్రమే | స్త్రీలలో అధికం | స్త్రీ-పురుషులలో సమానం | పురుషులలో అధికం |
|---|---|---|---|---|
| హెచ్.ఐ.వి. | | | | అధికం |
| మానసిక రోగాలు | | మధ్యమం | | |
| శ్వాసకోశ వ్యాధులు | | | అధికం | |
| అనీమియా | | అధికం | | |
| 49-59 సంవత్సరాల వయస్సు | | | | |
| క్షయ | | | | అధికం |
| హృద్రోగం | | | | మధ్యమం |
| శుక్లాలు | | అధికం | | |
| శ్వాసకోస వ్యాధులు | | | మధ్యమం | |
| మధుమేహము | | మధ్యమం | | |
| సెర్విక్సు కాన్సరు | అధికం | | | |
| కాన్సరు సంబంధిత కణుతులు | | | | అధికం |
| 60 సంవత్సరాలు అంతకు మించిన వయసు | | | | |
| హృద్రోగం | | | మధ్యమం | |
| శ్వాసకోశ వ్యాధులు | | | అధికం | |
| మధుమేహం | | మధ్యమం | | |
| క్షయ | | | | అధికం |
| శుక్లాలు | | | అధికం | |
| కాన్సరు సంబంధిత కణుతులు, ఉబ్బసం, ముదిరిన బ్రోంకైటిస్ వంటి రోగాలు | | | | అధికం |

వివరణ :

- వంద డాలర్ల ఖర్చు, వ్యక్తి జీవితంలో, రోగభారం వల్ల నష్టమయ్యే ఒక్క సంవత్సర కాలాన్ని పొదుపు చేయగల వీలుంటే, ఆ ఫలితాన్ని "అధికమని" భావించారు.
- ఇందుకు వందనుండి వెయ్యి డాలర్ల లోపు ఖర్చయినపుడు (999), అది సాధించిన ఫలితాన్ని "మధ్యమం" అని భావించారు.

*- వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1993 అన్న ప్రపంచ బ్యాంకు ప్రచురణ నుండి*

పెరుగుతున్నది ఈ దృష్ట్యా కూడా కుటుంబంలోనూ, సమాజంలోనూ స్త్రీ స్థానాన్ని బలపరచవలసిన అవసరం ఉన్నది ఆవిడ ఆరోగ్య రక్షణ ఈ కార్యసాధనకు తొలి సోపానమవుతుంది.

ప్రపంచ బ్యాంకు, ప్రపంచ ఆరోగ్య సంస్థ సహకారంతో స్త్రీ పురుషులు పలురకాల రోగాలురావటం వల్ల, అకాల మరణం వల్లా, వారి జీవితంలో ఎంత కాలాన్ని కోల్పోతున్నదీ అంచనాలను తయారు చేసింది ఇలా స్త్రీ, పురుషులు కోల్పోతున్న కాలానికి "డిసెబిలిటీ ఎడ్జెస్టెడ్ లైఫ్ ఇయర్సు" గా నామకరణం చేసింది. ఏయే రోగాల వల్ల స్త్రీ పురుషులు జీవిత కాలంలో ఎంత భాగాన్ని కోల్పోతున్నదీ, ఆ నిర్ణీత రోగ నిరోధమూ, నివారణా కృషికి ఎంత ఖర్చు చేస్తే, ఎంత జీవిత కాలం మానవులకు దక్కుతుంది అన్న అంశంపై లెక్కలను తేల్చింది. ఈ అంచనాలను "వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1993" అనే ప్రచురణలో పొందుపరచారు. ఇందులో ఆసక్తి కరమైన అంశాలు చాలా ఉన్నాయి. వ్యక్తి జీవితకాలంలో అనారోగ్యం - అకాల మరణం వల్ల నష్టమయ్యే దానిలో ఒక్క సంవత్సరాన్ని దక్కించు కోవటానికి వందడాలర్లు ఖర్చు చేయటం వల్ల అధిక ప్రయోజనం చేకూరగలదని ఈ అంచనాలు తెలియ జేస్తున్నాయి. ఈ విషయంలో 4 సంవత్సరాల నుండి 44 సంవత్సరాల మధ్య వయస్సు గల మగవారి మీద పెట్టిన ఆరోగ్య రక్షణా ఖర్చు వల్ల కంటే, ఇదే వయసున్న స్త్రీల మీద పెట్టిన ఖర్చువల్ల ఎక్కువ లాభాలుంటాయని కూడా ప్రపంచ బ్యాంకు అంచనాలు తెలియజేస్తున్నాయి. పదిహేను - నలభైనాలుగు సంవత్సరాల వయస్సు (సంతానాన్ని కనగల వయస్సులోని) స్త్రీల ఆరోగ్య రక్షణకు పెట్టిన ఖర్చు మరింత ప్రయోజన కరంగా ఉంటుందని కూడా ప్రపంచ బ్యాంకు సూచించింది. (ఏ రోగాల నివారణ లేక నిరోధం మీద పెట్టిన ఖర్చుల వల్ల ఎంత మేరకు ప్రయోజన ముంటుందో సూచించే పట్టికను ఈ అధ్యాయంలో చూడవచ్చు).

మనిషిని శక్తి హీనునిగా చేయగల, లేక ప్రాణం తీయగల రోగాలనుండి కాపాడటానికి తగిన రక్షణలను కల్పించగలగటం వల్ల లభించే లాభాలు బాల్యదశలో, స్త్రీ పురుషులకు ఒకే పరిమాణంలో ఉన్నాయి. పదిహేను సంవత్సరాల వయస్సు తర్వాత క్షయ వ్యాధి నిరోధానికి ఖర్చు చేసిన సొమ్ముకు అధిక ప్రతి ఫలం స్త్రీలలో కంటే పురుషులలో లభించగలదని తేలింది నలభై అయిదు సంవత్సరాల వయస్సు దాటిన పురుషులలో, మద్యపానాన్ని, ధూమపానాన్ని మాన్పించటం వల్ల కూడా స్త్రీలలో కంటే పురుషులలోనే అధిక ప్రతిఫలం కనుపించింది స్త్రీలలో, ఐదు సంవత్సరాల వయస్సు దాటిన తర్వాత, వారికి లైంగిక వ్యాధులు రాకుండా నిరోధించటం, వస్తే వాటికి సకాలంలో చికిత్స చేసి నివారించటం, ఇనుము పోషక పదార్థ లోపం వల్ల వచ్చే అనీమియాను రాకుండా చూడటం, వస్తే దానిని సకాలంలో నివారించటం వంటి పనులవల్ల పురుషులలో కంటే మంచి ఫలితాలు స్త్రీలకు లభిస్తాయి ప్రసూతి సేవలు, యోని కాన్సరుకు చికిత్స వంటి వాటి మీద పెట్టిన పెట్టుబడి వల్ల స్త్రీలు మాత్రమే లాభిస్తారు.

స్త్రీల ఆరోగ్యాన్ని రక్షించి, పెంచి, పోషించగలిగినపుడు, వారి కుటుంబాలు క్షేమంగా ఉంటాయి. వారి ఉత్పత్తి శక్తి పెరిగి దేశం బాగుపడుతుంది. ముందు తరాల వారు ఆరోగ్య వంతులుగా, బలవంతులుగా ఉంటారు. ఇందువల్ల కుటుంబమూ, సమాజమూ లాభిస్తాయి. కనుక దేశ ఆర్థికాభివృద్ధి నిరంతరాయంగా కొనసాగాలంటే స్త్రీల ఆరోగ్యాన్ని రక్షించాలి, దానిని పెంచాలి.

ఇందుకోసం, అభివృద్ధి చెందుతున్న దేశాలు అవలంబించదగిన కనీస కార్యక్రమాన్ని ప్రపంచబ్యాంకు రూపొందించింది. ఆయా దేశాల ఆర్థిక ఆరోగ్యస్థాయి, జనాభా పెరుగుదల రేటు, దేశంలోని వనరులు, సంస్కృతీ సంప్రదాయాలు, స్థానిక పరిస్థితులు ఇత్యాదులకు అనుగుణంగా ఈ కార్యక్రమంలో అవసరమైన మార్పులు చేసుకోవాలని కూడా సూచించింది. రెండు అంచెలుగా అమలు జరుపదగిన కార్యక్రమాన్ని ఇచ్చి, దేశ ఆర్థిక, ఆరోగ్య పరిస్థితుల దృష్ట్యా రెండవ అంచె కార్యక్రమాన్ని చేబట్టవచ్చునని కూడా ప్రపంచబ్యాంకు నిపుణులు సూచించారు.

ఈ కార్యక్రమంలో మూడు ప్రధాన అంశాలున్నాయి.

1. స్త్రీ కోరనపుడు ఆవిడకు గర్భధారణ జరగకుండా చూడటం, ఆవిడ కోరనపుడు గర్భధారణ జరిగితే దాని పరిష్కారానికి అవసరమైన చర్యలను తీసుకోవటం;

2. చూలు కాలంలో, చూలాలికి అవసరమైన సేవలను సమకూర్చటం.

3. లైంగిక సంబంధాల వల్ల సంక్రమించే సుఖరోగాల నిరోధమూ, చికిత్సా సదుపాయాల ఏర్పాటు.

కోరని గర్భధారణ : సంతానం వద్దనుకొన్నవారికి, గర్భధారణ జరుగకుండా చూడటం ఉత్తమం ఇందువల్ల వారు గర్భస్రావానికి ప్రాకులాడవలసిన అవసరం తప్పుతుంది ప్రాణాపాయం తొలగిపోతుంది కనవలసిన సంతానం మీద పరిమితి విధించుకోవడం, కాన్పుల మధ్య ఆరోగ్య సూత్రాల ప్రకారం అవసరమైనంత కాల వ్యవధి ఉండేట్లు చూచుకోవడం వల్ల, కన్న సంతానం జీవించే అవకాశాలు అధికంగా ఉంటాయి అందువల్ల సంతానం వద్దని అనుకొన్న వారికి కుటుంబ నియంత్రణా సేవలను అందించాలి. దేశ విధానాలు అనుమతించిన చోట్ల, క్షేమకరంగా గర్భస్రావం జరగటానికి వసతులుండాలి.

కుటుంబ నియంత్రణ సేవలు : స్త్రీలు ఎక్కువ సంతానాన్ని కంటూ ఉండటం, చూలాండ్ర బాలింతల మరణాలు అధికంగా ఉంటున్న పరిస్థితులలో, కుటుంబ నియంత్రణను పాటించటం వల్ల మరణించే బాలింతల సంఖ్య తగ్గుతుంది కుటుంబ నియంత్రణ సేవల మీద స్త్రీకి పదిహేను నుండి నూటయాభై డాలర్ల వరకూ ఖర్చు చేయగలిగితే, అనారోగ్యం అకాల మరణాల వల్ల నష్టమవుతున్న ఆవిడ జీవితకాల పరిమాణంలో ఒక సంవత్సరాన్ని కాపాడవచ్చు ఈ అంచనా ప్రకారం, కుటుంబ నియంత్రణా పద్ధతులను పాటించే వారికి, తలసరి ఖర్చు ఇరవై డాలర్లు మాత్రమే కాగలదు! ఇంత తక్కువ ఖర్చుతో ఒక స్త్రీ జీవిత కాలంలో ఒక సంవత్సరాన్ని కాపాడగలగటం ఎంత మేలైన విషయం! శిశు జనన మరణాలరేటు అధికంగా ఉన్న ప్రాంతాలలో శిశుమరణాల తగ్గింపుకు కృషి జరిగినపుడు, ఆపగలిగిన ప్రతి శిశుమరణానికి అయ్యే ఖర్చు చాలా తక్కువగా ఉంటుంది.

వాడకందార్ల అవసరాలకు, వారి ఆదరణకు, తగిన క్షేమకరమూ, పటుతరమూ అయిన కుటుంబ నియంత్రణ విధానాలను అందజేయాలి. వాడదగిన విధానాలను గురించి, స్త్రీలకు స్పష్టంగా తెలియజేయాలి. అన్ని వయస్సుల వారికి ఒకేరకమైన విధానం పొసగదు. పిల్లలు అవసరం లేదు అని అనుకొన్న వారికి, ఆపరేషన్లు చేయాలి. పిల్లలు కావాలనుకొన్న వారికి, కాన్పుల మధ్య వారు కోరుకొన్నంత కాలవ్యవధి ఉండటానికి తగిన విధానాలను సూచించాలి. ఇందుకు అవసరమైన సేవలను అందజేయాలి. వాడకందార్ల ఆర్థిక స్థోమతకు తగిన విధానాలను, వారికి సులభంగా అందేట్లు చూడాలని ప్రపంచబ్యాంకు సూచించింది. కండోమ్‌లు, మింగటానికి తగిన మాత్రలు, స్పెర్మిసైడ్స్ వంటి వాటిని నిరంతరం అందుబాటులో ఉండేట్లు చూడాలి ఖర్చు భరించలేని వారికి, ఇంజక్షను ద్వారా ఇచ్చే మందులను, ఐ.యు.డి.లను అందేట్లు చూడాలి అవసరమైతే వీటిని సబ్సిడీ ధరలకు అందచేయాలి

పుట్టిన బిడ్డకు చనుబాలివ్వటాన్ని ఎక్కువ కాలం కొనసాగించటం వల్ల, చూలు వచ్చే అవకాశాలు తగ్గిపోతాయి కుటుంబ నియంత్రణ విధానాలకు దీనిని తోడుగా వాడవచ్చు. బిడ్డ పుట్టిన ఆరు మాసాల వరకూ, బహిష్టు రాక, తల్లి బిడ్డకు చనుబాల నిస్తున్న పరిస్థితులలో, నూరింట 98 వంతుల వరకూ గర్భధారణ జరుగదన్న జార్జిటౌన్ యూనివర్సిటీ పరిశోధనా ఫలితాలు సూచిస్తున్నాయి. తొలి ఆరుమాసాలు బిడ్డకు తల్లి పాలు అవసరం; అటు తర్వాత రెండు సంవత్సరాలు, చనుబాలకు తోడుగా ఇతర ఆహార పదార్థాలను బిడ్డకు ఇవ్వవచ్చు. కనుకే హెల్తు వర్కర్లు, తల్లులు తమ బిడ్డలకు ఎక్కువ కాలం చనుబాల నీయటాన్ని ప్రోత్సహించాలి

కుటుంబ నియంత్రణ సాధనాలను విస్తృతంగా లభించే యేర్పాట్లు చేయగలిగితే, కుటుంబ నియంత్రణ విధానాల పాటింపును ప్రోత్సహించితే, ప్రమాదకరమైన గర్భస్రావ ప్రయత్నాలకు స్త్రీలు వెళ్ళే అవసరం ఉండదు. చిలీ అనుభవం ఈ విషయాన్ని రుజువు చేసింది.

గర్భస్రావానికి క్షేమకరమైన సర్వీసుల ఏర్పాటు: అవసరమైన స్త్రీకి గర్భస్రావం క్షేమకరంగా జరిగే అవకాశాలుండాలి ఈ సేవలు అవసరమైన వారికి సకాలంలో లభించాలి. ఈ ప్రయత్నంలో ఏవయినా అనారోగ్య సమస్యలు అంకురిస్తే, వాటికి అవసరమైన చికిత్సా వసతులు కూడా ఉండాలి. క్షేమకరంగాని గర్భస్రావ ప్రయత్నం వల్ల, రక్తస్రావం, షాక్, సెప్సిస్ వంటిప్రమాదాలు ఎదురయ్యే

అవకాశాలుంటాయి. పేషెంట్ రెండు మూడు రోజులు వైద్యశాలలో చేరి చికిత్సను పొందాలి. ఏంటీబయొటిక్ మందులను వాడవలసి రావచ్చు. సర్జరీ కూడా అవసరం కావచ్చు. ఇందువల్ల వ్యక్తికి చాలా సొమ్ము ఖర్చవుతుంది. ఈ బాధలు ఎదురు కాకుండా ఉండాలంటే, తర్ఫీదు పొందిన హెల్త్ వర్కరుతో, చూలు యొక్క ప్రాథమిక దశలో, వాక్యూమ్ ఏస్పిరేషన్ పద్ధతిని గర్భస్రావం చేయించటం క్షేమకరం. లాభకరం కూడా. ఎలాంటి అనారోగ్య సమస్యలు అంకురించకుండా గర్భస్రావాన్ని చేయటం వల్ల ఖర్చులు అతి తక్కువవుతాయి.

చూలు యొక్క తొలిమూడు మాసాలలో గర్భస్రావాన్ని క్షేమకరంగా చేయవచ్చు. ఈ పనిని స్థానిక వైద్యశాలలోని తర్ఫీదు పొందిన నర్సులు, ఇతర ఆరోగ్య సిబ్బంది చేయగలరు. పేషెంట్ వైద్యశాలలో చేరి ఉండనవసరం లేదు. వీరు వ్యాక్యూం ఏస్పిరేషన్ విధానాన్ని వాడతారు. డైలేషన్ అండ్ క్యూరెటేజ్ పద్ధతి వాడకానికి సర్జరీకి సంబంధించిన నైపుణ్యం అవసరమవుతుంది. ఎనస్థీషియాను కూడా ఇవ్వవలసి ఉంటుంది. దీనికంటే వ్యాక్యూం ఏస్పిరేషన్ విధానము సులభము; ఖర్చులు కూడా తక్కువగా ఉంటాయి. ఈ విధానపు టవలంబన వల్ల కీన్యాలోని ఒక వైద్యశాల, ఒక్క సంవత్సర కాలంలో మూడు లక్షల డాలర్లను పొదుపు చేయగలిగింది. ఇది ఆ దేశంలో రెండు వందల మంది నర్సుల సాలుసరి వేతనంతో సమానం! గర్భస్రావాన్ని చేసినపుడు, గర్భంలోని పిండం తాలూకు పదార్థాలు సంపూర్తిగా వెలికి వచ్చేట్లు చూడటం వల్ల కూడా వైద్యశాల ఖర్చులు తగ్గుతాయి.

భారతదేశంలో వలె, గర్భస్రావ వసతులు విస్తృతంగా లేని దేశాలలో ఈ సర్వీసును విస్తరింపజేయటం అవసరం. అవసరమైతే, ఈ సర్వీసులను అందజేయగల సామర్థ్యము, వసతులున్న ప్రైవేటు వైద్య శాలలకు ఇందుకు అనుమతి నీయవచ్చు. కుటుంబ నియంత్రణకు గర్భస్రావాన్ని సాధనంగా వాడుతున్న చోట్ల, కుటుంబ నియంత్రణా సాధనాల విస్తృత పంపిణీకి ఏర్పాట్లు చేయాలి, కుటుంబ నియంత్రణా సలహాల వసతిని ఏర్పాటు చేయటం మంచిది.

## చూలు - కాన్పు కాలపు సేవలు

చూలు కాలంలోగాని, కాన్పు సమయంలో గాని రాగల ఆరోగ్య సంబంధమైన ఇబ్బందులను సకాలంలో గుర్తించి వాటిని పరిష్కరించటానికి, అవసరమైతే పేషెంటును దగ్గరలోని పెద్ద వైద్యశాలకు తరలించటానికి తగిన ఏర్పాట్లుండాలి. ప్రతి ముగ్గురు చూలాండ్రలోనూ ఒకరికి ఆరోగ్య సంబంధమైన ఇబ్బందుల వల్ల తర్ఫీదు పొందిన మెడికల్ సిబ్బంది సహాయం అవసరంగావచ్చు. ప్రతి పది మందిలో ఒకరికి, వైద్యశాలలో చేర్పించి చికిత్స చేయించ వలసి రావచ్చు.

చూలు కాలపు సమస్యలు తల్లినీ బిడ్డనూ కూడా ప్రభావితం చేస్తాయి గనుక, వారి రక్షణకు తగిన సర్వీసులు ఏర్పాటు వల్ల వైద్య సర్వీసుల ఖర్చులు బాగా తగ్గుతాయి. ఒక్కొక్క చూలాలికి చూలు కాలంలోనూ, కాన్పు సమయంలోనూ, కాన్పు తర్వాత అవసరమైన సేవలను అందించటానికి మొత్తం ఖర్చు రెండువేల డాలర్లకు తక్కువగానే ఉంటుంది. ఈ అంచనా ప్రకారం, రోగ భారంతో వృథా అవుతున్న ఆవిడ జీవిత కాలంలోని ఒక్క సంవత్సరాన్ని కాపాడటానికి ముప్పైనుండి 250 డాలర్లకు మించి ఖర్చుగాదు. ఆర్థిక వనరులు తక్కువగా ఉండే దేశాలలో ఆరోగ్య రక్షణా చర్యలు తీసుకోవాలి. ఇనుము, ఫోలేట్ సప్లిమెంట్లను వారికి సరఫరా చేయాలి. ప్రీ-ఎక్లెంప్సియా, ఇన్ఫెక్షన్, కాన్పు కష్టంగావటం వంటి ఇబ్బందులు ఏర్పడినపుడు, పేషెంటును కాపాడటానికి అవసరమయ్యే సర్వీసుల అనుసంధానం అవసరం. ఇలాంటి చర్యలను తీసుకోవటం ద్వారా, బాలింతలను అకాల మరణం నుండి కాపాడవచ్చు. చూలాలు పలుసార్లు వైద్య పరీక్షను చేయించుకొంటున్నపుడు, పోషకాహార లోపాన్ని సకాలంలో గుర్తించి, దిద్దుబాటుకు తగిన చర్యలను తీసుకొనే వీలుంటుంది. చూలాలు, తాను తీసుకోదగిన జాగ్రత్తలను తీసుకోవటానికి, ప్రస్తుతం కనుపిస్తున్న రోగాలకు చికిత్స చేయించుకోవటానికి అవకాశాలుంటాయి. కాన్పు కష్టమవుతుందని తెలిసిన కేసులను పెద్ద ఆసుపత్రులకు పంపాలి. ఏ కేసులో ఎటువంటి ఇబ్బంది వస్తుందో చెప్పలేము, కనుక అత్యవసర సమయాలలో పేషెంటును పెద్ద హాస్పిటలుకు తరలించటానికి అవసరమైన రవాణా సదుపాయాలను ఏర్పాటు చేయాలి.

కాన్పు కాలంలో టిటనస్ రోగపు అంటు బాలింతకు

గాని, పుట్టిన శిశువుకు గాని సోకవచ్చు. దీని నిరోధానికి తల్లికి టీకాలు వేయించాలి. ఇందువల్ల తల్లి అనారోగ్య జీవిత కాలాన్ని ఒక్క సంవత్సరం తగ్గించటానికి ఆరు డాలర్లు మించి ఖర్చు కాదు. ఇలాగే ఇనుము పోషక పదార్థపు లోపసవరణకు అవసరమైన మాత్రల సప్లయి కూడా ముఖ్య పాత్రను నిర్వహిస్తుంది. ఇందుకు ఒక్కొక్కరికి సాలుకు రెండు నుండి నాలుగు డాలర్లకు మించి ఖర్చుకాదు. ఇపుడు ఈ పోషక పదార్థలోపం వల్ల సంభవిస్తున్న మరణాల ప్రాతిపదిక మీద, అనారోగ్యము, అకాల మరణము వల్ల సంభవించే వ్యక్తి జీవిత కాల పరిమాణంలో ఒక్క సంవత్సరాన్ని కాపాడటానికి పదమూడు డాలర్లు మాత్రమే ఖర్చవుతుంది. ఇనుము, అయొడిన్ పోషక పదార్థాలను ఇతర ఆహార పదార్థాలతో చేర్చికూడా సప్లయి చేయవచ్చు. అయొడయిజ్డ్ సాల్టును ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. రెండు నుండి ఐదేండ్ల కొకసారి అయొడిన్‌ను ఇంజక్షను ద్వారా గాని, నూనెతో కలిపి ఔషధప్రాయంగా గాని బిడ్డలను కనే వయస్సు స్త్రీలకు ఇస్తూండటం వల్ల అనారోగ్యం వల్లగాని, అకాల మరణం వల్ల గాని వారి జీవిత కాలంలో నష్టమయ్యే కాలంలో ఒక్క సంవత్సరాన్ని కాపాడటానికి 19 డాలర్లు మాత్రమే ఖర్చవుతుందని అంచనావేశారు.

స్త్రీ గర్భధారణ తర్వాత 14 వారాల నుండి, ముఖ్యంగా తొలిచూలులో, మలేరియా నిగ్రహశక్తి ఆవిడలో తగ్గిపోవటం ప్రారంభమవుతుంది. మలేరియా రోగికి పుట్టిన బిడ్డ బరువు, ఆరోగ్య సూత్రాల ప్రకారం ఉండవలసిన దానికంటే తక్కువగా ఉండే అవకాశాలుంటాయి. కనుక మలేరియా విడవకుండా వచ్చే ప్రాంతాలలో, చూలాండ్రను దోమ తెరలలో పడుకోబెట్టాలి. మలేరియా నిరోధక మందుల నిప్పించాలి. చూలాలికి మలేరియా వస్తే, దాని నివారణకు వీలయినంత త్వరగా చికిత్స చేయించాలి. ఇలా చేయటం వల్ల, అతి తక్కువ ఖర్చుతో, తల్లి-బిడ్డల ఆరోగ్యాన్ని రక్షించిన వార మవుతాము.

క్షేమకరమైన కాన్పు : క్షేమకరమైన ప్రసవానికి ఆరోగ్యవంతమైన పరిసరాలు, తర్ఫీదు పొందిన సిబ్బంది, కాన్పుకు అవసరమైన సాధన సామాగ్రి, అవసరమైతే దాపులోని పెద్ద వైద్యశాలకు చూలాలిని తరలించే రవాణా ఏర్పాట్లు ఉండాలి. ఇందుకు తగిన ఆరోగ్య సేవా సర్వీసులను ఏర్పాటు చేయాలి. కాన్పు తర్వాత జరిగే అధిక రక్త స్రావపు అవకాశాన్ని ముందుగానే ఊహించటం కష్టం. తగిన నైపుణ్యం గల మంత్రసాని, కాన్పు యొక్క మూడవ దశను జాగ్రత్తగా, నైపుణ్యంతో నిర్వహించగలిగినపుడు, ఈ ప్రమాదం తప్పవచ్చు. బిడ్డ సక్రమంగా వస్తున్నదా లేదా అని తెలుసుకోవటానికి యోని ద్వారంలో పలుసార్లు చేయిపెట్టకుండా, ఆరోగ్య ప్రదంగా కాన్పు చేయించటం ద్వారా, సెప్సిస్‌ను, చాలా వరకు నిరోధించవచ్చు.

కాన్పు సమయంలో, తల్లికి ప్రాణాపాయం సంభవించే పరిస్థితులేర్పడవచ్చు. ఈ ప్రమాదాన్ని ముందుగానే పసిగట్టటం కష్టం గనుక, అత్యవసర పరిస్థితులలో ఎమర్జన్సీలను నిర్వహించగల పెద్ద ఆసుపత్రికి పేషెంటును తరలించే ఏర్పాట్లుండాలి. అధిక రక్త స్రావ సమయంలో త్వరితగతిని మిగిలిన మాయను తొలగించవలసి ఉంటుంది. ఆక్సిటాసిక్ మందులను వాడవలసి వస్తుంది; రక్తాన్ని, ఇతర ద్రవ పదార్థాలను ఎక్కించవలసి రావచ్చు. ఆఖరుకు సర్జరీ కూడా అవసరం కావచ్చు. అధిక రక్తస్రావం, కాన్పు కష్టంగావటం, బిడ్డ వెలికి రావటానికి ఇబ్బంది యేర్పడటం, అధిక రక్తపు పోటువల్ల ఎక్లెంప్సియా రావటం వంటి అత్యవసర పరిస్థితులు ఏర్పడినపుడు, పేషంటును పెద్ద వైద్యశాలకు తరలించటానికి, రవాణా సౌకర్యాన్ని ఏర్పాటు చేయటం అత్యంత ముఖ్యమైన విషయం. అధిక రక్తస్రావ పరిస్థితులలో పేషెంటు రెండు గంటలలో చనిపోయే అవకాశాలుంటాయి. అందువల్ల ఆమె ప్రాణ రక్షణకు, ఆవిడ స్థితిని స్థిమిత పరచటానికి అవసరమైన చికిత్సా సదుపాయాలు ప్రాథమిక ప్రసూతి కేంద్రంలో ఉండాలి. పేషెంటు పెద్ద ఆసుపత్రిని చేరే లోపల ప్రాణాపాయం జరుగకుండా చూడాలి. ఎమర్జన్సీ పరిస్థితులలో చేయదగిన పనులకు అవసరమైన వనరులను ప్రాథమిక ప్రసూతి కేంద్రాలలో ఏర్పాటు చేయటం ద్వారా అధిక సంఖ్యాక బాలింతలను అకాల మరణం నుండి కాపాడవచ్చు.

కాన్పు కష్టమై బిడ్డ బయటకు రావటానికి ఆటంకం ఏర్పడినపుడు, సిజేరియన్ సెక్షన్‌నుగాని, సింఫిసియోటమీ ఆపరేషన్లను చేయటానికి గాని, రక్తస్రావం తరచూ జరుగుతూ ఉండటాన్ని ఆపటానికి లెపరోటమీ లేదా హిస్టిరెక్టమీ ఆపరేషన్లను చేయటానికి గాని తర్ఫీదు పొందిన వైద్య సిబ్బంది

ఉండాలి ఎక్లెంప్సియా, సెప్సిస్ నివారణ చికిత్సకూ, కాన్పువల్ల సంభవించగల ఫిస్టులాను రిపేరు చేయటానికి కూడా ఇటువంటి సిబ్బంది అవసరం ఉంటుంది.

వైద్య చికిత్సావసతులను మెరుగు పరచాలి ఇంటికి, వైద్యశాల దూరంగా ఉండటం, రవాణా వసతులు తగినంతగా లేకపోవటం, రానుపోను ఛార్జీలకు అయ్యే ఖర్చులను చాలాలు భరించలేకపోవటం, వైద్య పరీక్షలను చాలు కాలంలో చేయించుకొనవలసిన అవసరాన్ని గురించి చాలాలికి తెలియక పోవటం, వైద్యశాలలోని పరిస్థితులు పేషెంట్లకు ప్రోత్సాహకరంగా లేకపోవటం వంటి వాటి వల్ల ఇపుడున్న సేవా సదుపాయాలను కూడా చాలాంద్రు వాడుకోలేకపోతున్నారు.

కాన్పు తర్వాతి సేవలు : కాన్పు తర్వాత తల్లికి ఏదయినా ఇన్ఫెక్షన్ వచ్చినా, రక్తస్రావం కనుపించినా, వెంటనే తగిన చికిత్స చేయించాలి. ఆరు మాసాల వరకూ బిడ్డకు విధిగా చనుబాలిచ్చేట్లు చూడాలి. పోషణ, కుటుంబ నియంత్రణా విధానాల మీద ఆవిడకు సలహాలు అందాలి. వైద్యశాలలో చేరి కాన్పు చేయించుకొన్నవారు కూడా ఈ జాగ్రత్తలను పాటించాలి. వైద్యశాలలో కాన్పు జరిగినంత మాత్రాన, ఆరోగ్య సంబంధమైన ఇబ్బందులు రావని భావించకూడదు. బాలింతకు ఏదయినా రోగపు అంటు సంక్రమిస్తే, దానికి వెంటనే చికిత్స చేయించటం వల్ల ఆవిడ ప్రాణాన్ని కాపాడవచ్చునన్న పరిజ్ఞానాన్ని తల్లికి, ఆవిడ కుటుంబీకులకు, హెల్తు వర్కర్లకూ అందించాలి. కాన్పు తర్వాత కనుపించే అంటురోగాల నివారణకు, రోగం కనుపించిన నాలుగు రోజుల లోపల ఏంటిబయొటిక్ మందుల వాడకం వల్ల, ఏనభైశాతం కేసులలో రోగనివారణ జరిగే అవకాశా లుంటాయి.

సుఖరోగాల నిరోధము, చికిత్స : సుఖరోగాల వ్యాప్తి క్రమంగాపెరుగుతున్నది. దీనితో పాటే, హెచ్ఐవి/ ఎయిడ్స్ ప్రమాదం కూడా అధిక మవుతున్నది. కనుక ఈ రోగాల వ్యాప్తి నిరోధానికి, చికిత్సకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో తగిన వసతుల కల్పన అవసరం.

సుఖరోగం వల్ల ఒక మనిషి జీవితంలో సంప్రాప్తించే అనారోగ్యం అకాల మరణం వల్ల నష్టమయ్యే ఒక్క సంవత్సరాన్ని కాపాడటానికి ఒక్క డాలరు నుండి యాభయ్యైదు డాలర్ల వరకూ ఖర్చు గావచ్చునని ప్రపంచబ్యాంకు నిపుణులు అంచనా వేశారు. పురుషునికి సుఖవ్యాధి రాకుండా నిరోధించినప్పటి కంటే, స్త్రీకి రోగం రాకుండా చేయగలిగినపుడు, ఇరవైశాతం అధిక ప్రయోజనం చేకూరుతుందని ఈ కార్యక్రమం సూచిస్తున్నది. సుఖరోగాలలో అధికభాగం, స్త్రీలనుండి పురుషులకంటే, పురుషుల నుండి స్త్రీలకు సులభంగా సోకుతాయని వైద్యులు చెబుతున్నారు. అలాగే ఈ రోగాల ప్రభావం, పురుషులలో కంటే స్త్రీలలో తీవ్రంగా ఉంటుందని కూడా చెబుతున్నారు. సంతానాన్ని కనగల వయస్సులోని స్త్రీలకు, చాలాంద్రకు ఈ రోగాలు రాకుండా చేయటం, సుఖరోగ వ్యాప్తిని అరికట్టటానికి పటుతర మార్గమని సూచిస్తున్నారు.

సుఖరోగం వచ్చిన తర్వాత, అది ముదిరి తీవ్ర పరిణామాలను చూపుతున్న స్థితిలో దానిని నివారించటం కంటే, రోగ సూచనలు కనుపించగానే నివారణకు పూనుకోవటం వల్ల, రోగికి బాధ త్వరగా పోవటమే కాకుండా, చికిత్సా ఖర్చులు కూడా తగ్గుతాయి. ఎయిడ్స్ ప్రమాదం కూడా తొలగిపోతుంది. ఈ రోగాల నిర్ధారణకు సులభమైన వైద్య విధానాలు లేవు. అవసరమైన సాధనాలను ఏర్పాటు చేయటానికి చాలా డబ్బు ఖర్చవుతుంది; నిపుణులైన వైద్యుల సేవలు కూడా అవసరమవుతాయి. అందువల్ల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో ఇలాంటి రోగ నిర్ధారణ వసతుల కల్పన, అభివృద్ధి చెందుతున్న దేశాలలో చాలా కష్టం. కనుక, రోగి చెప్పే రోగ సూచనలను బట్టి, కంటికి కనుపించే ఆనవాళ్ళను బట్టి, అవసరమైన చికిత్స చేయటం కంటే గత్యంతరం లేదు. ఇలాంటి చికిత్సా విధానం వల్ల స్త్రీలు అధికంగా లాభిస్తారు.

కొన్ని రోగకారక సూక్ష్మజీవులకు ఔషధ నిగ్రహశక్తి వస్తున్న దృష్ట్యా, సుఖరోగాల వ్యాప్తి పరిమాణాన్ని బట్టి, ఈ రోగాలు సోకే ప్రమాదమున్న గ్రూపులు, వాటి స్వభావాన్ని బట్టి, అవసరమైన నిరోధక, చికిత్సా కార్యక్రమాన్ని రూపొందించాలి. పడుపు వృత్తిలో నున్న స్త్రీలకు సుఖరోగాలు సోకే అవకాశము అధికంగా ఉంటుంది. వీటి వ్యాప్తి కూడా వీరిమీదే ప్రధానంగా ఆధారపడి ఉంటుంది. అందుచేత

సుఖరోగ నిరోధ కార్యక్రమంలో, వీరికి ప్రాధాన్యత లభించాలని ప్రపంచ బ్యాంకు సూచిస్తున్నది. ఈ రోగ నిరోధక కార్యక్రమాన్ని సాధారణ ప్రజలందరి మీదకు విస్తరింపచేయటం వల్ల, కొన్ని నిర్ణీత గ్రూపుల మీద కేంద్రీకరించినంతటి ప్రయోజనం చేకూరదు. రోగాలు అధికంగా సోకగల అవకాశాలున్న పడుపు వృత్తిలోని మహిళల మీద కేంద్రీకరించటంతోపాటు, సంతానవతులు కాగల వయస్సులోని స్త్రీల మీద కూడా కేంద్రీకరించటం అవసరం. కుటుంబ నియంత్రణ, ప్రసూతి సేవలనందచేసే వైద్య కేంద్రాలు, సుఖరోగ నిరోధము, చికిత్స, సలహాల సర్వీసును కూడా నిర్వహించటం అత్యంత ప్రయోజనకరం. ఆర్థికంగా ఇది లాభదాకయమైన విధానం.

ఇలా కాకుండా, ప్రత్యేకంగా సుఖరోగ నివారణా కేంద్రాల ఏర్పాటు ప్రయోజనకరంగా ఉండక పోవటానికి కారణాలున్నాయి. సుఖరోగాలలో అధిక భాగం, స్త్రీలలో రోగసూచనలను చూపవు; అందువల్ల తాము చికిత్సకు పోవలసిన అవసరాన్ని వారు గుర్తించలేరు. సుఖరోగ చికిత్సా కేంద్రాలకు వెళ్ళటానికి స్త్రీలు సిగ్గుపడవచ్చు. ఇతరుల దృష్టిలో తాము చులకనవుతామని భయపడవచ్చు. కుటుంబ నియంత్రణా కేంద్రాలలో, సుఖరోగ చికిత్సా వసతులున్నపుడు, సుఖరోగం రాకుండా అనుసరించదగిన విధానాలను వైద్యులు సూచించే అవకాశాలుంటాయి. రోగాలున్న వారికి చికిత్సకు కూడా వీలుంటుంది. ఈ పద్ధతుల అనుసరణ వల్ల సుఖరోగ వ్యాప్తిని పటుతరంగా అరికట్టే అవకాశాలుంటాయి. భావి తరాల వారికి తల్లి నుండి ఇవి సంక్రమించకుండా నిరోధించవచ్చు. కుటుంబ నియంత్రణా కేంద్రాలకు, ప్రసూతి కేంద్రాలకు వచ్చే మహిళలకు, వైద్యులు సుఖరోగ లక్షణాలను గురించి, గర్భవతిలో ఈ రోగాలు ఉన్నపుడు, అవి పుట్టబోయే బిడ్డ మీద చూపగల ప్రభావాన్ని, రోగం తల్లి మీద ఎలా పనిచేసేది వివరించటంతో పాటు, రోగ నిరోధక మార్గాలను కూడా సూచించాలి. ఈ విషయాలను పేషెంట్లకు వివరించటానికి తగిన పరిజ్ఞానాన్ని తర్ఫీదు పొందిన మంత్రసానులకు కూడా ఇవ్వాలి. వీటి చికిత్సలో కూడా అవసరమైన తర్ఫీదు నివ్వాలి. వీరు కండోమ్ వాడుకను ప్రోత్సహించాలి. రోగ సూచనలు కనుపించిన వారి భర్తలకు ఈ విషయాన్ని తెలిపి, వారిని చికిత్స చేయించుకొమ్మని చెప్పాలి. సుఖరోగం వచ్చిన స్త్రీ పురుషులిరువురూ చికిత్స చేయించుకోవటం వల్ల రోగవ్యాప్తి తగ్గుతుంది. వారితో లైంగిక సంబంధం ఉన్నవారికి రక్షణ గలుగుతుంది.

సుఖరోగ నివారణ మందులు సులభంగా వాడకం దార్లకు అందేట్లు చూడాలన్నది మరొక సూచన. అవసరమైతే ఈ మందుల ధరల తగ్గింపుకు ప్రభుత్వం సబ్సిడీలను ఇవ్వాలని కూడా సూచించారు. కమరూన్‌లో సుఖరోగ నివారణ "కిట్స్" ను సోషల్ మార్కెటింగ్ ప్రాజెక్టు అమ్ముతున్నాయట. ఇందులో సుఖరోగాలను గురించిన వివరాలు, చికిత్సకు మందులు, కండోమ్‌లూ ఉంటాయి

**విస్తృతంగా కండోమ్‌ల పంపకం:** సుఖరోగాలను, హెచ్.ఐ.వి./ఎయిడ్స్ వ్యాప్తిని అరికట్టటానికి కండోమ్‌ల వాడుక అత్యంత ముఖ్యమైన అంశంగా ఈ కార్యక్రమం సూచిస్తున్నది కండోమ్‌ల వాడుకను ప్రోత్సహించటానికి, అవసరమైతే ప్రభుత్వాలు సబ్సిడీలను ఇవ్వాలని కూడా సలహా ఇస్తున్నారు. 76 డాలర్ల సబ్సిడీని కండోమ్‌ల కొనుగోలు మీద ఇస్తే, సుఖరోగాలు ఎయిడ్స్‌కో, గర్భసంచి కాన్సరుకో దారి దీయటం వల్ల స్త్రీ జీవితకాల పరిమాణంలో, అనారోగ్యం లేక అకాల మరణాల వల్ల కోల్పోతున్న కాలపరిమాణంలోని ఒక్క సంవత్సరాన్ని కాపాడవచ్చునని ప్రపంచ బ్యాంకు నిపుణులు అంచనా వేశారు. అంతేకాకుండా, ఆ స్త్రీ సంతానం మీద కూడా ఈ ఖర్చు ప్రభావం ఉంటుంది. కండోమ్‌ల వాడుకవల్ల కలిగే కుటుంబ నియంత్రణ ఫలితాలను కూడా పరిగణనలోనికి తీసుకొంటే, ఈ ఖర్చు 45 డాలర్లకు తగ్గుతుందని కూడా అంచనా వేశారు.

కమ్యూనిటీ ద్వారా కండోమ్‌ల పంపకం జరగాలనీ, వ్యక్తులు పనిచేసే కేంద్రాలలో కూడా ఇవి అందుబాటులో ఉండాలనీ, ఇందువల్ల, సుఖరోగ ప్రమాదం ఉన్న వారూ, ఇతర వ్యక్తులు కూడా వాటిని విరివిగా వాడే అవకాశాలుంటాయని సూచిస్తున్నారు. ఇలాంటి విధానాల అవలంబన వల్ల జింబాబ్వే, జయిర్ దేశాలు గణనీయ ఫలితాలను సాధించాయి.

**చూలు కాలంలో సిఫిలిస్ గుర్తింపు; చికిత్స:** సుఖరోగాలలో సిఫిలిస్ అధికంగా సోకుతున్నట్లు భావిస్తున్నారు.

గర్భవతులలో ఈ రోగం లేకుండా చూడటం అవసరమని వైద్యులు సూచిస్తున్నారు. రాపిడ్ ప్లాస్మా రీజిన్ టెస్ట్ విధానంతో సీరొలాజిక్ స్క్రీనింగ్ చేసి సిఫిలిస్‌ను పసిగట్టాలని. దీని నివారణకు పెన్సిలిన్ వంటి అతి సాధారణ మందులను వాడవచ్చునని ఈ కార్యక్రమం సూచించింది. ఇది అతి తక్కువ ఖర్చుతో చేయదగిన చికిత్సని. పుట్టబోయే బిడ్డ మీద చికిత్సా ప్రభావం అధికంగా ఉంటుందని కూడా సూచిస్తున్నారు. చూలాండ్రకు ఈ రోగ నిర్ధారణ పరీక్షలు తప్పకుండా జరగాలి రోగ సూచనలు కనుపిస్తే అవసరమైన చికిత్స చేయాలి ఇలాంటి విధానాల అవలంబనవల్ల, జాంబియాలో ఒక్క సంవత్సర కాలంలో అరవై శాతం మంది చూలాండ్రను ఈ రోగం నుండి కాపాడగలిగారు. గర్భవతికి ఈ రోగ నిర్ణయ పరీక్షకు అరవైసెంట్లు, నిరోధించగలిగిన ఒక్కొక్క సిఫిలిస్ కేసుకు పన్నెండు డాలర్లు మాత్రమే ఖర్చయినట్లు సూచించారు.

గనోరియాగాని, క్లమీడియాగాని ఉన్న గర్భవతికి పుట్టే బిడ్డకు అంధత్వం సంప్రాప్తించే అవకాలున్నాయి ఆ రోగం వల్ల సంభవించగల తీవ్ర పరిణామ మిది ఈ రోగ చిహ్నాలను పసిగట్టటానికి, ప్రతి చూలాలిని పరీక్షించటం కంటే, ఈ రోగ నిరోధానికి, ఏంటిబయొటిక్ మందులను ఇవ్వటం అత్యంత పొదుపైన పద్ధతిగా సూచిస్తున్నారు. ఈ మందులను ఇవ్వటానికి పేషెంటుకు డాలరు నలభయ్యైదు సెంట్లు కంటే ఎక్కువ ఖర్చు కాదు

రోగ చిహ్నాలను బట్టి కేసుల మేనేజ్‌మెంటు : మర్మాంగం మీద పుండ్లవంటి వాటికి, రోగ చిహ్నాలను బట్టి మగవారికి చికిత్స చేయాలని సూచించారు స్త్రీలకు జననాంగంలో కనుపించే పుండ్లు, మలుగులలో వాపుకు సంబంధించిన రోగాలకు ప్రపంచ ఆరోగ్య సంస్థ సూచించిన రోగ నిర్ధారణ విధానాల ననుసరించి పరీక్షలు నిర్వహించాలని సూచించారు సుఖరోగ నిర్ధారణ పరీక్షలకు అవసరమైన లేబొరేటరీ ఏర్పాటుకు చాలా డబ్బు ఖర్చవుతుంది. ఈ పరీక్షలను జరిపి రోగ నిర్ధారణ చేయగల వైద్యుల అందుబాటు కూడా తక్కువగా ఉన్నది. అందువల్ల, శాస్త్రం ప్రకారం రోగ నిర్ణయం చేయటం, వనరులు తక్కువున్న దేశాలలో ఇపుడు సాధ్యంగాదు.

సెక్స్ వర్కర్లకు పరీక్షలు - రోగ నివారణకు చర్యలు : రోగం ఎవరి ద్వారా అధికంగా విస్తరించే అవకాశాలున్నాయో వారిని పరీక్షించి నివారణకు అవసరమైన చికిత్స చేయటం లాభదాయకం కనుక పడుపు వృత్తిలోని వారి మీద ఈ కృషి జరగాలి ఇలాంటి కృషి వల్ల కలిగే లాభాలను గమనించటానికి కెన్యా అనుభవాన్ని చూడవచ్చు నైరోబీ నగరంలోని ఒక నిర్ణీత గ్రూపుకు చెందిన పడుపు వృత్తి స్త్రీల మీద ఇలాంటి కృషి జరిగినపుడు, వారికి గనోరియా సోకటం బాగా తగ్గింది 1986వ సంవత్సరంలో ఒక్కొక్క స్త్రీకి సగటున 2 85 సార్లు ఈ రోగం సోకుతూ ఉండేది. 1989వ సంవత్సరంలో 0.66 సార్లు మాత్రమే ఈ రోగం సోకింది ఒక్క మూడు సంవత్సరాలలో కనుపించిన అభివృద్ధి ఇది ! ఇతర సుఖరోగాల వ్యాప్తి కూడా తగ్గింది. హెచ్.ఐ.వి వ్యాప్తికూడా తగ్గింది ఒక్కొక్క కేసుకు 8 నుండి 12 డాలర్ల వరకూ ఖర్చు చేయటం ద్వారా, ఈ ప్రాజెక్టులో ఆరువేల నుండి పదివేల వరకూ కొత్త హెచ్.ఐ.వి కేసులను నిరోధించగలిగారట. ఎస్.టి డి. డయాగ్నోస్టిక్స్ ఇనిషియేటివ్ అనే సంస్థ త్వరగా రోగ నిర్ణయం చేసే విధానాలను పేద దేశాల కోసం రూపొందిస్తున్నది. ఈ సంస్థను అంతర్జాతీయ ప్రాతిపదిక మీద 1990లో ఏర్పాటు చేశారు పలు దేశాల సుఖరోగ వైద్య నిపుణులు ఇందులో పనిచేస్తున్నారు. గనోరియా, క్లమీడియా, సిఫిలిస్ రోగ చిహ్నాలను, త్వరగాను, కరెక్టుగానూ, స్వల్ప ఖర్చుతోనూ నిర్ణయించే విధానాల రూప కల్పనకు వీరు కృషి చేస్తున్నారు.

మానవ ప్రవర్తనలో మార్పులు : పైన పేర్కొన్న వైద్య చికిత్సా విధానాల అవలంబనతోపాటు, ఆరోగ్య సమస్యల విషయంలో సామాజికుల ప్రవర్తనలో అవసరమైన మార్పులను సాధించాలి. ఈ కృషిలో ప్రభుత్వంతోపాటు, వ్యాపార పారిశ్రామిక రంగాలు, స్వచ్ఛంద సేవా సంస్థలు కూడా పాల్గొనటం అవసరం. అవసరమైన కార్యక్రమ రూప కల్పనకు, ప్రభుత్వం, వైద్యరంగ సేవకులను, స్వచ్ఛంద సేవా సంస్థలనూ, ముఖ్యంగా మహిళా గ్రూపులనూ సంప్రదించి అవసరమైతే దేశపు చట్టాలను మార్చాలి.

ఆరోగ్య ప్రదమైన అలవాట్లకు ప్రోత్సాహం: విద్యా, సమాచార ప్రసారాలు వైద్య సిబ్బంది, ప్రజా నాయకులు, పరిపాలనాధినేతలతో సహా, స్త్రీ పురుషులందరనూ ప్రభావితం చేస్తాయి. వారి ఆలోచనా - ఆచరణా విధానాల మార్పుకు తోడ్పడతాయి. కనుక ప్రజాదరణ పొందగల ప్రసార సాధనాలను వాడుతూ, ప్రజలలో ఆరోగ్య రక్షణావసరాలనూ, రోగ నిరోధాన్ని, పోషణాలోప సవరణావసరాల వంటి అంశాలను ప్రచారం చేయాలని సూచిస్తున్నారు. చేతులను సబ్బు నీళ్ళతో కడుక్కోవటం, కాచిన నీటిని తాగే అలవాటు వంటి వాటిని కుటుంబంలో పెంపొందించటం వల్ల కుటుంబీకులకు ఎంతో ఆరోగ్య రక్షణ లభిస్తుంది. కుటుంబంలోని మహిళలకు, పురుషులకు కూడా, చూలు కాలంలో రాగల ప్రమాదాలను గురించి తెలియజేస్తూ, వెంటనే వైద్య చికిత్సకు వెళ్ళవలసిన తరుణాన్ని గుర్తించేట్లు చేయాలి. ఇందువల్ల చూలాండ్ర, బాలింతల మరణాలు తగ్గుతాయి.

కౌమార దశలో చూలు నిరోధం : పిన్నవయస్సులోనే పెండ్లయితే, శరీరం తగినంత యెదగకుండా, యువతి చూలాలు అవుతుంది. కనుక, శారీరక పెరుగుదల పూర్తి అయ్యేవరకూ గర్భధారణ జరుగకుండా చూడాలి. ఇందుకు స్త్రీల వివాహ వయస్సును ప్రభుత్వం పెంచాలి. యువతులు ఆలస్యంగా పెండ్లి చేసుకోవటానికి వీలుగా, వీరు ఎక్కువ కాలం విద్యాలయాలలో ఉండే ఏర్పాటు చేయాలని కూడా సూచించారు. పెండ్లయినా, చూలు ఆలస్యం కావటానికి గర్భనిరోధక సాధనాల వాడుకను ప్రోత్సహించాలి. కుటుంబ నియంత్రణ సాధనాల వాడుకకు, గర్భస్రావానికి, భర్త అనుమతి కావాలని చట్టం నిర్దేశిస్తున్న చోట్ల, అటువంటి చట్టాల ఉపసంహరణ జరగాలి. యువతులకు, అవివాహిత స్త్రీలకు సంతానోత్పత్తి, సెక్సు ఆరోగ్య రక్షణాంశాల మీద, (కోరిన వారికి) సలహాల నివ్వటానికి రహస్య సలహా సర్వీసు ఏర్పాటును చట్టబద్ధం చేయాలి.

పిన్నవయస్సులోనే పిల్లలను కనటం తల్లి ఆరోగ్యానికి మంచిదిగాదని, కాన్పుల మధ్య తగినంత కాల వ్యవధైనా ఉండాలని వైద్యులు సూచిస్తున్నారు. స్కూళ్ళలో సంతానోత్పత్తి క్రమము, సెక్సు విషయాలు పాఠ్యాంశాలుగా ఉండాలన్న సూచన కూడా ఇందులో ఉన్నది. ఇలాంటి అంశాలను పిన్న వయస్సులోనే వారికి బోధించటం వల్ల, పిన్న వయస్సులోనే సెక్సు కార్యకలాపాలకు పిల్లలు దిగే అవకాశాలుంటాయన్న వాదం సరి కాదన్నారు

సేఫ్ సెక్సు: ఇది చాలా ముఖ్యమైన అంశం కోరని గర్భధారణ జరుగకుండా, రోగాలు రాకుండా, స్త్రీ పురుషులు లైంగిక సంపర్కానికి పూనుకోవటాన్ని "సేఫ్ సెక్సు" గా ఇంటర్నేషనల్ ప్లాన్డ్ పేరెంట్‌హుడ్ ఫెడరేషన్ నిర్వచించింది.

సెక్సు సంపర్కం వల్ల వచ్చే ఎయిడ్స్‌తో సహా, సుఖ వ్యాధుల స్వభావం, అవి ఒకరి నుండి మరొకరికి సోకే విధానం, వాటివల్ల సంభవించగల దీర్ఘ కాలిక దుష్ఫలితాలు చాలా మందికి తెలియవు. అందువల్ల ఈ ప్రమాదాలను తప్పించు కోవలసిన అవసరాలను, మార్గాలను కూడా స్త్రీ పురుషులకు తెలియజేయాలి. సెక్సు సంపర్కానికి దూరంగా ఉండటం, ఏక పత్నీ వ్రతం, సెక్సు సంపర్కంలో కండోమ్ వాడుక వంటి పద్ధతుల అవలంబనను గురించి వీరికి తెలియ జెప్పాలి. రోగ చిహ్నాలు కనుపించిన వెంటనే చికిత్స చేయించుకోవలసిన అవసరాన్ని వీరికి వివరించాలి. ప్రజలకు సెక్సు సంపర్కం ద్వారా వచ్చే సుఖరోగాలు, ఎయిడ్స్ వంటి వాటిమీద ప్రచారం ప్రయోజనకరంగా ఉంటుందంటూ, మెక్సికో అనుభవాన్ని చూపారు. తొమ్మిది మాసాల ప్రచారం మూలంగా యూనివర్శిటీ విద్యార్థులలోనూ, పడుపు వృత్తి వారిలోనూ, ఇతర వర్గాలలోనూ కండోమ్‌ల వాడుక పెరిగింది.

సుఖరోగాలను గురించి పురుషులకు తెలిసినంతగా స్త్రీలకు తెలియదు. తమకు సోకిన రోగం ముదిరిన తర్వాతనే అధికులు గుర్తించగలుగుతున్నారు. దీనిని గురించి పత్రికల ద్వారా వారికి అందే సమాచారం కూడా తక్కువే. ఈ రోగాలకు సంబంధించిన విషయాల వివరణకు, స్త్రీలే పూనుకోవాలి. వ్యక్తులను గాని, గ్రూపులును గాని వీరు కలుసుకొని ఈ రోగాలకు సంబంధించిన సమాచారాన్నందించాలి. ఆరోగ్య కేంద్రాలు, విద్యాలయాలు, ప్రార్థనా స్థలాలు, క్లబ్‌లు, పనికి పోయేవారయితే పొలాలు, స్త్రీలను గ్రూపులుగా కలుసుకొనే అవకాశాలనిస్తాయి. ఈ విజ్ఞానం సంతానవతులు కాగల వయస్సులోని వారికి మాత్రమే కాకుండా, యుక్త వయస్సు వస్తున్న ఆడపిల్లలకు, వారు సెక్సు సంపర్కానికి దిగక ముందే అందాలి. వయస్సు మళ్ళిన మహిళలకు కూడా ఈ విజ్ఞానాన్ని

అందించాలి ఇందువల్ల వారు పిన్నలకు ఈ విషయాలను వివరించే అవకాశాలుంటాయి

పురుషులతో కండోమ్‌లను వాడించే నేర్పును మహిళలకు తెలియజెప్పాలి కండోమ్‌ల అమ్మక ప్రోత్సాహానికి, ఉద్యమం వంటి ప్రచారాన్ని చేబట్టాలి. ఇలాంటి ప్రచారం వల్ల కండోమ్‌ల వాడుక యెడల విముఖతను చూపుతున్న పురుషులు దానిని ఆమోదించే అవకాశాలు మెరుగవుతాయని సూచించారు కండోమ్‌ల వాడుక యెడల పురుషుల వైముఖ్యాన్ని తొలగించ గలిగితే సెక్సు సంపర్కం, స్త్రీ పురుషులిద్దరకూ అసంతృప్తి లేకుండా, సమాన ప్రాతిపదిక మీద జరుగుతుంది ఇందువల్ల స్త్రీ తాను కోరని గర్భధారణను నిరోధించ గలుగుతుంది. సుఖరోగాల నుండి తప్పించుకోగలుగుతుంది. కాండోమ్‌లను వాడుతున్న పురుషులు, తాము ప్రేమించే వ్యక్తులను అనారోగ్యం నుండి రక్షించిన వారవుతారు. ఈ విషయంలో పురుషులు సహకరించక పోయినా, స్త్రీలు సుఖరోగాల అంటును నిరోధించటానికి వీలయిన, యోనిలో పెట్టదగిన మైక్రోబిసైడ్స్ వంటి వాటిని శాస్త్ర వేత్తలు వీలయినంత త్వరగా రూపొందించటం అవసరమని ఈ కార్యక్రమం సూచించింది.

**అవసరాలకు తగినంత పోషణ :** ఆడ పిల్లలకు, స్త్రీలకు వారి వయస్సు పరిమాణాన్ని బట్టి, వారికి లభించవలసిన సుపోషకమైన ఆహార నియమాలను గురించి తెలియ జెప్పటం ఆరోగ్య సిబ్బంది బాధ్యత. స్త్రీలు అనుభవిస్తున్న దారిద్ర్యము, అధిక పనిభారము,అధిక సంతానం, సురక్షితమైన నీటి సరఫరాలేమి, సక్రమమైన పరిసర ఆరోగ్య పరిస్థితుల లేమి వంటి సమస్యల పరిష్కారం ప్రభుత్వ బాధ్యత.

ఆడపిల్లలను పిన్నవయస్సునుండి సక్రమంగా పోషిస్తే, వారు పెద్ద వారయిన తర్వాత రాగల అనారోగ్య సమస్యలను నిరోధించటానికి వీలుంటుంది. సూక్ష్మపోషక పదార్థలోపం (ప్రధానంగా కాల్షియం, ఇనుము ) వారికి సంభవించ కూడదు. మగ పిల్లల కంటే, ఆడపిల్లలకు తక్కువ పోషణ నిచ్చే ఆహార పదార్థాల నివ్వటాన్ని ఆరోగ్య కార్యకర్తలు గమనిస్తే, ఈ దురాచారం వల్ల ఆడపిల్లలకు సంభవించగల ప్రమాదాలను గురించి, కుటుంబీకులకు వివరించాలి.

పోషకాహార అవసరాలను గురించి విజ్ఞాన ప్రచారాన్ని నిర్వహించాలి తినే ఆహార పదార్థాల ఎన్నిక, ఆహార పదార్థాలను వండటం, విటమినుల వాడుక, విరోచనాలు వస్తే దాని నివారణా మార్గాలు, తిన్న ఆహారం వంటబట్టని పరిస్థితులలో తీసుకోదగిన జాగ్రత్తల వంటి అంశాలను స్త్రీలకు వివరించాలి.

**కార్యసాధనలో పురుషుల భాగస్వామ్యం :** స్త్రీ తన ఆరోగ్యాన్ని పటుతరంగా రక్షించు కోవటానికి, ఆవిడ భర్త యొక్క సంపూర్ణ సహకారం అవసరం. పలు దేశాలలో పోషణ, ఆరోగ్య రక్షణ, కుటుంబీకుల సంఖ్యా పరిమితి, కాన్పుల మధ్య ఉండవలసిన కాల వ్యవధి వంటి ఆరోగ్యాన్ని ప్రభావితం చేయగల అంశాలను నిర్ణయించేది పురుషులు. ఉన్న ప్రసూతి వసతులను స్త్రీలు ఇంత తక్కువగా ఎందుకు వినియోగించుకొంటున్నారో తెలుసుకోవటానికి సెనెగల్ లో ఒక సర్వే జరిగింది. చూలు, కాన్పుకు అవసరమైన ఆరోగ్యవసతులను వినియోగించు కోవటంలో తాము సర్వస్వతంత్రులమని రెండు శాతం మంది మహిళలు మాత్రమే చెప్పారు! మిగిలిన వారంతా, తమ భర్తలు అనుమతిస్తేనే ప్రసూతి కేంద్రాలకు వెళ్ళగలమని చెప్పారు ఈ అనుభవాన్ని చూపుతూ, కండోమ్‌ల వాడుక, సేఫ్‌సెక్సు, మాదకద్రవ్య వాడకం, భార్యలను హింసించటం వంటి అంశాల మీద, పురుషులను ప్రభావితం చేయగల విద్యాకార్యక్రమాల అమలు జరుగ వలసిన అవసరాన్ని కార్యక్రమం సూచించింది. సెక్సు సంబంధాలలో పురుషులది పైచేయిగా ఉంటున్న కాలమిది. అందువల్ల ఆ పురుషాధిక్యతా భావాన్ని బలహీన పరచటం కోసం, విద్యాలయాలలో విద్యార్థులకు చిన్న వయస్సు నుండీ పునరుత్పత్తికి సంబంధించిన అంశాలను బోధిస్తూ వారి ఆలోచనా సరళిలో మార్పులు తేవాలి.

ఇంతవరకూ పోషణ–ఆరోగ్య విషయ కార్యక్రమాలు ప్రస్తుతం థాయ్‌లాండ్, కీన్యా, మాలి, హోండూరాస్‌లలో అమలులో ఉన్నాయి. తల్లి తన బిడ్డకు ఎక్కువ కాలం చనుబాలు ఇచ్చేట్లు ఈ దేశాలలో ఒక కార్యక్రమం అమలు జరుగుతున్నది. ఈ కాలంలో తల్లికి అవసరమైన అదనపు పోషణా వసతులను ఏర్పాటు చేయటానికి, ఆవిడకు పని భారాన్ని తగ్గించి, కొంత మేరకయినా విశ్రాంతి లభించేట్లు చూడటానికి పురుషులను ప్రోత్సహించాలనే లక్ష్యంతో ఈ

ఆరోగ్య ప్రదమైన అలవాట్లకు ప్రోత్సాహం: విద్యా, సమాచార ప్రసారాలు వైద్య సిబ్బంది, ప్రజా నాయకులు, పరిపాలనాధినేతలతో సహా, స్త్రీ పురుషులందరనూ ప్రభావితం చేస్తాయి. వారి ఆలోచనా - ఆచరణా విధానాల మార్పుకు తోడ్పడతాయి. కనుక ప్రజాదరణ పొందగల ప్రసార సాధనాలను వాడుతూ, ప్రజలలో ఆరోగ్య రక్షణావసరాలనూ, రోగ నిరోధాన్ని, పోషణాలోప సవరణావసరాల వంటి అంశాలను ప్రచారం చేయాలని సూచిస్తున్నారు. చేతులను సబ్బు నీళ్ళతో కడుక్కోవటం, కాచిన నీటిని తాగే అలవాటు వంటి వాటిని కుటుంబంలో పెంపొందించటం వల్ల కుటుంబీకులకు ఎంతో ఆరోగ్య రక్షణ లభిస్తుంది. కుటుంబంలోని మహిళలకు, పురుషులకు కూడా, చూలు కాలంలో రాగల ప్రమాదాలను గురించి తెలియజేస్తూ, వెంటనే వైద్య చికిత్సకు వెళ్ళవలసిన తరుణాన్ని గుర్తించేట్లు చేయాలి. ఇందువల్ల చూలాంత్ర, బాలింతల మరణాలు తగ్గుతాయి.

కౌమార దశలో చూలు నిరోధం : పిన్నవయస్సులోనే పెండ్లయితే, శరీరం తగినంత యెదగకుండా, యువతి చూలాలు అవుతుంది. కనుక, శారీరక పెరుగుదల పూర్తి అయ్యేవరకూ గర్భధారణ జరుగకుండా చూడాలి. ఇందుకు స్త్రీల వివాహ వయస్సును ప్రభుత్వం పెంచాలి. యువతులు ఆలస్యంగా పెండ్లి చేసుకోవటానికి వీలుగా, వీరు ఎక్కువ కాలం విద్యాలయాలలో ఉండే ఏర్పాటు చేయాలని కూడా సూచించారు. పెండ్లయినా, చూలు ఆలస్యం కావటానికి గర్భనిరోధక సాధనాల వాడుకను ప్రోత్సహించాలి. కుటుంబ నియంత్రణ సాధనాల వాడుకకు, గర్భస్రావానికి, భర్త అనుమతి కావాలని చట్టం నిర్దేశిస్తున్న చోట్ల, అటువంటి చట్టాల ఉపసంహరణ జరగాలి. యువతులకు, అవివాహిత స్త్రీలకు సంతానోత్పత్తి, సెక్సు ఆరోగ్య రక్షణాంశాల మీద, (కోరిన వారికి) సలహాల నివ్వటానికి రహస్య సలహా సర్వీసు ఏర్పాటును చట్టబద్ధం చేయాలి.

పిన్నవయస్సులోనే పిల్లలను కనటం తల్లి ఆరోగ్యానికి మంచిదిగాదని, కాన్పుల మధ్య తగినంత కాల వ్యవధైనా ఉండాలని వైద్యులు సూచిస్తున్నారు. స్కూళ్ళలో సంతానోత్పత్తి క్రమము, సెక్సు విషయాలు పాఠ్యాంశాలుగా ఉండాలన్న సూచన కూడా ఇందులో ఉన్నది. ఇలాంటి అంశాలను పిన్న వయస్సులోనే వారికి బోధించటం వల్ల, పిన్న వయస్సులోనే సెక్సు కార్యకలాపాలకు పిల్లలు దిగే అవకాశాలుంటాయన్న వాదం సరి కాదన్నారు.

సేఫ్ సెక్సు: ఇది చాలా ముఖ్యమైన అంశం. కోరని గర్భధారణ జరుగకుండా, రోగాలు రాకుండా, స్త్రీ పురుషులు లైంగిక సంపర్కానికి పూనుకోవటాన్ని "సేఫ్ సెక్సు" గా ఇంటర్నేషనల్ ప్లాన్డ్ పేరెంట్‌హుడ్ ఫెడరేషన్ నిర్వచించింది.

సెక్సు సంపర్కం వల్ల వచ్చే ఎయిడ్స్‌తో సహా, సుఖ వ్యాధుల స్వభావం, అవి ఒకరి నుండి మరొకరికి సోకే విధానం, వాటివల్ల సంభవించగల దీర్ఘ కాలిక దుష్ఫలితాలు చాలా మందికి తెలియవు. అందువల్ల ఈ ప్రమాదాలను తప్పించు కోవలసిన అవసరాలను, మార్గాలను కూడా స్త్రీ పురుషులకు తెలియజేయాలి. సెక్సు సంపర్కానికి దూరంగా ఉండటం, ఏక పత్నీ వ్రతం, సెక్సు సంపర్కంలో కండోమ్ వాడుక వంటి పద్ధతుల అవలంబనను గురించి వీరికి తెలియ జెప్పాలి. రోగ చిహ్నాలు కనుపించిన వెంటనే చికిత్స చేయించుకోవలసిన అవసరాన్ని వీరికి వివరించాలి. ప్రజలకు సెక్సు సంపర్కం ద్వారా వచ్చే సుఖరోగాలు, ఎయిడ్స్ వంటి వాటిమీద ప్రచారం ప్రయోజనకరంగా ఉంటుందంటూ, మెక్సికో అనుభవాన్ని చూపారు. తొమ్మిది మాసాల ప్రచారం మూలంగా యూనివర్శిటీ విద్యార్థులలోనూ, పడుపు వృత్తి వారిలోనూ, ఇతర వర్గాలలోనూ కండోమ్‌ల వాడుక పెరిగింది.

సుఖరోగాలను గురించి పురుషులకు తెలిసినంతగా స్త్రీలకు తెలియదు. తమకు సోకిన రోగం ముదిరిన తర్వాతనే అధికులు గుర్తించగలుగుతున్నారు. దీనిని గురించి పత్రికల ద్వారా వారికి అందే సమాచారం కూడా తక్కువే. ఈ రోగాలకు సంబంధించిన విషయాల వివరణకు, స్త్రీలే పూనుకోవాలి. వ్యక్తులను గాని, గ్రూపులను గాని వీరు కలుసుకొని ఈ రోగాలకు సంబంధించిన సమాచారాన్నందించాలి. ఆరోగ్య కేంద్రాలు, విద్యాలయాలు, ప్రార్థనా స్థలాలు, క్లబ్‌లు, పనికి పోయేవారయితే పొలాలు, స్త్రీలను గ్రూపులగా కలుసుకొనే అవకాశాలనిస్తాయి. ఈ విజ్ఞానం సంతానవతులు కాగల వయస్సులోని వారికి మాత్రమే కాకుండా, యుక్త వయస్సు వస్తున్న ఆడపిల్లలకు, వారు సెక్సు సంపర్కానికి దిగక ముందే అందాలి. వయస్సు మళ్ళిన మహిళలకు కూడా ఈ విజ్ఞానాన్ని

అందించాలి. ఇందువల్ల వారు పిన్నలకు ఈ విషయాలను వివరించే అవకాశాలుంటాయి

పురుషులతో కండోమ్‌లను వాడించే నేర్పును మహిళలకు తెలియజెప్పాలి. కండోమ్‌ల అమ్మక ప్రోత్సాహానికి, ఉద్యమం వంటి ప్రచారాన్ని చేబట్టాలి. ఇలాంటి ప్రచారం వల్ల కండోమ్‌ల వాడుక యెడల విముఖతను చూపుతున్న పురుషులు దానిని ఆమోదించే అవకాశాలు మెరుగవుతాయని సూచించారు. కండోమ్‌ల వాడుక యెడల పురుషుల వైముఖ్యాన్ని తొలగించ గలిగితే సెక్సు సంపర్కం, స్త్రీ పురుషులిద్దరకూ అసంతృప్తి లేకుండా, సమాన ప్రాతిపదిక మీద జరుగుతుంది. ఇందువల్ల స్త్రీ తాను కోరని గర్భధారణను నిరోధించ గలుగుతుంది. సుఖరోగాల నుండి తప్పించుకోగలుగుతుంది కాండోమ్‌లను వాడుతున్న పురుషులు, తాము ప్రేమించే వ్యక్తులను అనారోగ్యం నుండి రక్షించిన వారవుతారు. ఈ విషయంలో పురుషులు సహకరించక పోయినా, స్త్రీలు సుఖరోగాల అంటును నిరోధించటానికి వీలయిన, యోనిలో పెట్టదగిన మైక్రోబిసైడ్స్ వంటి వాటిని శాస్త్ర వేత్తలు వీలయినంత త్వరగా రూపొందించటం అవసరమని ఈ కార్యక్రమం సూచించింది.

**అవసరాలకు తగినంత పోషణ :** ఆడ పిల్లలకు, స్త్రీలకు వారి వయస్సు పరిమాణాన్ని బట్టి, వారికి లభించవలసిన సుపోషకమైన ఆహార నియమాలను గురించి తెలియ జెప్పటం ఆరోగ్య సిబ్బంది బాధ్యత. స్త్రీలు అనుభవిస్తున్న దారిద్ర్యము, అధిక పనిభారము,అధిక సంతానం, సురక్షితమైన నీటి సరఫరాలేమి, సక్రమమైన పరిసర ఆరోగ్య పరిస్థితుల లేమి వంటి సమస్యల పరిష్కారం ప్రభుత్వ బాధ్యత.

ఆడపిల్లలను పిన్నవయస్సునుండి సక్రమంగా పోషిస్తే, వారు పెద్ద వారయిన తర్వాత రాగల అనారోగ్య సమస్యలను నిరోధించటానికి వీలుంటుంది. సూక్ష్మపోషక పదార్థలోపం (ప్రధానంగా కాల్షియం, ఇనుము ) వారికి సంభవించ కూడదు. మగ పిల్లల కంటే, ఆడపిల్లలకు తక్కువ పోషణ నిచ్చే ఆహార పదార్థాల నివ్వటాన్ని ఆరోగ్య కార్యకర్తలు గమనిస్తే, ఈ దురాచారం వల్ల ఆడపిల్లలకు సంభవించగల ప్రమాదాలను గురించి, కుటుంబీకులకు వివరించాలి.

పోషకాహార అవసరాలను గురించి విజ్ఞాన ప్రచారాన్ని నిర్వహించాలి తినే ఆహార పదార్థాల ఎన్నిక, ఆహార పదార్థాలను వండటం, విటమినుల వాడుక, విరోచనాలు వస్తే దాని నివారణా మార్గాలు, తిన్న ఆహారం వంటబట్టని పరిస్థితులలో తీసుకోదగిన జాగ్రత్తల వంటి అంశాలను స్త్రీలకు వివరించాలి

**కార్యసాధనలో పురుషుల భాగస్వామ్యం :** స్త్రీ తన ఆరోగ్యాన్ని పటుతరంగా రక్షించు కోవటానికి, ఆవిడ భర్త యొక్క సంపూర్ణ సహకారం అవసరం పలు దేశాలలో పోషణ, ఆరోగ్య రక్షణ, కుటుంబీకుల సంఖ్యా పరిమితి, కాన్పుల మధ్య ఉండవలసిన కాల వ్యవధి వంటి ఆరోగ్యాన్ని ప్రభావితం చేయగల అంశాలను నిర్ణయించేది పురుషులు ఉన్న ప్రసూతి వసతులను స్త్రీలు ఇంత తక్కువగా ఎందుకు వినియోగించుకొంటున్నారో తెలుసుకోవటానికి సెనెగల్ లో ఒక సర్వే జరిగింది. చూలు, కాన్పుకు అవసరమైన ఆరోగ్యవసతులను వినియోగించు కోవటంలో తాము సర్వస్వతంత్రులమని రెండు శాతం మంది మహిళలు మాత్రమే చెప్పారు! మిగిలిన వారంతా, తమ భర్తలు అనుమతిస్తేనే ప్రసూతి కేంద్రాలకు వెళ్ళగలమని చెప్పారు. ఈ అనుభవాన్ని చూపుతూ, కండోమ్‌ల వాడుక, సేఫ్‌సెక్సు, మాదకద్రవ్య వాడకం, భార్యలను హింసించటం వంటి అంశాల మీద, పురుషులను ప్రభావితం చేయగల విద్యాకార్యక్రమాల అమలు జరుగ వలసిన అవసరాన్ని కార్యక్రమం సూచించింది. సెక్సు సంబంధాలలో పురుషులది పైచేయిగా ఉంటున్న కాలమిది. అందువల్ల ఆ పురుషాధిక్యతా భావాన్ని బలహీన పరచటం కోసం, విద్యాలయాలలో విద్యార్థులకు చిన్న వయస్సు నుండీ పునరుత్పత్తికి సంబంధించిన అంశాలను బోధిస్తూ వారి ఆలోచనా సరళిలో మార్పులు తేవాలి.

ఇంతవరకూ పోషణ-ఆరోగ్య విషయ కార్యక్రమాలు ప్రస్తుతం తాయ్‌లాండ్, కీన్యా, మాలి, హాండూరాస్‌లలో అమలులో ఉన్నాయి. తల్లి తన బిడ్డకు ఎక్కువ కాలం చనుబాలు ఇచ్చేట్లు ఈ దేశాలలో ఒక కార్యక్రమం అమలు జరుగుతున్నది. ఈ కాలంలో తల్లికి అవసరమైన అదనపు పోషణా వసతులను ఏర్పాటు చేయటానికి, ఆవిడకు పని భారాన్ని తగ్గించి, కొంత మేరకయినా విశ్రాంతి లభించేట్లు చూడటానికి పురుషులను ప్రోత్సహించాలనే లక్ష్యంతో ఈ

కార్యక్రమం అమలు జరుగుతున్నది.

కుటుంబ నియంత్రణలో స్త్రీకంటే పురుషుడు అధిక బాధ్యతలను చేపట్టాలి. కోరని గర్భధారణ తన భార్యకు జరగకుండా చూచే బాధ్యతను పురుషుడు తీసుకోవాలి. ఇందుకు అనువుగా కుటుంబం నియంత్రణ సందేశం పురుషులను చేరటం అవసరం. కుటుంబ నియంత్రణా కేంద్రాలలో, కొన్ని నిర్ణీత సమయాలలో పురుషులకు అవసరమైన సలహాల నిచ్చే ఏర్పాటు జరగాలని కూడా ఈ కార్యక్రమం సూచిస్తున్నది.

కుటుంబ నియంత్రణ ఆపరేషన్లను కూడా పురుషుల కంటే అధికంగా స్త్రీలు చేయించుకొంటున్నారు. దాదాపు అన్ని దేశాలలోనూ పరిస్థితి ఇలాగే ఉన్నది. లాటిన్ అమెరికాలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లను చేయించుకొంటున్న వారిలో నూరింట 93 మంది వరకూ స్త్రీలే ఉంటున్నారు.

తాయ్‌లాండ్‌లో పురుషుల ఆపరేషన్‌ను (వాసెక్టమీని) అధికంగా ప్రోత్సహిస్తున్నారు. అయినా కుటుంబ నియంత్రణ ఆపరేషన్లను చేయించుకొనే వారిలో నూరింట 80 మంది స్త్రీలే ఉంటున్నారు! స్త్రీల కంటే పురుషులు ఈ ఆపరేషన్‌ను చేయించుకోవటం ఉత్తమం. ఇందుకు ఖర్చులు తక్కువవుతాయి; ప్రమాదం కూడా తక్కువ, మనిషి ఆపరేషన్ తర్వాత కోలుకోవటానికి ఎక్కువ కాలవ్యవధి అవసరం లేదు. స్త్రీలకు ఇందులో పలు రకాల బాధలు ఎదురయ్యే అవకాశాలున్నాయి. కత్తి ఉపయోగించకుండా వాసెక్టమీ చేసే విధానాలు ఇపుడు అమల్లోకి వచ్చాయి. దీనిని త్వరగా వ్యాప్తిలోనికి తేగలిగితే పురుషులను ఈ ఆపరేషన్లకు ప్రోత్సహించే అవకాశాలు అధికంగా ఉంటాయి.

సంతానాన్ని కనటం, పెంచటం వంటి బాధ్యతలను పురుషుల తలకెత్తితే గాని, అవాంఛిత గర్భధారణ బాధ వారి కర్థం కాదు. కొన్ని దేశాలలో, సంతాన పోషణ, సంరక్షణ బాధ్యత తండ్రిదేనని నిర్దేశిస్తున్న శాసనాలు, అమలులో ఉన్నాయి. అయితే ఇవి ఎంతమేరకు ఆసించిన ఫలితాల నిచ్చాయో తెలియదు. కుటుంబ నియంత్రణ బాధ్యతను పురుషుని మీద పెట్టాలి అన్న భావానికి సర్వత్రా ఆదరణ కనుపిస్తున్నది. ఒక ఆర్టిస్టు ఒక పోస్టర్ తయారు చేశాడట. దానిలో గర్భధారణతో ఉన్న పురుషుని చిత్రించాడు. దాని కింద "నీవే గర్భధారణను చేయవలసి వస్తే ఇప్పటి కంటే జాగ్రత్తగా ఉంటావా?" అని వ్రాశాడట. ఈ పోస్టరును పలు దేశాలు తమ కుటుంబ నియంత్రణ ప్రచారంలో వాడుతున్నట్లు రిపోర్టులు వచ్చాయి!

హానికరమైన సంప్రదాయాల తొలగింపు : ఆరోగ్య ప్రదమైన ఆచరణను ప్రోత్సహించే విద్యా, వైద్య విధానాలను పాటించటంతోపాటు సమాజంలో అమలులో నున్న ప్రమాదకరమైన సంప్రదాయాలను తొలగించాలి. ఉదాహరణకు: కుటుంబంలోనూ, సమాజంలోనూ పురుషుని కింది స్థానమే స్త్రీది. పోషణ, ఆరోగ్య రక్షణాది విషయాలలో పురుషుల తోడి సమాన స్థానం ఆవిడకు లభించటం లేదు. స్త్రీ మర్మాంగపు వక్రీకరణ ఆపరేషను, స్త్రీ హింస పెద్ద యెత్తున అమలు జరుగుతున్నాయి, వీటిని నిరోధించాలి. వీటివల్ల స్త్రీ ఆరోగ్యం చెడుతున్నది గనుక వీటి నివారణ అవసరం.

లింగ వివక్ష : లింగ వివక్షా పాటింపు వల్ల స్త్రీ అనారోగ్యం పాలవుతున్నదనీ, ఆవిడ సంక్షేమం దెబ్బతింటున్నదనీ, ఆవిడ ఉత్పత్తి శక్తి సన్నగిల్లుతున్నదని పాలసీ నిర్ణేతలకు, సామాజిక నాయకులకు తెలియజెప్పాలి. ఈ అంశానికి విశేష ప్రచారం లభించాలి. ప్రజలను జాగృతం చేయాలి.

స్త్రీ మర్మాంగ వక్రీకరణ ఆపరేషన్లు : ఈ ఆపరేషన్ల నిరోధానికి ప్రభుత్వాలే గాక, ప్రభుత్వేతర సంస్థలు, స్త్రీల సంఘాలు, ముఖ్యంగా వైద్యుల సంఘాలు నడుం కట్టాలి. ఈ దురాచారాన్ని నిరోధించే చట్టాలను ప్రభుత్వాలు చేయాలి. ఈ దురాచార దుష్ఫలితాలకు విశేష ప్రచారం లభించాలి.

స్త్రీల మానభంగాలు, హింస : స్త్రీ హింస, ఏదో అనారోగ్య సమస్యలెమ్మని తోసిపుచ్చ దగినది కాదు. ఇదొక సాంఘిక సమస్య కనుక హింసకు లోనైన స్త్రీకి అవసరమైన శారీరక, మానసిక వైద్యం చేస్తే సరిపోదు, దీనికి మూల కారణాలను విచారించాలి. స్త్రీని హింసనుండి కాపాడటానికి, పురుషుడు స్త్రీని తన గుప్పెటలో పెట్టుకోవటాన్ని నిరోధించటానికి అవసరమైన శాసన బద్ధమైన చర్యలను ప్రభుత్వాలు తీసుకోవాలి.

## వనరులున్న దేశాలకు అదనపు కార్యక్రమం

ఆర్థిక వనరులున్న అభివృద్ధి చెందుతున్న దేశాలకు అదనపు కార్యక్రమాన్ని సూచించారు అత్యవసరమైన సేవలేగాక, అదనపు సేవలు లభించేట్లు చేయటం ఈ కార్యక్రమ లక్ష్యం ఈ కార్యక్రమపు అమలుకు ఆర్థిక వనరులు ఉండటానికి తోడు రాజకీయ పరమైన కృతనిశ్చయం కూడా ప్రభుత్వాలకుండాలని ఈ కార్యక్రమం సూచిస్తున్నది ఈ అదనపు కార్యక్రమ సంక్షిప్త స్వభావమిది .

### 1 అత్యవసర సర్వీసుల విస్తరింపు

1. కుటుంబ నియంత్రణ సాధనాలలో పలు రకాలను అధికంగా ప్రవేశపెట్టటం.
2 చూలు - కాన్పు కాలపు సేవలను విస్తృత పరచటం
3. సుఖరోగాల పరీక్షలకు, చికిత్సలకూ వసతులను విస్తృత పరచటం
4 పోషణాలోపానికి గురిగాగల వర్గాల వారికి అవసరమైన సహాయాన్ని అధికంగా అందించటం.
5 హింసకు లోనవుతున్న స్త్రీల పరిస్థితులను తెలుసుకోవటానికి, వారి కవసరమైన చికిత్స చేయటానికి, తగిన ఇతర సేవలను అందజేయటానికి వసతుల ఏర్పాటు

### 2. కాన్సరును పసిగట్టటానికి పరీక్షల నిర్వహణ, చికిత్స

1 ముప్పయ్యైదు సంవత్సరాలు, అంతకు మించిన వయస్సు స్త్రీల సెర్వికల్ కాన్సరు పరీక్షలు, చికిత్స
2. యాభై సంవత్సరాలు అంతకు మించిన వయస్సు వారికి చనుకట్టు కాన్సరు చికిత్స (వనరుల ఇబ్బంది లేని దేశాలు ఈ కార్యక్రమాన్ని అమలు పరచాలి)

### 3. రాగల ఆరోగ్య సమస్యలను ముందుగానే పసిగట్టటం

1 పునరుత్పత్తి విధానాన్ని తెలిపే పాఠ్యాంశాలను స్కూళ్ళలో బోధించటం సెక్సు, పునరుత్పత్తికి సంబంధించిన ఆరోగ్య సమస్యలను కూడా బోధనాంశాలుగా చేయటం
2 అవాంఛిత గర్భధారణ జరగకుండా తీసుకోదగిన చర్యలకు, అందుకు అవసరమైన సర్వీసులకు, విశేష ప్రచారం లభించేట్లు చూడటం, సెక్సు సంబంధాల వల్ల వచ్చే సుఖరోగ వ్యాప్తి, నిరోధక మార్గాలకు కూడా ప్రచారం లభించటం
3. స్త్రీల పోషణావసరాల ప్రత్యేకతను గురించి అందరకూ తెలియజెప్పటం
4. పొగతాగుట, మాదక ద్రవ్యాల వాడుకలను నిరుత్సాహపరచటానికి వైజ్ఞానిక కార్యక్రమాల నిర్వహణ

### 4. లింగ వివక్ష తగ్గింపుకు మార్గాల రూపకల్పన

1. ప్రజలలో వైజ్ఞానిక ప్రచారం
2. ఈ విషయాలలో హెల్తు వర్కర్లకు తర్ఫీదు నియ్యటం
3. సామాజికులను కూడగట్టటం.

### 5. కాన్పులుడిగిన స్త్రీల సంరక్షణ

1 ఈ గ్రూపు వారి పోషణావసరాల మీద వైజ్ఞానిక ప్రచార నిర్వహణ.
2. స్వయం సహాయ పథకాల రూపకల్పన, వీరిని ఆదరించే సంస్థల అనుసంధానం.

# 8

## విషవలయంలో చిక్కిన స్త్రీ విద్య

పురుషులేగాదు, స్త్రీలు కూడా చదువుకోవటం అవసరం అని, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ త్వరితగతిని విస్తరిస్తున్న ఈ రోజుల్లో చెప్పబూనటం హాస్యాస్పదంగా కనుపిస్తుంది. అయినా సందర్భ శుద్ధి కోసం రెండు మాటలు చెప్పక తప్పదు.

చదువు కోవటం వల్ల వ్యక్తి యొక్క సృజనాత్మక శక్తులు వికసిస్తాయి; విచక్షణా జ్ఞానం పెరుగుతుంది. అవసరానికి తగిన సాహసాన్ని ప్రదర్శించ గల విజ్ఞత, శక్తి కూడా లభిస్తుంది. సామాజిక ఆర్థిక మార్పులకు తగినట్లు, మారగల శక్తి, యుక్తి వ్యక్తికి లభిస్తుంది. చదువు కోవటం వల్ల, కుటుంబాలలో కూడా శాస్త్రీయ విధానాల అవలంబనకు మార్గం సుగమమవుతుంది. ఛాందసభావాలు తొలగి పోవటానికి వీలుంటుంది. కుటుంబీకుల ఆరోగ్య రక్షణ, పోషణ, పిల్లల పెంపకం వంటి విషయాలలో ఆధునిక విధానాల అవలంబనావసరాన్ని స్త్రీ గుర్తించ గలుగుతుంది. ఇందువల్ల కుటుంబీకులు తరచూ అనారోగ్యం పాలయ్యే ప్రమాదం తగ్గుతుంది. శిశు మరణాలు తగ్గుతాయి.

గర్భంలో పిండంగా ఏర్పడిన నాటి నుండి తల్లి చదువు బిడ్డ పురోభివృద్ధికి ఉపకరించ నారంభిస్తుంది. గత 30 సంవత్సరాల కాలంలో పిల్లల తెలివితేటల సూచి ("ఐ క్యూ" అని ఇంగ్లీషులో వ్యవహరిస్తున్నారు) 20 పాయింట్లు పెరిగినట్లు నిపుణులు అంచనా వేశారు. ఇంత స్వల్పకాలంలో పిల్లల "ఐ క్యూ" ఇంత అధిక పరిమాణంలో పెరగటానికి వారి వంశ పారంపర్యతే కారణం గాదు; పిల్లల పెంపకంలో తల్లులు అవలంబిస్తున్న అభివృద్ధికర విధానాల ప్రభావం కూడా చెప్పదగినంతగా కారణమవు తున్నట్లు వీరు వివరిస్తున్నారు స్త్రీ చదువు, కుటుంబాలకూ, సమాజానికి మేలు చేయగలదు అని చెప్పటానికి, ఇటువంటి విషయాలను నిపుణులు ఉదహరిస్తూ ఉంటారు.

స్త్రీ విద్యా ప్రయోజనాన్ని ద్రవ్య పరిమాణంలో చిత్రించటం కష్టం. పిల్లలను చదివించటానికి ప్రభుత్వం సొమ్మును ఖర్చు చేస్తుంది. అయినా తలిదండ్రులు కొంత ఖర్చునైనా భరించవలసి ఉంటుంది. పిల్లల చదువులకు తలిదండ్రులు ఖర్చుచేసే సొమ్ము పరిమాణం, వారి కుటుంబ ఖర్చులో దాదాపు పదిశాతం వరకూ ఉంటుందని అంచనా వేస్తున్నారు. ఇది స్థూలమైన అంచనా మాత్రమే. ప్రభుత్వంగాని, కుటుంబాలు గాని, మగపిల్లల చదువుకు ఖర్చు చేసినంత

సొమ్మును ఆడపిల్లలకు వినియోగించటం లేదు ఆడపిల్లల చదువు కంటే, మగపిల్లల చదువు వల్లే కుటుంబం అధికంగా లాభిస్తుందన్న భావమే ఈ వివక్షకు మూలం ఈ అవగాహనలోని వాస్తవ మెంతో చూద్దాం

గత 20 సంవత్సరాలుగా పలుదేశాల నిపుణులు, చదువు కోవటం వలన వ్యక్తులకు, వారి విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడికి లభిస్తున్న లాభాల పరిమాణాలను అంచనా వేయటానికి ప్రయత్నిస్తున్నారు ప్రాథమిక విద్య వలన అధిక లాభాలు వస్తున్నట్లు కొన్ని అంచనాలు తెలియ జేస్తున్నాయి సెకండరీ విద్య మీద ఇంత అధిక లాభాలు గిట్టటం లేదు: కాని అవీ పరిగణించదగిన పరిమాణంలోనే ఉన్నాయి ఉన్నత విద్య మీద ఇంతటి అధిక లాభాలు కనుపించక పోయినా వస్తున్న లాభాలు అధికంగా ఉంటున్నాయని పరిశీలనా సమాచారం వెల్లడిస్తున్నది.

అంచనాలను రూపొందించటానికి పరిశీలకులు అనురించిన విధానాల వలన, కొన్ని రకాల అంచనాలు పొరపాటు అవగహనకు కూడా దారి దీస్తున్నాయి; ఆర్జిత లాభాలను అంచనా వేసేటపుడు, రొఖ్ఖరూప ఆర్జననే లాభంగా పరిగణిస్తున్నారు ఇందువల్ల, "ఇంటిపట్టున" ఉన్న ఇల్లాలు, బండెడు చాకిరీని రెక్కలు ముక్కలయ్యేట్లు చేస్తున్నా, ఆవిడ శ్రమకు ఆర్జిత విలువ లభించటం లేదు. వేతనార్జనకు వెళ్ళే వారిలో అత్యధికులు పురుషులే గనుక, విద్యార్జన వలన వచ్చే లాభాలు, స్త్రీల కంటే పురుషుల వల్లనే అధికంగా లభిస్తున్నట్లు లెక్క తేలుతున్నది. ఈ విషయ అవగహనకు ఒకటవ పట్టికలోని, ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించిన వివరాలను చూడవచ్చు విద్యార్జనకు పెట్టిన పెట్టుబడి మీద వచ్చిన లాభాలను అంచనా వేసేటపుడు, రొఖ్ఖ రూప ఆర్జననే లాభంగా స్వీకరించి అంచనా వేసినపుడు, స్త్రీల ప్రైమరీ విద్యకు పెట్టిన పెట్టుబడి మీద వచ్చిన లాభం 0.3 శాతం మాత్రమే ఉన్నట్లు తేలింది. ఇలా గాకుండా, ప్రైమరీ విద్య నార్జించిన స్త్రీలందరి శ్రమను కూడా కలిపి అంచనా వేసినపుడు, వారి విద్యార్జనా పెట్టుబడుల మీద వచ్చిన లాభాలు పన్నెండు శాతంగా తేలింది! సెకండరీ విద్యార్జన వలన లభిస్తున్న లాభాల అంచనాకు, రొఖ్ఖరూప ఆదాయాన్ని తెచ్చే మహిళల శ్రమను మాత్రమే అంచనాకు తీసుకొన్నపుడు, వారి విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడులకు వస్తున్న లాభాలు 2.4 శాతంగా తేలింది: ఇలాగాక సెకండరీ విద్య నభ్యసించిన స్త్రీ లందరి శ్రమనూ పరిగణనకు తీసుకొన్నపుడు వారి విద్యార్జనకు పెట్టిన పెట్టుబడి మీద వచ్చిన లాభాలు పన్నెండు శాతం వరకూ ఉన్నట్లు తేలింది!

చదువుకొన్న స్త్రీలందరకూ బయటకు వెళ్ళి రొఖ్ఖరూప ఆదాయాలను సంపాదించటం వీలు గాదు. వేతనార్జనకు బయటకు వెళ్ళటం కంటే, ఇంటి పట్టున ఉండి, ఇంటి పనులను చక్కబెట్టుకోవటం కొందరు స్త్రీలకు లాభకరంగా కనుపించవచ్చు ఇలాంటి వారి శ్రమఫలితం రొఖ్ఖరూపంలో కనుపించనంత మాత్రాన, వారిని కుటుంబంలోని సంపాదనాపరుల మీద ఆధారపడి జీవించే పరభాగ్యోప జీవులుగా పరిగణించబూనటం అన్యాయం; అవాస్తవికం. లాభదాయకమని అనుకొన్నపుడే స్త్రీలు బయట పనులకు వెళతారు. లేనపుడు, కులవృత్తిలోనో, స్వంతవ్యాపారాలలోనో, ఇంటిపనులలోనో నిమగ్నమవుతారు. అందుచేత చదువుకొన్న స్త్రీలు వేతనాన్ని ఆర్జించనంత మాత్రాన, వారు సంపాదనా పరులుగారనీ, వారి విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడి నిష్ప్రయోజనమైనదని భావించటం పొరపాటు; వీరి శ్రమను వదలివేసి లాభాలను అంచనా వేయబూనటం వాస్తవ విరుద్ధం.

ఒకటవ పట్టికలోని సంఖ్యా వివరాలను పరిశీలిస్తే, విద్యార్జన వలన స్త్రీ పురుషులకు లభిస్తున్న లాభాల పరిమాణాలలో తేడాలు కనుపిస్తాయి. చదువుకొని, రొఖ్ఖరూప సంపాదనను తెస్తున్న స్త్రీలకు, చదువుకొని కూడా వేతనార్జనకు వెళ్ళని మహిళలకు, వారికి లభిస్తున్న లాభాలలో తీవ్రమైన వ్యత్యాసాలు కనుపిస్తున్నాయి. పైన పేర్కొన్న స్త్రీల పరిస్థితిలోని లోపాన్ని, షూల్జ్ గణాంక పద్ధతిన సవరించి చూచినపుడు, తాయ్‌లెండ్‌లో, సెకండరీ విద్యార్జన వలన స్త్రీలకు 25 శాతం వరకూ లాభాలు చేకూరుతుండగా, పురుషులకు ఏడు శాతం మాత్రమే లభిస్తున్నట్లు తేలింది. ఉన్నత విద్య నార్జించిన స్త్రీలకు 18 శాతం లాభాలు వస్తుండగా, పురుషులకు వస్తున్న లాభాలు ఎనిమిది శాతంగా మాత్రమే ఉన్నాయి. పెరూ దేశానికి సంబంధించిన అంచనాలను కూడా ఇలా సవరించి చూచినపుడు, స్త్రీలకు వస్తున్న లాభాల పరిమాణం ఎక్కువగా పెరిగింది; సెకండరీ స్థాయి విద్యార్జనలోనే గాకుండా, ఉన్నత

ఒకటవ పట్టిక

విద్యార్జనా పెట్టుబడి మీద స్త్రీ-పురుషులకు లభిస్తున్న ప్రతిఫలస్థాయి (1959-1985)

| దేశము- పరిశీలనా సంవత్సరం | ప్రాథమిక విద్య | | సెకండరీ విద్య | | ఉన్నత విద్య | |
|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| అమెరికా (1959) (ఎ) | 17.8 | 5.6 | 14 0 | 13 0 | 9.7 | 4.2 |
| బొగోటా (కొలంబియా 1965) (ఎ) | 18 2 | - | 34 4 | 18 9 | 4 5 | 5.3 |
| జర్మనీ (1960) | - | - | - | - | 4 6 | 5.0 |
| గ్రీస్ (1960) | - | - | 3.0 | 5 0 | - | - |
| కీన్యా (1960) (ఎ) | 21.7 | 7.1 | 23 6 | 19 5 | - | - |
| మలేషియా (1960) | 9 4 | 9.3 | 12.3 | 11.4 | 10 7 | 9.8 |
| న్యూజిలెండ్ (1960) | - | - | 19.4 | 25.3 | 13.4 | 13 5 |
| బ్రెజిల్ (1960) | 17 9 | 38.5 | - | - | - | - |
| ఆస్ట్రేలియా (1960) (ఎ) | - | - | - | - | 21 1 | 21 2 |
| ఫ్రాన్స్ (1976) | - | - | 14 8 | 16.2 | 20.0 | 12 7 |
| యునైటెడ్ కింగ్డం (1971) | - | - | 10.0 | 8.0 | 8 0 | 12 0 |
| జపాన్ (1980) (ఎ) | - | - | - | - | 5.7 | 5.8 |
| దక్షిణ కొరియా (1971) | - | - | 13.7 | 16.9 | 15.7 | 22.9 |
| తైయువాన్ (1982) | 8.4 | 16.0 | - | - | - | - |
| ప్యూర్టోరికో (1959) | 29.5 | 18.4 | 27.3 | 40.8 | 21.9 | 9.0 |
| ఆంధ్రప్రదేశ్ (భారతదేశం) | | | | | | |
| (1977) (బి) | 8.9 | 11 8 | 8.7 | 11.9 | 6.2 | 8.9 |
| (ఎ) | 7.2 | 0.3 | 6.8 | 2.41 | 5.5 | 5.5 |
| ఐవొరికోస్ట్ (1985) | 18.3 | 5.5 | 17.0 | 28.7 | 21 1 | 13.6 |

1. పట్టికలోని సంఖ్యావివరాలు శాతాలను తెలియచేస్తున్నాయి.

2(ఎ) ఈ అంచనాలను, విద్యావంతులై, వేతనాన్ని ఆర్జిస్తున్న స్త్రీల పరిమాణ ప్రాతిపదికమీద రూపొందించారు.

(బి) ఈ అంచనాలను, విద్యావంతులయిన స్త్రీల నందరనూ పరిగణనకు తీసుకొని రూపొందించారు.

*ఆధారం : టీ.పి షూల్జ్ వ్రాసిన "రిటరన్స్ టు ఉమెన్స్ ఎడ్యుకేషన్" అన్న పరిశోధనా పత్రం.*

స్థాయీ విద్యార్జన వలన కూడా, స్త్రీలకు లభిస్తున్న లాభాలు పురుషులకు లభిస్తున్న పరిమాణం కంటే అధికంగా ఉన్నట్లు తేలింది. ప్రైమరీ స్థాయి విద్యార్జన వలన స్త్రీ-పురుష లిద్దరకూ లభిస్తున్న లాభాలు తక్కువగా ఉన్నట్లు కనుపించింది. ఈ అంశాన్ని యస్.ఖండేకర్ అనే ప్రపంచ బ్యాంకు నిపుణులు తాము వ్రాసిన పరిశోధనా పత్రం "లేబర్ మార్కెట్ పార్టిసిపేషన్, రిటరన్స్ టు ఎడ్యుకేషన్ అండ్ మేల్ - ఫిమేల్ వేజ్ డిఫరెన్సెస్ ఇన్ పెరూ" లో ఉదహరించారు. ఇందుకు వారు కారణాలను మాత్రం వివరించలేదు.

విద్యార్జన వలన స్త్రీలకు లభిస్తున్న లాభాల పరిమాణం తక్కువగా కనుపించటానికి, మార్కెట్ పరిస్థితులు కూడా కొంతమేరకు కారణమవుతున్నాయి. అత్యధిక సంఖ్యాక మహిళలు వేతనార్జనకు వెళ్ళటం లేదు. ఇందుకు భిన్నంగా పురుషులలో అత్యధికులు వేతనార్జనకు వెళుతున్నారు ఇందువలన స్త్రీ-పురుషులార్జిస్తున్న వేతన పరిమాణాలను పోల్చి చూచినపుడు, స్త్రీల సంపాదన కంటే పురుషుల సంపాదన అధికంగా ఉన్నట్లు కనుపించటం సహజం. అంతేకాదు; స్త్రీ-పురుషులు చేసే పని స్వభావం, దాని సాంకేతిక స్వభావము

ఒకే రకమైన పనయినా వారికి లభించే వేతనాలలో తేడాలుంటున్నాయి పురుషులకు లభిస్తున్నంత వేతనం స్త్రీలకు లభించటం లేదు అది తక్కువగా ఉంటున్నది ఇందువలన కూడా పురుషుల సంపాదన కంటే స్త్రీల ఆదాయం తక్కువగా ఉన్నట్టు కనుపిస్తున్నది వ్యక్తియొక్క విద్యాస్థాయి గాని. వృత్తిపరమైన అనుభవంగాని వేతనరూప వ్యత్యాసాలకు పరిగణించదగిన కారణంగా కనుపించటం లేదు

పలురకాల వివక్షకు స్త్రీలు గురికావలసి రావటం చేత. విద్యార్హతలున్నా వారి సంపాదన పురుషుల సంపాదన కంటే తక్కువగానే కనుపిస్తున్నది ఈ అవరోధాలను చూడలేని వారికి. ఆడపిల్లలను చదివించటం కంటే మగపిల్లలను చదివించటమే లాభకరమని అనిపిస్తుంది కనుక వారి విద్యార్జనకు అధిక ప్రాముఖ్యత నిస్తారు ఇందువల్ల మనుగడకు అవసరమైన విద్యలేక స్త్రీలు బాధపడవలసి వస్తుంది అవసరమైన విద్యార్హతలు లేకుండా స్త్రీలు. పురుషులతో ఎలా పోటీపడగలరు? ఇది చాలదన్నట్టు. సంస్కృతీ - సంప్రదాయాలు. అభివృద్ధి చెందిన. వెనుకబడిన దేశాల ఆర్థిక విధాన నిర్ణయాలను ప్రభావితం చేస్తాయి. ఇందువలన స్త్రీ విద్యకు మరికొన్ని రకాల ఇబ్బందులు ఎదురవుతున్నాయి ఈ విధంగా స్త్రీ విద్య విషవలయంలో చిక్కుకొన్నది

ఈ విషవలయ విచ్ఛేదం అంత సులభమైన పనికాదు లేబర్ మార్కెట్‌లో స్త్రీలకు సమానావకాశాలను కల్పించాలి కొన్ని రంగాలలో స్త్రీల ప్రవేశాన్ని నిరోధించే ఆంక్షలను తొలగించాలి తాము కోరుకొన్న విద్యార్హతలను సంపాదించటానికి. కోరుకున్న చోటకు పోయి చదువుకోవటానికి. ఉపాధిని సంపాదించటానికి అవసరమైన స్వేచ్ఛను. వనరులనూ వారికి కల్పించాలి అప్పుడే స్త్రీలు అల్పవేతన పరిధిని దాటి అధికాదాయార్జన లభించే ఉపాధి రంగంలో ప్రవేశించ గలుగుతారు అప్పుడే స్త్రీలకు వారి విద్యాస్థాయికి తగిన వేతనం లభిస్తుంది దీని వలన స్త్రీలలో విద్యార్జనాసక్తి పెరుగుతుంది. మలేషియా అనుభవం ఈ అంశాన్ని రుజువు చేస్తున్నది ఈ శతాబ్దపు 70వ దశాబ్దంలో విద్యార్జనకు. ఉపాధికి అవసరమైన సమానావకాశాలను స్త్రీ పురుషులకు మలేషియా ప్రభుత్వం కల్పించింది దీని ఫలితంగా దేశ ఆర్థికాభివృద్ధి పునరుజ్జీవితమైనది అధిక పురోగతిని సాధించింది కుటుంబాదాయపు పెరుగుదలలో అధిక భాగం స్త్రీల అర్జన వల్లనే రాసాగింది! 1973వ సంవత్సరంలో. కుటుంబాదాయంలో స్త్రీల సంపాదన 4 3 శాతంగా మాత్రమే ఉండేది. 1987వ

**తల్లి విద్యార్జనా స్థాయిని బట్టి పిల్లల మరణాల తగ్గుదల**

| దేశం | ప్రతి వెయ్యి సజీవ జననాలకు సంభవిస్తున్న ఐదు సంవత్సరాలలోపు పిల్లల మరణాల సంఖ్య | | |
|---|---|---|---|
| | తల్లి విద్యార్జనా స్థాయి | | |
| | నిరక్షరాస్యులయినపుడు | ప్రైమరీ విద్యను అభ్యసించినపుడు | సెకండరీ విద్యను అభ్యసించినపుడు |
| మొరాకో (1992) | 115 | 65 | 25 |
| యెమెన్ రిపబ్లిక్ (1991-92) | 130 | 80 | 65 |
| నేపాల్ 1996 | 140 | 80 | 60 |
| ఫిలిపీన్స్ 1993 | 150 | 80 | 40 |
| ఉగాండా 1995 | 170 | 140 | 90 |
| బొలివియా 1994 | 180 | 150 | 30 |
| మాలి 1995-96 | 255 | 195 | 100 |

*- వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1998 - 1999*

సంవత్సరానికిది 12.9 శాతానికి పెరిగింది ఇంతవరకూ స్వయం ఉపాధిలో ఉన్న వారూ, కూలీలుగా పనిచేస్తున్న స్త్రీలు ఉద్యోగాలలో ప్రవేశించ సాగారు ఇందువలన వారి వేతనార్జనా పరిమాణం పెరుగసాగింది. స్త్రీల విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడికి అధిక ఫలితం కనుపించనారంభించింది.

విద్యార్జనా లాభాలు స్త్రీల కంటే పురుషులకు అధికంగా ఉంటాయన్నది భ్రమ మాత్రమే అని ఈ విషయం నిరూపిస్తున్నది. పురుషులతో సమంగా స్త్రీలను కూడా విద్యావంతులను చేయటం వలన దేశ ఆర్థికవ్యవస్థా విస్తరణ, అభివృద్ధి, సమర్థతా పెరుగుతాయి.

## సామాజిక లాభాలు

విద్యవలన వ్యక్తులకు లభించే లాభాలు ఎలా ఉంటాయో చూచాం. స్త్రీ విద్య వ్యక్తికి, వారి కుటుంబానికి మాత్రమే గాక, సమాజానికి కూడా ఎలా ప్రయోజనకరంగా ఉంటుందో చూద్దాం.

ప్రతి అదనపు సంవత్సరపు స్త్రీ విద్యార్జన వలన ఐదు సంవత్సరాల లోపు వయసు పిల్లల మరణాలు ఐదు నుండి పదిశాతం వరకూ తగ్గుతాయని పలుదేశాలలో జరిగిన పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. తల్లి ఆర్జించిన విద్య, వారి బిడ్డల ఆరోగ్య రక్షణకు అధికంగా వినియోగ పడుతుంది; తల్లికంటే, వారి తండ్రి ఎంత పెద్ద చదువులను చదివి ఉన్నా, ఆ విద్యా ప్రభావం, పిల్లల మీద ఇంత అధికంగా ఉండటం లేదని కొందరు నిపుణులు నిర్ధారణ చేశారు. భారత దేశంలోని పిల్లల మరణాల రేట్లను, అందుకుగల కారణాలను పరిశీలించిన జీన్ డ్రేజ్, ప్రొఫెసర్ అమార్త్య సేన్‌లు ఈ అంశాన్ని సంఖ్యారూపంలో చిత్రించి చూపారు. 1981వ సంవత్సరంలో అక్షరాస్యులయిన స్త్రీల సంఖ్యా పరిమాణం, మొత్తం స్త్రీ జనాభాలో 22 శాతంగా ఉన్నదన్న ప్రాతిపదికను వీరు తీసుకొన్నారు. స్త్రీలలో 75 శాతం మంది (నూరింట 75 మంది) అక్షరాస్యులయి ఉన్నట్లయితే, 1981వ సంవత్సరంలో వెయ్యి మంది పిల్లలకు 156గా ఉన్న పిల్లల మరణాలు, 110కి తగ్గేవని అంచనా వేశారు. పురుషుల అక్షరాస్యతను పెంచటం, దారిద్ర్య భారాన్ని తగ్గించటం వంటి చర్యల వలన కంటే, స్త్రీ అక్షరాస్యతా పెంపు పటుతరంగా పిల్లల మరణాలను తగ్గించగలదని వీరు స్పష్టం చేశారు. పురుషులలో అక్షరాస్యులు నూరింట 22 మందిగా ఉన్నపుడు, ఐదు సంవత్సరాల లోపు వయసు పిల్లల మరణాలు, వెయ్యికి 167 ఉన్నట్లు వీరు భావించి అంచనా వేశారు. పురుషులలో అక్షరాస్యుల పరిమాణాన్ని 75 శాతానికి పెంచినపుడు ఇంతకు పూర్వం వెయ్యిమంది పిల్లలకు 167 ఉన్న మరణాలు, 141 కి మాత్రమే తగ్గేవని తేల్చారు. 1981 వ సంవత్సరపు ప్రజల దారిద్ర్య భారాన్ని సగం వరకూ తగ్గించ గలిగినపుడు, వెయ్యికి 156గా ఉన్న ఐదు సంవత్సరాల లోపు వయసు పిల్లల మరణాలు 153కు మాత్రమే తగ్గే అవకాశాలున్నట్లు వీరు అంచనా వేశారు. స్త్రీ విద్యావంతురాలు గావటం వలన, ఆడపిల్లల, మగపిల్లల మరణాల రేట్లు కూడా తగ్గుతాయి; సందేహం లేదు. కాని, మగపిల్లల మరణాల కంటే ఆడపిల్లల మరణాలు ఎక్కువగా తగ్గుతూ ఉండటం ఇచ్చట గమనించ వలసిన విషయం. సమాజం యొక్క ఆర్థికాభివృద్ధి కంటే, స్త్రీలలో విద్యావ్యాప్తి (అక్షరాస్యుల పెంపు) సామాజిక సంక్షేమానికి అధికంగా తోడ్పడుతుందని కూడా డ్రేజ్, సేన్‌లు స్పష్టం చేశారు.

ప్రపంచ బ్యాంకు నిపుణులు ఎస్. కాక్రన్ ప్రభృతులు కూడా "ది ఎఫెక్ట్ ఆఫ్ ఎడ్యుకేషన్ ఆన్ హెల్త్" అన్న పరిశోధనా పత్రంలో తండ్రి విద్య కంటే, తల్లి విద్య వారి పిల్లల ఆరోగ్యం మీద అత్యధిక ప్రభావాన్ని చూపగలదనీ, పిల్లల ఆరోగ్య రక్షణకు, తండ్రి చదువుకంటే తల్లి చదువు పటుతరంగా వినియోగపడుతుందని కూడా వీరు రుజువు చేశారు. అభివృద్ధి చెందుతున్న పదిహేను దేశాలలో ఈ అంశాన్ని ఐక్యరాజ్య సమితి నిపుణులు మెన్ష్ ప్రభృతులు, అత్యంత శాస్త్రీయ ప్రాతిపదిక మీద పరిశీలించారు. వీరు కూడా పై అంశాలను ధృవపరచారు. పలుదేశాలలో జరిగిన పరిశోధనలు ఈ విషయాలను నిరూపిస్తున్నాయి. జన్మ నిచ్చిన తల్లి, గర్భస్థ దశ నుండి బిడ్డ పోషణ, ఆరోగ్య రక్షణాది అంశాలలో అత్యంత శ్రద్ధను ప్రదర్శిస్తూ ఉంటుంది. బిడ్డ జీవితంలో ఇంతటి కీలక పాత్రను నిర్వహిస్తున్న తల్లి, బిడ్డ ఆరోగ్యానికి రక్షణ కవచంగా పనిచేయటం ఆశ్చర్యకరమైన అంశం కాదు. దురదృష్టవశాత్తూ ఈ అంశం గుర్తింపును పొందటం లేదు.

## సంపద కన్నా చదువు మిన్నా

స్త్రీలు చదువు కొన్న వారయినపుడు, వారు కనే సంతానపు సంఖ్య కూడా తక్కువగా ఉంటుందనీ, కన్న సంతానం కూడా ఆరోగ్యంగానూ, చురుకుగానూ ఉంటుందన్న విషయాన్ని, నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లైడ్ ఎకనామిక్ రిశర్చి సంస్థ జరిపిన దేశ వ్యాపిత సర్వే రుజువు చేస్తున్నది

ఈ సంస్థ మనదేశంలోని పలు ప్రాంతాలలో నివసిస్తున్న యాభైవేల కుటుంబాలను సర్వేకు ఎంచుకొన్నది సర్వే నిర్వహణ 1987వ సంవత్సరంలో జరిగింది కన్న పిల్లల సంఖ్య, కన్న సంతానపు జీవిత కాల పరిమాణం విషయాలలో, చదువుకొన్న వారి సంతానానికి, చదువుకోనివారి సంతానానికి మధ్య ఉండే తేడాలను ఈ సర్వే స్పష్టంగా చిత్రించింది ఆరు సంవత్సరాలు, అంతకంటే ఎక్కువ కాలం చదువు కొన్న స్త్రీల సంతానపు పరిమాణం, ఐదు సంవత్సరాలు, అంతకంటే తక్కువ కాలం చదువు కొన్న స్త్రీల కంటే చాలా తక్కువగా ఉన్నది. ఐదు సంవత్సరాలు, అంతకంటే తక్కువ కాలం చదువుకొన్న వారి సంతానంలో నూరింట 80 మంది జీవిస్తుండగా, ఆరు సంవత్సరాలు - అంతకంటే ఎక్కువ కాలం చదువు కొన్న స్త్రీల సంతానంలో నూరింట 90 మంది జీవిస్తున్నారు భార్య కనే సంతానపు సంఖ్యా పరిమాణం మీదా, వారి మనుగడ విషయం మీదా భర్తయొక్క విద్యార్జనా స్థాయీ ప్రభావం చాలా తక్కువగా ఉన్నట్లు సర్వేలో తేలింది. వీరి విద్యార్జనా స్థాయీ పరిమాణాల ప్రభావం అన్ని కుటుంబాలలోనూ ఒకే రకంగా ఉన్నట్లు కూడా కనుపించలేదు.

స్త్రీ కనే సంతానపు సంఖ్యా పరిమాణాన్ని, వారి మనుగడనూ వారి కుటుంబపు ఆర్థిక స్థోమత కూడా ప్రభావితం చేస్తున్నట్లు కూడా కనుపించింది. సర్వేకు ఎన్నుకొన్న కుటుంబాలలోని అత్యధిక సంపన్న కుటుంబాలలో పుట్టిన పిల్లలలో నూరింట 86 మంది వరకూ జీవించి ఉండగా, అల్పాదాయ వర్గాల కుటుంబాలలో పుట్టిన పిల్లలలో 66 మంది మాత్రమే జీవించి ఉంటున్నారు. కాని చదువుకొన్న స్త్రీ సంతానంలో, సంపన్న కుటుంబపు స్త్రీ సంతానం కంటే అధికులు జీవించి ఉంటూండటం గమనింపదగిన విశేషం ఆరు సంవత్సరాలు - అంతకంటే ఎక్కువ కాలం చదువుకొన్న స్త్రీల సంతానంలో నూరింట 90 మంది జీవించి ఉండగా, సంపన్న కుటుంబానికి చెందిన స్త్రీలు కన్న సంతానంలో 86 మంది మాత్రమే జీవించి ఉంటున్నట్లు సర్వే నిర్ధారించింది.

*సంపద కన్న చదువు మిన్న అని ఈ సర్వే నిరూపించింది.*

తల్లి చదువు ఒక్కటే బిడ్డ ప్రాణాన్ని కాపాడగలదా అన్న ప్రశ్న ఉదయించటం సహజం. బిడ్డకు జబ్బు చేస్తే, అవసరమైన చికిత్సకు దాపులో వైద్యశాల ఉండాలి; ఈ వసతి ఉన్నా, బిడ్డ చికిత్సకు, అవసరమైనంత సొమ్ము ఉండాలి. ఇలాంటి అంశాలు బిడ్డ ప్రాణ రక్షణపై తమ ప్రభావాన్ని చూపే మాట నిజం. విద్యావంతురాలైన తల్లి, బిడ్డ ఆరోగ్య రక్షణకు ముందు జాగ్రత్తలు తీసుకొంటుంది; బిడ్డ ఆరోగ్యం చెడితే, త్వరగా వైద్య చికిత్స చేయించాలని తాపత్రయ పడుతుంది. ఈ విషమ పరిస్థితిని గమనించలేని మగవారిని, వేధించయినా బిడ్డకు చికిత్స చేయించే ప్రయత్నానికి దిగుతుంది. మనసుంటే మార్గముంటుందని పెద్దలంటారు. ఎలాగైనా బిడ్డను బ్రతికించుకోవటానికి స్త్రీ సకాలంలో సకల ప్రయత్నాలు చేస్తుంది. ఈ ప్రయత్నానికి చోదకశక్తి ఆవిడ చదువే.

ఈ అంశపు నిర్ణయానికి కూడా కొందరు పరిశోధకులు కృషి చేశారు. బీన్‌స్టాక్, స్టర్డ్ ప్రభృతులు భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో సర్వేలను నిర్వహించారు. తల్లిదండ్రులతో పాటు బిడ్డకు డి.పి.టి వాక్సినేషన్ చేయించటం, అనుభవిస్తున్న దారిద్ర్య పరిమాణం, కులము, వైద్య చికిత్సా సదుపాయాల అందుబాటు వంటి పలు అంశాలను తీసుకొని, వాటిలో ఏవి, ఎంతవరకు బిడ్డ మనుగడ మీద తమ ప్రభావాన్ని చూపుతున్నదీ నిర్ణయించటానికి వీరు ప్రయత్నించారు. ఈ అంశాలలో అన్నింటి కంటే స్త్రీ విద్య బిడ్డ మనుగడ మీద అత్యధిక ప్రభావాన్ని చూపుతున్నట్లు వీరు నిర్ణయించారు. చిన్న పిల్లల

మరణాల రేటు అధికంగా ఉండటానికి ప్రధాన కారణం, స్త్రీల నిరక్షరాస్యత అని వీరు స్పష్టం చేశారు స్త్రీ 18 సంవత్సరాల లోపల పెండ్లి చేసుకోవటం వలన, ఆ వయస్సు లోపల బిడ్డను కన్నపుడు, ఆ బిడ్డ మరణించే అవకాశాలు ఎక్కువగా ఉంటున్నట్లు వీరు సూచించారు స్త్రీ విద్యావంతు రాలయినపుడు, ఆలస్యంగా పెండ్లి చేసుకొంటుంది గనుక, పిల్లల మరణాలు తగ్గుతాయని వీరు నిర్ధారణ చేశారు తల్లి విద్యావంతురాలైనపుడు, బిడ్డ పోషణ, ఆరోగ్య రక్షణాది విషయాల యెడల శ్రద్ధను ప్రదర్శిస్తూ, సకాలంలో బిడ్డకు అవసరమైన రక్షణా చర్యలను తీసుకొంటుంది.

తల్లి విద్యావంతురాలైనపుడు కుటుంబ ఆదాయపు పెంపుకు ఆవిడ కృషి చేయ గలుగుతుంది. తాను సంపాదనాపరురాలు కనుక, ఖర్చుల విషయంలో పెద్దల అవసరాల కంటే, బిడ్డల అవసరాలకు ఆవిడ అధిక ప్రాధాన్యత నిస్తుంది. ఇందుకు తన వద్ద నున్న సొమ్మును స్వేచ్ఛగా వాడుతుంది ఆడపిల్లల సృజనాత్మక శక్తుల వికాసానికి అధిక శ్రద్ధను ప్రదర్శిస్తుంది. తల్లి చేతిలోని డబ్బు బిడ్డ ఆరోగ్యాన్ని ఎలా ప్రభావితం చేయగలదో బ్రెజిల్‌లో జరిగిన ఒక పరిశీలన చిత్రిస్తున్నది. తల్లి సంపాదనా ప్రభావం కుమారుల మీద కంటే కూతుళ్ళ మీద అధికంగా ఉంటున్నట్లు, తండ్రి సంపాదనా ప్రభావం, కూతుళ్ళ మీద కంటే, కుమారుల మీద అధికంగా ఉంటున్నట్లు ఈ పరిశోధన వెల్లడించింది. భారతదేశంలో ఇపుడు, మగపిల్లల మరణాల రేటు కంటే ఆడపిల్లల మరణాల రేటు అధికంగా ఉన్నది. లేబర్ మార్కెట్‌కు వెళ్ళే స్త్రీల సంఖ్యా పరిమాణం పెరుగుతున్న కొలదీ, ఆడపిల్లల మరణాల రేటు, మగ పిల్లల మరణాల రేటుతో సమానమైన స్థాయికి తగ్గగలదని కొన్ని పరిశీలనలు సూచిస్తున్నాయి.

తల్లిదండ్రుల చదువులు వారి బిడ్డలను ఎలా ప్రభావితం చేస్తున్నదీ తెలియజేసే పరిశోధనా పత్రాన్ని ప్రపంచ బ్యాంకు నిపుణులు డి. థామస్ ప్రచురించారు. బ్రెజిల్, ఘనా, అమెరికా దేశాలకు సంబంధించిన అంశాలు ఇందులో ఉన్నాయి. తల్లులు ఆర్జించిన విద్య వారి కూతుళ్ళ అభివృద్ధికి, తండ్రులు ఆర్జించిన విద్య వారి కుమారుల అభివృద్ధికి వినియోగపడుతున్నట్లు వీరు పేర్కొన్నారు. ఆరోగ్యము, పోషణ, వ్యక్తిగత సృజనాత్మక శక్తుల అభివృద్ధి అంశాల విషయంలో - ఈ మూడు దేశాలలోనూ - తల్లుల విద్యార్జనా ప్రభావం, మగపిల్లల మీద కంటే ఆడపిల్లల మీద అధికంగా కనుపిస్తున్నట్లు థామస్ నిరూపించారు పురుషుల విద్యార్జనా ప్రభావం ఆడపిల్లల మీద కంటే మగపిల్లల మీద అధికంగా కనుపించింది. ఒక్క బ్రెజిల్ దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో పురుషుల విద్యార్జన మగపిల్లల మీద గాని, ఆడ పిల్లల మీద గాని తన ప్రభావాన్ని చూపుతున్నట్లు కనుపించలేదు కాని స్త్రీ విద్యార్జన మాత్రం ఆడపిల్లల మీద కంటే మగ పిల్లల మీద అధిక ప్రభావం చూపటాన్ని థామస్ గమనించారు కుటుంబ ఖర్చుల విషయానికొచ్చేటప్పటికి, తల్లులు ఆడపిల్లలకు, తండ్రులు మగపిల్లలకూ ప్రాధాన్యత నీయటం కనుపించింది. ఘనాలో భర్తకంటే పెద్ద చదువులను చదివిన భార్య, కుమారుల అభివృద్ధి కంటే, కూతుళ్ళ అభివృద్ధికి అధిక ప్రాధాన్యత నీయటం కనుపించింది. అదనపు పనిచేసి సంపాదించిన సొమ్మును, స్త్రీ, కుమారుని ఆరోగ్య రక్షణ మీద కంటే కూతురు ఆరోగ్య రక్షణకు అధిక ప్రాధాన్యత నిస్తూ ఆ సొమ్మును ఖర్చు చేస్తున్నది. పలువురి పరిశోధనలు ఈ ధోరణిని బలపరుస్తున్నాయి.

తల్లి చదువు, పిల్లల చదువులను ఎలా ప్రభావితం చేయగలదో చూద్దాం ఈ అంశం మీద ఎన్నో పరిశోధనా పత్రాలు వెలువడ్డాయి. తల్లుల చదువు, పిల్లల చదువులను తీవ్రంగా ప్రభావితం చేయగలదని ఇవి నిరూపిస్తున్నాయి పిల్లల చదువులను అధికంగా ప్రభావితం చేయగలిగేది తల్లి చదువా, తండ్రి చదువా అన్న అంశం స్పష్టంగా తేలినట్లు కనుపించటంలేదు. మలేషియాలో, చైనా జాతి వారిలో, తండ్రి విద్య కంటే తల్లి విద్య, పిల్లల విద్యార్జనను అధికంగా ప్రభావితం చేస్తున్నట్లు ఒక పరిశోధన సూచిస్తున్నది. మలేషియాలో ఉంటున్న చైనా, ఫిలిపన్ జాతుల వారిలో, తలిదండ్రుల విద్య పిల్లలను (ఆడ-మగ) సమానంగా ప్రభావితం చేస్తున్నట్లు మరొక పరిశీలన వెల్లడించింది. పెరూ దేశంలో జరిగిన ఒక సర్వే వలన, తల్లి చదువు ఆడపిల్లల చదువులను, తండ్రి చదువు మగ పిల్లల చదువులను ప్రభావితం చేస్తున్నట్లు పేర్కొన్నది. ఆడపిల్లలు చదువుకోవటానికి, కుటుంబం లో తండ్రి ఉండటం అవసరమని కూడా ఈ సర్వే సూచించింది. పెరూలో

విద్యార్జనావకాశాలు విస్తరించటమేగాక, విద్యా బోధనలో నాణ్యత, సమర్థతలకు కూడా ప్రాధాన్యత లభిస్తూండటం వలన, పిల్లల విద్యార్జన మీద తలిదండ్రుల విద్యార్జనా ప్రభావం క్రమంగా తగ్గుతున్నట్లు ఈ సర్వేయర్లు అభిప్రాయపడ్డారు.

ఘనాలో ఇటీవల జరిగిన ఒక సర్వే ప్రకారం, తల్లి చదువు, స్త్రీ-పురుష భేదం లేకుండా ఆడ-మగ పిల్లలందరి మీదా సమానమైన ప్రభావాన్ని చూపుతున్నట్లు కనుపిస్తున్నది. పిల్లలను స్కూలులో చేర్పించటం, వారి చదువు నిరంతరాయంగా కొనసాగేటట్లు చూడటం, అనే అంశాల మీద, తల్లి చదువు, మగపిల్లల మీద కంటే ఆడపిల్లల మీద రెట్టింపు ప్రభావాన్ని చూపుతున్నట్లు ఈ సర్వే నిరూపించింది

సంతానాన్ని పరిమిత పరచుకొని కుటుంబాన్ని చిన్నదిగా ఉంచుకోవటంలో స్త్రీ విద్య కీలకపాత్రను నిర్వహిస్తున్నది ఈ విషయంలో పురుషుల విద్య ఇంతటి ప్రధాన పాత్రను నిర్వహించటం లేదు. ఈ అంశాన్ని గత పదేండ్ల కాలంలో జరిగిన సర్వేలు, పరిశీలనలు రుజువు చేస్తున్నాయి. ఇది "సామాన్యుడు" అర్థం చేసుకోలేనంతటి జటిలమైన సమస్య గాదు. బిడ్డను నవ మాసాలు మోసి కనవలసింది, పాలిచ్చి పెంచవలసింది తల్లి. ఇందుకు ఎంతశ్రమ, కాల వ్యవధి అవసరమో ఆవిడకు బాగా తెలుసు. వివిధ దేశాలలోని ఆచార, వ్యవహారాలలో ఎంతటి తేడాలున్నా, పిల్లను కనటం, పెంచటంలో పెద్దగా తేడాలుండవు. పిల్లల పెంపక భారాన్నంతటినీ తల్లి మోయవలసి ఉంటుంది. స్త్రీ విద్యా స్థాయి పెరిగిన కొలదీ ఆవిడ శ్రమ విలువ పెరుగుతూ ఉంటుంది. పిల్లలను కంటూ, పెంచుతూ కూర్చుంటే, విలువయిన ఉపాధి అవకాశాలు చేజారిపోతాయి; తాను కష్టపడి సాధించిన తన సృజనాత్మక శక్తుల అభివృద్ధి తన అభివృద్ధికి, తన కుటుంబపు అభివృద్ధికి వినియోగపడదు. పెరుగుతున్న కుటుంబ అవసరాలకు తగినట్లు, తమ ఆదాయం పెరుగదు. కనుక సంతాన భారాన్ని తగ్గించుకొని, కుటుంబ పోషణ, సంరక్షణలకు అధిక కాలాన్ని వినియోగించాలని ఆవిడ తాపత్రయ పడుతుంది. అందుచేత విద్యావంతురాలు ఆలస్యంగా పెండ్లి చేసుకొంటుంది. సౌలభ్యం తెలుసు గనుక, వీలయినంత తక్కువ సంతానాన్ని కనాలని నిర్ణయించుకొంటుంది మగవారి విషయం - వారు ఎంత చదివినా - ఇందుకు భిన్నంగా ఉంటుంది ఎంతమంది పిల్లలను కన్నా, చూసుకోవటానికి ఇల్లాలున్న దన్న ధీమాతో, ఎందరనయినా కనాలనే తాపత్రయ పడతారు వచ్చిన ప్రతి అవకాశాన్ని వినియోగించుకొని సంపాదనకు పరుగులు దీస్తారు. సంపాదన పెరుగుతున్న కొలదీ, సంతానం అధికం గావాలన్న కోరిక కూడా పుడుతుందట! కనుక కుటుంబ నియంత్రణకు విద్యావంతులైన స్త్రీలు చేయదగినది ఎంతో ఉన్నది. కీలక పాత్రను నిర్వహించవలసిన వారు వీరే

కుటుంబ నియంత్రణానికి, గర్భ నిరోధక మార్గాల అవలంబన అవసరం. బిడ్డకు ఎక్కువ కాలం చనుబాలివ్వటం వలన కాన్పుల మధ్య కాలవ్యవధి పెరుగుతుందని నిపుణులు చెబుతున్నారు పొందిన విద్యార్హతల వలన స్త్రీ, లేబర్ మార్కెట్లో ప్రవేశించటం అవసరం: వెళ్ళాలన్న ఉత్సాహం విద్యావంతురాలికి ఉండటం సహజం. కుటుంబ సంక్షేమం దృష్ట్యా కూడా వెళ్ళటం అవసరం. ఉద్యోగంలో చేరిన తరువాత పిల్లలకు ఎక్కువ కాలం చనుబాలిచ్చే అవకాశాలుండవు కుటుంబ నియంత్రణ విధానాలను పాటించకపోతే అధిక సంతానం గలిగే అవకాశాలుంటాయి. కనుక లేబర్ మార్కెట్‌కు వెళ్ళే స్త్రీలు కుటుంబ నియంత్రణ విధానాలను అనుసరించటం అవసరం. ఈ అంశాలను విద్యావంతురాలైన స్త్రీ సులభంగా గుర్తిస్తుంది.

కొన్ని దేశాలలో, స్త్రీ జనాభాలో అల్ప సంఖ్యాకులు మాత్రమే విద్యావంతులై ఉంటారు. దానికి తోడు దారిద్ర్యం కూడా సమాజంలో ఉంటుంది. ఇటువంటి పరిస్థితులలో స్త్రీలు అక్షరాస్యులు కాకపోవటం చేతగాని, తగినంత విద్యాస్థాయి వారికి అబ్బకపోవటం చేతగాని, వారు అధిక సంతానవతులయ్యే అవకాశాలుంటాయి. స్త్రీ విద్య విస్తరించిన కొలదీ ఈ పరిస్థితి మారిపోతూ ఉంటుంది. విద్యతో, పిల్లలను ఆరోగ్యవంతులుగా పెంచే విజ్ఞత, ఆసక్తి తల్లికి కలుగుతుంది. ఇందువలన పిల్లల మరణాలు తగ్గుతాయి. కన్న వారిలో ఎందరు జీవించగలరో నన్న అనుమానంతో అధిక సంతానాన్ని కనాలన్న తాపత్రయం తల్లికి ఉండవలసిన అవసరం లేదు. ఈ విధంగా స్త్రీ విద్య చిన్న కుటుంబాలకు దారిదీస్తుంది.

ఆఫ్రికా ఖండానికి సంబంధించినంత వరకూ,

విద్యావ్యాప్తి ద్వారా కుటుంబ నియంత్రణ సాధ్యపడదని కొందరు నిపుణులు అభిప్రాయపడుతూ ఉండేవారు. ఈ ప్రాంతంలో చదువుకొన్నవారు కూడా అధిక సంతానాన్ని కోరేవారు. కాని ఇటీవల పరిస్థితులు మారాయి. స్త్రీ విద్యా విస్తరణ, వేగాన్ని పుంజుకొంటున్నది. దీనితో పాటు కుటుంబ నియంత్రణ సర్వీసులు కూడా విస్తరిస్తున్నాయి. దీనితో, స్త్రీ విద్యావ్యాప్తి వలన ఇతర దేశాలలో కనుపించే సత్ఫలితాలు ఇచ్చట కూడా కనుపించనారంభించాయి. ఇందుకు కీన్యా అనుభవాన్ని ఉదహరించ వచ్చు. ప్రపంచ బ్యాంకు ఈ విషయం మీద రెండు రిపోర్టులను ప్రచురించింది. ఇవి ఇచ్చట సంభవించిన పరిణామాలను వివరిస్తున్నాయి. ఈ దేశంలో స్త్రీ విద్యావ్యాప్తి, కుటుంబ నియంత్రణ సర్వీసుల విస్తరణ పరస్పర అనుబంధాస్త్రాలుగా పురోగమించాయి. స్త్రీ విద్య విస్తరిస్తున్న కొలదీ కుటుంబ నియంత్రణ సర్వీసుల విస్తరణను స్త్రీలు కోరనారంభించారు! ఈ పరిణామం వలన జనాభా పెరుగుదల గణనీయంగా తగ్గింది.

కుటుంబ నియంత్రణా కృషీ ఫలితాల మీద పలు సర్వే రిపోర్టులు వెలువడ్డాయి. వీటిని పరిశీలించి నపుడు స్త్రీ విద్య విస్తరించిన కొలదీ, స్త్రీ కనే సంతానపు సంఖ్య తగ్గుతూ ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఇందుకు ఉదాహరణగా మనం బ్రెజిల్‌దేశపు అనుభవాలను చూడవచ్చు. చదువు రాని స్త్రీలు, ఒక్కొక్కరూ సగటున 6.5 మంది పిల్లలను కంటూండగా, సెకండరీ స్థాయి వరకూ చదువుకొన్న స్త్రీలు సగటున 2.5 మందిని మాత్రమే కంటున్నారు. లైబీరియాలో చదువురాని స్త్రీల కంటే చదువు కొన్న మహిళలు, కుటుంబ నియంత్రణా విధానాలను పది రెట్లు అధికంగా పాటిస్తున్నారు. మన దేశంలో కూడా ఇదే ధోరణి ప్రదర్శిత మవుతున్నది. ప్రైమరీ విద్య కంటే, సెకండరీ విద్య కుటుంబ నియంత్రణానుసరణ మీద అధిక ప్రభావాన్ని చూపుతున్నట్లు పరిశీలనా ఫలితాలు తెలియజేస్తున్నాయి.

విద్య, వ్యక్తుల సృజనాత్మక శక్తుల అభివృద్ధికి, వాటి విడుదలకు తోడ్పడుతుంది. విద్య వలన స్త్రీ యొక్క సంపదోత్పత్తి శక్తి పెరుగుతుంది; తద్వారా ఆవిడ సంపాదన పెరుగుతుంది. సబ్-సహారన్ ఆఫ్రికాలోని రైతులలో చదువుకొన్న మహిళా రైతుల ఉత్పత్తి సామర్థ్యం, పురుషుల ఉత్పత్తి సామర్థ్యం కంటే ఎక్కువగా ఉన్నది. చదువుకోవటం వలన అధిక వేతనాలు లభించే ఉపాధి అవకాశాలు లభిస్తాయి. చదువుకొన్న స్త్రీ కుటుంబ సంక్షేమానికి అధికంగా

రెండవ పట్టిక

ప్రభుత్వము, వ్యక్తులు విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడికి గిడుతున్న లాభశాతాలు

| ప్రాంతం | ప్రభుత్వం పెట్టిన పెట్టుబడి మీద సమాజానికి గిడుతున్న లాభశాతం | | | వ్యక్తి పెడుతున్న ఖర్చు మీద ఆ వ్యక్తికి గిడుతున్న లాభ శాతం | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రైమరీ విద్య | సెకండరీ విద్య | ఉన్నత విద్య | ప్రైమరీ విద్య | సెకండరీ విద్య | ఉన్నత విద్య |
| ఆఫ్రికా | 27(12) | 19(12) | 45(12) | 45(9) | 28(9) | 33(9) |
| ఆసియా | 18(9) | 14(11) | 12(11) | 34(5) | 15(8) | 18(8) |
| లాటిన్ అమెరికా | 35(8) | 19(8) | 16(8) | 61(5) | 28(5) | 26(5) |
| అభివృద్ధి చెందిన దేశాలు | 13(6) | 10(5) | 8(15) | 19(7) | 12(14) | 11(15) |

గమనిక : (1) బ్రాకెట్లలోని అంకెలు ఆయా సర్వేలు జరిగిన దేశాల సంఖ్యను సూచిస్తున్నాయి

(2) అభివృద్ధి చెందిన దేశాలు : యూరపు, అమెరికా, న్యూజిలెండ్, ఇజ్రాయెల్ దేశాలు ఈ వర్గీకరణలో ఉన్నాయి.

(3) ప్రభుత్వం పెట్టిన ఖర్చు బాలబాలికలకు ఒకే పరిమాణంలో ఉన్నపుడు లభించే ప్రతిఫల పరిమాణం కూడా సమంగానే ఉండవచ్చునని షూల్జ్ సూచించారు.

– టి.పి షూల్జ్ వ్రాసిన "రిటరన్స్ టు ఉమెన్స్ ఎడ్యుకేషన్" నుండి

పాటుబడుతుంది. చదువుకొన్న మహిళలున్న కుటుంబాలలో పిల్లల మరణాలు తక్కువగా ఉంటాయి. ఇంట్లో ఆరోగ్యకరమైన పరిస్థితులు నెలకొంటాయి. శిశుపోషణ చక్కగా ఉంటుంది. అందుబాటులోని వైద్య చికిత్సా సదుపాయాలను వాడుకోగల శక్తి సామర్థ్యాలు మహిళలకుంటాయి. కుటుంబంలో పురుషునితో సమానమైన పాత్రను నిర్వహిస్తూ, కుటుంబీకుల అభివృద్ధికి పాటుబడగల శక్తిని విద్య, స్త్రీలకిస్తుంది. తన ఆరోగ్యాన్ని గురించి తగిన శ్రద్ధ తీసుకొంటుంది. తల్లి చదువుకొన్నదైనపుడు, తన పిల్లల చదువుకు - ముఖ్యంగా ఆడపిల్లల చదువుకు తాపత్రయ పడుతుంది. చదువుకొన్న తల్లి కన్న బిడ్డలు విద్యార్జనలో చురుకుగా ఉంటారు. మంచి గ్రేడ్స్‌ను సాధించ గలుగుతారు. చదువుకొన్న భర్త కంటే, వారి భార్య చదువుకొన్నదైనపుడు, ఆవిడ మూడురెట్ల పటుతరంగా కుటుంబ నియంత్రణ విధానాలను పాటించగలదని ఒక సర్వే ఫలితాలు సూచించాయి. చదువుకొని ఉపాధిలో ప్రవేశించటం వలన స్త్రీకి వ్యక్తిత్వం వస్తుంది, బయట తిరిగి లోకం పోకడను చూస్తుండటం వలన, ఆవిడ వ్యవహార జ్ఞానం పెరుగుతుంది; ఆత్మ విశ్వాసం బలపడుతుంది. తన హక్కులకు, శ్రేయస్సుకు ప్రమాద మేర్పడినపుడు, తల ఒగ్గకుండా, ఆత్మరక్షణకు పెనుగులాడుతుంది. ఈ విధంగా స్త్రీ విద్య కుటుంబానికే గాకుండా లోక కల్యాణానికి కూడా ఉపకరిస్తుంది.

ఈ అంశ నిరూపణకు ప్రపంచ బ్యాంకు నిపుణులు టి.పి. షూల్జ్, కొన్ని దేశాలలో జరిగిన సర్వేల ఫలితాలను సేకరించి ప్రకటించారు. పిల్లల, పెద్దల చదువులకు ప్రభుత్వం ఖర్చు చేసే నిధులు, వ్యక్తులు ఖర్చు చేసే వాటి కంటే చాలా అధికంగా ఉండటం అందరకూ తెలిసిన అంశమే. పిల్లల ఖర్చును తలితండ్రులు భరిస్తారు. వ్యక్తుల విద్యార్జన వలన సమాజానికి చేకూరుతున్న లాభమెంత, ఆ వ్యక్తులకు లభిస్తున్న ప్రతిఫలమెంత అన్న విషయాన్ని రెండవ పట్టికలో చూడవచ్చు.

ఈ సర్వే ఫలితాలు పాక్షిక లాభాలను మాత్రమే సూచిస్తున్నట్లు షూల్జ్ సూచించారు. పూర్తి లాభాలను సర్వేలు ప్రతిబింబించాలంటే, వ్యక్తులకు లభిస్తున్న వేతనాలను, వారు ప్రభుత్వానికి చెల్లిస్తున్న పన్నులను కూడా పరిగణనకు తీసుకొనవలసి ఉంటుందని షూల్జ్ అభిప్రాయపడ్డారు. ఇంతకు పూర్వమే వివరించినట్లు, స్త్రీ పురుషుల వేతనాల మధ్య వ్యత్యాసా లున్నాయి. ఉపాధి లభించక పోవటం చేత కొందరు స్త్రీలు ఇంట్లో ఉండవలసి వస్తున్నది. తగిన విద్యార్హతలున్నా, కొందరు మహిళలు తక్కువ వేతనాలు లభించే ఉద్యోగాలకు వెళ్ళక తప్పటం లేదు. చదువుకొని ఉండీ కూడా కొందరు ఇంటి పనులు చూసుకొంటూ, ఉద్యోగాలకు వెళ్ళటం లేదు. మార్కెట్‌పరమైన అసమానతల వలన కొందరు స్త్రీల ఆదాయాలలో కొంత భాగం లెక్కకు రావటం లేదు. లెక్కకు వస్తున్న సందర్భంలో, వేతన వ్యత్యాసాల వలన స్త్రీల ఆదాయం, పురుషుల ఆదాయం కంటే తక్కువగా ఉన్నట్లు కనుపిస్తున్నది. ఇందువలన స్త్రీల ఆర్థికాదాయం, ప్రభుత్వానికి వీరు చెల్లించుతూండే పన్నులు కూడా పురుషుల సంపాదన కంటేనూ, వారు చెల్లించే పన్నుల కంటేనూ తక్కువగా ఉన్నట్లు కనుపిస్తున్నాయి.

స్త్రీల, కొన్ని రకాల సేవలకు విలువ గట్టటం అసాధ్యం. తల్లి పిల్లలను ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దటానికి పాటుబడుతుంది. వారి పోషణకూ, ఆరోగ్య రక్షణకూ, వారి విద్యార్జనకూ ఎంతగానో పని చేస్తుంది. కుటుంబీకుల పోషణ, ఆరోగ్య రక్షణ, అనారోగ్యంతో బాధపడే కుటుంబీకుల సేవలు - ఇవన్నీ ఆర్థికార్జన రీత్యా విలువలేని అంశాలే. కాని స్త్రీలు చేస్తున్న సేవల వల్ల వారి కుటుంబమే గాక, సమాజం కూడా ఎంతగానో లాభిస్తున్నది. స్త్రీ విద్యార్జన వలన లభిస్తున్న లాభాలను అంచనా వేయటంలో ఇంతటి ముఖ్యాంశాలను వదలివేయటం వలన కూడా, మగపిల్లల విద్యార్జన వలన కంటే, ఆడపిల్లల విద్యార్జన వలన కుటుంబానికి, సమాజానికి లభించే లాభాల పరిమాణం తక్కువగా ఉన్నట్లు కనుపించటం సహజం. ఆచరణలో చూస్తే, మగవారి చదువు వలన కంటే, మహిళల చదువు వల్లనే సమాజానికి అధిక ప్రతిఫలం లభిస్తున్నది. ఇందులో ఏ మాత్రమూ సందేహానికి తావులేదు. ఈ విషయ విస్మరణ వల్లనే ప్రభుత్వాలు కూడా స్త్రీ విద్యా వ్యాప్తికి తగినంత అధిక నిధులను ఖర్చు చేయటానికి పూనుకోవటం లేదు.

## నిరాదరణకు గురవుతున్న స్త్రీ విద్య

జీవితంలోనూ, కుటుంబ జీవనంలోనూ, సామాజిక జీవనంలోనూ ఇంతటి ఉన్నత పాత్రను నిర్వహిస్తున్న స్త్రీ

విద్యకు వర్తమాన సమాజంలో లభిస్తున్న ఆదరణెంత? ఎందరు ఆడపిల్లలు విద్యాలయాలకు వెళుతున్నారు? వెళ్ళిన వారిలో ఎందరు అక్షరాస్యత నైనా సాధిస్తున్నారు? ఈ విషయాల నిపుడు పరిశీలించుదాం

ఈ శతాబ్దపు అరవయ్యవ దశాబ్దం నుండి, ప్రజల సంపూర్ణ అక్షరాస్యతా సాధనకు పేద దేశాలు ప్రత్యేకంగా కృషి చేయ నారంభించాయని చెప్పవచ్చు. కాని, సాధించినది, ఆశించిన దానిలో అర్ధభాగం కూడా లేదు 1987వ సంవత్సరం నాటికి లాటిన్ అమెరికా దేశాలు, తూర్పు ఆసియా ప్రాంత దేశాలు మాత్రమే బడికి వెళ్ళే వయసున్న ఆడ, మగ పిల్లల నందరనూ స్కూలుకు పంపగలిగాయి. సబ్-సహారన్ ఆఫ్రికా, దక్షిణ ఆసియా దేశాలలో, ప్రాథమిక విద్యాలయాలకు వెళుతున్న బాలబాలికల సంఖ్యా పరిమాణాలలో విపరీతమైన వ్యత్యాసాలు కనుపిస్తున్నాయి. ఈ ప్రాంత దేశాలలో ప్రాథమిక విద్యాలయాలకు వెళుతున్న మగపిల్లలలో, నాల్గింట మూడు వంతుల మంది ఆడ పిల్లలు మాత్రమే, ప్రాథమిక విద్యాలయాలకు వెళుతున్నారు. స్కూలుకు వెళ్ళే వయసున్న మొత్తం ఆడపిల్లలలో ఐదింట మూడువంతుల మంది మాత్రమే స్కూలుకు వెళుతున్నారు. ఉత్తర ఆఫ్రికా, మధ్యప్రాచ్య దేశాలలో 1965లో కంటే 1987 వ సంవత్సరంలో బడికి వెళ్ళే మొత్తం విద్యార్థుల సంఖ్య అధికంగానే ఉన్నది. కాని, బడికి వెళుతున్న బాల బాలికల సంఖ్యా పరిమాణపు రీత్యా చూసినపుడు, ఈ ప్రాంతంలో బాలురకంటే బాలికల సంఖ్య తక్కువగా ఉన్నట్లు కనుపిస్తుంది.

సెకండరీ విద్యాస్థాయిలో బడికి వెళ్ళే ఆడపిల్లల సంఖ్య కొంచెం మెరుగుగా ఉన్నట్లు కనుపిస్తుంది. ఈ స్థాయి స్కూళ్ళకు వెళ్ళే పిల్లల సంఖ్య కూడా త్వరిత గతిని పెరిగింది. లాటిన్ అమెరికా, తూర్పు ఆసియా దేశాలలోని, సెకండరీ స్థాయి విద్యార్జనకు వెళ్ళగల వయసున్న బాలురలోనూ, బాలికలలోనూ కూడా, సగం మంది వరకూ, ఆస్థాయి స్కూళ్ళలో చేరి చదువు తున్నారు. మధ్యప్రాచ్యంలోనూ, ఉత్తర ఆఫ్రికాలోనూ, పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నట్లు కనుపిస్తుంది. సెకండరీ స్కూలుకు వెళ్ళగల వయసున్న బాలురలో ఐదింట మూడు వంతుల మంది, బాలికలలో ఐదింట రెండు వంతుల మంది మాత్రమే ఈ స్థాయి విద్యాలయాలలో చేరి చదువుతున్నారు. 1965వ సంవత్సరం తరువాత ఆఫ్రికాలో బడిలో చేరి చదువుతున్న విద్యార్థినుల సంఖ్య దాదాపు రెట్టింపైంది. సెకండరీ స్కూలుకు వెళ్ళే వయస్సున్న బాలురలో నూరింట 22 మంది, బాలికలలో 15 మంది మాత్రమే సెకండరీ స్కూళ్ళలో చదువుతున్నారు. దక్షిణ ఆసియాలో (మనదేశం ఈ మండలంలో ఉన్నది) ఈ స్థాయి విద్యార్జనకు వెళ్ళే వయస్సు గల బాలురలో మూడింట ఒక్క వంతుమంది, బాలికలలో ఐదింట ఒక్క వంతు మంది మాత్రమే ఈ స్థాయి స్కూళ్ళలో చదువుతున్నారు (దీనిని మరొక విధంగా చెప్పవచ్చు సెకండరీ స్కూళ్ళకు బాలురలో నూరింట 33 మంది వెళుతుండగా, బాలికలలో 20 మంది మాత్రమే వెళుతున్నారు).

దక్షిణ ఆసియా, ఆఫ్రికా ప్రాంతాలలో ప్రైమరీ స్కూలులో చేరిన బాలికల సంఖ్య కంటే, సెకండరీ స్కూలులో చేరుతున్న విద్యార్థినుల సంఖ్య చాలా తక్కువగా ఉంటున్నది. కొందరు ప్రాథమిక విద్యాస్థాయిలో ఉత్తీర్ణులు గాకపోవటం చేత చేరలేదని, మరికొందరు చదువును ప్రాథమిక స్థాయిలోనే పూర్తి చేయకుండా, చదువు మానేశారని, నిపుణులు ఈ తరుగుదలకు కారణాలుగా నిర్ధారణ చేశారు. ఈ పరిణామం అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలలోనూ కనుపిస్తున్నది. వెనుకబడిన దేశాలలో ప్రైమరీ స్కూలులో చేరిన వారిలో నూరింట ఒక్క వంతు మంది మాత్రమే ఈ దశను పూర్తి చేస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు విడుదల చేసిన పలు పరిశోధనా ఫలితాలు వివరిస్తున్నాయి. (తలసరి జాతీయాదాయం 450 డాలర్లు - అంతకు మించని దేశాలను అల్పాదాయ లేక వెనుకబడిన లేక పేద దేశాలుగా వ్యవహరిస్తున్నారు). అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, వెనుకబడిన దేశాలలోనూ సంపూర్ణ అక్షరాస్యతా స్థితి లభించక ముందే చదువును మానేస్తున్న విద్యార్థులలో బాలుర కంటే బాలికలే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. అల్పాదాయ దేశాలలో పేదరికం వలన విద్యార్థులు చదువును మధ్యలోనే మానేస్తున్నారు. ఈ వర్గపు దేశాలలో స్కూళ్ళలో చేరి చదువుతున్న బాలికలలో 9.6 శాతం మంది, బాలురలో 8.2 శాతం మంది చదువును మధ్యలోనే మానేస్తున్నట్లు లభిస్తున్న సంఖ్యా సమాచారం తెలియజేస్తున్నది. తలసరి జాతీయాదాయం మధ్యస్థంగా ఉన్న దేశాలలో,

బాలికలలో 6 1 శాతం మంది, బాలురలో 5 9 శాతం మంది చదువు పూర్తి గాకుండానే బడికి పోవటం మానేస్తున్నారు ఆఫ్రికాలో బాలికలలో 8.6 శాతం మంది, బాలురలో 7 3 శాతం మంది చదువును మధ్యలోనే మానుతున్నారు బాలికలు చదువును మధ్యలోనే ఆపటం అనేది ఉత్తర ఆఫ్రికాలోనూ, మధ్య ప్రాచ్యంలో కూడా కనుపిస్తుంది ఈ మండలాలలో బాలికలలో ఆరు శాతం మంది, బాలురలో 4 3 శాతం మంది చదువును మధ్యలోనే మానుతున్నారు. లాటిన్

## మూడవ పట్టిక
## ప్రపంచ జనాభాలో నిరక్షరాస్యుల సంఖ్యా పరిమాణాలు

| ప్రాంతం | నిరక్షరాస్యుల సంఖ్య (కోట్లలో) | | | | 15 సం॥రాల వయస్సుకు పైబడిన వారిలో నిరక్షరాస్యుల శాతం | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1970 | 1980 | 1990 | 2000 అంచనాలు | 1970 | | 1990 | | 2000 (అంచనాలు) | |
| | | | | | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | 84 23 | 90 72 | 91 66 | 91 97 | 42 2 | 67 4 | 25 1 | 45 0 | 19 7 | 36 8 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 11 50 | 13 30 | 13 88 | 14 68 | 67 5 | 86 8 | 41 0 | 63 9 | 29 8 | 50.4 |
| అరబ్బు దేశాలు | 4 97 | 5 86 | 6 11 | 7 35 | 60 5 | 86 3 | 35 7 | 62 0 | 26 9 | 49 4 |
| లాటిన్ అమెరికా -కరిబియన్ | 4 30 | 4 46 | 4 39 | 4 17 | 22 5 | 29 9 | 13 6 | 17 0 | 10 3 | 12 7 |
| తూర్పు ఆసియా | 32 41 | 29 53 | 27 88 | 23 65 | 32 7 | 61 3 | 14 3 | 33 6 | 10.0 | 24 6 |
| దక్షిణ ఆసియా | 30.23 | 37 48 | 39.81 | 43 71 | 55 2 | 83 1 | 40 9 | 67 8 | 33 8 | 58 8 |
| వెనుకబడిన దేశాలు | 10 48 | 13 84 | 14 82 | 17 01 | 68 1 | 87 0 | 48 6 | 71 1 | 39 2 | 62 7 |
| అభివృద్ధి చెందిన దేశాలు | 4 78 | 4 23 | 3 15 | 1 57 | 5 0 | 7 3 | 2.6 | 3 9 | 1 0 | 2 0 |
| ప్రపంచం | 89 01 | 94 95 | 94 81 | 93 94 | 30 4 | 46 5 | 19 4 | 33 6 | 15 4 | 28 7 |

*ఐక్యరాజ్యసమితి ప్రచురణ - "వరల్డ్ సోషల్ సిట్యుయేషన్ ఇన్ ది నైంటీన్ నైంటీస్" నుండి*

## నాల్గవ పట్టిక
## 15-24 సం॥, 25-44 సంవత్సరాల మధ్య వయస్కులలోనూ, 15 సం॥ వయస్సును మించిన జనాభాలోని నిరక్షరాస్యుల సంఖ్యా పరిమాణాలు (శాతాలు)

| ప్రాంతం | 15-24 సంవత్సరాల మధ్య వయస్కులలో నిరక్షరాస్యుల శాతం | | | | 25-44 సంవత్సరాల మధ్య వయస్కులలో నిరక్షరాస్యుల శాతం | | | | 15 సంవత్సరాలకు మించిన వయసున్న వారిలో నిరక్షరాస్యుల శాతం | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1980 | | 1990 | | 1980 | | 1990 | | 1980 | | 1990 | |
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| ఆఫ్రికా | 35.8 | 55 7 | 35 6 | 51 0 | 50 7 | 74.4 | 35 3 | 58 3 | 51.8 | 71.8 | 44 6 | 61 6 |
| ఆసియా, పసిఫిక్ | 19 7 | 32.6 | 10 3 | 17 0 | 26.7 | 44 7 | 20 2 | 35 8 | 31 8 | 49.3 | 21 7 | 34 3 |
| తూర్పుయూరపు | 0 5 | 0.9 | - | - | 0.7 | 2 4 | - | - | 1 5 | 4 9 | 0 9 | 2 3 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 9 0 | 10 3 | 7.5 | 6 9 | 14 1 | 19 4 | 5 3 | 7.3 | 18.2 | 23 3 | 14 3 | 16.0 |
| పశ్చిమ యూరపు -ఇతర అభివృద్ధి చెందిన దేశాలు | 1 0 | 1 0 | 2.6 | 1 2 | 2.5 | 4 7 | 5 5 | 3 7 | 5 7 | 11.4 | 8.7 | 9.9 |

ఐక్యరాజ్య సమితి ప్రచురణ - "వరల్డ్ సోషల్ సిట్యుయేషన్ ఇన్ ది నైంటీన్ నైంటీస్" నుండి

ఐదవ పట్టిక
భారత దేశంలో ప్రాథమిక స్థాయి విద్యావివరాలు

| వివరము | భారతదేశం | ఆంధ్రప్రదేశ్ | కేరళ |
|---|---|---|---|
| 1. కొన్ని నిర్ణీత గ్రూపుల వారిలో 7 సం॥లకు పైబడిన వయస్కులలో అక్షరాస్యత శాతం (1991) | | | |
| స్త్రీలు | 39 | 25 | 86 |
| పురుషులు | 64 | 56 | 94 |
| 2. గ్రామీణ ప్రాంతాలలోని షెడ్యూల్డు కులాలవారిలో అక్షరాస్యులు | | | |
| స్త్రీలు | 19 | 8 | 73 |
| పురుషులు | 46 | 39 | 85 |
| 3. 10-14 సం॥ల మధ్య వయస్కులలో అక్షరాస్యుల శాతం (1987-88) | | | |
| గ్రామీణప్రాంతాలలో - స్త్రీలు | 52 | 39 | 98 |
| గ్రామీణ ప్రాంతాలలో - పురుషులు | 73 | 68 | 98 |
| పట్టణ ప్రాంతాలలో - స్త్రీలు | 82 | 69 | 98 |
| పట్టణ ప్రాంతాలలో - పురుషులు | 88 | 76 | 97 |
| 4. 1987-88లో బడికి వెళుతున్న పిల్లల శాతాలు | | | |
| 5-9 సం॥ వయసు వారిలో స్త్రీలు | 40 | 28 | 83 |
| పురుషులు | 52 | 45 | 87 |
| 10-14 సం॥ వయస్సు వారిలో - స్త్రీలు | 42 | 31 | 91 |
| పురుషులు | 66 | 64 | 93 |
| 12-14 సం॥రాల మధ్య వయస్కులలో బడిలో చేరనివారు (1986-87) (శాతం) | | | |
| గ్రామీణ ప్రాంతాలలో - స్త్రీలు | 51 | 68 | 18 |
| - పురుషులు | 26 | 27 | 0.4 |
| పట్టణ ప్రాంతాలలో - స్త్రీలు | 19 | 39 | 0.6 |
| - పురుషులు | 11 | 19 | 0.0 |
| 5. పదిహేను సంవత్సరాలకు పైబడిన వయస్సు గల వారిలో ప్రాథమిక విద్యను పూర్తి చేసిన వారి శాతం (1981) | | | |
| స్త్రీలు | 21 | 11 | 56 |
| పురుషులు | 44 | 37 | 68 |

*- డ్రేజ్, సేన్‌లు వ్రాసిన "ఇండియా : ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ ఆపర్చ్యూనిటీ" నుండి*

అమెరికాలో మాత్రం పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నది. ప్రాథమిక విద్యాస్థాయిలో మధ్యలోనే చదువును మానే వారిలో బాలికల కంటే బాలురే అధికంగా ఉంటున్నారు. బడిలో చేరి చదువుతున్న బాలికలలో 7 8 శాతం మంది మధ్యలోనే చదువును మానగా, బాలురలో 8.8 శాతం మంది ఇలా చేస్తున్నారు.

మండలాల ప్రాతిపదిక మీద పరిస్థితి ఇలా ఉంది. ఆయా మండలాలలోని దేశాల పరిస్థితిని పరిశీలించినపుడు మరికొన్ని ఆసక్తిదాయకమైన అంశాలు కనుపిస్తాయి. మాలావిలో ప్రైమరీ స్కూలులో చేరిన విద్యార్థినులలో 26.9 శాతం మంది మాత్రమే ఈ స్థాయి విద్యను పూర్తి చేస్తున్నారు; బాలురలో 45.9 శాతం మంది ఈ స్థాయి విద్యను పూర్తి

### ఆరవ పట్టిక
### భారత దేశంలో అక్షరాస్యతా పరిమాణాలు

| రాష్ట్రం | 7 సం॥ వయసుకు మించిన వారిలో అక్షరాస్యుల శాతాలు (1991) | | 10-14 సంవత్సరాల మధ్య వయస్సు వారిలో అక్షరాస్యుల శాతం (1987-88) | | | | 6 సం॥లకు పైబడిన వారిలో ప్రైమరీ విద్యను పూర్తి చేసిన వారి శాతం (1992-93) | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | గ్రామీణ ప్రాంతాలలో | | పట్టణ ప్రాంతాలలో | | | |
| | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు |
| ఆంధ్రప్రదేశ్ | 32 7 | 55 1 | 42 3 | 65.7 | 80.0 | 87 7 | 26 4 | 45 3 |
| అస్సాం | 43 0 | 61 9 | 78 1 | 82.5 | 86 8 | 92 9 | 28 5 | 41 2 |
| బీహారు | 22.9 | 52.5 | 34 1 | 59 5 | 71.0 | 80 5 | 17.4 | 42.9 |
| గుజరాత్ | 48.6 | 73.1 | 60 9 | 78 2 | 83.3 | 87.5 | 33.5 | 53.6 |
| హర్యానా | 40.5 | 69.1 | 63 5 | 87 3 | 88.6 | 93 4 | 30.9 | 53.5 |
| హిమాచల్ ప్రదేశ్ | 52 1 | 75.4 | 80 7 | 95 1 | 97.2 | 96.0 | 39.2 | 56.8 |
| జమ్ము-కాశ్మీర్ | - | - | 49.7 | 78 7 | 79.5 | 83.6 | 37.7 | 56.3 |
| కర్ణాటక | 44.3 | 67.3 | 55.8 | 74.2 | 85 9 | 86 8 | 30 4 | 46.8 |
| కేరళ | 86.2 | 93.6 | 98.2 | 98 1 | 97.8 | 97.3 | 60.5 | 65 8 |
| మధ్యప్రదేశ్ | 28 9 | 58.4 | 40 0 | 67.8 | 85.5 | 92.3 | 21.0 | 44.6 |
| మహారాష్ట్ర | 52.3 | 76 6 | 68.2 | 86.3 | 90.7 | 94.7 | 35 9 | 55.1 |
| ఒరిస్సా | 34 7 | 63.1 | 51 4 | 70 0 | 79.4 | 89 6 | 23 0 | 42.8 |
| పంజాబు | 50.4 | 65 7 | 68.8 | 76.5 | 87.3 | 89 5 | 41.0 | 51.6 |
| రాజస్థాన్ | 20.4 | 55 0 | 22.2 | 71.6 | 62 5 | 89.1 | 15 6 | 41.8 |
| తమిళనాడు | 51.3 | 73.8 | 70.8 | 85 1 | 85 6 | 91.7 | 40.1 | 58.7 |
| ఉత్తరప్రదేశ్ | 25.3 | 55 7 | 39.0 | 68.0 | 68.8 | 76 0 | 21.4 | 47.3 |
| పశ్చిమబెంగాల్ | 46.6 | 67.8 | 60.7 | 69.0 | 82.2 | 87.4 | 29.2 | 47.4 |
| భారతదేశం | 39.3 | 64.1 | 51.7 | 72.9 | 81.6 | 87.9 | 28.1 | 48.6 |

*- జీన్ డ్రేజ్, అమార్త్యసేన్ల "ఇండియా ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ ఆపర్చ్యునిటీ" నుండి*

చేస్తున్నారు కీన్యాలో ప్రైమరీ స్కూలులో చేరిన వారిలో సగాని కంటే తక్కువ మందే ఈ దశను పూర్తి చేస్తున్నారు. బాలురలో 41 శాతం మంది ఈ దశ విద్యను పూర్తి చేస్తుండగా బాలికలలో 34 శాతం మంది మాత్రమే పూర్తి చేస్తున్నారు. బంగ్లాదేశ్‌లో ఒకటవ తరగతిలో చేరిన విద్యార్థులలో ఐదు శాతం మంది మాత్రమే పన్నెండవ తరగతిని చేరగలుగుతున్నారు. ఈ దేశంలో, చదువును మధ్యలోనే ఆపేవారిలో బాలురకంటే బాలికలే అధికంగా ఉన్నారు.

ఆడపిల్లల వయః పరిమాణాన్ని బట్టి స్కూలు మానేవారి సంఖ్యా పరిమాణం ఆధారపడి ఉన్నట్లు కనుపిస్తున్నది. ప్రైమరీ విద్యా స్థాయిలో, చదువును పూర్తి చేయకుండానే ఎక్కువ మంది మధ్యలోనే మానేస్తున్నారు. సెకండరీ స్థాయిలో చదువును మానుతున్న విద్యార్థినుల సంఖ్య ఇంతకంటే అధికంగా ఉన్నది. ఇటీవల జాంబియాలో జరిగిన సర్వే ఈ ధోరణిని చిత్రిస్తున్నది. చదువుతున్న ఆడపిల్లలలో చాలామంది ఐదవ తరగతితోనే చదువును మానుతున్నారు. వారిలో నాల్గింట మూడు వంతుల మంది పెండ్లి కావటం చేతనో, చూలు రావటం వల్లో మానుతున్నారు.

బడిలో చేరిన వారిలో చాలామంది ఇలా మధ్యలోనే మానేస్తూండటం వల్లనే స్కూల్లో చేరే విద్యార్థుల సంఖ్య పెరిగినా, నిరక్షరాస్యుల సంఖ్య మాత్రం తరగటం లేదు; పైగా పెరుగుతున్నది. కొన్ని దేశాలు విడుదల చేసిన

### ఏడవ పట్టిక
### భారత దేశంలో బడికి వెళుతున్న, బడికి వెళ్ళని పిల్లల వివరాలు

| రాష్ట్రం | గ్రామీణ ప్రాంతాలలో స్కూళ్ళకు వెళుతున్న పిల్లల శాతాలు (1987-1988) | | | | 12-14 సం॥రాల మధ్య వయస్కులలో బడిలో చేరి చదువని వారి శాతాలు (1986-87) | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 5-9సం॥మధ్యవయస్కులలో | | 10-14సం॥మధ్యవయస్కులలో | | గ్రామీణ ప్రాంతాలలో | | పట్టణ ప్రాంతాలలో | |
| | ఆడపిల్లలు | మగపిల్లలు | ఆడపిల్లలు | మగపిల్లలు | ఆడపిల్లలు | మగపిల్లలు | ఆడపిల్లలు | మగపిల్లలు |
| ఆంధ్రప్రదేశ్ | 45.2 | 63.3 | 30.9 | 57.0 | 59 7 | 59.7 | 18.9 | 9.4 |
| అస్సాం | 47.8 | 48.6 | 70.9 | 76.1 | 28.5 | 22.9 | 18.0 | 5.1 |
| బీహారు | 19 7 | 33.0 | 28.7 | 54.6 | 67.3 | 41.9 | 38.0 | 19 5 |
| గుజరాత్ | 52.1 | 63.1 | 52.2 | 76.5 | 38.7 | 22.5 | 17.7 | 10 2 |
| హర్యానా | 53.8 | 60 2 | 51.6 | 81.8 | 42.4 | 12.9 | 14.6 | 6 2 |
| హిమాచల్ ప్రదేశ్ | 63.3 | 73.6 | 73.0 | 92.5 | - | - | - | - |
| జమ్ము-కాశ్మీర్ | 40.3 | 53.4 | 45.8 | 77.5 | 47.6 | 21.5 | 29.3 | 18 9 |
| కర్ణాటక | 50.6 | 50.7 | 45.5 | 65.0 | 46.5 | 26 0 | 17.4 | 11.7 |
| కేరళ | 82.8 | 86.9 | 91.2 | 93.3 | 1.8 | 0.4 | 0.6 | 0.1 |
| మధ్యప్రదేశ్ | 26.3 | 43.9 | 29.9 | 61 6 | 66.4 | 30.6 | 18.1 | 6.6 |
| మహారాష్ట్ర | 54.4 | 64.0 | 59.3 | 72.1 | 27.7 | 12.6 | 12.4 | 4.6 |
| ఒరిస్సా | 44.9 | 55.4 | 19.2 | 69.6 | 54.7 | 34.0 | 20.3 | 20 2 |
| పంజాబు | 59.1 | 66.3 | 59.3 | 72 1 | 33.3 | 22.6 | 7.9 | 7.9 |
| రాజస్థాన్ | 25.5 | 47.8 | 19.2 | 69.6 | 81.7 | 26.1 | 36.0 | 12.5 |
| తమిళనాడు | 77.7 | 84.9 | 48.7 | 70.7 | 26.3 | 11.5 | 5.6 | 3.7 |
| ఉత్తరప్రదేశ్ | 28.2 | 45.4 | 30.7 | 63.8 | 68.0 | 27.2 | 38.8 | 19.2 |
| పశ్చిమబెంగాల్ | 40.9 | 44.8 | 52.8 | 64.3 | 45.9 | 34.6 | 15.2 | 13.0 |
| భారతదేశం | 40.4 | 52.5 | 41.9 | 66.1 | 50.7 | 26.4 | 19.3 | 10.9 |

*- జీన్ డ్రేజ్, అమార్త్య సేన్ల "ఇండియా : ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ ఆపర్చ్యునిటీ" నుండి*

సమాచారం, బడికి వెళ్ళే వయస్సు గల ఆడపిల్లలు, మగపిల్లలు అందరూ బడిలో చేరి చదువుతున్నట్లు తెలియజేస్తాయి. మరికొన్ని దేశాల సమాచారం నూరింట 80-90 శాతం మంది స్కూళ్ళలో చదువుతున్నట్లు చూపుతుంది. ఇంకా కొన్ని దేశాలు నిర్బంధ ప్రాథమిక విద్యను అమలు జరువుతున్నట్లు ప్రకటిస్తుంటాయి. స్కూళ్లకు వెళుతున్న పిల్లలు ఇంత "అధికంగా" ఉన్నా, నిరక్షరాస్యుల సంఖ్య కాలానుగతంగా పెరుగుతున్నదే గాని తరగటం లేదు. ఇందువల్ల ప్రభుత్వాలు విడుదల చేస్తున్న సమాచారం మన కనులను కప్పుతున్నట్లు భావించక తప్పటం లేదు. బడిలో చేరి చదువుతున్న పిల్లల సంఖ్యా వివరాలకు సంబంధించిన ప్రభుత్వ సమాచారం నమ్మదగినదిగ లేదని పలువురు పరిశీలకులు భావిస్తున్నారు. బడిలో చేరిన మొత్తం పిల్లలు ఎందరు అన్న సమాచారం కంటే, చేరిన విద్యార్థినీ విద్యార్థులలో ఎందరు మధ్యలో మానకుండా, ఆ దశ విద్యను పూర్తి చేస్తున్నారు; బడిలో చేరినవారు, సంవత్సరంలో ఎన్ని రోజులు బడికి గైరు హాజరవుతున్నారు; ఎందరు క్రమం తప్పకుండా, ప్రతి క్లాసులో ప్యాసవుతూ పై తరగతుల కెళుతున్నారు అన్న సమాచారం మనకు ముఖ్యమైనది. మొత్తం విద్యార్థినీ విద్యార్థులకు కలిపిగాకుండా, వారిద్దరకూ విడివిడిగా ఈ సమాచారం లభించగలిగితే, చదువులో ఆడపిల్లలు మగపిల్లల కంటే ఎంతగా వెనుకబడి పోతున్నారో అంచనా వేయటానికి

ఏనిమిదవ పట్టిక
పెద్దల అక్షరాస్యతా విషయంలో, భారతదేశమూ సబ్-సహారన్ ఆఫ్రికాల పోలికలు (1991)

| ప్రాంతము | జనాభా కోట్లలో | అక్షరాస్యతా రేట్లు (శాతాలలో) | |
|---|---|---|---|
| | | స్త్రీలు | పురుషులు |
| భారతదేశము | 84.63 | 39 | 64 |
| రాజస్థాన్ | 4.40 | 20 | 55 |
| బీహార్ | 8.64 | 23 | 52 |
| ఉత్తరప్రదేశ్ | 13 91 | 25 | 56 |
| బర్మార్ (రాజస్థాన్) | 0.14 | 8 | 37 |
| కృష్ణగంజ్ (బీహార్) | 0 10 | 10 | 33 |
| బహరిచ్ (ఉత్తరప్రదేశ్) | 0.28 | 11 | 36 |
| బర్కినా ఫాసో | 0 92 | 10 | 31 |
| సియారా-లియోన్ | 0.43 | 12 | 35 |
| బెనిన్ | 0.48 | 17 | 35 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 48.89 | 40 | 63 |

*- జీన్ డ్రేజ్, అమార్త్య సేన్ల "ఇండియా . ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ అపర్చ్యునిటీ" నుండి*

వీలుంటుంది దురదృష్టవశాత్తు ఇటువంటి సమాచారం మనకు లభించటంలేదు. ఇటువంటి సమాచారపు విడుదలకు ముఖ్యంగా పేదదేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలు ముందుకు రావటం లేదు కొన్ని దేశాలు స్కూళ్లలో చేరుతున్న పిల్లల సంఖ్యా వివరాలను కూడా విడుదల చేయటం లేదు. లోపాలతో కూడిన సమాచారం మనను తప్పుడు నిర్ధారణలకే తీసుకు పోతుంది. కనుక బడిలో చేరుతున్న పిల్లల సంఖ్యా వివరాలను విచక్షణా జ్ఞానాన్ని వినియోగించి పరిశీలించాలని నిపుణులు హెచ్చరిస్తున్నారు.

ఈ సందర్భంలో ఐక్యరాజ్యసమితి హెచ్చరిక గమనించదగినదిగా కనిపిస్తున్నది; "గత 30 సంవత్సరాలుగా విద్యాలయాలలో చేరే విద్యార్థినీ విద్యార్థుల సంఖ్య పెరుగుతున్నా, నిరక్షరాస్యత ఇంకా ప్రధాన సమస్యగానే ఉండి పోయింది. 1990వ సంవత్సరంలో ప్రపంచ జనాభాలో పదిహేను సంవత్సరాలకు పై బడిన వయస్సు గల జనాభాలో 95 కోట్ల మంది నిరక్షరాస్యులుగానే ఉన్నారు. వీరిలో నూరింట 97 మంది అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉన్నారు. పురుషులలో కంటే స్త్రీలలో నిరక్షరాస్యత అత్యధికంగా ఉన్నది. పట్టణ ప్రాంతాలలో కంటే గ్రామీణ ప్రాంతాలలో నిరక్షరాస్యత అధికంగా ఉన్నది. ప్రపంచ వ్యాప్తంగా చూచినపుడు, నిరక్షరాస్యతా తీవ్రత తగ్గినట్లు కనుపించినా, సబ్-సహారన్ ఆఫ్రికా, దక్షిణా ఆసియా (భారత దేశం ఈ మండలంలోని భాగం - రచయిత), అరబ్బు దేశాలలో నిరక్షరాస్యుల సంఖ్యా పరిమాణం పెరిగింది. తూర్పు ఆసియా (జపాన్, చైనా దేశాలు ఈ మండలంలో ఉన్నాయి - రచయిత), లాటిన్ అమెరికా - కరిబియన్‌లలో నిరక్షరాస్యతా సమస్య తీవ్రత బాగా తగ్గింది. ఇదే స్థితి 2000 సంవత్సరం వరకూ కొనసాగితే, ప్రపంచంలో నిరక్షరాస్యుల సంఖ్య వంద కోట్లకు పెరుగుతుంది. అంతే కాదు, వీరిలో నూరింట 98 మంది అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉంటారు". (ఐక్యరాజ్య సమితి ప్రచురించిన "వరల్డ్ సోషల్ సిట్యుయేషన్ ఇన్ ది నైన్‌టీన్ నైన్‌టీస్") ఈ అధ్యాయంలోని మూడవ, నాల్గవ పట్టికలు ఈ అంశాలను సంఖ్యారూపంలో చిత్రిస్తున్నాయి.

నిరక్షరాస్యులలో అధికులు స్త్రీలే నన్న విషయాన్ని గుర్తుంచుకొన్నపుడు, స్త్రీల నిరక్షరాస్యతా సమస్య ముందు ముందు ఎంత తీవ్రమయ్యే అవకాశ మున్నదో ఊహించవచ్చు.

తొమ్మిదవ పట్టిక

అక్షరాస్యత, స్కూలు హాజరు విషయాలలో పొరుగు దేశాలతో భారత దేశపు పోలికలు (1992)

| దేశము | 15 సం॥ల వయసుకు పైబడిన వారిలో అక్షరాస్యుల శాతం | | 25 సంవత్సరాల వయసుకు మించిన వారు స్కూలుకు వెళ్ళిన సంవత్సరాల పరిమాణం | ప్రాథమిక విద్యాలయంలో ఒకటవ తరగతిలో చేరిన వారిలో ఈ స్థాయి విద్యను పూర్తి చేసిన వారి శాతము |
|---|---|---|---|---|
| | స్త్రీలు | పురుషులు | | |
| భారతదేశము | 39 | 64 | 2 4 | 62 |
| బంగ్లాదేశ్ | 23 | 49 | 2.0 | 47 |
| నేపాల్ | 14 | 39 | 2.1 | - |
| పాకిస్తాన్ | 22 | 49 | 1 9 | 48 |
| శ్రీలంక | 85 | 94 | 7.2 | 97 |
| చైనా | 68 | 87 | 5.0 | 85 |
| దక్షిణకొరియా | 95 | 99 | 9.3 | 99 |
| ఇండొనేషియా | 77 | 91 | 4.1 | 77 |
| తాయ్‌లాండ్ | 92 | 96 | 3.9 | 87 |

*- జీన్ డ్రేజ్, అమార్త్యసేన్ల "ఇండియా · ఎకనామిక్ డెవలప్‌మెంట్ అండ్ సోషల్ అపర్చ్యునిటీ" నుండి*

## భారతదేశంలో స్త్రీల అక్షరాస్యత

మనదేశంలో విడుదలవుతున్న అక్షరాస్యతా సమాచారం చిత్రిస్తున్న చిత్రం ఎంత అవాస్తవికంగా ఉన్నదో చూద్దాం. యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం (యుఎన్‌డిపి) ప్రచురిస్తున్న హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టులు, ప్రపంచబ్యాంకు ప్రచురిస్తున్న వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టులు అధికార సమాచారాన్ని పరిశీలనకు తీసుకొంటున్నాయి 1990వ సంవత్సరంలో, భారతదేశంలో నూరింట 99 మంది పిల్లలు స్కూళ్ళలో చేరి చదువుతున్నట్లు తెలిపే సమాచారాన్ని "హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1994" ప్రచురించింది. భారతదేశంలో ప్రాథమిక విద్యను, బడికి వెళ్ళే వయస్సున్న బాలబాలికలందరూ అభ్యసిస్తున్నట్లు అత్యంతాకర్షణీయమైన చిత్రాన్నిది చూపుతున్నది. భారత ప్రభుత్వమే సేకరిస్తున్న జనాభాలెక్కల సమాచారం గాని, నేషనల్ శ్యాంపుల్ సర్వే సమాచారం గాని ఈ అంచనాలను ధృవ పరచటం లేదు; పరోక్షంగా వ్యతిరేకిస్తున్నాయి. నేషనల్ శ్యాంపుల్ సర్వే, జనాభా లెక్కల సమాచారం నుండీ, కొందరు భారతీయ పరిశీలకులు ప్రచురించిన సమాచార విశ్లేషణల నుండీ, డ్రేజ్, సేన్‌లు సేకరించి కూర్చిన పట్టికను పరిశీలిస్తే, ప్రజలకు అబ్బుతున్న అక్షరాస్యతా ప్రమాణమెంతో అర్థమవుతుంది.

జనాభా లెక్కల ఆధారంతో, పైన పేర్కొన్న ఇరువురు నిపుణులు కూర్చిన అక్షరాస్యతా పట్టికలను కూడా ఈ అధ్యాయంలో ఇచ్చాం (5, 6, 7 పట్టికలను చూడండి). వీటిలో దేనిని పరిశీలించినా, అధికార అంచనాలు ఎంత వాస్తవ విరుద్ధంగా ఉన్నాయో అర్థమవుతుంది. మన దేశ జనాభాలో, పురుషులలో నూరింట 64 మంది, స్త్రీలలో 39 మంది మాత్రమే అక్షరాస్యులుగా ఉన్నారు. అతి తక్కువగా ఉన్న ఈ అక్షరాస్యతా పరిమాణాలే, బడిలో చేరి చదువుతున్న విద్యార్థినీ విద్యార్థుల సంఖ్యా సమాచారంగా ప్రభుత్వం ప్రకటించిన అంచనాల గుట్టును రట్టు చేస్తున్నాయి. 30 సంవత్సరాలకు పూర్వమే, భారతదేశంలోని అక్షరాస్యతా పరిమాణాలు చైనా, ఆగ్నేయ ఆసియా దేశాలలో కంటే కూడా తక్కువగా ఉన్నాయి. అంతేకాదు; కొన్ని పేదదేశాలలో కంటే కూడా మనదేశ అక్షరాస్యతా పరిమాణాలు తక్కువగా ఉన్నాయి. ఆఖరుకు మనదేశం సబ్-సహారన్ ఆఫ్రికా ప్రాంతం కంటే కూడా ఈ అంశంలో వెనుకబడి ఉండటం గమనించదగిన విషయం (8వ పట్టికను చూడండి).

మన దేశంలో, విద్యావిధానపు అమలులోనే కొన్ని

బలహీనతలు కనుపిస్తున్నాయి. అక్షరాస్యతా సాధనలో పలురాష్ట్రాల మధ్య తీవ్రమైన అసమానతలు కనుపిస్తున్నాయి కేరళలోని స్త్రీలలో నూరింట 86 మంది అక్షరాస్యులుగా ఉంటే రాజస్థాన్‌లో 22 మంది, ఉత్తర ప్రదేశ్‌లో 25 మంది మహిళలు మాత్రమే అక్షరాస్యతను సాధించగలిగారు అంతేగాదు. ఒక రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో కూడా ఈ విషయంలో తీవ్రమైన తేడాలు కనుపిస్తున్నాయి. ఉదాహరణకు రాజస్థాన్ రాష్ట్రంలోని మహిళల అక్షరాస్యత 22 శాతం వరకూ ఉన్నా, బర్మార్ జిల్లాలో 8 శాతం మంది స్త్రీలు మాత్రమే అక్షరాస్యులుగా ఉన్నారు ఉత్తర ప్రదేశ్‌లో మహిళల అక్షరాస్యతా పరిమాణం 25 శాతంగా ఉన్నా, ఆ రాష్ట్రంలోని బహరైచ్ ప్రాంతంలో స్త్రీల అక్షరాస్యత పదకొండు శాతంగానే ఉన్నది విద్యావిధానపు అమలులోని బలహీనతలు ఈ రూపంలో మనకు కనుపిస్తున్నాయి.

విద్యార్జనలోనూ అసమానతలు కనుపిస్తున్నాయి. ఈ విషయంలో స్త్రీ - పురుషుల మధ్య, గ్రామీణ పట్టణ ప్రాంతాల మధ్యా, అసమానతలు ఉన్నాయి. పలు జాతులు, కులాల మధ్య కూడా ఇలాంటి అసమానతలు ఉన్నాయి. ఆర్థిక అసమానతలకు లింగ, కుల, తెగ, వర్గ అసమానతలు కూడా తోడై అక్షరాస్యతా సాధనలో అధిక అసమానతలకు దారిదీస్తున్నాయి. మనదేశ జనాభాలో నూరింట 16 మంది వరకూ షెడ్యూల్డు కులాల వారున్నారు. వీరిలో నూరింట 19 మంది స్త్రీలు మాత్రమే అక్షరాస్యులైనారు! గిరిజన జనాభా దేశ జనాభాలో ఎనిమిది శాతం వరకూ ఉంటుంది; వీరిలో 16 శాతం మంది స్త్రీలే అక్షరాస్యులు. బీహారు, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు విద్యార్జనలో వెనుకబడి ఉన్నాయి. మహిళా అక్షరాస్యతే ఈ రాష్ట్రాలలో తక్కువగా ఉన్నది. ఈ రాష్ట్రాలలో ఏడు సంవత్సరాలకు పైబడిన మహిళలలో అక్షరాస్యులుగా ఉన్న వారి పరిమాణం కంటే, పైన పేర్కొన్న రెండు వర్గాల మహిళలలోనూ అక్షరాస్యతా పరిమాణం పదిశాతం తక్కువగానే ఉన్నది. అసలే వీరు స్త్రీలు. పురుషులతో సమానులు కారు; అది చాలదన్నట్లు సమాజపు చిన్న చూపుకు గురవుతున్న షెడ్యూల్డు కులాలకు చెందినవారు; దానికి తోడు వెనుక బడిన ప్రాంతాలలో వారి జీవనం. ఈ అసమానతలు, అననుకూలతలు ముప్పిరిగొని, వారి విద్యార్జనా స్థాయినీ, శక్తినీ దిగజార్చాయి అందువల్లనే వారికి అక్షరాస్యత నామ మాత్రంగానే అబ్బింది.

వయస్సు వచ్చిన స్త్రీలలో నిరక్షరాస్యులు అధికంగా ఉండటమే గాదు: బాలబాలికలలోనూ నిరక్షరాస్యులు అధికంగా ఉండటం గమనించదగిన అంశం. గ్రామీణ ప్రాంతాలలో వయస్సు వచ్చిన మహిళలలోనే గాకుండా 10-14 సంవత్సరాల వయస్సు పిల్లలలో నిరక్షరాస్యత అధికంగా ఉండటం కనుపిస్తున్నది విద్యార్జనావకాశాలు విస్తరిస్తున్న కాలంలో కూడా, చిన్న పిల్లలలో అత్యధికులు నిరక్షరాస్యులుగా ఉండటం భారతీయ విద్యావిధానంలోని మరొక బలహీనత

బడిలో చేరుతున్న పిల్లల సంఖ్యా, బడిలో చేరినా, క్రమం తప్పకుండా చదువును కొనసాగిస్తున్న వారి సంఖ్యా కూడా తక్కువగానే ఉన్నది భారతీయ స్త్రీ జనాభాలోని 12-14 సంవత్సరాల మధ్య వయస్సు పిల్లలలో సగం మంది బడి మొగ మెరుగరు! ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహారు రాష్ట్రాలలోని ఇదే వయస్సు గ్రూపు ఆడపిల్లలలో రెండింట మూడు వంతుల మందీ, రాజస్థాన్‌లో నూరింట 82 మందీ ఎన్నడూ బడిలో చేరి చదివెరుగరు! భారతదేశంలోని ఈ వయస్సు ఆడపిల్లలలో నూరింట 42 మంది, 5-9 సంవత్సరాల ఆడపిల్లలలో 40 మంది మాత్రమే స్కూళ్ళలో చదువుతున్నట్లు కనుపిస్తుంది. ఇవి సర్వే జరిగిన కాలం నాటి అంచనాలు; పైగా సగటున బడికి హాజరవుతున్న వారి సంఖ్య. కాని భారతదేశ గ్రామీణ ప్రాంతంలో బడిలో చేరిన పిల్లలంతా, రోజూ పాఠశాలకు హాజరవుతూ ఉండటం అనేది అరుదు. బడి హాజరు పట్టీలో కనుపించే పిల్లలలో చాలామంది బడికి గైరు హాజరై, పొలాలలోనో, ఇండ్లలోనో పనిచేస్తూ కనుపించటం సహజం! కనుక బడి హాజరు పట్టీలు, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతపు విద్యాలయాలలో, వాస్తవాలను ప్రతిబింబించవు.

ప్రాథమిక విద్యను కూడా పూర్తి చేయకుండా, మధ్యలోనే చదువు మానేవారు కూడా ఎక్కువగానే ఉంటారు. మొదటి తరగతిలో చేరిన పిల్లలలో సగం మంది మాత్రమే నాలుగు సంవత్సరాల తర్వాత కూడా స్కూళ్ళలో చదువుతూ కనుపిస్తారు! ప్రాథమిక విద్యాస్థాయిలో మనకు రెండు అవాంఛనీయ అంశాలు కనుపిస్తాయి : (1) బడిలో చేరినవారు అతి తక్కువ కాలం చదువుతున్నారు; (2) అధిక సంఖ్యాక

బాలబాలికలు బడిలో చేరటం లేదు. ఇందువల్ల ప్రాథమిక స్థాయిలో ఐదు సంవత్సరాల విద్యార్జనను అనుభవించినవారు చాలా తక్కువ మంది ఉంటున్నారు వీరికి సంబంధించిన అంచనాలు, భారతీయ జనాభా లెక్కల కంటే, ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ సైన్సెస్ వారు 1994వ సంవత్సరంలో ప్రచురించిన అంచనాలు యదార్థస్థితిని ప్రతిబింబిస్తున్నాయన్న విశ్వాసంతో, ఈనిపుణులు వాటిని పరిశీలనకు స్వీకరించారు ఈ సంస్థ అంచనాల ప్రకారం ఆరు సంవత్సరాల వయస్సును మించిన భారతీయ జనాభాలో, 1992-93వ సంవత్సరంలో, పురుషులలో నూరింట 49 మందీ, స్త్రీలలో 28 మంది మాత్రమే ప్రాథమిక విద్యను పూర్తి చేయగలిగారు. రాజస్థాన్ రాష్ట్రంలో ఈ వయస్సు గ్రూపు స్త్రీలలో నూరింట 15 మందీ, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో 21 మంది మాత్రమే ప్రాథమిక విద్యను పూర్తి చేయగలిగారు! 1994లో ప్రచురితమైన యు.ఎన్.డి.పి. రిపోర్టులో జనాభాలోని 25 సంవత్సరాల వయస్సు నిండిన వారిలో, వారు స్కూళ్ళకు వెళ్ళి చదివిన కాలపు అంచనాల నిచ్చారు. ఈ అంచనాల ప్రకారం భారతదేశ జనాభాలోని ఈ వయస్సు గ్రూపు వారిలో ఒక్కొక్కరు సగటున 2.4 సంవత్సరాల కాలం స్కూళ్ళలో చదివారు! పురుషులు సగటున మూడున్నర సంవత్సరాల కాలం బడిలో చదివితే, స్త్రీలు 1.2 సంవత్సరాల కాలం మాత్రమే బడిలో చదివారు! ఈ విషయాన్ని, కొన్ని పొరుగుదేశాల పరిస్థితితో భారతదేశ పరిస్థితి పోల్చి చూపే అంచనాలను కూడా యు.ఎన్.డి.పి. రిపోర్టు ప్రచురించింది. జనాభా లోని 25 సంవత్సరాల వయస్సును మించిన వారిలో ఒక్కొక్కరు, సగటున చైనాలో ఐదు సంవత్సరాల చొప్పునా, శ్రీలంకలో 7.2 సంవత్సరాల చొప్పునా, దక్షిణ కొరియాలో 9.3 సంవత్సరాల చొప్పునా, స్కూళ్ళలో చదివారు. ఈ దేశాల స్థితితో పోల్చితే భారతదేశపు పరిస్థితి ఎంత నాసిగా, దయనీయంగా ఉన్నదో చూడవచ్చు (వివరాలను తొమ్మిదవ పట్టికలో ఇచ్చాం).

స్త్రీలలో విద్యావ్యాప్తి వెనుకడుగు వేయటానికి కారణం ఏమిటి అన్న అంశపు నిర్ధారణకు ప్రపంచబ్యాంకు నిపుణులు 77 దేశాలకు సంబంధించిన సమాచారాన్ని పరిశీలించారు. బాలబాలికల విద్యాలయపు ప్రవేశము, విద్యాలయాలలో చేరటంలో వీరిద్దరి మధ్య కనుపిస్తున్న అసమానతలు, తలిదండ్రుల విద్యాస్థాయి, ప్రజల తలసరి జాతీయ ఆదాయం, దేశపు వ్యవసాయాభివృద్ధి స్థాయి, సర్వీసుల స్థితిగతులు, ప్రభుత్వం విద్యావ్యాప్తి మీద ఖర్చు చేస్తున్న నిధుల పరిమాణం వంటి విషయాలను పరిగణనలోనికి తీసుకొని ఆడపిల్లల విద్యార్జన మీద (స్త్రీ విద్యావ్యాప్తి మీద) దేని ప్రభావం ఎంత మేరకున్నది అన్న విషయపు టంచనాకు ప్రయత్నించారు స్త్రీ విద్యావ్యాప్తికి, బడిలో చేరుతున్న బాలబాలికల సంఖ్యా పరిమాణాలలో వ్యత్యాసాలుండటానికి సంబంధం ప్రస్ఫుటంగా కనుపించలేదు అని వీరు నిర్ణయించారు. తల్లులార్జించిన విద్య ఆడపిల్లలకు మూలధనంగానూ, ఆడపిల్లలను బడిలో చేర్పించి చదివించే ప్రోత్సాహక శక్తిగాను ఉన్నట్లు గమనించారు బడిలో చేరుతున్న బాలబాలికల మధ్యనున్న వ్యత్యాసాల తొలగింపుకు కూడా తల్లివిద్య తోడ్పడుతున్నట్లు వీరు గమనించారు దేశ ఆర్థికాభివృద్ధితో పాటు, అధిక సంఖ్యాక స్త్రీల విద్యాలయ ప్రవేశము, విద్యాలయాలలో బాలబాలికలను చేర్చటంలో లింగ సమానత్వ సాధన జరగదనీ, ఇందుకు ప్రత్యేక కృషి అవసరమనీ వీరు నిర్ధారణ చేశారు. క్యూబా, నికరాగ్వా దేశాలు స్త్రీ విద్యావ్యాప్తిలో సాధించిన అభివృద్ధి వీరి నిర్ధారణలను రుజువు చేస్తున్నది. ఆర్థికాభివృద్ధిలో చైనా, భారతదేశాన్ని మించిపోక పూర్వమే, ఈ విషయంలో సంచలనాత్మక ఫలితాలను సాధించింది. ఈ అనుభవాలు ప్రపంచబ్యాంకు నిపుణుల నిర్ధారణలకు రుజువులుగా కనుపిస్తున్నాయి.

స్త్రీ విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడి వలన, పురుషుల విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడి మీద వస్తున్న దాని కన్న అధిక ప్రతిఫలం లభిస్తున్నట్లు చూచాం. స్త్రీ విద్యార్జన మీద పెట్టిన పెట్టుబడి వలన, ఆవిడ కుటుంబం కంటే సమాజం అధికంగా లాభిస్తున్నట్లు కూడా చూచాం. స్త్రీ విద్య లోక కళ్యాణ కారకమని రుజువైంది. అయినా, ప్రభుత్వాలు గాని, కుటుంబాలు గాని స్త్రీ విద్యను ఎందుకు ప్రోత్సహించటం లేదు? ఆడ, మగ పిల్లలు తమ కడుపున పుట్టినవారే అయినా, బాలుర విద్యను ప్రోత్సహిస్తూ, బాలికల విద్యను ఎందుకు నిరాదరిస్తున్నారు? స్త్రీ విద్యావ్యాప్తి కున్న అవరోధాలేమిటి? ఈ విషయ పరిశీలనకు పూనుకుందాం.

**పదవ పట్టిక**

**పెరూ దేశంలో బడికి పోతున్న పిల్లలలోనూ, బడికి పోనివారిలోనూ, ఇంటి పనులు చేసేవారి సంఖ్యా పరిమాణ శాతాలు**

| వివరం | ఆడపిల్లలు | మగపిల్లలు |
|---|---|---|
| బడికి పోని పిల్లలలో ఇంటి పనులు చేసేవారి శాతం | | |
| 8-10 సం॥ల మధ్య వయస్కులలో | 82 | 72 |
| 11-13 సం॥ల మధ్య వయస్కులలో | 92 | 85 |
| 14-16 సం॥ల మధ్య వయస్కులలో | 91 | 69 |
| బడిలో చదువుతూ, లేబర్ మార్కెట్‌కు వెళ్ళేవారి శాతం | | |
| 5-7 సం॥ల మధ్య వయస్కులలో | 11 | 19 |
| 8-10 సం॥ల మధ్య వయస్కులలో | 25 | 28 |
| 11-13 సం॥ల మధ్య వయస్కులలో | 34 | 48 |
| 11-13 సంవత్సరాల మధ్య వయస్కులలో లేబర్ మార్కెట్‌కు ఎన్నడూ వెళ్ళని వారి శాతం | 26 | 35 |
| ఇంటి పనులను ఎన్నడూ చేయని వారి శాతం | | |
| 11-13 సం॥ల మధ్య వయస్కులలో | 9 | 19 |
| 14-16 సం॥ల మధ్య వయస్కులలో | 8 | 21 |

*- బి. కింగ్, ఆర్. బెల్లూలు, బి. హెర్జ్, యన్. ఖండ్కర్‌లు ప్రకటించిన పరిశోధనా పత్రాల ఆధారంతో ప్రపంచ బ్యాంకు నిపుణులు కూర్చిన పట్టిక*

## స్త్రీ విద్యావ్యాప్తికి అవరోధాలు

"లాభం లేనిదే సెట్టి వరదన పోడు" అన్నారు పెద్దలు. ఇది ఏదో ఒక వర్గానికో లేక కులానికో అతికే సామెతకాదు: మానవులందరకూ ఇది వర్తిస్తుంది లాభం లేకుండా, ఏపనినీ ఎవరూ చేయరు. ప్రతిఫలాపేక్ష ప్రతివారికీ ఉంటుంది. ఏదైనా పనిని చేసేముందు దానివల్ల లభించే లాభమెంతో అంచనా వేయటం మానవ నైజం. ఆడపిల్లలను గాని, మగపిల్లలను గాని చదివించేటపుడు, తమకు ఎవరి చదువు వలన అధిక లాభాలొస్తాయోనని అంచనా వేయటానికి తలిదండ్రులు పూనుకొంటారు. ప్రభుత్వం తన ఖర్చుతో విద్యాలయాలను నడుపుతున్నా, పిల్లల ఫీజులు, పుస్తకాల వంటి వాటికి తాము ఎంత ఖర్చు చేయవలసి ఉంటుందో నిర్ణయించటానికి అంచనాలను తయారు చేసుకొంటారు.

పిల్లలను చదివించటానికయ్యే ఖర్చును తక్షణమే తలిదండ్రులు భరించవలసి ఉంటుంది. దానిమీద లాభాలు రావటానికి కొంతకాలం ఆగవలసి ఉంటుంది. ఆ వచ్చే లాభాలు కూడా తలిదండ్రులకు రావు. చదువుకొన్న పిల్లలకు గిడతాయి. అటు తర్వాత, వారి బిడ్డలకు, మనుమలు మనుమరాండ్రకు - వారసత్వంగా కొన్ని ప్రయోజనాలు, తలిదండ్రులార్జించిన విద్యవలన లభిస్తాయి. చదువులకు పెట్టుబడిని పెట్టిన తలిదండ్రులకు ప్రయోజనముండదు. కాని వారి చదువుల ఖర్చుల భారాన్ని మాత్రం వీరు మోయవలసి ఉంటుంది.

మగపిల్లలను చదివించటానికంటే ఆడపిల్లలను చదివించటానికి ఖర్చులు కొంచెం ఎక్కువవుతాయి. ఆవిడ చదువు ముగియగానే పెండ్లి చేసుకొని మెట్టి నింటికి వెళుతుంది. ఇందువల్ల ఆవిడ చదువు వలన వచ్చే లాభాలు తలిదండ్రులకు లేదా వారి వారసులకు దక్కవు. ఆవిడతో పాటు ఆవిడ సృజనాత్మక శక్తులు, సంపాదన, అన్నీ మెట్టినింటి వారికి వెళతాయి. ఈ స్థితిని చూచి, ఆడపిల్లను చదివించటం "పొరుగింటివారి పెరటి చెట్టుకు నీరు పోయటం"గా ఆమె తలిదండ్రులు భావిస్తారు. ఇందువల్ల ఆడపిల్లలను చదివించ టానికి వెనుకాడుతారు. ఒకవేళ చదివిన బిడ్డ తమతో కొంతకాలం ఉంటే, ఆవిడ సంపాదన కుటుంబానికి వినియోగపడుతుంది. కాని, ఆడపిల్లలు, మగపిల్లలంత

## "నా చదువు మధ్యలోనే ఆగిపోయింది"

"నేను నియమం తప్పకుండా బడికి వెళ్ళేదాన్ని. టీచరు ఏ ప్రశ్న నడిగినా కరెక్టుగా సమాధానం చెప్పేదానిని. చదువులో ఎంతో పైకి పోవాలని ఆశించాను" అని చెబుతూ ఒక అమ్మాయి భోరున ఏడ్చింది. ఆవిడ ఆరవ తరగతి చదువుతూండగా రజస్వలైంది దానితో "చదివిందిక చాలు, ఇంటి పనులు నేర్చుకో" అని ఆవిడ తలిదండ్రులు చదువు మాన్పించారు.

మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, తమిళనాడు రాష్ట్రాలలోని ఆరుగ్రామాలలో సర్వేను నిర్వహించిన కుమారి వీణా కుల్కర్ణి వెల్లడించిన ఉదంతమిది. ఈ ఆరుగ్రామాల సామాజిక పరిస్థితులూ, సంస్కృతి భిన్నంగా ఉన్నది. కాని ఆడపిల్లల చదువును మధ్యలోనే మాన్పించటానికి గల కారణాలు మాత్రం ఒకే రకంగా ఉన్నట్లు కుమారి వీణా గుర్తించారు.

కుమారి వీణా, పైన పేర్కొన్న మూడు రాష్ట్రాలలోనూ, రాష్ట్రానికి రెండు గ్రామాల చొప్పున సర్వేకు ఎన్నుకొన్నారు. ఈ గ్రామాలలో మధ్యలోనే చదువును మానేసిన 32 మంది బాలురనూ, 30 మంది బాలికలను ఎన్నుకొన్నారు. వీరంతా పది - పధ్నాలుగు సంవత్సరాల మధ్య వయస్కులు. బాలురలో దాదాపు అందరూ తమంత తామే చదువును ఆపేశారు: ఇందులో తలిదండ్రుల ప్రమేయం లేదు. బాలికలలో ఇద్దరు తప్ప, మిగిలిన వారిని వారి తలిదండ్రులే చదువు మాన్పించారు.

కొన్ని సాంఘిక, ఆర్థిక కారణాలవల్ల తలిదండ్రులు తమ బిడ్డలను, సునాయాసంగా చదువు మాన్పిస్తున్నారు. ఆడపిల్లల చదువును మాన్పించటానికి ఇంటి చాకిరీ, పసిపిల్లల సంరక్షణ అనేవి అతి ప్రధాన కారణాలుగా కనుపిస్తున్నాయి. బాలుర విద్యార్జన మీద అధిక ప్రతిఫలం లభిస్తుంది అని అన్ని వర్గాల కుటుంబాల వారు భావిస్తున్నారు. సర్వే జరిగిన ఆరు గ్రామాలలోనూ ఇదే భావం వ్యక్తమైంది. కనుకే బాలురను చదివించటానికి తలిదండ్రులు వెనుకాడటం లేదు. ఎంత చదివించినా, ఆడపిల్ల ఒకరింటికి వెళ్ళ వలసిందే. వనరులు తక్కువగా ఉన్నపుడు, ఆడపిల్లలకు బదులు మగపిల్లలను చదివించటానికి ఉన్న శక్తిని వినియోగించటం ఉత్తమమని తలిదండ్రులు - ముఖ్యంగా రైతులు, వ్యవసాయ కూలీ కుటుంబాలకు చెందిన వారు - భావిస్తున్నారు.

ఇల్లు గడవటం కష్టంగా ఉండటం చేత ఆడపిల్లలను ఏదయినా పనికి పంపటానికి చదువును మాన్పించినట్లు, సర్వేను ఎన్నుకొన్న రెండు మధ్యప్రదేశ్ గ్రామాలలోను రుజువైంది. తల్లి వేతనార్జనకు వెళ్ళినపుడు, ఇంట్లోని చిన్న పిల్లలను చూసే వారుండాలి గనుక, పెద్ద పిల్లలను చదువు మాన్పిస్తున్నట్లు, కొందరు చెప్పారు. చదువు మానేసిన ఆడపిల్ల లంతా, ఇంటి చాకిరీ చేస్తున్నారు, చదువు మానిన మగ పిల్లలంతా కూలికి పోవటమో, లేక కుల వృత్తిలోకి దిగటమో చేస్తున్నారు.

మహారాష్ట్ర, తమిళనాడు సర్వే గ్రామాలలో కూడా ఇలాంటి కారణాల వల్లనే ఆడపిల్లలు చదువు మానేయటం కనుపించినదని కుమారి వీణా వెల్లడించారు.

గ్రామంలో ఉన్న అవకాశాల మేరకే ఆడపిల్లలను చదివిస్తున్నారు. అంతకు పై చదువులకు ఆడపిల్లలను ఇతర ప్రాంతాలకు పంపటానికి తలిదండ్రులు ఇష్టపడటం లేదు. మధ్యప్రదేశ్‌కు చెందిన దిగ్మా సర్వే గ్రామంలో ఐదవ తరగతి వరకే అవకాశాలున్నాయి. ఇంతకంటే పై చదువును చదివిన ఆడపిల్లలు ఆగ్రామంలో అతి తక్కువగా కనుపించారు. తమిళనాడుకు చెందిన కానూర్ గ్రామంలో ఎనిమిదవ తరగతి వరకే చదివే వసతున్నది. ఆగ్రామంలోని అత్యధిక బాలికలు, ఇంతమేరకే చదివారు.

మగపిల్లలను చదివించటం మీద వారి తలిదండ్రులకు ఆసక్తి ఉన్నా, అది పూర్తిగా కార్యరూపం దాల్చటం లేదు. సర్వేకు ఎన్నుకొన్న ప్రతి గ్రామంలో గ్రామ పాఠశాలల పనితీరు తలిదండ్రులకు నిరుత్సాహం గలిగించేది గానే ఉన్నది.

*- కుమారి వీణా కుల్కర్ణి సర్వే ఫలితాల ఆధారంతో "పబ్లిక్ రిపోర్టు ఆన్ బేసిక్ ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా" ఇచ్చిన సమాచారం*

అధికంగా సంపాదించలేక పోతున్నారు. (అందుకు లేబర్ మార్కెట్లోని అసమానతలు, లింగవివక్ష వంటివి కారణమని ఇంతకు పూర్వమే చూచాం) ఇందువల్ల, మగపిల్లల చదువులకే తలిదండ్రులు ప్రాధాన్యత నిస్తారు ఆడపిల్లలను ఇంట్లోనే ఉంచుతారు ఒకవేళ బడికి పంపినా, అది "వానాకాలపు చదువుగా" పరిణమిస్తుంది

పిల్లలను బడికి పంపేముందు, వారిని ఇంట్లో ఉంచి పనిచేయించటం లాభకరమా, చదివించటం ప్రయోజనకరమా అన్న విషయ విచారణ జరుగుతుంది పిల్లలను ఇంట్లో ఉంచితే వారు ఇంటి పనులు చేయటానికి ఉపకరిస్తారు లేదా గొడ్ల కాపలాకో, పైరుపై కాపలాకో, పొరుగింటి వారి ఇంటి పనులకో వారిని పంపవచ్చు ఇలా పిల్లలతో పని చేయించటం వలన కుటుంబానికి కొంత ఆదాయం గిడుతుంది. పిల్లలను ఇంట్లో ఉంచితే, తలిదండ్రులు కూలిపనులకో, ఉద్యోగాలకో వెళ్ళవచ్చు పిల్లలు ఇంట్లో ఉండే వీలుండనపుడు, తలిదండ్రులలో ఒకరు మాత్రమే సంపాదనకు వెళ్ళగల అవకాశాలుంటాయి. ఇందువల్ల ఒకరి సంపాదన నష్టమవుతుంది పిల్లలను బడికి పంపటం వలన, ఈ విధంగా కొంత కుటుంబ సంపాదన నష్టం కావటం మాత్రమే కాదు; పిల్లల చదువులకు కొంత సొమ్మును కూడా ఖర్చు చేయవలసి ఉంటుంది కనుక పిల్లలను చదువులకు పంపే కంటే ఇంట్లో ఉంచటం మేలని తలిదండ్రులు భావిస్తారు. పేదకుటుంబాలలో ఈ పరిస్థితి స్పష్టంగా కనుపిస్తుంది. పిల్లలమీద మమకారంతోనో, లేక తాము లేవలేని స్థితికి వచ్చినపుడు పోషించి సంరక్షిస్తారన్న ఆశతోనో కొందరు మగపిల్లలను చదివిస్తారు.

పిల్లలను బడికి పంపటమా, లేక ఏదైనా పనిలో పెట్టటమా అన్న విషయ నిర్ణయానికి ముందు, ఆలోచనకు వచ్చే అంశాలివి·

1. పిల్లల ఫీజులు, పుస్తకాలు - దుస్తులు మొదలైన వాటికి ఎంత ఖర్చు అవుతుంది?

2. పిల్లలను బడికి పంపకుండా ఇంట్లో ఉంచటం వలన కుటుంబానికి ఎంత ఆదాయం వస్తుంది? (పేద కుటుంబాలకు పిల్లల వలన వచ్చే ఆదాయం కూడా ప్రాణప్రదమే)

3. పిల్లల రక్షణకు వారి సంక్షేమానికి (ముఖ్యంగా ఆడపిల్లల విషయంలో) ఎంత శ్రమ, సొమ్ము అవసరమవుతుంది? ఆడపిల్లల విషయంలో సంప్రదాయ ఉల్లంఘనకు చాలామంది తలిదండ్రులు ఇష్టపడరు.

4. లేబర్ మార్కెట్లోని లింగ వివక్ష, అసమానతల వలన మగవారికి లభించేంతటి వేతనాలు స్త్రీలకు రావు ఇందువలన మగపిల్లల చదువు మీద పెట్టిన పెట్టుబడికే అధికాదాయం వస్తున్నట్లు కనిపిస్తుంది. ఈ కారణం చేతనే తలిదండ్రులు, ఆడపిల్లలను చదివించటం కంటే మగపిల్లలను చదివించటం లాభకరమని భావిస్తుంటారు.

పిల్లలను బడికి పంపినపుడు, వారి చదువులకు తలిదండ్రులు ఎంత సొమ్మును ఖర్చు చేయవలసి ఉంటుందో, వారిని ఇంట్లో ఉంచితే వచ్చే ఆదాయం ఎంతో చూద్దాం.

పిల్లల చదువుకు కొంత సొమ్మును తలిదండ్రులు పెట్టుబడి పెట్టాలి వారు చదివినంత కాలము సొమ్ము ఖర్చవుతూనే ఉంటుంది ఈ ఖర్చులను వాయిదా వేయటానికి వీలు లేదు. కుటుంబాదాయం ఎంత తక్కువగా ఉంటే, పిల్లల చదువు అంత అధికభారమవుతుంది. చదువుకొనే పిల్లల ఖర్చులు, అల్పాదాయ దేశాలలో కుటుంబ పోషణ ఖర్చులో నాలుగుశాతం వరకూ ఉంటాయని ప్రపంచ బ్యాంకు నిపుణులు 1990లో అంచనా వేశారు మధ్యరకం ఆదాయాలుండే దేశాలలో, కుటుంబ ఖర్చులో పిల్లల విద్యార్జనా ఖర్చులు ఆరుశాతం వరకూ, అభివృద్ధి చెందిన దేశాలలో ఎనిమిది శాతం వరకూ ఉండవచ్చునని వీరు సూచించారు. (ఇవి సుమారుగా వేసిన అంచనాలు మాత్రమే. యదార్థాలుగా రుజువైన సంఖ్యాపరమైన అంచనాలుగా వీటిని భావించకూడదు). తలసరి జాతీయాదాయం 350 డాలర్లున్న భారతదేశము, పాకిస్తాన్లలో, పిల్లల చదువుకు కుటుంబ పోషణా ఖర్చులో మూడు నుండి నాలుగు శాతం వరకూ, 370 డాలర్ల వరకూ జాతీయాదాయం ఉన్న కీన్యాలో తొమ్మిది శాతం వరకూ, 290 డాలర్ల తలసరి జాతీయాదాయం ఉన్న జాంబియాలో పదమూడు శాతం చొప్పునా సొమ్ము ఖర్చవుతున్నట్లు నిపుణులు అంచనా వేశారు. తలసరి జాతీయాదాయం 1200-1300 డాలర్ల వరకూ ఉన్న ట్యూనీషియాలో కుటుంబ ఖర్చులో తొమ్మిది శాతం, టర్కీలో

ఒక్క శాతం, పెరూలో ఆరుశాతం సొమ్ము పిల్లల చదువులకు ఖర్చవుతున్నట్లు అంచనా వేశారు.

పేద కుటుంబాల వారు సంపాదన కోసం పిల్లల మీద ఆధారపడతారు. (కనుకనే వారు అధిక సంతానాన్ని కోరతారు) కనుక పిల్లలను చదివించటం వీరికి తలకు మించిన పనవుతుంది మగపిల్లలను చదివించటం కంటే ఆడపిల్లలను చదివించటం వీరికి అత్యంత భారమైన పనవుతుంది ఆడపిల్లలు ఇంట్లో పనిచేస్తారు; అవసరమైతే బయట కూలికి పోతారు. ఆడపిల్ల, ఇంట్లో ఉండి తనకన్న చిన్న పిల్లలను (తన తోబుట్టువులను) చూస్తుంది గనుక, తలిదండ్రులు సంపాదనకు పోవచ్చు. ఇలాంటి పిల్లలు చదువులకు పోతే, తలిదండ్రులు ఇద్దరూ బయట సంపాదనకు వెళ్ళే అవకాశాలుండవు. కనుక ఆడపిల్లలను బడికి పంపటం వీరికి ఆర్థికంగా నష్టదాయకమవుతుంది.

సబ్-సహారన్ ఆఫ్రికా, దక్షిణ ఆసియా ప్రాంతాలలో గ్రామీణ మహిళల పనిభారం అధికంగా ఉంటుంది. వీరికి పిల్లలు ఇంట్లో ఉంటే చిన్న పిల్లలను చూస్తారు ఎక్కువ కాల వ్యవధి పట్టే పొలం పనులకు వెళతారు, ఇంట్లో బట్టలుతకటం, వంట చెరకును సేకరించటం వంటి పనుల కుపకరిస్తారు మాలావీలోని ఆడపిల్లలు బడికి వెళుతూ కూడా, మగపిల్లల కంటే అధికంగా ఇంటి పనులను చేస్తున్నారు. వీరు బడి నుండి ఇంటికి రాగానే విశ్రాంతి తీసుకోవటానికి గాని, ఆడుకోవటానికి గాని, చదువుకోవటానికి గాని వీలుండదు. బర్కీనా ఫాసోలో ఏడు సంవత్సరాలు, అంతకు మించిన వయస్సున్న ఆడపిల్లలు (బడికి పోతున్నవారు) రోజుకు మూడున్నర గంటలు చొప్పున ఇంటి పనులను చేస్తున్నారు; బడికి వెళుతున్న మగ పిల్లలు రోజుకు గంటన్నర మాత్రమే ఈ పనులను చేస్తున్నట్లు ఒక సర్వే నిర్ధారణ చేసింది. జాంబియాలో స్కూలుకు పోతున్న ఆడపిల్లలలో నూరింట పదిమంది వరకూ ఇంటి పనులను చేయవలసి ఉన్నందువలన చదువులు మానుతున్నట్లు ప్రపంచబ్యాంకు నిర్వహింప జేసిన ఒక సర్వే వెల్లడించింది.

నేపాల్ దేశంలో ఆడపిల్లలు, మగపిల్లల కంటే ఒకటిన్నర రెట్లు అధికంగా ఇంటి పనులను చేస్తున్నారు. భారతదేశము, బంగ్లాదేశ్, నేపాల్ దేశాలలో ఆడపిల్లలు, ఐదు సంవత్సరాల వయస్సు వచ్చేటప్పటికి ఇంటి వాడుకకు అవసరమైన నీరు తేవటం, వంట చెరకును సేకరించటం, పొలం పనులు చేయటం, తమకంటే చిన్నపిల్లల యోగక్షేమాలను చూడటం వంటి పనులను చేస్తున్నారు. పది-పదిహేను సంవత్సరాల మధ్య వయస్సు ఆడపిల్లలు ఇంటి పనులను గాని, బయటి పనులను గాని, రోజుకు ఎనిమిది గంటల పాటు చేస్తున్నట్లు, కొన్ని పరిశీలనలు వెల్లడించాయి. భారతదేశంలో ఇంటి పనులకు, కుటుంబానికి సంబంధించిన వ్యవసాయ పనులను ఆడపిల్లలలో చిన్నవారు రోజుకు ఐదున్నర గంటల చొప్పున చేస్తుండగా, మగపిల్లలు రోజుకు 18 గంటల చొప్పుననే ఈ పనులను చేస్తున్నారు. వీరి కంటే కొంచెం పెద్ద ఆడపిల్లలు రోజుకు 7.7 గంటల చొప్పున పని చేస్తుండగా, ఇదే వయస్సు గల మగపిల్లలు రోజుకు 3.6 గంటల చొప్పున మాత్రమే పని చేస్తున్నారు. ప్రపంచ బ్యాంకు ప్రచురించిన "జండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా" అన్న రిపోర్టు ఈ అంశాలను పేర్కొన్నది

కుటుంబాలలోని బాలురు, బాలికల కంటే తక్కువ కాలం ఇంటి పనులను చేస్తున్నారు. నేపాల్ భౌగోళికంగా, ఒకరకమైన మండలంలో ఉంటే, కీన్యా మరొక రకమైన మండలంలో ఉన్నది. అయినా, ఆడపిల్లలు ఇంటిపనులు చేయటానికి సంబంధించినంతవరకూ ఈ రెంటికీ చక్కని పోలికలున్నాయి. కుటుంబంలోని బాలుర కంటే, బాలికలు ఎక్కువ కాలం ఇంటి పనులను చేస్తున్నారు. ఆడపిల్లలు పని చేస్తున్నా, వీరు అధికార నిర్వచనం ప్రకారం "లేబర్ ఫోర్స్" క్రిందకు రారు. కాని, వీరు చిన్న నాటి నుండి - ముఖ్యంగా పేద కుటుంబాలలో - ఇంటి పనులను, పొలం పనులను, సంపాదన కుపకరించే ఇతర రకాల పనులను చేస్తున్నారు. ఇండోనేషియాకు చెందిన జావాలో పేద కుటుంబాలలోని 10-15 సంవత్సరాల మధ్య వయస్సు ఆడపిల్లలు సగటున మాసానికి 94 గంటల చొప్పున ఇంటి పనులను చేస్తున్నారు; మగ పిల్లలు 36 గంటలు మాత్రమే పని చేస్తున్నారు. మధ్య తరగతి కుటుంబాలకు చెందిన ఆడపిల్లలు మాసానికి డెబ్బై గంటల చొప్పున పని చేస్తుండగా, మగ పిల్లలు ఎనిమిది గంటలు చొప్పున మాత్రమే ఇంటి పనులను చేస్తున్నారు. సంపన్న కుటుంబాలకు చెందిన ఆడపిల్లలు మాసానికి 26

గంటల చొప్పున ఇంటి పనులను చేస్తుండగా, బాలురు తొమ్మిది గంటల చొప్పున మాత్రమే ఈ పనులను చేస్తున్నారు.

ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో ఆడపిల్లలు ఇంటి పనులను అధికంగా చేస్తొంటే, మగపిల్లలు బయటి పనులను, ఆడపిల్లల కంటే ఎక్కువ కాలం చేస్తున్నారు. ఫిలిపీన్స్‌లో 12-14 సంవత్సరాల మధ్య వయస్సు గల ఆడపిల్లలు, మగ పిల్లల కంటే రెండు రెట్ల కాలము ఇంటి పనులను చేస్తున్నారు. లేబర్ మార్కెట్ పనులను మాత్రం మగపిల్లలు చేసిన దానిలో సగభాగాన్నే ఆడపిల్లలు చేస్తున్నారు.

పెరూ దేశ పరిస్థితుల మీద ప్రపంచబ్యాంకు నిపుణులు 1991వ సంవత్సరంలో రెండు సర్వేలను నిర్వహించారు. వీరు కొన్ని వివరాలను వెల్లడించారు. బడికి వెళ్ళని వారిలో, 5-7 సంవత్సరాల మధ్య వయస్సు గల ఆడపిల్లలలో 30 శాతం మంది, 8-10 సంవత్సరాల మధ్య వయస్సు గల వారిలో సగం మంది వేతనార్జనకు (లేబర్ మార్కెట్‌కు) వెళుతున్నారు. (మరికొన్ని వివరాలను పదవ పట్టికలో చూడవచ్చు) బడికి పోతున్న పిల్లలలోనూ, బడికి పోని పిల్లలలోనూ, ఇంటి పనులను చేసేవారిలో బాలురకంటే బాలికలే అధికంగా ఉన్నట్లు ఈ వివరాలు చిత్రిస్తున్నాయి. బడికి వెళుతూ, లేబర్ మార్కెట్‌కు వెళుతున్న వారిలో ఆడపిల్లల కంటే మగపిల్లలు అధికంగా ఉన్నారు. వీరు బడికి వెళ్ళకుండా ఎగవేసి పనులకు పోతూండటాన్ని బట్టి, వారికి ఏపాటి అక్షరాస్యత అబ్బగలదో ఊహించటం కష్టం కాదు.

ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా ఖండపు దేశాలలో, తలిదండ్రుల ఆదాయపు పెరుగుదల, మగపిల్లలు ఇంటి పనులను చేయటం కంటే కూడా, ఆడపిల్లలతో ఈ పనులను చేయించటం వలన అధికంగా పెరుగుతున్నట్లు ప్రపంచ బ్యాంకు నిపుణులు కె. హైడ్ నిరూపించారు. కొన్ని రకాల వ్యవసాయపు పనులను పిల్లలు పెద్దలతో సమంగా చేయగలరని భారతదేశంలో జరిగిన కొన్ని సర్వేలు నిరూపించాయి. పేద కుటుంబాలకు చెందిన మహిళ ఆదాయం పదిశాతం పెరిగితే, ఆ కుటుంబానికి చెందిన ఆడపిల్లల బడి హాజరు ఐదు శాతం వరకూ తగ్గుతుందని ఎం రోజెన్‌విగ్ అనే సోషల్ సైంటిస్టు అంచనా వేశారు. కుటుంబంలో చిన్న పిల్లలకు జబ్బు చేస్తే వారి కంటే పెద్దవారయిన ఆడపిల్లలు, వారు బడికి వెళుతున్నా, వారితో బడి హాజరును మాన్పించి జబ్బు పడిన వారి సేవలకు ఇంట్లో ఉంచుతారు

సింగపూర్ విశ్వవిద్యాలయానికి చెందిన ఆర్. ఇవాన్‌స్టన్, బి పాప్‌కిన్‌లు, ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్‌కు చెందిన యం.పిట్, యం. రోజెన్‌విగ్‌లు ఇండోనేషియాలో జరిపిన సర్వేల ఫలితాలు ఈ విషయాన్ని చక్కగా చిత్రించాయి కుటుంబంలో చిన్న పిల్లలకు జబ్బు చేసినపుడు, వారి కంటే పెద్ద పిల్లలయిన బాలుర మీద కంటే, బాలికల మీదే కుటుంబం అధికంగా ఆధారపడుతున్నది. పధ్నాలుగు - పద్దెనిమిది సంవత్సరాల మధ్య వయస్సు గల మగపిల్లలలో మూడు శాతం మంది మాత్రమే ఇంటి పనులు చేస్తొంటే, 25 శాతం మంది ఆడపిల్లలు ఈ పనులను చేస్తున్నారని వీరు సూచించారు. బాలురలో 61 శాతం మంది బడికి వెళుతుంటే, బాలికలలో సగం మంది మాత్రమే బడిలో చేరి చదువుతున్నారు. సర్వేలో పరిశీలనకు తీసుకొన్న పిల్లల తల్లులలో నూరింట 25 మంది లేబర్ మార్కెట్‌కు వెళుతుంటే, 75 మంది ఇంటి పట్టున ఉండి ఇంటి పనులను చేసుకొంటున్నారు. కుటుంబంలో చిన్న పిల్లలకు జబ్బు చేసినపుడు, పదమూడేండ్ల వయస్సును మించిన మగపిల్లలు బడిమాని గాని, లేబర్ మార్కెట్ పనిమానిగాని ఇంట్లో ఉండి సహాయం చేయటం లేదు. చిన్న పిల్లలకు జబ్బు చేయటం అనేది 29 శాతం పెరిగితే, ఆ బిడ్డ తల్లి కూలిపని మానటం అనేది 63 శాతం వరకూ ఉంటున్నది; అదే కుటుంబంలోని ఆడపిల్లలు (14-18 సంవత్సరాల మధ్య వయస్సు గలవారు) కూలి పనులకు వెళుతుంటే, వారు పనిని మానటం అనేది 25 శాతం వరకూ ఉంటుంది. వారు ఒక వేళ బడికి వెళ్ళి చదువుకుంటున్న వారయితే, వారి బడి హాజరు 15 శాతం వరకూ తగ్గుతున్నది (కూలి పనినీ బడి హాజరును మాని చిన్న పిల్లల సేవకు ఇంట్లో ఉంటున్నారన్న మాట), వీరు ఇంటి పనులు చేయటం అనేది 53 శాతం వరకూ పెరుగుతున్నది.

పెరిగిన పెద్ద పిల్లలు బడిమాని లేబర్ మార్కెట్ పనులకు వెళుతున్నారు. ఇలాంటి కుటుంబాలలోని ఆడపిల్లలు, విశ్రాంతి కూడా తీసుకోకుండా ఇంటి పనులలో మునిగి పోతున్నారు. ఆడపిల్లలు ఇంటి పనులను చూస్తుండబట్టి వారి

తల్లులు ఎక్కువ రోజులు వేతనార్జనకు పోగలుగుతున్నారు.

కుటుంబంలోని ఆడపిల్లల పోషణ, సంరక్షణలకు పెద్దలు వినియోగించే కాలపరిమాణం, మగ పిల్లలకు వినియోగించే దాని కంటే 23 శాతం తక్కువగా ఉంటున్నట్లు ఫిలిపీన్స్‌లో జరిగిన ఒక సర్వే సూచించింది. కుటుంబంలోని తొలి శిశువుగా జన్మించే ఆడపిల్ల మాత్రం ముక్కు పచ్చలారక ముందే, గృహ నిర్వహణ, శిశు సంరక్షణా భారాలను మోయవలసి వస్తున్నది! తన బాగును ఆ బిడ్డ కుటుంబ శ్రేయస్సుకు పెట్టుబడిగా పెడుతున్నది.

బోట్స్‌వానా, ఇథియోపియా దేశాలలో మగపిల్లలు పశువులకాపరులుగా వెళ్ళటం ఆచారంగా వస్తున్నది. ఈ ఆచారాన్ని చూపుతూ మగపిల్లలు మాత్రం ఇంటి పనులను చేయటం లేదా అని ప్రశ్నించవచ్చు. కాని ఆచరణలో చూస్తే, ఆడపిల్లలకు మగపిల్లలతో సమానమైన స్థానం కుటుంబంలో లభించటంలేదు. అన్ని దేశాల లోనూ, తరతమ భేదాలతో లింగ వివక్ష ఉంటున్నది. మగపిల్లలు కొంత మేరకు ఇంటి పనులను చేస్తూ ఉండవచ్చు. కాని తలిదండ్రులకు, ముఖ్యంగా తల్లికి వేతనార్జనకు వెళ్ళే అవకాశాన్ని కల్పించేంత అధికంగా వీరు ఇంటి పనులను చేయటం లేదు. కాని ఈ కార్యాన్ని ఆడపిల్లలు నిర్వహిస్తున్నారు! ఇంతటి కీలక పాత్రను నిర్వహిస్తున్న ఆడపిల్ల బడికి వెళితే, తల్లికి వేతనార్జనావకాశాలు ఉండవు. కుటుంబం కొంత ఆదాయాన్ని కోల్పోతుంది. కనుక ఆడపిల్లలను బడికి పంపటం వలన, మగపిల్లలను బడికి పంపినప్పటి కంటే, కుటుంబం, ముఖ్యంగా పేద కుటుంబం, అధికంగా నష్ట పడుతుంది. ఇందువల్లనే ఆడపిల్లలను బడిలో చేర్చటానికి తలిదండ్రులు వెనుకాడుతారు. చేర్పించినా, ఇంటి అక్కరల నిమిత్తం తరచూ వారి బడి హాజరును మాన్పిస్తూ ఉంటారు. ఇందువల్ల వారికి అక్షరాస్యత అబ్బటం కూడా గగన కుసుమమవుతుంది. కాని వీరే మగపిల్లలను బడికి పంపటానికి మాత్రం తయారవుతారు.

చాలా మంది పరిశీలకులు ఈ విషయాన్ని విస్మరిస్తు న్నారు. ఆడపిల్ల ఇంటిపట్టున ఉండి ఇంటి పనులను చేసినందుకు గాని, లేక వేతనార్జనకు వెళ్ళినందుకు గాని, పిల్లల వేతన రేట్ల ప్రకారం ఆ బిడ్డ శ్రమకు విలువ గడుతున్నారు. ఇది వాస్తవ విరుద్ధం. ఆ బిడ్డ ఇంటి వద్ద ఉండి, ఇంటి పనులను చక్క బెట్టక పోయి ఉంటే, తల్లి వేతనార్జనకు వెళ్ళ గలిగేది కాదు కనుక, ఆవిడ శ్రమకు పెద్దల కూలిరేటు ప్రకారం వేతనాన్ని లెక్క గట్టాలి. ఈ అంశపు విస్మరణ వలన ఆడపిల్లల సేవల విలువ తగ్గిపోతున్నది. దాని ప్రాధాన్యత వెలుగుకు రావటం లేదు.

కుటుంబం పేదరికాన్ని అనుభవిస్తున్న పరిస్థితులలో ఆడపిల్ల బడికి వెళ్ళటం వలన తల్లి ఆర్జనను కుటుంబం కోల్పోతుంది. ఇది కుటుంబానికి నష్టదాయకం. ఇది చాలదన్నట్లు ఆ బిడ్డకు, స్కూలు ఫీజు, పుస్తకాలు, రవాణా వంటి అదనపు ఖర్చులను కుటుంబం భరించవలసి వస్తున్నది ఇది కుటుంబానికి అదనపు భారంగా రూపొందుతున్నది. మగపిల్లలు ఎలాగూ ఇంటిపనులు చేయటం లేదు. చేసినా వారిపని, తల్లిని వేతనార్జనకు విడుదల చేసేంతగా ఉండటం లేదు. కనుక వీరు చదువులకు వెళ్ళినా, పుస్తకాలు, ఫీజుల వంటి ఖర్చులు మాత్రమే ఉంటాయి. తల్లి ఆర్జన నష్టమయ్యే ప్రమాదం లేదు. ఈ విధంగా చూచినపుడు మగపిల్లలను చదివించటం కంటే, ఆడపిల్లలను చదివించటానికే కుటుంబం అధిక ఆర్థిక భారాన్ని మోయవలసి వస్తున్నట్లు కనుపిస్తుంది. కనుకే ఆడపిల్లలను చదివించటానికి తలిదండ్రులు - ముఖ్యంగా పేద కుటుంబాల వారు వెనుకాడతారు. ఈ కీలకాంశాన్ని మనం మరువ కూడదు. స్త్రీ విద్యా వ్యాప్తి కున్న అవరోధాలలో ఇది అతి పెద్దది.

కొన్ని సామాజిక సంప్రదాయాలు, కట్టుబాట్లు కూడా ఆడపిల్లల చదువులకు అవరోధాలుగా ఉంటున్నాయి. ఆడ పిల్లలకు ఏదయినా జరుగరానిది జరిగితే, "కుటుంబ గౌరవం" పోతుంది. కనుక ఆవిడకు కొన్ని రకాల రక్షణలు అవసరమవుతున్నాయి. కొన్ని దేశాలలో ఆడవారు మగవారితో కలిసి తిరిగే వీలు లేదు. అది నిషిద్ధం. ఆడపిల్ల రజస్వల కాగానే చదువు మాన్పించటం అనేది అధికంగా కనుపిస్తున్నది. ఇలాంటి కారణాల వలన ఆడపిల్లలు ఇంటి పనులు చేయవలసిన అక్కర లేకపోయినా, తలిదండ్రులు వారిని బడికి పంపటానికి వెనుకాడుతారు. ఇంటి దాపులో బడి ఉంటే ఆడపిల్లలను పంపటానికి వీరు ఇష్టపడతారు. ఆడపిల్లలకు బడిలో అవసరమైన అన్ని వసతులూ ఉండాలి. బడి యాజమాన్యం క్రమశిక్షణను కఠినంగా అమలు జరిపేదిగా

ఉండాలి. ఉపాధ్యాయులుగా మహిళలే పనిచేస్తూ ఉండాలి. ఇలాంటి వసతులు లేనిచోట్ల ఆడపిల్లలను తలిదండ్రులు చదువులకు పంపటానికి వెనుకాడుతారు ఈ పట్టింపులు గ్రామీణ ప్రాంతంలో అధికంగా ఉంటాయి తలిదండ్రులు అక్షరాస్యులు గానపుడు, వారు తమ బిడ్డలను చదివించటానికి అంత సులభంగా పూనుకోరు.

బడి ఇంటికి ఎంత దగ్గర్లో ఉంటే అంత మంచిదని అనుకొంటారు ఇలాంటపుడు పిల్లల రక్షణ మీద "ఒక కన్ను వేసి ఉంచటం" సులభం బడి దూరమయి, రిక్షాలోనో, బస్సులోనో పోవలసి ఉంటే, ఖర్చులు పెరగటానికి తోడు, వారి "రక్షణా" సమస్య ఎదురవుతుంది. విద్యాలయం ఇంటికి ఒక కిలోమీటరు దూరంలో ఉన్నపుడు, 94 శాతం మంది మగపిల్లలు బడికి వెళుతుండగా, ఆడపిల్లలలో 74 శాతం మంది మాత్రమే బడికి వెళుతున్నారు. బడి ఇంటికి రెండు కిలోమీటర్ల దూరంలో ఉన్నపుడు బడికి వెళ్ళే మగపిల్లల పరిమాణం 90 శాతానికి తగ్గగా, ఆడపిల్లల శాతం 64కు తగ్గింది! ఈజిప్టులో జరిగిన ఒక సర్వే వెల్లడించిన సమాచారమిది ఘనాలో జరిగిన సర్వేలు కూడా, ప్రాథమిక పాఠశాల ఇంటికి దూరమయిన కొలదీ, ఆ బడిలో చదివే ఆడపిల్లల సంఖ్య తగ్గుతున్నట్లు సూచించాయి. సెకండరీ స్కూలు, ప్రాథమిక పాఠశాలకు దగ్గర్లో ఉన్న సందర్భాలలో, ఆడపిల్లలను చదివించటానికి వారి తలిదండ్రులు ఉత్సాహాన్ని చూపుతున్నట్లు కూడా ఈ సర్వే సూచించింది.

కొన్ని దేశాలలోనూ, దేశంలోని కొన్ని ప్రాంతాలలోనూ, ఆడపిల్లలకు మహిళలే ఉపాధ్యాయులుగా ఉండాలని తలిదండ్రులు కోరుకుంటారు. ముఖ్యంగా ముస్లిం దేశాలలో ఈ అభిప్రాయం బలంగా ఉన్నది. పాకిస్తాన్ ముస్లిం దేశమయినా, ఆ దేశంలోని ప్రాథమిక పాఠశాలలో పని చేస్తున్న ఉపాధ్యాయ సిబ్బందిలో, మూడవ వంతు మేరకే మహిళలున్నారు. బంగ్లాదేశ్‌లో వీరి సంఖ్యా పరిమాణం ఐదవ వంతు మేరకే ఉన్నది. కీన్యా లోని తలిదండ్రులకు, తమ ఆడపిల్లలకు పురుషోపాధ్యాయులు చదువు చెప్పటం సమ్మతమే; కాని తమ బిడ్డలు గర్భవతులవు తారేమోనని భయపడుతూ ఉంటారట! ప్రపంచబ్యాంకు నిపుణులు సేకరించిన అంశాలలో ఇదొకటి. సెకండరీ స్థాయి విద్యాలయాలలో, ఉపాధ్యాయినులులేనపుడు, ఆ పాఠశాలలో చేరే విద్యార్థినుల సంఖ్య కూడా తక్కువగా ఉంటున్నట్లు కనుపిస్తున్నది. తలిదండ్రుల భయాల కిది ప్రతిబింబం

మహిళా అక్షరాస్యత, భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలో కన్న కేరళ రాష్ట్రంలో అధికంగా ఉన్నది ఈ రాష్ట్రంలోని ఉపాధ్యాయ సిబ్బందిలో నూరింట అరవై మంది వరకూ ఉపాధ్యాయినులున్నారు భారతదేశ పరిస్థితిని చూచినపుడు దేశపు ఉపాధ్యాయ సిబ్బందిలో నూరింట ఇరవై మంది మాత్రమే ఉపాధ్యాయినులున్నారు. స్త్రీ అక్షరాస్యతలో వెనుకబడిన ఉత్తరాది రాష్ట్రాలలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నది ఉత్తరప్రదేశ్ ఉపాధ్యాయ సిబ్బందిలో నూరింట 18 మంది, మధ్యప్రదేశ్‌లో 13 మంది మాత్రమే మహిళలున్నారు ఆడపిల్లలకు ప్రత్యేక పాఠశాలలు లేక పోవటం చేత, ఆడపిల్లలు మగపిల్లలు కలిసి చదివే పాఠశాలలలో తగినంత మంది ఉపాధ్యాయినులు లేక పోవటం చేతా, తమ బిడ్డల చదువులను తలిదండ్రులు మధ్యలోనే మాన్పిస్తున్నట్లు 1984లో, మధ్యలో చదువులను మానుతున్న విద్యార్థుల సమస్యను అధ్యయనం చేసిన బి ఆర్ పాటిల్ వెల్లడించారు పురుషోపాధ్యాయులు చదువులు చెప్పే పాఠశాలలలో చదువుతున్న తమ బిడ్డలకు ఏడు లేక ఎనిమిది సంవత్సరాల వయస్సు రాగానే, వారి చదువులను తలిదండ్రులు మాన్పిస్తున్నట్లు డి.బి గుప్తా - వారి సహచరులు నిర్వహించిన సర్వే సూచించింది.

గ్రామీణ ప్రాంతాలలో పని చేస్తున్న ఉపాధ్యాయినుల సంఖ్య చాలా తక్కువగా ఉంటున్నది. రవాణా వసతుల కొరత, వారు పనిచేసే కొత్త ప్రాంతాలలో తగిన రక్షణ లేక పోవటం వంటివి ఇందులకు కారణాలుగా కనుపిస్తున్నాయి.

బడిలో పిల్లలకు చెప్పే పాఠ్యాంశాలు, బోధనా నైపుణ్యం కూడా స్త్రీ విద్యా వ్యాప్తిని ప్రభావితం చేస్తున్నాయి. ఆడపిల్లలను బడికి పంపటం అత్యధిక ఖర్చుతో కూడిన పని అనీ, పేద కుటుంబాల వారికిది భారమైన విషయమనీ చూచాం. ఇలాంటి పరిస్థితులలో తమ బిడ్డలను బడికి పంపేవారు, వారి బిడ్డలకు నైపుణ్యయుక్తమైన బోధన లభించాలని, పెట్టిన పెట్టుబడికి వీలయినంత అధిక ప్రతిఫలం రావాలని వారు ఆశించటం అత్యాశ కాదు.

కొన్ని పాఠశాలలలో పిల్లలకు బోధించే పాఠ్యాంశాలు

## గ్రామాల్లో ఉపాధ్యాయినుల కొరతకు కారణాలు కోకొల్లలు !

ఉత్తరప్రదేశ్‌లోని నైనిటాల్ జిల్లాకు చెందిన ముర్ఘదియా గ్రామంలోని స్కూల్లో ఒక్క ఉపాధ్యాయిని మాత్రమే ఉన్నారు రెండవ వారిని ఆ స్కూల్ హెడ్మిస్ట్రెస్‌గా పోస్టు చేశారు. కాని ఆవిడ ఛార్జి తీసుకోలేదు! ఆవిడకు పోస్టింగ్ వచ్చిన తర్వాత, వారి సోదరుడు వచ్చి ఆగ్రామాన్ని చూచి అచ్చట పరిస్థితులను గమనించి వెళ్ళారు. అది పర్వత ప్రాంతంలోని మారుమూల గ్రామమని, అచ్చట తన సోదరి బాధలు పడవలసి ఉంటుందని ఆ సోదరుడు భావించి, ఆవిడను ఆ స్కూలుకు పంపలేదు!

ఇలాంటి మారు మూల గ్రామాలలో ఉపాధ్యాయినులు పలు సమస్యలను ఎదుర్కొన వలసి ఉంటుంది

గ్రామీణ ప్రాంతంలో స్త్రీలకు తగిన నివాస వసతి లభించటం కష్టం. లభించినా ఏకాకిగా ఉండటం కష్టం. వసతులుండవు. ఒక్కరుగా ఉంటే ఎలాంటి ప్రమాదం ముంచుకొస్తుందో నన్న భయం. ఉత్తరప్రదేశ్‌లోని మధుర జిల్లాకు చెందిన సింగపత్తి గ్రామంలో ఇటీవల కొందరు ఉపాధ్యాయినుల మానభంగాలు జరిగాయి. సెక్సు పరమైన వేధింపులకు కొందరు గురయినారు. ఇదే రాష్ట్రంలోని సుల్తాన్పూర్ జిల్లాకు చెందిన నేరి గ్రామంలో, ఉపాధ్యాయినులకు క్వార్టర్సు ఉన్నాయి. కాని గుండాల భయం వల్ల ఎవరూ రావటం లేదు. ఉపాధ్యాయిని మరొక గ్రామంలో ఉంటూ ఈగ్రామానికి వచ్చి పనిచేసి పోతూ ఉండవచ్చు. కాని రవాణాకు అధిక కాలం పడుతుంది. మార్గ మధ్యంలో "ఏమయినా జరుగవచ్చు" నన్న భయం వారిని వెంటాడుతూ ఉంటుంది.

పురుషాధిక్యతా సంస్కృతి కూడా ఇందులో తన వంతు పాత్ర నది నిర్వహిస్తున్నది. ఉత్తర భారత దేశంలోని అవివాహిత యువతి, మరొక గ్రామంలో పని చేయటానికి వెళ్ళటాన్ని వారి కుటుంబీకులు అంగీకరించరు. ఒక వేళ ఆవిడ వివాహిత అయి ఉంటే, భర్త ఉన్న గ్రామంలో మాత్రమే ఆవిడ ఉండాలి. ఒంటిగా మరొక గ్రామంలో ఉండటాన్ని సామాజికులు అంగీకరించరు. అంతేగాదు; వివాహిత యువతి, ఉద్యోగం చేస్తున్నా, ఇంటి పనంతటిని కూడా ఆవిడ చేయక తప్పదు!

పురుషాధిక్యతా సంస్కృతి, విద్యాలయ ప్రాంగణంలోనూ, తన వంతు పాత్ర నది నిర్వహిస్తున్నది. ఉపాధ్యాయినులు తరచూ సెక్సుపరమైన వేధింపులకు గురిగావటం అతి సామాన్యమైన విషయం. ఇది చాలదన్నట్లు, ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులను రెండవ తరగతి పనివారిగా చూస్తున్నారు. అఖరుకు పురుష జూనియర్ టీచర్లు కూడా టీ పెట్టే పనిని ఉపాధ్యాయినులకు అప్పగించటాన్ని "ప్రోబ్" టీమ్ కళ్ళారా చూచింది! ఉపాధ్యాయిని, తోటి ఉపాధ్యాయుల కంటే సీనియరయినా, రికార్డులు మోసే భారాన్ని కూడా తీసుకోవాలి! ఒక స్కూల్ హెడ్మాస్టరుకు తన స్కూలులో ఏమి జరుగుతున్నది కూడా తెలియదు! అందుకు సంబంధించిన సమాచారాన్ని ఉపాధ్యాయిని ఇవ్వవలసి వచ్చింది! దానిని బట్టి ఆఫీసు పని నంతటినీ ఎవరు చేస్తున్నారో గమనించవచ్చు.

రాజస్థాన్‌లోని ఉదయపూర్ జిల్లాకు చెందిన గింగ్లా గ్రామంలో స్కూలు ఉపాధ్యాయులతో "ప్రోబ్" సభ్యులు మాట్లాడుతుండగా, ఉపాధ్యాయినులు తలమీద ముసుగులు వేసుకొని వారి వెనుక నిలుచున్నారు.

పాఠశాల ఆవరణలో మరుగుదొడ్లు లేకపోవటం కూడా ఒక సమస్యగానే ఉన్నది. ఈ సమస్య ఒక్క గ్రామీణ పాఠశాలలకే పరిమితమని భ్రమించనవసరంలేదు. ఢిల్లీ నగరంలో పనిచేస్తున్న ఉపాధ్యాయిని, మండే వేసవిలో కూడా టీ తాగటానికి సాహసించేదిగాదట! టీత్రాగితే మూత్ర విసర్జనకు వెళ్లవలసి వస్తుందని ఆవిడ భయమట!

మన విద్యావ్యవస్థకు, దాని అధీనంలో పనిచేస్తున్న ఉపాధ్యాయినుల కనీస అవసరాలను కూడా గుర్తించ గల శక్తి లేదని ఈ విషయాలు నిరూపిస్తున్నాయి.

*- 1998వ సం॥రంలో విడుదలయిన "పబ్లిక్ రిపోర్టు ఆన్ బేసిక్ ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా" అన్న రిపోర్టు ఆధారంతో*

వారి తలకు మించినవిగా ఉంటాయి కొన్ని సందర్భాలలో అవి జీవితానికి దూరంగా ఉంటాయి: లెక్కలు, సైన్సు వంటి సాంకేతిక అంశాల బోధన అధ్వాన్నంగా ఉంటుంది. అవసరమైన ప్రయోగ సామగ్రి పాఠశాలలో ఉండదు అంతేగాదు. పిల్లల విద్యార్జన ముగిసిన తర్వాత, వృత్తి నైపుణ్యమూ, అధిక వేతనార్జనలకు అనువైన ఉద్యోగాలలో ప్రవేశించటానికి తగిన విద్యాబోధనను తలిదండ్రులు ఆశిస్తారు. ఇవి లభించనపుడు పిల్లలను బడికి పంపటానికి తలిదండ్రులు వెనుకాడుతారు

కొన్ని దేశాలలో ఆడపిల్లలను అల్పులుగాను, మగపిల్లలను అధికులు గాను చిత్రించే పాఠ్యాంశాల బోధన జరుగుతూ ఉంటుంది. అన్ని రకాల వృత్తులలో తామూ ప్రవేశించే అర్హత తమకూ ఉన్నదన్న విశ్వాసాన్ని బోధన ప్రోత్సహించదు; నిరుత్సాహ పరుస్తుంది. ఇందువల్ల ఆడపిల్లల భవిష్యత్తు దెబ్బతింటుంది. ఇటువంటి అంశాల బోధన లింగపరమైన అసమానతలను సహజసిద్ధమైన అంశాలుగా చిత్రించి, ఆడపిల్లలను అశక్తులను చేసే అవకాశాలుంటాయి.

ప్రాథమిక స్థాయి వరకో, లేక మాధ్యమిక స్థాయి నుండి సెకండరీ స్థాయి వరకో చదువు చెప్పే విద్యాలయాలు ఉన్నచోట్ల, ఆడపిల్లలను ఇటువంటి స్కూళ్ళకు పంపటానికి తలిదండ్రులు ఉత్సాహాన్ని చూపరు. ఒకసారి తమ పిల్లలను బడికి పంపటం ప్రారంభిస్తే, అదే విద్యాలయంలో లేదా అదే గ్రామంలో లేక కేంద్రంలో వారు సెకండరీ స్థాయి విద్యను కూడా పూర్తి చేయగల అవకాశాలుండాలని తలిదండ్రులు ఆశిస్తారు. ఉన్న ఊరిలో ప్రాథమిక విద్య నభ్యసించిన ఆడపిల్లలను, సెకండరీ విద్యార్జనకు మరొక ఊరికి పంపటానికి కొందరు తలిదండ్రులు ఇచ్చగించరు; కొందరకు అందుకు తగిన ఆర్థిక స్థోమత ఉండదు. ఇందువల్ల ఈ రెండు స్థాయిలలో ఏదో ఒకటే ఉన్నచోట్ల ఆడపిల్లలను చదివించటానికి తలిదండ్రులు ఉత్సాహాన్ని ప్రదర్శించటంలేదు.

ఈ సమస్యా పరిష్కారానికి సాధనంగా టాంజానియా, సెకండరీ స్కూలు విద్యాలయ ప్రవేశార్హతను పెంచటం కోసం, ఆడపిల్లలకు, మగపిల్లల కంటే తక్కువ మార్కుల పరిమితిని నిర్దేశించింది. ఇది శాశ్వత పరిష్కార మార్గం కాదు. బోధనా విధానాన్ని మెరుగుపరచి, ఆడపిల్లల విద్యార్జనా శక్తిని పెంచటం చక్కని మార్గం.

ఆడపిల్లలు, మగపిల్లల వలె ఎందుకు అర్హతకు తగిన మార్కులను సంపాదించలేకపోతున్నారు అన్న సమస్య వస్తుంది కుటుంబ ఆర్థిక పరిస్థితి ఎంత నాసిగా ఉంటే, ఆడపిల్లల విద్యార్జనా శక్తి కూడా అంత తక్కువగా ఉంటుందని ఐవొరీకోస్ట్ పరిశీలనలు వెల్లడిస్తున్నాయి ప్రాథమిక విద్యాబోధన ఉచితమే అయినా, కుటుంబ ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా లేకపోవటంచేత అల్పాదాయ వర్గాల వారు తమ బిడ్డలను బడికి పంపటానికి సాహసించటం లేదు. అలాంటి కుటుంబాలలో మగపిల్లల కంటే ఆడపిల్లలు ఇంటి పనులను అధికంగా చేయవలసి వస్తున్నది పనిలో ఉండటం చేత తగినంత కాల వ్యవధి లేక, పని చేయటం వలన అలసిపోయి చదువు మీద తగినంత శ్రద్ధను ప్రదర్శించ లేకపోవడంచేత బాలికలు బాలురతో సమంగా చదువ లేకపోతున్నారు. తమ విద్యాస్థాయిని దాటిన అక్కలు కుటుంబంలో ఉన్నపుడు, వారి చెల్లెండ్రు అధిక విద్యార్జనా స్థాయిని ప్రదర్శిస్తూ ఉండటం కనుపిస్తున్నది. పాఠ్యాంశాల అధ్యయనంలో అక్కల సహాయం, ప్రోత్సాహం లభిస్తూండటమే ఇందుకు కారణం. ప్రపంచ బ్యాంకు పలు దేశాలలో - ముఖ్యంగా వెనుకబడిన దేశాలలో నిర్వహించిన పలు సర్వేలు ఈ విషయాన్ని ధ్రువపరచాయి.

ఆడపిల్లల ఆరోగ్యము, పోషణా స్థాయి కూడా, వారి విద్యార్జనా శక్తిని ప్రభావితం చేస్తున్నట్లు సర్వేలలో తేలింది. అనారోగ్యంగా ఉన్నా, ఆకలిగొని ఉన్నా, ఏ వ్యక్తీ విద్యను సక్రమంగా ఆర్జించలేడు. అటువంటపుడు చిన్నపిల్లల పరిస్థితి ఇంకా ఎంత అధ్వాన్నంగా ఉంటుందో ఊహించటం కష్టం కాదు. ముఖ్యంగా ఆసియా ఖండంలో, ప్రత్యేకంగా దక్షిణాసియా ప్రాంతంలో ఇలాంటి పరిస్థితులు అధికంగా ఉన్నాయని ప్రపంచబ్యాంకు నిర్వహించిన పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. పోషణా, ఆరోగ్య రక్షణాంశాలలో లింగవివక్ష ప్రదర్శిత మవుతున్న పరిస్థితులలో మగపిల్లలతో సమంగా ఆడపిల్లలు చదువలేరు; వారంత ఆరోగ్య ప్రదంగా ఉండలేరు. జీవితంలోని పలు దశలలో ఆడపిల్లల మరణాలు బాలుర మరణాల కంటే అధికంగా ఉంటున్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. కోట్లాది మంది మహిళలు అకాల మరణం పాలవుతున్నట్లు ప్రొఫెసర్ అమార్త్య సేన్ నిరూపించిన విషయాన్ని తెలుసుకొన్నాం.

ఈ అంశాన్ని భారత ప్రభుత్వం యునిసెఫ్ సహకారంతో ప్రచురించిన 'ది లెస్సర్ ఛైల్డ్' అనే పుస్తకం చక్కగా చిత్రిస్తున్నది. దీనిలోని సమాచారం ప్రకారం మగపిల్లలలో (పసిబిడ్డలలో) 43 శాతం మందిలో పెరుగుదల సక్రమంగా ఉండటం లేదు; ఆడపిల్లలలో పెరుగుదల సక్రమంగా లేనివారి శాతం 79 వరకూ ఉన్నది! ఒకటి - రెండు సంవత్సరాల మధ్య వయస్సు పిల్లలలో, బాలురలో 63 శాతం మందిలో పెరుగుదల సక్రమంగా లేదు; ఆడపిల్లలలో పెరుగుదల సక్రమంగా లేనివారి సంఖ్యాపరిమాణం 86 శాతం వరకూ ఉన్నది! "మగపిల్లలను సర్వ సమర్థులుగా పరిగణిస్తూ, ఆడపిల్లల జననాన్ని అత్యంత భయంకరమైన అంశంగా పరిగణించే సంస్కృతిలో ఆడపిల్లగా పుట్టటం, మానవుని కన్న హీనమైన జన్మకింద జమ.... తల్లి గర్భం నుండి సజీవంగా బయటబడగలిగినా, అటు తర్వాత జీవించే అదృష్టం లభించినా, బాలురతో సమంగా పోషణ, ఆరోగ్య రక్షణ, విద్యార్జన, ఉద్యోగావకాశాలు, మానవులుగా పరిగణనను పొందే

### భారతదేశంలో ఆడపిల్లలు బడికి పోక పోవటానికి కారణమేమిటి?

కుటుంబ పోషణకు వారి శ్రమ అవసరం గావటమే ఇందుకు కారణమని ప్రపంచ బ్యాంకు ప్రచురించిన "జెండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా" అన్న రిపోర్టు సూచిస్తున్నది. ఈ అంశాన్ని రిపోర్టు ఇలా వివరించింది.

"ఇలాంటి ఆడపిల్లలలో అత్యధిక సంఖ్యాకులు ఇపుడు లేబర్ ఫోర్సులో ఉన్నారు 1981వ సంవత్సరపు అంచనాల ప్రకారం, 11-13 సంవత్సరాల మధ్య వయస్సు ఆడపిల్లలలో, గ్రామీణ ప్రాంతంలో నూరింట 24 మంది, పట్టణ ప్రాంతంలో 9.3 మంది లేబర్ ఫోర్సులో ఉన్నారు. వీరిలో అత్యధికులు వ్యవసాయ రంగంలోనో, దాని అనుబంధిత రంగాలలోనో పని చేస్తున్నారు. ఇలా పనిచేస్తున్న పిల్లలు బడికి వెళ్ళి చదవటం కష్టమవుతుంది కనుకే, ఈ వర్గపు ఆడపిల్లలు నూరింట ఇద్దరు మాత్రమే బడికి హాజరవుతున్నారు.

"గ్రామీణ ప్రాంతంలో పనిచేస్తున్న ఆడపిల్లల సంఖ్యా పరిమాణం 1971-1981 సంవత్సరాల మధ్యకాలంలో త్వరితగతిని పెరిగినట్లు బెనర్జీ అధ్యయనం సూచిస్తున్నది. ఈ కాలంలో గ్రామీణ ప్రాంతంలోని లేబర్ ఫోర్సులో బాలుర సంఖ్యా పరిమాణం ఎనిమిది శాతం తగ్గిపోగా, బాలికల సంఖ్యా పరిమాణం 30 శాతం వరకూ పెరిగింది. కుటుంబ కమతాలలో పనిచేస్తున్న ఆడపిల్లల సంఖ్య, వ్యవసాయ కూలీలుగా పనిచేస్తున్న పిల్లల కంటే అధికంగా పెరిగింది. కుటుంబ కమతాలలో పనిచేస్తున్న ఆడపిల్లలను రైతులుగా జనాభాలెక్కల్లో నమోదు చేశారు. కుటుంబీకుల శ్రమ మీద ఆధార పడుతున్న చిన్న, సన్నకారు రైతు కుటుంబాల వారు కుటుంబంలోని స్త్రీల, ఆడపిల్లల శ్రమమీద ఎంత అధికంగా ఆధారపడుతున్నదీ ఈ అంశం చిత్రిస్తున్నది. ఆడపిల్లలను పని కంపి, మగపిల్లలను బడిలో చేర్చి చదివించటం కూడా కనుపిస్తున్నది.

"పనికి పోని ఆడపిల్లల సంఖ్య నాలుగు కోట్ల వరకూ ఉన్నది. వీరితో ఇంటి పనులనో, బయట పనులనో కుటుంబీకులు చేయిస్తున్నారు. కుటుంబీకుల సంతానం, ఆడ-మగ అన్న భేదం లేకుండా, శిశుప్రాయం నుండే కుటుంబపు పనులలో పాల్గొంటూంటారు. మగపిల్లల కంటే ఆడపిల్లలు ఎక్కువకాలం పనిచేస్తున్నారు. వీరు ప్రధానంగా, ఇంటికి అవసరమైన నీరు తేవటం, వంటచెరకు సేకరించుకు రావటం, వంటా-వార్పూ, చిన్న పిల్లల సంరక్షణ వంటి పనులలో మునిగి పోతారు. వారు పనిచేసే కాలంలో దాదాపు సగాని కంటే ఎక్కువ కాలాన్నే ఈ పనులకు వినియోగిస్తారు.

"దీనికి తోడు చదివించటానికి అయ్యే ఖర్చులు, చదివినా, వారు తేగల సంపాదన మగపిల్లల కంటే తక్కువ ఉండటం" కూడా ఆడపిల్లలను బడికి పంపి చదివించటాన్ని నిరుత్సాహ పరుస్తున్నట్లు రిపోర్టు పేర్కొన్నది. "కుటుంబంలో స్త్రీ పురుషులు నిర్వహిస్తున్న పాత్ర, సమాజంలో స్త్రీకున్న స్థానం, ఆడపిల్లల కన్యాత్వ రక్షణాసక్తి - ఇవన్నీ ఆడపిల్లల ప్రాథమిక విద్యార్జనను నిరోధిస్తున్నాయి" అని ఈ రిపోర్టు నిర్వచించింది.

అవకాశాలు ఆడపిల్లలకు లేవు' అని ఈ ప్రచురణ చాటుతున్నది ఇది భారత దేశంలోని ఆడపిల్లల పరిస్థితిగా మాత్రమే పరిగణించకూడదు ఇది సర్వలోక సత్యం!

ఆడపిల్లలను చదివించటం కుటుంబీకులకు ఎంత భారమైన అంశమో చూచాం. కొన్ని సంప్రదాయాలూ, సాంస్కృతిక అంశాలూ ఆడపిల్లలు మగపిల్లలతో సమంగా విద్యను ఆర్జించే అవకాశాలు లేకుండా చేస్తున్నట్లు కూడా తెలుసుకొన్నాం ఇలాంటి అసమానతల మధ్య పెరిగి, చదువుకొన్న మహిళల ఉత్పత్తి సామర్ధ్యం, ఆర్జనా సామర్ధ్యం కూడా మగవారి కంటే తక్కువగానే ఉండటం సహజం "ఆడపిల్లల సంపాదన తక్కువగా ఉంటుంది కనుక, మగపిల్లలను బడికి పంపి, ఆడపిల్లలను ఇంటి పనులకు ఉంచుకుందాం" అని తలిదండ్రులు నిర్ణయించుకోవటం ఆశ్చర్యకరమైన అంశం కాదు లాభనష్టాలే ప్రధానాంశాలుగా పరిగణనకు వచ్చినపుడు జరిగేది ఇదే! మహిళల వేతనార్జనావకాశాలను, స్వయం ఉపాధి అవకాశాలను కుదించే ప్రభుత్వ ఆర్థిక విధానాలు, మూలిగే నక్క మీద తాటికాయ పడటం వంటివిగా తయారవుతాయి. ప్రభుత్వాలు అనుసరించే విధానాలు అన్ని వర్గాల వారికి సమంగా లాభం చేకూర్చవు కొందరి కవి శాపంగా పరిణమిస్తాయి లేబర్ మార్కెట్లోను, ఉన్నత ఉద్యోగాల విషయం లోనూ మహిళలకు జరుగుతున్న అన్యాయం లోక విదితం. (ఈవిషయాలను మరొక అధ్యాయంలో వివరించాం). మహిళ జీవితంలో ఎదురవుతున్న ఇలాంటి అసమానతల వలన అన్ని రంగాలలోనూ వారు పురుషులకంటే వెనుకబడుతున్నారు. ఇలాంటి అవాంఛనీయ పరిస్థితులలో తలిదండ్రులు, తమ బిడ్డల చదువు మాన్పించి, ఇంటి పనులలో ప్రవేశపెట్టటం అబ్బురంగాదు. ఆడవారు మగవారితో కలిసి తిరగకుండా ఉండటం, స్త్రీలు గడప దాటకుండా ఉండటం, పురుషులు మాత్రమే బయటకు వెళ్ళి సంపాదనకు పాటుబడటం అనేది సంస్కృతి - సంప్రదాయ మైనపుడు, మహిళ "స్వల్ప" సంపాదనా శక్తి ఈ సాంస్కృతిక, సంప్రదాయ బంధాలను బలపరచటానికి తోడ్పడుతున్నది. "ఆడది చదివి చెడితే, మగవాడు చదువక చెడతాడు", వంటి సామెతలు సంప్రదాయ జనితాలే కదా!

ఆడపిల్లల చదువులకున్న అవరోధాలు అన్ని దేశాలలోనూ ఒకే రకంగా లేవు రూపంలోనూ, గుణంలోనూ భేదాలున్నాయి దేశపు అభివృద్ధి దశ వీటిని అధికంగా ప్రభావితం చేస్తున్నది ఏ అభివృద్ధి దశలో అవరోధాలు ఏ రూపంలో, ఎంత తీవ్రంగా ఉంటాయి అని నిర్దిష్టంగా చెప్పటానికి తగినంత సమాచారం లభించటం లేదు తలసరి జాతీయాదాయం మూడు వందల డాలర్లు, అంతకంటే తక్కువగా ఉండే పేద వ్యావసాయిక దేశాలలో, ఆడపిల్లలను బడికి పంపటం కుటుంబానికి ఆర్థికంగా భారమైన అంశంగా ఉంటున్నది సంప్రదాయం కూడా అడ్డు వస్తున్నది. ఇలాంటి చోట్ల బడిలో చేరే ఆడపిల్లల సంఖ్యా పరిమాణం తక్కువగా ఉంటున్నది బడికి వెళ్ళే విద్యార్థినీ, విద్యార్థుల సంఖ్యా పరిమాణంలోనూ అంతరం అధికంగా ఉంటున్నది. దక్షిణాసియా, ఆఫ్రికా ఖండాలలోని అత్యధిక ప్రాంతాలలోని పరిస్థితులు ఈ విషయాన్ని చిత్రిస్తున్నాయి. పిల్లల చదువు ఖర్చులను భరించగల శక్తి చాలా తక్కువ కుటుంబాలకే ఉన్నది. ఆడపిల్లలు ఇంటివద్ద ఉండకపోతే ఇల్లు గడవదు; బడి ఇండ్లకు దూరంగా ఉంటుంది; రవాణా సదుపాయాలు తక్కువ, బడిలో అవసరమైన వసతులుండవు: పాఠశాలలో ఉపాధ్యాయినుల సంఖ్య స్వల్పంగా ఉంటుంది

ఆఫ్రికా ఖండంలో వ్యవసాయం చేసేది ప్రధానంగా మహిళలు ఎదిగిన ఆడపిల్లలు చేతి క్రింద ఉంటే వ్యవసాయపు పనులు కుటుంబానికి తేలికవుతాయి. కనుక పిల్లలను ప్రాథమిక పాఠశాలకు పంపినా, సెకండరీ స్థాయిలో విద్యను మాన్పించి, ఇంటి పనులలో పెట్టటానికి తలిదండ్రులు తాపత్రయ పడతారు.

దీనికితోడు పరిసరాలు పాడుబడుతూ ఉండటం మరొక అవరోధంగా తయారైంది. కుటుంబానికి అవసరమైన నీరు తేవటం, వంటచెరకును పోగుచేసి తేవటం వంటివి పెద్ద పనులై కూర్చున్నాయి. దక్షిణ ఆశియా, ఆఫ్రికా ఖండ దేశాలలో ఈ స్థితి బాధాకరంగా తయారైంది. ఇలాంటి అవరోధాల తొలగింపుకు అవసరమైన నిధులు ప్రభుత్వాలకు లేవు.

జాతీయాదాయం మధ్యస్థంగా ఉన్న దేశాలలో, గ్రామీణ - పట్టణ ప్రాంతాల మధ్య ఉన్న అంతరాలు, లేబర్ మార్కెట్ సమస్యలు స్త్రీ విద్యావ్యాప్తికి అవరోధాలుగా

కనుపిస్తున్నాయి. లాటిన్ అమెరికా దేశాల గ్రామీణ ప్రాంతాలలో, బడిలో చేరే బాలికల సంఖ్య తక్కువగా ఉంటున్నది. ఈ దేశాల పట్టణ ప్రాంతాలలో బడిలో చేరే ఆడపిల్లల సంఖ్య ఆశ్చర్యం గలిగించేంత అధికంగా ఉంటున్నది.

మధ్యప్రాచ్య దేశాలలో కూడా స్త్రీ విద్యావ్యాప్తి క్రమంగా అధికమవుతున్నది. పెట్రోలు నుత్పత్తి చేసే దేశాలలో ఈ నూచనలు స్పష్టంగా కనుపిస్తున్నాయి. ఛాందస సంప్రదాయాలను చాలా వరకూ అధిగమించిన టర్కీ, ట్యునిషియా వంటి దేశాలు, ఈ ప్రాంతపు దేశాలన్నింటి కంటే స్త్రీ విద్యలో అధిక అభివృద్ధిని సాధించాయి. మత సంప్రదాయాలు స్త్రీ విద్యావ్యాప్తిని, వీరి ఉపాధిని నిరోధిస్తున్నాయి. లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంత దేశాలలో కుటుంబ ఇబ్బందుల వలన ఆడపిల్లలను బడికి పంపలేక పోవటం అనేది కనుపించటం లేదు. ఇందువలన ఈ ప్రాంతాలలో మహిళలు అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్లో ప్రవేశించ గలుగుతున్నారు.

## భారతదేశంలో స్త్రీ విద్యావ్యాప్తి

భారతదేశంలో స్త్రీ విద్యావ్యాప్తికి సంబంధించిన మరికొన్ని అంశాలను ఇచట వివరిస్తాం.

భారతదేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించిన తర్వాత, స్త్రీ విద్యావ్యాప్తి త్వరితగతిని జరుగనారంభించింది. మన దేశపు విద్యా పురోగతిని, కొన్ని ఇతరదేశాలతో పోల్చితే, సాధించింది నామ మాత్రమేనని చెప్పవలసి ఉంటుంది. వెనుకబడిన ప్రాంతంగా పరిగణనకు వస్తున్న సబ్-సహారన్ ఆఫ్రికా ప్రాంతాలలో కంటే భారతదేశంలోని స్త్రీల అక్షరాస్యతా పరిమాణం తక్కువగా ఉండటమే ఇందుకు నిదర్శనం. చైనాతో పోల్చితే, మనం మరింతగా వెనుకబడిన విషయం కొట్టవచ్చినట్లుగా కనుపిస్తుంది. మనదేశంలోని 15-19 సంవత్సరాల వయస్సున్న స్త్రీలలో సగం మంది వరకూ నిరక్షరాస్యులుగానే ఉన్నారు. చైనాలో ఈ వయస్సు గ్రూపు స్త్రీలలో నూరింట పదిమంది మాత్రమే నిరక్షరాస్యులు!

మనదేశంలోని విద్యావిధానంలోని తీవ్రమైన బలహీనతలే ఇందుకు కారణం. మన ప్రభుత్వం రాజకీయ పరమైన కార్యదీక్షను ఈ విషయంలో ప్రదర్శించక పోవటం మరొక కారణం. స్వాతంత్ర్య సాధనానంతరం, ప్రభుత్వ నాయకులుగా స్వాతంత్ర్య పోరాటంలో కాకలు దీరిన వారంతా వచ్చారు. దేశాభివృద్ధిని వారంతా మనసారా కోరినవారే. కనుక 1960 వ సంవత్సరం నాటికి, 14 సంవత్సరాలలోపు వారందరనూ, నిర్బంధ, ఉచిత విద్యా విధానం ద్వారా విద్యావంతులను చేయాలన్న అంశాన్ని భారత రాజ్యాంగ చట్టంలో చేర్చారు. ఇది అత్యుత్సాహంతో చేసిన నిర్ణయం. నిర్ణయ రూపకల్పనలో చూపిన ఉత్సాహం కార్యాచరణలో ప్రదర్శితం కాలేదు; కనుకే ఫలితాలు ఆశించినట్లు లభించలేదు. గమ్యానికి దూరంగానే ఉండవలసి వచ్చింది. ఆ గమ్య సాధనకు అవసరమైన వసతులను ప్రభుత్వం కల్పించలేక పోయింది. కార్య దీక్షను కూడా ప్రదర్శించలేక పోయింది. 1991వ సంవత్సరం నాటికి కూడా, దేశంలోని ప్రతి 58 మంది విద్యార్థులకు ఒక్క ఉపాధ్యాయుడు (ప్రాథమిక విద్యాస్థాయిలో) ఉండటమే ఇందుకు నిదర్శనం. 14 సంవత్సరాల వయస్సు వరకు గాక పది సంవత్సరాలలోపు వయస్సు పిల్లలను తీసుకొన్నా, ప్రతి ఉపాధ్యాయునకు, ఉండదగిన సగటు పరిమాణాని కంటే, విద్యార్థులు అధికంగా ఉంటారని డ్రేజ్, సేన్‌లు అంచనా వేశారు. 1986-87 సంవత్సరానికి కూడా, బడిలో చేరిన వారిలో సగం మందైనా మానకుండా, ఐదు సంవత్సరాలు వరుసగా బడిలో చదవటం లేదు! వరుసగా ఎనిమిది సంవత్సరాలు విడవకుండా చదివిన వారు, బడిలో చేరిన వారిలో మూడవ వంతు కంటే కూడా తక్కువగానే ఉంటున్నారు!

1960వ సంవత్సరానికి సాధించ దలచిన లక్ష్యసాధన 1986-87వ సంవత్సరానికి కూడా జరగలేదు. పైగా గమ్యానికి చాలా దూరంగానే దేశం ఉండిపోయింది. 1995వ సంవత్సరానికి ఈ లక్ష్యాన్ని సాధించాలన్న ఆశయంతో 1986వ సంవత్సరంలో, "నేషనల్ పాలసీ ఆన్ ఎడ్యుకేషన్" పేరిట రెండవ లక్ష్యాన్ని భారత ప్రభుత్వం ప్రకటించింది. దీన్ని ఎలా సాధించ దలచింది వివరించలేదు. ఈ ప్రకటన తర్వాత, బడిలో చేరుతున్న వారి సంఖ్యా పరిమాణంలో పెరుగుదల కనుపించినా, ప్రాథమిక విద్యను పూర్తి చేస్తున్న వారి పరిమాణంలో మాత్రం అభివృద్ధి కనుపించలేదు. 1992 వ సం॥రంలో, మరొక విధాన ప్రకటన

"నేషనల్ పాలసీ ఆన్ ఎడ్యుకేషన్" పేరిట వెలువడింది. 20వ శతాబ్దాంతానికి, పైన పేర్కొన్న లక్ష్యాన్ని సాధించాలని చెప్పటం తప్ప, మరెట్టి వివరణా వెలువడలేదు లక్ష్యసాధనావసరాలను మాత్రం చక్కగా వివరించారు. "మాటలు కోటలు దాటినా, కాలు గడప దాటద"న్న చందంగా ఇది కనుపించింది "నిర్బంధ, ఉచిత" ప్రాథమిక విద్య అందరకూ లభించాలన్నది లక్ష్యమైనా ఆచరణలో ఇది కొందరకు మాత్రమే లభించ సాగింది. బలహీన వర్గాల వారి పిల్లలు కుటుంబ సంపాదనకు తోడ్పడక తప్పని స్థితిలో ఉండగా, ఆర్థికంగా వెసులుబాటున్న వర్గాలవారు ప్రభుత్వం వారి ఉచిత ప్రాథమిక విద్యా సదుపాయాలను అనుభవించ గలిగారు. ఈ వైఫల్యాలకు మూడు కారణాలు కనుపిస్తున్నట్లు డ్రేజ్, సేన్‌లు పేర్కొన్నారు : (1) సాధించ దలచిన లక్ష్యాన్ని గురించిన స్పష్టమైన అవగాహన నిర్ణేతలకు లేదు. (2) సాధించ దలచిన లక్ష్యానికి, దాని సాధనకు అనుసరిస్తున్న మార్గాలకు పొందిక ఉన్నట్లు కనుపించదు. (3) లక్ష్య సాధనకు అవసరమైన నిధుల కేటాయింపులు జరుగలేదు.

కేంద్రం విద్య మీద ఖర్చు చేస్తున్న నిధుల పరిమాణం పెరుగుతున్నా, అనుసరిస్తున్న విధానాలలో మాత్రం మార్పు కనుపించలేదు. ఇతర దేశాలతో పోల్చితే, జాతీయాదాయంలో భారత ప్రభుత్వం విద్యకు ఖర్చు చేస్తున్న భాగం తక్కువే. యు.ఎన్.డి.పి.వారు 1994వ సంగరంలో ప్రచురించిన హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టులో నూట పదహారు దేశాల ప్రభుత్వాలు, తమ జాతీయాదాయంలో విద్యకు ఖర్చు చేస్తున్న పరిమాణపు టంచనాలను, అధికంగా విద్యకు ఖర్చు చేస్తున్న దేశంతో ప్రారంభించి అంతకంటె తక్కువగా ఖర్చు చేస్తున్న వరుస క్రమంలో లిస్టును ప్రచురించారు. ఈ రాంకింగ్లో భారతదేశం 88వ స్థానంలో ఉంది! విద్యా విధాన ప్రకటన వెలువడినపుడల్లా జాతీయాదాయంలో ఆరు శాతాన్ని విద్యకు ఖర్చు చేయాలని ప్రభుత్వం ప్రకటిస్తున్నా, నిధుల కేటాయింపు ఇంతవరకూ ఆ స్థాయిని చేరలేదు.

ఈ శతాబ్దపు 80వ దశాబ్ద కాలం నుండి నిధుల కేటాయింపులు పెరుగుతున్నా, ఆ పెరుగుదలలోని 90 శాతం వరకూ, పెరిగిన ఉపాధ్యాయుల వేతనాల చెల్లింపులకే ఖర్చు కాసాగింది! ఉపాధ్యాయుల వేతనాలు పెరిగినంత వేగంగా, ఉపాధ్యాయుల నియామకాలు పెరుగలేదు. జరుగుతున్న ఉపాధ్యాయ నియామకాల కంటే, బడిలో చేరుతున్న పిల్లల సంఖ్య వేగంగా పెరగటం కనుపించసాగింది! మూలిగే నక్క మీద తాటికాయ పడిన చందంగా, 1991వ సంగరంలో ఆర్థిక సరళీకరణ విధానాల అవలంబన ప్రారంభమైనది. ఇందువల్ల, విద్యా బడ్జెట్ నిధుల పెరుగుదల వేగం మందగించసాగింది. దీని ఫలితంగా విద్యా బోధనా ప్రమాణాల ప్రకారం, ఉండవలసిన దానికంటే, ఉపాధ్యాయుల సంఖ్య తగ్గ నారంభించింది 1992 - 93 సంవత్సరకాల పరిస్థితి ఇది.

పిల్లలందరనూ కనీసం అక్షరాస్యులనైనా చేయాలంటే, ప్రతి గ్రామంలోనూ పాఠశాల ఉండటమే గాదు, (1) దానిలో ఉచితంగా చదువు చెప్పాలి, (2) అది క్రమశిక్షణతో పని చేస్తూండాలి, (3) అవసరమైనంత బోధనా సిబ్బంది, పరికరాలుండాలి, (4) ఉపాధ్యాయులంతా చిత్తశుద్ధితో తమ విధులను నిర్వహించాలి. ఇంత ఆదర్శప్రాయంగా ఇపుడు బడులు నడవటంలేదు. ఉపాధ్యాయులు తమ విధులను సక్రమంగా నిర్వహించటం లేదు. వారు విధులకు హాజరుగాకపోవటం అధికంగావటం, హాజరయినా, సక్రమంగా వారు పిల్లలకు చదువు చెప్పక పోవటం అనే అంశాలు మన ప్రాథమిక విద్యను అధికంగా పీడిస్తున్నాయి. ఈ అంశాలను నిరూపించే సర్వేలు పలు రాష్ట్రాలలో వెలువడ్డాయి. ఈ సందర్భంలో, ప్రపంచబ్యాంకు తయారు చేయించిన "జెండర్ అండ్ పావర్టీ ఇన్ ఇండియా" పేరిట వెలువడిన రిపోర్టులోని అంశాలు గమనింప దగినవిగా ఉన్నాయి:

"విద్యాలయాలు పనిచేసే తీరు కూడా ఆడపిల్లల ప్రాథమిక విద్యార్జనను ప్రభావితం చేస్తుంది. అందుబాటుగా లేని ప్రాంతాలలో స్కూళ్ళుండటం, ఉపాధ్యాయుల గైరుహాజరు, విద్యాలయాలు క్రమపద్ధతిలో పనిచేయక పోవటం వంటివి దీనిలోని భాగాలే. భారతదేశం యొక్క గ్రామీణ ప్రాంతంలో ఉన్న ప్రాథమిక విద్యాలయాలలో మూడింట ఒక్క వంతు వరకూ, ఒకటి కంటే ఎక్కువగా క్లాసులుండే సింగిల్ టీచరు స్కూళ్ళే. దేశంలోని ప్రాథమిక విద్యాలయాలలోని చాలా వాటిలోనూ కనీస బోధనా-సౌకర్యాలు కూడా ఉండటం లేదు. ఒకే గదిలో ఒకటికి మించిన క్లాసులను నిర్వహించవలసి రావటం, బోధనా పరికరాలు లేకపోవటం, బోధనా నైపుణ్యం అతి తక్కువగా నున్న ఉపాధ్యాయులుండటం వీటిలోని

భాగాలే. మొత్తం స్కూళ్ళలోని నాల్గవవంతు స్కూళ్ళకు శాశ్వత భవన వసతి లేదని, సగభాగపు విద్యాలయాలకు పిల్లలాడుకొనే స్థలము, త్రాగే నీటి సదుపాయాలు లేవనీ 1986వ సంవత్సరపు ఫిఫ్త్ ఆలిండియా ఎడ్యుకేషనల్ సర్వే పేర్కొన్నది. ప్రైమరీ స్కూళ్ళలో నూరింట అరవైకి మాత్రమే గ్రంథాలయ వసతులున్నట్లు 1978వ సంవత్సరపు నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రిశర్చి అండ్ ట్రెయినింగ్ రిపోర్టు వెల్లడించింది. గ్రామీణ పాఠశాలల కంటే పట్టణ ప్రాంత విద్యాలయాల వసతి పరిస్థితులు మెరుగ్గా ఉన్నా, వాటికీ భవనాలు, ఇతర వసతులు, తగినంత బోధనా సిబ్బంది ఉండటం లేదు.

"భారతదేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించిన తరువాత విద్యాలయాల సంఖ్య త్వరితగతిని పెరిగింది. అయినా, సర్వజనులకు ప్రాథమిక విద్యావసతి ఇంకా అందటం లేదు. మిడిల్ స్కూళ్ళు అవసరాలకు తగినంతగా లేకపోవటమే గాదు, ఇవి చాలా తక్కువగా ఉన్నాయి. ఐదు వందల వరకూ జనాభా ఉన్న చిన్న గ్రామాలకు, ప్రాథమిక విద్యావసతులు అందుబాటులో లేవు; పదిహేను శాతం గ్రామాలకు మిడిల్ స్కూళ్ళ వసతి మూడు కిలోమీటర్ల దూరంలోపల లేదు. ఆడపిల్లలు తక్కువగా విద్యార్జనకు వచ్చే గ్రామీణ ప్రాంతాలలో - ముఖ్యంగా గిరిజన గ్రామాలున్న ప్రాంతాలలో - ప్రైమరీ, మిడిల్ స్కూలు విద్యా వసతులు ఇంకా తక్కువగానే ఉన్నాయి. స్కూలుకు వెళ్ళదలచిన ఆడపిల్లలకు అవసరమైన రవాణా వసతులు లేకపోవటం చేత, ఈ పిల్లలు రావటానికి తగినంత దూరంలో పాఠశాలలుండటం అవసరం. ఆడపిల్లల చదువును ప్రోత్సహించటానికిది ముఖ్యమైన సాధనం. ఆడపిల్లల భద్రతను గూర్చి తలిదండ్రులు ఆందోళన పడుతుంటారు గనుక, ఈ విషయానికి ప్రాధాన్యత లభించాలి.

"పిల్లలకు అందుబాటు దూరంలో విద్యాలయాలుండటం అనేది అన్ని ప్రాంతాలలో ఒకే రకంగా లేదు. స్కూళ్ళు ఉన్నా, వాటికున్న వసతులు, వనరుల విషయంలో హెచ్చు తగ్గులున్నాయి. రాష్ట్రాల ప్రజల అక్షరాస్యత, ఆయా రాష్ట్రాలలోని ప్రైమరీ స్కూళ్ళ భౌతిక వసతులకు, పిల్లలకు అక్షర జ్ఞాన మబ్బటానికి ప్రతిబింబంగా కనుపిస్తున్నది. స్కూళ్ళల్లో తగిన వసతులు లేక పోవటం వలన, హాజరు గావలసిన పిల్లలలో నిస్పృహ కలగటం సహజం. ఉపాధ్యాయులు కూడా నిస్సహాయులై, పిల్లల హాజరును ప్రోత్సహించలేరు, తమ బిడ్డలు బడికి వెళ్ళేట్లు చేయమని తలిదండ్రులను కోరలేరు. గ్రామీణ ప్రాంతంలోనూ, పట్టణ ప్రాంతంలోనూ ఉన్న పేదల పిల్లలకు చదువులు చెప్పటమే ఒక సవాలు వంటిది. ఇటువంటి పరిస్థితులలో వారికి చదువులు చెప్పగలిగే నంతటి తర్ఫీదు ఉపాధ్యాయులకు లభించటం లేదు. టీచర్ల గైర్ హాజర్ అతి సామాన్యమైంది. ప్రధానంగా, సింగిల్ టీచర్ స్కూళ్ళను, మారుమూల గ్రామీణ ప్రాంతపు స్కూళ్ళను ఈ సమస్య వేధిస్తున్నది.

"ఆడపిల్లల విద్యార్జనను నిరుత్సాహ పరచే మరొక సమస్య మహిళా ఉపాధ్యాయుల కొరత. ప్రైమరీ, మిడిల్ స్కూళ్ళలో పనిచేస్తున్న ఉపాధ్యాయులలో, మూడవ వంతు మంది కంటే తక్కువగా మహిళలున్నారు. బడికి వస్తున్న మొత్తం విద్యార్థులలో, ఆడపిల్లలు చాలా తక్కువగా ఉంటున్న రాష్ట్రాలలో (ఈవిషయంలో వెనుకబడినవిగా వర్గీకరణకు వస్తున్న 9 రాష్ట్రాలలోని ఎనిమిదింటిలో) మహిళా ఉపాధ్యాయుల సంఖ్య చాలా తక్కువగా ఉంటున్నది.

"పాఠ్య పుస్తకాల కొరత, బోధనా సామగ్రి కొరతా ఉంటున్నది. బోధనా ప్రమాణాలు అన్ని ప్రాంతాలలోనూ ఒకే రకంగా ఉండటం లేదు. బోధన, నియమిత పాఠ్యపుస్తకాలకే పరిమిత మవుతున్నది. ఇందువలన పిల్లల విద్యార్జనా ప్రమాణాలు కూడా తక్కువగా ఉంటున్నాయి. వారికి అక్షర జ్ఞానం గాని, సంఖ్యా జ్ఞానం గాని అబ్బటం లేదు. పిల్లలలో ఈ జ్ఞానం అతి తక్కువగా ఉంటున్నట్లు పలు సర్వేలు నిర్ధారించాయి. బోధనా పటిమ లోపంవలనా, పిల్లలు సక్రమంగా బడికి హాజరు గాక పోవటం చేతా, ఒకే క్లాసులో ఒక సంవత్సరానికి మించి ఉండేవారి సంఖ్య అధికంగా ఉంటున్నది. ఇలాంటి వారిలో మగపిల్లల కంటే ఆడపిల్లల సంఖ్య అధికంగా ఉంటున్నట్లు పలు పరిశీలనలు రుజువు చేశాయి. ఆడపిల్లలు ఇంటి పనులను చేయవలసి ఉండటం చేత, వారు క్రమం తప్పకుండా పాఠశాలకు హాజరు కాలేక పోతున్నారు. అందువలన వారు ఒకే క్లాసులో ఒకటి కంటే ఎక్కువ సంవత్సరాలు ఉండవ వలసి వస్తున్నది. "చదువు మీద శ్రద్ధను ప్రదర్శించటం లేదు", గనుకా, "చదువులో పురోగమనం కనుపించక పోవటం" చేతా తమ బిడ్డలను

(ఆడపిల్లలను) బడి మాన్పిస్తున్నట్లు తలిదండ్రులు చెబుతుంటారు తరచూ క్లాసు పరీక్షలలో తప్పేవారు. చదువు మానటం సహజం ''

ప్రభుత్వ విద్యాలయాలు ఇంత అధ్వాన్నంగా ఉండటం చేత కూడా తలిదండ్రులు తమ పిల్లలను బడికి పంపటానికి ఉత్సాహాన్ని చూపటం లేదు ఆడపిల్లలను చదివించటం ఎంత ఖర్చుతో కూడిన పనో చూచాం ఇటువంటి పరిస్థితులలో తలిదండ్రులు వారిని బడికి పంపి, రెంటికీ చెడిన రేవడులు కాదలచక పోవటం ఆశ్చర్యకరమైన అంశం గాదు ఈ పరిస్థితిని గమనించిన లాభార్జనాపరులు విద్యారంగంలో ప్రవేశించారు. ప్రైవేటు విద్యాలయాలు తామరతంపరగా వెలుస్తున్నాయి విద్యాలయాల పెరుగుదల ఆహ్వానించదగినదే కాని వీరు వసూలు చేసే ఫీజులు అధికంగా ఉంటున్నాయి. ఇందువలన అధికులకు ఇవి అందుబాటులో ఉండటం లేదు. వెనుక బడిన వర్గాల వారు వీటిని గురించి ఆలోచించే అవకాశాలు కూడా లేవు. పైగా ఇవన్నీ ప్రధానంగా పట్టణ ప్రాంతాలలోనే వెలుస్తున్నాయి ఈ విద్యావ్యాపారులు, ప్రాధమిక విద్యకు ప్రాధాన్యత నీయటం లేదు. సెకండరీ స్థాయి, అంతకంటె ఉన్నత స్థాయి విద్యాలయాల ఏర్పాటు మీద కేంద్రీకరిస్తున్నారు ఈ అంశాన్ని పలువురు పరిశీలకులు నిర్ధారణ చేశారు. నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రిశర్చి అండ్ ట్రెయినింగ్ సంస్థ 1992లో ప్రచురించిన అఖిల భారత విద్యా సర్వే రిపోర్టు కూడా ఈ అంశాన్ని ధ్రువపరచింది. కొన్ని ప్రైవేటు విద్యాసంస్థలు ప్రభుత్వ గ్రాంటులను కూడా స్వీకరిస్తున్నాయి 1986వ సంవత్సరంలో దేశంలోని మొత్తం సెకండరీ విద్యాలయాలలో నూరింట 54 వరకూ ప్రైవేటు విద్యా సంస్థలు నిర్వహిస్తున్న సెకండరీ పాఠశాలలున్నట్లు రిపోర్టు పేర్కొన్నది. దేశంలోని ప్రాధమిక పాఠశాలలలో, ఇవి నిర్వహిస్తున్న పాఠశాలలు నూరింట ఏడు మాత్రమే ఉన్నాయి; గ్రామీణ ప్రాంతపు ప్రాధమిక పాఠశాలలలో ఇవి నిర్వహిస్తున్న పాఠశాలలు నూరింట మూడు మాత్రమే ఉన్నాయి. గ్రామీణ పాఠశాలల గుర్తింపులో కొంత పొరపాటు జరగటం వలన వాటి సంఖ్య తక్కువగా ఉన్నదన్న విషయాన్ని అంగీకరించినా, సెకండరీ స్థాయిలో ప్రైవేటు విద్యాలయాల ప్రాబల్యాన్ని అంగీకరించకుండా ఉండలేము.

కనుక పేదవర్గాల వారు, వెనుకబడిన తరగతుల వారూ, మధ్యతరగతి ప్రజలు ప్రభుత్వ పాఠశాలలను ఆశ్రయించక తప్పదు. ఇందువల్ల ఇవి సక్రమంగా పనిచేసేట్లు చూడటం అవసరం ఇది ప్రభుత్వ పరంగా జరిగే పనిగాదు అని ఇంతవరకూ సంపాదించిన అనుభవం రుజువు చేసింది ఇపుడు, విద్యాలయాన్ని నడిపే బాధ్యతను ఉపాధ్యాయులే నిర్వహిస్తున్నారు విద్యాలయాలకు దూరంగా, పాలనా కేంద్రాలలో ఉండే అధికారులు వీటి పనిని అజమాయిషీ చేస్తున్నారు అందువల్ల గ్రామంలోని పాఠశాల ఎలా పనిచేస్తున్నదీ వారు స్వయంగా తెలుసుకోలేరు. విద్యాలయాలను నిర్వహిస్తున్న ఉపాధ్యాయులే వారికి రిపోర్టు సమర్పిస్తారు కనుక విద్యాధికారి వాస్తవాన్ని తెలుసుకోలేని పరిస్థితులుంటున్నాయి ఈ లోప సవరణకు విద్యాలయాల అజమాయిషీ బాధ్యతను సామాజికుల కివ్వాలి సామాజికులు కలుగజేసుకోకుండా ప్రభుత్వ పాఠశాలలు బాగుపడవు. ఈ పరిస్థితులు మారనంత వరకూ విద్యాబోధన మెరుగు గాదు, తలిదండ్రులు తమ పిల్లలను ఆ విద్యాలయాలకు పంపటానికి ఇష్టపడరు. నిర్బంధవిద్య పేరిట నిర్బంధించే శాసనాలు చేసినా ప్రయోజనం ఉండదు.

ఈ లోపాల ప్రభావం, ఆడపిల్లల మీదా, మగపిల్లల మీద ఒకే రకంగా ఉంటుందని మనం అనుకొంటూ ఉంటాం. ఇది పొరపాటు. గ్రామంలో పాఠశాల సక్రమంగా పనిచేయనపుడు తలిదండ్రులు తమ మగ పిల్లలను, మెరుగని అనుకొన్న మరో పొరుగూరి పాఠశాలకు పంపటానికి ప్రయత్నిస్తారు. లేదా ప్రైవేటు వ్యక్తులు నిర్వహించే విద్యాలయాలకు పంపుతారు. పొరుగూరి బడికి ఆడపిల్లలను పంపటానికి తలిదండ్రులు ఇష్టపడరు. ఆడపిల్లలను చదివించటమే నష్టమనుకొంటున్న తలిదండ్రులు, వారికి ఫీజులు కూడా చెల్లించి ప్రైవేటు విద్యాలయాలకు పంపించటానికి సాహసించరు. ఇందువల్ల బాలుర విద్యార్జన కంటే, బాలికల చదువులు అధికంగా దెబ్బతింటాయి. స్త్రీ విద్యావ్యాప్తికి, స్త్రీల అక్షరాస్యతా పెంపుకూ ఈ పరిస్థితులు తీవ్రమైన అవరోధాలుగా రూపొందాయి.

ప్రాథమిక విద్యారంగంలో ప్రైవేటు సంస్థల ప్రవేశం నామ మాత్రంగానే ఉంది. లాభాలను ఆర్జించ నేర్చినవారు,

ఇన్ని ఇబ్బందుల నెదుర్కొంటున్న ప్రాథమిక విద్యారంగంలో ప్రవేశించ నిచ్చగించరు. కనుక ప్రాథమిక విద్యావ్యాప్తి, ప్రజలను అక్షరాస్యులను చేసే బాధ్యత పూర్తిగా ప్రభుత్వం మీదనే ఆధారపడి ఉన్నది. ఈ విషయాన్ని ప్రభుత్వాధినేతలు, రాజకీయ నాయకులు గుర్తించటం అవసరం.

ప్రభుత్వ అజమాయిషీ క్రింద ప్రాథమిక విద్యా విధానం ఎంత నాసిగా తయారైందో చూచాం. ఈ విద్యా వ్యవస్థ ప్రభుత్వాధి కారుల పర్యవేక్షణ క్రింద ఉన్నంత కాలము అది బాగుపడదు. సామాజికుల ఆధిపత్యం క్రిందకు ఇది రావాలి. వైద్యశాలలో డాక్టరు లేకపోతేనో, మందులు తగినన్ని లేకుండా పోతేనో ఉద్యమాలను సామాజికులు నడుపుతున్నారు. ఉపాధ్యాయులు తమ బోధనా విధులను సక్రమంగా నిర్వహించక పోయినపుడు దానికి వ్యతిరేకంగా కూడా సామాజిక ఉద్యమం నడవాలి. ప్రాథమిక విద్యా వ్యవస్థా మరమ్మత్తుకు సామాజికులు పూనుకోవాలి.

విద్యార్జనలో స్త్రీ ఎదుర్కొన వలసి వస్తున్న అవరోధాలేమిటో చూచాం. ఉపాధి విషయాలలో వారి స్థితి ఎలా ఉన్నదో పరిశీలించుదాం.

# 9

## ఆర్థిక పునర్వ్యవస్థీకరణ : మహిళా జీవనం పై దాని ప్రభావము

"గ్లోబలైజేషన్", "ఎకనామిక్ రీస్ట్రక్చరింగ్" వంటి మాటలు తరచుగా వినిపిస్తున్నాయి. జాతీయ ఆర్థిక వ్యవస్థల, మార్కెట్ల మధ్యనున్న హద్దులు అంతరిస్తున్నాయి. ప్రపంచ ప్రాతిపదిక మీద వీటి ఏకీకరణ జరుగుతున్నది ఒక కార్పొరేట్ సంస్థ మరొక దానిని కొనటం, లేదా రెండు సంస్థలూ స్వచ్ఛందంగా కలిసిపోవటం, ఖర్చులను తగ్గించుకొని లాభాలను పెంచుకోవటానికి ఆధునిక ఉత్పత్తి విధానాలను అవలంబిస్తూ, సిబ్బందిని తాత్కాలికంగా గాని, శాశ్వతంగా గాని తగ్గించటం, పెట్టుబడులను పేద దేశాలకు పంపి, అచ్చట తక్కువ ఖర్చులతో ఉత్పత్తయిన సరుకును అభివృద్ధి చెందిన దేశాలలో అమ్మి అధిక లాభాలను గడించటం వంటి పరిణామాలు ఈ ఏకీకరణలోని భాగాలే.

అభివృద్ధి చెందుతున్న దేశాలూ, వెనుకబడిన దేశాలూ, మోస్తున్న రుణభారాన్ని అవకాశంగా తీసుకొని, ప్రపంచ బ్యాంకు, ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ సంస్థలు అంతర్జాతీయ కార్పొరేట్ ఆబోతులకు ( బహుళ జాతి సంస్థలకు) తమ దేశ మార్కెట్లను తెరవాలనీ, దేశ ఆర్థిక వ్యవస్థను ఇందుకు అనుగుణంగా మార్చాలనీ, ఈ దేశాలను వత్తిడి చేస్తున్నాయి. స్వయం సమృద్ధి విధానాలను విడనాడాలనీ, ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేట్ రంగానికి అప్పగించాలనీ, స్వేచ్ఛా వ్యాపారానికి వీలుగా చట్టాలను మార్చాలనీ, నామమాత్రంగానైనా కార్మికులకు రక్షణనిస్తున్న లేబర్ లాను సడలించి, "హైర్ అండ్ ఫైర్"కు అవకాశాలను కల్పించాలని కూడా ఇవి, ఈ దేశాలను నిర్బంధిస్తున్నాయి. ఆర్థిక ఇబ్బందులలో చిక్కుకున్న అభివృద్ధి చెందుతున్న దేశాలూ, పేద దేశాలు వీటి ఆజ్ఞలను పాటించక తప్పటంలేదు. ఇందువల్ల ఈ వర్గపు దేశాలలో ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, సరళీకరణ విధానాల అవలంబన జరుగక తప్పటం లేదు.

అందుబాటులోనికి వచ్చిన ఆధునిక సాంకేతిక విధానాలను ఉపయోగించుకొని ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకొంటూ, అంతర్జాతీయ మార్కెట్లో తమ ప్రాబల్యాన్ని కాపాడుకోవటానికి, ఇతరదేశాల పోటీని తట్టుకోవటానికి ఈ శతాబ్దపు ఎనభయ్యవ దశాబ్ద ప్రారంభకాలం నుండీ అభివృద్ధి చెందిన దేశాలు ప్రయత్నాలు ప్రారంభించాయి. ద్రవ్యోల్బణం, మోయలేని రుణభారంతో అభివృద్ధి చెందుతున్న దేశాలూ, పేద దేశాలూ కుంగిపోతున్నాయి. దానికి తోడు ప్రపంచ ఆర్థిక

రంగంలో సంక్షోభం కూడా ప్రారంభమై ఎగుమతులు తగ్గనారంభించాయి ఈ సంక్షోభం నుండి బయట పడటానికి, ఆ దేశాలు తమ ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించ ప్రారంభించాయి. తూర్పు యూరపు దేశాలలోనూ, సోవియట్ రిపబ్లిక్‌లలోనూ కమ్యూనిష్టుల పాలన కూలిపోయింది. ఈ దేశాలలో ఇంతవరకూ ప్రభుత్వరంగంలో నున్న ఉత్పత్తి సంస్థల ప్రైవెటీకరణ ప్రారంభమైంది. ఈ పరిణామాలు మహిళలను ఎలా ప్రభావితం చేశాయో చూద్దాం.

### అభివృద్ధి చెందిన దేశాలలో.....

అభివృద్ధి చెందిన దేశాలలో ఆర్థికాభివృద్ధి రేటు మందగించింది, దీనికితోడు అంతర్జాతీయ మార్కెట్లో పోటీ కూడా పెరిగింది. దేశ ద్రవ్యవ్యవస్థను, ఉత్పత్తి రంగాన్ని బలపరుచుకొని, లాభాలరేటు పడిపోకుండా కాపాడుకోవాలని అభివృద్ధి చెందిన దేశాలు కూడబలుక్కున్నాయి. ఇందుకు అనుగుణంగా, ద్రవ్యవ్యవస్థలోనూ, ఉత్పత్తిరంగంలోనూ, లేబర్ మార్కెట్‌లోనూ కొన్ని మార్పులు తేవటానికివి పూనుకొన్నాయి.

ద్రవ్యోల్బణాన్ని అరికట్టటానికి దేశ ద్రవ్య విధానంలో మార్పులు తేవాలన్న ప్రయత్నాలు ప్రారంభమయినాయి. ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటురంగానికి బదలాయించటానికి నిర్ణయించుకొన్నారు. ఇందువల్ల ప్రభుత్వం ఖర్చులు తగ్గించుకోవటానికి, బడ్జెట్‌లోటును తగ్గించుకోవటానికి అవకాశాలుంటాయి; ఈ ప్రయత్న ఫలితంగా సాంఘిక సంక్షేమానికి, ప్రజల ఆరోగ్యం, విద్యవంటి వాటికి ఖర్చుపెట్టే మొత్తాలు తగ్గాయి. జాతీయ ఆర్థిక వ్యవస్థమీద ప్రభుత్వపు పట్టుకూడా సడలింది. సంక్షేమ కార్యక్రమాల బడ్జెట్ మొత్తాల తగ్గింపువల్ల అందరికంటే మహిళలకు ఎక్కువ నష్టం జరిగింది. ప్రభుత్వరంగ పరిశ్రమలలో, స్త్రీ పురుష ఉద్యోగుల మధ్య వివక్ష తక్కువగా ఉంటుంది; మహిళలకు ప్రసూతి శలవు, వారి బిడ్డలకు డేకేర్ సెంటర్ల ఏర్పాటు వంటి వసతులుంటాయి. అవి ఇపుడు అంతరిస్తున్నాయి. కనుక మహిళలు ఈ విధంగా కూడా నష్టపడుతున్నారు.

కార్పొరేట్ సంస్థ అధిక లాభాలను సంపాదించాలంటే, ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకోవాలి; ఉత్పత్తిని పెంచాలి. అపుడే అది మార్కెట్లో పోటీకి నిలిచి అధిక లాభాలను ఆర్జించగలుగుతుంది. కనుక కార్పొరేట్ సంస్థలు కార్మికుల సంఖ్యను తగ్గించనారంభించాయి. ఈ తగ్గింపునకు తొలుత గురయినది మహిళలు. మహిళలకు గృహనిర్వాహణా బాధ్యతలుంటాయి; పైగా ప్రసూతి శలవు వంటి రాయితీల నివ్వాలి. కనుక యజమానులు - ముఖ్యంగా మాన్యుఫాక్చరింగ్ రంగ పరిశ్రమల వారు - మహిళలను తీసుకోవటానికి ఇష్టపడరు కనుక రిట్రెంచ్‌మెంట్‌కు తొలుత గురయ్యేది ఉద్యోగినులు. లాభసాటిగాని పరిశ్రమలు మూతబడటం వల్ల కూడా అధికంగా నిరుద్యోగం పాలయినది మహిళలే. పురుషులకు దొరికినంత త్వరగా మహిళలకు మరొక ఉద్యోగం లభించదు

కొన్ని సంస్థలు సిబ్బందిని తగ్గించి, కాంట్రాక్టుపర్కు ఇవ్వనారంభించాయి; తాత్కాలిక పనివారిని పెట్టుకోవటం ప్రారంభించాయి. ఇందువల్ల కూడా మహిళా ఉపాధి తగ్గింది.లేబర్ మార్కెట్లో వీరు "రిజర్వు" కూలీలుగా మారారు అవసరమైనపుడు యజమానులు పనిలో పెట్టుకొంటారు అవసరంలేనపుడు పంపివేస్తారు. అభివృద్ధి చెందిన దేశాలలోని ఈ దుస్థితిని ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ ప్రచురించిన "లేబర్ రిపోర్టు 1992" ఇలా వర్ణించింది. " ఖాయిలా పడిన పరిశ్రమలను మూసివేయటం, ఉత్పత్తి రంగంలో తమకు అనువుగా ఉండే విధానాలను యజమానులు అనుసరించటం వలనా, సర్వీసెస్ సెక్టారు పెరగటం వలనా కార్మికజీవితం ముక్క చెక్కలైంది. అనిశ్చిత ఉద్యోగాల పెరుగుదల, ఒకసారి దొరికినటువంటి ఉద్యోగం మరొకసారి ఉద్యోగికి దొరకకపోవటం వంటివి ఇందుకు నిదర్శనం."

ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకు సంఘటిత సెక్టారు సిబ్బంది సంఖ్యను తగ్గించటం, నైపుణ్యం అంతగా అవసరంలేని ఉద్యోగాలు దాదాపు అంతరించటం వల్ల పురుషుల కంటే మహిళలు అధికంగా నష్టపడ్డారు. ఆరోగ్యం, విద్య, వ్యక్తిగత సేవలకు సంబంధించిన రంగంలో స్త్రీల ఉద్యోగావకాశాలు దాదాపు యథాతథంగా ఉన్నాయి; బిజినెస్ సర్వీసులు (ముఖ్యంగా ఎక్కౌంటెన్సీ, మార్కెటింగ్, అడ్వర్‌టైజ్‌మెంట్, లీగల్ సర్వీసుల వంటివి) త్వరితగతిని విస్తరించ నారంభించాయి. వృత్తి నైపుణ్యం ఉన్న మహిళలకు ఇవి మంచి ఉపాధి అవకాశాలను కలుగజేయగలవని కొందరు అర్థశాస్త్ర నిపుణులు అభిప్రాయ పడుతున్నారు. ప్రభుత్వరంగ

సంస్థలలో మహిళలు కోల్పోయినన్ని ఉద్యోగాలను ఈ రంగం ఇవ్వగలదని మాత్రం ఎవరూ చెప్పలేకపోతున్నారు

అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థలో వచ్చిన మార్పులు మహిళలను పలురకాలుగా ప్రభావితం చేశాయి ఉపాధి అవకాశాలు పెరిగినట్లు కనుపించినా వాటికి శాశ్వతత్వం లేదు. ఉద్యోగభద్రత అదృశ్యమైంది ఉద్యోగినులకు లభిస్తున్న అవకాశాలు క్రమంగా తరిగిపోగల పరిస్థితులు కనుపిస్తున్నాయి

మాజీ కమ్యూనిస్టు దేశాలలో.....

ఇక మాజీ కమ్యూనిస్టు దేశాలలో వచ్చిన మార్పులను పరిశీలించుదాం కమ్యూనిస్టుల పాలనలో ఉన్న కాలంలో ఇవి పెట్టుబడిదారీ ప్రపంచ మార్కెట్‌కు వెలుపల ఉన్నాయి గనుక, ఆర్థిక సంక్షోభ పరిస్థితిలో ఇవి చిక్కలేదు. కాని వాటి ఆర్థిక పరిస్థితి దిగజారింది. ఉత్పత్తి బాగా తగ్గి, ప్రజల అవసరాలు కూడా గడవని స్థితి ఏర్పడిన సందర్భాలున్నాయి. సాంకేతిక విధానం అపూర్వంగా పెరిగినా, దానికి దీటుగా ఆదేశాల ఉత్పత్తిగాని, ఆర్థిక స్థోమతగాని పెరుగలేదు. 1989వ సంవత్సరానికి పరిస్థితి బాగా నీరసించింది. ఆర్థిక చిక్కులకు తోడు, రాజకీయ పరిణామాలు కూడా విషమించటం వలన కమ్యూనిస్టుల పాలన అంతరించింది. రాజకీయ రంగాల్లోనూ, ఆర్థిక సామాజిక రంగాలలోనూ పెనుమార్పులొచ్చాయి. తర్వాత జరిగిన పరిణామాల వలన దేశ ఆర్థిక వ్యవస్థాపునర్నిర్మాణం ప్రారంభమైంది. కేంద్ర ప్లానింగ్, ఉత్పత్తి శక్తులపై ప్రభుత్వ యాజమాన్యం అంతరించింది; ప్రైవేట్‌రంగం అవతరించింది. ప్రపంచ మార్కెట్లో ఈ దేశాల మార్కెట్ల విలీన ప్రయత్నాలు ఆరంభమైనాయి. ఈ సంస్కరణలను అమలు జరపటంలో మాజీ కమ్యూనిష్టు దేశాలన్నిటి పురోగతి ఒకే రకంగాలేదు. కాని అవి చేపట్టిన పునర్నిర్మాణ విధానం మాత్రం ఒక్కటే. ఆ దేశాలలోని మహిళా కార్మికులంతా ఉపాధిపరంగా గాని, ఆర్థికంగా గాని, కుటుంబ జీవన విధానంలోగాని ఒకే రకంగా ప్రభావితమైనారు. ప్రైవేట్ రంగ విస్తరణ, ప్రభుత్వరంగ పరిశ్రమల తగ్గుదల వల్ల చాలామంది కార్మికులు ఉద్యోగాలను కోల్పోయారు. ఈ స్థితిని వివరిస్తూ, ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ (ఐ.ఓ.ఎల్.ఓ.) ప్రచురించిన " వరల్డ్ లేబర్ రిపోర్టు 1994" "మరొకచోట పెద్దయెత్తున ఉద్యోగాలను కోల్పోయిన వారికి ఉద్యోగావకాశాలు లభించేంత అధికంగా ప్రైవేట్ రంగంలో ఉపాధి అవకాశాలు పెరుగలేదు" అని పేర్కొన్నది.

ప్రైవేటీకరణ వల్ల మహిళలకు స్వయం ఉపాధి అవకాశాలు ఏర్పడ్డాయి. వ్యాపారరంగంలో, ఉపాధి అవకాశాలు పెరిగాయి. అయినా వారు ప్రభుత్వ రంగ సంస్థలను విడిచి పోవటానికి ఇష్టపడటంలేదు ప్రభుత్వరంగంలో ఉద్యోగ భద్రత ఉంది లింగ వివక్షతకు తావు లేదు ప్రసూతి సెలవు, వారి పిల్లలకు డేకేర్, ఆరోగ్య రక్షణ వంటి వసతులు లభిస్తున్నాయి ప్రైవేట్ రంగంలో ఇవి లభించవు కనుక వీలయినంత కాలం ప్రభుత్వ రంగ సంస్థలలో ఉండటానికి మహిళలు తాపత్రయపడుతున్నారు. పురుషులతో సమానమైన వృత్తి విద్యా నైపుణ్యము, అనుభవము ఉన్నా, ప్రైవేట్ రంగ పరిశ్రమలు మహిళలను తీసుకోవటానికి సుముఖంగా లేవు. ఉదాహరణకు జెక్ రిపబ్లిక్‌లోని పరిస్థితిని చూడవచ్చు. 1991లోనూ, 1992లోనూ ఆ దేశపు ప్రైవేట్ రంగ సంస్థలలో పనిచేస్తున్న వారిలో మూడింట రెండు వంతుల మంది పురుషులున్నారు. ఈ పురుషోద్యోగులకు దీటయిన వృత్తి విద్యార్హతలు, వృత్తి నైపుణ్యంగల వనితలకు ఈ రిపబ్లిక్‌లో కొరత లేదు అయినా వారికి ప్రైవేట్ రంగంలో తగినంత స్థానం లభించటం లేదు. ఆయా సంస్థల యాజమాన్యాలు మహిళా నియామకాలను వ్యతిరేకిస్తూండటమే ఇందుకు కారణమని, ఐ.ఎల్.ఓ. నిపుణులు ఎల్. పాకెట్ట్ "ఉమెన్స్ ఎంప్లాయ్‌మెంట్ ఇన్ ఈస్టరన్ యూరప్" అన్న పరిశోధన పత్రంలో పేర్కొన్నారు.

ఈ ప్రైవేటీకరణ ప్రక్రియలో భారీ పరిశ్రమలకు బదులు తేలిక పరిశ్రమలకు, అత్యాధునిక సాంకేతిక విధానంతో కూడిన ఎలక్ట్రానిక్ పరిశ్రమలకు, వాడకందారుల నిత్యావసర సరుకులను ఉత్పత్తి చేసే పరిశ్రమలకు అత్యధిక ప్రాధాన్యత లభిస్తున్నది. ప్రైవేట్ రంగం ఇలా కొన్ని రకాల పరిశ్రమలకే ప్రాధాన్యత నిస్తుండటం వల్ల మహిళా ఉపాధి రంగం సంకుచిత మవుతుందని, వారి వేతనాలు, ఉద్యోగులుగా వారికి లభించే వసతులు తగ్గిపోవచ్చుని, ఐ.ఎల్.ఓ. నిపుణులు జి. స్టాండింగ్ హెచ్చరించారు. తూర్పు యూరవు, మధ్యయూరవు మాజీ కమ్యూనిస్టు దేశాలలో ప్రైవేట్ రంగం కొన్ని రకాల పరిశ్రమలకే ప్రాధాన్యతనిస్తూ, మిగిలిన వాటిని (ముఖ్యంగా భారీపరిశ్రమలను) వదలివేయటంవల్ల స్త్రీ-పురుష కార్మికుల ఉపాధి అవకాశాలలో తీవ్రమైన మార్పు వచ్చినట్లు

ఎల్. పొకెర్ట్ సూచించారు. అత్యధిక లాభార్జనే పరిశ్రమల యజమానుల లక్ష్యం, కనుక మారిన పారిశ్రామిక రంగపు వాతావరణంలో పనిచేయటానికి మహిళలు తగరనీ, పరిపాలనా సంబంధమైన పోస్టులలో పనిచేస్తున్న మహిళలనూ, ప్రొడక్షన్ లైన్లో గుమాస్తాలుగా పనిచేస్తున్న మహిళలనూ, పురుషులకంటే ముందుగానే తొలగిస్తున్నట్లు బి.ఇన్వార్స్, ఎస్. మిట్టర్‌లు వెల్లడించారు. అంతర్జాతీయ మార్కెట్లో పోటీకి తట్టుకోలేక పరిశ్రమలలో మహిళా కార్మికులను లేఆఫ్‌లో పెడుతున్నట్లు వరల్డ్ లేబర్ రిపోర్టు - 1993 పేర్కొన్నది

మాజీ కమ్యూనిస్టు దేశాలలో జరుగుతున్న ఆర్థిక పునర్వ్యవస్థీకరణవల్ల, అననుకూల పరిస్థితి పురుషులకంటే మహిళలకు అధికంగా ఉన్నదని చెప్పటానికి తగిన నిదర్శనాలున్నాయి. 1990వ సంవత్సరం నుండీ ఒక్క హంగరీలో తప్ప, మిగిలిన మాజీ కమ్యూనిస్టు దేశాలలో పురుషుల నిరుద్యోగం కంటే మహిళా నిరుద్యోగమే అధికంగా ఉన్నది. ప్రభుత్వరంగ సంస్థలు కూడా, లాభార్జన కోసం సిబ్బంది తగ్గింపును అమలు జరపటం ప్రారంభించటంవల్ల ఈ పరిస్థితి విషమించింది. అధిక లాభార్జనకు తగినట్లు సంస్థల నిర్వహణను మలుచుతూ ఉండటంవల్ల, లేఆఫ్ వేటు తొలుత మహిళా కార్మికుల మీద పడుతున్నది. ఇంతమందిని లేఆఫ్‌లో పెట్టనవసరం లేదని అనిపించే సందర్భాలు కూడా ఉన్నాయి. మహిళలకు ఒకసారి ఉద్యోగంపోతే పురుషులకు లభించినంత తేలికగా వారికది లభించదు అని వరల్డ్ లేబర్ రిపోర్ట్ - 1993 వెల్లడించింది.

కొన్ని రకాల ఉద్యోగాలకు "మహిళా ఉద్యోగాలుగా" ముద్ర పడింది. విద్యార్హతా, వృత్తి నైపుణ్యము, అనుభవము తూర్పు యూరపు మహిళలకు పురుషులతో సమంగానే ఉన్నది. అయినా, ఈ "మహిళా ఉద్యోగాలుగా" వ్యవహరించబడే వాటిలో ఇటీవల పురుషులు ప్రవేశించటం ప్రారంభమైంది ! ఇంతకు పూర్వం భార్యాభర్తలిద్దరకూ ఉద్యోగ సంపాదన ఉండేది. విద్య, వైద్యం వంటి ఉచిత సేవా సదుపాయాలు ఉండేవి. ప్రైవెటీకరణ వల్ల ఈ ఉచిత సదుపాయాలు అంతరించాయి. పైగా వీటి ఖర్చును కుటుంబాలు భరించవలసిన స్థితి ఏర్పడింది. లాభార్జనే ప్రధానాశయంగా పెట్టుకొన్న యజమానులు, ఇలాంటి ఉచిత సేవా వసతులను ఇవ్వటానికి ఇష్టపడరు. ఈ దృష్టితోనే వీరు ఉద్యోగాలలో మహిళలను నియమించరు. పురుషులతో సమానమైన ఉద్యోగావకాశాలు స్త్రీల కుండేట్లు చూడాలంటే, ఈ విషయాన్ని గురించి వెంటనే ఆలోచించటం అవసరమని ఎల్. పొకెర్ట్ హెచ్చరించారు. ఇంత వరకూ మహిళలకు లభిస్తున్న శిశు సంక్షేమ వసతులను వారికి లభించేట్లు చూడటం అత్యవసరమని, ఇది త్వరగా జరగాలని కూడా ఈ ఐ.ఎల్.ఓ. నిపుణులు సూచించారు. ఇంతవరకూ మహిళా కార్మిక సంక్షేమానికున్న చట్టాలను, మారిన మార్కెట్ అవసరాలకు అనుగుణంగా మార్చి అమలు జరిపే ప్రమాదమున్నట్లు వీరు ఊహించారు. తర్వాత జరిగిన పరిణామాలు వీరి ఆందోళన అకారణం కాదని నిరూపించాయి.

మాజీ కమ్యూనిస్టు దేశాలలో లింగవివక్షా తీవ్రత, కమ్యూనిస్టేతర దేశాలలో కంటే తక్కువగా ఉండేది. పురుషులతో సమానమైన విద్యార్హతలు, వృత్తిపరమైన నైపుణ్యం మహిళలకున్నాయి. ఉద్యోగ నియామకంలో కూడా లింగవివక్షకు స్థానం లేదు. అటువంటి దేశాలలో ఇపుడు రాజకీయ, ఆర్థిక సంస్కరణలు అమలు జరుగుతున్నాయి. ఇంతకు పూర్వం నీరసించిన లింగవివక్ష తిరిగి ప్రాణం పోసుకోనారంభించింది. దీనితో ఇంతకు పూర్వం సాధించుకొన్న హక్కులను సంక్షేమ సదుపాయాలనూ ఈ దేశాల మహిళలు కోల్పోతున్నారు.

**అభివృద్ధి చెందుతున్న దేశాలలో...**

ఇక అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పరిణామాలను పరిశీలించుదాం.

ఆర్థిక మాంద్యం, అభివృద్ధి చెందుతున్న దేశాలను ప్రభావితం చేసింది. ఆఫ్రికా, లాటిన్ అమెరికా, మధ్య ప్రాచ్యదేశాలు దీనివల్ల అధికంగా దెబ్బతిన్నాయి. ఆసియా ఖండపు దేశాలు ఇంత నష్టపోలేదు; కొంత మేరకు నిగ్రహించుకోగలిగాయి. ఈ దేశాలు సంప్రదాయంగా ఎగుమతి చేస్తున్న వ్యాపార పంటలకు డిమాండ్ లేకపోవటం, సరుకుల ధరలు తగ్గటం, వడ్డీరేట్లు పెరగటం, బ్యాంకులు రుణాల నివ్వటాన్ని తగ్గించటం, ఈ మాంద్యపు ప్రధాన ఫలితాలుగా చెప్పవచ్చు. మధ్య ప్రాచ్యపు పెట్రోలియం ఆర్థిక వ్యవస్థ యనభయ్యవ దశాబ్ద మధ్యకాలంలో సంక్షుభిత పరిస్థితులలో

పెట్టుకొన్నది. ఈ కారణాలవల్ల ఎగుమతి వ్యాపారంలో ఈ దేశాలు ఇప్పటికే అనుభవిస్తున్న లోటు ఇంకా పెరిగింది. విదేశీ రుణభారం వెన్ను విరిగే స్థాయికి పెరిగింది. కొన్నిదేశాలు పీకదాకా మునిగాయి. రుణదాతలయిన ప్రపంచ బ్యాంకు, ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ సంస్థల సూచనల మేరకు (వీటిని సూచనలనటం కంటే ఆదేశాలనటం ఉచితం) ఆర్థిక స్థితిని స్థిమిత పరచటానికి అవసరమైన మార్పులను చేపట్టవలసి వచ్చింది. దేశంలోని బడ్జెట్‌లోటును తగ్గించటం, విదేశీ వ్యాపారంలో, ఎగుమతులను పెంచి విదేశీ మారక ద్రవ్యార్జనా పరిమాణాన్ని పెంచుకోవటం, నిరంతరాయంగా ఆర్థికాభివృద్ధి సాధనకు అవసరమైన ఆర్థిక సంస్కరణలను చేపట్టటం ముఖ్యాంశాలుగా తేలాయి.

దేశీ ద్రవ్య మారకం రేటును తగ్గించుకోవటంవల్ల (డీవాల్యుయేషన్‌వల్ల) దేశంలో నిత్యావసర వస్తువుల ధరలు పెరిగాయి. ఇదే కాలంలో ప్రపంచ బ్యాంకు ఇచ్చిన కార్యక్రమపు అమలువల్ల ఇంతవరకూ ప్రభుత్వాలు ఆహార ధాన్యాల మీద ఇస్తున్న సబ్సిడీలు కోతబడి, వాటిధరలు పెరిగి, ప్రజలు (ముఖ్యంగా పేదలు) అధిక బాధలకు లోనుగావలసి వచ్చింది. నిరుద్యోగం ప్రబలి ప్రజల ఆదాయార్జన తగ్గింది. దారిద్ర్యపు బాధ అధికమైంది. సన్నకారు రైతులు, ప్రభుత్వ రంగ సంస్థలలోనూ, సర్వీసెస్ సెక్టార్లోనూ అధిక సంఖ్యలో పనిచేస్తున్న మహిళలు ఈ ఆర్థిక సంస్కరణల అమలు వల్ల అందరికంటే అధికంగా దెబ్బతిన్నారు. వీరు నష్టపడిన వైనమేమిటో చూద్దాం.

## రుణదాతల ఆదేశాలు

అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్థిక పునర్వ్యవస్థీకరణకు ప్రపంచబ్యాంకు 1989వ సంవత్సరాంతానికి 62 దేశాలకు 143 రుణాలను మంజూరు చేసింది. రుణాలను ఇస్తూ ఈ సంస్థలు జారీచేసిన ఆదేశాలివి:

1) ప్రభుత్వం బడ్జెట్‌లోటును బాగా తగ్గించుకోవాలి.

2) పన్నుల సంస్కరణలను ప్రవేశపెట్టాలి; అంటే పెట్టుబడి దారుల ఉత్పత్తి, వ్యాపారాల మీద ఇపుడున్న పన్నుల భారాన్ని తగ్గించాలన్నమాట. ప్రభుత్వం ఖర్చులను తగ్గించుకోవాలి. సాంఘిక సంక్షేమ కార్యక్రమాల ఖర్చులను కూడా తగ్గించుకోవాలి. సబ్సిడీలకు స్వస్తి చెప్పాలి

3) ప్రభుత్వ రంగ పరిశ్రమలను పునర్వ్యవస్థీకరించాలి: ఆర్థికంగా లాభాలు సంపాదించటానికి తగిన మార్పులు చేయాలి. లాభసాటిగాని వాటిని మూసివేయాలి ఈ రంగం నుండి ప్రభుత్వం క్రమంగా వైదొలగాలి

4) దేశపు కరెన్సీ మారకపురేటును కృత్రిమంగా నిలవబెట్టే ప్రయత్నం చేయకుండా, మార్కెట్ విలువకు అది చేరటానికి వీలు కల్పించాలి ఈ సూచనల మేరకే పలు దేశాలు (భారత దేశంతో సహా) తమదేశపు ద్రవ్య మారకపు రేటును తగ్గించుకొన్నాయి

5) మార్కెట్ల స్వేచ్ఛను అనుమతించాలి. (అంటే విదేశీ సరుకు ప్రవాహంగా రావటానికి వీలు కల్పించాలని అర్థం) మార్కెట్లో సరుకుల ధరలను కృత్రిమంగా కాపాడకుండా, పోటీని బట్టి వాటి ధరలు నిర్ణయంగావటానికి వీలు కల్పించాలి.

6) ఎగుమతికి అవకాశమున్న వ్యవసాయోత్పత్తులకు అధిక ధరలు గిట్టటానికి అవసరమైన చర్యలను ప్రభుత్వం తీసుకోవాలి. ఆహార పంటల వ్యాపారంలో ఇపుడున్న ప్రభుత్వ పాత్రను తగ్గించాలి.

7) వ్యాపారం స్వేచ్ఛగా జరిగే అవకాశాలను కల్పించాలి.

8) దేశ ఆర్థిక వ్యవస్థలో ప్రైవేట్ రంగానికి అధిక ప్రాధాన్యత నీయటానికి వీలయిన విధానాలను ప్రభుత్వాలు అవలంబించాలి.

9) దేశ ఆర్థికాభివృద్ధికి విదేశీ పెట్టుబడులు అధికంగా వినియోగపడటాన్ని ప్రోత్సహించాలి.

దేశ ఆర్థికాభివృద్ధి స్థిరమైన పునాదుల మీద ఉండటానికి ఈ కార్యక్రమం తోడ్పడుతుందని కొందరు అర్థశాస్త్ర వేత్తలు అభిప్రాయపడ్డారు ఈ కార్యక్రమం మంచిదే అయినా, ఇది అమలు జరిగే కాలంలో ప్రజలు అవస్థలపాయ్యే వీలున్నదని మరికొందరు నిపుణులు ఆందోళనను ప్రకటించారు. దీర్ఘకాలిక అభివృద్ధికి ఈ కార్యక్రమం ఉపయోగపడక పోవచ్చుననీ, దారిద్ర్యం పెరుగుతుందనీ, పరిసరాలు పాడవుతాయని వీరు అభిప్రాయపడ్డారు. అన్ని దేశాలకూ ఈ కార్యక్రమం పనికిరాదని, ఆయా దేశాలకు తగినట్లు కార్యక్రమ రూపకల్పన జరగాలని మరికొందరు

నిపుణులు అభిప్రాయపడ్డారు.

ఈ కార్యక్రమపు అమలువల్ల దేశంలో ద్రవ్య చలామణీ పరిమాణం తగ్గుతుంది; బ్యాంకులిచ్చే రుణ పరిమాణాలు కూడా తగ్గుతాయి; సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు తగ్గిపోతాయి. సబ్సిడీల ఎత్తివేతగాని, కోతగాని సంభవించవచ్చు; ప్రభుత్వరంగ ఉద్యోగాలు తగ్గుతాయి. ఉత్పత్తి పెంపుదలకు ముఖ్యంగా ఎగుమతి అవకాశమున్న సరుకుల ఉత్పత్తి పెంపుకు ప్రాధాన్యత లభిస్తుంది; విదేశీ మార్కెట్లో పోటీకి తట్టుకోవటానికి వీలుగా దేశంలో కరెన్సీ మారకపు రేటును తగ్గిస్తారు; ధరల, వ్యాపారాల అదుపు మీద నున్న ఆంక్షలను ఎత్తివేస్తారు. దేశంలో పెట్టుబడి పెట్టటానికి విదేశీ పెట్టుబడి దారులను ఆకర్షించటం కోసం కార్మికుల వేతనాలకు కోత బెడతారు. కార్మిక సంక్షేమ కార్యక్రమాలను ఎత్తివేస్తారు; కార్మికులకున్న చట్టబద్ధమైన రక్షణను ఉపసంహరిస్తారు. ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేట్ రంగానికి అప్పగిస్తారు.

ఈ సంస్కరణల అమలువల్ల అందరికంటే అధికంగా బాధపడేది మహిళలేనని 80వ దశాబ్ద మధ్యకాలానికే రుజువైంది. వారి ఆర్థిక, సాంఘిక స్థితి బాగా దెబ్బతింటున్నది. ఇప్పటికే కొన్ని రకాల అసమానతలకూ, వివక్షలకూ గురవుతున్న మహిళలు, ఆర్థిక సంస్కరణల వల్ల ఏర్పడిన అవకాశాలను కూడా వినియోగించుకోలేకపోతున్నారు. ఈ సంస్కరణలు మహిళల ఆర్థిక సాంఘిక పరిస్థితులను ఎంతమేరకు అభివృద్ధి చేయగలవు అనే దానిని బట్టి, వాటి కార్య సాఫల్యత ఆధారపడుతుంది. ఆర్థిక సంస్కరణల అమలు వల్ల లభించే అవకాశాలు స్త్రీ-పురుషులకు ఒకేరకంగా లాభాలను చేకూర్చవు; అలాగే వీరికి ఎదురయ్యే అవరోధాలు కూడా భిన్నంగా ఉంటాయి. అభివృద్ధి కార్యక్రమాలు గాని, అవి సాధించే ఫలితాలు గాని లింగాతీతమైనవని భ్రమించకూడదు; ఇది జీవితం నిగ్గుతేల్చిన సత్యం. ఈ ఆర్థిక సంస్కరణల అమలు కాలంలో ఎదురవుతున్న బాధలను పురుషుల కంటే మహిళలే అధికంగా అనుభవిస్తూ ఉండటానికి కారణం ఇదే.

## మహిళల మనుగడలో మార్పులు

ఈ కార్యక్రమంలోని వివిధ అంశాలు మహిళలను ఎలా ప్రభావితం చేస్తున్నాయో పరిశీలించుదాం.

ఇతర కారణాలతోపాటు, ధరల కంట్రోళ్ళ ఎత్తివేత, సబ్సిడీల కోతవల్ల నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నాయి ఇందువల్ల ప్రజల జీవన వ్యయ పరిమాణం పెరుగుతున్నది. కార్మికుల నిజవేతనాలు తగ్గుతున్నాయి. ఇందువల్ల ఇల్లు గడవక గృహిణి ఇబ్బంది పడుతున్నది. ప్రభుత్వ రంగ సంస్థలలోనూ, పట్టణాలలో స్వయం ఉపాధి రంగంలోనూ మహిళలు అధికంగా ఉంటారు. ఆర్థిక సంస్కరణలు అమలు జరిగే కాలంలో పురుషులకంటే ముందు ఉద్యోగాలను కోల్పోతున్నది మహిళలు. మరొక ఉద్యోగం పురుషులకు లభించినంత త్వరగా స్త్రీలకు రాదు. ఇందువల్ల పురుషులకంటే మహిళలే అధికంగా నష్టపడుతున్నారు.

ధరల పెరుగుదలవల్ల, ఇల్లు గడవక మహిళ, ఇంట్లో ఇబ్బందులున్నా, లేబర్ మార్కెట్‌కు వెళ్ళక తప్పదు. ఇందువల్ల ఆవిడ గృహ నిర్వహణ,శిశు సంరక్షణ, కుటుంబ నిర్వహణ దెబ్బతింటాయి; పైగా పనిభారం పెరుగుతుంది. వివాహిత యువతులు చదువులు మాని, సంసార సాగరంలో పడతారు. ఈ విధంగా మహిళలు అసమానత అనే విషవలయంలో బందీలుగానే ఉండవలసి వస్తుంది.

ఆర్థిక సంస్కరణ విధానాలు మహిళల ఉద్యోగ స్వభావాన్నే మార్చి వేస్తున్నాయి. సంస్థలను లాభదాయకంగా చేయాలనే లక్ష్యంతో యజమానులు కార్మిక సిబ్బందిని తగ్గిస్తారు. ఇందువల్ల తొలుత ఉద్యోగాలను కోల్పోయేది మహిళలు. ప్రభుత్వరంగం ప్రైవేటు రంగానికి బదిలీ అవుతూండటంవల్ల, శాశ్వతమైన ఉద్యోగాన్ని మహిళలు కోల్పోతారు. ఇందువల్ల ఉపాధికి , ప్రైవేటురంగాన్నో, అసంఘటిత రంగాన్నో వీరు ఆశ్రయించవలసి ఉంటుంది. ఇల్లు గడవటం కోసం ఉద్యోగం చేయక తప్పనిస్థితిలో నున్న మహిళలకు భద్రత, రక్షణ ఉన్న ఉద్యోగం దొరకటం కష్టం; తనకున్న విద్యార్హతలు, అనుభవానికి తగిన ఉద్యోగం దొరకటం దుర్లభమవుతుంది. డబ్బు వస్తే చాలు; ఏ ఉద్యోగమైతేనేమి అని ఆవిడ సంతృప్తి పడవలసి ఉంటుంది.

వ్యాపార నిబంధనలను సడలించి, ఎగుమతులకు ప్రోత్సాహాన్ని కల్పించినపుడు, కూలీలు అధికంగా కావలసిన ఉత్పత్తి పరిశ్రమలు అవతరిస్తాయి. ఇందువల్ల మహిళలకు అదనపు ఉపాధి అవకాశాలేర్పడతాయి. ప్రపంచ మార్కెట్‌లోని

ధరలు, పోటీలనుబట్టి, అభివృద్ధి చెందిన దేశాలు అమలు జరుపుతూ ఉండే దిగుమతి విధానాలను బట్టి, ఉత్పత్తిలో హెచ్చు తగ్గులుంటాయి అందువల్ల, మహిళలకు ఉద్యోగం దొరికినట్లే దొరికి, ఇట్లే అది జారిపోయే ప్రమాదం కూడా ఇందులో ఇమిడి ఉంటుంది ఇటువంటి ఉద్యోగాలలో స్త్రీ పురుష వేతనాల మధ్య వ్యత్యాసం ఉండి తీరుతుంది. విధిలేక మహిళలు దొరికిన పనికల్లా వస్తున్నారు గనుక యజమానులు వీరికి తక్కువ వేతనాలిస్తారు పురుషుల కంటే వీరికి ఉద్యోగం దొరకటం (ఇటువంటి పరిశ్రమలలో) సులభమే అయినా, ఆ ఉద్యోగం వల్ల లభించే వేతనం కూడా పురుషుల కంటే తక్కువగానే ఉంటుంది ఆ దొరికిన ఉద్యోగం ఊడిపోవటం అనేది కూడా అంత సులభమే. ఒకసారి ఏర్పడిన అనుకూలత ఇలా ప్రతికూలతగా మారుతున్నది. (జకార్తా డిక్లరేషన్ ఫర్ ది అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ ఉమెన్ ఇన్ ఏషియా అండ్ పసిఫిక్ అన్న ఐక్యరాజ్యసమితి పత్రంలో ఈ అంశపు వివరణ ఉన్నది)

ఉత్పత్తి రంగంలోనూ, సర్వీసుల రంగంలోనూ ఆధునిక సాంకేతిక విధానాలు ప్రవేశిస్తున్నాయి ఈ పరిణామం కాలగతిని వేగాన్ని పుంజుకొంటున్నది. మహిళల మీద ఉండే ఈ టెక్నాలజీ మార్పుల ప్రభావ పరిమాణం, దేశంలోని ఆర్థిక పరిస్థితిని బట్టి, మహిళా ఉపాధి స్వభావాన్ని బట్టి, ఆచరణలోనికి వచ్చిన టెక్నాలజీ యొక్క సాంకేతిక స్థాయిని బట్టి ఉంటుంది ఉత్పత్తి రంగంలో ఆధునిక టెక్నాలజీ ప్రవేశంవల్ల మహిళల ఉపాధి అవకాశాలు తగ్గాయి. మహిళ సంపాదన తగ్గటంతో కుటుంబంలోని ఆవిడస్థానం కూడా దిగజారటం సహజం. ఆధునిక టెక్నాలజీ ప్రావీణ్యం మహిళలకు ఉంటే, వారి ఉపాధి అవకాశాలు పెరుగుతాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, వెనుకబడిన దేశాలలోనూ ఉన్న మహిళలు ఈ విషయంలో ఎంతో వెనుకబడి ఉన్నారు. అక్షర జ్ఞాన మబ్బటమే మహా అదృష్టంగా ఉన్న దేశంలో, ఆధునిక టెక్నాలజీ పరిజ్ఞానాన్ని సంపాదించటాన్ని గురించి వెనుకబడిన దేశాల మహిళ ఆలోచించే అవకాశమే లేదు. కనుక, ఈ అవకాశాలు ఈ దేశాల మహిళలకు దక్కటం లేదు. అభివృద్ధి చెందిన దేశాల మహిళలకు మాత్రమే దీనివల్ల అధిక ప్రయోజనం లభిస్తున్నది. ఆయాదేశాల అభివృద్ధి స్థాయిని బట్టి ఇతర దేశాలలోని వారు కూడా దీనివల్ల లాభం పొందే అవకాశాలున్నాయి. సర్వీసెస్ సెక్టార్లో మహిళలు అధికంగా చేరుతున్నారు గనుక, ఈ రంగంలోని స్త్రీలకు ఇందువల్ల ప్రయోజనం చేకూరే అవకాశాలున్నాయని నిపుణులు చెబుతున్నారు

ఆర్థిక సామర్థ్య సాధనకు, తద్వారా ఉత్పత్తి ఖర్చుల తగ్గింపు, అధిక లాభార్జనా లక్ష్యంతో అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణలు మహిళా ఉపాధి స్థాయిని, ఉద్యోగ భద్రతను తగ్గిస్తున్నాయి మహిళకు, తల్లిగా, గృహిణిగా నిర్వర్తించవలసిన కుటుంబ బాధ్యతలున్నాయి వేతనార్జనకు తన సృజనాత్మక శక్తుల పెంపుకు ఆవిడ పాటుబడవలసి ఉంటుంది. మహిళ పనిచేస్తున్న సంస్థలోని వసతులుగాని, లభిస్తున్న వేతన రూప ప్రతిఫలంగాని, మాతృమూర్తిగా, ఇల్లాలిగా, సంపాదనా పరురాలిగా ఆవిడ నిర్వహిస్తున్న కార్యభారానికి, దాని గౌరవానికి దీటుగా ఉండటంలేదు. పరిశ్రమ లాభాలు గడించటానికి, అమ్మకాల పరిమాణాన్ని బట్టి ఉత్పత్తిని నియమిత పరచటం అవసరం. అందువల్ల యజమానులు అవసరాన్ని బట్టి సిబ్బందిని ఉద్యోగంలో పెట్టుకోవటానికి, అవసరం లేనపుడు తీసివేయటానికి పూనుకొంటూ ఉంటారు. ఈ పరిస్థితులలో స్త్రీలకు లభించే ఉద్యోగాల స్థాయి తక్కువగా ఉండటమే కాదు: వాటికి భద్రత కూడా కరువుగానే ఉంటున్నది. వీరికి, ఉద్యోగంలోని పై స్థాయికి చేరే అవకాశాలుండవు; వృత్తి విద్యా నైపుణ్యాన్ని పెంచుకొనే వీలుకూడా ఉండదు. ఈ అవకాశం ఉంటే ఉన్న ఉద్యోగం ఊడిన తర్వాతనైనా ఇంతకంటే మంచి ఉద్యోగానికి పోయే మార్గాలుంటాయి. "మహిళా ఉద్యోగ స్థాయిలో వచ్చిన ఇలాంటి అవాంఛనీయ మార్పులవల్ల, కొత్తగా ఏర్పడిన ఉపాధి అవకాశాల యొక్క ప్రయోజనం చాలా వరకు తగ్గిపోతున్నది; కనుక ఉద్యోగ నియామక విషయాలలో యాజమానులకు లభించిన స్వేచ్ఛను, ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, ఆర్థిక సరళీకరణ విధానాలను మహిళాభ్యుదయ కార్యక్రమాలతో సమానమైనవిగా పోల్చటం సాహస కార్యమే" అని జి. స్టాండింగ్ "వరల్డ్ డెవలప్‌మెంట్" పత్రికలో ప్రచురితమైన "గ్లోబల్ ఫెమినైజేషన్ త్రూ ఫ్లెక్సిబుల్ లేబర్" అన్న వ్యాసంలో వ్యాఖ్యానించారు. బాధాకరమైన ఈ పరిణామాన్ని ఈ రచయిత ప్రియ వచనాలలో చెప్పటం గమనార్హం !

## వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పులు

ఇక వ్యవసాయరంగంలో వచ్చిన మార్పులను పరిశీలించుదాం. ఉత్పత్తి దారులకు మార్కెట్ ధరల నీయటం, సబ్సిడీల కోత వల్ల తిండి గింజల ధరలు పెరగటం, స్వేచ్ఛా వ్యాపారానికి అవకాశాలు అధికంగావటంవల్ల, పట్టణ గ్రామీణ ప్రాంతాల మధ్య వస్తు మార్పిడిలో రైతులకు అనుకూల పరిస్థితులేర్పడ్డాయి. అందుచేత వ్యవసాయ రంగం లాభించే పరిస్థితులు రూపొందుతున్నాయి. కాని ఈ లాభాలన్నీ, ఈ రంగంలోని అన్ని వర్గాల వారికీ దక్కటం లేదు. నియమిత పరిమితిలో ఆదాయాలను పొందేవారూ, సన్నకారు రైతులు, తాము పండించిన పంట కుటుంబావసరాలకు చాలని పేదరైతులు, ముఖ్యంగా మహిళలు నూతన పరిణామాల ప్రయోజనాన్ని పొందలేకపోతున్నారు. కుటుంబ అవసరాలు తీరగా మార్కెట్లో ఉత్పత్తిని అమ్మే స్థోమతగల పెద్దరైతులు లాభిస్తున్నారు. పెరిగిన ఉత్పత్తి ఖర్చులను, ఆధునిక ఉత్పత్తి విధానాల అవలంబన ద్వారానూ, కూలీరేట్ల తగ్గింపువల్లా తగ్గించుకోగల స్థోమత వారికున్నది.

ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వల్ల గ్రామీణ ప్రజలలో ఇంతవరకూ ఒడ్డున ఉన్నవారిని కూడా దారిద్ర్య ప్రవాహం తనలోనికి లాగేస్తున్నది. ఇందువల్ల గ్రామీణ పేదరికం పెరుగుతున్నది. ఆహార ధాన్యాల ఎగుమతుల మీద ఆధారపడిన దేశాలలోని పేదలు, ఉరుగ్వే రౌండ్ షరతులవల్ల మరింత బాధల పాలయ్యే ప్రమాదమేర్పడింది. ముఖ్యంగా ఆసియా ఖండంలోనూ, కొంతమేరకు లాటిన్ అమెరికా ప్రాంతంలోనూ, స్వంత భూములులేక పూర్తిగా రెక్కల కష్టం మీదనే ఆధారపడినవారు ఈ ప్రమాదానికి అధికంగా గురవుతున్నారు.

సన్నకారు రైతులు మహిళలయినపుడు వారికి ఇబ్బందులు ఎక్కువగానే ఎదురవుతాయి. ఆవిడకు బ్యాంకు రుణం లభించటం కష్టం; వ్యవసాయ విస్తరణాధికారులు వీరిని లక్ష్యపెట్టరు; అందువల్ల అధికోత్పత్తికి అవసరమైన సలహాలు వారి కందవు. కనుక లాభదాయకమైన పంట దిగుబడులు రావు. ఆర్థిక సంస్కరణలో భాగంగా ప్రభుత్వం వ్యవసాయ సరుకుల కొనుగోలును మానటంవల్ల సన్నకారు రైతులు ఎక్కువగా నష్టపోతారు. చివరకు లాభించేది వడ్డీ వ్యాపారి, వ్యవసాయ సరుకుల కొనుగోలు వ్యాపారి మాత్రమే.

ఆర్థిక సంస్కరణల అమలువల్ల మహిళ ఆర్థిక పరిస్థితి విషమించినట్లు దాదాపు పరిశీలకులందరూ అంగీకరిస్తున్నారు. అంతేకాదు; ఆవిడ గృహ నిర్వహణా భారం కూడా పెరిగినట్లు స్పష్టమవుతున్నది. ఇది మూలిగే నక్క మీద తాటికాయపడటం వంటి పరిస్థితి. లభిస్తున్న నూతన అవకాశాలను, శక్తిలేమి వల్ల మహిళలు ఉపయోగించుకోలేకపోతున్నారు. అంతేగాని, ఇది ఆర్థిక పునర్వ్యవస్థీకరణ విధాన దోషం గాదు అని కొందరు నిపుణులంటున్నారు సంప్రదాయం మహిళను ఇంటికి కట్టివేస్తున్నది; కుటుంబంలో పురుషునితో సమానమైన హోదా ఆవిడకు లభించటం లేదు. ఉత్పత్తి వనరుల మీదా, సాధనాల మీద ఆవిడకు అధికారం లేదు. ఆవిడ సృజనాత్మక శక్తుల అభివృద్ధికి అవకాశాలు లేవు; ఉన్నవన్నీ అవరోధాలే. ఇటువంటి పరిస్థితులలో, వచ్చిన సదవకాశాన్ని వినియోగించుకోగల స్థోమత ఆవిడకెలా ఉంటుంది? ఒకవేళ ఏ ఉద్యోగావకాశమో లభించినా, అది దిగువస్థాయిదే అయి వుండటం ఆశ్చర్యకరమైన అంశం కాదు. కనుక స్త్రీ జనోద్ధరణ కూడా ఒక భాగంగా ఉండేట్లు ఆర్థిక సంస్కరణను రూపొందించాలని నిపుణులు సూచిస్తున్నారు (ఈ అంశాన్ని మరొక అధ్యాయంలో విపులంగా వివరిస్తాం)

## స్త్రీలకు నష్టదాయకంగా పరిణమించిన ప్రైవేటీకరణ

మహిళల ఆర్థిక పరిస్థితిని ప్రైవేటీకరణ పలువిధాలుగా ప్రభావితం చేసింది. పలు అభివృద్ధి చెందిన దేశాలలోనూ, మాజీ కమ్యూనిస్టు దేశాలలోనూ, ప్రభుత్వరంగ సంస్థలలో మహిళలు అధిక సంఖ్యలో పనిచేస్తున్నారు. ప్రభుత్వ రంగ పరిశ్రమలలో, ప్రైవేట్‌రంగ పరిశ్రమలలో కంటే, వేతనాలు అధికంగా ఉంటాయి; మహిళలకు ఈ రంగంలో పని పరిస్థితులు కూడా అనుకూలంగా ఉంటాయి. ప్రైవేట్ రంగంలో కంటే ప్రభుత్వ రంగపరిశ్రమలలో, స్త్రీ -పురుష వేతనాల వ్యత్యాసం కూడా తక్కువగా ఉంటుంది. ప్రైవేట్ పారిశ్రామిక రంగంలో లభించని వసతులు, (ప్రసూతి సెలవు, తమ పిల్లలకు "డేకేర్" సెంటర్లు, సోషల్ సెక్యూరిటీ వంటివి) ప్రభుత్వరంగ పరిశ్రమలలో స్త్రీలకు లభిస్తాయి. పెద్దయెత్తున ప్రభుత్వరంగ పరిశ్రమల ప్రైవేటీకరణ జరిగినపుడు మహిళా ఉద్యోగుల వేతనాలు తగ్గిపోతాయి; ఇంతవరకూ వారు అనుభవిస్తున్న అదనపు వసతులు, ఉద్యోగ భద్రత, స్త్రీ-

పురుష సమానత్వము కూడా అంతరిస్తాయి ఇందువల్ల, పెద్దయెత్తున ప్రైవేటీకరణ జరిగినపుడు పురుషులకంటే స్త్రీలు అధికంగా నష్టపడతారు మహిళలను తక్కువస్థాయి ఉద్యోగాలలో నియమిస్తారు: ఈ ఉద్యోగాలకు భద్రత ఉండదు అవసరం లేనపుడు యజమానులు సునాయాసంగా తొలగిస్తారు ఇందువల్ల వీరు అవసరానికి వాడుకోదగిన "రిజర్వు" ఉద్యోగులుగా మారిపోతారు పురుషులలోనూ నిరుద్యోగం ప్రబలింది గనుక, ఉద్యోగాన్వేషణలో మహిళలకు వీరు పోటీదారులవుతారు. ఇందువల్ల మహిళలకు ఉద్యోగావకాశాలు తగ్గిపోతాయి.

మాజీ కమ్యూనిస్టు దేశాలలో పెద్దయెత్తున ప్రైవేటీకరణ ప్రారంభం గావటంతో నిరుద్యోగం పెరిగింది. (ఇది తాత్కాలిక స్థితి అని చెబుతున్నారు) ప్రైవేటీకరణ జరుగుతున్న పలుదేశాలలో మహిళలు, పొట్టగడవటం కోసం, అల్పాదాయాలనిచ్చే లేసుల అల్లకం, దుస్తుల తయారీ, తినుబండారాల తయారీ, అమ్మకం వంటి వృత్తుల నవలంబిస్తున్నారు. ఆర్థిక వనరులు కొంతమేరకైనా ఉన్నవారు చిన్నపాటి వ్యాపారాన్ని ప్రారంభిస్తున్నారు. ఇవి స్థిరమైన ఆదాయాన్నిచ్చే వ్యాపకాలు కావు. కనుక దీనిని నిరుద్యోగపు మారురూపంగా, లేదా కంటికి కనుపించని నిరుద్యోగంగా వర్ణించవచ్చు.

ఆర్థిక సంస్కరణల ప్రభావం, మహిళల ఆర్థిక పరిస్థితి మీద, అన్ని దేశాలలోనూ ఒకే రకంగా లేదు. ప్రైవేటీకరణవల్ల మహిళలను "లే ఆఫ్"లో పెట్టే ప్రమాదం అధికమైంది. ఇందువల్ల వారి వేతనాలు తగ్గిపోతాయి. వారి ఉద్యోగ పరిస్థితి విషమిస్తున్నది ప్రైవేటీకరణవల్ల సంభవిస్తున్న ఉద్యోగాల తరుగుదలరేటు, ప్రైవేట్‌రంగంలో ఏర్పడుతున్న నూతన ఉద్యోగావకాశపు రేటుకంటే అధికంగా ఉన్నది. స్త్రీలు అధిక సంఖ్యాకులుగా ఉన్న సంస్థలే అధికంగా ప్రైవేట్ యజమానుల పరమవుతూ ఉండటంవల్ల, కొత్తగా ఏర్పడే ఉద్యోగావకాశాలకంటే, నిరుద్యోగులయ్యే వారి సంఖ్యే అధికంగా ఉండే ప్రమాదమున్నది. మహిళా నిరుద్యోగం ఎంత ఉంటుంది, ఎంతకాలముంటుంది. అనే అంశము, ప్రైవేటీకరణ వేగాన్ని, పరిమాణాన్ని బట్టి, లేబర్ మార్కెట్లో యజమానులకు లభించే స్వేచ్ఛను బట్టి నిర్ణయమవుతుంది. పరిస్థితుల అనుకూలత వల్ల తూర్పు ఆసియా ప్రాంతంలో, పారిశ్రామిక ఉత్పత్తిలోనికి మహిళలను పెద్దయెత్తున తీసుకొంటున్నారు మాజీ కమ్యూనిస్టు దేశాలలో రాజకీయ, ఆర్థిక పరిస్థితులు స్థిమితపడక పోయినా, స్త్రీ-పురుష వేతనాల మధ్యనున్న అంతరం, అభివృద్ధి చెందుతున్న దేశాలలో కంటే తక్కువగానే ఉన్నది. మహిళా ఉద్యోగులకు ప్రసూతి సెలవుల వంటి వసతులు కల్పించాలి గనుక, యజమానులకు ఖర్చులు పెరుగుతాయి. అందువల్ల వారిని ఉద్యోగంలో పెట్టుకోవటానికి యజమానులు వెనుకాడుతున్నారు. ఇందువల్ల మహిళా నిరుద్యోగం ఎక్కువ కాలమే ఉండే అవకాశాలున్నట్లు పరిశీలకులు భావిస్తున్నారు.

## యాజమానులకే ఉపకరిస్తున్న లేబర్ మార్కెట్ స్వేచ్ఛ

ఎగుమతుల పెంపు లక్ష్యంతో ఇటీవలి కాలంలో ఆర్థికాభివృద్ధి, పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. ఇందువల్ల ప్రపంచ వ్యాప్తంగా మహిళల ఉపాధి అవకాశాలు (అవి ఎంత అశాశ్వతము, నాసివే అయినా) పెరిగాయి. కార్మిక క్షేమం దృష్ట్యా ప్రభుత్వాలు అమలు జరుపుతున్న కొన్ని చట్టాలను, రూల్సును సవరించటంవల్ల యాజమానులు లేబర్ మార్కెట్లో స్వేచ్ఛగా వ్యవహరించే అవకాశాలేర్పడ్డాయి దీనిని "స్వేచ్ఛా" లేబర్ మార్కెట్‌గా మనం వ్యవహరించవచ్చు. ఈ పరిణామంవల్ల లేబర్ మార్కెట్‌ను కంట్రోలు చేసి, కార్మిక సంక్షేమాన్ని రక్షించే శక్తిని ప్రభుత్వం కోల్పోయింది. స్వేచ్ఛా మార్కెట్ల అభివృద్ధి వలన పెట్టుబడుల వినియోగం సమర్థవంతంగా ఉండి, అధిక లాభాలు వస్తాయని నిపుణులు సూచిస్తున్నారు. లేబర్ మార్కెట్ మీద ఉండే ప్రభుత్వ కంట్రోలు "అభివృద్ధి నిరోధక" మైనదని అంటున్నారు. స్వేచ్ఛా మార్కెట్, ఆర్థికాభివృద్ధి నిర్ణయాలను ప్రభావితం చేసేదిగా ఉండాలని, ప్రపంచ మార్కెట్లో ఎగుమతులకున్న అవకాశానుసారంగా దేశంలో ఉత్పత్తి జరగాలని, ఎగుమతులకు అవసరమైన ప్రోత్సాహం లభించాలని, అపుడే ప్రపంచ ప్రజల జీవనం సుఖప్రద మవుతుందనీ ప్రపంచబ్యాంకు ఉపదేశిస్తున్నది. (వివరాలను తెలుసుకొనగోరేవారు బ్యాంకు ప్రచురించిన "వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1987"ను చూడవచ్చు). ఇందుకు

ఉదాహరణంగా తూర్పు ఆసియా దేశాల అనుభవాన్ని, (ముఖ్యంగా దక్షిణ కొరియాను) చూపుతున్నారు. స్వేచ్ఛా లేబర్ మార్కెట్ వర్ధిల్లుతూ, ఎగుమతుల పెంపు లక్ష్యంతో ఉత్పత్తి జరిగేటపుడు, ఎగుమతులు విదేశీ మార్కెట్లో పోటీబడాలి గనుక, వాటి ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకు కూలీరేట్లలో హెచ్చు-తగ్గులు సునాయాసంగా జరుగుతూంటాయి. యజమానులకు ఈ స్వేచ్ఛను ఇవ్వటం కోసమే, లేబర్‌లాను ప్రభుత్వం సడలిస్తుంది. ఇందువల్ల కనీసవేతనపు అమలుకు ఇక అవకాశాలుండవు; కార్మిక సంక్షేమాన్ని యజమానులు పాటించవలసిన అవసరం లేదు. దిగుమతులను తగ్గించి, స్వయం సమృద్ధిని సాధించే లక్ష్యానికి కొన్ని దేశాలు తిలోదకాలిచ్చాయి; మరికొన్ని ఇవ్వబోతున్నాయి. డొమినికన్ రిపబ్లిక్, ఎల్ సెల్వెడార్, హాండూరాస్, హాంకాంగ్, మలేషియా, మెక్సికో, ఫిలిపీన్స్, పోర్టోరికో, దక్షిణ కొరియా, సింగపూర్, శ్రీలంక, తాయ్‌లాండ్‌లు ఎనభయ్యవ దశాబ్దంలో భారీఎత్తున ఎక్స్‌పోర్టు ప్రాసెసింగ్ జోన్సును ఏర్పాటుచేసి, ఎగుమతుల పెంపును చురుకుగా ప్రోత్సహించ నారంభించాయి. ఇందువల్ల మహిళలు అధికంగా లేబర్ మార్కెట్‌కు రావటం ప్రారంభమైంది ఇచ్చే కూలీరేట్లు తక్కువగా ఉన్నా, కుటుంబ అవసరాల దృష్ట్యా అధిక సంఖ్యాక మహిళలు ఈ ఎక్స్‌పోర్టు ప్రమోషన్ జోన్లలోని ఉద్యోగాలకు ఎగబ్రాకరు. ఎగుమతుల పెంపు లక్ష్యంతో జరిగే అభివృద్ధి వ్యూహం ఫలప్రదంగావటంగా దీనిని కొందరు పరిశీలకులు చిత్రిస్తున్నారు. ఈ పరిమాణామం ప్రపంచ వ్యాప్తంగా కనుపించటం లేదు. ఇది ప్రధానంగా తూర్పు ఆసియా దేశాలకు, కొంతమేరకు ఆగ్నేయ ఆసియా దేశాలకు మాత్రమే పరిమితమైనదన్న విషయాన్ని మనం గమనించాలి. డెబ్బయ్యవ దశాబ్దంనుండి ఈ వ్యూహాన్ని అనుసరిస్తున్న'' లాటిన్ అమెరికా దేశాలలో ఇలాంటి "సత్ఫలితాలు" కనుపించటం లేదు.

మహిళా ఉపాధి అవకాశాలు పెరిగినా, వారి పని పరిస్థితులు తీవ్రంగా చెడిపోయాయని జి. స్టాండింగ్ 1994లో వ్రాసిన మరొక వ్యాసంలో పేర్కొన్నారు. "పురుషులతో సమంగా చేసిన పనికి సమానమైన వేతనం లభించాలి" అనే ఉద్యోగుల హక్కును యజమానులు భంగపరచారన్నారు; ఈ అన్యాయ ప్రాతిపదిక మీదనే, మహిళా ఉపాధి పెరిగినట్లు వారు వివరించారు. ఉపాధిలో ప్రవేశించిన మహిళల సంఖ్య పెరిగి ఉండవచ్చు; కాని ఈ అవకాశాలు అతి తక్కువ దేశాలలోని మహిళలకే లభించాయి. ఈ అసమానతల పెరుగుదల, స్త్రీ పురుషుల వేతనాల మధ్యనున్న వ్యత్యాసాల పెంపుదల ప్రాతిపదికల మీద ఈ "అభివృద్ధి" జరిగినట్లు ఎస్. జోన్స్ తాను వ్రాసిన "ఉమెన్ ఇన్ వరల్డ్ ఎకానమీ" అన్న పుస్తకంలో వివరించారు.

స్వేచ్ఛను పొందిన లేబర్ మార్కెట్, ఇంతకు పూర్వమే ఉన్న స్త్రీ-పురుష వేతన వ్యత్యాసాన్ని మరింత పెంచింది. ఉపాధి లభించిన మహిళల సంఖ్య పెరిగినా, వారి పని పరిస్థితులు బాగా చెడిపోయాయి. మహిళల ఆర్థిక, సామాజిక స్థాయి పెంపుకు సూచనగా దీనిని ఎలా వర్ణించగలం? స్వేచ్ఛా లేబర్ మార్కెట్లో తమ ఇచ్ఛ వచ్చినట్లు వ్యవహరించే "హక్కు"ను యజమానులు సంపాదించారు; కార్మికులకు ఇంతకు పూర్వమున్న హక్కులు హరించుకుపోయాయి. మహిళల వేతనాలను, వారి పని పరిస్థితులను నిర్ణయించే హక్కును స్వేచ్ఛా మార్కెట్ సంపాదించింది ! మహిళా జీవనోపాధి నిర్ణేతగా అది రూపొందింది ! ఈ స్వేచ్ఛా మార్కెట్, పురుషులతో సమానమైన ప్రతిఫలాన్ని స్త్రీలకు ఇప్పించలేకపోతున్నది; తల్లిగా, గృహిణిగా, కుటుంబ పోషకురాలిగా ఆవిడ నిర్వహిస్తున్న పవిత్ర పాత్రకు తగిన ప్రతిఫలాన్నిది ఇవ్వలేకపోతున్నదన్న అంశం స్పష్టమవుతున్నది. ఈ పరిస్థితి తొలగింపుకు, మార్కెట్ మీద ప్రభుత్వ కంట్రోలు ఉండటం అవసరం. అయితే ప్రభుత్వం దీనిని ఎంతమేరకు కంట్రోలు చేయాలి అన్నదాని కంటే, కంట్రోలు చేయటానికి అది అవలంబించే విధానాల స్వభావం, వాటి లక్ష్యం ఏమిటి అన్నది ముఖ్యమైన అంశం.

### ప్రపంచ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ పరిధి

దేశీ ఆర్థిక వ్యవస్థలలో వలె ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో కూడా మార్పులొచ్చాయి; ఇంకా వస్తున్నాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో వస్తున్న మార్పులకు అనుగుణంగానే, వివిధ దేశాల ఆర్థిక వ్యవస్థలలో కూడా మార్పులు వస్తున్నాయి. దేశీ ఆర్థిక వ్యవస్థా, అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థా ఒక దాని మీద ఒకటి ఆధారపడ్డాయి గనుక, అనుబంధిత మార్పులు రావటం ఆశ్చర్యకరమైన అంశం కాదు. రెండవ ప్రపంచ యుద్ధానంతర

కాలం నుండీ. విదేశీ వ్యాపారంలో మార్పులు రాసాగాయి గత 40-45 సంవత్సరాల కాలంలో ప్రపంచ వ్యాపార పరిమాణం పెరిగింది: వ్యాపారంలో మార్పిడికి లోనవుతున్న వస్తుసముదాయ స్వభావంలో కూడా మార్పులున్నాయి బహుళజాతి సంస్థల (ట్రాన్స్ నేషనల్ కార్పొరేషన్లు లేక మల్టీనేషనల్ కార్పొరేషన్ల) సంఖ్య ఊహాతీతంగా పెరిగింది ! వాటి వ్యాపారస్థాయి కూడా విపరీతంగా పెరిగింది వీటిలో వంద పెద్దవని అనుకొంటే, వాటిలో సగభాగం చాలా పెద్దవి ఇటువంటి 350 బహుళజాతి సంస్థలు ప్రపంచ వ్యాపారంలో నూరింట నలభై వంతులను కంట్రోలు చేస్తున్నాయి. వీటి వార్షిక వ్యాపార పరిమాణం కొన్ని దేశాల జాతీయోత్పత్తి పరిమాణాన్ని మించి ఉంటున్నది! అంతర్జాతీయ ద్రవ్యనిధి మార్పిడి పరిమాణం చుక్కల నంటే స్థాయికి ఎదిగింది ఈ మార్పిడి రోజులోని ఇరవై నాలుగు గంటల కాలము జరుగుతూనే ఉంటున్నది. ఇందువల్ల పాపం లక్ష్మీదేవికి, ఆఖరుకు ఒక్క కునుకుదీసే కాలవ్యవధి కూడా లభించటం లేదు!

ప్రపంచ వ్యాపారం ఎంతమేరకు విస్తరించిందో, ఎగుమతి, దిగుమతులకు లోనవుతున్న సరుకుల స్వభావమేమిటో చూద్దాం. వ్యాపార స్థాయిని బట్టి, దాని స్వభావాన్ని బట్టి దేశీ ఆర్థిక వ్యవస్థలో మార్పులు రావలసి ఉంటుంది. ఉత్పత్తి వనరుల వాడకాన్ని ఈ మార్పులు ప్రభావితం చేస్తాయి వ్యాపారానికి ఉపాధి అవకాశాలను పెంచగల సామర్థ్యం ఉన్నపుడే, దాని అభివృద్ధి వలన మహిళల ఉద్యోగావకాశాలు కూడా పెరుగుతాయి.

అంతర్జాతీయ వ్యాపారానికి కవాటాలు తెరచిన అభివృద్ధి చెందుతున్న దేశాలలో, మహిళా ఉపాధి అవకాశాలు అకస్మాత్తుగా పెరగటం కనుపిస్తుంది. మహిళా ఉపాధి అవకాశాల పెంపుపై వ్యాపారపెంపు ప్రభావం ఎలా ఉంటుంది అనే విషయాన్ని పరిశీలించే ముందు మనం ముఖ్యంగా మూడు అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి:

1) ఎగుమతుల పెంపుకు జరిగే ఉత్పత్తి, ఉపాధి అవకాశాల పెంపును ప్రోత్సహించిందా? 2) మహిళా వేతనాలు తక్కువ గనుక, ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకే వారిని నియోగిస్తున్నారా? 3) ఎగుమతవుతున్న సరుకుల పరిమాణంలోనూ, స్వభావంలోనూ ఏమయినా మార్పు లొచ్చాయా?

ఎనభయ్యవ దశాబ్దంలో పలుదేశాల మార్కెట్ల మధ్య హద్దులు చెరిగిపోయి, వ్యాపార ప్రపంచీకరణకు, దాని విస్తరణకూ అవకాశాలేర్పడ్డాయి. ఈ దశాబ్దంలో అంతర్జాతీయ వ్యాపార పరిమాణపు పెరుగుదలరేటు ప్రపంచ ఉత్పత్తి పెరుగుదల రేటును మించిపోయింది ! ఈ పురోగతి 90వ దశాబ్దంలో కూడా కొనసాగింది

వ్యాపార వస్తు మార్పిడిలో మార్పులొచ్చాయి. మొత్తం వ్యాపారంలో మాన్యుఫాక్చరింగ్ పరిశ్రమల ఉత్పత్తుల ఎగుమతుల పరిమాణం బాగా పెరిగింది. 20వ శతాబ్దపు అరవయ్యవ దశాబ్దకాలంలో, అభివృద్ధి చెందుతున్న దేశాల ఈ సరుకుల ఎగుమతిరేటు, అభివృద్ధి చెందిన దేశాల జాతీయాదాయపు పెరుగుదల రేటు కంటే రెండు రెట్లు అధికంగా ఉన్నది ! 1980వ సంవత్సరంలో, ప్రపంచపు మొత్తం ఎగుమతుల పరిమాణంలో 54.2 శాతంగా ఉన్న మాన్యుఫాక్చర్డ్ గుడ్స్, 1990వ సంవత్సరానికి 71.1 శాతానికి పెరిగింది అభివృద్ధి చెందుతున్న దేశాల మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతులలోనూ ఇదే స్వభావం కనుపిస్తుంది. మొత్తం ప్రపంచ ఎగుమతులలో, 1970వ సంవత్సరంలో, 24.5 శాతంగా ఉన్న అభివృద్ధి చెందుతున్న దేశాల మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతులు, 1980వ సంవత్సరానికి 61.5 శాతానికి, 1990వ సంవత్సరానికి 72.4 శాతానికి పెరిగాయి. 1987-1991 సంవత్సరాల మధ్యకాలంలో, అభివృద్ధి చెందుతున్న దేశాల మొత్తం ఎగుమతులు సగటున సాలుకు 7.7 శాతం చొప్పున పెరిగితే, మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతులు 12.8 శాతం చొప్పున పెరిగాయి. గత ముప్పై సంవత్సరాల కాలంలోనూ మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ వ్యాపారం నిరంతరాయంగా, నిలకడగా పెరుగుతూనే ఉన్నది. జాతీయ ఉత్పత్తి పెరుగుదలరేటు కంటే, మొత్తం ఎగుమతుల పెరుగుదలరేటు కంటే వీటి ఎగుమతుల పెరుగుదల రేటు అధికంగా ఉన్నది. దీనిని బట్టి ఈ ధోరణి ఇక ముందు కూడా కొనసాగే అవకాశాలున్నాయని పరిశీలకులు విశ్వసిస్తున్నారు.

దేశపు ఆర్థికాభివృద్ధి, ఎగుమతుల పెంపువల్ల లేబర్ మార్కెట్‌కు వచ్చే మహిళల సంఖ్య పెరిగింది. 1970-1990 సంవత్సరాల మధ్యకాలంలో వీరి సంఖ్య అధికంగావటం

కనుపిస్తున్నది. మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతుల పెరుగుదలకు అనుగుణంగా, మహిళా ఉపాధి అవకాశాలు పెరుగనారంభించాయి. ప్రపంచ వ్యాప్తంగా చూచినపుడు ఈ పరిస్థితి సంతృప్తికరంగా కనుపిస్తుంది. కాని ప్రాంతీయ భేదాలను బట్టి చూస్తే, పరిస్థితి నిరాశాజనకంగా కనుపిస్తున్నది. అన్ని ప్రాంతాలలోనూ ఎగుమతులు ఒకే పరిమాణంలో పెరుగలేదు. అభివృద్ధి చెందుతున్న అతికొద్ది దేశాల ఎగుమతులే, ఈ వర్గపు దేశాల మొత్తం ఎగుమతులలో అత్యధిక భాగంగా ఉంటున్నాయి. 1987-1991 సంవత్సరాల మధ్యకాలంలో పెరిగిన అభివృద్ధి చెందుతున్న దేశాల మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతుల పరిమాణంలో, మూడింట రెండువంతులను, ఆసియాకు చెందిన కేవలం ఎనిమిది దేశాలు మాత్రమే ఎగుమతి చేశాయి. ఇవి : హాంకాంగ్, ఇండోనేషియా, దక్షిణ కొరియా, మలేషియా, సింగపూర్, తైయువాన్, ఫిలిపీన్స్, తాయ్‌లాండ్‌లు. ఈ వర్గపు సరుకుల ఎగుమతుల పెరుగుదలలో 80 శాతం వరకూ ఈ దేశాల ఎగుమతి శక్తే కారణం. ఇదే కాలంలో లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాల మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతులు తగ్గాయి. ఆఫ్రికా నుండి జరిగిన ఎగుమతులు స్వల్పంగా ఉన్నాయి. 1980-1990 సంవత్సరాల మధ్యకాలంలో ఆర్థికోత్పత్తిలో పాల్గొంటున్న మహిళల సంఖ్య ఆఫ్రికాలోనూ, లాటిన్ అమెరికాలోనూ తగ్గింది. సబ్-సహారన్ ప్రాంత ఆఫ్రికాలో ఈ తగ్గుదల అధికంగా ఉన్నది.

మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ఎగుమతుల పరిమాణాన్ని బట్టి, అభివృద్ధి చెందుతున్న దేశాలలో మహిళల పారిశ్రామిక రంగ ఉపాధి అవకాశాల పరిమాణం ఆధారపడి ఉంటున్నది. 20వ శతాబ్దపు డెబ్భయ్యవ దశాబ్దకాలంలో పారిశ్రామికాభివృద్ధిని సాధించిన హాంకాంగ్, సింగపూర్, తైయువాన్, దక్షిణ కొరియా దేశాలలో మహిళా ఉపాధి పెరుగుదల కనుపించింది. తర్వాత ఇండోనీషియా, మలేషియా, తాయ్‌లాండ్ దేశాలు కూడా ఇటువంటి అభివృద్ధిని ప్రదర్శించాయి. ఈ దేశాలు అంతర్జాతీయ ఎగుమతులకు కవాటాలు తెరచి, ఎగుమతుల పెంపు ప్రాతిపదిక మీదకు పారిశ్రామిక ఉత్పత్తి విధానాన్ని మరలించిన తర్వాతనే ఇది సాధ్యమైంది.

ఈ పరిణామానికీ, మహిళా ఉపాధి అవకాశాలు పెరగటానికీ సంబంధం ఏమిటి? అంతర్జాతీయ మార్కెట్లో మాన్యుఫాక్చర్డ్ గుడ్స్‌కు ఎపుడూ గిరాకీ ఉంటుంది. అభివృద్ధి చెందిన దేశాలలో మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ ధరలు అభివృద్ధి చెందుతున్న దేశాలలో కంటే అధికంగా ఉంటాయి. అభివృద్ధి చెందిన దేశాల ప్రజల ఆదాయాలు, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రజల ఆదాయాల కంటే అధికంగా ఉంటాయి గనుక, అధిక ధరల నిచ్చి సరుకును కొనటానికి వారు వెనుకాడరు. అభివృద్ధి చెందిన దేశాలు వాడే మొత్తం మాన్యుఫాక్చర్డ్ గుడ్స్ పరిమాణంలో, అభివృద్ధి చెందుతున్న దేశాల నుండి వస్తున్న సరుకు 1988వ సంవత్సరంలో కూడా, రెండు శాతం మాత్రంగానే ఉన్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలనుండి వచ్చే ఈ రకపు సరుకును, ఇంతకంటే అధిక పరిమాణంలో అభివృద్ధి చెందిన దేశాల మార్కెట్లలో అమ్మే అవకాశాలున్నాయి. ఈ తరగతికి చెందిన పారిశ్రామికోత్పత్తుల ధరలు, అభివృద్ధి చెందుతున్న దేశాలలో కంటే, అభివృద్ధి చెందిన దేశాల మార్కెట్లలో అధికంగా ఉంటాయి. ఇందువల్ల అభివృద్ధి చెందుతున్న దేశాల ఉత్పత్తులు, అంతర్జాతీయ మార్కెట్లో తీవ్రమైన పోటీనివ్వ గలుగుతున్నాయి. ఈ పోటీలో నిలవగలగాలంటే, పరిశ్రమల యజమానులు, ఉత్పత్తిని పెంచటం, లేదా పనివారి వేతనాలకు కోతబెట్టటం వంటి చర్యల ద్వారా ఉత్పత్తి ఖర్చులను తగ్గించవలసిన అవసరం ఉంటుంది. ఇందువల్ల తక్కువ కూలీకి పనిచేసే కార్మికులకు డిమాండ్ పెరిగింది. పొట్ట గడవక లేబర్ మార్కెట్‌కు అధిక సంఖ్యలో వస్తున్న మహిళలు పారిశ్రామిక యజమానుల లాభార్జనా తృష్ణకు ఎరవుతున్నారు. ఫాక్టరీలలో పనిపరిస్థితులు దుర్భరంగా ఉన్నా, ప్రమాదకరంగా ఉన్నా, పనిచేయటానికి వీరంగీకరిస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో చౌకగా లభిస్తున్న ఈ మానవ శ్రమను వినియోగించుకొని, అధిక లాభార్జనా సాధనకే విదేశీ పెట్టుబడులు, అభివృద్ధి చెందుతున్న దేశాలకు ప్రవాహంగా వస్తున్నాయి.

ఎగుమతి కోసం ఉత్పత్తి చేసే పరిశ్రమలన్నింటిలోనూ మహిళలకు అధిక పరిమాణంలో ఉపాధి లభించటం లేదు. మానవ శ్రమ అధికంగా అవసరమైన పరిశ్రమలలో మాత్రమే ఈ అవకాశాలు మహిళలకు లభిస్తున్నాయి. అవసరానికి మించిన సంఖ్యలో పనివారున్నపుడు, తక్కువ కూలీకి వచ్చే

వారికే యజమానులు నియమించబూనటం సహజం మగవారి కంటే ఆడవారి కూలిరేట్లు తక్కువగా ఉంటాయి గనుక యజమానులు వీరి నియామకానికి తాపత్రయ పడటం సహజం ఎగుమతి కోసం సరుకు నుత్పత్తి జేసే పరిశ్రమలలో మహిళా ఉపాధి పెరుగుదలకు ప్రధాన కారణం ఇదే

అభివృద్ధి చెందిన దేశాలలో పరిస్థితి దీనికి పూర్తిగా భిన్నంగా ఉన్నది ఈ దేశాలు ఆధునిక టెక్నాలజీలో అగ్రగాములుగా ఉన్న విషయం లోకవిదితం. టెక్నాలజీ స్థాయి అధికంగా ఉండటం వలన, స్వయంచలిత సాధనాలను వాడి, తక్కువస్థాయి ఉద్యోగాలను లేకుండా చేస్తున్నారు. తక్కువ స్థాయిలో పని జరగవలసిన పరిస్థితులలో, అటువంటి పరిశ్రమలను, కూలీలు తక్కువ రేట్లకు దొరికే అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, పేద దేశాలలోనూ ఏర్పాటు చేస్తున్నారు ఇందువల్ల తక్కువ నైపుణ్యం అవసరమైన పనులలో ఉన్నవారికి ఉద్వాసన జరిగే ప్రమాదం ఏర్పడింది. ఈ స్థాయి ఉద్యోగాలలో ఉన్నవారిలో అధిక సంఖ్యాకులు మహిళలు; కనుక వారికి నిరుద్యోగ ప్రమాదం అధికమైంది. ఈ విధంగా వృత్తినైపుణ్యం లేని మహిళలకు, అంతర్జాతీయ వ్యాపార విస్తరణవల్ల నష్టం జరుగుతున్నది ఈ దేశాలలో, వ్యక్తి జీవితపు ఏ దశలోనైనా నైపుణ్యపు పెంపుకు అవసరమైన విద్యార్జనకు వెళ్ళే వసతులున్నాయి. కనుక శక్తి సామర్థ్యాలున్న యువతులు తమ వృత్తి నైపుణ్యాన్ని పెంచుకొని ఉపాధిని సంపాదించే అవకాశాలున్నాయి. అభివృద్ధి చెందిన దేశాలలో సర్వీసెస్ సెక్టారు త్వరితగతిని విస్తరిస్తున్నందువల్ల, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళలకున్నంతటి నిరుద్యోగ ప్రమాదం వీరికి లేదు ఇప్పటి ప్రపంచ వ్యాప్త పరిస్థితిని చూచినపుడు, అంతర్జాతీయ వ్యాపార పెరుగుదలవల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలలో (ముఖ్యంగా భారీయెత్తున ఎగుమతి చేస్తున్న తూర్పు, ఆగ్నేయ ఆసియా దేశాలలో) మహిళా నిరుద్యోగ సూచనలు కానరావటం లేదు. ప్రపంచంలో ఉపాధిలో ఉన్న మహిళల సంఖ్య తగ్గలేదు. పారిశ్రామిక రంగంలో నిరుద్యోగం మామూలు స్థాయిని మించినా, సర్వీసెస్ సెక్టారులో ఉద్యోగాల సంఖ్య పెరుగుతూ ఉండటంవల్ల ఈ అవాంఛనీయ పరిణామం సంభవించలేదు.

అంతర్జాతీయ మార్కెట్‌కు పెద్దయెత్తున ఎగుమతి చేయటానికి తగిన ఆర్థికాభివృద్ధి విధానాలను అవలంబిస్తున్న దేశాలలో కూడా, వేతనాలరేట్లు క్రమంగా పెరుగుతున్నాయి ఆర్థికాభివృద్ధి స్థిరపడటంవల్ల, దేశీ ఆర్థిక వ్యవస్థ బలపడింది అందుచేత, ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకు ఈ దేశాలకు ఆధునిక సాంకేతిక విధానాలను వాడగల సామర్థ్యం లభించింది. కొన్ని ఆసియా, లాటిన్ అమెరికా దేశాలు ఆధునిక ఉత్పత్తి విధానాల నవలంబించి, అంతర్జాతీయ మార్కెట్‌లో పోటీకి తట్టుకొని కూడా పారిశ్రామికోత్పత్తులను లాభసాటిగా ఎగుమతి చేయగలుగుతున్నాయి. ఇటువంటి దేశాలలో ఎగుమతి కోసం ఉత్పత్తి జరుగుతున్న పారిశ్రామిక రంగంలో ఉపాధిలోని కొస్తున్న మహిళల సంఖ్య పెరుగకపోవటమే కాదు: తరగనారంభించింది "ఎగుమతి సరుకులను ఉత్పత్తి చేసే పరిశ్రమలలోనూ, ఎక్స్‌పోర్టు ప్రోసెసింగ్ జోన్స్‌లోని పరిశ్రమలలోనూ, ఆధునిక సాంకేతిక ఉత్పత్తి విధానాలను (అంతర్జాతీయ మార్కెట్లో పోటీకి తట్టుకోవటానికి) ప్రవేశపెట్టటం వలన, వీటిలో ఉపాధిని అనుభవిస్తున్న మహిళల సంఖ్య తగ్గుతున్నది. దీనికొక కారణమున్నది. సాంకేతికంగా ఉన్నత ప్రమాణాలను గలిగిన వస్తూత్పత్తికి, వాటి ఉత్పత్తిలో నైపుణ్యాన్ని పొందిన కార్మికులవసరం; వారికి వృత్తిపరమైన అనుభవం కూడా ఉండాలి. ఈ ప్రాంతాల మహిళా కార్మికులకు ఈ స్థాయీ నైపుణ్యం లేదు; కనుక వారా ఉత్పత్తి రంగానికి పనికిరారు. ఉపాధి అన్వేషణా రంగంలో వీరు పురుషులతో పోటీకి నిలువలేరు" అని ఐ.ఎల్.ఓ. నిపుణులు ఎన్. బేడెన్, మహిళా ఉపాధి విషయాల మీద వ్రాసిన ఒక పరిశీలనా వ్యాసంలో వివరించారు.

తక్కువ వేతనాలకు కూడా పనిచేయటానికి, అవసరమైన దాని కంటే ఎక్కువ పరిమాణంలో కార్మికులున్న దేశాలు మరొక ప్రమాదానికి గురవుతున్నాయి. విదేశీ పెట్టుబడులు ఈ దేశాలకు తరలి వెళుతున్నాయి. అభివృద్ధి చెందిన దేశాలలో ఇప్పటికే ఎగుమతి సామర్థ్యాన్ని పొందిన పరిశ్రమలలో విదేశీ పారిశ్రామిక సంస్థలు షేర్లను కొంటున్నాయి. అందువల్ల ఈ ప్రాంత పరిశ్రమల సాంకేతిక స్థాయి పెరుగుతున్నది. ఇక మీదట ఉద్యోగ సంపాదనలో, ఆధునిక సాంకేతిక నైపుణ్యానికీ, అనుభవానికీ ప్రాధాన్యత లభిస్తుంది. మహిళలు ఈ విషయంలో వెనుకబడి ఉంటారు గనుక

పారిశ్రామిక రంగంలో వారి ఉపాధి అవకాశాలు బాగా తగ్గిపోతాయి.

అభివృద్ధి చెందిన దేశాల మహిళల విద్యాస్థాయి, ఉత్పత్తి అనుభవం, సామర్థ్యం, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని స్త్రీల కంటే అధికంగా ఉన్నది. ఇందువల్ల మారిన ఉపాధి పరిస్థితులను తట్టుకొని, అభివృద్ధి చెందిన దేశాల మహిళలు నిలచినట్లుగా, *అభివృద్ధి చెందుతున్న దేశాల మహిళలు ఉపాధి రంగంలో నిలువలేరు. దీనిని బట్టి అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ఎగుమతుల పెంపే ప్రధాన లక్ష్యంగా ఉత్పత్తి జరిగే ఆర్థిక వ్యవస్థ, దీర్ఘకాలిక ప్రాతిపదిక మీద మహిళలకు ఉపాధిని కల్పించలేదు అని నిరూపణవుతున్నది. ఈ వ్యవస్థ మహిళా కార్మికుల వృత్తి నైపుణ్యాన్ని, అనుభవాన్ని పెంచి, వారి ఉపాధిని కాపాడలేదు అని కూడా ప్రదర్శితమవుతున్నది. దేశం ఆర్థికాభివృద్ధి సాధనలో పురోగమిస్తున్న కొలదీ, పరిశ్రమల సాంకేతిక స్థాయి పెరుగుతూ ఉంటుంది; నైపుణ్యంలేని కార్మికుల అవసరం తగ్గుతూ ఉంటుంది. దేశపు పారిశ్రామిక టెక్నాలజీ అభివృద్ధి స్థాయికి తగినట్లుగా, మహిళా కార్మికుల వృత్తి నైపుణ్యము, అనుభవమూ పెరుగనపుడు, దేశ ఆర్థికాభివృద్ధి స్థాయి పెరుగుతున్న కొలదీ, ఈ స్థాయికి తగినట్లు మహిళా కార్మిక నిరుద్యోగ పరిమాణం పెరుగుతూ ఉంటుంది. మహిళా ఉపాధికి, వ్యాపారానికి మధ్యనున్న సంబంధాన్ని, వ్యాపార పరిమాణము, దాని నిర్మాణ స్వభావమూ, ఎగుమతులు చేరే ప్రాంత స్వభావమూ నిర్ణయిస్తాయి. పారిశ్రామికోత్పత్తికి మానవశ్రమ అధికంగా అవసరమైనంత కాలమే (అధిక సంఖ్యలో కార్మికులు పనిచేయవలసిన అవసరమున్నంత కాలమే), విదేశీ ఎగుమతులు పెరుగుతున్న కొలదీ మహిళల ఉపాధి పరిమాణం పెరుగుతూ ఉంటుంది. మహిళా కార్మికుల వృత్తి నైపుణ్యం బాగా పెరుగనపుడు, వారి ఉపాధి అవకాశాలు తగ్గుతాయి.

**మహిళా ఉపాధిపై బహుళజాతి సంస్థల వ్యాప్తి ప్రభావం**

బహుళజాతి సంస్థల (ట్రాన్స్-నేషనల్ కార్పొరేషన్లు) విస్తరణ కూడా మహిళా ఉపాధిని ప్రభావితం చేస్తున్నది. గత పాతిక సంవత్సరాల కాలంలో దాదాపు 14-15 అభివృద్ధి చెందిన దేశాలలో ఈ వర్గపు సంస్థల సంఖ్య మూడు రెట్లు పెరిగింది. వరల్డ్ ఇన్వెస్ట్‌మెంట్ రిపోర్టు - 1993 ప్రకారం, ఈ దశాబ్ద ప్రారంభ కాలంలో 37,000 బహుళజాతి సంస్థలకు, ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో మొత్తం 1,70,000 అనుబంధ సంస్థలున్నాయి. ప్రపంచ మంతటా పెద్దయెత్తున పెట్టుబడులు పెట్టి ఇవి సరకులను ఉత్పత్తి చేస్తున్నాయి ఇందువల్ల ఉపాధి అవకాశాలు బాగా పెరిగాయి. అంక్టాడ్ (UNCTAD) తయారుచేసిన "ట్రాన్స్-నేషనల్ కార్పొరేషన్స్ అండ్ ఎంప్లాయిమెంట్" రిపోర్టు (1994) ప్రకారం, ఈ సంస్థలలో మొత్తం ఏడు కోట్ల ముప్పై లక్షల మంది పనిచేస్తున్నారు. ఈ సంస్థల కాంట్రాక్టర్లు, సప్లయర్లు మొదలైన వారివల్ల, కంపెనీలో పనిచేసే ప్రతి ఉద్యోగికి, ఇద్దరు చొప్పున బయటివారు ఉపాధిని పొందుతున్నారు. దీని ప్రకారం కంపెనీ ఉద్యోగులు గాక, వెలుపల దాదాపు పదిహేను కోట్ల మందికి ఉపాధి లభిస్తున్నదన్నమాట.

బహుళజాతి సంస్థలు విదేశాలలో పనిచేయటానికి పంపే తమ సిబ్బందిలో కూడా మహిళలకు తగినంత స్థానం లభించకపోవటం ఆశ్చర్యకరమైన అంశము. ఉత్తర అమెరికాలోని 686 కంపెనీలకు సంబంధించిన సమాచారాన్ని ఒక సర్వే ప్రకటించింది. దీని ప్రకారం ఇవి మొత్తం 13,338 మంది మేనేజీరియల్ సిబ్బందిని ఆసియా దేశాలకు పంపాయి, అందులో నూరింట ముగ్గురు మాత్రమే మహిళలున్నారు! మేనేజీరియల్ స్థాయి సిబ్బందిలో మహిళా నియామక విషయంలో అభివృద్ధి చెందిన దేశాలే, ఇంత సంకుచితంగా వ్యవహరిస్తుంటే, అభివృద్ధి చెందుతున్న దేశాల కంపెనీలు ఉదారతను ఎలా చూపుతాయి?

అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ఉత్పత్తితో సంబంధంలేని టెలికమ్యూనికేషన్స్, రవాణా, టెక్నాలజీ రంగాలలో బహుళజాతి సంస్థలు ప్రధానంగా పెట్టుబడులను పెట్టాయి. "సంప్రదాయేతర సరుకుల" ఎగుమతిని ప్రోత్సహించటం పేరుతో అభివృద్ధి చెందుతున్న దేశాలు ఏర్పాటు చేసిన "ఎక్స్‌పోర్టు ప్రాసెసింగ్ జోన్స్"లో పరిశ్రమలను ఏర్పాటుచేసే బహుళజాతి సంస్థలకు, ఈ దేశాల ప్రభుత్వాలు, సరుకుల ఎగుమతి, దిగుమతుల మీద పన్నుల రాయితీల నిస్తున్నాయి. పన్నుల రాయితీలు, తక్కువ వేతనాలకు సమృద్ధిగా దొరికే కార్మిక వర్గమూ, ఈ బహుళజాతి సంస్థలకు బహు ఆకర్షణీయంగా కనుపించాయి. ఎక్స్‌పోర్టు ప్రాసెసింగ్

జోన్స్‌లో పరిశ్రమలను విరివిగా ఏర్పాటు చేయ ప్రారంభించాయి. తక్కువ వేతనాలకే వచ్చే పురుష కార్మికులకు కొరత లేకపోయినా, కావాలనే వారు మహిళా కార్మికులను సిబ్బందిలోకి తీసుకొంటున్నారు. పురుషులకిచ్చేంత వేతనాలను స్త్రీ కార్మికులకు ఇవ్వనవసరం లేదు. పురుషులకంటే స్త్రీలను కంట్రోలు చేయటం సులభం. పైగా వారు "మెత్తని" వారు. పనిలో మొరాయించకుండా, స్వచ్ఛందంగా సహకరిస్తారు పనిని కూడా "చక్కగా" చేస్తారు. (మహిళా కార్మికుల వల్ల యజమానులకు ఎన్నిరకాల ప్రయోజనాలున్నాయి!)

అభివృద్ధి చెందిన దేశాలలో ఏర్పాటైన ఎక్స్‌పోర్టు ప్రాసెసింగ్ జోన్స్, మరికొన్ని ప్రత్యేక మండలాలు విదేశీ పెట్టుబడులను అధికంగా ఆకర్షించాయి. ఇందువల్ల చాల మందికి ఉపాధి లభించింది. పైన పేర్కొన్న "అంక్‌టాడ్" రిపోర్టు ప్రకారం 20వ శతాబ్దపు 90వ దశాబ్ద ప్రారంభకాలంలో, అరవై అభివృద్ధి చెందుతున్న దేశాలలో సుమారుగా రెండు వందల వరకూ ఎక్స్‌పోర్టు ప్రాసెసింగ్ జోన్స్ ఉన్నాయి: వీటిలో మొత్తం నలభై లక్షల మందికి ఉపాధి లభించినట్లు అంచనా వేస్తున్నారు ఈ అవకాశం మానవశ్రమ అధికంగా అవసరముండే వస్త్ర పరిశ్రమ, దుస్తుల తయారీ, విద్యుత్ పరికరాల వంటి వాటిలో మాత్రమే లభించింది. సర్వీసు సెక్టార్లో, డేటా ప్రాసెసింగ్, ఆఫీసుల నిర్వహణ వంటి వాటిలో కూడా ఉపాధి అవకాశాలేర్పడ్డాయి అమెరికాలోని "ఫార్ఛ్యూన్" పత్రిక యేటా సర్వేకు తీసుకొనే ప్రపంచంలోని వెయ్యిపెద్ద కంపెనీలలో రెండు వందల యాభై వరకూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలో కార్యాలయాలను తెరిచాయి. (పనివారి వేతనాలు తక్కువగా ఉంటాయి గనుక, ఈ అవకాశ వినియోగం కోసం డేటా ప్రాసెసింగ్ వంటి పనులను చేయించుకోవటానికి ఈ దేశాలలో ఆఫీసులను కూడా ఏర్పాటు చేస్తున్నాయి) వీటిని "బాక్-ఆఫీసెస్" అని అంటున్నారు.

కంప్యూటర్ల మీద చేసే ఈ పనులకు ప్రధానంగా మహిళలనే తీసుకొంటున్నారు. ఈ ఆఫీసుకు చెందిన మాతృసంస్థ మరొక దేశంలో ఉండటంవల్ల, ఆ సంస్థ నుండి పూర్తిగా వీరు వేరు పడుతున్నారు. ఇందువల్ల వారికి వృత్తి నైపుణ్యపు పెంపుకుగాని, పై ఉద్యోగాలకు వెళ్ళే అవకాశాలు గాని ఉండటం లేదు. ఎక్స్‌పోర్టు ప్రాసెసింగ్ జోన్స్‌లోని సంస్థలలో మహిళా నియామకాలు అధికంగా ఉంటున్నాయి. ఇప్పటి పరిశ్రమలలో పనిచేసే వారిలో సగటున నూరింట డెబ్భై మంది వరకూ మహిళలుంటున్నట్లు అంచనా వేస్తున్నారు. ఇంతకు పూర్వమే మేము సూచించినట్లు, వృత్తి నైపుణ్యపు అవసరం పెరిగిన కొలదీ, సిబ్బందిలో మహిళలు ఉద్యోగాలను కోల్పోతూ ఉంటారు. మెక్సికోలోని ఎక్స్‌పోర్టు ప్రమోషన్ జోన్సులోని సంస్థలలో పనిచేసే మహిళా కార్మికులు, మొత్తం సిబ్బందిలో 77 శాతం వరకూ ఉండేవారు. 1990వ సంవత్సరానికి వీరి సంఖ్య అరవై శాతానికి తరిగిపోయింది !

ఎక్స్‌పోర్టు ప్రమోషన్ జోన్స్ సంఖ్య పెరగటం, అందులో మహిళా నియమకాలు పెరుగుతూ ఉండటం చూపులకు ఆనందకరంగా కనుపిస్తుంది, ఉద్యోగభద్రత, ప్రమాదకరమైన పని పరిస్థితులు, వృత్తినైపుణ్యపు పెంపు విషయాలను పరిశీలిస్తే విచారమే మిగులుతుంది. దాదాపు అన్ని జోన్లలోనూ కార్మికులను తాత్కాలిక పనివారుగానే పరిగణిస్తున్నారు. యువతులకు - ముఖ్యంగా అవివాహితలకు, బిడ్డలు లేని వారికి నియామకంలో ప్రాధాన్యత లభిస్తున్నది. స్థానికులిస్తున్న పరిమాణంలో విదేశీ కంపెనీలు వేతనాల నిస్తున్నాయి, కాని వృత్తి నైపుణ్యపు పెంపుకు, పై పదవులకు చేరటానికి అవకాశాల నివ్వటం లేదు పారిశ్రామిక రంగంలోనూ, సర్వీసెస్ సెక్టారులోనూ ఇదే పరిస్థితి కొనసాగుతున్నది

ఎక్స్‌పోర్టు ప్రమోషన్ జోన్స్‌లో మహిళా ఉపాధి విషయాన్ని పరిశీలించేటపుడు మనం రెండు ముఖ్య విషయాలను గమనించటం అవసరం. (1) ఉత్పత్తయ్యే వస్తువు మారటాన్ని బట్టి, దాని ఉత్పత్తికి అవసరమైన సాంకేతిక స్థాయి పెరగటాన్ని బట్టి సిబ్బందిలో మహిళల పరిమాణం తగ్గుతూ ఉంటుంది. 2) ఈ జోన్సులో సాంకేతిక స్థాయి పెరుగుదల, కార్మిక వేతనాల పెరుగుదల, ఉత్పత్తిలో అధికపెట్టుబడుల అవసరపు పెరుగుదల, అధిక సంఖ్యాక సిబ్బంది అవసరపు తగ్గుదల వంటి కారణాలవల్ల విదేశీ పెట్టుబడి దారులు వెళ్ళిపోతున్నారు. ఇందువల్ల నష్టపడేది ఒక్క మహిళా కార్మికులే కాదు; ఇది జాతీయార్థిక వ్యవస్థకే ప్రమాదకరమైనది. ఇటువంటి సంఘటనలు ఇప్పటికే మారిషస్, ఫిలిఫీన్స్, తైయువాన్‌లలో జరిగాయి. దీనినొక జాతీయ సమస్యగా పరిగణించవలసి ఉంటుంది. ఈ జోన్స్‌ను రద్దు

చేయటమా లేక వీటిని ఆధునిక టెక్నాలజీతో, ఆధునిక పారిశ్రామిక వాడలుగా రూపొందించటమా అన్న విషయాన్ని ఆయా దేశాల ప్రభుత్వాలు ఆలోచించవలసి ఉంటుంది. ఈ విషయంలో ప్రభుత్వ నిర్ణయం ఎలా ఉన్నా, మహిళలకు మాత్రం ప్రయోజనం చేకూరదు.

ఏనాటికైనా పారిశ్రామిక రంగంలో ఆధునిక టెక్నాలజీల ప్రవేశం జరగక తప్పదు. నిరుద్యోగ ప్రమాదాన్ని తగ్గించటానికి, దేశంలో సాంకేతిక నైపుణ్యము, వృత్తి అనుభవంగల కార్మిక వర్గాన్ని తయారు చేయటానికి - ముఖ్యంగా మహిళలకు ఈ విషయంలో చేయూత నీయటానికి అభివృద్ధి చెందుతున్న దేశాలు అధిక ప్రాధాన్యత నీయవలసి ఉంటుంది.

ఎక్స్‌పోర్టు ప్రమోషన్ జోన్స్‌లో సబ్ కాంట్రాక్టర్లకు, ఏన్సిలరీ సంస్థలకూ, సర్వీసు సంస్థలకూ మంచి అవకాశాలుంటాయి. చొరవ, ఆర్థిక స్థోమత ఉన్న మహిళలు ఈ రంగంలో ప్రవేశించవచ్చు. చిన్న వ్యాపారానికి అనువైన అవకాశాలు ఈ జోన్స్‌లో ఉన్నాయి. ఈ అంశం ఇంకా గుర్తింపును పొందినట్లు కనుపించదు.

### అంతర్జాతీయ పెట్టుబడుల రీతిలో మార్పులు

గతకొన్ని దశాబ్దాల కాలంగా పెట్టుబడుల వినియోగం చాలా పెద్దయెత్తున జరుగుతున్నది; పెట్టుబడుల విషయంలో దేశాలు పరస్పరం ఆధారపడవలసి ఉంటుంది. పెట్టుబడుల మార్కెట్లో ఎపుడయినా సంక్షుభిత పరిస్థితి ఏర్పడే అవకాశాలుంటాయి. పెట్టుబడుల ప్రభావం ఇంత విస్తృతంగా ఉండటం వలననే, పెట్టుబడుల మార్కెట్, దేశాల జాతీయ, అంతర్జాతీయ విధానాలను కూడా ప్రభావితం చేయగలుగుతున్నది. దీని ప్రభావానికి ఉదాహరణగా అభివృద్ధి చెందుతున్న దేశాల "రుణ సంక్షోభాన్ని" చూపవచ్చు. 1974వ సంవత్సరంలో పెట్రోలియంను ఉత్పత్తి చేస్తున్న దేశాలు, పెట్రోలియం ధరలను పెంచటం, తదనంతర పరిణామాలవల్ల ఏర్పడిన సంక్షుభిత పరిస్థితిని ఇందుకు ఉదహరించవచ్చు. పెట్రోలు అమ్మకాల మీద వచ్చిన అపారధనాన్ని, బ్యాంకులు ఉదారంగా అభివృద్ధి చెందిన దేశాలకు అప్పుగా ఇచ్చాయి. ఇంతవరకూ అంతర్జాతీయ రుణాలను, సానుభూతితో తక్కువ వడ్డీరేట్లకు ఇస్తూండేవారు; ఇపుడు హెచ్చు వడ్డీలకు, వ్యాపార ప్రాతిపదికమీద ఇవ్వటం ఆరంభమైంది.

ఇరవయ్యవ శతాబ్దపు యనభయ్యవ దశాబ్దారంభంలో మరోసారి పెట్రోలు ధరలు పెరిగాయి. రుణాల వడ్డీరేట్లు పెరిగాయి; వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతి ధరలు దాదాపు ఇరవై శాతం పడిపోయాయి; అభివృద్ధి చెందిన దేశాలలో ఆర్థిక మాంద్యం తలయెత్తింది. డెబ్భయ్యవ దశాబ్దంలో చురుకుగా ఆర్థికాభివృద్ధిని సాధిస్తున్న అభివృద్ధి చెందుతున్న దేశాలు, అకస్మాత్తుగా విదేశీ మారకద్రవ్యపు కొరతను ఎదుర్కొన నారంభించాయి, ఎగుమతులు తగ్గి, దేశపు దిగుమతులు పెరిగాయి; విదేశీ రుణభారం తలకు మించినదైంది. "రుణ సంక్షోభం" తాండవించసాగింది. ఈ సమస్యలతో తలమునకలై అభివృద్ధి చెందుతున్న చాలా దేశాలు ఎనభయ్యవ దశాబ్దంలో ఆర్థిక పురోగతిని సాధించలేకపోయాయి. ప్రపంచ బ్యాంకు, ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ సంస్థల ఆదేశాల మేరకు అమలు పరచిన ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, సర్దుబాట్ల కార్యక్రమపు అమలువల్ల నిరుద్యోగం ప్రబలింది; ఆర్థికాభివృద్ధి దాదాపు స్థంభించింది; ప్రజల తలసరి ఆదాయం దిగజారింది. విదేశీ పెట్టుబడుల రాక తగ్గింది. 1983 నాటికి దేశాలలోనికి వచ్చే విదేశీ మారక ద్రవ్య పరిమాణం కంటే, బయటికి పోయే పరిమాణం అధికమైంది. 1987-1989 సంవత్సరాల మధ్యకాలంలో, సాలుకు సగటున 1800 కోట్ల డాలర్ల చొప్పున విదేశీ మారకద్రవ్యం దేశాల వెలుపలికి పోయింది. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కృషి వల్ల ఈ ప్రవాహం తిరుగుముఖం బట్టింది. ఇందువల్ల 1990-1992 సంవత్సరాల మధ్యకాలంలో సాలుకు సగటున 4,300 కోట్ల డాలర్ల చొప్పున విదేశీ మారకద్రవ్యం ఈ దేశాలకు వచ్చింది. ఆఫ్రికాలో మాత్రం ఆర్థిక పునర్వవస్థీకరణ ప్రయత్నాలు ఫలించలేదు. అందువల్ల నిధులు ఆ ప్రాంతానికి నామమాత్రంగానే వెళ్ళాయి. లాటిన్ అమెరికా దేశాలకు నిధులు వెళ్ళటం 1990వ సంవత్సరం నుండి పెరిగింది.

ఈ నిధుల మార్పిడివల్ల అభివృద్ధి చెందుతున్న దేశాల పరిస్థితి మెరుగు గాగలదని పరిశీలకులు భావించారు. పెట్టుబడుల రాకవల్ల, పరిశ్రమలలో అధిక పెట్టుబడులను పెట్టే అవకాశాలుంటాయి; దీనివల్ల దేశీ ఆర్థిక వ్యవస్థ బలపడుతుంది. ఈ శతాబ్దపు యనభయ్యవ దశాబ్దంలోనే ఆర్థిక పునర్వ్యవస్థీకరణను పూర్తి చేసిన దేశాలకు విదేశీ

పెట్టుబడులు అధికంగా వెళుతున్నాయి ఇందుకు చైనా, దక్షిణ కొరియాలను ఉదహరించవచ్చు ఈ దేశాలకు వస్తున్న నిధుల స్వభావంలో మార్పులొచ్చాయి. పరిశ్రమలలో పెట్టుబడులుగా వచ్చే నిధులు, పరిశ్రమలకు, వ్యాపారులకు ఋణాలుగా వస్తున్న నిధుల పరిమాణం పెరిగి, ప్రభుత్వాలకు ఋణాలుగా వచ్చే మొత్తాలు తగ్గాయి ఇందువల్ల ఆ దేశాలు ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొనే ప్రమాదం తగ్గుతుందని నిపుణులు భావించారు కాని 1997 లో దక్షిణ కొరియా, తాయలాండ్, మలేషియా, ఫిలిపీన్స్, ఇండోనేషియాలలో తలయెత్తిన ఆర్థిక సంక్షోభం వీరి అంచనాలను వమ్ము చేసింది.

ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కార్యక్రమంవల్ల, అందరికంటే అధికంగా నష్టపడినది మహిళలేనన్న విషయాన్ని ఇంతకు పూర్వమే చూచాం ఆర్థిక సంక్షోభం తలయెత్తినా, పురుషుల కంటే అధికంగా నష్టపడేది స్త్రీలే నన్న విషయం మరొకసారి ఋజువవుతున్నది కుటుంబాదాయం తగ్గినపుడు, ఇంతకు పూర్వమే వివక్షకు గురవుతున్న స్త్రీలు, ఆడపిల్లలే అధికంగా నష్టపడే వైనాన్ని కూడా ఇంతకు పూర్వమే వివరించాం. పెరూలో జరిగిన ఒక సర్వే కూడా ఈ అంశాన్ని ధృవపరుస్తున్నది. యనభయ్యవ దశాబ్దాంత కాలంలో విదేశీ పెట్టుబడులరాక తగ్గింది. అది చాలదన్నట్లు దేశం ఋణాల చెల్లింపు కూడా జరుపవలసి వచ్చింది. దీనికి తోడు ఆదేశం ఆర్థిక పునర్వ్యవస్థీకరణను పూర్తి చేయలేకపోయింది. ఇందువల్ల దేశంలో దారిద్ర్యం పెరిగింది. ప్రజల ఆదాయాల మధ్యనున్న వ్యత్యాసం అధికమైంది. ఈ పరిణామాల వల్ల అందరికంటే అధికంగా మహిళలే నష్టపడినట్లు సర్వే ఋజువు చేసింది.

ఆర్థిక సంక్షోభం వల్లగాని, ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కార్యక్రమపు అమలు వల్లగాని స్త్రీలు నష్టపడటం యొక్క ప్రభావం, ఆర్థిక వ్యవస్థ అంతటి మీదా ఉంటుందని ఐక్యరాజ్య సమితి నిపుణులు సూచిస్తున్నారు. కుటుంబ పోషకులుగా స్త్రీలున్న కుటుంబాల సంఖ్య ఎంత అధికంగా ఉంటే, బాధలకు లోనయ్యే కుటుంబాల సంఖ్య అంత అధికంగా ఉంటుందని వీరు నిరూపించారు. ప్రపంచంలోని మొత్తం కుటుంబాలలో మూడవ వంతుకు మించే (35 శాతం వరకూ) మహిళల సంరక్షణ కింద నున్న కుటుంబాలు ఉన్నట్లు ఐక్యరాజ్యసమితి అంచనాలు తెలియజేస్తున్నాయి.

సంక్షిప్తంగా విషయమిది ! గత రెండు దశాబ్దాలుగా పలుదేశాలలో ఆర్థిక పునర్వ్యవస్థీకరణ జరుగుతున్నది ఇందువల్ల దేశంలో జరిగే మార్పులనూ, అంతర్జాతీయ రంగంలో సంభవించే ఆర్థిక పరిణామ ఫలితాలను దేశాలు నిగ్రహించవలసి ఉంటుంది దేశ ఆర్థిక పటిష్టతను, సామర్థ్యాన్ని పెంచటం, ఎగుమతులను పెంచుకోవటం, తాను ఉత్పత్తి చేసిన సరుకులకు "సక్రమమైన" ధరలను రాబట్టటం, మార్కెట్ల పని సామర్థ్యాన్ని పెంచటం ఆర్థిక పునర్వ్యవస్థీకరణ ప్రధాన లక్ష్యాలు ఈ పరిణామాల వల్ల అంతర్జాతీయ మార్కెట్లో దేశాల ఉత్పత్తుల మధ్య పోటీ తీవ్రమవుతుంది. ఆర్థిక వ్యవస్థా వైవిధ్యం పెరుగుతుంది. దేశాల ఆర్థిక వ్యవస్థలు అనుసంధితమై, ఒక దాని పరిమాణాలు రెండవ దానిని ప్రభావితం చేస్తాయి. ఇందువల్ల, ప్రయోజనాలతో పాటు, అవి ప్రమాదంలో చిక్కుకొనే అవకాశాలు కూడా ఉంటాయి

ప్రపంచంలోని ఏ దేశంలో ఆర్థిక పునర్వ్యవస్థీకరణ జరిగినా, ఆ దేశంలోని పురుషుల కంటే స్త్రీలే అధికంగా ప్రభావితులు గావటం కనుపిస్తుంది. ఆర్థిక పునర్వ్యవస్థీకరణను జయప్రదంగా అమలు జరుపగలిగిన దేశాలలో మహిళా ఉపాధి అవకాశాలు విస్తరించాయి ఎగమతుల పెంపు, స్త్రీల ఉపాధి అవకాశాల విస్తరణ, అల్పవేతనానికి పనిచేసే కార్మికుల లభ్యతవల్ల సాధ్యమైనది అన్న విషయం గమనార్హమైనది. ఎగుమతికి సరుకులనుత్పత్తి చేసే పరిశ్రమలలో, పనిచేస్తున్న సిబ్బందికి అల్ప వేతనాలే లభించటాన్ని చూచాం. ఈ పరిశ్రమలలో పురుషులకంటే స్త్రీలకు అధిక ఉపాధి అవకాశాలు లభించటాన్ని కూడా చూచాం. మహిళలు, ఉపాధి విస్తరణావకాశాన్ని పొందగలిగారు గాని, పురుషులతోడి సమానవేతనాన్ని సాధించుకోలేక పోయారు; అల్పోద్యోగాలనే వీరు పొందగలిగారు. ఐక్యరాజ్యసమితి ప్రచురించిన 1994వ సంవత్సరపు "అభివృద్ధిలో మహిళల పాత్ర" అన్న సర్వే రిపోర్టు పేర్కొన్నట్లు "పురుషుల ఆర్థిక పరిస్థితి మెరుగుబడినంతగా, స్త్రీల ఆర్థిక పరిస్థితి పెంపొందలేదు; బహుశా అది నీరసించిందేమో" !

ఇదే రిపోర్టు వేరొకచోట ఇలా వివరించింది : "ఎగుమతుల పెంపు ప్రాతిపదిక మీద విజయవంతంగా అమలు జరిగే అభివృద్ధి విధానం, అధిక సంఖ్యాక స్త్రీలను

లేబర్ ఫోర్సులోనికి తెస్తున్నది; కాని ఇది పాలసీ నిర్ణేతలకు ఒక సమస్యను కూడా ప్రతిపాదిస్తున్నది. ఉద్యోగికి లభించే వేతన పరిమాణ నిర్ణయాన్ని లేబర్ మార్కెట్‌కు వదలివేయటం అనేది ఎగుమతుల పెంపు విధానంలోని ఒక సూత్రం ఇందువల్ల అవసరాన్ని బట్టి పరిశ్రమ, వేతన పరిమాణ నిర్ణయాలను స్వేచ్ఛగా మార్చుకొనే వీలుంటుంది. ఇవ్వదగిన వేతన పరిమాణ నిర్ణయాన్ని మార్కెట్‌కు వదలినపుడు, స్త్రీ పునరుత్పత్తి పాత్ర యొక్క సాంఘిక విలువలకు తగినంత ప్రాధాన్యత లభించదు. ఈ మార్కెట్ వైఫల్యపు సర్దుబాటుకు పాలసీ నిర్ణేతలు కలుగుజేసుకోవలసి ఉంటుంది. మహిళా సిబ్బంది సంక్షేమానుసారంగా, మార్కెట్ పనితీరును నియమిత పరచటంలో ప్రభుత్వం విఫలమైతే, లేబర్ మార్కెట్లోని పోటీకి స్త్రీలు తట్టుకోలేరు. వారి నియామకాలు లాభసాటివిగా కూడా కనుపించకపోవచ్చు.

"ఆర్థిక విధానాలు, అభివృద్ధి సాధన పేరిట అనుసరించే వ్యూహాలు లింగాతీతమైనవి గావన్న అంశం స్పష్టంగా రుజువైంది. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ అమలు భారాన్ని, అమలులో దాని వైఫల్య ఫలితాలను కూడా, అందరికంటే అధికంగా స్త్రీలే భరిస్తున్నారు."

యునైటెడ్ నేషన్స్ యూనివర్సిటీకి చెందిన వరల్డ్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ డెవలప్‌మెంట్ ఎకనామిక్ రిశర్చి సంస్థ రూపొందించిన "వరల్డ్ డెవలప్‌మెంట్ స్టడీస్-4" కూడా ఇటువంటి అభిప్రాయాన్నే ప్రకటించింది. ఈ రిపోర్టు సంకలనకర్తగా వ్యవహరించిన డాక్టర్ వెలైంటైన్ ఎం. మొఘడం ఈ విషయాన్నిలా వివరించారు. "అభివృద్ధి చెందుతున్న దేశాలల్లోనూ, ఆర్థిక పునర్వవస్థీకరణను అనుభవిస్తున్న మాజీ సోషలిస్టు దేశాలలోనూ అమలు జరుగుతున్న ఆర్థిక పునర్వ్యవస్థీకరణలోని ప్రధానాంశాలివి: ప్రభుత్వ రంగ పరిధి తగ్గింపు, విదేశీ పెట్టుబడుల రాకను ప్రోత్సహించటం, ప్రైవేట్ రంగపు విస్తరణ, ఎగుమతుల పెంపుకు కృషి, కార్మిక సంక్షేమ శాసనాల, సంక్షేమ కార్యక్రమాల పునఃపరిశీలన, కొన్ని దేశాలలో కుటుంబ వ్యవస్థకు సంబంధించిన చట్టాల పరిశీలన, వాటి సంస్కరణ. ఈ కార్యక్రమం వివిధ దేశాలలో అమలు జరిగే కాలంలోనూ, అమలు పటుత్వము, వేగములోనూ, వాటి పరిధిలోనూ తేడాలు ఉండవచ్చు. కాని దాని సాధనా లక్ష్యం మాత్రం ఒక్కటే. ఇటువంటి మార్పులు సాంఘిక, లింగపరమైన ప్రభావాన్ని తప్పకుండా చూపుతాయి. పైన పేర్కొన్న రెండు వర్గాలకు చెందిన దేశాలలోనూ, పురుషులతోపాటు, కొందరు స్త్రీలు కూడా ఆర్థిక పునర్వ్యవస్థీకరణవల్ల లాభించినప్పటికీ స్త్రీలలో అత్యధిక సంఖ్యాకులు నష్టపడినట్లు ఇపుడు జరుగుతున్న పరిశోధనల ఫలితాలు వెల్లడిస్తున్నాయి"

ఇలా ఎందుకు జరుగుతున్నది? ఆర్థిక సంస్కరణలు స్త్రీ-పురుషుల మీద ఎందుకు భిన్న ప్రభావాన్ని చూపుతున్నాయి? పురుషుల కంటే స్త్రీలు ఎందుకు అధికంగా నష్టపడుతున్నారు? ఇందుకు పలు కారణాలున్నాయంటూ, డాక్టర్ వెలైంటైన్ రెంటిని ప్రధాన కారణాలుగా పేర్కొన్నారు. మొదటిది లింగపరమైనది. కుటుంబంలోనూ, సమాజంలోనూ పురుషునితో సమానమైన స్థానం స్త్రీకి లభిస్తుండకపోవటం. పురుషుని కంటే స్త్రీ తక్కువదని, అల్పజీవి అన్న సంప్రదాయంగా వస్తున్న భావన. రెండవది అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణల ప్రభావం. ఈ అంశాలను వివరిస్తూ వీరిలా వ్రాశారు.

"పురుషునికంటే స్త్రీ తక్కువదన్న సంప్రదాయభావన, పిల్లలనుకంటూ, సాంఘికంగా పురుషునిమీద ఆధారపడవలసిన వ్యక్తిగా ఆవిడను మార్చేసింది; పురుషునకు ఉత్పత్తి రంగంలో ఉన్నత స్థానాన్నిచ్చి, మానవజాతి మనుగడకు అత్యంత కీలకమయిన స్త్రీ పునరుత్పత్తి శక్తికి అధమ స్థానాన్నిస్తున్నది. ఆవిడ పోషకునిగా పురుషునకు కీర్తి ప్రదమైన స్థానాన్నిచ్చింది. లింగపరమైన ఈ భావన, స్త్రీ-పురుష అసమానత్వము, అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందని అన్న భేదంలేకుండా, అన్ని సమాజాలలోనూ ఉన్నది. నిర్ణీత సమాజపు చరిత్ర, సంస్కృతి, ఉత్పత్తి విధానాల భేదాలవల్ల ఈ అసమానతా రూపము తీవ్రతలలో తేడాలుండవచ్చు. స్త్రీకి, పురుషుని కంటే తక్కువ వేతనం, దిగువ స్థాయి ఉద్యోగాలు మాత్రమే లభిస్తూండటం, సంస్థ సిబ్బంది తొలగింపు జరిగేటపుడు తొలుత స్త్రీయే దానికి గురవతూండటం, ఉద్యోగ నిర్వహణా విధానాన్ని గృహ నిర్వహణతో అనుసంధించే ప్రయత్నాన్ని యాజమాన్యం ప్రతిఘటిస్తూండటం – వంటి వాటికి, ఈ లింగపరమైన సంప్రదాయ భావనే కారణం. దేశంలో సంక్షుభిత పరిస్థితులేర్పడటం వల్ల, ప్రభుత్వం పొదుపు పాటింపు పేరిట సాంఘిక సంక్షేమ కార్యక్రమాల అమలును తగ్గించినా, నిత్య

వినిమయ సరుకుల మీద ఇస్తూండే సబ్సిడీలకు కోతపెట్టినా, లేక తగ్గించినా. ప్రజలలోని అత్యధిక సంఖ్యాకులకు ఇల్లు గడవదు. ఇటువంటి విపత్కర పరిస్థితులలో, "భూదేవి లాంటి ఓర్పును గలిగినది" గనుకా, "ప్రేమను వర్షింపజేయగల వాత్సల్యమూర్తి" గనుకా, జరిగిన నష్టాన్ని ఇల్లాలే పూరించవలసివస్తుంది ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వల్ల ఉద్యోగాల తొలగింపు అవసరమైతే, తొలివేటు పడేది స్త్రీ ఉద్యోగులమీదే. కొత్త సిబ్బంది నియామకాలను తగ్గించాలని గాని, జరుపగూడదని గాని యాజమాన్యం నిర్ణయిస్తే, అధికంగా నష్టపడేది వీరే. ఉత్పత్తి ఖర్చుల తగ్గింపు, లేక సామర్థ్యపు పెంపు పేరిట తీసుకొనే ఏ చర్య వల్లనైనా ముందు నష్టపడేది స్త్రీలే. "స్త్రీలు పనిచేయకపోయినా నష్టంలేదు, వారు అల్ప వేతనాలకు కూడా పనిచేస్తారు" అన్న చులకన భావనే ఇందుకు కారణం స్త్రీ, పురుషుని కంటే తక్కువదన్న సంప్రదాయ భావనే ఈ పరిణామాలకు చోదకశక్తిగా ఉపకరిస్తున్నది.

"ఆర్థిక పునర్వ్యవస్థీకరణ జరుగుతున్నపుడు స్త్రీలు పురుషుల కంటే అధిక నష్టాన్ని అనుభవించటానికి రెండవ కారణం ఆర్థికమని ఇంతకు ముందే చెప్పాం. అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణల స్వభావాన్ని బట్టి స్త్రీలు అనుభవించే నష్టరూపము, పరిమాణము ఆధారపడి ఉంటుంది స్త్రీ జనాభ్యుదయ దృష్టితో ఆర్థిక సంస్కరణల రూపకల్పన, అమలు విధానం ఉండకపోవటం చేతనే, స్త్రీలు నష్టపడుతున్నారని ఒక వర్గపు అర్థశాస్త్ర నిపుణులు భావిస్తున్నారు. కుటుంబంలో పోషణ, ఆరోగ్య రక్షణ, విద్య వంటి విషయాలలో ప్రదర్శితమవుతున్న స్త్రీ-పురుష అసమానత్వాన్ని, పరిగణనకు తీసుకోవటం లేదని వీరు చెబుతున్నారు లింగపరమైన అసమానత్వాన్ని విస్మరించటం వల్లనే, స్త్రీ జనాభ్యుదయాన్ని సాధించగల అభివృద్ధి కార్యక్రమాల రూపకల్పన జరగటం లేదని వివరిస్తున్నారు. ఇపుడు అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణలు స్త్రీ-పురుష అసమానత్వాన్ని గుర్తించటంలేదనీ, మహిళాభ్యుదయ సాధనా లక్ష్యాన్ని ప్రదర్శించటం లేదనీ వాదిస్తున్నారు. ఇందుకు రుజువుగా వారు చూపుతున్న పలు అంశాలలో కొన్ని ఇవి:

"(1) సామాజిక, సాంస్కృతిక, లీగల్ పరిస్థితులు, పునరుత్పత్తి బాధ్యతా నిర్వహణ, పురుషులతో సమంగా స్త్రీల పలురంగాల ప్రవేశాన్ని, పలురకాల ఉద్యోగ నిర్వహణనూ, పలుసంస్థల ప్రవేశాన్ని నిరోధిస్తున్నాయి లేబర్ మార్కెట్లో, పురుషులవలె స్త్రీలు కూడా పోటీపడి ఉద్యోగాలను సంపాదించాలనీ, వారికి ప్రత్యేక రక్షణలు, సడలింపులు అవసరం లేదనీ, నేడు ఆర్థిక సంస్కరణా విధానాలు రూపొందిస్తున్నవారు భావిస్తున్నారు

"(2) కుటుంబానికి, సమాజానికి స్త్రీల సేవల ద్వారా లభిస్తున్న ప్రయోజనాలను, వారి పునరుత్పత్తి విలువలను, జాతీయ సంపదోత్పత్తిని అంచనా వేయటంలో వదలి వేస్తున్నారు ఇందువల్ల జాతీయ ఉత్పత్తి అంచనాలలో స్త్రీల శ్రమశక్తి విలువలు ప్రదర్శితంగావటం లేదు. ఇందువల్ల పురుషుని పోషణలో నున్న పరాధీనలుగానే వారు పరిగణనకు వస్తున్నారు

"(3) స్త్రీల, కాలపు విలువను వీరు సక్రమంగా అంచనా వేయలేకపోతున్నారు రోజుకు ఉన్నది 24 గంటలే అయినా, ఆ సమయంలోనే ఆవిడ ఎంత పనినైనా చేయగలదన్నట్లు భావిస్తున్నారు ఆర్థిక పునర్వ్యవస్థీకరణ విధానాల రూపకల్పనలో, మానవ సృజనాత్మక శక్తుల అభివృద్ధి కుపకరించే స్త్రీ విద్య, ఆరోగ్య రక్షణ వంటి వాటికి పెట్టే ఖర్చుల తగ్గింపును వీరు సూచిస్తున్నారు. ప్రభుత్వం తగ్గించుకొనే ఈ భారాన్ని కుటుంబం మోయవలసి వస్తుందన్న విషయాన్ని వీరు విస్మరిస్తున్నారు.

"(4) లేబర్ మార్కెట్లో స్త్రీ శ్రమకు విలువ గట్టేటపుడు, ఆవిడ నిర్వర్తిస్తున్న పునరుత్పత్తి, గృహ నిర్వహణ, శిశుపోషణ, సంరక్షణ, కుటుంబీకులకు చేసే పలురకాల సేవలు పరిగణనను పొందటం లేదు. ఇందువల్ల ఆవిడ రెండు షిఫ్టులు (ఇంటి పని ఒకటి, ఉద్యోగం రెండవది) పనిచేస్తున్నా, ఒక్క షిఫ్టు పనికి వేతనం లభిస్తున్నది; పైగా అది పురుష వేతనం కంటే తక్కువగా కూడా ఉంటున్నది

"ప్రభుత్వాలు అనుసరించే ఆర్థిక సాంఘిక విధానాలు, స్త్రీ, పురుషుని కంటే తక్కువదన్న భావనను బలపర్చటానికిగాని, లేక బలహీన పరచటానికే గాక స్త్రీ పురుష అసమానత్వాల తగ్గింపుకు, లేదా పెంపకానికి కూడా తోడ్పడవచ్చు. మానవ సృజనాత్మక శక్తుల పెంపు లక్ష్యంతో ఆర్థిక, సాంఘిక కార్యక్రమాల రూపకల్పన జరిగినపుడు, స్త్రీ జనాభ్యుదయానికి

### కార్మికుల సంఘటిత శక్తిని నీరసింపజేస్తున్న గ్లోబలైజేషన్

గ్లోబలైజేషన్ వల్ల పెట్టుబడులకు కాళ్ళొచ్చాయి. ప్రపంచంలోని ఏ ప్రాంతంలోనయినా పారిశ్రామికోత్పత్తిని సాగించే అవకాశాలేర్పడ్డాయి. ఇందువల్ల, కార్మిక సంఘాలతో గట్టిగా వ్యవహరించగల శక్తి యాజమాన్యానికి వచ్చింది. తత్ఫలితంగా ట్రేడ్ యూనియన్లు ఖాయిలా పడనారంభించాయి. ఈ పరిణామం మూడు దశాబ్దాల క్రితం ప్రారంభమై, క్రమంగా బలాన్ని, వేగాన్ని కూడా పుంజుకొంటున్నది. ఈ రోగం ముదిరి ట్రేడ్ యూనియన్లు మరణశయ్యనెక్కుతున్న సూచనలు కూడా నేడు కనుపిస్తున్నాయి.

అధిక లాభార్జనకు వీలున్న ప్రాంతాలకు పెట్టుబడులు పోతుండటం, స్వయంచలిత యంత్ర శక్తిని అధికంగా వినియోగించుకోవటం, కాంట్రాక్టు లేబర్, పార్ట్‌టైము లేబరును అధికంగా వినియోగించుకొంటూ ఉండటం, ప్రపంచంలోని ఏ భాగంలోని కార్మిక శ్రమనైనా, చౌకగా వినియోగించుకొంటూండటంవల్ల పారిశ్రామిక దేశాలలోని అసంఖ్యాక కార్మికులు ఉపాధిని కోల్పోతున్నారు. ఇందువల్ల కార్మిక సంఘాల సభ్యత్వం తరిగిపోతున్నది.

ఈ పరిణామాలవల్ల యాజమాన్యంతో జరిగే సంప్రదింపులలో కార్మిక సంఘబలం నీరసించసాగింది. తమ హక్కుల సాధనకంటూ, కార్మికులు సమ్మెకు దిగితే, సంస్థ శాశ్వతంగా మూతబడి, తమ ఉపాధి పోవటానికయినా వారు సమాయత్తం గావాలి, లేదా ఉపాధిని రక్షించుకో దలచితే, యాజమాన్యపు షరతులకు తలఒగ్గి రాజీబడి పనిచేయాలి. ఇలాంటి పరిస్థితులు దాపురించాయి. ఇందువల్లనే కార్మిక సంఘాలు సమ్మెలకు తలపడటానికి జంకుతున్నాయి. అమెరికాలో ఇరవయ్యవ శతాబ్దపు అరవయ్యవ దశాబ్దంలో వెయ్యిమంది లేక అంతకు మించిన సంఖ్యలో కార్మికులు పాల్గొన్న సమ్మెలు, సాలుకు సగటున అరువందలు జరిగాయి. తొంభయ్యవ దశాబ్దం వచ్చేసరికి వీటిసంఖ్య నలభైకి తగ్గిపోయింది! తొంభయ్యవ దశాబ్దంలో అమెరికా కార్మికులలో, పదహారు శాతం మంది మాత్రమే కార్మిక సంఘాలలో సభ్యులుగా ఉన్నారు. ఇంతటి తక్కువ శాతపు సభ్యత్వం ఒక్క ఫ్రాన్సు, స్పెయిన్ దేశాలలో తప్ప, మరే పారిశ్రామిక దేశంలోనూ లేదు !

ద్వితీయ ప్రపంచ సంగ్రామం తర్వాత, దాదాపు ముప్పై సంవత్సరాల పాటు కార్మిక సంఘటిత శక్తి ప్రభంజనం పారిశ్రామిక దేశాలలో వీచింది కార్మికుల వేతనాల తగ్గింపుకు యాజమాన్యాలు భయపడుతూ ఉండేవి. డెబ్బయ్యవ దశాబ్ద ప్రారంభ కాలం నుండీ కార్మిక సంఘ వ్యతిరేక పరిస్థితులుకనుపించ నారంభించాయి. నెదర్లాండ్స్‌లోనూ, స్కాండినేవియా దేశాలలోనూ కార్మిక శ్రేయస్సును కోరేపార్టీలు అధికారాన్ని కోల్పోయాయి. బ్రిటన్‌లో లేబర్ ప్రభుత్వం పోయి కన్సర్వేటివు పార్టీ ప్రభుత్వం ఏర్పడింది. కార్మిక సంఘాలకు అండగా నిలిచిన ఇటలీ, ఫ్రాన్సు దేశాల కమ్యూనిస్టు పార్టీలు నీరసించాయి. దీనితో కార్మికవర్గపు వెన్ను విరిగిపోయింది. "కార్మిక సంఘాల బలాన్ని, వాటి సభ్యత్వ పరిమాణం దృష్ట్యా చూచినా, అవి నిర్వహించిన సమ్మెల సంఖ్య దృష్ట్యా చూచినా, వాటి శక్తి, రెండవ ప్రపంచయుద్ధపు పూర్వపు రోజుల స్థాయికి పడిపోయింది" అని 1985వ సంవత్సరంలోనే ఒ యి సి డి దేశాలకు సంబంధించిన ఒక రిపోర్టు పేర్కొనటాన్ని అతిశయోక్తి అని చెప్పలేము; రాబోతున్న కార్మిక సంఘ వ్యతిరేక పరిస్థితులకు సూచనగా ఇది నిలిచింది.

- రిచర్డ్ బెర్నెట్, జాన్ కవంగ్‌లు వ్రాసిన "గ్లోబల్ డ్రీమ్స్" అన్న రచన నుండి

పరిగణన లభిస్తుంది. స్త్రీల విద్యావ్యాప్తి, ట్రెయినింగ్, ఆరోగ్య రక్షణ వంటి వాటికి అధిక ప్రాధాన్యత లభిస్తుంది. శిశు, కుటుంబ సంక్షేమాలు కూడా పరిగణనకు వస్తాయి. ఇటువంటి కృషి జరగటానికి, మాజీ సోషలిస్టు దేశాల, నార్డిక్ దేశాల అనుభవాన్ని ఉదహరించవచ్చు. ఇటువంటి కార్యక్రమాల అమలువల్ల, ఈ దేశాలలో స్త్రీలు అసంఖ్యాకంగా లేబర్ మార్కెట్‌కు రాగలిగారు; వారి వివాహ వయః పరిమితి కూడా పెరిగింది. సంతానప్రాప్తి తగ్గి జనాభా పెరుగుదల వేగం బాగా మందగించింది. సమాజానికి, ఆర్థిక వ్యవస్థకూ స్త్రీలు తమ వంతు సేవను చేయగలిగారు. లింగపరమైన అసమానతలు

బాగా తగ్గాయి

"విద్య, ఆరోగ్యము, సాంఘిక సంక్షేమ ఖర్చుల తగ్గింపు ప్రాతిపదిక మీద అమలు జరిగే ఆర్థికాభివృద్ధి విధానాలవల్ల, లేబర్ మార్కెట్‌కు వచ్చే స్త్రీల సంఖ్య తగ్గిపోతుంది. వారి ఉత్పత్తి శక్తికి సంకెలలు పడతాయి, వారు పనిచేయవలసిన కాలపరిమాణం పెరుగుతుంది. ఈ విషయాలను రుజువు చేసే పరిశోధనా ఫలితాలు, సర్వే ఫలితాలు కొల్లలుగా ఇపుడు లభిస్తున్నాయి ఈ పరిణామాలవల్ల, సంప్రదాయంగా వస్తున్న లింగవివక్ష తీవ్రమవుతుంది స్త్రీ పురుష అసమానతలు అధికమవుతాయి. స్త్రీ-పురుష అసమానతలు అధికంగా ఉన్న దేశాలలో, స్త్రీల సృజనాత్మకశక్తుల అభివృద్ధికి, ప్రభుత్వం నడిపే పాఠశాలలు, ఆరోగ్య రక్షణా సేవలే ప్రధానాధారంగా ఉంటాయి. ఇటువంటి పరిస్థితులలో ప్రభుత్వం, విద్య, ఆరోగ్యరక్షణ వంటి వాటి మీద పెట్టే ఖర్చులను తగ్గిస్తే, పురుషులకంటే స్త్రీలే అధికంగా నష్టపడతారు. రుసుము చెల్లింపు ద్వారా విద్యా, ఆరోగ్యరక్షణా సేవలను పొందవలసి వచ్చినపుడు, పేద కుటుంబాలలో, పురుష సంతానానికే ప్రాధాన్యత లభిస్తుందని చైనా, వియత్నాం, ఈజిప్టుల అనుభవం నిరూపించింది

"పలుదేశాలలో స్త్రీ శ్రమ యొక్క ఆర్థిక విలువలకు తగినంత గుర్తింపు లభించటం లేదు. ఆ దేశాల సమాజాలలో స్త్రీ పురుషుల పాత్రానిర్వహణకు లభిస్తున్న అసమాన పరిగణనకు దీన్ని కొలమానంగా యెంచవచ్చు. దీనిని సవరించనపుడు, స్త్రీ పురుష అసమానతలు పెరగటానికి వీలుంటుంది. ఈ విషయ విస్మరణ అర్థ శాస్త్ర నిపుణులకు, దేశ నాయకులకు అలవాటుగా పరిణమిస్తున్నది. స్త్రీల అవసరాలను, వారి శ్రమశక్తి ప్రాధాన్యతను గుర్తించలేని ఆర్థిక విధానాలు లేబర్ మార్కెట్లో స్త్రీల స్థానాన్ని బలహీన పరుస్తున్నాయి. స్త్రీలు, పురుషులకు లొంగి ఉండాలన్న సంప్రదాయ భావాన్ని బలపరచటానికి వినియోగ పడతాయి. కుటుంబానికి, సమాజానికి, స్త్రీ సేవలవల్ల లభిస్తున్న సంపదా, సంక్షేమ పరిమాణాలను, సంప్రదాయంగా వస్తున్న స్త్రీ-పురుష అసమానతా భావనా, ఇపుడు అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణలూ విస్మరిస్తున్నాయి. ఇందువల్ల, జరుగుతున్న అభివృద్ధి వీరి నంటటం లేదు; అభివృద్ధి పథం నుండి వారిని తొలుగదోస్తున్నాయి ప్రియవచనాలలో చెప్పాలంటే లభిస్తున్న అభివృద్ధి అవకాశాలను వారు వినియోగించుకోలేకుండా చేస్తున్నాయి అని చెప్పవచ్చు

"ఆర్థిక పునర్వ్యవస్థీకరణ ప్రారంభమైన తర్వాత, యజమానులు - ఉద్యోగుల సంబంధాలలో మార్పులు రా నారంభించాయి ఈ మార్పును కొందరు, ఈ సంబంధాల పునర్వ్యవస్థీకరణగా నిర్వచిస్తే, మరికొందరు లేబర్ మార్కెట్ స్వేచ్ఛీకరణగా వర్ణించారు. లేబర్ లాను సరళీకృతం చేస్తున్నారు ప్రసూతి సెలవు నివ్వటం వంటి కార్మిక శ్రేయో కార్యక్రమాలను విధిగా అమలు జరపాలన్న నిర్దేశాలలోని ఉచితత్వాన్ని ప్రశ్నించసాగారు కార్మిక భద్రత, కార్మిక శ్రేయస్సు అనేవి ఇంతవరకూ ఒక్క సంఘటిత రంగంలోనే అమలు జరుగుతున్నాయి. కార్మికులు అతి తక్కువ మంది ఈ రంగంలో పనిచేస్తున్నారు కనుక, మొత్తం కార్మికులలో అతి తక్కువ మందికి వీటి ప్రయోజనం లభిస్తున్నది. దీనిని కార్మిక వర్గాని కంతటికీ విస్తరింప జేయటంలోని విజ్ఞత ఇపుడు వివాదానికి గురవుతున్నది. ఈ అంశం మీద ఇంతవరకూ ఏకాభిప్రాయం ప్రకటితం గావటం లేదు. పరిశ్రమల ప్రైవెటీకరణ, పునర్వ్యవస్థీకరణల వల్లా, ప్రభుత్వ పాత్ర ఈ విషయంలో సంకుచితం గావటం చేతా, చాలామంది పనివారికి ఉద్యోగాలూడటమో, లేక ఆదాయాలు తగ్గటమో జరుగుతున్నది. ఈ పరిణామం వల్ల పురుషుల కంటే స్త్రీలే అధికంగా నష్టపడ్డారు.

"ఈ పరిస్థితి అనివార్యంగాదు. దీని మార్చే వీలున్నది. ఇందుకు ఆర్థికాభివృద్ధి యొక్క నిర్వచనాన్ని మార్చవలసి ఉంటుంది. ఆర్థిక పునర్వ్యవస్థీకరణను అమలు జరిపే విధానాన్ని, ఆర్థికాభివృద్ధి యొక్క ప్రయోజన నిర్వచనాన్నే మార్చవలసి ఉంటుంది. అభివృద్ధి నిర్వచనం, దాని అమలుకు వినియోగించే వ్యూహం, దానివల్ల ప్రభావితం గావలసిన ప్రజల సంక్షేమం దృష్ట్యా జరగాలి. స్త్రీల ఆర్థిక, సాంఘిక సంక్షేమం, వారి సృజనాత్మక శక్తుల అభివృద్ధి దృష్ట్యా కూడా ఇది జరగాలి. ఈ విషయంలో ఉద్యోగినుల పని పరిస్థితులకు కూడా పరిగణన లభించాలి.

"ఆర్థిక-సాంఘిక పరిస్థితుల దృష్ట్యానూ, స్త్రీ-పురుష సమానత్వ దృష్ట్యానూ ఆర్థిక విధానాలు అమలు జరగాలి.

అవి మానవ సృజనాత్మక శక్తుల అభివృద్ధి మీదా, స్త్రీ - పురుష సమానత్వ సాధన మీద ఎలాంటి ప్రభావాన్ని చూపినది కూడా పరిశీలించాలి. పరిశ్రమల ప్రైవెటీకరణ, నర్సరీల, కిండర్ గార్టెన్ల మూసివేత యొక్క దీర్ఘకాలిక ప్రభావం పిల్లల ఆరోగ్యం, విద్యార్జనల మీద ఎలా ఉన్నది, స్త్రీలు లేబర్ ఫోర్సులో చేరటాన్ని, అందులోనే కొనసాగటాన్నీ, లేబర్ మార్కెట్లో సమఉజ్జీగా వారు పురుషులతో పోటీ పడటాన్నీ ఇవి ఎలా ప్రభావితం చేస్తున్నాయి? ఇవి సాకల్యంగా పరిశీలనకు రావలసిన అంశాలు.

"ఆర్థిక ఆలోచనా ధోరణులు మారటం అన్నిటికంటే ముఖ్యమైన విషయం. పిల్లలను కుటుంబం యొక్క సొత్తుగా గాక, సామాజిక సంపదగా, దాన్ని అభివృద్ధికి పెట్టుబడిగా పరిగణించటాన్ని మనం అలవరచుకోవాలి. అభివృద్ధి సాధనలో స్త్రీ సంక్షేమాన్ని, వారి అభివృద్ధిని మరువకూడదు. స్త్రీల మానవ హక్కులను రక్షించటానికి కంకణం కట్టుకోవాలి. దీర్ఘకాలిక ప్రయోజనాల దృష్టితో అభివృద్ధి సాధనకు కృషి చేయాలి.

"ఇటువంటి మార్పు స్వల్ప కాలంలో వస్తుందని ఆశించలేము. ఈ దృష్ట్యా స్వల్పకాలిక మార్పులను సాధించే మార్గాలు మనకున్నాయి. యునైటెడ్ నేషన్స్ కన్వెన్షన్ ఆన్ ఎలిమినేషన్ ఆఫ్ ఆల్ ఫార్మ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ ఎగైన్స్ట్ ఉమెన్ ప్రకటించిన పత్రంలోని పదకొండవ ఆర్టికల్‌లో సూచించిన ఉపాధి, కార్మిక హక్కుల విషయంలో సమానత్వం అన్న అంశాన్ని అమలు జరుపగలిగితే చాలు. ఆరోగ్య రక్షణను, భద్రతను కోరే హక్కు స్త్రీ కార్మికుల కున్నదని ఈ ఆర్టికల్ ప్రకటించింది. సంతానోత్పత్తిలోనూ రక్షణను కోరే హక్కు స్త్రీల కున్నట్లిది గుర్తించింది. ఇవి గాక, అది ప్రతిపాదించిన వాటిలో దిగువ పేర్కొన్న అంశాలు కూడా ఉన్నాయి. వీటి అమలుకు, దీనిని ఆమోదించిన దేశాల ప్రభుత్వాలు బాధ్యత వహించవలసి ఉంటుంది.

"(1) వివాహము, గర్భధారణ, ప్రసూతి సెలవును కోరటం కారణంగా ఉద్యోగినిని ఉద్యోగం నుండి తొలగించకూడదు. ఈ విషయాన్ని ఉల్లంఘించిన సంస్థమీద ఆంక్షలను అమలు జరిపే హక్కు ప్రభుత్వాని కుంటుంది.

"(2) వేతనంతో ప్రసూతి సెలవును ఇవ్వాలి, లేదా దీనికి సమానమైన ప్రతి ఫలాన్నిస్తూ ఉద్యోగిని యొక్క ఉద్యోగానికి గాని, సీనియారిటీకి గాని సోషల్ ఎలవెన్సులను పొందటానికి గాని భంగం వాటిల్ల కుండా చూడాలి.

"(3) సంతానవతులైన ఉద్యోగినుల ఉద్యోగ విధుల నిర్వహణను, కుటుంబ బాధ్యతల నిర్వహణను సమన్వయీకరించటానికి అవసరమైన సంక్షేమ వసతులను కల్పించాలి. ఇట్టి సమన్వయ సాధనకు ఉద్యోగినిని ప్రోత్సహించాలి. ఇందుకు అవసరమైన చైల్డ్‌కేర్ వసతులను ఏర్పాటు చేయాలి.

"ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ (ఐ.ఎల్.ఓ.) నిర్వహించిన పలు కన్వెన్షన్లు, ఉద్యోగినుల శ్రేయోరక్షణ, లేబర్ మార్కెట్లో లింగ వివక్షా పాటింపు నిరోధం, స్త్రీ-పురుష వేతన సమానత్వ సాధనవంటి పలు అంశాల మీద సూచనలను చేశాయి. 1995వ సంవత్సరం మార్చి మాసంలో ప్రకటితమైన డిక్లరేషన్ అండ్ ప్రోగ్రాం ఆఫ్ ఏక్షన్ ఆఫ్ ది వరల్డ్ సమ్మిట్ ఫర్ సోషల్ డెవలప్‌మెంట్ ప్రకటనాంశాలు కూడా సులభంగా ఆచరింపదగినవిగా ఉన్నాయి. "స్త్రీ-పురుష సంపూర్ణ సమానత్వాన్ని సాధించటానికీ, సామాజికాభివృద్ధి సాధనలో స్త్రీలు పాల్గొనటాన్ని ప్రోత్సహించటానికి మేము కంకణం కట్టుకొన్నాం" అని ఈ కన్వెన్షన్ ప్రకటించింది.

"అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణలు సమాజం మీద దుష్ఫలితాలనుగాక, సత్ఫలితాలను చూపటానికీ, ముఖ్యంగా స్త్రీల సాంఘిక ఆర్థిక స్థాయీ పెంపుకూ ఇటువంటి చర్యలను తీసుకోవాలి అని కూడా కన్వెన్షన్ సూచించింది."

ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాలు మహిళా జీవన విధానాన్ని ప్రభావితం చేసిన వైనాన్ని చూచాం. ఉపాధి రంగంలో వారి స్థితిగతులెలా ఉన్నాయో వివరంగా పరిశీలించుదాం.

# 10

## లేబర్ మార్కెట్లో మహిళలు

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ, ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలలో మహిళలు గణనీయమైన పాత్రను నిర్వహిస్తున్నారు ఏ దేశంలోనూ - అది ఎంత అభివృద్ధి చెందిన దయినా - మహిళల శ్రమకు దాని ఔన్నత్యానికి తగిన ఆర్థిక విలువ గాని, మానవతా విలువలు గాని లభించటం లేదు. గృహిణిగా, ఉద్యోగినిగా, పడకటింట్లో మగవాని సెక్సు కోర్కెను తీర్చే మగువగా త్రిపాత్రాభినయం చేసినా, ఆవిడను పరిచారిక గానే చూసే మగవారికి ఈ లోకంలో కొదువలేదు. ఇటీవలి కాలంలో మహిళల స్థితి కొంత బాగుపడినా, పురుషులతో సమానమైన హక్కులు ఇంకా లభించలేదనే చెప్పాలి. మహిళలను వంటింటి కుందేలుగా చూసే సంప్రదాయం ఇంకా చావలేదు. పోషణ, విద్య, వైద్య చికిత్సాంశాలలో ఆవిడ వివక్షతకు గురవుతున్నది. తన సృజనాత్మక శక్తులను పెంపొందించుకొని, జాతీయ ఉత్పత్తిలో పాల్గొనే అవకాశాలు తగినంతగా ఉండటంలేదు. చివరకు ఆవిడ శరీరం మీదనే కాదు, ఆవిడ శ్రమ మీద కూడా ఆవిడకు హక్కు లేని స్థితులున్నాయి. కుటుంబంలో ఇటువంటి తీవ్రమైన లింగ వివక్షతకు గురవుతూ, గృహ నిర్వహణా భారాన్ని మోస్తూ కూడా, స్త్రీ, లేబర్ మార్కెట్‌కు వచ్చి కుటుంబ పోషణకు శ్రమిస్తున్నది.

మహిళ లేబర్ మార్కెట్‌కు వచ్చి, జాతీయ సంపదోత్పత్తిలో భాగస్వామిని కావటాన్ని ప్రభావితం చేసే అంశాలు చాలా ఉన్నాయి. వీటిలో ఆవిడ వర్గ స్వభావము, సంస్కృతి, సంప్రదాయం, దేశ ఆర్థికాభివృద్ధి స్థాయి, దాని లక్షణము ముఖ్యమైన వని చెప్పవచ్చు. ఇటీవలి కాలంలో విద్యావంతులవుతున్న స్త్రీల సంఖ్య త్వరితగతిని పెరుగుతున్నది. అధిక సంఖ్యలో మహిళలు వృత్తి విద్యలను అభ్యసిస్తున్నారు. అన్నింటికీ మించి, కుటుంబ ఆదాయాలు తగినంతగా లేకపోవటం వల్ల భార్యా భర్త లిరువురూ సంపాదనా పరులు కావలసిన అవసరం కూడా కలుగుతున్నది. దారిద్ర్య దేవత కౌగిలిలో చిక్కిన వారి సంగతిని వేరుగా చెప్పనవసరం లేదు. ఇలాంటి పలు అంశాలు వివిధ వర్గాల మహిళలను లేబర్ మార్కెట్‌కు పంపు తున్నాయి. అందువల్ల సంపాదనా పరులుగా ఉన్న మహిళల సంఖ్య త్వరితగతిని పెరుగుతున్నది. 1990 వ సంవత్సరంలో వేతనార్జనలో నున్న మహిళలు ప్రపంచంలో యనభయ్యారు కోట్ల మంది ఉన్నట్లు ఇంటర్నేషనల్ లేబర్

ఆర్గనైజేషన్ అంచనా వేసింది. పదిహేను సంవత్సరాలు, అంతకు మించిన వయస్సు గలిగిన మహిళల జనాభాలో 34.3 శాతం మంది (దాదాపు మూడవ వంతు మంది) వేతనార్జనకు పనిచేస్తున్నట్లు అంచనా వేస్తున్నారు. అన్ని దేశాలలోనూ, మొత్తం స్త్రీ జనాభాలో వేతనార్జనకు పనిచేస్తున్న స్త్రీల సంఖ్యా పరిమాణం ఇంత మాత్రంగానే లేదు. కొన్ని దేశాలలో ఇంతకంటే అధికంగా ఉన్నది; మరికొన్ని దేశాలలో తక్కువగా కూడా ఉన్నది. ఈ తరతమ భేదాలు ఆయా ప్రాంతాల మహిళ సాంఘిక - ఆర్థిక స్థాయికి, వారు అనుభవిస్తున్న స్వేచ్ఛకూ కొలమానాలు. ఆఫ్రికా ఖండంలో మహిళలకు, అభివృద్ధి చెందిన దేశాలలో ఉన్నంత స్వేచ్ఛ లేకపోయినా, ఇచ్చట మహిళలలో అధిక సంఖ్యాకులు పనిచేయటం కనుపిస్తుంది. ఈ దేశాలలో కుటుంబ పోషణకు పంటలు పండించటం మహిళల బాధ్యత. అందువల్ల వెనుక బడిన దేశాలలో కంటేనూ, ఆఖరుకు అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళల కంటే కూడా అధిక పరిమాణంలో ఆఫ్రికా మహిళలు సంపదోత్పత్తిలో పాల్గొనటం కనుపిస్తుంది. దీన్ని వారు అనుభవిస్తున్న స్వేచ్ఛా పరిమాణానికి సూచికగా భావించ కూడదు. మధ్య ప్రాచ్యంలోని అరబ్బు దేశాలలో పని చేస్తున్న స్త్రీల సంఖ్యా పరిమాణం ఇతర దేశాలలో కంటే తక్కువగా ఉన్నది. (స్త్రీలు "పనిచేయటం" అనే ప్రస్తావన ఈ అధ్యాయంలో వచ్చిన చోట్ల, వారు వేతనార్జనకు పనిచేయటంగా పరిగణించాలి -ర॥)

అభివృద్ధి చెందుతున్న దేశాలలో పనిచేస్తున్న మహిళలలో సుమారుగా సగం మంది అసంఘటిత రంగంలో ఉన్నారు. దీనిని ఇంగ్లీషులో "ఇన్‌ఫార్మల్ సెక్టారు" గా వ్యవహరిస్తున్నారు. స్వయం ఉపాధి, షాపులలో, హోటళ్ళలో, ఇండ్లలో పని చేయటం, ఇంట్లో ఉండి కాంట్రాక్టు పద్ధతిన పనిచేయటం వంటి పనులు ఈ రంగంలో జరుగుతూ ఉంటాయి. ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలో స్వయం ఉపాధిలో ఉండే మహిళల సంఖ్య, మొత్తం పని చేస్తున్న మహిళలలో 25 నుండి 40 శాతం వరకూ ఉంటుందని అంచనా. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, ఆర్థిక సరళీకరణ విధానాల అమలు వల్ల, సంఘటిత రంగంలో (ఫార్మల్ సెక్టార్లో) ఉపాధి అవకాశాలు తగ్గుతూండటంచేత కుటుంబ పోషణకు స్త్రీలు అసంఘటిత రంగాన్ని ఆశ్రయించక తప్పటం లేదు. ఇందువల్ల ఈ రంగంలో పనిచేస్తున్న స్త్రీల సంఖ్య త్వరితగతిన పెరుగుతున్నది.

పనిచేస్తున్న మొత్తం స్త్రీ జనాభాలో నూరింట ఆరు మంది వరకూ వ్యవసాయేతర ఉత్పత్తి రంగంలో ఉన్నారు. ప్రపంచంలో వ్యవసాయేతర వృత్తులలో నున్న మొత్తం పని వారిలో (లేబర్ ఫోర్సులో) నూరింట 30 మంది వరకూ స్త్రీలు ఉంటారని అంచనా వేశారు. అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవసాయేతర వృత్తులలో నున్న స్త్రీల సంఖ్యా పరిమాణం ఇంకా అధికంగా ఉంటుంది. లేబర్ ఫోర్సులోని స్త్రీలలో 86 శాతం మంది, ఈ వర్గపు దేశాలలో, వ్యవసాయేతర వృత్తులలో ఉన్నారు. వీరిలో ఎనభై శాతం మంది వరకూ ఉద్యోగాలలో ఉన్నారు. జాతీయోత్పత్తిలో వ్యవసాయోత్పత్తి పరిమాణం తగ్గుతూ, పట్టణ జనాభా పెరుగుతూ ఉండటం వల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా ఆధునిక ఉత్పత్తి రంగంలో పనిచేసే మహిళల సంఖ్య పెరుగుతున్నది. పారిశ్రామికోత్పత్తి, సర్వీసెస్ రంగాలు విస్తరించుతూ ఉండటం వల్ల వ్యవసాయరంగంలో పనిచేసే మహిళల సంఖ్య తగ్గిపోతున్నది. ప్రపంచంలో పనిచేస్తున్న మహిళలలో నూరింట 37 మంది మాత్రమే ఇపుడు వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నట్లు అంచనా వేస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో కూడా సర్వీసెస్ రంగం విస్తరించుతూ ఉండటం వల్ల వ్యవసాయ రంగంలో కంటే కూడా అధికులు ఈ రంగంలో పనిచేస్తున్నారు: ఈ దేశాలలో మొత్తం పని చేస్తున్న మహిళలలో నూరింట 40.8 మంది వ్యవసాయ రంగంలో పనిచేస్తూంటే, 42.9 మంది సర్వీసెస్ రంగంలో పనిచేస్తున్నారు. లాటిన్ అమెరికాలో, మొత్తం పనిచేస్తున్న మహిళలలో 8.4 శాతం మంది మాత్రమే వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నారు. ఒక్క ఆఫ్రికా దేశాలలో మాత్రమే నేటికీ, అత్యధిక సంఖ్యాక మహిళలు వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నారు.

ఇటీవలి కాలంలో మహిళలకు సర్వీసెస్ సెక్టార్ అత్యంత ప్రధానమైన రంగంగా రూపొందింది. చిల్లర వ్యాపారం నుండి బ్యాంకింగ్ వరకూ ఈ రంగపు పరిధిలోనికి వస్తాయి. ఖాతాదారులకు అవసరమైన పలురకాల సర్వీసులను అందించటమే ఈ రంగపు లక్ష్యం. వేతనార్జనకు పనిచేస్తున్న

మొత్తం మహిళలలో దాదాపు సగం మంది వరకూ ఈ రంగంలోనే ఉన్నారు ప్రపంచంలో ఈ రంగంలోని మొత్తం పనివారిలో 36.8 శాతం మంది మహిళలున్నారు అభివృద్ధి చెందిన దేశాలలో ఈ రంగంలో పనిచేస్తున్న మహిళల శాతం ఇంతకంటే ఇంకా ఎక్కువగా ఉన్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ రంగంలో పనిచేస్తున్న వారిలో దాదాపు మూడవ వంతుకు మించే మహిళలున్నారు: వేతనార్జనకు పనిచేస్తున్న మొత్తం మహిళలలో 42.9 శాతం మంది ఈ రంగంలో ఉన్నారు. లాటిన్ అమెరికా దేశాలలో, అభివృద్ధి చెందిన దేశాలలో వలె అధిక సంఖ్యాక మహిళలు ఈ రంగపు వృత్తులలో ఉన్నారు.

"మహిళా" వృత్తులు గా ముద్రలు పడిన ఉద్యోగాలు, ప్రపంచ మంతటా ఒకటిగా లేవు. దేశాలను బట్టి, ప్రాంతాలను బట్టి వీటిలో భిన్నత్వం కనుపిస్తున్నది. కొన్ని దేశాలలో డాక్టర్లుగా, హోటళ్ళలో వెయిటర్లుగా మగవారుంటారు. మరికొన్ని దేశాలలో ఇవి "మహిళా" వృత్తులుగా చలామణీ అవుతున్నాయి. వృత్తి విద్యార్హతలు, నైపుణ్యమూ అవసరమైన టెక్నికల్ ఉద్యోగాలు తప్ప, మిగిలిన వన్నీ అల్పవేతనం, హోదా తక్కువగా ఉండే దిగువ స్థాయీ ఉద్యోగాలే. ప్రపంచంలో ఈ తరగతి 'మహిళా" ఉద్యోగాలలో ఉండే మొత్తం పనివారిలో మహిళలు 41.8 శాతం వరకూ ఉన్నట్లు అంచనా వేస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ శాతం 39.4 వరకూ, లాటిన్ అమెరికా దేశాలలో ఈ పరిమాణం 50కి మించి ఉంటుంది. మహిళలు ఉపాధ్యాయ, నర్సింగ్ వృత్తులలో పనిచేయటం సంప్రదాయంగా మారిపోయింది. అందుచేత ఇలాంటి "మహిళా" వృత్తులలో స్త్రీల స్థానం బలపడింది. లింగ వివక్ష తీవ్రంగా ఉన్న దేశాలలో ఉపాధ్యాయులు, నర్సులు, డాక్టర్లుగా మహిళలే ఉండటం అవసరమవుతున్నది. మహిళలు వీరి సర్వీసులనే కోరతారు.

కుటుంబావసరాల నిమిత్తం మహిళలు అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్ కు వస్తున్నట్లు, ఐక్యరాజ్యసమితి దాని అనుబంధ సంస్థ, అంతర్జాతీయ లేబర్ ఆర్గనైజేషన్ ప్రచురించిన వివరాలు తెలియజేస్తున్నాయి. ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ ప్రచురించిన వరల్డ్ లేబర్ రిపోర్టు 1994 అంచనాల ప్రకారం, పదిహేను సంవత్సరాలు, అంత వయస్సుకు మించిన మహిళలలో, పనిచేస్తున్న వారి శాతం పలుదేశాలలో, పలు ప్రాంతాలలో భిన్నంగా ఉన్నది. ప్రపంచం మొత్తంగా చూచినపుడు, మహిళలలో పదిహేను సంవత్సరాలు అంతకు మించిన వయస్సుగల వారిలో 41 శాతం మంది పనిచేస్తున్నారు అభివృద్ధి చెందిన దేశాలలో ఈ పరిమాణం 1980 లో 53 శాతం వరకూ ఉంది: 1990 వ సంవత్సరాని కది 60 శాతానికి పెరిగింది ఈ శతాబ్దాంతానికి, పలు అభివృద్ధి చెందిన దేశాలలో పనిచేస్తున్న మహిళల సంఖ్య, సుమారుగా పురుషులతో సమం కాగలదని భావిస్తున్నారు.

ఉపాధి స్వభావం

1 మహిళలకు లభిస్తున్న ఉపాధి స్వభావాన్ని పరిశీలిస్తే మనకు కొన్ని విచారకరమైన లక్షణాలు కనుపిస్తాయి. ఇందులో మొదటిది, అతి తక్కువ వృత్తులలో మాత్రమే వీరికి ఉద్యోగాలు లభిస్తూండటం ఈ అల్ప సంఖ్యాక వృత్తులలోనే వీరు అధికంగా కేంద్రీ కృతమవుతున్నారు. ఆ వృత్తులలో లభించే వేతనాలు తక్కువ; ప్రమోషన్ అవకాశాలు దాదాపు ఉండవు. పైగా అవి ప్రతిష్ఠాకరమైనవి కూడా కాదు

ఉపాధిలోనున్న మహిళలలో అత్యధిక సంఖ్యాకులు గుమాస్తాగిరి, సర్వీసు, సేల్స్ వంటి మధ్యస్థ స్థాయీ ఉద్యోగాల లోనే ఉన్నా, గత పదిహేను సంవత్సరాల కాలంలో మేనెజీరియల్, పరిపాలనా విభాగాలలోనూ, ప్రొఫెషనల్, టెక్నికల్ రంగాలలోనూ ఉన్నత స్థానాలను చేరగలుగుతున్న వారి సంఖ్య పెరుగుతున్నది. ఈ పరిమాణం ప్రధానంగా అభివృద్ధి చెందిన దేశాలలో కనుపిస్తున్నది. స్వయం ఉపాధిలో ప్రవేశించటమే గాకుండా, వ్యాపార సంస్థలను ప్రారంభిస్తున్న స్త్రీలు కూడా కనుపిస్తున్నారు. భారీ తరహా వ్యాపార పారిశ్రామిక సంస్థలలో పరిపాలనా, లేక మేనెజీరియల్ పోస్టులలో చేరుతున్నారు. భారీ కార్పొరేషన్లలో గాని, ప్రభుత్వం, యూనివర్సిటీలు, రిశర్చి సంస్థలు మొదలైన వాటిలో అత్యున్నత పదవుల నలంకరించ గలిగిన స్త్రీల సంఖ్య మాత్రం అతి తక్కువగానే ఉన్నది. ఈ పరిణామాన్ని, ఉపాధిరంగంలో స్త్రీ విజయ సాధనను నిరోధిస్తున్న"గ్లాస్ సీలింగ్"గా పేర్కొంటున్నారు.

2. ఇక రెండవ అంశం, నాణ్యమైన నూతన ఉద్యోగావకాశాల పెరుగుదల పరిమాణానికి తగినట్లుగా

మహిళలకు అవి లభించక పోవటం. రోజులో కొద్ది కాలం పనిచేసే అవకాశాలు పెరగటం వల్ల (పార్టు టైం జాబ్స్ పెరుగుదల వల్ల) అభివృద్ధి చెందిన దేశాలలో మహిళలకు అత్యధికంగా ఉద్యోగావకాశాలు లభించాయి. అమెరికా, ఇటలీ, గ్రీస్ దేశాలలో ఇలాంటి పార్ట్ టైమ్ ఉద్యోగాలలో ఉన్నవారిలో 65 శాతం మంది, బెల్జియం, జర్మనీలలో 90 శాతం మంది వరకూ మహిళలే ఉన్నారు. పార్ట్‌టైమ్ ఉద్యోగాలలో నున్న వారిలో అత్యధిక సంఖ్యాకులు మహిళలేనని ఈ అంచనాలు స్పష్టం చేస్తున్నాయి. ఇలాంటి మహిళలలో అధిక సంఖ్యాకులు పసిబిడ్డల తల్లులున్నారు. తాము పనిచేసే సంస్థలలో శిశు సంరక్షణా వసతులు లేకపోవటం చేతనే, అధిక సంఖ్యాక తల్లులు పార్ట్‌టైమ్ ఉద్యోగాలను ఎన్నుకొంటున్నట్లు "వరల్డ్ డెవలప్ మెంట్ రిపోర్టు - 1994" పేర్కొన్నది. ఇరవయ్యైదు నుండి నలభై తొమ్మిది సంవత్సరాల మధ్య వయస్సున్న స్త్రీలకు కుటుంబ నిర్వహణా బాధ్యతలు అధికంగా ఉంటాయి. పార్ట్ టైమ్ ఉద్యోగాలను చేస్తున్న మహిళలలో, ఈ వర్గపు వయస్కులు నూరింట 55 మంది వరకూ ఉన్నారని 1985 - 1991 సంవత్సరాల మధ్య కాలంలోని పరిస్థితుల పరిశీలనకు, కమిషన్ ఆఫ్ ది యూరోపియన్ కమ్యూనిటీస్ నిర్వహింప జేసిన సర్వే పేర్కొన్నట్లు వరల్డ్ లేబర్ రిపోర్టు - 1994 వెల్లడించింది. పూర్తికాలపు ఉద్యోగులకు లభించినంత వేతనము, ప్రమోషన్, ట్రెయినింగ్ వంటి అవకాశాలు పార్ట్‌టైమ్ ఉద్యోగులకు లభించవు. కుటుంబ నిర్వహణా భారాన్ని మోస్తూ కూడా పార్ట్‌టైమ్ ఉద్యోగాలను చేయవలసి వచ్చిన స్త్రీలు వెనుకబడ వలసి వస్తున్నది.

3. మూడవ అంశము ఉద్యోగ స్థిరత్వమూ, భద్రత లోపించటమూ; ఏ రకం ఉద్యోగం దొరికినా, దానిలో ప్రవేశించ వలసి రావటం. యజమానులు ఉద్యోగినులను అవసరమైనపుడు నియోగిస్తారు; అవసరంలేనపుడు నునాయాసంగా తొలగిస్తారు. రోజువారి పనివారిని పెట్టుకోవచ్చు; ఇంటి వద్ద పనిచేసే పద్ధతిపై కాంట్రాక్టు ఇవ్వవచ్చు. ఇలా లాభకరమైన విధానాలను యజమానులు అవలంబిస్తుంటారు. ఏ ఉద్యోగమూ లేనపుడు మహిళ స్వయం ఉపాధికి దిగుతుంది. ఇలా దొరికిన పని ఏదయినా చేస్తూ కుటుంబపోషణ కోసం తాపత్రయ పడుతుంది. తగిన విద్యార్హతలు లేనివారూ, వృత్తి నైపుణ్యం లోపించిన వారు ప్రధానంగా ఇలాంటి ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. వీరికి చట్టబద్ధమైన ఉద్యోగరక్షణ లభించదు. సాంఘిక భద్రత కార్మిక సంక్షేమ కార్యక్రమాలు వర్తించవు. అభివృద్ధి చెందుతున్న దేశాలలోనే కాదు; అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ఈ వర్గపు మహిళలున్నారు. ఇంటి వద్ద కాంట్రాక్టు పనులు చేసే మహిళలు ప్రధానంగా పసిబిడ్డలున్న తల్లులే. వీళ్ళను "హోమ్ వర్కర్సు" అని వ్యవహరిస్తున్నారు ఈవర్గపు కార్మికుల రక్షణకు ఏవయినా చట్టాలున్న చోట్ల వాటిని అమలు పరచటం కష్టం వీరిని ట్రేడ్ యూనియన్లకు తేవటం కూడా కష్టమే. ఇందువల్ల ఇతర వర్గాల కార్మికుల కంటే వీరు అధికంగా బాధపడవలసి వస్తున్నది.

4. పురుషులతో సమానమైన పనిచేసినా వీరికి వారితో సమానమైన వేతనం లభించటం లేదు. ఇది నాలుగవ అంశము. గత నలభై సంవత్సరాల కాలంలో స్త్రీ పురుష వేతన వ్యత్యాసపు సర్దుబాటుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. కాని అన్ని దేశాలలోనూ ఈ ప్రయత్న ఫలితాలు ఒకే రకంగా లేవు. నేటికీ, పురుషుని వేతనంలో నూరింట 50 నుండి 80 వంతుల వేతనమే స్త్రీకి లభిస్తున్నది మహిళ శ్రమకు తగిన విలువ లభించటం లేదు. వారికి లభిస్తున్న ప్రతిఫలం వారి సంపద సృష్టి పరిమాణానికీ, మాతృత్వ బాధ్యతా నిర్వహణకు తగినట్లుగా ఉండటం లేదు. తక్కువ నైపుణ్యం అవసరమైన తక్కువ స్థాయి ఉద్యోగాలలో వీరు అత్యధికులుగా ఉండటం, ఏ ఉద్యోగం దొరికితే దానిని చేయవలసి రావటం, రోజులో తక్కువ కాలమే పనిచేయగలిగి ఉండటం, చట్టపు నిషేధం వల్లగాని, ఇంటి బాధ్యతల మూలంగా గాని ఓవర్‌టైమ్ చేయలేక పోవటం, రాత్రి వేళలగాని, షిప్పులలోగాని పనిచేయలేక పోవటం వల్ల మహిళా కార్మికులు, కార్మిక వర్గంలో తక్కువ తరగతి వారుగా వేరయినారు. స్త్రీ-పురుష వేతన వ్యత్యాసానికి ఇవి కూడా కొంత వరకు తోడ్పడ్డాయి.

ఇవన్నీ పరోక్ష కారణాలు. ఒకే రకమైన పనిని చేసిన వారికి వారిలో స్త్రీ పురుష భేదం ఉన్నంత మాత్రాన చెల్లించే వేతనంలో వ్యత్యాసం ఎందుకుండాలి? ఇలాంటి భేదాన్ని చూపటాన్ని కావాలని చేస్తున్న దురాగతంగా భావించ వలసి ఉంటుంది. అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందుతున్న

వెనుకబడిన దేశాలన్న భేదం లేకుండా ఈ దురాగతం సర్వత్రా తాండవిస్తున్నది. ఐ.ఎల్.ఓ. ఏర్పాటు చేసిన ఈక్వల్ రెమ్యూనరేషన్ కన్వెన్షన్ ప్రకటనను ఆమోదించిన దేశాలలో కూడా ఇలాంటి వేతన వ్యత్యాసాలున్నాయి పీస్‌వర్క్ చేసేవారు, వ్యవసాయ కూలీలు ఈ దురాగతాన్ని అధికంగా అనుభవిస్తున్నారు వ్యక్తుల వృత్తి పరమైన నైపుణ్యం ఎంత తక్కువగా ఉంటే అంతధికంగా వేతన వ్యత్యాసం వీరిని వేధిస్తున్నది అసంఘటిత రంగంలో ఇలాంటి దురాగతాలు చాలా జరుగుతూ ఉంటాయి వృత్తి నైపుణ్యం లేని మహిళా కార్మికులు వేతన వ్యత్యాసానికి మారుపేరుగా రూపొందారు! ఇందువల్లే అందరి కంటే అధికంగా వీరు దారిద్ర్యం వల్ల బాధ పడవలసి వస్తున్నది; రెక్కాడినా డొక్కాడని స్థితిలో జీవిస్తున్నారు కుటుంబ పోషణా, సంరక్షణా భారాన్ని, మహిళే వహించ వలసి వస్తే, ఆవిడ స్థితి ఇంకెంత భయంకరంగా ఉంటుందో ఊహించటం కష్టంగాదు ప్రపంచంలోని ప్రతి మూడు కుటుంబాలలో ఒకటి మహిళా పోషణ, సంరక్షణల కింద ఉన్నట్లు (సింగిల్ పేరెంట్ ఫామిలీ) ఇంటర్నేషనల్ ఫండ్ ఫర్ అగ్రి కల్చరల్ డెవలప్ మెంట్ తయారు చేయించిన "ది రిపోర్టు ఆన్ రూరల్ ఉమెన్ లివింగ్ ఇన్ పావర్టీ" పేర్కొన్నది.

## మారుతున్న ప్రపంచ ఆర్థిక వాతావరణంలో మహిళోద్యోగులు

కుటుంబ పోషణ గడవక గృహిణులు, ఇంట్లో ఇబ్బందులున్నా, అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్‌కు వస్తున్నట్లు, ఇంతకు పూర్వమే చూచాం. ప్రపంచ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వీరికి ఉద్యోగావకాశాలను పెంచింది. లేబర్ మార్కెట్ కు వస్తున్న మహిళల సంఖ్య, వారి ఉద్యోగాల సంఖ్య పెరిగినా, వారి పని పరిస్థితులు మాత్రం మెరుగు కాలేదు. వాడకంలోని కొస్తున్న ఆధునిక టెక్నాలజీ వల్ల కూడా వారి పని పరిస్థితులు బాగుపడ గలవన్న ఆశాభావం కలగటం లేదు.

మహిళా ఉద్యోగిని జీవితం తిన్నగా సరళరేఖలా సాగదు. ఉద్యోగంలో చేరిన వనిత మాతృదేవత కాగానే పిల్లల సంరక్షణా భారం వల్ల ఉద్యోగం విరమించవలసి వస్తుంది. ఈ దశను దాటిన తర్వాత తిరిగి ఆవిడ ఉద్యోగంలో చేరి వేతనార్జనకు ఉపక్రమిస్తుంది. ఇదివరకటి వలె అధిక సంతానాన్నిప్పుడు కుటుంబాలు కోరటం లేదు. పరిమిత సంతానం కోసమే వారు తాపత్రయ పడుతున్నారు ఇందువల్ల పిల్లలను కనటానికి, వారి సంరక్షణకు వెనుకటంతటి కాలపరిమాణం పట్టదు మాతృత్వం వల్ల స్త్రీ ఉద్యోగాన్ని మానవలసి వచ్చినా, ఆ దశ గడచిన వెంటనే తిరిగి ఉద్యోగంలో త్వరగానే ప్రవేశించ గలుగుతున్నది ఇందువల్ల తన జీవిత కాలంలో ఎక్కువ కాలాన్ని వేతనార్జనకు వినియోగించ గలుగుతున్నది. (కొన్ని దేశాలలో భార్య కన్నప్పుడు, భర్తలు కూడా ప్రసూతి సెలవులు తీసుకొనే అవకాశాలున్నాయి ఈ సెలవును ఇద్దరిలో ఎవరయినా ఒక్కరు వాడుకోవచ్చు)

తూర్పు యూరపులోని మాజీ కమ్యూనిస్టు దేశాలలో మహిళా ఉద్యోగినుల మీద ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనేజేషన్ 1993 లో సర్వే జరిపించింది. ఆర్థిక స్వాతంత్ర్య సాధన ద్వారా వ్యక్తిత్వాన్ని నిలుపు కోవటానికి ఈ దేశాల స్త్రీలు తాపత్రయ పడతున్నారనీ, అందుచేతనే దేశంలో ప్రైవెటీకరణ అమలు జరుగుతున్న కాలంలోనూ, ఆర్థిక మాంద్యపు కాలంలోనూ కూడా ఉద్యోగాలను వదలకుండా ఉండటానికి వారు ఎంతగానో ప్రయత్నించారనీ ఆ సర్వే వెల్లడించింది. తోటి కార్మికులతో కలిసి పనిచేయటానికి వారు ఎంతో ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారనీ, అది వారి జీవన విధానంగా మారిందని కూడా సర్వే పేర్కొన్నది. మహిళ జీవితంలో మాతృత్వానికే (అంటే పిల్లలను కని పెంచటానికే) ప్రాధాన్యత నీయాలన్న సంప్రదాయానికీ, పనిచేసి వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలన్న ఆధునిక భావానికి పొత్తుకుదురుతున్నట్లు లేదని కూడా ఈ సర్వే గమనించింది.

ఈ సర్వే జెక్ రిపబ్లిక్, స్లవాక్ రిపబ్లిక్, బల్గేరియా దేశాలలో జరిగింది. కుటుంబ పోషణకు తగినంత వేతనాన్ని తమ భర్తలు సంపాదించగలిగినపుడు, "మేము ఉద్యోగాలను మాని ఇంట్లోనే ఉంటాము" అని 28 శాతం మంది వివాహిత మహిళలు మాత్రమే చెప్పారు. ఈ ప్రాంతాలలోని మాజీ కమ్యూనిస్టు దేశాలు మరి కొన్నింటిలో కూడా ఇలాంటి సర్వేలు జరిగాయి. ఆ దేశాలలోని మహిళలు కూడా ఇదే పరిమాణంలో ఇదే సమాధానాన్ని చెప్పారు.. 1991 వ సంవత్సరంలో బల్గేరియాలో జరిగిన సర్వేలో 20 శాతం మంది మహిళలు మాత్రమే గృహిణులుగా ఉండటానికి

ఉత్సాహాన్ని ప్రదర్శించారు. భర్త సంపాదన కుటుంబ అవసరాలకు సరిపోతే, తాము ఉద్యోగాలను మాని ఇంట్లోనే ఉంటామని పదిశాతం మంది మహిళలు మాత్రమే చెప్పినట్లు తూర్పు జర్మనీలో జరిగిన సర్వే (1991) పేర్కొన్నది. తమ భర్తల సంపాదన కుటుంబ అవసరాలకు సరిపోయినా, తాము పనిచేస్తామని డెబ్భై శాతం మంది మహిళలు చెప్పారు. ఇలా మాజీ కమ్యూనిస్టు దేశాల మహిళలు, నూరింట 70 మందికి మించే ఇంట్లో ఉండటం కంటే ఉద్యోగం చేయటానికి ప్రాధాన్యత నిస్తామని చెప్పారు; అంతేకాదు; పార్ట్ టైమ్ ఉద్యోగాలకు బదులు పూర్తికాలం పనిచేసే ఉద్యోగాలకే ప్రాధాన్యత నిస్తామని కూడా వారు చెప్పారు! మహిళా లోకంలో వస్తున్న విప్లవాత్మక పరిణామాల కిది ఒక్క సూచన మాత్రమే.

ఇటీవలి కాలంలో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఆర్థిక మాంద్యానికి లోనయినపుడు మహిళలు అధిక సంఖ్యలో ఉపాధిని కోల్పోయారు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థా ఏకీకరణ (దీనినే గ్లోబలైజేషన్ అని అంటున్నారు), పలు దేశాలు చేబట్టిన దేశీ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, సరళీకరణ వంటి విధానాల అవలంబన వల్ల, మహిళా కార్మికుల పని పరిస్థితులు చెడిపోయాయి. పెరిగిన నిరుద్యోగ పరిమాణం అన్ని రంగాలలోనూ ఒకేరకంగా లేదు. అభివృద్ధి చెందిన దేశాలలోనూ, మాజీ కమ్యూనిస్టు దేశాలలోనూ పారిశ్రామిక రంగంలో అధిక సంఖ్యలో ఉద్యోగాలు పోయాయి. ఇందువల్ల పురుషులు కూడా పెద్ద సంఖ్య లోనే నిరుద్యోగులయినారు. సర్వీసెస్ సెక్టారు లోనూ, ఆధునిక టెక్నాలజీని ఉపయోగించే తేలిక పరిశ్రమలలోనూ మహిళల ఉపాధి అవకాశాలు పెరిగాయి. కాని ఈ పెరుగుదల వారి నిరుద్యోగ సమస్యాతీవ్రతను పరిష్కరించేంతదిగా లేదు. అంతేకాదు; పురుషులకు దొరికినంత త్వరగా మహిళలకు ఉద్యోగాలు దొరకటం లేదు. ఆధునిక టెక్నాలజీ త్వరితగతిని వ్యాపిస్తున్న కాలంలో వృత్తి పరమైన సాంకేతిక నైపుణ్యం గలవారికి మాత్రమే ఉద్యోగావకాశాలుండటం సహజం. దీనిని బట్టి మహిళలు వృత్తి పరమైన సాంకేతిక నైపుణ్యాన్ని పెంచుకోవలసిన అవసరం స్పష్టమవుతున్నది. ఇందులో వెనుకబడితే నిరుద్యోగ సాగరాన్ని దాటటం కష్టం.

ప్రభుత్వ రంగం కుదించుకుపోతూ, ప్రైవేట్ రంగం విస్తరించుతూండటం ఉద్యోగాలు లభించటం కష్టం గావటానికి మరొక కారణం. దీని ప్రభావం అభివృద్ధి చెందుతున్న, మాజీ కమ్యూనిస్టు దేశాలలోనే అధికంగా కనుపిస్తున్నది. మాజీ కమ్యూనిస్టు దేశాలలో మగవారు కూడా అధిక సంఖ్యలో ఉపాధిని కోల్పోయారు. ఉపాధిని కోల్పోయిన వారిలో మగవారి కంటే మహిళలే అధికంగా ఉన్నారు. ఒక్క హంగరీలో మాత్రం ఇలాంటి అవాంఛనీయ పరిణామాలు సంభవించలేదు. పాలనా వ్యవస్థలోనూ, ప్రభుత్వ రంగంలోని కంపెనీలలో నిర్ణయాత్మక అధికారాలను చలాయించే అవకాశాలున్న ఉన్నత స్థానాలలోనూ మహిళలు అధికంగా ఉండటమే ఇందుకు సూచన.

మహిళలకు ఉపాధి దొరకటం కష్టం గావటానికి మరొక కారణం పాతుకుపోయిన లింగవివక్ష. ఉదాహరణకు జెక్, స్లావాక్ రిపబ్లిక్కుల అనుభవాన్ని చూడవచ్చు. మేనేజీరియల్ పోస్టులకూ, సాంకేతిక పరమైన వృత్తులకూ, వృత్తి నైపుణ్యం అవసరమైన పనులకూ మహిళల కంటే మగవారిని తీసుకోవటానికి కంపెనీల యజమానులు ఇష్టపడుతున్నట్లు వరల్డ్ బ్యాంకు నిపుణులొకరు వెల్లడించారు. మేనేజీరియల్ పోస్టులలోనూ, పాలనా సంబంధమైన పోస్టులలోనూ మహిళల కంటే మగవారే సమర్ధవంతంగా పనిచేయగలరన్న అభిప్రాయాన్ని వారు ప్రకటించారు. మహిళలకు ప్రసూతి సెలవు, వారి పిల్లలకు శిశు సంరక్షణా కేంద్రాల ఏర్పాటు వంటి వసతులను కల్పించాలి గనుక, మగవారిని వదలి మహిళలను నియమించటం వల్ల కంపెనీ ఖర్చులు పెరుగుతాయని యజమానులు అభిప్రాయ పడినట్లు కూడా వారు వెల్లడించారు.

ప్రపంచంలోని పనిచేస్తున్న మహిళలలో సగం మంది (54.2 శాతం మంది) ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలో ఉన్నారు. తూర్పు ఆసియా, ఆగ్నేయ ఆసియా ప్రాంతాలలో, ఎగుమతి కోసం ఉత్పత్తిచేస్తున్న పరిశ్రమలలో పనిచేస్తున్న వారిలో యువతులు అత్యధిక సంఖ్యాకులుగా ఉన్నారు. అందుకే ఈ ప్రాంతపు అభివృద్ధిని "మహిళా చోదిత" అభివృద్ధిగా వర్ణిస్తున్నారు. ఈ ప్రాంతాలలో కూడా నిరుద్యోగ సమస్య తీవ్రమవుతున్నది. చాల మందికి చేయటానికి తగినంత పని లభించటం లేదు. ఇందువల్ల పేదరికం పెరుగుతున్నది. లభిస్తున్న అంచనాలు, ఫిలిపీన్సు, పాకిస్తాన్, శ్రీలంకలలో

పురుషుల కంటే స్త్రీలు నిరుద్యోగాన్ని అధికంగా అనుభవిస్తున్నట్లు నిరూపిస్తున్నాయి. నిరుద్యోగ తీవ్రత వల్ల, ఇతర ప్రాంతాలకో, విదేశాలకో స్త్రీలు కూడా వలస పోతున్నారు. (ఈ వివరాలను మరొకచోట వివరించాం)

### వాస్తవాన్ని ప్రతిబింబించని "లేబర్ ఫోర్స్" అంచనాలు

ప్రస్తుతం ప్రకటితమవుతున్న ఉపాధికి సంబంధించిన అంచనాలు గాని, జనాభా లెక్కలు గాని యదార్థంగా పనిచేస్తున్న మహిళల సంఖ్యను, వారి శ్రమకు సంబంధించిన అంచనాలను ప్రతిబింబించటం లేదు. అభివృద్ధి చెందుతున్న దేశాలలోని ప్రజలలో అధికులు, కుటుంబ పోషణా వృత్తులలో ఉంటారు. వేతనార్జనా పరులు అధికంగా సర్వీసెస్ రంగపు ఉద్యోగులుగానో, దిన కూలీలుగానో పని చేస్తూంటారు. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ కూలీలుగా, పట్టణాలలో పలురకాల పార్ట్‌టైమ్ పనులు చేస్తూంటారు. సర్వేయర్లు, వీరి పనులను, వాటి స్వభావ నిర్ణయాలను అర్థం చేసుకోవటంలోనూ, వాటి స్వభావాన్ని బట్టి అంచనాలను సేకరించటంలోనూ విఫల మవుతున్నారు. ఇందువల్ల మహిళల శ్రమ పరిమాణంగాని, దాని విలువ గాని వెలుగు లోనికి రావటం లేదు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఎవరు "పని" చేస్తున్నారు, ఎవరు "పని" చేయటం లేదు అనే విషయాన్ని మహిళల నుండి రాబట్టటం అతి కష్టమైన పని. స్టాటిస్టికల్ నిర్వచనాలుగాని, సర్వేలో వాడే భాషగాని, ఎన్నుకొన్న ప్రశ్నలను అడిగే క్రమంగాని, సర్వేజరిగే కాలంగాని, వాస్తవమైన సమాచారాన్ని రాబట్టటానికి తగినట్లుగా ఉండటం లేదు "ఉద్యోగము" "పని" "ప్రధానమైన దినచర్య" వంటి వాటిని ప్రజలు ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా అర్థం చేసుకొంటారు సర్వేయర్లు మహిళలను ప్రశ్నించేటపుడు, "పని" అంటే అర్థమేమిటో, దాని నిర్వచనా పరిధి ఏమిటో వివరించాలి. పురుషులు ఏ పని చేస్తారో, మహిళలు ఏం పని చేస్తారో

ఒకటవ పట్టిక

పలుదేశాల ప్రభుత్వాలు, పలు సంస్థలూ రూపొందించిన మహిళా "లేబర్ ఫోర్స్" అంచనాలు

| దేశం పేరు | ప్రపంచ ఫెర్టిలిటీ సర్వే | ప్రభుత్వ అంచనాలు | ఐ ఎల్ ఓ అంచనాలు | |
|---|---|---|---|---|
| | | | 1980 | 1985 |
| కమరూన్ | 69 | 47 | 45 | 66 |
| ఘనా | 89 | 62 | 53 | 63 |
| కీన్యా | 13 | - | 64 | 47 |
| లసోటో | 22 | 35 | 68 | 82 |
| సెనెగల్ | 74 | 64 | 60 | 57 |
| సుడాన్ | 34 | 21 | 20 | 11 |

గమనిక : ఈ సంఖ్యలు, మొత్తం స్త్రీ జనాభాలో లేబర్ ఫోర్స్‌లో నున్న వారి శాతాలను తెలియ జేస్తాయి. "పని"కి సర్వేయర్లు ఎన్నుకొన్న నిర్వచనాన్ని బట్టి, సర్వే చేసిన వారి అవగాహనను బట్టి "పనిచేస్తున్న" స్త్రీల సంఖ్యా పరిమాణాలు ఎంత భిన్నంగా ఉంటున్నదీ ఈ వివరాలు సూచిస్తున్నాయి.

- వరల్డ్ సర్వే ఆన్ ది రోల్ ఆఫ్ ఉమెన్ ఇన్ డెవలప్‌మెంట్ నుండి

విచారించాలి. ప్రశ్న పరిధి తెలియకపోవటం వల్ల, వారు పనిచేస్తున్నా, దాని వల్ల కుటుంబానికి ఆదాయం వస్తున్నా, తన భర్త వ్యవసాయం చేస్తాడనో, లేదా ఉద్యోగమో, కూలీపని చేస్తాడనో చెప్పి, తాను మాత్రం ఇంటి వద్దనే ఉంటున్నట్లు ఇల్లాలు చెబుతుంది. తాను చేస్తున్న పని కుటుంబ ఆర్థిక పరిస్థితికి తోడవుతున్నా, దాన్ని వారు వ్యక్తం చేయలేక పోతున్నారు. ఇందుకు చిలీలో జరిగిన సర్వేను ఉదహరించవచ్చు. ఈ సర్వేలో, స్వంత పొలంలో నాట్లకు, పంటకోతలకు వెళుతున్నా, అవి కుటుంబపు పనులు గనుక ఇల్లాండ్రు ఇంటి పనులు చేసుకొంటూ ఉంటాం అని చెప్పిన సందర్భాన్నొక సర్వేయరు వెల్లడించారు. భర్త పోషణలో ఉన్నాను గనుక, తాను నిమిత్తమాతృరాలనన్న భావం ఆవిడలో ఉండటం వల్లనే, తాను చేస్తున్న శ్రమ విలువను ఆవిడ గ్రహించలేక పోతున్నది. ఫీల్డు సర్వేలకు వెళ్ళిన వారు ఈ సూక్ష్మాలను గ్రహించలేక, యాంత్రికంగా వ్యవహరిస్తూంటారు.

సర్వేయర్లు తమ భావాన్ని స్పష్టంగా, వాస్తవ పరిస్థితులకు అనుగుణంగా నిర్వచించలేక పోవటం కూడా ఇందుకు కారణమవుతున్నది. కుటుంబ పోషణకు చేసేపనికి, గృహ నిర్వహణకు చేసేపనికి తేడాను చూపటం మహిళకు చాలా కష్టం. కుటుంబ పోషణకు స్వంత కమతంలో పనిచేయటం, వడ్లను దంచి బియ్యం చేయటం వంటి ప్రొసెసింగ్ పనులు, అసంఘటిత రంగంలో చేసే పనులు కూడా ఇపుడు ఆర్థిక సంబంధమైన పనులుగా పరిగణనకు వస్తున్నాయి. ఇంటికి అవసరమైన నీరు తేవటం, వంట చెరుకును సేకరించటం, కంకులు కొట్టి గింజలు తీయటం, వడ్లు దంచి బియ్యం చేయటం వంటి ప్రొసెసింగ్ పనులు, ఇంటి పశువులను కాయటం, పెరటి తోటను పెంచటం, ఇంట్లో చిల్లర దుకాణాన్ని నిర్వహించటం వంటి పనులు చాలా దేశాలలో నేటికీ ఆర్థిక విలువలు గలిగిన పనులుగా పరిగణనను పొందటం లేదు.

"మీ ప్రధాన దిన చర్య ఏమిటి" అని సర్వేయరు గృహిణిని ప్రశ్నిస్తే, తాను గృహిణి నని వెంటనే సమాధానం చెబుతుంది. పలు సందర్భాలలో ఇది వాస్తవానికి దూరమైన సమాధాన మవుతుంది. తాను కుటుంబాదాయపు పెంపుకు పనిచేస్తున్నా, "పోషకుడు" భర్త గనుక ఆవిడకు తట్టే సమాధానం ఇదే. ఇంటి పనికి అధిక కాలం పడుతుంది, గనుక ఆవిడ ఇంటిపనినే తాను ప్రధానంగా చేస్తున్నట్లు భావిస్తుంది. "మీ ప్రధాన చర్య ఏమిటి?" అనే ఒక్క ప్రశ్న చాలదు; దానికి కొన్ని అనుబంధ ప్రశ్నలుండి తీరాలి.

వేతనార్జనకు పనిచేసే వారు వెంటనే స్పష్టమైన సమాధానాన్ని చెప్పగలరు. రొక్క రూపమైన ఆర్జన లేని మహిళతోనే సమస్య ఉత్పన్న మవుతుంది కుటుంబ కమతంలోగాని, వ్యాపారంలో గాని మహిళ చేసే శ్రమ మరుగున పడుతున్నది. సర్వే జరుపవలసిన విధానాలను పరిష్కరించే ప్రయత్నంలో భాగంగా భారత దేశంలోనూ, ఈజిప్టులోనూ ఒక ప్రయోగం జరిగింది. పనిచేస్తున్న వారి సంఖ్యా నిర్ణయానికి పలురకాల ప్రశ్నలను రూపొందించారు. ఈ సర్వేలో "మీరు చేస్తున్న ప్రధాన పని ఏమిటి" అని ప్రశ్నించినపుడు, ఆర్థిక ఆర్జనా పరమైన పనిచేస్తున్న వారు భారత దేశంలోనూ ఈజిప్టులోనూ పదహారు శాతంగా తేలారు "చేస్తున్న రెండవ పని ఏమిటి" అని ప్రశ్నించినపుడు ఈ పరిమాణం భారత దేశంలో 41 శాతానికి ఈజిప్టులో 27 శాతానికి పెరిగింది. "పని" అన్న పద ప్రయోగంతో ప్రశ్నించినపుడు ఈ శాతాలు భారతదేశంలో 48 కి, ఈజిప్టులో 29కి పెరిగాయి. పరిశీలకులెన్నుకొన్న పదమూడు రకాల పనులలోనూ, వ్యవసాయం, పశుపాలన, చిల్లర వ్యాపారం, కూలిపని వంటి వాటిని కొన్నిటిని కలిపి చూచినపుడు, 'పని' చేస్తున్న వారి శాతం భారతదేశంలో 88 కి, ఈజిప్టులో 54కు పెరిగింది! సర్వేయర్లు ప్రధాన ప్రశ్నలలో వాడే పదాలు సామాన్యులకు తెలిసేవిగా ఉండేట్లు చూడాలని, మహిళా సమస్యలను సాకల్యంగా సర్వేయర్లు తెలుసుకొన్న తర్వాతే సర్వేలో పాల్గొనాలని ప్రాయోజకులు అభిప్రాయ పడ్డారు. సర్వేల నిర్వహణలో ఇటువంటి సవరణలు జరిగినపుడే, స్త్రీల శ్రమ విలువకు సంబంధించిన సరియైన అంచనాలు లభిస్తాయి. అపుడే దేశ సంపదోత్పత్తిలో మహిళల శ్రమ శక్తి వల్ల లభిస్తున్నది ఎంత మేరకు ఉంటున్నదీ తెలుస్తుంది.

గత ఇరవై సంవత్సరాల కాలంలోనూ, ఇలాంటి సవరణా ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1993 వ సంవత్సరంలో జరిగిన ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ ఆఫ్ లేబర్ స్టాటిస్టీషియన్స్, అసంఘటిత రంగంలో పని చేస్తున్న మహిళల

సంఖ్యా వివరాలను కూడా సేకరించాలని నిర్ణయించింది. ప్రపంచ వ్యాప్తంగా చూచినపుడు, ఈ అసంఘటిత రంగంలోనే మహిళలు అత్యధిక సంఖ్యలో పని చేయటం కనుపిస్తుంది. ఇంత ముఖ్యమైన రంగాన్ని అంచనాల పరిగణనలోనికి తీసుకోక పోవటం చేతనే మహిళా శ్రమ పరిమాణం చాలా తక్కువగా కనుపిస్తున్నది. సర్వే నిర్వచనాలను అన్వయించటంలోనూ, సర్వే నిర్వహణ లోను భిన్న విధానాలను అవలంబిస్తూండటం వల్ల, ఒక్క దేశపు అంచనాలే ఎంత భిన్నంగా ఉంటున్నాయో ఈ అధ్యాయంలోని ఒకటవ పట్టిక చిత్రిస్తున్నది

**మహిళా ఉపాధిని కలచి వేస్తున్న టెక్నాలజీ తరంగాలు**

టెక్నాలజీ తరంగాలు ప్రపంచ ఉత్పత్తి రంగాన్ని, మార్కెట్లను ముంచెత్తుతున్నాయి. ఇందువల్ల వృత్తి నైపుణ్యానికి, ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకు ప్రాధాన్యత పెరిగింది ఈ పరిణామం మహిళల కంటే పురుషులకే ఇపుడు అధికంగా తోడ్పడుతున్నది తక్కువ వృత్తి నైపుణ్యము, అధిక మానవ శ్రమ అవసరమైన పరిశ్రమల లోను, సర్వీసెస్ సెక్టార్లోనూ మహిళలు అధిక సంఖ్యలో పనిచేస్తున్నారు. ఇది తాత్కాలిక స్థితి మాత్రమే. దీర్ఘకాలిక ప్రాతిపదిక మీద వీరే అధికంగా నిరుద్యోగులయ్యే ప్రమాదం పొంచి ఉన్నది. సహజవనరులు, తక్కువ వేతనానికి పనిచేసే కార్మిక వర్గం, పెట్టుబడుల కంటే సాంకేతిక విజ్ఞానానికి (టెక్నాలజీకి) ఇపుడు అధిక ప్రాధాన్యత లభిస్తున్నది. ఈపరిణామం అభివృద్ధినీ, మానవ శ్రేయస్సునూ ప్రభావితం చేస్తున్నది. సాంకేతిక విజ్ఞానం వల్ల టెక్నాలజీ పుడుతుంది. పుట్టిన టెక్నాలజీవల్ల సాంకేతిక ఉత్పత్తుల రాక పెరుగుతుంది. టెక్నాలజీ, దానివల్ల వచ్చిన ఉత్పత్తులు పరస్పర సృష్టి కర్తలుగా వ్యవహరిస్తాయని నిపుణులు చెబుతున్నారు. వినిమయం, టెక్నాలజీ పెంపును ప్రోత్సహిస్తుంది. టెక్నాలజీ అభివృద్ధి లోని రెండు అంశాలు మహిళల ఉపాధిని, అత్యధికంగా ప్రభావితం చేస్తున్నాయి. మొదటిది, కంప్యూటర్ల రాక, ఇవి సృష్టించిన ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ విప్లవం, రెండవది వ్యవసాయ రంగంలోనూ, బయో టెక్నాలజీ లోనూ సంభవించిన సాంకేతికాభివృద్ధి.

ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రాకవల్ల ఉత్పత్తి విధానము పునర్జన్మ నెత్తినట్లు చెప్పవచ్చు. అందుచేతనే దీనిని మూడవ పారిశ్రామిక విప్లవంగా వర్ణిస్తున్నారు. దీని రాకతో కంపెనీ లక్ష్యాలు, ఉత్పత్తి వ్యూహాలు మారాయి. ఒక సంస్థలోనే మార్పులు రాలేదు. సంస్థల మధ్య నుండే సంబంధాల లోనూ మార్పు లొచ్చాయి. ఉపాధి మీద ఈ పరిణామాల ప్రభావం ఏమిటి అన్నది ఇప్పుడు మనం పరిశీలించవలసిన అంశం. ఈ అంశం మీద ఏకాభిప్రాయం వ్యక్తం గావటం లేదు. టెక్నాలజీరాక, ప్రపంచ ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, ఆర్థిక సర్దుబాటు వంటి మార్పులు కూడా ఒకేసారి రావటం వల్ల, ఉపాధి మీద దేని ప్రభావం ఎంత అని నిర్ణయించటం కొంచెం కష్టమని కొందరు అభిప్రాయ పడుతున్నారు టెక్నాలజీ రాకవల్ల "ఉపాధి మీద ప్రస్తుతం కనుపిస్తున్న దుష్ఫలితాలను చూచి అంతగా నిరాశపడనవసరం లేదు" అని అంటూనే ఉపాధి మీద కనుపిస్తున్న కొన్ని రకాల దుష్ప్రభావాలను ఐ ఎల్ ఓ తాను ప్రచురించిన ఒక ప్రతంలో ఉదహరించింది. వృత్తి నైపుణ్యం అవసరం లేని ఉద్యోగాలు పోవటం వల్ల కూడా నిరుద్యోగం పెరుగుతున్న సందర్భాలను ఈ పత్రం పేర్కొన్నది. ముందు ముందు పరిస్థితి ఇంతకంటే ఎందుకు మెరుగవుతుందని తాను భావిస్తున్నదీ ఈ పత్రం వివరించలేదు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ పేదలను మరింత పేదలుగానూ, అనారోగ్యులు గాను మార్చవచ్చునని ప్రఖ్యాత కంప్యూటర్ శాస్త్ర నిపుణులు మైకేల్ టరోజోస్ సూచించారు.

మాన్యుఫాక్చరింగ్ పరిశ్రమలలో మహిళా ఉపాధికి సంబంధించినంత వరకూ మనం రెండు విషయాలను పరిశీలించాలి మొదటిది: ప్రవేశపెట్టిన నూతన టెక్నాలజీ స్థాయి ఏమిటి? ఉత్పత్తి క్రమం యొక్క ఏదశలో దానిని వాడుతున్నారు? మేనేజిమెంటు దానిని ఏ లక్ష్యంతో ప్రవేశ పెట్టింది? అధిక మానవశ్రమ వాడకాన్ని తగ్గించటం ద్వారా ఉత్పత్తి ఖర్చులను తగ్గించే లక్ష్యంతో టెక్నాలజీని ప్రవేశపెట్టినపుడు, కార్మికుల తొలగింపు అనివార్యమవుతుంది. ఇందువల్ల ఉత్పత్తి నైపుణ్యం లేని కార్మికుల తొలగింపు ముందు జరుగుతుంది. ఈ కారణంగా పురుషుల కంటే స్త్రీలు అధికంగా ఉపాధిని కోల్పోతారు. ఉత్పత్తి పెంపుకు నూతన టెక్నాలజీని ప్రవేశపెట్టినపడు స్త్రీలకు ఉపాధి అవకాశాలు పెరిగే వీలుంటుంది. ఇది నిర్ణీత సంస్థ యొక్క మాతృదేశంలో జరుగవచ్చు; తన ఉత్పత్తికి అవసరమైన విడిభాగాల ఉత్పత్తికి ఇతర దేశాలలో ఉత్పత్తి కేంద్రాలను

ఏర్పాటు చేస్తే, ఆదేశాలలోని స్త్రీల ఉపాధి అవకాశాలు పెరుగవచ్చు. తమ పారిశ్రామికోత్పత్తికి అవసరమైన పరికరాల ఉత్పత్తిని సబ్‌కాంట్రాక్టర్లకు అప్పగించినపుడు, స్త్రీల ఉపాధి పెరిగినా, అది సంఖ్యా పరంగానే ఉంటుంది. వారికి అల్ప వేతనాలు మాత్రమే లభిస్తాయి; పని పరిస్థితులు నాసిగా ఉంటాయి; సంక్షేమ వసతులు లభించవు. ఇవి అసంఘటిత రంగపు ఉపాధులు గనుక, దీనిలో ఉపాధిని పొందే వారికి శాసన బద్ధమైన రక్షణ లభించదు. కార్మిక శ్రేయస్సును కోరే ప్రభుత్వం లేక పోయినా బలమైన ట్రేడ్ యూనియన్లు లేకపోయినా, కార్మికులు నష్టపడతారు.

నూతన టెక్నాలజీని ప్రవేశపెట్టటం వల్ల, కార్మికుల వృత్తి నైపుణ్య స్థాయి ఎంత పెరగాలి అన్నది మనం పరిశీలించవలసిన రెండవ అంశము. ఎసెంబ్లీ లైన్లో నూతన టెక్నాలజీని ప్రవేశపెట్టారని అనుకొందాం. ఇంత వరకూ చేతితో చేస్తున్న ఎసెంబ్లింగ్‌కి బదులు, మెషిన్ ఎసెంబ్లింగ్‌కి వెళ్ళవలసి వస్తుంది. దీనితో మెషిన్ ఫీడింగ్, మెషిన్ మెయింటెనెన్స్, క్వాలిటీ కంట్రోలు ఇత్యాదులు వస్తాయి. ఇలాంటి పనులకు యాజమాన్యం స్త్రీలకు బదులు పురుషులకే ప్రాధాన్యత నిస్తుంది. ఇందువల్ల స్త్రీలు ఉపాధిని కోల్పోయే అవకాశాలుంటాయి. వృత్తి నైపుణ్యం ఉన్న మహిళలు ఈ ప్రమాదాన్ని తప్పుకోవచ్చు. ప్రింటింగ్‌లో కంపోజింగ్ కు బదులు టైపు సెట్టింగ్ యంత్రాలు ప్రవేశించినపుడు టైపు చేయనేర్చిన ఉద్యోగినికి నిరుద్యోగభయం ఉండదు.

సర్వీసెస్ సెక్టార్లో మహిళలు అధికంగా గుమాస్తాలుగా, బుక్-కీపింగ్, సెక్రెటేరియల్ పోస్టులలోను, కాషియర్స్, సేల్స్ గరల్స్ గానూ పని చేస్తుంటారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో స్త్రీలు డేటా ఎంట్రీ పనులలోనూ, క్లెరికల్ పోస్టులలోనూ నియమితు లవుతున్నారు. ఈ ఉపాధుల పెరుగుదల, అభివృద్ధి చెందుతున్న దేశాల మహిళలకు లాభదాయకంగా ఉన్నది. అభివృద్ధి చెందిన దేశాలలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నది. క్లెరికల్, సెక్రెటేరియల్ పోస్టులు తగ్గిపోతున్నాయి; కంప్యూటర్ ఎనలిస్టు, ప్రోగ్రామర్స్, సాఫ్ట్‌వేర్ డెవలపర్స్, సిస్టం ఎనలిస్టులు, మేనేజ్‌మెంట్ ఎనలిస్టులు, కన్సల్టెంట్స్ వంటి పోస్టులు వస్తున్నాయి. ఈ వృత్తి విద్యలలో మహిళలు వెనుకబడి ఉన్నారు. గనుక, వీటి లాభాలను పురుషులే అధికంగా అనుభవిస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో డేటా ఎంట్రీవర్క్, క్లెరికల్ వర్క్ పెరుగుతున్న రేటుకు అనుగుణంగా అభివృద్ధి చెందిన దేశాలలో ఈ పోస్టులు తగ్గుతున్నాయి. అభివృద్ధి చెందిన కార్పొరేట్ సంస్థలు ఈ పనులను, తక్కువ వేతనాల నిచ్చి అభివృద్ధి చెందుతున్న దేశాలలో చేయించుకొంటూ ఉండటం దీనికి కారణం(టెలివర్కింగ్ లేక రిమోట్ వర్కింగుకు అవకాశం ఉండటం వల్ల ఇది సంభవమైంది). అభివృద్ధి చెందుతున్న దేశాలను కూడా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, ముంచి వేసినపుడు, ఇపుడు లభిస్తున్న డేటా ఎంట్రీ, క్లెరికల్ వర్క్‌లో కూడా, మహిళలు తమ సాంకేతిక నైపుణ్య స్థాయిని పెంచుకోనపుడు వారి కవి దక్కవు

సర్వీసెస్ సెక్టార్లో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రవేశం వల్ల మహిళా ఉపాధికి సంబంధించినంత వరకూ సంక్షుభిత పరిస్థితులేర్పడ గలవని భావిస్తున్నారు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రవేశం వల్ల, సంస్థలో పనిచేసేవారు రెండు వర్గాలుగా విడిపోతున్నారు. ఒక వర్గంవారు వృత్తి నైపుణ్యం, వృత్తి విద్యా ప్రమాణాన్ని సాధించినవారు. వీరు కంపెనీలో పని చేయటం అవసరం. ఇక రెండవ వర్గం వారు, రిజర్వు సిబ్బంది. తన కవసరమైనపుడు, సంస్థ వారిని పనిలో పెట్టు కొంటుంది. కొందరకు కాంట్రాక్టు వర్కును ఇస్తుంది. వీరికి వచ్చే ఆదాయం తక్కువగా ఉంటుంది. పని ఎపుడు ఉంటుందో ఉండదో తెలియని అనిశ్చిత పరిస్థితిలో వీరుంటారు. సిబ్బందితో కలిసి పనిచేసే అవకాశం వీరి కుండదు. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, సిబ్బందిని విడదీసి, కార్మిక సంఘీభావాన్ని దెబ్బతీయటానికి కూడా ఉపకరిస్తున్నది. ఇందువల్ల ట్రేడ్ యూనియన్లు బలహీనపడతాయి. కాంట్రాక్టు వర్కర్సు పనిని వెదుక్కోవలసి రావటం చేత, దొరికిన ఉపాధికి రక్షణ లేక పోవటం చేత, ఏ పని దొరికితే దానిని చేయవలసి వస్తుంది. ఇందువల్ల కార్మికుడు వృత్తి నైపుణ్యాన్ని పొందటానికి తగిన ప్రోత్సాహం లభించదు.

సర్వీసెస్ సెక్టార్లో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రభావం మహిళా ఉపాధి మీద ఎలా ఉంటుంది అని ఆలోచించేటపుడు, మనం మహిళా విద్యాస్థాయిని, వృత్తి అనుభవాన్నీ పరిగణలోనికి తీసుకోవటం అవసరం. వారు కొత్తగా వస్తున్న, లేక నూతన రూపును దాల్చుతున్న ఉద్యోగాలకు అర్హులా కాదా అన్న అంశ నిర్ణయానికి వీటి

పరిశీలన అవసరం మార్కెట్లో పోటీ తీవ్రమవుతున్నది: సంస్థలు ఖాతాదారులను ఆకర్షించటానికి, వారికి అవసరమైన వ్యక్తిగత సేవలను కూడా అందించేదశకు వెళ్ళాయి. అందువల్ల ఉద్యోగులకు ఖాతాదారులను మెప్పించగల ఓర్పూ, నేర్పూ ఉండాలి. ఉత్పత్తి మార్కెటింగ్ నైపుణ్యం ఉండాలి, వ్యాపారాన్ని లాభదాయకంగానూ, సమర్ధవంతంగాను నడపగల సామర్ధ్యమూ, నైపుణ్యమూ ఉండాలి. ఇలాంటి శక్తులను సంపాదించిన మహిళలకు మాత్రమే మంచి ఉపాధి అవకాశాలుంటాయి. సబ్-కాంట్రాక్టర్లుగా వ్యవహరించటం లోనూ, తోటి వారితో వ్యవహరించటం లోనూ, విషయ వివరణలోనూ మహిళలు నేర్పరులని కొన్ని సర్వేలు వెల్లడించాయి ఇందువల్ల ఇలాంటి అర్హతలను సంపాదించ గలిగిన మహిళలకు మంచి అవకాశాలు లభిస్తాయి. ఈస్థాయికి ఎదగలేని మహిళలకు నిరుద్యోగ ప్రమాదం పొంచి ఉంటుంది.

ఇక గ్రామీణ ప్రాంతంలో టెక్నాలజీ ప్రభావం ఎలా ఉంటుందో చూద్దాం.

వెనుక బడిన దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ మహిళల శ్రమశక్తి వ్యవసాయానికి వెన్నెముక. వ్యవసాయ రంగంలో ఆధునికి టెక్నాలజీ అడుగిడటం వల్ల తొలుత నష్ట పడేది మహిళ. అసంఖ్యాక మహిళలు వ్యవసాయ కూలీలుగా పనిచేస్తున్న చోట జరిగేది ఇదే అధిక దిగుబడి నిచ్చే వంగడాల ప్రవేశం వల్ల, సాలుకు రెండు మూడు పంటలను పండించటానికి వీలైంది. ఇందువల్ల వ్యవసాయ కూలీలకు ఉపాధి అవకాశాలు బాగా పెరిగాయి. నాట్లు, కలుపుతీత, ఎరువుల వాడకం, పంట కోత, నూర్పిడి వంటి పనులలో మహిళా కార్మికులు పాల్గొంటూ ఉండటం లోకవిదితం.

వ్యవసాయ రంగంలో నాట్లు వేసే, కోతకోసే యంత్రాలు, కోసిన పంటను నూర్చే యంత్రాల రాక వల్ల వ్యవసాయ కార్మికుల ఉపాధి తగ్గనారంభించింది. దీనికి తోడు ఆధునిక నాగరికత గ్రామీణ ప్రాంతాలకు ప్రాకటం వల్ల సంప్రదాయ వృత్తులైన కుమ్మరం, కమ్మరం, చేనేత వంటి వృత్తులు అంతరించ నారంభించాయి. ఇందువల్ల గ్రామీణ నిరుద్యోగం పెరుగసాగింది. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ ప్రారంభం గావటంతో, వ్యాపార పంటలను పండించటం పెరిగింది. ఇది కూడా మహిళా ఉపాధిని దెబ్బ తీస్తున్నది. ఇండోనేషియాలో నూర్పిడి యంత్రాల రాక, రైస్ మిల్లుల ఏర్పాటు అధికంగావటం వల్ల, అచ్చటి మహిళలు అధిక సంఖ్యలో ఉపాధిని కోల్పోయినట్లు "రిపోర్టు ఆన్ రూరల్ ఉమెన్ లివింగ్ ఇన్ పావర్టీ" పేర్కొన్నది భారత దేశం లోనూ, బంగ్లాదేశ్ లోనూ ఇలాంటి పరిణామాలు సంభవించటాన్ని ఈ రిపోర్టు ఉదహరించింది. ఆఫ్రికా ఖండంలో ఆధునిక టెక్నాలజీ, వ్యవసాయంలో మహిళల ప్రాబల్యాన్ని తగ్గించి, పురుష ప్రధాన వ్యాసంగంగా దాన్ని మార్చివేస్తున్నది.

బయోటెక్నాలజీ ప్రవేశం కూడా మహిళా వైరిగా మారింది. ఈ టెక్నాలజీతో రూపొందిన విత్తనాలు, ఎరువులు, పురుగుల మందుల రాకవల్ల మహిళా కార్మికుల ఉపాధి కుదించుకుపోతున్నది. ఉదాహరణకు కలుపు మందుల శక్తిని తట్టుకొని మొలకెత్త గల విత్తనాలొస్తున్నాయి. కనుక ఈ విత్తనాలను వాడే వారు పైరులో కలుపుతీయ నవసరం లేదు. ఈ విధంగా వ్యవసాయ యంత్రీకరణ, ఆహారపంటలకు బదులు వ్యాపార పంటలకు ప్రాధాన్యత లభించటం, బయోటెక్నాలజీ ప్రవేశం, గ్రామీణ మహిళల ఉపాధి అవకాశాలను కుదించ నారంభించింది. వీటి వ్యాప్తి వేగాన్ని బట్టి ఉపాధి తరుగుదల రేటు నిర్ణయమవుతుంది.

వ్యవసాయ కుటుంబాల పెద్దలుగా, మహిళలే వ్యవహరించ వలసిన సందర్భాలలో వారు పలురకాల ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. వారి కమతాలు చిన్నవిగా ఉంటాయి; పంటలు పండించటానికి తగినంత పెట్టుబడి ఉండదు; బ్యాంకుల రుణ సదుపాయం వారి కందటం కష్టం; ఆధునిక టెక్నాలజీతో వారికి పరిచయం ఉండదు; వ్యవసాయ విస్తరణాధికారులకు వీరి క్షేమం పట్టదు. వ్యవసాయ మార్కెట్ ధరల విషయం మగవారికే అగమ్యగోచరంగా ఉంటున్న రోజులలో మహిళల స్థితి ఏమిటో ఊహించలేనంతటి గొప్ప విషయం కాదు.

మహిళలకు తగిన వ్యవసాయ టెక్నాలజీని రూపొందించటం అవసరమని ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ సూచిస్తున్నది. అదెలా ఉంటుందో, ఆచరణలో అది మహిళలకు ఎలా ఉపకరిస్తుందో చూసి తెలుసు కోవలసిన అంశమే గాని, ఇది ఊహకు అందే విషయం గాదు.

## పారిశ్రామికోత్పత్తి రంగంలో మహిళల పరిస్థితులు

ఇటీవలి కాలంలో పారిశ్రామికోత్పత్తి (మాన్యు ఫాక్చరింగ్) రంగంలో చేరుతున్న పురుషుల సంఖ్య కంటే స్త్రీల సంఖ్య అధికంగా ఉన్నది. ప్రపంచ పారిశ్రామికోత్పత్తి రంగంలో పని చేస్తున్న స్త్రీల సంఖ్య, దానిలో పనిచేస్తున్న మొత్తం సిబ్బందిలో మూడవ వంతు కంటె కొంచెం తక్కువ ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు. ప్రపంచ స్త్రీ జనాభాలో వేతనార్జనకు పనిచేస్తున్న స్త్రీల సంఖ్య కూడా దాదాపు ఇదే పరిమాణంలో ఉంటుందని అంచనా వేశారు.అభివృద్ధి చెందిన దేశాలలో ఈ రంగంలో పనిచేస్తున్న వారిలో స్త్రీలు 31 శాతం మేరకుండగా, అభివృద్ధి చెందుతున్న దేశాలలో 29.8 శాతం మేరకున్నారు. ఆసియాలో అధిక సంఖ్యాకయువతులు మాన్యు ఫాక్చరింగ్ రంగ పరిశ్రమలలో పనిచేస్తున్నారు.

మిగిలిన మహిళా కార్మికులంతా అసంఘటిత రంగపు ఉత్పత్తిలో ఉన్నారు. చిన్న తరహా పరిశ్రమలను నడుపు తూండటం ఇతర రకాల స్వయం ఉపాధిలో ఉండటం వేతనార్జన లేకుండా కుటుంబ ఉత్పత్తిలో పాల్గొనటం వంటి పనులతో అభివృద్ధి చెందిన దేశాలలో 41.2 శాతం మంది మహిళలున్నారు. ఆఫ్రికాలో పనిచేస్తున్న మహిళలలో మూడింట రెండువంతుల మంది స్వయం ఉపాధిలో ఉన్నారు. ఈ సంఖ్యా వివరాలు వాస్తవాన్ని చాలావరకూ దాచి వేస్తున్నాయి. ఆఫ్రికాలోని స్వయంఉపాధి పరిమాణాన్ని చూచి, అచ్చటి మహిళలు సుఖంగా ఉన్నారని అనుకోకూడదు. వారిలో చాలా మంది సంప్రదాయ సిద్ధమైన ఆహారోత్పత్తి, ఈ ఉత్పత్తుల ప్రొసెసింగ్‌లలో పనిచేస్తున్నారు. దాని మీద వచ్చే ఆదాయం కుటుంబ పోషణకు చాలితే అదే గొప్ప! లాటిన్ అమెరికా దేశాలలో ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాల వల్ల నిరుద్యోగం ప్రబలింది.; దారిద్ర్య పరిమాణం పెరిగింది. ఇందువల్ల పట్టణాలను చేరిన మహిళలు దొరికిన పనినల్లా చేస్తూ పొట్ట బోసుకొంటున్నారు. ఈ పనులలో స్వయంఉపాధి ప్రధాన భాగం. ఆసియాలో ఎగుమతి పెంపుకు ఉత్పత్తి జరుగుతున్న ప్రాంతాలలో, కొన్ని రకాల పరిశ్రమలలో (ముఖ్యంగా మానవ శ్రమ అత్యధికంగా అవసరమైన పరిశ్రమలలో) మహిళా నియామకాలు పెరిగాయి. మహిళలు, ఇంటికి తెచ్చి చేసే కాంట్రాక్టు పనులకు అంగీకరిస్తున్నారు. సంస్థలలో పనిచేసే కార్మికుల వేతనాలు స్వల్పంగా ఉంటున్నాయి; కంపెనీ నష్టపడితే, ఆ నష్టపు భారం కాంట్రాక్టు కూలీల మీద కూడా పడుతుంది. ఇలా హోమ్ వర్కర్స్ నష్టపడుతూంటారు.

మొత్తం మాన్యుఫాక్చరింగ్‌లో, మూడింట రెండు వంతుల వరకూ సంఘటిత రంగంలో జరుగుతున్నది. అభివృద్ధి చెందిన దేశాలలో పనిచేస్తున్న స్త్రీలంతా దాదాపు సంఘటిత రంగంలోనే ఉంటున్నారు. అరబ్బు దేశాలలో కూడా మొత్తం పనిచేస్తున్న స్త్రీలలో 74.1 శాతం మంది సంఘటిత రంగంలో ఉన్నారు. ప్రపంచంలోని సంఘటిత రంగంలో ఉన్న మాన్యుఫాక్చరింగ్ లోని మొత్తం కార్మికులలో 24.3 శాతం మంది మాత్రమే స్త్రీలున్నారు. సంఘటిత రంగంలో పని చేస్తున్న మొత్తం స్త్రీల సంఖ్యా పరిమాణం కంటే సంఘటిత రంగంలోని మాన్యు ఫాక్చరింగ్‌లో పనిచేస్తున్న మహిళా సంఖ్యా పరిమాణం చాలా తక్కువగా ఉన్నది. దీనిని బట్టి అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళలు అసంఘటితరంగ మాన్యుఫాక్చరింగ్ పరిశ్రమల మీదనే ఉపాధికి అధికంగా ఆధారపడవలసి ఉన్నట్లు స్పష్టమవు తున్నది. ఎగుమతుల పెంపు లక్ష్యంతో ప్రపంచ వ్యాప్తంగా మాన్యుఫాక్చరింగ్ పరిశ్రమలు ఏర్పాటవుతున్నాయి. ఇవి సంఘటిత రంగంలో ఉంటాయి. వీటి ఏర్పాటు వల్ల యువతులకు ఉపాధి అవకాశాలు పెరుగవచ్చునని కొందరు సూచిస్తున్నారు.

మాన్యుఫాక్చరింగ్‌కు సంబంధించిన అన్ని పరిశ్రమల లోనూ మహిళలకు అధిక ఉపాధి అవకాశాలు లభించటం లేదు. మానవ శ్రమ శక్తి అధికంగా అవసరమైన పరిశ్రమల లోనే వీరికి ఉద్యోగ వసతి లభిస్తున్నది. ఉదాహరణకు దుస్తుల తయారీ (రెడీమేడ్ దుస్తుల తయారీ)ని ఉదాహరణగా చూపవచ్చు. ఈ పరిశ్రమలో పనిచేస్తున్న వారిలో మహిళలే అత్యధిక సంఖ్యాకులుగా కనుపిస్తారు. ప్రపంచంలో ఈ పరిశ్రమలో పనిచేస్తున్న వారిలో దాదాపు మూడింట రెండు వంతుల మంది స్త్రీలే ఉన్నారు. ప్రపంచ మాన్యుఫాక్చరింగ్ రంగంలో పనిచేస్తున్న మొత్తం స్త్రీ సిబ్బందిలో, దుస్తుల పరిశ్రమలో పనిచేస్తున్న స్త్రీల సంఖ్యా పరిమాణం ఐదింట ఒక్క వంతుమేర కుండవచ్చునని అంచనా వేస్తున్నారు. స్త్రీల శ్రమనే అధికంగా వినియోగించుకొనే పరిశ్రమలలో ప్రాంతీయ భేదాలున్నాయి. ఆసియాలో తేలికపాటి పరిశ్రమలలో (లైట్

ఇండస్ట్రీస్ మహిళా నియామకాలు అధికంగా ఉన్నాయి. ఆఫ్రికాలో తక్కువగా ఉన్నాయి. ఆఫ్రికాలో సంఘటిత రంగంలో పనిచేస్తున్న స్త్రీల సంఖ్య చాలా తక్కువగా ఉన్నది. ఇటువంటి పరిస్థితులలో తేలికపాటి పరిశ్రమలలో పనిచేస్తున్న మహిళల సంఖ్యా పరిమాణం తక్కువగా ఉండటం ఆశ్చర్యకరం గాదు.

మాన్యుఫాక్చరింగ్ రంగంలో మహిళల ఉపాధి విషయంలో ఆలోచించవలసిన మరొక అంశము వారి ఉద్యోగపు హోదా లేక స్థాయి. అతి తక్కువ స్థాయి ఉద్యోగాలలోనే మహిళా నియామకం జరుగుతున్నది. ఈ రంగంలో పని చేస్తున్న వారిలో మూడింట రెండు వంతుల మందిని "కార్మికులు"గా వర్గీకరిస్తున్నారు. ఐదు శాతం మంది మాత్రమే వృత్తి నైపుణ్యం అవసరమైన టెక్నికల్ లేదా ప్రొఫెషనల్ పోస్టులలో కనుపిస్తారు. పరిపాలనా సంబంధమైన మేనేజీరియల్ పోస్టులలో మహిళలకు దక్కినది 1.9 శాతమే (ఇవన్నీ యునైటెడ్ నేషన్స్ ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్ ప్రకటించిన అంచనాలు). మహిళల కంటే ఐదురెట్ల మంది పురుషులు టెక్నికల్ లేదా ప్రొఫెషనల్ పోస్టులలోనూ, ఎనిమిది రెట్ల మంది మేనేజీరియల్ పోస్టులలోనూ ఉన్నారు. ఇతర ఏ రంగంలోనూ మహిళల ఉపాధిస్థితి ఇంత హీనంగా లేదు. పారిశ్రామిక రంగంలో వృత్తి నైపుణ్యపరమైన టెక్నికల్, ప్రొఫెషనల్, మేనేజీరియల్ పోస్టులు మహిళలకు అందని మావి పండ్లయినాయి. ఇందువల్ల మహిళలకు పారిశ్రామిక రంగంలో ఉపాధి అవకాశాలు పెరిగాయన్న నామమాత్రపు సంతృప్తి మాత్రమే మిగిలింది. వీరికి లభిస్తున్నవి నైపుణ్యం అవసరం లేని పోస్టులు మాత్రమే; వీరికున్న ప్రమోషన్ అవకాశాలు శూన్యం. కనుక చివరకు మిగిలేది అసంతృప్తే.

దీనిని బట్టి మూడు అంశాలు మనకు స్పష్టమవుతున్నాయి. 1. ఉద్యోగ భద్రత, అధిక వేతనాలు లభించే సంఘటిత రంగంలో మహిళలకు తక్కువగా ఉపాధి అవకాశాలు లభిస్తున్నాయి; ఇందువల్ల అధికులు అసంఘటిత రంగంలో పని చేయవలసి వస్తున్నది. 2. మానవ శ్రమ అత్యధికంగా అవసరమైన వస్త్ర పరిశ్రమ, దుస్తుల తయారీ పరిశ్రమ వంటి అతితక్కువ పరిశ్రమలకే వీరి ఉపాధి పరిమితమై యున్నది; 3. అతి తక్కువ స్థాయి ఉద్యోగాలు మాత్రమే మహిళలకు లభిస్తున్నాయి; ప్రమోషన్ పొంది పై పోస్టులకు వెళ్ళే అవకాశాలు వీరికి లేవు.

ప్రపంచ మాన్యుఫాక్చరింగ్ రంగంలో వస్తున్న మార్పులు, ఈ రంగంలో పనిచేస్తున్న మహిళలను ఎలా ప్రభావితం చేస్తున్నాయో చూద్దాం.

ఇటీవలి కాలంలో ప్రపంచ పారిశ్రామికోత్పత్తి విధానాలు నూతనరూపును దిద్దుకొంటున్నాయి. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, అధిక పెట్టుబడుల వినియోగం విస్తరిస్తున్నది. "ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకు అధిక స్థాయి ఉత్పత్తి" అనే లక్ష్యం స్థానే "అవకాశానికి తగిన ఉత్పత్తి" అనేది వచ్చింది. ఆధునిక టెక్నాలజీ అందుబాటువల్ల ఉత్పత్తి విధానాలను సులభంగా మార్చటానికి వీలుగలుగుతున్నది. అవసరమైతే తక్కువ స్థాయిలో ఉత్పత్తి చేయటం, ఉత్పత్తి సరుకుల స్వభావాన్ని త్వరితగతిని మార్చటం, ఖాతాదార్ల వ్యక్తిగత అభిరుచికి తగినట్లుగా ఉత్పత్తిని రూపొందించి ఇవ్వటం ఇంతకు పూర్వం కంటే ఇపుడు సులభంగా జరుగుతున్నది. ఈ స్థాయి ఉత్పత్తి ఎంతమేరకు వెళ్ళిందో ఒక్క ఉదాహరణ చూస్తే అర్థమవుతుంది. మీరు కారును కొనటానికి ఆర్డరిస్తే, దానికి మీరు కోరిన రంగును వేస్తారు; మీరు కోరిన పరికరాలను అందులో అమర్చుతారు! మీకు కావలసిన ఇతర వసతులను ఏర్పాటు చేసి కారును మీ కందిస్తారు! అదీ సకాలంలో!

ఉత్పత్తి విధానంలో మార్పులు రావటమే కాదు; ఆ ఉత్పత్తిని నిర్వహించే సంస్థల నిర్మాణము, పని తీరులలో కూడా మార్పు లొచ్చాయి. ఖాతాదారుల వ్యక్తిగత అభిరుచుల ప్రకారం ఉత్పత్తిని చేస్తూ వారిని ఆకట్టుకోవటం పరిశ్రమ లక్ష్యంగా పరిణమించిది. ఇందువల్ల మార్కెట్లో తమ సరకుల కున్న డిమాండును బట్టి ఉత్పత్తిని నియమిత పరచటం, ఎసెంబ్లీకి అవసరమైన విడి భాగాల సప్లయిని, ఉత్పత్తి పరిమాణానికి తగినంత మేరకు నియమిత పరచటం, ఖాతాదారు మనసున నాటేంతగా తమ ఉత్పత్తి ప్రయోజకత్వాన్ని వివరించగల మార్కెటింగు నేర్పు, వస్తువును అమ్మిన తర్వాత అవసరమైన నాణ్యమైన సర్వీసును చేయగల సదుపాయాల ఏర్పాటు అవసరమైనాయి. పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి ఎంత ప్రధానమైనదో, అంతకంటే ప్రధానమైనదిగా మార్కెటింగ్ రూపొందింది. డెలివరీ ఇస్తామన్న కాలానికి సరుకును ఖాతాదారునకు అందజేయటం, తయారయిన సరుకు

ఫ్యాక్టరీలో నిల్వచేరకుండా వీలయినంత త్వరగా మార్కెట్‌కు తరలించటం కూడా నైపుణ్యంతో కూడిన అంశాలుగా తయారయినాయి. ఇందువల్ల పారిశ్రామిక సంస్థలు, అవసరాలను బట్టి ఉత్పత్తిని సునాయాసంగా పెంచటం, లేక తగ్గించగలగటం, త్వరితగతిని మారుతున్న మార్కెట్ పరిస్థితులకు అనుగుణంగా ఉత్పత్తిలో అవసరమైన మార్పులను చేయగల సామర్థ్యాన్ని సంపాదించటం, ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకో గలగటం అవసరమైంది ఆధునిక టెక్నాలజీ వల్ల పరిశ్రమను మొత్తంగా గాని, దాని కొన్ని విభాగాలను గాని మరొక ప్రాంతానికి తరలించే వీలుగలిగింది. ఉత్పత్తి నాణ్యతకు అధిక ప్రాధాన్యత లభించటం గమనించదగిన మరొక అంశం. మార్కెట్లో ఎదురవుతున్న పోటీవల్ల దీనికి ప్రాధాన్యత పెరిగింది. ఇలాంటి ఉత్పత్తి రంగంలో పనిచేయటానికి అత్యున్నత వృతినైపుణ్యం గల పనివారు అవసరం. ఆయా విభాగాల ఉత్పత్తిలో క్వాలిటీని కంట్రోలు చేయగల నైపుణ్యం ఉన్న ఉద్యోగులు అవసరం.

మూడవ అంశం, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వాడుక లోనికి వచ్చిన తర్వాత మానవ శారీరక శ్రమ అవసరాలు తగ్గాయి. పలురకాల పరిశ్రమలలో నైపుణ్యం లేని కార్మికులు అవసరం లేదు. ఇందువల్ల అధిక సంఖ్యలో మహిళలు ఉపాధిని కోల్పోతున్నారు. సంస్థల ఉత్పత్తి, మేనేజ్‌మెంట్, మార్కెటింగ్ విధానాలలో విపరీతమైన మార్పులు రావటం వల్ల సాంకేతిక నైపుణ్యం గలిగిన సిబ్బంది అవసరమైంది; నైపుణ్యం లేనివారితో అవసరం తగ్గి పోయింది. అవసరమైన వృత్తినైపుణ్యం మహిళలకు లేదు గనుక తొలుతవారు నిరుద్యోగులవుతున్నారు. పారిశ్రామికోత్పత్తి రంగంలో పనిచేయటానికి కనీసం సెకండరీ విద్యనయినా వ్యక్తి అభ్యసించి ఉండవలసిన అవసరం వచ్చింది.

అత్యంత ఉన్నత స్థాయీ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వినియోగంలోనికి వచ్చిన తర్వాత, అధిక మానవశ్రమ వినియోగం అవసరమయ్యే పరిశ్రమలను, అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఏర్పాటు చేసే అవసరం లేకుండా పోతున్నది. అతి చౌకగా లభించే స్త్రీల శ్రమను ఉపయోగించే ఎగుమతి సరుకుల ఉత్పత్తి కొనసాగిస్తున్న అభివృద్ధి చెందుతున్న దేశాలకు, ఈ ఎగుమతి పరిశ్రమలకు విదేశీ పెట్టుబడుల మీద ఆధార పడవలసిన అవసరం క్రమంగా తగ్గుతున్నది. ఎగుమతి మార్కెట్లో ఎదురయ్యే పోటీని తట్టుకొని, తమ ఎగుమతులు తగ్గకుండా చూచుకోవటానికి, వాటిని కాలానుగతంగా పెంచుకోవటానికి ఈ దేశాలు కూడా ఆధునిక టెక్నాలజీని వినియోగించ వలసిన అవసరం గలుగుతున్నది. ఈ వ్యూహాన్ని అనుసరించే అభివృద్ధి చెందుతున్న దేశాల సంఖ్య క్రమంగా పెరుగుతున్నది. ఈ పరిణామ క్రమాన్నిపుడు సంక్షిప్తంగా వివరిస్తాం.

పారిశ్రామికోత్పత్తి రంగంలో పునర్వ్యవస్థీకరణ వల్ల వస్తున్న మార్పుల కారణంగా ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడి విధానాలు మారుతున్నాయి. శ్రమ శక్తి చౌకగా దొరికే చోట్లకు పోయే అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రయత్నాలు సడలు తున్నాయి. ఉత్పత్తి విధానాలలో అవసరమైనంత మేరకు స్వయంచలిత సాంకేతిక విధానాల అవలంబన ప్రారంభంగాని దేశాలలో చౌకగా దొరికే మానవ శ్రమకు డిమాండు పూర్తిగా పడిపోలేదు. ఇందుకు రెడీమేడ్ దుస్తుల తయారీని, అల్లికదుస్తుల తయారీని ఉదహరించవచ్చు. అధిక మానవ శ్రమను వినియోగించుకో గలిగిన మరోరంగం ఇటీవల అవతరించింది ఇది కంప్యూటర్ ప్రోగ్రామింగ్. దుస్తుల తయారీకి పెద్ద చదువులు అవసరం లేదు. కాని కంప్యూటర్ ప్రోగ్రామింగ్‌కు ఉన్నత విద్యార్హతలు గలిగిన సిబ్బంది అవసరమవుతుంది. ఈ సిబ్బందిని అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలనుండి సమకూర్చు కొంటున్నాయి. ఈ తరగతికి చెందిన విదేశీ సిబ్బంది, స్వదేశీ సిబ్బంది కంటే తక్కువ వేతనాలకు లభిస్తుండటమే ఇందుకు కారణం.

కొత్తగా పారిశ్రామికవంతమవుతున్న అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఇంతవరకూ కూలీరేట్లుతక్కువగా ఉన్నా, జరుగుతున్న అభివృద్ధిక్రమాన్నిబట్టి ఇవి పెరుగుతున్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలవారు, ఇందువల్ల, ఈ దేశాలలో పరిశ్రమల ఏర్పాటుకు సుముఖంగా లేరు. అంతేకాదు; వేతనాలు పెరుగుతున్న కారణంగా, అభివృద్ధి చెందుతున్న దేశాల వారు కూడా, వేతనాలు తక్కువగా ఉండే అభివృద్ధి చెందుతున్న దేశాలలో అనుకూలమైన వాటికి తమ పెట్టుబడులను ఎగుమతి చేస్తున్నారు. ఉత్పత్తిని ఆ దేశాలలో నిర్వహిస్తున్నారు. హాంకాంగ్‌లోని ఎగుమతి సరుకుల పరిశ్రమల

యజమానులు చైనాలో పరిశ్రమలను ఏర్పాటు చేస్తున్నారు; సింగపూర్ వారు మలేషియా లోనూ, ఇండోనేషియా లోనూ ఎగుమతి సరుకుల పరిశ్రమలను ఏర్పాటు చేస్తున్నారు. "పారిశ్రామిక దేశం" అన్న హోదాను పొందగల స్థితికి ఎదగని థాయ్‌లాండ్ కూడా తమ దేశంలో కూలిరేట్లు పెరగటం వల్ల పొరుగున ఉన్న వియత్నాం వంటి దేశాలకు తమ పెట్టుబడులను తరలిస్తున్నది సింగపూర్‌లో కూలీరేట్లు ఇంకా తక్కువగానే ఉండటం వల్ల జపాన్, అమెరికా దేశాల పెట్టుబడులు అచటికి వస్తూనే ఉన్నాయి ముఖ్యంగా కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ రంగం విదేశీ పెట్టుబడులను ఆకర్షిస్తున్నది భారత దేశంలో కూడా కంప్యూటర్ సాఫ్ట్‌వేర్‌లో వృత్తి విజ్ఞానైపుణ్యాన్ని సంపాదించిన వారు అధిక సంఖ్యలో ఉన్నందువల్ల సాఫ్ట్‌వేర్ రంగం విదేశీ పెట్టుబడులకు ఆకర్షణీయంగా కనుపిస్తున్నది.

విదేశీపెట్టుబడులు మరొక దేశానికి తరలటానికి మరొక కారణం, ఆ దేశం నుండి ఎగుమతయ్యే సరుకులకు, విదేశీ మార్కెట్లో కోటా పరిమితులు లేకపోవటం. వెనుకబడిన దేశాలుగా వర్గీకరణను పొందిన బంగ్లాదేశ్ నుండి పోయే ఎగుమతులకు పరిమితులంటూ లేవు. ఉదాహరణకు దుస్తుల పరిశ్రమను తీసుకోవచ్చు ఆశియా దేశాల నుండి అమెరికాకు, యూరోపియన్ యూనియన్‌కు వెళ్ళే ఎగుమతులకు కోటా పరిమితులున్నాయి. ఇలాంటి నియమం బంగ్లాదేశ్‌కు లేదు. కనుక ఈ దేశానికి విదేశీ పెట్టుబడులు అధికంగా పోతున్నాయి.

ప్రధానంగా ఎగుమతి కొరకే సరుకును ఉత్పత్తి చేస్తున్న పరిశ్రమలు, ఇంటి వద్ద పనిచేసే పద్ధతిని వ్యక్తులకు కాంట్రాక్టు పనులను ఇస్తున్నాయి. ఇందువల్ల ఈ ఎగుమతి పరిశ్రమలలో మహిళల శ్రమ ఎంత ఉన్నదీ అంచనా వేయటానికి వీలు గావటం లేదు. ఇంటి పట్టున ఉండి పిల్లలను, ఇంటి పనులనూ చూచుకొంటూ తీరిక సమయాన్ని వేతనార్జనకు ఉపయోగించే వీలుంటుందని గృహిణులు కాంట్రాక్టు పనులను తీసుకొంటారు. ఫ్యాక్టరీలో పని చేయవలసిన కార్మికుల సంఖ్య తగ్గుతుంది గనుక, ఫ్యాక్టరీ నిర్మాణం మీద, పనివారికి కల్పించ వలసిన వసతుల మీద సొమ్ము ఖర్చు తగ్గుతుంది. పైగా కూలీల సంఖ్య పెరిగిన కొలదీ కొన్ని రకాల ఫ్యాక్టరీ చట్టాలను, కార్మిక సంక్షేమ చట్టాలను యజమానులు పాటించవలసి వస్తుంది ఇందువల్ల ఖర్చులు పెరుగుతాయి కాంట్రాక్టు పద్ధతి ఉత్పత్తి వల్ల వీరికి బాధ ఉండదు కనీస వేతన గ్యారంటీ, ఇన్స్యూరెన్సు ఈ సదుపాయాలు కార్మికులకు లభించవు ఇది తమకు నష్టకరమని తెలిసి కూడా మహిళలు, విధిలేని పరిస్థితుల్లో కాంట్రాక్టు పనులను తీసుకొంటారు. దీనినే నాగరిక పరిభాషలో "ఆధునికోత్పత్తిలో తొలిదశ" అనీ, "సంప్రదాయేతర కార్మిక సంబంధాలనీ" వర్ణిస్తున్నారు. నేటి ఉత్పత్తి విధానాలలో ప్రవేశించిన "ఆధునిక" అంశాలలో ఇదొకటి.

అమెరికా, యూరపుల పెట్టుబడులు వాటికి దాపులో నున్న ప్రాంతాలకు తరలిపోతున్నాయి యూరోపియన్ పెట్టుబడులు ఉత్తర ఆఫ్రికా దేశాలకు, అమెరికా పెట్టుబడులు లాటిన్ అమెరికా దేశాలకు వెళుతున్నాయి ఉత్పత్తి కేంద్రాలు తమ దేశాలకు దాపులో ఉండటం వల్ల, మారుతున్న మార్కెట్ పరిస్థితులకు తగినట్లు ఉత్పత్తి పరిమాణాలను మార్చటం సులభమని యజమానులు ఇందుకుపక్రమిస్తున్నారు. నిన్నటి వరకూ అనామకంగా ఉన్న మారిషస్‌కు, ఆధునిక నౌకా, విమానయాన వసతులు ఉన్నందువల్ల, దాన్ని విదేశీ పెట్టుబడులు వరిస్తున్నాయి ఇందువల్లనే ఈ దేశంలో ఎక్స్‌పోర్టు ప్రొసెసింగ్ జోనులు వర్ధిల్లుతున్నాయి

అభివృద్ధి చెందిన దేశాలలో, జాతీయాదాయంలో అధిక భాగాన్ని ఆర్జించే పారిశ్రామికోత్పత్తి, తన ప్రథమ స్థానాన్ని సర్వీసెస్ రంగానికి అప్పగించవలసి వచ్చింది. జాతీయాదాయార్జనలోనూ, ఉపాధి కల్పనలోనూ కూడా ఈ రంగం మాన్యుఫాక్చరింగ్ రంగాన్ని మించిపోయింది. ఈ పరిణామం కొన్ని సంవత్సరాల క్రిందే జరిగింది. ఇలా మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా మరొకసారి ఉత్పత్తి విధానాలను మార్చవలసిన అవసరం గలిగింది. ఇందువల్ల సర్వీసెస్ రంగపు ప్రాబల్యం మరింత పెరిగింది. అత్యాధునిక సాంకేతిక విధానాల వాడుకవల్ల, సలహాలకు, జమాఖర్చుల వ్రాతలకూ, పరిశ్రమలో అవసరమైన రిపేర్లకు, ఎగుమతుల పెంపుకూ వ్యాపారపు పెంపుకూ అవసరమైన సలహాల నివ్వటానికి బహుముఖ ప్రజ్ఞ గలిగిన సర్వీసెస్ అవసరమవుతున్నాయి. ఇలాంటి సేవలను అందించే వ్యాపార సంస్థలు అవతరిస్తున్నాయి. ఇంతకు పూర్వం, ఇలాంటి

సర్వీసులు కూడా పారిశ్రామిక సంస్థలలో ఒక భాగంగా ఉండేవి. ఇపుడు, అత్యాధునిక నైపుణ్యం అవసరం గావటం చేత, ఈ విషయాలలో ఇందుకవసరమైన సిబ్బంది నియామకం, పారిశ్రామిక సంస్థలకు పెనుభారమైంది కనుక ఫీజులను చెల్లించి ఇతర సంస్థల సేవల నివి పొందుతున్నాయి. ఈ మార్పువల్ల మహిళలకు ఉపాధి అవకాశాలు పెరిగాయి. వృత్తి విద్య నభ్యసించిన వారికి, అవసరమైనంత సాంకేతిక పరిజ్ఞానం ఉన్నవారికి ఉన్నత పదవులు లభించే అవకాశాలు కూడా రూపొందాయి. దురదృష్టవశాత్తు అల్పసంఖ్యాక స్త్రీలకే ఈ వృత్తి విద్యా నైపుణ్యం ఉండటం వల్ల, స్త్రీలలో అధికులు ఈ పరిణామపు ప్రయోజనాన్ని పొందలేక పోతున్నారు.

ఈ రంగంలో కూడా పార్ట్‌టైం ఉద్యోగుల నియామకం పెద్ద యెత్తున జరుగుతున్నది. కాంట్రాక్టు పనులను కూడా ఇస్తున్నారు. అభివృద్ధి చెందిన దేశాల మహిళా ఉపాధిలో పార్ట్‌టైమ్ ఉద్యోగం ముఖ్యాంశాలలో ఒకటిగా రూపొందింది. అభివృద్ధి చెందిన దేశాలలో తలయెత్తిన ఈ మార్పు కొత్తగా పారిశ్రామికవంత మవుతున్న ఆసియా దేశాలకూ, ప్రైవేటీకరణలో మునిగి తేలుతున్న మాజీ కమ్యూనిస్టు దేశాలకు కూడా విస్తరిస్తున్నది.

అభివృద్ధి చెందుతున్న చాలా దేశాలలో లఘు పరిశ్రమలు ఇంకా ప్రధాన పాత్రను నిర్వహిస్తూనే ఉన్నాయి. ఆధునిక పరిశ్రమలు పెంపొందని సబ్-సహారన్ ఆఫ్రికాను ఇందుకు ఉదాహరణగా చూపవచ్చు. ఇంతలో ఆధునిక పరిశ్రమలు పెంపొందే అవకాశాలు ఈ ప్రాంతంలో లేవు. అందువల్ల మహిళలు ఉపాధికి ప్రధానంగా లఘు పరిశ్రమల మీదనే ఆధారపడవలసి వస్తున్నది. ఈ పరిశ్రమలకు ఆధునిక యంత్రాలు అవసరం లేదు; పనిచేసే వారికి సాంకేతిక నైపుణ్యం కూడా ఉండనవసరం లేదు.

ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, ఆర్థిక సర్దుబాటు వల్ల ప్రభుత్వ రంగంలో ఉపాధిని కోల్పోయిన వారికి, లఘు పరిశ్రమల రంగంలో అవకాశాలు లభిస్తున్నాయి. ఆధునిక పారిశ్రామికరంగ ప్రవేశం కంటే, లఘు పరిశ్రమలలో ఉపాధి సంపాదన మహిళలకు సులభంగా ఉన్నది. ఇందులోని పనివారికి సాంకేతిక నైపుణ్యం అవసరం లేదు; పైగా కుటుంబీకులు నిర్వహించే పరిశ్రమలలో ఆకుటుంబీకులకు, వారి సన్నిహితులకు ఉపాధి లభించటం సులభం. మహిళ ఇలా లాభించటం అనేది నిర్ణీత దేశపు ఆర్థిక పారిశ్రామిక అభివృద్ధి స్థాయిని బట్టి, ఆదేశాలలోని సంప్రదాయాలను బట్టి ఉంటుంది.

ఆధునిక పరిశ్రమల ప్రభావం విస్తరించని ప్రాంతాల వారికి, వ్యవసాయం, గ్రామీణ పరిశ్రమలే ప్రధాన ఉపాధి రంగాలుగా ఉన్నాయి. అసంఘటిత రంగ పరిశ్రమలు ప్రధానంగా పట్టణ ప్రాంతాలలోనే అవతరిస్తున్నాయి. వీటిలో మహిళలు పనిచేసి, నిరుద్యోగం వల్ల కుటుంబం కోల్పోయిన ఆదాయంలో కొంత భాగాన్నైనా పూడ్చగలుగుతున్నారు ఈ అవకాశాన్ని అధికంగా పట్టణ ప్రాంతాల మహిళలే అనుభవిస్తున్నారు

## మహిళల పారిశ్రామిక రంగపు ఉపాధిని ప్రభావితం చేస్తున్న అంశాలు

మాన్యు ఫాక్చరింగ్ పారిశ్రామిక రంగపు సాధారణ అభివృద్ధి స్థాయి కంటే, ఆ అభివృద్ధి యొక్క ప్రత్యేక లక్షణాలు ఆ రంగంలోని మహిళా ఉపాధిని అధికంగా ప్రభావితం చేస్తాయి. నిర్ణీత దేశంలో అవతరిస్తున్న పరిశ్రమలకు కూలీలు అధికంగా అవసరమా లేక పెట్టుబడి అధికంగా అవసరమా అన్న వాటి స్వభావమూ, పరిశ్రమల అభివృద్ధి స్థాయి (అది ప్రాథమిక దశా లేక ఉన్నత దశా అన్న అంశము), ఆ దేశ పారిశ్రామికీకరణలో మహిళల పాత్రను నిర్దేశిస్తాయి. దేశ ఆర్థిక విధానం సంప్రదాయంగా వస్తున్న వ్యవసాయార్థిక విధానం నుండి, పారిశ్రామికీకరణకు మారుతున్నపుడు, మహిళల పాత్ర బలహీన పడుతుంది. ఇంతవరకూ కుటుంబ ఉత్పత్తి ప్రాతిపదికగా నడుస్తున్న ఆర్థిక వ్యవస్థ, పారిశ్రామిక ఉత్పత్తికి మారటమే ఇందుకు కారణం.

దేశపు పారిశ్రామిక, ఆర్థిక పురోగమనం తర్వాత, మహిళల శ్రమను కూడా అధికంగా వినియోగించ వలసిన అవసరం కలుగుతుంది. ఆర్థికంగా శక్తి లేనివారు కూలీలుగా, ఉద్యోగులుగా వెళ్ళినా, ఈ శక్తీ, వనరులూ ఉన్న మహిళలు స్వయంఉపాధిని చూచుకొనే అవకాశాలేర్పడతాయి. వృత్తి నైపుణ్యంలేని ఉత్పత్తిలోనో, లేక శారీరక బలాన్ని వినియోగించనవసరంలేని పరిశ్రమలలోనో స్త్రీలకు అధికంగా

ఉపాధి లభిస్తుంది. ఫ్యాక్టరీలో ఏసెంబ్లీలైన్లు కూరగాయలు పండ్ల ప్రాసెసింగ్ పరిశ్రమలు వస్త్రాలు, చర్మ పరిశ్రమల వంటి రంగాలలోనూ ఎలక్ట్రానిక్ ఉత్పత్తి రంగంలోనూ వీరి శ్రమ అధికంగా వినియోగపడుతుంది.

పారిశ్రామిక రంగం మరింత పురోగమించి, అత్యాధునిక సాంకేతిక ఉత్పత్తి విధానాలనూ, అధిక పరిమాణ పెట్టుబడులను వాడే దశకు చేరినపుడు, ఈ రంగంలో మహిళల ఉపాధి అవకాశాలు తగ్గిపోతాయి. ఉక్కు, రసాయన, భారీయంత్రోత్పత్తి రంగాలను ఇందుకు ఉదహరించవచ్చు. పరిశ్రమలలో స్వయంచలిత యంత్రాల వాడకం (ఆటోమేషన్) వల్ల కూడా ఉపాధి అవకాశాలు తగ్గుతున్నాయి. మహిళలు అధిక సంఖ్యలో పనిచేస్తున్న వస్త్ర పరిశ్రమలో స్వయంచలిత టెక్నాలజీ వాడకం వల్ల, అధికులు నిరుద్యోగులయినారు. మార్కెట్ పోటీని తట్టుకోవటానికి ఉత్పత్తి ఖర్చుల తగ్గింపు అవసరమవుతుంది. అపుడు ఏ దేశంలో కూలి ఖర్చులు తగ్గుతాయో చూచి, ఆదేశాలకు పెట్టుబడులను పంపుతారు. ఇందువల్ల ఆ దేశాలలో పరిశ్రమలు రూపొంది, మహిళలకు ఉపాధి అవకాశాలు లభిస్తాయి. ఇలా టెక్నాలజీకి, మహిళల ఉపాధికి పోటీ జరుగుతూనే ఉంటుంది. వృత్తి విద్యా నైపుణ్యాన్ని పెంపొందించుకో గలిగిన అదృష్టవంతులు ఈ పోటీలో గెలుపొందుతారు; ఇది సాధ్యపడని వారు వైదొలగక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. ఇది నిరంతర పరిణామ క్రమం.

వేతనార్జనలో మహిళలు పాల్గొనటాన్ని ఆప్రాంతపు సాంఘిక - సాంస్కృతిక పరిస్థితులు ప్రభావితం చేస్తాయి. ఈ పరిస్థితులను బట్టే, దేశ ఆర్థిక విధానంలోనూ, సమాజంలోనూ మహిళల స్థానం నిర్దేశిత మవుతుంది. ఈ అంశాలే ఆధునిక పారిశ్రామిక వ్యవస్థలో ఉపాధి అవకాశాల వినియోగానికి వారికి అవరోధాలుగా తయారవుతాయి. నియమిత విద్యాస్థాయి ఉంటేనే తప్ప ఆధునిక పారిశ్రామిక వ్యవస్థలో ఉపాధి అవకాశాలు లభించవు. అదృష్టవశాత్తు, మహిళ అవసరమైన పరిమాణపు విద్యాస్థాయి నందగలిగినా, గృహనిర్వహణా భారం ఆవిడకు మరొక అవరోధంగా తయారవుతున్నది.

కొన్ని సమాజాలలో స్త్రీలు పరపురుషులతో కలసి తిరగటం, వారితో వ్యవహరించటం నిషిద్ధం. అభివృద్ధి చెందుతున్న దేశాలలో పనిచేస్తుండే మహిళలలో యువతులు - ముఖ్యంగా అవివాహితలు - అధిక సంఖ్యాకులుగా ఉంటారు. వివాహమైన తర్వాతనో, లేక తొలికాన్పు తర్వాతనో పెద్దలు వీరిని ఉద్యోగం చేయనీయరు. ఆధునిక సమాజాలలో కూడా, మహిళలు గృహనిర్వహణా బాధ్యతలనూ, పిల్లల పెంపకం, కుటుంబ పోషణ, పిల్లల, పెద్దల సంరక్షణా బాధ్యతలను నిర్వహించటంలో తలమునకలై యుంటున్నారు. ఇటువంటి పరిస్థితులలో ఉద్యోగం చేసి, వేతనాన్ని ఆర్జించే అవకాశమేది? అయినా ఇటువంటి అసౌకర్యాలను అధిగమిస్తూ కూడా మహిళలు లేబర్ మార్కెట్‌కు వస్తున్నారు. భార్యా భర్త లిరువురూ సంపాదించకపోతే కుటుంబం గడవదు. ఇన్ని అసౌకర్యాలనూ, అవరోధాలను అధిగమించి మహిళ వేతనాన్ని ఆర్జించినా, ఆవిడకు కుటుంబంలో లభించేది ద్వితీయ స్థానమే! ప్రథమ స్థానం పురుషజన్ములది!

విస్తరిస్తున్న ఉపాధి అవకాశాలను స్త్రీలు వినియోగించుకోవటాన్ని సాంఘిక - సాంస్కృతిక విధానాలు నిరోధిస్తున్నాయి. ఇందులో గృహ నిర్వహణా భారం కంటే వీటి పాత్రే అధికంగా ఉంటుంది. స్త్రీ-పురుష విద్యార్జనలో సమాన స్థాయీ లోపం, ముఖ్యమైన అవరోధాలలో ఒకటి. అభివృద్ధి చెందుతున్న పలుదేశాలలో స్త్రీ-పురుష విద్యాస్థాయీ భేదం అధికంగా ఉన్నది. అక్షరాస్యతలో మహిళలు పురుషులకంటే ఎంతో వెనుకబడి ఉన్నారు. ఇందువల్లే పారిశ్రామిక ఉత్పత్తి రంగంలో పురుషుల కంటే మహిళలకు ఉపాధి అవకాశాలు చాలా తక్కువగా ఉంటున్నాయి. ఉన్నత విద్యాస్థాయిలోనూ, వృత్తి విద్యాస్థాయిలో కూడా ఈ తేడా అధికంగానే ఉంది. కాని క్రమంగా ఈ స్థాయీ విద్యార్జనకు వచ్చే మహిళల సంఖ్య పెరుగుతూండటం శుభసూచకం. సైన్సు, ఇంజినీరింగ్, మేనేజ్‌మెంట్ విద్యార్జనకు వెళ్ళే మహిళల సంఖ్య ఇంకా తక్కువగానే ఉంటున్నది. ఇందువల్ల పారిశ్రామిక రంగంలోని మధ్యస్థాయి, ఉన్నతస్థాయి పోస్టులు వీరికి అతి తక్కువగా లభిస్తున్నాయి. పలు దేశాలలో, అభివృద్ధి చెందిన, అభివృద్ధి చెందుతున్న అన్న భేదం లేకుండా, సర్వీసెస్ రంగమే మహిళలకు మంచి అవకాశాల నిస్తున్నట్లు చెప్పవచ్చు. ప్రధానంగా ఉద్యోగస్థాయీ భేదం వల్ల పురుషుల కంటే మహిళల సంపాదన తక్కువగా ఉంటున్నది. కంపెనీ స్థాయీ

రెండవ పట్టిక

పూర్తి వేతనంతో ప్రసూతిశలవు నీయని దేశాలు : పూర్తివేతనంలో కొంతభాగం మాత్రమే ఇస్తున్న దేశాలు

| | | | |
|---|---|---|---|
| అభివృద్ధి జెందిన ప్రాంతం | | మెడగాస్కర్ | 50 శాతము |
| ఆస్ట్రియా | సగటు మాసవేతనం | నైజర్ | 50 శాతము |
| బెల్జియం | 82 శాతం | నైజీరియా | 50 శాతము |
| కెనడా | 17 వారాల ప్రసూతి శలవు | సోమాలియా | 50 శాతము |
| | 15 వారాలకు 57 శాతపు వేతనం | స్వాజిలాండ్ | వేతనం చెల్లించరు |
| డెన్మార్క్ | 28 వారాలకు సగటు వేతనం | ట్యూనీషియా | దినవేతనములో మూడింట |
| ఫిన్లండ్ | 80 శాతం | | రెండువంతులు |
| ఫ్రాన్స్ | 84 శాతము | జైర్ | వేతనంలోని మూడింట |
| ఐర్లెండ్ | 70 శాతము | | రెండువంతులు |
| ఇజ్రాయెల్ | 75 శాతము | జింబాబ్వే | వేతనంతో లభించే శలవు దినాలను |
| ఇటలీ | 80 శాతము | | వదలుకోవటానికి అంగీకరిస్తే 75 |
| జపాన్ | 60 శాతము | | శాతం, లేకపోతే అరవైశాతపు వేతనం |
| లిచెన్‌స్టన్ | 80 శాతము | లాటిన్ అమెరికా, కరిబియన్ | |
| న్యూజిలెండు | వేతనం చెల్లించరు | అర్జెంటీనా | 60 శాతము |
| స్పెయిన్ | 75 శాతము | ఎల్‌సాల్వెడార్ | 75 శాతము |
| స్వీడన్ | 90 శాతము | గ్రెనెడా | 60 శాతము |
| టర్కీ | 66 శాతము | నికరాగ్వా | 60శాతము |
| యునైటెడ్ కింగ్డం | 90 శాతము | పెరాగ్వే | 50 శాతము |
| అమెరికా | వేతనం చెల్లించరు | ట్రెనిడాడ్ అండ్‌టోబాగో | 60 శాతము |
| ఆఫ్రికా | | ఆసియా, పసిఫిక్ | |
| బోట్‌స్వానా | 25 శాతము | ఇరాక్ | వేతనంలోని మూడింట రెండు |
| బురుండి | 90 శాతము | | వంతులు |
| సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 50 శాతము | పాకిస్తాన్ | రోజువారీ సగటు వేతనం |
| చాద్ | 50 శాతము | పాపూ న్యూగిని | వేతనం చెల్లించరు. |
| ఈక్విటోరియల్ గిని | 75 శాతము | సాదీ అరేబియా | 50 శాతము |
| ఘనా | 50 శాతము | సిరియా | 70 శాతము |
| కీన్యా | వేతనంతో ఇచ్చేశెలవును దీనికి | యెమన్ | 70శాతము |
| | లెక్కగడతారు. | | *- ది వరల్డ్స్ ఉమెన్ 1995-నుండి* |

ప్రమాణంతో పనిలేకుండా, ఉద్యోగం దొరికితే చాలునన్న సంతృప్తితో, దొరికిన ఉద్యోగంలో ప్రవేశించటం, పార్ట్‌టైమ్ ఉద్యోగాలు చేయటం కూడా మహిళా సంపాదన తక్కువగా ఉండటానికి కారణమవుతున్నది. మహిళలను ఆర్థిక జీవనంలోనికి తీసుకువచ్చే ప్రయత్నాలు జరగాలి. ఈ ప్రాంతాల మహిళ లిపుడు ప్రధానంగా వ్యవసాయం లోనూ, సంప్రదాయ వృత్తులలోనూ ఉన్నారు.

సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలలో ప్రబలిన ఆర్థిక

హుంచ్చము. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాలు మహిళల ఉపాధి అవకాశాలను బాగా తగ్గించాయి అభివృద్ధికున్న అవకాశాలు కూడా తక్కువ కావటం చేత మహిళలకున్న ఆర్థికావకాశాలు కూడా తక్కువగానే ఉన్నాయి

### ప్రసూతి సెలవు - ఇతర వసతులు

సంతాన ప్రాప్తి స్త్రీ జీవితంలో అతిముఖ్యమైన అంశం లేబర్ మార్కెట్లో, స్త్రీ పురుషునితో సమ ఉజ్జీగా పోటీ బడాలంటే, మాలు. కాన్పు కాలంలో తగిన రక్షణా వసతులుండాలి. కాన్పు తర్వాత శిశుసంరక్షణా వసతులుండటం అవసరం. కనుకే ప్రసూతిసెలవు వేతనార్జనకు పనిచేసే మహిళలకు అత్యవసరమైనదిగా రూపొందింది ప్రపంచం లోని చాలా దేశాలలో పనిచేసే మహిళలకు కాన్పుకు ముందు, కాన్పు తర్వాత కొన్ని వారాల పాటు సెలవు నిస్తున్నారు. శలవును వారు అనుభవించే కాలానికి, యజమానుల నుండి గాని, లేక సోషల్ సెక్యూరిటీ నిధుల నుండి గాని వేతనం లభిస్తుంది. అమెరికా, న్యూజిలెండ్, పాపు న్యూగినీలు మాత్రం, వేతనంతో ప్రసూతి శలవును ఇవ్వటం లేదు (రెండవ పట్టికను చూడండి) అలాగే అన్ని దేశాలూ, సంపూర్ణ వేతనాన్ని ప్రసూతి సెలవు కాలాని కివ్వటం లేదు

అభివృద్ధి చెందిన దేశాలలో, ఒక్క మాల్టా. స్విట్జర్లండులలో తప్ప, సెలవు కాలపు వేతనాన్ని సోషల్ సెక్యూరిటీ. లేదా ఇన్స్యూరెన్సు ద్వారా వేతన చెల్లింపు జరుగుతున్నది ఈ రెండు దేశాలలో యజమానులు సెలవు కాలపు వేతనాన్ని చెల్లిస్తున్నారు. ఈదేశాలు ఇచ్చే ప్రసూతిసెలవు ఎనిమిది వారాలనుండి ఇరవై నాలుగు వారాల వరకూ ఉంటున్నది. హంగరీలో 24 వారాలు, ఇటలీలో ఐదుమాసాలు, రష్యన్ ఫెడరేషన్లో 20 వారాలు ప్రసూతి సెలవు నిస్తున్నారు.

ఆఫ్రికాలోని దేశాలన్నిటిలోనూ (ఒక్క స్వాజీలాండ్ లో తప్ప) పని చేసే స్త్రీలకు వేతనంతో సెలవు లభిస్తున్నది. సెలవు కాలానికి సగం నుండి పూర్తి వేతనం వరకూ ఉద్యోగినికి ఇస్తున్నారు. స్వాజీలాండ్ లో వేతనం లేకుండా పన్నెండు వారాల ప్రసూతి సెలవు నిస్తున్నారు. ఆఫ్రికా దేశాలలో ఇచ్చే సెలవు ముప్పై రోజుల నుండి పదిహేను వారాల వరకూ ఉంటున్నది.

లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలలో ఎనిమిది వారాలనుండి నాలుగు మాసాల వరకూ స్త్రీ వర్కర్లకు ప్రసూతి సెలవు లభిస్తున్నది అధిక సంఖ్యాక దేశాలలో ఈ సెలవు పరిమాణం 12 నుండి 14 వారాల వరకూ ఉంటున్నది. సెలవు కాలపువేతనం సోషల్ సెక్యూరిటీ నుండి లభిస్తున్నది. దాదాపు పూర్తి వేతనం ఉద్యోగినికి లభిస్తున్నది

ఆసియా దేశాలలో, ప్రధానంగా యజమానులే సెలవు కాలానికి వేతనాన్ని చెల్లిస్తున్నారు ఈప్రాంత దేశాలలో ఇచ్చే సెలవు ఇతర దేశాలలో ఇస్తున్నంత అధిక కాలం ఉండటం లేదు. సగభాగపు దేశాలలో ఈ సెలవు పది వారాలు లేదా అంతకంటే తక్కువగానే ఉంటున్నది.

దేశంలోని శాసనాల ప్రకారం లభించ వలసిన ప్రసూతి సెలవు వల్ల ఉద్యోగిను లందరూ లాభిస్తున్నట్లు భ్రమించకూడదు వ్యవసాయ రంగంలోనూ, అసంఘటిత రంగంలో పనిచేస్తున్న మహిళలకు, కాంట్రాక్టు వర్కర్లకు ఈ సదుపాయం లభించదు. ప్రసూతి సెలవు కాలానికి వేతనం లభిస్తున్న దేశాలలో కూడా, మహిళలకు, అవసరమైన శిశు సంరక్షణా కేంద్రాల ఏర్పాట్లు లేనిచోట్ల, కాన్పు తర్వాత స్త్రీ ఉద్యోగంలో చేరి పనిచేసే వీలుండటం లేదు. అందుచేత ఇలాంటివారు బలవంతపు నిరుద్యోగాన్ని అనుభవించ వలసి వస్తున్నది ఇందువల్ల లభించ వలసిన సర్వీసు, ప్రమోషన్ వసతులను వారు కోల్పోవలసి వస్తున్నది.

### మహిళా కార్మికుల వలస

కార్మికులు పెద్ద యెత్తున విదేశాలకు కూడా వలస పోతున్నారు. కాని వారి సంఖ్యా పరిమాణాలు లెక్క లోనికి రావటం లేదు. ఉదాహరణకు సింగపూరును చూడవచ్చు. ఇచ్చట పనిచేస్తున్న వారిలో పది శాతం మంది విదేశాల నుండి వచ్చిన వారే! కార్మికులను అధికంగా'ఎగుమతి' చేస్తున్న దేశం ఫిలిపీన్స్ ఈ దేశం నుండి పోయి విదేశాలల్లో పనిచేస్తున్న వారి సంఖ్య పన్నెండున్నర లక్షల వరకూ ఉన్నట్లు అంచనా. క్రమంగా మహిళలు కూడా అధికంగా వలస పోవటం కనిపిస్తున్నది. ఫిలిపీన్స్ నుండి ఆసియా దేశాలకు వలస పోతున్న వారిలో మగవారి కంటే మహిళలే అధికంగా ఉన్నారు. ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ అంచనాల ప్రకారం, ఈదేశం నుండి వలస పోయే వారిలో ప్రతి ఒక్క మగ మనిషికి,

పన్నెండు మంది మహిళలుంటున్నారు; శ్రీ లంక నుండి వలస పోయే వారిలో ప్రతి ఇద్దరు మగవారికి ముగ్గురు చొప్పున మహిళ లుంటున్నారు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో నిరుద్యోగం పెరిగిపోతున్నది: ఇందువల్ల అసంఘటిత రంగంలో దొరికిననాడు పనిచేయటం, దొరకని నాడు ఇంట ఉండవలసి రావటం జరుగుతున్నది ఇందువల్ల మహిళలు దాపులోని పట్టణాలకో, వీలున్నట్లైతే విదేశాలకో పొట్ట పోసుకోవటం కోసం వలస పోతున్నారు ప్రపంచీకృత మవుతున్న ఆర్థిక వ్యవస్థ వలసను ప్రోత్సహిస్తున్నది. ముఖ్యంగా యువతులు, వీరిలో అధికులు అవివాహితలు, వలసకు ఉత్సాహ పడుతున్నారు. చైనాలో ఆర్థిక సరళీకరణ ప్రారంభం కాగానే, స్పెషల్ ఎకనామిక్ జోన్స్‌కూ, తీర ప్రాంతాలకూ, ఇతర ప్రాంతాలలోనున్న పారిశ్రామిక కేంద్రాలకూ, సిచువాన్, గాంగ్‌డాంగ్ రాష్ట్రాల నుండి మహిళలు వెల్లువ వలె వలస పోయారు. ఆసియా నుండి విదేశాలకు వలస వెళ్ళే మహిళలు ప్రధానంగా ఇంటి పని వారుగా పోతున్నారు. మధ్య ప్రాచ్యానికి, యూరపుకూ, తూర్పు ఆసియా దేశాలకూ వీరు వెళుతున్నారు. హాంకాంగ్, జపాన్, సింగపూరు, తయువాన్లకు లఘుపరిశ్రమలలోనూ, ఇతర అసంఘటిత పరిశ్రమలలోనూ పనిచేయటానికి ఆసియా మహిళలు వెళుతూండటం కనిపిస్తున్నది.

మహిళా వలసకు పలురూపాలున్నాయి. భర్త పని చేస్తున్న చోట్లకు వారి సతులు వెళ్ళటం ఒక రూపం. తనకు ఉన్నచోట పొట్ట గడవక, పనివెతుక్కోవటం కోసం స్త్రీ వెళ్ళటం వలస యొక్క మరొక రూపం. యునైటెడ్ నేషన్స్ పాప్యులేషన్ ఫండ్ అంచనాల ప్రకారం, ఆగ్నేయ ఆసియా, లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతాలకు వలస వచ్చిన మహిళలలో నూరింట యాభై నుండి డెబ్భైమంది వరకూ పనిని వెదుకుతూ వచ్చిన వారే ఉన్నారు. దక్షిణ ఆసియా, ఆఫ్రికా ప్రాంతాలకు వలస వెళ్ళిన వారు ప్రధానంగా కుటుంబీకులను చేరటానికి వెళుతున్నప్పటికీ, ఆర్థిక కారణాల వల్ల వలస వచ్చిన వారు నూరింట యాభై మంది వరకూ ఉన్న సందర్భాలు కూడా ఉన్నట్లు ఐ.ఎల్.ఓ. అంచనా వేసింది. వలస పోయేవారి వల్ల లాభపడదలచిన సంస్థలు, వలస పోదలచిన వారి నుండి సొమ్ము పిండుకొని, వారిని విదేశాలకు పంపటం వలస యొక్క మరొక రూపం.

వలస పోయిన పురుష కార్మికుల కంటె, మహిళ దోపిడీకి అధికంగా గురయ్యే అవకాశాలున్నాయి. ఇందుకు ఒక కారణం, స్త్రీ పొట్ట పట్టుకు రావటం. రెండవ కారణం ఆవిడ స్త్రీ కావటం; పైగా నిరాధారితైయుండటం ఆవిడ పక్ష బద్ధంగా వలస పోయి ఉండకపోతే, ఆవిడ మరింత బాధ పడవలసి వస్తుంది. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ వల్ల, లేబర్ మార్కెట్ మీద ఉన్న ప్రభుత్వపు పట్టు సడలిపోయి యజమానుల ఇష్టారాజ్యానికి బాట బడింది కనీస వేతన నిబంధనలు అడ్డురావటం లేదు. గనుక పొట్ట చేతబట్టుక వచ్చిన వారిని దోయటానికే సంస్థల యజమానులు ఎదురు చూస్తూఉంటారు. ఎంత తక్కువ వేతనానికైనా వలసకార్మికులు పనులకు పోతూ ఉంటారు మహిళా కార్మికులు సెక్సు పీడనకు, హింసకూ గురవుతూ ఉండటం అతి సామాన్యమైన విషయం. తమ దేశంలోని సమీప పట్నాలకు వలస పోయిన మహిళలలో అధికులు ఇంటి పనివారుగా పొట్ట బోసుకొంటున్నారు.

ఆఫ్రికాకు వలస వచ్చిన వారిలో అధికులు అసంఘటిత రంగంలో పనిచేస్తున్నారు. వీరి వేతనాలు తక్కువగా ఉంటాయి; పనికి భద్రత అనేది ఉండదు. పని దొరకని పరిస్థితులలో దారిద్ర్యపు బాధ తాళలేక వలస వచ్చిన వారు, విధిలేక పడుపువృత్తిలో ప్రవేశిస్తూ ఉంటారు. కమరూన్ లోని దవాలా ప్రాంతానికి మహిళా కార్మికుల వలస అధికంగా ఉంటున్నది. వలస వచ్చిన వారిలో దాదాపు సగం మంది తమ "మిత్రులు" ఇస్తున్న సొమ్ము వల్ల జీవనం గడుపుతున్నట్లు చెప్పారని, ఇంటర్నేషనల్ లేబర్ ఆఫీసు విడుదల చేసిన ఒక పరిశోధక పత్రం వెల్లడించింది. బ్యాంకాక్‌కు వలస వచ్చిన మహిళలలోని 14-24 సంవత్సరాల వయస్కులలో నూరింట పదిమంది పడుపు వృత్తిలో చేరినట్లు, ఈ సంస్థ విడుదల చేసిన మరొక సర్వే సూచించింది. అభివృద్ధి చెందుతున్న పలుదేశాలలో పడుపు వృత్తిలో ప్రవేశిస్తున్న మహిళల సంఖ్య త్వరితగతిని పెరుగుతున్నది.

వలస వల్ల కొన్ని సమస్యలు మహిళలను వేధిస్తున్నాయి. పురుషులు వలస వెళ్ళటం వల్ల, కుటుంబ పోషణాభారాన్ని మోయవలసి వచ్చిన మహిళల సంఖ్య

పెరుగుతున్నది. ఇందువల్ల ఇలాంటి కుటుంబాలలో అత్యధిక భాగం దారిద్ర్యంలో కూరుకు పోతున్నాయి. కొన్ని సందర్భాలలో బాలికల విక్రయం కూడా జరుగుతున్నది. కొందరు బాలికలు తెలివిలేక ఆశపడి సులభంగా మోస పోతూంటారు. ఇలాంటి వారు చివరకు వేశ్యావాటికకు చేరుతున్నారు. పట్నాలకు వలస పోయే స్త్రీలకు అధిక ప్రమాదాలుంటాయి. వేశ్యావాటికను చేరే ప్రమాదాన్ని తప్పించుకోగలిగిన వారికి, పని చేసే దగ్గర సెక్సు పరమైన వేధింపులకు గురయ్యే ప్రమాదం ఉంటున్నది.

వలస పోయే వారందరి లక్ష్యము ఒక్కటే- నిరుద్యోగం, దారిద్ర్యం నుంచీ తప్పించుకోవటం. ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకోవటం. ప్రస్తుత పరిస్థితులు ఇందుకు అనుకూలంగా ఉన్నాయి గనుక, ఈ దశాబ్ద కాలంలో వలసపోయే మహిళల సంఖ్య పెరుగుతూ ఉంటుందనే అంచనా వేస్తున్నారు. గత దశాబ్దంలో ప్రారంభమైన ఆర్థిక పునర్వ్యవస్థీకరణ మహిళల అంతర్జాతీయ వలసను ప్రోత్సహించినదని చెప్పవచ్చు. నిరుద్యోగంతో బాధపడుతున్నవారు, ఉదర పోషణకు, కొత్తగా ఏర్పడిన పారిశ్రామిక, వ్యాపార కేంద్రాలకు వలస వెళ్ళారు. ఈ దశాబ్దంలో, మాజీ కమ్యూనిస్టు దేశాలనుండి, అధిక సంఖ్యలో కార్మికులు పశ్చిమ యూరపు దేశాలకు, అమెరికాకు వలస పోయారు. వీరి సంఖ్య ఇరవై లక్షల నుండి రెండు కోట్ల వరకూ ఉండగలదని అంచనా. ఆసియాలోని పేదలు తూర్పు ఆసియా దేశాలకూ, ఆగ్నేయ ఆసియాకు వెళ్ళారు. ఇదీ తొంభయ్యవ దశాబ్దపు ప్రత్యేకత!

మాజీ కమ్యూనిస్టు దేశాల నుండి వలస వెళ్ళిన వారిలో అత్యధిక సంఖ్యాకులుగా మహిళలున్నట్లు అంచనా వేస్తున్నారు. పశ్చిమ దేశాలలో హోటళ్ళలో పనిచేయటానికి, నర్సులుగా, ఇంటి పనివారుగా పనిచేయటానికి వీరి నియామకాలు జరిగాయని చెబుతున్నారు. పడుపు వృత్తికి డిమాండ్ అధికంగా ఉండటం వల్ల మహిళలు అధిక సంఖ్యలో 'ఎంటర్‌టెయిన్‌మెంట్' పరిశ్రమలో చేరుతున్నారు. రష్యా వధువులకు అమెరికాలో గిరాకీ పెరగటం ఈ పరిణామంలో మరో విశేషం!

వలస వస్తున్న వారి సంఖ్య క్రమంగా పెరుగుతూ ఉండటం వల్ల కొన్ని తూర్పు ఆసియా దేశాలు తమ దేశాల వలసకు సంబంధించిన చట్టాలను సవరిస్తున్నాయి. వలసవల్ల దేశంలోని కార్మికుల వేతనాలు తగ్గుతున్నాయని, నిరుద్యోగ ప్రమాదం పెరుగుతున్నదనీ, స్థానిక ట్రేడ్ యూనియన్లు ఆందోళన చేస్తున్నాయి. ఇందుకు అనువుగా ఆ దేశ ప్రభుత్వాలు ప్రతిస్పందించటాన్ని పరిశ్రమల యజమానులు వ్యతిరేకిస్తున్నారు. చదువుకొన్నవారు తక్కువ స్థాయి పనులు, ప్రమాదభరితమైన పనులు చేయరు. కనుక వలసవచ్చేవారు లేకపోతే ఇలాంటి పనులు చేసే కార్మికుల కొరత ఏర్పడుతుంది. ఇది పరిశ్రమల యజమానుల వాదం. వలస పోయిన కార్మికులు పంపే విదేశీ మారకద్రవ్యం, కొన్ని దేశాలకు వరప్రసాదంగా కనుపిస్తున్నది. అందువల్ల తమ దేశం నుండి కార్మికుల వలస తగ్గితే విదేశీ మారక ద్రవ్యపు రాక తగ్గుతుందని ఈ రకపు ప్రభుత్వాల భయం. ఈ ఆబోతుల కుమ్ములాటలో మహిళలు చిక్కుబడుతున్నారు.

గత్యంతరం లేక మహిళలు వలస పోతున్నారు. వారిలో అధికులకు వలస వెళ్ళే మార్గాలు, చేరదగిన గమ్యాలు తెలియవు. ఇందువల్ల వలస వెళ్ళిన చోటవారు పలురకాల ప్రమాదాలకు గురవుతున్నారు; బాధలు పడుతున్నారు. వలస పోదలచిన వారికి అవసరమైన సమాచారాన్ని అందజేసే వసతి ఉండాలి. వలస కార్మికులకు కూడా ఆయాదేశాల కార్మిక సంక్షేమ చట్టాలు వర్తించేట్లు చూడాలి. ఇది జరిగే వరకూ వలస పోవలసిన మహిళలకు ప్రమాదాలు తప్పవు; వారు శ్రమ దోపిడీకే గాక, మానపు దోపిడీకి కూడా గురయ్యే ప్రమాదమున్నది.

# 11

## లేబర్ మార్కెట్లో లింగ వివక్ష

ఆర్థిక వ్యవస్థ పురోగమించిన కొలదీ, దాని సామర్థ్యం పెరుగుతూ ఉంటుంది. ఉపాధి అవకాశాలు పెరుగుతాయి. ప్రజల ఆదాయాలు పెరుగుతాయి. కాని ఈ అవకాశాలు ప్రజలందరకూ సమంగా లభించవు. వ్యక్తుల మధ్య, స్త్రీ పురుషుల మధ్య, వివిధ జాతుల మధ్య, వివిధ కుటుంబాల మధ్య ఈ విషయంలో హెచ్చుతగ్గులుంటాయి. ఆర్థిక స్థోమత లేనివారూ, శక్తి హీనులు, పేదలు, స్త్రీలు, దేశంలోని కొన్ని ప్రాంతాలు వెనుకబడే అవకాశాలుంటాయి అభివృద్ధికి అవసరమైన వనరులు అందరకూ సమంగా అందుబాటులో ఉండవు. విద్య, వృత్తి నైపుణ్యం వంటి వాటిని ఇందుకు ఉదాహరణలుగా చెప్పవచ్చు. స్త్రీలు, కొన్ని జాతులు, కొన్ని తెగల వారికివి, అందరితో సమంగా అందుబాటులో ఉండవు. కనుక వారు వెనుకబడి పోతారు, ఆర్థికాభివృద్ధి వలన ఏర్పడిన అవకాశాలను వారు ఉపయోగించుకోలేరు. ఆర్థికాభివృద్ధి ఫలితాలు సమాజంలోని అన్ని వర్గాలకూ, స్త్రీ పురుషులకు, అక్షరాలా సమంగా లేకపోయినా, కొద్దిపాటి హెచ్చుతగ్గులతోనైనా అందనపుడు, సమాజం ఆత్మపరిశోధన చేసుకోవటం అవసరం. వైఫల్యాల సర్దుబాటుకు తాపత్రయ పడటం న్యాయం.

వివిధ రంగాలలోనూ, వివిధ వృత్తులలోనూ పనిచేస్తున్న వారికి వేతన నిర్ణయంలో, అన్ని దేశాలలోనూ తేడాలున్నాయి ఫైనాన్స్ రంగంలో పనిచేసే వృత్తి నైపుణ్యం గల ఉద్యోగులకు లభించే వేతనాలు, చిల్లర వ్యాపారంలో పనిచేసే, నైపుణ్యంలేని ఉద్యోగి వేతనాల కంటే మూడు నాలుగు రెట్లు అధికంగా ఉంటున్నాయి. వ్యక్తుల వృత్తి నైపుణ్యము, శక్తియుక్తులు, పని పరిస్థితులు, ఆ పోస్టులోని వారికి ఉండవలసిన సామర్థ్యం – ఇవన్నీ వ్యక్తుల వేతనాల మధ్య తేడాలుండటానికి కారణమవుతున్నాయి. కష్టమైన పనులకు, ప్రమాద భరిత పరిస్థితులలో చేయవలసిన పనులకు లేదా అత్యంత అసహ్యకరమైన వాతావరణంలో చేయవలసిన పనులకూ, ఇంతకంటే సులభమూ, క్షేమకరము, పరిశుభ్రమైన పరిస్థితులలో చేయవలసిన పనులకు లభించే వేతనం కంటే అధిక వేతనాల చెల్లింపు జరుగుతుంది. ఈ రెండు రకాల వృత్తులలోనూ పనిచేస్తున్న వారి వృత్తి నైపుణ్యమూ, సామర్థ్యమూ సమంగా ఉన్నా, పని పరిస్థితులలోని అంతరాన్ని బట్టి, వారికి చెల్లించే వేతన పరిమాణంలో తేడాలుంటాయి.

ఇదంతా యదార్థమంటూ, ఈ వేతన వ్యత్యాసాలను

సమంజసమని మనం అంగీకరించినా, సమర్థించటానికి వీలులేని వేతన వ్యత్యాసాలు కొన్ని ఉన్నాయి వ్యక్తి యొక్క సహజమైన శక్తియుక్తుల అంచనాల వైఫల్యం, కావాలని పాటించే వివక్ష, లేబర్ మార్కెట్లో జరిగే ఇతర అన్యాయాల వల్ల వ్యక్తుల మధ్య వేతన అంతరాలుంటున్నాయి ఇవి ఏ విధంగానూ సమర్థించ వీలులేని అంశాలు. అత్యంత ఉన్నత స్థాయిని సాధించిన సమగ్రమైన లేబర్ మార్కెట్‌గా అమెరికన్ లేబర్ మార్కెట్ పేరొందింది ఇలాంటి మార్కెట్లోనే వేతన వ్యత్యాసాలున్నాయి వ్యక్తుల సామర్థ్య - స్వభావాలను బట్టి, పరిశ్రమ యొక్క, ఆ పరిశ్రమలోని ఉద్యోగం యొక్క స్వభావాన్ని బట్టి, ఆ సంస్థను నడిపే పాలక వర్గపు విధానాలను బట్టి ఉండే వేతన వ్యత్యాసాలను యాభై నుండి డెబ్బై శాతం వరకు మాత్రమే సమర్థించగలం. మిగిలిన తేడాను సమర్థించటానికి న్యాయమైన ప్రాతిపదిక ఏదీ కనుపించదు "ఆర్థికాభివృద్ధి పురోగమిస్తున్న కొలదీ, వేతన వ్యత్యాసాల తగ్గుదల చాలా దేశాలలోనూ కనుపిస్తున్నది. కాని ఈ తగ్గుదల పరిమాణం అన్ని దేశాలలోనూ ఒకే విధంగా ఉండే అవకాశాలు లేవు" అని ప్రపంచ బ్యాంకు ప్రచురించిన "వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995" సూచించింది.

వ్యక్తుల మధ్య ఉండే అసమానతలకు రెండింటిని ప్రధానమైన కారణాలుగా చెప్పవచ్చు. 1. వ్యక్తికున్న వనరులు. ఇందులో ముఖ్యమైనవి అతను సముపార్జించిన విద్యా స్థాయి, తగినంత భూవసతి, పరపతి సౌకర్యం, విద్య, వైద్యం వంటి సామాజిక సేవలను పొందలేని వారూ, వృత్తి నైపుణ్యం లేనివారు పేదలు గానే మిగిలి పోతారు. వీరు ఉన్న వనరులతో అధికోత్పత్తిని చేసి లాభించలేరు. ఉన్నతోద్యోగాలకు ఎగబ్రాకలేరు. 2. వనరుల పంపకంలో వివిధ రంగాల మధ్య, వివిధ వృత్తుల మధ్య తేడాలుంటాయి. సంఘటిత రంగంలోని ఉద్యోగాల పంపకంలోనే గాకుండా, ఆ ఉద్యోగాల వల్ల లభించే వేతన పరిమాణంలో కూడా తేడా లుంటాయి. ఇలాంటి తేడాలు స్వయంఉపాధి రంగంలోనూ కనుపిస్తాయి.

విద్య, వృత్తి నైపుణ్యంలోని తేడాల వల్ల కార్మికుల వేతనాల మధ్య తేడాలుంటున్నాయి ఒక వ్యక్తి యొక్క వేతన పరిమాణాన్ని నిర్ణయించే అత్యంత ముఖ్యమైన అంశము అతని విద్యాస్థాయి. వ్యక్తి యొక్క విద్యాస్థాయి, అతనిలోని సృజనాత్మక శక్తులు, వృత్తి నైపుణ్యము, అనుభవము - ఇవన్నీ కలిపి, వేతనంలోని మూడవ వంతునుండి సగం వరకూ వేతన వ్యత్యాసానికి కారణమవుతున్నాయి. విద్యాస్థాయిని పెంచటానికి ప్రయత్నించటం వల్ల, వేతన వ్యత్యాసాల పరిమాణం గణనీయంగా తగ్గే అవకాశాలున్నాయని అనుభవం నిరూపిస్తున్నది. బ్రెజిల్‌లో విద్యాస్థాయిలోని భేదాలు, వేతన తేడాలలో నాల్గవ వంతుకు మించే కారణమవుతున్నట్లు నిపుణులు నిర్ణయించారు. కొలంబియాలో విద్యావ్యాప్తి అధికంగావటం వల్ల, నైపుణ్యం గల కార్మికులకు డిమాండు అధికంగా ఉన్న కాలంలో ఉన్నత పోస్టులకు, దిగువ పోస్టులకు మధ్యనున్న వేతన వ్యత్యాసం ఇరవైశాతం తగ్గింది. మలేషియా, కోస్టారికాలలోనూ, ఇలాంటి పరిణామమే సంభవించింది. కొన్ని దేశాలలో కార్మికుల విద్యాస్థాయి పెరుగుతున్నా, వేతన వ్యత్యాసాలు,కార్మిక నియామకాలలో వ్యత్యాసాలు కనిపిస్తున్నాయి. చిలీ, మెక్సికో దేశాలలో విద్యావ్యాప్తి పెరిగినా నైపుణ్యం లేని కార్మికుల డిమాండ్ పడిపోవటం వల్ల, దాని ప్రయోజనం కనిపించటం లేదు. ఇవన్నీ సర్వేలు నిర్ధారించిన అంశాలు వేతన వ్యత్యాసాలను నిర్ణయించేది విద్యాస్థాయి ఒక్కటే గాదు లేబర్ మార్కెట్ కూడా ఇందులో తన వంతు పాత్రను నిర్ణయించగలదని ఈ అనుభవం చాటుతున్నది.

వేతనార్జనకు పురుషుల కంటే స్త్రీలు తక్కువకాలం పనిచేస్తున్న మాట వాస్తవం. గృహ నిర్వహణకు స్త్రీలు వినియోగిస్తున్న కాల పరిమాణాన్ని కూడా కలిపి చూస్తే, పురుషుల కంటే ఎక్కువ కాలమే వీరు పనిచేస్తున్నట్లు రుజువవుతుంది వేతనార్జనకు వెళుతున్న మహిళలు పురుషుని కంటే ఎక్కువ కాలం పనిచేయటాన్ని మనం చూస్తూనే ఉన్నాం. రొఖ్ఖరూప వేతనార్జనకు స్త్రీ-పురుషులు వాడే కాల పరిమాణ భేదం వల్లనే, కుటుంబంలో పురుషుల ఆదాయం అధికంగా ఉండి, వారు "కుటుంబ పోషకులు"గా చలామణీ అవుతున్నారు. కుటుంబ వనరుల వినియోగ నిర్ణేతలుగా వారు వ్యవహరిస్తుంటారు. ఇందువల్ల ఇల్లాలు వారి పోషణలో, చెప్పుచేతలలో ఉండవలసిన మనిషిగా తయారైంది. తల్లి అనుభవిస్తున్న సంప్రదాయమే కూతుళ్ళకూ సంక్రమించటం సామాజిక న్యాయంగా చలామణీ అవుతున్నది. తరతరాలుగా స్త్రీలు కుటుంబంలోనూ, సమాజంలోనూ దిగువ స్థానాలలో

ఉండవలసి వస్తున్నది. దీని ప్రభావం కూడా, ఆధునిక సమాజంలోని లేబర్ మార్కెట్లో ప్రదర్శితమవుతున్న లింగ వివక్ష మీద కూడా ఉంటున్నది.

వర్తమాన సమాజంలో మాతృత్వసిద్ధే మహిళా జీవన సార్థకతకు లక్ష్యంగా వస్తున్నది. లోగడ మహిళా జీవిత కాల పరిమాణం తక్కువగా ఉండేది. వీలయినంత అధిక సంతానాన్ని పొందవలసి వచ్చేది. తాను ఆరోగ్యంగా ఉన్నంతకాలము కాన్పులకు, పిల్లల పోషణ, సంరక్షణ, గృహనిర్వహణ వంటి పనులకే ఆవిడ పరిమితమై ఉండేది. ఆనాటి జీవన వ్యవస్థకు ఆ రకమైన పని విభజన అనుకూలంగా ఉండి ఉండవచ్చు. ఇపుడు కాలం మారింది. ఆధునిక వైద్య చికిత్సా సదుపాయాలు, ఔషధాలు రావటం వల్ల ప్రజల జీవన కాల పరిమాణం పెరిగింది. ఆర్థిక పరిస్థితులు మారిపోతున్నాయి. ఇపుడు పరిమిత సంతానం ప్రయోజనకరమైనదిగా పరిగణనకు వస్తున్నది. కాన్పులకూ, పిల్లల పోషణ, పెంపకాలకు, మహిళ తన జీవిత కాలంలో కొద్ది భాగాన్ని వినియోగిస్తే సరిపోతున్నది. వెనుకటి వలె ఇంటికి కట్టివేసుకొని కూర్చొనవలసిన అవసరం లేదు. ఇపుడు ఆవిడ శ్రమ, సృజనాత్మక శక్తులు, జాతీయ సంపదోత్పత్తి పెంపుకు ఉపయోగపడటం వల్ల అధిక ప్రయోజనం సమాజానికి, కుటుంబానికి చేకూరుతుంది. కనుక ఆవిడ లేబర్ మార్కెట్‌కు రావలసిన అవసరం ఇపుడు అధికమైంది. కుటుంబంలో ఒక్కరి సంపాదనే చాలే రోజులు కూడా గతించాయి. ఇపుడు భార్యాభర్త లిద్దరూ సంపాదించవలసిన అవసరం కలిగింది. ఇందుకు అనుగుణంగానే లేబర్ మార్కెట్‌కు వచ్చే మహిళల సంఖ్య పెరుగుతున్నది.

అధిక సంఖ్యలో మహిళలు లేబర్ మార్కెట్‌కు వస్తూండటం ఆనందదాయకమే, కాని వారు పనిచేసే చోట్ల కార్మిక సంక్షేమం, భద్రతా పరిస్థితులు దిగజారటాన్ని చూచిన తర్వాత ఆ ఆనందం క్షణికమే అవుతున్నది. విపరీతమైన లింగ వివక్ష లేబర్ మార్కెట్లో విలయ తాండవం చేస్తున్నది. కొన్ని వృత్తులలో మహిళా ప్రవేశం నిషిద్ధం. పురుషునితో సమానమైన పనిని చేసినపుడు, వారితో సమానమైన వేతనం స్త్రీకి లభించటం లేదు. గృహ నిర్వహణనూ, వేతనార్జననూ సమన్వయీ కరించటానికి మహిళ ఎంతో ఆరాటపడుతుంది. ఎలాగో సమన్వయాన్ని సాధించి కుటుంబ పోషణ కోసం లేబర్ మార్కెట్‌కు వచ్చిన మహిళకు లభిస్తున్న 'సత్కారం' ఇది! లభించగల ఉపాధి అవకాశాలను స్త్రీలు ఉపయోగించుకోకుండా, ఆయా దేశాలలో నెలకొని యున్న సంస్కృతీ సంప్రదాయాలు అడ్డుపడుతున్నాయి. అభివృద్ధి చెందిన, వెనుక బడిన లేక అభివృద్ధి చెందుతున్న అన్న భేదం లేకుండా అన్ని సమాజాలలోనూ స్త్రీల ఉపాధి పరిస్థితులు దాదాపు ఇలాగే ఉన్నాయి.

దేశంలోని సంస్థల స్వభావాన్ని బట్టి కూడా పనిచేయగల గృహిణి పరిస్థితులు నిర్ణయమవుతాయి మహిళల పని పరిస్థితుల నాణ్యత, వారు పనిచేస్తున్నది ప్రభుత్వరంగ సంస్థలలోనా లేక ప్రైవేట్ రంగ సంస్థలలోనా, లేక సంఘటిత రంగంలోనా లేక అసంఘటిత రంగంలోనా అనే దానిని బట్టీ, నిర్ణీత దేశపు ఆర్థిక వ్యవస్థలో వివిధ రంగాల బలం ఎంతగా ఉన్నది అనే దానిని బట్టి ఉంటుంది. చేస్తున్న పని పూర్తి కాలపుదా, లేక పార్ట్‌టైమ్ పనా అనేదానిని బట్టి, పురుషులవలె నిరంతరాయంగా, దీర్ఘకాలిక సెలవులు అవసరం లేకుండా పనిచేయగలరా, మెటర్నిటీ లీవు వంటివి అవసరమవుతాయా అన్నవి కూడా మహిళా ఉపాధి పరిస్థితులను, వాటి నాణ్యతను నిర్ణయిస్తాయి. చదువు, తర్ఫీదుల వల్ల స్త్రీకున్న వృత్తి నైపుణ్యస్థాయి, లింగ వివక్షా పాటింపును నిరోధించగల ప్రభుత్వ శాసనాలు, పనిచేసే మహిళల సంక్షేమానికి ఏర్పాటు చేయవలసిన శిశు సంరక్షణా కేంద్రాల ఏర్పాటు వంటి వసతుల కల్పన, కార్మికుల హక్కులను రక్షించగల కార్మిక సంఘాలు, వాటిని బలపరచే రాజకీయ శక్తులుండటం వంటివి కూడా మహిళా ఉపాధి పరిస్థితులను ప్రభావితం చేస్తాయి.

### కొన్ని ప్రత్యేక రంగాలకే పరిమితమైన ఉపాధి

మహిళల ఉపాధి అతి తక్కువ కాలపు ఉద్యోగాలకే పరిమితం గావటం మరో విచారకరమైన అంశం. యనభయ్యవ దశాబ్దంలో, అభివృద్ధి చెందిన దేశాలలో పనిచేస్తున్న మహిళలలో నూరింట 75 నుండి 80 మంది వరకూ సర్వీసెస్ సెక్టార్లో ఉన్నారు. పదిహేను నుండి ఇరవై మంది వరకు మాత్రమే పారిశ్రామిక రంగంలో పనిచేస్తున్నారు. పారిశ్రామిక రంగంలో కూడా వస్త్ర పరిశ్రమ, పాదరక్షల పరిశ్రమ, తోళ్ళ పరిశ్రమ, ఆహార పదార్థాల ప్రొసెసింగ్ పరిశ్రమలలో మాత్రమే ప్రధానంగా

వీరు కేంద్రీకృతమైయున్నారు. కనుకే వీటికి "మహిళా" పరిశ్రమలుగా ముద్రలు పడ్డాయి! ఇంతవరకూ పురుషులకే పరిమితమైన కొన్ని రకాల ఉద్యోగాలలో కూడా మహిళల ప్రవేశం ప్రారంభమైంది ఇలా జరిగిన చోట్ల వీరు ప్రధానంగా గుమాస్తాలు గానూ, సర్వీసెస్ సెక్టారులోని కొన్ని రకాల ఉద్యోగాలలోనూ పనిచేస్తున్నారు

మాజీ కమ్యూనిస్టు దేశాలలో ఈ పరిస్థితి కొంచెం భిన్నంగా కనుపిస్తుంది మొత్తం పనిచేస్తున్న స్త్రీలలో దాదాపు సగం మంది సర్వీసెస్ సెక్టార్లో ఉన్నారు నూరింట ముప్పై మంది పారిశ్రామిక రంగంలోనూ, ఇరవైమంది వ్యవసాయ రంగంలోనూ పని చేస్తున్నారు. పారిశ్రామిక రంగంలో, అభివృద్ధి చెందిన దేశాలలో కంటే అధిక సంఖ్యాక మహిళలు పనిచేస్తూండటం ఇచ్చటి విశేషం. ఈ రంగంలోని మొత్తం పనివారిలో నూరింట నలభైమంది మహిళలున్నారు. "మహిళల" ఉద్యోగాలుగా ముద్రపడిన రంగం ఏదీ లేదు. కాని, వైద్యం, విద్యాబోధన రంగాలలో మహిళలు అధిక సంఖ్యలో ఉన్నారు. సమాజంలో ఈ వృత్తులకు అంత హోదాలేదు. పైగా వీరి వేతనాలు కూడా తక్కువగానే ఉంటాయి. ప్రైవెటీకరణ ప్రారంభమైన తర్వాత ఈ ప్రమాణాలు త్వరితగతిని మారుతున్నాయి. అభివృద్ధి చెందిన దేశాలలో కనుపిస్తున్న మోడల్‌కు ఇవి మారుతున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మహిళలలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయ రంగంలోనే పనిచేస్తున్నారు.

అభివృద్ధి చెందిన దేశాలలో మేనెజీరియల్, అడ్మినిస్ట్రేటివు పోస్టులలోనూ, టెక్నికల్ పోస్టులలోనూ, ప్రత్యేక వృత్తి నైపుణ్యం అవసరమైన ఉద్యోగాలలోనూ మహిళలు చేరటం కొంచెం పెరిగింది. ఇతర దేశాలలో ఈ సూచనలు స్పష్టంగా కనుపించటం లేదు. భారీ వ్యాపార సంస్థలలోనూ, ఇతర సంస్థల లోనూ, ప్రభుత్వ పాలనా యంత్రాంగంలోనూ ఉన్నత పదవులు మాత్రం మహిళలకు ఇంకా అందని మావిపండ్లుగానే ఉన్నాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో సంఘటిత రంగంలో పనిచేస్తున్న మహిళలలో అత్యధిక సంఖ్యాకులు కొన్ని రకాల పోస్టులకే పరిమితమైనారు. మధ్యతరగతికి చెందిన పోస్టులలో కూడా దిగువ స్థానాలలోనే వీరుంటున్నారు. ఉపాధ్యాయ, నర్సింగ్, క్లెరికల్ వృత్తులలో అధికులున్నారు. కొన్ని ఆసియా దేశాలలో మాత్రమే కొందరు మహిళలు మేనెజీరియల్ పోస్టులలో పనిచేయగలుగుతున్నారు. ఆఫ్రికాలో పరిస్థితి ఇంకా నాసిగా ఉన్నది ఇరవై యొక్క దేశాలలో ప్రభుత్వ పాలనా యంత్రాంగంలో మహిళలు బాధ్యతాయుతమైన స్థానాలలో ఒక్కరు కూడా లేరు!

లింగ వివక్షా తొలగింపుకు చాలా ప్రభుత్వాలు శాసనాలు చేశాయి. కొన్ని గట్టిగా అమలు పరచటానికి ప్రయత్నిస్తున్నాయి అయినా ఈ వివక్ష అంతరించటం లేదు. దాదాపు అన్ని దేశాలు మహిళా కార్మికులకు ప్రసూతి సెలవు ఇవ్వాలనీ, ఇతర వసతులు కల్పించాలని శాసనాలను చేశాయి. వీటి ఆదేశాల ప్రకారం,యజమానులు ఇవన్నీ చేస్తే వారి ఖర్చులు పెరుగుతాయి. ఇందువల్ల ఈ పెరుగుదలను నివారించటానికి యజమానులు, మహిళలకు ఇచ్చే వేతనాలను తగ్గిస్తున్నారు. లేదా వీరిని తీసుకోవటం మానేస్తున్నారు. కొన్ని సందర్భాలలో ఈ శాసనాల అమలును అతిక్రమించటానికి యజమానులు అనుచితమైన పద్ధతులకు పాల్పడుతున్నారు ఇటువంటి సందర్భాలను ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ కొన్నిటిని వెల్లడించింది. ఆస్ట్రియాలో మహిళా కార్మికులకు ప్రసూతి సెలవు మంజూరును ఎగవేయటానికి, మహిళా ఉద్యోగులను నియమిత కాలం పనిచేసే కాంట్రాక్టు కూలీలుగా పెట్టుకొంటున్నారు. కాన్పుకాలం దగ్గర పడగానే వారిని తొలగిస్తున్నారు.

బంగ్లాదేశ్‌లో యజమానులు ఈ దృష్టితోనే మహిళలను రోజు కూలీలుగా మాత్రమే తీసుకొంటున్నారు. లాటిన్ అమెరికా దేశాలలోని సంస్థల యజమానులు మరింత అమానుషమైన విధానాలకు పాల్పడుతున్నారు. తాము కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్స చేయించుకొన్నందుకు రుజువుగా మెడికల్ సర్టిఫికెట్టును తేవాలని మహిళా కార్మికులను నిర్బంధిస్తున్నారు. మరికొందరు అవివాహితులను మాత్రమే తీసుకొంటున్నారు.

ప్రభుత్వాలు ఎంత కట్టుదిట్టమైన చట్టాలను చేసినా, వాటి ఉల్లంఘనగా కనుపించకుండా, అవి అమలు జరుగకుండా చేయగల నేర్పూ, బలమూ యజమానుల కున్నాయి. ఇది జీవితం నిరూపించిన సత్యం. మహిళా కార్మికులకు రాజ్యాంగ బద్ధమైన హక్కుల నివ్వాలి; లభిస్తున్న

ఒకటవ పట్టిక

మాన్యుఫాక్చరింగ్ రంగంలో సగటు వేతనాలు : పురుషుల వేతనంలో స్త్రీలకు గిడుతున్న వేతన శాతం

| ప్రాంతము | 1970 | 1980 | 1990 | ప్రాంతము | 1970 | 1980 | 1990 |
|---|---|---|---|---|---|---|---|
| **అభివృద్ధి చెందిన దేశాలు** | | | | స్వీడన్ | 80 | 90 | 89 |
| ఆస్ట్రేలియా | 57 | 79 | 82 | స్విట్జర్లెండ్ | 65 | 66 | 68 |
| బెల్జియం | 68 | 70 | 76 | యునైటెడ్ కింగ్డం | 58 | 69 | 68 |
| జకస్లవాకియా | - | 68 | 68 | యునైటెడ్ స్టేట్స్ (అమెరికా) | - | - | 68 |
| డెన్మార్క్ | 74 | 86 | 85 | **ఆఫ్రికా** | | | |
| ఫిన్లెండ్ | 70 | 75 | 77 | ఈజిప్ట్ | 64 | 62 | 68 |
| ఫ్రాన్స్ | - | 77 | 79 | కీన్యా | - | 62 | 74 |
| పశ్చిమ జర్మనీ | 70 | 73 | 73 | స్వాజీలాండ్ | - | 55 | 54 |
| గ్రీస్ | 68 | 68 | 76 | జాంబియా- | - | - | 73 |
| హంగరీ | - | - | 72 | **లాటిన్ అమెరికా, కరిబియన్** | | | |
| ఐర్లాండ్ | 56 | 69 | 69 | కోస్టారికా | - | 70 | 74 |
| ఇటలీ | - | 83 | - | ఎల్ సాల్వెడార్ | 82 | 81 | 94 |
| జపాన్ | - | 44 | 41 | పెరాగ్వే | - | 79 | 66 |
| లెగ్జింబర్గ్ | 51 | 61 | 65 | **ఆసియా, పసిఫిక్** | | | |
| నెదర్లాండ్స్ | 72 | 80 | 77 | గ్వామ్ | - | 50 | 51 |
| న్యూజిలెండ్ | - | 71 | 75 | హాంకాంగ్ | - | 78 | 69 |
| నార్వే | 75 | 82 | 86 | దక్షిణ కొరియా | - | 45 | 50 |
| పోర్చుగల్ | - | - | 72 | మయన్మార్ | 84 | 86 | 97 |
| స్పెయిన్ | - | - | 72 | సింగపూర్ | - | - | 55 |
| | | | | శ్రీలంక | - | 75 | 88 |

ఈ పట్టికలో పేర్కొన్న 35 దేశాలలోనూ ఏ ఒక్క దేశంలోకూడా, పురుషునితో సమానమైన వేతనం, మాన్యుఫ్యాక్చరింగ్ పరిశ్రమలో స్త్రీలకు లభించటం లేదు ఒక్క ఐదు దేశాలలో మాత్రం, పురుషుని వేతనంలో నూరింట 60 వంతుల మేరకు స్త్రీలకు లభించటం కనుపిస్తున్నది. అభివృద్ధిచెందిన దేశాల వర్గీకరణ కిందకు వచ్చే నార్డిక్ దేశాలలోనూ, ఇటలీ, ఆస్ట్రేలియా దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న వర్గానికి చెందిన దేశాలలో ఎల్ సాల్వెడార్, మయన్మార్, శ్రీలంకలలో మాత్రమే, పురుషుని వేతనంలో 80 శాతానికి మించి స్త్రీకి లభిస్తున్నది. జపాన్ అభివృద్ధి చెందిన దేశమే అయినా, ఆ దేశంలో ఏ దేశంలో లేనంత తక్కువ వేతనం స్త్రీలకు లభిస్తున్నది. 1980వ సంవత్సరంలో పురుషుని వేతనంలో 44 శాతం మేరకు స్త్రీలకి లభిస్తూండేది. 1990 వ సంవత్సరానికి స్త్రీ వేతన శాతం పెరుగక పోగా 41 శాతానికి తగ్గింది! హాంకాంగ్, నెదర్లెండ్స్‌లో కూడా స్త్రీల వేతనశాతపు తగ్గుదల కనిపిస్తుంది.

అభివృద్ధి చెందిన వర్గానికి చెందిన చాలా దేశాలలోనూ 1960, 1970 వ సంవత్సరాల నుండి, పురుషునితో సమానమైన వేతనం స్త్రీలకు లభించాలని శాసనాదేశాలున్నా, ఇప్పటికీ స్త్రీ పురుష వేతన వ్యత్యాసాలు ఆ దేశాలలో సమసిపోలేదు; పైగా అవి అధికంగానే ఉన్నాయి.

- *"ది వరల్డ్స్ ఉమెన్ 1995" నుండి*

హక్కు లేమిటో మహిళా కార్మికులకు తెలియజెప్పాలి. ప్రభుత్వము, కోర్టులు, ట్రేడ్ యూనియన్లు చట్టాలు అమలు జరిగేట్లు సమన్వయంతో కృషి చేయాలి అపుడే మహిళా కార్మికులు శాసన బద్ధమైన రక్షణను పొందగలుగుతారు. ఉపాధి రంగంలో వారికి పురుషులతో సమానమైన స్థానం లభిస్తుంది

## వేతన వ్యత్యాసాలు

"కన్వెన్షన్ ఆన్ ది ఎలిమినేషన్ ఆఫ్ ఆల్ ఫార్మ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ ఎగైన్స్ట్ ఉమెన్" అనే పత్రం ఐక్యరాజ్య సమితి ఆమోదాన్ని పొంది ఇరవయ్యేండ్లు దాటిపోయింది (డిశంబరు 18వ తేదీ, 1979). అంతకు పూర్వం నుండి కూడా చాలా ప్రభుత్వాలు - ముఖ్యంగా కమ్యూనిస్టు ప్రభుత్వాలు, వేతన వ్యత్యాసాల తొలగింపుకు కృషిచేస్తున్నాయి. కమ్యూనిస్టు దేశాలు స్త్రీ పురుషుల సమాన వేతనాలను రాజ్యాంగ బద్ధమైన హక్కుగా ప్రకటించాయి మహిళలు సమాజానికి ఇస్తున్న శ్రమకు తగినట్లుగా వారికి వేతనాలు లభించటం లేదు. లేబర్ మార్కెట్లో వీరికున్న బలహీనతలకు తోడు, అల్పసంఖ్యాక వృత్తులలో అత్యధిక సంఖ్యాకుల కేంద్రీకరణ, తక్కువస్థాయి ఉద్యోగాలు, ఒకే వృత్తిలో గాక దొరికిన పనినల్లా చేయవలసి రావటం, ఓవర్ టైం చేసే అవకాశాలు లేక పోవటం, రాత్రి వేళల పని చేయటం, షిఫ్టు పనులలో స్త్రీల నియామకం నిషిద్ధం గావటం వంటి పలు ఆంక్షలు, మహిళలకు లభించే వేతనాల తగ్గింపుకు తోడ్పడుతున్నాయి. స్త్రీ పురుష వేతన వ్యత్యాసాల పెంపుకు కూడా ఇవి కారణమవుతున్నాయి. పైన వివరించినట్లు వేతన వ్యత్యాసాలకు ఇవి మాత్రమే కారణాలుకాదు; బుద్ధిపూర్వకంగా అమలు జరుగుతున్న లింగ వివక్షే ఇందుకు ప్రధాన కారణమన్న అంశాన్ని ఇంతకు ముందే వివరించాం. "ఉత్పత్తి స్వభావాన్నీ, వృత్తి వైవిధ్యాన్నీ, ఇతర భేదాలను పరిగణనలోనికి తీసుకొన్నా, కారణాలను చూపటానికి వీలులేని వేతన వ్యత్యాస పరిమాణం మిగిలే ఉంటున్నది" అని ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ నిపుణులు యం. గాండర్ వెల్లడించారు. వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995 (ప్రపంచబ్యాంకు "వర్కర్స్ ఇన్ ఏన్ ఇంటెగ్రేటింగ్ వరల్డ్" అన్న అంశం మీద ప్రచురించిన సంపుటం) ఇదే అంశాన్నిలా వివరించింది · "స్త్రీ పురుష కార్మికుల విద్యాస్థాయి, వృత్తి నైపుణ్యము, అనుభవం వంటి వ్యత్యాసాలను పరిగణించినా, ఇతర అంశాలలో స్త్రీ-పురుషులు సమంగా ఉన్నా, స్త్రీ పురుష వేతన వ్యత్యాసం పలు దేశాలలో అధికంగానే ఉంటున్నది. భారతదేశంలో పురుషునికి లభించే వేతనంలో 57 శాతం మాత్రమే మహిళలకు గిడుతున్నది వేతనంలో 34 శాతం మేరకు మాత్రమే పైన పేర్కొన్న భేదాల వల్ల తగ్గవలసి ఉంటుంది కీన్యాలో స్త్రీ పురుషుల మధ్యనున్న భేదాలను కూడా పరిగణనలోనికి తీసుకొన్నా, వారివేతనంలో 18 శాతపు వ్యత్యాసం మాత్రమే ఉండాలి లాటిన్ అమెరికాలో స్త్రీ-పురుష వేతన వ్యత్యాసం 71 శాతం వరకూ ఉన్నది. ఇందులో ఇరవై అయిదు శాతం మేరకు మాత్రమే వారి శక్తి సామర్థ్యాల భేదం దృష్ట్యా తగ్గవలసి ఉంటుంది."

ఈ అధ్యాయంలో ఇచ్చిన ఒకటవ పట్టికను పరిశీలిస్తే, అభివృద్ధి చెందిన దేశాలలోనే స్త్రీ పురుష వేతన వ్యత్యాసం ఎంతగా ఉన్నదో బోధపడుతుంది. ఇటీవల యునైటెడ్ కింగ్డంలో ప్రకటితమైన అంచనాల ప్రకారం ఎగ్జిక్యూటివు పోస్టుల స్థాయిలో స్త్రీ పురుష వేతన వ్యత్యాసం తగ్గినా, ఇంకా పై పోస్టులలో ఇది రాజ్యమేలుతున్నదని తెలుతున్నది. లండన్ లోని ఫైనాన్షియల్ టైమ్ ప్రకటించిన రిపోర్టు ప్రకారం (జూలై 25, 1994) ప్రారంభ సగటు వేతనంలోనే, డాక్టరు పోస్టులలో స్త్రీ-పురుష వేతన వ్యత్యాసం 23 శాతం, సెక్షన్ హెడ్స్ పోస్టుల లోనివారికి 10.2 శాతం, డిపార్ట్‌మెంట్ హెడ్స్ పోస్టులలో తొమ్మిది శాతం ఉన్నది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని, ఎక్స్‌పోర్టు ప్రోసెసింగ్ జోన్స్‌లో ఈ వేతన వ్యత్యాసం విలయ తాండవం చేస్తున్నది. ఎగుమతుల పెంపుకు తగినట్లు ఆర్థిక వ్యవస్థను మరలించిన దేశాలలో కూడా ఇదే స్థాయిలో కనుపిస్తున్నది. ఎకనామిక్ కమిషన్ ఫర్ లాటిన్ అమెరికా సమాచారం ప్రకారం పురుషునికిచ్చే వేతనంలో స్త్రీకి 44 నుండి 77 శాతం మేరకే లభిస్తున్నది. ఇక ఆసియా దేశాల స్థితిని చూద్దాం. 1990-91 సంవత్సరపు అంచనాల ప్రకారం, పారిశ్రామికోత్పత్తి రంగంలో, పురుషుని వేతనంలో 80 శాతం మాత్రమే మహిళకు లభిస్తున్నది. హాంకాంగ్‌లో 70 శాతం, సింగపూర్‌లో 56 శాతం, దక్షిణ కొరియాలో 51 శాతం, జపాన్‌లో 43 శాతం, మాత్రమే మహిళా కార్మికులకు గిడుతున్నది. ఇండ్ల దగ్గర చేసే కాంట్రాక్టు పనులలో కూడా వేతన వ్యత్యాసం

కనుపిస్తున్నది. అసంఘటిత రంగం సంగతి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. ఇచ్చట పురుషుల వేతనాల కన్న స్త్రీల వేతనాలుమరీ తక్కువగా ఉంటాయి. ఈ వేతన వ్యత్యాసాలు కూడా పేదరికపు పెంపుకు తోడ్పడుతున్నాయి.

## వేతన వ్యత్యాసాల తొలగింపులో ప్రభుత్వ పాత్ర

లేబర్ మార్కెట్లో స్త్రీ-పురుష వేతన వ్యత్యాసాలకు రెండు కారణాలున్నట్లు, ప్రపంచ బ్యాంకు ప్రచురించిన 1995వ సంవత్సరపు వరల్డ్ డెవలప్మెంట్ రిపోర్టు పేర్కొన్నది. అవిః
1. స్త్రీలలో అధిక సంఖ్యాకులకు విద్యార్జనా స్థాయి, వృత్తి విద్యానైపుణ్యం పురుషులకంటే తక్కువగా ఉంటున్నది. సమాజంలో వారు అనుభవిస్తున్న లింగపరమైన వివక్షవల్ల వారికీ గతి పట్టింది. ఇందువల్ల లేబర్ మార్కెట్లో విలువ పలికే శక్తియుక్తులు అసంఖ్యాక మహిళలకు ఉండటం లేదు.
2. స్త్రీలకుఉపాధి లభించగల పరిధి కూడా చాలా తక్కువగా ఉన్నది. వీరితో సమానమైన విద్యాస్థాయి, వృత్తి నైపుణ్యము గల పురుషులు కొరత లేకుండా లభించగల అవకాశాలున్నపుడు, స్త్రీలకు ఉపాధి అవకాశాలు తగ్గుతున్నాయి. ఇందుకు ఉదాహరణగా ఈక్వెడార్, జమైకా, ఫిలిపీన్స్ దేశాలలో ఒకే రకపు విద్యాస్థాయి, వృత్తి నైపుణ్యము గల స్త్రీ పురుషులు, ఒకే రకమైన వృత్తులలో నున్నపుడు స్త్రీలకు లభిస్తున్న వేతనం పురుషులకంటే ఇరవైనుండి ముప్ఫైశాతం వరకూ తక్కువగా ఉండటాన్ని ఈ రిపోర్టు ఉదహరించింది. అంతేకాదు, పురుషుల పనితో పోల్చితే, స్త్రీలకు పురుషుల కంటే అధిక వేతనం గిట్టవలసి ఉంటుందని కూడా రిపోర్టు పేర్కొన్నది.

లేబర్ మార్కెట్, సరుకుల నమ్మే మార్కెట్ వంటిది గాదు. ఈ మార్కెట్ నిర్ణయించే వేతనము, అది ఇవ్వగల పని పరిస్థితులు కార్మికుల, ఉద్యోగుల జీవితాన్నే గాదు, వారి కుటుంబ జీవనాన్ని కూడా ప్రభావితం చేస్తుంది. ఇందుచేతనే, దాదాపు అన్ని దేశాలలోనూ, ప్రభుత్వాలు లేబర్ మార్కెట్ను రెగ్యులేట్ చేయటానికి కొన్ని చర్యలను తీసుకొంటున్నాయి. కనీస వేతన చట్టాలు, పనిచేసే స్త్రీల శ్రేయోరక్షణకు అవసరమైన చట్టాల రాక ఈ పరిణామ ఫలితమే. కొన్ని చట్టాలు కార్మికుల, ఉద్యోగుల రక్షణకు అవతరిస్తే, మరికొన్ని నియమిత పద్ధతిలో లేబర్ మార్కెట్ నడవటానికి తోడ్పడుతున్నాయి. ఈ చట్టాలన్నీ, లక్ష్య శుద్ధిని సాధించాయని చెప్పటానికి వీలులేదు. కొన్ని చట్టాలు, ఉద్యోగులు, కార్మికులలో తక్కువ వేతనాలను పొందుతున్న వారి రక్షణకు నిలుస్తున్నాయి! కొన్ని చట్టాలు బలహీనుల ఉపాధి పరిధి తగ్గింపుకు ఉపకరిస్తున్నాయి! ఇలాంటి పరిణామాలు మాజీ కమ్యూనిస్టు దేశాల ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కాలంలో కనుపిస్తున్నాయి. అభివృద్ధి చెందుతున్న పలు దేశాలలో, ప్రభుత్వ బలహీనతవల్ల, ఆదర్శప్రాయమైన చట్టాలున్నా, అవి సక్రమంగా అమలు జరగటం లేదు. ఈ లోప నిర్ధారణను చేసింది కూడా పైన పేర్కొన్న వరల్డ్ డెవలప్మెంట్ రిపోర్టే.

ప్రభుత్వాలు ఎలాగూ సక్రమంగా ఉద్యోగుల సంక్షేమాన్ని రక్షించలేక పోతున్నాయి. దేశపు ఆర్థికాభివృద్ధి పుంజుకొంటే ఈ అసమానతలు అంతరిస్తాయని, అపుడు లేబర్ మార్కెట్లోని స్త్రీల పరిస్థితి మెరుగుబడుతుందనీ ఆశిస్తున్న వారూ చాలామంది ఉన్నారు. అభివృద్ధి చెందిన దేశాల అనుభవాన్ని చూస్తే, దాదాపు రెండు శతాబ్దాల కాలం స్త్రీపురుష వేతన వ్యత్యాసాలు స్థిరంగా ఉన్నట్లు కనుపిస్తాయి; ఈ రెండు వందల సంవత్సరాలలోనూ ఏమాత్రము తగ్గలేదు గత ముప్ఫై సంవత్సరాల నుండి, ఈ వ్యత్యాసాలు కొంత మేరకు తగ్గుతూండటం కనుపిస్తున్నది.

పరిశ్రమలు అభివృద్ధవుతున్న కొలదీ, ఆర్థికాభివృద్ధి జరుగుతున్న కొలదీ, గ్రామీణ ప్రాంతాలలోని వ్యవసాయ వృత్తులలోని వారూ ఉదరపోషణకు పట్టణాలకు వలస పోవటం పెరిగిపోతున్నది. ఈ మార్పు వల్ల కూడా స్త్రీల పరిస్థితి మెరుగుపడలేదు. వేతన వ్యత్యాసాలు కొద్దిగా తగ్గినా, లేబర్ మార్కెట్ల వివక్షా విధానాల నుండి మాత్రం వారికి విముక్తి లభించలేదు; వివక్షాబలం ఏమాత్రం సన్నగిల్లలేదు.

ఈ దురదృష్టకర పరిస్థితుల సృష్టికి పలు కారణాలున్నాయి. వీటిలో ముఖ్యంగా మూడింటి నిచట పేర్కొంటాము : 1. తరతరాలుగా సమాజంలో పురుషాధిపత్యం చలామణీలో ఉండటం. ఈ పురుషాధిక్యతా ప్రభావమే ఉపాధిని స్త్రీ స్వీకరించాలా వద్దా అనే అంశాన్ని నిర్ణయిస్తుంది. స్త్రీని ఇంటి వద్ద ఉంచినా, ఉద్యోగానికి పంపినా, దాని కర్త వారి భర్తే గదా? 2. పురుషుని కంటే స్త్రీ తక్కువదన్న తరతరాలుగా వస్తున్న భావం మన రక్తంలో జీర్ణించి పోయింది. ఈ భావం మన సంస్కృతిలో భాగమైంది. ఈ భావమే

పురుషుల ఆలోచనలను, చేతలను ప్రభావితం చేస్తున్నది. 3 కొన్ని రకాల వ్యాపార, పారిశ్రామిక సంస్థాగత పరిస్థితులు, ప్రభుత్వాల శాసనాలు మహిళల ఉపాధి పరిధిని బాగా తగ్గిస్తున్నాయి. స్త్రీలను కొన్ని "ప్రమాదకర" పని వాతావరణాలలో పనిచేయనీయగూడదన్న ప్రభుత్వ "పితృవాత్సల్య భావనా" ప్రదర్శన కూడా కొంతమేరకు కారణమవుతున్నట్లు ఇంతకు పూర్వమే చూచాం!

ఈ లోపాలను తొలగించి, లేబర్ మార్కెట్లో స్త్రీల స్థానాన్ని బలపరచటానికి అవసరమైన ప్రయత్నాలు జరుగకపోతే, స్త్రీ విద్యావ్యాప్తి దెబ్బతింటుంది. స్త్రీ విద్య విషవలయంలో చిక్కుకు పోతుంది. వారి విద్యార్జనా పెట్టుబడులకు తగినంత రాబడి స్త్రీల వల్ల లభించటం లేదుకనుక, తల్లిదండ్రులు ఆడపిల్లలను చదివించటానికి వెనుకాడతారు. చదువురాని తల్లి, తన బిడ్డను కూడా చదివించటానికి ఆసక్తిని ప్రదర్శించదు. ఈ విధంగా విషవలయ సృష్టి జరుగుతుంది. ఈ విషవలయ విచ్ఛేదం అంత సులభమైన పనిగాదు. కాని దాన్ని ఛేదించకపోతే స్త్రీ జనోద్ధరణ పురోగమించదు. మహిళా ఉద్యోగులకు వేతనంతో ప్రసూతి సెలవును ఇవ్వటానికి, శిశు సంరక్షణా వసతుల కల్పనకూ అదనపు సొమ్ము ఖర్చుచేయవలసి ఉంటుంది గనుక, యజమానులు స్త్రీలను ఉద్యోగాలకు తీసుకోవటానికి వెనుకాడటం సహజం. వారీ ధోరణిని విడనాడాలి. ప్రభుత్వం కలుగజేసుకొని చట్టబద్ధమైన రక్షణలను మహిళా ఉద్యోగులకు కల్పించాలి.

లేబర్ మార్కెట్లో యజమానులు, ఉద్యోగుల శక్తుల పరిమాణంలో తేడాలున్నపుడు, వివక్షా ప్రదర్శన జరుగుతున్నపుడూ, తగినంత సమాచారం ఉద్యోగులకు గాని, యజమానులకు గాని లభించనపుడు, ఉద్యోగులకు ప్రమాదాల నుండి రక్షణ లభించనపుడూ ప్రభుత్వాలు జోక్యం కలిగించుకోవాలని వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు- 1995 సూచిస్తూ ప్రభుత్వాలకు దిగువ సలహాల నిచ్చింది :

"పైన పేర్కొన్న నాలుగు అంశాలు సిబ్బంది సామర్థ్యాన్ని సమానత్వాన్నీ ప్రభావితం చేస్తాయి. యజమానులు, ఉద్యోగుల శక్తుల మధ్య తేడాలున్నపుడు యజమానుల కంటే ఉద్యోగులు బలహీనమైన స్థానంలో ఉంటారు. ఇందువల్ల తమకు జరుగుతున్న అన్యాయాల నుండి ఉద్యోగులు రక్షణను పొందలేరు ఆ సంస్థలో పనిచేయటానికి తగిన వృత్తి నైపుణ్య సాధనకు వారు తగినంత ఉత్సాహాన్ని ప్రదర్శించరు. సమాజంలో శక్తిహీనులుగా నోటిలో నాలుక లేనివారుగా మనుతున్న స్త్రీలు, పిల్లలు, దళిత వర్గాల వారూ, కొన్ని మతాల వారూ పైన పేర్కొన్న మార్కెట్లోని శక్తి అసమానతల వల్ల అధికంగా నష్టపోతారు. వివక్షతా ప్రదర్శనవల్ల లభించగల ఫలితాలు కూడా నాసిగానే ఉంటాయి. వాటి పంపకంలో ఎలాగూ సమానత్వం ఉండదు. ఇందువల్ల దేశ ఆర్థికాభివృద్ధికి లభించవలసిన స్త్రీల, వెనుక బడిన తరగతుల వారి కృషి పరిమితంగానే ఉంటుంది ."

ప్రభుత్వాలేగాదు, పారిశ్రామిక, వ్యాపార సంస్థల యజమానులుకూడా గమనించవలసిన అంశమిది.

### కార్మిక సంక్షేమం : ట్రేడ్ యూనియన్లు

ఇంతవరకూ అమలు జరుగుతున్న సంక్షేమ కార్యక్రమాలు పురుషులను పోషకులుగానూ, వారి సతీమణులను "భరింపబడుతున్న" ఇల్లాండ్రుగానూ పరిగణిస్తున్నాయి. ఇపుడు మహిళలు కూడా అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్‌కు వస్తూండటం చేత ఈ దృష్టి అనుసరణీయం గాకుండా ఉన్నది. ఇపుడు స్త్రీ, పురుషులిద్దరకూ సమంగా వర్తించే సాంఘిక సంక్షేమ విధానం అవసరం.

అభివృద్ధి చెందిన దేశాలలో వేతన ప్రాతిపదిక మీద సాంఘిక భద్రతా కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి ఇలాంటి సౌకర్యాలన్నిటినీ అనుభవించే అవకాశం మహిళలకు ఉండటం లేదు. కాన్పుకోసం మహిళా కార్మికులు సెలవు పెట్టినపుడు, ఆ కాలానికి వారికి వేతనం లభించదు. ఒక్కొక్కసారి ఆమె ఉద్యోగానికి కూడా భద్రత ఉండదు. పార్ట్‌టైం కార్మికులకు సాంఘిక భద్రత అనేది ఉండదు. ఉన్నచోట్ల దానివల్ల వారికి లభించే సదుపాయం నామమాత్రం గానే ఉంటుంది. మగవారికంటే మహిళలు అధికకాలం నిరుద్యోగులుగా ఉండే అవకాశాలున్నాయి. పైగా వారి వేతనాలు కూడా మగవారి వేతనాల కంటే తక్కువగానే ఉంటాయి. ఇందువల్ల కూడా వారికి లభించే సాంఘిక భద్రత కూడా తక్కువగా ఉంటుంది. కనుక మహిళలకు కూడా పురుషులతో సమానమైన సాంఘిక భద్రతను కల్పించాలంటే, ప్రభుత్వం ఈ విషయంలో విప్లవాత్మకమైన విధానాలను

అవలంబించవలసి ఉంటుంది. కావాలని అమలు చేస్తున్న లింగ వివక్షను అధిగమించటానికే కాకుండా పరోక్షమైన వివక్షను కూడా మహిళ అధిగమించటానికి ప్రభుత్వం తోడ్పడాలి.

మాజీ కమ్యూనిస్టు దేశాలు తమ ప్రజలకు ఆదర్శప్రాయమైన సాంఘిక భద్రతను అమలు జరుపుతూండేవి. ఆ ప్రభుత్వాలు కూలిపోయిన తర్వాత ఆ భద్రతా విధానం కూడా కూలిపోయింది. కుటుంబ బాధ్యతల నిర్వహణతో, వేతనార్జనా వృత్తి జీవనాన్ని అనుసంధించే విధంగా ఆ దేశాలలో సాంఘిక భద్రతా విధానాన్ని కమ్యూనిస్టు ప్రభుత్వాలు రూపొందించాయి. ఇలాంటి వ్యవస్థ కూలిపోవటం, నిరుద్యోగం ప్రబలటంతో పురుషులకంటే మహిళలు అధికంగా బాధపడుతున్నారు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో సాంఘిక భద్రతా కార్యక్రమాలు ప్రధానంగా ప్రభుత్వ రంగంలోనే అమలు జరుగుతున్నాయి. సాంఘిక భద్రతా కార్యక్రమాలను బలపరచటమే గాకుండా విస్తరించవలసిన అవసరాన్ని కూడా కొన్ని దేశాలప్రభుత్వాలు గుర్తించాయి. కాని ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, ఎగుమతి ప్రోత్సాహక ఉత్పత్తి విధానం వంటి వాటిని చేపట్టవలసి రావటంతో, నూతన భద్రతా కార్యక్రమాలను ప్రవేశపెట్టటం గాలికి పోయింది. ఉన్న కార్యక్రమాలే నామమాత్రమైనాయి. బడ్జెట్ ఖర్చులను తగ్గించుకోవాలనీ, బడ్జెట్ లోటును పూడ్చాలనీ, సబ్సిడీలను తగ్గించాలనీ ప్రపంచ బ్యాంకు, ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ వత్తిడి చేస్తుండటం చేత, సాంఘిక సంక్షేమ కార్యక్రమ ఖర్చులకు ప్రభుత్వాలు కోతలు పెడుతున్నాయి. ఇంతవరకూ వీటి ఫలితాలను అనుభవిస్తున్న వారు ఇపుడు ఇబ్బందులకు గురిగావలసి వస్తున్నది. స్వయంఉపాధిలో నున్నవారు అసంఘటితరంగ కార్మికులు, సర్వీసెస్‌లో ఉన్నవారూ ఇలాంటి సంక్షేమ కార్యక్రమాలకు ఇంతకు ముందే నోచుకోలేదు.

పారిశ్రామిక రంగంలో పనిచేస్తున్న మహిళల శిశు సంరక్షణావసరాన్ని గురించి, చాలా కాలంగా పలు సంస్థలు ఆందోళన చేస్తున్నాయి. అతి తక్కువ మంది యజమానులు ఈ సౌకర్యాలను కలుగజేస్తున్నారు. అధికులు ఎగవేస్తున్నారు. కుటుంబంలో భర్త ప్రవర్తనలో ప్రధానమైన మార్పులు మాత్రం రాలేదు. భర్తతో సమంగా భార్య వేతనార్జనకు పనిచేస్తున్నా, ఇంటి పనిభారంలో ఆవగింజంత కూడా పంచుకొని మగరాయుళ్ళకు నేటికీ కొదువలేదు. పైగా పని నుండి ఇంటికి రాగానే కాఫీ-ఫలహారాలను క్షణాలమీద అందించలేదని భార్యలను సాధించే ఘనులూ ఉన్నారు ఆవిడా తనవలె అలసిపోయి, ఆకలిగొని ఉంటుందన్న విషయం వారికి తోచదు!(?) వేతనార్జనా పరురాలుగా స్త్రీ అనుభవిస్తున్న బాధలలో ఇదొకటి.

లేబర్ మార్కెట్‌కు వస్తున్న మహిళల సంఖ్య పెరుగుతున్నా, ఈ సంఖ్య పెరుగుదలకు దీటుగా, వారి ట్రేడ్ యూనియన్ సభ్యత్వం పెరగటం లేదు. ట్రేడ్ యూనియన్లు ఉన్నచోట్ల, అవి వారి సమస్యలకు తగినట్లుగా ప్రతిస్పందించలేక పోతున్నాయి.

ట్రేడ్ యూనియన్ సభ్యత్వం అన్ని యూరపు దేశాలలోనూ ఒకే విధంగా లేదు. స్విట్జర్లండులో పదమూడు శాతం మంది మహిళలకు ట్రేడ్ యూనియన్ సభ్యత్వం ఉన్నది. స్వీడన్‌లో 51 శాతం వరకూ మహిళా సభ్యత్వం ఉన్నది. ఆఫ్రికాలో మహిళా ట్రేడ్ యూనియన్ సభ్యత్వం ముప్పైశాతం వరకూ ఉన్నది. అమెరికాలో 37 శాతం వరకూ, కెనడాలో 39 శాతం వరకూ మహిళా ట్రేడ్ యూనియన్ సభ్యత్వం ఉంటుంది. ఈ రెండు దేశాలలో "మహిళా" పరిశ్రమలుగా రూపొందిన వస్త్ర పరిశ్రమ, దుస్తుల తయారీ పరిశ్రమలలో మహిళా ట్రేడ్ యూనియన్ సభ్యత్వం ఇంతకు రెట్టింపు ఉంటుంది. మోటారు వాహనాలు, ఉక్కు పరిశ్రమలలో దీనిలో సగం మేరకు మాత్రమే మహిళా సభ్యత్వం ఉంటుంది.

ట్రేడ్ యూనియన్లలో మహిళా నాయకత్వం నామ మాత్రంగానే ఉన్నది. నాయకత్వ స్థానాలకు మహిళలు, వారి సభ్యత్వ సంఖ్యా బలానికి తగినంత మంది రావటం లేదు. అసంఘటిత రంగ కార్మికులను, ఇవి తమ యూనియన్ల కిందకు తీసుకురాలేక పోతున్నాయి. యజమానులు - కార్మిక ప్రతినిధుల సంప్రదింపులు జరిగే సందర్భాలలో కూడా, ఆ సంప్రదింపులకు వెళ్ళే ట్రేడ్ యూనియన్ ప్రతినిధి వర్గంలో పురుషుల తోడి సమానమైన స్థానం స్త్రీలకు లభించటం లేదు. మహిళలలో అధిక సంఖ్యాకులు పనిచేస్తున్న అసంఘటిత రంగంలోనూ, గ్రామీణ ప్రాంతాలలోనూ

పనిచేసేవారిని ట్రేడ్ యూనియన్‌లో సంఘటిత పరచే కృషి పటుతరంగా ఉండటం లేదు ఇంటి పనివారు గానూ, కాంట్రాక్టు కూలీలుగాను, హోంవర్కర్లుగాను పని చేస్తున్న స్త్రీలకు ట్రేడ్ యూనియన్లు ఇంకా దూరంగానే ఉంటున్నాయి ఈ వర్గాల మహిళా కార్మికులను ట్రేడ్ యూనియన్లలో సంఘటిత పరచినపుడే వారికి రక్షణ లభిస్తుంది లేబర్ మార్కెట్లో వారి స్థితి కొంతమేరకైనా బలపడుతుంది.

లేబర్ మార్కెట్లో స్త్రీలు అనుభవిస్తున్న లింగ వివక్షా రూపాలను, దాని దుష్ఫలితాలనూ చూచాం పరిపాలనలో ఉన్నత పదవుల లభ్యతా విషయంలోనూ, రాజకీయ, మీడియా రంగాలలోనూ ఈ లింగ వివక్షా ఫలితంగా స్త్రీలు అనుభవించ వలసి వస్తున్న నష్ట రూపాలనూ వాటి పరిమాణాలనూ వరుసగా పరిశీలించుదాం

# 12

## స్త్రీలకు నిర్ణయాత్మక పాత్ర లేని ఆర్థిక విధాన రూపకల్పన

ప్రభుత్వ యంత్రాంగంలో గాని, కార్పొరేట్ సెక్టార్లో గాని ఆర్థిక విధానాలను రూపొందించేవారు, ఆయా రంగాల ఆర్థిక వ్యవస్థ యొక్క పరిస్థితుల నిర్ణేతలుగా ఉంటారు. వర్తమాన కాలానికి తగిన, లేక భవిష్యత్తులో అమలు జరుగదగిన విధానాలను ఈ రంగంలోని కీలక పదవులలో ఉండే వ్యక్తులు నిర్ణయిస్తారు. ఇటువంటి విధానాల స్వభావము, లక్ష్య నిర్ణయం, వాటిని రూపొందించటంలో స్త్రీలు, పురుషులు నిర్వహించిన పాత్రను బట్టి ఉంటాయి. జాతీయ ఆర్థిక వ్యవస్థలో స్త్రీల పాత్రాపరిధి పెరుగుతూండటాన్ని చూస్తున్నాం; దారిద్ర్యపు తొలగింపులో వారు నిర్వహించగల పాత్రకు పరిగణన లభిస్తున్నది. ఉన్నత విద్యను, వృత్తి విద్యను ఆర్జించే స్త్రీల సంఖ్య పెరగటాన్ని మనం చూస్తున్నాం. వారి సృజనాత్మక శక్తుల పెరుగుదల, ఆర్థిక వ్యవస్థ మీద దాని ప్రభావం కనుపిస్తూనే ఉన్నది. అయినప్పటికీ, ఆర్థిక విధానాల రూపకల్పనలో వారికి నిర్ణయాత్మక పాత్ర లభించటం లేదు. గత ఇరవై-ఇరవయ్యైదు సంవత్సరాల కాలంలో లేబర్ ఫోర్సులోనికి వస్తున్న స్త్రీల సంఖ్యా పరిమాణం పెరుగుతున్నది, పలు రంగాలకు వీరి సేవలు విస్తరిస్తున్నాయి. వృత్తి విద్యార్జనకు విద్యాలయాలలో చేరుతున్న స్త్రీల సంఖ్య దాదాపు పురుషుల సంఖ్యా పరిమాణానికి అతి సమీపంలో ఉంటున్నది, పలు వృత్తులలో వీరు ప్రవేశించటాన్ని చూస్తున్నాం. స్త్రీల సృజనాత్మక శక్తుల పెంపుదలలో ఇంతటి అభివృద్ధి కనుపిస్తున్నా, ఆర్థిక విధానాల నిర్ణయాలలో వారికి ఇప్పటికీ నామమాత్రపు పాత్ర కూడా లభించటం లేదనే చెప్పవలసి ఉన్నది, ఇలాంటి కీలక పదవులు వారి తగినంతగా అందుబాటు లోకి రాలేదు. స్త్రీల సృజనాత్మక శక్తుల ప్రభావం ప్రతి ఫలించాలంటే, వారికి కూడా పురుషులతో సమానమైన నిర్ణయాత్మక పాత్రా నిర్వహణకు అవకాశాలు లభించాలి.

ఆర్థిక విధాన నిర్ణయాలలో, వ్యక్తులు గాని, వ్యక్తుల గ్రూపు గాని, లేక ఒక సంస్థగాని కీలక పాత్రను నిర్వహిస్తారు. నిర్ణీత వ్యక్తి లేక వారి గ్రూపుకు, లేక వారి సంస్థకు ఉన్న విజ్ఞానం, సంస్థా నిర్మాణ బలం, ఉత్పత్తికి అవసరమైన శ్రమశక్తిని, పెట్టుబడిని, ముడి పదార్థాలను, ఇతర వస్తువులనూ, సేవలను సమీకరించ గల శక్తి మీద, వారు విధాన నిర్ణయాల రూప కల్పనలో నిర్వహించ గల పాత్రా ప్రాముఖ్యత మీద ఆధారపడి ఉంటుంది. నిర్ణయాత్మక పాత్రను నిర్వహించే

వ్యక్తి లేక గ్రూపు లేక సంస్థ యొక్క ప్రభావము లేక పలుకుబడి పరిమాణం, దేశపు ఆర్థికాభివృద్ధి దశను బట్టి, ఆదేశంలో ఉన్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ, న్యాయ వ్యవస్థల స్థాయి, స్వభావాలను బట్టి నిర్ణయమవుతాయి ప్రభుత్వ రంగంలో గాని, ప్రైవేట్ రంగంలో గాని ఉన్న పెద్ద ఆర్థిక సంస్థలలో మేనేజిమెంటు పదవులలోనూ, ట్రేడ్ యూనియన్ సంస్థలలోనూ, ప్రొఫెషనల్ ఆర్గనైజేషన్సు యొక్క నాయకత్వస్థానాలలోనూ, స్త్రీల ప్రాతినిధ్యం నామ మాత్రం గానే ఉన్నది ఇలాంటి పదవులలో ఉంటున్న స్త్రీల సంఖ్య పెరగటం లేదని భావించనవసరం లేదు స్త్రీల వృత్తి విద్యా వ్యాప్తి విస్తరణకు, లేబర్ ఫోర్సులోనికి వస్తున్న మహిళల సంఖ్యా పరిమాణానికి దీటుగా, వారి మేనేజిమెంటు స్థాయి పదవులు పెరగటం లేదు

విధాన నిర్ణయాలను చేయగల అధికారాలూ, అవకాశాలు ఉండే పదవులకు వీరు అధిక సంఖ్యలో రాకుండా పలు అవరోధాలు, అన్నిదేశాలలోనూ, అన్ని సమాజాల లోనూ, అవి ఎంతటి అభివృద్ధిని సాధించినవయినా, అభివృద్ధిలోని ఏదశలో నున్నవయినా, ఉంటున్నాయి. ఈ అవరోధాల స్వరూప స్వభావాలేమిటో చూద్దాం. వీటి పరిశీలన వల్ల, ఈ సమస్యా పరిష్కారానికి తగిన మార్గాలు మనకు కనుపిస్తాయి.

విధాన నిర్ణయాధికారం గల పదవులలోనున్న స్త్రీల సంఖ్యా సమాచారంతో సహా, స్త్రీల ఉపాధికి సంబంధించిన సమాచారం ప్రధానంగా ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ వద్ద ఉంటుంది. అంతర్జాతీయంగా పెద్దవిగా పరిగణనకు వస్తున్న అగ్రగామి వ్యాపార సంస్థలలోనూ, అమెరికా లోని పెద్ద సంస్థలలోనూ మేనేజిరియల్ పదవులలో నున్న స్త్రీల సంఖ్యా పరిమాణం మీద యునైటెడ్ నేషన్స్ సెక్రటేరియట్ కింద పనిచేస్తున్న డివిజన్ ఫర్ ది అడ్వాన్స్‌మెంట్ ఫర్ ఉమెన్, సర్వేను నిర్వహించింది. మొరాకో, నైజీరియా, ఫిలిపీన్స్ పోర్చుగల్, దక్షిణ కొరియాలలో ఇటువంటి అంశాల మీద, ఆయాదేశాల సంస్థలు నిర్వహించిన సర్వేల ఫలితాలను కూడా పైన పేర్కొన్న ఉమెన్స్ డివిజన్ సేకరించింది. ఆఫ్రికా డెవలప్‌మెంట్ బ్యాంకు, ఇంటర్-అమెరికన్ డెవలప్‌మెంట్ బ్యాంకు, వరల్డ్ బ్యాంకుకు సంబంధించిన ఇలాంటి సమాచారాన్ని కూడా ఈ సంస్థ సేకరించింది, కొన్ని అనధికార పరిశోధనా సంస్థలు సేకరించిన సమాచారం కూడా కొంత లభిస్తున్నది. ఈ సమాచారపు ఆధారంతో రూపొందిన పరిశీలనను, వరల్డ్ సర్వే ఆన్ ది రోల్ ఆఫ్ ఉమెన్ - 1994 ప్రకటించింది. ఈ సర్వే రిపోర్టులోని సమాచారాన్ని సంక్షిప్తంగా ఇచ్చట ఇస్తున్నాం.

పైన పేర్కొన్న పలురకాల సమాచార పరిశీలన వల్ల, దిగువపేర్కొన్న పదవులలో ఉన్నవారు ఆర్థిక విధానాల రూప కల్పనలో కీలక పాత్రను నిర్వహించ గలరని తేలింది

(1) ప్రభుత్వ యంత్రాంగం లోనూ, ప్రభుత్వ రంగంలోనూ ఆర్థిక విషయాలతో వ్యవహరించే ఉన్నత పదవులలో నున్న "టాప్ ఎగ్జిక్యూటివులు";

(2) జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో పనిచేస్తున్న ప్రభుత్వ రంగ, ప్రైవేట్ రంగపు సీనియర్ మేనేజర్లు ;

(3) పలు స్థాయిలలో నున్న వ్యాపార సంస్థల అధినేతలు,

(4) అంతర్జాతీయ, ప్రాంతీయ స్థాయిలలో ద్రవ్య సంస్థల (ఫైనాన్షియల్ ఇన్‌స్టిట్యూషన్స్) సీనియర్ స్థాయి మేనేజర్లు;

(5) వ్యాపార సంస్థలు, ప్రొఫెషనల్ సంస్థలు, ట్రేడ్ యూనియన్ల మేనేజ్‌మెంటు బోర్డులలోని సభ్యులు.

## నిర్ణయాధికారం గల పదవులలో స్త్రీల సంఖ్యా పెరుగుదల ఆవశ్యకత

ఆర్థిక విధాన నిర్ణయాధికారం గల పదవులలో స్త్రీల సంఖ్యా పెరుగుదల ఆవశ్యకతకు పలు కారణాలను చూపు తున్నారు. వాటిలోని మూడు కారణాలను సర్వే రిపోర్టు పేర్కొన్నది.

(1) ఇలాంటి వసతులను అనుభవించటానికి, పురుషులతో సమానమైన హక్కు స్త్రీల కున్నది. 1948 వ సంవత్సరం డిశంబరు పదవ తేదీన యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ ఆమోదించిన యూనివర్సల్ డిక్లరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్, ఇదే సంస్థ 1979 వ సంవత్సరం డిశంబరు 18 వ తేదీన ఆమోదించిన కన్వెన్షన్ ఆన్ ది ఎలిమినేషన్ ఆఫ్ ఆల్ ఫార్మ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ ఎగెయిన్స్ట్ ఉమెన్, ఆర్థిక వ్యాసంగంలోనూ, పబ్లిక్ పాలసీల విషయం లోనూ లింగ వివక్షాప్రదర్శన కూడదనీ,

ఈ విషయాలలో స్త్రీలకూ పురుషుల తోడి సమానావకాశాలు లభించాలంటూ, ఇలాంటి వసతిని అనుభవించటాన్ని స్త్రీల "హక్కు"గా ఇవి నిర్దేశించాయి. విధాన నిర్ణయాధికారం గల స్థానాలను చేరటానికీ, ఆ వసతిని అనుభవించటానికి, అవసరమైన నైపుణ్యాన్ని, ఆస్థులనూ, వృత్తులను పొందటంలో పురుషులతోడి సమానావకాశాలు స్త్రీలకుండాలి.

(2) స్త్రీల సృజనాత్మక శక్తుల వికాసాన్ని నిరోధించటం వల్ల అవి నిరుపయోగమవుతాయి; దేశం నష్టపడుతుంది. వసతులను కల్పిస్తే, అవసరమైన వృత్తి నైపుణ్యాన్ని పెంచుకోవటానికి స్త్రీలు ఉద్యమిస్తారు. వృత్తి విద్యా కోర్సులలో చేరి చదువుతున్న విద్యార్థినుల సంఖ్య, లేబరు ఫోర్సు లోనికి వస్తున్న స్త్రీల సంఖ్యా పెరుగుదలలు ఇందుకు తార్కాణాలు. జనాభా పెరుగుదల తగ్గుతున్న వర్తమాన కాలంలో అభివృద్ధి చెందిన దేశాలలో, వృత్తి విద్యాకోర్సులను చదివిన పనివారి కొరత యేర్పడ గల సూచనలు కనుపిస్తున్నాయి రానున్న ఇరవై సంవత్సరాల కాలంలో ఉన్నత విద్య నార్జించిప గ్రాడ్యుయేట్ల సంఖ్యా పరిమాణం అధికంగా తగ్గుతుందని, భావిస్తున్నారు. ఉదాహరణకు జర్మనీని చూద్దాం, 20వ శతాబ్దాంతానికి, దేశంలో ఐదులక్షల మేనేజర్ల కొరత యేర్పడగలదని ఫెడరల్ లేబర్ ఆఫీసువారు అంచనా వేశారు. ఈ పోస్టులలో స్త్రీలను నియమించవచ్చు. ఇటువంటి పరిస్థితి కొన్ని ఆసియా దేశాలలోనూ యేర్పడవచ్చునని భావిస్తున్నారు. దక్షిణ కొరియాలోని శామ్‌సంగ్, హండై సంస్థలు స్త్రీ గ్యాడ్యుయేట్స్ ను పెద్దయెత్తున తీసుకొంటున్నాయి.

ఒకటవ పట్టిక
ప్రపంచంలోని పలు ప్రాంతాలలో పాలనా నిర్వహణ, మేనేజిమెంటు పోస్టులలో ఉన్న వారిలో స్త్రీల సంఖ్యా పరిమాణ శాతం

| ప్రాంతము | 1980 | 1990 |
|---|---|---|
| ఆఫ్రికా | 10 | 18 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 9 | 10 |
| తూర్పు యూరపులోని మాజీ కమ్యూనిస్టు దేశాలు | 30 | 66 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 24 | 34 |
| పశ్చిమ యూరపు, ఇతర దేశాలు | 23 | 41 |
| ప్రపంచం | 19 | 34 |

*గమనిక :* ఆసియా ఖండపు దేశాలలోని అభివృద్ధి నామ మాత్రంగా ఉండటం, లాటిన్ అమెరికా, కరిబియన్ పరిస్థితి ఇంతకంటె మెరుగుగా ఉండటం గమనార్హం.

(3) ఆధునిక పారిశ్రామిక, వ్యాపార రంగాలలో ప్రత్యేకంగా ఉండవలసిన కొన్ని రకాల మేనేజిమెంటు నైపుణ్యం స్త్రీల సొత్తు. అది, వారికి మాత్రమే ఉన్నది. తగినంత కాలవ్యవధి, వనరులు లేనపుడు, వాటిని లాభదాయకంగా వినియోగించుకొనే నైపుణ్యం స్త్రీల కున్నంతగా పురుషుల కుండదు. ఏక కాలంలో పలురకాల పనులను సమన్వయ పరుస్తూ నిర్వహించటం లోనూ, గృహనిర్వహణలోనూ వీరు నిపుణులు. వర్తమాన కాలంలో మార్కెట్లలో పోటీ పెరిగి పోతున్నది. ఇందువల్ల ఉన్న వనరులను, కాలవ్యవధిని లాభదాయకంగా వినియోగించు కొనవలసిన అవసరం

రెండవ పట్టిక
ప్రపంచలోని వివిధ ప్రాంతాలలో మంత్రి వర్గంలో స్త్రీల సంఖ్యా పరిమాణ శాతం

| ప్రాంతము | 1987 | | 1994 | |
|---|---|---|---|---|
| | మంత్రి వర్గంలో | ఆర్థిక మంత్రిత్వశాఖలో | మంత్రి వర్గంలో | ఆర్థిక మంత్రిత్వశాఖలో |
| ఆఫ్రికా | 2.9 | 0.9 | 5.4 | 3.0 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 1.8 | 1.7 | 2.9 | 2.0 |
| తూర్పు యూరపు (మాజీ కమ్యూనిస్టు దేశాలు) | 3.0 | 2.5 | 2.6 | 1.9 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 3.1 | 0.9 | 7.5 | 5.1 |
| పశ్చిమ యూరపు, ఇతర దేశాలలో | 7.1 | 3.9 | 15.2 | 9.6 |
| ప్రపంచంలో | 3.4 | 1.7 | 6.2 | 4.1 |

మూడవ పట్టిక

ప్రపంచంలోని పలు ప్రాంతాలలో, 1987, 1994 సంవత్సరాలలో ప్రభుత్వాధికారులలో స్త్రీల శాతాలు

| ప్రాంతము | 1987 | | 1994 | |
|---|---|---|---|---|
| | అన్ని పోస్టులలో | ఆర్థిక మంత్రిత్వశాఖ | అన్ని పోస్టులలో | ఆర్థిక మంత్రిత్వశాఖ |
| ఆఫ్రికా | 4.0 | 1 6 | 6 3 | 4.1 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 3 0 | 2.3 | 2.9 | 2 5 |
| తూర్పు యూరపు (మాజీ కమ్యూనిస్టు దేశాలు) | 3.5 | 5 4 | 5 0 | 4 9 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 7.3 | 2.7 | 10.4 | 6.9 |
| పశ్చిమ యూరపు, ఇతర దేశాలలో | 9.6 | 3.2 | 13.0 | 10.3 |
| ప్రపంచంలో | 5.4 | 2.4 | 6.8 | 5.6 |

ప్రభుత్వ యంత్రాంగంలో విషయ నిర్ణయాధికారంగల ఉన్నత పదవులలో నున్న స్త్రీల శాతము (1994)

| ప్రాంతము | చీఫ్ ఎగ్జిక్యూటివ్ | ఆర్థిక శాఖ | లా, న్యాయ శాఖ | సాంఘిక శాఖ | రాజకీయ శాఖ |
|---|---|---|---|---|---|
| అభివృద్ధి చెందిన ప్రాంతాలు | | | | | |
| తూర్పు యూరపు | 3.9 | 5.1 | 0.9 | 10 3 | 0.6 |
| పశ్చిమ యూరపు | 7.8 | 8.0 | 9.7 | 18.7 | 7.7 |
| అభివృద్ధి చెందిన ఇతర ప్రాంతాలు | 10.9 | 15.4 | 15.1 | 25.1 | 9.7 |
| ఆఫ్రికా | | | | | |
| ఉత్తర ఆఫ్రికా | 5.6 | 0.0 | 16.7 | 1.6 | 0.0 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 2.8 | 4.5 | 6.9 | 12.5 | 4 4 |
| లాటిన్ ఆమెరికా, కరిబియన్ | | | | | |
| మధ్య అమెరికా | 7.7 | 9.7 | 14.6 | 14.6 | 6.4 |
| దక్షిణ అమెరికా | 4.9 | 5.1 | 5.8 | 11.5 | 3.1 |
| కరిబియన్ | 7.3 | 6.7 | 22.2 | 22.1 | 20.5 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | | | | | |
| తూర్పు ఆసియా | 0.6 | 1.5 | 0.0 | 3.9 | 0.0 |
| ఆగ్నేయ ఆసియా | 1.9 | 2.2 | 0.0 | 4.9 | 0.5 |
| మధ్య ఆసియా | 0.0 | 3.9 | 0.0 | 9.0 | 0.0 |
| దక్షిణ ఆసియా | 5.7 | 4.9 | 6.2 | 4.8 | 1.0 |
| పశ్చిమ ఆసియా | 0.7 | 1.8 | 1.5 | 3.9 | 0.0 |
| ఒషీనియా | 8.8 | 2.2 | 0.0 | 5.0 | 18.3 |

*- ది వరల్డ్స్ ఉమెన్ 1995 నుండ*

పెరిగింది. ఇందుకు వృత్తినైపుణ్యము, సహనము, సమన్వయీకరణ శక్తి గలిగిన మేనేజర్లు అవసరం. అలాగే సంస్థలలో మేనేజ్‌మెంట్ విధానాలు- ముఖ్యంగా కార్మిక సంబంధాల నిర్వహణలో - మార్పులవసర మవుతున్నాయి. లోగడవలె ఉద్యోగులు బానిసలవలె పడి ఉండే రోజులు గతించాయి. వారి మానసిక స్థితిని బట్టి మేనేజర్లు వ్యవహరించ వలసిన అవసరం ఉన్నది. మేనేజిమెంటులో సహకార సమన్వయం, సమస్యలను అక్కడికక్కడే పరిష్కరించటం, ఉత్పత్తి నైపుణ్యపు పెంపు అవసరమవుతున్నాయి. ఇందుకు అవసరమైన శక్తులు స్త్రీలలోనే ఉన్నాయని ఇపుడు మేనేజిమెంటు నిపుణులు గుర్తిస్తున్నారు.

కాలం గడుస్తున్న కొలదీ కుటుంబ అవసరాలు పెరుగుతున్నాయి. ఇందువల్ల స్త్రీలు కూడా లేబర్ మార్కెట్టుకు అధికంగా వస్తున్నట్లు చూచాం. వీరి మార్కెట్ ప్రవేశ పరిమాణపు పెంపు, కాలం గడచిన కొలదీ, ఇంకా వేగంగా జరిగే పరిస్థితులలో, ఆర్థిక విధాన నిర్ణయాధికారంగల పదవులలో స్త్రీలను అధికంగా నియమించవలసిన అవసరం కనుపిస్తున్నది.

## జాతీయ విధానాల నిర్ణయాత్మక స్థాయిలో మహిళా ప్రాతినిధ్యం

దురదృష్టవశాత్తూ కాలం మారుతున్నంతగా కార్యాచరణ మారటం లేదు. నిర్ణయాత్మక పాత్రానిర్వహణకు తగిన అవకాశాలు మహిళలకు ఇంకా లభించటం లేదు. పరిపాలన, మేనేజిమెంటు రంగాలలో స్త్రీల ప్రాతినిధ్యం చాలా తక్కువగా ఉంటున్నది. ప్రపంచ వ్యాప్తంగా పరిస్థితిని చూచినపుడు, మేనేజిమెంటు వ్యవహారాల నిర్వహణలో ఉన్నవారిలో స్త్రీలు, నూరింట పది నుండి ముప్పై మంది వరకూ, అత్యంత ఉన్నత పదవులలో ఉన్నవారు ఐదు శాతం మేరకే ఉన్నట్లు ఐ.యల్.ఓ. అంచనాలు తెలియజేస్తున్నాయి. తూర్పు యూరపు లోని మాజీ కమ్యూనిస్టు దేశాలలోనూ, పశ్చిమ యూరపు దేశాలలోనూ, లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంత దేశాలలోనూ, మరికొన్ని ఇతర దేశాలలోనూ స్త్రీ-పురుష ఉద్యోగుల సంఖ్యాపరిమాణ భేదాలు త్వరితగతిని తగ్గుతున్నట్లు ఐక్యరాజ్య సమితి అంచనాలు

నాలుగవ పట్టిక
ప్రపంచంలోని పెద్ద కార్పొరేట్ సంస్థలలో మహిళా ప్రాతినిధ్య శాతం (1993)

| విభాగము | అంతర్జాతీయ సంస్థలు | అమెరికా సంస్థలు |
|---|---|---|
| గనులు, క్వారీలు | 0 | 6 |
| మాన్యుఫాక్చరింగ్ | 1 | 7 |
| విద్యుత్, గ్యాస్, నీరు | 3 | 10 |
| నిర్మాణం | 2 | 6 |
| హోల్‌సేల్, చిల్లరవ్యాపారాలు, రెస్టారెంట్‌లు, హోటళ్ళు | 0 | 30 |
| రవాణా, స్టోరేజి, కమ్యూనికేషన్స్ | 1 | 8 |
| ఫైనాన్సింగ్, ఇన్సూరెన్స్, స్థిరాస్తులు, వ్యాపారసర్వీసులు | 1 | 7 |
| సామాజిక, సాంఘిక, వ్యక్తిగతసేవలు | 5 | 8 |
| పై వర్గీకరణ కిందకు తీసుకు రావటానికి వీలులేని విభాగాలు | 2 | 18 |
| అన్ని విభాగాలు కలిపి చూచినపుడు | 1 | 8 |

అవకాశాలున్నాయి. కనుక స్త్రీ-పురుషులిద్దరూ అటు ఆర్థిక రంగంలో నిర్ణయాత్మక పాత్రా నిర్వహణలోనూ, కుటుంబ వ్యవహారాల నిర్వహణలోనూ సమ ఉజ్జీలుగా, సమన్వయ సహకారాలతో పనిచేయవలసిన కాలం ఆసన్నమైంది. ఈ

తెలియజేస్తున్నాయి. (ఒకటవ పట్టికను చూడండి)

వరల్డ్ వైడ్ గవర్నమెంట్ డైరెక్టొరీస్ అనే సంస్థ 1994 లో ప్రచురించిన వివరాల ప్రకారం, మంత్రిపదవి, లేక అంతకన్న ఉన్నత పదవులలో ఉన్న వారిలో స్త్రీల సంఖ్యా పరిమాణం 6.2 శాతం మాత్రమే ఉన్నది ఆర్థిక, వ్యాపార, ప్లానింగు మంత్రిత్వ శాఖలలోనూ, దేశాల కరెన్సీని కంట్రోలు చేసే సెంట్రల్ బ్యాంకులు, లేక ఫెడరల్ బ్యాంకులలోను ఉన్నత పదవులలో ఉన్నవారిలో స్త్రీల సంఖ్య ఇంకా తక్కువగా ఉంది. ఈ పదవులలో కేవలం 3.6 శాతం మంది మాత్రమే స్త్రీలున్నారు! 144 దేశాలలో ఈ శాఖల నిర్వహణలో మహిళలకు స్థానమే లేదు! 1987 వ సంవత్సరంలో ఐక్యరాజ్య సమితికి చెందిన డివిజన్ ఫర్ ది అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ ఉమెన్ సంస్థ ఈ విషయాల మీద 162 దేశాల్లో సంఖ్యా వివరాలను సేకరించింది. ఈ అంచనాల ప్రకారం ఈ 162 దేశాలలోని 108 దేశాలలో పైన పేర్కొన్న పదవులలో స్త్రీలకు స్థానం లేదు 1994 వ సంవత్సరం నాటికి పరిస్థితి కొంచెం మెరుగైంది. అంచనాల సేకరణ జరిగిన 186 ప్రభుత్వాలలోనూ, 90 దేశాలలో ఈపోస్టులలో స్త్రీలకు స్థానం లభించలేదు. (ప్రాంతాల వారీ వివరాలను రెండవ పట్టికలో చూడవచ్చు)

కాబినెట్ మంత్రులు, వారి కంటే చిన్న మంత్రులు, ప్రిన్సిపల్ సెక్రెటరీలు, డిపార్ట్‌మెంట్ డైరెక్టర్ల పోస్టుల వంటి నిర్ణయాత్మక స్థానాలను నాల్గింటిని కలిపిచూస్తే, స్త్రీల పరిస్థితి కొంత మేరకు ఆశాజనకంగా కనుపిస్తుంది. ఈపోస్టులలో ఉన్న వారిలో 6.8 శాతం వరకూ మహిళలున్నారు. ఆర్థిక మంత్రిత్వ శాఖలను పరిశీలిస్తే, మహిళలు 5.6 శాతం వరకూ ఉన్నట్లు కనబడుతున్నది. 1987, 1994 సంవత్సరాలలో పరిస్థితి ఎలా ఉన్నదీ, ఈ అధ్యాయంలోని మూడవ పట్టిక సూచిస్తున్నది.

ప్రభుత్వ యంత్రాంగంలో వలె, ప్రైవేట్ రంగంలోని అతి పెద్ద కార్పొరేషన్లలో కూడా ఆర్థిక విధాన నిర్ణయాలు చేసే అధికార స్థానాలలో స్త్రీల సంఖ్య తక్కువగానే ఉన్నది.. అమెరికాలోని అతి పెద్ద కార్పొరేషన్లలో వెయ్యి సంస్థలను, ఇతర దేశాల లోని ఈ వర్గపు సంస్థలో వెయ్యింటినీ డివిజన్ ఫర్ అడ్వాన్స్‌మెంట్ ఫర్ ఉమెన్ నిపుణులు 1993 వ సంవత్సరంలో పరిశీలనకు తీసుకొన్నారు. సీనియర్ లెవెల్ మేనేజ్‌మెంట్ పోస్టుల వర్గీకరణ కిందకు వచ్చే ఛీఫ్ ఎగ్జిక్యూటివు, ఛీఫ్ ఆపరేటింగ్ ఆఫీసర్ లేక గ్రూపు మేనేజింగ్ డైరెక్టర్, ఇతర సెక్టార్ల మేనేజర్లు లేక బోర్డులోని కార్పొరేట్ సభ్యత్వ పదవులలో నున్న వారిలో స్త్రీ లెందరో పరిశీలించారు. అగ్ర స్థానంలో ఉన్న కార్పొరేషన్లలోని మేనేజిరియల్ పదవులలో స్త్రీలు చాలా తక్కువగా ఉన్నట్లు గమనించారు. అమెరికన్ కార్పొరేట్ సంస్థలలో పనిచేస్తున్న మొత్తం మేనేజర్లలో, వందమంది పురుషులకూ ఎనిమిది మంది చొప్పున స్త్రీలున్నారు. అమెరికా కార్పొరేట్ సంస్థలుగాక, ఇతర దేశాల కార్పొరేట్ సంస్థలను పరిశీలనకు తీసుకొన్నట్లు పైన పేర్కొన్నాం. వీటిలో అధిక భాగం యూరపు, ఆసియాలలో ఉన్నాయి. ఈ దేశాల వెయ్యి కార్పొరేట్ సంస్థలలోనూ, పనిచేస్తున్న మొత్తం మేనేజర్లలో, వందమంది పురుషులకు ఒక్కరు చొప్పున మాత్రమే స్త్రీలున్నారు! అత్యున్నత పదవిగా పరిగణనకు వస్తున్న ఛీఫ్ ఎగ్జిక్యూటివు పోస్టులలో, ఈరెండు గ్రూపుల లోని సంస్థలో, ఒక్క శాతం పోస్టులలో మాత్రమే స్త్రీలున్నారు. స్త్రీ మేనేజర్లలో అత్యధికులు, కార్పొరేషన్ విధానాలను నిర్ణయించే అత్యంత దిగువ స్థాయిలలో ఉన్నారు. అమెరికాకు చెందిన వెయ్యి కార్పొరేట్ సంస్థలలో గల మహిళా మేనేజర్లలోని 97 శాతం మంది, అమెరికాయేతర కార్పొరేషన్లలో 61.5 శాతం మంది, దిగువనున్న మూడవ స్థానంలో ఉన్నారు. హోల్‌సేల్ వ్యాపారం, చిల్లర వ్యాపారం, ఆహారం, లాడ్జింగు వసతుల ఏర్పాటు వంటివి ప్రధానాంశాలుగా వ్యాపారం చేసే సంస్థలలో మాత్రం స్త్రీ ఎగ్జిక్యూటివుల సంఖ్య సాధారణ స్థాయి కంటె అధికంగా ఉన్నది. ఈ రెండు గ్రూపుల సంస్థల లోని మహిళా ప్రాతినిధ్య పరిమాణాలను 4వ పట్టికలో చూడవచ్చు.

లేబర్ ఫోర్సులో స్త్రీలకున్న స్థానానికి గాని, ట్రేడ్ యూనియన్లలో ఉన్న వారి సభ్యత్వ పరిమాణానికి గాని, తగినంత ప్రాతినిధ్యం, వారికి ట్రేడ్ యూనియన్ల నిర్వహణలో లభించటం లేదు. అధిక సంఖ్యాకులుగా స్త్రీలుండే టీచర్లు, నర్సుల యూనియన్ల వంటి సంఘాలలో తప్ప ఇతర సంఘాలలో వారికి తగిన నాయకత్వ ప్రాధాన్యత లభించటం లేదు. నాయకత్వపు పరిధి, స్థాయీ పెరుగుతున్న కొలదీ, స్త్రీల ప్రాతినిధ్యము వాటిలో తగ్గిపోవటం కనుపిస్తున్నది. ఇటీవలి కాలంలో ట్రేడ్ యూనియన్లలో స్త్రీల సభ్యత్వం త్వరితగతిని పెరుగుతున్నది. కనుక, వాటి నాయకత్వంలో కూడా స్త్రీల

స్థానం బలపడవలసిన అవసరం ఉన్నది.

ట్రేడ్ యూనియన్ల నాయకత్వాన్ని గురించి ప్రపంచవ్యాప్త సంఖ్యా సమాచారం గాని, స్త్రీ-పురుషుల పాత్రా నిర్వహణా పరిమాణము, పరిధులను తెలియజేసే సమాచారం గాని లభించటం లేదు. ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ వద్ద నున్న 1993 వ సంవత్సరపు సమాచారాన్ని బట్టి, పలుదేశాల ట్రేడ్ యూనియన్లలో స్త్రీల స్థానం ఇలా ఉన్నది :

ఐదవ పట్టిక

నైజీరియాలోని ఉద్యోగులలో స్త్రీ-పురుష శాతాలు

| ఉద్యోగ స్థాయి | స్త్రీలు | పురుషులు |
|---|---|---|
| కార్పొరేట్ ఆధిపత్యం | 10 | 90 |
| మధ్యస్థ మేనేజిమెంట్ | 35 | 65 |
| స్వంత వ్యాపారాల నిర్వహణ | 20 | 80 |
| చిన్న వ్యాపారులు | 70 | 30 |
| సివిల్ సర్వీసులో ఉన్నత పదవులు | 10 | 90 |
| ట్రేడ్ యూనియన్లు | 5 | 95 |
| బ్యాంకింగు, ఫైనాన్సు విషయాలలో బాధ్యతాయుత స్థానాలు | 5 | 95 |

భారత దేశానికి చెందిన హింద్ మజ్దూర్ సభలో స్త్రీ సభ్యత్వం 25 శాతం వరకూ ఉన్నా నాయకత్వ స్థానాలలో 4 శాతం మేరకే మహిళలున్నారు. సియోరా లియోన్ లేబర్ కాంగ్రెస్‌లో, స్త్రీ సభ్యత్వం 35 శాతం వరకూ ఉన్నా, నాయకత్వ స్థానాలలో ఆరు శాతమే స్త్రీలకు లభించాయి. స్వీడిష్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ప్రొఫెషనల్ ఎంప్లాయీస్ సంస్థలో, స్త్రీ సభ్యత్వం 58 శాతం మేరకున్నా, నాయకత్వ స్థానాలు రెండు శాతం మేరకే వారికి దక్కాయి.

ప్రొఫెషనల్ సంస్థల యజమానుల సంఘాలు ఆది నుండి పురుషుల కంట్రోలులోనే ఉంటున్నాయి నాయకత్వ స్థానాలన్నీ పురుషుల సొత్తుగానే ఉంటున్నాయి. ఈ నష్టాన్ని పూడ్చుకోవటానికన్నట్లు జాతీయ, ప్రాంతీయ అంతర్జాతీయ మహిళా ప్రొఫెషనల్, స్త్రీ యాజమాన్య సంఘాల మధ్య సంబంధాల పెంపుకు స్త్రీలు ప్రయత్నిస్తున్నారు. ట్రేడ్ యూనియన్లలోని స్త్రీ సభ్యత్వం, నాయకత్వంలోని వారి స్థానాన్ని తెలిపే కొన్ని వివరాలయినా లభిస్తున్నాయి గాని, ప్రొఫెషనల్, సంస్థల యాజమాన్య సంఘాలలోని స్త్రీ ప్రాతినిధ్య, నాయకత్వ స్థానాలకు సంబంధించిన వివరాలు ఏమాత్రం లభించటం లేదు. స్త్రీల యాజమాన్యాన నడుస్తున్న వ్యాపార సంస్థల

ఆరవ పట్టిక

దక్షిణ కొరియాలో 1965-1992 సంవత్సరాల మధ్య కాలంలో మహిళా ఉద్యోగుల ఉపాధి స్థాయి
(మొత్తం ఉద్యోగులలో మహిళల శాతం)

| ఉద్యోగ స్థాయి | 1965 | 1970 | 1980 | 1990 | 1992 |
|---|---|---|---|---|---|
| సంస్థల యజమానులు | - | - | - | 2.6 | 2.9 |
| స్వయం ఉపాధిలోని వారు | 21.4 | 21.0 | 23.3 | 16.6 | 16.8 |
| ఉద్యోగులు | 20.9 | 28.6 | 39.2 | 55.3 | 57.6 |
| వేతనం లేని కుటుంబపు పనిని చేసేవారు | 57.9 | 50.4 | 37.4 | 25.5 | 22.8 |
| మొత్తం | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 |

ఆస్ట్రేలియన్ కాన్‌ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్లలో, మొత్తం సంస్థ సభ్యత్వంలో స్త్రీల సభ్యత్వం 31 శాతం వరకు ఉండగా, కార్యవర్గంలో స్త్రీ సభ్యత్వం తొమ్మిది శాతం మాత్రమే ఉన్నది. బంగ్లాదేశ్ ఫ్రీ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ లో మొత్తం సభ్యత్వంలో స్త్రీల సభ్యత్వం 30 శాతం వరకూ ఉన్నది; నాయకత్వ స్థానాలలో వీరు 19 శాతం మేరకే ఉన్నారు.

వివరాలను తెలిపే సమాచారం కూడా సమగ్రంగా లభించటం లేదంటే ఆశ్చర్యపడనవసరం లేదు.

### కొన్ని దేశాల సర్వేల ఫలితాలు

ఇంతకు పూర్వమే పేర్కొన్నట్లు డివిజన్ ఫర్ అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ ఉమెన్ సంస్థ కొన్ని దేశాలలో సర్వేలను

నిర్వహింప చేసి సమాచారాన్ని సేకరించ ప్రయత్నించింది. ప్రభుత్వ యంత్రాంగంలో గాని, ట్రేడ్ యూనియన్లలో గాని, ప్రైవేట్ సంస్థలలో గాని, విధాన నిర్ణయాలు చేయగలిగిన ఉన్నత స్థానాలలో ఉన్న స్త్రీల సంఖ్య చాలా తక్కువగా ఉన్నట్లు ఈ సమాచారం సూచిస్తున్నది కాలానుగతంగా ఈ పరిస్థితి మెరుగవుతున్న సూచనలు కూడా కనుపించటం లేదు ప్రభుత్వ యంత్రాంగంలోనూ, చిన్న తరహా, మధ్య స్థాయి వ్యాపార సంస్థలను ఏర్పాటు చేస్తున్న వారిలోనూ మహిళల సంఖ్య పెరుగుతున్నట్లు కనుపిస్తున్నది.

గత దశాబ్దకాలంలో మొరాకోలో చారిత్రాత్మకమైన సాంఘిక మార్పు జరిగినట్లు 1992 వ సంవత్సరంలో జరిగిన సర్వే వల్ల తెలుస్తున్నది ఈ దశాబ్దంలో స్త్రీలు అధిక సంఖ్యలో లేబరు మార్కెట్‌కు వచ్చారు; కొందరు స్వంత వ్యాపారాలను ప్రారంభించారు ప్రభుత్వోద్యోగాలలో ఉన్న మహిళలలో నూరింట 67 మంది 1980 వ సంవత్సరం తర్వాత వాటిలో

### ఏడవ పట్టిక
### అంతర్జాతీయ కార్మిక సంస్థ సమావేశాలకు హాజరైన డెలిగేషన్లలో మహిళా ప్రతినిధుల శాతం

| గ్రూపు | 1975 | 1985 | 1993 |
|---|---|---|---|
| ప్రభుత్వ ప్రతినిధులు | 14.4 | 18.0 | 16.9 |
| యజమానుల ప్రతినిధులు | 6.0 | 6.3 | 9 1 |
| కార్మిక ప్రతినిధులు | 16.9 | 12.7 | 12.5 |
| అన్ని గ్రూపులు (కలిపి) | 13.0 | 14.0 | 13.9 |

### తొమ్మిదవ పట్టిక
### సంస్థల యజమానులు గానో, స్వయం ఉపాధిలోనో ఉన్నవారిలో స్త్రీల పరిమాణ శాతాలు

| ప్రాంతము | ప్రతి వంద మంది పురుషులకు మహిళల సంఖ్యా పరిమాణం | | |
|---|---|---|---|
| | 1970 | 1980 | 1990 |
| ఆఫ్రికా | 35 | 50 | 50 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 16 | 9 | 22 |
| తూర్పు యూరపు | 67 | 47 | 48 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 22 | 33 | 48 |
| యూరపు, ఇతర దేశాలు | 22 | 37 | 38 |
| ప్రపంచం | 26 | 39 | 40 |

చేరారు స్వంత వ్యాపారాలు చేసుకొనేవారిలో నూరింట 46 మంది 1986 వ సంవత్సరం తర్వాతే వ్యాపారాన్ని ప్రారంభించారు. స్త్రీలు ప్రారంభించిన స్వంత వ్యాపార సంస్థలలో నూరింట డెబ్బై అయిదుకు మించే గత దశాబ్దంలో ప్రారంభమైనాయి. వీటిలోని నూరింట 84 సంస్థలలో ఉద్యోగులు ఇరవయ్యైదుగురు కంటే తక్కువగా ఉన్నారు. ఈ సంస్థల ప్రారంభానికి అవసరమైన పెట్టుబడులను మహిళలు, బ్యాంకుల నుండి కంటే, స్వంత వనరుల నుండే అధికంగా కూర్చారు. సాలుకు లక్ష దీరాముల కంటే (ఆదేశపు నాణెములు) ఎక్కువ సంపాదించే వారిలో 8 8 శాతం మంది మాత్రమే మహిళలున్నారు.

(నైజీరియాలో 1993 లో ఈ సంస్థ నిర్వహించిన సర్వే ఫలితాలను ఈ అధ్యాయంలోని ఐదవ పట్టికలో చూడవచ్చు.)

1992 వ సంవత్సరంలో ఫిలిపీన్స్‌లో జరిగిన సర్వే ప్రకారం పరిపాలనా సంబంధమైన పోస్టుల లోనూ, ఎగ్జిక్యూటివు, మేనేజిమెంటు స్థాయిలలోనూ పనిచేస్తున్న వారిలో, మహిళలు 31 శాతం వరకూ ఉన్నట్లు తెలుస్తున్నది. వృత్తులలో నున్న వారిలో నూరింట 40 మంది స్వయం ఉపాధిలో ఉన్నారు. వీరిలో 28 శాతం మంది పురుషులు, 12 శాతం మంది మహిళలు. స్వయం ఉపాధిలో ఉన్న వారిలోగాని, కొందరిని ఉద్యోగంలో పెట్టుకోవలసిన సంస్థలను నడుపుతున్న వారిలో గాని, మూడింట రెండు వంతుల మంది పురుషులుండగా, స్త్రీలు ఒక్క వంతు మంది మాత్రమే ఉన్నారు. ప్రభుత్వ రంగ సంస్థలలో నిర్ణయాలు తీసుకోవలసిన ఉన్నత స్థాయి ఉద్యోగాలలో ప్రధానంగా పురుషులే ఉన్నారు. కాని రెండవ స్థాయి ఉద్యోగాలలో మాత్రం పురుషుల కంటే స్త్రీలే అధికంగా ఉన్నారు.

1987 వ సంవత్సరం తర్వాత పోర్చుగల్ దేశంలో బాధ్యతాయుత స్థానాలకు స్త్రీలు అధికంగా రావటం కనిపిస్తుంది ఈ దేశంలోని వెయ్యి పెద్ద కంపెనీలను సర్వేకు తీసుకొన్నారు. 1987వ సంవత్సరంలో, ఈ సంస్థలలోని 18 శాతంలో స్త్రీలు నాయకత్వ స్థానాలలో ఉన్నారు. 1992 వ సంవత్సరానికి ఈ పరిమాణం 33.6 శాతానికి పెరిగింది.

ఈ సంస్థలలోని పెద్దవైన యాభైని మాత్రమే పరిగణన లోనికి తీసుకొంటే, 1987 లో వీటిలో మహిళా నాయకత్వం

లేదు; 1992 లో కూడా మహిళలు వీటి నాయకురాండ్రుగా రాలేదు; 1960 వ సంవత్సరంలో స్వంత వ్యాపార సంస్థలను నడుపుతున్న వారిలో ఏడు శాతం మంది మాత్రమే మహిళలున్నారు; 1981 వ సంవత్సరానికి ఈ పరిమాణం 19 శాతానికి, 1987 వ సంవత్సరానికి 20 శాతానికి పెరిగింది

దక్షిణ కొరియాలో 1989 వ సంవత్సరంలో ఇరవై మంది లేక అంతకన్న తక్కువ ఉద్యోగులతో నడుస్తున్న చిన్నపాటి వ్యాపార సంస్థలు దాదాపు అన్నీ (99.7 శాతం) స్త్రీలు నిర్వహిస్తున్నవే. మాన్యుఫాక్చరింగ్ రంగంలో పరిశ్రమలను నడుపుతున్న మహిళల సంఖ్య తగ్గింది; కాని సామాజిక, లేక వ్యక్తిగత సేవలను అందించే పరిశ్రమలలో వీరి సంఖ్య పెరగటం కనుపిస్తుంది. 1990 వ సంవత్సరంలో వ్యాపార సంస్థలను నడుపుతున్న మహిళలలో 64 శాతం మంది హోల్‌సేల్, లేదా చిల్లర వ్యాపారంలో ఉన్నారు. 23

### ఎనిమిదవ పట్టిక
### వృత్తివిద్యా కళాశాలలలో చదువుతున్న వారిలో విద్యార్థినుల సంఖ్యా పరిమాణ శాతం

| ప్రాంతం | 1970 | 1980 | 1990 |
|---|---|---|---|
| సైన్సు - టెక్నాలజీ | | | |
| ఆఫ్రికా | 24 | 21 | 24 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 33 | 45 | 70 |
| తూర్పు యూరపు | 61 | 81 | 74 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతం | 37 | 54 | 80 |
| పశ్చిమ యూరపు, ఇతర దేశాలు | 29 | 49 | 67 |
| ప్రపంచం | 32 | 43 | 56 |
| లా - బిజినెస్ | | | |
| ఆఫ్రికా | 12 | 43 | 36 |
| ఆసియా, పసిఫిక్ | 25 | 56 | 70 |
| తూర్పు యూరపు | 64 | 134 | 124 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 30 | 92 | 115 |
| పశ్చిమ యూరపు, ఇతర దేశాలు | 25 | 54 | 85 |
| ప్రపంచం | 25 | 63 | 102 |

శాతం మంది సాంఘిక లేక వ్యక్తి గత సర్వీసుల నందించే సంస్థలను నిర్వహిస్తున్నారు. అసిస్టెంట్ మేనేజరు, లేక అంతకు మించిన స్థానాలలో పనిచేస్తున్న మహిళల శాతం 1980 సంవత్సరంలో రెండు మాత్రమే ఉండేది; 1992 వ సంవత్సరానికిది 12.5 కు పెరిగింది. (వివరాలు 6వ పట్టికలో చూడండి)

ఆర్థిక విధానాల రూప కల్పనాధికారంగల స్థానాల అలంకరణలో మహిళల స్థానం జాతీయ స్థాయిలో ఎంత అల్పంగా ఉందో అంతర్జాతీయ స్థాయిలో కూడా అంత తక్కువగా ఉన్నది

యునైటెడ్ నేషన్స్ అనుబంధిత సంస్థలలో ఆర్థిక విషయాలను చూసే సంస్థల అధినేతలుగా మహిళలు లేరు. యునైటెడ్ నేషన్స్ సెక్రటేరియట్‌లో గాని, బ్రెటన్ ఉడ్స్ సంస్థలలో గాని మహిళలు కీలక పదవులను నిర్వహించటం లేదు. ప్రాంతీయ అభివృద్ధి బ్యాంకుల అధినేతలుగా గాని, కమిషన్ ఆఫ్ ది యూరోపియన్ యూనియన్ వంటి ప్రధాన ఆర్థిక సంస్థలలో గాని, స్త్రీలు కీలక పదవులలో లేరు. ప్రభుత్వాలు ఈ సంస్థల సమావేశాలకు పంపే ప్రతినిధి వర్గాలలో కూడా మహిళలకు ప్రాతినిధ్యం లభించటం లేదు. అంతర్జాతీయ, లేదా ప్రాంతీయ ద్రవ్య సంస్థల ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ పదవి, ఇంతవరకూ ఒక్క మహిళకు కూడా లభించలేదు.

ఐక్యరాజ్య సమితి యొక్క రెండవ కమిటీ ఆర్థిక, ద్రవ్య సంబంధ వ్యవహారాలను చూస్తుంది. అంతర్జాతీయ అభివృద్ధి వ్యూహానికి సంబంధించిన ప్రణాళికలను రూపొందిస్తుంది; వాటి ఆచరణను అంచనా వేస్తుంది; పరిసరాలు, వాటి పరిరక్షణా కార్యకలాపాలను పర్యవేక్షిస్తుంది; ఆర్థిక విధానాలను రూపొందిస్తుంది. 1987 వ సంవత్సరంలో ఈ కమిటీ సమావేశాలకు హాజరయిన మొత్తం డెలిగేట్లలో ఏడు శాతం మంది మాత్రమే స్త్రీలున్నారు. 1993 వ సంవత్సరంలో 145 దేశాలకు చెందిన ప్రతినిధి వర్గాలలో మహిళలకు ప్రాతినిధ్యమే లభించలేదు. అన్ని దేశాల ప్రతినిధి వర్గాలను కలిపి చూచినపుడు, ఈ సంవత్సరపు ప్రతినిధులలో ఇరవై శాతం వరకూ స్త్రీలుండటం కనుపిస్తుంది.

అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ యల్ ఓ) నిర్వహించే కాన్ఫరెన్సులకు వచ్చే డెలిగేషన్లలో కూడా మహిళా ప్రాతినిధ్యం ఇలాగే ఉంది. (వివరాలను ఏడవ పట్టికలో చూడవచ్చు)

1989 వ సంవత్సరంలో ప్రపంచ బ్యాంకు తయారు చేసిన రిపోర్టు ప్రకారం ఆ బ్యాంకులో పనిచేస్తున్న గ్రేడ్ 18, ఆపై ఉద్యోగాలలో మొత్తం 4000 మంది ఉద్యోగులున్నారు. (వీరంతా ఉన్నత తరగతి ఉద్యోగుల కింద జమ) వీరిలో

నాల్గవ వంతు మంది మహిళలున్నారు. వీరిలో అత్యధికులు (సగాని కంటే పైగానే) 18-21 గ్రేడ్ల మధ్య నుండే ఉద్యోగాలలో ఉన్నారు. ఇరవైరెండవ గ్రేడ్ ఆపై ఉద్యోగాలలో వీరి శాతం 15 వరకూ ఉన్నది. పదవీ స్థాయి పెరిగిన కొలదీ, స్త్రీ ప్రాతినిధ్యం తగ్గుతున్నట్లు కనుపిస్తున్నది.

పురుషులలో ఉన్నత తరగతి ఉద్యోగాలలో నున్న వారి సంఖ్యా పరిమాణం 24 వ గ్రేడ్, ఆపై తరగతిలో 59 శాతం వరకూ ఉంటుంది. ఈ స్థాయిలో నున్న మహిళా ఉద్యోగినులు పదహారు శాతం మంది మాత్రమే. మేనేజిమెంటు, తదితర ఉన్నతోద్యోగాలలో మహిళల సంఖ్యా పరిమాణం మరీ తక్కువగా నున్నది 26 వ గ్రేడ్ - ఆపై తరగతి స్థాయి ఉద్యోగాలలో మొత్తం 498 మంది ఉద్యోగులుండగా, వారిలో స్త్రీలు కేవలం 3.8 శాతం మేరకే ఉన్నారు! 27 వ గ్రేడ్, ఆపై స్థాయి ఉద్యోగాలలో మొత్తం 158 మంది ఉన్నారు; వీరిలో స్త్రీలు 2.5 శాతం ముందే ఉన్నారు. 1994 వ సంవత్సరంలో ఒక్క మహిళా వైస్ ప్రెసిడెంట్ మాత్రమే ఉన్నారు. ప్రపంచ బ్యాంకు చరిత్రలో ఒక్కసారి మాత్రమే ఇద్దరు మహిళా వైస్ ప్రెసిడెంట్సు ఉన్నారు! ఉన్నతోద్యోగాలలో మహిళా ప్రాతినిధ్యపు పెంపు "అతి తక్కువగా" జరిగినట్లు రిపోర్టు పేర్కొన్నది.

ఆఫ్రికన్ డెవలప్‌మెంట్ బ్యాంకులో, 1992 వ సంవత్సరంలో పనిచేస్తున్న మహిళలలో, నూరింట 72 మంది నాన్ ప్రొఫెషనల్ ఉద్యోగాలలో ఉన్నారు; మగవారిలో 57 శాతం మంది ప్రొఫెషనల్ ఉద్యోగాలలో ఉన్నారు. 1989 వ సంవత్సరంలో ప్రొఫెషనల్ ఉద్యోగాలలో స్త్రీలు 15 శాతం మందివరకూ ఉండేవారు. 1992 లో, ఆ సంస్థలో పనిచేస్తున్న మహిళా ప్రొఫెషనల్స్‌లో 94 శాతం మంది, తక్కువ స్థాయి ప్రొఫెషనల్ ఉద్యోగాలలో ఉన్నారు. (పి 5వ స్థాయి వరకూ స్థితి ఇది) పి 6, అంతకు పై స్థాయి ఉద్యోగాలలో, మొత్తం పురుష ప్రొఫెషనల్స్ లో 30 శాతం మంది వరకూ ఉన్నారు. పి6, అంతకు పై స్థాయి ఉద్యోగాలలో, 1992 వ సంవత్సరంలో ఉన్న మొత్తం ఉద్యోగులలో నాలుగు శాతం మేరకు మాత్రమే మహిళలున్నారు.

1994 వ సంవత్సరపు రిపోర్టు ప్రకారం ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ కార్యాలయంలో 1993 వ సంవత్సరంలో ఉన్న మొత్తం ఉద్యోగులలో 45 శాతం మంది వరకూ మహిళలున్నారు. వీరిలో అత్యధిక సంఖ్యాకులు కింద తరగతి ఉద్యోగాలలో మాత్రమే ఉన్నారు ఈ సంస్థ మేనేజర్లలో ఏడు శాతం మంది మాత్రమే మహిళ లున్నారు. మేనేజింగ్ డైరెక్టర్, డిప్యూటి మేనేజింగ్ డైరెక్టరు, డిపార్టుమెంట్ అధినేత ఈ తరగతి ఉన్నతోద్యోగాలలో మహిళలకు ఏనాడూ స్థానం లభించలేదు.

## ఆర్థిక విషయ నిర్ణేతలుగా తయారవుతున్న భావితరం

ఆర్థిక విషయ నిర్ణేతల స్థానాలకు మహిళలను ఎందుకు తీసుకోవటం లేదు అంటే "తగినంత మంది అర్హులు కనిపించక" అన్న సమాధానం వస్తున్నది. ఈ విషయంలో వస్తున్న మార్పులు స్పష్టంగా కనుపిస్తున్నాయి. వృత్తి విద్యా కోర్సులలో స్త్రీలు అధికంగా చేరుతున్నారు. ఆర్థికంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో వీరి సంఖ్యా పరిమాణం అధికంగా ఉన్నది ఐక్యరాజ్య సమితి ప్రకటించిన అంచనాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. దీన్ని ఆశాజనక పరిణామంగా వర్ణించవచ్చు. (వివరాలకు ఎనిమిదవ పట్టికను చూడండి)

## కార్పొరేట్ సంస్థలలో మహిళల ప్రవేశం

ప్రభుత్వరంగ సంస్థలలో గాని, ప్రైవేట్ సంస్థలలో గాని, చేరినవారు క్రమంగా ప్రమోషన్లు పొందుతూ ఉన్నత పదవులకు చేరటం సహజమార్గం. పురుషులు అటువంటి ఉన్నత స్థానాలకు చేరటం, వారితో సమంగా ఆస్థానాలకు స్త్రీలు చేరుకోలేక పోవటం కనుపిస్తున్నది. దీనిని బట్టి ఆ స్థానాలకు చేరే మార్గాలు, స్త్రీ పురుషులకు వేరుగా ఉన్నాయని అనుకోవలసి వస్తున్నది. లేదా, అనుసరించే మార్గం ఇద్దరకూ ఒకటే అయితే, ఈ మార్గంలో స్త్రీలు కొన్ని ప్రత్యేక అవరోధాలను ఎదుర్కొన వలసి రావటం కారణమై యుండాలి. ఆర్థిక విషయనిర్ణయాలను చేయగల స్థాయికి మహిళలు పురుషులతో సమంగా ఎదగాలంటే, వృత్తిలో వీరి ప్రవేశ మార్గాలేమిటి, వాటిలో ఎలాంటి మార్పులు చేయటం వల్ల ఈ అసమానత తొలగిపోతుంది అనే అంశాలను అర్థం చేసుకోవటం అవసరం.

ఈ విషయం మీద వెలువడిన పరిశీలనా సమాచారం చాలా తక్కువగా కనుపిస్తున్నది. యూరపులోనూ, అమెరికాలోనూ వెలువడిన కొన్ని పరిశీలనలను బట్టి మనకు కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. కుటుంబం, పరిశ్రమలను

"గ్లాస్ సీలింగ్" ప్రభావం

ఉన్నత పదవులను పొందటానికి స్త్రీలు ఎదుర్కొన వలసి వస్తున్న అదృశ్య అవరోధాలను వర్ణించటానికి, 1986వ సంవత్సరంలో, వాల్ స్ట్రీట్ జర్నల్ "గ్లాస్ సీలింగ్" అనే పదాన్ని సృష్టించింది. ఈ పదాన్ని తొలుత వాడినది ఈ పత్రికే. అమెరికా మహిళలు ప్రజ్ఞావంతులన్న విషయం రుజువైంది. ఇతర దేశాల స్త్రీల కంటే కూడా శక్తి వంతులని తేలింది. అయినా వారిని ఈ "గ్లాస్ సీలింగ్" అనే అవరోధం విడిచి పోలేదు.

స్ట్రాక్ అండ్ స్ట్రాక్ లెవన్ అనే పరిశోధనా సంస్థ ఉద్యోగినుల కున్న ప్రమోషన్ అవకాశాలు, అవరోధాల మీద ఒక సర్వేను నిర్వహించింది. అమెరికా లోని పలు సంస్థలలో పనిచేస్తున్న నాలుగు వేల మంది సీనియర్ ఎగ్జిక్యూటివుల అభిప్రాయల్ని ఈ అంశం మీద సేకరించింది. ఉన్నత పదవులకు ప్రమోషన్‌ను పొందటంలో, స్త్రీ ఎగ్జిక్యూటివులను నిరోధిస్తున్నది. వారి శక్తి సామర్థ్యాల లేమి గాదని ఈ సర్వే నిరూపించింది. వ్యక్తి యొక్క స్వరూప స్వభావాలు, నెట్ వర్కింగ్ సామర్థ్యం, విశ్వాస పాత్రత, నిజాయితీ, రాజకీయ చతురత వంటి అంశాలు, వృత్తికి సంబంధించిన శక్తి సామర్థ్యాల కంటే అధికంగా స్త్రీ ఎగ్జిక్యూటివుల ప్రమోషన్‌ను ప్రభావితం చేస్తున్నట్లు ఈ సర్వే నిరూపించింది.

సెంటర్ ఫర్ క్రియేటివ్ లీడర్‌షిప్ సంస్థ ఒక సర్వేను నిర్వహించింది. వత్తిడులకు తట్టుకోగల శక్తి స్త్రీలకు లేదు గనుక, వత్తిడులను అధికంగా అనుభవించ వలసి వచ్చే దేశీ, విదేశీ పోస్టులకు వారి ఎన్నిక జరగటం లేదని ఈ ఫలితాలు వెల్లడించాయి. ఉద్యోగ నిర్వహణలో ఎదురయ్యే వత్తిడులకు స్త్రీలు తట్టుకోలేరని సర్వేలో పాల్గొన్న మేనేజర్లు చెప్పారు. నిర్ణీత ఉన్నత పదవిలో పనిచేయటానికి తగిన అర్హతలన్నీ స్త్రీల కుండవచ్చు; అయినా పైన పేర్కొన్న పురుష ఎగ్జిక్యూటివుల దురభిప్రాయాల వల్ల, తమకు న్యాయంగా రావలసిన ఉన్నతోద్యోగాలను స్త్రీలు కోల్పోతున్నారు; అవి పురుషులకే దక్కుతున్నాయి.

*- ఐక్యరాజ్య సమితి ప్రచురణ : ఉమెన్ : లుకింగ్ బియాండ్ 2000 నుండి*

గాని, వ్యాపార సంస్థలను గాని నిర్వహిస్తున్నపుడు, ఆ కుటుంబానికి చెందిన మహిళలు, ఆ సంస్థలలోని ఉన్నత స్థానాలను అలంకరిస్తూండటం కనుపిస్తుంది. యూరపు లోనూ, అమెరికాలోనూ కొందరు స్త్రీలు కార్పొరేట్ అధిపతులుగా పనిచేస్తూండటం ఇందుకు రుజువు. రాజకీయ రంగ ప్రవేశం ద్వారా మహిళలు ఇలాంటి స్థానాలకు చేరటం కూడా కనుపిస్తున్నది ఇలాంటి రాజకీయ నాయకురాండ్రు మనకు ప్రైవేట్ కార్పొరేషన్లలో కనుపిస్తూంటారు. ప్రభుత్వ యంత్రాంగంలో గాని, స్వచ్ఛంద సంస్థలలో గాని, జాతీయ రాజకీయ రంగంలో గాని పనిచేసి, పరిపాలనానుభవాన్ని గడించిన మహిళలు కార్పొరేట్ సంస్థలలో ప్రవేశించటం కనుపిస్తున్నది. మహిళలలో,పరిపాలనా యంత్రాంగంలో పనిచేసిన వారూ, సర్వీసు సంబంధమైన కార్పొరేట్ సంస్థలలో చేరినవారూ, ఆర్థిక నిర్ణయాలు చేయగల ఉన్నత స్థానాలకు చేరుతున్నారు. కాని ఈ స్థితి, మాన్యుఫాక్చరింగ్ రంగంలో మాత్రం కనుపించటం లేదు. ప్రభుత్వపాలనా యంత్రాంగంలో గాని, దాని ఆధ్వర్యంలో నడిచే సంస్థలలో గాని, ప్రమోషన్లకు లింగవివక్ష అంతగా అడ్డురాదు.

ఉన్నత పదవులను చేరటానికి స్త్రీలు పలురకాల అవరోధాలను ఎదుర్కొనవలసి వస్తున్నది. వృత్తిలో ఎదగటానికి, వీరు ఆదినుండీ, పదవీ నిర్వహణా కాలంలో క్లిష్టమైన సమస్యలను ఎదుర్కొన వలసి వస్తున్నది. స్త్రీ అనగానే, కుటుంబ నిర్వహణ, పిల్లలను కనటం, సంరక్షించటం అనే అంశాలు గుర్తుకు వస్తాయి. గృహ నిర్వహణ ఇల్లాలి పనిగాను, సంపాదన పురుష వ్యాసంగంగానూ తరతరాలుగా వస్తున్న సంప్రదాయం నిర్ణయించింది! మగపిల్లల వలె ఆడపిల్లలు బడికి పోతున్నా, వారి విద్యార్జనా పరిస్థితులు భిన్నంగా ఉంటున్నాయి. వ్యాపార, పారిశ్రామిక అంశాలలో వృత్తి పరమైన విద్యకు మగపిల్లలను పంపుతారు. ఈ విధంగా వీరికి మేనేజిమెంటు నిర్వహణకు అవసరమైన నైపుణ్యాన్ని

## ఆర్థిక విషయ నిర్ణయాధికారంగల పదవులలో స్త్రీలు













*ఆర్థిక విషయ నిర్ణయాధికారాలు గల ఉన్నత పదవులకు వచ్చే స్త్రీల సంఖ్యా పరిమాణం ఇప్పటి రేటుననే పెరుగుతూంటే, వారు పురుషులతో సమాన స్థాయికి రావటానికి ఇంకా 475 సంవత్సరాల కాలం పట్టవచ్చు !*

*- ఐక్య రాజ్య సమితి ప్రచురణ - వరల్డ్ సర్వే ఆన్ ది రోల్ ఆఫ్ ఉమెన్ ఇన్ డెవలప్‌మెంట్ - 1994 నుండి*

సంపాదించే అవకాశాల నిస్తారు. గృహనిర్వహణ, సంతానోత్పత్తి, శిశు సంరక్షణాంశాలను దృష్టిలో పెట్టుకొని, వీటికి భంగం కలుగని వృత్తులను చేబట్టటానికి తగిన అర్హతల సాధనకు అవసరమైన విద్యాకోర్సులకు ఆడపిల్లలను తలిండ్రులు లేదా వారి సంరక్షకులు పంపుతారు. కొన్ని వృత్తులు మహిళా వృత్తులుగా పరిగణనను పొందుతున్నాయి. (ఉపాధ్యాయ, డాక్టరు, నర్సుల వంటి వాటిని ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు) సైన్సు, టెక్నాలజీ, ఎకనామిక్స్, ఫైనాన్స్, కామర్సు వంటి విద్యలను అభ్యసిస్తున్న మహిళల సంఖ్య తక్కువగా ఉంటున్నది. ఈ అల్ప సంఖ్యాపరిమాణం, వారు ఉన్నత స్థానాలను చేరటానికి ప్రధాన అవరోధంగా తయారైంది. ఈ రకమైన వృత్తి విద్యా కోర్సులలో తర్ఫీదు పొందుతున్న మహిళల సంఖ్య ఇటీవలె పెరుగుతున్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. కనుక "కాలం మారక పోదు" అన్న ఆశాభావం కలుగుతున్నది.

తగిన విద్యార్హతలున్న స్త్రీలు ఉన్నత పదవి చేరదగిన శాఖలో చేరగలుగుతారు. కాని వారికి ఉన్నత పదవులకు వెళ్ళే అవకాశాలు తక్కుఉంటున్నాయి. అత్యధికులు దిగువస్థాయి పోస్టుల్లోనే ఉండిపోతున్నారు. సంస్థ అధిపతిగా స్త్రీ ఉన్న సందర్భాలలో కూడా, స్త్రీలకు ఆసంస్థలో ఉన్నత పదవులు లభించటం లేదు! స్త్రీ సామర్థ్యం మీదా, ప్రవర్తన మీద, పురుషులకే కాదు, స్త్రీలకు కూడా దురభిప్రాయాలున్నాయి! ఉద్యోగ నియామకమే "ఉన్నత పదవుల నిర్వహణకు వీరు తగరు" అన్న భావంతో జరుగుతుంది. గృహ నిర్వహణ, సంతానోత్పత్తి - శిశు సంరక్షణా భారాన్ని వహించే మహిళ, "ఇంత భారమైన పదవిని నిర్వహించ లేదు" అన్న భావం యజమానులలోనూ, ఉన్నతోద్యోగుల లోనూ స్థిర పడింది.

పురుషాధిక్యత అనేది కార్పొరేట్ కల్చర్‌లో స్థిరపడి పోయింది. అమెరికా లోని అరిజోనా స్టేట్‌లోని రిశర్చి స్కాలర్ (మహిళ)ఒకరు, ఈ విషాయాన్ని పరిశీలిస్తూ, కార్పొరేట్ వ్యవస్థ నిర్మాణమే పురుషభావంతో జరిగినట్లు నిరూపించటానికి ప్రయత్నించింది. ప్రపంచానుభవం ఆవిడ పరిశీలన యదార్థమని నిరూపిస్తున్నది. మహిళ, నియమిత వృత్తి యొక్క ప్రాథమిక దశ స్థాయి ఉద్యోగంలో చేరగలిగినా, ఆవిడ పై పోస్టుకు పోవటానికి పలురకాల అవరోధాలను ఎదుర్కొన వలసి వస్తున్నది. ఉద్యోగ నియామకపు రూల్సు, పనితనాన్ని కొలిచే కొలమానాలు ఆవిడ ఎదుగుదలకు అవరోధాలుగా ఉంటున్నాయి. ఇవన్నీ పురుష ఉద్యోగులకు పురుష యజమానులకూ అనుకూలంగా ఉంటున్నాయి. ఉద్యోగంలో

ఉన్న మహిళ ప్రవర్తనా, కార్యనిర్వహణా విధానం, తల్లిగా, గృహిణిగా ఆవిడ నిర్వహించవలసిన అదనపు పనులను పురుషులు సానుభూతితో చూడటం లేదు. సామాజిక అవసరాలుగా ఈ సేవలకు గుర్తింపు లభించటం లేదు పురుష కార్పొరేట్ కల్చర్, వ్యక్తి ప్రవర్తన లోనికి కూడా ప్రవేశించి, మహిళల పాలిట శాపంలా పరిణమించింది. సెక్సు పరంగా మహిళా ఉద్యోగులను హింసించటం, మహిళా ఉద్యోగుల వృత్తి నైపుణ్యాన్ని తక్కువగా అంచనా వేయటం వంటి దురాగతాలకు మూల మీభావమే.

వృత్తి పరమైన అర్హతలు, వృత్తి నిర్వహణానైపుణ్యం గల వారంతా, స్త్రీ పురుష భేదం లేకుండా ఉన్నత పదవులకు ఎదుగవచ్చునన్నది సామాన్య సూత్రం. కాని పైని పేర్కొన్న అవరోధాల వల్ల అవసరమైన అర్హతలున్నా, అనుభవం ఉన్నా, స్త్రీలకు ఉన్నత పదవులన్నీ ఎండమావులే అవుతున్నాయి, ఈ స్థితినే ఇంగ్లీషులో "గ్లాస్ సీలింగ్" అని అంటున్నారు చేరవలసిన గమ్యం గాజుపలకలో నుండి చేరువుగా నున్నట్లు కనుపిస్తుంది. కాని, ఉద్యోగి దాన్ని చేరటాన్ని గాజుపలక నిరోధిస్తూంటుంది! ప్రపంచ మంతటా, తర తమ భేదాలతో స్త్రీల స్థితి ఇలాగే ఉన్నది.

గృహ నిర్వహణా బాధ్యతను మహిళ నిర్వర్తించవలసి రావటం, ఆవిడ వృత్తి పరంగా ఉన్నత పదవులకు చేరటానికి అవరోధంగా తయారైంది. గృహ నిర్వహణ, శిశు సంరక్షణకే మహిళ ప్రాధాన్యత నిస్తుంది గనుక, ఉన్నతోద్యోగ విధుల నిర్వహణను ఆవిడ సక్రమంగా చేయలేదు అని ప్రమోషన్ ఇవ్వవలసిన సమయాలలో సంస్థల యజమానులు భావిస్తారు. ఉదాహరణకు సింగపూరు అనుభవాన్ని చూడవచ్చు. వృత్తికి సంబంధించిన ట్రెయినింగుకు పంపేటపుడు, పురుషులకు ఎలాంటి అవరోధమూ ఉండదు కాని, వివాహిత స్త్రీలను, ముఖ్యంగా పిల్లలున్న వారిని, పంపటానికి యజమానులు వెనుకాడుతున్నారు అవివాహిత అయిన ఉద్యోగిని, పెండ్లయిన తర్వాత ఉద్యోగ విరమణ చేయవచ్చు గనుక, ఆవిడను కూడా తర్ఫీదుకు పంపరు.

మహిళ భార్యగా, తల్లిగా, ఉద్యోగినిగా వ్యవహరించ వలసి ఉంటుంది. భర్త, తండ్రి, ఉద్యోగి పాత్రలను మగవాడు పోషిస్తున్నాడు. ఈ రెండు పాత్రలు భిన్న స్వభావం గలవి; నిర్వహణా విధానం కూడా భిన్నమైనదే. సంస్థల నిర్మాతలు పురుషులు, వాటిని పురుషుల అవసరాలకు తగినట్లు నిర్మించారు. స్త్రీ పుట్టిపెరిగిన సంప్రదాయానికి, వాతావరణానికి కార్పొరేట్ కల్చర్ భిన్నమైనది. ఆవిడ జీవితానుభవం కూడా భిన్నమైనదే. కనుక ఇదంతా అగమ్యగోచరంగానూ, కొన్ని సందర్భాలలో అవమానకరంగానూ స్త్రీలకు కనుపించటం సహజం

ఇన్ని అవరోధాలను అధిగమించి ఉన్నత పదవిని చేరగలిగిన అదృష్టవంతురాలు, స్త్రీగా, "మైనారిటి" వర్గానికి చెందిన మనిషిగా పలురకాల సమస్యలను ఎదుర్కొన వలసివస్తున్నది. ఒక "స్త్రీ" గా ఉన్నతోద్యోగ భారాన్ని మోయవలసి రావటం, ఇంతకు పూర్వం అటువంటి ఉన్నతోద్యోగాలలో నున్న మహిళల అనుభవ సంపద నుండి లాభించే అవకాశాలు లేకపోవటం, పలువురు పురుషుల మధ్య పనిచేయవలసి రావటం చేత, అనుభవించ వలసి వచ్చే వంటరితనము, ఇందువల్ల అంకురించే వేర్పాటు భావము, ఇవన్నీ చాలవన్నట్లు ఉద్యోగినుల యెడల ప్రదర్శితమయ్యే అపోహలు, యజమానులు, తోటి ఉద్యోగులు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ప్రదర్శిస్తుండే వివక్ష, సంస్థా నిర్మాణ స్వభావము, స్వరూపము, దానిలో నెలకొని ఉండే వాతావరణము, వీటిని మహిళా ఎగ్జిక్యూటివులు ఎదుర్కొన వలసి వచ్చే అవరోధాలకు ఉదాహరణలుగా చెప్పవచ్చు. ఉన్నత స్థానాన్ని చేరగలిగిన మహిళ, ఈ అవరోధాలను ఎదుర్కొన వలసి రావటమే గాక, కుటుంబ నిర్వహణా భారాన్ని కూడా మోయవలసి ఉంటుంది. ఇందువల్ల, విషయనిర్ణయాధికారం గల పోస్టుకు చేరిన మహిళ విపరీతమైన మానసిక వత్తిడిని, ఆందోళననూ, అనుభవించ వలసి ఉంటుంది.

## సంస్థల యజమానులుగా మహిళలు

కార్పొరేట్ సెక్టార్లో మహిళలకు నిర్ణయాత్మక విషయాలను పరిష్కరించే అధికారం గల ఉన్నత పదవులు లభించటం లేదని చూచాం. ఇట్లని వారు నిస్సహాయులుగా కూర్చున్నారని అనుకోనవసరం లేదు. వృత్తి విద్యా నైపుణ్యాన్ని సంపాదించిన వారూ, చొరవగలిగి, అవసరమైనంత అండ ఉన్నవారు, స్వయం ఉపాధికి ప్రయత్నిస్తున్నారు. కొందరు

మహిళలు చిన్న స్థాయిలోనైనా, పరిశ్రమలను వ్యాపార సంస్థలను నెలకొల్పుతున్నారు పెద్ద సంస్థలలో ఉన్నత పదవులకు వెళ్ళటానికి మహిళకున్న అవరోధాల వంటివి ఈ చిన్న పరిశ్రమలలో లేవు.

ఎంత మంది మహిళలు ఇలాంటి సంస్థలను ప్రారంభించారు అని చెప్పటానికి ఇంకా తగినంత సమాచారం లభించటంలేదు ఉమెన్స్ ఇండికేటర్స్ అండ్ స్టాటిస్టికల్ డేటా బేస్ అనే సంస్థ ప్రకటించిన సమాచారం వల్ల కొన్ని అంచనాలు అందుబాటులో ఉన్నాయి "యజమానులు, స్వయం ఉపాధిలో నున్నవారు" అన్న వర్గీకరణ కింద ఇచ్చిన వివరాలను బట్టి, మహిళల సంఖ్యాబలాన్ని కొంతమేరకు అంచనా వేసే అవకాశాలున్నాయి (ఈ విషయాన్ని 9వ పట్టికలో చూడవచ్చు)

సమాజంలో పురుషాధిక్యత పెత్తనం చేస్తున్నది గనుక, సంపాదనా రంగంలో పురుషులు అత్యధిక సంఖ్యాకులుగా ఉండటం సహజం. స్త్రీల సంఖ్య అల్పంగా ఉండటంలో ఆశ్చర్యం లేదు గత రెండు దశాబ్దాలుగా ఈ స్థితి మారుతున్న సూచనలు కనుపిస్తున్నాయి. 1970 వ సంవత్సరంలో ప్రపంచంలో స్వయంఉపాధిలో ఉన్న వారిలో ప్రతి వందమంది పురుషులకు ఇరవయ్యారు మంది మాత్రమే స్త్రీలుండేవారు. వీరి సంఖ్యాబలం 1980 వ సవత్సరానికి 39 కి 1990 వ సంవత్సరానికి 40 కి పెరిగింది! వృత్తి విద్యా కోర్సులలో చేరుతున్న మహిళల సంఖ్య పెరుగుతున్న దృష్ట్యా స్వయం ఉపాధిలో ఉండే మహిళల సంఖ్యా బలం ఇంకా త్వరిత గతిని పెరిగే అవకాశాలున్నాయి.

ఇరవై సంవత్సరాల క్రితం పరిశ్రమలను, వ్యాపార సంస్థలను ఏర్పరచిన మహిళల సంఖ్య చాలా తక్కువగా ఉండేది పైన పేర్కొన్నట్లు ఇటీవలి కాలంలో వీరి సంఖ్య పెరుగుతున్నది ఆయాదేశాలు విడుదల చేస్తున్న సమాచారాన్ని బట్టి ఇందుకు సంబంధించిన అంచనాలు కొన్ని మనకు అందుబాటులో ఉన్నాయి గత రెండు దశాబ్దాల కాలంలో కొత్తగా ఏర్పాటైన వ్యాపార సంస్థలలో ఉత్తర ఆఫ్రికాలో 10 శాతము, ఉత్తర అమెరికాలో 33 శాతము, మాజీ జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లిక్ లో 40 శాతము మహిళలు స్థాపించినవే. కెనడా ప్రభుత్వం విడుదల చేసిన అంచనాల ప్రకారం 1975-1990 సంవత్సరాల మధ్యకాలంలో స్వయం ఉపాధిని చేబట్టిన మహిళల సంఖ్య 172 శాతం వరకూ పెరిగింది; ఇదే కాలంలో స్వయం ఉపాధిలో ప్రవేశించిన పురుషుల సంఖ్య 50 శాతం మాత్రమే పెరిగింది.

పురుషాధిక్యత చలామణి అవుతున్న కార్పొరేట్ సెక్టారు లోని కల్చరుకు, మహిళలు ఏర్పటు చేస్తున్న సంస్థలలోని కల్చరు భిన్నమైనది. మహిళలు కలిసికట్టుగా పనిచేస్తారు; ఆర్థిక విషయాలలో పొదుపును పాటిస్తారు; వారి అవసరాలేమిటో, పనిచేస్తున్న వాతావరణ మేమిటో వారికి బాగా తెలును. సక్రమమైన సర్వీసులను అందించి ఖాతాదారులను సంతృప్తి పరచగల నైపుణ్యమూ, పట్టుదల వారి కుంటుంది. మహిళా యజమానులు వ్యాపార రంగంలో నూతన సంప్రదాయాలను (కల్చర్‌ను) ప్రవేశ పెడుతున్నట్లు పరిశీలకులు భావిస్తున్నారు.

వీరు "ఆడవారు" కావటం చేతా, వారు ఏర్పాటు చేసిన సంస్థలు చిన్నవి కావటం వల్లా, కొన్ని ఇబ్బందులను ఎదుర్కొవలసి వస్తున్నది. బ్యాంకు రుణాలు, వృత్తి పరమైన తర్ఫీదు, సాంకేతిక నైపుణ్యం, వ్యాపారానికి సంబంధించిన సమాచారము- ఈ విషయాలలో కొన్ని ఇబ్బందులకు వారు గురవుతున్నారు సమాజంలో స్త్రీకి పురుషునితో సమానమైన స్థానం లేక పోవటం ఈ ఇబ్బందులకు ప్రధాన కారణం.

వీరికి ఎదురయ్యే ప్రధాన సమస్య పెట్టుబడిని సేకరించటం పురుషుడు బ్యాంకులో అప్పుతీసుకొంటే, వారికి హామీగా మరెవరూ సంతకం పెట్టనవసరం లేదు. అదే మహిళ విషయానికి వస్తే పురుషుడొకరు హామీ ఇస్తూ సంతకం పెట్టాలి, ఆపురుషునికి, ఆ మహిళ ప్రారంభిస్తున్న, లేక నడుపుతున్న సంస్థతో ఎలాంటి సంబంధం లేకపోయినా సరే, వారు సంతకం చేయాలి, లేక పోతే లోన్ శాంక్షన్ గాదు చిన్న పరిశ్రమలకు రుణాలు పొందటం కొంచెం కష్టమనే మాట నిజం. మహిళలు ఏర్పాటు చేసే సంస్థలకు ఇది మరింత కష్టమైన అంశము. కొన్ని దేశాలలోని బ్యాంకుల రూల్సు లోనే మహిళా వివక్ష అక్షరరూపంలో ఉంది. ఆస్థి హక్కులు, వారసత్వ హక్కులు, వైవాహిక సంబంధం వల్ల సంక్రమించే ఆస్తుల యాజమాన్యాన్ని నిర్దేశించే చట్టాలు, రూల్సు ఇవన్నీ మహిళలకు వ్యతిరేకం గానే ఉన్నాయి. ఇందువల్ల వారికి

రుణాలు పొందటం కష్టమవుతున్నది ఆఖరుకు వడ్డీ వ్యాపారులు కూడా వారికి అంత త్వరగా అప్పుఇవ్వరు. కనుక మహిళలు స్వంత వనరుల మీదనే ప్రధానంగా ఆధారపడవలసి వస్తున్నది. పెట్టగల పెట్టుబడి తక్కువ గనుక, చిన్న సంస్థనే స్థాపించాలి. తగిన తర్ఫీదు, సామర్థ్యం ఉన్నా, పెద్ద సంస్థలను ఏర్పాటు చేయటానికి మహిళలకు వీలుగావటం లేదు. పెట్టే పెట్టుబడి తక్కువగనుక సంస్థ అభివృద్ధి కూడా నెమ్మదిగానే జరుగుతుంది

ఈ కాలంలో వ్యాపార సంస్థను ఏర్పాటు చేయాలంటే సాంకేతిక నైపుణ్యం ఉండాలి: దానికి తోడు సంస్థను నిర్వహించటానికి తగినంత మేనేజీరియల్ నైపుణ్యం కూడా ఉండటం అవసరం మేనేజిమెంటు నైపుణ్యం తగినంత లేకపోవటం, తగినంత సాంకేతిక సహకారం అందక పోవటం వల్ల, సంస్థ విజయవంతంగా నడవటానికి అవరోధమేర్పడు తున్నది వీరు స్థాపించే సంస్థలు అంతరించటానికి దీనినే ప్రధాన కారణంగా పరిగణిస్తున్నారు.

ఇపుడున్న మేనేజిమెంటు తర్ఫీదులో మహిళ ప్రవేశానికి తగినన్ని అవకాశాలు లేవు మహిళలు ఏర్పాటు చేస్తున్న సంస్థల నిర్వహణకు అవసరమైన అంశాలు ఇపుడున్న ట్రెయినింగు కోర్సులలో ఉండటం లేదు. ఉన్న అవకాశాన్ని వినియోగించు కొందామంటే, గృహనిర్వహణా బాధ్యతలున్నందు వల్ల, మహిళ ఆ అవకాశాలను వినియోగించుకో లేక పోతున్నది శిక్షణా సంస్థలు కూడా, పురుషులు అధికంగా పనిచేస్తున్న ఆర్థిక విభాగాల వినియోగానికే తమ శిక్షణా విధానాన్ని రూపొందిస్తున్నారు.

కొన్ని దేశాలలో ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాలు పెద్ద సంస్థల ప్రయోజనానికే వినియోగపడుతున్నాయి. పెద్ద సంస్థల కంటే, సంఖ్యాబలంలో అధికంగా ఉన్న చిన్న సంస్థల ప్రయోజనాన్ని ఆయా ప్రభుత్వ విధానాలు విస్మరిస్తున్నాయి. మహిళలు నడిపే సంస్థలలో అత్యధిక సంఖ్యాబలం గలవి చిన్న స్థాయి సంస్థలే ప్రభుత్వాలు అనుసరిస్తున్న సంకుచిత విధానాల వల్ల, మహిళలు నిర్వహించే సంస్థలకు వనరులు సక్రమంగా అందటం లేదు; వారు లాభించటానికి అవకాశాలు ఉండటం లేదు.

సంస్థలు లాభించటానికి, ఆసంస్థలను నడిపే కుటుంబ సభ్యుల సహకారము, యజమానుల సంఘాలు తోడ్పడుతాయి. యజమానుల సంఘాల ఏర్పాటు వల్ల, వ్యాపార రంగంలో వస్తున్న మార్పులను తెలుసుకోవటానికి, కొత్తగా వస్తున్న అవకాశాలను గుర్తించటానికి, పరస్పర అనుభవ మార్పిడికి వీలుంటుంది. ఇలాంటి మహిళా యజమానుల సంఘాలు కొన్ని చోట్ల ఉన్నాయి; కొన్ని చోట్ల లేవు, ఉన్నచోట్ల నామ మాత్రంగానే ఉంటున్నాయి

పురుష యజమానుల సంఘాలు, మహిళా యజమానుల సంఘాలతో సామాన్యంగా సహకరించవు. ఆదర్శవంతగా పనిచేసే సంస్థల యజమానులను, ఇతరులు ఆదర్శప్రాయంగా తీసుకొని పనిచేస్తారు, ఇలాంటి వారి అనుభవం కొత్తవారిని ప్రభావితం చేస్తుంది. ఇంతటి కీలకమైన అవకాశాలు మహిళాయజమానులకు లభించటం లేదు.

పరిశ్రమను నడిపే స్త్రీకి, తల్లి, తండ్రి, భర్త వంటి వారి సంపూర్ణ సహకారం ఎంతో అవసరం. వీరి సహకారం ఉంటేనే మహిళా యజమాని, సంస్థ నిర్వహణా భారాన్ని, గృహ నిర్వహణా భారాన్ని సమన్వయీకరించ గలదు. ఇంతటి అదృష్టానికి మహిళా యజమానులంతా నోచుకోలేదు. వారు, వృత్తి పనిని, ఇంటి పనిని సమన్వయ పరచటానికి, సకాలంలో పనులు చేసుకోవటానికి ఇంకా పెనుగులాడుతున్నారు.

# 13

## మీడియాలో మహిళలు

పత్రికలు, రేడియో, టెలివిజన్ వంటి ప్రచార సాధానాలను "మాస్ మీడియా" అని వ్యవహరిస్తున్నారు. పత్రికలను ప్రింట్ మీడియా అని, రేడియో, టెలివిజన్ వలె ప్రచారంలో వినియోగపడే ఎలక్ట్రానిక్ సాధనాలను ఎలక్ట్రానిక్ మీడియాగాను వ్యవహరిస్తున్నారు. ఈ ప్రచార సాధనాలు (మాస్ మీడియా) ప్రజల ఆలోచనా విధానాలను, ప్రవర్తనను, నమ్మకాలను, జీవన విధానాన్ని ప్రభావితం చేస్తున్నాయి. ఈ విషయంలో ఇవి పటుతరమైన సాధనాలుగా పేరుపొందాయి. కాని వాటిలో పని చేస్తూండే జర్నలిస్టులలో చాలా మంది, వృత్తి వ్యాపకంలో పడి, ఈ విషయాన్ని మరచి పోతున్నారు. దీనిని గురించి ఆలోచించే కాలవ్యవధి కూడా చాలా మందికి లభించటం లేదనటం అతిశయోక్తి కాదు.

ప్రపంచంలో, ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో చదువురానివారు అసంఖ్యాకంగా ఉన్నా, పత్రికల సర్క్యులేషన్ పెరుగుతూనే ఉన్నది. వీటి ప్రచారం విస్తరిస్తూనే ఉన్నది. ఫిల్ములు, వీడియోలు, గ్రామసీమలలో కూడా కనుపిస్తున్నాయి. ప్రచారసాధనాలన్నిటిలోనూ, టెలివిజన్ శక్తివంతమైనదిగా రుజువైంది. దీనికి ఎంతగా ప్రశంసలు లభిస్తున్నాయో, అంతగా అది విమర్శలకు కూడా గురవుతున్నది. ప్రపంచాన్నంతటినీ ఇంట్లో చూపగల సాధనంగా టెలివిజన్ ఉండటం వల్ల, అది అత్యంత ప్రజాదరణను పొందుతున్నది. వ్యక్తుల మనస్సుల నాకట్టుకొని, వారి ఆలోచనా విధానాన్నే మార్చే శక్తినది ప్రదర్శిస్తున్నది. ఇందువల్ల ప్రచారంలో ఇది అత్యంత శక్తివంతమైనదిగా రూపొందింది.

వీటికితోడు, ఇటీవల అభివృద్ధి చెందుతున్న కమ్యూనికేషన్ టెక్నాలజీ, ప్రచార సాధనాల శక్తిని ఇనుమడింప చేసినదని చెప్పవచ్చు. గత రెండు మూడు సంవత్సరాలలో ఇంటర్నెట్ శక్తివంతమైన ప్రచార సాధనంగా రూపొంద నారంభించింది.

సెటిలైట్ బ్రాడ్ కాస్టింగ్ ప్రారంభమైన తర్వాత, తమ దేశంలో టెలివిజన్, రేడియో ప్రసారాల వసతులు లేకపోయినా, ఆదేశప్రజలు వీటిని గ్రహించగలుగుతున్నారు. ఒక్కొక్క సెటిలైట్ సిస్టం 30 ఛానల్సు వరకూ ఇవ్వగలుగు తున్నది. ఇందువల్ల ప్రపంచ వ్యాప్తంగా టెలివిజన్ ప్రసారాలు లభించే అవకాశాలు గలిగాయి. ప్రసార టెక్నాలజీలో సంభవించిన సాంకేతిక పరిణామాల వల్ల, ఈ ప్రసారాలను సెన్సార్ చేయాలన్న కొన్ని

## మార్పులను తేగల మహిళా జర్నలిస్టుల శక్తి

ప్రచార సాధనాలలో పనిచేసే మహిళా జర్నలిస్టుల సంఖ్యా బలం పెరిగితే, ప్రసారాంశాల రూపవైవిధ్యాలు మారగలవని అనుభవం నిరూపించింది.

వార్తా ప్రసార సంస్థలలో పనిచేస్తున్న మహిళా సంఖ్యాబలం, ముఖ్యంగా ఎడిటోరియల్ విభాగాలలో పని చేసే వారి సంఖ్య. పురుషుల సంఖ్యా బలంతో సమంగా పెరగలేదు కాని, కాలగతిని, మహిళల సంఖ్యా బలం పెరుగుతూ ఉండటం కనుపిస్తున్నది. పై పోస్టులకు వెళ్ళేవారి సంఖ్య కూడా గతంలో కంటే ఇపుడు అధికంగానే ఉన్నది. పది సంవత్సరాలకు పూర్వం ఊహకందని విషయాలివి మహిళా జర్నలిస్టుల సంఖ్యాబలం పెరగటంతో పాటు, ప్రసారమవుతున్న వార్తలలో నూతనాంశాలు చోటు చేసుకొంటున్నాయి ఇంతకు పూర్వము వెలుగు చూడ నోచుకోని అంశాలు ఇపుడు వార్తలలో కనుపిస్తున్నాయి అమెరికాలోని వంద పెద్ద దినపత్రికల మేనేజింగ్ ఎడిటర్స్ మీద 1992 లో సర్వే జరిగింది. పత్రికలలో పనిచేసే మహిళా జర్నలిస్టుల సంఖ్య పెరుగుతున్న కొలదీ, వార్తా సేకరణ కొత్త రంగాలకు విస్తరిస్తున్నదనీ, వస్తు వైవిధ్యం పెరిగిందనీ సర్వేలో పాల్గొన్న వారిలో 84 శాతం మంది చెప్పారు! మహిళ ఆరోగ్యం,కుటుంబ విషయాలు, శిశు రక్షణ, పోషణ, సెక్సు పరమైన వేధింపులు, మహిళల యెడల ప్రదర్శిత మవుతున్న వివక్ష, మానభంగాలు, భర్తలు భార్యలను కొడుతూ వేధించటం, నిర్వాసిత మహిళా సమస్యలు, జీవన వైవిధ్యం వంటి కొత్త అంశాలు వార్తల కెక్కటం పెరిగిందని వీరు అంగీకరించారు.

న్యాయానికివి క్రొత్త విషయాలు కావు. జన్మ నెత్తినప్పటి నుండి స్త్రీ అనుభవిస్తున్న విషయాలే ఇవి. కాకపోతే మహిళా జర్నలిస్టుల అభిరుచివల్ల ఇవి పత్రికల కెక్కి ప్రచారాన్ని ఇపుడు పొందుతున్నాయి.మరొక రకంగా కూడా మహిళాజర్నలిస్టులు తమ సామర్థ్యాన్ని చూపగలుగుతున్నారు. ఈ విషయాన్ని తెలుసుకోవటానికి మాజీ యుగోస్లావియాలో రగిలిన అంతర్యుద్ధాన్ని చూద్దాం. పెన్నీ మార్షల్ అనే మహిళా జర్నలిస్టు యుద్ధరంగ వార్తా సేకరణకు వెళ్ళారు. వీరు ఒక బందీల క్యాంపును చూచారు. అందులోని పురుషుల స్థితి ఎంతో దయనీయంగా కనుపించింది. వారు ఎంతటి హింసకు గురయినదీ తెలుసుకోవాలన్న ఆసక్తి ఆవిడకు కలిగింది. స్త్రీల స్థితిని విచారించటం కూడా ఇంత ముఖ్యమైన విషయమన్న భావం ఆవిడలో అంతవరకూ కలుగలేదట. ఇంతవరకూ అమలు జరుగుతున్న జర్నలిస్టు సంప్రదాయ ప్రభావం నుండి తాను బయటపడలేక పోవటమే ఇందుకు కారణమని ఆవిడ చెప్పుకొన్నారు. పురుషులను చూచిన తర్వాత స్త్రీలు పథకం ప్రకారం మానభంగానికి గురయినట్లు తెలిసి ఆవిడ ఓమర్‌స్కా, ట్రొనొపొల్ లోని క్యాంపులలోని మహిళలను చూచి, విషయాలను సేకరించారు. పథకం ప్రకారం స్త్రీలు మానభంగాలకు గురవుతున్నట్లు వీరు తెలుసుకొన్నారు. ఈ అంతర్యుద్ధంలో మహిళల మీద పథకం ప్రకారం జరుగుతున్న అత్యాచారాల వార్తను ప్రపంచానికి తొలుత వెల్లడించినదీ మహిళా జర్నలిస్టే.

యుద్ధానికి, మానభంగాలకు విడదీయరానంతటి సంబంధం ఉన్నది గనుక, తమ తరువాతి తరం మహిళా జర్నలిస్టులు యుద్ధరంగానికి వార్తా సేకరణకు వెళ్ళినపుడు, మానభంగాలను గురించిన వార్తా సేకరణకు ప్రాధాన్యత నిస్తారన్న విశ్వాసాన్ని పెన్నీ ప్రకటించారు. ఇది జర్నలిస్టుల వృత్తి ధర్మంగా ఉండాలని వీరు సూచించారు.

దేశాల ప్రయత్నాలు కూడా ఫలించటం లేదు. ప్రసార పటుత్వము, మానవ ఆలోచనను మార్చగల వీటి శక్తి, అనన్య సామాన్యమైనదిగా తయారైంది.

వార్తా ప్రసారాలకు, వినోదకార్యక్రమాలకు కోట్లాది మంది ప్రజలు, ఈ ప్రచార సాధనాల మీద ఆధారపడుతున్నారు. ప్రచార సాధనాలు ఎంత బలవత్తరమైనవో, వాటిలో పనిచేసే వారు కూడ అంతటి బలవంతులుగా ఉంటారని వేరుగా చెప్పనవసరం లేదు.

ప్రచార సాధనాల నిర్వహణలోనూ, వార్తా ప్రసారాలలోనూ, నీతి, నిజాయితీల పాటింపు అవసరమన్నది నైతిక సూత్రం ఇదొక సంప్రదాయంగా ఉంటున్నది. ఈ విషయ నిబద్ధతకు ప్రభుత్వాలు చట్టనిర్దేశాలను జారీ చేయకపోయినా, జర్నలిస్టు నీతిగా దీని పాటింపు జరుగుతున్నది ప్రచారంలో కూడా అందరకూ సమాన స్థానాన్ని ఇవ్వటం అవసరమనేది జర్నలిస్టు నీతి సూత్రాలలో ఒకటి. కాని, మీడియాలో, స్త్రీలకు పురుషులతోడి సమాన ప్రచారం లభించటం లేదు; వీటి నిర్వహణలో సమానావకాశాలు కూడా లభించటం లేదు. స్త్రీ సమస్యా చిత్రణలో గాని, జరుగుతున్న ప్రచార పరిమాణంలో గాని, స్త్రీలకు న్యాయం జరగటం లేదు.

ఈ విషయాన్ని ఇప్పటికే జరిగిన పలు పరిశోధనలు నిస్సందేహంగా రుజువుచేశాయి. మహిళా లోకానికి మీడియా, న్యాయంగా లభించవలసినంత ప్రచారాన్నివ్వటం లేదు. ఇచ్చట గమనించవలసిన అంశం ఒకటున్నది. మీడియా ఒక అంశాన్ని ఎంత శక్తి వంతంగా కవర్ చేయగలుగుతుందో, కొన్ని విషయాలను కవర్ చేయకుండా వదలి వేయటంలోనూ అంత శక్తివంతంగా వ్యవహరించగలదు. తలుచుకొంటే సంపూర్తిగా బ్లాక్ అవుట్ చేయగలదు! దీని శక్తి అంతటిది!

## వ్యక్తుల జీవన విధానాన్ని మార్చగల మీడియా శక్తి

వ్యక్తుల మీద మీడియా చూపగల ప్రభావ పరిమాణం మీద కూడా కొన్ని పరిశోధనలు జరిగాయి. ఇవన్నీ, మీడియా ప్రచారానికి మానవ ప్రవర్తనకు మధ్య సన్నిహిత సంబంధం ఉన్నట్లు రుజువు చేశాయి. చిన్న పిల్లలు, టెలివిజన్ ప్రసారాలలో కనుపించే పాత్రలను ఆదర్శప్రాయంగా తీసుకొని, తమ ప్రవర్తనను వాటి ప్రవర్తనకు అనువుగా మార్చుకొంటున్నట్లు కొన్ని పరిశోధనలు రుజువు చేశాయి. జీవన విధానాన్నే మార్చగల శక్తి టెలివిజన్ కున్నట్లు కొందరు పరిశోధకులు రుజువు చేశారు. వ్యక్తులు జీవితానుభవం నుండి ఎలా గుణపాఠాలను నేర్చుకొంటారో, టెలివిజన్ ప్రసారాల నుండి కూడా అంతటి ప్రభావాన్ని పొందగలరని కొందరు పరిశోధకులు నిరూపించారు.

మీడియా ప్రసారాలు, వ్యక్తుల నిర్ణయాత్మక విధానాలను ఎంత సులభంగా మార్చగలవో, వారి నమ్మకాలను కూడా అంత సులభంగా మార్చగలవని జీవితం రుజువు చేస్తున్నది. ఇందుకు పరిశోధకులు ఇరాక్ అధినేత సద్దాం హుస్సేన్ ఉదంతాన్ని ఉదహరిస్తున్నారు. నేటి మీడియా ప్రచారం ప్రకారం హుస్సేన్ పరమ కిరాతకుడుగా మనకు కనుపిస్తాడు. వారు అధికారానికొచ్చిన తొలి రోజులలో, మధ్యప్రాచ్య తిమిరాలను తరుమగల సూర్యబింబంగా వారిని మీడియా వర్ణించింది. అభ్యుదయాన్ని కోరే నాయకునిగా చిత్రించింది. లండన్ నుండి వెలువడుతున్న గార్డియన్ పత్రిక 1979 లో మధ్యప్రాచ్యపు "టిటో" గా వర్ణించింది; న్యూయార్క్ టైమ్స్ పత్రిక వీరిని "నూతన ఇరాక్ యొక్క బలవత్తరమైన శక్తి"గా పేర్కొన్నది. ఇలా వెలువడిన వ్యాసాలు, సద్దామ్ హుస్సేన్‌ను పశ్చిమదేశాల నూతన మిత్రునిగా పొగిడాయి. వీరు అధికారాన్ని చేపట్టిన వెంటనే తన సహచరులలో ఇరవయొక్కరిని హత్య చేయించిన తర్వాత కూడా ఇటువంటి ప్రచారం జరగటం గమనించదగిన విషయం. గల్ఫ్ యుద్ధం తర్వాత వీరినే మధ్య ప్రాచ్యపు కిరాతకునిగా చిత్రించటాన్ని మనం చూస్తూనే ఉన్నాం. ఇలాంటి ప్రచారాన్ని అమెరికన్ మీడియా ప్రారంభించగానే మిగిలిన అంతర్జాతీయ ప్రచార సంస్థలన్నీ దీన్నే వల్లించ నారంభించాయి. నీతి నియమాలను గాలికి వదలిన పిచ్చివానిగా చిత్రించసాగాయి. తొలుత జరిగిన ప్రచారానికిది పూర్తిగా వ్యతిరేకమైనదని వేరుగా చెప్పనవసరం లేదు.

హుస్సేన్ ప్రవర్తనలో నిజంగా మార్పు వచ్చిందా లేదా అన్న విషయాన్ని మనం నిర్ధారించలేకపోవచ్చు. కాని, ప్రజాభిప్రాయాన్ని మార్చగల శక్తి మీడియా కున్నది అన్న విషయాన్ని మాత్రం మనం నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇంతకు పూర్వం ప్రజలకున్న విశ్వాసాన్ని వారి మనసులనుండి తుడిచి

వేయగల శక్తి దీని కున్నది అన్న విషయ నిర్ధారణ కిది చక్కని ఉదాహరణ.

### మీడియా పాత్ర నిర్వహణ మీద కొన్ని నమ్మకాలు

మీడియా కథలను సృష్టించదు. అది వాస్తవాలను రిపోర్టు చేస్తుంది అని అంటుంటారు. జరుగుతున్న దాన్ని చిత్రిస్తుంది అని చెబుతారు. ఎవరి వాస్తవాన్నది చెబుతున్నది అన్నది పరిశీలనాంశం

మీడియా ప్రతిబింబించేది పురుషుల భావాలను. దాని నిర్వాహకులు. నిర్దేశకులు పురుషులు గావటమే ఇందుకు ప్రధాన కారణం. వారి మనోగత భావాలను బట్టి, ఏది వార్తగా ఇవ్వదగినది, ఏది తగనిది అని వారు నిర్ణయిస్తారు స్త్రీలకు సంబంధించిన విద్య, ఆరోగ్యం, పిల్లల పెంపకం వంటి విషయాలకు అతి తక్కువ ప్రాధాన్యత లభిస్తున్నది. అంతర్జాతీయ మీడియా ధోరణే ఇలా ఉంది. ఇది ఒక్క దేశపుదని చెప్పనవసరం లేదు

ప్రపంచంలోని ఏ సమాజంలోనూ స్త్రీలకు పురుషులతోడి సమానమైన స్థానం లభించటం లేదు. స్త్రీలకు మీడియాలో తగిన స్థానం లభించక పోవటానికి ఈ అసమానత్వమే కారణం అంటూ దానిని సమర్థించ బూనకూడదు. గత రెండు దశాబ్దాల కాలంలోనూ స్త్రీలు వేతనార్జనకు (లేబర్ మార్కెట్‌కు) రావటం పెరగటాన్ని మనం చూస్తున్నాం. కొందరు మహిళలు విధాన నిర్ణయాలు చేయగల స్థానాలకు వస్తున్నారు. పలు సంప్రదాయేతర వృత్తులలో మనకు కనుపిస్తున్నారు. కుటుంబ నిర్వహణలోనే గాదు, ఆర్థిక రంగంలోనూ, రాజకీయ, వ్యాపార, పారిశ్రామిక రంగాలలోనూ కనుపిస్తున్నారు. ఇంతవరకూ పురుషుల సంప్రదాయ రంగాలుగా ఉన్నవాటిలో స్త్రీలు ప్రవేశించ గలుగుతున్నారు.

ఈ మార్పులను మీడియా ప్రతిబింబించటం లేదు. ఇంకా వారినిది సంప్రదాయ దృష్టితోనే చూస్తున్నది. మత ఛాందసుల వలె ఇది అభివృద్ధి నిరోధక విధానాలను అవలంబిస్తున్నట్లు ఫెమినిస్టులు చేసే ఆరోపణలో వాస్తవం లేదని చెప్పలేము. ఈ అంశపు పరిశీలనకు యునెస్కో 1970 లో ఒక సారి, 1985 లో రెండవ సారి పరిశీలనలు జరిపించింది. మీడియా కవరేజ్‌లో 1970 తర్వాత తగినంత మార్పులు రాలేదు అని 1985 వ సంవత్సరపు రిపోర్టు పేర్కొనటమే ఇందుకు సాక్ష్యం.

వార్తలలోనూ, తాజా పరిణామాలను వివరించే సందర్భాలలోనూ "మేము వాస్తవాన్ని చిత్రిస్తున్నాం" అంటారు మీడియా నిర్వాహకులు. ఇది నిజంకాదు; వారి దృష్టికి వాస్తవమని కనుపించిన దాన్ని చిత్రిస్తున్నారు.

జర్నలిస్టు రిపోర్టు చేసేటపుడు, వాస్తవచిత్రణ జరగాలి గాని, దాని మీద వారి విశ్వాసం, లేక అభిప్రాయానికి అందులో తావుండకూడదు. ఇది మీడియా పాటించవలసిన నైతిక సూత్రం. కాని ఇలా జరగటం లేదు. దీనికి కారణాలను తెలుసుకోవటానికి, ఆ స్టోరీని కవర్ చేయాలని నిర్ణయించిన దెవరు? ఏ దృష్టితో దానిని కవర్ చేయాలి, ఆ వార్తా ప్రసారానికి ఎంత టైము, లేక స్పేస్‌ను ఇవ్వాలి, దానికి అనుసరించవలసిన శైలి ఏమిటి అన్న విషయ నిర్ణయం చేసిన వారెవరు అన్న విషయాలను మనం పరిశీలించటం అవసరం. ఎగ్జిక్యూటివు ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు, ఎడిటర్లు, చీఫ్ రిపోర్టర్స్, బ్యూరో ఛీఫ్స్ వంటివారు ఈ విషయాలను నిర్ణయిస్తారు. ఈ పదవుల నలంకరిస్తున్నవారు ప్రధానంగా పురుషులు. పాఠకులకు ఏది రుచికరంగా ఉంటుందో నిర్ణయించేది వీరు వీరి నిర్ణయాలే ప్రస్తుతం చెల్లుబాటులో ఉంటున్నాయి. వార్తా సంగ్రహణకు తగిన నోస్‌ను (నోస్ ఫర్ న్యూస్ ను) వీరు పెంచుకొన్నారు. ఏ వార్తను ప్రచురిస్తే పత్రికల అమ్మకాలు పెరుగుతాయో వీరికి తెలుసు. అలాంటి వార్తా ప్రచురణకే వారు ఉత్సాహాన్ని ప్రదర్శిస్తారు.

ఏది వార్త అవుతుంది అన్న విషయ నిర్ణయం, ఒక సంప్రదాయంగా మీడియాలో వస్తున్నది. ఈ విషయ నిర్ణయంలో ఆధునికత ఉండటం లేదు. కాలాను గుణంగా నిర్వచనం మారటం లేదు. వార్తలను వాసన చూడగలిగిన ముక్కుకు అన్ని రకాల వార్తలనూ వాసన చూడగల శక్తి ఉండటం అవసరం అన్న విషయవిస్మరణ జరుగుతున్నది. ఒక తోటలో పూసిన పూలలో సగభాగపు వాసనను గ్రహించలేని ముక్కు వల్ల ప్రయోజనం ఏమిటి? వాసనను పసిగట్ట గలిగిన ముక్కుకు, అన్ని రకాల వాసనలను, దాని మూలాలను గుర్తించగల జ్ఞానం ఉండటం అవసరంగదా!

మీడియా లక్ష్యం ఉన్న దానిని చిత్రించటం మాత్రమే కాదు, భావికి కూడా బాటలు వేయగలిగి ఉండాలి. క్రొత్త ధోరణులను చిత్రిస్తున్నాం అంటూ, తమ మనోగత భావాలనే జర్నలిస్టులు ప్రకటిస్తూ ఉండటాన్ని అమెరికన్ జర్నలిస్టు సుసాన్ ఫ్లాడీ తాము వ్రాసిన "బ్యాక్ లాష్: ది అన్‌డిక్లేర్డ్ వార్ ఎగైన్స్ట్ అమెరికన్ ఉమెన్" లో దుయ్య బట్టారు. జర్నలిస్టులు, సమాజపు నాడిని పరిశీలిస్తున్నాం అంటూ, తమ హృదయ చలన విధానాన్ని చూసుకొంటున్నారన్నారు, ప్రకటనదారుల కనుగుణంగా ప్రవర్తిస్తున్నారని విమర్శించారు.

సుసాన్ వాడిన పరుష పదజాలాన్ని అందరూ ఆస్వాదించలేకపోవచ్చు. కాని ఆ పదజాలం వెనుక నున్న వారి మానసిక వ్యథను అర్థం చేసుకోవటం కష్టంగాదు. వృత్తిలోనూ, వ్యక్తిత్వంలోనూ పురుషులతోడి సమాన స్థానం స్త్రీకి లభించాలి అన్న భావ ప్రచారంలో, మీడియా దాదాపు తటస్థ వైఖరిని అవలంబించటాన్ని ఆవిడ నిరసించారు. స్త్రీ స్థానం ఇల్లు గనుక, ఆవిడ ఇంటికే కట్టుపడి ఉండాలన్న భావాన్ని సుసాన్ అంగీకరించ లేకపోతున్నారు. ఈ విషయంలో వివాదానికి తావులేదు. స్త్రీ స్థానం ఇల్లే; స్త్రీకి పురుషునితో సమానత్వం లభించవలసిన అవసరం లేదు, అన్న సామాజికుల భావనలనే మీడియా బలపరుస్తూ వస్తున్నది.

వార్తగా ఇవ్వదగినది ఏది, ఎలాంటి వార్తా ప్రచురణ సంస్థలకు లాభకరం అన్న విషయ నిర్ణయంలో, స్త్రీ జనాభ్యుదయము, స్త్రీల భావాలకూ పరిగణన లభించటం లేదు. ఏది వార్త అన్న నిర్వచనంలో మార్పు తప్ప కుండా రావాలి.

ఏది హార్డ్ న్యూస్, ఏది సాఫ్ట్ న్యూస్? పైన పేర్కొన్న సంప్రదాయ వాదుల వార్తా వర్గీకరణ విధానంలో ఇదొక శాఖ అని చెప్పవచ్చు. జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలు, యుద్ధము, వ్యాపారము, పరిశ్రమలు, ఫైనాన్స్, యంత్రాల వాడుకతో పెద్ద యెత్తున జరిగే వ్యవసాయము, ప్రకృతి వైపరీత్యాలు, సంఘర్షణలు, సాయుధ పోరాటాలు, స్పోర్ట్సు మొదలైనవన్నీ హార్డ్‌న్యూస్ గా పరిగణనకు వస్తాయి. విద్య, ఆరోగ్యం, సంస్కృతి, కుటుంబ వ్యవహారాలు, పిల్లలు, జంతువులు, ఫ్యాషన్లు, జీవన విధానాలు మొదలైనవి సాఫ్ట్ న్యూస్ క్రిందకు వస్తాయి.

హార్డ్ న్యూస్ మగవారి సువిశాల జీవన ప్రపంచానికి సంబంధించిన వయితే, సాఫ్ట్ న్యూస్, మహిళల ఇల్లు, కుటుంబానికి పరిమితమైన సంకుచిత పరిధికి సంబంధించినవిగా పరిగణనకు వస్తాయి.

హార్డ్ న్యూస్ మొదటి పేజీలో ప్రముఖంగా వస్తుంది. సాఫ్ట్ న్యూస్ లోపలి పేజీలకు వెళుతుంది హార్డ్‌న్యూస్‌కు స్థలం అవసరమైనపుడు, సాఫ్ట్ న్యూస్‌ను తీసివేయటం అతిసామాన్యం. ఒక సందర్భంలో అమెరికా మాజీ అధ్యక్షులు రిచర్డ్ నిక్సన్, నీ వార్త మొదటి పేజీలో పడిందా, లోపలి పేజిలో పడిందా; అందుకు కారణమేమిటి అన్న విషయ నిర్ణయం అతి సులభమన్నారు. నిన్ను చూసి వారు భయపడుతూంటే, నీ వార్త మొదటి పేజీలో పడుతుంది: లేకపోతే ఏ ముప్ఫయ్యవ పేజీకో పోతుంది అని అన్నారు!

స్త్రీల వార్తలన్నీ సాధారణంగా సాఫ్ట్ న్యూస్ వర్గంలోకి వస్తాయి. కనుక ప్రచురితం గావటం అంటూ జరిగితే, అవి పత్రిక లోపలి పేజీలకే వెళతాయి. స్త్రీలను చూచి మీడియా భయపడటం లేదు అని చెప్పటానికిదే నిదర్శనం!

పాఠకులు కోరే విషయాలనే కవర్ చేస్తాం అని అంటారు మీడియా నిర్వాహకులు. ఇదే నిజమైతే అంతర్జాతీయంగా చూచినపుడు, వార్తా పత్రికలను చదివే మహిళా పాఠకుల సంఖ్య ఎందుకు తగ్గుతున్నది? వార్తా పత్రికలను చదివే పురుషుల తగ్గుదల కంటే మహిళా పాఠకుల తగ్గుదల ఎందుకు అధికంగా ఉంటున్నది! నాయకత్వ స్థానాలకు ఎదుగుతున్న స్త్రీల మీద వస్తున్న అతి తక్కువ టెలివిజన్ కార్యక్రమాలు, పురుషులు ఇంటి పనులను చేస్తూ, భార్యలకు గృహనిర్వహణలో చేదోడుగా ఉండటాన్ని చిత్రించే "సాఫ్ట్ న్యూస్" ప్రేక్షకులను ముఖ్యంగా స్త్రీ ప్రేక్షకులను ఆకర్షించటం కనుపిస్తున్నది. ఇది అంతర్జాతీయ పరిణామం. రేడియోలో వచ్చే స్త్రీల కార్యక్రమాలలో, పరిశ్రమలలో, వ్యవసాయంలో స్త్రీలు, స్త్రీల ఆరోగ్య సమస్యలు వీరిని అధికంగా ఆకర్షించటం కనుపిస్తున్నది.

చక్కని జీవిత చిత్రణ ఉన్నపుడు శ్రోతలుగాని, ప్రేక్షకులు గాని ఆకార్యక్రమాలకు అధికంగా ఆకర్షితులవుతారు. తమ జీవిత చిత్రణలో, స్త్రీలు వైవిధ్యాన్ని కోరుతున్నారు. ఇపుడు ప్రసారమవుతున్న కార్యక్రమాల మీద శ్రోతల లేక

ప్రేక్షకుల అభిప్రాయాలను సర్వే కాలంలో అడుగుతున్నారే తప్ప, "మీకు ఎటువంటి కార్యక్రమాలు కావాలి" అని మాత్రం అడగటం లేదు. సంప్రదాయేతర కార్యక్రమాలకు లభిస్తున్న స్త్రీల ఆదరణను చూచినపుడు, మీడియా తన దృక్పథాన్ని మార్చుకోవాలన్న విషయం స్పష్టమవుతుంది. దాదాపు అన్ని దేశాలలోనూ, ప్రేక్షకులు లేక శ్రోతల, లేక పాఠకుల ఆకాంక్షలకు తగినట్లుగా ప్రసార కార్యక్రమాలు ఉండటం లేదు. ఈ స్థితి మారాలి.

"స్త్రీలకు పురుషులతోడి సమానత్వం కావాలి అని ప్రచారం చేయటం మీడియా ధర్మం కాదు, ఏ ఒక్క గ్రూపు అవసరాలకో ప్రచారం చేయము" అని మీడియా నిర్వాహకులు అనవచ్చు ఈ పనిని చేయమని, స్త్రీలు కోరటం లేదు. మీడియా స్వాతంత్ర్యాన్ని కోల్పోవటాన్ని స్త్రీలు కోరటం లేదు. ఏ ఒక్క గ్రూపు కోసమో మీడియా పని చేయాలన్న భావం స్త్రీలకు లేదు. మీడియా, ప్రస్తుతం, స్త్రీలకంటే పురుషులకు సంబంధించిన వార్తలకే ప్రాధాన్యత నిస్తున్నది. జనాభాలో సగభాగంగా ఉన్న స్త్రీలు, తమకు కూడా మీడియా ప్రచారంలో సగభాగం లభించాలని ఆశించటం అత్యాశకాదు. స్త్రీ పురుషుల మధ్య మీడియా పాటిస్తున్న ఈ వివక్ష అంతరించాలని మాత్రమే స్త్రీలు కోరుతున్నారు.

## మీడియాలో మనీ పాత్ర

మీడియాలో స్త్రీ పురుషులకు సమాన ప్రచారం లభించక పోవటానికి, మనీకి (డబ్బుకు) సంబంధం ఉన్నదా? ఉన్నది . ఆధునిక ప్రపంచంలో మనీ ప్రాబల్యం మీడియా మీద అధికంగా ఉన్నదని కూడా చెప్పవచ్చు. ప్రపంచ మీడియాలో అత్యధిక భాగం ధనార్జనాలక్ష్యంతోనే పని చేస్తున్నది. ప్రచార సాధనాల మనుగడ, వాటి ధనార్జన, వ్యాపార ప్రకటనల మీద ఆధారపడి ఉన్నది. ప్రసారాంశాలతో మిళితం చేసి, వ్యాపార ప్రకటనలను చేస్తుంటారు. తమ సరుకుల కొనుగోలుకు వాడకం దారులను ఆకట్టుకొనేట్లు ప్రకటనలను రూపొందిస్తూంటారు.

ప్రపంచ జనాభాలో సగం మంది స్త్రీలే నన్న అంశాన్ని పలుమార్లు పాఠకులకు చెప్పనవసరం లేదు. వాడకందారులలో సగం మంది స్త్రీలుంటారని ఈ అంశం మనకు గుర్తు చేస్తున్నది అమెరికన్ జర్నలిస్టు సుసాన్ ఫ్లాడీ అంచనాల ప్రకారం, సరుకులను కొనే వారిలో నూరింట 80 మంది వరకూ స్త్రీలుంటారు. పలు సమాజాలలో కుటుంబ వాడకపు వస్తువుల కొనుగోలు నిర్ణయాలు చేస్తున్నది స్త్రీలే; ఆహార పదార్థాలు, వస్త్రాలు, గృహోపకరణాలు వంటివి వీరి ప్రోద్బలంతోనే కొంటుంటారు. అమెరికాలో మార్కెట్‌కు వచ్చే కార్లలో సగభాగాన్ని స్త్రీలే కొంటున్నట్లు రిశర్చి రిపోర్టులు సూచిస్తున్నాయి. అంతేకాదు; ఇటీవల స్త్రీలు స్టాక్ మార్కెట్లో షేర్లను కొనటం కూడా అధికమైంది. తాజా అంచనాల ప్రకారం, అమెరికా మహిళలలో నూరింట అరవైమంది షేర్లను కొంటున్నారు. గృహనిర్వహణ, పిల్లల చదువు, వైద్య విషయాలవంటి వాటిని చూచేది స్త్రీలే గనుక, కుటుంబ కొనుగోళ్ళ మీదా, ఆఖరుకు భర్తల కొనుగోలు విధానాల మీద కూడా స్త్రీల ప్రభావం ఉంటుంది.

ప్రకటన కర్తలకు స్త్రీ ఖాతాదారులు ఇంత ముఖ్యమైన వారయినా, వారికి ప్రచారంలో తగిన స్థానాన్ని మీడియా ఇవ్వటం లేదు. కొన్ని సందర్భాలలో వారికి అసభ్య ప్రచారాన్ని కూడా ఇస్తూ అపచారం చేస్తున్నది. ఇందుకు కారణమేమిటి? ఆధునిక స్త్రీల ఆశలు, ఆశయాలను వారిలో అంకురించిన చైతన్యాన్ని మీడియా గుర్తించలేక పోవటమే ఇందుకు కారణమని ఆస్ట్రేలియాకు చెందిన ది ఆఫీస్ ఆఫ్ ది స్టేటస్ ఆఫ్ ఉమెన్ సంస్థ అభిప్రాయ పడుతున్నది. ఈ విధంగా మీడియా, వాడకందార్లలో సగం మందిని విస్మరిస్తున్నది. మహిళలను ఆకర్షించటం కోసం మీడియా ఫ్యాషన్ సప్లిమెంట్సు వంటి వాటిని ప్రచురిస్తూంటుంది. వంటా- వార్పులకు సంబంధించిన విషయాలను కూడా వాడుతూ ఉంటుంది. స్త్రీల కార్యక్రమాలకు, వారి అభిప్రాయాలకు, కార్యాచరణకు ప్రచారాన్నివ్వటానికి బదులు మీడియా ఇలాంటి చౌకబారు ఆకర్షణలను వాడుతున్నది. ఈ పరిస్థితుల అవగాహనవల్లనే, రీనా బర్టోస్ తాము వ్రాసిన "మార్కెటింగ్ టు ఉమెన్: ఏ గ్లోబల్ పర్స్పెక్టివ్" అన్న పుస్తకంలో స్త్రీలను సంప్రదాయ బద్ధంగా చిత్రిస్తూ, కాలందీరిన విధానాలను అవలంబిస్తూ "మహదవకాశాన్ని మీడియా కోల్పోతున్నది" అని చెప్పారు. ఇది వ్యాపార ప్రకటనదారులను మాత్రమే ఉద్దేశించి చేసిన వ్యాఖ్య అయినా, మీడియా నిర్వాహకులకు కూడా వర్తిస్తుంది.

ఆస్ట్రేలియన్ ఆఫీస్ ఆన్ ది స్టేటస్ ఆఫ్ ఉమెన్ సంస్థ, మీడియాలో స్త్రీల చిత్రణ మీద 1993 లో పరిశీలనలను జరిపించింది. ఈ పరిశీలనలను జరిపిన నేషనల్ వర్కింగ్ పార్టీ, స్త్రీల సమస్యల మీదా, ప్రపంచ విషయాల మీదా వార్తలను, వ్యాసాలను ప్రచురించటం, రేడియో, టెలివిజన్ కార్యక్రమాలను నిర్వహించటం ద్వారా అధిక సంఖ్యాక స్త్రీలను ఆకర్షించే అవకాశాలున్నట్లు పేర్కొన్నది. స్త్రీలకు ఇచ్చే ప్రచారాన్ని కొంచెం పెంచితే, అవసరమైతే పురుష ప్రచారాన్ని కొంచెం తగ్గించి, దాన్ని స్త్రీలకు కేటాయిస్తే, స్త్రీ పాఠకుల లేక ప్రేక్షకుల సంఖ్య పెరుగుతుంది; ఇందువల్ల తగ్గే పురుష పాఠకులు లేదా ప్రేక్షకుల సంఖ్య నామమాత్రంగానే ఉంటుందని అభిప్రాయపడింది.

ఇందులోని సత్యానికి ప్రపంచ వ్యాప్తంగా రుజువులు కనుపిస్తున్నాయి. ఐరిష్ టైమ్స్ పత్రిక 1991 వ సంవత్సరంలో నల్లజాతి మహిళా పాఠకులను ఆకర్షించదలచింది. మేరీ కమింగ్స్ అన్న ప్రఖ్యాత రచయిత్రిని స్త్రీ విషయాల కరస్పాండెంటుగా నియమించింది. ప్రఖ్యాత మహిళా జర్నలిస్టులను తీసుకొని, వారిని స్వేచ్ఛగా మహిళా ప్రపంచంలో సంచరించి వార్తా సేకరణకు పూనుకొమ్మని ఆదేశించింది. ఒక మహిళా ఫీచర్ ఎడిటరును , ఇద్దరు డ్యూటీ ఎడిటర్సును నియమించింది. ఒక డే టైం ఎడిటరును కూడా నియమించింది. వీరంతా మహిళా జర్నలిస్టులే.

దీని ఫలితంగా పత్రికా సర్క్యులేషన్ త్వరితగతిని పెరిగింది. ఆ పెరుగుదల ఆగక, కొనసాగుతూ ఉండటం కనుపించింది. ఈ పనిని ఆ ప్రచురణ సంస్థ స్త్రీలను జాలి దలచి చేయలేదనీ, వ్యాపార దృష్టితోనే చేసిందనీ న్యూస్టేట్స్‌మన్ పత్రికా జర్నలిస్టొకరు వ్యాఖ్యానించారు.

బ్రిటన్‌లో ప్రముఖ మహిళా జర్నలిస్టులను నియమించిన పత్రికా సంస్థలు, వాటి సర్క్యులేషన్‌ను పెంచుకోగలుగుతున్నాయి. వాటి మహిళా పాఠకుల సంఖ్య క్రమంగా పెరుగుతున్నది.

దీనిని బట్టి, మహిళాలోకపు వార్త, వ్యాస ప్రచురణ ఒక్కటేగాదు; బాధ్యతాయుత స్థానాలలో మహిళా జర్నలిస్టుల నియామకాలు కూడ పత్రికా సర్క్యులేషన్ పెంపుకు తోడ్పడగలవని స్పష్టమవుతున్నది.

మీడియాకు ఇంత ముఖ్యమైన మహిళా జర్నలిస్టుల నియామక విధానాలను, వారికి లభిస్తున్న ఉద్యోగాల సంఖ్యా పరిమాణాలనూ, వీటి హోదాకు సంబంధించిన అంశాలను పరిశీలించుదాం.

## మీడియా ఉద్యోగులలో స్త్రీల సంఖ్యా పరిమాణం

ప్రచార సాధనాలలో పని చేయటానికి ఇటీవలి కాలంలో స్త్రీలు అధిక సంఖ్యలో ముందుకు వస్తున్నారు. గత పదిహేను సంవత్సరాల కాలంలో కమ్యూనికేషన్ విద్యను ఆర్జిస్తున్న స్త్రీల సంఖ్య బాగా పెరిగింది. ఈ ధోరణి ప్రపంచ వ్యాప్తంగా కనుపిస్తున్నది మీడియాలో స్త్రీల స్థాన నిర్ణయం మీద 1993 లో యునెస్కో 81 దేశాలలో వివరాలను సేకరించింది. ఇందులోని యాభైదేశాలలో జర్నలిజం, కమ్యూనికేషన్ విద్యను అభ్యసిస్తున్న వారిలో స్త్రీల సంఖ్యా పరిమాణం యాభై శాతానికి మించే ఉన్నది. కాని, టెలివిజన్, రేడియో, పత్రికలలో పనిచేస్తున్న వారిలో మహిళలు ఇంత అధిక సంఖ్యలో కనుపించటం లేదు. ఒక్క అమెరికా, యూరపు దేశాలలో తప్ప, మరే దేశంలో చూచినా, ప్రచార సాధనాలలో పనిచేస్తున్న స్త్రీల సంఖ్యా పరిమాణం ముప్పైశాతానికి తక్కువగానే ఉన్నది. (వివరాలను ఒకటవ, రెండవ పట్టికలలో చూడవచ్చు)

మీడియాను నిర్వహించే సంస్థలు తీసుకొన్న మహిళలను, ప్రొడక్షన్, ఎడిటోరియల్ పోస్టులలో నియమించటం కంటే, పరిపాలనా సంబంధమైన శాఖలలో అధికంగా నియమిస్తున్నారు. ఇందువల్ల ప్రసారం చేయదగిన అంశాలను నిర్ణయించటానికి, నిర్ణయించిన వాటికి ప్రసారానికి తగిన రూపకల్పన చేయటానికి స్త్రీలకు అవకాశాలు లభించటం లేదు. ఆఫ్రికా, యూరపు, లాటిన్ అమెరికాలలో, పరిశీలనకు ఎన్నుకొన్న ప్రతిదేశంలోనూ, నియమిత మహిళలలో నూరింట యాభైమందికి మించే పరిపాలనా సంబంధమైన పోస్టులలో పనిచేస్తూండటం కనుపిస్తుంది. ఆ పరిపాలనా శాఖలలో కూడా అట్టడుగు గుమాస్తాలుగా, దిగువ స్థాయి మేనేజర్లుగా మాత్రమే స్త్రీలు పని చేస్తున్నారు!

సాంకేతిక నైపుణ్యం అవసరమైన ఉన్నత పోస్టులలో, ముఖ్యంగా రేడియోలో, స్త్రీలు నామమాత్రంగానే కనుపిస్తారు.

ఈ పదవులలో పనిచేసే వారికి అధిక వేతనాలు లభిస్తాయి. ఉన్నత పదవులకు ప్రమోషన్ పొందే అవకాశాలుంటాయి. ప్రోగ్రాముల ప్రొడక్షన్ వీరి చేతిలో ఉంటుంది. ఈ పోస్టులలో, యూరపు దేశాలలో ఎనిమిది శాతం మంది, ఆఫ్రికా దేశాలలో ఐదుశాతం మంది, లాటిన్ అమెరికాలో నాలుగుశాతం మంది మాత్రమే మహిళలు పనిచేస్తున్నారు. లాటిన్ అమెరికాలో, సర్వేజరిగిన ఆరు దేశాలకూ చెందిన 22 రేడియో ప్రసార సంస్థలలో పని చేస్తున్న సిబ్బందిలో ఒక్క మహిళ కూడా లేదు! ఈ ఉద్యోగాలకు అవసరమైనంత తర్ఫీదు పొందిన మహిళలు తగినంత మంది లభించకపోవటం దీనికి కారణంగా చెబుతూ ఉంటారు. ఇది వాస్తవం కాదని యూరపులో జరిగిన సర్వేలు నిరూపించాయి. తగిన విద్యార్హతలున్నవారు వచ్చినా, అతి తక్కువ మంది మహిళలనే ఈ పోస్టులకు తీసుకొంటున్నట్లు ఈ సర్వేలు నిరూపించాయి.

ప్రచార సాధనాలను నిర్వహించే సంస్థలలో ఎడిటోరియల్, ప్రొడక్షన్ విభాగాలు అత్యంత కీలకమైనవి. ప్రసారమయ్యే అంశాల విషయప్రాధాన్యతను, రూపకల్పననూ నిర్ణయించే విభాగాలివి. పత్రికల విషయాన్ని పరిశీలనకు తీసుకొంటే, లాటిన్ అమెరికా దేశాలలో మహిళా ప్రాతినిధ్యం కొంచెం సంతృప్తికరంగా కనుపిస్తుంది. సర్వేకు తీసుకొన్న ఆరు లాటిన్ అమెరికా దేశాలలో రిపోర్టర్స్, స్టాండర్డ్ జర్నలిస్టుల వర్గంలో 28 శాతం, కరస్పాండెంట్స్ వర్గంలో 29 శాతం, సబ్ - ఎడిటర్స్ లో 36 శాతం, ఎడిటర్స్ పోస్టులలో 24 శాతం, బ్యూరో ఛీఫ్స్, డైరెక్టర్స్, ఎగ్జిక్యూటివ్ ఎడిటర్స్ పోస్టులలో 21 శాతం మంది స్త్రీలున్నారు.

సర్వేకు తీసుకొన్న ఏ ఒక్క ఆఫ్రికా దేశంలోనూ బ్యూరో ఛీఫ్సుగా మహిళలు పనిచేయటం లేదు. జపాన్ లోనూ, మలేషియాలోనూ ఇదే పరిస్థితి ఉన్నది. భారతదేశంలో సర్వేకు తీసుకొన్న మూడు ప్రధానమైన పత్రికా ప్రచురణ సంస్థలలోనూ, ఒక్క దానిలో మాత్రమే ఒక్క మహిళ, బ్యూరో ఛీఫ్‌గా పనిచేస్తున్నది. మొత్తం పత్రికా సిబ్బందిలో ఎనిమిది శాతం మంది మహిళలు మాత్రమే పనిచేస్తున్నారు. సంస్థలలో పనిచేస్తున్న మొత్తంస్త్రీలలో 15 శాతం మంది మాత్రమే ఎడిటోరియల్ విభాగంలో ఉన్నారు. క్రియేటివు, టెక్నికల్ విభాగాలలో వీరికి స్థానం లభించలేదు. పరిపాలనా విభాగంలో 12 శాతం మంది, సీనియర్ మేనేజిమెంటు పోస్టులలో మూడు శాతం మంది మహిళలున్నారు. ఆర్థికంగా ఎంతో అభివృద్ధి చెందిన జపాన్‌లో పరిస్థితి దయనీయంగా ఉన్నది. మొత్తం పత్రికా సిబ్బందిలో ఏడు శాతం మంది మహిళలు మాత్రమే ఉన్నారు. వీరిలో 15 శాతం మంది ఎడిటోరియల్ విభాగంలో పనిచేస్తున్నారు; క్రియేటివు విభాగంలో నాలుగు శాతం మంది మహిళలు పనిచేస్తున్నారు. టెక్నికల్ విభాగంలో తొమ్మిది శాతం మంది వరకూ స్త్రీలు పనిచేస్తున్నారు సీనియర్ మేనేజిమెంట్ పోస్టులలో ఒక్క స్త్రీకి కూడా స్థానం లభించలేదు!

రేడియో, టెలివిజన్ ప్రసార సంస్థలలో మహిళలు, పత్రికా ప్రచురణలో కంటే అధికంగా కనుపిస్తున్నా, వారికి కీలక పదవులు మాత్రం ఇంకా గగన కుసుమాలు గానే ఉన్నాయి. టెక్నికల్ విభాగంలో పనిచేసే వారికి వేతనాలు అధికంగా ఉండటమే గాకుండా, ఉన్నత పదవులకు ప్రమోషన్ పొందే వీలుంటుంది. ఇలాంటి పోస్టులకు చేరే అవకాశాలు ఇంకా మహిళలకు లభించటం లేదు

అభివృద్ధి చెందిన దేశాలలో రేడియో ప్రసార సంస్థలలో పనిచేస్తున్న వారిలో 30 నుండి 40 శాతం వరకూ మహిళలు పనిచేస్తున్నారు. అయినా, సర్వే జరిగిన యూరపుదేశాలలో టెక్నికల్ విభాగంలో స్త్రీలకు ఎనిమిది శాతానికి మించి ప్రాతినిధ్యం లభించటం లేదు. ఆఫ్రికా, లాటిన్ అమెరికా, ఆసియా, దేశాలలోని స్థితి ఎంత దయనీయంగా ఉన్నదో, పట్టికలలోని వివరాలను పరిశీలిస్తే తెలుస్తుంది. ప్రొడక్షన్ అసిస్టెంట్స్‌గా, ఎనౌన్సర్స్‌గా, ప్రెజంటర్స్‌గా మాత్రమే స్త్రీలకు అధిక ప్రాతినిధ్యం లభిస్తున్నది. వీరి ప్రాతినిధ్యాన్ని పూర్తిగా ఈ మేరకే పరిమితం చేశారు.

రేడియో ప్రసార సంస్థలలో కంటే టివి లో మహిళల ప్రాతినిధ్య పరిస్థితి మెరుగుగా కనుపిస్తున్నది. యూరపు దేశాలలో 33 శాతం మంది, ఆఫ్రికాలో 34 శాతం మంది, లాటిన్ అమెరికాలో 41 శాతం మంది ప్రొడ్యూసర్సుగా పనిచేస్తున్నారు. మలేషియాలో ప్రొడ్యూసర్సుగా పనిచేస్తున్న వారిలో మహిళలు 36 శాతం వరకూ ఉన్నారు. భారత దేశంలో ఈ ప్రాతినిధ్యం మహిళలకు 30 శాతం వరకూ ఉన్నట్లు ఐక్యరాజ్య సమితి సర్వే ఫలితాలు వెల్లడిస్తున్నాయి. టెలివిజన్‌లో పనిచేస్తున్న మొత్తం ఉద్యోగులలో మహిళలు

15 శాతం మేరకే ఉన్నా, ప్రొడ్యూసర్స్ పోస్టులో మహిళలు మూడవవంతు వరకూ ఉండటం శుభసూచకమే. ప్రొడ్యూసర్స్ హోదా గాని, పని తీరు గాని, అన్ని టెలివిజన్ ప్రసార సంస్థల లోనూ ఒకే రకంగా ఉండని మాట వాస్తవం. ఈ పోస్టులలోని వారికి తగినంత పలుకుబడి ఉంటుందని చెబుతున్నారు. ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ పోస్టులు వచ్చేటప్పటికి, మహిళల పరిస్థితి అసంతృప్తి కరంగా కనుపిస్తుంది. (ఈ పోస్టుల లోని వారు డిపార్టుమెంట్ హెడ్స్‌గానో, లేక ప్రోగ్రాం కంట్రోలర్స్ గానో పనిచేస్తుంటారు) ప్రొడ్యూసర్స్‌గా 33 శాతం మంది మహిళలు పని చేస్తున్న యూరపు దేశాలలో, ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివు పోస్టులలో 15 శాతం మంది మాత్రమే స్త్రీలున్నారు. లాటిన్ అమెరికా దేశాలలో 41 శాతం పోస్టులలో ప్రొడ్యూసర్స్‌గా మహిళలు పనిచేస్తున్నా, వారికి లభించిన ఎగ్జిక్యూటివు ప్రొడ్యూసర్స్ పోస్టులు 16 శాతం మాత్రమే ఆఫ్రికాలో 12 శాతం, భారత దేశంలో 4 శాతం ఎగ్జిక్యూటివు ప్రొడ్యూసర్స్ పోస్టులు మాత్రమే మహిళలకు లభించాయి. జపాన్, మలేషియా, మాలావి, నమీబియా, స్వాజీలాండ్ దేశాలలో మాత్రం, ఈ పోస్టులలో ఒక్క మహిళ కూడా లేదు!

ఏ విధంగా చూచినా, మీడియా సంస్థలలో పురుషుల గుత్తాధి పత్యం కొనసాగటం కనుపిస్తుంది. ప్రపంచంలో నాలుగు మండలాలలోని ముప్పైదేశాలలో దాదాపు రెండు వందల సంస్థలను పరిశీలించిన తర్వాత తేలిన వాస్తవమిది! ఈ రెండు వందల సంస్థలలోను, ఏడింటిలో మాత్రమే స్త్రీలు ఆధిపత్య స్థానంలో ఉన్నారు. మరో ఏడింటిలో స్త్రీలు డెప్యూటీ డైరెక్టర్ల

### మహిళా జర్నలిస్టులు సాహసాన్ని, సామర్థ్యాన్ని ప్రదర్శిస్తున్నా.....

"టైమ్స్ ఆఫ్ ఇండియా రిపోర్టర్లు సిబ్బందిలో, ఎనిమిది సంవత్సరాల కాలం, నేను ఒక్క దానినే మహిళా రిపోర్టరును నా తొలి కాన్పుకు ప్రసూతి సెలవు కావాలని అడిగాను. రూల్సులో ఏముందో చూచి చెబుతాం అన్నారు యజమానులు. ఈ పత్రికలలో ఇంతకు పూర్వం ప్రసూతి సెలవు ప్రస్తావనే రాలేదు" 1988 లో శ్రీమతి ఉషారాయ్ చెప్పిన మాటలివి.

ఈవిడ 1960 లో టైమ్స్ పత్రికలో చేరారు. ఇపుడు ఈ పత్రికలో పనిచేస్తున్న జర్నలిస్టులలో నూరింట ఇరవైమంది వరకూ మహిళలున్నారు. రిపోర్టరుగా మహిళ కనుపించటం, ఇపుడు సామాన్య విషయమైంది. పలు దేశాలు, మహిళా రిపోర్టర్ల నియామకావసరాన్ని గుర్తించాయి. "క్రైమ్ బీట్" వంటి ప్రమాదకర రంగాలకు వారిని పంపకూడదన్న భావం కూడా క్రమంగా అంతరిస్తున్నది. యుద్ధరంగానికి కూడా వెళ్ళి మహిళా రిపోర్టర్లు వార్తలను సేకరిస్తున్నారు. ఈ తరగతి మహిళా జర్నలిస్టులలో బ్రిటన్ కు చెందిన కాటె ఎడిని గురించి చెప్పటం అవసరం. ఇలాంటి మహిళా జర్నలిస్టులు ఇపుడు చాలామంది టెలివిజన్ తెరల మీద కనుపిస్తున్నారు. ఎంతటి ప్రమాదకరమైన ప్రాంతాల కయినా వెళ్ళి, రిపోర్టులు ఫైల్ చేయటంలో సాహసాన్ని, మనో నిబ్బరాన్ని వారు ప్రదర్శిస్తున్నారు. చూపరులను అధికంగా ఆకర్షించటానికి, టెలివిజన్ ప్రసార నిర్వాహకులు తెరల మీద స్త్రీలను ఎక్కువగా చూపిస్తున్నారన్న చవకబారు ప్రచారం చేసేవారూ లేక పోలేదు. లండన్ టైమ్స్ వంటి పత్రికే ఇటువంటి భావాలను ఒక దశలో ప్రకటించింది!

ఇది వాస్తవమని మనం అంగీకరించినా, అంగీకరించక పోయినా, గత 15-20 సంవత్సరాల కాలంలో మహిళలు అధికంగా జర్నలిస్టులుగా వస్తున్నారన్నది వివాదాస్పదమైన అంశం గాదు. సీనియర్ ఎగ్జిక్యూటివులుగా పనిచేస్తున్న మహిళలు కూడా ఇవాళ ప్రచార సాధనాల నిర్వహణారంగంలో మనకు కనుపిస్తున్నారు. పని చేస్తున్న మహిళా జర్నలిస్టుల సంఖ్య పెరిగింది. ప్రాణభీతి లేకుండా, ఎంతటి ప్రమాదకరమైన స్థలాలకు కూడా వెళ్ళి రిపోర్టులు సేకరిస్తున్నారు. సాహసాన్నే గాకుండా వృత్తిపరమైన నైపుణ్యాన్నీ, సామర్థ్యాన్నీ ప్రదర్శిస్తున్నారు. అయినా ప్రచార సాధనాలలో పని చేస్తున్న మహిళలకు ఇప్పటికీ లభిస్తున్నది, "సీతాకోక చిలుకల" స్థానమే! వృత్తిలో పురుషులకు లభిస్తున్నంతటి గౌరవప్రదమైన స్థానం వారికింకా లభించటంలేదు.

హోదాలో పనిచేస్తున్నారు. వీటిలో అధిక భాగం చిన్న సంస్థలు! లేదా చిన్న పత్రికలు! రేడియో ప్రసార సంస్థలలో ఉన్నత స్థానాలకు పోయే అవకాశాలు స్త్రీల కంటే పురుషులకు ఏడురెట్లు అధికంగా ఉన్నట్లు యూరపులో జరిగిన సర్వేలు నిరూపించాయి. స్త్రీలకు మధ్యస్థాయి పోస్టులు అధికంగా లభిస్తున్నా, ఉన్నత స్థానాలను చేరటానికి అవరోధాలు ఎదురవుతున్నాయి. "గ్లాస్ సీలింగ్" గా వ్యవహరిత మవుతున్న ఈ వివక్ష అంత సులభంగా అంతరించదు.

ఈ సంస్థలు ఉద్యోగాలివ్వటంలోనే కాదు; వేతనాలివ్వటంలో కూడా స్త్రీ పురుష వివక్షను ప్రదర్శిస్తున్నాయని ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ సేకరించిన సమాచారం వల్ల తెలుస్తున్నది. ఈ సంస్థ 1993 లో సేకరించిన సమాచారం ప్రకారం, పురుషులకు లభిస్తున్న వేతనంలో స్త్రీలకు, ఆస్ట్రేలియాలో 78 శాతము, జక్ రిపబ్లిక్‌లో 90 శాతం, డెన్మార్క్ లో 94 శాతం, స్వీడన్‌లో 88 శాతం, యునైటెడ్ కింగ్డం లో 71 శాతం, అమెరికాలో 74 శాతం మాత్రమే లభిస్తున్నది. అభివృద్ధి చెందిన అమెరికాలో, యునైటెడ్ కింగ్డంలో ఈ వ్యత్యాసం నాల్గవ వంతు వరకూ ఉండటం గమనార్హం. అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ పరిస్థితి ఇలాగే ఉన్నది. పురుషుల వేతనంలో, బొలివియాలో 95 శాతం, సైప్రస్ లో 69 శాతం, ఘనాలో 91 శాతం, దక్షిణ కొరియాలో 68 శాతం, తజికిస్తాన్ లో 92 శాతం మాత్రమే స్త్రీ ఉద్యోగులకు లభిస్తున్నది.

## మహిళల కోసం మీడియా సంస్థలు

ఆధునిక కమ్యూనికేషన్ రంగంలో ముఖ్యంగా నెట్ వర్కింగ్‌లో మహిళల ప్రజ్ఞ జగద్విదితం. ఈ సాంకేతిక నైపుణ్యంతో మహిళలు తమ స్వంత మీడియా సంస్థలను ఏర్పాటు చేయటం మంచిదని కొందరు అభిప్రాయ పడుతున్నారు. గత పది సంవత్సరాల కాలంలోనూ మహిళా కమ్యూనికేషన్ కృషి ఫలితాలు కనుపిస్తున్నాయి.

మహిళల కోసం, మహిళల నిర్వహణ క్రింద మాస, పక్ష పత్రికలు వెలువడుతున్నాయి. న్యూస్ లెటర్స్, మోనోగ్రాఫ్స్, పలురచనలు కూడా వస్తున్నాయి. పాశ్చాత్య దేశాలలో వీటికి విశేష ప్రచారం లభిస్తున్నది. దీని ప్రభావం దక్షిణాది దేశాలకు కూడా విస్తరిస్తున్నది. తృతీయ ప్రపంచ మహిళా ప్రచురణల 1990 వ సంవత్సరపు డైరెక్టరీలో మూడు వందల మహిళా ప్రచురణల పేర్లున్నాయి.

స్త్రీలు నిర్వహించే పత్రికలకు వార్తలను, వ్యాసాలను అందజేయగల వార్తా సంస్థలు కూడా అవతరిస్తున్నాయి. ఆసియాలో డెప్త్ న్యూస్ అనే సంస్థ పని చేస్తున్నది. ఉమెన్స్ ఇంటర్నేషనల్ న్యూస్ గాదరింగ్ సర్వీస్ అనే సంస్థ అమెరికాలో ఉన్నది. చిలీలో ఫెమ్‌ప్రెస్ అనే సంస్థ పనిచేస్తున్నది

ఈ పరిణామాలు ఆహ్వానింపదగినవే అయినా, వీటి ప్రభావం మహిళా పాఠకుల మీద ఎలా ఉంటున్నది తెలియటం లేదు. ఈ వార్తా సంస్థలు సప్లయి చేస్తున్న వార్తలు, వ్యాసాలు ఎలా ఉంటున్నాయి; ఏ వర్గం వారికివి లాభదాయకంగా ఉంటున్నాయి; వీటివల్ల మహిళలు ఎంత మేరకు ప్రయోజనాన్ని పొందుతున్నారు అన్న వివరాలు లభించటం లేదు. మహిళలలో అత్యధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులు; ఇటువంటి పరిస్థితులలో ఈ మీడియా ప్రయోజనం అట్టడుగు వర్గాలకు, నిరక్షరాస్యులకు అందదుగదా అని ప్రశ్నించేవారు కూడా ఉన్నారు. ఈ అంశాలన్నింటి మీద తగినంతగా పరిశోధనలు జరగవలసిన అవసరం కనుపిస్తున్నది.

మహిళల కోసం ప్రత్యేక రేడియో, టివి ప్రసారాలు చాలా కాలంగా అమెరికా, యూరపులలో కొనసాగుతున్నాయి. ఇవి విని, చూచి ఆనందింప దగినవి గనుక, నిరక్షరాస్యులు కూడా వీటి వల్ల లాభించే అవకాశాలున్నాయి. రేడియో టియెరా అని చిలీలోనూ, ఫెమినిస్ట్ ఇంటర్నేషనల్ రేడియో ఎడివోర్ అని కోస్టారికాలోనూ స్త్రీ విషయ ప్రసారాలు చేసే రేడియో కేంద్రాలు పనిచేస్తున్నాయి. టివి ప్రసారాల కంటే రేడియో ప్రసారాలు పేదలకు అధికంగా అందుబాటులో ఉంటున్నాయి. కనుక పేద దేశాలలో కూడా రేడియో ప్రసారావకాశాలు చాలా వరకు విస్తరించాయి.

ప్రచారానికి చలనచిత్రాలు మంచి సాధనాలయినా, అవి ఎందువల్లో కమ్యూనికేషన్ సాధనా వర్గంలో చేరలేక పోయాయి. వీడియోలు వచ్చిన తర్వాత వీటి ప్రచారం బాగా దెబ్బతిన్నది. మహిళా సమస్యల ప్రచారానికి, మహిళలలో చైతన్యాన్ని కలిగించటానికి వీడియోలు ఉత్తమ సాధనాలుగా

## ఒకటవ పట్టిక

### పత్రికా ప్రచురణ సంస్థలలోని వివిధ శాఖలలో పనిచేస్తున్న మహిళల శాతం (1993)

| ప్రాంతము - దేశము | సర్వేజరిగిన సంస్థల సంఖ్య | అన్నిశాఖలలోను పనిచేస్తున్న మహిళలు | ఎడిటోరియల్ విభాగంలో | క్రియేటివ్ విభాగంలో | టెక్నికల్ విభాగంలో | పరిపాలనా విభాగంలో | సీనియర్ మేనేజ్‌మెంటు పోస్టులలో |
|---|---|---|---|---|---|---|---|
| యూరపు | | 27 | 24 | - | 12 | 46 | 18 |
| బెల్జియం | 6 | 22 | 21 | - | 4 | 37 | 14 |
| డెన్మార్క్ | 3 | 29 | 24 | - | 19 | 46 | 25 |
| జర్మనీ | 5 | 33 | 31 | - | 14 | 53 | 9 |
| ఇటలీ | 4 | 21 | 22 | - | 3 | 28 | 12 |
| లెగ్జెంబర్గ్ | 1 | 37 | 12 | - | 31 | 79 | 37 |
| నెదర్లెండ్స్ | 3 | 32 | 26 | - | - | 74 | 16 |
| పోర్చుగల్ | 1 | 20 | 14 | - | 2 | 32 | 13 |
| స్పెయిన్ | 3 | 26 | 45 | - | 9 | 29 | 18 |
| యునైటెడ్ కెంగ్డం | 4 | 25 | 23 | - | 1 | 31 | - |
| ఆఫ్రికా | | 27 | 18 | 14 | 11 | 41 | 13 |
| బోట్స్‌వానా | 5 | 33 | 16 | 0 | - | 45 | 10 |
| లెసోటో | 1 | 35 | 18 | 33 | - | 67 | 0 |
| మాలావి | 2 | 17 | 11 | 0 | 0 | 33 | 11 |
| నమీబియా | 3 | 47 | 34 | 6 | 28 | 69 | 32 |
| స్వాజీలాండ్ | 2 | 28 | 27 | 55 | 25 | 6 | 6 |
| టాంజానియా | 3 | 19 | 10 | - | 0 | 27 | 14 |
| జాంబియా | 2 | 21 | 17 | 0 | - | 38 | 14 |
| జింబాబ్వే | 9 | 19 | 9 | 5 | 4 | 47 | 13 |
| లాటిన్ అమెరికా | | 25 | 29 | 11 | 7 | 45 | 17 |
| చిలీ | 12 | 25 | 31 | 19 | 4 | 38 | 17 |
| కొలంబియా | 7 | 30 | 34 | 23 | 13 | 35 | 22 |
| ఈక్వెడార్ | 2 | 32 | 37 | 11 | 8 | 68 | 27 |
| మెక్సికో | 7 | 19 | 21 | 3 | 2 | 35 | 9 |
| పెరూ | 6 | 15 | 12 | 8 | 18 | 25 | 9 |
| వెనుజులా | 3 | 27 | 37 | 0 | 0 | 72 | 18 |
| ఆసియా | | | | | | | |
| భారతదేశం | 3 | 8 | 15 | 0 | 0 | 12 | 3 |
| జపాన్ | 5 | 7 | 9 | 4 | 0 | 9 | 0 |
| మలేషియా | 2 | 26 | 32 | 10 | 6 | 43 | 15 |

*- ఐక్యరాజ్య సమితి స్టాటిస్టికల్ డివిజన్ యునెస్కో సహకారంతో 1993 లో జరిపిన సర్వేఫలితాలు ఈ పట్టికకు ఆధారం.*

రెండవ పట్టిక
టి.వి, రేడియో ప్రసార సంస్థలలోను వివిధ శాఖలలో పనిచేస్తున్న మహిళల శాతం (1993)

| ప్రాంతము - దేశము | సర్వే జరిగిన సంస్థల సంఖ్య | అన్నిశాఖల లోనూపని చేస్తున్న మహిళలు | ప్రొడక్షన్ విభాగాలలో | క్రియేటివు విభాగాలలో | టెక్నికల్ విభాగాలలో | పరిపాలనా విభాగాలలో | సీనియర్ మేనేజిమెంట్ పోస్టులలో |
|---|---|---|---|---|---|---|---|
| యూరపు | | 35 | 35 | 32 | 8 | 68 | 12 |
| బెల్జియం | 3 | 31 | 35 | 29 | 4 | 66 | 10 |
| డెన్మార్క్ | 2 | 43 | 35 | 39 | 18 | 77 | 18 |
| ఫ్రాన్స్ | 7 | 37 | 33 | 30 | 11 | 80 | 24 |
| జర్మనీ | 14 | 39 | 27 | 44 | 13 | 75 | 4 |
| గ్రీస్ | 3 | 36 | 39 | 40 | 11 | 72 | 16 |
| ఐర్లండ్ | 1 | 33 | 41 | 25 | 4 | 71 | 12 |
| ఇటలీ | 2 | 30 | 34 | 33 | 2 | 57 | 4 |
| లెక్జెంబర్గ్ | 1 | 29 | 34 | 39 | 1 | 60 | 4 |
| నెదర్లెండ్స్ | 10 | 33 | 38 | 17 | 11 | 50 | 13 |
| పోర్చుగల్ | 3 | 34 | 33 | 29 | 6 | 63 | 8 |
| స్పెయిన్ | 9 | 30 | 28 | 27 | 6 | 66 | 11 |
| యునైటెడ్ కింగ్డం | 24 | 40 | 48 | 29 | 6 | 74 | 14 |
| ఆఫ్రికా | | 27 | 30 | 13 | 8 | 56 | 15 |
| బోట్స్వానా | 1 | 47 | 32 | 18 | 0 | 88 | 9 |
| లెసోటో | 1 | 40 | 44 | 0 | 23 | 100 | 50 |
| మాలావి | 1 | 11 | 19 | 0 | 4 | 33 | 9 |
| మొజాంబిక్ | 1 | 16 | 26 | - | 1 | 29 | 8 |
| నమీబియా | 1 | 25 | 28 | 17 | 3 | 61 | 11 |
| స్వాజీలాండ్ | 2 | 30 | 29 | 25 | 17 | 49 | 8 |
| జాంబియా | 1 | 25 | 30 | 13 | 10 | 56 | 13 |
| జింబాబ్వే | 1 | 22 | 33 | 20 | 5 | 35 | 14 |
| లాటిన్ అమెరికా | | 26 | 31 | 20 | 3 | 61 | 25 |
| చిలీ | 6 | 23 | 28 | 12 | 1 | 59 | 16 |
| కొలంబియా | 10 | 32 | 36 | 35 | 5 | 63 | 21 |
| ఈక్వెడార్ | 11 | 25 | 24 | 13 | 4 | 69 | 25 |
| మెక్సికో | 4 | 24 | 32 | 25 | 7 | 63 | 26 |
| పెరూ | 6 | 29 | 38 | - | 0 | 42 | 20 |
| వెనిజులా | 3 | 24 | 31 | 16 | 1 | 67 | 43 |

(ప్రక్క పేజ తరువాయి)

| ప్రాంతము - దేశము | సర్వే జరిగిన సంస్థల సంఖ్య | అన్నిశాఖల లోనూపని చేస్తున్న మహిళలు | ప్రొడక్షన్ విభాగాలలో | క్రియేటివు విభాగాలలో | టెక్నికల్ విభాగాలలో | పరిపాలనా విభాగాలలో | సీనియర్ మేనేజిమెంట్ పోస్టులలో |
|---|---|---|---|---|---|---|---|
| ఆశియా | | | | | | | |
| భారతదేశం | 2 | 12 | 24 | 9 | 8 | 19 | 10 |
| జపాన్ | 4 | 9 | 11 | 11 | 1 | 15 | 0 |
| మలేషియా | 1 | 28 | 36 | - | - | - | 0 |

*- ఐక్యరాజ్య సమితి వారి స్టాటిస్టికల్ డివిజన్ యునెస్కో సహకారంతో జరిపించిన సర్వే ఫలితాలు ఈ పట్టికకు ఆధారం*

గమనిక : 1. సీనియర్ మేనేజర్స్ ఉద్యోగాల కాలంలోని వివరాలలో ఛీఫ్ ఎగ్జిక్యూటివు ఆఫీసర్ (సి.ఇ ఓ), డెప్యూటీ ఛీఫ్ ఎగ్జిక్యూటివు ఆఫీసర్ పదవులను చేర్చలేదు. వీటి దిగువనున్న మూడంచెల పదవులను పరిగణనకు తీసుకొన్నారు.

2 యూరపు దేశాల వివరాలు 1990వ సంవత్సరానికి సంబంధించినవి.

3 లెగ్జెంబర్గ్, కొలంబియా, బోట్స్‌వానా, మొజాంబిక్, పెరూ దేశాల వివరాలు ప్రసార సంస్థలకు మాత్రమే సంబంధించినవి

4 భారతదేశపు వివరాలు ఆలిండియా రేడియో సిబ్బంది అంతటికి, దూరదర్శన్ కేంద్రకార్యలయంలోని సిబ్బందికి, ఈసంస్థకు సంబంధించిన ఏడు ప్రొడక్షన్ సెంటర్లలోనూ పనిచేస్తున్న సిబ్బందికి సంబంధించినవి.

ఉపకరిస్తున్నాయి. వీ టి వి పేరిట కెనడాలో ఒక సంస్థ ఏర్పాటైంది. ఇది సెటిలైట్ ద్వారా అంతర్జాతీయ ప్రసారాలను ప్రారంభించింది. ఇది ప్రధానంగా మహిళల కోసమే పనిచేస్తున్నది. మాంట్రియల్ లో ఏర్పాటైన వరల్డ్ అసోసియేషన్ ఆఫ్ కమ్యూనిటీ రేడియో బ్రాడ్ కాస్టర్స్ అనే నెట్‌వర్కింగ్ సంస్థ మహిళా సమస్యలకు ప్రాధాన్యత నిస్తున్నది

మహిళా నెట్‌వర్క్ సంస్థలు కూడా ఏర్పాటై పనిచేస్తున్నాయి. ట్రినిడాడ్, టొబాగోలలో కరిబియన్ అసోసియేషన్ ఫర్ ఫెమినిస్ట్ రిశర్చి అండ్ ఏక్షన్ అనే సంస్థ ఏర్పాటైంది. బార్బడోస్‌లో ఉమెన్ అండ్ డెవలప్‌మెంట్ పేరిట మరొక సంస్థ పనిచేస్తున్నది. ఆస్ట్రేలియాలో సిస్టర్ లింక్, అరబ్బు దేశాల మహిళల కోసం, లెబనాన్ లోని ఉమెన్ స్టడీస్ సంస్థ ఇటువంటిదే. కీన్యాలో ఫెమినిట్ అనే సంస్థ మహిళల కోసం పనిచేస్తున్నది.

## ప్రసారాల స్వీకరణలో స్త్రీల ఇబ్బందులు

ప్రపంచంలో అత్యధిక జనాభా రేడియో ప్రసారాలను వినగలుగు తున్నది. సెటిలైట్ ప్రసారాల వసతి వచ్చిన తర్వాత రేడియోతోపాటు టెలివిజన్ ప్రసారాలు కూడా ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకు చేరే అవకాశం లభించింది. టెక్నాలజీ ఉన్నా, పేదరికం వల్ల కొన్ని దేశాలు టెలివిజన్ ప్రసారాలను ప్రారంభించలేదు. ఇందువల్ల ప్రపంచంలోని దక్షిణ ప్రాంత దేశాల ప్రజలు వీటి ప్రయోజనాన్ని పొందలేక పోతున్నారు ప్రస్తుతం వాడకంలో ఉన్న టెలివిజన్ సెట్ల సంఖ్యా వివరాలు ఈ అంశాన్ని ధృవపరుస్తున్నాయి. ఉత్తర అమెరికాలో ప్రతి వెయ్యి మంది జనాభాకు 783 టెలివిజన్ సెట్లున్నాయి; ఆఫ్రికాలో 13, అభివృద్ధి చెందుతున్న దేశాలలో 39 చొప్పున మాత్రమే టెలివిజన్ సెట్లున్నాయి పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల వారంత అధికంగా, అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రజలు ఈ ప్రసారాల ప్రయోజనాన్ని పొందలేక పోతున్నారు. (3వ పట్టికను చూడండి)

టెలివిజన్ ప్రసారాలు జరుగుతున్న దేశాలలో, టెలివిజన్ సెట్ల అమ్మకాలు, వాటి సర్వీసింగ్ వసతులు లేకపోవటం, ఇవన్నీ ఉంటే వాటిని కొనగల ఆర్థిక స్థోమత లేక పోవటం వంటి అవాంతరాల వల్ల అధికులు వీటి ప్రయోజనాన్ని పొందలేక పోతున్నారు. పత్రికలను, పుస్తకాలను చదవటానికి

నిరక్షరాస్యత అడ్డుపడుతున్నది ఈ సమస్య, అభివృద్ధి సాధనకు పెద్ద అవరోధంగా తయారైంది పేద దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, అత్యధిక సంఖ్యాక మహిళలు నిరక్షరాస్యులుగా ఉన్నారు. ఇటీవలి కాలంలో విద్యావ్యాప్తి పెరుగుతున్నా, పురుషులలో తగ్గినంత వేగంగా, స్త్రీలలో నిరక్షరాస్యతా పరిమాణం తగ్గటం లేదు. ప్రచార సాధనాల అభివృద్ధికి, దేశాభివృద్ధికి ఈ సమస్య పెద్ద అవరోధంగా వ్యక్తిత్వం కూడా దక్కటం లేదు. గ్లోబలైజేషన్ పేరిట అంతర్జాతీయ గుత్తాధిపతులు ప్రపంచంలోని మీడియా నంతటినీ కంట్రోలు చేసే దశకు వచ్చారు. దీనివల్ల జాతీయ మీడియా పాలసీలు మారిపోయే ప్రమాదం ఏర్పడింది. లాభార్జనా దృష్టితో ప్రచార సాధనాల వాడకం జరిగే ప్రమాదం పెరిగింది. ఇది ప్రజలందరితో పాటు మహిళలకూ నష్టదాయకం.

సమాజంలో ఉన్న ఆర్థిక అసమానతలు, గ్రామీణ

**మూడవ పట్టిక**

**వాడుకలోనున్న రేడియో, టెలివిజన్ సెట్లు (1994 సం॥ అంచనాలు)**

| కమ్యూనికేషన్ సాధనాలు | సబ్ సహారన్ ఆఫ్రికా | అరబ్బు దేశాలు | దక్షిణ ఆసియా | తూర్పు ఆసియా | చైనా మినహా మిగిలిన తూర్పు ఆసియా | ఆగ్నేయ ఆసియా పసిఫిక్ ప్రాంతం | లాటిన్ అమెరికా, కరిబియన్ | వెనుక బడిన దేశాలు | అన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలు | తూర్పు యూరపు రష్యన్ ఫెడరేషన్ | పారిశ్రామిక దేశాలు | భారత దేశం | ప్రపంచం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రేడియోలు (ప్రతి1000 మంది జనాభాకు) | 149 | 259 | 88 | 214 | 702 | 154 | 349 | 96 | 178 | 420 | 1,018 | 81 | 361 |
| టెలివిజన్ సెట్లు ప్రతి 100 మంది జనాభాకు) | 3 | 12 | 5 | 23 | 26 | 14 | 21 | 2 | 14 | 30 | 50 | 6 | 22 |
| ఇంటర్‌నెట్ వాడకం దారులు (ప్రతి10,000 మంది జనాభాకు) | - | - | - | 1.4 | - | 1.6 | 2.0 | - | 1.5 | 6.4 | 223.2 | - | 60.9 |

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్ట్ - 1997 నుండి*

తయారైంది, తమ స్థితి గతులను గూర్చి తెలుసు కోవటానికిది అడ్డుపడుతున్నది.

కుటుంబంలో స్త్రీలు ఆర్థికంగా స్వతంత్రులు కాకపోవటం చేత, ఉన్న ప్రచారావకాశాలను కూడా వారు వినియోగించుకోలేక పోతున్నారు. ఆర్థికంగా వనరులున్నా, తాము కోరిన పుస్తకాలను, పత్రికలను కొని చదివే అవకాశాలు చాలామంది ఇల్లాండ్రకు లభించటం లేదు కొందరకు ఇంటి పనులతో తీరికలేక, ఉన్న అవకాశాలను వినియోగించుకోలేక పోతున్నారు.

దేశంలో ప్రజాస్వామ్యం ఉన్నపుడే ప్రచార సాధనాలు స్వేచ్ఛగా పనిచేయగలుగుతాయి. మహిళలు విజ్ఞాన వంతులయ్యే అవకాశాలుంటాయి. మత ఛాందసులు రాజ్యం చేస్తున్న చోట్ల (ఉదాహరణకు ఆఫ్‌గనిస్తాన్) మహిళలకు దారిద్ర్యం స్త్రీలకు, మీడియా వనతుల వినియోగానికి ప్రతిబంధకాలుగా తయారైనాయి. ఆర్థిక సరళీకరణ పేరిట, ప్రపంచబ్యాంకు, ఇంటర్నేషనల్ మోనిటరీ ఫండ్ సంస్థల బలవంతం వల్ల పలురకాల సబ్సిడీలు అంతరిస్తున్నాయి. ఇందువల్ల ప్రచార సాధనాలు వాడే పేపరు, ప్రింటింగ్ సామగ్రి ధరలు పెరిగే ప్రమాద మేర్పడింది. ఖర్చులు పెరిగాయి గనుక పత్రికలు , పుస్తకాల ధరలు పెరుగుతున్నాయి. ఇది చాలదన్నట్లు పేదరికము, అటుపై ఇంట్లో ఆర్థిక స్వాతంత్ర్యం లేమి స్త్రీలకు వీటిని అందుబాటులో లేకుండా చేస్తున్నాయి. కొన్ని దేశాలు చెప్పినట్లు మరికొన్ని దేశాలు వినవలసి రావటమే ఈ దుస్థితికి కారణం. దేశాల మధ్యే సమానత్వం లేక, ఒక దేశం చెప్పినట్లు మరొక దేశం వినవలసి రావటం సమానత్వానికి సూచనకాదు. అలాగే సమాజంలోనే అసమానతలున్నపుడు,

స్త్రీల యెడల అమలు జరుగుతున్న వివక్ష అంత సులభంగా అంతరించదు!

కొన్ని దేశాలు, స్త్రీల యెడల ప్రచార సాధనాలు అవలంబిస్తున్న కొన్ని అనుచిత విధానాలను నిషేధిస్తూనో, లేక పరిమిత పరుస్తూనో శాసనాలు చేశాయి. ఇది ఆహ్వానించదగిన అంశం. మహిళలను గౌరవ ప్రదంగానూ, వాస్తవికంగానూ చిత్రించటానికి ప్రచారసాధనాలకు ఆస్ట్రేలియా ప్రధానమంత్రి కార్యాలయం కొన్ని మార్గదర్శక సూత్రాలను నిర్దేశించింది. భారతదేశంలో స్త్రీల అశ్లీల చిత్రాల ప్రదర్శనను అరికట్టటానికి 1986 లో ప్రభుత్వం రిప్రెజెంటేషన్ ఆఫ్ ఉమెన్ (ప్రొహిబిషన్) చట్టాన్ని రూపొందించింది. సమాజంలో స్త్రీ, పురుష సమానత్వ సాధనా ప్రయత్నాన్ని నిరోధించే ప్రతిచర్యా అశ్లీలంకిందకే వస్తుందని కెనెడియన్ న్యాయమూర్తి ఒకరు నిర్వచించారు. ఇలాంటి చర్యలను ఇతర ప్రభుత్వాలు కూడా తీసుకోవటం మంచిది టోక్యోలో ఫోరం ఫర్ సిటిజన్స్ టెలివిజన్ అనే ఒక సంస్థ ఉన్నది. ఇది కూడా స్త్రీల యెడల జరిగే అసభ్య, అక్రమ ప్రచారాన్ని అరికట్టటానికి పనిచేస్తున్నది. ఇలాంటి ప్రయత్నాలు కూడా ఆహ్వానింప దగినవే.

## అనుసరించదగిన కార్యక్రమం

ప్రచార సాధనాల నిర్వహణ, కంట్రోలులో స్త్రీలకూ పురుషుల తోడి సమానత్వ సాధనకు పలురకాల ప్రయత్నాలు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్నాయి. కొన్ని లాటిన్ అమెరికా దేశాలలో స్త్రీల ఉద్యమం ఇలాంటి కార్యక్రమాలను చురుకుగా అమలు జరుపుతున్నట్లు రిపోర్టులు సూచిస్తున్నాయి. ఇంతవరకు సాధించినది చాలునని చెప్పటానికి వీలులేదు. ఇప్పటికి మహిళలు సాధించిన విజయాలు, వారి మహా ప్రస్థానంలో కొన్ని మజిలీలు మాత్రమే. ఇంకా చేయవలసింది ఎంతో ఉన్నది. ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ వల్ల ఆధునిక విధానాలు వస్తున్నందువల్ల, ఈకృషికి ఇంతకు పూర్వం లభించని అవకాశాలు ఇపుడు అందుబాటు లోనికి వస్తున్నాయి. గత అనుభవ ప్రాతిపదిక మీద ఇక ముందు అమలు జరుగవలసిన కార్యాచరణను గురించి కొన్ని సూచనలు చేయటానికి అవకాశాలున్నాయి

సాంఘిక, ఆర్థికాభివృద్ధికి అక్షరాస్యత పునాది వంటిదని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. బాలికలకు, స్త్రీలకు బేసిక్ ఎడ్యుకేషన్, ట్రెయినింగ్ లభించేట్లు చూడటం వల్ల, అభివృద్ధి కార్యక్రమాలలో వారు చురుకుగా పాల్గొనే అవకాశాలుంటాయి. అవసరమైన కమ్యూనికేషన్ ట్రెయినింగ్ వల్ల ప్రచార సాధనాల నిర్వహణలో స్త్రీలు సముచిత పాత్రను నిర్వహించే వీలుంటుంది.

కమ్యూనికేషన్, ప్రచార సాధనాల నిర్వహణలో, పురుషులతో సమంగా స్త్రీలకు కూడా శిక్షణ లభించాలి. అలాగే ఉద్యోగాలలోనూ సమానావకాశాలు లభించటమే గాక అన్ని అంతస్థులలోనూ పురుషులతో సమంగా స్త్రీల నియామకాలు జరగటం అవసరం వట్టి సంఖ్యా బలపు పెంపు ఈ సమానత్వాన్ని సాధించలేదని అనుభవం నిరూపించింది. అట్లని వృత్తి విద్యానైపుణ్యం లేనివారిని కూడా పెద్ద పోస్టులకు తీసుకోవాలని భావించనవసరం లేదు. ఆ పోస్టులకు తగిన మహిళ వచ్చినపుడు. ఆవిడను వదలి పురుషులను తీసుకోవటం వివక్ష క్రిందకు వస్తుంది.

స్త్రీల జీవితాలను, వారి జీవన విలువలను, వారి అభివృద్ధికి తోడ్పడే విధంగా ప్రసార సాధనాలు చిత్రించాలి. వారికి పురుషులతో సమానమైన ప్రతిపత్తి, ప్రచారము ప్రచార సాధనాల నిర్వహణలో లభించాలి. వారి జాతి, మత, సాంఘిక, సాంస్కృతిక అంశాల వక్రీకరణకు తావుండకూడదు

"నిపుణులు", "విజ్ఞానవంతులు" అనే పేరిట పురుషుల అభిప్రాయ ప్రకటనలను ప్రసారసాధనాలు ప్రచారం చేస్తుంటాయి. ఇలాంటి అవకాశాలు స్త్రీలకు కూడా లభించాలి. స్త్రీలు, స్త్రీల సమస్యలను గురించే మాట్లాడాలన్న నియమాన్ని పాటించ కూడదు. పురుషుల వలె జాతీయ, అంతర్జాతీయ విషయాలమీదా, వారి జీవన విధానము, జీవితాశయాల మీదా తమ భావాలను ప్రకటించే అవకాశాలుండాలి. స్త్రీల సమస్యలకే స్త్రీలను పరిమితం చేయటం అంటే, ప్రచార సాధనాల వినియోగంలో వారి చేతులను కట్టివేయటంగా భావించవలసి ఉంటుంది.

గత పది-పదిహేను సంవత్సరాల కాలంలో కొన్ని దేశాలలో స్త్రీలు, స్త్రీల కోసం ప్రత్యేక ప్రచారసాధనాలను నిర్వహిస్తున్నట్లు చూచాం. ఈ ఆదర్శప్రాయమైన కృషి, బలపడటమే కాకుండా, విస్తరించటం కూడా అవసరం. దీనికి

లభించే ఆర్థిక సహకారము. మేథావుల ప్రోత్సాహం పెరగాలి. అవసరమైతే ఖర్చుల తగ్గింపుకు. కొన్ని సంస్థలు కలిసి పనిచేయవచ్చు.

ఇప్పటి అభివృద్ధి పథకాల రూపకల్పనలో గాని. అమలులో గాని. స్త్రీలకు సముచిత పాత్ర లభించటం లేదు ఆర్థిక సరళీకరణ విధానాల వల్ల స్త్రీలు ఎంత పెద్ద యెత్తున నిరుద్యోగులయినారో. భద్రతలేని అసంఘటిత రంగానికి వారు తరల వలసి వచ్చిందో చూచాం ఈ మార్పుల భారాన్ని పురుషుల కంటే, స్త్రీలే అధికంగా మోస్తున్నట్లు, మార్పులను బలవంతంగా అమలు జరిపిస్తున్న ప్రపంచ బ్యాంకే బహిరంగంగా అంగీకరించక తప్పలేదు ఇలాంటి దుస్థితి ఏర్పడకుండా అభివృద్ధి ప్రణాళికల రచయితలు, వాటిని అమలు జరిపే ఏజన్సీలు జాగ్రత్తపడాలి. మహిళలకు ప్రచార సాధనాల నిర్వహణలో తగినంత ప్రాతినిధ్యం ఉన్నపుడు, ఇలాంటి దుష్ఫలితాలు రాగల ప్రమాదాన్ని ముందుగానే వారు పసిగడతారు. అవి సంభవించకుండా ఉండే మార్గాలను కూడా వారు సూచించగలరు. వర్తమాన కాలపు అభివృద్ధి ఫలితాలు స్త్రీ పురుషులకు సమానంగా లభించటం లేదు అని గుర్తించినపుడు, ఈ విషయావగాహన సులభమవుతుంది.

సమస్యాధ్యయనం పెరిగిన కొలదీ, దానికి తగిన పరిష్కార మార్గాల నాణ్యత కూడా పెరుగుతూ ఉంటుంది. ఇది అతి సామాన్య సత్యం. అలాగే ప్రచారసాధనాల నిర్వహణలోని లోటుపాట్ల మీద కూడా సమగ్ర అధ్యయనం జరగాలి. పరిశ్రమలో ఉద్యోగ నియామకాలు ఎలా ఉంటున్నాయి; ఇందులో మహిళలకు లభిస్తున్న స్థానం ఎటువంటిది, పత్రికలు, రేడియో, టెలివిజన్ ప్రసారాలలో స్త్రీల సమస్యల మీద వస్తున్న విషయమెంత, దాని నాణ్యతా పరిమాణమేమిటి అన్న అంశాలను ఆ మూలాగ్రంగా చూడాలి. ఇది నామమాత్రంగా గాక, ఆత్మశుద్ధి పరంగా జరగాలి. అంకిత భావంతో జరగాలి. ఇలాంటి పరిశీలనలు, సంస్థలలో పనిచేసే వారిమీద, ప్రచురితం, లేక ప్రసారిత మవుతున్న అంశాల మీదనే గాకుండా, పాఠకుల మీదా, శ్రోతల మీద కూడా జరగాలి. బహుళ జాతి గుత్త సంస్థల నీడలు జాతీయ ప్రచార సాధనాల మీద పడుతున్న ఈ కాలంలో ఇలాంటి అధ్యయనం జరగటం మరింత అవసరం. అన్ని ప్రాంతాల లోని మహిళా జర్నలిస్టులకు అవసరమైన తర్ఫీదు నీయటం వల్ల ఈ విషయంలో మంచి ఫలితాలు లభిస్తాయి.

ఇలాంటి అధ్యయనాలు జరగటం లేదని భావించ నవసరంలేదు. ఉండవలసిన స్థాయిలోనూ, అవసరమైనంత నాణ్యంగానూ ఇవి ఉండటం లేదు. వస్తున్న సమాచారం, ప్రపంచంలోని అన్ని ప్రాంతాల వారికి లభించే అవకాశాలుండటం లేదు. ఈ సమస్య ప్రధానంగా అభివృద్ధి చెందుతున్న దేశాలకే పరిమితమైంది. ఈ సమాచారం ప్రతి దేశంలోనూ లభించే అవకాశాలను కల్పించాలి. జాతీయ, ప్రాంతీయ డాక్యుమెంటేషన్ సెంటర్లను ఇందుకు ఏర్పాటు చేయవచ్చు; ఇలాంటి సమాచారాన్ని సేకరించి లైబ్రరీలలో నిల్వచేయవచ్చు.

# 14

## స్త్రీలకు సముచిత స్థానం లభించని రాజకీయ రంగము

రాజకీయ రంగము పౌరులందరకూ చెందినదే అయినా, అది మగవారి గుత్తసొత్తుగానే మిగిలిపోయింది. ఓటర్లలో సగభాగంగా ఉన్న మహిళలకు, ప్రపంచ పార్లమెంట్ల సభ్యత్వంలో 13 శాతము, క్యాబినెట్ మంత్రి పదవులలో ఏడు శాతం మాత్రమే లభిస్తున్నాయి. దీనిని బట్టి రాజకీయ రంగంలో మహిళలకున్న స్థానం నామ మాత్రమేనని స్పష్టమవుతున్నది.

ఓటర్లలో సగభాగంగా ఉన్న మహిళలకు నిర్ణయాత్మక స్థానం రాజకీయ రంగంలో ఎందుకు లభించటం లేదు అనేది ఇంకా అగమ్య గోచరంగానే ఉంది. కొన్ని స్వచ్ఛంద సేవా సంస్థలు ఈ "రహస్య" భేదనకు దర్యాప్తులు జరుపుతున్నాయి. సమాచారాన్ని సేకరిస్తున్నాయి. ఇలాంటి సేకరణల కందిన సమాచార మంతా పోలికలకు అందటం లేదు. ఒక్కొక్కరి సమాచారం ఒక్కొక్క దృక్పథానికి అవకాశమిస్తున్నది. దాదాపు నలభై సంవత్సరాల నుండి, మహిళలు, ప్రపంచ వ్యాప్తంగా ఓటింగు హక్కును అనుభవిస్తున్నారు. రాజకీయాలలో స్త్రీలకు కూడా నిర్ణయాత్మక స్థానం ఉండాలి అన్న అంశాన్ని దాదాపు అన్ని దేశాల ప్రభుత్వాలు గుర్తించాయి. అయినా, స్త్రీలకు రాజకీయ రంగంలో నిర్ణయాత్మక స్థానం ఇంకా లభించలేదు. మరే రంగంలోనూ స్త్రీ పురుషుల మధ్య ఇంతటి వ్యత్యాసమున్నట్లు కనుపించదు.

ఈ విషయం మీద, ఐక్యరాజ్యసమితికి చెందిన ఎకనామిక్ అండ్ సోషల్ కౌన్సిల్ 1990వ సంవత్సరంలో ఆమోదించిన పదిహేనవ తీర్మానంలోని దిగువ పేర్కొన్న భాగం గమనార్హమైనది "రాజకీయ రంగంలో మహిళలకు నిర్ణయాత్మక పాత్ర లభించటం లేదు అన్న అంశం స్పష్టంగా రికార్డయింది. రాజకీయ విషయాలలో, ముఖ్యంగా స్త్రీల జీవితాన్ని ప్రభావితం చేయగల పాలసీ నిర్ణయాధికారాలు ఇంకా పురుషుల చేతిలోనే ఉన్నాయి. ఈ విషయాల అమలులో స్త్రీల కుండేంత శ్రద్ధ పురుషుల కుండదు. ఇది సహజం. మహిళా సమస్యలను శ్రద్ధగా పరిష్కరించగల పార్టీలకే స్త్రీలు ఓటువేసి గెలిపించే సూచనలున్నట్లు ఇపుడిపుడే కనుపిస్తున్నాయి. కాని ఈ మొగ్గు పాలసీల రూపకల్పనను, అమలును ప్రభావితం చేసేంత బలమైనదిగా అభివృద్ధి చెందలేదు. సీనియర్ మేనేజిమెంటు స్థానాలకు స్త్రీలు అధిక సంఖ్యలో పోటీచేసి, నెగ్గి వాటిని

చేజిక్కించుకోనంత వరకూ పరిస్థితులు ఇలాగే ఉంటాయి. వారీ స్థానాలను ఆక్రమించ గలిగినపుడే మహిళా శ్రేయస్సుకు, తద్వారా సామాజిక శ్రేయస్సుకు భద్రత చేకూరుతుంది "

నిర్ణయాత్మకాధికారం గల స్థానాలకు మహిళలు రావలసిన అవసరాన్ని గురించి పలువురు పలు రకాలుగా సూచిస్తున్నారు. ఇవి అన్నీ కాకపోయినా, కొన్నయినా సమంజసంగా ఉన్నట్లు కనుపిస్తాయి. ఇటువంటి వాటిలో కొన్నిటి నిచట పేర్కొంటాం :

1 మొదటి వాదం ప్రజాస్వామ్యము, సమానత్వాలకు సంబంధించినది. జనాభాలో సగం మంది వరకూ స్త్రీలుంటారు గనుక, పురుషులతో సమానమైన ప్రాతినిధ్యం స్త్రీల కుండాలి పురుషులతోపాటు స్త్రీలకూ పౌరసత్వ హక్కులున్నాయి గనుక, సామాజిక, రాజకీయ జీవితపు అన్ని స్థాయిలలోనూ వారు సంపూర్తిగా పాల్గొనే అవకాశాలుండాలి. అధికార యంత్రాంగం నుండి స్త్రీలను దూరంగా ఉంచే వ్యవస్థ వాస్తవమైన ప్రజాస్వామికం కాలేదు.

2. రెండవ వాదం స్త్రీల హక్కులకు సంబంధించినది. ప్రజా ప్రతినిధులు తమ నెన్నుకొన్న ప్రజలతో సన్నిహిత సంబంధాలను కలిగి ఉండాలనీ, వారి ఆశలనూ, ఆశయాలను వారు చట్ట సభలలో ప్రతిబింబించ గలగాలని ప్రజాస్వామ్య సూత్రాలు, సంప్రదాయాలు నిర్దేశిస్తున్నాయి. శాసన సభలలో మహిళల ఆశయాలను ప్రతిబింబించగల స్త్రీ ప్రతినిధులు లేకపోవటం అనేది ప్రజాస్వామ్య వ్యతిరేకం. ఇందువల్ల, శాసన సభలు చేసే రాజకీయ విధాన నిర్ణయాలు స్త్రీ పురుషుల అవసరాలను సమంగా ప్రతిబింబించే అవకాశాలు ఉండవు. పురుషులు చేసే విధాన నిర్ణయాలు స్త్రీల అవసరాలను చక్కగా ప్రతిబింబించ లేవు. ఇందువల్ల ప్రజాప్రాతినిధ్య విధానం యెడల ప్రజలకున్న విశ్వాసం తొలగిపోయే ప్రమాదమున్నది. అమెరికా రాజ్యాంగ చట్టం శాసనసభ ఆమోదాన్ని పొందినపుడు, అది మహిళలకు ఓటింగు హక్కును, ఎన్నికలలో వారు పోటీచేసే హక్కును ఇవ్వలేదు. దీనిని అమెరికా మహిళా ప్రతినిధులు నిరసిస్తూ 1848 వ సంవత్సరంలో ఒక ప్రకటనను చేశారు. చట్టసభలు, చట్టాలు, రూల్సు రాజకీయ విధానాల రూపకల్పనలో తమ కెలాంటి పాత్రను అమెరికా రాజ్యాంగం ఇవ్వటం లేదు గనుక, అది చెల్లనేరదనీ, దాని నిర్దేశాల ప్రకారం రూపొందే చట్టాలను, విధానాలనూ తాము ఆమోదించమనీ, ఆ ప్రకటన స్పష్టం చేసింది. ఆ ప్రకటన "డిక్లరేషన్ ఆఫ్ సెంటిమెంట్స్, మేడ్ ఎట్ సెనెకా ఫాల్స్ - 1848" అన్న పేరిట ప్రఖ్యాతిని పొందింది ఇటువంటి మహిళా వ్యతిరేకత అన్ని చోట్లా వ్యక్తం కాగల ప్రమాదమున్నదని ఈ వర్గం వారి భావన.

3. మూడవది స్త్రీ-పురుషుల అవసరాలలోని భిన్నత్వానికి సంబంధించినది నిర్ణయాత్మక విషయ చర్చలలోనూ, నిర్ణయాల రూపకల్పనలోనూ పాల్గొనే అవకాశాలున్నపుడు, తమ అభిప్రాయాలను వ్యక్తం చేయటానికి తగిన సలహాలను ఇవ్వటానికి తమ వర్గపు వారికి హాని కలిగించే నిర్ణయాలు జరిగే ప్రమాదమున్నపుడు వాటిని ఎదిరించటానికి స్త్రీ ప్రతినిధులకు అవకాశాలుంటాయి. సమాజంలో స్త్రీ పురుష పాత్రలు భిన్నంగా ఉంటాయి వారి విలువలు కూడా వేరుగా ఉంటాయి. మహిళా సమస్యలు, మహిళలకు తెలిసినంతగా పురుషులకు తెలియవు. ఇందులో ఏమాత్రం సందేహం లేదు. అందువల్ల మహిళలే, తమ వర్గం వారి క్షేమాన్ని కాపాడటానికి కృషి చేయగలరు. మహిళల శరీరతత్వం వారికే బాగా తెలుస్తుంది. ఎపుడు బిడ్డనుకనాలో, కనకూడదో పురుషులకంటే వారికే ఎక్కువ తెలుసు. కుటుంబ నియంత్రణావసరం పురుషుల కంటే వారే బాగా ఎరిగి ఉంటారు. బిడ్డల పోషణ, సంరక్షణలో వారి కుండే శ్రద్ధ అసమానం. హింస నుండి పటుతరమైన రక్షణను వారు కోరతారు. పురుషుల నిర్ణయాధికారాలు చలామణి అయ్యే ఈ రోజులలో స్త్రీలకు ఇలాంటి రక్షణలు, సదుపాయాలు సమకూరటం లేదు. కనుక, మహిళా సంక్షేమ రక్షణలో రాజకీయ విధాన నిర్ణయాలలో స్త్రీలకు కూడా సమానావకాశాలుండాలి.

4. నాల్గవది రాజకీయాల ధోరణిలో వస్తున్న మార్పులకు సంబంధించినది. శాసన సభలో తగినంత మహిళా ప్రాతినిధ్యం ఉన్నపుడు,రాజకీయ విధాన నిర్ణయ ప్రాధాన్యతలో మార్పులను తెచ్చే అవకాశాలుంటాయి. నేటి మహిళలు రాజకీయాల సంప్రదాయ నిర్వచనాన్ని అంగీకరించటం లేదు. మహిళల రాజకీయ రంగ ప్రవేశం వలన రాజకీయ విషయాల పరిధి విస్తరిస్తున్నది. ఉదాహరణకు శిశు సంరక్షణ, స్త్రీల

సెక్సు సంబంధిత విషయాలు, కుటుంబ నియంత్రణ వంటి వాటిని తీసుకోవచ్చు ఇటీవలి కాలం వరకూ ఇలాంటి అంశాలు పూర్తిగా వ్యక్తికో కుటుంబానికో సంబంధించినవిగా ఉన్నాయి. ఇపుడవి రాజకీయాలలో భాగమైనాయి. నేటి విధానాల నిర్ణయాధికారాలు కొందరిచేతిలో కేంద్రీకృతమైనాయి వంశ పారంపర్యంగా ఈ హక్కుల చలామణీ జరుగుతున్నది. ఇవి పూర్తిగా టెక్నికల్ విషయాలుగా పరిగణనకు వస్తున్నాయని కొందరు మహిళలు భావిస్తున్నారు. రాజకీయాలు స్త్రీల ఆశయాలను ప్రతిబింబించేవిగా ఉండాలని ఈ వర్గం వారు కోరుతున్నారు.

5 ఐదవ అంశము మానవ సృజనాత్మక శక్తుల వినియోగానికి సంబంధించినది. ఏ దేశమయినా, తన పౌరులందరి సృజనాత్మక శక్తులను వినియోగించుకోగలిగినపుడే, పురోగమించ గలుగుతుంది. సామాజిక సృజనాత్మక శక్తులలో సగభాగం స్త్రీలవి. మాతృమూర్తులుగా, శిశు సంరక్షకులుగా వారు సమాజానికి చేస్తున్న సేవలు, చేకూర్చుతున్న ప్రయోజనాలు అత్యున్నతమైనవి; అత్యంతావశ్యకమయినవి కూడా. అయినా వారి ప్రాముఖ్యతను సమాజం తరచూ మరచి పోతున్నది. ఇల్లాలిగా ఇంటిని చక్కబెడుతూ, వేతనార్జనకు వెళుతూ, జాతీయ సంపదోత్పత్తికి సగభాగాన్ని స్త్రీ చేకూర్చుతున్నది. ఇంతటి ప్రముఖ పాత్రను నిర్వహిస్తున్న స్త్రీని ప్రజా ప్రాతినిధ్య సభలకు, అధికార పీఠానికి తీసుకురాక పోవటం వలన ప్రజా జీవనం పేదదవుతుంది; అన్ని అవకాశాలనూ ప్రజలంతా సమంగా అనుభవించేట్లు చేయగల ఆదర్శ సమాజ నిర్మాణ కృషి దెబ్బతింటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, విధాన నిర్ణయాలలో స్త్రీలు సంపూర్తిగా పాల్గొనలేక పోయినపుడు, రాజకీయ విధానాల అమలు, అవి సాధించగల మార్పులు ఉండవలసినంత పటుతరంగా ఉండవు. పైగా ఇటువంటివి సమాజానికి హానిచేసే అవకాశాలు కూడా ఉంటాయి.

ఈ వాదాలన్నీ సక్రమంగానే ఉన్నాయి. అయినా, అవసరమైన అర్హతలు గల మహిళలు పదవులకు లభించటం లేదు గదా అనే సమస్యను, ప్రతివాదులు ప్రతిపాదించే అవకాశాలు లేకపోలేదు. నిర్ణయాత్మక స్థానాలలో ఉన్న కొద్దిమంది మహిళల జీవిత చరిత్రలను తరచిచూస్తే మనకు ఇందుకు అవసరమైన సమాధానం లభిస్తుంది. ఇందుకు వారి జీవిత పరిణామాలను, నేటి సామాజిక పరిస్థితులను పోల్చి చూపటం అవసరం తగినంత మంది మహిళలు ఈ స్థానాల అలంకరణకు లభించక పోవటానికి పలు కారణాలు కనుపిస్తాయి. ఆర్థికాభివృద్ధి, సంపదోత్పత్తి పెరగటం ఇందుకు అవసరమా? పార్టీల విధానాలు, ఎన్నికల నిర్వహణా సరళి ఇందుకు కారణమా? పురుషుల రాజకీయ చతురతను అలవరచుకోవటం వలన, మహిళలు ఆ స్థానాలను అలంకరించగలరా? ఇవన్నీ ఆలోచించ వలసిన అంశాలే.

రాజకీయాలలో పదవులకు ఎన్నిక గావటానికి పౌరులకు తొలుత అవసరమైనది ఓటింగు హక్కు. పదవీ పీఠాల నెక్కటాని కిది ప్రధమ సోపానం వంటిది కనుక పై విషయ విచారణకు ముందు, స్త్రీలు ఓటింగు హక్కును సాధించుకొన్న వైనాన్ని చూద్దాం.

## మహిళలకు ఓటింగు హక్కు

సర్వజనీన ఓటింగు హక్కు లభించిన తర్వాతనే రాజకీయ నిర్ణయాత్మక స్థానాలకు వెళ్ళే అవకాశాలు మహిళలకు లభించాయి. కొన్ని దేశాలలో ఓటింగు హక్కుల సాధనకోసం, పంధొమ్మిదవ శతాబ్దమధ్యకాలంలో మహిళలు పోరాటాలను నడిపారు. ఈ ఉద్యమాలు ప్రధానంగా యూరపులోనూ, ఉత్తర అమెరికాలోనూ నడిపారు. స్త్రీల సంతానోత్పత్తి, గృహ నిర్వహణా బాధ్యతలకు, రాజకీయాలకు పొంతన కుదరదన్న వాదంతో మహిళలకు ఓటింగు హక్కులను నిరాకరించటం వలన వీరీ ఉద్యమాలను నడుపవలసి వచ్చింది.

మహిళలకు ఓటింగును నిరాకరించటానికి ప్రధానమైన కారణాలు మూడు :

1. మహిళలలో భావోద్రేకం అధికంగా ఉంటుంది గనుక, రాజకీయ పరిస్థితులను సక్రమంగా, వాస్తవికంగా వారు అంచనా వేయలేరు;

2. మహిళల భర్తలు ఇప్పటికే వారి ప్రతినిధులుగా, రాజకీయ రంగంలో ఉన్నారు గనుక వారికి ప్రత్యేక ప్రాతినిధ్యం అవసరం లేదు!

3. రాజకీయ మురికి కూపంలోనికి దిగితే వారి స్త్రీత్వం "మలినమవుతుంది!".

స్త్రీల ఓటింగు హక్కు సాధన కోసం 1900-1920 సంవత్సరాల మధ్యకాలంలో నడిచిన ఉద్యమంలో మహిళలు ప్రజా ప్రదర్శనలను నిర్వహించారు; ధర్నాలు జరిపారు, ఆఖరుకు నిరాహార దీక్షలను కూడా పూనారు. అభివృద్ధి చెందిన దేశాలయిన యునైటెడ్ కింగ్డం, అమెరికా, నెదర్లాండ్స్, నార్వే, స్వీడన్ వంటి దేశాలలో కూడా ఈ ఉద్యమం ఉన్నతస్థాయికి చేరింది. ఈ ఉద్యమం కొన్ని దేశాలలో 20వ శతాబ్దం యొక్క నలభయ్యవ, యాభయ్యవ దశాబ్దాలలో కూడా నడిచింది. తమను రాజకీయ రంగంలోనికి రానీయకుండా, వివాహము, గృహనిర్వహణ, పిల్లలపోషణ సంరక్షణ వంటి కార్యాలకే పరిమితం చేయటానికి వ్యతిరేకంగా కోస్టారికాలో మహిళలు తిరుగుబాటు చేశారు. ఇంతకు పూర్వం సంప్రదాయానికి కట్టుబడిన మహిళలు తెగించి వీధుల కెక్కారు. పురుషులతో సమానమైన హక్కులు కావాలంటూ మహిళలు వీధులలో ప్రదర్శనలు నిర్వహించారు.

ఓటింగు హక్కు సాధనకోసం మహిళలు ఉద్యమాలను నిర్వహించవలసిన అవసరం అన్ని దేశాలలోనూ గలుగలేదు. విద్య, ఉపాధి అర్హతల వంటివి, ఆర్థిక హక్కులు సమాజంలో దీర్ఘకాలిక మార్పులకు కారణమైనాయి. ఇంతకు పూర్వం, విద్య, ఆర్థిక స్థాయి వంటి వాటి ప్రాతిపదిక మీద లభించే ఓటింగు హక్కు, ఈ అవకాశాల విస్తరణ తర్వాత సులభంగా మహిళలకు లభించసాగింది. అదే, క్రమంగా మహిళల సర్వజనీన ఓటింగు హక్కుగా పరిణతి చెందింది.

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఫలితంగా కొన్ని దేశాలలో మహిళలకు ఓటింగు హక్కు, అందుకు ప్రత్యేకంగా ఆందోళన జరపకుండానే లభించింది. ఇందుకు భారతదేశమే పెద్ద సాక్షి. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాతే యూరపులోని కొన్ని దేశాల మహిళలకు ఓటింగు హక్కు లభించింది! పురుషులు దేశ రక్షణకు యుద్ధానికి వెళ్ళగా, మహిళలు వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో ఇంతవరకూ పురుషులు నిర్వహిస్తున్న బాధ్యతలను నిర్వహించి, దేశ ఆర్థిక వ్యవస్థను రక్షించిన ఫలితంగా మహిళలకు యుద్ధానంతరం "ఈ బహుమతి" నిచ్చారు.

ప్రపంచంలో మహిళలకు ఓటింగు హక్కు నిచ్చిన తొలిదేశం న్యూజిలెండ్. 1893 వ సంవత్సరంలో ఆ దేశపు మహిళలకు ఓటింగు హక్కు లభించింది. తర్వాత ఆస్ట్రేలియా 1901 వ సంవత్సరంలో తమ దేశ మహిళలకు ఓటింగు హక్కు నిచ్చింది. అటు తర్వాత ఆస్ట్రియా, కెనడా, జకస్లొవాకియా, డెన్మార్క్, ఫిన్లండ్, జర్మనీ, ఐస్‌లెండ్, ఐర్లెండ్, లెక్జెంబర్గ్, నెదర్లెండ్స్, నార్వే, పోలెండ్, సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్, అమెరికా దేశాలు 1920 వ సంవత్సరానికి తమ దేశాల మహిళలకు ఓటింగు హక్కు నిచ్చాయి. ఈ కాలంలో చాలా దేశాలు, తమ దేశపు చట్టాలను తగినట్లుగా సవరించి మహిళలకు ఓటింగు హక్కు లభించటానికి అవకాశం కల్పించాయి. అటుతర్వాత, రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభకాలానికి మరొక పదహారు దేశాలు తమ దేశాల మహిళలకు ఓటింగుహక్కులనిచ్చాయి. వీటిలో స్వీడన్, యునైటెడ్ కింగ్డం, పోర్చుగల్, స్పెయిన్, టర్కీలున్నాయి. బ్రెజిల్, బర్మా (ఇపుడు దీనిని "మయన్మార్" అని పిలుస్తున్నారు). క్యూబా, ఈక్వెడార్, మాల్దీవ్స్, మంగోలియా, ఫిలిపీన్స్, దక్షిణ ఆఫ్రికా, శ్రీలంక, తాయ్‌లాండ్, ఉరుగ్వే వంటి దేశాలకు, స్వాతంత్ర్యం లభించక ముందే ఆ దేశాల మహిళలకు ఓటింగు హక్కు లభించింది. నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ప్రజావిప్లవాన్ని నడిపి, ఆధునిక యుగంలో నాగరికతకు మారుపేరుగా పరిగణనను పొందుతున్న ఫ్రాన్సు దేశంలో మహిళలకు 1944వ సంవత్సరం వరకూ ఓటింగు హక్కు లభించలేదు. ఇటలీ మహిళలకు 1945 లోనూ, స్విస్ మహిళలకు 1971వ సంవత్సరంలోనూ ఓటింగు హక్కు లభించింది.

ఇంటర్-పార్లమెంటరీ యూనియన్ వద్దనున్న సమాచారం ప్రకారం, 1987 వ సంవత్సరానికి 115 దేశాలలోని మహిళలకు ఓటింగు హక్కు లభించింది. 1987వ సంవత్సరానికి న్యూజిలెండ్ మహిళలు 97 సంవత్సరాలుగా ఓటింగు హక్కును అనుభవిస్తున్నారు, ఈక్విటోరియల్ గిని, జోర్డాన్ దేశాల మహిళలు ఎనిమిది సంవత్సరాలుగా మాత్రమే ఈ హక్కును అనుభవిస్తున్నారు. అన్ని దేశాలలోనూ కలిపి చూస్తే మహిళలు నగటున 39 సంవత్సరాలుగా ఓటింగు హక్కును అనుభవిస్తున్నట్లు లెక్క తేలుతుంది. ప్రాంతాల వారీగా చూస్తే, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన యూరోపియన్ దేశాల మహిళలు సగటున 56 సంవత్సరాల నుండీ, ఆసియా,

ఆఫ్రికా, కరిబియన్ ప్రాంతాల మహిళలు 37 సంవత్సరాలనుండి ఓటింగు హక్కును అనుభవిస్తున్నారు

చాలా దేశాల మహిళలకు, ఓటింగు హక్కు, మొదట ప్రాంతీయ స్థాయిలో లభించింది. జాతీయ స్థాయి సంస్థలకు ఓటు చేసే హక్కు అటు తర్వాతే వచ్చింది. ఓటింగు హక్కులను ఇవ్వటానికి, లింగస్వభావాన్ని మాత్రమేగాక, అంతకంటే ముఖ్యంగా ఆదాయ పరిమాణము, విద్యార్హతలు, వైవాహిక స్థితి, వృత్తి, జాతి వంటి వాటి పరిగణనకు ప్రాధాన్యత లభించింది. పంథొమ్మిదవ శతాబ్దపు చివరి కాలంలో, ఫిన్లెండ్, ఐస్‌లెండ్, స్వీడన్‌లలో అవివాహిత మహిళలకు మాత్రమే ఓటింగు హక్కు ఉండేది. వివాహనంతరం స్త్రీ, భర్త రక్షణలో ఉంటుంది గనుక, ఆవిడ ఓటింగు హక్కును కలిగి ఉండే అర్హతను కోల్పోయింది!

బెల్జియం దేశంలో 1919 వ సంవత్సరంలో ప్యాసయిన చట్టం ప్రకారం, యుద్ధంలో మృతి చెందిన సైనికుల వితంతువులు, తల్లులు, గాయపడిన లేక మరణించిన పౌరుల భార్యలు, తల్లులు ఓటింగు హక్కుకు అర్హులవుతారు. కెనడా ప్రభుత్వం 1917 వ సంవత్సరంలో చేసిన చట్టం ప్రకారం, సైన్యంలో చేరి పనిచేస్తున్న మహిళలకు, సైనికులకు సంబంధించిన సన్నిహిత బంధువులకు, కేంద్ర పార్లమెంటుకు జరిగే ఎన్నికలలో ఓటు చేసే హక్కు ఉంటుంది.

పోర్చుగల్ దేశం 1931 వ సంవత్సరంలో ఆమోదించిన చట్టం, చదువను, వ్రాయను వచ్చిన పురుషులకు ఓటింగు హక్కు నిచ్చింది. కాని మహిళలు సెకండరీ స్థాయి విద్యను గాని, ఉన్నత విద్యనుగాని అభ్యసిస్తేనే ఓటింగు హక్కు లభిస్తుందని నిర్దేశించింది! బొలివియా ప్రభుత్వం 1938లో మహిళలకు ఓటింగు హక్కునిస్తూ, దానిని చదువను, వ్రాయను వచ్చిన వారికే పరిమితం చేసింది. ఈజిప్టు ప్రభుత్వం, పురుషులందరకూ ఓటింగు హక్కును ప్రకటిస్తూ, కోరిన మహిళలకే ఈ హక్కును పరిమితం చేసింది! ఇందువల్ల అతి తక్కువ మంది మహిళలే ఓటింగు హక్కును రిజిష్టరు చేసుకొన్నారు.

వలస పాలనలో నున్న దేశాలలో మహిళల ఓటింగు హక్కులకు చాలా పరిమితులుండేవి. కీన్యాలో, యూరపు జాతులకు చెందిన మహిళలకే ఓటింగు హక్కును పరిమితం చేశారు. తర్వాత 1956లో దేశీయులకు ఓటింగు హక్కునిచ్చారు. కాని దానిని, విద్యాస్థాయికి, ఆస్థి హక్కులకు ముడివేశారు. 1963లో మాత్రమే సర్వజనీన ఓటింగుహక్కు అమలులోనికి వచ్చింది. జింబాబ్వేలో 1957 వ సంవత్సరంలో, దేశీయ పురుషులకూ, యూరోపియన్ మహిళలకు ఓటింగు హక్కు నిచ్చారు. అదే సంవత్సరంలో వివాహిత దేశీయ మహిళలకు కూడా ఓటింగు హక్కును వర్తింపజేశారు. కాలానుగతంగా ఇటువంటి ఆంక్షలన్నీ రద్దవుతూ, ఓటింగు హక్కు దాదాపు. (ఎన్నికలు జరిపే అవకాశాలున్న) అన్ని దేశాల మహిళలకూ లభించింది.

## అధికార యోగానికి ఓటు హక్కుకు మధ్య అగాధం

చాలా దేశాలు, మహిళలకు ఓటింగు హక్కుతోపాటు, ఎన్నికలలో పోటీచేసి ఎన్నికయ్యే హక్కును కూడా ఇచ్చాయి. కాని కొన్ని దేశాలలో (ఇందుకు ఉదాహరణగా నెదర్లెండ్స్, నార్వే, అమెరికాలను చూపవచ్చు) మహిళలకు ఎన్నికలలో పోటీచేసే హక్కు ముందు లభించింది. తర్వాత కొంత కాలానికి గాని ఓటింగు హక్కు వీరికి లభించలేదు.

ఈ విషయాన్ని అమెరికా అనుభవం చక్కగా చిత్రిస్తున్నది. 1788లో ప్యాసయిన రాజ్యాంగం (కాన్‌స్టిట్యూషన్) ఏ "వ్యక్తైనా" (పర్సన్) లేక "సభ్యుడయినా" (మెంబర్) ఎన్నిక కావచ్చును అని పేర్కొన్నదేగాని, ఈ విషయంలో స్త్రీ-పురుష లింగభేదాన్ని ప్రస్తావించలేదు. ఇందువల్ల పురుషుల వలె, స్త్రీలు కూడా ఎన్నికలలో పోటీచేసి, కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళే అవకాశం కలిగింది. కాని మహిళలకు ఈ రాజ్యాంగం ఓటింగు హక్కును (తమ ప్రతినిధులను ఎన్నుకొనే హక్కును) ఇవ్వలేదు. దానిని పురుషులకు మాత్రమే పరిమితం చేసింది. 1920 వ సంవత్సరంలో రాజ్యాంగ సవరణ ఆమోదం తర్వాతనే మహిళలకు ఓటు చేసే హక్కు లభించింది. ఫెడరల్ యూనియన్లోని కొన్ని రాష్ట్రాలు (స్టేట్స్) ఇంతకు పూర్వమే మహిళలకు, తమ రాష్ట్రాల శాసనసభలకు ఎన్నికయ్యే హక్కుతో, ఓటింగు హక్కును కూడా ఇచ్చాయి. కొందరు మహిళా ప్రతినిధులు రాష్ట్రాల శాసనసభలకు ఎన్నికయినారు. 1920 వ సంవత్సరపు రాజ్యాంగ సవరణ చట్టం ప్యాస్ కాక పూర్వమే, 1916వ సంవత్సరంలో, వ్యోమింగ్ రాష్ట్రానికి చెందిన మహిళ, జీనెట్ రాన్‌కిన్ యునైటెడ్ స్టేట్స్ కాంగ్రెసుకు ఎన్నికయినారు.

**ఒకటవ పట్టిక**
**స్త్రీ పార్లమెంటుకు ఎన్నికయ్యే అర్హతను సంపాదించటానికి, తొలి స్త్రీ పార్లమెంటుకు ఎన్నిక కావటానికి పట్టిన కాల వ్యవధి**

| ఓటింగు హక్కు లభించిన తర్వాత పార్లమెంటుకు తొలి స్త్రీ ఎన్నికకు పట్టిన కాల వ్యవధి | స్త్రీ ఎన్నికైన దేశాల సంఖ్య | దేశాల శాతం |
|---|---|---|
| ఓటింగ్ హక్కు లభించక పూర్వము | 7 | 8.1 |
| అదే సంవత్సరంలో | 27 | 31 4 |
| ఒకటి లేక రెండు సం॥ల తర్వాత | 14 | 16.3 |
| మూడు సం॥ లేక అంతకు మించిన కాలం తర్వాత | 38 | 44 2 |

*ఆధారం : పార్టిసిపేషన్ ఆఫ్ ఉమెన్ ఇన్ పొలిటికల్ లైఫ్ అండ్ ఇన్ ది డిసిషన్ - మేకింగ్ ప్రాసెస్ - ఎ వరల్డ్ సర్వే ఏప్రిల్ 1988.*

ప్రథమ ప్రపంచ సంగ్రామంలో అమెరికా పాల్గొనాలన్న తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేసిన ఏకైక కాంగ్రెసు సభ్యులు వీరే!

మహిళలకు ఓటు చేసే హక్కు నిచ్చి, దానితోపాటే ఎన్నికలలో పోటీచేసే హక్కునివ్వని దేశాలు కూడా కొన్ని ఉన్నాయి. కెనడా 1917 వ సంవత్సరంలో మహిళలకు ఓటింగు హక్కు నిచ్చినా, 1920 వ సంవత్సరంలో గాని, మహిళలు ఎన్నికలలో పోటీ చేసే హక్కు నివ్వలేదు. ప్రపంచంలోని అన్ని దేశాలకంటే ముందే మహిళలకు ఓటింగుహక్కు నిచ్చిన ఖ్యాతిని పొందిన న్యూజిలెండ్, 1893 వ సంవత్సరంలో స్త్రీలకు ఓటింగు హక్కు నిచ్చినా, 1919వ సంవత్సరం వరకూ వారు ఎన్నికలలో పోటీ చేసే అధికారాన్నీయ లేదు. ఇలాగే పెరూ, స్త్రీలకు ఓటింగు హక్కును 1950లో ఇచ్చినా, పోటీ చేసే హక్కును 1956 వరకూ ఇవ్వలేదు, సిరియన్ మహిళలకు ఓటింగు హక్కు 1949 లో లభించినా, ఎన్నికలలో పోటీచేసే హక్కు 1953వ సంవత్సరంలో గాని లభించలేదు. జయర్ మహిళలకు 1967 లో ఓటింగు హక్కును ప్రభుత్వం ఇచ్చినా, 1970 వ సంవత్సరం వరకూ వారు పోటీచేసే హక్కు నీయలేదు. జింబాబ్వే 1957 లో తమ దేశపు మహిళలకు ఓటింగు హక్కునిచ్చినా, ఎన్నికలలో పోటీచేసే హక్కును వారికి 1978వ సంవత్సరం వరకూ ఇవ్వలేదు.

ఇల్లలుకగానే పండుగ కాదని పెద్దలు చెప్పారు. మహిళలకు ఓటింగు హక్కు, ఎన్నికలలో పోటీచేసే హక్కు లభించినంత మాత్రాన వారు ప్రజాప్రతినిధి సభలకు ఎన్నికవుతారని ఆశించటం పొరపాటు. ఈ హక్కులు మహిళలకు లభించటానికి, వారు ప్రజాప్రతినిధి సభలకు ఎన్నిక కావటానికి మధ్య ఎంత కాల వ్యవధి పట్టిందో సూచించే 86 దేశాల సర్వే సమాచారాన్ని, ఇంటర్ పార్లమెంటరీ యూనియన్ 1988 లో ప్రచురించింది. (ఇంటర్ పార్లమెంటరీ యూనియన్ ప్రభుత్వేతర సంస్థ. ఇది పలు దేశాల జాతీయ పార్లమెంట్ల సమాఖ్య. పలు దేశాల పార్లమెంటరీ సమాచార ప్రతిరూపమే ఒకటవ పట్టిక).

ఈ సర్వేలోని దేశాలలో దాదాపు సగం దేశాలలో మాత్రమే ఓటింగు హక్కు లభించిన ఒకటి లేక రెండు సంవత్సరాల లోపలే మహిళా ప్రతినిధులు పార్లమెంట్లకు ఎన్నికయినారు. ఎన్నికలలో పోటీచేసే హక్కును పొందిన ఐదేండ్ల తర్వాత మాత్రమే చాలా దేశాలలో మహిళలు పార్లమెంటుకు ఎన్నిక కాగలిగారు. సర్వజనీన మహిళా ఓటింగు హక్కు రాక పూర్వమే, పరిమితంగా నైనా ఓటింగుహక్కులు ఉన్నచోట కూడా, మహిళలు పార్లమెంటుకు ఎన్నిక కావటం కనుపిస్తుంది. కొన్ని దేశాలలో ఆస్థి, లేక ఇతరాలు ఓటింగు హక్కు లభించటానికి ప్రాతిపదికలుగా ఉన్నాయి. ఉదాహరణకు నార్వే అనుభవాన్ని తీసుకొందాం. ఈ దేశంలో తొలి మహిళ, 1911వ సంవత్సరంలోనే పార్లమెంటు సభ్యురాలిగా

ఎన్నికైంది 1913 వ సంవత్సరంలోగాని, ఈ దేశంలో సర్వజనీన మహిళా ఓటింగు హక్కు అమల్లోకి రాలేదు.

మహిళలకు ఓటింగు హక్కు లభించటానికి, తొలి మహిళ, దేశపు పార్లమెంటుకు ఎన్నిక కావటానికి, అన్ని దేశాలలో కంటే అత్యధిక కాల వ్యవధి (అరవయ్యైదు సంవత్సరాలు) ఆస్ట్రేలియాలో పట్టింది 1988 వ సంవత్సరం నాటికి. ఇంటర్ పార్లమెంటరీ యూనియన్ వద్ద నున్న సమాచారం ప్రకారం, జోర్డాన్, మొరాకో, యునైటెడ్ అరబ్ అమీరేట్స్ దేశాల పార్లమెంట్లకు ఒక్క మహిళ కూడా ఎన్నిక కాలేదు ఒక్కసారి మహిళలలో ఒక్కరు పార్లమెంటుకు ఎన్నిక కాగలిగితే, అటు తర్వాత అధికులు పార్లమెంటుకు వెళతారన్న గ్యారంటీ లేదని అనుభవం నిరూపించింది.

నామ మాత్రపు సంఖ్యలో స్త్రీలు పార్లమెంటుకు వెళ్ళటం వలన మహిళా లోకానికి మేలు జరుగదు పార్లమెంటు నిర్ణయాలను ప్రభావితం చేయగలిగినంత సంఖ్యా పరిమాణంలో స్త్రీల ప్రాతినిధ్య ముండాలి. అపుడే, నిర్ణీత దేశంలోని స్త్రీల పరిస్థితికి, పార్లమెంటులోని వారి సభ్యత్వ పరిమాణం కొలమానంగా మారుతుంది అంతేకాదు; మంత్రివర్గ సభ్యులు కావాలంటే, ముందు పార్లమెంటులో సభ్యత్వాన్ని పొందాలి. ఓటర్లలో దాదాపు సగం మందిగా ఉన్న స్త్రీలకు, పార్లమెంట్‌లో తగినంత ప్రాతినిధ్యం లేనపుడు, ఆ పార్లమెంటు మహిళా శ్రేయస్సుకు అనుగుణంగా పనిచేయలేదు, దాని నిర్ణయాలు మహిళా లోకపు శ్రేయస్సుకు అనుకూలంగా ఉండే అవకాశాలుండవు. పార్లమెంటులోని సీట్లలో సగభాగంమేరకు స్త్రీలకు లభించక పోయినా, జరిగే నిర్ణయాలను ప్రభావితం చేయగలగటానికి కనీసం మూడవ వంతుకు (30 నుండి 35 శాతం వరకూ) సభ్యత్వం స్త్రీలకు లభించాలన్నది సర్వజనామోదాన్ని పొందిన పరిమితి. 1995 వ సంవత్సరం నాటికయినా, మహిళల పార్లమెంటు సభ్యత్వం ముప్పై శాతానికి చేరాలని ఐక్యరాజ్య సమితికి చెందిన ఎకనామిక్ అండ్ సోషల్ కౌన్సిల్ లక్ష్యాన్ని నిర్ణయించింది. మహిళల సభ్యత్వ పరిమాణం, ఇప్పటి రేటునే పెరిగితే, పురుషులతో సమానమైన సభ్యత్వ సాధన విషయం దేవుడెరుగు, మూడవ వంతు పరిమాణ సాధనైనా, 22వ శతాబ్దకాలంలో నయినా సంభవిస్తుందా అన్న సందేహం కలుగుతుంది.

ఈ అధ్యాయంలోని రెండవ పట్టికను పరిశీలిస్తే డెన్మార్క్, ఫిన్లండ్, నార్వే, స్వీడన్ దేశాలలో మాత్రమే మహిళా పార్లమెంటరీ ప్రాతినిధ్యం ముప్పై శాతాన్ని మించి ఉన్నట్లు కనుపిస్తుంది. ఫిన్లండ్, నార్వేలలో మాత్రం మహిళా ప్రాతినిధ్యం దాదాపు నలభైశాతం వరకూ ఉన్నది. మిగిలిన అన్ని దేశాలలోనూ మహిళా ప్రాతినిధ్యం ఆశించదగిన పరిమాణంలో లేదని మూడవ, నాల్గవ పట్టికలు చిత్రిస్తున్నాయి

## అల్ప ప్రాతినిధ్యానికి కారణాలు

మహిళలకు పార్లమెంట్లలోనూ, నిర్ణయాధికారాలు గల పరిపాలనా పదవులలోనూ స్థానం లభించక పోవటానికి పలు కారణాలున్నట్లు ఐక్యరాజ్య సమితి జరిపించిన అధ్యయనం వలన స్పష్టమవుతున్నది. పదవీ సోపానాలనుఎక్కటానికి, అందుకు తగిన అర్హతలను సంపాదించాలి. అవసరమైన అర్హతలను ఆయా దేశాల రాజ్యాంగ చట్టాలు నిర్దేశిస్తాయి. పదవిని ఆశించే వారు, యుక్త వయస్కులై యుండాలి. దేశపు పౌరులై యుండాలి కనీస నిర్ణీతకాలం, పోటీచేస్తున్న ప్రాంతంలోనో, లేక దేశంలోనో నివాసముండాలి ఓటింగు హక్కును వినియోగించుకొనే అర్హతలు కూడా ఉండాలి. ఈ అర్హతలను సంపాదించటం పదవీ పీఠాన్నెక్కటానికి తొలి సోపానం తర్వాత సంపాదించ వలసిన అర్హత, పార్టీ సభ్యత్వం. సభ్యత్వం పొందిన తర్వాత, పార్టీ కార్య కలాపాలలో నిమగ్నమై, నాయకత్వ స్థాయికి ఎదగాలి. ఈ స్థితి సాధనను, వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యాలు, వారి సాంఘిక స్థాయి, వారి కులము లేక కమ్యూనిటీకున్న బలము మొదలైనవన్నీ ప్రభావితం చేస్తాయి. సామాజిక, ఆర్థిక పరిస్థితుల ప్రభావం కూడా దీనిమీద ఉంటుంది. పార్టీలో చేరి పరిగణించదగిన నాయకత్వ స్థాయికి ఎదగ గలగటం, పదవీ పీఠాన్నెక్కటానికి అవసరమైన రెండవ సోపానం. ఇక మూడవ సోపానం. ఎన్నికలలో పోటీచేయటానికి అభ్యర్థిగా ఎంపిక కావటం. అభ్యర్థిగా ఎంపిక గావటమనేది, నిర్ణీత దేశంలో అమలులో ఉన్న ఎన్నికల విధానం మీద కూడా ఆధారపడి ఉంటుంది. పార్టీ అధిష్ఠాన వర్గం పోటీ చేయదగిన అభ్యర్థులను ఎంపిక చేస్తుంది. ఈ ఎంపిక ఎలా జరుగుతుంది అనేది, ఆ పార్టీ సంస్కృతి మీద ఆధారపడి ఉంటుంది. విషయాన్ని సంక్షిప్తంగా చెప్పాలంటే, అధికార పీఠాన్ని సంపాదించటానికి వ్యక్తి ఎక్కిపోవలసిన సోపానాలు మూడు 1. ఓటు చేయటానికి,

రెండవ పట్టిక

కొన్ని దేశాల పార్లమెంట్లలో, మునిసిపాలిటీలలో, మంత్రి వర్గాలలో మహిళా సభ్యత్వ శాతాలు (1994)

| దేశం పేరు | పార్లమెంటరీ సభ్యత్వం | మునిసిపాలిటీలో సభ్యత్వం | మంత్రివర్గ సభ్యత్వం |
|---|---|---|---|
| పారిశ్రామిక దేశాలు | | | |
| డెన్మార్క్ | 33 | 28 | 29 |
| ఫిన్లండ్ | 39 | 30 | 39 |
| నెదర్లెండ్స్ | 29 | 22 | 31 |
| నార్వే | 39 | 28 | 35 |
| స్వీడన్ | 34 | 34 | 30 |
| ఆర్గనైజేషన్ ఆఫ్ ఎకనామిక్ కో ఆపరేషన్ అండ్ డెవలప్ మెంట్ (ఓ.ఇ.సి.డి.) దేశాలు | 13 | 16 | 15 |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | | | |
| క్యూబా | 23 | 14 | 4 |
| గుయానా | 20 | 22 | 11 |
| జమైకా | 12 | 13 | 5 |
| నికరాగువా | 16 | 13 | 10 |
| ట్రెనిడాడ్ అండ్ టొబాగో | 18 | 21 | 19 |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | 10 | - | 5 |
| ప్రపంచం | 10 | - | 6 |

గమనిక : ఈ పట్టికలోని సంఖ్యా వివరాలు 1994వ సంవత్సరం జూన్ నాటి పరిస్థితిని తెలియజేస్తున్నాయి.

ఆధారం : హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1995

అభ్యర్థిగా పోటీ చేయటానికి అవసరమైన అర్హతలను సంపాదించాలి. 2. పార్టీలో సభ్యత్వాన్ని పొంది, పరిగణను పొందినంత శక్తివంతుడైన నాయకునిగా వ్యక్తి ఎదగాలి. 3. పోటీ చేయటానికి తగిన అభ్యర్థిగా పార్టీ ఎన్నికను పొందగలగాలి. ఈ సోపాన అధిరోహణలో స్త్రీలకున్న అవరోధాలేమిటో చూద్దాం.

### పార్టీ సభ్యత్వ సాధన

అధికార పీఠాన్ని ఆశించేవారు దేశంలోని ఏదయినా ఒక రాజకీయ పార్టీలో చేరి, నాయకత్వ స్థానానికి ఎదగగలగాలని ఇంతకు ముందే చెప్పాం. అన్ని దేశాల మహిళలకూ ఇది సాధ్యం గాకపోవచ్చు. ఈ సాధ్యాసాధ్యాలు నిర్ణీత దేశపు అభివృద్ధి స్థాయిని బట్టి ఉంటాయి. పురుషులలో కంటే స్త్రీలలో అధిక నిరక్షరాస్యత ఉండటం ఒక అవరోధమే. పేదరికము, దానికి తోడు అధిక సంతానం కూడా అవరోధమే పిల్లల పోషణ, సంరక్షణ, కుటుంబానికి అవసరమైన ఆదాయార్జనలో నిమగ్నం గావటం వంటి అధిక భారాన్ని మోస్తున్న మహిళలకు రాజకీయాలలో పాల్గొనే అవకాశాలుండవు. దేశపు అభివృద్ధి స్థాయి పెరిగినకొలదీ మహిళా ప్రాతినిధ్యం పెరుగుతుందని చెప్పటానికి కూడా వీలులేదు. అంతే కాదు, ప్రజల ఓటింగు సరళిలో కూడా తేడాలుండవని చెప్పటానికి వీలులేదు. ఒక్క నార్డిక్ దేశాలలో మాత్రమే పార్లమెంటులోనూ, మంత్రి వర్గంలోనూ మహిళలకు మూడవ వంతుస్థానాలు లభించాయి. (డెన్మార్క్, నార్వే, స్వీడన్,

### మూడవ పట్టిక
### తూర్పు యూరపు దేశాలలో "ప్రజాస్వామ్యపు" పాలు పెరుగుతున్న కొలదీ తగ్గిపోతున్న మహిళా పార్లమెంట్ ప్రాతినిధ్యం
### (అంకెలు శాతాలను తెలియజేస్తాయి)

| దేశం పేరు | 1988 | 199-91 |
|---|---|---|
| ఆల్బేనియా | 28 8 | 6 2 |
| బల్గేరియా | 21.0 | 8.5 |
| జెకస్లొవాకియా | 29.5 | 6 0 |
| తూర్పు జర్మనీ | 32.2 | 20 5 |
| హంగరి | 20 9 | 7.0 |
| పోలెండ్ | 20.2 | 13 3 |
| రొమేనియా | 34 4 | 3.5 |
| సోవియట్ యూనియన్ | 34.5 | 15.6 |
| యుగోస్లావియా | 17.7 | 17.7 |
| అన్ని దేశాల సగటు | 27.5 | 10.9 |

కమ్యూనిస్టు పాలనా కాలంలో, ఈ దేశాల పార్లమెంట్లలో మహిళా సభ్యత్వం మూడవ వంతు వరకూ ఉన్నది. కమ్యూనిస్టు పాలన అంతరించి "ప్రజాస్వామ్య పాలన" అవతరించిన తర్వాత మహిళా సభ్యత్వం పదవ వంతుకు పడిపోయినట్లు పట్టికలోని వివరాలు తెలియజేస్తున్నాయి. ఇరవయ్యవ శతాబ్దంలో రాజకీయ రంగంలో మహిళల నిర్ణయాత్మక పాత్రా నిర్వహణమీద ఐక్యరాజ్య సమితి జరిపించిన అధ్యయనం ఇందుకు గల కారణాలను వివరించింది చూడండి :

"...కొత్త రాజకీయ విధానంలో (ప్రజాస్వామ్య అవతరణ తర్వాత) పార్లమెంటు ప్రాముఖ్యత పెరిగింది. దానికి ఇంతకు పూర్వం కంటే ఇపుడు అధికారాలు ఎక్కువున్నాయి. అందుచేత పార్లమెంటు సభ్యత్వ సాధన అత్యంత ముఖ్యమైన విషయమైంది పెరిగిన పార్లమెంటు ప్రాముఖ్యత సమాజంలో ముఖ్యమైన శక్తిని ప్రతిబింబింప చేస్తున్నది ఈ దృష్ట్యా చూచినపుడు, రాజకీయ నిర్ణయానికి ప్రజాస్వామ్యపు పాలు పెరిగిన కొలదీ, పురుషుల పరిస్థితితో పోల్చినపుడు. స్త్రీల ప్రాతినిధ్యం తగ్గుతున్నట్లు తూర్పుయూరపు దేశాలలో కనుపిస్తున్నది(!!!)"

*- మూలం : ఉమెన్ ఇన్ పాలిటిక్స్ అండ్ డిసిషన్ మేకింగ్ ఇన్ ది లేట్ ట్వెంటీయత్ సెంచ్యురీ - ఎ యునైటెడ్ నేషన్స్ స్టడీ*

ఫిన్లండ్, ఐస్‌లెండ్లను నార్డిక్ దేశాలుగా వ్యవహరిస్తున్నారు) ఈ దేశాలకంటే అధిక అభివృద్ధిని సాధించి, ప్రపంచంలో అత్యంత శక్తివంతమైన దేశంగా రూపొందిన అమెరికాలో కూడా మహిళలకు పార్లమెంటులో గాని, మంత్రి మండలిలో గాని ఇంతటి ప్రాతినిధ్యం లభించలేదు.

దేశంలోని రాజకీయ వాతావరణాన్ని బట్టి పార్లమెంటుకు పోటీచేయగల మహిళల ఎంపిక ఆధారపడి ఉంటుంది. సైనిక పాలన, నియంతృత్వ పాలన వంటివి అమలులో నున్న దేశాలలో పురుషులకే స్వేచ్ఛగా పోటీచేసే అవకాశాలుండవు. ఇటువంటి పరిస్థితులలో మహిళలకు ఇలాంటి అవకాశాలు లభిస్తాయని ఆశించటం పొరపాటు. దేశంలో సాయుధ పోరాటాలు జరుగుతూండటం, లేక దురాక్రమణ ప్రమాదాన్ని దేశం ఎదుర్కొంటూ ఉండటం వంటి వాతావరణం ఉన్నపుడు, వారి భద్రత దృష్ట్యా పోటీకి

నాల్గవ పట్టిక

ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో మహిళా పార్లమెంటు సభ్యత్వ పరిమాణ శాతాలు

| ప్రాంతము | 1975 | 1987 | 1994 |
|---|---|---|---|
| అభివృద్ధి చెందిన ప్రాంతం | | | |
| తూర్పు యూరప్ | 24 | 25 | 8 |
| పశ్చిమ యూరపు, ఇతర అభివృద్ధి చెందిన ప్రాంతాలు | 13 | 13 | 16 |
| ఆఫ్రికా | | | |
| ఉత్తర ఆఫ్రికా | 1 | 3 | 4 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 5 | 7 | 8 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 5 | 8 | 9 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | | | |
| తూర్పు ఆసియా | 10 | 11 | 17 |
| ఆగ్నేయ ఆసియా | - | 8 | 8 |
| మధ్య ఆసియా | - | - | 7 |
| దక్షిణ ఆసియా | 5 | 6 | 4 |
| పశ్చిమ ఆసియా | 2 | 8 | 5 |
| ఒషీనియా | 1 | 2 | 3 |

*గమనిక : తూర్పు యూరపు కింద ఇచ్చిన 1975 వ సంవత్సరపు అంచనాలలో సోవియట్ యూనియన్ అంచనాలున్నాయి. 1975 వ సంవత్సరపు తూర్పు ఆసియా కింద ఇచ్చిన దానిలో అగ్నేయ ఆసియా అంచనాలు కలిసి ఉన్నాయి*

*మూలం : వరల్డ్స్ ఉమెన్ 1970 - 1990, వరల్డ్స్ ఉమెన్ 1995 అనే ఐక్యరాజ్య సమితి ప్రచురణలోని సంఖ్యా వివరణలు ఈ పట్టిక రూప కల్పనకు ఉపకరించాయి.*

మహిళా సభ్యుల ఎన్నిక సాధ్యంగాక పోవచ్చు. దేశ స్వాతంత్ర్య పోరాటం లోనూ, లేదా శత్రు దండయాత్ర కాలంలో, దేశ రక్షణకు ప్రాణాలొడ్డి పోరాడిన కారణంగా పోటీ చేయగల మహిళల అర్హత గుర్తింపుకు వచ్చిన సందర్భాలు కూడా చరిత్రలో మనకు కనుపిస్తాయి.

దేశంలోని సాంఘిక వాతావరణం కూడా మహిళా సభ్యుల ఎన్నికను ప్రభావితం చేస్తుంది. మత సూత్రాల అమలుకు అధిక ప్రాధాన్యతనిచ్చే సమాజంలో మహిళా వాణి నిషిద్ధమవుతుంది. స్వేచ్ఛగా సమాజంలో సంచరించే అవకాశం కూడా వారికి లభించదు. ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ దేశాలను ఇందుకు ఉదాహరణలుగా చెప్పవచ్చు. ఇరాన్‌లో షా పాలన అంతరించి, రాజ్యాధికారం మత ఛాందసుల చేతికి వచ్చిన తర్వాత, కాలేజి క్లాసులో ఆడపిల్లలు, తమ సందేహనివృత్తికి ప్రొఫెసర్‌ను ముఖాముఖి ప్రశ్నించటాన్ని నిషేధించారు. విద్యార్థినులు తమ సందేహాలను కాగితం మీద వ్రాసి మహిళా ఇన్స్పెక్టరు కివ్వాలి. ఆ ఇన్స్పెక్టరు ఈ పత్రాలను ప్రొఫెసరుకు పంపి, వారి వ్రాతపూర్వక సమాధానాలను తెప్పించి, ఆయా విద్యార్థినులకు అందజేస్తారు! ఆఫ్ఘనిస్థాన్‌లోని తాలిబాన్ ప్రభుత్వం, మహిళలు ఉద్యోగాలు చేయటాన్నే నిషేధించింది. వీధిలో నడిచే మహిళ మొగాలు, పరదా కిందనుండి

కనుపించినా కొరడాలతో కొడుతున్నారు! ఇటువంటి పరిస్థితులలో మహిళ రాజకీయ వాణి వినిపించగలదని ఆశించలేము. ఇలాంటి రాజకీయ వాతావరణంలో మహిళలకు, పురుషులతోడి సమానత్వం లభించదు మరింత అణచివేతకు వారు గురవుతారు. మత ఛాందసులు కుటుంబ నియంత్రణను కూడా నిషేధించారు. ఇందువల్ల మహిళల జీవన భారం మరింత పెరుగుతుంది.

మత ఛాందసం ఒక్కటే సమాజంలో స్త్రీ-పురుష అసమానతలకు కారణం కాదు సామాజిక సంస్కృతిలోనే ఆ భావం, సంప్రదాయం ఇమిడి ఉన్నదన్న విషయాన్ని ఇంతకు ముందే చూచాం. ఇల్లాలు గృహనిర్వహణలో తలమునకలుగా ఉంటే, పురుషుడు వీధిలో కార్యాలు చక్కబెట్టాలనటం సామాజిక సంప్రదాయంగా కొనసాగుతున్నది. స్త్రీ-పురుష అసమానతా భావం తొలుత సాంప్రదాయంలో పుట్టగా, దానిని, కుటుంబం, తర్వాత బడిలో చెప్పే చదువు, కుటుంబంలో, సమాజంలో స్త్రీ-పురుషుల పని విభజనా, పత్రికా ప్రచారం, సినిమాలు, టివీ ప్రసారాలు దానిని (ఆ భావాన్ని) పెంచి, పోషిస్తున్నాయి ఈ అసమానతా భావమే రాజకీయాలలో స్త్రీలకు సముచిత స్థానం లభించకుండా చేస్తున్నది. రాజకీయ రంగం పురుషులకు మాత్రమే తగినదిగా చిత్రితమవుతున్నది.

స్త్రీలు రాజకీయ రంగంలోనికి రావటం మీద పలు దేశాలలో పలు రకాల అభిప్రాయాలున్నాయి కొన్ని దేశాలలో, రాజకీయాలలో స్త్రీలు ప్రవేశించటం ఉచితంగాదనే అభిప్రాయమే ప్రబలంగా ఉన్నది.రాజకీయ రంగం పురుషులకే తగినది గనుక, అందులో ప్రధాన పాత్ర లభించాలని మహిళలు ఆసించకూడదన్న భావనే బలంగా ఉన్నది. రాజకీయాలలో చురుకైన పాత్రను నిర్విహించాలనే కోరిక బలంగా ఉన్న మహిళలు కూడా, పురుషుల అండదండలు తమకు లభించవేమో నన్న సంశయంతో ఎన్నికల రంగంలోకి దిగటానికి సాహసించలేక పోతున్నారు. ఐక్యరాజ్య సమితి అధ్యయనానికి సేకరించిన పలు దేశాల సర్వేలు ఈ అంశాన్ని ధృవపరుస్తున్నాయి.

కాని నేటి పరిస్థితి పూర్తిగా నిరాశాజనకంగా లేదు. మహిళలు కూడా రాజకీయరంగంలో సముచిత పాత్రను నిర్వహించాలన్న భావం క్రమంగా బలపడుతున్నది: అది విస్తరిస్తున్నది మహిళలు అధిక సంఖ్యలో ఉన్నత విద్యను, వృత్తి విద్యలను ఆర్జిస్తూండటం, అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్‌కు వస్తూండటం వలన ఇందుకు మార్గం సుగమమవుతున్నది

దేశంలోని రాజకీయ సాంఘిక పరిస్థితులకూ, గృహ నిర్వహణా బాధ్యతల నుండీ స్త్రీ విముక్తిని పొందటానికి సంబంధం ఉన్నది. దేశంలో కార్మికుల పని పరిస్థితులు, పనిచేసే తల్లుల బిడ్డలకు, పనికాలంలో తోడ్పడే శిశు సంరక్షణా వసతులు లేకపోవటం వంటి ఇబ్బందుల వలన, మహిళలు అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్‌కు రాలేకపోతున్నారు. ఇటువంటి పరిస్థితులలో రాజకీయ రంగంలో స్త్రీల చురుకైన పాత్రా నిర్వహణ కష్టసాధ్యమైన విషయమవుతుంది. పారిశ్రామిక దేశాల మహిళలకు ఇలాంటి ఇబ్బందులు ఎదురవుతూంటే, అభివృద్ధి చెందుతున్న, వెనుకబడిన దేశాల మహిళలకు మరొక రకమైన ఇబ్బందులు, వారిని రాజకీయ రంగానికి రావటానికి వీలులేకుండా చేస్తున్నాయి నిరక్షరాస్యత, లేక తగినంత విద్యాస్థాయి లేకపోవటం, అధిక సంతానం వంటివి, ఈ దేశాల మహిళలకు అవరోధాలుగా ఉంటున్నాయి. పరిమిత సంతానం, తగినంత విద్యాస్థాయి, స్త్రీలకు లభించినపుడు వారు కూడా లేబర్ మార్కెట్లో పురుషులతో పోటీచేయగలుగుతారు. క్రమంగా రాజకీయ రంగంలో కూడా వారు ముఖ్యమైన పాత్రా నిర్వహణకు తయారయ్యే అవకాశాలుంటాయి.

కుటుంబ గౌరవం, సమాజంలో ఆ కుటుంబీకులకున్న పలుకుబడి కూడా వ్యక్తుల రాజకీయ జీవితానికి పెట్టుబడిగా ఉపకరిస్తాయి సామాజిక వనరుల పంపకంలోనూ, కుటుంబ వనరుల పంపకంలోనూ, ఈ స్థాయి, పలుకుబడి, హోదాల విషయంలోనూ, స్త్రీల కంటే పురుషులకే ఆధిక్యత ఉండటం సహజం. ఈ పరిస్థితి మహిళల రాజకీయ జీవితాభివృద్ధికి ఆటంకంగా ఉంటుంది. ఇవిగాక, వ్యక్తి యొక్క విద్యాస్థాయి, వృత్తిపరమైన అనుభవం, ఆర్థిక స్థోమతా, పరిగణనకు వచ్చే ఇతర అంశాలు. మహిళ విద్యావంతురాలు గావటం వలన, వేతనార్జనాశక్తి వస్తుంది. యుక్తవయస్సు వచ్చినా, అనుకూల పరిస్థితులు ఏర్పడే వరకూ వివాహాన్ని వాయిదా వేసుకో

గలుగుతుంది పరిస్థితుల అనుకూలతను బట్టి సంతానాన్ని కంటుంది. పైగా కనవలసిన సంతానాన్ని నియమిత పరచుకుంటుంది. తనకు పౌరునిగా ఉన్న రాజకీయ హక్కులను గుర్తించి వాటి సాధనకు తాపత్రయ పడుతుంది. ఇవన్నీ, ఆవిడ రాజకీయ జీవితాన్ని ప్రభావితం చేయగల అంశాలు. ఈ అర్హతల లేమి, మహిళ యొక్క రాజకీయ జీవితాన్ని సంకుచిత పరుస్తుంది. అన్ని విషయాలలోను పురుషులు అధికులుగా ఉంటారు గనుక మహిళల కంటే అధికావకాశాలు పురుషులకే లభిస్తాయి. పురుషులతో దీటయిన అభ్యర్థులుగా పోటీలో స్త్రీలు నిలువలేరు

మహిళల రాజకీయ జీవితాన్ని ప్రభావితం చేసే మరొక అంశం, ఆవిడ యొక్క వృత్తిపరమైన స్థాయి, హోదా. ఆవిడ ఉద్యోగార్హతలను పొందగలిగినపుడు, స్వతంత్ర జీవనానికి పునాది పడుతుంది. వృత్తి పరమైన సామర్థ్యం, మెళుకువలు లభిస్తాయి. ఇందువల్ల ఆత్మవిశ్వాసం ఇనుమడిస్తుంది. ఇవన్నీ ఉన్నపుడే స్త్రీకి రాజకీయ జీవితం అబ్బుతుంది. పంతులమ్మ వంటి ఉద్యోగాలు ఉదరపోషణకే ఉపకరిస్తాయి గాని రాజకీయ జీవిత నిర్మాణానికి పనికిరావు. ఉద్యోగంలో చేరిన మహిళ, నియమితకాలం కార్యాలయంలో పనిచేయవలసి ఉంటుంది గనుక, పార్టీయొక్క రాజకీయ అవసరాలకు, కావలసినపుడల్లా వెళ్ళి పనిచేయలేదు. మహిళ రాజకీయ జీవితానికి ఈ కట్టుదిట్టమైన పనికాలం కూడా అవరోధంగా తయారైంది

స్త్రీల రాజకీయ జీవితాన్ని ప్రభావితం చేస్తున్న మరొక అంశం ఆవిడ ఆర్థిక పరిస్థితి. పోటీ చేస్తున్న అభ్యర్థికి, వారి పార్టీ ఎన్నికల ఖర్చులకు పెట్టుబడి పెట్టే ఆచారం అన్ని చోట్లా లేదు. ఇలాంటి సంప్రదాయం ఉన్నచోట్ల కూడా వారిచ్చే సొమ్ము ప్రచార నిర్వహణకు సరిపోదు. పోటీచేసే వారే అదనపు సొమ్మును సేకరించుకోవలసి ఉంటుంది. ఆర్థిక స్వాతంత్ర్యం లేని మహిళలకు ఇది సాధ్యమయ్యే విషయం గాదు.

అమెరికా, గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్స్ వంటి అభివృద్ధిచెందిన దేశాల అనుభవం ఈ అంశాలను స్పష్టంగా నిరూపిస్తున్నది. ఆయా దేశాలలో పార్లమెంటుకు ఎన్నికవుతున్న స్త్రీ పురుషుల విద్యాస్థాయి, వృత్తి స్థాయి కూడా దాదాపు సమంగా ఉంటున్నాయి. ఉన్నత విద్యను అభ్యసించి, ఉన్నతస్థాయి ఉద్యోగాలలో ఉన్న మహిళలు పార్లమెంటుకు రావటం కనుపిస్తున్నది. స్త్రీలను పార్లమెంటుకు పంపటంలో వెనుకబడిన జపాన్‌లో, మహిళా విద్యాస్థాయి పెరుగుదలతో పాటు, పార్లమెంటులో వారి ప్రాతినిధ్యం పెరగటం కనుపిస్తున్నది. ఇటువంటి పరిస్థితి మనదేశంలో కూడా ఇపుడు కనుపిస్తున్నది. పట్టణ ప్రాంత మహిళల విద్యాస్థాయి త్వరిత గతిని పెరగటం వలన వారికి ఈ అవకాశం లభిస్తున్నది. స్త్రీ జనాభాలో, దాదాపు మూడింట రెండు వంతుల మంది గ్రామీణ ప్రాంతంలో నివసిస్తున్నారు. వారి జీవన స్థాయి, విద్యాస్థాయి చాలా తక్కువగా ఉన్నది. ఇందువల్ల వారికి రాజకీయాలలో పాల్గొనే అవకాశాలు లేకుండా పోయాయి.

పైన పేర్కొన్నట్లు, వ్యక్తుల విద్యాస్థాయి, ఆర్థికస్థోమతా లేమి మాత్రమే మహిళలకు పార్లమెంటులోనూ, పరిపాలనా పదవులలోనూ సముచిత స్థానం లభించకపోవటానికి కారణం కాదు. సోవియట్ యూనియన్, పోలెండ్ దేశాలలో మహిళలకు పురుషులతో సమానమైన విద్యాస్థాయి ఉన్నది. ఎన్నికలలో పోటీచేసే వ్యక్తులకు పెద్ద మొత్తంలో సొమ్ము అవసరం కూడా లేదు. అన్ని ఖర్చులను పార్టీ భరిస్తుంది. అయినా, ఆ దేశాలలో పురుషులతో సమానమైన స్థానం మహిళలకు పార్లమెంటరీ ప్రాతినిధ్యంలో లభించలేదు. పైగా అది క్రమానుగతంగా తగ్గుతూ కూడా వచ్చింది. సోవియట్ యూనియన్‌లో, పందొమ్మిది వందల ఎనభై ఎనిమిదవ సంవత్సరపు పార్లమెంటు సభ్యత్వంలో మహిళలకు 34.5 శాతం మేరకు ప్రాతినిధ్యమున్నది. 1990-1991వ సంవత్సరానికి (కమ్యూనిస్టు పాలన అంతరించక పూర్వమే) ఈ ప్రాతినిధ్య స్థాయి 15.6 శాతానికి తగ్గింది! అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలోనూ, మహిళల విద్యాస్థాయి పురుషుల కంటె అంత తక్కువగా లేదు. అయినా, ఆ దేశాలలో మూడవ వంతు ప్రాతినిధ్యం మహిళలకు లభించటం లేదు. ఒక్క నార్డిక్ దేశాలలో మాత్రమే మహిళలకు ఈ గౌరవం లభించింది.

వ్యక్తుల విద్యాస్థాయి, ఆర్థికస్థోమతల కంటే, వారి జీవన విధాన ప్రభావం, మహిళల ప్రాతినిధ్య పరిమాణాన్ని అధికంగా ప్రభావితం చేస్తున్నట్లు కనుపిస్తున్నది. మహిళలలో అత్యధిక సంఖ్యాకులు వివాహం చేసుకొని, కుటుంబ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. సంతానాన్ని కని వారిని పోషించి పెంచుతున్నారు. ఈ బాధ్యతలు చిన్నవేమీ కావు. వేతనార్జన

పేరిట పురుషుడు బయట చేసి వచ్చే పనికంటే, ఈ పని అధికంగానే కాదు, భారంగా కూడా ఉంటుంది. మహిళ యొక్క సాంఘిక హోదా, ఆరోగ్య పరిస్థితి, ఆర్థిక పరిస్థితి. రాజకీయాలలో పాల్గొనటం వంటివి, ఆవిడ వివాహం చేసుకొనేటపుడుండే వయో పరిమితి మీదా, సంతానాన్ని కనటం ప్రారంభించేటప్పటి కుండే వయో పరిమాణం మీదా, కుటుంబ నియంత్రణాసక్తి మీదా, ఆవిడ కనే సంతానపు సంఖ్య మీదా ఆధారపడి ఉంటుంది

కొన్ని సమాజాలలో వివాహానంతరం ఇల్లాలు ఇల్లు విడిచి బయటకు వచ్చే అవకాశాలుండవు. కొన్ని ఆఫ్రికా సమాజాలలో వివాహిత మహిళ పరిపాలనా సంబంధమైన కార్యకలాపాలలో పాల్గొన కూడదన్న సంప్రదాయం ఉన్నది. భర్త స్వగ్రామంలో, వారి ఇల్లాలు ఇలాంటి పని చేయటం సంప్రదాయ విరుద్ధంగా పరిగణనకు వస్తుంది. వివాహానంతరం మహిళ తన పుట్టిన ఊరిలో కూడా ఇలాంటి పదవులను నిర్వహించ కూడదు ఇలాంటి పనికి ఇల్లాలు ఒడిగడితే, అది భర్తకు విడాకులివ్వటంతో సమానమైన అంశమవుతుంది! ఆవిడ భర్తతో నివసించవలసిన గ్రామాన్ని విడిచి స్వగ్రామానికి, పదవీ నిర్వహణకు పోవటమే ఆవిడ చేసిన అపరాధం. రాజకీయ రంగంలోనికి రావాలన్న తాపత్రయం, ఆఫ్రికా మహిళలకున్నా, ఈ అవరోధం వలన వారు ఈ రంగంలో సముచిత పాత్రను నిర్వహించలేకపోతున్నారు. వెనుకబడిన ఆఫ్రికాలోనే గాదు, అభివృద్ధిచెందిన యూరపులోనూ పరిస్థితి, ఇటీవలి కాలం వరకూ, మహిళలకు అనుకూలంగా లేదు! రెండవ ప్రపంచ సంగ్రామానికి పూర్వం, యూరపు దేశాల వివాహిత స్త్రీలు ఎన్నికలలో పోటీ చేయటాన్ని, కుటుంబ సంప్రదాయాన్ని భంగపరచటంగా భావించే వారు! అంతేకాదు, పార్లమెంటరీ బాధ్యతా నిర్వహణకు వివాహితలు పనికిరారని పార్టీ నాయకత్వాలు నమ్మేవి!

మహిళలకు ఓటింగుహక్కును, ఎన్నికలలో పోటీచేసే హక్కును, మంత్రులుగా, రాజ్యాధినేతలుగా నియమిత మయ్యే హక్కులను ఇచ్చినంత మాత్రాన ప్రయోజనం లేదు. వారీ హక్కులను అనుభవించటానికి తగిన వసతులనూ ఆయా ప్రభుత్వాలు కల్పించాలి. ఉదాహరణకు, శిశు సంరక్షణకు, తీరిక దొరికిన సమయాలలో ఉద్యోగ విధుల నిర్వహణకు ప్రభుత్వాలు అవకాశాలు కల్పిస్తే, మహిళలకు రాజకీయ రంగంలో పాలు పంచుకొనే వీలుంటుంది. ఒక్క స్కాండినేవియా దేశాలు తప్ప, ఇలాంటి వసతులను ఇతర దేశాలు ఏర్పాటు చేయలేదు (డెన్మార్క్, నార్వే, స్వీడన్ దేశాలను స్కాండినేవియా దేశాలుగా వ్యవహరిస్తున్నారు జాతి సంబంధమైన విషయ ప్రస్తావన వచ్చినపుడు ఐస్‌లెండును: చారిత్రక, భౌగోళిక విషయాల ప్రస్తావన వచ్చినపుడు ఫిన్లండును వీటిలో కలుపుతున్నారు). రాజకీయ రంగంలో పనిచేసేవారు, ఏ సమయంలో నయినా ఆ పనులకు వెళ్ళవలసిన అవసరం ఉంటుంది. ఇల్లాలు ఇంటిని, పిల్లలను వదిలి ఎలా వెళ్ళ గలదు? కనుక ఇలాంటి వసతులను మహిళలకు ఆయా ప్రభుత్వాలు కలుగజేసినపుడు మహిళలు ఈ రంగంలో అధికంగా చేరే అవకాశాలుంటాయి వారికిచ్చిన హక్కులను అనుభవించటానికి ఉత్సాహపడతారు. ఇలాంటి అవకాశాలు లేవు గనుకే, పార్లమెంటరీ వ్యవహారాలలో పాల్గొన దలచిన మహిళలు, అవివాహితలుగా ఉంటున్నారు. చరిత్రలో మనకు ఇటువంటి సందర్భాలు కనుపిస్తాయి. పురుషులకు ఇలాంటి ఇబ్బందులు లేవు. పెండ్లి చేసుకొంటారు; పిల్లలను కంటూ ఉంటారు; రాజకీయాలో పాల్గొంటూ ఉంటారు.

మహిళలకు ఇలాంటి అవకాశాలు లేవు. జర్మనీలో గ్రీన్ పార్టీ అధిష్ఠాన వర్గ సభ్యురాలు మార్గరెట్ ఉల్ఫ్ మేయర్ అనే ఆవిడ భర్త, తన భార్య రాజకీయాలలోదిగి పిల్లలను సక్రమంగా చూడటం లేదని కోర్టులో ఫిర్యాదుచేశారు. ఇది 1986లో జరిగింది. "రాజకీయాలకు, పిల్లలను కనటానికి సమన్వయం కుదరదు" గనుక, పిల్లలను తండ్రి సంరక్షణకు పంపాలని కోర్టు ఆదేశించింది! పిల్లల పోషణ, సంరక్షణలను తల్లిచూడాలని సమాజం భావించినట్లే తల్లి కూడా అనుకొంటుంది. ఈ బాధ్యతలున్న మహిళలు రాజకీయాలలో పనిచేస్తున్నపుడు, తాము తమ కుటుంబ విధులను సక్రమంగా నిర్వహించలేక పోతున్నామే అన్న బాధ వారిలో ఉంటుంది. ఇది సహజం. అమెరికాలో 1981వ సంవత్సరంలో ఈ అంశాల మీద సర్వేను నిర్వహించిన మహిళ రూత్ మేండెల్ ఈ అంశాన్ని ధృవపరచారు. తమ సర్వేలో పాల్గొన్న మహిళా కాంగ్రెసు సభ్యులలో అధికులు గృహ నిర్వహణా విధులను సక్రమంగా చేయలేక పోతున్నామన్న విచారాన్ని వ్యక్తం చేసినట్లు

సర్వే వెల్లడించింది (అమెరికాలో సెనెట్ సభను, హౌస్ ఆఫ్ రిప్రజెంటెటివ్స్ సభను కలిపి "కాంగ్రెస్"గా వ్యవహరిస్తారు) ఎదిగిన పిల్లలున్న వారికి కూడా, పిల్లల, తమ భర్తల సౌఖ్యాన్ని గమనించలేక పోతున్నామే అనే బాధ ఉండటం సహజం. రాజకీయ రంగంలో పనిచేస్తున్న అవివాహితలు తమ ఇంటిని అందంగా, పరిశుభ్రంగా ఉంచలేక పోతున్నామే, చక్కగా వండుకుతినటానికి, అతిథులను పిలిచి ఆనందింపచేయటానికి వీలుకలగటం లేదే అని బాధపడుతూంటారు. కొందరు మహిళలు, పిల్లలు పెద్దయిన తర్వాత, కుటుంబ నిర్వహణాభారం తగ్గిన తర్వాత, వయస్సు ముదిరిన దశలో రాజకీయ రంగానికొస్తారు (మగవారికీ బాధలేదు, వారు ఏ దశలోనైనా రాగలరు). అంటే పురుషుల కంటే చాలా వెనుక, వయస్సు ముదిరిన తర్వాత వీరు రాజకీయ రంగ ప్రవేశం చేస్తారన్న మాట. ఈ దశలో వారు వచ్చినా, పురుషుల తోడి సమానత్వాన్ని (రాజకీయ రంగంలో) సాధించటం వారికి కష్టమే అవుతుంది. ఈ అంశాన్ని, ఎం.ఎం.లీ. తాను వ్రాసిన "వై ఫ్యూ ఉమెన్ హోల్డ్ పబ్లిక్ ఆఫీస్" అన్న వ్యాసంలో చక్కగా వివరించారు. అందులోని ఒక్క విషయాన్నిచట ప్రస్తావిస్తాను. "పదవీ పీఠానికి ఎన్నిక కావాలన్న మహిళ ఆకాంక్షను, సంతానభారం నిరుత్సాహ పరుస్తుంది. అంతేకాదు; పిల్లలు పెద్దవారయి, వారు స్వతంత్ర్య జీవనానికి వెళ్ళిన తర్వాత కూడా ఆవిడ స్వేచ్ఛగా ఈ పదవులకు పోటీచేయలేదు; ఎన్నో అవరోధాలను ఎదుర్కొన వలసి వస్తుంది. వయస్సు ముదరక ముందే, (అంటే ఇరవై నుండి నలభయ్యైదు సంవత్సరాల మధ్యకాలంలో) వీరు రాజకీయానుభవాన్ని సంపాదించే అవకాశం లేదు. వీరి కంటే ఎంతో ముందుగా రంగంలో దిగిన పురుషులు, వీరు రంగంలోనికి రాకపూర్వమే అధికానుభవాన్ని సంపాదించి ఉంటారు. వయస్సు ముదిరిన తర్వాత రంగంలోనికి వచ్చిన మహిళలకు పూర్వానుభవం ఉండదు. రాజకీయాలలో ఓ న మా లను ఇపుడే నేర్చుకోవలసి ఉంటుంది. కుటుంబ బాధ్యతల నుండి విముక్తి పొందిన తర్వాత రాజకీయ రంగానికి వచ్చిన మహిళలు అప్పటికే ఎంతో అనుభవాన్ని సంపాదించి ఉన్న పురుషులతో పోటీ బడలేరు. దీనినే ఒక్క మాటలో చెప్పవచ్చు. "రాజకీయాలలో ఆసక్తి ఉన్న పురుషులు, స్త్రీల కంటే ఎంతో ముందుంటారు. కనుక ఈ పరుగు పందెం లో స్త్రీలు వారిని దాటి పోలేరు."

కొన్ని కుటుంబాలలోని జీవన పరిస్థితులు, రాజకీయ రంగంలో ప్రవేశించే మహిళలకు భౌతికంగానే గాకుండా, మానసికంగా కూడా ఎంతో తోడ్పాటు నిచ్చేవిగా ఉంటాయి. రాజకీయ రంగంలో పనిచేసిన, పనిచేస్తున్న కొందరు మహిళలకు, భర్తల అండదండలు పుష్కలంగా లభించటాన్ని చూస్తున్నాం. మహిళా పార్లమెంటు సభ్యుల భర్తలు, రాజకీయాలలో దిగి ఉండటమే గాదు, బాధ్యతాయుత పదవులను నిర్వహిస్తూండటం కూడా కనుపిస్తుంది. అట్లని జీవితంలోని అన్ని దశలలోనూ భర్తల ప్రోత్సాహం, సహకారము తమకు లభిస్తుందని మహిళలు ఆశించే అవకాశాలు లేవు భార్యల రాజకీయ జీవితం, తమ రాజకీయ జీవితానికి, ఆశలకు, ఆకాంక్షలకు అవరోధంగా తయారయినా, లేక భర్తగా వారి పురుషాధిక్యతకు భంగం గలిగే పరిస్థితులేర్పడినా, భార్యలకు వీరి మద్దతు లభించదు. మాజీ బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్ జీవితానుభవాన్ని వివరిస్తూ ఎలిజెబెత్ వెలెన్స్, "ఉమెన్ ఇన్ ది హౌస్ - ఎ స్టడీ ఆఫ్ ఉమెన్ మెంబర్స్ ఆఫ్ పార్లమెంట్" అన్న రచనలో పేర్కొన్న అంశం, ఈ సందర్భంలో గమనించదగినది. "బ్రిటిష్ రాజకీయాలలో ఒక మహిళ అందరికంటే అధికంగా రాణించటంలో ఒక ప్రత్యేకత ఉన్నది. మార్గరెట్ థాచర్ భర్త, ఆవిడ కంటే అనేక సంవత్సరాలు పెద్దవారు, మార్గరెట్ రాజకీయ జీవితంలో ఉన్నత దశ ప్రారభమయ్యే కాలానికి, వారి భర్త, రాజకీయ జీవితం ముగిసింది". ఇందిరాగాంధి జీవితానుభవాన్ని కూడా మనం చూడవచ్చు. కుటుంబ బాధ్యతలు వదలిపోయిన తర్వాతనే వారి రాజకీయ జీవితం ఉన్నతస్థాయికి ఎదుగసాగింది. ఎదిగిన పుత్రులు ఆవిడకు అండగా నిలిచారు.

ఐక్యరాజ్య సమితికి చెందిన సెంటర్ ఫర్ సోషల్ డెవలప్‌మెంట్ అండ్ హ్యూమనిటేరియన్ ఎఫైర్స్ సంస్థ జరిపించిన సర్వేలు, కుటుంబ నిర్వహణా భారం వలననే స్త్రీలు అధికంగా రాజకీయ రంగంలో ప్రవేశించలేకపోతున్నారనీ, చేరినా రాణింపు దశకు అత్యధికులు రావటం లేదనీ నిరూపించాయి. గృహిణిగా, మాతృమూర్తిగా మహిళ నిర్వహించ వలసిన కార్యభారమే, వెనుజులా మహిళల రాజకీయ రంగ ప్రవేశానికి పెద్ద అవరోధంగా తయారయినట్లు ఆ దేశంలో

జరిగిన సర్వే ఒకటి పేర్కొన్నది ఆ సర్వేను నిర్వహించిన మహిళ, ఆదేశపు సెనెట్ సభ్యురాలట. ఫిలిపీన్స్‌లోనూ ఒక సెనెట్ సభ్యురాలు ఇలాంటి సర్వేను నిర్వహించారు. రాజకీయ విధుల నిర్వహణా భారం, గృహనిర్వహణా బాధ్యతలకు పోటీగా రూపొందినట్లు సర్వేలో పాల్గొన్న పార్లమెంటరీ సభ్యురాండ్రు చెప్పారు.

యునైటెడ్ రిపబ్లిక్ ఆఫ్ టాంజానియా సర్వేను ఆ దేశపు పార్లమెంటు సభ్యురాలిగా దీర్ఘకాలం పనిచేసిన మహిళ ఒకరు నిర్వహించారు. శిశుపోషణ, వారి సంరక్షణా భారాలే మహిళలు రాజకీయ రంగంలో ప్రవేశించకుండా నిరోధిస్తున్నట్లు సర్వే పేర్కొన్నది. అభివృద్ధి చెందుతున్న పలుదేశాలలో వలె, అధిక పనిభారానికి తోడు, కుటుంబ ఆర్థిక పరిస్థితులు కూడా వారి రంగ ప్రవేశానికి అవరోధాలుగా ఉన్నట్లు కూడా సర్వే సూచించింది. నాయకత్వ స్థానాలకు రాగలిగిన అర్హతలు, శక్తి సామర్థ్యాలున్న మహిళలకు వారి వైవాహిక జీవితం అడ్డంకిగా తయారైంది. కొందరి భర్తలు, తమ భార్యలు పార్టీ పదవులకు ఎన్నిక కావటానికీ, లేక పోటీ చేయటానికి సుముఖంగా ఉండటం లేదు. వీరు భార్యలను నిరుత్సాహపరుస్తున్నారు. అవివాహితలు, విడాకులను పొందినవారూ నాయకత్వ స్థానాలకు పోటీ చేయటానికి, వారికి తగినన్ని అర్హతలున్నా, పార్టీలో వ్యతిరేకత వ్యక్తమవుతున్నది!

నెదర్లాండ్సులో పార్లమెంటు సభ్యుల జీవితాల మీద ఒక సర్వే జరిగింది. ఇందులో 145 మంది మహిళా సభ్యుల జీవితాలను, 1208 మంది పురుష సభ్యుల జీవితాలను పరిశీలించారు. 1918-1986 సంవత్సరాల మధ్య కాలాన్ని పరిశీలనకు తీసుకొన్నారు. ఈ సర్వేలో కూడా రాజకీయ రంగంలోనికి రాగోరిన మహిళలకు, పెండ్లి గావటం, సంతానం ఉండటం అనేవి ప్రధాన అవరోధాలుగా తేలాయి. 1918-1946 సంవత్సరాల మధ్యకాలంలో, మహిళా పార్లమెంటు సభ్యులలో సగం మంది మాత్రమే వివాహితలు; అంతేకాదు, వారిలో చాలా మందికి సంతానం కూడా లేదు. 1977-86 సంవత్సరాల మధ్య కాలంలో ఈ విషయంలో కొంత మార్పు కనుపించింది. మహిళా సభ్యురాండ్రలో నాల్గింట మూడు వంతుల మంది వివాహితలున్నారు. వారిలో 40 శాతం మంది పిల్లలను కన్నారు. తల్లుల రాజకీయ జీవితం రాణింపుకు వచ్చేనాటికి, వారి పిల్లలు పెరిగి పెద్దవారయినారు అందువల్ల వారు అధిక కాలాన్ని రాజకీయ కార్యకలాపాలకు వాడగలిగారు సంతాన నియంత్రణావసరం గుర్తింపుకు వస్తున్నందున, గత కాలం కంటే ముందు కాలం మెరుగుగా ఉండగలదన్న ఆశాభావం గలుగుతున్నది.

రాజకీయ పార్టీలు, వాటికి సంబంధించిన సంస్థలు, పార్లమెంటులు మగవారు నిర్ణయించిన విధానాల ప్రాతిపదిక మీద పనిచేస్తున్నాయి. వీరు కార్యక్రమాలను రూపొందించేటపుడు, గృహ నిర్వహణ, శిశుపోషణ-సంరక్షణా భారాలను నిర్వహించవలసిన మహిళా సభ్యుల సౌకర్యాలను గమనించటం లేదు. ఇందువల్ల కూడా మహిళలు రాజకీయ రంగంలో తమ వంతు పాత్రను నిర్వహించలేక పోతున్నారు. రాజకీయ రంగంలో పురుషుల ఆధిక్యతే కొనసాగుతున్నది. పురుషులతో సమాన ప్రతిపత్తిని స్త్రీల కిచ్చిన రాజ్యాంగ చట్టాలను ఆమోదించిన దేశాలలో కూడా, పార్లమెంట్లలో స్త్రీలకు సగం మేరకు కాకపోయినా, మూడవ వంతు స్థానాలు కూడా లభించక పోవటం మనకు కనుపిస్తున్నది.

## ఎన్నికలలో పోటీకి అభ్యర్థుల ఎంపిక

మహిళల రాజకీయ జీవిత పురోగమనాన్ని, పోటీ చేయవలసిన అభ్యర్థుల ఎంపిక విధానాలు ఎలా అడ్డు కొంటున్నాయో చూద్దాం.

పలువురు రాజకీయ పార్టీలలో చేరి పనిచేస్తుంటారు. వారి శక్తిసామర్థ్యాలు భిన్నంగా ఉండటం సహజం. ఎన్నికలలో పోటీకి తగిన అభ్యర్థులను పార్టీ ఎంపిక చేస్తుంది. కార్యకర్తలుగా, స్థానిక, లేక ప్రాంతీయ నాయకులుగా రూపొందినవారు, అధికార పీఠాన్ని చేరటానికీ ఎంపిక రెండవ సోపానం. దీని కోసం, పార్టీలోనే పోటీ తీవ్రంగా ఉండటం కూడా సహజం. ఇంతవరకూ నామ మాత్రపు ప్రాతినిధ్యానికి నోచుకొంటున్న మహిళలకు ఇది మరింత ముఖ్యమైన అదును.

ఎన్నికలలో పోటీచేయవలసిన అభ్యర్థుల ఎంపిక ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క రకంగా ఉంటుంది. కొన్ని చోట్ల "ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్" విధానం అమలులో ఉంటుంది. ఈ విధానంలో, అభ్యర్థి ఎంపికకు కావలసిన మొత్తం ఓట్ల

పరిమాణాన్ని బట్టి, ఆయా పార్టీలకు వచ్చిన ఓట్ల ప్రాతిపదిక మీద, ఎన్నికయ్యే అభ్యర్థుల సంఖ్య ఆధారపడి ఉంటుంది. మరికొన్ని చోట్ల "మెజారిటీ సిస్టం" అనే ఎన్నిక విధానం అమలులో ఉంటుంది. ఇందులో ఒక నియోజక వర్గంలో పోటీ చేసిన అభ్యర్థులలో అధికంగా ఓట్లు వచ్చిన వారిని ఎన్నికయినట్లు ప్రకటిస్తారు.

మెజారిటీ సిస్టం ఓటింగు విధానం కంటె, ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ విధానంలో ఎక్కువ మంది మహిళలు ఎన్నికయ్యే అవకాశాలుంటాయన్నది సామాన్యమైన భావన. ఈ ఎన్నిక విధానంలో, పార్టీలు, ఏ వరుసలో అభ్యర్థుల పేర్లను ప్రకటిస్తాయో ఆ వరుసలోనే గెలిచిన అభ్యర్థుల పేర్లను ప్రకటిస్తారు. ఇచ్చట అభ్యర్థి ప్రాధాన్యత మీదగాక, పార్టీ ప్రాధాన్యత, ప్రజాదరణల మీద విజయావకాశాలు ఆధారపడి ఉంటాయి. మెజారిటీ సిస్టంలో, అభ్యర్థి పొందే ప్రజాదరణ, లేక వారికుండే ఆర్థిక, సాంఘిక ప్రాబల్యాల మీద వారి విజయం ఆధారపడి ఉంటుంది. ఇచ్చట, ఇంతకు పూర్వమే పురుషుల కంటే ఎంతో వెనుక బడిన మహిళలు, అన్నిటా తమ కంటే అధికులుగా ఉండే పురుషులతో తలపడవలసి ఉంటుంది. ఇది పూర్తిగా వ్యక్తుల మధ్య పోటీగా ఉంటుంది. ఈ పోటీ సమానుల మధ్య గాక (స్త్రీ పోటీ చేస్తున్న సందర్భంలో) అసమానుల మధ్య జరుగుతుంది. ఇందువల్ల ఈ పోటీ స్త్రీలకు అనుకూలంగా ఉండదని భావిస్తున్నారు.

ఇట్లని ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ విధానంలో స్త్రీలు పోటీని ఎదుర్కొన వలసి ఉండదని భావించనవసరం లేదు. పార్టీల నాయకత్వం సామాన్యంగా పురుషుల చేతులలోనే ఉంటుంది; కనుక అభ్యర్థుల లిస్టులను తయారు చేసేది వీరే. పురుష నాయకత్వం మహిళల యెడల ఆదరణను ప్రదర్శించగలిగినపుడే అధికసంఖ్యలో మహిళలు ఎన్నికయ్యే అవకాశాలుంటాయి. లిస్టులోని ముందు భాగంలో స్త్రీల పేర్లున్నపుడు, వీరి ఎన్నికకు, అధికావకాశాలుంటాయి; లిస్టులో దిగువకు పోయిన కొలదీ ఈ అవకాశాలు తగ్గుతాయి. కనుక అభ్యర్థుల ఎంపిక విధానం ఎన్నికలలో కీలకాంశంగా ఉంటుంది.

అభ్యర్థుల ఎంపికలో మూడు ముఖ్యాంశాలు ఉన్నాయి; 1. అభ్యర్థులనుఎంపికచేసేది ఎవరు? 2. ఎంపికకు అనుసరించే విధానం ఎటువంటిది? 3. పార్లమెంటులో, స్త్రీల స్థానాన్ని బలపరచాలనే ఆశయం ఆ పార్టీ నాయకత్వానికున్నదా?

ఆయా దేశాలలో అనుసరిస్తున్న విధానాలనుబట్టి, పార్టీ అధిష్ఠానవర్గం పోటీ చేయవలసిన అభ్యర్థుల ఎంపిక జరుపుతుంది. కొన్ని దేశాలలో, నియోజక వర్గంలోని పార్టీ సభ్యులు ప్రైమరీ ఎలక్షన్ ద్వారా, ఎన్నికలలో పోటీ చేయవలసిన తమ పార్టీ అభ్యర్థిని ఎన్నుకొంటారు. ఇందుకు ఉదాహరణగా అమెరికా అనుసరిస్తున్న విధానాన్ని చూడవచ్చు, ఈ ఎన్నికలో నెగ్గిన అభ్యర్థిని పార్టీ నాయకత్వం జనరల్ ఎన్నికలలో, ఆ నియోజక వర్గం నుండి పోటీ చేయటానికి ఎంపిక చేస్తుంది. పురుషులంత అధికంగా స్త్రీలు డబ్బును ఖర్చు చేయలేరు. పైగా వారు పురుషులంత బలమైన ప్రచారాన్ని కొనసాగించలేరు. ఇందువల్ల ఈ విధానపు ఎంపిక కూడా మహిళా అభ్యర్థులకు అనుకూలంగా ఉండటం లేదు.

కొన్ని పార్టీలలో, అభ్యర్థుల ఎంపికను పార్టీ కేంద్ర నాయకత్వం చేస్తుంది. మరికొన్ని పార్టీలలో ఈ అధికారం, పార్టీ ప్రాంతీయ శాఖల కుంటుంది. యునైటెడ్ కింగ్డంలో, లేబర్ పార్టీ ఈ రెండవ విధానాన్ని అనుసరిస్తున్నది. ఇంతవరకూ ఈ రకమైన ఎన్నిక విధానం మహిళలకు ప్రయోజనకరమన్న అంశం రుజువుకాలేదు. కాని, బ్రిటన్లో 1997లో అధికారానికొచ్చిన లేబరు పార్టీ, స్త్రీలకు ఇరవైశాతం సీట్లను కేటాయించటం గమనించదగిన అంశం. ఈ రకమైన ఎంపిక మహిళలకు ప్రయోజనకరంగా ఉన్నట్లు నార్వే దేశపు అనుభవం నిరూపించింది.

అభ్యర్థుల ఎంపికకు ప్రాంతీయ కమిటీలకు అధికారాన్నివ్వటం వల్ల, మహిళలు అధిక పోటీని ఎదుర్కొనవలసి వస్తున్నది. కేంద్ర నాయకత్వం ఎంపిక చేసేటపుడు, మహిళల కుండవలసిన కనీస ప్రాతినిధ్యం విషయాన్నైనా దృష్టిలో ఉంచుకొంటుంది. ఇలాంటి విషయం మీది కంటే, ఆ ప్రాంతంలో తామే అధికారాన్ని చలాయించాలన్న పురుషుల కాంక్షా ప్రదర్శనకు అధికావకాశాలుండటం వల్ల మహిళలు పురుషుల నుండి తీవ్రమైన పోటీని ఎదుర్కొన వలసి ఉంటుంది. కనుక ఈ ఎన్నిక విధానం కూడా స్త్రీలకు అనుకూలించటం లేదు.

పార్టీలు అభ్యర్థుల ఎంపికకు అనుసరించే విధానాలను చూద్దాం వ్యక్తికి ఆ నియోజక వర్గంలో ఉండే పలుకుబడి, సాంఘిక హోదా, ఆర్థిక స్థోమత ఇవన్నీ పరిగణనకు వస్తాయి. విద్యార్హతలకు కూడా ప్రాధాన్యత ఉంటుంది. కొన్ని పార్టీలు, అభ్యర్థి యొక్క రాజకీయ జీవిత పరిమాణం, అనుభవం, పరిపక్వతా విషయాలను కూడా పరిగణనకు తీసుకొంటాయి. సామాజికుల అండదండలు కూడా వ్యక్తి విజయానికి తోడ్పడతాయి గనుక, ఆ వ్యక్తి యొక్క సంఘసేవ, లేక మతపరమైన సేవలు కూడా పరిగణనకు వస్తాయి. రాజకీయాల ప్రమేయం లేకుండా, సంఘసేవలో అనుభవాన్ని పొందినవారు, రాజకీయాలలో రాణిస్తూండటాన్ని కూడా మనం చూస్తున్నాం. మహిళలకున్న పూర్వ రాజకీయానుభవం, ఈ ఎంపికలో అధికంగా తోడ్పడుతున్నట్లు కనుపిస్తున్నది.

నియమిత పరిమాణపు స్థానాలను మహిళల కివ్వాలన్న నియమాన్ని పార్టీలు పాటించినపుడు, స్త్రీలకు కొద్దిపాటి ప్రాతినిధ్యమైనా లభిస్తుంది. కొన్ని పార్టీలు నియమిత పరిమాణపుసీట్లను తమ మహిళా సభ్యులకు ఇవ్వాలని తీర్మానించుకొన్నాయి. కొన్ని దేశాలలో ప్రభుత్వాలు పార్లమెంటులో మహిళల కివ్వవలసిన సీట్ల సంఖ్యను కూడా నిర్ణయించాయి ఉదాహరణకు పాకిస్తాన్ 20సీట్లను, యునైటెడ్ రిపబ్లిక్ ఆఫ్ టాంజానియా 15 సీట్లను, ఈజిప్టు 31 సీట్లను తమ పార్లమెంట్లలో మహిళల కివ్వాలని చట్టపరంగా నిర్ణయించాయి. ఇలాంటి చట్టపరమైన రిజర్వేషన్లు కొన్ని సమస్యలను మన ముందుంచుతున్నాయి.

ఇందుకు ఈజిప్టు అనుభవాన్ని తీసుకుందాం. 1979 వ సంవత్సరంలో అధ్యక్షుడు సాదత్, దేశపు పార్లమెంటు సీట్లలో 31 స్థానాలను చట్టపరంగా స్త్రీలకు కేటాయించారు. ఆ సంవత్సరం జరిగిన ఎన్నికలలో ఈ ముప్పై యొక్క స్థానాలకు రెండు వందల మంది మహిళలు పోటీ చేశారు. రిజర్వేషన్ క్రిందకు రాని, స్థానాలలో పురుషులతో పోటీచేసి ముగ్గురు మహిళలు గెలుపొందారు. 1983 వ సంవత్సరంలో ఈ రిజర్వేషన్ విధానపు తొలగింపుకు ప్రయత్నాలు జరిగాయి. పార్లమెంటులో తమకున్న సంఖ్యాబలాన్ని వినియోగించుకొని మహిళలు ఈ ప్రాతిపదనా విరమణకు జయప్రదంగా కృషి చేశారు. 1986వ సంవత్సరంలో ఈ ప్రాతిపాదన నెగ్గి అమల్లోకి వచ్చింది. ఈసారి, కొందరు మహిళా పార్లమెంటు సభ్యులే రిజర్వేషన్లకు వ్యతిరేకంగా పనిచేశారు. మహిళలు రాజకీయాలలో పాల్గొనటానికిపుడున్న సాంఘిక వ్యతిరేకత తొలగేవరకూ, రిజర్వేషన్లు ఉండటం అవసరమని కొందరు. మహిళలకు లభించగల అవకాశాలను పరిమిత పరుస్తున్నాయని రెండవ వర్గం వారు భావించారు. రిజర్వేషన్ వ్యతిరేకుల వాదనలివి

1 పురుషులతో, సమ ఉజ్జీగా మహిళలు పోటీ పడవలసిన సమయ మాసన్నమైంది

2 రిజర్వేషన్లు, మహిళల పాత్రను సంకుచిత పరుస్తున్నాయి, రిజర్వేషన్ నియమం లేకపోతే మరింత అధికావకాశాలు స్త్రీలకు లభిస్తాయి:

3. రిజర్వేషన్ ఫలితంగా పార్లమెంటుకు వచ్చిన మహిళా సభ్యులలో అధికులు సాధించింది ఏమీ లేదు: వారిది నామ మాత్రపు సభ్యత్వం;

4. రిజర్వేషన్, మహిళలను సంతృప్తి పరచటానికి పురుష నాయకత్వం వేసిన ఒక ఎత్తు మాత్రమే. ఇది మహిళా సమస్యల పరిష్కారానికి పార్టీ నాయకత్వపు దీక్షా ప్రదర్శన కాదు.

ఈ వాదోపవాదాలలోని అంశాలేవయినా, రిజర్వేషన్ల తొలగింపు మాత్రం మహిళలకు అనర్థదాయకంగా తయారైందన్న మాట మాత్రం నిజం. ఈజిప్టులో 1987 వ సంవత్సరపు ఎన్నికలలో పధ్నాలుగురు మహిళలు పార్లమెంటుకు ఎన్నికైనారు. 1994 జూన్ నాటికి వీరికున్న సభ్యత్వం కేవలం పదిమాత్రం! మొత్తం సభ్యత్వంలో ఇది రెండు శాతం!

మహిళలకు రిజర్వేషన్లు ప్రయోజనకరంగాదు అన్న వాదం మంచిది కాదు. ఆ వసతిని వాడుకొన్న విధానాన్ని బట్టి, దానివల్ల లభించే ఫలితాలుంటాయి. రిజర్వేషన్ల విధానం, మహిళలను రాజకీయ రంగానికి రప్పించటానికి ఆధారంగా ఉపకరిస్తుంది. రాజకీయాలలో మహిళల ముందంజకు ఇది అత్యవసరం. స్వీడన్, నార్వే, డెన్మార్క్, ఫిన్లండ్ దేశాలలోని పది రాజకీయ పార్టీలు, మహిళలకు రిజర్వేషన్ వసతిని కల్పించాయి. నార్వేలోని రాజకీయ పార్టీలలో కెల్ల పెద్దదయిన నార్వేజియన్ లేబర్ పార్టీ, పార్టీశాఖల కార్యవర్గ ఎన్నికలలో,

**భారత పార్లమెంటులో 8 శాతానికి మించని మహిళా ప్రాతినిధ్యము**

| ఎన్నికలు జరిగిన సంవత్సరం | పార్లమెంటులోని మొత్తం సీట్ల సంఖ్య | సభలో స్త్రీ సభ్యుల సంఖ్య | మహిళా సభ్యత్వ శాతము |
|---|---|---|---|
| 1952 | 499 | 22 | 4.4 |
| 1957 | 500 | 27 | 5.4 |
| 1962 | 503 | 34 | 6.8 |
| 1967 | 523 | 31 | 5.9 |
| 1971 | 521 | 22 | 4.2 |
| 1977 | 544 | 19 | 3.5 |
| 1980 | 544 | 28 | 5.1 |
| 1984 | 544 | 44 | 8.1 |
| 1989 | 517 | 27 | 5.2 |
| 1991 | 544 | 39 | 7.2 |
| 1996 | 544 | 40 | 7.4 |
| 1998 | 543 | 43 | 7.9 |

హిందూ దినపత్రిక ప్రచురించిన ఈ సమాచారం ప్రకారం, పార్లమెంటులో మహిళాసభ్యత్వం 4.4 శాతం నుండి 7.9 శాతానికి పెరగటానికి 46 సంవత్సరాలు పెట్టింది. మహిళా సభ్యత్వ శాత పరిమాణం ఈ రేటునే పెరుగుతూంటే, 35 శాతాన్నిది చేరటానికి సుమారుగా 360 సంవత్సరాలు పట్టవచ్చు ! స్త్రీలకు సముచిత ప్రాతినిధ్యం లభించటానికి రిజర్వేషన్ ఒక్కటే ఉత్తమ మార్గంగా కనుపిస్తున్నది.

1981 లో రిజర్వేషన్ల విధానాన్ని ప్రవేశపెట్టింది. 1983వ సంవత్సరం, పార్లమెంటరీ ఎన్నికలలో కూడా ఈ విధానాన్ని పార్టీ అనుసరించింది. ఇందువల్ల 1985 వ సంవత్సరపు పార్లమెంటరీ ఎన్నికలలో వారి పార్టీలో మహిళలు అధిక సంఖ్యలో ఎన్నికయినారు. పార్లమెంటరీ పార్టీ సభ్యులలో నూరింట 42 మంది మహిళా సభ్యులున్నారు. ఐస్‌లెండ్‌లోని పీపుల్స్ ఎలయన్స్ పార్టీ అనే అతివాద పార్టీల సమాఖ్య యొక్క కేంద్ర కమిటీకి ఎన్నికయిన సభ్యులలో సగం మంది వరకూ మహిళలున్నారు. నాటి నుండి ఆ పార్టీ, మహిళలకు కోటా పద్ధతిన సీట్లను రిజర్వు చేస్తున్నది. పార్టీలో సగం బలం తమకున్నది గనుక, పార్లమెంటు సభ్యత్వానికి పోటీచేసే అభ్యర్థులలో సగం మంది మహిళలుండేట్లు చూడగలుగుతున్నారు. 1985వ సంవత్సరపు ఎన్నికల తర్వాత నార్వే ప్రధానిగా వచ్చిన మహిళ, గ్రో హర్లెమ్ బ్రంట్లెండ్ తమ మంత్రివర్గ స్థానాలలో సగానికి, మహిళలను తీసుకొన్నారు. అటు తర్వాత, అధికార పార్టీగా వచ్చిన కన్సర్వేటివు పార్టీ కూడా సగం కాబినెట్ స్థానాలను మహిళల కిచ్చింది. 1991 వ సంవత్సరంలో ఈ దేశంలోని మూడు ప్రధాన రాజకీయ పార్టీల నాయకులుగా మహిళలుండటం విశేషం! అటు తర్వాత, పలుదేశాలలోని రాజకీయ పార్టీలు ఇలాంటి రిజర్వేషన్ విధానాన్ని అవలంబించ నారంభించాయి.

చిత్తశుద్ధి, మహిళాభ్యున్నతి ప్రధానాశయంగా గలిగిన నాయకత్వాలు ఈ విధానాన్ని మహిళలకు ప్రయోజనకరంగా ఉండేట్లు అమలు జరుపుతున్నాయి.చిత్తశుద్ధి లేనివారు దీనిని కన్నీటి తుడుపుగా పరిగణిస్తున్నారు. అమలు పరచని నాయకత్వం మీద శిక్షణా చర్యను తీసుకొనే వారెవరు? అందువల్ల అలసత్వం ప్రదర్శిత మవుతున్నది. ఏ ఇరవై లేక ముప్పై శాతం సీట్లో స్త్రీలకు కేటాయించటం కూడా లింగ

ఐదవ పట్టిక
స్త్రీపురుష రాజకీయ నాయకుల సామర్థ్యంపై ప్రజల విశ్వాస సేకరణ (1975-1983)
(పట్టికలోని సంఖ్యా వివరాలు, ఆయా అభిప్రాయాలను ప్రకటించిన వారి శాతపరిమాణాలను తెలియజేస్తాయి)

| స్త్రీలు లేక పురుషులు | సర్వేజరిగిన సంవత్సరం | పురుషుల మీద అధిక విశ్వాసం | స్త్రీలమీద అధిక విశ్వాసం | ఎవరైనా ఒకటే | ఏమీ చెప్పని వారు |
|---|---|---|---|---|---|
| స్త్రీలు | 1975 | 33 | 11 | 50 | 6 |
| | 1977 | 33 | 16 | 44 | 7 |
| | 1983 | 27 | 9 | 61 | 3 |
| పురుషులు | 1975 | 42 | 6 | 46 | 6 |
| | 1977 | 47 | 6 | 42 | 5 |
| | 1983 | 34 | 4 | 60 | 2 |
| స్త్రీ పురుషుల సరాసరి | 1975 | 38 | 8 | 48 | 6 |
| | 1977 | 40 | 11 | 43 | 6 |
| | 1983 | 30 | 6 | 61 | 3 |

*ఆధారం : యునైటెడ్ నేషన్స్ స్టడీ -1984.*

వివక్షా ప్రదర్శనే అవుతుంది. ఓటర్లలోనూ, జనాభాలోనూ సగభాగంగా ఉన్న స్త్రీలకు ఇది తక్కువ ప్రాతినిధ్యం క్రిందే వస్తుంది. రాజకీయ పార్టీల ధోరణులలో కూడా క్రమంగా మార్పు లొస్తున్నాయి. మహిళలకు కనీసం మూడవ వంతు స్థానాలుండటం న్యాయమన్న సూత్రానికి సర్వత్రా ఆమోదం లభిస్తున్నది. కాని దీని ఆచరణ మాత్రం మందకొడిగా సాగుతున్నది.

మహిళల పార్లమెంటరీ ప్రాతినిధ్య పరిమాణాన్ని, పార్టీల రాజకీయ సిద్ధాంతాలుకూడా ప్రభావితం చేస్తున్నాయి. పోటీ ప్రాతిపదిక మీద నడిచే రాజకీయ రంగంలో అందరకూ సమానావకాశాలుండాలని మితవాద రాజీయ పార్టీలు భావిస్తాయి; మహిళలు సమాజంలో వెనుకబడినవారు గనుక, వారికి అధిక ప్రాధాన్యత లభించాలని సోషలిస్టు భావాలు గల పార్టీలు నమ్ముతుంటాయి. ఛాందస భావాలు గల పార్టీలు, స్త్రీలకు తగిన స్థానం ఇల్లు గనుక, వారికి రాజకీయాలతో ప్రమేయం ఉండకూడదని భావిస్తాయి. అతివాద పార్టీలు మాత్రమే గాక, వారికి అనుకూలంగా ఉండే మితవాద పార్టీలు కూడా, ఇప్పటి కంటే అధిక ప్రాతినిధ్యం స్త్రీలకు లభించాలని కోరతాయి. కౌన్సిల్ ఆఫ్ యూరప్ జరిపించిన సర్వే ఈ విషయాలను వెల్లడించింది. ఇందుకు రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఇటలీలో జరిగిన ఎన్నికల ఫలితాలను చూడవచ్చు. 1948 లో జరిగిన ఎన్నికలలో అన్ని పార్లమెంటరీ పార్టీలలో కంటే కమ్యూనిస్టు పార్టీలో మహిళా ప్రాతినిధ్యం అధికంగా ఉంది. ఈ పార్లమెంటరీ పార్టీలో మహిళా సభ్యత్వం పదహారు శాతం వరకూ ఉన్నది. మితవాద పార్టీ అయిన క్రిస్టియన్ డెమొక్రటిక్ పార్టీలో మహిళా సభ్యత్వం ఆరు శాతం మేరకే ఉన్నది. ఇతర దేశాలలో కంటే కమ్యూనిస్టు పాలిత దేశాలలో మహిళలకు అధిక పార్లమెంటరీ ప్రాతినిధ్యం ఉన్న విషయాన్ని ఇంతకు పూర్వమే వివరించాం. కమ్యూనిస్టేతర పార్టీలు కూడా మహిళా ప్రాతినిధ్యానికి క్రమంగా ప్రాధాన్యత నిస్తున్నాయి. లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతాలలో జరిగిన సర్వేలు కూడా ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి మతవాదానికి మొగ్గుతున్న మితవాద పార్టీలు తప్ప, మిగిలిన పార్టీలు మహిళల అధిక ప్రాతినిధ్యాన్ని కోరుతున్నాయి.

మత సిద్ధాంత ప్రాతిపదిక మీద నడిచే పార్టీలు మాత్రం రాజకీయ రంగంలో మహిళల ప్రవేశాన్ని నిరసిస్తున్నాయి. పెండ్లి చేసికోవటం, పిల్లలను కనటం, భర్తలకు సేవలు చేయటమే స్త్రీ బాధ్యతలుగా ఈ పార్టీలు నిర్వచిస్తున్నాయి.

ఇటీవల యూరపులో అవతరిస్తున్న చిల్లర పార్టీలు కొన్ని అధిక మహిళా ప్రాతినిధ్యాన్ని బలపరుస్తున్నాయి. ఇందుకు ఉదాహరణగా, పరిసరాల పరిరక్షణ కోసం ఏర్పాటవుతున్న "గ్రీన్" పార్టీలను పేర్కొనవచ్చు. ఈ పార్టీలలో బాగా చదువు కొన్నవారూ, యువకులు అధికంగా ఉంటున్నారు. పైగా వీరు ఎక్కువ కాలాన్ని సంఘసేవకు వినియోగించ గలుగుతున్నారు ఈ పార్టీలలో యువతులు కూడా ఎక్కువగా చేరుతున్నారు. ఈ పార్టీలు, ఇప్పటి ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించటమే గాక, స్త్రీలకు అధికప్రాధాన్యత రాజకీయ రంగంలో లభించాలని కోరుతున్నారు. ఈ పార్టీలలో కొన్ని, పోటీకి నిలిపే అభ్యర్థులలో సగం మంది మహిళలుండేట్లు కూడా చూస్తున్నాయి. సంప్రదాయ చట్రాన్ని ఛేదించటమే వీరి లక్ష్యంగా కనుపిస్తున్నది.

ఈ సందర్భంలో ఆస్ట్రియా సర్వే ఫలితాల పరిశీలన ప్రయోజనకరంగా కనుపిస్తుంది. దేశంలోని మితవాద పార్టీలలో ఒకటైన సోషల్ డెమొక్రటిక్ పార్టీ ఇతర మితవాద పార్టీల కంటే మహిళలకు అధిక ప్రాతినిధ్యాన్నిస్తున్నది. మహిళలకు సంబంధించిన సంప్రదాయ బంధాలు తెగిపోతున్న కాలంలో, వాటిని బలపరుస్తూండటం నిష్ప్రయోజనకరమని ఈ పార్టీ భావిస్తున్నది. కొత్తగా అవతరిస్తున్న పార్టీలలో మహిళలు అధికంగా ఉండటం, వాటి పలుకుబడి, తమ పార్టీల పలుకుబడి కంటే త్వరగా పెరుగుతూండటం కూడా మితవాద పార్టీలలో మార్పులకు కారణమవుతున్నాయి రాజకీయ రంగంలో ఏర్పడిన ఈ నూతన వాతావరణం మహిళల రాజకీయ పాత్రాభివృద్ధికి, పార్లమెంటరీ ప్రాతినిధ్యపు పెరుగుదలకు తోడ్పడుతున్నది.

పార్టీల సంస్కృతి కూడా మహిళా ప్రాతినిధ్య పరిమాణాన్ని ప్రభావితం చేస్తుంది. రాజకీయ పదవులు కూడా వంశపారంపర్యపు ఆస్థులుగా తయారయినాయి. ఆ వంశపారంపర్యత కూడా, ఆస్థి విషయంలో వలె పురుష క్రమంలోనే సంక్రమిస్తున్నది. ఇందువల్ల స్త్రీలకు రాజకీయ రంగంలోనూ, తద్వారా పార్లమెంటరీ వ్యవస్థలోనూ న్యాయమైన స్థానం లభించటం లేదు. ఈ వంశ పారంపర్యతా రీతికి మన దేశం పెద్ద ఉదాహరణ. ఇందిరాగాంధీ మహిళయినా, అధికారం వంశపారంపర్యంగా లభించినా, స్త్రీల విముక్తి, వారికి పురుషులతో సమానమైన స్థానపు సాధన సంభవించలేదు. పార్టీ వ్యవస్థలో, ఆ పార్టీ నిర్ణయాలను ప్రభావితం చేయగలిగి నంతటి ప్రాతినిధ్యం మహిళలకు లేకపోవటమే ఇందుకు కారణం స్త్రీ పురుషులు కలిసి పనిచేయటం, కలిసి నిర్ణయాలు తీసుకోవటమనేది జరగటం లేదు ఫ్రాన్సులో ఇంకా రాజకీయ రంగం పురుషుల గుత్తసొమ్ముగానే చలామణీ అవుతున్నది. పార్టీలో ప్రబలిన అలసత్వం, అధికార కాంక్ష, స్త్రీల యెడల ప్రదర్శితమవుతున్న నాయకత్వ అవాంఛనీయ విధానాలు స్త్రీలకు ఏ మాత్రం సరిపడటం లేదని చెబుతున్నారు. నాయకత్వాలు అనుసరిస్తున్న ఇలాంటి సంప్రదాయాల వల్ల, మహిళలకు తగిన అవకాశాలు లభించటం లేదు. మంత్రి పదవుల పంపకంలో గాని, పాలసీ నిర్ణయాలు చేసే అధికారం గల పదవుల పంపకంలోనూ, స్త్రీలు పంక్తి చివరలోనే ఉంటున్నారు. ట్రేడ్ యూనియన్లు, వృత్తి సంఘాల నిర్మాణంలో కూడా మహిళలకు న్యాయమైన స్థానం లభించటం లేదు.

రాజకీయ పార్టీలకు అనుబంధితమైన మహిళా సంఘాలు బలంగా ఉన్నచోట్ల, అవి మహిళా ప్రాతినిధ్యాన్ని ప్రభావితం చేయగలుగుతున్నాయి. పార్టీ అనుబంధిత మహిళా సంఘపు బలానికి, ఆ పార్టీలో మహిళలకు లభించే పార్లమెంటరీ ప్రాతినిధ్యానికి సంబంధం ఉంటున్నట్లు నిపుణుల పరిశీలనలు తెలియజేస్తున్నాయి. కనుకే చాలా పార్టీలు ఇలాంటి అనుబంధ సంస్థలను ఏర్పాటు చేస్తున్నాయి. రాజకీయాలలో ప్రవేశించగానే మహిళలకు ఇవి తర్ఫీదు నిచ్చే గరిడీలుగా ఉపకరిస్తాయి. పార్టీలకు ఇలాంటి సంఘాలు రాజకీయ స్థావరాల ఏర్పాటుకు వినియోగపడతాయి. గెలిచిన పార్టీ అభ్యర్థికి ప్రచార, కార్యాచరణ సాధనాలుగా ఉపయోగపడతాయి. పార్టీల అనుబంధ మహిళా సంఘాలు, ఆయా పార్టీల అధిష్ఠాన వర్గంలో పలుకుబడిని సంపాదించి, పార్టీ విధానాలు మహిళలకు అనుకూలంగా రూపొందేట్లు చేసే అవకాశాలుంటాయి. తమ వాణిని వినిపించే వేదికగా మహిళలు వీటిని వాడుకోవచ్చు. నార్వేలోని మహిళా సంఘాలు

ఇలాంటి వేదికలను ఏర్పాటు చేసుకోబట్టే, మహిళలకు పోటీ చేయటానికి అవసరమైన రిజర్వేషన్ వసతులను సాధించాయి.

ఇలాంటి ప్రత్యేక ప్రజాసంఘాల ఏర్పాటు వల్ల, కొన్ని నష్టాలు కూడా ఉంటాయని, స్త్రీలు నాయకత్వ స్థానాలకు వచ్చే వీలు కూడా ఉండక పోవచ్చునని కొన్ని పరిశీలనలు తెలియజేస్తున్నాయి. ఇలాంటి అనుబంధ సంఘాలలోని చాలామంది సభ్యులకు పార్టీలు, తమ పార్టీ సభ్యత్వాన్నీయవు; కార్యవర్గంలో నామ మాత్రపు స్థానాలలోనే ఉంచుతాయి మెక్సికోలో ఒక సర్వే జరిగింది. నాయకత్వ స్థానాలలో ఉన్న రెండు వేల మంది అభిప్రాయాలను సేకరించారు. వీరిలో 40 మంది మహిళలున్నారు. వీరిలో ఎవరూ, తాము నాయకత్వ స్థానాలకు రావటానికి, తమ ప్రజా సంఘం ఉపకరించినట్లు చెప్పలేదు! కొలంబియాలో జరిగిన మరొక సర్వేలో, తమ మహిళా సంఘాలు, తాము రాజకీయ రంగంలోనికి రావటానికి తోడ్పడినట్లు చెప్పారు. పార్టీలో తమ అభివృద్ధి సంకుచితంగానే ఉన్నదనీ, నాయకత్వం తమను దాని దరికి కూడా రానీయలేదనీ సర్వేలో పాల్గొన్న మహిళలు వెల్లడించారు ఈ రెండు సందర్భాలలోనూ, మహిళా సంఘాలు, పార్టీ విధానాలను తమకు అనుకూలంగా మలుచుకోనేంత బలంగా లేవు.

పార్టీల అనుబంధిత మహిళా సంఘాలు, ఆయా పార్టీల విధానాలకు అనుగుణంగానే పనిచేయవలసి ఉంటుంది. స్వతంత్ర విధానాలను అవలంబించటానికి వీలు లేదు. మహిళల క్షేమం దృష్ట్యా కూడా, పార్టీ విధానాలతో భేదించే అవకాశాలుండవు. పార్టీల నాయకత్వాలు కూడా అనుబంధ సంఘాలు బలపడి, పోటీ పార్టీలుగా రూపొందకుండా జాగ్రత్త పడతాయి. ఇలా జరిగిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఇందుకు గ్రీకు అనుభవమే ఉదాహరణ.

గ్రీస్‌లో యూనియన్ ఆఫ్ గ్రీక్ ఉమెన్ అనే మహిళా సంఘం, ఒక రాజకీయ పార్టీకి అనుబంధిత సంస్థగా ఉండేది. పార్టీకి ప్రజాసమీకరణ శక్తిగాను, మహిళలకు వారి సమస్యల పరిష్కర్తగానూ పనిచేస్తూ ఇది క్రమంగా బలపడ సాగింది. 1988-1989 సంవత్సరాలలో మహిళా ఉద్యమం బలపడి, పరిగణించదగిన రాజకీయ శక్తిగా రూపొందింది అధిక సంఖ్యలో మహిళలను సమీకరించగలిగేంతగా పెంపొందింది. మహిళా సమస్యల విషయంలో రాజకీయపార్టీలు, ప్రభుత్వము అనుసరిస్తున్న విధానాల యెడల అసంతృప్తి చెంది, పద్దెనిమిది మహిళా సంఘాలు కలసి, ఉమెన్స్ కో ఆర్డినేటింగ్ కమిటీగా ఏర్పడి పని చేయసాగాయి. ఈ సంస్థలో ఎనిమిది, వివిధ పార్టీల అనుబంధ సంఘాలున్నాయి. ఈ కమిటి, మహిళలకు 35 శాతం పార్లమెంటరీ స్థానాలను రిజర్వు చేయాలని ఆందోళన చేసింది. కాని, రాజకీయ పార్టీలు దానిని ఆమోదించలేదు. తర్వాత జరిగిన ఎన్నికల ఫలితాలు ఈ సంఘాలకు ప్రతికూలంగా వచ్చాయి! ఇది పార్టీలలోనే కాదు, సమాజలోని పురుషుల స్త్రీ వ్యతిరేక భావాలకు ప్రతిబింబంగా సర్వే నిర్వాహకులు నిర్వచించారు.

## అధికార పీఠానికి తృతీయ సోపానం ఎన్నికల విధానం

వ్యక్తిని అధికార పీఠానికి చేర్చే చివరి సోపానం ఎన్నికల విధానం. అభ్యర్థి రాజకీయ జీవితాభివృద్ధికి ఉపకరించిన అంశాలే, వారి విజయానికి కూడా తోడ్పడతాయి. ఎన్నిక అవకాశాలు స్త్రీ పురుషులకు సమంగా ఉంటాయా ఉండవా అనేది చర్చించదగిన అంశం.

"తమ క్షేమాన్ని రక్షించగలవారు రాజకీయ నాయకులా (పురుషులా) లేక నాయకురాండ్రా (స్త్రీలా)" అన్న ప్రశ్నను ప్రధానాంశంగా చేసుకొని సర్వేను యూరోపియన్ కమ్యూనిటీ దేశాలలో జరిపించారు. ఇది మూడంచెలుగా జరిగింది. 1975 లో ఒకసారి, 1977లో రెండవసారి, 1983వ సంవత్సరంలో మూడవసారి జరిగింది. (సర్వే ఫలితాలు 1984 లో వెలువడ్డాయి) దాని ఫలితాలను అధ్యాయంలోని ఐదవ పట్టికలో చూడవచ్చు.

ఈ సర్వే ఫలితాలను బట్టి చూస్తే, తమ సంక్షేమ రక్షణకు స్త్రీ పురుషులలో ఎవరైనా ఒక్కటేనన్న అభిప్రాయం ప్రజలలో క్రమంగా బలపడుతున్నట్లు తెలుస్తున్నది. 1975 వ సంవత్సరపు సర్వేలో 46 శాతం మంది పురుషులు, 50 శాతం మంది స్త్రీలు తమకెవరైనా ఒకటేనని చెప్పగా, 1983వ సంవత్సరపు సర్వేలో పురుషులలో అరవై శాతం మంది, స్త్రీలలో 61 శాతం మంది ఇదే విషయాన్ని చెప్పటం ప్రజలలో వస్తున్న మార్పుకు సూచనగా కనుపిస్తున్నది

స్త్రీలలో అధికులు స్త్రీ అభ్యర్థులవైపే మొగ్గు చూపుతూండటం కూడా సహజమే. "స్త్రీ అభ్యర్థి మీకు

అంగీకారమేనా" అని ప్రశ్నించినపుడు స్త్రీలలో అధికులు వారినే కోరతారు. "పురుష అభ్యర్థి మీకు అంగీకారమేనా" అని అడిగినపుడు, ఓటర్లలో అత్యధికులు, (స్త్రీ పురుష భేదం లేకుండా) పురుష అభ్యర్థి వైపే మొగ్గు జూపుతారు. స్త్రీల యొక్క వృత్తి పరమైన జీవితానుభవం, వారు రాజకీయ నాయకురాండ్రుగా చెలామణి గావటానికి తగినది గాదన్న భావం ఓటర్లలో ఉండటమే ఇందుకు కారణం గావచ్చుననిపిస్తున్నది. 1985వ సంవత్సరంలో, అమెరికా ఎన్నికలలో పోటీ చేస్తున్న స్త్రీ - పురుష అభ్యర్థుల మీద ఎస్. కరోల్ నిర్వహించిన సర్వే కూడా ఈ అంశాన్ని సూచించింది. "ఉమెన్ కాండిడేట్స్ ఇన్ అమెరికన్ పొలిటిక్స్" అన్న పేరిట ఈ సర్వే ఫలితాలు ప్రచురితమైనాయి. ఆ సర్వే ఫలితాలను విశ్లేషిస్తూ ఆవిడ ఇలా చెప్పింది· "తోటి పురుష అభ్యర్థుల వలె స్త్రీ అభ్యర్థులు కూడా ప్రొఫెషనల్, మేనేజీరియల్ వృత్తుల నుండి వస్తున్నారు. వృత్తి పేరును చెప్పగానే అది ఆడవారి పని అని గుర్తుకు వచ్చేంతగా కొన్ని వృత్తులకు ముద్రలు పడ్డాయి. మహిళా అభ్యర్థులలో అధికులు విద్యాబోధన, సంఘసేవ, నర్సింగ్ వంటి వృత్తుల నుండి వస్తున్నందువల్ల వారు ఎన్నికలో అననుకూల పరిస్థితిని ఎదుర్కొన వలసి వస్తున్నది. పరిపాలన సంబంధమైన పదవుల నిర్వహణకు న్యాయవాదవృత్తి వంటి వాటి నుండి వచ్చినవారే తగిన వారనీ, విద్యాబోధన వంటి వృత్తులలో ఎంతటి ఉన్నతపదవిని నిర్వహిస్తూ, ఎంతటి అనుభవాన్ని అభ్యర్థులు సంపాదించి ఉన్నా, వారి వృత్తి అనుభవం రాజకీయ పదవుల నిర్వహణకు తగినది గాదన్న భావం ఓటర్లలో ఉన్నది". "మహిళా వృత్తులు"గా ముద్రబడిన వృత్తులలో ఉండటమే స్త్రీ అభ్యర్థులు చేసుకొన్న "పాప" మన్నమాట!

అభ్యర్థి విజయానికి, ఆ వ్యక్తి రూప, గుణ, హావభావ ప్రకటనా విధానం వంటివి కూడా కారణమవుతాయని, మరొక అమెరికా పరిశీలకురాలు రూత్ ఎ. మేండెల్ అంటున్నారు. "అమెరికాలో జరిగే ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థుల మీద వీరు పరిశీలనలు జరిపారు. పురుషులే రాజకీయ రంగంలో నిలువగల వారనీ, వారే అభ్యర్థులుగా ఎన్నికకు తగిన వారన్న అభిప్రాయం సమాజంలో ఉండటం మహిళల ఎన్నికకు అవరోధాలను కల్పిస్తుంది. ఇది చాలదన్నట్లు, పురుషుల ఇమేజ్‌నిచూసేదాని కన్న, స్త్రీ ఇమేజ్‌ని, ఆఖరుకు అలంకరణ, వస్త్ర ధారణ, మాట్లాడటం వంటి వాటిని పరిశీలిస్తారు. ఆఖరుకు వారి వయస్సు కూడా పరిగణనకు వస్తున్నది" అని రూత్ చెబుతున్నారు. రాజకీయ రంగంలో మహిళ ఎంతటి విజయాన్ని సాధించగలిగినా, ఓటర్లు ఆవిడ స్త్రీత్వం మీద వ్యాఖ్యలు చేస్తూనే ఉంటారని రూత్ వ్రాశారు.

ఎన్నికల స్వభావాన్ని బట్టి కూడా పోటీచేసే మహిళల విజయావకాశాలుంటాయి. ఎన్నికలకు స్థానిక, ప్రాంతీయ, జాతీయ అన్న స్థాయీ భేదం ఉంటుంది. స్థానిక సమస్యలతోనూ, సమస్యల వల్ల ఇబ్బందులు పడుతున్న ఓటర్లతోనూ మహిళలకు సన్నిహిత సంబంధాలు ఉండే అవకాశాలుంటాయి. మహిళా అభ్యర్థులు కూడా ఆ సమస్యలను స్పష్టంగా అర్థం చేసుకోగలరు కూడా. పైగా, స్థానిక సంస్థలకు ఎన్నికలు జరిగినపుడు, కార్య నిర్వహణకు గ్రామం విడిచి పోవలసిన అవసరం కూడా ఉండదు. (గ్రామంలోని పనేగనుక). ఇందువల్ల ఈ రంగంలో మహిళల విజయావకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఇలా స్థానిక నాయకులుగా రూపొందగలిగిన స్త్రీలకు, ఉన్నత స్థానాలకు ఎన్నికయ్యే అవకాశాలు అధికంగా ఉంటాయి.

ఈ సందర్భంలో "హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు-1995" విశ్లేషణ గమనార్హమనిపిస్తున్నది. "స్థానిక సంస్థలలో స్త్రీ ప్రాతినిధ్యం, దేశ పార్లమెంట్లలో కంటే అధికంగా ఉంటున్నది. సమాచారం లభించిన 78 దేశాలలోని 46 దేశాలలో, ఆ దేశాలలోని పార్లమెంట్లలో ఉన్న స్త్రీ ప్రాతినిధ్యం కంటే అధిక ప్రాతినిధ్యం, ఆ దేశాలలోని స్థానిక సంస్థలలో ఉన్నది. ఈ దేశాలలోని పదమూడింటిలోని మునిసిపాలిటీల నాల్గవ వంతు స్థానాలు స్త్రీలవే. స్థానిక సంస్థలలో లభించగల స్త్రీ ప్రాతినిధ్య పరిమాణం ఆశ్చర్యం గలిగించేంత అధికంగా ఉండే అవకాశాలున్నాయి. 1994 వ సంవత్సరంలో భారత ప్రభుత్వం, దేశంలోని పంచాయితీలలో మూడవ వంతును మహిళలకు కేటాయించింది. దీనివల్ల, దేశంలోని కనీసం ఎనిమిది లక్షల మంది మహిళలు స్థానిక రాజకీయ రంగంలో ప్రవేశించే అవకాశాలేర్పడ్డాయి. వీరినుండి జాతీయ నాయకురాండ్రు రూపొందే అవకాశాలుంటాయి."

కుటుంబ సంబంధాలు మహిళా అభ్యర్థులకు

అధికంగా ఉపయోగపడతాయి ప్రముఖ రాజకీయ నాయకుల భార్యలు, పుత్రులు, పుత్రికలు ఎన్నికవుతూండటమే ఇందుకు చక్కని ఉదాహరణ. పురుష నాయకుడు చనిపోతే, వారి భార్యకు వారి సీటును సామాన్యంగా ఇస్తూంటారు. ఇలాంటి సందర్భంలో ఆ పురుష నాయకుని వారసురాలుగా ఆవిడను ఓటర్లు ఆమోదిస్తున్నారు గాని ఆవిడ వ్యక్తిత్వాన్ని, సామర్థ్యాన్ని చూడటం లేదు. ఇలాంటి ఎంపికలు పురుష వారసత్వ రాజకీయాలనే బలపరుస్తాయి. రాజకీయ రంగంలో స్త్రీల స్థానాన్ని పెంచలేవు

## పాలనా యంత్రాంగ నిర్వహణలో మహిళల స్థానం

పార్లమెంటుకు వెళుతున్న మహిళల సంఖ్యను చూచి, అధికారయోగం వారికి సంప్రాప్తించినట్లు భావించకూడదు. ప్రభుత్వ విధానాల నిర్ణయంలోనూ, వాటిని అమలు పరచటంలోనూ వారికి లభించిన స్థానమేమిటో, అధికారాలేమిటో కూడా చూడాలి. మంత్రి వర్గంలోనూ, సివిల్ పరిపాలనలోనూ వారికున్న అవకాశాలను తెలుసుకోవాలి.

మెజారిటీ సీట్లను సాధించిన పార్టీ, మంత్రివర్గాన్ని ఏర్పాటు చేస్తుంది. కొన్ని ప్రభుత్వాలలో అధ్యక్షులు ప్రధాన పాలనాధికారిగా ఉంటారు. (ఉదాహరణకు అమెరికా) మరికొన్ని దేశాలలో ప్రధాన మంత్రికి ఈ హోదా లభిస్తున్నది (మనదేశ ప్రభుత్వం ఇందుకు ఉదాహరణగా కనుపిస్తుంది). మహిళలలో ఇలాంటి స్థానాలకు వచ్చినవారు, ఆ పదవులను ఎలా పొందారు, ఎంత మంది ఇలాంటి ఉన్నత స్థానాలను అలంకరించగలిగారు అన్న విషయాలను పరిశీలిద్దాం.

దేశాధ్యక్షులుగానో, ప్రధాన మంత్రులుగానో మహిళలు రావటం అనేది ఇరవయ్యవ శతాబ్దంలోనే మనకు కనుపిస్తుంది. వచ్చినవారి సంఖ్యకూడా చాలా తక్కువ, వేళ్ళమీద లెక్కించవచ్చు. (ఈ అధ్యాయంలోని ఆరవ పట్టికను చూడండి). మంత్రివర్గంలో స్థానం లభించిన మహిళలందరకూ, ఒకేరకమైన ప్రాధాన్యత ఉండదు. అధికార పరిధిలో కూడా తేడాలుంటాయి. అందువల్ల ఎంతమంది మహిళలు మంత్రివర్గంలో ఉన్నారు అన్న సంఖ్యా వివరాలను కాదు చూడవలసింది. ఎంతటి ముఖ్యమైన శాఖలను వారునిర్వహిస్తున్నారు అన్న అంశం ముఖ్యమైనది.

మంత్రి వర్గం తర్వాత, ప్రభుత్వ నిర్వహణలో అత్యంత కీలక పాత్రను నిర్వహించేది, సెక్రటరీ స్థాయి సివిల్ ఉద్యోగులు. (కొన్ని ప్రభుత్వాలలో వీరిని డైరెక్టర్లని కూడా వ్యవహరిస్తారు). ఈ సీనియర్ ఉద్యోగులు ప్రభుత్వ నిర్ణయాల రూపకల్పనలోనూ, వాటిని అమలు జరపటంలోనూ కీలక బాధ్యతలను నిర్వహిస్తారు. ఇలాంటి పదవులలో స్త్రీలు ఎంతమంది ఉన్నారో కూడా చూడటం అవసరం. అన్ని రకాల సంస్థల కంటే అధిక సంఖ్యలో స్త్రీలకు ఉద్యోగాల నిచ్చేది ప్రభుత్వం. అందువల్ల, స్త్రీలు అధిక సంఖ్యలో ఈ ఉద్యోగాలలో చేరవచ్చు, ఇలాంటి పదవులలో చేరటం వల్ల వారికి లోకానుభవం వస్తుంది: వ్యవహార జ్ఞానం అబ్బుతుంది. సివిల్ పాలనలో కీలక స్థానాలకు మహిళలు చేరగలిగినపుడు, మహిళా జనోద్ధరణకు అవసరమైన విధానాల రూపకల్పనకూ, వాటిని శ్రద్ధగా అమలు పరచటానికి వీరు ఉత్సాహంగా పూను కొంటారు ఇలాంటి మంచి కార్యక్రమాలను అమలు జరుపదలచిన ప్రభుత్వానికి, మహిళా ఉద్యోగులు ఎంతగానో తోడ్పడతారు. స్త్రీలకు పురుషులతో సమానావకాశాలనిచ్చే కార్యక్రమాలు, శిశుసంరక్షణ, మహిళల మీద అమలు జరుగుతున్న హింసాకాండ, సెక్సుపరమైన వేధింపుల నిరోధం వంటి వాటిని మహిళా అధికారులు పటుతరంగా అమలు జరపటానికి పూనుకొంటారు.

ప్రభుత్వ యంత్రాంగంలో అత్యంత ఉన్నత స్థానాలకు ఎన్నికైన మహిళల సంఖ్య చాలా తక్కువగా ఉన్నది. 1996వ సంవత్సరం వరకూ ప్రపంచ చరిత్రను పరిశీలిస్తే, దేశాధ్యక్షులు గానో, ప్రధాన మంత్రులుగానో ఎన్నికైన వారు కేవలం ఇరవయ్యైదు మంది మహిళలు మాత్రమే కనుపిస్తారు. ఈ శకం, శ్రీలంకకు చెందిన శ్రీమతి సిరిమావో బండారనాయకేతో ప్రారంభమైంది. 20వ శతాబ్దంలోని అరవయ్యవ దశాబ్ద కాలం నుండి మహిళలు ఇంతటి ఉన్నత స్థానాలను అలంకరించటం కనుపిస్తుంది. ఆఫ్రికా, తూర్పుయూరపు దేశాలలో (ఒక్క యుగోస్లావియా మినహా) ఈ పరిణామం ఇంకా కనుపించ వలసే ఉన్నది. ఉన్నత స్థానాలను అలంకరించిన వారిలో అధికులు కుటుంబ వారసత్వం ద్వారా వచ్చిన వారే గావటం గమనించ దగిన అంశం. ఇందిరాగాంధి, కరజోన్ అక్విన్, సిరిమావో బండారు నాయకే, చంద్రిక బండారు నాయకే

## ఆరవ పట్టిక

ఇరవయ్యోవ శతాబ్దంలో దేశాధ్యక్షులు, లేక ప్రధాన మంత్రిగా పదవులు నిర్వహించిన, లేక నిర్వహిస్తున్న మహిళ

| దేశము | వ్యక్తి పేరు | పదవీ కాలం |
|---|---|---|
| దేశాధ్యక్షులుగా | | |
| అర్జెంటీనా | ఇజబెల్ మార్టినెజ్ డీ పీరాన్ | 1974-1976 |
| బొలివియా | లిడియా గ్యూలర్ | 1979-1980 |
| హెయిటీ | ఎర్తా పాస్కెల్-ట్రొలట్ | 1991- |
| ఐస్‌లెండ్ | విగ్డిస్ ఫిన్‌బొగడొటిర్ | 1980- |
| ఐర్లెండ్ | మేరీ రోబిన్‌సన్ | 1990- |
| నికరాగువా | వయొలెటా కెమొరూ | 1990-1996 |
| ఫిలిపీన్స్ | కరజోన్ అక్వినొ | 1986-1992 |
| శ్రీలంక | చంద్రికా బండారనాయకె కుమారతుంగ | 1994- |
| యుగోస్లావియా | మిల్కా ప్లానిక్ | 1982-1986 |
| దేశ ప్రధానులుగా | | |
| బంగ్లాదేశ్ | ఖలీదా/జియా | 1991-1996 |
| బంగ్లాదేశ్ | షేక్ హసీనా | 1996- |
| బురుండి | సిల్వి కినిగి | 1993- |
| కెనడా | కిం కాంప్‌బెల్ | 1993- |
| డొమినికా | ఎగ్నియా / ఛార్లెస్ | 1980- |
| ఫ్రాన్స్ | ఎడిత్/క్రెసన్ | 1991-1992 |
| భారతదేశము | ఇందిరాగాంధి | 1966-1977 |
| | | 1980-1984 |
| ఇజ్రాయెల్ | గోల్డా మెయిర్ | 1969-1974 |
| నార్వే | గ్రో హర్లెం బ్రంట్‌లాండ్ | 1981, 1986-1989 |
| | | 1990-1996 |
| పాకిస్తాన్ | బేనజీర్ భుట్టో (ఇస్లామిక్ | 1988-1990 |
| | దేశాల తొలి మహిళా ప్రధానమంత్రి | 1993-1997 |
| పోలెండ్ | హన్నా షుకోక్స్ | 1992-1993 |
| పోర్చుగల్ | మరియాడీ లోర్డిస్ పింటస్లింగో | 1981-1985 |
| రువాండా | అగ్రీ యు విలింగిమన | 1993-1994 |
| శ్రీలంక | సిరిమావో బండారనాయకె | 1960-1965 |
| | (ప్రపంచంలో తొలి మహిళా | 1970-1977 |
| | ప్రధానమంత్రి) | 1994- |
| టర్కీ | తంసూ చిల్లర్ | 1993-1996 |
| యునైటెడ్ కింగ్డం | మార్గరేట్ థాచర్ | 1979-1990 |

గమనిక : ఈ పట్టిక 1994వ సంవత్సరం నాటికున్న పరిస్థితిని తెలియజేస్తున్నది. బంగ్లాదేశ్, పాకిస్తాన్, టర్కీ పరిస్థితిని 1997 వరకూ సవరించాం

*(ది వరల్డ్స్ ఉమెన్ 1995 నుండి)*

ఏడవ పట్టిక
పార్లమెంటులోనూ మంత్రి మండలిలోనూ ఉన్న మహిళా ప్రాతినిధ్య పరిమాణ శాతాలు (1994)

| ప్రాంతము | పార్లమెంటులో మహిళల సభ్యత్వ శాతము | మంత్రి మండలిలో మహిళా మంత్రుల శాతము |
|---|---|---|
| పారిశ్రామిక దేశాలు | 12 | 8 |
| యూరోపియన్ యూనియన్ దేశాలు | 14 | 16 |
| ఓ యి సి డి దేశాలు | 13 | 15 |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు (అన్నీకలిపి) | 10 | 5 |
| అరబ్బు దేశాలు | 4 | 1 |
| తూర్పు ఆసియా | 19 | 6 |
| దక్షిణ ఆసియా | 5 | 3 |
| ఆగ్నేయ ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 9 | 3 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 8 | 6 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 10 | 8 |
| వెనుకబడిన దేశాలు | 6 | 5 |
| ప్రపంచం | 10 | 6 |

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995*

కుమారతుంగ, వయొలెటా కుమురూ, బెనజీర్ భుట్టో, ఖలీదా జియా, షేక్ హసీనా మొదలయినవారు ఈ తరగతికి చెందినవారే.

కొందరు మహిళలు పార్టీలలో పనిచేసి, అగ్ర నాయకత్వానికి రాగలిగారు. గ్రో హర్లెం బ్రంట్‌లాండ్, ఎగ్నియా ఛార్లెస్, ఎడిత్ క్రెస్సన్, గోల్డా మెయిర్, మార్గరెట్ థాచర్ మొదలైనవారు ఈ వర్గం కిందకు వస్తారు. బొలివియాకు చెందిన లిడియా గ్యూలర్, పోర్చుగల్‌కు చెందిన మరియా డీ లోర్డిస్ పింటస్లింగోలు తమ తమ దేశాలలో జరిగిన రాజకీయ ఉద్యమాలలో పాల్గొని, అగ్ర నాయకత్వానికి రాగలిగారు.

ఇలాంటి మహిళా నాయకులలో అత్యధిక సంఖ్యాకులు ఉన్నత విద్యను అభ్యసించారు. ఐస్‌లెండ్‌కు చెందిన విగ్డిస్ ఫిన్‌బొగడొటిర్ ఉపాధ్యాయవృత్తి నుండి వచ్చారు. డొమినికాకు చెందిన ఎగ్నియా ఛార్లెస్ న్యాయవాది. బ్రిటిష్ ప్రధానిగా ప్రఖ్యాతి గాంచిన మార్గరెట్ థాచర్ విద్యార్హతా పూర్వకంగా కెమిస్ట్. తర్వాత వీరు లా పట్టా పుచ్చుకొన్నారు. కొంతకాలం శాస్త్ర పరిశోధనలో కాలం గడిపారు. తర్వాత రాజకీయ రంగానికొచ్చారు. అక్వినో, బెనజీర్ భుట్టో, వయొలెటా కెమోరులు అమెరికాలో ఉన్నత విద్య నభ్యసించారు.

ఉన్నత స్థానాలను చేరగలిగిన స్త్రీలు ఎటువంటి వాతావరణం నుండి వచ్చి నప్పటికీ, రెండు విషయాలు మాత్రం మనకు స్పష్టంగా కనుపిస్తున్నాయి: (1) వంశపారంపర్యత (2) చాలా కాలం రాజకీయ రంగంలో పనిచేసి ఉండటం అనేవి మాత్రం స్పష్టంగా కనుపిస్తున్నాయి. ఈ రెండు అంశాలు వారి ఉన్నతికి తోడ్పడ్డాయి. అట్లని, వంశపారంపర్యత పురుషులకు వినియోగ పడదనీ, దాన్ని ఉపయోగించుకొని, ఉన్నత పదవులను వారు పొందలేరనీ

### ఎనిమిదవ పట్టిక
### తమ దేశాల మంత్రి వర్గంలో పదిహేను శాతము లేక అంతకు మించి, కాబినెట్ మంత్రి లేదా సహాయ మంత్రి పదవులను మహిళల కిచ్చిన దేశాలు (1994)

| ప్రాంతము / దేశము | మహిళల కిచ్చిన పదవుల శాతం | |
|---|---|---|
| | కాబినెట్ మంత్రి పదవులు | సహాయ మంత్రి పదవులు |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | | |
| ఆస్ట్రేలియా | 13 | 23 |
| ఆస్ట్రియా | 16 | 5 |
| కెనడా | 14 | 20 |
| డెన్మార్క్ | 29 | 11 |
| ఫిన్లండ్ | 39 | 17 |
| జర్మనీ | 16 | 5 |
| ఐర్లండ్ | 16 | 15 |
| ఇటలీ | 12 | 10 |
| లిచ్‌టెన్‌స్టీన్ | 17 | 0 |
| నెదర్లెండ్స్ | 31 | 10 |
| న్యూజిలెండ్ | 8 | 17 |
| నార్వే | 35 | 49 |
| శాన్ మెరినో | 17 | 43 |
| స్లవాకియా | 5 | 16 |
| స్వీడన్ | 30 | 4 |
| స్విట్జర్లండ్ | 17 | 0 |
| అమెరికా | 14 | 26 |

| ప్రాంతము / దేశము | మహిళల కిచ్చిన పదవుల శాతం | |
|---|---|---|
| | కాబినెట్ మంత్రి పదవులు | సహాయ మంత్రి పదవులు |
| ఆఫ్రికా-ఆసియా | | |
| సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 22 | 0 |
| గినియా-బిస్సు | 4 | 19 |
| లెసోతో | 6 | 21 |
| భూటాన్ | 22 | 0 |
| నైజర్ | 5 | 19 |
| సావోటోమ్, ప్రిన్సిపి | 0 | 20 |
| సెషలిస్ | 31 | 21 |
| జింబాబ్వే | 3 | 25 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | | |
| ఏంటిగ్వా బర్బుడా | 0 | 44 |
| బహమాస్ | 23 | 35 |
| డొమినికా | 9 | 38 |
| గ్వాటెమాలా | 19 | 7 |
| గుయానా | 12 | 25 |
| హోండురాస్ | 11 | 22 |
| జమైకా | 5 | 17 |
| ట్రినిడాడ్, టొబాగో | 19 | 13 |

*- ది వరల్డ్స్ ఉమెన్ - 1995 నుండి*

భావించనవసరం లేదు. రాజకీయ రంగంలో వెనుకబడిన మహిళలు, లభించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలగటం విశేషాంశం. వంశపారంపర్యతకు తోడు, రాజకీయ కుటుంబంలో పుట్టి పెరగటం వల్ల ఈ మహిళలు ఆ రంగపు మెలుకువలను గమనించ గలిగారు. దానిని తమ అనుభవానికి జోడించి ఉన్నత పదవులకు యెదగ గలిగారు. రాజకీయ వ్యవహార జ్ఞానం లేకుండా, ఒక్క కుటుంబ గౌరవ ప్రతిష్ఠలతో అందలం యెక్కటం, యెక్కినా మనగలగటం కష్టం.

## మంత్రి మండలిలో మహిళలు

ఉన్నత స్థానాలలో మహిళల సంఖ్య తక్కువగా ఉండటానికి కారణం, దిగువ స్థానాలలో కూడా వారి సంఖ్య పరిగణించ దగిన స్థాయిలో లేకపోవటమే. ఈ విషయానికి సంబంధించిన సరియైన అంచనాలు ఇంకా లభించటం

### తొమ్మిదవ పట్టిక
### మహిళా పార్లమెంటరీ ప్రాతినిధ్యం, 1994లో 20 శాతము - అంతకు మించి ఉన్న దేశాలు

| | |
|---|---|
| దిగువ సభలో | |
| అభివృద్ధి చెందిన దేశాలు | |
| ఆస్ట్రేలియా | 21 |
| ఆస్ట్రియా | 33 |
| ఫిన్లెండ్ | 39 |
| జర్మనీ | 21 |
| ఐస్లెండ్ | 24 |
| లెక్జెంబర్గ్ | 20 |
| నెదర్లెండ్స్ | 31 |
| న్యూజిలెండ్ | 21 |
| నార్వే | 39 |
| స్వీడన్ | 34 |
| ఆఫ్రికా | |
| సెషలిస్ | 27 |
| దక్షిణ ఆఫ్రికా | 25 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | |
| క్యూబా | 23 |
| గుయానా | 20 |
| ఆసియా | |
| చైనా | 21 |
| దక్షిణ కొరియా | 20 |
| ఎగువ సభలో | |
| అభివృద్ధి చెందిన దేశాలు | |
| ఆస్ట్రేలియా | 21 |
| ఆస్ట్రియా | 21 |
| నెదర్లెండ్స్ | 25 |
| ఆఫ్రికా | |
| స్వాజీలాండ్ | 20 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | |
| బార్బడోస్ | 29 |
| బెలిజీ | 22 |
| సెయింట్ లుసియా | 36 |
| ట్రినిడాడ్ అండ్ టొబాగో | 23 |
| ఆసియా | |
| మలేషియా | 20 |

- *వరల్డ్ ఉమెన్ 1995 నుండి సంఖ్యలు శాతాలను సూచిస్తున్నాయి*

లేదు. ఈ విషయానికి తగినంత పరిశోధనా ప్రాధాన్యత లభించటం లేదు. ఇటీవలి కాలంలో కొంతమేరకు ఈ విషయానికి పరిగణన లభిస్తున్నది. ఇప్పటికి లభిస్తున్న సమాచారం ప్రకారం ఉన్నత పదవులలో, ఆరేడు శాతానికి మించి మహిళలకు లభించటం లేదని తెలుతున్నది. (ఈఅధ్యాయంలోని ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ పట్టికలను చూడండి)

గత పదేండ్ల కాలంలోనూ పరిస్థితి కొంచెం ఆశా జనకంగా కనుపిస్తున్నది. 1987వ సంవత్సరంలో ఒక్క మహిళకు కూడా మంత్రివర్గంలో, కాబినెట్ మంత్రులుగా స్థానమీయని దేశాలు 93 ఉండేవి 1994వ సంవత్సరానికి వాటి సంఖ్య 59కి తగ్గింది. 1994వ సంవత్సరపు ఐక్యరాజ్య సమితి అంచనాల ప్రకారం, అన్నిదేశాల మంత్రి వర్గాలలోని మంత్రులను కలిపి చూచినపుడు, 5.7 శాతం స్థానాలు మాత్రమే మహిళలకు లభించినట్లు కనుపిస్తుంది. 1987వ సంవత్సరంలో మహిళలకు లభించిన స్థానాలు 3.3 శాతం మాత్రమే. 1987వ సంవత్సరంలో, తమ దేశాల మంత్రి మండలిలో మహిళలకు పదిహేను శాతము, లేక అంతకంటె అధిక స్థానాల నిచ్చిన దేశాలు, కేవలం ఎనిమిది మాత్రమే ఉండేవి. 1994వ సంవత్సరంలో వీటి సంఖ్య పదహారుకు పెరిగింది నెదర్లెండ్స్, డెన్మార్క్, నార్వే, స్వీడన్, ఫిన్లండ్, సెషలిస్ - ఈ ఆరు దేశాల మంత్రి వర్గాలలోనూ మహిళలకు మూడవ వంతు లేక అంతకు మించిన స్థానాలు లభించాయి! స్వీడన్‌లో 1994వ సంవత్సరపు ఎన్నికల తర్వాత ఏర్పడిన మంత్రివర్గంలో, స్త్రీలకు సగానికి మించిన పోస్టులు (52 శాతం) లభించాయి. (ఈ పేరాలో పేర్కొన్న మహిళా మంత్రిత్వ స్థానాలన్నీ కాబినెట్ మంత్రి స్థాయి పదవులు)

ఉపమంత్రులు, సహాయ మంత్రుల వంటి పోస్టులలో మహిళల సంఖ్యా పరిమాణం ఇంతకంటే మెరుగ్గా ఉంది. (ఎనిమిదవ పట్టికను చూడండి) 1994వ సంవత్సరంలో ఈ పోస్టులను, మహిళలకు, పదిహేను శాతం అంతకంటే అధికంగా ఇచ్చిన దేశాలు 23 వరకూ ఉన్నాయి. (ఈ పరిమాణంలో కాబినెట్ హోదా పోస్టుల నిచ్చిన దేశాలు పదహారు) 1987లో ఈ పదవులను, ఇంతటి పరిమాణంలో మంత్రి మండలిలో మహిళల కిచ్చిన దేశాలు 14 మాత్రమే ఉన్నాయి. 1994వ

**కాబినెట్ మంత్రులుగా గాని, ఉప మంత్రులుగా గాని మహిళలకు మంత్రి వర్గాలలో స్థానమీయని దేశాలు (1994)**

| | |
|---|---|
| యూరపు | ఆగ్నేయ ఆసియా |
| ఆల్బేనియా | బ్రూనీ దారుస్సలాం |
| జెక్ రిపబ్లిక్ | మయన్మార్ |
| మాల్టా | |
| రొమేనియా | |
| ఉక్రెయిన్ | దక్షిణ ఆసియా |
| | ఆఫ్ఘనిస్తాన్ |
| ఆఫ్రికా | నేపాల్ |
| కమరోస్ | పశ్చిమ ఆసియా |
| లిబియా | |
| మొరాకో | బెహరీన్ |
| సోమాలియా | ఇరాక్ |
| సుడాన్ | కువైట్ |
| | లెబనాన్ |
| లాటిన్ అమెరికా, | యునైటెడ్ అరబ్ అమీరేట్స్ |
| కరిబియన్ | యెమెన్ |
| సెంట్ విన్సెంట్/గ్రెనడీన్స్ | ఒషీనియా |
| సురినామ్ | |
| | పాపు న్యూగిని |
| తూర్పు ఆసియా | |
| మంగోలియా | |

*- వరల్డ్స్ఉమెన్ 1995 నుండి*

సంవత్సరంలో, కాబినెట్ మంత్రులుగానే కాదు, సహాయ లేక ఉపమంత్రి పదవులను కూడా తమ మంత్రి వర్గాలలో మహిళలకు ఇవ్వని దేశాలు 25 వరకూ ఉన్నాయి. వీటిలో సగానికి మించి ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలో ఉన్నాయి.

కాబినెట్ మంత్రి స్థాయిలో గాని, ఉపమంత్రి లేక సహాయమంత్రి స్థాయిలో గాని, మహిళలకు లభిస్తున్నది నామ మాత్రపు స్థానాలే. స్త్రీలకు ఎక్కువ కాబినెట్ మంత్రి పదవులు లభించిన సందర్భంలో, ఉపమంత్రి లేక సహాయ మంత్రి పదవులు వీరికి తక్కువగా వస్తున్నాయి. అలాగే సహాయ మంత్రి స్థానాలు అధికంగా లభించాయని అనుకొన్న సందర్భంలో కాబినెట్ మంత్రి పదవులు తక్కువగా లభిస్తున్నాయి. ఒక్క ఫిన్లండ్, నార్వే, సెషలిస్ దేశాలలో మాత్రమే సమతూకం గల ప్రాతినిధ్యం మహిళలకు లభించింది.

మంత్రివర్గ నిర్మాణంలో సాంఘిక సంక్షేమ శాఖలోనే సామాన్యంగా మహిళలకు పదవి లభిస్తుంది. మహిళలకు తగినది సాంఘిక సంక్షేమ శాఖ ఒక్కటే అనిపించేంత సంప్రదాయంగా ఈ పదవీ ప్రదానం మారింది తర్వాత వీరికి లభించేవి లా, న్యాయ శాఖలలో స్థానాలు. యూరపు దేశాలు గాక, ఇతర అభివృద్ధి చెందిన దేశాలలో 25 శాతము సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి పదవులు మహిళలకు లభించాయి. ఒక్క ఉత్తర ఆఫ్రికాలో మాత్రమే అతి తక్కువ పోస్టులు (1.6 శాతం) మహిళలకు ఈ శాఖలో వచ్చాయి. ఈ ప్రాంతంలో 17 శాతం మంత్రి పదవులు న్యాయ, లా శాఖలలో మహిళలకు లభించటం విశేషం! దక్షిణాసియాలో పలు శాఖలలో ఐదు శాతం మంత్రి పదవులు స్త్రీలకు లభించాయి; ఒక్క రాజకీయ శాఖలో మాత్రం నామ మాత్రపు ప్రాతినిధ్యం (ఒక్క శాతం) లభించింది. ఒషీనియా ప్రాంతంలో 5 శాతం మంత్రి పదవులు సాంఘిక సంక్షేమ శాఖలో మహిళలకు లభించగా, ప్రధాని కార్యాలయంలో తొమ్మిది శాతం పదవులు, రాజకీయ శాఖలో 18 శాతం మంత్రి పదవులు స్త్రీలకు లభించటం విశేషం. మధ్య అమెరికా, కరిబియన్ ప్రాంతాలలో సాంఘిక సంక్షేమ శాఖలో మాత్రమే గాక, లా, న్యాయ శాఖలలో కూడా దాదాపు సమాన ప్రాతినిధ్యం మహిళలకు లభించింది. ఈ ప్రాతినిధ్యం మధ్య అమెరికాలో 15 శాతం మేరకు, కరిబియన్‌లో 22 శాతం వరకూ ఉన్నది. యూరప్‌లోని దేశాలు గాక, ఇతర అభివృద్ధి చెందిన దేశాలలో పదిశాతం పదవులు దాదాపు అన్ని శాఖలలోనూ మహిళలకు లభించాయి. ఆసియాలో, ఒక్క దక్షిణ ఆసియాలో తప్ప, మిగిలిన ప్రాంతాలలో ఉన్నత స్థానాలలోని మహిళా ప్రాతినిధ్యం రెండు శాతం మేరకే ఉన్నది. సబ్-సహారన్ ఆఫ్రికా దేశాలలో మహిళా ప్రాతినిధ్యం ఆసియాలో కంటే మెరుగుగా ఉన్నట్లు కనుపిస్తున్నది. వివిధ మంత్రిత్వ శాఖలలోనూ వారికి 3 నుండి 7 శాతం స్థానాల

వరకూ లభించాయి కరిబియన్ ప్రాంత దేశాలలో సాంఘిక సంక్షేమ శాఖలోనే గాక, లా, న్యాయ, రాజకీయ శాఖలలో మహిళా ప్రాతినిధ్యం ఇరవై శాతాన్ని మించి ఉండటం విశేషం. ప్రధాని కార్యాలయంలోనూ, ఆర్థిక శాఖలోనూ ఇంతకంటే తక్కువ ప్రాతినిధ్యం ఉండటం కూడా విశేషమే

ఇక ఈ సంఖ్యా వివరాలు తెలియజేస్తున్న అంశాలేమిటో చూద్దాం దేశంలోని పరిపాలనా విధానాన్ని బట్టి, ప్రభుత్వాధి నేతగా అధ్యక్షులు (అమెరికాలో వలె) గాని, ప్రధాన మంత్రి గాని (మనదేశంలో వలె) ఉంటారు ప్రభుత్వంలో ఉండే పరిపాలనా శాఖలను ప్రధానంగా ఆరు వర్గాలుగా విభజించవచ్చు దేశాధినేత కార్యాలయం, ప్రభుత్వాధి నేత కార్యాలయం, రాజకీయ శాఖ, ఆర్థిక శాఖ, లా, న్యాయశాఖలు, సాంఘిక శాఖ. రాజకీయ విభాగం కిందకు వచ్చే శాఖలు అత్యంత ప్రధానమైనవి, లేక కీలకమైనవిగా పరిగణనకు వస్తాయి రాజకీయ పరిభాషలో ఇవి "ఫ్లాగ్ మినిస్ట్రీస్": పాలనా యంత్రాంగంలో అగ్రగాములన్న మాట. ఫైనాన్స్, పరిశ్రమలు, వ్యవసాయం, వ్యాపారం, సెంట్రల్ బ్యాంకు లేక రిజర్వు బ్యాంకు, లేక ఫెడరల్ బ్యాంకు - ఇవన్నీ ఆర్థిక విభాగం కిందకు వస్తాయి. లా, న్యాయశాఖలు ప్రజా ఫిర్యాదులను విచారిస్తాయి. సాంఘిక సంక్షేమ శాఖ కిందకు విద్య, ఆరోగ్యం, సంస్కృతి, సాంఘిక సంక్షేమం, కమ్యూనిటీ డెవలప్‌మెంట్, యువజన, మహిళా వికాసం వంటి అంశాలు వస్తాయి.

పార్లమెంటులో మహిళా ప్రాతినిధ్యం తక్కువగా ఉన్నట్లే, కాబినెట్‌లో కూడా వీరి ప్రాతినిధ్యం నామ మాత్రంగానే ఉన్నట్లు చూచాం. ప్రపంచంలో వీరికి లభిస్తున్న కాబినెట్ మంత్రి పోస్టులు ఆరేడు శాతానికి మించటం లేదని కూడా చూచాం. అంటే, ప్రభుత్వాలు చేసే పాలసీ నిర్ణయాలలో నూరింట 93-94 శాతంలో మహిళల ప్రమేయం లేకుండా పురుషులే వ్యవహరిస్తున్నారన్న మాట!

కాబినెట్‌లో మహిళా ప్రాతినిధ్య పరిమాణం, ప్రభుత్వ నిర్మాణ స్వభావం మీద ఉంటుందని రాజకీయ నిపుణులు చెబుతున్నారు. అధ్యక్షులు మంత్రులను నియమించుతున్నప్పటి కంటే పార్లమెంటు సభ్యుల నుండి ప్రధాని మంత్రివర్గ సభ్యులను ఎన్నుకొనే సందర్భంలో మహిళలకు అధిక ప్రాతినిధ్యం లభించే అవకాశాలుంటాయని వీరు సూచిస్తున్నారు సైనిక పరిపాలనలో గాని, నియంతృత్వ పాలనలో గాని, స్త్రీలకు మంత్రివర్గంలో స్థానం లభించదని అనుభవం నిరూపించింది. దీనికి కొన్ని మినహాయింపు లున్నాయి. ప్రజా విప్లవం ద్వారా దేశాధికారాన్ని సైన్యం చేబట్టిన సందర్భంలో, మహిళలకు కాబినెట్‌లో స్థానం లభిస్తుంది వారు కూడా పోరాటంలో భాగస్వాములు గనుక, వారికి కూడా పదవులు లభిస్తాయి. నికరాగువాలో శాండినిస్టా విప్లవం విజయవంతమైన తర్వాత, అధికారానికి వచ్చిన ప్రభుత్వంలో మహిళలకు కాబినెట్ మంత్రివర్గ స్థానాలు లభించాయి. జింబాబ్వే అనుభవం కూడా దీనినే నిరూపిస్తున్నది

మహిళలకు మంత్రివర్గంలో స్థానం అంటూ లభిస్తే, వారికి వచ్చేది సాంఘిక సంక్షేమ శాఖే! నేటి రాజకీయ సంప్రదాయంలో ఇది భాగమై పోయింది ఇంతకు ముందు ఉదహరించిన సంఖ్యా వివరాలు ఈ విషయాన్ని చిత్రిస్తున్నాయి. ఇందుకు కొన్ని కారణాలున్నాయి. రాజకీయాల లోనికి వచ్చిన మహిళలు సామాన్యంగా సంఘసేవలో పాల్గొని ఉంటారు, లేదా ఉపాధ్యాయ వృత్తి నుండయినా వచ్చి ఉంటారు ఇతర రంగాల నుండి వచ్చే వారి కంటే వీరి సంఖ్యే అధికంగా ఉంటుంది. ఈ దృష్ట్యా చూచినపుడు, మహిళలకు సాంఘిక సంక్షేమ మంత్రిత్వ శాఖను అప్పగించటం సబబేనని పురుష నాయకుల కనిపిస్తుంది. ఈ శాఖలను పురుషుల కంటే స్త్రీలే చక్కగా నిర్వహిస్తారన్న అభిప్రాయం కూడా పురుషులలో ఉంది. దీనిలో లింగ వివక్షతా భావం ఇమిడి ఉన్నట్లు ఇంతకు ముందే చూచాం. కనుకే ఈ మంత్రిత్వ శాఖకు "ఆడ" ముద్ర పడిపోయింది!

అంతేకాదు; మంత్రిత్వ శాఖలలో ఉండే అధికార బలాన్ని బట్టి కూడా, వాటి పంపకాలు ఆధారపడి ఉంటాయి. ఈ విషయాన్ని మరువకూడదు. ఆర్థిక, రాజకీయ, దేశరక్షణ వంటి శాఖలు ఏనుగుల వంటి వనుకొంటే, సాంఘిక సంక్షేమశాఖ దోమ వంటిది (హస్తిమశకాంతర న్యాయం). ఈ శాఖకు అధికారాలు తక్కువగా ఉంటాయి. నిధులు అధికంగా ఉండే సందర్భంలో ఈ శాఖను మహిళలకు అప్పగించరు! తూర్పు యూరపు దేశాలలో, సాంఘిక సంక్షేమానికి నిధులు పెద్ద యెత్తున కేటాయిస్తారు. కనుక ఈ శాఖలను పురుషుల

పెత్తనం కిందే ఉంచటం కనుపిస్తుంది. యునైటెడ్ నేషన్స్ అధ్యయనంలో ఇచ్చిన సంఖ్యా వివరాల ప్రకారం లా, న్యాయశాఖలలో, ఈ ప్రాంతంలో మహిళలకు 14.3 శాతం మంత్రి పదవులు లభించగా, సాంఘిక సంక్షేమ శాఖలలో కేవలం 4.8 శాతం స్థానాలు మాత్రమే లభించాయి. తూర్పు యూరపు లోనే కాదు, నిధులు అధికంగా ఈ శాఖ క్రింద ఉన్న సందర్భాలన్నింటిలోనూ, ఈ శాఖాధిపతులుగా మహిళల నియామకాలు తక్కువగా ఉంటున్నట్లు యునైటెడ్ నేషన్స్ అధ్యయనం పేర్కొన్నది. "ఇదే సూత్రం ఫ్లాగ్ మినిస్ట్రీస్‌కు కూడా వర్తిస్తుంది" అని కూడా ఈ అధ్యయనం సూచించింది.

### సివిల్ సర్వీసులో స్త్రీలు

సివిల్ సెక్రటరీ, జాయంట్ సెక్రటరీ, అసిస్టెంట్ సెక్రటరీ వంటి పోస్టులు, పాలనా నిర్వహణలో కీలకమైనవి. విధాన నిర్ణయాలను, రాజకీయ పార్టీలకు చెందిన పెద్దలు (మంత్రులు) చేసినా, వాటిని అమలు జరుపవలసిన బాధ్యత పాలనా యంత్రాంగానిది: దానికి చోదక శక్తి, ఉన్నత వర్గాల పోస్టుల నలంకరించిన సివిల్ సర్వీసు ఉద్యోగులు. మంత్రి వర్గాలు ఎన్ని మారినా, రిటైర్ అయ్యే వయస్సు పూర్తయ్యే వరకూ ఈ అధికారవర్గం పదవిలో ఉంటుంది. కనుకే వారు, మంత్రులుగా వచ్చి పోయే రాజకీయ నాయకులను "రోజు వారీ కూలీలుగా" ('కాజువల్ లేబర్'గా) చమత్కరిస్తూ ఉంటారు. ఇలాంటి విధాన నిర్ణయాలను చేసి, అమలు పరచటంలో బాధ్యతలను వహిస్తున్న సివిల్ సర్వీసు స్థానాలకు మహిళలు రావటం అవసరం అపుడే విధాన నిర్ణయాలు, మహిళలకు అనుకూలంగా ఉండే అవకాశం లభిస్తుంది. వాటి అమలుకు కూడా మహిళోద్యోగులు ప్రాధాన్యత నిస్తారు. ఈ అధికార వర్గంలో మహిళల సంఖ్యాపరిమాణం పెరుగుదలకు, అధికార వర్గపు వైఖరిని కూడా ప్రభావితం చేయగల శక్తి ఉంటుంది. అంతేకాదు; ఇటువంటి పాలనానుభవం గలవారు, అదును దొరికినపుడు మంత్రి పదవులను కూడా అలంకరించవచ్చు. ఉద్యోగానుభవం వీరికి మంత్రి పదవీ నిర్వహణలో చక్కగా ఉపకరిస్తుంది.

దురదృష్టవశాత్తూ ఈ రంగంలో కూడా మహిళలకు సముచిత స్థానం లభించటంలేదు. ఇలాంటి పరిస్థితి ఏ ఒక్క దేశంలోనో కాదు, ప్రపంచం అంతటా ఇలాగే ఉన్నది. ఇతర రంగాలలో స్త్రీల పురోగమనానికి అడ్డు వస్తున్న అంశాలే,

పదవ పట్టిక

వివిధ మంత్రిత్వ శాఖలలో పనిచేస్తున్న నిర్ణయాధికారంగల అధికారులలో స్త్రీ ఉద్యోగుల శాత పరిమాణం (1987)

| ప్రాంతము | రాజ్యాధినేత కార్యాలయం | ప్రధాని కార్యాలయం | రాజకీయ శాఖ | ఆర్థిక శాఖ | లా, న్యాయ శాఖలు | సాంఘిక శాఖ | అన్నిశాఖలు |
|---|---|---|---|---|---|---|---|
| ఆఫ్రికా | 1.1 | 2.6 | 1.6 | 1.6 | 3.4 | 8.6 | 3.6 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 1.5 | 0.5 | 0.9 | 2.0 | 0.7 | 3.3 | 2.0 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతం | 1.0 | 11.0 | 6.3 | 2.8 | 9.6 | 10.9 | 6.0 |
| తూర్పుయూరపు | 7.1 | 4.2 | 2.1 | 3.2 | 3.1 | 9.0 | 3.7 |
| పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పశ్చిమదేశాలు | 7.7 | 12.8 | 5.1 | 3.6 | 4.0 | 13.8 | 6.8 |
| అన్ని ప్రాంతాలు కలిపి | 2.3 | 5.7 | 3.0 | 2.3 | 4.0 | 8.6 | 4.2 |

- ఎ యునైటెడ్ నేషన్స్ స్టడీ - *1987 నుండి*

పదకొండవ పట్టిక
వివిధ మంత్రిత్వ శాఖలలో పనిచేస్తున్న విషయ నిర్ణయాధికారంగల స్థాయి ఉద్యోగులలో మహిళా ఉద్యోగుల శాతం (1994)

| ప్రాంతము పేరు | ప్రధాని కార్యాలయం | ఆర్థిక శాఖ | రాజకీయ శాఖ | లా, న్యాయ శాఖలు | సాంఘిక శాఖ |
|---|---|---|---|---|---|
| అభివృద్ధి చెందిన ప్రాంతం | | | | | |
| తూర్పు యూరపు | 3.9 | 5.1 | 0 6 | 0.9 | 10.3 |
| పశ్చిమ యూరపు | 7 8 | 8 0 | 7.7 | 9.7 | 18.7 |
| ఇతర అభివృద్ధి చెందిన దేశాలు | 10 9 | 15.4 | 9.7 | 15.1 | 25.1 |
| ఆఫ్రికా | | | | | |
| ఉత్తర ఆఫ్రికా | 5.8 | 0.0 | 0.0 | 16.7 | 1 6 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 2.8 | 4 5 | 4.4 | 6.9 | 12.5 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | | | | | |
| మధ్య అమెరికా | 7.7 | 9.7 | 6.4 | 14.6 | 14.6 |
| దక్షిణ అమెరికా | 4.9 | 5 1 | 3.1 | 5.8 | 11.5 |
| కరిబియన్ | 7.3 | 6.7 | 20.5 | 22.2 | 22.1 |
| ఆశియా-పసిఫిక్ | | | | | |
| తూర్పు ఆసియా | 0.6 | 1.5 | 0.0 | 0.0 | 3.9 |
| ఆగ్నేయాసియా | 1.9 | 2.2 | 0.5 | 0.0 | 4.9 |
| మధ్య ఆసియా | 0.0 | 3.9 | 0.0 | 0.0 | 9.0 |
| దక్షిణ ఆసియా | 5.7 | 4.9 | 1.0 | 6.2 | 4.8 |
| పశ్చిమ ఆసియా | 0.7 | 1.8 | 0.0 | 1.5 | 3.9 |
| ఒషీనియా | 8.8 | 2.2 | 18.3 | 0.0 | 5.0 |

*- ది వరల్డ్స్ ఉమెన్ 1995 నుండి*

ఇచ్చుట కూడా అవరోధాలుగా కనుపిస్తున్నాయి. ("స్త్రీలకు నిర్ణయాత్మక పాత్రలేని ఆర్థిక విధాన రూపకల్పన" అన్న అధ్యాయంలో ఈ అంశాన్ని వివరంగా చర్చించాం)

మహిళల అభివృద్ధికి ప్రధాన సాధనం విద్య. మహిళల విద్యార్జనావకాశాలు, ఆయా దేశాల ఆర్థికాభివృద్ధిని బట్టి ఉంటాయి. దీనికి తోడు, కుటుంబ జీవన స్థాయి ప్రభుత్వ విధానాలు కూడా అనుకూలంగా ఉండాలి. విద్యార్హతా స్థాయి ఎంత తక్కువగా ఉంటే, వారి ఉద్యోగావకాశాలు స్త్రీలకు అంత తగ్గుతూంటాయి. సామాజిక జీవనంలో స్త్రీలకు లభించే అవకాశాలు, ఆ సమాజపు రాజకీయ, సాంఘిక వాతావరణాన్ని బట్టి ఉంటుంది. "స్త్రీలకు "స్వర్గసీమ" ఇల్లే; పిల్లలను కనటం, పెంచటం, భర్తకు సేవలు చేయటమే" స్త్రీల ధర్మమని బోధించే సమాజం, వారి పురోగతిని అడ్డగిస్తుంది; తద్భిన్నంగా వ్యవహరించే సమాజం స్త్రీల పురోగతికి తోడ్పడుతుంది. తగిన విద్యార్హత ఉండి, భర్త ప్రోత్సాహము, అండదండలు లభించే అవకాశాలకు నోచుకొన్న యువతులకు, ఉద్యోగ విధుల నిర్వహణను, గృహ నిర్వహణను సమన్వయం చేసుకోగల అవకాశాలుండాలి. ఇవి లేక పోవటం చేతనే చాలామంది మహిళలు ఉద్యోగాలకు వెళ్లలేక పోతున్నారు. సామాజిక వరమైన ఈ ఇబ్బందులు చాలవన్నట్లు, ప్రభుత్వ

యంత్రాంగంలో కూడా కొన్ని అవరోధాలు వీరికి ఎదురవుతున్నాయి. స్త్రీలకు తగిన ఉద్యోగాలుగా కొన్నిటిని అనధికారికంగా నిర్ణయించటం, (ఉదాహరణకు గుమస్తా ఉద్యోగాలు) ఉద్యోగం ఇవ్వటంలో లింగ వివక్షా పాటింపు వంటివి మహిళలను సివిల్ సర్వీస్‌లో ఉన్నత పదవులకు పోనీయకుండా అడ్డుకొంటున్నాయి. ఎలాగో ఉద్యోగంలో ప్రవేశించిన స్త్రీలకు, తగిన తర్ఫీదును పొందే అవకాశాలు లేక పోవటం వల్ల, ప్రమోషన్ పొంది ఉన్నత పదవులకు వెళ్ళే అవకాశాలుండటం లేదు. ఐక్యరాజ్య సమితి సుమారుగా పదహారు దేశాల పరిస్థితి మీద సర్వేలు జరిపించింది. తరతమ భేదాలతో పైన ఉదహరించిన కారణాలే మహిళలకు సివిల్ సర్వీసులో ఉన్నత పదవుల అలంకరణకు అడ్డుగా ఉంటున్నట్లివి నిరూపించాయి. (1987, 1994 సంవత్సరాల సంఖ్యా వివరాలను ఈ అధ్యాయంలోని పదవ, పదకొండవ పట్టికలలో ఇచ్చాం).

పార్లమెంటులోనూ, మంత్రి వర్గాలు, సివిల్ సర్వీసుల లోని ఉన్నత పదవుల లోనూ ఉన్న మహిళా ప్రాతినిధ్య పరిమాణాలను, అవి ఉండవలసిన దాని కంటే తక్కువగా ఉండటానికి గల కారణాలను చూచాం. ఈ సమస్య మీద ఐక్యరాజ్య సమితి అధ్యయనం కొన్ని సిద్ధాంత పరమైన నిర్ణయాలను చేయటానికి ప్రయత్నించింది. ఈ ప్రయత్నంలో, ఐక్యరాజ్య సమితి సేకరించిన 155 దేశాల, జనాభా, ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిస్థితులను నిపుణులు పరిశీలించారు. ఈ అధ్యయన ప్రాతిపదిక మీద వారు కొన్ని సిద్ధాంత పరమైన నిర్ణయాలను రూపొదించారు. వాటి నిచ్చట సంక్షిప్తంగా వివరిస్తాను.

## పార్లమెంటులోనూ, నిర్ణయాధికారంగల అధికార స్థానాలలోనూ స్త్రీలు

పార్లమెంటులో ఉంటున్న మహిళా ప్రాతినిధ్య స్థాయినీ, నిర్ణయాధికారం గల ఉద్యోగ స్థానాలలోని మహిళా సంఖ్యా బలాన్నీ, - మంత్రి వర్గ స్థాయి నుండి కార్యదర్శి స్థాయి వరకూ - ఇంతకు పూర్వం పరిశీలించాం. ఆయా స్థానాలకు వారు వస్తున్న మార్గాలేమిటో తెలియజేశాం. పార్లమెంటులోని మహిళా ప్రాతినిధ్య పరిమాణానికి, నిర్ణయాధికారాలు గల స్థానాలలోని స్త్రీల ప్రాతినిధ్య పరిమాణాలకు ఏమయినా సంబంధం ఉన్నదా అన్న అంశాన్నిపుడు పరిశీలించుదాం.

పార్లమెంటులోని మహిళా ప్రాతినిధ్యపు పెంపువల్ల, వారి అధికార స్థానాల సాధనను సుగమం చేయటానికి వీలవుతుందా? ఇది సాధ్యమైతే, ఓటింగ్ ద్వారా పార్లమెంటులోని మహిళా ప్రాతినిధ్యపు పెంపుకు పూనుకోవచ్చు. ఈ విషయాన్ని పరిశీలించిన ఐక్యరాజ్య సమితి అధ్యయనం, పార్లమెంటులో మహిళా ప్రాతినిధ్య పరిమాణపు పెంపుద్వారా, విధాన నిర్ణయాధికారం గల స్థానాలలోని మహిళా ప్రాతినిధ్యాన్ని పెంచవచ్చునని భావించింది చాలా దేశాలలో, పార్లమెంటు సభ్యుల నుండి మంత్రివర్గ సభ్యుల ఎన్నిక జరుగుతుంది గనుక, ఇది సాధ్యమేనని అధ్యయన కర్తలు భావించారు. మహిళా పార్లమెంటు సభ్యుల సంఖ్య అధికంగా ఉన్నపుడు, మంత్రివర్గంలో కూడా వారికి అధిక ప్రాతినిధ్యం లభిస్తుందన్నది పరిశీలకుల భావన.

విషయ నిర్ణయాధికారం గల స్థానాలకు మహిళలు రావటానికి పార్లమెంటు ఒక సాధనం అని దీనిని బట్టి స్పష్టమవు తున్నది. ఒక దేశపు పార్లమెంటులోని మహిళా ప్రాతినిధ్యం, ఆదేశ మహిళల రాజకీయాభివృద్ధికి కొలమానంగా కనుపిస్తున్నది; ఆదేశంలోని విషయ నిర్ణయాధికారాన్ని కూడా, ఇది ప్రభావితం చేయగలుగుతుంది. అట్లని ఈ సూత్రం, అన్నిదేశాలకూ సమంగా వర్తిస్తుందని భావించకూడదని ఐక్యరాజ్యసమితి అధ్యయనం హెచ్చరిస్తున్నది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పశ్చిమదేశాలలో రాజకీయ నిర్ణయాలు చేయటంలోనే గాక, పరిపాలనా సంబంధమైన నిర్ణయాలు చేయటంలో కూడా మహిళా ప్రాతినిధ్యపు పాత్ర అధికంగానే ఉన్నది. ఈ విషయపు పోలికకు, తరువాత చెప్పదగిన ప్రాంతం లాటిన్ అమెరికా, కరిబియన్. అన్ని ప్రాంతాలలో కంటే అతి తక్కువ మహిళా ప్రాతినిధ్యం ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలో ఉన్నది. ప్రపంచం మొత్తాన్ని పరిగణనకు తీసుకొన్నపుడు, పార్లమెంట్లలోని మహిళల ప్రాతినిధ్య పరిమాణం కంటే, విషయ నిర్ణయాధికారం గల స్థానాలలోని మహిళా ప్రాతినిధ్యం తక్కువగా ఉన్నట్లు అధ్యయనం పేర్కొన్నది.

పార్లమెంటులోని అధిక మహిళా ప్రాతినిధ్యం వల్ల, విషయ నిర్ణయాధికారంగల స్థానాలు వారికి ఎక్కువగా లభిస్తాయని ఆశించకూడదని కూడా ఈ అధ్యయనం

సూచిస్తున్నది. పార్లమెంటులో ప్రాతినిధ్యం ఉన్నా, అధికార స్థానాలలో ప్రాతినిధ్యం లభించని తొమ్మిది దేశాల అనుభవాన్నీ అధ్యయనం ఉదహరించింది పార్లమెంటులో మహిళా ప్రాతినిధ్యం లేకపోయినా, విషయ నిర్ణయాధికారం గల స్థాయిలో మహిళలకు అధిక ప్రాతినిధ్యం లభించటానికి ఉరుగ్వే, పాపూ న్యూగినీల స్థితిని అధ్యయన కర్తలు ఉదహరించారు, ఉరుగ్వేలో 7.1 శాతము, పాపూ న్యూగినీలో 49 శాతము ఉన్నతాధికార స్థానాలు మహిళల చేతిలో ఉన్నట్లు పేర్కొన్నారు.

మహిళా ప్రాతినిధ్యము : ఆర్థిక సాంఘిక పరిస్థితులు

రాజకీయ రంగంలో మహిళల సముచిత పాత్రా నిర్వహణనూ, విధాన నిర్ణయాధికారం గల అధికార స్థానాల అలంకరణనూ, ఆయా దేశాల లేక ప్రాంతాల ఆర్థిక, రాజకీయ, సాంఘిక స్థాయిలు ప్రభావితం చేస్తున్నాయని కొందరు పరిశీలకులు సూచిస్తున్నారు. ఇది నిజమని మనం నమ్మినపుడు, దేశాభివృద్ధి స్థాయిని బట్టి, మహిళలు నిర్వహించగల పాత్ర ఆధారపడి ఉంటుందని చెప్పవలసి వస్తుంది ఇందులోని సత్యాసత్యాలు నిర్ధారణకు, ఐక్యరాజ్య సమితి నిర్వహింపజేసిన సర్వే మూడు అభివృద్ధి సూచికలను పరిశీలించింది ఇందులో రెండు, ఆర్థికాభివృద్ధికి సంబంధించినవి; ఒకటి జనాభాకు చెందినది. ఆ మూడు అంశాలు : (1) తలసరి జాతీయోత్పత్తి, (2) సాలుసరి జనాభా పెరుగుదల రేటు, (3) ప్రభుత్వ రంగంలో ప్రభుత్వం ఖర్చు చేస్తున్న సొమ్ము పరిమాణం

తలసరి జాతీయోత్పత్తి దేశ సంపన్నతకు కొలమానం. దేశాభివృద్ధి అంచనాకు దీనిని వాడతారు. నిర్ణీత పరిమాణానికి మించిన జాతీయోత్పత్తి సూచిక గల దేశాలను అభివృద్ధి చెందినవి గాను, దాని దిగువ స్థాయిలోనివి అభివృద్ధి చెందుతున్న దేశాలుగాను పరిగణిస్తున్నారు. ఈ సంపదోత్పత్తి కొలమానంలో మనం గమనించవలసిన అంశమొకటున్నది. ఇది దేశపు ఆర్థిక వ్యవస్థ ఉత్పత్తి చేసిన సంపద పరిమాణాన్ని మాత్రమే సూచిస్తుంది. అంతే కాని, ఆ సమాజంలో సర్వజనులకూ, జీవించటానికి తగినంత ఆర్థిక, సాంఘిక వసతులు చేకూరాయని చెప్పటానికి దీన్ని ప్రాతిపదికగా భావించకూడదు. తలసరి జాతీయోత్పత్తి అధికంగా ఉన్నా, సంపద పంపకంలో హెచ్చు తగ్గులుంటాయి కనుక ధనికులు, మధ్య తరగతి, పేదలు ఆ సమాజంలో ఉంటారు.

ఈ అధ్యయన నిర్వాహకులకు తలసరి జాతీయోత్పత్తి. విషయ నిర్ణయాధికార స్థానాలలో ఉన్న మహిళా ప్రాతినిధ్య పరిమాణపు అంచనాలు 77 దేశాలవి మాత్రమే లభించాయి. ఈ రెండు అంశాలకు సంబంధం ఉన్న నిదర్శనాలు వీరికి కనుపించ లేదు దేశం ఎంత అధిక సంపన్నతను పొందగలిగితే, ఆ దేశపు పార్లమెంటులో స్త్రీ ప్రాతినిధ్య పరిమాణము, విషయ నిర్ణయాధికారం గల పోస్టులలో వీరి ప్రాతినిధ్య పరిమాణము అంత అధికంగా ఉంటుందని చెప్పటానికి తగిన ఆధారాలేవీ వీరికి లభించలేదు దేశాల వారీగా గాక, ప్రాంతీయ ప్రాతిపదిక మీద చూచినా, ఇలా నిర్ణయించటానికి తగిన రుజువులు లభించలేదు. తలసరి జాతీయోత్పత్తి పరిమాణం తక్కువగా నున్న దేశాలలో, ఈ పరిమాణం అధికంగా ఉన్న దేశాలలో కంటే, స్త్రీల పార్లమెంటరీ ప్రాతినిధ్యం ఎక్కువగా ఉన్నట్లు వీరి పరిశీలనలో తేలింది! కొన్ని ప్రాంతాలలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నట్లు కనుపించింది ఒకే ప్రాంతంలోని దేశాలలో కూడా ఈ విషయంలో భేదాలున్నాయి. దీనిని బట్టి, పైన పేర్కొన్నట్లు, మహిళలకు సముచిత ప్రాతినిధ్యం లభించటానికి దేశం సంపన్నమై యుండటానికి సంబంధం లేదని స్పష్టమవు తున్నది.

జనాభా పెరుగుదల రేటు తక్కువగా ఉండటానికి, పార్లమెంటు సీట్లు, ఉన్నతాధికార పదవులు స్త్రీలకు అధికంగా లభించటానికీ సంబంధం ఉన్నట్లు అధ్యయన నిర్వాహకులు గమనించారు. అంతేకాదు; ప్రజాసంక్షేమానికి ప్రభుత్వ నిధులను అధిక పరిమాణంలో ఏ దేశాలు ఖర్చు చేస్తాయో, ఆదేశాలలో, అధిక ఉపాధి అవకాశాలుంటాయి గనుక, మహిళలకు ఎక్కువగా ఉన్నత పదవులు లభించ గల అవకాశాలు కనుపించినట్లు కూడా ఈ అధ్యయనం వెల్లడించింది.

ప్రజాసంక్షేమ కార్యక్రమాలకు ప్రభుత్వం అధిక నిధులను ఖర్చు చేస్తున్నపుడు, విద్యకు ఎక్కువ సొమ్ము వినియోగ పడటం సహజం. ఉద్యోగాలలో రాణించ దలచిన వారికి, విద్య ముఖ్య సోపానంగా ఉపకరిస్తుంది. మహిళలలో అధికులు విద్యావంతు లయినపుడు, ఓటర్లు వారు మహిళల ప్రాతినిధ్యపు పెంపును కోరుతూ ఓట్లు వేస్తారు. విజ్ఞానవంతులైన ఓటర్లు దేశానికి పెన్నిధి వంటి వారు. పలు దేశాల

### పన్నెండవ పట్టిక
### 1970వ సంవత్సరపు స్త్రీ పురుషుల ఉన్నత విద్యార్జనా ప్రాతిపదిక మీద 1987లో ఉన్న మహిళల పార్లమెంటరీ ప్రాతినిధ్య శాత పరిమాణాలు

| | ప్రతి వందమంది పురుషులకు ఉన్నత విద్యను ఆర్జించిన స్త్రీల సంఖ్య | | | | |
|---|---|---|---|---|---|
| | 20 మంది కంటె తక్కువ ఉన్నపుడు | 20కి 30కి మధ్య నున్నపుడు | 30కి 49 కి మధ్య నున్నపుడు | 50కి 70కి మధ్య నున్నపుడు | 80కి మించి ఉన్నపుడు |
| ఆఫ్రికా | 6.6 | 6.7 | 2.7 | 16.0 | 24.0 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 4.6 | 10.4 | 3.0 | 7 5 | 8.3 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతం | - | 7.0 | 7.5 | 12.1 | 4 4 |
| తూర్పుయూరపు | - | - | 28.8 | 28.8 | 25.2 |
| పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పశ్చిమదేశాలు | - | 8 5 | 14.0 | 13.7 | 31.5 |
| అన్ని దేశాలు | 6.3 | 8.4 | 9 7 | 14.5 | 17.0 |

- యునైటెడ్ నేషన్స్ స్టడీ నుండి

### పదమూడవ పట్టిక
### 1970వ సంవత్సరపు స్త్రీ పురుషుల ఉన్నత విద్యార్జనా ప్రాతిపదిక మీద 1987వ సంవత్సరంలో ప్రభుత్వ యంత్రాంగంలో విషయ నిర్ణయాధికారం గల స్థానాలలో మహిళా ప్రాతినిధ్య శాత పరిమాణాలు

| | ప్రతి వందమంది పురుషులకు ఉన్నత విద్యను ఆర్జించిన స్త్రీల సంఖ్య | | | | |
|---|---|---|---|---|---|
| | 20 మంది కంటె తక్కువ ఉన్నపుడు | 20కి 30కి మధ్య నున్నపుడు | 30కి 40 కి మధ్య నున్నపుడు | 50కి 70కి మధ్య నున్నపుడు | 80కి మించి ఉన్నపుడు |
| ఆఫ్రికా | 4.5 | 5.4 | 2.1 | 1.4 | 14.6 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 0.7 | 1.0 | 0.5 | 3.7 | 5.3 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతం | - | 9.7 | 1.9 | 4.7 | 8.9 |
| తూర్పుయూరపు | - | - | 4.5 | 5.9 | 2.1 |
| పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పశ్చిమదేశాలు | - | 1.4 | 7.7 | 4.9 | 19.4 |
| అన్ని దేశాలు | 4.0 | 4.1 | 4.2 | 4.5 | 7.6 |

- యునైటెడ్ నేషన్స్ స్టడీ నుండి

## పధ్నాలుగవపట్టిక
## 1980వ సంవత్సరంలో మహిళలలో వేతనార్జనకు వెళుతున్న వారి పరిమాణ ప్రాతిపదిక మీద, 1987లో స్త్రీలకున్న పార్లమెంటరీ సభ్యత్వ శాత పరిమాణాలు

| | స్త్రీలలో వేతనార్జనకు వెళుతున్న వారి శాతం | | | | |
|---|---|---|---|---|---|
| | 10 మంది కంటె తక్కువ ఉన్నపుడు | 10కి 19కి మధ్య నున్నపుడు | 20కి 39 కి మధ్య నున్నపుడు | 30కి 49కి మధ్య నున్నపుడు | 50కి మించి ఉన్నపుడు |
| ఆఫ్రికా | 5.8 | 5.3 | 7.3 | 4 2 | 16.0 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 4.4 | 8.0 | - | 7.7 | 7.2 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతం | - | 1.6 | 6 3 | 9.2 | 7.7 |
| తూర్పుయూరపు | - | - | 52 5 | 16.5 | 36.1 |
| పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పశ్చిమదేశాలు | - | 3.0 | 6.4 | 11.3 | 21.3 |
| అన్ని దేశాలు | 5 0 | 5 5 | 4.2 | 4.5 | 19.6 |

- యునైటెడ్ నేషన్స్ స్టడీ నుండి

## పదిహేనవ పట్టిక
## 1980వ సంవత్సరంలో మహిళలలో వేతనార్జనకు వెళుతున్న వారి పరిమాణ ప్రాతిపదిక మీద, 1987లోప్రభుత్వ యంత్రాంగంలోని విషయ నిర్ణయాధికారం గల పదవులలో స్త్రీలకు లభించిన వాటి పరిమాణ శాతాలు

| | స్త్రీలలో వేతనార్జనకు వెళుతున్న వారి శాతం | | | | |
|---|---|---|---|---|---|
| | 10 మంది కంటె తక్కువ ఉన్నపుడు | 10కి 19కి మధ్య నున్నపుడు | 20కి 39 కి మధ్య నున్నపుడు | 30కి 49కి మధ్య నున్నపుడు | 50కి మించి ఉన్నపుడు |
| ఆఫ్రికా | 3.7 | 3.8 | 7.2 | 1.6 | 0.0 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 0.5 | 1.3 | 2.1 | 2.4 | 5.7 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంతం | - | 0.0 | 4.6 | 4.4 | 9.8 |
| తూర్పుయూరపు | - | - | 13.9 | 3.2 | 2.0 |
| పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన పశ్చిమదేశాలు | - | 0.0 | 0.0 | 6.3 | 11.5 |
| అన్ని దేశాలు | 2.2 | 5.5 | 4.9 | 4.5 | 7.2 |

- యునైటెడ్ నేషన్స్ స్టడీ నుండి

అధ్యయనాలను పరిశీలిస్తే, ఉన్నత పదవులను పొందిన మహిళలంతా ఉన్నత విద్య నభ్యసించిన వారై యుండటం కనుపిస్తుంది కనుక స్త్రీలు రాజకీయ రంగంలో రాణించటానికి, పురుషులతో సమానమైన రాజకీయ ప్రాతినిధ్యాన్ని సాధించటానికి, ఉన్నత విద్య, వృత్తి విద్యార్జన అవకాశాలు తోడ్పడతాయని ఈ అధ్యయనం సూచించింది.

విద్యార్జనలో వెనుకబాటుతనానికి, లింగ వివక్షకు ప్రతిరూపం స్త్రీల నిరక్షరాస్యత. వర్తమాన కాలంలో నూరు మంది విద్యార్థులకు, 80 మంది వరకూ ఆడపిల్లలు బడికి వెళుతున్నట్లు కనుపించినా, అధికులు వృత్తి విద్యార్జన కుపక్రమిస్తున్నట్లు లెక్కలు చూపినా, గత కాలం లోని వెనుకబాటుతనం, నేటి రాజకీయ రంగంలో స్త్రీల స్థానాన్ని ప్రభావితం చేస్తున్నది. పశ్చిమ, తూర్పు యూరపు దేశాలలోనూ, లాటిన్ అమెరికా, కరిబియన్ ప్రాంత దేశాలలోనూ, మగపిల్లలతో సమంగా ఆడపిల్లలు ఇపుడు విద్య నార్జిస్తున్నారు. అయినా గత కాలంలోని వెనుకబాటుతనం వల్ల, ఆదేశాల మహిళలు, వర్తమాన కాలంలో పురుషులతో రాజకీయ రంగంలో కూడా పోటీకి నిలువలేకుండా ఉన్నారు. విద్యార్జనావకాశాలను లోగడ గాని, నేడు గాని ఉపయోగించుకోలేక పోవటం అనేది, రాజకీయ రంగంలో మహిళల సముచిత పాత్రా నిర్వహణను అధికంగా ప్రభావితం చేస్తున్నట్లు ఈ అధ్యయనం భావించింది.

రాజకీయ పార్టీల నాయకత్వాలకు, అధికార పదవులకూ వచ్చే వారంతా ఉన్నత విద్యను అభ్యసించిన వారుగా మనకు కనుపిస్తున్నారు. ఉన్నత విద్యాభ్యాసానికి, పదవులకు ఎన్నిక కావటానికి ఉన్న సంబంధాన్ని నిరూపించే సంఖ్యా వివరాలను ఈ అధ్యయనంలో ఇచ్చారు; వాటిని ఇచ్చట చూడవచ్చు. 1970వ సంవత్సరంలో వివిధ ప్రాంతాలలో ఉన్నత విద్యను అభ్యసించిన స్త్రీ పురుషుల నిష్పత్తిని, పార్లమెంటులోని మహిళా ప్రాతినిధ్య శాతాలను పన్నెండవ పట్టికలో ఇచ్చాం. మహిళలలో ఉన్నత విద్యను అభ్యసించిన వారి పరిమాణం పెరిగిన కొలదీ ఉన్నత పదవుల అలంకరణలోనూ వారి ప్రాతినిధ్యం పెరుగుతూ ఉండటాన్ని పదమూడవ పట్టిక చిత్రిస్తున్నది.

లేబర్ మార్కెట్‌కు వెళ్ళే (వేతనార్జనకు వెళ్ళే) మహిళల సంఖ్యా పరిమాణం కూడా, రాజకీయాలలో మహిళలు నిర్వహించ గల పాత్రను ప్రభావితం చేయగలదని ఐక్యరాజ్యసమితి అధ్యయనం నిరూపించింది. స్త్రీలు అధిక సంఖ్యలో శాస్త్రీయ, సాంకేతిక, విద్యా బోధన, పరిపాలనా రంగాల వ్యవహారాలకు అవసరమైన విద్యను ఆర్జించి, వృత్తి నైపుణ్యాన్ని పొందటం ఇందుకు అవసరమని కూడా అధ్యయనం సూచించింది. పరిపాలనా యంత్రాంగం లోనికి వచ్చినా, లేక మంత్రులుగా వచ్చినా, వారంతా ఇలాంటి రంగాల నుండి రావటం ప్రధానంగా కనుపిస్తున్నది. కనుక ఆయా రంగాలకు సంబంధించిన ఉన్నత విద్యను మహిళలు ఆర్జించటం అవసరం

లేబర్ మార్కెట్‌కు వెళ్ళే మహిళల సంఖ్యా పరిమాణం ఎంత అధికంగా ఉంటే, పార్లమెంటు సభలలోనూ, అధికార నిర్ణయాలను చేయగల పరిపాలనా స్థానాల అలంకరణలోనూ మహిళలకు అంత అధిక ప్రాతినిధ్యం లభించగలదని అధ్యయనం నిరూపిస్తూ, ఈ అంశాన్ని బలపరచే కొన్ని సంఖ్యా వివరాలను ఇచ్చింది. వాటిని పధ్నాలుగవ, పదిహేనవ పట్టికలలో చూడవచ్చు.

స్త్రీలు లేబర్ మార్కెట్‌కు అధిక సంఖ్యలో వెళ్ళటం అనేది మాత్రమే గాదు; వారు చేస్తున్న ఉద్యోగ స్వభావం, దాని స్థాయి ఏమిటి అనేది ఇంత కంటే ముఖ్యమైన అంశం. వారు ప్రొఫెషనల్ లేక టెక్నికల్ పోస్టులలో పనిచేస్తున్నారా లేక, పరిపాలన, మేనేజిమెంటు పోస్టులలో పనిచేస్తున్నారా అన్నది ముఖ్యమైన అంశం. ఈ వృత్తులలో మహిళలు ఎంత అధికంగా ఉంటే, విషయ నిర్ణయాధికారం గల ప్రభుత్వపాలనా యంత్రంలోని పోస్టులలో వారికి అంత అధిక ప్రాతినిధ్యం లభిస్తుందని అధ్యయనం సూచించింది.

### మహిళా ప్రాతినిధ్యంపై దేశంలోని రాజకీయ నిర్మాణ స్వభావ ప్రభావం

దేశంలోని రాజకీయ నిర్మాణ స్వభావం మహిళా ప్రాతినిధ్యాన్ని ప్రభావితం చేస్తుంది. ఇందులో మనం పరిగణించ వలసిన అంశాలు రెండున్నాయి. (1) ఎంతకాలం నుండి దేశంలోని మహిళలు ఓటింగు హక్కును అనుభవిస్తున్నారు; (2) దేశంలో ఎన్ని రాజకీయ పార్టీలున్నాయి.

దేశంలోని మహిళలు ఎంత ఎక్కువ కాలం నుండి

ఓటింగు హక్కును అనుభవిస్తుంటే, వారికంత రాజకీయ చైతన్యం లభించి, తమ శ్రేయస్సును కోరేవారిని ఎన్నుకోవాలన్న ఆకాంక్ష వారిలో అంత అధికంగా ఉదయించే అవకాశాలుంటాయని అధ్యయనకర్తలు భావించారు. ఇందువల్ల పార్లమెంటులోనూ, విధాన నిర్ణయాధికారం గల స్థానాల సంపాదనలోనూ మహిళలకు అధిక ప్రాతినిధ్యం లభించే అవకాశాలుంటాయి. ఈ విషయాన్ని అధ్యయనకర్తలు సంఖ్యావివరాలతో నిరూపించారు.

1940వ సంవత్సరానికి పూర్వమే ఓటింగు హక్కును పొందిన దేశాలలో ఇతర అన్ని దేశాలలో కంటే పార్లమెంటులో మహిళా ప్రాతినిధ్యం అధికంగా ఉన్నది ఈ దేశాలలో మహిళా పార్లమెంటరీ ప్రాతినిధ్యం 16.7 శాతం వరకూ ఉన్నది. 1940-1950 సంవత్సరాల మధ్యకాలంలో ఓటింగు హక్కును మహిళలు పొందిన దేశాలలో, మహిళా పార్లమెంటరీ ప్రాతినిధ్యం 12.1 శాతం ఉన్నది. (పై దేశాలలో కంటే తగ్గింది). 1950-1960 సంవత్సరాల మధ్యకాలంలో ఓటింగు హక్కు లభించిన దేశాలలో వీరి పార్లమెంటరీ ప్రాతినిధ్యం 5.8 శాతము, 1960-1970 సంవత్సరాల మధ్యకాలంలో ఓటింగు హక్కును స్త్రీలు పొందిన దేశాలలో, వారి పార్లమెంటరీ ప్రాతినిధ్యం ఆరు శాతము మాత్రమే ఉన్నది. ప్రపంచ దేశాలలో మహిళల పార్లమెంటరీ ప్రాతినిధ్యపు సగటు 8.8 శాతము వరకూ ఉన్నది. (ఈ అంచనాలు 1987వ సంవత్సరానికున్న పరిస్థితిని తెలియజేస్తాయి) స్వరాజ్య సిద్ధితో పాటు సర్వజనీన ఓటింగు హక్కు ప్రజలకు లభించిన అన్ని దేశాలలోనూ మహిళా ప్రాతినిధ్య పరిస్థితి ఇలాగే ఉన్నది.

దేశంలో ఒకే రాజకీయ పార్టీ ఉన్నపుడు, మహిళలకు అధిక ప్రాతినిధ్యం లభిస్తుందా, ఒకటి కంటే అధికంగా రాజకీయ పార్టీలున్నపుడు వారికి అధిక ప్రాతినిధ్యం లభిస్తుందా అన్న విషయాన్ని కూడా అధ్యయన కర్తలు పరిశీలించారు. (ఒకటి కంటే అధికంగా రాజకీయ పార్టీలు దేశంలో ఉన్నపుడు వాటి మధ్య పోటీ ఉండటాన్ని వీరు పరిగణనకు తీసుకొన్నారు) 1987లో వీరు పరిశీలనకు తీసుకొన్న దేశాలలోని 44 దేశాలలో ఒకే రాజకీయ పార్టీ ఉన్నది. ఆదేశాల పార్లమెంట్లలో మహిళల ప్రాతినిధ్యపు సగటు 11.1 శాతం వరకూ ఉన్నది. 75 దేశాలలో ఒకటి కంటే ఎక్కువ రాజకీయ పార్టీలున్నాయి. ఆ దేశాలలోని స్త్రీల పార్లమెంటరీ ప్రాతినిధ్యపు సగటు 9.1 శాతం మేరకే ఉన్నది ప్రపంచంలోని చాలా దేశాలలో ఒకటి కంటే ఎక్కువగానే రాజకీయ పార్టీలున్నాయి గనుక. పైన పేర్కొన్న రెండవ సంఖ్యను (9.1) ప్రపంచ సగటుకు ప్రతిరూపంగా భావించవచ్చు. ఒకే పార్టీఉన్న దేశాలు. లాటిన్ అమెరికా. కరిబియన్ ప్రాంతాలలో ఎక్కువగా ఉన్నాయి. ఈ ప్రాంతపు దేశాలలో స్త్రీలకు అత్యధిక పార్లమెంటరీ ప్రాతినిధ్యం లభించింది. ఒక్క క్యూబాలో మాత్రమే (1987లో 33.9 శాతం వరకూ స్త్రీలకు ప్రాతినిధ్యం ఉన్నది). అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలలో కూడా ఇంతటి ప్రాతినిధ్యం మహిళలకు లభించలేదు. మహిళలకు సీట్లను రిజర్వు చేసే ఆచార ఫలితంగా వారికి అంతటి ప్రాతినిధ్యం లభించినట్లు అధ్యయనకర్తలు భావించారు.

ఈసూత్రానికి యాంత్రికంగా అన్ని దేశాలకు వర్తింపజేయ బూనటం ఉచితంగాదు అని కూడా అధ్యయన కర్తలు హెచ్చరించారు. ఈ సందర్భంలో వీరు నార్డిక్ దేశాల పరిస్థితిని ఉదహరించారు. ఇచ్చట, ఇతర అభివృద్ధి చెందిన దేశాలలో కంటే మహిళలకు అధిక పార్లమెంటరీ, కాబినెట్ ప్రాతినిధ్యాలు ఉన్నట్లు ఇంతకు పూర్వమే వివరించాం. ఇందుకు గల కారణాలను అధ్యయన కర్తలు వివరించారు. నియమిత సంప్రదాయాను సారంగా, ప్రజాస్వామ్యం, రాజకీయ పోటీ, మహిళల హక్కుల రక్షణ వంటి వాటిని ఈ దేశాల ప్రజలు పాటిస్తున్నారు. వీరు రాజకీయ వైరుధ్యానికి బదులు సహకారానికి, సంప్రదింపుల ద్వారా సమస్యల పరిష్కార మార్గాల అన్వేషణకు అధిక ప్రాధాన్యత నిస్తున్నారు.

### మహిళల పార్లమెంటరీ ప్రాతినిధ్యము : వారి సామాజికాభివృద్ధి స్థాయి

సమాజంలో నెలకొన్న స్త్రీ పురుష సమానత్వ స్థాయికి, స్త్రీల పార్లమెంటరీ ప్రాతినిధ్యము, విధాన నిర్ణయాత్మకాధికారం గల స్థానాలలో వారికి లభించగల వాటాకు అత్యంత సన్నిహిత సంబంధం ఉన్నది. రాజకీయ రంగంలోనూ, అధికార నిర్ణయాలు తీసుకోవటంలోనూ స్త్రీ-పురుష సమానత్వ సాధన జరిగిన తర్వాతే, స్త్రీజనాభ్యుదయ సాధన సాధ్యమా? లేక మహిళాభ్యుదయ సాధనానంతరమే రాజకీయ రంగంలోనూ, అధికార నిర్ణయార్హతలోనూ స్త్రీలకు సముచిత స్థానం

లభిస్తుందా? ఇప్పటికి, స్త్రీ జనాభ్యుదయం మీద లభిస్తున్న సమాచార ఆధారంతో ఈ విషయాన్ని నిర్ణయించటం కష్టం.

సమాజంలో స్త్రీ జనాభ్యుదయ పరిమాణాన్ని అంచనా వేయటానికి అవసరమైన కొలమాన రూపకల్పనకు గత పది సంవత్సరాల కాలంలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1987వ సంవత్సరంలో అమెరికాకు చెందిన "పాప్యులేషన్ క్రైసిస్ కమిటి" ఇందుకు ఒక ప్రాతిపదికను తయారు చేసింది. స్త్రీల ఆరోగ్యము, విద్య, వివాహము, సంతాన ప్రాప్తి, ఉద్యోగం, సమాజంలో అమలులో నున్న స్త్రీ - పురుష సమానత్వాల స్థాయీ పరిమాణాలను ఈ అంచనాకు ఆధారాలుగా తీసుకొన్నది. పైన పేర్కొన్న ఒక్కొక్క అంశానికి చెందిన మూడు విషయాలను పరిశీలించి, దానికి అనువైన రాంకింగ్‌ను ఇచ్చారు. ఉదాహరణకు విద్యను తీసుకొందాం. సెకండరీ స్కూలు టీచర్లుగా పనిచేస్తున్న వారిలో మహిళల సంఖ్యా పరిమాణమెంత, ప్రైమరీ, సెకండరీ స్కూళ్ళలో చదువుకు వెళ్ళే విద్యార్థినుల పరిమాణమెంత, విద్యార్థినీ విద్యార్థుల పరిమాణ భేదాలు ఎంత అన్న మూడు విషయాలను పరిశీలించి, ఆ విషయంలో ఆయా దేశాలకు, విద్యా విషయమైన ర్యాంకింగును ఇచ్చారు. దీనివల్ల ఆయా రంగాలలోని స్త్రీ జనాభ్యుదయ స్థాయిని మనం తెలుసుకోవచ్చు. (సమాజంలో స్త్రీ-పురుష సమానత్వ స్థాయీ నిర్ణయానికి, యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం సంస్థ "జెండర్ - రిలేటెడ్ డెవలప్‌మెంట్ ఇండెక్స్ (జిడిఐ)" అని ఒక కొలమానాన్ని రూపొందించి, క్రమంగా, దానికి ఆ సంస్థ మెరుగులు పెడుతున్నది. 1995వ సంవత్సరపు హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు ఆ ఇండెక్సును ప్రచురించి, దాని తయారీ విధానాలను కూడా వివరించింది. దీనిని మరొక అధ్యాయంలో సంక్షిప్తంగా పరిచయం చేశాం. పాప్యులేషన్ క్రైసిస్ కమిటి రూపొందించిన ఇండెక్స్ కంటె ఇది వాస్తవానికి మరింత సన్నిహితంగా ఉన్నది).

పాప్యులేషన్ క్రైసిస్ కమిటి రూపొందించిన ఇండెక్స్ సూచనలను బట్టి, వివిధ రంగాలలో నున్న స్త్రీ పురుష సమానత్వ స్థాయీ భేదానికి అనుగుణంగానే, మహిళా పార్లమెంటరీ ప్రాతినిధ్యం, విషయ నిర్ణయాధికారం గల స్థానాలలో స్త్రీల వాటా ఉన్నట్లు స్పష్టమవుతున్నది. అన్ని దేశాల పరిస్థితిని కలిపి చూచినపుడు, స్త్రీ పురుష సమానత్వ స్థాయి తక్కువగా నున్న దేశాలలో, సగటున 1.3 శాతము మాత్రమే మహిళలకు ప్రాతినిధ్యం లభించింది. ఈ సమానత్వ స్థాయి మధ్యమంగా ఉన్న దేశాలలో 2.8 శాతము, అధికంగా నున్న దేశాలలో 6.0 శాతము లభించింది. సమానత్వ పరిశీలనకు తీసుకొన్న ఇతర విషయాలలో కూడా, అసమానతా పరిమాణాలు దాదాపు ఇదే స్థాయిలో ఉన్నాయి. అన్ని అంశాలను కలిపి చూచినపుడు కనుపించే స్త్రీ అసమానతా స్థాయిని ఈ అధ్యాయంలోని పదహారవ పట్టికలో చూడవచ్చు.

ఈ వివరాల వల్ల, సమాజంలోని స్త్రీ-పురుష సమానత్వ

పదహారవ పట్టిక
ప్రపంచంలోని వివిధ దేశాలలో విధాన నిర్ణయాలు చేయగల అధికార స్థానాలలో స్త్రీలకు లభించిన ప్రాతినిధ్యం (శాతాలలో) (1987)

| స్త్రీల సామాజిక స్థాయీ పరిమాణం | విధాన నిర్ణయాధికారం గల ప్రభుత్వోద్యోగాలలో స్త్రీలకు లభించిన వాటా శాతం | పార్లమెంటులో మహిళలకు లభించిన స్థానాల శాతం |
|---|---|---|
| అల్పము | 1.5 | 4.4 |
| మధ్యమం | 3.7 | 6.0 |
| అధికం | 4.6 | 8.6 |
| అత్యధికం | 6.8 | 20.4 |

*- పాప్యులేషన్ క్రైసిన్ కమిటీ రూపొందించిన ఇండెక్సు ప్రకారం తయారు చేసిన పట్టిక*

*- ఆధారం : యునైటెడ్ నేషన్స్ స్టడీ*

స్థాయి పరిమాణాన్ని బట్టి, వారికి పార్లమెంటరీ ప్రాతినిధ్యం, నిర్ణయాధికారాలు గల పదవుల లభ్యతా ఆధారపడి ఉంటాయని స్పష్టమవుతున్నది. అంతేగాని, ఏది ముందు లభిస్తే తర్వాత రెండవది లభిస్తుంది అన్న విషయాన్నిది తెలియజేయటంలేదు గత పాతిక సంవత్సరాల కాలంలోనూ, సమాజంలో స్త్రీల స్థాయి పెరిగిందన్న మాట నిజం విషయ నిర్ణయాధికారం గల పదవులలో వీరిపుడు, లోగడ కంటే అధికంగానే కనుపిస్తున్నారు. ఈ పరిణామం అన్ని దేశాలలోనూ ఒకే పరిమాణంలో జరుగలేదు. చాలాదేశాలలో ఈ విషయంలో స్త్రీలు ఇంకా వెనుకబడే ఉన్నారు.

## స్త్రీల అధిక ప్రాతినిధ్యం వల్ల కనుపించగల ఫలితాలు

రాజకీయాలలోనూ, విధాన నిర్ణయాలు చేసే అధికారం గల ప్రభుత్వ రంగ పోస్టులలో మహిళల ప్రాతినిధ్యపు పెరుగుదల వల్ల ఎటువంటి ఫలితాలు కలుగుతాయో చూద్దాం. స్త్రీల ప్రాతినిధ్యం ఎంత స్థాయిలో ఉంటే ఎంతమంచి ఫలితాలు కనిపిస్తాయో చెప్పటానికి తగినంత పరిశోధనా సమాచారం లభించటంలేదు. అయినా, అధిక ప్రాతినిధ్యపు ప్రభావం వల్ల మహిళా లోకానికి మేలు చేకూరుతుందని చెప్పదగిన రుజువులు మాత్రం కనుపిస్తున్నాయి.

కొన్ని సమస్యల మీద స్త్రీ పురుషుల అభిప్రాయాలు ఒకేరకంగా ఉండవు అని పలు పరిశోధనా పలితాలు, సర్వే ఫలితాలు వెల్లడిస్తున్నాయి. ఈ విషయానికి రాజకీయ రంగంలోని స్త్రీ పురుషులు కూడా అతీతులుగారు. ఏవో కొన్ని స్త్రీ జన సంక్షేమాంశాలకే ఈ భిన్నత్వం పరిమితమని భావించకూడదు. కొన్ని సాధారణ విషయాలలోనూ అభిప్రాయ భేదాలు కనుపిస్తాయి. కొన్ని సాంఘిక సమస్యలతో పాటు, యుద్ధము, శాంతి, పరియావరణ సంరక్షణ వంటి అంశాల మీద కూడా స్త్రీ పురుషుల అభిప్రాయాలు ఒకే విధంగా ఉండవు. రాజకీయ పార్టీలకు, ప్రభుత్వాలకు నాయకత్వం వహించిన మహిళలలో అధికులు స్త్రీ జనోద్ధరణ కంటూ చేసిన గొప్ప పనులు ఏమీ కనుపించవు. అధిక సంఖ్యాక పురుషుల మధ్యనున్న అతి కొద్ది మంది స్త్రీలు ఏమి చేయగలరు అని చెప్పవచ్చు. పురుషుల అభిప్రాయానుసారం ఆ నాయకురాండ్రు నడవక తప్పని పరిస్థితులుండటం కూడా సహజమే ఇప్పటికి లభిస్తున్న సమాచారాన్ని బట్టి, మహిళల సభ్యత్వ శాతం 30 నుండి 35 వరకూ ఉన్నపుడే, వారు విధాన మార్పులు, స్త్రీ జన సంక్షేమానుసారంగా ఉండేట్లు చూడగలరని చెబుతున్నారు. ఈ మహిళా ప్రాతినిధ్య పరిమాణాన్నే ఇంగ్లీషులో "క్రిటికల్ మాస్"గా వ్యవహరిస్తున్నారు.

ఈ "క్రిటికల్ మాస్" అనేంతటి మహిళా ప్రాతినిధ్యాన్ని ప్రపంచంలోని అతికొద్ది దేశాలు మాత్రమే సాధించగలిగాయి. అందుచేత, ఈ అంశం మీద ఎవరేం చెప్పినా, అది ఈ కొద్ది దేశాల అనుభవ ప్రాతిపదికానుసారంగా ఉండటం లేదు: రాజకీయ రంగంలోని తమ తమ అనుభవాలను బట్టి, అభిప్రాయాలను బట్టి చెబుతున్నారు మహిళా ప్రాతినిధ్యం అధికంగా ఉన్న పార్లమెంట్లలో, వారు ప్రవేశపెట్టిన తీర్మానాలు, వాటిలోని అంశాల పరిశీలన వల్ల కూడా మనకొక అంచనా లభించే అవకాశమున్నది. ఈ విషయంలో అమెరికా దేశపు హౌస్ ఆఫ్ ది రిప్రజెంటెటివ్స్ అనుభవాన్ని చూద్దాం. ఆర్థిక విషయాలు, యుద్ధము - శాంతి, అణుశక్తి, మరణదండన, గర్భస్రావము, స్త్రీ-పురుష సమానత్వము వంటి అంశాల మీద, స్త్రీ-పురుష సభ్యులు సభలో ప్రతిపదించిన తీర్మానాంశాలలో ప్రకటితమైన అభిప్రాయాలు భిన్నంగా ఉన్నాయి. 1972-1980 సంవత్సరాల మధ్య జరిగిన సభలలోని మహిళల, పురుషుల ఓటింగ్ విధానాలను పరిశీలించిన యునైటెడ్ నేషన్స్ అధ్యయన నిర్వాహకులు, పురుషుల కంటే మహిళలు అధిక సరళీకృత విధానాలకు అనుకూలంగా ఓటు చేసినట్లు గమనించారు. అంతేకాదు; అవసరమైనపుడు, తమ పార్టీ విధానాల పరిధిని కూడా వారు దాటివెళ్ళినట్లు వీరు వెల్లడించారు.

స్కాండినేవియా దేశాలలో కూడా పార్లమెంటులో మహిళా ప్రాతినిధ్యం క్రమంగా పెరుగుతున్నది. అందుచేత అధ్యయనా నిర్వాహకులు ఈ దేశాల అనుభవాలకు సంబంధించిన సర్వేలను కూడా పరిశీలించారు. స్టాక్‌హోం నగర శివార్లలోని ఒక ప్రాంతంలో సర్వే జరిగింది. 20వ శతాబ్దపు 80వ దశాబ్దంలో, ఈ ప్రాంతంలోని ఒక స్థానిక సంస్థలోని మహిళా ప్రాతినిధ్యం 40 నుండి 48 శాతం వరకూ పెరిగింది. దీని ప్రభావం వల్ల ఆ సంస్థ తీర్మానాలలో మహిళల అభిప్రాయాలకు చోటు లభిస్తున్నది. అంతేకాదు; శిశు సంక్షేమం, విద్యా, విరామ సమయ వినియోగ విధానం వంటి అంశాలకు

ప్రాధాన్యత లభించటం కూడా ప్రారంభమైంది. సభలో జరిగే చర్చల సరళి కూడా మారింది చర్చలలో పరస్పర నిందారోపణలకు, వ్యక్తిగత నిందలకు గాకుండా, స్త్రీ పురుషులిద్దరూ విషయానికి ప్రాధాన్యత నివ్వటం ప్రారంభమైంది. మహిళలు సామాన్యుల పరిభాషలో మృదువుగా మాట్లాడటం వల్ల, ప్రజలు చర్చలను చక్కగా అర్థం చేసుకోవటానికి వీలు గలిగింది. కుటుంబ బాధ్యతా నిర్వహణలో తామూ పాలు పంచుకోవలసిన అవసరాన్ని పురుష సభ్యులు క్రమంగా గ్రహించ నారంభించారు. రాజకీయ విషయాల మీద కంటె కుటుంబ విషయాల మీద అధిక శ్రద్ధా ప్రదర్శన అవసరమన్న విషయాన్ని పురుషులు బహిరంగంగా అంగీకరించటం కూడా కనుపించింది.

ఫిన్లండ్‌లో పార్లమెంటు చర్చల సరళిని పరిశీలిస్తే, సాంఘిక సంక్షేమము, విద్య, సంస్కృతి వంటి అంశాల మీద మహిళా సభ్యులు అధికాసక్తిని ప్రదర్శిస్తే, ఆర్థిక, రాజకీయ, దేశరక్షణ, రవాణా వంటి విషయాల యెడల పురుషులు శ్రద్ధను ప్రదర్శించటం కనుపించింది. స్వీడిష్ పార్లమెంటులో సభ్యురాండ్రు విద్య, సంస్కృతి వంటి అంశాల మీద చేసే చట్టాల చర్చలలో చురుకుగా పాల్గొనటం కనుపించింది. ఆర్థిక, ద్రవ్య విధానాల చర్చలలో ఇంతటి శ్రద్ధా ప్రదర్శన కనుపించలేదు. పురుషులు ఆర్థిక, పారిశ్రామిక చట్టాల రూపకల్పనలో చురుకుగా పాల్గొంటున్నారు.

యునైటెడ్ కింగ్డంలో జరిగిన ఒక సర్వేలో, సభలో మహిళలు ప్రతిపాదించిన 25 బిల్లుల స్వభావాన్ని పరిశీలించారు. స్త్రీ జన సంక్షేమ ధ్యాసే వీటిలో ప్రతిబింబిత మవుతున్నది. ఈ బిల్లులోని తొమ్మిది, స్త్రీ, శిశు సంక్షేమానికి సంబంధించినవి ఉన్నాయి; నాలుగు, వాడకం దారుల శ్రేయస్సుకు, మరొక మూడు విద్య, మద్యపాన లోలత్వానికి సంబంధించినవి, ఇంకొక మూడు పశు సంరక్షణకు సంబంధించినవి ఉన్నాయి.

పార్లమెంటులో మహిళా ప్రాతినిధ్యపు పెంపువల్ల సత్ఫలితాలు కనిపిస్తున్నట్లు కొన్ని రుజువులు ఇప్పటికే ఉన్నా, ఈ విషయం మీద సమగ్రాధ్యయనం జరగాలనీ, పలుదేశాల అనుభవాన్ని సేకరించాలని అధ్యయన బృందం అభిప్రాయ పడింది.

## అధ్యయన బృందం సూచించిన కొన్ని పరిష్కార మార్గాలు

పార్లమెంటరీ ప్రాతినిధ్యము, విషయ నిర్ణయాధికారం గల స్థానాల పంపకంలో మహిళలను చిన్నచూపు చూస్తున్నారనీ, వారికి న్యాయమైన స్థానం లభించటం లేదన్న విషయాన్నీ, అందుకు గల కారణాలనూ ఇంత వరకూ చూచాం. ఈ పరిస్థితిని చక్క దిద్దటానికి అధ్యయన బృందం చేసిన కొన్ని సూచనలను ఇచ్చట వివరిస్తాం.

పైన పేర్కొన్న విషయాలలో కొంత పురోగతి సాధన జరిగినా, ఇంకా మహిళలు అధికార పీఠానికి చేరువ గాలేదు. ఒక్క నార్డిక్ దేశాలలో మాత్రమే రాజకీయ రంగంలో స్త్రీలకు సముచిత స్థానం లభించింది. మిగిలిన అన్ని దేశాలలోనూ (సంపన్న దేశాలతో సహా) మహిళలకు సముచిత స్థానం లభించక పోవటమో, లభించినా అది నామ మాత్రంగా ఉండటమో కనుపిస్తున్నది పరిస్థితులు మారుతున్నాయి; కాని ఆమార్పు నత్తనడక సాగుతున్నది. పురోగమన 'వేగం' ఇలాగే ఉంటే, బహుశా 22వ శతాబ్దాంతానికయినా స్త్రీలకు ఈ రంగాలలో సమానత్వం గాకపోయినా, 30-35 శాతపు ప్రాతినిధ్యమయినా లభించగలదని చెప్పటానికి తగిన ఆధారాలు లభించటం లేదు! ఇప్పటికే నార్డిక్ దేశాలు ఈదశను కూడా అధిగమించాయి. కనుక, ఏనాటికయినా, ఈ రంగాలలో స్త్రీ-పురుష సమానత్వ సాధన సాధ్యమే నన్న ఆశాభావం గలుగుతున్నది. కాకపోతే ఇందుకు పట్టే కాల పరిమాణ మెంత అన్నదే ఇంకా ప్రశ్నార్థకంగా ఉన్నది.

నార్డిక్ దేశాల అనుభవం ఈ కార్య సాధన కుపకరించ వచ్చు. ఆ దేశాలలో విషయ నిర్ణయాధికారం గల ప్రభుత్వ యంత్రాంగ స్థానాలలో స్త్రీలు అధికంగా కనుపిస్తారు. ఆదేశాల స్త్రీలకు ఓటింగు హక్కు ఉన్నది; ఎన్నికలలో పోటీ చేసే అవకాశాలూ ఉన్నాయి. కొన్ని సంవత్సరాలుగా ఈ హక్కులను అనుభవిస్తూ వారు అధికార పీఠాలను అలంకరిస్తున్నారు. ఇలాగే కొన్ని సంవత్సరాలుగా ఈ దేశాల మహిళలు విద్యార్జనావకాశాలనూ, ఉద్యోగావకాశాలనూ అనుభవిస్తున్నారు. ఈ దేశాల ఆర్థికాభివృద్ధి నిరంతరాయంగా సాగుతూనే ఉన్నది. దేశ సంపదలో అధిక భాగాన్ని ప్రజా సంక్షేమ కార్యక్రమాలకు ఖర్చు చేస్తున్నారు. సాంఘిక సమానత్వ సాధన ప్రభుత్వ లక్ష్యంగా ఉన్నది. దేశక్షేమము, అభివృద్ధి దృష్ట్యా, విషయ

## రాజకీయ రంగంలో స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించిన నార్వే

ఇరవయ్యవ శతాబ్దారంభ కాలంలోనే స్త్రీలకు ఓటింగు హక్కు నిచ్చిన అతి కొద్ది దేశాలలో నార్వే ఒకటి. ఈ దేశపు రాజకీయ వ్యవస్థలో ఆదర్శప్రాయమైన స్త్రీ-పురుష సమానత్వాన్ని మనం చూడవచ్చు పలు రాజకీయ పార్టీలు రంగంలో ఉన్న ఈ దేశపు మంత్రి మండలిలో నలభై శాతం స్థానాలలో స్త్రీలుండటం కనుపిస్తుంది దీన్ని స్త్రీలకు "సముచిత స్థానం" లభించటంగా భావించవచ్చు. ఇటీవలి కాలంలో మాత్రమే ఫిన్లండ్, స్వీడన్ దేశాలు ఈ స్థాయిని దాటి పోయాయి. 1981 వ సంవత్సరం నుండి 1989 వ సంవత్సరం వరకూ, 1990 వ సంవత్సరం నుండి నార్వే లేబర్ పార్టీ అధినేతగానున్న మహిళ-గ్రో హర్లెం బ్రెంట్‌లెండ్ - దేశపు ప్రధానిగా ఉన్నారు.

నార్వే దేశపు సమాజంలో ఆదినుండి స్త్రీ-పురుష సమానత్వానికి ఆదరణ ఉన్నది బలమైన శక్తిగా రూపొందిన మహిళోద్యమం స్త్రీల ఆర్థిక, సాంఘిక స్థాయి పెంపుదలకు తోడ్పడింది రాజకీయరంగంలో పురుషులతోడి సమానత్వాన్ని కూడా ఈ ఉద్యమం సాధించగలిగింది రాజకీయరంగంలో పొడచూపే వైరుధ్యాలను, పోటీలనూ, పోరాడి తేల్చుకోవటం ద్వారా గాకుండా, సంప్రదింపుల ద్వారా పరిష్కారం చేసుకోవటం అనేది నార్వేలో సంప్రదాయంగా వస్తున్నది. ఓటర్లలో నూరింట ఎనభైమందికి తగ్గకుండా, జాతీయ ఎన్నికలలో ఓటు చేయటం ఈ దేశం యొక్క ప్రత్యేకత. ఇందువల్ల, స్త్రీలతో సహా భిన్న వర్గాల వారి అభిప్రాయ ప్రతిబింబంగా ఎన్నికల ఫలితాలుంటున్నాయి.

ఈ శతాబ్దపు ప్రారంభకాలం నుండి పురుషులతోడి సమానావకాశాలను రాజకీయ రంగంలో సాధించటానికి మహిళా ఉద్యమం పనిచేస్తున్నది. ఇతర దేశాలలో స్త్రీ ఉపాధికో, రాజకీయ పాలసీలకో అధిక ప్రాధాన్యత లభిస్తుండగా, ఈ దేశంలో రాజకీయాలకు తొలి ప్రాధాన్యత లభిస్తున్నది. ఈ శతాబ్దపు అరవయ్యవ, డెబ్భయ్యవ దశాబ్దాల కాలంలో, స్త్రీల రాజకీయ రంగ ప్రాతినిధ్య పరిమాణం త్వరితగతిని పెరిగింది. 1963-1967 సంవత్సరాల మధ్య కాలంలో స్థానిక సంస్థలలో మహిళా ప్రాతినిధ్యం ఐదు శాతం నుండి పన్నెండు శాతానికి పెరిగింది. ఎన్నికల నిర్వహణా విధానాలను, ప్రాంతీయ సమస్యలను ఓటర్లకు తెలియజెప్పే కార్యక్రమం ఈ కాలంలో చురుకుగా సాగిన ఫలితమే ఇది.

రాజకీయ పార్టీలలోనూ, మహిళా సంఘాలలోనూ పనిచేస్తున్న స్త్రీలు, "స్త్రీలకు స్త్రీలే ప్రాతినిధ్యం వహించాలి" అన్న నినాదాన్ని చేబట్టి, పురుషులతోడి సమానత్వ సాధనకు కృషి చేశారు. 1970 వ సంవత్సరం తర్వాత నుండీ, రాజకీయ పార్టీలు, మహిళా ప్రాతినిధ్యానికి కోటాలను నిర్ణయించి స్త్రీలకు అవకాశాల నిచ్చాయి. ఇలాంటి కోటా పద్ధతిని అనుసరించని పార్టీలు కూడా మహిళా ప్రాతినిధ్యం నాల్గవ వంతుకు తగ్గకుండా జాగ్రత్త పడనారంభించాయి. రాజకీయ పార్టీలు ప్రదర్శించిన ఈ శ్రద్ధకు తోడు, ఈదేశంలో ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ పద్ధతిని జరిగే ఎన్నికల నిర్వహణా విధానం కూడా మహిళా ప్రాతినిధ్యపు పెంపుకు తోడ్పడింది.

ఈ మహిళా ప్రాతినిధ్యపు పెంపును చూచి ఈ దేశం, మహిళల పాలిటి భూతల స్వర్గంగా భావించనవసరం లేదు. ఈ దేశంలో కూడా, స్త్రీ పురుష వేతన సమానత్వం లేదు; కొన్ని రకాల ఉపాధులకే స్త్రీలు పరిమితమవుతున్నారు; స్త్రీ హింస ఇంకా ఈ దేశాన్ని పీడిస్తూనే ఉన్నది!

*హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995*

ప్రాధాన్యతా నిర్ణయం వారికి సంప్రదాయంగా వస్తున్నది. ఈ విషయంలో ఆదేశాలలోని రాజకీయ పార్టీలన్నీ అవగాహనతో పని చేస్తున్నాయి. స్త్రీ - పురుష సమానత్వ సాధనకు కొన్ని సంవత్సరాలుగా ఈ దేశాలలో కృషి జరుగుతున్నది. ఈ సమానత్వ సాధనకు ఇతర దేశాల వారు నార్డిక్ దేశాల అనుభవాలను అధ్యయనం చేయటం అవసరం. ఈ అధ్యయనాంశాలను యునైటెడ్ నేషన్స్ స్టడీ పేర్కొన్నది. వీటిలో మూడింటి నిచట వివరిస్తాము :

1. స్త్రీ పురుష సమానత్వ సాధనకు, స్త్రీలకు కొన్ని చట్టపరమైన హక్కులను ఇవ్వటం అవసరమే. కాని హక్కులు ఇవ్వటం మాత్రమే చాలదు. అవి అమలు జరిగేటట్లు చూడాలి. నార్డిక్ దేశాలలో వలె సమాజంలో స్త్రీలకు ఆదర్శ ప్రాయమైన స్థానాన్నీయదలచిన దేశాలలో, తమకు నచ్చిన అభ్యర్థికి స్వేచ్ఛగా ఓటు చేయటానికి, ప్రజాప్రతినిధి సభలకు పోటీ చేసి ఎన్నిక కావటానికి, పురుషులతో సమానమైన హక్కులూ, అవకాశాలూ మహిళల కుండాలి. ఇలాంటి హక్కులు చాలా దేశాల మహిళల కున్నాయి. అవి అమలు జరిగినపుడే మహిళలకు సమానావ కాశాలు లభిస్తాయి. కాని అవి అమలు జరగటం ఒక్కటేచాలదు. వాటిని అనుభవించటానికి తగిన శక్తియుక్తులు, పురుషులతోడి సమానావకాశాలు కూడా వారికి ఉండటం అవసరం. విద్యార్జనా, ఉద్యోగ సంపాదనా విషయాలలో పురుషుల తోడి సమానావ కాశాలు స్త్రీలకు కూడా లభించాలి. చాలా దేశాలలో స్త్రీలకు ఈ రెండు అంశాలలోనూ సమానావకాశాలు లభించటం లేదు. అందువల్ల లేబర్ మార్కెట్‌కు, స్త్రీ జనాభాలో అతి తక్కువ మంది మాత్రమే వస్తున్నారు. అయినా కొందరు మహిళలు రాజకీయ రంగప్రవేశం చేయగలుగుతూనే ఉన్నారు. కొన్ని దేశాలలో ఈ రెండు విషయాలలోనూ స్త్రీ - పురుష సమానత్వ సాధన జరిగినా రాజకీయ రంగంలోనూ, నిర్ణయాధికారం గల ఉన్నతోద్యోగాల సంపాదనలోనూ వారికి సమానావకాశాలు లభించటం లేదు. విద్యార్జన, ఉపాధి సంపాదనా విషయాలలో పురుషులతోడి సమానావకాశాలుండటం వాంఛనీయమే అయినా, ఇవి మాత్రమే స్త్రీలను అధికార పీఠానికి తీసుకు పోదగిన బాటలను వేయలేవు.

2. స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించదలచిన దేశం సంపన్నత్వాన్ని సాధించాలి ప్రజలు సుఖంగా జీవించటానికి అవసరమైన వేతనాలు లభించాలి, జీవన వసతుల కల్పన కూడా అవసరం. రోజు ఎలాగడుస్తుందా అని ఆందోళన పడుతూ, లేచిన దగ్గర నుండి పడుకొనే వరకూ చాకిరీ చేస్తూ ఉండవలసిన పరిస్థితులు అంతరించాలి స్త్రీలు పురుషులతోడి సమానావకాశాలను అనుభవించటానికి, అవసరమైన సామాజిక మార్పు సాధనకు ప్రభుత్వం పెద్ద ఎత్తున నిధులను ఖర్చు చేయగలగాలి. దేశం సంపన్న మయినపుడే ఇది సాధ్యమవుతుంది. ప్రపంచంలో కెల్ల అత్యధిక తలసరి జాతీయాదాయాలను గలిగిన అభివృద్ధి చెందిన దేశాలలో, మహిళా ప్రాతినిధ్యం, రాజకీయ రంగంలో స్త్రీలు నిర్వహిస్తున్న పాత్ర ఆశించదగిన దానికంటే తక్కువగానే కనుపిస్తున్నది. వీటికంటే తక్కువ అభివృద్ధిని సాధించిన దేశాలలో మహిళలు ఈ రంగంలో గణనీయమైన పాత్రను నిర్వహిస్తూండటం కనుపిస్తుంది. ప్రజల జీవన ప్రమాణం అధికంగా ఉండటం, సాంఘిక సంక్షేమానికి ప్రభుత్వం అధిక పరిమాణంలో నిధులను ఖర్చు చేయగలిగి ఉండటం అవసరమే. కాని, స్త్రీ-పురుష సమానత్వ సాధనకు ఇదొక్కటే చాలదని అనుభవం నిరూపించింది.

3. స్త్రీ పురుష సమానత్వ సాధనకు ఉవ్విళ్ళూరే దేశంలో రాజకీయ రంగ నిర్వహణలో ప్రజాస్వామ్య సూత్రాలను చిత్తశుద్ధితో పాటించే సంప్రదాయం ఉండటం అవసరం. ఇలాంటి సంప్రదాయాన్ని అనుసరించే దేశాలలో మహిళలు స్వేచ్ఛగా దేశ రాజకీయాలలో పాల్గొంటారు; ప్రశాంత వాతావరణంలో వారు తమ ఓటింగు హక్కును వినియోగించు కొంటారు; ప్రభుత్వ యంత్రాంగంలోని నిర్ణయాధికారం గల స్థానాలకు ఎన్నికయ్యే అవకాశాలుంటాయి. సంపన్నంగాకుండాను, పేదదిగాకుండానూ, మధ్యస్థ స్థితిలో ఉండే దేశాల అనుభవాన్ని చూస్తే, మహిళలు తమ జీవితాంతం ఓటు చేస్తున్నట్లు కనుపిస్తుంది, కాని వారు అధిక సంఖ్యలో విషయ నిర్ణయాధికారం గల అధికార పీఠాలనెక్కటం మాత్రం కనుపించదు! ఓటింగు హక్కు ఒక్కటే వారిని అందలం ఎక్కించటం లేదు. అతివాదుల నాయకత్వాన జరిగిన రాజకీయ విప్లవాల అనంతరం ఏర్పడే ప్రభుత్వంలోని నాయకత్వ స్థానాలలో మహిళలు కనుపిస్తారు. ఇది అకస్మాత్తుగా జరిగే

పరిణామం ఇందుకు నికరాగ్వాలో శాండినిస్టా విప్లవానంతరం ఏర్పడిన మంత్రివర్గాన్ని ఉదహరించవచ్చు. రాజకీయ రంగంలోనూ, అధికార పీఠాల అలంకరణ విషయాలలోనూ స్త్రీ పురుష సమానత్వ సాధనకు ప్రజాస్వామ్య సంప్రదాయాల పాటింపు మాత్రమే సరిపోదు. ఈ విషయాన్ని మనం మరువకూడదు.

ఇట్లని ప్రజాస్వామ్య సంప్రదాయపు పాటింపును తక్కువగా అంచనా వేయకూడదు. ఇది లేకుండా స్త్రీ-పురుష సమానత్వ సాధన సాధ్యం కాదని అధ్యయన బృందం అభిప్రాయపడింది. ఇది తు.చ తప్పక అమలు జరిగినపుడే స్త్రీ-పురుష సమానత్వ సాధనా కృషి వల్ల, జాతీయ విధానాల, చట్టాల రూపకల్పనలో స్త్రీ-పురుష సమానత్వానికి ఉచిత స్థానం లభిస్తుంది. ప్రజాస్వామ్యం ఎంత చక్కగా అమలు జరిగితే, అంతగా స్త్రీ-పురుష సమానత్వ సాధన జరుగుతుందని అధ్యయనం పేర్కొన్నది.

పైన పేర్కొన్న సూత్రాలన్నీ అమలు జరిగినపుడు పార్లమెంటరీ ప్రాతినిధ్యంలోనూ, విధాన నిర్ణయాధికారం గల అధికార స్థానాల పంపకంలోనూ స్త్రీ పురుష సమానత్వం సాధ్యమవుతుంది. ఈ పరిణామ క్రమాన్ని ఏవరుసలో సాధించాలి; ఏ కార్యక్రమం తర్వాత దేనిని అమలు జరపాలి? కార్యాచరణలో ఆయా అంశాలకు ఇవ్వవలసిన ప్రాధాన్యతా పరిమాణమెంత? స్త్రీలు కూడా, పురుషుల స్థాయిలో రాజకీయాలలో స్వేచ్ఛగా పాల్గొనాలంటే, వారి సామాజిక స్థాయీ అభివృద్ధి ఏ పరిమాణంలో ఉండాలి; ఎంత మేరకు సాధించాలి? స్త్రీల సామాజిక స్థాయీ పెంపుకు, అభివృద్ధి సాధనకు వారు రాజకీయాలలో పాల్గొన వలసిన అవసరం ఉన్నదా? ఈ విషయాలను గురించి ఆలోచించాలి.

ఈ సమస్యను ఏవంక నుండి పరిశీలించినా, మనకు ఎదురవుతున్న ప్రశ్నఇది: స్త్రీల భవితవ్యాన్ని నిర్ణయించవలసినది ఎవరు? మనుషులా? లేక మార్కెట్ సంబంధాలా? లేక వారి భవితవ్యాన్ని వారే నిర్ణయించుకోవాలా? రాజకీయ రంగంలో మహిళలు చురుకుగా పాల్గొనాలంటే, వారు ఎన్నిక కావటం అవసరం. వారి ఎన్నిక జరగాలంటే, వారు అభ్యర్థులుగా ఎన్నికయ్యే అవకాశాలుండాలి. చాలా దేశాలలో వారికీ అవకాశం లభించటం లేదు. ఎన్నికలలో మహిళా అభ్యర్థులకు ఓట్లువేసి, దేశ రాజకీయ పరిణామాలను స్త్రీ జనాభ్యుదయ సాధనకు అనువుగా మార్చటానికి ప్రయత్నించ దలిచితే, ఎన్నికలలో పోటీ చేయటానికి తగినంత మంది స్త్రీ అభ్యర్థులు లభించటం లేదు.

దేశంలో సంభవిస్తున్న పరిణామాలను అర్థం చేసుకోగలశక్తి స్త్రీలకు లభించినపుడు, వారు చైతన్య వంతులయిన పౌరులుగా వ్యవహరిస్తారు. కనుక మహిళా ఓటర్లు విద్యావంతులు కావటం అవసరం. ఇందుకు వారి విద్యార్జనకు, పురుషులతో సమానావకాశాలు లభించాలి. పురుషులతో సమమైన ఉపాధి అవకాశాలు వారికి లభించినపుడు, ఆర్థికంగా వారు స్వతంత్రులవుతారు. ఇందువల్ల విధాన నిర్ణయాధికారం గల అధికార స్థానాలకు తగిన అర్హత కూడా వారికి లభించి, ఆయా స్థానాలకు అవసరమైనంత మంది మహిళలు లభిస్తారు. ఇలాంటి వారిలో కూడా అతి తక్కువ మందే నాయకత్వ స్థాయికి ఎదగగలుగుతున్నారు. ఎంతటి అభివృద్ధిని సాధించిన దేశాన్ని చూచినా, ఈపరిస్థితి కనుపిస్తున్నది. కనుక, అధికార నిర్ణయాలు చేసే స్థానాల అలంకరణలో, పురుషులతోడి సమానత్వ స్థాయీ సాధనకు స్త్రీలు విద్యావంతులుగా, ఆర్థికంగా స్వతంత్రులుగా అభివృద్ధి చెందటం ఒక్కటే చాలదు.

రాజకీయాధికారపు అమలులో మార్పులు ఒక్కొక్కసారి త్వరితగతిని సంభవించే వీలున్నది; ఒక్కొక్కసారి ఈ మార్పులు అకస్మాత్తుగా జరగవచ్చు కూడా. అందుచేత, ఈ రంగంలో స్త్రీ జనాభ్యుదయ సాధనకు ప్రశాంత పరిణామ క్రమం మీదనే ఆధారపడవలసిన అవసరం లేదని అనుభవం నిరూపిస్తున్నది. సిద్ధాంతరీత్యా చూస్తే, మహిళలంతా కలసికట్టుగా వ్యవహరించినపుడు, పురుషులతో సమానమైన పార్లమెంటరీ ప్రాతినిధ్యాన్ని వారు సాధించగల అవకాశాలున్నాయి. ఎటువంటి ప్రయత్నమూ చేయకుండా రాజకీయ పరిపాలనా యంత్రాన్ని తనంత తనను నడవనిస్తే, అభ్యుదయ సాధన నత్తనడకన మాత్రమే సాగుతుంది. మార్పును త్వరితగతిని సాధించే అవకాశాలు కూడా ఉన్నాయి. ఇందుకు ఘనం నార్వే అనుభవాన్ని చూడవచ్చు. ముప్ఫై సంవత్సరాల క్రితం మహిళల పార్లమెంటరీ ప్రాతినిధ్యం చాలా తక్కువగా ఉండేది. మహిళలు కూడా తమ స్థాయిలో రాజకీయ జీవనంలో పాల్గొంటే తప్ప,

దేశంలో ప్రజాస్వామ్యం వికసించదన్న విషయాన్ని పురుషులు గుర్తించారు ఇందుకు రాజకీయాధికారంలో సముచిత స్థానం స్త్రీలకు లభించాలని తెలుసుకొన్నారు. ఇందుకు అవసరమయిన సహకారాన్ని స్త్రీల కందించారు. దీని ఫలితంగా 1969 వ సంవత్సరంలో తొమ్మిది శాతంగా ఉన్న మహిళా పార్లమెంటరీ ప్రాతినిధ్యం 1973 వ సంవత్సరానికి 16 శాతానికి పెరిగింది. 1985 వ సంవత్సరం వచ్చే సరికి 34.4 శాతానికి, 1994వ సంవత్సరానికిది 39 శాతానికి చేరింది. 1969-1985 సంవత్సరాల మధ్య కాలంలో జరిగిన నాలుగు ఎన్నికలలో నార్వే ప్రజలు, మహిళలకు "క్రిటికల్ మాస్" పరిమాణపు ప్రాతినిధ్యాన్నిచ్చారు. ఈ కార్యసాధనకు మూలకారణం, పురుషుల మీద, స్త్రీలు జరిపిన "పోరాటం" కాదు; స్త్రీ-పురుషుల సహకారం, సుహృద్భావ ప్రదర్శన, ఈ కార్యసాధనకు తోడ్పడ్డాయి. ఇది గమనించవలసిన అంశం. పురుషుల ఆలోచనలలో, అవసరమైన మార్పు వచ్చే వరకూ మహిళలు కలిసికట్టుగా ఆందోళన జరపవలసే ఉంటుంది.

# 15

## యుద్ధము : స్త్రీలు

యుద్ధ స్వభావాన్ని తెలుసుకోవటానికి, ఆ యుద్ధంలో స్త్రీలు పాల్గొంటున్నారా లేదా అని చూడమన్నారు యుద్ధనీతి నిపుణులు. న్యాయమైన లక్ష్యసాధనకు జరుగుతున్న యుద్ధంలో దేశంలోని పురుషులతో సమంగా స్త్రీలు కూడా పోరాడుతారు. దేశ జనాభాలో సగభాగంగా ఉండే స్త్రీలు పాల్గొనకుండా విజయం సాధ్యం గాదు. స్త్రీలు "అబలలు" కాదు అని భావించే వారికీ విషయం సులభంగా బోధ పడుతుంది. న్యాయమైన యుద్ధంలో స్త్రీలు పాల్గొన్నపుడు మేలు జరిగినట్లే, ఓడినపుడు వారికి, వారి సంతానానికి కూడా నష్టం జరగటం సాధారణం. పరాజయం వలన ముందు నష్టపడేది, అధికంగా బాధపడవలసి వచ్చేది స్త్రీలు, వారు కన్నపిల్లలు.

సమాజం కొన్ని వందల సంవత్సరాలుగా స్త్రీలను యుద్ధంలో పాల్గొననీయటం లేదు. ముఖ్యంగా పోరాట దళాలలో వీరిని చేర్చటంలేదు. యుద్ధంలో పట్టుబడినపుడు, వీరు మానభంగానికో, ఇతర రకాల దురాగతాలకో గురయ్యే అవకాశాలుంటాయన్న భయంతో స్త్రీలను పోరాట దళాలలో (కాంబాటెంట్స్‌గా) చేర్చటం లేదు. ఈ వాదం, పూర్వకాలానికి వర్తించవచ్చును గాని, ఇపుడు వర్తించదని ఒక వర్గం వారిపుడు చెబుతున్నారు. (దీని మీద ఏకాభిప్రాయం లేదు.) పోరాట దళాలని(కాంబాటెంట్స్‌గా), యుద్ధరంగంలో ప్రత్యక్షంగా పోరాడని దళాలని(నాన్-కాంబాటెంట్స్), ఇపుడున్న తేడా, ప్రాచీన కాలంలో లేదు. స్త్రీలను సైన్యంలోకి తీసుకోకూడదు అని వాదించేవారు, ఈ తేడాలను గమనించటం లేదని కొందరు భావిస్తున్నారు. పాతకాలపు భావాన్ని, మారిన ఆధునిక పరిస్థితులకు వర్తింపజూస్తూ వారు పొరబడుతున్నారని వాదిస్తున్నారు.

ప్రాచీన కాలంలో విజయాన్ని సాధించిన సైన్యానికి చెందిన సైనికులకు, పరాజయం పాలయిన దేశపు స్త్రీలను చెరిచే అవకాశాలనీయటం, వారి నాయకులిచ్చే బహుమానంగా భావించనవసరం లేదు. విజయసాధన జరిగినపుడు, దొరికిన ప్రతిదానిని అనుభవించటానికే, పురుషులు సైన్యంలో చేరేవారు. ట్రోజన్‌కు చెందిన స్త్రీలతోడి సెక్సు సుఖాన్ని అనుభవించటానికే ఎషియన్స్ యుద్ధాన్ని విడువకుండా సాగించినట్లు హోమర్ వ్రాసిన ఇలియడ్‌లో ఉన్నది. విజేతలంతా ఇలాగే ప్రవర్తించని సందర్భాలు కూడా చరిత్రలో ఉన్నాయి. అలెగ్జాండర్, డెరియస్‌ను ఓడించి, వారి స్త్రీలను చెరబట్టినా, వారిమీద

దురాచారానికి అతడు దిగలేదు. అలెగ్జాండర్ నపుంసకుడయి ఉండటం వలననే ఇలా చేశాడని ఆ కాలపు వారు అనుమానించారు. పట్టుబడిన స్త్రీలలో అత్యంత సౌందర్యవతి అయిన స్త్రీని సిపియో ఆఫ్రికనీస్‌కు అప్పగిస్తే, అతడు ఆవిడను అనుభవించలేదట! అందుకు అతడిని అందరూ ప్రశంసించారట. 1631 వ సంవత్సరంలో జర్మనీలోని మెగ్డెబర్గ్ పతనమయినపుడు, నగరంలోని స్త్రీల విలాపం పెద్దపెట్టున వినవచ్చిందట. ఆ నగరపు స్త్రీలు యుద్ధంలో పాల్గొనకపోయినా వారు అత్యాచారాలకు గురికాక తప్ప లేదు ఇలాంటి దురాగతాలను తప్పించుకోవటానికి, శత్రువుకు లొంగిపోయినా, ఓడినవారి స్త్రీల మీద దురాగతాలు జరుగవన్న నమ్మకం కూడా లేదు

ఓడినపుడు, స్త్రీల మీద అత్యాచారాలు జరిగే అవకాశ ముంటుందని తెలిసి కూడా, స్త్రీలు తిరుగుబాట్లలోనూ, పలురకాల సాయుధ పోరాటాలలోనూ పాల్గొన్నట్లు చరిత్ర చెబుతున్నది. వర్తమాన కాలంలో తిరుగుబాట్లలో గాని, సాయుధ పోరాటాలలో గాని పాల్గొన్నవారిని ప్రభుత్వం నేరస్తులుగానే పరిగణిస్తుంది. ఖైదీగా పట్టుబడిన సైనికునికి లభించే చట్టపరమైన భద్రత వీరికి లభించదు. అందుచేత వారిని దయాదాక్షిణ్యాలు లేకుండా హింసించే అవకాశా లున్నాయి. సైనిక నియంతృత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న అర్జెంటీనా గెరిల్లా దళాలలోని స్త్రీలు పట్టుబడినపుడు, వారిని సైన్యం తిరుగుబాటుదారులుగా భావించింది. పట్టుబడిన సైనికులుగా వారిని పరిగణించలేదు. సైన్యం వారిని చిత్రహింసలకు గురిచేసింది. లాటిన్ అమెరికాలో ఇలాంటి సంఘటనలు కొల్లలుగా మనకు కనిపిస్తాయి. ఇలాంటి స్థితి ఇంకా మెక్సికో, కొలంబియా, ఎల్ సాల్వెడార్ వంటి దేశాలలో కొనసాగుతూనే ఉన్నది. న్యూటెస్టమెంట్ కాలం నుండి నెపోలియన్‌కు వ్యతిరేకంగా స్పెయిన్‌లో తిరుగుబాటు జరిగే కాలం వరకూ, పలురకాల సాయుధ తిరుగుబాట్లలో స్త్రీలు పాల్గొనటమే గాదు, అత్యంత ముఖ్యమైన పాత్రను వారు నిర్వహించిన సందర్భాలు కూడా మనకు చరిత్రలో కనిపిస్తాయి. బాబిలోన్‌కు వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో జ్యూల (జ్యూలను యూదులని తెలుగులో వ్యవహరిస్తున్నారు) వీరవనిత జుడిత్, శత్రుసేనానిని ప్రేమిస్తున్నట్లు నటించి, అతనితో ఒక రాత్రి గడిపి చాకచక్యంగా అతనిని చంపివేసిన సంఘటన స్త్రీల సాహసానికి, బుద్ధికుశలతకు ప్రతిబింబమని చెప్పవచ్చు. అల్జీరియా, వియత్నాం, పాలెస్టైయిన్ దేశాల స్వాతంత్ర్య పోరాటాలలో స్త్రీలు గణనీయమైన పాత్రను నిర్వహించారు. లాటిన్ అమెరికన్ పోరాటాలలో స్త్రీలు నిర్వహిస్తున్న పాత్ర గణనీయమైనది. పోరాటపటిమలోనూ, దీక్షాప్రదర్శనలోనూ, స్త్రీలు పురుషులకు ఏ మాత్రం తీసిపోలేదని చరిత్ర చాటుతున్నది.

స్త్రీ-పురుషులలో ఉన్న "తేడాలను" (భేదాలను) గురించి పలు అంశాలు ప్రచారంలో ఉన్నాయి. ఇందులో కొన్ని నిజాలున్నా, చాలా భాగం అతిశయోక్తులు, అబద్ధాలు. స్త్రీలకు కార్యదీక్షాశక్తి, తెలివితేటలు లేవనీ, ప్రతిదానిని చులకనగా చూడటం వారి కలవాటనీ, ఉబుసుపోని కబుర్లలో మునగటం వారికి సరదా అని, వాగుడే వారికి కాలక్షేపమనీ చెబుతుంటారు; తగవులమారివారనీ, అసూయాపరులని, సెక్సుకోరిక వారిలో తీరని దాహంలా ఉంటుందనీ, వారికి ఏ మాత్రం తెలివితేటలు లేవని కట్టుకథలు చెబుతూ ఉంటారు. ఇలాంటి అవాస్తవాలను చెప్పటంలో ఫ్రాయిడ్ వంటి మానసిక శాస్త్రవేత్తలూ, సెయింట్ పాల్ వంటి మతగురువులు కూడా అందెవేసిన చేతులే! ఈ దురభిప్రాయాలన్నీ, ప్రపంచ సాహిత్యంలో చోటు చేసుకున్నాయి; పురుషుల మనస్సులలో స్థిరంగా నాటుకొన్నాయి.

తమకూ, సైన్యంలో ప్రాతినిధ్యం కావాలన్న ఫెమినిస్టుల ఆందోళన గత ఇరవై సంవత్సరాలుగా సాగుతున్నది. స్త్రీలకు సైన్యంలో స్థానమీయటం సాధ్యం గాదనీ, అది అత్యంత ప్రమాదకర పరిస్థితులకు దారిదీస్తుందనీ చెప్పటానికి, పై వాదాలకు శాస్త్రీయ ప్రాతిపదికలను వెదుకుతున్నారు. ఈ విషయాల నిర్ణయానికి పలురకాల ప్రయోగాలు జరిగాయి. స్త్రీల తెలవితేటలు, ధైర్యసాహసాలు, మేథమేటిక్స్, సైన్సు వంటి శాస్త్రీయాంశాలలో వారి అధ్యయనాసక్తి వంటి విషయాలు ప్రయోగాంశాలయినాయి. ఈ పరిశోధనల ఫలితంగా, సందర్భానికి అనువయిన ఫలితాలు విడుదలయినాయి. కాని ఇవన్నీ సైన్యంలో "పురుషుల ముందు స్త్రీలు ఎందుకూ పనికిరారు" అన్న అంశాన్ని రుజువు చేయలేక పోయాయి. 20వ శతాబ్దపు యాభయ్యావ, అరవయ్యావ దశాబ్దాలలో

ఇందుకు సంబంధించిన పరిశోధనలు అధికంగా జరిగాయి ఉన్న భేదాలు ఏమిటో శాస్త్రవేత్తలు వెల్లడించారు. కాని, వాటికి ఆ కాలంలో ప్రచారం లభించలేదు. స్త్రీల జనాభా పరిమాణానికి తగినంత ప్రాతినిధ్యం సైన్యంలో తమకు ఉండాలన్న ఫెమినిస్టుల ఆందోళన తీవ్రమైన తర్వాత, స్త్రీలకు వ్యతిరేకంగా వెలువడిన పరిశోధనాంశాలకు ప్రచారం లభించటం అధికమైంది! దీనిని బట్టి, ఈ పరిశోధనా ఫలితాలు, వాస్తవాల కంటే ఈ కాలపు సాంఘిక ధోరణులను అధికంగా ప్రతిబింబిస్తున్నాయని చెప్పవలసి వస్తున్నది. (ఈ వివాదాంశాలను తర్వాత వివరంగా చూద్దాం - ర॥)

స్త్రీ పురుషుల మధ్య ప్రధానంగా కనిపించే భేదం శారీరక శక్తి పరిమాణం. దీని నిర్ణయానికి పరిశోధనలు జరుగవలసిన అవసరం లేదు సాయుధ పోరాటంలో పాల్గొనే వారు పలురకాల శారీరక బాధలను అనుభవించవలసి ఉంటుంది. కొందరు స్త్రీలు పురుషుల కంటే అన్ని విధాలుగానూ బలవంతులుగా ఉంటారు. స్త్రీలను సైన్యంలో చేర్చుకోవటానికి జరిగే పరీక్షలలో, వారి శారీరక శక్తిని పురుషుల శారీరక శక్తితో పోల్చి చూసే ప్రయత్నం, ఏ దేశంలోనూ ఇపుడు జరగటం లేదు. పురుషులతో శారీరకంగా సమంగా లేని కారణంగా, స్త్రీలను సైన్యంలో చేరటానికి అనర్హులుగా ప్రకటించటం లేదు. సోక్రటీస్ వ్రాసిన "రిపబ్లిక్" అనే రచనలో, పురుషులతో స్త్రీల శారీరక శక్తిని పోల్చి చూచి, అర్హులయిన వారినే సైన్యంలోకి తీసుకోవాలని సూచించారు ఆ సూచనను వారి సమకాలీనులే గేలి చేశారు వారి సూచన నవ్వుల పాలైంది. శారీరక శక్తిలో స్త్రీలను పురుషులతో పోల్చి వారిని సైన్యంలోకి తీసుకొంటున్నట్లయితే, పురుషాహంకారం దెబ్బతిన్న కారణంగా, పురుష సైనికులు తిరుగుబాటు చేసి ఉండేవారు! శారీరకంగా తమను మించిన "ఆడవారితో" కలిసి పనిచేయటం

"ప్రధానమంత్రి పదవా? అది ఆడవారు చేసే పనే!"

పాకిస్తాన్ ప్రధానమంత్రిగా బేనజీర్ భుట్టో తొలిసారి అధికారానికొచ్చిన రోజులవి ఆ కాలంలోనే బ్రిటిష్ ప్రభుత్వ విదేశాంగ మంత్రిగా ఉన్న సర్ గ్రిఫరీ హో, సతీ సమేతంగా పాకిస్తాన్ సందర్శనానికి వచ్చారు. వారు కరాచీ వీధిలో నడుస్తుండగా, ఆడుకొంటున్న పిల్లవాడొకడు వారి కంటబడ్డాడు. సర్‌గ్రిఫరీ భార్య ఆ పిల్లవాణ్ణి పలకరించింది. "నీవు పెరిగి పెద్దవాడివయిన తరువాత ఏమి చేస్తావు?" అని ఆవిడ ఆ పిల్లవాడిని అడిగింది. "నేను ట్రక్ డ్రైవర్ నవుతాను" అని ఆ పిల్లవాడు తడువుకోకుండా సమాధానం చెప్పాడు! ఆ పిల్లవాడు అంతటి అతి సామాన్యమైన కోరికను కోరటం చూచి ఆవిడ ఆశ్చర్యపడింది. "నీవు కూడా రాజకీయాలలో ప్రవేశించి, ఈ దేశపు ప్రధానమంత్రివి ఎందుకు కాకూడదు" అని సర్ గ్రిఫరీ భార్య అడిగింది. "అది ఆడవారు చేసే పని" అని ఆ పిల్లవాడు తడువుకోకుండా సమాధానం చెప్పాడట! (1991వ సంవత్సరంలో ఈ సంఘటన విశేష ప్రచారాన్ని పొందింది)

తినటానికి తిండి, త్రాగటానికి నీరు, విశ్రాంతికి కనీసం కునికిపాటు పడటం వంటివి కరువయ్యే పరిస్థితి వస్తుంది. అన్నింటికి మించి, మరణం అనుక్షణం వెన్నాడుతూ ఉంటుంది. సైనికులుగా యుద్ధరంగంలో బాధలు అనుభవించిన వారికి ఈ అంశాలు బాగా బోధపడతాయి. సాయుధ పోరాటంలో పాల్గొనేవారికి శరీరదార్ఢ్యము, దమ్ము (త్వరగా అలుపురాని శారీరక శక్తి) అవసరం. ఇలాంటి శక్తి సైనికులకు అలవడాలనే, వారితో బాగా డ్రిల్ చేయిస్తారు. పురుషులంతా స్త్రీల కంటే శారీరకంగా శక్తివంతులుగా ఉంటారని చెప్పటానికి వీలులేదు. పురుషుని "హోదాకు", వారి "ఔన్నత్యానికి" భంగకరం! సమాజంలో స్త్రీ, పురుషుని కంటే "దిగువ" స్థానంలో ఉంటుంది గనుక, ఆవిడ ఎంతటి ఘనకార్యాన్ని సాధించినా ఆ కార్యసాధనకు అబ్బవలసిన గౌరవం కూడా తగ్గిపోతుంది! "ఆడవారి" పనిగా దానికి ముద్రపడి పురుషులు అలాంటి కార్యసాధనకు పూనుకోవటం కూడా మానేస్తారు! ఇదంతా సమాజంలో చలామణీ అవుతున్న పురుషాధిక్యతా ప్రభావం!

స్త్రీలు "సుకుమారులనీ" "కోమలాంగులనీ" వారిని పురుషులు పదిలంగా చూస్తున్నారా? లేదు. బిడ్డలను కని

పెంచవలసిన భారాన్ని మోయటమే గాకుండా, గృహ నిర్వహణా భారాన్నంతటినీ మహిళ మోస్తున్నది. కుటుంబావసరాలకు నీరు తేవటం, వంటచెరకును సేకరించుకు రావటం "సుకుమారులు" చేసే పనులా? ఆవిడను బరువులు మోసే పశువుగానే భావిస్తునారు. మధ్య ప్రాచ్యంలోని అరబ్బుదేశాలలో, ఇల్లాలు నీటి కడవను నెత్తిని పెట్టుకొని మోస్తుండగా, భర్త కంచరగాడిద మీద ఆవిడ వెనుక వెళుతూండటం కనిపిస్తుందని ఆ ప్రాంతాలను చూచిన వారు చెబుతూంటారు! వెన్ను విరిగే వ్యవసాయపు పనులను మహిళలు చేస్తూండటాన్ని మనం చూస్తూనే ఉన్నాం స్త్రీల శరీరం కందకుండా పురుషులు చూడటం లేదు. స్త్రీల సౌకుమార్య రక్షణ కంటే, దానిని అనుభవించి ఆనందించటానికే వారు అధికంగా తాపత్రయ పడుతూంటారు.

ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని చూచినపుడు, స్త్రీలు పురుషులకంటే శారీరకంగా బలహీనులు కనుక, స్త్రీలు సైన్యంలో ఉండకూడదు అన్న వాదంలో బలం లేదని స్పష్టమవుతుంది. స్త్రీలు సైన్యంలో చేరకుండా చేయటానికి పురుషులు సూచించే సాకులు మాత్రమేనని రుజువవుతుంది. సైన్యంలో స్త్రీలకు స్థానం లేకుండా చేయటానికి గల కారణాలు మన సంస్కృతీ, సంప్రదాయం , సమాజాలలోనే ఉన్నాయి. స్త్రీలు యుద్ధరంగానికి వెళ్ళక పోవటం అనే సంప్రదాయం రూపొందటానికి మనకు తెలియని కొన్ని కారణాలు కూడా ఉండవచ్చు. వీటి పరిశీలనను తర్వాత చూద్దాం.

ప్రకృతి ధర్మాన్ని చూస్తే, కొన్ని రకాల జంతు జాతులలో సంతానోత్పత్తికి తోడ్పడిన తర్వాత, మగ జంతువు జీవితానికి సార్థకత ఉండదు అటు తర్వాత వంశాభివృద్ధిని చూచుకొనేది తల్లి. కనుక పునరుత్పత్తిలో ఆడజంతువుకు మాతృమూర్తిగా అత్యంత గౌరవనీయమూ, మహోన్నతమూ అయిన స్థానం దక్కుతుంది.

ఈ సూత్రాన్నే మనం మానవజాతికి కూడా అన్వయించి చూడవచ్చు. వంశాభివద్ధి, పటిష్ఠమైన జాతి నిర్మాణంలో స్త్రీ మహోన్నత స్థానాన్ని సాధిస్తే, అంతటి పాత్రను పురుషుడు మరొక రంగంలోనో, కొన్ని రంగాలలోనో సాధించటానికి ప్రయత్నిస్తాడన్న భావం పొటమరిస్తుంది. మతాలు, శాస్త్ర, సాంకేతిక రంగాలలో వీరి కృషి మనకు స్పష్టంగా కనిపిస్తుంది. అట్లని ఈ రంగాలలో స్త్రీల కృషిని రచయిత విస్మరిస్తున్నట్లు పాఠకులు భావించనక్కరలేదు. మార్గరెట్ మీడ్ 1950 లో "మేల్ అండ్ ఫిమేల్" అనే పుస్తకాన్ని వ్రాశారు. ఆవిడ ఈ అంశాన్ని తమ రచనలో ప్రస్తావించారు. కొన్ని సమాజాలలో పురుషుల కార్యసాధనే ఎందుకు పరిగణనకు వస్తుంది అన్న ప్రశ్నకు వారు చెప్పిన సమాధానం ఇది : "ఆయా రంగాలు పురుషులకే పరిమిత మైనవిగా సమాజం గుర్తించింది గనుక". ఈ కారణం వల్లనే, పురుషునితో సమమైన ఘనకార్యాన్ని స్త్రీ సాధించగలిగినా, పురుషునకు లభించినంతటి గౌరవం, ప్రతిష్ఠ ఆవిడకు లభించటం లేదు; ఇంతకు పూర్వమే చెప్పినట్లు, ఆ కార్యన్ని స్త్రీ సాధించిన "పాపానికి" దాని ప్రతిష్ఠ కూడా తరిగిపోతుంది. సామాజిక, సాంస్కృతిక, సంప్రదాయాల ప్రభావమే ఇందుకు కారణమని స్పష్టమవుతున్నది.

పురుషునితో సమానమైన హోదాను స్త్రీలకు ఇవ్వకపోవటం వల్లనే, ఆదికాలం నుండీ వారు చేస్తున్న పనులకు "ఆడవారి పనులుగా" ముద్రలు పడ్డాయి. శిశుపోషణ, సంరక్షణ, కుటుంబంలోని వారు అనారోగ్యం పాలయినపుడు వారు చేసే సేవలూ, దారం తీయటం, వస్త్రాలనేత వంటి సాంకేతిక పరమైన పనులకు విలువే లభించటం లేదు. చరిత్ర అంతటా ఇదే కనిపిస్తుంది. ప్రాచీన కాలంలో పాశ్చాత్య దేశాలలో, ఉన్ని నుండి నూలును తీయటాన్ని మగవారు చేయటం అత్యంత అప్రతిష్ఠాకరమైన పనిగా భావించేవారట (అది "ఆడవారి పనట"). అటువంటి పనిని మగవారు చేయవలసి వస్తే, దానిని అవమానకరమైన శిక్షగా భావించేవారట. హెరెక్లెజ్ చేసిన హత్యకు, పాపపరిహారంగా, పన్నెండు రకాల పనులను అతడు చేయాలని శిక్ష విధించారట. ఆ శిక్షలో ఒకటి ఉన్ని నుండి నూలు తీయటం! వర్తమాన సమాజంలో కూడా కొన్ని పనులకు "ఆడవారి" పనులుగా ముద్రపడ్డాయి. వంటా-వార్పుతో పాటు, నర్సింగ్, టీచింగ్, గుమాస్తా గిరుల వంటి పనులను ఇందుకు ఉదహరించవచ్చు. టీచింగుకు, గుమాస్తాగిరికి, పూర్వం ఇప్పటికంటే అధికగౌరవం ఉండేది. మహిళలు అధిక సంఖ్యలో ఈ వృత్తులలో ప్రవేశిస్తున్న తర్వాత, ఆ పదవుల గౌరవం తగ్గిపోయింది!

ఆడవారు అధిక సంఖ్యలో పనిచేసే వృత్తులకు, అవి స్త్రీల పనులుగా ఎపుడయితే ముద్రలు పడ్డాయో, నాటినుండి,

పురుషులు ఆ వృత్తులకు దూరంగా ఉండనారంభించారు ఏ మగవాడయినా, "నీవు ఆడదానివి" అంటే, దానిని అతడు అతి తీవ్రమైన అవమానంగా పరిగణిస్తాడు పదుగురు మగవారు పనిచేసేచోట ఒక స్త్రీ వచ్చి చేరితే, అది పురుషులలో మహోత్తేజానికి కారణమవుతుంది. కార్యశూరులుగా ఆవిడ దృష్టికి రావడానికి ప్రతివాడూ ఆరాటపడతాడు. స్త్రీల సంఖ్య మరికొంచెం పెరిగిందనుకోండి, అపుడు పురుషులలో ఉత్సాహం సన్నగిలి, తాము "ఆడవారితో సమానులమైనామని" బాధపడటం ప్రారంభిస్తారు. ఆ వృత్తిని వదలి మరో "మంచి" ఉద్యోగానికి వెళ్లటానికి తాపత్రయ పడతారు ఈ కారణం చేతనే, స్త్రీలు పై పోస్టులకు ఎక్కువ సంఖ్యలో పోకుండా తగిన జాగ్రత్తలు తీసుకుంటూంటారు పురుషుడు బ్యాంకు మేనేజరుగా ఉంటే, స్త్రీలు గుమాస్తాలుగానే ఉంటారు: పురుషులు పరిపాలనా సంబంధమైన ఉన్నత పదవులలో ఉంటే, స్త్రీలు గుమాస్తాలుగా, సెక్షన్ ఆఫీసర్లుగా మాత్రమే ఉంటారు వివక్ష అనేది అంకురించ కుండా ఉండాలేగాని, అంకురిస్తే అది విషవలయంగా రూపొందుతుంది. సమాజంలో పురుషుని కార్యనిర్వహణకున్న విలువ స్త్రీ చేసిన పనులకు లభించదు. చరిత్రలో కొన్ని వేల సంవత్సరాలుగా ఈ సంప్రదాయపు అమలు మనకు కనిపిస్తుంది. ఇందువల్లనే, స్త్రీలు అధిక సంఖ్యలో పనిచేసే వృత్తులకు పురుషులు రావటానికి వెనుకాడుతారు ఇందువల్ల శక్తి సామర్థ్యాలుండి, వృత్తిలో ఆరితేరిన పురుషులు ఆయా పోస్టులకు రావడం లేదన్న విషయం ఆచరణలో స్పష్టమైంది. సమర్థులు రానపుడు, ఆ పోస్టులకు ఇచ్చే జీతాలు కూడా తగ్గుతాయి. తక్కువ జీతం వచ్చే పోస్టులలో పనిచేయటం "అప్రతిష్ఠాకరం" గనుక, ప్రత్యామ్నాయ ఉపాధిని సాధించగల పురుషులు ఆ పోస్టులకు రారు ఇలా అదొక విషవలయంగా రూపొందుతుంది. ఇలాంటి పరిస్థితులలో ఏది దేనికి కారణమో చెప్పటం కూడా సాధ్యం గాదు. ఏయే వృత్తులలో ఇలా జరుగుతుంది అనేది కూడా చెప్పటం కష్టమే. కనిపించే దానిని బట్టి, స్త్రీలు అధిక సంఖ్యలో ప్రవేశించే వృత్తులలో - అవి వీధులు ఊడ్చే సఫాయి పనినుండి, ఇంజనీరింగు కాలేజిలో ఉపాధ్యాయ వృత్తి వరకూ ఏదయినాగావచ్చు-పురుషులు (శక్తి సామర్థ్యాలున్నవారు) చేరటానికి ఇష్టపడరని స్పష్టమవుతున్నది.

ఆర్థికాంశాలకూ, సామాజిక విషయాలకు వర్తింపుతున్న ఈ సూత్రమే యుద్ధానికి కూడా వర్తిస్తుంది చరిత్రలో యుద్ధాన్ని గురించి ఎరుగని సమాజమంటూ మనకు కనిపించదు. అన్ని విషయాలలో కంటే సైన్యము, యుద్ధాలకు సంబంధించిన అంశాలలో లింగ వివక్ష మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది: ఈ రంగం పురుషులకే పరిమితమైనట్లు వెల్లడవుతుంది మగటిమిని చూపగల అవకాశం పురుషునికి యుద్ధంలోనే లభిస్తుంది ఆ మగటిమి ప్రదర్శనకే యుద్ధం పురుషులను ఆహ్వానిస్తుంది: సమాజం వీరి ధైర్యసాహసాల ప్రదర్శనను ప్రోత్సహిస్తుంది. భారతదేశపు స్త్రీలు, తమ భర్తల విజయాలను, వారు వీరస్వర్గమలంకరించటాన్ని సమంగానే స్వీకరించేవారు ఖడ్గతిక్కన ఉదంతం ఈ అంశాన్ని చక్కగా చిత్రిస్తున్నది పురుషునితో యుద్ధ యోధత్వం ముడిపడింది. కొన్ని భాషలలో ఈ రెండు మాటలకూ అర్థం ఒకటిగానే ఉన్నదంటే, ఈ అనుబంధం ఎంత పటిష్ఠమైనదో ఊహించవచ్చు.

రోమన్ సామ్రాజ్య కాలంలో మాతృత్వాన్ని పొందటం స్త్రీకి ఎంత పవిత్రమైనదో, యుద్ధం చేయటం పురుషునకు అంత పవిత్రమైనదిగా పరిగణిస్తూండేవారు ఈ భావమూ, సంప్రదాయము మంచికోసం పుట్టిందో చెడుకోసం పుట్టిందో చెప్పలేము. కాని, స్త్రీలు యుద్ధంలో పాల్గొంటున్నట్లయితే, ఇపుడున్న ప్రతిష్ఠ యుద్ధానికి లభించేది గాదు: సైన్యం తన ధర్మాన్నది విజయవంతంగా నిర్వహించగలిగి ఉండేది కాదు. సైన్యపు ఏర్పాటే అంతరించి ఉండేదేమో! ఇందులో ఇసుమంత కూడా ఆశ్చర్యం లేదు. స్త్రీ సరసన చేరి పోరాడవలసిన అవసరం గాని, లేక శత్రుసైన్యంలోని స్త్రీలతో తలపడవలసిన అవసరం గాని పురుషునకు కలిగి ఉంటే, ఆ సందర్భం తన మగటిమి ప్రదర్శనకు లభించిన అవకాశంగా అతడు భావించగలిగేవాడు కాదు; ఆ యుద్ధాన్ని అర్థం లేని దానినిగా భావించి అస్త్రసన్యాసం చేసి ఉండేవాడు. పురుషుని మగటిమి, దానిమీద ఆధారపడిన సైన్యమూ అంతరించి ఉండేవి. మహాభారత యుద్ధంలో, శత్రుపక్షంలో శిఖండి కనిపించినంతనే, మహాయోధునిగా పేరొందిన భీష్మాచార్యులు అస్త్రసన్యాసం చేసి, మరణాన్ని ఆహ్వానించటం భారతీయులందరకూ తెలిసిన అంశమే.

యుద్ధం వరకూ వెళ్ళటం దేనికి. సాధారణంగా మనం

చూస్తూ ఉండే ఫుట్‌బాల్ ఆటను ఉదాహరణంగా తీసుకొని పరిశీలించుదాం (ఇలాంటి ఆటల్లో, స్త్రీ పురుషులు కలిసిన టీములుండవు. ఇలాంటి కలయిక, బాడ్మింటన్, పింగ్‌పాంగ్, టెన్నిస్‌లకే పరిమితమైంది). మహిళా టీముల ఆటను చూసినంత ఆసక్తితో స్త్రీ పురుషులు కలిసి ఆడే ఆటను చూసి ప్రేక్షకులు ఆనందించలేరు. స్త్రీ పురుషులను సమాన ఉజ్జీలుగా పరిగణించలేని మనస్తత్వమే ఇందుకు కారణం. తన శారీరక శక్తినీ, నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ, పురుషుడు, స్త్రీ కంట్రోలు చేస్తున్న బంతిని తీసుకొన బోయినపుడు, సామాజికులు ఆ ఆటగాడిని ప్రశంసించరు, పైగా "ఆడపిల్ల దగ్గర బంతిని లాక్కుపోవడం గొప్పా" అని ఈసడిస్తారు. ఓడిపోతే, "ఆడవారి చేతిలో ఓడిన వారిగా" మగవారికి ముద్రపడుతుంది; వారు అపహాస్యం పాలవుతారు. ఇందువల్ల పురుషులు నిస్పృహకు గురవుతారు స్త్రీ - పురుషులు కలిసిన టీముల ఏర్పాటు జరగటానికి తగిన శాసనమేదయినా వస్తే, ఎంతటి పెద్ద ఆటగాడయినా ఆ టీములో చేరనొల్లడనటం అతిశయోక్తి గాదు ఇందువల్ల క్రమంగా ఆ ఆట అంతరించవచ్చు. ఈ సత్యమే సైన్యంలో స్త్రీల ప్రవేశానికి వర్తిస్తుంది.

## చారిత్రకానుభవం

తిరుగుబాట్లలోనూ, స్వాతంత్ర్య పోరాటాలలోనూ స్త్రీ పురుషులు కలిసి పోరాడిన సంఘటనలు చరిత్రలో అసంఖ్యాకంగా కనుపిస్తాయి ఈ సాయుధ పోరాటాలలో స్త్రీలకు స్థానం ఎలా లభించింది? యుద్ధసామగ్రితో సమాయత్తమై, బలవత్తర మైన సైనికశక్తిని మాత్రమే గాకుండా, స్థానిక పోలీసు బలగాలను, వారి తాబేదారులను స్వాతంత్ర్య యోధులుగాని, తిరుగుబాటు దారులుగాని ఎదుర్కొనవలసి ఉంటుంది. రెండు సైనిక దళాల మధ్య జరిగే యుద్ధం ఆటల పోటీల వంటిదైతే, తిరుగుబాటు గాని, స్వాతంత్ర్య పోరాటం గాని జీవన్మరణ పోరాటం వంటిది. అందిన ప్రతి ఆధారం విజయసాధనలో పరిగణనకు వస్తుంది. ఇది కొన్ని నియమిత సూత్రాల ప్రాతిపదిక మీద జరిగే పోరాటం గాదు. ఇలాంటి ఉద్రేక పూరిత వాతావరణంలో స్త్రీ పురుష భేదం మరుగున బడుతుంది. దేశానికి దురాక్రమణ ప్రమాదం ఏర్పడినప్పుడు కూడా ఇలా జరుగుతుంది. విజయ సాధన తర్వాత ఈ భేదం తిరిగి తలయెత్తుతుంది! స్త్రీలను యథాస్థానానికి పంపేస్తారు! పోరాటంలో స్త్రీలు తమ పోరాట పటిమ చూపలేకపోయిన దోషానికి కాదు, వారికీ "శిక్ష"; సైన్యంలో స్త్రీకి స్థానం ఉండకూడదన్న భావమే ఇందుకు కారణం.

చరిత్రలో ఇటువంటి సంఘటనలు మనకు అనేకం కనుపిస్తాయి. ఫ్రెంచి విప్లవ చరిత్రను అధ్యయనం చేస్తున్న ఫ్రెంచి చరిత్రకారిణిని డొమినిక్ గొడినో విప్లవ పరిణామాన్ని వివరిస్తూ ఇలా వ్రాశారు: "ఫ్రెంచి విప్లవ కాలంలో పాతకొత్తల కలయిక జరిగింది. ఇది ఆ కాలపు ఆసక్తిదాయకమైన పరిణామం; కొన్ని దశాబ్దాల పాతకాలపు సంప్రదాయం, భవిష్యత్పరిణామాల కలయిక ఈ విప్లవ కాలంలో జరిగింది. 15 వందల నుండి 18 వందల సంవత్సరం వరకూ యూరపులో-ఆమ్‌స్టర్‌డాం నుండి నేపుల్స్ నగరం వరకూ స్త్రీలు, పురుషులను తిరుగుబాటుకు ప్రోత్సహించటం కనుపిస్తుంది. ఎంతోకాలంగా అమలులోనున్న ఈసంప్రదాయం నుండి ఫ్రెంచి విప్లవ నినాదం పుట్టింది. డప్పులు (డ్రమ్స్) కొట్టటం, విచిత్ర వేషాల ప్రదర్శన ద్వారా అధికార వర్గాన్ని అపహాస్యం పాలుచేయటం, స్త్రీలను కార్యాచరణకు పురికొల్పటం ఆ కాలపు స్త్రీలు పాటించిన సంప్రదాయం. ఫ్రెంచి విప్లవ కాలంలో ఇలాంటి ప్రదర్శనలను స్త్రీలు నిర్వహిస్తూ, పురుషులను విప్లవ కార్యాచరణకు ప్రేరేపించారు. ఫ్రెంచి విప్లవంలో పాల్గొన్న విప్లవకారిణి నూతన రూపాన్ని దాల్చింది. మానవ హక్కుల ప్రకటనను చేబట్టి పురోగమించసాగింది. చట్ట సభలలో కూర్చుండే అధికారం సర్వంసహాధికారాన్ని పొందిన పౌరులకు లభించినట్లు ప్రకటించింది. సంప్రదాయం ఆవిడకు కేటాయించిన పాత్రను నిర్వహిస్తూనే, నూతనరంగంలో ప్రవేశించే అవకాశాన్ని విప్లవం స్త్రీకి ప్రసాదించింది కాని, ఈ నూతన రంగాన్ని (చట్ట సభను), పురుషులు తమ కోసం నిర్మించుకొన్నారు. కొంతకాలం "పౌరులు"గా - మాటవరుసకైనా పిలిపించుకోనే అవకాశం స్త్రీలకు లభించినా, ఇతర దేశాలలోని స్త్రీలవలె వారికి కూడా చట్టబద్ధమైన పౌరసత్వం లభించలేదు.

"తిరుగుబాటు కంటే విప్లవం గొప్పది. 1789వ సంవత్సరానికి ప్రజలకీ విషయం అవగతమైంది. విప్లవ నిర్వహణకు నిర్మాణయుతమైన ప్రాతిపదిక అవసరం ఈ విప్లవాంగాల నిర్మాణంలో స్త్రీలకు స్థానం లభించలేదు. సైన్యంలోగాని, చట్టసభలలోగాని, చివరకు స్థానిక

సంస్థలలోగాని, రాజకీయ గ్రూపులలోగాని చేరే అవకాశం పేరికి లేకుండా పోయింది ఈ విప్లవ పరిణామ క్రమంలో. స్త్రీ-పురుష సంబంధాలు మారిపోయాయి అకస్మాత్తుగా సంభవించిన తిరుగుబాట్ల ప్రజ్వలనకు స్త్రీలు కారకులయినా. విప్లవ నిర్వహణాంగాలలో స్త్రీలకు ప్రాతినిధ్యం లభించలేదు" (హిస్టరీ ఆఫ్ ఉమెన్, నాల్గవ సంపుటం పేజీలు 17-18)

ఇరవయ్యవ శతాబ్దపు మహిళా చరిత్ర మీద పరిశోధనలు కొనసాగిస్తున్న మరొక ఫ్రెంచి చరిత్రకారిణి ఫ్రాంకోస్ థెబడ్ ఇలా వ్రాశారు "జేమ్స్ ఎఫ్. మాక్మిలన్ 1977లో ప్రచురించిన "హౌస్ వైఫ్ ఆర్ హెర్లాట్ ది ప్లేస్ ఆఫ్ ఉమెన్ ఇన్ ఫ్రెంచ్ సొసైటీ - 1870-1940" అన్న రచనలో సెక్సు విషయంలో ఫ్రెంచి వారి ఛాందసభావ (కన్సర్వేటిజం యొక్క) పటుత్వాన్ని గమనించాలని సూచించారు యుద్ధాలు ఫ్రెంచి మహిళలను ఇల్లాండ్రుగానూ. మాతృమూర్తులుగానూ మరింత స్పష్టంగా చిత్రించినట్లు ఈ రచయిత్రి వివరించారు. 20వ శతాబ్దపు ఎనభయ్యవ దశాబ్దంలో చారిత్రక రచనలను చేసిన యువ చరిత్రకారులు కూడా యుద్ధాలు స్త్రీల విముక్తికి తోడ్పడ్డాయి అనే అభిప్రాయాన్ని సవాలు చేశారు. ఈ కాలపు రచనలను జాగ్రత్తగా చదివితే, స్త్రీ పురుష సంబంధాలలో వచ్చిన మార్పులు తాత్కాలికాలనీ, పై పూతల వంటివనీ స్పష్టమవుతుంది. యుద్ధకాలంలో వచ్చిన విప్లవాత్మక మార్పులు, మామూలు పరిస్థితులేర్పడగానే తిరిగి యథాస్థాయికి వచ్చాయి. స్త్రీ విముక్తి అనేది భ్రమగా మాత్రమే మిగిలిపోయింది. ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభ దశలో యూరపును ముంచెత్తుతున్న స్త్రీ విముక్తి ఉద్యమ పురోగతిని, యుద్ధం ఆపివేసిందని చెప్పవచ్చు .... యుద్ధ ప్రారంభ కాలానికి ముందు దెబ్బతింటున్న పురుషాధిక్యతా భావాన్ని యుద్ధం కాపాడింది; బలపరచింది; మహిళలను యథాస్థానాలకు పంపి, సమృద్ధిగా సంతానాన్ని కనే తల్లులుగానూ, "బాధ్యతాయుతంగా" మెలిగే ఇల్లాండ్రుగాను వారిని మార్చివేసింది. యుద్ధం వారికి ఎంత మేరకయినా విముక్తిని ప్రసాదించి ఉంటే, అది వారిని మరింత సమర్థులైన గృహనిర్వాహకులుగాను, బాధ్యతల నెరిగిన సంసారులుగా, భర్తలు మెచ్చగల భార్యలుగా చేయటానికే ఉపకరించింది." (హిస్టరీ ఆఫ్ ఉమెన్, ఐదవ సంపుటం, 23వ పేజి)

పై పుస్తకపు ఐదవ సంపుటపు సంకలనాన్ని నిర్వహించిన చరిత్రకారిణి ఫ్రాంకోస్ థెబడ్. ఈ సంపుటానికి పరిచయాన్ని వ్రాస్తూ స్వాతంత్ర్యసాధన కోసం జరిగే విముక్తి పోరాటం తర్వాత స్త్రీల స్థితి ఎలా యథాస్థానానికి వస్తుందో వివరించారు: "యుద్ధం సంప్రదాయంగా పురుష వ్యాపారంగా పరిగణనకు వస్తున్నది. అందులో మగటిమి ప్రదర్శన అవసరం గావటమే ఇందుకు కారణం గావచ్చు ఆధునిక యుద్ధంలో, యుద్ధరంగానికి ఎంతగా బలాలను సమీకరించాలో, వెనుక కూడా అంతగా బలపరచుకోవలసి ఉంటుంది. ఇందువల్ల యుద్ధం స్త్రీ పురుషులను సమాన పాత్రధారులనుగా చేస్తున్నది. యుద్ధరంగంలో మరణప్రమాద ముంటుంది, యుద్ధరంగానికి వెనుక భాగంలో కూడా మరణానికి మించిన ప్రమాదాలుంటాయి.

"ఈ యుద్ధంలో స్త్రీ పురుషులిద్దరూ సమాన భాగస్వాములవుతారు అయినా యుద్ధపు ముగింపు అభివృద్ధికరమైన మార్పులకు తోడ్పడటానికి బదులు ఛాందస భావాలనూ, అభివృద్ధి నిరోధక విధానాల స్థిరీకరణనూ బలపరుస్తుంది. ఫ్రెంచి విప్లవంలోనూ, స్పెయిన్ అంతర్యుద్ధంలోనూ అత్యధిక సంఖ్యలో మహిళలు పాల్గొన్నారు, ఎందరో మరణించారు; చాలామందికి దేశ బహిష్కారం సంప్రాప్తించింది. ఇంతటి త్యాగాలను మహిళలు చేసినా, వారికి యుద్ధ నిర్వహణా బాధ్యతలు మాత్రం లభించలేదు; ఆ పోరాటపు ఖ్యాతి కూడా వారికి లభించలేదు. ప్రజల సాయుధపోరాటం, శత్రుదళాలతో ప్రత్యక్షంగా తలపడే దశకు చేరుకొన్న తర్వాత, విముక్తి ఉద్యమం సైనిక దళాలను ఏర్పాటు చేసింది. ఈ నిర్మాణంలో స్త్రీలకు నాయకత్వ పాత్ర లభించలేదు! పోరాటం ఆగిపోగానే, వారు నిర్వహించవలసిన "మహోన్నత పాత్రను" స్త్రీలకు గుర్తు చేస్తారు. (ఇంటికి వెళ్ళి ఇల్లు చక్క బెట్టమని చెబుతారని రచయిత్రి భావన) మామూలు యుద్ధాల ముగింపు తర్వాతే ఇలా జరిగిందని భావించనవసరం లేదు; స్వాతంత్ర్యం కోసం జరిగిన సాయుధ పోరాటాల అనంతరం కూడా ఇలాగే జరిగింది. ఈ సూత్రపు అమలు విషయంలో మాత్రం ఈ రెండు రకాల యుద్ధాలకు తేడా లేదు. యుద్ధంలో పాల్గొనటం వలన, దానిలో పాల్గొన్న స్త్రీల ప్రవర్తనలో కొన్ని మార్పులు రావచ్చు.

ఉదాహరణకు, అల్జీరియా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న మహిళలు, ఇందులో పాల్గొనని తోటి మహిళల కంటె తక్కువ మంది పిల్లలను కన్నారు. యుద్ధంలో స్త్రీలు పాల్గొనటం వలన ఇలాంటి ప్రవర్తనా సంబంధమైన మార్పులు స్త్రీలలో సంభవించాయేగాని, స్త్రీ పురుష సంబంధాలలో సమూలమైన మార్పులు మాత్రం రాలేదు."

మార్టిన్ వాన్ క్రివెల్డ్ జెరూసలెంలోని హెబ్రూ విశ్వవిద్యాలయంలో యుద్ధ చరిత్రకోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. సైనిక చరిత్రాధ్యయనంలో దిట్టగా వీరికి అంతర్జాతీయ ఖ్యాతి ఉన్నది. వీరు వ్రాసిన "ది ట్రాన్స్‌ఫర్మేషన్ ఆఫ్ వార్" అన్న పుస్తకంలో స్త్రీ పురుష మిశ్రమదళాల నిర్మాణానుభవాన్ని గురించి ఇలా వ్రాశారు "…. సాయుధ పోరాటాన్ని సాగించే తిరుగుబాటుదారులు, శక్తివంతము, నిర్మాణయుతము అయిన సైనిక, పోలీసు బలగాలతో తలపడవలసి వచ్చినపుడు, స్త్రీలను కూడా పోరాటంలో పాల్గొననీయవలసి వస్తుంది. వీరు పోరాటంలో పాల్గొనటంవలన, పురుషుల కృషి ప్రతిష్ఠకు ఏ మాత్రం ప్రమాదం వాటిల్లకుండా తగిన జాగ్రత్తలను తీసుకుంటారు. విజయ సాధన తర్వాత, పోరాటపటిమా ప్రదర్శనలో స్త్రీ పురుష భేదాల పరిగణనకు అంతగా ప్రాధాన్యత లభించదు. పోరాటంలో పాల్గొన్న స్త్రీలు ఎలాంటి పొరపాట్లను చేయకపోయినా, తిరిగి వారిని యథాస్థానానికి పంపిస్తారు. ఈ విషయంలో దయా దాక్షిణ్యాలకు చోటుండదు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడిన, ఇజ్రాయెల్ ప్రజలు స్వరాజ్యసాధనకోసం, రహస్యంగా సాయుధదళాలను నిర్మించి పోరాటాన్ని సాగించారు. ఇందులో యువతీ యువకులు ప్రధానపాత్రను నిర్వహించారు. ఈ దళాలను "పాల్‌మాక్" అని పిలిచేవారు. నేటి ఇజ్రాయెల్ సైన్యం ఈ వలంటీరు దళాల నుండి ఆవిర్భవించింది. ప్రపంచంలో సాయుధపోరాటాన్ని సాగించిన ఏ దళాలలోనూ స్త్రీ పురుషుల కలయిక ఇంత చక్కగా ఉన్నట్లు కనిపించదు. ఇటువంటి సుసంఘటిత దళాల నిర్మాణం ఇంతకు పూర్వంగాని, అటు తర్వాతగాని మనకు కనిపించదు. ఇది అవధ్యశమని చెప్పవచ్చు. దళాలలోని స్త్రీ పురుషులు కలిసి పనిచేశారు; కలిసి శిక్షణ పొందారు; ఒకదాని సరసన మరొకటి ఉన్న టెంట్లలో నివశించారు. స్నానపు గదిలో ఒక రేకును అడ్డం పెట్టుకొని, స్త్రీ పురుషులు స్నానాలు చేశారు! సైనిక చర్యలలో పురుషుల వెంట స్త్రీలు వెళ్లేవారు. రహస్యంగా శత్రు సమాచారాన్ని సేకరించటం, ఆ వార్తలను తమ దళాలకు చేరవేయటం వంటి సాహసోపేతమైన కార్యసాధనకు దళాలలోని స్త్రీ సభ్యులు పనిచేశారు.

"బ్రిటిష్ వారు వెళ్ళిపోయిన తర్వాత ఇజ్రాయెల్ స్వాతంత్ర్య పోరాటం ప్రారంభమైంది. ఇంతవరకూ రహస్యంగా ఉండి పోరాటాన్ని సాగిస్తున్న దళాలు బయటికి వచ్చి తమ కార్యక్రమాన్ని నిర్వహించసాగాయి. ఈ సైనిక దళాలకు "ఇజ్రాయెల్ డిఫెన్స్ ఫోర్సెస్"గా నామకరణం జరిగింది. ఈ ఏర్పాటు తర్వాత, మహిళలను దళాలనుండి పంపివేశారు. ఇజ్రాయెల్ సైనిక దళాలలో స్త్రీలు కూడా పోరాడుతున్నట్లు అరబ్బు దేశాలలో జరిగిన ప్రచారంలో ఏ మాత్రం సత్యం లేదు. 1948 యుద్ధం తర్వాత కూడా స్త్రీలను సైన్యంలోకి తీసుకొంటున్నారు. అయితే వారిని సంప్రదాయంగా స్త్రీలకు లభించే కార్యదర్శి, టెలిఫోను ఆపరేటరు, సోషల్ వర్కర్స్ వంటి పోస్టులకి పరిమితం చేశారు. ఇజ్రాయిల్ జానపద సాహిత్యంలో, స్త్రీలు టీ తయారుచేసి అందించే వారుగా చిత్రితమైనారు. ఈ సంప్రదాయానుసారంగానే ఇలా జరిగింది. ఆఫీసరు పోస్టులలో ఉన్న మహిళలను మాత్రం పంపివేయలేదు. వీరిని దండచేతికి పదవీ స్థాయిని సూచించే బ్యాడ్జిని పెట్టుకోనిచ్చేవారు; పేరాచూట్‌లో సైనికుడు దిగగానే దాన్ని మడిచి ఆ దిగిన సైనిక సోదరుని ఆ స్త్రీ సైనికాధికారి ముద్దు పెట్టుకోవలసి ఉండేది. ఆవిడ ముద్దు, ఆ సైనికుడు చూపిన సాహసానికి బహుమానం! స్త్రీ ఆఫీసర్లు ఈ బాధ్యతా నిర్వహణతోనే సంతృప్తి పడేవారు. అందమైన యువతులు ఆయుధాలను శుభ్రపరుస్తున్నట్లు వార్తా పత్రికలలో ప్రచురితమవుతున్న చిత్రాలు చూపరులను తప్పుదారి పట్టిస్తున్నాయి. ఇజ్రాయెల్ సైన్యంలో స్త్రీలకు సాయుధ శిక్షణ నీయటం, సంప్రదాయానుసరణే తప్ప, వారిని యోధులుగా రూపొందించటానికి కాదు. వారి చేతులలో ఉన్న ఆయుధాల స్వభావాన్ని గుర్తించగలిగితే, అసలు విషయం బట్ట బయలవుతుంది. వారి చేతిలో కనిపించే ఆయుధాలు, కాలం తీరటం వలన, పురుషులు వాడటం మానివేసినవో, లేక, అవి ఆధునికమైనవయి ఉంటే, పురుషుల వాడకానికి సరిపోగా, సమృద్ధిగా మిగిలినవో అయి ఉంటాయి!

"ఆరబ్ - ఇజ్రాయెల్ యుద్ధం 1973వ సంవత్సరం అక్టోబరు మాసంలో ప్రారంభమైంది ఇందువల్ల ఇజ్రాయెల్ సైనిక దళాల సంఖ్యను వీలయినంతగా పెంచవలసిన అవసరం గలిగింది: సైనికుల సంఖ్యను పెంచటం మాత్రమే గాక, వారికి పటిష్ఠమైన శిక్షణను కూడా ఇవ్వవలసిన అవసరం గలిగింది దేశజనాభాయే తక్కువ గనుక, వీలయినంత మందిని సైన్యంలోకి తీసు కోవలసిన అవసరం కూడా కలిగింది. ఇటువంటి అత్యవసర పరిస్థితులలో, స్త్రీలను అదనపు బాధ్యతాయుత స్థానాలలో నియమించే ప్రయత్నాలు పలుసార్లు జరిగాయి. పురుషుల ప్రాథమిక శిక్షణా కాలంలో స్త్రీలు వారికి కమాండర్లుగా పనిచేశారు; లేదా స్వయంచలిత భారీ హోవిడ్జర్స్‌ను ఆపరేట్ చేయటం నేర్పేవారు. కొంత అనుభవం తర్వాత, స్త్రీలు ఈ పనులలో కంటే టెక్నీషియన్సుగా, కమ్యూనికేటర్స్‌గా, సాంకేతికపరమైన కంప్యూటర్లు, రేడారు ఆపరేటర్సుగా పురుషులకంటె బాగా ఉపకరిస్తారని, వారిని ఈ పనులకు నియమించసాగారు. ఏమైనా వారు అత్యంత ప్రశంసనీయమైన కృషి చేశారు ఇందువల్ల ప్రమోషన్లు పొంది, స్త్రీలు 1980వ సంవత్సరానికి, అన్ని రాంకులలోనూ కనిపించసాగారు కొందరు మహిళలు బ్రిగేడియర్ జనరల్ పోస్టువరకూ కూడా వచ్చారు. ఈ ప్రయోగ ఫలితంగా, ఇజ్రాయెల్ సైన్యం సాంఘిక నష్టాన్ని అనుభవించక తప్పలేదు. స్త్రీ సైనికులకు అధమస్థాయి జాబ్సును కూడా ఇచ్చారు. అయినా, వారు చేసే పనులకు 'ఆడవారి పనులుగా' ముద్రలు వేసి, ఆ పనులు చేయవలసి వచ్చే ఉద్యోగాలకు పురుషులు రావటం మానేశారు! ఇందువల్ల ఇజ్రాయెల్ డిఫెన్స్ ఫోర్సెస్ తీవ్రంగా నష్టపడ్డాయి. ఈ కారణం చేత మాత్రమే కాదు, కొన్ని కారణాల కలయిక వలన ఇజ్రాయెల్ సైన్యపు సాంఘిక ప్రతిష్ఠ దెబ్బతిన్నది. కార్యదక్షులు, సాహసులు అయిన పురుషులను సైన్యం ఆకర్షించలేకపోయింది. ఇతర కారణాలేమైనా, స్త్రీలు అధిక సంఖ్యలో, సైన్యంలోని అన్ని స్థాయిలలోనూ ఉండటమే ఇందుకు ప్రధాన కారణమై ఉంటుంది.

"ప్రపంచ చరిత్రనంతటినీ తరచి చూస్తే, స్త్రీలు, పురుష వేషాలు ధరించి పోరాటాలలో కొన్ని మాసాలో, కొన్ని సంవత్సరాల కాలమో పాల్గొన్న సంఘటనలు మనకు అతి కొద్దిగా మాత్రమే కనిపిస్తాయి. ఇలాంటివారు ధైర్యసాహసాల ప్రదర్శనలో పురుషులకు ఏ మాత్రము తీసిపోలేదు వీరు స్త్రీలని తేలినవెంటనే, పురుష సేనానులు, వారిని దళాల నుండి తొలగించేవారు ఇందుకు కారణం, వారు పురుషులతో సమంగా పోరాడలేకపోవటం కాదు. స్త్రీ తమ సరసన పోరాడటం పరువు తక్కువని పురుష సైనికులు భావించటమే. సాయుధ తిరుగుబాట్లలో స్త్రీలుండటం అధికంగానే కనిపిస్తుంది కాని పురుషవేషాలతో స్త్రీలే సైనిక దళాలుగా బాహా బాహీ శత్రువుతో తలపడిన సంఘటనలు మనకు కాల్పనిక గాథలలో మాత్రమే కనిపిస్తాయి." (ది ట్రాన్స్‌ఫర్మేషన్ ఆఫ్ వార్, 183-185 పేజీలు)

వర్తమాన కాలంలో సైన్యంలో చేరిన స్త్రీల వస్త్రధారణ, అలంకరణల మీద శాసనబద్ధమైన కొన్ని నియమాలను అమలు జరుపుతున్నారు ఉదాహరణకు జుట్టును పొడవుగా పెంచకూడదు. తొడలు కనబడేంత పొట్టి ఫ్రాకులను గాని, స్కర్టులను గాని వారు వాడకూడదు. నగలు పెట్టకోవడం, మేకప్‌చేసుకోవటం నిషిద్ధం. పురుష సైనికులతోకలిసి తిరగటం మీద కూడా తీవ్రమైన పరిమితులను అమలు జరుపుతున్నారు. స్త్రీ పురుష సైనికులిరువురూ రాత్రి వేళల ఒక గదిలో గడపరాదన్న నియమం ఇజ్రాయెల్ సైన్యంలోఉన్నది. కమాండర్లు, స్త్రీ సైనికులను సెక్సుపరమైన వేధింపులకు గురిచేయకూడదు పురుషుల నివాసాలకు దూరంగా స్త్రీ సైనికుల క్వార్టర్సు ఉంటాయి. సైన్యంలో పనిచేస్తున్న పురుషడాక్టర్లు స్త్రీ సైనికులపై వైద్య పరీక్షలను జరుపకూడదు. ఇలాగే మిలటరీ పోలీసులుగా పనిచేస్తున్న పురుషులు స్త్రీ సైనికులను తాకకూడదు. స్త్రీ సైనికులకు మానభంగ ప్రమాదాలు గాని, లేక అక్రమ సెక్సు సంబంధాల ఏర్పాటు ప్రమాదంగాని ఉంటుందన్న భావం ఈ క్రమశిక్షణా సూత్రాలను రూపొందించిన వారి మనసులో ఉండి ఉంటుందని వేరుగా వివరించనవసరం లేదు.

తాను స్త్రీ సైనికులతోకలిసి పనిచేస్తున్నాను అన్న భావాన్ని పురుషసైనికుడు మరిచిపోవలసి ఉంటుంది. సెక్సు ప్రస్తావన రాకూడదు. ఈ నియమాలు ఒక్కొక్కసారి, సైన్యంలో సంఘటిత శక్తి సాధనకు, స్త్రీ పురుషసైనికుల పరస్పర సహకారానికి అవరోధాలుగా ఉంటున్నాయన్న అభిప్రాయం కూడా ఉన్నది. అధికార పూర్వకమైన పనిమీద తప్ప, వ్యక్తిగత కారణాలతో పురుషసైనికులు స్త్రీ సైనికులను కలియకూడదు

అన్న సూత్రం, పరస్పరావగాహనకు దారిదీయకపోగా, ఈర్ష్యా వైషమ్యాలకు దారితీసే ప్రమాదం ఉంటుంది.

సాంఘికాంగాలలో సైన్యం కూడా ఒకటి గనుక, సంఘానికి అన్వయించే సూత్రాలే దీనికి కూడా అన్వయిస్తాయి. ఇతర సంఘ నిర్మాణాలలో కంటే, సైన్యంలో సంఘటిత శక్తి సాధనకు అత్యంత ప్రాధాన్యత లభిస్తుంది. ఈ శక్తి లేకుండా యుద్ధంలో విజయసాధన సాధ్యం కాదు. యుద్ధరంగంలో, మృత్యు ప్రమాదం ముంచుకొస్తున్నా "నీవు" "నేను" అనే భావాన్ని వదలి "మన మందరం" అన్న భావాన్ని ప్రదర్శించిన సైన్యాలే ప్రపంచంలో అత్యుత్తమ పోరాటదళాలుగా నిరూపితమైనాయి. "కష్టాన్నైనా, సుఖాన్నైనా మనమంతా సమంగా పంచుకోవాలి" అన్న భావం సైనిక దళాలలో పెంపొందాలి జీవశాస్త్ర దృష్టితో చూచినా, సాంఘిక దృష్టితో చూచినా, స్త్రీ పురుష సంబంధం పూర్తిగా వ్యక్తిగత వ్యవహారంగానే కనిపిస్తుంది. పైగా అది అసహజమైనదేమీ కాదు. ఇది పూర్తిగా "నేను" "నీవు" అన్న భావానికి పరిమితమైన సంబంధం. ఇది చరిత్ర అంతటా కనివిన్నంది. యుద్ధరంగంలో పోరాడే దళంలో ఇలాంటి వ్యక్తిగత సంబంధానికి గాని, అనుబంధానికిగాని తావుండకూడదు. "మనమంతా ఒకటి" అన్న భావం వ్యక్తిగత భావాన్ని, అనుబంధాన్ని అధిగమించగలగాలి. అపుడే దళం సంఘటిత శక్తిగా శత్రుదళాలతో తలపడి విజయాన్ని సాధించటమో, వీరస్వర్గాన్ని అలంకరించటమో జరుగుతుంది. వారు మృత్యుంజయులుగా పేరొందుతారు.

చరిత్ర పుటలను తిరగవేస్తే, స్త్రీ పురుష సమానత్వం మనకు ఏ సమాజంలోనూ కనుపించదు. ఈనాటికీ కొన్ని గిరిజన జాతులలో స్త్రీ పురుష సంబంధాలు మనకు అర్థంగానంత గజిబిజిగా ఉంటాయి, విచిత్రంగా కూడా కనుపిస్తాయి. ఇప్పటికీ పురుషుడు పలువురు స్త్రీలతో సెక్సు సంబంధాలను కలిగి ఉండటం, స్త్రీ కూడా పలువురు పురుషులతో సెక్సు సంబంధాలను పెట్టకోవటం కనుపిస్తుంది. భార్యను తాకట్టు పెట్టటం లేక అమ్మటం వంటి సంఘటనలు, పరిమితంగానైనా కనుపిస్తాయి. నాగరిక సమాజాలలోనూ ఇటువంటి కొన్ని ధోరణులు మనకు కనుపిస్తాయి. ఏకపత్నీవ్రతం, లేక ఏక భర్తృత్వం - వంటి వాటిని నూటికి నూరు మంది సామాజికులు పాటించటం మాత్రం జరగటం లేదు. స్త్రీ పురుషులను సమంగా చూస్తున్న సమాజం నాగరిక ప్రపంచంలో కూడా మనకు కనుపించదు. సెక్సు సంబంధాలు పూర్తిగా వ్యక్తిగతమైనవి; సైనికదళ పటిష్ఠత, సంఘటితశక్తి, సామాజిక ప్రయోజనానికి సంబంధించినది. స్త్రీలు పురుషులతో సమానమైన పరిమాణంలో ఉండటం వలన, ఈ రెండు భిన్న లక్ష్యాల మధ్య తీవ్రమైన వైరుధ్యం ఏర్పడుతుంది. ఈ వైరుధ్యం అంకురించకుండా ఉండాలంటే, పురుషులు తమ పుంసత్వ సూచనలను తొలగించుకోవాలి, అలాగే స్త్రీలు కూడా తమ స్త్రీత్వాన్ని తొలగించుకోవాలి. ఈ పనులకు పురుషులే కాదు, స్త్రీలు కూడా అంగీకరించరు. ఈ వైరుధ్య ప్రదర్శనకు అవకాశం కలుగనంత మేరకే స్త్రీలను సైన్యంలోకి తీసుకొంటున్నారు; తీసుకొన్నవారికి కూడా, యుద్ధరంగంలో శత్రుదళాలతో బాహాబాహీ పోరాడే దళాలలో మాత్రం స్థానాలనీయటం లేదు.

సైనిక నాయకత్వ మనుసరిస్తున్న ఈ విధానాలను ఫెమినిస్టులు తీవ్రంగా దుయ్యబడుతున్నారు. సింధియా ఎన్లో అనే మహిళా ప్రొఫెసర్ "ది మార్నింగ్ ఆఫ్టర్" అనే పేరిట ఒక పుస్తకాన్ని వ్రాశారు "యూరపులో కమ్యూనిస్టుల పాలన కూలిపోవడంతో ప్రపంచంలో శాశ్వత శాంతి ఏర్పడుతుందని భావించటం భ్రమ మాత్రమే. సైన్యంలో పురుషాధిపత్యం కొనసాగినంత కాలం మనకు దురాక్రమణ యుద్ధ ప్రమాదాలుంటాయి" అని వాదించే వరకూ వెళ్ళారు. సైన్యంలో కూడా స్త్రీలకు పురుషులతో సమానమైన పాత్ర ఉండాలని వీరి వాదం.

కారల్ ఫిలిప్ గాట్లిబ్ వాన్ క్లాజ్‌విట్జ్ అనే ప్రష్యన్ సేనాని యుద్ధ తంత్రం మీద జర్మన్ భాషలో ఒక పుస్తకాన్ని వ్రాశారు. ఇంగ్లీషులో "ది వార్" అన్న పేరిట ఇది ప్రచురితమైంది. క్లాజ్‌విట్జ్ 1780లో జన్మించారు; 1831 వ సంవత్సరంలో మరణించారు. ఇది దాదాపు వెయ్యిపేజీల పుస్తకం. దీని రచనకు వారు పన్నెండు సంవత్సరాల కాలాన్ని పెట్టుబడిగా పెట్టారు. వారి మరణానంతరం, వారి సతీమణి, బావమరది ఈ పుస్తకాన్ని అచ్చు వేయించారు. 1860వ సంవత్సరానికిది అత్యంతాదరణను పొంది, యుద్ధ తంత్రంలో ప్రామాణిక గ్రంథంగా పరిగణన కెక్కింది. సైనికాధికారుల కిది వేద ప్రమాణంగా తయారైంది. ఫెడరిక్ ఏంగిల్స్ దీనిని "వెరీ గుడ్ బుక్" అన్నారు. కారల్‌మార్క్సు కూడా దీనిని శ్రద్ధగా చదివారు.

లెనిన్. జ్యూరిక్‌లో అజ్ఞాత వాసం చేస్తున్న రోజులలో ఈ పుస్తకాన్ని చదివారు వారు చదివిన ప్రతిలోని ప్రతి పేజీలోనూ నోట్సు వ్రాశారట! హిట్లర్ దీనిని కంఠోపాఠంగా చెప్పగలిగేవాడట. ఆధునిక యుగంలో కూడా దీని ప్రాధాన్యత తగ్గలేదు ప్రతి మిలిటరీ ఎకాడమీలోనూ దీని ప్రతులను భద్రపరుస్తున్నారు

"లక్ష్యసాధనకు ఆయుధంగా ఉపకరించేది సైన్యం దీని పటిష్ఠతను, సంఘటితశక్తిని నీరసపరచే ఏ చర్యనూ తీసుకోకూడదు" అని చెబుతూ, సైన్యంలో స్త్రీలను చేర్చుకోకూడదు అని కూడా జనరల్ క్లాజ్‌విట్జ్ స్పష్టంగా వ్రాశారు ఈ సూత్రమే సైన్యంలో అమలులో ఉంటున్నది కాని ఇటీవలి కాలంలో ఫెమినిస్టుల, కొన్ని రాజకీయ పక్షాల ఆందోళన అధికంగావటంతో, కొన్ని దేశాలు, కొంతమేరకు సైన్యంలో స్త్రీలను చేర్చుకొంటున్నాయి. కొన్ని దేశాలు స్త్రీలకు పోరాట దళాలలో కూడా స్థానాన్నిస్తున్నాయి. ఈ అనుభవాలకు సంబంధించిన కొన్ని వివరాలను అమెరికన్ ప్రెసిడెన్షియల్ కమిషన్ 1992 వ సంవత్సరంలో సేకరించింది. ఆ విషయాలను ఇచ్చట సంగ్రహంగా వివరిస్తాను (సైన్యంలోని స్త్రీలను యుద్ధరంగానికి (కాంబాటెంట్స్‌గా) పంపటం మంచిదా కాదా అన్న విషయ నిర్ణయానికి అమెరికా అధ్యక్షులు ఈ కమిషన్‌ను నియమించారు )

## వివిధ దేశాల సైన్యంలో స్త్రీల స్థానం

అధ్యక్షునికి 1992వ సంవత్సరాంతంలో రిపోర్టును సమర్పించిన అమెరికన్ ప్రెసిడెన్షియల్ కమిషన్ కెనడా, నెదర్లెండ్స్, డెన్మార్క్, రష్యా (మాజీ సోవియట్ యూనియన్), గ్రేట్ బ్రిటన్, జర్మనీ, ఇజ్రాయెల్-ఈ ఏడు దేశాల నుండి సమాచారాన్ని సేకరించింది. ఈ దేశాలన్నీ స్త్రీలను కాంబాటెంట్స్ గానో, తత్సమానమైన ప్రతిపత్తితోనో యుద్ధరంగానికి ఇంతకు పూర్వం పంపటమో, లేక ఇపుడు ఆ వర్గంలో స్త్రీలను చేర్చటమో చేశాయి. అందుచేత ఈ దేశాల అనుభవాలను కమిషన్ సేకరించింది ఈ సమాచారాన్ని కమిషన్, రిపోర్టులో విశ్లేషిస్తూ, ఆయా దేశాలు అవలంబిస్తున్న విధానాలను, ఆ దేశాల సంస్కృతి, చరిత్ర, భౌగోళిక ఉనికి, దాని విస్తీర్ణం, స్త్రీ పురుషులకు సమాన స్థానాలివ్వటంలో ఆయాదేశాలు అనుసరిస్తున్న విధానాలు, దురాక్రమణ ప్రమాద మేర్పడినపుడు ఆ దేశాలకు సంభవించిన ఇబ్బందులు మొదలైన అంశాల దృష్ట్యా ఈ సమస్యను పరిశీలించాలని కమిషన్ సూచించింది నెదర్లెండ్స్, డెన్మార్క్, కెనడా, గ్రేట్ బ్రిటన్ దేశాలు స్త్రీలను కాంబాట్ యూనిట్లలో సూత్రప్రాయంగా చేర్చాయి. కాని ఈ దేశాలేవీ స్త్రీలను యుద్ధరంగానికి పంపలేదు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఒక్క సోవియట్ యూనియన్, జర్మనీలు మాత్రమే స్త్రీలను కాంబాటెంట్స్‌గా యుద్ధరంగానికి పంపాయి.

స్త్రీలకు పురుషులతో సమానావకాశాలను ఇవ్వాలన్న పాలసీ అమలు కోసమే కెనడా, నెదర్లెండ్స్, డెన్మార్క్ దేశాలు స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చాయి. బ్రిటన్‌లో దేశ జనాభా తక్కువ గనుక, అవసరమైనంత సైన్యాన్ని నిర్మించలేక, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చారు. ఈ నాలుగు దేశాలు, తాము "సైన్యంలో లింగవివక్షతను పాటించటం లేదు" అని ప్రకటించుకొన్నాయి. సైన్యంలోని అన్ని విభాగాలలోను (పదాతి, వైమానిక, నావికా దళాలలో) స్త్రీలు కనీసం 20శాతం మేరకు ఉండటం వాంఛనీయమని ఈ దేశాలు ఒక పరిమితిని నిర్ణయించుకొన్నాయి. కాని ఆచరణలో స్త్రీ సైనికుల పరిమాణం ఐదుశాతానికి మించకుండా జాగ్రత్త పడుతున్నాయి!

జర్మనీ, సోవియట్ దేశాలకు రెండవ ప్రపంచ సంగ్రామ కాలం అతిప్రమాదకరమైనదిగా తయారైంది. వాటి జాతి మనుగడకే ప్రమాదమేర్పడింది. ఇటువంటి పరిస్థితులను తట్టుకోవటానికి ఈ రెండు దేశాలు స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపాయి అరబ్ - ఇజ్రాయెల్ యుద్ధకాలంలో ఇజ్రాయెల్ ఇటువంటి ప్రమాదాన్నే ఎదర్కొనవలసి రావటంచేత, స్త్రీలను కాంబాటెంట్స్‌గా పంపారు. ప్రమాదం తప్పిన వెంటనే ఈ దేశాలన్నీ, స్త్రీలను కాంబాట్ యూనిట్ల నుండి ఉపసంహరించాయి!

కెనడా : స్త్రీలను సైనిక దళాలలోచేర్చటం వలన దేశ రక్షణ దళాల శక్తి బలహీనపడదు గనుక, సైన్యంలో చేరదలచిన స్త్రీల యెడల వివక్షను ప్రదర్శించకూడదన్న భావంతో కెనడా సైన్యం 1990 వ సంవత్సరంలో స్త్రీలను సైనిక దళాలలో చేర్చుకోవాలని నిర్ణయించింది సైన్యంలో లింగవివక్షకు స్థానం ఉండకూడదన్న భావంతో ఈ నిర్ణయాన్ని తీసుకొన్నారు, అంతేగాని, సైన్యంలో చేరటాన్ని స్త్రీల హక్కుగా మాత్రం

గుర్తించలేదు; వారికి కోటాలను నిర్ణయించలేదు.

సెక్సు విషయంలో అక్రమ ప్రవర్తనను నిషేధించారు. స్త్రీ పురుషులు ఒకరినొకరు మంచి చేసుకోవటాన్ని, సెక్సు సంబంధాలను ఏర్పాటు చేసుకోవటాన్నీ సెక్సు పరమైన వేధింపుల నిరోధానికి చర్యలు తీసుకొన్నారు. నావికాదళం మాత్రం ఈ నియమాలను కరుకుగా అమలు జరుపుతున్నది. నాయకత్వంలో "చేవ" ఉంటే ఇలాంటి చర్యలను అరికట్టటం కష్టం కాదని ఈ విధాన నిర్ణేతల అభిప్రాయం.

డెన్మార్క్ : సైన్యంలో స్త్రీ పురుషులకు సమానావకాశాలుండాలన్నది ప్రభుత్వాశయం. ప్రస్తుతం రెండు శాతం మేరకు స్త్రీలను సైన్యంలోకి తీసుకొంటున్నారు. 2005 వ సంవత్సరానికి ఈ పరిమాణాన్ని ఐదు శాతానికి పెంచాలని నిర్ణయించారు. సైన్యంలోని అన్ని శాఖలలోనూ స్త్రీలున్నారు. తక్షణమే సైన్యాన్ని యుద్ధరంగానికి పంపవలసిన అవసరం లేదు గనుక, అవసరమైన నాటికి స్త్రీలు కాంబాటెంట్సుగా తర్ఫీదు పొందగలరని సైనిక నాయకత్వం విశ్వసిస్తున్నది. స్త్రీలతో ప్రత్యేక దళాలను నిర్మించి చూచారు. స్త్రీల ప్రత్యేక దళాల కంటె, మిశ్రమ దళాలే బలంగానూ, సమర్థవంతంగాను ఉన్నట్లు గమనించారు.

నెదర్లెండ్స్ : లింగ వివక్షను రూపుమాపటమే ప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకొన్నందున, సైన్యంలో దానికి తావు లేకుండా చేస్తున్నారు. ఈ దృష్టితోనే ఇప్పటి వరకూ, సైన్యంలో ఉన్న స్త్రీల శాత పరిమాణాన్ని ఐదు నుండి ఎనిమిదికి పెంచటానికి నిర్ణయించారు. వారు చేర్చుకోదలచినంత మంది స్త్రీలు సైన్యంలో చేరటానికి రావటం లేదు. సైన్యంలో ఎక్కువమంది స్త్రీలను చేర్చుకొనే ప్రయత్నాన్ని పురుష సైనికులు తీవ్రంగా నిరసిస్తున్నారు.

### పదాతి దళాలలో స్త్రీ కాంబాటెంట్స్

కెనడా, డెన్మార్క్, నెదర్లెండ్స్, గ్రేట్ బ్రిటన్ దేశాల సైన్యంలోని కాంబాట్ విభాగాలలో చాలా వాటిలోనూ, కొన్ని సందర్భాలలో అన్ని విభాగాలలోనూ, గత ఐదు పది సంవత్సరాల కాలంలో స్త్రీలనుచేర్చుకొంటున్నారు. కాని కోరినంత మంది స్త్రీలు వీటిలో చేరటానికి రావటం లేదు; వచ్చిన వారిలో తగినంత మంది ఉండటం లేదు. పైన పేర్కొన్న ఏ దేశంలోనూ, ఐదు శాతం మంది స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చాలన్న ప్రయత్నం సఫలం కాలేదు!

కెనడా : ఒక్క సబ్‌మెరీన్ విభాగంలో తప్ప, సైన్యంలోని మిగిలిన అన్ని విభాగాలలోనూ స్త్రీలను 1989 నుండి చేర్చుకొంటున్నారు. సైన్యంలో ఇంతకు పూర్వమే పనిచేస్తున్న వారిని, క్రొత్తవారిని కూడా కాంబాట్ యూనిట్లకు రమ్మంటున్నారు. అయినా 103 మందికి మించి స్త్రీలు రాలేదు. వచ్చిన వారి నందరనూ, అవసరమైన పరీక్షలేవీ చేయకుండానే చేర్చుకొంటున్నారు. ఆ శ్రమకు, భారపు పనులకు తట్టుకోలేక జారిపోయే వారి సంఖ్య అధికంగానారంభించింది. ఇన్‌ఫాంట్రీ విభాగంలో చేరిన మహిళలలో ఒక్కరు మాత్రమే ఆ యూనిట్‌లో పని చేయటానికి తగిన వారుగా తేలారు!

డెన్మార్క్ : సైన్యంలో చేరే స్త్రీలు, పురుషులతో సమంగా శరీర దార్ఢ్య పరీక్షలలో నెగ్గవలసి ఉంటుంది. కాని రెండు రకాల పరిమాణాలను ఈ విషయంలో నిర్ధారించారు. ఇందువల్ల స్త్రీ పురుషుల యూనిట్ల నిర్మాణం సులభమవుతుందని నాయకత్వం భావిస్తున్నది. స్త్రీలు కొంత మేరకు శరీర దార్ఢ్యంలో నాసిగా ఉన్నా, ఆ యూనిట్‌లోని పురుషులు ఆ లోపాన్ని పూరించగలరు గనుక, యూనిట్ బలం దెబ్బ తినదని విధాన నిర్ణేతల నమ్మకం. పన్నెండు నిమిషాలలో రెండు వేల ఒక్క వంద మీటర్ల దూరం పరుగెత్తగల మహిళలను మాత్రమే ఇపుడు కాంబాట్ యూనిట్లకు తీసుకొంటున్నారు.

యూనిట్‌లోని 20 శాతం మంది (70 మంది) మహిళలు ఇన్‌ఫాంట్రి టెస్ట్‌లో పాల్గొన్నారు. వారిలో 39 మంది కొన్ని వారాల తర్వాత వెళ్ళిపోయారు. ట్రెయినింగ్ ప్రోగ్రాం యొక్క శారీరక శ్రమకు, సైనిక క్రమశిక్షణకు తట్టుకోలేకపోవటం, పనిచేయవలసి ఉన్న వాతావరణం వారికి నచ్చకపోవటం ఇందుకు ప్రధాన కారణాలు. టెస్ట్‌లో నెగ్గినవారిని, కాంబాట్ యూనిట్‌లో చేర్చారు.

నెదర్లెండ్స్ : కాంబాట్ యూనిట్లలో చేరే వారికి జరిగే టెస్టులలో పురుషులలో ఇరవై శాతం మంది, స్త్రీలలో 80 శాతం మంది పనికిరాని వారుగా తేలుతున్నారు. ప్రస్తుతం ఇన్‌ఫాంట్రీలో ఒక్క మహిళ మాత్రమే పని చేస్తున్నారు. టాంక్

ఒకటవ పట్టిక

వివిధ దేశాల సైనిక దళాలలో స్త్రీల సంఖ్యాపరిమాణాలు

| వివరము | అమెరికా | డెన్మార్క్ | కెనడా | నెదర్లెండ్స్ | గ్రేట్ బ్రిటన్ | జర్మనీ | ఇజ్రాయెల్ | రష్యా | ఫ్రాన్స్ | నార్వే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొత్తం సైనికుల సంఖ్య | | | | | | | | | | |
| అక్టివు డ్యూటీలో | 18,94,905 | 29,400 | 86,600 | 1,01,400 | 3,00,100 | 4,69,000 | 1,41,000 | 39,88,000 | 4,53,000 | 34,100 |
| రిజర్వు | 16,13,600 | 72,000 | 26,100 | 1,55,700 | 3,40,000 | 8,53,000 | 5,04,100 | 56,02,000 | 4,19,000 | 2,85,000 |
| పేరామిలటరీ | 68,000 | తెలియదు | 6,600 | 4,700 | తెలియదు | 21,000 | 6,000 | 5,30,000 | 91,800 | 700 |
| స్త్రీ సైనికులు | | | | | | | | | | |
| అక్టివు డ్యూటీలో | 2,14,899 | 1,000 | 9,400 | 1,750 | 18,100 | 462 | 15,516 | 25,000 | 13,000 | 972 |
| మొత్తం సైనికులలో స్త్రీల శాతం | 11.3% | 3.4% | 10.9% | 1.7% | 6 0% | 0.1% | 11 0% | 0 7% | 2 9% | 2 4% |
| కాంబాట్ యూనిట్లలో స్త్రీలున్నారా? | లేరు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | లేరు | లేరు | లేరు | లేరు | ఉన్నారు |
| సైన్యంలోని వివిధ విభాగాలలో ఉన్న స్త్రీలు (1991) | | | | | | | | | | |
| పదాతి దళము | 64,576 | 379 | 1,574 | 1,069 | 5,985 | 0 | ఈవివరాలను | తెలియదు | 8,608 | 452 |
| నావికా దళము | 54,934 | 190 | 746 | 841 | 3,905 | 0 | రహస్య | తెలియదు | 2,249 | 315 |
| వైమానికదళము | 58,273 | 379 | తెలియదు | 109 | 6,827 | 0 | సమాచారంగా | తెలియదు | 5,681 | 199 |
| నర్సింగ్ కార్ప్స్ | 35,270 | తెలియదు | తెలియదు | తెలియదు | 2,380 | 462 | భావిస్తున్నారు | తెలియదు | 2,760 | తెలియదు |

| వివరము | అమెరికా | డెన్మార్క్ | కెనడా | నెదర్లాండ్స్ | గ్రేట్ బ్రిటన్ | జర్మనీ | ఇజ్రాయెల్ | రష్యా | ఫ్రాన్స్ | నార్వే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సైన్యంలో స్త్రీల పాత్ర | | | | | | | | | | |
| 1. కాంబాట్ కాక ఇతర సర్వీసులు | | | | | | | | | | |
| పరిపాలనా సంబంధము | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు |
| మెడికల్ | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు |
| 2. కాంబాట్‌కు మద్దతునిచ్చే | | | | | | | | | | |
| దళాలలో | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | ఉన్నారు | లేరు | లేరు | లేరు | లేరు | ఉన్నారు |
| 3. కాంబాట్ దళాలలో | | | | 134 | | సమాచారం | సమాచారం | సమాచారం | | |
| పదాతిదళాలలో (సంఖ్య) | | 7 | 8 | తెలియదు | లేరు | లభించలేదు | లభించలేదు | లభించలేదు | అన్నిదళాల | ఉన్నారు |
| ఇన్‌ఫాంట్రీ | | 3 | 2 | తెలియదు | లేరు | | | | లోను కలిపి | ఉన్నారు |
| ఆర్టిలరీ | | 1 | 2 | తెలియదు | లేరు | | | | 3శాతంమంది | ఉన్నారు |
| ఆర్మర్డ్ | | | | | | | | | | |
| నావికాదళంలో | | | | | | | | | | |
| కాంబాట్ నావలలో | | | 234 | 280 | 500 | | | | లేరు | ఉన్నారు |
| సబ్‌మెరైన్లలో | | 0 | లేరు | లేరు | 0 | | | | లేరు | ఉన్నారు |
| వైమానికదళంలో | | | | | | | | | | |
| ఫైటర్‌పైలట్లు | | లేరు | 1 | 1 (ట్రెయినీ) | లేరు | | | | లేరు | ఉన్నారు |
| హెలికాప్టర్ పైలట్స్ | | లేరు | 8 | 9 | తెలియదు | | | | లేరు | ఉన్నారు |

*మూలం . 1992 వ సంవత్సరం నవంబరు మాసంలో ప్రెసిడెన్షియల్ కమిషన్ అమెరికా అధ్యక్షునకు సమర్పించిన రిపోర్టు నుండి*

యూనిట్లలో గాని, కాంబాట్ ఇంజనీరింగ్ యూనిట్‌లో గాని ఒక్క మహిళ కూడా లేదు. లింగభేదాన్ని బట్టి, వ్యక్తి వయసును బట్టి నియమాలను సడలిస్తున్నా, తగినంత మంది అర్హులయినవారు రావటం లేదు పదాతి దళాలలో చేరిన మహిళలలో 75 శాతం మంది వెళ్ళిపోతున్నారు. కాంబాట్ యూనిట్ టెస్టులలో నెగ్గటం వారికి శారీరకంగా సాధ్యం గావటం లేదు సైనిక పటిష్ఠతకు భంగం వాటిల్లకుండా, టెస్ట్ స్టాండర్డ్సును తగ్గించి చూడటం మంచిదా కాదా అని నాయకత్వం ఆలోచిస్తున్నది.

## వైమానిక దళాలలో కాంబాటెంట్స్

కెనడా, నెదర్లెండ్స్, గ్రేట్ బ్రిటన్ దేశాల వైమానిక దళాలలో స్త్రీ కాంబాటెంట్స్ పనిచేస్తున్నారు.

కెనడా : కాంబాట్ విమానాలను (సి యఫ్ - 18) నడిపే అర్హతను ముగ్గురు మహిళలు సంపాదించగలిగారు. ఒక్కరు మాత్రం "స్టాఫ్ పోజిషన్"లో ఉన్నారు. ఒక్కరు ప్రోగ్రాం మధ్యకాలంలోనే విరమించుకొన్నారు.

నెదర్లెండ్స్ : ప్రస్తుతం ఒక్క మహిళ మాత్రమే, దిగువ స్థాయి ట్రెయినింగును పొందుతున్నారు. మరొకరు ప్రోగ్రాంను పూర్తి చేయటంలో విఫలమైనారు

గ్రేట్ బ్రిటన్ : కాంబాట్ ఫైటర్ (టొర్నెడో) ట్రెయినింగులో ఒక్క మహిళ మాత్రమే ఉన్నారు. ఆవిడ ఆ ప్రోగ్రాంను పూర్తి చేయలేకపోయింది.

ఇజ్రాయెల్ : ఎయిర్ క్రాఫ్ట్ సిమ్యులేటర్స్ మీద పురుషులకు తర్ఫీదు నీయటానికి స్త్రీలను నియోగిస్తున్నా, కాంబాట్ విమానాలను గాని, సపోర్టు ఎయిర్ క్రాఫ్టును గాని నడిపే అవకాశాలను వీరి కివ్వటం లేదు. తమ సైన్యంలో మహిళా పైలట్లు లేరని సైనిక నాయకత్వం వెల్లడించింది. స్త్రీల తర్ఫీదుకు, పురుషుల తర్ఫీదు కంటే ఎక్కువ డబ్బు ఖర్చుగావటం, పనిభారము, స్వభావము, పిల్లలను కనిపెంచే వ్యాసంగానికి ఈ వృత్తికి పొసగక పోవటం, కాంబాట్ పైలట్‌కు ప్రాణత్యాగం చేయాలన్న దీక్ష అవసరం గావటం - వీటన్నిటినీ ఇందుకు కారణాలుగా చెప్పారు.

డెన్మార్క్ : స్త్రీలు సంతానాన్ని కనవలసిన దృష్ట్యా, ఎక్కువ కాలం విమానాలను నడపటం వలన వ్యక్తి శరీరంలో జరిగే మార్పుల స్వభావాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, ఫలితాలను నిర్ధారణ చేసే వరకూ మహిళలను పైలట్లుగా చేర్చుకోకూడదని సైనిక నాయకత్వం నిర్ణయించింది

## నావికా దళంలో కాంబాటెంట్స్

కెనడా, నెదర్లాండ్స్, డెన్మార్క్, గ్రేట్‌బ్రిటన్ దేశాలలో కాంబాట్ షిప్స్ మీద స్త్రీలు పని చేస్తున్నారు కెనడా, గ్రేట్ బ్రిటన్‌ల అనుభవం వలనా, నెదర్లెండ్స్, డెన్మార్క్ దేశాల పరిశీలనల వలనా, యుద్ధ నావల మీద స్త్రీలు కమ్యూనికేటర్సుగా సమర్థవంతంగా పనిచేయగలరని నిర్ణయించారు

గ్రేట్‌బ్రిటన్ : కాంబాట్ షిప్స్ మీద స్త్రీలను చేర్చుకోవటం 1990వ సంవత్సరంలో ప్రారంభమైంది. కాంబాటెంట్, నాన్-కాంబాటెంటు దళాలలో మహిళా సభ్యులు 10నుండి 15 శాతం వరకూ ఉండాలని నిర్ణయించారు. నావికా దళంలో ఉన్న నాలుగు వేల మంది మహిళలలోనూ, 300 మంది మాత్రమే సముద్రం మీద డ్యూటీ చేయటానికి అంగీకరించారు. సముద్రం మీద డ్యూటీ ఎక్కువ కాలం ఉండటం, శారీరకంగా కష్టమైన పనులు చేయవలసి రావటం ఇందుకు కారణం. ఈ నావల మీద ఉండేవారు రోజుకు 24 గంటలు పనిచేయవలసి ఉంటుంది; ఆడవారికి అవసరమైన మరుగు సౌకర్యం ఉండదు. "హెచ్ యం యస్ ఇన్‌విన్స్‌బుల్" అనే విమాన వాహక నౌక మీద మొత్తం పదకొండు వందల మంది పనిచేస్తారు. వీరిలో 75 మంది మాత్రమే మహిళలున్నారు. వీరు ఇతర డ్యూటీలు చేయటంతోపాటు ఫ్లైట్ డెక్ మీద కూడా పనిచేయవలసి ఉంటుంది ఇంతమంది మహిళలను ఒక్కసారిగా నియమించటం వలన, షిప్ యొక్క కాంబాటింగ్ శక్తి సన్నగిలలేదని బాధ్యులు చెప్పారు

డెన్మార్క్ : డేనిష్ షిప్స్ మీద, నాలుగేళ్ళపాటు మహిళలను ప్రయోగాత్మకంగా పనిచేయించి ఫలితాలను పరిశీలించారు. ఈ టెస్ట్ పిరియడ్‌లో మహిళలలో పద్దెనిమిది శాతం మంది, పురుషులలో 13 శాతం మంది విరమించుకొన్నారు. ఈ కాలంలోని రెండు శాతం రోజులు పురుషులు సిక్‌లీవ్ పెట్టగా, స్త్రీలు మూడు శాతం రోజులు తీసుకొన్నారు

(ఇందులో ప్రసూతి సెలవు చేరలేదు). సైనికులు ఎక్కువ కాలం సెలవులు పెట్టటాన్ని సైనిక నాయకత్వం అవాంఛనీయమైన చర్యగా భావిస్తుంది.

కాంబాట్ షిప్స్ మీద పనిచేయటం యెడల మహిళలు సంతృప్తిని ప్రకటిస్తే, పురుషులు మాత్రం స్త్రీలుండటం క్షేమకరంగాకపోవచ్చునన్న అనుమానాలను వ్యక్తం చేశారు. స్త్రీలు బాధ్యత నెరిగి పనిచేసినట్లు కనుపించింది. ట్రెయినింగు కాలంలో అననుకూల వాతావరణాన్ని తట్టుకొని కూడా వారు బాగా పనిచేసినట్లు అనుభవం నిరూపించింది. కానన్ ఫైరింగ్, డెక్ వర్క్ కొంచెం భారమైన పనులు. ఇవి చేయటానికి మహిళలు ఇబ్బంది పడ్డారు. స్త్రీలు బాగానే పనిచేయగలిగారు కాని, శారీరకంగా భారమైన పనులు గనుక, పురుషులంత త్వరగా వారు చేయలేకపోయారు గల్ఫ్ యుద్ధకాలంలో డేనిష్ షిప్స్, మేరిటైమ్ కొయలిషన్ ఫోర్సులో భాగంగా పాల్గొన్నాయి. ఈ ఆపరేషన్‌లో స్త్రీలు ప్రశంసనీయంగా పనిచేసినట్లు రుజువైంది; స్త్రీలుండటం వలన, యుద్ధ సన్నద్ధతా ప్రమాణం ఏ మాత్రం తగ్గలేదు. స్త్రీ-పురుషులు ఒకరినొకరు మంచి చేసుకోవటం, దగ్గర చేరటం, సెక్సుపరమైన వేధింపులుండక తప్పవని ఈ అనుభవం రుజువుచేసింది. కాని, నాయకత్వం కరకుగా వ్యవహరిస్తే ఇలాంటి అవాంఛనీయ చర్యలను అరికట్టవచ్చునని అధికారులు విశ్వసిస్తున్నారు. షిప్‌లో ఏర్పడిన స్త్రీ పురుష సంబంధాల వలన కొన్ని సమస్యలుత్పన్న మైనాయి. సైనికుల కుటుంబీకులు ఈ సంబంధాల యెడల ఆందోళనను వ్యక్తం చేశారు (తమ భర్తలు మరెవరైనా స్త్రీ సైనికునితో సంబంధాలేర్పరచుకొంటారేమోనని వారి భార్యలు భయపడితే, తమ భార్యలు మరెవరితోనైనా సంబంధాలేర్పరుచుకోచ్చునన్న భయాన్ని వారి భర్తలు వెల్లడించారు). ఇలాంటి పరిణామాలను అరికట్ట వీలున్నదని విశ్వసిస్తున్న నాయకత్వం, షిప్స్ మీద స్త్రీలను నియోగించటానికే నిర్ణయించింది.

కెనడా : స్త్రీ సైనికులను దళంలో నియమించిన తర్వాత, సైనికుల ప్రవర్తన మెరుగైనట్లు సైనికాధికారులు తెలియజేశారు. స్త్రీ పురుష సమ్మేళనం విజయవంతంగావాలంటె, తగిన పరిమితిలో (దీనినే "క్రిటికల్ మాస్" అని ఇంగ్లీషులో వ్యవహరిస్తున్నారు) స్త్రీ సైనికులను దళాలలో చేర్చాలని అధికారులు భావిస్తున్నారు. ఐదు శాతం మేరకు స్త్రీలుండటం కనీస పరిమితిగా భావించిన నాయకత్వం, ఇపుడు ఈ పరిమితి ఇరవై శాతంగా ఉంటే బాగుంటుందని అభిప్రాయపడుతున్నది. నాయకత్వం కరుకుగా వ్యవహరించకపోతే నైతిక ప్రవర్తనకు సంబంధించిన సమస్యలేకాక, సంఘటిత శక్తి సాధనకు కూడా ఇబ్బందులు ఏర్పడవచ్చునని కూడా అధికారులు విశ్వసిస్తున్నారు

నెదర్లెండ్స్ : డచ్ నావికా దళంలోని అన్ని కాంబాట్ పోస్టులకు మహిళలు అర్హులు సబ్‌మెరైన్స్, మెరైన్ కార్ప్సులో మాత్రమే స్త్రీలకు ప్రవేశం లేదు. దళంలోని ప్రతి నౌకలోనూ, పదిశాతం మేరకు స్త్రీలున్నారు.

గల్ఫ్‌వార్‌లో నౌకాదళంలో స్త్రీలు కాంబాట్ బాధ్యతలను నిర్వహించారు. కమ్యూనికేషన్ విభాగంలో పనిచేశారు. సర్ఫేస్ పిక్చర్ ఆపరేటర్సుగా, ఎయిర్ పిక్చర్ ఆపరేటర్సుగా మహిళలు పనిచేశారు.

## కాంబాట్ స్థాయిని స్త్రీలకివ్వని దేశాలు

ఇజ్రాయెల్ : ఇజ్రాయెల్ అనుభవాలను సేకరించటానికి ప్రెసిడెన్షియల్ కమిషన్ ప్రత్యేక శ్రద్ధను ప్రదర్శించింది. ఇజ్రాయెల్ కాంబాట్ దళాలలో స్త్రీలు పాల్గొంటున్నట్లు జరిగిన ప్రచార ప్రభావంతో వీరీ పనికి పూనుకున్నారు. స్త్రీలలో శారీరకంగా అర్హులయిన వారు, దేశపు పిలుపు నందుకొని సైన్యంలో చేరాలన్న నియమం ఇజ్రాయెల్‌లో ఉన్నది. కాని, ప్రమాదకర పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చే ఏ కార్యనిర్వహణనూ, ఇజ్రాయెల్ సైనికాధికారులు స్త్రీ సైనికుల కివ్వటం లేదు. కాంబాట్ విమానాలను గాని, వాటికి మద్దతునిచ్చే విమానాలను గాని స్త్రీలు నడపరు. యుద్ధ రంగానికి డ్రైవర్లుగా వీరు వెళ్ళరు; శత్రువుతో ఎదురుపడవలసి వచ్చే ఏ విధమైన కార్యక్రమంలోనూ వీరు పాల్గొనరు. తమ దేశపు స్త్రీలు శత్రువు చేతిలో పడే ప్రమాదం లేకుండా తగిన జాగ్రత్తలను సైనిక నాయకత్వం తీసుకొంటున్నది.

స్త్రీలలో ఆరోగ్యవంతులు, అవివాహితలు, సంతానం లేనివారు, మత సంబంధమైన ఆంక్షలకు కట్టుపడనవసరంలేని వారు సైన్యంలో చేరవలసి ఉంటుంది. ఈ సూత్రం ప్రకారం

18 సంవత్సరాల వయస్సు గల స్త్రీలలో నూరింట 80 మంది సైన్యంలో చేరవలసి ఉంటుంది రెండేండ్ల పాటు వీరు సర్వీసులో ఉండాలి ఆఫీసరు పదవులకు వెళ్ళదలచిన వారు మరొక ఆరు మాసాలు అదనంగా సర్వీసు చేయవలసి ఉంటుంది.

యుద్ధరంగానికి వెళ్ళిన పురుష సైనికుల బాధ్యతలను నిర్వహించటానికి స్త్రీలు ఆ పోస్టులలో పని చేస్తారు ఈ స్థితిని వారు "కాంబాట్ మల్టిప్లైయర్" అని అంటున్నారు. ఇపుడు, తమ దేశావసరాలకు తగినంత సైన్యాన్ని ఏర్పాటు చేయగలిగారు గనుక, స్త్రీలను కొన్ని మినహాయింపులతో సైనిక సర్వీసుకు తీసుకొంటున్నారు. వారి సెమిటిక్ సంస్కృతి, మత ఛాందసము, నిరంతర యుద్ధప్రమాదము, శత్రువు చేతిలో తమ స్త్రీలు చిక్కి అవమానకరము, మానహీనము అయిన బాధలకు లోనుగావచ్చునన్న భయము, సైన్యంలోనికి స్త్రీలను తీసుకొనే విధానాలను ప్రభావితం చేస్తున్నాయి.

ఇజ్రాయెల్ స్వాతంత్ర్య పోరాటం 1948వ సంవత్సరంలో ప్రారంభం గావటానికి ముందు, రహస్యంగా సాయుధ పోరాటాలను నిర్వహించారు. ఈ పోరాట దళాలలో మహిళలు 15 శాతం మంది వరకూ ఉన్నారు. ప్రత్యక్షంగా కొన్ని దాడులలో వారు పాల్గొన్నారు; సరకులను రవాణా చేసే దళానికి రక్షకులుగా వెళ్ళేవారు; ఆయుధాలను రహస్యంగా చేరవేసేవారు; రైళ్ళను, వంతెనలను, బిల్డింగు లను పేల్చివేయటంలో పాల్గొన్నారు. స్వాతంత్ర్య పోరాటం కొనసాగిన కాలంలో దేశజనాభా ఆరు లక్షలు మాత్రమే ఉండేది. ఇటువంటి పరిస్థితులలో వీలయినంత ఎక్కువమంది సైన్యంలో పనిచేయవలసిన అవసరం గలిగింది. అపుడు స్త్రీలు యుద్ధరంగంలోకి దిగక తప్పలేదు. స్త్రీలను యుద్ధరంగానికి పంపకూడదని 1948వ సంవత్సరం తర్వాత ప్రభుత్వం నిర్ణయించింది.

**రష్యా (మాజీ సోవియట్ యూనియన్)** : ఆధునిక చరిత్రలో ఎన్నడూ లేనంత అధిక సంఖ్యలో సోవియట్ మహిళలు యుద్ధరంగానికి కాంబాటెంట్స్‌గా రెండవ ప్రపంచ సంగ్రామ కాలంలో వెళ్లారు.

రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం, యుద్ధ రంగానికి వెళ్లే దళాల వెనుక, వారికి అవసరమైన సపోర్టును ఇవ్వటం మేరకే మహిళా సైనికుల కర్తవ్యంగా ఉండేది. 1942లో హిట్లరు దండయాత్ర వలన దేశపు మనుగడకే ప్రమాదం వాటిల్లింది ఈ స్థితిలో వీలయినంత ఎక్కువమంది స్త్రీలను సైన్యంలోకి తీసుకోక తప్పలేదు. ఇన్‌ఫాంట్రీ, ఏంటీ - ఎయిర్ క్రాఫ్ట్ డిఫెన్స్, ఆర్టిలరీ, ట్రాన్స్‌పోర్టేషన్, కమ్యూనికేషన్, నర్సింగ్ సర్వీసెస్‌లో మహిళలు యుద్ధాంతం వరకూ పనిచేశారు రెగ్యులర్ సైనిక దళాలలోనే గాకుండా, అసంఖ్యాక మహిళలు గెరిల్లా దళాలలోచేరి పోరాడారు ఆ కాలంలో సైనిక చర్యలలో పాల్గొన్న మహిళల సంఖ్య పదిలక్షల వరకూ ఉంటుందని అంచనా వేశారు ఎనిమిది లక్షల మంది రెగ్యులర్ దళాలలో ఉన్నారు వీరిలో ఐదు లక్షల మంది కాంబాట్ దళాలలోగాని, వాటికి మద్దతు నిచ్చే దళాలలో గాని ఉన్నారు. యుద్ధాంతానికి, సోవియట్ సైన్యం, కోటి ఇరవైలక్షల వరకూ ఉన్నది. దీనిలో స్త్రీల సంఖ్యా పరిమాణం ఎనిమిది శాతం వరకూ ఉన్నది.

స్త్రీ - పురుషులను కలిపి దళాలను ఏర్పాటు చేశారు ఇలాంటి మిశ్రమ దళాల ఏర్పాటువలన ఉత్పన్నమయిన సమస్యలేమయినా ఉన్నాయో లేదో తెలుసుకొనే అవకాశం కమిషన్‌కు లభించలేదు. స్త్రీలు, పురుషులంత బలశాలురు కాకపోవటంచేత వారు కొన్ని ఇబ్బందులకు, ప్రమాదాలకు గురైనారు గ్రెనేడ్స్‌ను పటుతరంగా స్త్రీలు ప్రయోగించలేక పోవటంచేత వారు మరణించవలసి వచ్చిన సందర్భాలున్నాయి. పోరాటంలో ఇలాంటి ఇబ్బందుల వలన స్త్రీ సైనికులు అధిక సంఖ్యలో ప్రాణత్యాగం చేయవలసి వచ్చింది. బైప్లేన్సు ఆరువందల పౌనుల బరువును కూడా మోయలేవు, వందమైళ్ళకు మించిన వేగాన్నివి అందుకోలేవు. అయినా అటువంటి శక్తి హీనమైన విమానాలలో స్త్రీలు వెళ్ళి శత్రు స్థావరాల మీద బాంబులు వేశారు. ఈ ప్రయత్నంలో మరణించిన వారు ఎందరో ఉన్నారు. అనమాన ధైర్యసాహసాలను స్త్రీలు ప్రదర్శించారు; వీర మరణాన్ని వరించారు.

యుద్ధానంతరం, స్టాలిన్ సైన్యాధినేతగా ఉండగానే సైన్యంలోని స్త్రీల సంఖ్యను బాగా తగ్గించారు. అతి కొద్ది కాలంలోనే వారి సంఖ్య 25,000 కు తగ్గింది!

జర్మనీ : రెండవ ప్రపంచయుద్ధానంతరం స్త్రీలను సైన్యంలోనికి తీసుకోవటం దాదాపు మానేశారు. మెడికల్ విభాగానికి. బ్యాండ్ విభాగానికి మాత్రమే వీరికి ప్రవేశాన్ని పరిమితం చేశారు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో కాంబాట్ దళాలలో వెళ్ళిన సైనికుల బాధ్యతలను నిర్వహించటానికి స్త్రీ సైనికులను నియోగించారు. ఎయిర్ డిఫెన్స్, ఏంటి ఎయిర్ క్రాఫ్ట్, సెర్చిలైట్, రేడార్. బరాజ్ బెలూన్ బాటరీస్ విభాగాలలో స్త్రీలు పనిచేశారు రెండవ ప్రపంచ యుద్ధాంతానికి సైన్యంలో స్త్రీలు మూడు లక్షల మంది వరకూ ఉన్నారు. అన్ని యుద్ధ రంగాలలోనూ వారు పనిచేశారు తూర్పు యూరపులో చాలా మందిమహిళా సైనికులు పట్టుబడి, చెరసాలకు తరలారు. ఇది జర్మన్ ప్రజల మనో నిబ్బరాన్ని దెబ్బతీసింది. దీని ప్రభావంతో జర్మనీ సైన్యంలో స్త్రీల పాత్రను తగ్గించారు.

స్త్రీలను కాంబాటెంట్స్‌గా పంపటంలోని మంచి చెడులను ప్రెసిడెన్షియల్ కమిషన్ విపులంగా చర్చించింది. వివిధ దేశాల అనుభవాలను, సైనికాభిప్రాయల సేకరణతో ముగించకుండా, ప్రజాభిప్రాయాన్ని కూడా కమిషన్ సేకరించింది. ఈ కమిషన్ కార్యనిర్వహణలో ఇందుకు సంబంధించిన పలు అంశాలు చర్చకు వచ్చాయి. వాటిలో ముఖ్యమైన వాటినిచట వివరిస్తాం:

సైన్యంలోకి తీసుకోవటంలో, స్త్రీ పురుషులకుసంఖ్యా ప్రాతిపదిక మీద "కోటాలను" నిర్ణయించటం మంచిది గాదనీ, ఇందువల్ల సైన్యపు శక్తి దెబ్బతినే ప్రమాదం ఉంటుందనీ కమిషన్‌లోని మెజారిటీ సభ్యులు అభిప్రాయపడ్డారు. కమిషన్‌లో మొత్తం 15 మంది సభ్యులున్నారు. వారిలో ఆరుగురు కమిషన్ మెజారిటీ నిర్ణయాన్ని వ్యతిరేకించారు.

### ఫిట్‌నెస్ ప్రమాణాలు

సైన్యానికి సిబ్బందిని రిక్రూట్ చేసేటపుడు, శరీరదార్ఢ్య నిర్ణయ విషయంలో, స్త్రీలకు, పురుషులకూ భిన్నమైన కొలమానాలను పాటించాలని చెబుతూ, ఈ విషయంలో, మిలటరీకి అవసరమైన పరిమాణాలను విస్మరించకూడదన్నారు.

ఫిట్‌నెస్ ప్రమాణాలలో స్త్రీ పురుషుల శరీరదార్ఢ్యాన్ని పోల్చి చూచారు. పరీక్షకు వచ్చిన 623 మంది మహిళలలో కేవలం 21 మంది (3.4 శాతం మంది) మాత్రమే, ఫిట్‌నెస్

---

**బిడ్డ జీవితాన్ని నాశనం చేయగల తల్లిదండ్రుల యెడబాటు**

"తలిదండ్రుల యెడబాటు బిడ్డను ఎలా ప్రభావితం చేస్తుంది? బిడ్డ నుండి తలిదండ్రుల యెడబాటు - అది వారాలు గానీయండి, మాసాలు గానీయండి, మహా ప్రమాదకరమైంది. శారీరకంగానూ, మానసికంగానూ ప్రదర్శితమయ్యే తలిదండ్రుల ప్రేమ బిడ్డకు ప్రాణప్రదమైనది. అది దానికి జీవగఱ్ఱ

"తలి దండ్రుల వలన బిడ్డ శారీరక, మానసికానందాలను పొందుతుంది తల్లిగాని, తండ్రి గాని బిడ్డకు చాల కాలం దూరమైనపుడు, ఆ బిడ్డకు విపరీతమైన కోపం వస్తుంది; అది ఆందోళనకు గురవుతుంది; వర్తమానాన్ని గూర్చి భవిష్యత్తును గురించి ఆందోళన పడనారంభిస్తుంది. కుటుంబ నిర్మాణానికి ప్రమాదమేర్పడి నపుడు, బిడ్డ మానసిక వికాసం దెబ్బదింటుంది.

"తలిదండ్రులలో ఎవరయినా ఎక్కువ కాలం బిడ్డకు దూరంగా ఉన్నా, లేక చనిపోయినా బిడ్డకు వారిమీద ఉన్న విశ్వాసం దెబ్బదింటుంది; దాని ఆత్మాభిమానం గాయపడుతుంది...

"బిడ్డనుండి తల్లి ఎక్కువ కాలం దూరంగా ఉండవలసి వచ్చినపుడు, తల్లి మీద ఉండే ప్రేమ, బిడ్డలో క్రమంగా అంతరించ నారంభిస్తుంది. క్రమంగా బిడ్డ తల్లికి దూరమవుతుంది. అంతేగాదు; బిడ్డమీద తల్లికున్న ప్రేమ కూడా కాలగతిన తరగనారంభిస్తుంది.

"ఏ కారణం చేతనయినా మనం బిడ్డ నుండి తల్లిని వేరు చేయటం అంటే, మానవ వికాసానికి మూలాధారమైన అంశాన్ని తొలగిస్తున్నాం అని గుర్తించాలి. దాని దుష్ప్రభావం ఆ ఒక్క వ్యక్తి మీదే గాదు, సమాజం మీద కూడా ప్రసరిస్తుంది".

*- ప్రెసిడెన్షియల్ కమిషన్ ముందు డాక్టర్ బ్రెండా హంటర్ అనే శిశు వైద్య ప్రవీణులిచ్చిన సాక్ష్యం నుండి*

ప్రమాణాలలో పురుషులకు సమంగా వచ్చారు డెబ్బై ఎనిమిది శాతం మంది పురుషులు అందుకో గలిగిన ఫిట్‌నెస్ ప్రమాణాన్ని, ఏడు శాతం మంది స్త్రీలు మాత్రమే చేరగలిగారు పురుషుల కండబలంలో స్త్రీల కండబలం 50 నుండి అరవై శాతం మేరకే ఉన్నది: దమ్ము విషయంలో పురుషుల శక్తిలో 70-75 శాతం మేరకున్నది ఈ దృష్ట్యా స్త్రీ పురుషులకు వేరు వేరు ప్రమాణాలుండటం మంచిదని సిఫార్సు చేశారు

## శిశు సంరక్షణా బాధ్యతలున్న సైనికులు

పిల్లలున్న సైనికులను యుద్ధరంగానికి పంపటం లోని మంచి చెడులు కూడా కమిషన్ పరిశీలనా పరిధిలో ఉన్నాయి ఈ విషయం మీద కూడా కమిషన్ అధిక ప్రజాభిప్రాయాన్ని సేకరించింది సైన్యంలో ఉన్న స్త్రీలు, పురుషుల కంటే అధికంగా సంతాన సంరక్షణా భారాన్ని మోయవలసి ఉంటున్నది దురదృష్టవశాత్తూ వీరుయుద్ధ రంగంలో మరణిస్తే పిల్లల గతేం గాను? ఇది పెద్ద మానవతా సమస్యగా రూపొందింది. తల్లి లేక తండ్రి, మరణిస్తే, పిల్లల మీద దాని ప్రభావం ఎలా ఉంటుంది అన్న విషయాన్ని కమిషన్ విచారించింది దీని మీద ప్రజాభిప్రాయాన్నిది సేకరించింది. పిల్లల సంరక్షణాభారాన్ని వహిస్తున్న స్త్రీ సైనికులను యుద్ధ రంగానికి పంపకుండా ఉండటం మంచిదన్న అభిప్రాయాన్ని, సర్వేలో పాల్గొన్న వారిలో 69 శాతం మంది ప్రజలు ప్రకటించారు. సర్వేలో పాల్గొన్న సైనికులలో 72 శాతం మంది, శిశు సంరక్షణా బాధ్యతలున్న స్త్రీ సింగిల్ పేరెంట్స్‌ను యుద్ధ రంగానికి పంపటం మంచిది గాదన్నారు దంపతులిద్దరూ సైన్యంలో ఉన్నపుడు, స్త్రీని యుద్ధరంగానికి పంపటం మంచిదిగాదని సర్వేలో పాల్గొన్న సైనికులలో 64 శాతం మంది సూచించారు.

"తల్లిదండ్రుల నుండి వేరయిన పసిబిడ్డలు ఆందోళనకు గురవుతారనీ, అండలేకపోవటం, తల్లిదండ్రులు దూరమైనారన్న విషాదం వంటి మానసిక బాధలకు లోనవుతారని శిశు అభివృద్ధి విషయాలలో నిపుణులైన వారు సూచించారు. పిల్లల వయసెంత తక్కువగా ఉంటే, తల్లి దండ్రుల దీర్ఘకాలిక యెడబాటు ప్రభావం అంత తీవ్రంగా వారిమీద ఉంటుందని చెబుతున్నారు. బిడ్డ యొక్క జీవన ప్రారంభ దశలో, కొన్ని మాసాల పాటు, బిడ్డకు తల్లి సంరక్షణ అత్యవసరమనీ, అది తల్లి బిడ్డల మధ్య అనుబంధం ఏర్పడటానికి, బలపడటానికి తోడ్పడుతుందని కొందరు నిపుణులు సూచించారు. శిశు జీవితకాలంలో తొలి మూడు సంవత్సరాలు అత్యంత కీలక మయిన కాలమనీ. ఈ కాలంలో తల్లి ఎడబాటు వలన సంభవించే అనర్థాన్ని ఎంతటి శిశు సంరక్షణా నైపుణ్యమైనా తొలగించలేదనీ. తల్లి సంరక్షణకు మరేదీ ప్రత్యామ్నాయం కాలేదనీ. నిపుణులంతా సూచిస్తున్నారు ఈ విషయానికి సంబంధించిన విస్తృత సాహిత్యం కూడా ఈ అంశాన్ని స్పష్టం చేస్తున్నది బిడ్డలకు సంభవించే తలిదండ్రుల దీర్ఘకాలిక యెడబాటు ఎంత మాత్రమూ వాంఛనీయం కాదని రుజువైంది" అని కమిషన్ పేర్కొన్నది

ఈ కారణం చేతనే, పిల్లలున్న సింగిల్ పేరెంట్స్‌ను గాని, దంపతులను గాని యుద్ధరంగానికి పంపటాన్ని అమెరికా ప్రజలు "తీవ్రంగా వ్యతిరేకించినట్లు" కమిషన్ రికార్డు చేసింది: ఇక ముందు ఇలా జరగకుండా అమెరికా రక్షణ శాఖ చూడాలన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ దిగువ సూచనలను చేసింది .

1. రెండు సంవత్సరాలకంటే తక్కువ వయస్సు పిల్లలున్న వారిని, వీలయితే యుద్ధరంగానికి పోనవసరంలేని విభాగాలకు పంపాలి; ఇలా వీలుగానపుడు వారిని డిశ్చార్జి చేయాలి తిరిగి మామూలు పరిస్థితులేర్పడినపుడు, వారి రాంక్‌కు, సర్వీసుకు భంగం వాటిల్లకుండా తిరిగి సైన్యంలోకి తీసుకోవాలి.

2. రెండు సంవత్సరాల వయస్సుకు మించిన పిల్లలు న్నపుడు, వారికి శిశు సంరక్షణా వసతిని ఏర్పాటు చేయాలి.

3. దంపతులిద్దరూ సైన్యంలో ఉన్నపుడు, వారిలో ఒక్కరినే యుద్ధరంగానికి పంపాలి.

4. సింగిల్ పేరెంట్స్‌ను సైన్యంలో చేర్చుకోకూడదు.

5. స్కూలుకు వెళ్లే వయస్సురాని పిల్లలున్న సింగిల్ పేరెంట్‌ను యుద్ధరంగానికి పంపకూడదు.

6. దంపతులిద్దరూ సైన్యంలో ఉన్నపుడు, వారిలో ఒకరిని సర్వీసునుండి తొలగించాలి. ఇవి కమిషన్ చేసిన సిఫార్సులలో ముఖ్యమైనవి. ఈ సిఫార్సును కమిషన్ సభ్యులంతా ఏకగ్రీవంగా అంగీకరించారు.

గర్భవతులను యుద్ధరంగానికంపే విషయాన్ని కూడా

కమిషన్ వివరంగా చర్చించింది దళంలోని సభ్యులందరిని రంగంలో నిలుపగలగటం మీద సైనిక సన్నద్ధతాశక్తి, సంఘటితశక్తి ఆధారపడి ఉంటాయి గర్భధారణమూలంగా కొందరను మినహాయించ వలసి రావటం చేత, సైన్యపు సంఘటిత శక్తి దెబ్బతింటుంది. అలాగే దళనాయకురాలు గర్భవతయి శలవు మీద వెళితే, ఆ దళపు సంఘటితశక్తి దెబ్బతింటుంది; నాయకుని మీది విశ్వాసం అనుచరులలో సన్నగిలుతుందని కమిషన్ అభిప్రాయపడింది.

ఇలాంటి పరిస్థితుల వలన గల్ఫ్ వార్ కాలంలో ఏమి జరిగిందో చూద్దాం. గల్ఫ్ వార్ కాలంలో, దళ నాయకురాండ్రు కొందరు గర్భవతులు గావటంచేత శలవు మీద వెళ్ళారు. ఇందువల్ల ఆ దళాల సంఘటిత శక్తి నీరసించినట్లు కమిషన్ సేకరించిన సమాచారం రుజువు చేసింది. డిజర్ట్ షీల్డ్ లేక డిజర్ట్ స్టార్మ్ సంరంభ కాలంలో, తమ యూనిట్లలోని స్త్రీలు కొందరు, యుద్ధరంగానికి వచ్చే ముందు గాని, వచ్చిన తర్వాత గాని గర్భవతులయినట్లు, స్త్రీలు పురుషులు కలిసి పనిచేసే మిశ్రమ దళాలలోని 54 శాతం మంది తెలియజేశారు. స్త్రీ సైనికులు గర్భవతులు కావటం వలన, దళపు యుద్ధ సన్నద్ధత దెబ్బతిన్నట్లు, దళాలలోని 46 శాతం మంది చెప్పారు; ఈ పరిణామం సైనికుల మనో నిబ్బరాన్ని దెబ్బతీసినట్లు 59 శాతం మంది తెలియజేశారు.

యుద్ధరంగానికి వెళ్ళిన వారిలో, డిజర్టు షీల్డ్ - డిజర్ట్ ఆపరేషన్ జరిగిన కాలంలో - పురుషుల కంటే ఎక్కువమంది స్త్రీలు శలవలు పెట్టారు. స్త్రీలు శలవులు పెట్టటానికి ప్రధాన కారణం గర్భధారణ స్త్రీలలో సెలవు పెట్టిన వారిలో 47 శాతం మంది గర్భధారణ కారణంగా శలవు పెట్టవలసి వచ్చినట్లు, నావీ కెప్టెన్ మార్తా వైట్‌హెడ్ కమిషన్‌కు చెప్పారు. శలవు పెట్టిన వారిలో పురుషుల కంటే స్త్రీలు మూడు రెట్ల కంటే కూడా అధికంగా ఉన్నారు.

ఈ పరిస్థితుల దృష్ట్యా యుద్ధరంగానికి వెళ్ళవలసి వచ్చే దళాలలో గర్భవతులు లేకుండా చూడాలని కమిషన్ సిఫార్సు చేసింది. ఈ సిఫార్సును కమిషన్ సభ్యులంతా బలపరచారు.

## యుద్ధరంగంలో స్త్రీల పాత్ర

అన్ని రంగాల ప్రవేశానికి, స్త్రీలకూ సమానావకాశాలు కల్పించటానికి జరిగే ప్రయత్నాలు ముమ్మరమవుతున్న రోజులివి. ఇందువల్ల, కాంబాట్ యూనిట్లలోని అన్ని స్థానాలకూ స్త్రీలు వెళ్ళే అవకాశాలను కల్పించాలన్న ఆందోళన అధికమవుతున్నది. రాజకీయ నాయకులు కూడా ఇందుకు సుముఖంగా మారుతున్నారు సైనిక నాయకత్వం, ఈ విషయంలో తగినంత సడలింపులకు సుముఖంగా లేదు. కనుక ఈ సమస్య అత్యంత ప్రముఖమైనదిగా తయారైంది. కమిషన్ ఈ విషయంలో జరిపిన విచారణాంశాలను కొంచెం విపులంగా తెలుసుకొందాం. ఈ దృష్టితోనే రిపోర్టులోని దిగువ భాగాన్నిచట ఇస్తున్నాం .

"మహిళలు ఫైటర్ విమానాలను నడపగలరనీ, కాంబాట్ నావలమీద పనిచేయగలరనీ, శాంతియుత వాతావరణంలో శారీరకంగా అతికష్టమైన బాధ్యతలను నిర్వహించగలరనీ పలువురు కమిషన్ ముందు సాక్ష్యమిచ్చారు. ఇదే విధంగా అమెరికా దేశపు మతము, సంస్కృతుల యొక్క ప్రధానమైన విలువలనుచూపుతూ, శత్రుసైనికులతో ప్రత్యక్షంగా తలపడవలసి వచ్చే యుద్ధానికి స్త్రీలను పంపకూడదని కూడా అనేకులు సాక్ష్యమిచ్చారు.

"స్త్రీలు సాయుధులై యుద్ధరంగంలోప్రవేశించటంలోని విజ్ఞత ఎంత, అమెరికా అధ్యక్షులు స్త్రీలను యుద్ధరంగానికి పంపటం ఉచితమా, అనుచితమా అన్న నిర్ణయ సమస్య ఇపుడు ప్రజల ముందున్నది సివిల్ బాధ్యతల నిర్వహణలో స్త్రీలు గణనీయమైన పురోగతిని సాధించారు. అయినప్పటికీ, పురుషులతో సమానమైన స్థానాన్ని, కాంబాట్ దళాలలో స్త్రీలకు కూడా కల్పించాలన్న వాదన, సమస్యను తెగ లాగుతున్నది. కమిషన్ ముందు సాక్ష్యమిచ్చిన సెంటర్ ఫర్ స్టడీ ఆఫ్ పాప్యులర్ కల్చర్ సంస్థ అధ్యక్షులు డేవిడ్ హేరోవిడ్జ్ ఇలా చెప్పారు :

"ప్రమాదభరిత పరిసరాలకు స్త్రీని పంపటం, తోటి మనిషిని చంపటానికి అవసరమైన తర్ఫీదు నావిడ కివ్వటం, బయట పనిచేసే అవకాశాన్ని స్త్రీకి కల్పించటం గాదు... నేను సామాన్యునిగా ఒక్క విషయాన్ని చెప్పదలచాను. ఇందుకు గణాంక వివరాలు గాని, యుద్ధరంగపు రిపోర్టులు గాని అవసరం లేదు. స్త్రీలను పెద్ద సంఖ్యలో విదేశాలలోని యుద్ధరంగాలకు తరలించటం వలన, అమెరికా యొక్క యుద్ధ నిర్వహణా సామర్థ్యం ఇప్పటికే చాలా బలహీనపడింది.

యుద్ధరంగానికి వెళ్ళిన వారి బిడ్డల, వారి తల్లిదండ్రుల దయనీయమయిన స్థితి గతులను మనం టి.వి ప్రసారాలలో చూచాం దీని ఫలితంగా అమెరికా అధ్యక్షులు, నాలుగు రోజులలో (అతి తక్కువ కాలంలోనని సాక్షి అభిప్రాయం) "యుద్ధ విజయాన్ని సాధించాలన్న వత్తిడికి లొంగటమో, లేక దేశంలో జరిగే యుద్ధంలో (ఎన్నికలని సాక్షి అభిప్రాయం) ఓడిపోవటమో జరుగుతుంది..."

"సైన్యంలో సముచిత పాత్రా నిర్వహణాంశపు ప్రస్తావన వచ్చిపుడు, సమాజపు సాంస్కృతిక విలువలు కూడా చర్చకు వస్తాయి. స్త్రీ పురుషుల మధ్య సెక్సు సంబంధాలు, కుటుంబ బాధ్యతలు, కుటుంబంలోని సభ్యుల మధ్య సంబంధాలు - ఇవన్నీ కూడా పరిగణనకు రాక తప్పదు కాంబాట్ యూనిట్లలో స్త్రీలను చేర్చి, వారిని యుద్ధరంగానికి పంపటం అనేది అమెరికన్ సామాజిక విలువలకూ, సైనిక ఔన్నత్యానికి భంగకరమన్న అభిప్రాయాన్ని, కమిషన్ ముందు సాక్ష్యమిచ్చిన వారిలో అత్యధికులు సూచించారు. కమిషన్‌కు ఈ అంశం మీద పదమూడు వేల ఉత్తరాలు అందాయి వారిలోనూ అత్యధికులు ఇలాంటి అభిప్రాయాన్నే వెల్లడించారు.

"స్త్రీలను గౌరవించటానికి, రక్షించటానికి, వారికి అండగా నిలుచుండటానికి, మనం సంఘటిత సామాజిక శక్తిగా, పురుషులను ప్రోత్సహిస్తూనే ఉండటమా లేక మానటమా అనేది ఈసమస్య సారాంశంగా తేలింది కమిషన్ సభ్యులొకరు, "స్త్రీలను రక్షించటానికి, వారికి అండగా నిలుచుండటానికి, లక్షలాది అమెరికా మాతృమూర్తులు, కొడుకులను కంటున్నారు." అని చెప్పారు. ఇప్పటి సామాజిక సంస్కృతి ఇది. ఇటువంటి పరిస్థితులలో స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపటం అనేది ఈ సంస్కృతికి వ్యతిరేకమైనది. మరొక మాటలో చెప్పాలంటే, కాంబాట్ యూనిట్లలో స్త్రీలను చేర్చటంలో కృతకృత్యులం కాగలగటమనేది, మన సామాజిక సంస్కృతి మారిపోయి, స్త్రీ రక్షణ తన విద్యుక్త ధర్మమనుకొనే పురుషభావాన్ని రూపుమాపగలిగినపుడే సాధ్యమవుతుంది.

"స్త్రీ సైనికులు, శత్రువు చేతిలో పడే ప్రమాదమున్నదని తెలిసి కూడా, శత్రు సైన్యంతో ప్రత్యక్షంగా తలపడటానికి అవసరమైన నైపుణ్యాన్ని వారికి అలవరచి, కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపటం అనే ప్రభుత్వ విధానం యొక్క స్వభావం. సామాజిక సంస్కృతి మీద ఎలా ఉంటుందో క్షుణ్ణంగా పరిశీలించాలని కొందరు కమిషన్ సభ్యులు పట్టుపడుతుండటానికి కారణం ఇదే బుద్ధి పూర్వకంగా స్త్రీల మీద హింసాచర్యలకు దిగటాన్ని. లేక ఇలా దిగటాన్ని ప్రోత్సహించటాన్ని మన సమాజం అనుమతిస్తుందని ఇటువంటి విధానానుసరణ చాటుతుంది"

ఇంతకు పూర్వం శత్రువులకు యుద్ధఖైదీలుగా పట్టుబడిన మహిళలు (ఇందులో ఆపరేషన్ డిజర్ట్ స్టార్మ్‌లో పట్టుపడిన ఇద్దరు మహిళలు కూడా ఉన్నారు) కమిషన్ ముందు సాక్ష్యం ఇచ్చారు వారి సాక్ష్యాలు యుద్ధ ఖైదీలుగా, స్త్రీ సైనికులు అనుభవించ వలసి వచ్చే హింసారూపాన్ని, దాని తీవ్రతనూ స్పష్టంగా వర్ణించాయి. తమలో పట్టువడిన స్త్రీ సైనికుల మీద శత్రువు హింసను ప్రయోగించటాన్ని చూచి, పురుషసైనిక. ఖైదీలు బెంబేలు పడిపోకుండా, వారికి మనోనిబ్బరాన్నివ్వటానికి, ప్రత్యేక తర్ఫీదు నిస్తున్నారు. అసభ్యకరమైన అత్యాచారానికి గురయిన స్త్రీ సైనికురాలు, కమిషన్ ముందు ఇచ్చిన సాక్ష్యం వలన, ఈ ట్రెయినింగ్ ప్రోగ్రాం మరింత మంది దృష్టిని ఆకర్షిస్తున్నది. ఫెయిర్ ఛైల్డ్ బేస్‌లో అమలు జరుగుతున్న "సర్వైవల్, ఎవేషన్, రెసిస్టెన్స్, అండ్ ఎస్కేప్" స్కీము క్రింద ట్రెయినింగు నిస్తున్న వారితోడి గోష్ఠి వలన, అత్యంతాందోళనకరమైన అంశాలు వెలికి వచ్చాయి. స్త్రీలను కాంబాట్ యూనిట్లలో పంపటం యొక్క ఫలితం ఎలా ఉంటుందో ఒకరు ఇలా వివరించారు :

"ప్రభుత్వ విధానం మారి, స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపితే, వారు మానభంగానికి గురయ్యే అవకాశాలున్నాయని, జీవచ్ఛవాలుగా తిరిగి వచ్చిన తర్వాత, వారు తీవ్రమైన దోపిడీకి గురయ్యే ప్రమాదం కూడా ఉన్నదని మనం అమెరికా ప్రజలకు తెలియజెప్పాలి. అత్యంత విస్తృత ప్రాతిపదిక మీద ఈ ప్రచారాన్ని మనం చేబట్టకపోతే, అమెరికా దీర్ఘకాలిక యుద్ధంలో చిక్కుకొన్నపుడు, దేశసైనిక పటిష్టత, శక్తి సామర్థ్యాలమీద ప్రజలకున్న విశ్వాసం సడలిపోతుంది."

"నావల్ ఎవియేటర్స్, స్త్రీ అధికారులు పాల్గొన్న టెయిల్‌హుక్ కన్వెన్షన్ సందర్భంలో సంభవించిన అవమానకరమూ, అసభ్య కరమూ అయిన సంఘటనలు జాతి దృష్టిని

ఆకర్షించాయి. ఈ కన్వెన్షన్‌లో తోటి సైనికులే స్త్రీ సైనికుల యెడల అసభ్యకరంగా వ్యవహరించారు. ఈ సంఘటన తర్వాత కూడా స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపటం వలన, స్త్రీలు అనుభవిస్తున్న సెక్స్‌పరమైన వేధింపు తగ్గుతుందని కొందరు వాదించటం కొంచెం వికృతంగా కనిపిస్తుంది. టిల్‌హుక్ సంఘటనలో పురుష ఆఫీసర్లు కలుగజేసుకొని, స్త్రీలను రక్షించటానికి పూనుకోకపోవటం అనేది తీవ్రంగా కలచివేయగల అంశం. అమెరికా సామాజిక విలువలు కూలిపోతుండటానికిది సూచన. ప్రభుత్వ విధానాలు దీన్ని మరింత క్షీణింపజేసేట్లుండకూడదు.

"స్త్రీలు అనుభవిస్తున్న సెక్సుపరమైన వేధింపులు, వారి మీద అమలు జరుగుతున్న హింసాకాండ, స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చటం వలన గాని, మన సామాజిక సంస్కృతిని మార్చటం వలన గాని అంతరిస్తాయని కమిషన్ ముందు ఎవరూ వివరించలేదు. డెన్నిస్ పేజర్, లాస్ ఏంజలిస్‌లో కమిషన్ ముందు సాక్ష్యమిస్తూ, "వ్యక్తులు చేసే చెడు పనులను మానవతా విలువలు మాత్రమే నిరోధించగలవనీ, మానవత్వం గలిగిన మనిషి స్త్రీలను వేధించలేడనీ" చెప్పారు. స్త్రీలను సెక్సుపరమైన వేధింపుల నుండి రక్షించాలంటే, మానవత్వం గల పురుషులను తయారు చేయటం ఒక్కటే మార్గమని వీరు సూచించారు.

"ఉత్తమ పురుషులు స్త్రీలను గౌరవిస్తారు; రక్షిస్తారు. తమకు లభించే "సమానత్వానికి" ప్రతిఫలంగా, నాగరిక సామాజిక వ్యవస్థకు మూలమైన ఈ నైతిక సూత్రాన్ని త్యాగం చేయమని స్త్రీలను కోరటం అనుచితం. డాక్టర్లు, లాయర్లు, సెనెట్ సభ్యులు కావటానికి స్త్రీలకు అవకాశాల నీయటం సమానత్వ సాధనాకృషి క్రిందకు వస్తుంది; స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపటం ద్వారా కల్పించే "సమానత్వం" ఇందుకు పూర్తిగా భిన్నమైనది.

"స్త్రీలను కాంబాట్ యూనిట్సులో చేర్చటానికి మన సామాజిక విలువలను మార్చుకోవాలి; మానవ చరిత్రానుభవాన్నీ, యుద్ధ చరిత్రానుభవాన్నీ విస్మరించాలి".

రాక్‌ఫర్డ్ ఇన్‌స్టిట్యూట్ (షికాగో) అధ్యక్షులు ఎలాన్ కారల్‌సన్, కమిషన్ ముందు ఇలా సాక్ష్యమిచ్చారు : "చరిత్ర నుండి కమిషన్ మరొక పాఠాన్ని నేర్చుకోవచ్చు. బలవంతంగా యువతులను సైన్యంలో చేర్చుకొని, కాంబాట్ యూనిట్లలో చేర్చి యుద్ధరంగానికి పంపిన దాని ఫలితాలను వదలివేయండి. బుద్ధి పూర్వకంగా, నిర్మాణ యుతంగా స్త్రీ కాంబాట్ దళాలను నిర్మించి యుద్ధరంగంలో దింపి, ఏ సమాజమూ విజయాన్ని సాధించిన సంఘటనలు, చరిత్ర రచన ప్రారంభకాలాన్నుండి నేటివరకూ మనకు కనిపించవు. అతి క్లిష్టమైన రాజకీయ, సైనిక పరిస్థితులలో ఇటువంటివి జరిగిన సందర్భాలున్నాయి. ఆ పరిస్థితి అంతరించిన తరువాత, ఆ ఆచరణ కూడా తెరమరుగైంది; లేదా పాలకులు ఆ విధానాలకు స్వస్తి చెప్పారు ఈ సత్యాన్ని గమనించకుండా మనదేశం ఈ మార్గాన్ని అనుసరించటం (స్త్రీ కాంబాట్ దళాలను యుద్ధ రంగానికి పంపటం - రచయిత) అహంకార జనితమైన బాధ్యతారాహిత్యమే అవుతుంది."

ప్రజాభిప్రాయ సేకరణకు జరిగిన సర్వేలో ఇందుకు అనుకూలత, వ్యతిరేకత కూడా సమాన పరిమాణాలలో వ్యక్తమైంది. పదాతి దళాలలో తప్ప, ఇతర దళాలలో స్త్రీలను కాంబాట్ యూనిట్లలో చేర్చటానికి తీవ్రమైన వ్యతిరేకత వ్యక్తంగాలేదు. మతాల ప్రతినిధులు మాత్రం ఈ విధానాన్ని నిర్ద్వంద్వంగా వ్యతిరేకించారు.

కొన్ని ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే స్త్రీలు కాంబాట్ యూనిట్లలో చేరి యుద్ధ రంగానికి వెళ్ళటాన్ని అమెరికా సమాజం అంగీకరించటమే గాదు, పైగా ప్రోత్సహిస్తున్నట్లు కమిషన్ భావించింది; ఇందుకు అనుగుణంగానే సిఫార్సు చేసింది. కమిషన్ సభ్యులలో ఒక్కరు మాత్రమే దీనిని వ్యతిరేకించారు.

### నేలమీద జరిగే యుద్ధంలో మహిళా కాంబాటెంట్లు

కమిషన్ ఏర్పాటుకు పూర్వం, అమెరికా రక్షణశాఖ మహిళా కాంబాట్ యూనిట్లను నేలమీద జరిగే యుద్ధంలోకి (గ్రౌండ్ కాంబాట్‌కు) పంపటాన్ని నిషేధించింది. కమిషన్ సిఫార్సుల తర్వాత కూడా ఇదే విధానం అమలు జరుగుతున్నది. యుద్ధ నిర్వహణలో ఎంతటి సాంకేతిక విధానాలు ప్రవేశించినా, దానిలోని ప్రమాదసంభవ పరిమాణాలు ఏ మాత్రము తగ్గలేదన్న అంశాన్ని కమిషన్ గుర్తించింది. ఇందుకు సంబంధించిన రిపోర్టులోని వివరాలను గమనించండి :

**"దళంలో సెక్సు ప్రమాదఘటితం"**

"గల్ఫ్‌వార్ సందర్భంలో నిర్వహించిన డిజర్ట్ షీల్డ్- డిజర్ట్ స్టార్మ్ వ్యూహపు అమలులో స్త్రీలు - పురుషులున్న మిశ్రమ దళాలు పాల్గొన్నాయి అమెరికన్ ప్రెసిడెన్షియల్ కమిషన్. సైనికుల అభిప్రాయ సేకరణకు రోపర్ సంస్థతో పోల్‌ను నిర్వహింపజేసింది ఈ దళాలలోని 64 శాతం మంది. తమ దళంలోని స్త్రీ పురుషుల మధ్య సెక్సు సంబంధాలున్నట్లు చెప్పారు ఆర్మీలో 74 శాతం మంది, మెరైన్ కార్ప్స్‌లో 73 శాతం మంది కూడా తమ దళాలలోని స్త్రీ పురుషుల మధ్య సెక్సు సంబంధాలున్నట్లు వెల్లడించారు. (గల్ఫ్‌వార్‌లో స్త్రీ పురుషులు కలసి ఉన్న దళాలు కాంబాట్‌కు వెళ్ళినవి గావు. ఇవి కాంబాట్ సపోర్టు, కాంబాట్ సర్వీసు దళాలు మాత్రమే) ఈ అనుభవం వలన మనకు స్పష్టమవుతున్న అంశమిది యువతీ యువకులు అత్యంత సన్నిహిత స్థానాలలో పనిచేస్తున్నారు. వీరంతా తమ కుటుంబీకులకు దూరంగా ఉన్నారు: అత్యంత ప్రమాదకరమైన పరిస్థితులలో పనిచేస్తున్నారు అంతేగాదు, మాసాల తరబడి ఇలాంటి వాతావరణంలో ఉంటున్నారు. ఇటువంటి పరిస్థితులలో మానవులలో సెక్సు వాంఛ ప్రకోపించటం సహజం. ఈ పరిణామం యూనిట్ సంఘటిత శక్తిని బలహీనపరుస్తుంది జీవన్మరణ పోరాటాన్ని నిర్వహిస్తున్న దళనాయకులకు ఇదొక పెద్ద క్రమశిక్షణా సమస్యగా తయారై, వారి లక్ష్యసాధనా దీక్షను దెబ్బతీస్తుంది. యుద్ధ రంగంలోని చిన్న దళాలలో సెక్సు సమస్యలుత్పన్నమైతే, అప్పటికే విపరీతమైన భారాన్ని మోస్తున్న దళం అత్యంత ప్రమాదకరమైన పరిస్థితిని ఎదుర్కొనవలసి వస్తుంది.

-- డిస్సెంట్ నోట్‌లో మాజీ యు యస్ జనరల్ మాక్స్‌వెల్ ఆర్. త్రూమన్

"కమిషన్ సేకరించిన సాక్ష్యాధారాలు స్త్రీ పురుషుల శరీర దార్ఢ్యంలో ఉన్న తేడాలను ధృవపరిచాయి. మహిళలలో అధికులు పురుషుల కంటే పొట్టిగా ఉంటారు; కండబలం తక్కువగా ఉంటుంది; పురుషుల కంటే తక్కువ బరువుంటారు. కండబలంలోనూ, అలువురాని దమ్ము (Aerobic Capacity) విషయంలోనూ స్త్రీ పురుషుల మధ్య నున్న తేడా, స్త్రీలకు ఇబ్బందికరంగా తయారవుతుంది. శత్రువుతో ఎదురు నిలిచి పోరాడటం, కందకాల తవ్వకం, బరువయిన సామగ్రిని మోయటం, లేదా వాటిని ఎత్తటం వంటి పనులు గ్రౌండ్ కాంబాట్‌లో ఉంటాయి. ఇలాంటి పనులను స్త్రీలు చురుకుగా చేయలేరు.

"మహిళల కాంబాట్ యూనిట్లలో పనిచేయదలచిన అత్యధిక శారీరక దార్ఢ్యం గలవారిని కమిషన్ చూచింది. ఇటువంటి వారు ఆ పనికి తగుదురని కమిషన్‌కు తెలుసు. ఇంతటి శక్తి మహిళలలో అతి తక్కువ మందికి మాత్రమే ఉంటుంది. 1992వ సంవత్సరంలో 900 మంది మహిళా సైనికులు ఒక సర్వేలో పాల్గొన్నారు. వీరిలో పన్నెండు మంది సైనికులు, పది మంది నాన్ కమిషన్డ్ ఆఫీసర్లు మాత్రమే కాంబాట్ యూనిట్లలో పనిచేయటానికి తమ సంసిద్ధతను వ్యక్తం చేశారు

"దళంలో స్త్రీలుండటం యొక్క ప్రభావం, దానిమీద ఎలా ఉంటుందో కమిషన్ పరిశీలించింది. దళ సభ్యులలో ఒకరిమీద మరొకరికి విశ్వాసముండాలి; సమిష్టి అనుభవం ఉండాలి; అంతా సమానులమన్న భావం వారిలో రావాలి. అపుడే దళపు సంఘటిత శక్తి రూపొంది మనుతుంది. స్త్రీలు పురుషుల దళంలో చేరటం యొక్క ప్రభావం, దళపు సంఘటిత శక్తి మీద ఎలా ఉంటుంది అన్న అంశంపై జరిగిన సర్వే సమాచారం ఏదీ కమిషన్ దృష్టికి రాలేదు. పూర్తిగా పురుషులున్న దళాల మీదే ఇటువంటి సర్వేలు జరిగాయి. ఉన్న పరిశోధనా ఫలితాలను పరిశీలించినపుడు, దిగువ పేర్కొన్న పరిస్థితులలో కొన్ని సమస్యలు అంకురించ వచ్చునని స్పష్టమైనది :

1. దళంలోని ప్రతి సభ్యునితో సమంగా శారీరక శ్రమతో చేయదగిన పనులను సక్రమంగా నిర్వహించగలగాలి; ఇందుకు కండబలం, దమ్ము అవసరం.

2. స్నానాలు చేయటానికి, బట్టలుతకటానికి స్త్రీ సైనికులకు ప్రత్యేక వసతులుండవు. స్త్రీ పురుషులు ఒకే మరుగుదొడ్డిని వాడవలసి ఉంటుంది. ఇందువల్ల స్త్రీ పురుషులు

ఒకే చోట, ఒకేసారి ఈ పనులను చేయవలసి వస్తుంది. స్త్రీలకు ప్రత్యేక వసతి లభించదు

3. స్త్రీలను రక్షించటం, పాశ్చాత్య సంప్రదాయంలో అత్యంత విలువైన అంశం కనుక తోటి దళ సభ్యురాలు ప్రమాదంలో పడితే, తన బాధ్యతను విస్మరించి, పురుష సైనికుడు ఆవిడ రక్షణకు వెళ్ళే అవకాశాలుంటాయి.

4. సెక్సు సంబంధాల ఏర్పాటు జరుగవచ్చు.

5. గర్భధారణ కూడా సంభవించవచ్చు.

"నేలమీద జరిగేయుద్ధంలో స్త్రీ పురుషులు కలిసి పాల్గొనేటపుడు వారి మధ్య సెక్సు సంబంధాలు ఏర్పడే అవకాశాలు అధికంగా ఉంటాయి. జీవన్మరణ పోరాటం జరుగుతున్న కాలంలో దళ నాయకులకు, పై సైనికాధికారులకూ, ఇదొక అదనపు క్రమశిక్షణా సమస్యగా వారి నెత్తిన పడుతుంది. ఇందువల్ల లక్ష్యం మీది నుండి వారి దృష్టి మరలుతుంది; వారి కార్య నిర్వహణాభారం కూడా పెరుగుతుంది.

"నేల మీద యుద్ధం చేసే సైనికులు బందీలుగా పట్టుబడే అవకాశాలు అధికంగా ఉంటాయి. కమిషన్ ముందు యుద్ధఖైదీలుగా చిక్కినవారు కూడా సాక్ష్య మిచ్చారు. వారి సాక్ష్యాన్ని బట్టి చూస్తే, జనీవా కన్వెన్షన్ నిర్దేశిత సూత్రాలను ఎవరూ పాటిస్తున్నట్లు కనుపించటం లేదు (యుద్ధ ఖైదీల యెడల అనుసరించదగిన విధానాలను ఈ కన్వెన్షన్ నిర్దేశించింది - ర॥) 20వ శతాబ్దంలో జరిగిన యుద్ధాలన్నిటిలోను (ఒక్క వియత్నాం యుద్ధంలో తప్ప) ఇతర అన్ని దళాలలో కంటే నేలమీద పోరాటం సాగించే దళాల సభ్యులే అధిక సంఖ్యలో ఖైదీలుగా చిక్కారు. సంఖ్యా పరిమాణక్రమంలో వీరి తర్వాత వైమానిక దళ సభ్యులొస్తారు. నావికాదళ సభ్యులు ఖైదీలుగా చిక్కే అవకాశాలు అతి తక్కువగా ఉంటాయి. యుద్ధ ఖైదీలుగా చిక్కిన స్త్రీ సైనికుల యెడల శత్రు పక్షం చూపే దురుసుదనం, అమలు పరచే అసభ్యకర విధానాల ప్రభావం పురుష సైనికుల మీద విషమంగా ఉంటుందని, రక్షణశాఖ ప్రతినిధులు, యుద్ధ ఖైదీలుగా అనుభవాన్ని పొందినవారు కమిషన్‌కు వివరించారు.

"గ్రౌండ్ కాంబాట్‌లో స్త్రీలు పాల్గొనవచ్చా లేదా అన్న అంశం మీద కమిషన్ ప్రజాభిప్రాయాన్ని, సైనికుల అభిప్రాయాలను కూడా సేకరించింది. అన్ని రకాల గ్రౌండ్ కాంబాట్‌లలోనూ స్త్రీలు పాల్గొనకూడదని సైనికులు అభిప్రాయపడ్డారు. ప్రజలు అనుకూలంగానూ, వ్యతిరేకంగానూ కూడా అభిప్రాయ ప్రకటనలు చేశారు. రోపర్ సంస్థ ద్వారా, ప్రజాభిప్రాయ సేకరణకు జరిపించిన సర్వేలో, ఇన్‌ఫాంట్రీ దళంలో స్త్రీలుండ కూడదని 57 శాతం మంది సూచించారు; మెరైన్ ఇన్‌ఫాంట్రీ దళంలో స్త్రీలుండరాదన్న అభిప్రాయాన్ని 52 శాతం మంది ప్రకటించారు.

"రోపర్ సంస్థ ద్వారా సైనిక దళాలలో అభిప్రాయ సేకరణకు జరిపించిన సర్వేలు, అధికంగా వ్యతిరేకతను ప్రకటించాయి. సర్వేలో పాల్గొన్న సైనికులలో 74 శాతం మంది ఇన్‌ఫాంట్రీలో మహిళలు ఉండటం వాంఛనీయంగాదన్నారు. మెరైన్ ఇన్‌ఫాంట్రీలో స్త్రీలకు స్థానం ఉండకూడదని 72 శాతం మంది ప్రకటించారు; టాంకు డ్రైవర్లుగా వీరుండరాదన్న అభిప్రాయాన్ని 59 శాతం మంది వ్యక్తం చేశారు. 54 శాతం మంది ఆర్టిలరీలో స్త్రీలుండరాదన్నారు. గ్రౌండ్ కాంబాట్‌లో పాల్గొన్న సైనికులలో 83 శాతం మంది, ఇందులో స్త్రీలకు స్థానమీయకూడదని చెప్పారు; మెరైన్ ఇన్‌ఫాంట్రీలో పనిచేసిన వారిలో 83 శాతం మంది కూడా ఇలాంటి అభిప్రాయాన్నే ప్రకటించారు. ఆర్మర్డ్ దళంలో పనిచేసిన వారిలో 71 శాతం మంది, ఆర్టిలరీలో పనిచేసిన వారిలో 64 శాతం మంది స్త్రీల నియామకాన్ని వ్యతిరేకించారు

"పలుదేశాలు స్త్రీలను గ్రౌండ్ కాంబాట్‌కు పంపాయి; కాని అవి సాధించినది నామ మాత్రం, (సోవియట్ యూనియన్, జర్మనీ, ఇజ్రాయెల్ దేశాలు ఇందులో ప్రధానమైనవి) వాటి జాతి మనుగడకే ప్రమాదం సంభవించిన పరిస్థితులలో, ఆత్మరక్షణకు సర్వస్వాన్ని ఒడ్డి ఆదేశాలు పోరాడవలసి వచ్చింది. ఆ ప్రమాదం తప్పిన తర్వాత, గ్రౌండ్ కాంబాట్ నుండి స్త్రీలను ఆదేశాల వారు తొలగించారు. ఇటీవలి కాలంలో కొన్ని దేశాలు గ్రౌండ్ కాంబాట్ యూనిట్లలో స్త్రీలను ప్రవేశపెట్టాయి; కాని ఆ ప్రయోగాలు విఫలమైనట్లు తేలింది.

"స్త్రీలను గ్రౌండ్ కాంబాట్‌లో ప్రవేశ పెట్టకూడదు అన్న అంశం స్పష్టంగానూ, నిర్ద్వంద్వంగానూ తేలింది. గ్రౌండ్

కాంబాట్‌లో ప్రదర్శించవలసి వచ్చే కండబలం, దమ్ము విషయాలలో స్త్రీ పురుషుల మధ్య నున్న వ్యత్యాసాలు స్పష్టంగా వెలుగులోకి వచ్చాయి. దీనికి తోడు, సైన్యంలో ఇప్పటికే పనిచేస్తున్న వారిలో అతికొద్ది మంది మాత్రమే గ్రౌండ్ కాంబాట్‌కు వెళ్ళటానికి అంగీకరించటాన్ని కూడా మనం గుర్తించాలి విజయసాధనకు దళపు సంఘటిత శక్తి ప్రదర్శన అవసరం స్త్రీలు దళంలో చేరటం వల్ల ఈ శక్తి దెబ్బతినే ప్రమాదం ఉన్నది. ఇది ఏ రూపంలో ఉంటుంది అనేఅంశం స్పష్టంగా తెలియక పోయినా, కాంబాట్ దళాలలో స్త్రీలుండటం నష్టకరమన్న విషయం స్పష్టంగా రుజువైంది. ఇందువల్ల కమిషన్ సభ్యులు అంతా ఈ విషయంలో ఆందోళనను ప్రదర్శించారు గ్రౌండ్ కాంబాట్‌కు స్త్రీలను పంపకూడదు అన్న ప్రజాభిప్రాయం స్పష్టంగా ప్రదర్శితమైంది. కాంబాట్ యూనిట్లలో కార్యభారాన్ని మోసి, అనుభవాన్ని సంపాదించిన సైనికులు సయితం ఇందుకు తమ వ్యతిరేకతను తీవ్రంగానూ, సుస్పష్టంగానూ వ్యక్తం చేశారు గ్రౌండ్ కాంబాట్ యూనిట్లలో స్త్రీలను చేర్చటానికి సంబంధించిన అంతర్జాతీయానుభవం కూడా ఈ అంశాన్ని స్పష్టంగా సమర్థించటం లేదు..."

ఈ పరిశీలనల తర్వాత కమిషన్ స్త్రీలను గ్రౌండ్ కాంబాట్‌కు పంపకూడదు అని సిఫార్సు చేసింది. ముందు కాలంలో కొందరు ఈ విధానాన్ని కోర్టులలో సవాలు చేయకుండా నిరోధించటానికి అవసరమైన రూల్సును రూపొందించవలసినదిగా కమిషన్ దేశ రక్షణ శాఖకు సూచించింది.

## దాడికి వెళ్ళే విమానాలలో....

శత్రు గగన తలం నుండి దాడులు జరపటానికి వెళ్ళే విమానాల కూల్చివేత జరిగే ప్రమాదమున్నది; విమానం కూలినపుడు పైలట్ పట్టుబడే అవకాశాలుంటాయి కనుక స్త్రీలను ఎయిర్ కాంబాట్ దళాలలోచేర్చకూడదని కమిషన్ అభిప్రాయపడింది. వైమానిక దళంలో స్త్రీలు పనిచేస్తున్నారు; వారి పనిమీద ఎటువంటి వ్యతిరేకతా, పురుష పైలట్లలో కనిపించటం లేదు. కాని, వారిని ఎయిర్ కాంబాట్ దళంలో చేర్చటాన్ని మాత్రం వారు వ్యతిరేకిస్తున్నారు. ప్రపంచంలోని అన్ని యుద్ధ స్థావరాలలో పనిచేస్తున్న అమెరికా వైమానిక దళాల సిబ్బంది అభిప్రాయలను కమిషన్ సేకరించింది. సర్వేలో పాల్గొన్న పైలట్లలో నూరింట 69 మంది, ఎయిర్ కాంబాట్‌లో స్త్రీలుండటాన్ని వ్యతిరేకించారు స్త్రీలను ఎయిర్ కాంబాట్ దళాలలో చేర్చటం వలన, దళపుసంఘటిత శక్తి నీరసిస్తుందనీ, తద్వారా దళపు పని నాణ్యత తగ్గుతుందనీ కమిషన్‌లోని మెజారిటీ సభ్యులు అభిప్రాయపడ్డారు. కమిషన్ ముందు సాక్ష్యమిచ్చిన వైమానిక దళ సభ్యులు, కమాండర్లంతా, స్త్రీలు శత్రువు చేతిలో చిక్కే అవకాశం ఉంటుంది, తమ తోటి సిబ్బంది వారి చేతిలో యమయాతనలు అనుభవించటాన్ని చూచి తాము భరించలేమనీ. ఇది దళాలనైతిక బలాన్ని నీరసింపజేస్తుందని వాదించారు గల్ఫ్‌వార్‌లో గాయపడిన అమెరికా సైనికుల రక్షణకు వైద్యబృందం హెలికాప్టర్లలో వెళ్ళింది దానిని శత్రువు కూల్చి వేయగా, అందులోని పురుష సిబ్బందిలో ఐదుగురు చనిపోయారు. ఒక లేడీ డాక్టరు, ఇద్దరు పురుష సిబ్బంది గాయపడి శత్రువు చేతిలో చిక్కారు. శత్రు సైనికులు గాయపడిన లేడీ డాక్టరును చికిత్సకు పంపటానికి బదులు, పురుష సైనికుల యెదుటే మానభంగం చేశారు ఆవిడే ఈ విషయాన్ని కమిషన్ ముందు వివరించింది. స్త్రీలు పైలట్లుగా ఉండటానికి పనికిరారని చెప్పటానికి తగిన శాస్త్రీయ సాక్ష్యాధారాలేవీ లభించలేదని కమిషన్ చెబుతూ, శత్రువు చేతిలో స్త్రీలు చిక్కే ప్రమాదాన్ని మాత్రమే కారణంగా చూపుతూ, కాంబాట్ ఎయిర్ క్రాఫ్ట్‌లో స్త్రీలకు స్థానం ఉండకూడదు అని సిఫార్సు చేసింది ఈ సిఫార్సును కమిషన్ సభ్యులలో ఎనిమిది మంది బలపరచగా, ఏడుగురు వ్యతిరేకించారు. కమిషన్‌లో రెండు వాదాలకు (అనుకూల, ప్రతికూల) దాదాపు సమాన బలం ఉండటం గమనించదగిన అంశం.

## దాడికి వెళ్ళే నావలలో...

కాంబాట్ వెసల్స్‌లో స్త్రీలు చేరటానికి వ్యక్తమయిన వ్యతిరేకత నామ మాత్రమే! నావికాదళంలో బరువులెత్తటం, దించటం వంటి పనులకు శారీరక దార్ఢ్యం అవసరమే. ఈ విషయంలో స్త్రీలు కొంచెం వెనుకబడతారు. ఇతర విషయాలలో వీరు పురుషులతో సమంగా పనిచేయగలరని గత అనుభవం నిరూపించినట్లు కమిషన్ అంగీకరించింది. ఒకసారి సముద్రం మీదికి వెళితే ఆరుమాసాల లోపల తిరిగి వచ్చే అవకాశాలుండవు; నివాస వసతి నావలోచాలా తక్కువగా

ఉంటుంది. ఇది స్త్రీలకు ఇబ్బందికరంగా ఉంటుంది. వారికి తగినట్లు నివాస వసతి కల్పనకు ఒక్కొక్క నావకు, దాని పరిమాణాన్ని బట్టి 66వేల డాలర్ల నుండి నలభై లక్షల డాలర్ల వరకూ ఖర్చవుతుందని కమిషన్ అంచనా వేసింది. ఇప్పటి మిలటరీ బడ్జెట్‌లో ఇలాంటి ఖర్చులకు అవకాశాలు లభించవని కూడా కమిషన్ భావించింది.

ప్రజాభిప్రాయ సేకరణకూ, నావికాదళ సభ్యుల అభిప్రాయసేకరణకు, కమిషన్ సర్వేలు నిర్వహింపజేసింది. సర్వేలో పాల్గొన్న పౌరులలో నూరింట 83 మంది మహిళలకు కాంబాట్ వెసల్స్‌లో స్థానం ఉండాలన్న అభిప్రాయాన్ని ప్రకటించారు ఇంతకు పూర్వమే సైన్యంలో పనిచేసిన అనుభవం ఉన్న వారిలోనూరింట 72 మంది కూడా ఇలాంటి అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. నావికాదళ సభ్యులలో 73 శాతం మంది, స్త్రీలు కాంబాట్ వెసల్స్‌లో పనిచేయటానికి సుముఖతను ప్రకటించారు. కమిషన్ ఇతర దేశాల అనుభవాలను కూడా పరిశీలించింది. పలు దేశాల వారు తాము స్త్రీలను కాంబాట్ వెసల్స్‌లో ప్రవేశపెట్టే కృషిలో ఉన్నట్లు తేలింది.

ఈ విచారణానుభవంతో కమిషన్ స్త్రీలకు కాంబాట్ వెసల్స్‌లో స్థానం ఉండాలి అని సిఫార్సు చేసింది. ఈ సిఫార్సును ఎనిమిది మంది బలపరచగా ఆరుగురు వ్యతిరేకించారు. ఒక్కరు తటస్థంగా ఉన్నారు.

స్త్రీలకు కాంబాట్ దళాలలో స్థానం లేకుండా పోవటానికి కారణం సైనికంగాదని, సాంఘికమని మార్టిన్ వాన్ క్రివెల్డ్ సూచించిన విషయాన్ని ఇంతకు పూర్వమే వివరించాం. వీరి సూచనకు ప్రెసిడెన్షియల్ దర్యాప్తు సోదాహరణ వ్యాఖ్యగా కనిపిస్తుంది. సాంఘిక కారణాలేవో, అవి సైన్యంలో ఎటువంటి ఇబ్బందులకు దారిదీస్తాయో కమిషన్ ముందు సాక్ష్యమిచ్చిన వారు వివరించారు. స్త్రీల యెడల సంఘము, ముఖ్యంగా పురుషులు అవలంబిస్తున్న వైఖరి, సంప్రదాయము మారితేనే తప్ప, సైన్యంలో పురుషులతో సమానమైన స్థానం స్త్రీలకు లభించదు. జినీవా కన్వెన్షన్ నిర్దేశాలను దాదాపు ఏ దేశమూ యుద్ధఖైదీల యెడల పాటించటం లేదు. ఇక ముందు కూడా ఇదే ధోరణి ప్రదర్శితం గాదు అని చెప్పటానికి ఆధారాలు కూడా కనిపించటం లేదు. మానవత్వం కంటె పశుత్వమే త్వరితగతిని పెరుగుతున్న ఈ కాలంలో, శత్రువు చేతిలో యుద్ధఖైదీగా చిక్కిన స్త్రీకి రక్షణ లభించదు. ఈ పరిస్థితి మారనంత వరకూ ఏ సమాజమూ తమ స్త్రీలకు ఇటువంటి ప్రమాదాలను సంభవించనీయదు. కనుక కాంబాట్ దళాలలో స్త్రీలకు స్థానం లభించటం అనుమానాస్పద మైన అంశంగానే ఉంటుంది.

ఇప్పటికి లభిస్తున్న సమాచారాన్ని బట్టి ఒక్క అమెరికా, ఇజ్రాయెల్, కెనడా దేశాల సైన్యంలో మాత్రమే స్త్రీలు పదకొండు శాతం వరకూ (సంఖ్యాపరిమాణం) ఉన్నారు. మిగిలిన దేశాలలో నామ మాత్రంగానే ఉన్నారు. (ఈ అధ్యాయంలోని ఒకటవపట్టికను చూడండి) డెన్మార్క్, కెనడా దేశాల కాంబాట్ యూనిట్లలో స్త్రీలున్నా, వారి సంఖ్య, అన్ని దళాలలోనూ కలిసి పన్నెండుకు మించలేదు !

కమ్యూనిస్టుల పాలనలోని సోవియట్ యూనియన్ అంతరించిన తర్వాత, "డెమోక్రసీస్" గా వ్యవహరిత మవుతున్న పెట్టుబడిదారీ దేశాలలో కొంతమేరకు వాస్తవికత ప్రదర్శిత మవుతున్నది. అణ్వాయుధాల ప్రయోగంతో సాగే యుద్ధంలో, జయించినవారికి మిగిలేది స్మశానమేనన్న భావం అన్ని దేశాలలోనూ వ్యక్తమవుతున్నది. కనుక అణ్వాయుధ ప్రయోగానికి కాలం తీరిందని నిపుణులు అభిప్రాయపడుతున్నారు.

యుద్ధ సామాగ్రి తయారీలో అత్యంతాధునిక విధానాలను అవలంబిస్తున్నారు. స్వయంచలితశక్తిది పై చేయిగా మారి మానవుని పాత్ర యుద్ధరంగంలో తరిగిపోతున్నది. దీనికి తోడు, దేశ సరిహద్దులను చెరుపగల యుద్ధాలు ఇక ముందు జరిగే అవకాశాలు చాలా తక్కువగా ఉన్నాయని మార్టిన్ వాన్ క్రివెల్డ్ అభిప్రాయపడుతున్నారు. యుద్ధాలనేవి ఇక స్థానికంగా జరిగే తిరుగుబాట్లు, సాయుధ పోరాటరూపాలలో ఉండే "లో ఇన్‌టెన్సిటీ వార్‌ఫేర్" గానే ఉంటాయని వీరు చెబుతున్నారు. ఇందుకు ఉదాహరణగా మనదేశంలోని కాశ్మీరులో జరుగుతున్న సంఘటనలను కూడా రచయిత ఉదహరించారు. అణ్వాయుధాల రంగప్రవేశం వలన, పోరాడే సైనికుని విలువ కొంత దెబ్బతింటే, ఈ "లో ఇన్‌టెన్సిటీ వార్ ఫేర్" వలన వారి ప్రాముఖ్యత మరికొంచెం తగ్గినట్లు మార్టిన్ వాన్ క్రివెల్డ్ అభిప్రాయపడుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో కొన్ని

పాశ్చాత్య దేశాలు స్త్రీలను సైన్యంలోనికి తీసుకొంటూ ఉండటాన్ని, సైన్యంలో లింగ వివక్షతా క్షీణతకు సూచనగా భావించరాదంటూ, వారు తమ అభిప్రాయాన్నిలా వివరించారు

"ఈ శతాబ్దపు డెబ్భయ్యోవ దశాబ్దంనుండీ పలు పాశ్చాత్య దేశాలలో స్త్రీలు సైన్యంలో అధికంగా చేరుతూ ఉండటం కనిపిస్తున్నది. దీన్ని సైన్యంలో స్త్రీ పురుష సంబంధాలలో వచ్చిన మార్పుగానే కాదు, అట్టి మార్పుకు సూచనగా కూడా పరిగణించకూడదు ఇజ్రాయెల్ అతి చిన్న దేశము. శక్తివంతమైన పలు శతృదేశాలు దీన్ని చుట్టిముట్టి ఉన్నాయి. కొన్ని సంవత్సరాలుగా ఈ దేశము తన మనుగడకు సర్వస్వాన్ని ఒడ్డి పోరాడుతున్నది. అందువల్ల సైనిక చర్యలలో స్త్రీలకు స్థానం కల్పించక తప్పలేదు స్త్రీల సహాయం దేశానికి అవసరమైనా, వారు సైనిక చర్యలలో పాల్గొనటం వలన పలురకాల సమస్యలను ఎదర్కొనవలసి వచ్చింది. ఇలాంటి అత్యవసర పరిస్థితులలో చిక్కని దేశాలు కూడా సైన్యంలో స్త్రీలకు స్థానాన్ని కల్పిస్తున్నాయి ఫెమినిస్టుల వత్తిడివలన ఈ దేశాలు ఇందుకు అవకాశాన్ని ఇస్తున్నాయి పోరాడే సైన్యంగా తమ పాత్రను, తమ ప్రాధాన్యతను సైన్యం కోల్పోతున్న విషయాన్ని నాయకత్వం క్రమంగా గ్రహిస్తున్నది. అణ్వాయుధాల రాక తర్వాత దాని ప్రాధాన్యత కొంత మేరకు తగింది ఇటీవల ప్రారంభమైన 'లో ఇన్‌టెన్సిటీ వార్ ఫేర్' వలన పోరాడే సైనికుని ప్రాధాన్యత తగ్గింది ఒక దేశం మరొక దేశం మీద దండయాత్ర సాగించటం అనేది దుహూహ్యంగా తయారైంది. ఈ పరిస్థితులలో స్త్రీలకు సైన్యంలో స్థానం కల్పించటం, లేక వత్తిడికి లొంగి వారిని సైన్యంలో చేర్చుకోవటం అనే దానిని, సైన్యం యొక్క ప్రాధాన్యత అంతరించే దశ రాకకు సూచన గానే కాక, అందుకు కారణంగా కూడా భావించాలి" (ది ట్రాన్స్‌ఫర్మేషన్ ఆఫ్ వార్)

ఇంతవరకూ జరిగిన పరిశీలన వల్ల స్పష్టంగా తేలిన అంశాలివి :

1) స్త్రీని రక్షించటం పురుష ధర్మంగా మన సమాజంలో చలామణిఅవుతున్నది మన సామాజిక సంస్కృతిలో ఈ భావం

"దేశ రక్షణ విషయ నిర్ణయాలలో స్త్రీలకు లభిస్తున్న పాత్ర అత్యల్పం"

"శాంతి రక్షణకు అత్యవసరమైన నిరాయుధీకరణ, దేశాల మధ్య సత్సంబంధాల యేర్పాటు వంటి అంశాల నిర్ణయంలో స్త్రీలకు లభిస్తున్న ప్రాతినిధ్యం చాలా తక్కువగా ఉన్నది. 1975 నుండి 1986 వ సంవత్సరం వరకూ వియన్నాలో, మధ్యయూరపులో సైన్యం తగ్గింపుకు తీసుకోవలసిన చర్యలపై జరిగిన సమావేశాలను చూడండి. ఈ సమావేశాలకు మొత్తం పంథొమ్మిది ప్రతినిధి వర్గాలు వస్తే, వాటిలో వచ్చినది మొత్తం పదిమంది మహిళలు మాత్రమే. ఇందులో ఐదుగురు సమావేశాలు ముగియబోయే దశలో మాత్రమే వచ్చారు. 1989వ సంవత్సరంలో ఐక్యరాజ్యసమితికి వచ్చిన దేశాల శాశ్వత దౌత్యవర్గ సభ్యులలో ఇరవై శాతం మేరకే మహిళలున్నారు. యాభై రెండు సభ్యదేశాల ప్రతినిధులలో ఒక్క మహిళ కూడా లేదు. (ఇది మొత్తం సభ్య దేశాలలో 37 శాతం) లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలు మాత్రం అన్ని దేశాలకంటె అధిక సంఖ్యలో మహిళా ప్రతినిధులను పంపాయి. ఈ దేశాల మహిళా ప్రతినిధులు 37 శాతం మంది వరకూ ఉన్నారు. పశ్చిమ యూరపు దేశాల ప్రతినిధి వర్గాలలో 26 శాతం మంది, ఆఫ్రికా దేశాల ప్రతినిధి వర్గాలలో 15 శాతం మంది, ఆసియా, పసిఫిక్ ప్రాంతదేశాల ప్రతినిధులలో 12 శాతం మంది, తూర్పు యూరపు దేశాల ప్రతినిధి వర్గాలలో 4 శాతం మంది మహిళలున్నారు. నిరాయుధీకరణ, అంతర్జాతీయ భద్రతా విషయాలను పరిశీలించే జనరల్ అసెంబ్లీ యొక్క మొదటి కమిటీలో స్త్రీలు 7.9 శాతం మంది మాత్రమే ఉన్నారు. ఈ కమిటీ లోకి కూడా అత్యధిక సంఖ్యలో (16.3 శాతం) మహిళలను పంపినది లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలే. మహిళా ప్రాతినిధ్యానికి సంబంధించిన ఈ అంతర్జాతీయ పరిమాణాలే, దేశీయ విషయాలకు కూడా వర్తిస్తాయని చెప్పవచ్చు. రక్షణ విషయ నిర్ణయాలలో స్త్రీలకు లభిస్తున్న పాత్ర అత్యల్పం"

- మహిళాభ్యుదయాన్ని కోరే నైరోబి మహాసభా నిర్ణయాల అమలు మీద యునైటెడ్ నేషన్స్ *సెక్రటరీ జనరల్ రూపొందించిన రెండవ సమీక్ష (1995) నుండి.*

జీర్ణించింది. అందువలన శత్రు పక్షంలోని స్త్రీసైనికుల సంహారానికి పురుష సైనికులు పూనుకోలేరు. తమ దళంలో ఉన్న స్త్రీ సైనికులు పోరాట సమయంలో ప్రమాదానికి గురయ్యే అవకాశాలున్నపుడు, వారి రక్షణకు వీరు వెళతారు. ఇందువలన దళపు సంక్షేమం, ఆ సైనికుని భద్రతకు ప్రమాదమేర్పడవచ్చు. జీవన్మరణ పోరాట కాలంలో ఇలాంటి భావాలు, చర్యలు అత్యంత ప్రమాదాలకు దారి తీస్తాయి.

2. తమ స్త్రీ సైనికులు శత్రువుకు పట్టుబడి, వారి చేతిలో ఖైదీలుగా చిక్కిన వీరు, యమయాతనలు పడుతున్నా, అసభ్యకరమూ, మానహీనము అయిన బాధలను వారు శత్రువుల చేతిలో అనుభవించవలసి వచ్చినా, అది పురుష సైనికుల మనోనిబ్బరాన్నే గాక, దేశ ప్రజల మనోనిబ్బరాన్ని కూడా దెబ్బతీస్తుంది. యుద్ధ కాలంలో ఇలాంటి పరిణామాలు దేశ రక్షణా ప్రయత్నాలను బలహీన పరుస్తాయి

3. సైన్యంలోని స్త్రీలు, ట్రెయినింగు కాలం నుండీ సెక్సుపరమైన వేధింపులకు గురవుతుంటారు ఇది వారిని మానసికంగా క్రుంగదీస్తూంటుంది. ఇలాంటి అవకాశాల వలన పురుష సైనికుల మధ్య వైషమ్యాలు అంకురించవచ్చు. సంఘటిత శక్తి, పరస్పరావగాహన ప్రధానంగా ఉండవలసిన సైన్యంలో ఇలాంటి అవాంఛనీయ పరిణామాలు సైనిక శక్తిని నీరసింపజేస్తాయి. యుద్ధరంగంలో తలయెత్తగల సెక్సు సంబంధమైన సమస్యలు, జీవన్మరణ పోరాట వ్యూహంలో తలమునకలుగా ఉన్న సైనిక నాయకత్వానికి అదనపు భారమవుతాయి.

4. పిల్లలున్న సింగిల్ పేరెంట్స్ యుద్ధరంగానికి వెళ్ళటం వలన, వారి బిడ్డలు తీవ్రమైన ఎడబాటును అనుభవించవలసి ఉంటుంది. తల్లిదండ్రుల మరణ ప్రమాదం ఉంటుంది గనుక, వారి భవిష్యత్తు ప్రమాదభరితం గావచ్చు. చాలు, కాన్పు కారణాల వలన దళపు సంఘటిత శక్తి దెబ్బతింటుంది. ఇటువంటి పలురకాల కారణాలు అమెరికన్ ప్రెసిడెన్షియల్ కమిషన్ విచారణలో తేలాయి.

5. దేశ రక్షణకు ప్రమాదమేర్పడిన కాలంలో సోవియట్ యూనియన్, జర్మనీ, ఇజ్రాయెల్ వంటి దేశాలు స్త్రీలను కాంబాట్‌కు పంపినా, ఆపద తప్పినంతనే స్త్రీ సైనికులను ఉపసంహరించటం మనకు కనిపిస్తుంది. స్త్రీలు సైన్యంలో ఉండటం ప్రయోజనకరమనుకొన్న ఏ దేశమూ ఇటువంటి చర్యకు పాల్పడదు తమ సైన్యంలో పురుషులతో సమానమైన స్థానంలో స్త్రీలుండటం వలన, సైన్యం నైతికంగా అధిక నష్టానికి గురయినట్లు ఇజ్రాయెల్ సైనిక నాయకత్వం స్పష్టంగా ప్రకటించింది.

ఇచ్చట గమనించ వలసిన అంశమొకటున్నది. చరిత్రలోని ఏ సంఘటనగాని, ఏ దేశపు సైనికానుభవం గాని, స్త్రీలలో పోరాట దీక్ష కొరవడినట్లుగాని, కార్యశూరత్వం, బుద్ధికుశలత లోపించినట్లుగాని రుజువు చేయలేదు. పోరాటంలో వారు చూపిన సాహసం, పోరాట పటిమ శ్లాఘనీయమన్న అంశం స్పష్టంగా రుజువైంది పోరాట దళాలలో స్త్రీలకు స్థానం ఉండకూడదని చెబుతున్న దానికి కారణం కేవలం సాంఘికం. వర్తమాన సమాజంలో సైన్యంలో, పురుషులతోడి సమానత్వం లభించక పోవటం అనేది స్త్రీల అశక్తతకు సూచన కాదు. వారికిది మచ్చగాదు; వారి అశక్తతా ఫలితం గాదు.

సైన్యంలో పురుషులతో సమానమైన స్థానాన్ని ఆశించటం కంటె, దేశ రక్షణ, శాంతి రక్షణా విషయ నిర్ణయంలో సముచిత స్థానం తమకు దక్కాలని స్త్రీలు కోరటం అత్యవసరం యుద్ధం వలన అందరికంటే అధికంగా నష్టపడేది స్త్రీలు. కనుక ఈ విషయాల నిర్ణయంలో వీరికి సముచిత పాత్ర లభించాలి. ఇందుకు అవసరమైన కృషి జరగటం అవసరం.

## సైన్యంతో ముడివడిన పడుపు వృత్తి

సైన్యానికీ పడుపువృత్తికీ ఉన్న సంబంధం అతి ప్రాచీనమైనది. పూర్వ కాలంలో సైన్యం దండయాత్రకు వెళుతూంటే పడుపు వృత్తితో జీవించే వారు ఆ దళాల వెనుక వెళ్ళేవారట. ఆ సంబంధమే కాలానుగుణంగా మారుతూ పెంపొందుతున్నది. సైన్యము, దాని తాబేదారుల సహచర్యంతో అది నిర్మాణ ప్రాతిపదిక మీదకు వచ్చింది. ప్రపంచంలోని పలు ప్రాంతాలలో నెలకొన్న అమెరికా సైనిక స్థావరాలు ఈ పరిణామానికి తలమానికాలు. ఆసియా ఖండంలోని ఫిలిపీన్స్, దక్షిణకొరియా, తాయ్‌లాండ్ దేశాలలోనూ, అమెరికా ఖండంలోని మధ్య అమెరికా, కరిబియన్ ప్రాంతంలోనూ ఈ వృత్తిలో నున్న స్త్రీలు ఈ విషయాన్ని స్పష్టంగా వివరిస్తున్నారు.

పారిశ్రామికీకరణలో పడుపువృత్తి కూడా ఒక భాగంగా

పెంపొందుతున్నది ఇటీవల గ్లోబలైజేషన్ లేక ప్రపంచ మార్కెట్ల ఏకీకరణ క్రమంలో కూడా ఈ వృత్తి మిళితమై పోయింది. పడుపు వృత్తిలోని వారికి పోలీసులబాధ అధికంగా ఉంటుంది వీరికి విటుల ద్వారా సంక్రమించే రోగాల నుండి ఎటువంటి రక్షణా ఉండదు. ఈ వృత్తిలోని స్త్రీలు సుఖరోగాలు వస్తే తమ సొమ్ముతోనే వారు చికిత్స చేయించుకోవలసి ఉంటుంది మిలటరీతో ముడివడిన పడుపువృత్తికి నిర్మాణ ప్రాతిపదిక ఉంటుంది విటులకు రోగాలు రాకుండా సైనిక యంత్రాంగం, స్థానిక ప్రభుత్వము తగిన జాగ్రత్తలను తీసుకొంటాయి. సామాజిక స్త్రీల సెక్సును సైనికులు అనుభవించటానికి అన్ని వసతులనూ ప్రభుత్వము కల్పిస్తుంది. పారిశ్రామికీకరణ దశలోని పడుపువృత్తికి, సైనిక దళాలతో ముడివడిన పడుపు వృత్తికి ఉన్న తేడా ఇదే. "కమ్యూనిజం వ్యాప్తిని" అరికట్టటానికంటూ, అమెరికా కొన్ని దేశాలలో సైనిక స్థావరాలను ఏర్పాటుచేసింది. ఈ స్థావరాలలోని సైనికుల సెక్సు దాహాన్ని తీర్చటానికి, ఆ యా దేశాల ప్రభుత్వాలుకృషి చేయటం కూడా మనకు కనిపిస్తున్నది ఈ విధంగా "కోల్డ్‌వార్"తో సైనిక పడుపువృత్తి అనుసంధితమైంది! ఈ విషయాల మీద చరిత్రకారులతో పాటు పలువురు మహిళా కార్యకర్తలు, మహిళా జర్నలిస్టులు ఎంతో సమాచారాన్ని సేకరించారు. సైనిక పడుపు వృత్తి స్వభావాన్నీ, దానిలోని బాధలను వెలుగుకు తెచ్చారు.

సోవియట్ విస్తరణను అరికట్టే పేరిట మధ్య అమెరికాలో, అమెరికా ఏర్పాటు చేసిన సైనిక స్థావరాలలో హాండురాస్‌లోని ఎల్మరోల్ ఒకటి. పడుపువృత్తి కేంద్రాలలోని మహిళల బాధలను లూసి కొసిమర్ అనే జర్నలిస్టు 1985లో వ్రాసిన ఒక వ్యాసంలో వివరించారు. అమెరికా సైనికుల సెక్సు అవసరాలకే గాక, స్థానిక ప్రభుత్వ సైనికావసరాలకు కూడా వీరు వినియోగపడుతున్నట్లు వ్రాశారు. ఈ సైనిక స్థావరం వెలసిన మూడు సంవత్సరాల తర్వాత అచ్చటి పడుపువృత్తిలోని స్త్రీలు, ప్రబలిన సుఖరోగాలతో పడుతున్న బాధలను వర్ణించారు. ఈ రోగాలలో ఒక దానిని "వియత్నాం రోజ్" అన్న పేరిట వ్యవహరించే వారట! దక్షిణ అమెరికాలో (అమెరికా తిష్టవేసిన కాలంలో అచ్చట విపరీతంగా సుఖరోగాలు వ్యాపించాయి) సుఖరోగాల వ్యాప్తికి, కమ్యూనిస్టు వ్యతిరేక భావాలకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని ఈ మహిళా జర్నలిస్టు చక్కగా వివరించారు

లూసి కొసిమర్ ఆ స్థావర ప్రాంతంలో పడుపువృత్తిని చేసుకొంటున్న పలువురు మహిళలను కలుసుకొని వారి స్థితిగతులను విచారించారు. పదహారు సంవత్సరాల లోపు ప్రాయంలోని యువతులు కూడా అచ్చట ఉన్నట్లు వీరు రిపోర్టు చేశారు ఇలాంటి పసివారిని బలవంతంగా తీసుకువచ్చి పడుపు వృత్తిలో ప్రవేశపెడుతుంటారు ఇలాంటి వారిలో పారిపోవటానికి ప్రయత్నించిన ఒక యువతిని, పోలీసులు పట్టుకొని తెచ్చి తిరిగి పడుపు గృహ నిర్వాహకులకు అప్పగించిన ఉదంతాన్ని కూడా ఈవిడ వివరించింది కొందరు స్త్రీలు ఈ వృత్తికి స్వచ్ఛందంగా వచ్చినట్లు కనిపిస్తుంది. కాని వారు పొట్టగడవక వచ్చిన సంగతి చూపరుల కంటికి కనిపించదు తాము ఆర్జించిన ఆదాయంలో కొంత భాగాన్ని వసతి, పోషణావసరాలను కూర్చినందుకు గృహయజమానికి ఇవ్వవలసి ఉంటుంది. పైగా వైద్య చికిత్సావసరాలు పెరుగుతూ ఉంటాయి. చాల మందికి, ఈ అవసరాలకు సరిపడినంత ఆదాయం కూడా లభించదు. అందువలన వీరు గృహయజమానుల దాస్యం నుండి బయటపడే అవకాశమే లేనట్లు లూసి రిపోర్టు చేశారు.

స్థానిక పోలీసులు, మిలటరీ కంట్రోలు క్రింద పడుపు వృత్తిని నియమిత పరచటాన్నీ, స్థానిక మహిళల సెక్సును తమ అవసరాలకు వాడుకొనే హక్కు తమకున్నట్లు, అమెరికా సైనికులు ప్రవర్తిస్తున్న తీరును కూడా వీరు వివరించారు సైనిక స్థావరంలోని సైనిక డాక్టర్లు, రోగ నిర్ధారణ కోసం పడుపు వృత్తిలోని మహిళల మీద వైద్య పరీక్షలను నిర్వహిస్తూ, తమ సైనికులు రోగపు అంటువల్ల శలవు పెట్టవలసిన అవసరాన్ని తప్పించే ప్రయత్నాలు చేస్తున్నట్లు కూడా వీరు వెల్లడించారు !

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో హవాయిలోని హోనోలూలు స్థావరపు విశేషాలను రచయితలు బెత్ బెయిలీ, డేవిడ్ ఫార్బర్‌లు, తాము వ్రాసిన "ది ఫస్ట్ స్ట్రేంజ్ ప్లేస్ : ది ఆల్కెమీ ఆఫ్ రేస్ అండ్ సెక్స్ ఇన్ వరల్డ్ వార్ II - హవాయి" అన్న పుస్తకంలో వివరించారు. దీనిలోని కొన్ని విషయాలను చూద్దాం :

హోనోలులూలో లభించే సెక్సు సుఖం కోసం, నెలకు

2,50,000 మంది విటులు, ఒక్కొక్కరు మూడు నిమిషాలకు మూడు డాలర్ల చొప్పున చెల్లిస్తున్నారు. ఇంత స్పష్టమైన అంచనాలు ఎలా లభించాయి అని పాఠకులు ఆశ్చర్యపోవచ్చు హానోలులూలోని, పడుపు గృహాల యజమానులు (వీరిలో అత్యధికులు తెల్లజాతి మహిళలు) స్పష్టమైన రికార్డులను, ప్రభుత్వ ఆదేశాల ప్రకారం వ్రాశారు ప్రజాభిప్రాయానికి తలొగ్గి అమెరికా ప్రభుత్వం 1941వ సంవత్సరం మే మాసంలో పడుపువృత్తిని నిషేధించింది. అయినా, స్థావరంలోని అమెరికా సైనికుల వసతి కోసం, "కొంత మేరకయినా" పడుపువృత్తి కొనసాగే అవకాశాల నివ్వాలని నిర్ణయించి, అందుకు అనువైన విధానాలను అవలంబించారు. వినోద కేంద్రాల పేరిట పడుపువృత్తి వారికి లైసెన్సులనీయ నారంభించారు. హానోలులూలోని హోటల్ స్ట్రీట్ పడుపు వృత్తికి ప్రధాన కేంద్రం. ఈ ప్రాంతంలో వృత్తిని సాగించే వారంతా పోలీసు స్టేషన్లో రిజిస్టర్ చేయించుకోవాలని ఆదేశించారు. రిజిస్ట్రేషన్ ఫీజు సాలుకు ఒక డాలరు. వృత్తిలోని వారంతా క్రమం తప్పకుండా వైద్య పరీక్షలను చేయించుకోవాలి. ఈ వృత్తిలోని వారెవరూ హవాయిలో ఆస్తులను కొనగూడదు. స్వంత వాహనాలను ఉంచుకోకూడదు. రాత్రి పదిన్నర గంటల తర్వాత ఇల్లు విడిచి వెళ్ళకూడదు. సైన్యంలోని వారి నెవరినీ పెండ్లి చేసుకోకూడదు. సైనిక విటుడు ఎపుడు వచ్చినా, వృత్తిలోని స్త్రీ ఇంట్లో తయారుగా ఉండాలని దీని అర్థం. అందుకు అవసరమైన అన్ని నిర్బంధాలనూ ప్రభుత్వ యంత్రాంగం అమలు జరుపుతున్నది!

ఈ వృత్తిలో స్థానికులు నష్టపడినా, అమెరికాలోని పలు రాష్ట్రాల నుండి వచ్చిన తెల్లజాతి మహిళా నిర్వాహకులు లాభించారు. ప్రభుత్వ ఆంక్షలను ఉల్లంఘించి ఆస్తులను కొనగలిగారు! విటుల నుండి వసూలుచేసిన మూడు డాలర్లలో రెండు డాలర్లను తాముంచుకొనేవారు. నివాస వసతి, పోషణాది సౌకర్యాలను సమకూర్చిన ఇంటి యజమానికి నెలకు వంద డాలర్లు చెల్లించేవారు. ప్రతి నెలా జరుగవలసిన వైద్య పరీక్షలకు, పదమూడు డాలర్ల చొప్పున చెల్లించేవారు.

యుద్ధ ప్రారంభానికి పూర్వం, వేశ్యా గృహానికి, రెండు ప్రవేశ ద్వారాలుండేవి. ఒకటి తెల్లవారికి, రెండవది ఇతరులకు. అమెరికా సైనికుల రాక తర్వాత, వారికి కోపం తెప్పించటం ఇష్టంలేక, ప్రవేశాన్ని తెల్లవారికే పరిమిత పరచారు. ఇతర జాతులకు ప్రవేశం లేకుండా పోయింది.

హాండూరాస్‌లో బ్రిటిష్ వారి పాలన ఉండేది ఇది 8,866 చదరపు మైళ్ళ విస్తీర్ణం గల ప్రాంతం. జనాభా ఇపుడు సుమారుగా రెండు లక్షల మంది వరకూ ఉంటుంది. ఇచ్చట వలస పాలన అంతరించినా, బెలిజిలో సైనిక స్థావరాన్ని బ్రిటన్ ఉంచింది. అటవీ ప్రాంతపు యుద్ధంలో తమ సైనికులకు శిక్షణ నీయటానికి దీనిని ఉపయోగిస్తున్నట్లు బ్రిటన్ చెబుతున్నది. ప్రతి ఆరు మాసాలకు ఇచ్చట ఉండే 900 మంది సైనిక దళం మారుతూ ఉంటుంది. ఇచ్చటి సైనికుల సౌకర్యార్థం పడుపువృత్తిని కొనసాగనిస్తున్నారు. ఇది అత్యంత నిర్మాణయుతంగా నడుస్తున్నది. అనుమతి పొందినవారినే ఈ ప్రాంతంలో వృత్తి చేయటానికి వీలు కల్పించారు. మధ్య అమెరికా దేశాల నుండి, ముఖ్యంగా గ్వాటెమాలా నుండి మహిళలు వృత్తి చేసుకోవటాని కిచటి కొస్తున్నారు.

ఈ వృత్తిని కంట్రోలు చేయటానికి బ్రిటిష్, హాండురాస్ ప్రభుత్వాలు సమన్వయంతో పనిచేస్తున్నాయి. వృత్తిలోని వారికి గుర్తింపు కార్డుల నిస్తారు. వారాని కొకసారి బెలిజీ డాక్టర్లు వీరికి వైద్య పరీక్షలను నిర్వహిస్తారు. సైనిక విటులు వచ్చినపుడు వారు విధిగా కాండోమ్‌లను వాడేట్లు వేశ్య చూడవలసి ఉంటుంది. సైనికునికి సుఖరోగం గాని, లేదా హెచ్.ఐ.వి. గాని సోకితే, దానికి కారణంగా అతడు పేర్కొన్న మహిళ అందుకు బాధ్యురాలవుతుంది. మొదటి తప్పిదానికి ఆ మహిళకు హెచ్చరిక లందుతాయి; రెండవ తప్పిదానికి జుల్మానాను విధిస్తారు; మూడవ తప్పిదానికి ఆ ప్రాంతం నుండి ఆవిడను పంపేస్తారు. అంత శ్రద్ధగా హాండురాస్ ప్రభుత్వం బ్రిటిష్ సైనికులకు సెక్సు సౌకర్యాలను సమకూర్చుతున్నది!

ఫిలిపీన్స్‌లో అమెరికా ఏర్పాటు చేసిన క్లార్క్ వైమానిక స్థావర ప్రాంతంలోనూ, సుబిక్ బే నౌకా స్థావర ప్రాంతంలోనూ ఇంకా "మేలయిన" విధానాలను అవలంబించి, తమ సైనికుల సెక్సు అవసరాలను తీర్చటానికి వసతులను సైనిక నాయకత్వం కల్పించింది. బ్రిటిష్ వారి వలె, పడుపు వృత్తిలోని ప్రతి స్త్రీ విధిగా తరచూ వైద్య పరీక్షలనుచేయించుకొంటూ ఉండాలని

ఆదేశించారు ఇలాంటి వైద్య పరీక్షలను జరిపించుకొని, అవసరమైన లైసెన్సును పొందిన వారిని మాత్రమే ఆయా ప్రాంతాల మునిసిపల్ అధికారులు వృత్తి చేసుకోవటానికి అనుమతించేవారు ఈ వ్యాసంగంలో సెక్సు సంబంధిత సుఖరోగమేదయినా సైనికునికి సోకినపుడు, అతడు ఆ రోగం ఏ స్త్రీ ద్వారా వచ్చిందో చెప్పనవసరం లేదు. తగిన జాగ్రత్తలను స్థానిక ప్రభుత్వ ఆరోగ్య శాఖ తీసుకొంటుంది. ఆయా ప్రాంతాల ఆరోగ్యాధికారులు ఏ వేశ్యకయినా సుఖరోగం ఉన్నట్లు నిర్ధారణ చేయగలిగినపుడు, ఆవిడ పేరును, ఫొటోను వారు అమెరికా సైనికాధికారులకు పంపుతారు ఈ అధికారులు ఆవిడ బొమ్మను తలక్రిందులుగా నోటీసు బోర్డులో వేసి, తద్వారా తమ సైనికులకు ఆ ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తారు

పలువురు స్త్రీలతో సెక్సు సంబంధాల కోసం పరుగులు తీయటం వలన తమ సైనికులకు సుఖరోగాలు వచ్చే ప్రమాదం అధికంగా ఉంటుందని, ఒక్క స్త్రీకే ఆ సంబంధాన్ని పరిమితం చేయటానికి కూడా అమెరికా సైనికాధికారులు ఏర్పాటు చేశారు. వేశ్యాగృహ నిర్వాహకుల ద్వారా స్త్రీలను ఏకంగా తమ స్థావరాలలోనే ఉండే యేర్పాట్లను కూడా చేశారు! స్థావరంలోని సైనికులు ఇలా స్త్రీలను తీసుకొచ్చుకొని తమ వసతిలో ఉంచుకోవచ్చు. ఏ స్త్రీకయినా సుఖరోగం గాని, ఎయిడ్స్‌గాని సోకినట్లు రుజువయితే వారిని బయటికి పంపేసేవారు. ఆవిడ రోగ చికిత్సకు ఏ మాత్రం ఆర్థిక సహాయం కూడా చేసేవారు కాదు. క్లార్క్ వైమానిక స్థావరప్రాంతంలోనూ, సుబిక్ బే నౌకా స్థావర ప్రాంతంలోనూ మొత్తం సుమారుగా లక్షమంది వరకూ పడుపువృత్తి చేసుకొనే మహిళలుండేవారని అంచనా.

ఈ రెండు సైనిక స్థావరాలను 1992వ సంవత్సరంలో అమెరికా ప్రభుత్వం ఎత్తివేసింది. దీనితో వృత్తిలోని స్త్రీలకున్న అనారోగ్య బాధ చాలక, నిరుద్యోగ బాధ అదనంగా సంక్రమించింది. జపాన్‌లోని ఒకినావా ప్రాంతానికో, ఉత్తర పసిఫిక్‌లోని గ్వామ్ స్థావరానికో, జర్మనీకో కొందరు స్త్రీలు వెళ్ళిపోయారు సుబిక్ బే స్థావర ప్రాంతాన్ని వినోద కేంద్రంగా రూపొందించి, లాభదాయకమైన పడుపువృత్తి కొనసాగేలాగా చూడాలని ఫిలిపీన్ వ్యాపార వర్గాలవారు కొందరు తాపత్రయ పడుతున్నారు. సింగపూర్‌లో అమెరికా నావికా స్థావరపు ఏర్పాటుకు 1992వ సంవత్సరంలో ఉభయ ప్రభుత్వాల మధ్య అంగీకారం కుదిరింది. దీని ఏర్పాటు తర్వాత అమెరికా సైనికులకు అవసరమైన సెక్సు సుఖపు సదుపాయాలను ఆ దేశ ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా? ఇది ఇంకా తేలని అంశం

సైనిక స్థావరాలలో వృత్తి చేసుకొంటున్న పలువురు మహిళల అభిప్రాయాలను కొందరు చరిత్రకారులు, జర్నలిస్టులు, సంఘసేవికలు సేకరించారు వాటిని చదువుతున్నపుడు, సైనిక, సివిల్ సంస్కృతుల మధ్య నున్న సంబంధాల పటిష్ఠతా పరిధి అర్థమవుతుంది. సెక్సు సంబంధాలకు, ఆర్థిక విషయాలకు మధ్య విభజన రేఖ అంటూ ఏదయినా ఉన్నదా లేదా అన్న సందేహం కూడా కలుగుతుంది. సైనికుల సౌకర్యార్థం వేశ్యా గృహాలను నిర్వహించేవారు, బార్లు, డిస్కోసెంటర్ల యజమానులు - లాభార్జనా దృష్టితోనే ఆ పనులను చేస్తున్నారు. పడతి యొక్క పొంకాన్ని, ఆవిడ వయస్సునూ, ఆవిడ మానాన్ని మార్కెట్లో పెట్టి అధిక ధరలకు విక్రయించటమే వీరు చేస్తున్న "వ్యాపారం." తమ ఖాతాదారుల అభిలాషలకు అనుగుణంగా 'సరుకులో' మార్పులు చేస్తుంటారు. ఈ దశాబ్ద కాలంలో ఎయిడ్స్ మహమ్మారిలా దాపురించింది. దీని ప్రమాదం తెలిసిన అమెరికాసైనికులు, అతి తక్కువ వయస్సు యువతులను కోరుతున్నారు. వీరికి సెక్సు అనుభవం అతి తక్కువగా ఉంటుంది గనుక, ఎయిడ్స్ ప్రమాదం వీరివలన సంభవించదని వారి భావన. ఇందువలన "మార్కెట్లో" వయస్సు ముదిరిన ముదితలకు వెల తగ్గింది. ఇరవై సంవత్సరాలలోపు వయస్సున్న యువతులకు "ధర" పెరిగింది! ఈ పరిణామ ఫలితంగా పిన్న వయస్కులను సేకరించటానికి వేశ్యా గృహాధిపతులు పడరాని పాట్లు పడుతున్నారు.

అమెరికా నౌకాదళంలో పనిచేసి రిటైరైన సైనికాధికారులు ఫిలిపీన్స్‌లో సెక్సు వ్యాపారానికి, "వినోద" కేంద్రాలను నిర్వహిస్తున్నారు. ఆఖరుకు ఆస్ట్రేలియా నుండి కూడా వ్యాపారులు వచ్చి ఈ పరిశ్రమను నిర్వహిస్తున్నారు. సైనికాధికారులు కూడా ఈ పరిశ్రమలో భాగస్తులు గావటం గమనింపదగిన అంశం. తమ పలుకుబడినీ, అధికారాన్నీ వినియోగించి గ్రామీణ ప్రాంత యువతులను సేకరించటానికి

వీరు విశేషంగా ఈ వ్యాపారానికి తోడ్పడుతున్నారు సైనికుల వసతికి వేశ్యాగృహాలను నిర్వహించే వారికి, వినోద కేంద్రాల పేరిట నడుస్తున్న వ్యభిచార కేంద్రాలకు, ఆడపిల్లలను సేకరించటం ద్వారా, ఫిలిపీన్ సైనికాధికారులు, సైనికులు, తమ వేతనాల కంటే అధికంగా సొమ్మును సంపాదిస్తున్నట్లు కొందరు జర్నలిస్టులు రిపోర్టు చేశారు. ఆసియాలోని అన్ని దేశాలలో కంటే తాయ్‌లాండ్‌లో పడుపు వృత్తి అతి పెద్ద వ్యాపారంగా కొనసాగుతున్న విషయం జగద్విదితం తాయ్‌లాండ్ సైనికాధికారులు పెద్దయెత్తున పెట్టుబడులు పెట్టి, ఈ వ్యాపారాన్ని బీనామీ పేర్లతోనిర్వహిస్తున్నారు సైనికుల సెక్సు దాహ మొక్కటే ఈ పరిశ్రమాభివృద్ధికి కారణమని భ్రమ పడకూడదు. ఈ పరిశ్రమ మనుగడకు, పెరుగుదలకూ, గ్రామీణ దారిద్ర్యం, దళారుల, యజమానుల లాభార్జనా కాంక్ష, పట్టణ ప్రాంతాలలో ఉండే "డిమాండ్" (లేక గిరాకి), పోలీసు రక్షణ, ప్రభుత్వ ఆర్థిక అవసరాలు ఇవన్నీ తమ వంతు పాలునవి నిర్వహిస్తున్నాయి. ఇవన్నీ వనగూడబట్టే ఈ "పరిశ్రమ" విస్తరిస్తున్నది; అధిక లాభాల నార్జిస్తున్నది.

సైనికావసరాల కోసం నడుస్తున్న పడుపు వృత్తిని, పూర్తిగా ఆర్థిక లాభార్జన కోనమే జరుగుతున్న వ్యాపారంగా భావించకూడదు. శాంద్రా స్టర్డ్‌వెన్ట్, బ్రెండా స్టోల్ట్జ్‌ఫస్‌లు, ఫిలిపీన్స్‌లోనూ, జపాన్‌లోని ఒకినావాలోనూ, దక్షిణ కొరియాలోనూ ఉన్న అమెరికా సైనిక స్థావరాల అవసరాలను తీర్చటానికి జరుగుతున్న పడుపువృత్తి వ్యాపారంలో వేశ్యలుగా జీవిస్తున్న పలువురు మహిళలను కలుసుకొని వారి అనుభవాలను సేకరించారు. "లెట్ ది గుడ్ టైమ్స్ రోల్" అన్న పుస్తకంలో రచయిత్రులు ఈ అనుభవాలను వివరించారు. ఈ వ్యాపారం యొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయ ప్రయోజనాలను గురించి ఈ మహిళలకు ఏమీ తెలియదని రచయిత్రులు చెప్పారు. వృత్తిలోని మహిళలు, తమ ఆశలను, భయాలను, లేమిని, శారీరక భద్రతను, ఆత్మగౌరవ రక్షణాసక్తిని గురించి వీరికి వివరించారు, తమ పోషణకు, తమ బిడ్డల పోషణ, రక్షణాది విషయాలను సక్రమంగా నిర్వహించటానికి తాము పడుతున్న పాట్లను వారు చెప్పారు.

విదేశీ ప్రభుత్వాలు, ఇతర దేశాలలో ఏర్పాటు చేసే సైనిక స్థావరాల ప్రభావం స్థానిక ప్రజల మీద ఎలా ఉంటుంది అన్న విషయపు చర్చలో ఇంతవరకూ వెలుగుకు రాని కొన్ని అంశాలు, ఈ రచయిత్రులు సేకరించిన సమాచారం వలన తెలియవస్తున్నాయి. పడుపువృత్తి కేంద్రాలలో పనిచేస్తున్న మహిళలకు రెండు వర్గాల పురుషులతో సంబంధం ఉంటుంది వీరిలో ఒక వర్గంవారు విదేశీ సైనికులు, రెండవ వర్గం వారు దేశీయులు. దేశీయులలో కొందరు సామాన్య పౌరులయితే, మరికొందరు దేశీ సైన్యంలో పనిచేస్తున్న పురుషులు! ఈ వర్గంలోని అధిక సంఖ్యాకులు దేశీ పౌరులే! బయట వారికి, దేశీయులలో ఇలా రెండు రకాల వారున్నట్లు కనిపించదు. సైనిక పడుపువృత్తి పరిశీలనలో ఈ రెండు రకాల దేశీయుల పరిగణన అవసరమని శాంద్రా, బ్రెండాలు సూచించారు పురుష ప్రేమికులు, భర్తలు, తమ మహిళలు బార్లలోనూ, డిస్కోలలోనూ చేరటానికి అనువైన పరిస్థితులను కల్పిస్తున్నారు. ఈ పురుషుల పరస్త్రీలోలత్వం, తమ భార్యలు, ప్రియురాండ్ర యెడల ప్రదర్శిస్తున్న దురుసుదనం, బార్లలో నానాబాధలు పడితెచ్చిన అల్పవేతనాన్ని వీరు స్వంత ఖర్చులకు వాడుకోవటం, తమను నిర్లక్ష్యం చేయటం వంటి వాటి ప్రభావం వలన, ఈ స్త్రీలు క్రమంగా పడుపు వృత్తిలోకి జారిపోక తప్పలేదని దక్షిణ కొరియా, ఫిలిపీన్ దేశాల మహిళలు, (వృత్తిలోకి దిగిన మహిళలు) రచయిత్రులకు వివరించారు. వృత్తిలోని మహిళలలో అత్యధికులకు సంతానముండటం గమనించదగిన అంశం. వీరిలో కొందరు వారి భర్తలకో, ప్రేమికులకో పుట్టారు. వృత్తి భారం, జీవన బాధలతో సతమతమవుతున్న స్త్రీలకు, సంతానం అదనపు భారంగా తయారవుతున్నది. పైగా వారి పిల్లల మనుగడ అవాంఛనీయ వాతావరణంలో సాగవలసి రావటం మరొక బాధాకరమైన అంశం.

ఫిలిపీన్స్, దక్షిణ కొరియా, తాయ్‌లాండ్, హోండూరాస్ వంటి దేశాలలో పడుపు వృత్తిలో జీవిస్తున్న మహిళలు, ఇటు దేశీ సైనికావసరాలనూ, విదేశీ సైనికావసరాలనూ, తీర్చక తప్పదు. దానిని ఆయా దేశాలు ఆత్మ గౌరవ సమస్యగా పరిగణించటం లేదు. పైగా దేశీ సైనికుల సెక్సుపరమైన ప్రవర్తనను ఆయా దేశాల ప్రభుత్వాలు చూచీ చూడనట్లు నటిస్తున్నాయి. ఆనీ మేరీ క్రాన్, అనే ఆస్ట్రేలియా పరిశోధకురాలు 80వ దశాబ్దంలో ఫిలిఫీన్ సైనికులను, దేశంలో సాయుధ పోరాటం సాగిస్తున్న దళాలను కలుసుకొన్నారు.

చాలామంది సైనికులు, తోటి స్త్రీ సైనికుల ముందు తమ సెక్సు సామర్థ్యాన్ని, సెక్స్ విశృంఖలత్వాన్ని గురించి గొప్పలు చెప్పటాన్ని ఈవిడ గుర్తించారు. టికెట్ కొనకుండానే పౌర రవాణా వసతులను సైనికులు వాడటం, బార్లలో ప్రవేశించి, డబ్బు ఇవ్వకుండానే మద్యసేవనం, వృత్తిలోని స్త్రీల సెక్సును దోచుకోవటం వంటివి విస్తృతంగా జరుగుతున్నట్లు ఈ పరిశోధకురాలు రికార్డు చేశారు. ప్రభుత్వం, సైనికుల అవసరాలకు వృత్తిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రోత్సహిస్తున్నట్లు ఈ పరిణామాలన్నీ రుజువు చేస్తున్నాయి.

ఆత్మ గౌరవానికి భంగకరమన్న విషయాన్ని కూడా మరచి దేశీ ప్రభుత్వం పరదేశ ప్రభుత్వ సైనికుల కోసం పడుపు వృత్తిని ప్రోత్సహిస్తున్నది స్థావరాలను ఏర్పాటు చేసిన పరదేశ ప్రభుత్వం కూడా, దేశాన్ని విడిచి సంవత్సరంలో ఎక్కువకాలం విదేశాలలో ఉండే తమ సైనికుల సెక్సు కోరికలను తీర్చటానికి తాపత్రయ పడుతున్నది. దేశీయుల, విదేశీయుల అవసరాలను తీర్చటానికి సైనిక పడుపువృత్తిని వ్యాపార స్థాయిలో నిర్వహించి లాభాలు సంపాదించాలనే ఆశ లాభార్జనాసక్తుల కుండటం సహజం. ఇవన్నీ కలిసి దేశ స్త్రీల సెక్సుకు మార్కెట్ విలువలను సృష్టించాయి. ఈ అవకాశాన్ని 'సద్వినియోగం' చేసుకోదలచిన తిరుగుబోతులైన మగవారు తమ స్త్రీలను బార్లలో ప్రవేశపెట్టారు. ఈ విధంగా సైనిక స్థావరాల చుట్టూ, పడుపు వృత్తి కేంద్రాలు వెలిశాయి. పలువురు సేకరించిన వివరాల పరిశీలన తర్వాత, ఈ వృత్తి ఇంతగా వర్ధిల్లుతూండటానికి కారకులుగా దిగువ వర్గాల పురుషులను సింధియా ఎన్లో ("ది మార్నింగ్ ఆఫ్టర్" రచయిత్రి) సూచించారు ·

- భర్తలు, ప్రేమికులు
- బార్‌ల, పడుపువృత్తి కేంద్రాల మేనేజర్లు (వీరిలో దేశీయులు, విదేశీయులు కూడా ఉన్నారు)
- స్థానిక ప్రభుత్వ ఆరోగ్య శాఖ అధికారులు
- స్థానిక ప్రభుత్వ జోనింగ్ బోర్డు సభ్యులు
- స్థానిక పోలీసు అధికారులు
- స్థానిక మేయర్లు
- దేశీ ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వశాఖ అధికారులు
- దేశీ ప్రభుత్వ రక్షణశాఖ అధికారులు
- పడుపువృత్తి కేంద్రాలకు వెళ్ళటానికి అలవాటు పడిన దేశీ పౌరులు
- స్థానిక ప్రభుత్వ సైనికులు
- విదేశీ సైనికులు. వారి తాబేదార్లు
- విదేశీ సైనిక స్థావరాల సైనిక కమాండర్లు
- విదేశీ సైన్యంలో పనిచేస్తున్న మెడికల్ ఆఫీసర్లు
- విదేశీ రక్షణ విషయాల సలహాదారులు
- విదేశీ శాసన సభల సభ్యులు

ఇంత పొడవయిన లిస్టు కూడా "సమగ్రమైనది కాదు. ఇంకా ఇందులో చేరవలసిన వారున్నారు" అని సింధియా ఎన్లో అంటున్నారు! "దేశీ సైనికులకు సంతృప్తి నీయగల సెక్సు విధానాలు, విదేశీ సైనికులకు ఆహ్లాదకరంగా ఉండటం లేదు! వారిని సంతృప్తిపరచటానికి అవలంబించదగిన సెక్సు విధానాలను మేము నేర్చుకోవలసి వచ్చింది" అని జపాన్, కొరియా, ఫిలిపీన్ దేశాల వేశ్యలు శాంద్రా, బ్రెండాలకు చెప్పారు! ఈ విధంగా పడుపు వృత్తి నిర్మాణం కూడా గ్లోబలైజైంది. "పడుపు వృత్తి ఇప్పుడు గ్లోబలైజ్ కాలేదు. కొందరు టూరిస్టులు, పరిశోధకులు, మిషనరీలు, వలస దేశాలను పాలించే ప్రభుత్వాల అధికార్లు, ఆరోగ్యాధికార్లు, నవలా రచయితలు, అభివృద్ధి విధానాలను రూపొందించే సాంకేతిక నిపుణులు, వ్యాపారులు, సైనికులు మొదలైన వారంతా ఇంతకు ముందే ఎన్నడో ఈ వృత్తిని గ్లోబలైజ్ చేశారు" అని సింధియా ఎన్లో అంటున్నారు. దారిద్ర్యబాధను తట్టుకోలేక పడుపువృత్తిలో ప్రవేశిస్తున్న అభాగ్యులను బార్ యజమానులు, వేశ్యాగృహ నిర్వాహకులు, మిలటరీ కమాండర్లు, స్థానిక ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వ శాఖ వారూ దోచుకొంటున్నారు. వీరి రక్త మాంసాలను లాభార్జనకు వినియోగించుకొంటున్నారు.

ఈ పరిణామాలు ఇటీవలవి గావు; రెండవ ప్రపంచ యుద్ధారంభానికి ముందే దీనికి పునాదులు పడ్డాయి. కొరియా, తాయ్‌లాండ్, బర్మా దేశాల మహిళలను, రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో, జపాన్ సైనికుల సెక్సు అవసరాలను తీర్చటానికి ఆ దేశప్రభుత్వం బందీలుగా పట్టుకెళ్ళి, క్యాంపులు నడిపింది. ఈ విషయాన్ని జపాన్ ప్రభుత్వం చేత ఒప్పించి, బాధితులకు పరిహారం ఇప్పించే ప్రయత్నాలు కొద్ది సంవత్సరాల

క్రితం ప్రారంభమైనాయి. ఈ ఉద్యమానికి జపాన్ ఫెమినిస్టులు, చరిత్రకారులు కొందరు సహకరించనారంభించారు. జపాన్ ప్రభుత్వం ఇరుకులో బడి, "ఆ పనిని మా ప్రభుత్వం చేయలేదు; కొందరు వ్యాపారులు దానిని చేశారు" అని చెప్పసాగింది. ఆ పనిని జపాన్ ప్రభుత్వమే చేసినట్లు జపనీస్ సైనికాధికారులు కొందరు ఒప్పుకోవటం కూడా ప్రారంభ మైంది. విదేశాలలోని అమెరికా సైనిక స్థావరాల చుట్టూ పడుపు వృత్తి కేంద్రాల నిర్వహణకు, తమ ప్రభుత్వానికి ఎటువంటి సంబంధము లేదంటూ అమెరికా ప్రభుత్వము కూడా, వాస్తవాన్ని మరుగుపరచటానికి ఇటువంటి విధానాన్నే అవలంబించింది. చౌ విశ్వవిద్యాలయానికి చెందిన, చరిత్ర విభాగపు ప్రొఫెసర్ యొషియాకీ యొషిమీ, ఇందుకు సంబంధించిన అధికార పత్రాలను సేకరించి, ప్రపంచానికి చాటిన తర్వాత, జపాన్ ప్రభుత్వం తన బాధ్యతను అంగీకరించక తప్పలేదు. సెల్ఫ్ డిఫెన్స్ ఏజన్సీ గ్రంధాలయంలో "రిగార్డింగ్ ది రిక్రూట్‌మెంట్ ఆఫ్ ఉమెన్ ఫర్ మిలిటరి బ్రోతెల్స్" అన్న మకుటంతో ఉన్న ప్రభుత్వ అధికార పత్రాన్ని ఈ ప్రొఫెసర్ వెలికి దీశారు. దీన్ని జపాన్ ప్రభుత్వం 20వ శతాబ్దపు ముప్పయ్యవ దశాబ్దపు చివరి కాలంలో జారీ చేసింది. జపాన్ సైన్యాలు దక్షిణ దిశ నుండి చైనాలో ప్రవేశిస్తున్న కాలమది. జపాన్ సైన్యాల "సెక్సు సుఖం కోసం" అవసరమైన వసతులను కల్పించాలని జపాన్ ప్రభుత్వం సైనిక నాయకత్వాన్ని ఈ పత్రం ద్వారా ఆదేశించింది. ఈ ఉద్యమంలో ఒక లక్ష నుండి రెండు లక్షల మంది వరకూ కొన్ని ఆసియా దేశాల నుండి మహిళలను బలవంతంగా తీసుకుపోయి వృత్తిలోకి దించినట్లు అంచనా వేస్తున్నారు. ఈ వృత్తికి వారు "కరయుకి-సాన్" అని పేరు బెట్టారు. ఆ స్త్రీలను "కంఫర్ట్ ఉమెన్" అన్నారు. వీరిలో అధిక సంఖ్యాకులుగా కొరియన్లు ఉన్నట్లు చెబుతున్నారు (కంఫర్ట్ ఉమెన్‌గా పనిచేసిన ఒక కొరియన్ మహిళ జీవితానుభవాధారంతో నోరా ఒక్జా కెల్లర్ అనే అమెరికా పౌరసత్వాన్ని పొందిన కొరియన్ మహిళ "కంఫర్ట్ ఉమెన్" అన్న పేరుతో ఒక నవలను వ్రాశారు. దీనిలో కంఫర్ట్ ఉమెన్ అనుభవించిన బాధలను రచయిత్రి వర్ణించారు. (దీనిని వైకింగ్ ప్రచురణ సంస్థ 1997వ సంవత్సరపు తొలి భాగంలో ప్రచురించింది.)

తొలుత ఎన్ని అసత్యాలను చెప్పినా, జపాన్ ప్రభుత్వం చివరకు వాస్తవాన్ని అంగీకరించక తప్పలేదు. ప్రధాని కిచిమియజవా ఈ తప్పిదానికి క్షమాపణ కూడా చెప్పుకొన్నారు. కంఫర్ట్ ఉమెన్ కోరుతున్న నష్ట పరిహార వ్యవహారాలు ఇంకా పరిష్కారం గాలేదు ఇంత జరుగుతున్నా, గ్లోబలైజైన సైనిక పడుపు వృత్తి మాత్రం నిరంతరాయంగా కొనసాగుతూనే ఉన్నది. ఈ శతాబ్దపు ముప్పయ్యవ-నలభయ్యవ దశాబ్దాలలో జపాన్ కొనసాగించిన సైనిక పడుపువృత్తిని, పెరల్ హార్బర్ సంఘటనల కాలం నుండి అమెరికా చేబట్టి విస్తరింపజేసింది. బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలూ అమెరికా అడుగు జాడలను అనుసరించాయి.

జపాన్ ప్రభుత్వం సైనిక పడుపు వృత్తి కేంద్రాల వసతిని ఏర్పాటు చేయటానికి సంబంధించిన అధికార పత్రం వెలుగు చూసిన తర్వాత, ఆగ్నేయ ఆసియాలో అమెరికా నిర్వహించిన పడుపు వృత్తి మీద పరిశోధనలు సాగిస్తున్న రీటా నకషిమాబ్రోక్ 1992వ సంవత్సరం ఫిబ్రవరి 23వ తేదీన, న్యూయార్క్ టైమ్స్ పత్రికకు సంపాదక లేఖను వ్రాశారు. ఈవిడ తల్లిదండ్రులు జపాన్ పౌరులు. అమెరికా, జర్మనీ, జపాన్‌లలోని సైనిక స్థావరాలలో తన బాల్యాన్ని గడిపారు. ఆసియా ఖండవాసులెవరు కనిపించినా, అమెరికా సైనికులు, ఆవిడ తమ సెక్సు కోరిక తీర్చటానికి ఉపకరిస్తున్నట్లు వ్యవహరించే వారని ఆ లేఖలో రీటా వ్రాశారు. తనను సైనికులు "గ్రీషాగర్ల్" అని పిలిచేవారట. "నేను ఉన్న అన్ని స్థావర ప్రాంతాలలోనూ పడుపు వృత్తి కేంద్రాలున్నాయి," అని ఈవిడ వ్రాశారు. తాను చిన్నతనంలో చూసిన సైనిక పడుపువృత్తి, తాను పెద్దయిన తర్వాత కూడా కొనసాగుతూ ఉండటాన్ని చూచి రీటా ఆశ్చర్యపడుతున్నారు. జపాన్‌లోని అమెరికా సైనిక స్థావరంలో ఉంటున్న సైనికుల సెక్సు అవసరాలను తీర్చటానికి, జపాన్ మహిళలను సేకరించాలన్న అమెరికా సైనికాధికారుల ప్రయత్నాలను గర్హించినందుకు, తనను ఆ స్థావరం నుండి బదిలీ చేయటమే గాకుండా మరొక విభాగానికి పంపినట్లు, రిటైరైన ఒక సైనికాధికారి తనకు చెప్పినట్లు కూడా రీటా తన సంపాదకలేఖలో పేర్కొన్నారు.

తాయ్‌లాండ్ పడుపువృత్తి చరిత్ర మీద అధ్యయనాన్ని కొనసాగిస్తున్న తాన్-డామ్ ట్రూంగ్ అనే వియత్నాం మహిళ ఆసక్తికరమే కాదు, మహిళాలోకాన్ని గాయపరచే కొన్ని పరమ

సత్యాలను బయటపెట్టారు అరవయ్యవ దశాబ్దంలో అవసరంలేని సెక్సు విధానాలను, యనభయ్యవ దశాబ్దంలో వేశ్యలు నేర్చుకోవలసిన అవసరం గలిగిందని వీరు వివరిస్తున్నారు విటుల యొక్క మారిన అభిరుచులకు అనుగుణంగా వేశ్యలు కూడా సెక్సుపరమైన చిట్కాలను నేర్చుకొనవలసి వచ్చిందట. యనభయ్యవ దశాబ్దంలో, సుబిక్ బే స్థావరంలోని బార్ యజమానులు స్త్రీలతో "ఫాక్సీ-బాక్సింగ్" చేయించేవారట. స్టేజి మీద ఇరువురు స్త్రీలు కుస్తీ పడుతూండటం, బాక్సింగ్ చేస్తూండటాన్ని చూస్తేనే గాని అమెరికా నావికాదళ సైనికుని పుంసత్వం మేలుకోదట! అప్పుడు గాని వారికి ఫిలిపీన్ మహిళల మీద మనసు రగులదట! అంతేకాదు, రక్తం బాగా కారే దెబ్బలు తిన్న మహిళకు వారు ఎక్కువ రుసుము చెల్లించేవారట! అమెరికా విటులను ఆకర్షించటానికి ఇంతకంటె హేయమైన పనులను మహిళలతో చేయించే వారట (ఇవన్నీ మన సంప్రదాయ మహిళలు చదివి భరించలేరు గనుక వివరించటం లేదు - ర॥).

ఫిలిపీన్స్‌లోని రెండు స్థావరాలూ, "కోల్డ్‌వార్" ముగిసిన తర్వాత మూతబడ్డాయి. నావల రిపేరు, కమ్యూనికేషన్, ట్రెయినింగ్ పేరిట కొన్ని వసతులను అమెరికా ప్రభుత్వం ఆసియా దేశాలను కోరింది. సింగపూర్, మలేషియా, ఆస్ట్రేలియాలు ఈ వసతుల కల్పనకు అంగీకరించాయి. యుద్ధ ప్రమాదం ఇంతలో లేకపోయినా, బయటి దేశాలలో ఉండే అమెరికా సైనికుల సంఖ్య కొన్ని వేలలో ఉంటుంది పైగా ట్రెయినింగు ప్రోగ్రాముల పేరిట మరికొన్ని వేలమందిని ఇతర దేశాలలో కొంతకాలంపాటు ఉంచవలసి వస్తుంది; వీరందరి సెక్సు సుఖానికి అవసరమైన వసతుల కల్పనకు చర్యలు తీసుకొనక తప్పదు. సైనిక నాయకత్వం ఎటువంటి వసతులను కల్పిస్తుందో వేచి చూడవలసి ఉంటుంది.

గల్ఫ్‌వార్ సందర్భంలో ఇలాంటి వసతుల కల్పనకు సౌదీ అరేబియా ప్రభుత్వం అంగీకరించలేదు. అమెరికా సైన్యంలో మహిళలు కూడా పురుషులతో కలిసి పని చేస్తూండటం వలన, సెక్సు కార్యకలాపాలు బాగా పెరిగాయి. (ఇంతకు పూర్వమే ఇచ్చిన జనరల్ ట్రూమన్ డిస్సెంట్ పత్రపు సారాంశాన్ని చూడండి - ర॥) అమెరికా సైనికులే తమ దళాలలోని మహిళా సైనికులను రేప్ చేసిన సంఘటనలు కూడా ఉన్నాయి. వీరి చర్యలు సెనెట్ కమిటీ విచారించే దశకు కూడా వెళ్ళాయి.

### మహిళల మానభంగాలు

యుద్ధంలో ముడిపడిన మరొక అంశం మహిళల మానభంగం (లేక రేప్). దురాక్రమణ కోసం జరిగిన యుద్ధాలలో శత్రుసైనికులు ఆయా దేశాల స్త్రీల మాన భంగానికి తలపడటం. వారిని అవమాన పరచటం వంటివి చరిత్ర అంతటా కనుపిస్తాయి. "కమ్యూనిజం వ్యాప్తిని" అరికట్టటం, "సోవియట్ అనుకూల" ప్రభుత్వాలను పడగొట్టటం పేరిట అమెరికా, 20వ శతాబ్దపు యనభయ్యవ దశాబ్ద కాలంలో మధ్య అమెరికా, కరిబియన్, లాటిన్ అమెరికా దేశాలలో, సైనిక నియంతృత్వాలను బాహాటంగా ప్రోత్సహించింది వాటికన్ కూడా అమెరికా ప్రయత్నాలకు అన్ని విధాలా సహకరించింది (చూడండి - కార్ల్ బెర్న్‌స్టీన్, మార్కో పొలిటీలు వ్రాసిన "హిజ్ హోలీనెస్ జాన్ పాల్. అండ్ ది హిడెన్ హిస్టరీ ఆఫ్ అవర్ టైం" - డబుల్ డే ప్రచురణ) ఇది ఒక సాయుధ ఉద్యమంగా సాగింది ఈ కాలంలో సైనికులు మహిళలపై, విస్తృత ప్రాతిపదిక మీద అత్యాచారాలకు దిగారు. ఆఫ్రికాలో జాతి, తెగల వైషమ్యం, ఆయా జాతుల వారు బలా బలాలను తేల్చుకొనే దశకు వెళ్ళింది. ఈ మారణహోమంలో మహిళలు-పిల్లలు పడుతున్న బాధలు నరకయాతనలతో సమంగా ఉంటున్నాయి. పెద్ద యెత్తున మానభంగాలు, మహిళా, శిశు హత్యలు జరుగుతున్నాయి. బోస్నియాలో జాతి విముక్తి పేరిట జరుగుతున్న యుద్ధంలోనూ ఇవే పరిస్థితులు కనుపిస్తున్నాయి. "జాతి స్వచ్ఛత" సాధనకు ముస్లిం మహిళలను మానభంగం చేస్తున్నట్లు సెర్బియన్ "వీరులు" చెప్పుకొంటున్నారు శత్రు సైనికులు తమ ఆక్రమిత ప్రాంతంలోని మహిళలను రేప్ చేయటాన్ని మనం ఊహించగలం. కాని ఒకే దళంలో కలిసి పనిచేస్తున్న తోటి మహిళా సైనికులను పురుష సైనికులు మానభంగం చేయటం మనం ఎరుగనిది కాని అమెరికా పురుష సైనికులు ఈ విషయంలోనూ తమ "మగటిమిని" ప్రదర్శిస్తున్నారు.

ఒక దేశపు సైనికులు, తాము రక్షించవలసిన దేశ ప్రజలలోని మహిళలను చెరచటం కూడా మనకు కనిపిస్తుంది. అంతే కాదు; చెరచిన సైనికులూ, ఈ దురాగతానికి గురయిన

వారూ ఒకే మతస్థులైన సందర్భాలు కూడా ఉన్నాయి దీని రుజువులకు మనం చరిత్ర పుటలను తిరగవేసే శ్రమను కూడా తీసుకోనవసరం లేదు. ఇటీవల జరిగిన గల్ఫ్ యుద్ధమే దీనికి సాక్షి. దేశీ సైన్యమయినా, విదేశీ సైన్యమైనా వీరి చేతిలో మహిళలకు రక్షణ లేదా అని అనిపించేంతగా సైనికుల సెక్సు దాహం పెరిగింది!

సైనిక నియంతృత్వం నుండి విముక్తిని పొందటానికి పోరాడుతున్న వారి మానసిక స్థైర్యాన్ని దెబ్బతీయటానికి, నైతికంగా వారిని కృంగదీయటానికి సైన్యం ఇలాంటి దురాగతాలకు తలపడుతున్నట్లు స్పష్టంగా కనిపిస్తున్నది ఇటువంటి సమయాలలో స్త్రీ జన రక్షణ పురుష ధర్మం గనుక "మీ స్త్రీలను మీరే కాపాడుకోలేక పోతున్నారు" అని ప్రజాపోరాట దళాలను వెక్కిరించటానికి, "పురుషులను లొంగిపొమ్మనండి, లేదా మీరు ఈ బాధలను, అవమానాలను ఇంకా అధికంగా అనుభవించవలసి వస్తుంది" అని స్త్రీలను హెచ్చరిస్తూ, వారి మనోనిబ్బరాన్ని దిగజార్చటానికి సైనిక నాయకత్వం ఇలాంటి దుశ్చర్యలకు పాల్పడుతున్నది. అంతే కాదు, ప్రజాపోరాట దళాలలోని పురుషులను పట్టి ఇవ్వనందుకు కూడా ప్రతీకార చర్యగా సైనికులు ఇలాంటి దురాగతాలకు పూనుకొంటున్నారు.

గ్వాటేమాలాలో అమెరికన్ ఇండియన్ కుటుంబ వ్యవస్థ పోరాటదళాలకు ప్రాణం వంటిది. అందుచేత దాన్ని నాశనం చేస్తే తప్ప ప్రజాపోరాటాలు ఆగవని, మానభంగాలకూ, మూక ఉమ్మడి హత్యలకు తాము పాల్పడుతున్నామని ఆ దేశపు సైనిక కమాండర్ ఒకరన్నట్లు మైకెల్ మాక్లింటాక్ తమ రచన "ది అమెరికన్ కనెక్షన్" లో సూచించారు.

ఇరవయ్యవ శతాబ్దపు 90వ దశాబ్ద ప్రారంభ కాలంలో జరిగిన గల్ఫ్ యుద్ధానికి వస్తే, కువైట్ సైనికులు తమ దేశపు స్త్రీలనే మానభంగం చేయటం మనకు కనిపిస్తుంది! దేశీ సైనికులే కువైట్ మహిళలను రేప్ చేస్తున్న సంఘటనలు రోజుకు ఇరవైకి మించే ఉంటున్నట్లు 1991వ సంవత్సరం మే మూడవ తేదీన "యు యస్ టు డే" పత్రిక రిపోర్టు చేసింది! ఇరాక్ ఆక్రమణ కాలంలో కంటే విముక్తి జరిగిన తర్వాతనే రేప్‌లు అధికంగా జరుగుతున్నట్లు ఒక వైద్యశాలలో పనిచేస్తున్న నర్సు చెప్పినట్లు కూడా పత్రికా ప్రతినిధి పేర్కొన్నారు. కువైట్ యూనిఫారాలలో ఉన్న సైనికులే తమను రేప్‌చేసినట్లు బాధిత మహిళలు చెప్పారు. ఇరాక్ సైన్యపు ఆక్రమణ క్రింద ఉన్న కాలంలో 1990వ సంవత్సరం ఆగస్టు నుండి 1991 వ సంవత్సరం ఫిబ్రవరి మధ్య కాలంలో 3,200 మంది కువైట్ మహిళలు ఇరాకీ సైనికుల వలన మానభంగానికి గురై ఉంటారని కువైట్ సైకాలజిస్టొకరు చెప్పినట్లు కూడా రిపోర్టైంది. రేప్‌కు గురైన కువైట్ మహిళలలో ఇరాక్ సైనికుల వలన కంటే కువైట్ సైనికుల వలన రేప్‌కు గురయిన వారే అధికంగా ఉంటారని అంచనా వేస్తున్నారు. సెక్సుపరమైన అత్యాచారానికి గురిగావటం, అరబ్బు సంస్కృతిలో మహానేరం గనుక, చాలా మంది మహిళలు తమపై అత్యాచారం జరిగినా, బైటకు చెప్పుకోవటం లేదు అని న్యూయార్క్ టైమ్స్ పత్రికా ప్రతినిధి 1991 వ సంవత్సరం ఆగస్టు 4వ తేదీన రిపోర్టు చేశారు.

బోస్నియాలో యుద్ధం జాతీయ విముక్తి కోసమని చెప్పు కొంటున్నా, ఇచటా మానభంగాలు పెద్ద యెత్తుననే జరిగాయి. బోస్నియాలో 1992 ఏప్రిల్, జనవరి 1993 మధ్య కాలంలో ఇరవై వేలమంది ముస్లిం మహిళలు మానభంగానికి గురైనట్లు యూరోపియన్ కమ్యూనిటీ పరిశీలనలో వెల్లడైనట్లు బోస్టన్ గ్లోబ్ పత్రిక 1993, ఫిబ్రవరి 27వతేదీన రిపోర్టు చేసింది. తనను, తనతోపాటు తమ గ్రామంలోని మరికొందరు మహిళలను బలవంతంగా తీసుకొని పోయి, సైనికులు మానభంగం చేసినట్లు ముస్లిం మహిళ ఒకరు వెల్లడించారు. తమసైనిక నాయకత్వ నిర్దేశం మేరకే ఆ అత్యాచారాలను ముస్లిం మహిళల మీద తాము చేస్తున్నట్లు తనను మానభంగం చేసిన సెర్బియన్ సైనికుడు అన్నట్లు బాధితురాలొకరు చెప్పారు!

ఇటువంటి పోరాటాలలో అందరి కంటే మహిళలు అధికంగా నష్టపడుతున్నారు. అన్నింటినీ మించి, అత్యంత విలువైన మానాన్ని వారు కోల్పోతున్నారు. విముక్తి తర్వాతనైనా వారికి గౌరవం లభించకపోగా, గృహబహిష్కారానికో, లేదా విడాకులకో వారు ఎరవుతున్నారు. మన పొరుగున ఉన్న బంగ్లాదేశ్‌లో, విముక్తి పోరాట కాలంలో ఎందరో మహిళలు సైనిక మానభంగాలకు గురయినారు. కుటుంబము, సమాజము ఆదరించక పోవటం వలన ఇటువంటి బాధితులలో చాలా మంది పొట్ట గడవక పడుపువృత్తిలో ప్రవేశించారు. కాశ్మీరులో గాని, శ్రీలంకలో గాని,

అత్యాచారాలకు గురవుతున్న మహిళలకు ఎలాంటి ఆదరణా లభించక పోవటాన్ని మనం చూస్తూనే ఉన్నాం

మరొక రకమైన రేప్ కూడా మనకు సైన్యంలో కనుపిస్తుంది పురుష సైనికులు తమ దళంలోని మహిళా సైనికులను మానభంగం చేయటమే ఈ కొత్తరకపు రేప్. గల్ఫ్‌వార్‌లో అమెరికా సైన్యానికి చెందిన మిశ్రమ దళాలు పాల్గొన్నాయి సుమారుగా నలభైవేలమంది మహిళలు దళాలలో ఉన్నట్లు అంచనా. ఆర్మీ క్రిమినల్ ఇన్వెస్టిగేషన్ కమాండ్ రిపోర్టు ప్రకారం అమెరికా స్త్రీ సైనికులలో 24మందిని, అమెరికా సైనికులే రేప్ చేశారు. రేప్‌కు గురయినా, రేప్ చేసిన తమపై అధికారులకు భయపడి, రిపోర్టు చేయనివారు చాలామంది ఉన్నట్లు భావిస్తున్నారు.

జాక్వెలిన్ అనే మహిళా సైనికురాలు 1992 వ సంవత్సరం జూన్ 30వ తేదీన సెనెట్ కమిటీ ముందు సాక్ష్యమిస్తూ 1991 వ సంవత్సరం, జనవరి 19 వతేదిన, పట్టపగలే, తన దళపు సార్జంటే, ఆర్మీ కాంప్ లో తనను మానభంగం చేసినట్లు చెప్పుకొన్నది. (అమెరికాలో రేప్‌లు, అక్రమ సెక్సు సంబంధాలు, వివాహం కాక పూర్వమే వ్యక్తులు సెక్సు కార్య కలపాలకు దిగటం వంటివి అతి సామాన్య విషయాలు కనుక ఆ దర్యాప్తు ఫలితాలు, అమెరికా పౌరులలో సంచలనాన్ని గలిగించలేదు - ర॥) ఈ పరిణామాలను బట్టి, సైనిక పడుపు వృత్తి లాగే, సైనిక రేప్ కూడా "గ్లోబలైజేషన్" లో భాగమైనట్లు కనుపిస్తున్నది ! దేశ రక్షణకు నిర్మితమైన సైన్యం వలన, దేశంలోని మహిళల మానానికే రక్షణ లభించటం లేదని ఈ పరిణామాలు రుజువు చేస్తున్నాయి. దేశీసైన్యం చేతిలోగాని, శత్రుసైన్యం చేతిలో గాని అందరి కంటే అధికంగా నష్టపడుతున్నది మహిళే.

ముందు జరగబోయే యుద్ధాలు దేశ సరిహద్దులను మార్చేవిగా ఉండవనీ, అవి సాయుధపోరాట స్థాయిలో (లోఇన్‌టెన్సిటీ వార్‌ఫేర్) ఉండవచ్చుననీ మార్టిన్ వాన్ క్రివెల్డ్, వారు వ్రాసిన "ది ట్రాన్స్‌ఫర్మేషన్ ఆఫ్ వార్" అన్న పుస్తకం లో సూచించిన విషయాన్ని ఇంతకుముందే ప్రస్తావించాం. ఆపుస్తకంలో "ఫ్యూచర్‌వార్" అన్న అధ్యాయంలో సైనిక స్వార్థాన్ని గురించి వారు వ్రాసిన విషయాలు ఈ సందర్భంలో గమనార్హాలుః

"కొన్నిరకాల ప్రోత్సాహాలు మనిషిని పోరాటానికి పురి కొలుపుతాయి. ఇది వాస్తవం. అందుచేత, తమకు అర్థంగాని రాజకీయ లక్ష్యసాధన కోసం పోరాడటమే తమ వృత్తి ధర్మంగా సైనికులు భావిస్తారని అనుకోనవసరం లేదు యుద్ధ నిర్వహణా సంస్థలో మార్పులు రావటమంటూ జరిగితే, యుద్ధాన్ని నిర్వహించే నాయకత్వపు వ్యక్తిగత అభిరుచులకు, యుద్ధ నిర్వహణా లక్ష్య సాధనకంటే అధిక ప్రాధాన్యత లభించినపుడు. వారి సైనికులలోనూ ఇలాంటి మార్పులొస్తాయి. 1648వ సం॥కి పూర్వం సైనిక, ఆర్థిక లక్ష్యాల మధ్య ఐక్యత ఉండేది. సామాన్య పౌరులను కొల్లగొట్టి సంపదను దోచుకోవటంతో పాటు, పేరు ప్రఖ్యాతులను, లాభాలను ఆర్జించటం, వ్యక్తిగత ఆశయంగా ఉండేది. ఈధోరణి తిరిగి తల యెత్తుతున్నది. యుద్ధావకాశాన్ని వినియోగించుకొని దేశం లాభించాలి అన్న లక్ష్యం స్థానే, వ్యక్తి గత లాభార్జనే యుద్ధ లక్ష్యంగా మారబోతున్నది ఇలాంటి పరిస్థితులలో స్త్రీలను ఎత్తుకు పోవటం, బలవంతంగా సెక్సును అనుభవించటం అనే దాహం అంకురించటం కూడ అసంభవం కాబోవటం లేదు. కాంబాటెంట్స్‌కు, నాన్ కాంబాటెంట్స్‌కు మధ్య భేదం అంతరించినపుడు నాగరిక యుద్ధ సూత్రాలు అనుమతించని పనులను సైనికులు చేస్తున్నా, చాలావరకు వాటిని నాయకత్వం అనుమతిస్తుంది. లో ఇన్‌టెన్సిటీ వార్ ఫేర్ జరుగుతున్న అనేక అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆ పరిస్థితి ఇపుడే కనుపిస్తున్నది. ఇపుడుండటమే కాదు; ఇది అన్ని కాలాలలోనూ చెల్లే సూత్రమే.

"సాయుధ పోరాటంలో పాల్గొంటున్న వారిని, నిర్మాణ ప్రాతిపదికమీద నెలకొన్న సైన్యం ఓడించలేక పోవటానికి ఆ స్వలాభ సూత్రమే కారణం .... సాయుధ పోరాటాలలో పాల్గొనే వ్యక్తులను, వారి నాయకత్వం శత్రువు నుండి లాభాలను పొందటాన్ని అనుమతిస్తున్నది; అనుమతించటమే గాదు; ప్రోత్సాహిస్తున్నది. సైనికుల పరిస్థితి ఇందుకు భిన్నమైనది. తనకు తన సైనికసంస్థ జీతభత్యాల నిస్తున్నది. అతనికి ప్రమోషన్ గాని, గౌరవ పత్రం గాని, పతకం గాని వస్తే, అది తన సంస్థ ద్వారానే రావలసి ఉంటుంది. ఆ సంస్థ అధీనంలో ఆ సైనికుడు పనిచేస్తుంటాడు; అది నిర్దేశించిన క్రమశిక్షణకు కట్టుబడి ఉంటాడు. నిర్మాణ ప్రాతిపదిక మీద ఏర్పాటయిన రెండు దేశాల సైన్యం మధ్య యుద్ధం

జరిగినపుడు, ఇరుపక్షాలు సైనిక శిక్షణకు కట్టుబడే పోరాడతాయి. సైనికులు ఏదైనా చేయరాని పనిని చేసినపుడు, నాయకత్వం చూసీ, చూడనట్లు ఊరుకుంటుంది. ఆ సంప్రదాయం ఇటీవలిది కాదు; నెపోలియన్ కాలం నుండీ వస్తున్నది. ఆ క్రమశిక్షణా సూత్రాలకే, లో ఇన్‌టెన్సిటీ వార్ ఫేర్ లో కూడా సైనికులు కట్టుపడి ఉంటున్నారు. లో ఇన్‌టెన్సిటీ వార్‌ఫేర్‌లో నేలకొరిగిన "టెర్రరిస్టు" చేతి గడియారం వంటి వాటిని సైనికుడు తీసుకో గోరడని అనుకోవటం భ్రమ. దాన్ని తీసుకోవాలనే అతడు తాపత్రయపడటం సహజం. (సైనిక క్రమశిక్షణా రూల్సు ప్రకారం దాన్ని అతడు అధికార్లకు అందజేయాలి) మాదక ద్రవ్యాలను చేరవేసే మాఫియా మనుష్యులను పట్టుకోవటానికి సైన్యాన్ని వినియోగించేవారు గమనించ వలసిన విషయమిది". (ది ట్రాన్స్‌ఫర్మేషన్ ఆఫ్ వార్ -216 -217 పేజీలు)

"టెర్రరిస్టుల" మీదా, మాఫియా దళాల మీదా, సాయుధ చర్యలకు దిగిన దళాల మీదా సైన్యాన్ని ప్రయోగించినపుడు, మానభంగాలు, హత్యలు, దోపిడీలు ఎందుకు జరుగుతాయో దీనినిబట్టి అర్థం చేసుకోవచ్చు. రాబోయేది లో ఇన్‌టెన్సిటీ వార్ ఫేర్ యుగమని క్రివెల్డ్ సూచిస్తున్న దృష్ట్యా, మహిళలకు మానభంగ ప్రమాదాలు పెరిగేవే గాని తరిగేవి కావని భావించ వలసి వస్తున్నది.

### కాందిశీక క్యాంపులలోనూ తప్పని ముప్పు

యుద్ధం వలన అధికంగా నష్ట పడేది మహిళలు, పిల్లలు. మహిళలు ఆస్తులను, అప్పులను కోల్పోవటమే గాక , మానాన్ని కూడా కోల్పోవలసి వస్తున్నది. తల్లులు - బిడ్డలు వేరుగావలసి వస్తున్నది.

సోవియట్ యూనియన్లోనూ, తూర్పు యూరపు లోని దాని మిత్రరాజ్యాలలోనూ కమ్యూనిస్టు పాలన అంతరించిన తర్వాత (దీనినే "కోల్డ్‌వార్ అంతరించిన తర్వాత" అని కూడా పత్రికలు, రాజకీయ నాయకులు వ్యవహరిస్తున్నారు) విపరీతమైన మానవ వథా, వ్యథా ప్రారంభమైంది. జాతి వైషమ్యాలు ఒక్క పెట్టున ప్రజ్వలించాయి. మధ్య ఆఫ్రికాలో మానవ మారణ హోమమే జరుగుతున్నది. చరిత్రలో కని విని ఎరుగని హింసను, నిర్వాసితుల వలసను మానవజాతి అనుభవిస్తున్నది. రువాండా ఆఫ్రికాలోని చిన్న దేశం. జనాభా సుమారుగా 60 లక్షలుంటుంది. నాల్గు మాసాల కాలంలో దేశ జనాభాలో దాదాపు సగం మందినుండి మూడింట రెండు వంతులమంది వరకు జాత్యహంకార పోరాటానికో, అంటు రోగాలతో మరణించటమో, కాందిశీకులుగా ప్రాణాలను అరచేత బట్టుకొని పారిపోవటమో జరిగి ఉంటుందని యునైటెడ్ నేషన్స్ హై కమిషనర్ ఫర్ రిఫ్యూజీస్ అంచనా వేశారు. ప్రపంచం మొత్తం మీద కాందిశీకులుగా మారిన జనాభా రెండు కోట్ల ముప్పై లక్షలనుండి రెండు కోట్ల అరవై లక్షల వరకూ ఉండవచ్చునని కూడా వీరు అంచనా వేశారు. ఇలా నిర్వాసితులైన జనాభాలో నూరింట తొంభై మంది వరకూ స్త్రీలు, పిల్లలు ఉండవచ్చునని కూడా వారు సూచించారు. వీరి భర్తలు హత్యకు గురై యుండవచ్చు; లేదా బందీలుగా పట్టుబడి ఉండవచ్చు. 1995 వ సంవత్సరాంతానికి అంతర్యుద్ధాల వలన స్వదేశాన్ని వదలి ఇతర దేశాలకు పారిపోయిన కాందిశీకుల సంఖ్య రెండు కోట్ల అరవై లక్షల వరకూ ఉండవచ్చుననీ, ఎనభైలక్షల మంది వరకూ దాదాపు కాందిశీకుల వలె జీవితం గడుపుతున్న వారుంటారని 1997వ సంవత్సరపు హ్యూమన్ డెవలప్ మెంట్ రిపోర్ట్ సూచించింది. వీరంతా తమ ఉపాధితోసహా సర్వస్వాన్నీ కోల్పోయి అడుగడుగునా అత్యంత ప్రమాదకరమైన పరిస్థితులను ఎదుర్కొంటున్నారని కూడా ఆ రిపోర్టు వివరించింది.

1994 వ సంవత్సరంలో రువాండా ఊచకోతలో ఐదు లక్షల మంది హతులై యుంటారని, ఐదు లక్షలమంది వరకూ కలరా వలన మరణించినట్లు అంచనా వేశారు. జయర్ తిరుగుబాటుదారులు ఇలాంటి నిర్వాసితులను కూడా చంపారనటానికి పలు దాఖలాలున్నాయి.

మానభంగానికి గురైన మహిళల సంఖ్యా నిర్ణయానికి సరియైన అంచనాలే లభించటం లేదు. ఆసంఖ్య కూడా లక్షలలో ఉంటుందని చెబుతున్నారు. మహిళా కాందిశీకుల బాధలు ఎలా ఉంటాయో చూడండి:

"ముద్దు లొలికే తన మగబిడ్డను చూచినపుడు, బాధితురాలైన లోయోనిల్‌కు ఇక ఎంతమాత్రము బ్రతుక కూడదనిపిస్తుంది. ఇందుకు కారణం బిడ్డకాదు... తనను ముగ్గురు హుటు సైనికులు చెరచిన సంఘటన తన స్మృతి పథంలో మెదలటానికి ఆ బిడ్డడు కారణమవుతున్నాడు అన్ని

విధాలా తాను దురదృష్టవంతురాలనని ఆవిడ ఆత్మనిందకు పూనుకొంటున్నది. "ఈ ప్రపంచంలో నాకేమీ లేదు చనిపోవటం ఉత్తమం" అంటున్నది.

రువాండా ఊచకోత కాలంలో వేలాదిమంది మహిళలు మానభంగానికి గురయినారు. దీని ఫలితంగా గర్భధారణకు గురయిన వారు అనేకులు. చెరచిన వారిలో కొందరు ఆ యువతి భర్తను. అప్పులను చంపినవారే అయి ఉండవచ్చు. "హ్యూమన్ రైట్స్ వాచ్" సంస్థ వారి అంచనాల ప్రకారం, ఇలాంటి "శత్రు సంతానం" రెండువేలనుండి ఐదువేలవరకూ ఉండవచ్చునని తెలుస్తున్నది 1994వ సంవత్సరంలో మూడు మాసాల కాలం ఏకధాటిగా సాగిన మారణ కాండ ఫలితమే వీరి జననం.

"ఈ దేశంలో గర్భవిచ్ఛిత్తి మీద నిషేధం ఉన్నది. అందువల్ల శత్రు సంతానం జన్మించకుండా చేసుకొనే అవకాశం బాధితులకు లేకుండా పోయింది. కొందరు దొంగచాటుగా గర్భ విచ్ఛిత్తికి పాల్పడగా, మరికొందరకు కనక తప్పని పరిస్థితి ఏర్పడింది. కొందరు తమ బిడ్డలను అనాధ శరణాలయాలకు ఇచ్చారు; మరికొందరు గుండెనురాయి చేసుకొని కాననిచోట వదిలి వేశారు. బిడ్డను పెంచదలచిన వారికి వనరులులేవు. తినటానికి తమకే తిండి లేదు; ఉండటానికి నీడలేదు; భర్తలు చనిపోయారు; ఇలాంటి నికృష్ట జీవన స్థితిలో ఎంతటి దారుణానికైనా మానవుడు పాల్పడటం ఆశ్చర్యకరమైన అంశంగాదు.

"విధవలకు, మానభంగానికి గురయిన మహిళలకు రువాండా సమాజంలో గౌరవంలేదు. మళ్ళీ పెండ్లి చేసుకొని, కొత్త జీవితాన్ని ప్రారంభించే అవకాశాలు కనుపించటం లేదు. మానభంగానికి గురి గావటం వలన చాలా మంది బాధిత స్త్రీలకు, దురాగతానికి పాల్పడిన వారి నుండి ఎయిడ్స్ సంక్రమించింది. అన్నింటికంటే మానసికంగా జరిగిన నష్టం అపారం. పరపురుషుని చేతిలో బడి నలిగి, ఇంకా బ్రతికి ఉండవలసి వచ్చిందే అని వీరు వ్యధపడుతున్నారు. తమ భర్తవలె తాము చనిపోయి ఉంటే బాగుండేదిగదా అని బాధపడుతున్నారు. ప్రాణాలను కాపాడుకోవటానికి సైనికులకు లొంగి పోయిన వారు, పడుపు వృత్తికి దిగవలసి వచ్చిందే అని బాధపడు తున్నారు" (శాన్హోజే మెర్క్యురి న్యూస్ దినపత్రిక ప్రచురించిన న్యూయార్క్ టైమ్స్ రిపోర్టు - సెప్టెంబరు 23. 1996. నిర్వాసిత మహిళల బాధలను పాఠకులు గ్రహించటం కోసమే ఈ రిపోర్టును ఉదహరించాం). విస్తృత ప్రాతిపదిక మీద మహిళలు మానభంగాలకు గురయినట్లు, యునైటెడ్ నేషన్స్ హైకమిషనర్ ఫర్ రిఫ్యూజీస్ సదకో ఒగటా చెబుతూ, "ప్రపంచాన్నే చెరచటంగా" దీనిని వర్ణించారు.

నిర్వాసిత జనాభా ప్రపంచంలో ఎంత ఉంటుంది అనే అంశం మీద స్పష్టమైన అంచనాలు లభించటం లేదు. లభించిన అంచనాలు భిన్న చిత్రాలను ప్రదర్శిస్తున్నాయి.

తలదాచుకోవటానికి, క్యాంపులలో చేరిన మహిళలకు కూడా భద్రత కరువైంది బందిపోట్లు, దొంగ సరుకుతో వ్యాపారం చేసేవారు, సరిహద్దు కాపలాకున్న సైనికులు, ఆదేశపు పోలీసులు, సైనికులు, టెర్రరిస్టులు, చివరకు క్యాంపు నిర్వాహక సిబ్బంది, స్థానికులు కూడా అవకాశం కోసం దేగల్లా చూస్తుంటారు. క్యాంపులలోని మహిళల నిస్సహాయతను అవకాశంగా తీసుకొని వారి సెక్సును దోయటానికి ఈ వర్గాల వారు పొంచి ఉంటున్నారు

మహిళలు, పిల్లలు స్వస్థానాలను తప్పిన తర్వాత, రాలినఆకు వంటి వారిలా తయారవుతారు. అతి చిన్న ప్రమాదం కూడా వారికి తీవ్రమైన హానిని కలుగజేస్తుంది. పారిపోతున్న కాలంలో దేశ సరిహద్దులను దాటుతున్నపుడు, సరిహద్దు కాపలా సైనికులు వారిని మంద వేస్తారు. ఈ సమయంలో స్త్రీలను వేరుగా గాక పురుషులతోనే ఉంచే అవకాశాలు కూడా ఉంటాయి. ఇటువంటపుడు మహిళ మానానికి ముప్పు సంభవించ వచ్చు వీరి దీనస్థితిని చూసి, వస్తువులు, డబ్బు ఆశచూపి వారి సెక్సును దోచుకొనేవారుంటారు. వారిని రక్షించటానికి ఏర్పాటైన క్యాంపు అధికారులు కూడా ఇలాంటి దురాగతానికి పాల్పడతారు. తమ కోరికను మన్నించని మహిళకు, సహాయం అందకుండా చేయటానికి అనేక రకాల అధికార అభ్యంతరాలను లేవనెత్తుతారు. భార్యాభర్తలు అదృష్ట వశాత్తూ క్యాంపుకు రాగలిగినా, శారీరక, మానసిక వ్యధకు అంతా గురయి ఉండటం చేత, భర్త చేతిలోనే భార్యలు హింసను అనుభవించవలసి వచ్చే పరిస్థితులు కూడా ఏర్పడతాయి. క్యాంపును దాటి బయటకు వెళితే (వంట చెరకు కోసం

అడవికి పోకతప్పదు గదా) అదను కోసం పొంచి ఉన్న గ్రామస్థుల చేతిలో మానం పోయే ప్రమాదం ఉంటుంది 1993 వ సంత్సరంలో కీన్యాలోని క్యాంపులలో ఉంటున్న సోమాలియా కాందిశీక స్త్రీల మీద రాత్రివేళ దాడి చేసి, బందిపోట్లు, సోమాలియా సాయుధులు మూక ఉమ్మడిగా మానభంగాలకు పాల్పడ్డారు. ఇటీవల జయర్ లోని క్యాంపులో ఉంటున్న రువాండా మహిళలు వంటచెరుకు కోసం అడవికి పోయినపుడు పొంచి ఉన్న గ్రామస్థులు వారిని చెరిచారు. ఈ విధంగా మహిళా నిర్వాసితుల స్థితి అడుగడుగునా ప్రాణ గండంగా తయారవుతున్నది.

నిర్వాసిత మహిళలకు ఐక్యరాజ్యసమితి చేస్తున్న సహాయం సముద్రంలో నీటి బొట్టు వంటిదే. సామాజికులకు పట్టని మహిళా రక్షణను, ఇతర ఏజన్సీలు పట్టించుకుంటాయని అనుకోవటం పొరపాటు. వాటి వలన లభించే సహాయం నామమాత్రమేనని అనుభవం నిరూపిస్తున్నది.

యుద్ధము లేక అంతర్యుద్ధాల కాలంలోగాని, సైన్యంలో తాను చేరటంవల్లగాని, లేక సైన్యం తమ మధ్యకు రావటం చేతగాని స్త్రీలు అనుభవించ వలసి వస్తున్న బాధలను చూచాం. తాను సంచరించే సమాజంలోనే గాక, తన ఇంటిలో, తనను చేబట్టిన భర్త చేతిలోనో, సమీపబంధువుల చేతిలోనో, తమ నెరిగిన వారివల్లనో, శారీరకంగా, మానసికంగా స్త్రీ అనుభవించ వలసి వస్తున్న హింసారూపాలను, వాటి పరిమాణాలను, వాటి దుష్ఫలితాలను చూద్దాం.

# 16

## కన్నీటి కడలిలో కోమలి

స్పెయిన్ లో ఒక పొడుపుకథ ప్రచారంలో ఉన్నది. దాని సారాంశమిది :

ప్రశ్న : గాడిదకు, ఆడదానికి అవసరమైన దేమిటి?

సమాధానం : రెంటికీ దెబ్బలు బాగా పడుతూ ఉండాలి; అపుడే అది చెప్పినట్లు వింటుంది.

ఒక ఇంగ్లీషు సామెతను చూడండి :

"కుక్కనూ, భార్యను, వాల్‌నట్ చెట్టునూ ఎంతగా కొడుతూ ఉంటే అవి అంతగా బాగుపడుతూ ఉంటాయి" ఒక రష్యన్ సామెత ఇలా ఉన్నది. " తనను కొట్టని భర్తను, భార్య ప్రేమించవచ్చు, కాని గౌరవించదు". కొన్ని గిరిజన జాతులలో పెండ్లినాడు పెండ్లి కొడుకు భార్యను లాంఛన ప్రాయంగా కొట్టాలట. "భార్య, నేను కొన్న గుర్రం వంటిది; దాని మీద నేను స్వారి చేస్తాను, కొరడాతో ఇష్టం వచ్చినట్లు కొడతాను." ఇదొక చైనా సామెత. తెలుగువారూ ఇలాంటి సామెతలను చెప్పటంలో తీసిపోలేదు. "ఆడదానికీ, బర్రె గొడ్డుకు దెబ్బలు పడుతూ ఉండాలి; అపుడే అది మాటవింటుంది". తెలుగులో ఇల్లాలిని "వంటయింటి కుందేలు"గా వర్ణించటం చాలా మందికి తెలుసు. ప్రపంచ వ్యాప్తంగా ఇలాంటి సామెతలెన్నో వాడుకలో ఉన్నాయి.

అనాగరిక కాలం నాడు సృష్టించినవని ఈ సామెతలను కొట్టి వేద్దాం. ఆధునిక యుగంలో వీటికి దీటయినవే గాదు, వీటిని మించిన భావాలను ప్రకటించిన మహానుభావులున్నారు. కొన్ని సందర్భాలను ఇచట వివరిస్తాం పెరూ దేశంలో ఒక నర్సింగు స్టూడెంటును, ఆవిడ పోలీసు కస్టడీలో ఉన్నపుడు, పోలీసు అధికారి ఒకరు చెరిచారు. ఆవిడ కోర్టు కెళ్ళింది. "నీవు కన్యవేనా, లేక ఇంతకు పూర్వమే సెక్సు అనుభవం ఉందా" అని పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఫిర్యాదిని ప్రశ్నించాడు. ఆవిడ కన్యను కానని చెప్పింది. "కన్యవి కానపుడు ఇక కంప్లెయింటు ఎందుకు చేశావు. ఇదంతా సహజమే గదా" అన్నాడట అతను. పాపూ న్యూగిని పార్లమెంటులో ఒకరోజు భార్యలను భర్తలు కొట్టటం మీద చర్చ జరుగుతున్నదట. అపుడొక సభ్యుడు లేచి "భర్త భార్యను కొట్టడం ఆచారం; ఇలాంటి విషయాన్ని చర్చిస్తూ మనం కాలాన్ని వ్యర్థం చేస్తున్నాం" అన్నాడట! కీన్యాలోని ఒక బోర్డింగు స్కూలు విద్యార్థులు, హెడ్మాస్టరు ప్రవర్తనకు నిరసనగా ఒక ఒకరోజు

### "పెండ్లాన్ని కొట్టనని ఎలా అనుకొన్నావు?"

దక్షిణ కొరియాలోని ఒక గ్రామంలో న్యూయార్కు టైమ్స్ పత్రికా ప్రతినిధి ఒక గ్రామస్థుణ్ణి కలుసుకొన్నారు. "నీవూ పెండ్లాన్ని కొడతావా" అని అడిగారు.

"నాకిపుడు 52 సంవత్సరాలు. 28 సంవత్సరాలుగా పెండ్లాంతో కాపురం చేస్తున్నాను. నేను పెండ్లాన్ని కొట్టకుండా ఎలా ఉంటానను కొన్నావు?" అన్నాడట ఆ వ్యక్తి.

భార్యను భర్త కొట్టం అనేది ఆ దేశంలో అతి సామాన్యమైన విషయమని రిశర్చి స్కాలర్సు, సోషల్ వర్కర్సు చెబుతున్నారు. ఇటీవలె జరిగిన ఒక సర్వేలో పాల్గొన్న మొత్తం మహిళలలో 42 శాతం మంది తమను భర్తలు కొడుతున్నట్లు చెప్పారు.

"ఆడవారిని మూడు రోజులకొకసారి కొట్టాలి" ఒక కొరియన్ సామెత సూచిస్తున్నది. "బాగా కొట్టిన తర్వాతే, ఎండు చేపలు, ఆడదీ బాగుంటాయి" అని చెబుతున్నది మరొక కొరియా సామెత.

గ్రామంలో ఒక దుకాణం పెట్టు కొన్న మధ్యవయస్సు స్త్రీని ఆ ప్రతినిధి కలుసుకొన్నారు. "కొన్ని సందర్భాలలో భర్త భార్యను కొట్టటం తప్పే. కాని, భర్తకు ఎదురు మాటాడకుండా ఉంటే దెబ్బలు తప్పుతాయి" అని ఆవిడ చెప్పింది.

ఆవిడ తన బిడ్డకూ ఇలాంటి సలహా నిచ్చినట్లు కూడా చెప్పింది. "భర్త కొట్టినపుడు, తిరుగబడవద్దు. అతడు కొడితే తలవంచు; మిన్నకుండు". ఇదీ ఆవిడ సలహా.

కాని , తన సలహాను తన బిడ్డ పాటించటం లేదట. భర్త కొట్టినపుడు, బాక్సింగ్ రింగ్ లో బాక్సరులా భర్త మీదకు దూక చూస్తుందట.

భర్తలు కొడితే తాము ఊరుకుండటం లేదని, తిరుగబడుతున్నామని, యువతులు చెప్పారు.

"నేనూ నా భర్త పోట్లాడు కుంటే, అది పొరుగు వారికి తెలియకుండా ఉండాలి. భర్త దెబ్బలకు శరీరం గీసుకుపోయినా, దెబ్బలు తగిలినా అసలు విషయాన్ని పొరుగు వారికి చెప్పకూడదు. దెబ్బలెలా అయినాయి అని ఎవరయినా అడిగితే, చెట్టుకు కొట్టుకొన్నాననో, లేక కింద పడ్డాననో, లేక అతికే మరొక కారణాన్నో చెప్పాలి" ఇది మరో ఇల్లాలు వెల్లడించిన భావం.

*(న్యూయార్కు టైమ్స్ 1996, డిశంబరు మాసంలో ప్రచురించిన వార్తనుండి)*

సమ్మెచేయాలని నిర్ణయించారు. విద్యార్థినులు ఆ సమ్మెలో చేరటానికి నిరాకరించారు. దానితో కోపించిన విద్యార్థులు, మూక ఉమ్మడిగా ఆడపిల్లల మీద ఎగబడి అత్యాచారం చేశారు. ఆ చర్యలో 71 మంది విద్యార్థినులు మాన భంగానికి గురయినారు; పంథొమ్మిది మంది చనిపోయారు. ఆ సంఘటన మీద హెడ్మాష్టరు ఒక ప్రకటన చేశాడు. "విద్యార్థులు, విద్యార్థినులకు హాని చేయాలని అనుకోలేదు; కేవలం మానభంగాలు చేయాలనే అనుకొన్నారు" అని అందులో పేర్కొన్నారట! మలేషియా పార్లమెంటులో ఒక సారి మానభంగాల నివారణకు ఒక చట్టాన్ని చేసే ప్రయత్నం జరిగింది. దాని మీద జరిగిన చర్చలో పాల్గొంటూ, బరిసన్ నేషనల్ పార్టీకి చెందిన సభ్యులొకరు ఇలా సూచించారు: "అమాయకులయిన మగవారిని స్త్రీ అవయవ రూపురేఖలు ఉద్రేక పరుస్తాయి. అందువల్ల వారు అనుకోకుండానే మానభంగానికి పాల్పడతారు. దీని నివారణకు స్త్రీలు అవయవాలు కనుపించకుండా, తలనుండి పాదాల వరకూ కప్పి ఉంచే పరదాలను వాడాలి. నిరంతరం మగవారిని తిట్టిపోస్తూ ఉండే కంటే, వారి పాలబడకుండా స్త్రీలు తగిన జాగ్రత్తలను తీసుకోవటం అవసరం". కాబూల్‌లో తాలిబాన్ ప్రభుత్వంలో విద్యామంత్రిగా ఉన్న సయ్యాద్ ఘియాసుద్దీన్

ప్రవచనాలను వినండి : "స్త్రీ రోజాపువ్వువంటిది దాన్ని వాడిపోకుండా జాగ్రత్తగా ఉంచుకో, దాన్ని నీవు మాత్రమే చూచి ఆనందించాలి. దాని పరిమళాన్ని నీవు మాత్రమే అనుభవించాలి. దానిని బయటకు తీసుకుపోయి ఇతరులు దాని సువాసనను అనుభవించే అవకాశాన్నీయవద్దు". ఆ సూత్రం ప్రకారమే నేమో, తాలిబాన్ ప్రభుత్వం ఏర్పడగానే కాబూల్ నగరంలోని స్త్రీ లెవ్వరూ గడపదాటి వెళ్ళకూడదని శాసించారు!

అన్ని దేశాలలోనూ, అన్నిరకాల కల్చర్లలోనూ మహిళ తరతరాలుగా తనకుంటుబీకుల చేతిలోనే పలురకాల బాధలను అనుభవిస్తూ బందీ వలె జీవిస్తున్నది. తాను ఎవరితోనయితే స్వేచ్ఛగా, సంతోషంగా జీవించాలో వారి చేతిలోనే ఆమె దెబ్బలను తింటున్నది; సెక్సు పరమైన అత్యాచారాలకు గురవుతున్నది; శారీరక హింసనే గాక మానసిక హింసను కూడా అనుభవిస్తున్నది. ఈ దురాగతానికి పాల్పడిన వారికి శిక్షలు పడటం అరుదైన విషయం. "అయ్యో ఇది దురాగతం" అన్న వారెవరూ కనుపించరు. బహిరంగంగా కాకపోయినా, పరోక్షంగానైనా దీనిని ఖండించినవారు కనుపించరు; బహిరంగంగా గాని, మౌనంగా గాని దానిని అంగీకరిస్తున్నారు

మన సంస్కృతీ స్థాయిని బట్టే, మన పరిపాలకులుంటారు. ఇది సహజమైన అంశం. సమాజమంతా స్త్రీ హింసను సమర్థిస్తున్నపుడు, "ఇదినేరం" అని మనచట్టాలు, కోర్టులు అనటానకి సాహసించవు. తన మాట వినని భార్యను కొట్టటానికి, ఆఖరుకు చంపటానికి కూడా భర్తకు చట్టాలు అవకాశమిస్తున్నాయి. 1775 వ సంవత్సరంలో డబ్లు. బ్లాక్‌స్టన్ అనే బ్రిటిష్ జడ్జి "కామెంటరీస్ ఆన్ ది లాస్ ఆఫ్ ఇంగ్లండ్" అనే పుస్తకాన్ని వ్రాశారు. దానిలో వారు "తనపిల్లలను గాని, తన సేవకులను గాని, తప్పు చేసినప్పుడు సరిదిద్దినట్లే, భార్యకూడా తప్పు చేసినపడు సరిదిద్దే హక్కు భర్తకున్నది" అని చెప్పారు. 1872 వ సంవత్సరంలో జి.సి.జెఫర్సన్ అనే జడ్జి "బ్రైడ్స్ అండ్ బ్రైడల్స్" అనే పుస్తకం వ్రాశారు. అందులో వారు, భార్యను కొట్టటానికి ఇనుపకడ్డీని వాడవద్దన్నారు."కడ్గెల్" తో కొట్టమన్నారు. (కడ్గెల్ అనేది బేస్‌బాల్ బాట్ రూపంలో ఉంటుంది.) దానికి చివరగాని, చుట్టూగాని, మూలలుండవు సుంద్రంగా చేసి ఉంటుంది. దీనితో కొడితే చర్మం చిట్లి రక్తం కారదు. కాని ఎముకలు సులభంగా విరుగుతాయి: కండరాలు కీమా అవుతాయి దీనినే మనం వళ్ళు "హూనం గావటం" గా వ్యవహరిస్తూ ఉంటాము. ఈ సూత్రాలు ప్రాతిపదికమీదనే ఇంగ్లండులోనూ, అమెరికాలోనూ కోర్టు తీర్పులుండేవి. 1824వ సంవత్సరంలో ఇంగ్లండులో భర్త భార్యను కొట్టిన నేరం ఒకటి విచారణకు వచ్చింది. జడ్జి తన తీర్పులో ఒక సందర్భంలో ఇలా సూచించారు: "భార్యను భర్త కొట్టిన విషయం బయటి వారికి తెలిసినపుడు ఇద్దరకూ పరువు పోతుంది కొట్టిన భర్త ప్రాసిక్యూషన్‌కు గురి కావచ్చు. ఇలాంటి పరిస్థితి ఏర్పడకుండా భార్యను కొట్టే హక్కు భర్తకున్నది" దీని అర్థం "కొట్టు; కాని ఆ విషయం ఇరుగు-పొరుగుకు తెలియనీకు " అనేగదా! భర్త చేతిలో దెబ్బలు తిన్న భార్యకు శాశ్వత అంగవైకల్యం ఏదైనా సంభవిస్తేనే భర్తను శిక్షార్హునిగా కోర్టులు తీర్పుల నిస్తున్నాయి. ఇది జరుగనపుడు భర్తకు జరుగుతున్న నష్టమేమీ లేదు. కాబట్టి నేరం రుజువుగాకుండా ఉండాలంటే భర్త భార్యను కొట్టేటపుడు ఆమె ఎముకలు విరగకుండా జాగ్రత్తపడాలి! కనుపించని దెబ్బలు కొట్టాలి. తనను రెచ్చగొట్టేట్లుగా భార్యప్రవర్తించిందని చెప్పిన భర్త వాదాన్ని కోర్టులు అంగీకరించిన సందర్భాలున్నాయి. ఒకవేళ భర్త దోషిగా నిర్ధారణయితే, అతనికి పడుతున్న శిక్ష నామమాత్రం! భార్యను భర్త కొట్టడం సహజం అనే మన సంస్కృతి ప్రాతిపదిక మీదనే "రూల్ ఆఫ్ ది థంబ్" అనేది వాడుక లోనికి వచ్చినట్లున్నది. భార్యను కొట్టటానికి బొటన వేలంత లావుగల కర్రను మాత్రమే వాడాలనే నిర్దేశం దీనికి మూలమై యుంటుందన్న అభిప్రాయాన్ని "వాషింగ్టన్ లా రివ్యూ" అనే పత్రికలో ప్రచురితమైన తన వ్యాసంలో కె.విట్స్ అనే లాయరు వ్యక్తం చేశారు.

భార్యమీద సెక్సు సంబంధమైన దురాగతానికి పాల్పడిన భర్త చర్యను మన చట్టాలు, కోర్టులు మన్నిస్తున్నాయి. తన భార్యతో పరపురుషుడు సెక్సు సంబంధం పెంచుకొన్నా, లేక పరపురుషుడు ఆవిడ మీద సెక్సు పరమైన హింసకు పాల్పడినా, దాన్ని నేరంగా చట్టాలు నిర్దేశిస్తున్నాయి. భార్య అంగీకారం లేకుండా, ఆవిడ ఇష్టపడనపుడు, బలవంతంగా ఆవిడ మీద సెక్సు హింసకు తలపడిన భర్తను మాత్రం చట్టాలు-కోర్టులు

నేరస్తునిగా నిర్దేశించటం లేదు. జాన్ స్టూవర్ట్ మిల్ "సబ్జుగేషన్ ఆఫ్ ఉమెన్" అన్న పుస్తకాన్ని 1869లో వ్రాశారు. అందులో "భార్య" ను ఎంత దయనీయంగా చిత్రించారో చూడండిః "..... . తనను భర్త ద్వేషిస్తున్నట్లు ఆవిడకు తెలుసు, ఆవిడను చిత్రహింసల పాలు చేయటమే భర్తకు ఆనందదాయకమైన పనిగా ఉండవచ్చు; ఆవిడ నుండి అతడు దేనినయినా కోరవచ్చు; ఆవిడ ఇష్టానిష్టాలతో పని లేకుండా ఎంతటి నైచ్యానికయినా పాల్పడవచ్చు; ఎంతటి దురాగతానికయినా దిగజారవచ్చు; పశుప్రవృత్తిని ప్రదర్శించవచ్చు. నీచమానవుని వలె ప్రవర్తిస్తూ ఉండవచ్చు. ఇటువంటి దుర్మార్గుని చేతిలో ఆవిడ బందీ అయిపోయింది. దూరంగా ఉండమని ఆ దుర్మార్గుని ఆదేశించగల శక్తి ఆవిడకు లేదు ........ ఈ వ్యక్తే "భార్య" ఈ చిత్రీకరణ జరిగి 130 సంవత్సరాలు గడిచినా, "ఇది ఈ కాలానికి వర్తించదు" అని చెప్పదగిన పరాణామం ఇంకా సంభవించలేదు!

సమాజపు సంస్కృతికి అనుగుణంగానే చట్టాలు రూపొందుతాయి; కోర్టులు తీర్పులు చెబుతాయి. కనుక భార్య భర్తకు లోబడి ఉండాలని ఇవి నిర్దేశిస్తాయి. భర్త యొక్క ఆస్తిగా భార్యనివి గుర్తిస్తాయి. తన అభీష్టానికి అనుగుణంగా ప్రవర్తించాలని , భార్యను భర్త నిర్దేశించవచ్చు; తనమాటను జవదాటినపుడు భర్త ఆవిడను శిక్షించవచ్చు. సంప్రదాయంగా సమాజం అంగీకరించిన అంశమిది. కనుక కుటుంబంలో జరిగినది ఆ కుటుంబపు ప్రైవేటు వ్యవహారం; అందులో జోక్యం కలుగ జేసుకోగల హక్కు ఎవరికీ లేదు. కనుకే పరుల భార్యల రక్షణ కోసం సామాన్యంగా ఇతరులెవరూ ప్రయత్నించరు.

"ప్రపంచ జనాభాలో సగానికి మించే స్త్రీలున్నారు. ప్రపంచంలో జరిగే పనిలో మూడింట రెండు వంతులను వీరే చేస్తున్నారు. లభిస్తున్న ఆదాయంలో వీరికి పదవవంతు మాత్రమే గిడుతున్నది; ప్రపంచ ఆస్థిలో వీరి కున్నది నూరింట ఒక్కపాలు మాత్రమే; మానవ హక్కులను అనుభవించటానికి వీరు నోచుకోలేదు; పురుషులతో సమంగా వ్యవహరించగల అధికారం స్త్రీలకు లేదు; అంతేకాదు; స్వేచ్ఛగా, గౌరవ ప్రదంగా జీవించగల అవకాశాలు కూడా లేవు; ప్రత్యక్షంగా - ప్రేక్షకుల ముందే - వారు శారీరక, మానసిక హింసలకు గురవుతున్నారు; వారి మాన ప్రాణాలకు రక్షణ లేకుండా పోయింది" ("వయలెన్స్ ఎగైన్స్ట్ ఉమెన్" - సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ అండ్ హ్యూమనిటేరియన్ ఎఫెయిర్స్ ప్రచురణ)

కాలం మారుతున్నది. మహిళాలోకంలో చైతన్యం అంకురించింది. అందువల్ల కొన్ని దేశాలలోని చట్టాలలో మార్పులు వస్తున్నాయి కాని స్త్రీ హింస తగ్గిన సూచనలు మాత్రం కనుపించటం లేదు. పురుషాహంకారానికి కళ్ళాలు పడలేదు. ప్రపంచంలోని పలు దేశాలు, కుటుంబంలోని మహిళలు హింసకు గురవుతూ ఉండటాన్ని తీవ్రమైన సమస్యగా గుర్తించాయి. స్త్రీ హింసా సంఘటనల సంఖ్య పెరుగుతూ ఉండటమే గాక, ఒక సంఘటన మరొక దానికి దారి దీస్తూ ఇది జీవన సమస్యగా రూపొందిన పరిణామం కూడా స్పష్టంగా వెలుగులోని కొచ్చింది. పలువురు పరిశోధకుల కృషి వల్లా, సంఘసేవకుల సేవానిరతి వల్లా, స్త్రీ హింసా పరిమాణమే గాకుండా హింసా రూపాలు కూడా స్పష్టంగా తెలియ వస్తున్నాయి. సంభవిస్తున్న హింసా పరిమాణానికీ, వెలుగులోనికి వస్తున్న హింసా పరిమాణానికీ హస్తిమ శకాంతరం ఉన్నది. ఈ సమస్యకు అంతర్జాతీయ గుర్తింపు లభించింది. స్త్రీలు పురుషులతో సమంగా జీవించే అవకాశాలు లేకపోతే సామాజికాభివృద్ధి, శాంతి అనేవి ఉండవనే భావన నెలకొన్నది.

### హింసః దానిరూపాలు : పరిమాణం

స్త్రీ బట్టగట్టినప్పటి నుండి మాత్రమే హింసకు గురిగావటం లేదు. తల్లి గర్భంలో పిండంగా అవతరించినప్పటి నుండి, కాటికి పోయే వరకూ హింసను - పలురూపాలలో - అనుభవిస్తూనే ఉంటున్నది. అనుక్షణం ప్రాణాపాయాలను ఎదుర్కొంటూ ఉంటుంది. గర్భస్థ శిశువు, మగపిల్లవాడు కాదని పరీక్షలు నిరూపిస్తే, గర్భస్రావ ప్రయత్నం జరుగవచ్చు. ఇందువల్ల పిండంగానే తాను చనిపోవలసి వస్తుంది. ఆ ప్రాణ గండాన్ని దాట గలిగిన తర్వాత, తల్లి అనుభవించ వలసి వచ్చే పోషకాహార లోపం, వైద్య చికిత్సా సదుపాయం లేక పోవటం వల్ల, తల్లితో బాటు తానూ నష్టపడుతుంది. తండ్రి హింసా ప్రవృత్తి వల్ల తల్లి దెబ్బలు తినవలసి వస్తే, ఆ దెబ్బలు గర్భస్రావానికి దారిదాయవచ్చు. తండ్రి దురాగతానికి తాను పిండంగానే మరణించవలసి రావచ్చు. ఆ ప్రమాదాన్ని గడచి గట్టెక్క గలిగితే, తండ్రి దుర్మార్గం వల్ల తల్లి అనుభవించే

శారీరక, మానసిక, హింసల ఫలితాన్ని తాను అనుభవించవలసి వస్తుంది. తల్లి మానభంగానికి గురయిన ఫలితంగా తాను అవతరించినా, ఆ నష్టాన్ని తానూ అనుభవించక తప్పదు. ఇలాంటి బాధలకు గురయ్యే తల్లులకు ప్రసవమే ఒక గండంగా మారవచ్చు. తల్లితో పాటు తానూ మరణించవచ్చు; లేదా తల్లిపోగా తాను మిగలవచ్చు. ఇలాంటి బిడ్డలు తల్లి మరణించిన సంవత్సరం లోపున మరణించే అవకాశాలుంటాయని ఇంతకు పూర్వమే చూచాం: ఈ దశలో చావును తప్పించుకో గలిగితే తల్లి లేని బిడ్డగా బ్రతకటం ఎంత కష్టమో అందరకూ తెలుసు.

ఆడపిల్ల పుట్టుక తల్లి దండ్రులకు ఇష్టం లేనపుడు ఆవిడ పురిటిలోనే "చనిపోయే" ప్రమాదం ఉన్నది. ఆ ప్రమాదాన్ని గడచి బ్రతుక గలిగితే, ఆడపిల్లగా పోషణ, ఆరోగ్య రక్షణలలో వివక్షకు గురిగావలసి వస్తుంది. మగపిల్లలతో సమానమైన రక్షణా, పోషణా వీరికి లభించదు. అలాగే చదువు - సంధ్యల విషయంలోనూ వారు రెండవ తరగతి వారు గానే ఉంటారు.

శైశవావస్థ నుండి బాల్యంలో ప్రవేశించిన తర్వాత మరో రూపంలో హింస ఎదురవుతుంది. ముక్కు పచ్చలారక ముందే పెండ్లి చేస్తారు; ఆచారం అమలులో ఉన్న చోట్ల మర్మావయవాల ఆపరేషన్‌కు (జెనిటల్ మ్యూటిలేషన్‌కు) గురిగావలసి వస్తుంది; తెలియని వారితో పాటు తెలిసిన వారుకూడా చేసే మానభంగాలకు గురిగావలసి రావచ్చు. పోషణా, వైద్య చికిత్సా సదుపాయాల ఏర్పాటులో జరిగే వివక్షకు గురిగావలసి రావచ్చు. వేశ్యావాటికను ప్రవేశించే ప్రమాదాలు కూడా సంభవించవచ్చు.

యవ్వనదశలో ప్రవేశించిన తర్వాత "ప్రేమ పురాణం" ప్రారంభమవుతుంది. "ప్రేమికుల" చేతిలోనే ఆవిడ పలు హింసారూపాలను అనుభవించవలసి రావచ్చు. అతి సామాన్యంగా సంభవిస్తూండేది మానభంగం; దారిద్ర్యపు బాధ వల్ల వ్యభిచారవృత్తికి దిగవలసి రావచ్చు; మోసపోయి వేశ్యావాటికను చేరవచ్చు; పనిచేసే చోట సెక్సు వేధింపులకు, ఆఖరుకు మానభంగానికి కూడా ఎరగావలసి రావచ్చు; ఎయిడ్స్‌తో పాటు పలురకాల "సుఖ" వ్యాధులు వచ్చే ప్రమాదం పొంచి ఉంటుంది.

ఈ దశను దాటి కని- పెంచే వయస్సుకు చేరిన తర్వాత, మగని చేతిలోనో లేక "ప్రేమికుని" చేతిలోనో హింసను అనుభవించవలసి రావచ్చు. భర్త చేతిలోనే మానభంగాన్ని అనుభవించవలసి రావచ్చు. కట్నాల బాధలు ఎంత తీవ్రంగా ఉంటాయో అందరకూ తెలుసు. ఆ వివాదం ఆవిడ శారీరక మానసిక హింసతో అంతరించక బలవన్మరణానికి కూడా దారితీయవచ్చు. భర్త చేతిలోని దెబ్బలవల్ల చావు మూడవచ్చు. చూలు కాలంలోనూ, కాన్పు కాలంలోనూ ఉండే ప్రమాదాలు అందరకూ తెలుసు.

ఈ దశను దాటి వయస్సు మళ్ళిన తర్వాత నైనా ప్రశాంతంగా జీవించే అవకాశాలు స్త్రీకి లేవు. నిర్లక్ష్యానికి, అవమానాలకూ వీరు గురి అవుతూ ఉంటారు. ఇటువంటి బాధితులకు సంబంధించిన సమాచారం ఒక్క అమెరికాలో మాత్రమే సంతృప్తి కరమైన మేరకు అందుబాటులో ఉన్నది. ఈ సమాచారం ప్రకారం వయస్సు మళ్ళిన వారిలో, పురుషుల కంటే స్త్రీలే అధికంగా నిరాదరణకు, అవమానాలకూ గురవుతున్నట్లు తెలుస్తున్నది. మందులకు లొంగని రోగాలతో బాధపడవలసివచ్చే దశ ఇది. అయినా ఆ దశలోనూ స్త్రీ, శారీరకంగానే కాక మానసికంగా కూడా బాధలు పడక తప్పటం లేదు.

స్త్రీ పుట్టిన దగ్గర నుండి, కాటికి పోయేవరకూ ఈవిధంగా పలురకాల శారీరక, మానసిక హింసలకు గురవుతూ ఉంటుంది. అడుగడుగునా ప్రాణగండాలను దాటవలసి ఉంటుంది. బ్రతికినంత కాలమూ ఆత్మాభిమానాన్ని కూడా కాపాడుకోలేక పోతున్నది. ఆవిడ జీవితం కంటకావృతం; ప్రమాదభరితం. భావి తరాలకు జీవం పోస్తున్న మాతృ మూర్తికి లభిస్తున్న గౌరవమిది!

స్త్రీ అనుభవించవలసి వచ్చే హింసా రూపాలు ఎలా ఉంటాయో, సూక్ష్మంగా పైన వివరించాం. వాటి పరిమాణమెంతో, అలాంటి హింసలకు కారకులెవరో చూద్దాం. ప్రపంచ బ్యాంకు, భార్యల హింసలమీద పలు దేశాలలో జరిపిన సర్వేల సమాచారాన్ని స్వీకరించి వాటి సారాంశాన్ని విడుదల చేసింది. ఆ వివరాలలో కొన్నింటిని చూద్దాం.

బార్బడోస్ లో 1993వ సంవత్సరంలో జరిగిన సర్వేలో, ముప్పై శాతం మంది మహిళలు భర్త చేతిలో దెబ్బలు

తిన్నారని తేలింది; యాభై శాతం మంది స్త్రీ - పురుషులు, తమ తల్లులు భర్త చేతిలో దెబ్బలు తింటున్నట్లు చెప్పారు. బెల్జియంలో సర్వేలో పాల్గొన్న మహిళలలో మూడు శాతం మంది తీవ్రమైన హింసకు గురయినారు. పదమూడు శాతం మంది ఒక మోస్తరు దెబ్బలు తిన్నారు; ఇరవయ్యైదు శాతం మంది తేలికపాటి హింసకు గురయినారు. ఈ సర్వే 1989 లో జరిగింది. కెనడాలో 1993వ సంవత్సరంలో జరిగిన సర్వేల్లో, పాల్గొన్న వారిలో 25 శాతం మంది తాము తమ 18 సంవత్సరాల వయస్సు నుండి, తమ ప్రస్తుత భర్తల చేతిలో గాని, మాజీ భర్తల చేతిలోగాని హింసను అనుభవించినట్లు చెప్పారు 65 శాతం మంది తాము ఒకటి కంటే ఎక్కువ సార్లు దెబ్బలు తిన్నామన్నారు; 32 శాతం మంది పదకొండు సార్లుకు మించే దెబ్బలు తిన్నామని చెప్పారు. భర్తలు కొట్టిన 45 శాతం సందర్భాలలో భార్యలకు గాయాలైనాయి.

చిలీలో 1993 లో ఒక సర్వే జరిగింది. అరవై శాతం మంది తాము భర్తల చేతిలో హింసను అనుభవించినట్లు చెప్పారు. 26.2 శాతం మంది తీవ్రమైన హింసకు గురయినట్లు ఈ సర్వే పేర్కొన్నది. చెంపదెబ్బలు వేయటం, నెట్టటం,

## కొన్ని భ్రమలు : నిరూపణలు

"అందరు భర్తలూ, ప్రియులూ తమ భార్యలను, ప్రియురాండ్రను కొడతారా, తిడతారా, బాధిస్తారా? ఎవరో ఒకరుంటారు ఇలాంటివారు. కొట్టినా వ్యక్తిగత కారణాల వల్ల కొడతారు" అనేభావం ప్రచారంలో ఉన్నది. ఇది భ్రమ మాత్రమే; వాస్తవం గాదు అని పలువురు సంఘ సేవకులు, సామాజిక శాస్త్ర, వైద్యశాస్త్ర నిపుణులు నిరూపించారు; ఆ నిరూపణను ధృవ పరిచే సాహిత్యం అపారంగా లభిస్తున్నది. మచ్చుకు కొన్ని భ్రమలనూ, నిరూపణలను ఇచ్చట చూడవచ్చు

1. గృహమే స్వర్గసీమ , ఇదే కుటుంబీకుల కంచుకోట అని అంటూంటారు. తన "కంచుకోట" లోనే ఇల్లాలికి రక్షణ లేదు; బయటికంటే ఇంట్లోనే స్త్రీ అధిక హింసకు, చివరకు ప్రాణహానికి గురవుతున్నది.

2. గుడిసెలలో ఉండే "అలగా జనం" పెండ్లాలను కొడతారుగాని, అంతా కొడతారా ? ఇది భ్రమ మాత్రమే. అన్ని కులాల వారు, అనేక అంతస్థుల వారు, విద్యావంతులు, అత్యున్నత స్థానాలను అలంకరిస్తున్న వారూ, ఆఖరుకు రాజకుటుంబీకులు భార్యలను బాధిస్తూనే ఉన్నారు. ఈ రెండు వర్గాల మధ్య స్త్రీ హింసలో తర - తమ భేదాలు ఉండవచ్చు. ఇది వాస్తవం.

3. భార్యను మంచి మార్గంలో పెట్టటానికి కొడతారుగాని, చావగొడతారా? లేక ఎముకలు విరగ గొడతారా? వళ్ళు కాలుస్తారా? ఇలాంటి పనులను బయటి వారు చేయవచ్చు. ఇది భ్రమ. బయటివారు హింసిస్తే, ఆ హింసా ఫలితం కంటికి కనుపించ వచ్చు; భర్త కనుపించని దెబ్బలను కొడతాడు; చివరకు ప్రాణం తీయటానికి కూడా సంకోచించడు. శారీరకంగానే గాదు; మానసికంగా చిత్రవధ చేయగలడు. ఇది వాస్తవం.

4. ఆడవారు మాత్రం భర్తలను చంపటం లేదా? లేక చంపించటం లేదా? ఇది అర్ధసత్యం మాత్రమే. భర్త పోరు పడలేక కొందరు భార్యలు ఆత్మరక్షణకు ఇలాంటి పనులను చేయవచ్చు కాని, భర్త చేతిలోచనిపోయే భార్యల సంఖ్యతో పోల్చితే, భార్యచేతిలో హతులయ్యే భర్తల సంఖ్య, సముద్రంలో నీటి బొట్టు మాత్రం. ఇది సత్యం.

5. భర్తలు చికాకు పడినపుడు, లేక మనోవేదనకు గురయినపుడు భార్యలను కొడతారు. ఇది అసత్యం. ఇది వాస్తవం గాదని మానసిక రోగ చికిత్సా నిపుణులు నిరూపించారు. తాను చెప్పినట్లు స్త్రీ పడి ఉండాలన్న భావమే వారిని హింసకు పురికొల్పుతున్నది. భార్యను కొట్టటం పురుషాధిక్యతా భావ ప్రదర్శనకు మాత్రమే. ఇది సత్యం.

6. తాగివచ్చి పెండ్లాన్ని కొట్టాడని కొందరు సాధారణంగా భావిస్తారు. ఇది భ్రమ మాత్రమే. తాగుడు, మాదక ద్రవ్య వాడకం స్త్రీ హింసను ప్రోత్సహించటం లేదని శాస్త్రీయంగా రుజువైంది. తాగుడు అలవాటున్న సమాజంలో స్త్రీ హింసకు తావులేని దాఖలాలున్నాయి. తాగినంత మాత్రాన భార్యను హింసించ వలసిన అవసరం లేదు. హింసించాలన్న భావం తోనే దురాగతానికి భర్తలు పూనుకొంటారు. తాగుడు ఒక ముసుగు వంటిది మాత్రమే. ఇది వాస్తవం.

## ఒకటవ పట్టిక
## కొన్ని దేశాలలో సంభవించిన సెక్సు దురాగతాలు

| దేశము / నగరము | హింసించిన వారిలో బాధితలకు తెలిసిన వారి శాతం | దురాగతానికి లోనైన వారిలో 15 సం॥ల వయస్సులోపు వారి శాతం | దురాగతానికి గురయిన వారిలో 10 సం॥లకు తక్కువ వయస్సున్న వారి శాతం |
|---|---|---|---|
| లిమా (పెరూ) | 60 | - | 18 |
| మలేషియా | 68 | 58 | 18 |
| మెక్సికన్ సిటీ | 67 | 36 | 23 |
| పనామాసిటీ | 63 | 40 | - |
| పాపు న్యూగినీ | - | 47 | 13 |
| శాంటియాగో (చిలి) | 72 | 58 | 32 |
| అమెరికా | 78 | 62 | 29 |

*- ఆయా దేశాలలో జరిగిన సర్వేల సమాచారపు ఆధారంతో ప్రపంచ బ్యాంకు నిపుణులు కూర్చిన పట్టిక (1996)*

వస్తువులను మీదకు విసరటం వంటివిగాక, అంతకంటే తీవ్రమైన చర్యలకు వీరి భర్తలు పాల్పడ్డారు. దెబ్బలు తిన్నవారిలో 70 శాతం మంది తాము ఒకసారికి మించే హింసను అనుభవించినట్లు చెప్పారు. కంబోడియాలో ఇరవై శాతం మంది శారీరక హింసకు, 33 శాతం మంది మానసిక హింసకు గురయినట్లు చెప్పారు. పదిశాతం మంది తమను భర్తలు మానభంగం చేసినట్లు చెప్పారు. ఈ సర్వే 1990లో జరిగింది

1990 వ సంవత్సరంలో పంజాబు లోని జలంధర్ జిల్లాలో సర్వే జరిగింది. షెడ్యూల్డు కులాలకు చెందిన పురుషులలో 75 శాతం మంది తాము భార్యలను కొడుతున్నట్లు చెప్పారు. అగ్ర వర్ణాలకు చెందిన వారిలో 22 శాతం మంది పురుషులు తాము కూడా భార్యలను కొడుతున్నట్లు చెప్పారు. షెడ్యూల్డు కులాలకు చెందిన మహిళలలో 75 శాతం మంది తమను భర్తలు తరచు కొడుతూ ఉన్నారని వెల్లడించారు. 1993 వ సంవత్సరంలో దక్షిణ కర్ణాటక లోని ఒక గ్రామీణ ప్రాంతంలో సర్వే జరిగింది. తమను భర్తలు కొడుతున్నట్లు 22 శాతం మంది మహిళలు చెప్పారు. పన్నెండు శాతం మంది తమను గత మాసం కాలంలో భర్తలు కొట్టినట్లు చెప్పారు. వీరు సగటున మాసానికి 2.65 సార్లు దెబ్బలు తింటున్నట్లు సర్వేయర్లు లెక్కలు గట్టారు సర్వేలో వెల్లడైన దానికంటే అధికంగానే హింస జరుగుతున్నదని, సర్వేలో పాల్గొన్నవారు విషయాలను మనస్సు విప్పి చెప్పనందున తక్కువగా కనుపిస్తున్నదని సర్వేయర్లు అభిప్రాయ పడ్డారు.

1993 వ సంవత్సరంలో జపాన్‌లో ఒక సర్వే జరిగింది. 58.7 శాతం మంది తమను భర్తలుకొడుతున్నట్లు చెప్పారు. 65.7 శాతం మంది తమను భర్తలు మానసికంగా హింసిస్తున్నట్లు చెప్పారు; 59.4 శాతం మంది తమను భర్తలు సెక్సుపరమైన హింసకు గురిచేస్తున్నట్లు వెల్లడించారు. నలభైనాలుగు శాతం మంది మహిళలు ఈ మూడు రకాల హింసలను తాము అనుభవించినట్లు వివరించారు.

నెదర్లాండ్సులో 1989 లో జరిగిన సర్వేలో 20.8 శాతం మంది మహిళలు తాము తమ ప్రియుల చేతిలో

హింసననుభవించినట్లు చెప్పారు. దెబ్బలు తిన్న వారిలో పదకొండు శాతం మంది తాము పలుసార్లు తీవ్రంగా దెబ్బలు తిన్నట్లు చెప్పారు. న్యూజిలాండ్ లో జరిగిన ఒక సర్వేలో తాము తమ 16 వ సంవత్సరం వయస్సు నుండి హింసకు గురవుతున్నట్లు చెప్పారు; 76 శాతం మంది తాము తమ ప్రియుల చేతిలో హింసను అనుభవించినట్లు వెల్లడించారు. దెబ్బలు తిన్న వారిలో 20.7 శాతం మంది సెక్సు పరమైన హింసకు గురయినట్లు చెప్పారు

శ్రీలంకలో 1990 వ సంవత్సరంలో ఒక సర్వే జరిగింది. అరవై శాతం మంది మహిళలు తాము హింసకు గురవుతున్నట్లు చెప్పారు. దెబ్బలు తిన్నవారిలో 51 శాతం మంది, తమను కొట్టటానికి భర్తలు సాధనాలను వాడినట్లు చెప్పారు.

అమెరికాలో 1986 వ సంవత్సరంలో మరొక సర్వే జరిగింది ఇరవయ్యొనిమిది శాతం మంది మహిళలు తాము ఒక్కసారయినా హింసను అనుభవించినట్లు చెప్పారు. సర్వేకు పూర్వపు సంవత్సర కాలంలో హింసకు గురయినట్లు 22 శాతం మంది చెప్పారు. 1989 లో జరిగిన సర్వేలో తమ పద్దెనిమిదవ యేట నుండీ హింసకు గురవుతున్నట్లు 39 శాతం మంది మహిళలు చెప్పారు. ముప్పయ్యొక శాతం మంది శారీరక హింసకు గురయినట్లు వెల్లడించారు. పన్నెండు శాతం మంది పద్దెనిమిది సంవత్సరాల వయస్సు నుండీ పురుషుల చేతిలో సెక్సు హింసను అనుభవిస్తున్నట్లు చెప్పారు.

ప్రపంచబ్యాంకు ప్రపంచంలోని నలభై దేశాలలో, స్త్రీ హింసపై జరిగిన సర్వే ఫలితాలను ప్రకటించింది. మచ్చుకు కొన్నింటిని మాత్రమే ఇచ్చట సంక్షిప్తంగా ప్రస్తావించాం. హింసా సంఘటనలలో, హింసకు లోనైన వారి సంఖ్యా పరిమాణంలో హెచ్చు తగ్గు లుండవచ్చు; కాని హింసా రూపాలు - దాదాపు ఇలాగే ఉన్నాయి.

పైన ఉదహరించిన సర్వే ఫలితాలను బట్టి స్త్రీ అనుభవిస్తున్న హింసలో అత్యధిక భాగం వారి భర్తల వల్లనో లేక ప్రియుల వల్లనో సంభవిస్తున్నట్లు స్పష్టమవుతున్నది. ఇంటి వెలుపలి కన్న, ఇంట్లోనే ఆవిడ అధిక హింసకు గురవుతున్నది. తనవారని తాను భావించిన వారే, ఆవిడను అధికంగా హింసిస్తున్నారు. బాధితులలో అధిక భాగం మానసిక వ్యథకు గురవుతూండడం కనుపిస్తున్నది. ఈ సర్వేలన్నీ అర్థ సత్యాలనే వెల్లడిస్తున్నాయన్న అంశాన్ని మరువకూడదు. భర్త తనను దండించటం అతని హక్కుగా భావించే పతివ్రతలున్నారు. సర్వేయర్లు వేసే ప్రశ్నల ప్రకారం భర్త చేసిన ఏ పని హింస కిందకు వస్తుందో తెలియని అమాయకులు కూడా ఉన్నారు. ఇలాంటి వారు సక్రమమైన సమాధానాలు ఇవ్వలేరు పరువు పోతుందనో, బయటి వారికి విషయం తెలిస్తే భర్త, తనను ఇంకా హింసిస్తాడన్న భయం వల్లనో కొందరు మహిళలు యదార్థాన్ని చెప్పరు. కనుక సర్వేలలో కనుపిస్తున్నది పాక్షిక సత్యం మాత్రమేనని భావించవచ్చు.

పోలీసుల రికార్డుల కెక్కుతున్న సెక్సు హింసా నేరాలు కూడా వాస్తవాన్ని ప్రతిబింబించటం లేదు. ఇటీవలె జరిగిన ఒక సర్వే ప్రకారం కుటుంబ సభ్యులే తమ పిల్లల మీద చేసిన సెక్సు హింసా సంఘటనలలో రెండు శాతము, కుటుంబీకులే తమ స్త్రీల మీద చేసిన సెక్సు హింసా కేసులలో ఆరు శాతము, వయస్సు వచ్చిన స్త్రీలపై జరిగిన అత్యాచారాలలో 5 నుండి 8 శాతం మేరకే రికార్డయినట్లు తేలింది. ఇదేకాలంలో 61.5 శాతం దోపిడీలు, 82.5 శాతం దొంగతనాలు రికార్డయినాయి! పారిశ్రామికంగా అభివృద్ధయిన దేశాలలో మహిళలు ఇపుడు తెగించి సెక్సు హింసా కేసుల రికార్డింగుకు ముందుకు వస్తున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ స్థితి ఇంకా ప్రాథమిక స్థాయిలోనే ఉంది.

## మానభంగాలు

ప్రపంచంలో మహిళలు అనుభవిస్తున్న హింసలో అత్యధిక భాగం సెక్సుపరమయినదే. ఇటీవలి కాలంలో, శాస్త్రీయంగా జరిగిన సర్వేలుగా వర్ణించబడిన ఆరు సర్వేల ఫలితాలు వెలువడ్డాయి. అమెరికా మహిళలలో ప్రతి ఐదుగురిలో ఒకరి నుండి ఏడుగురిలో ఒకరు వరకూ, తమ జీవిత కాలంలో మాన భంగానికి గురవుతారని ఈ సర్వేలు సూచించాయి (1993). ఇంతటి పరిమాణంలో మానభంగ నేరాలు జరుగుతున్నట్లు కాలేజీ కెళ్ళే వయస్సున్న స్త్రీలపై ఇతర దేశాలలో జరిగిన సర్వేలు నిరూపించాయి. కెనడా, న్యూజీలాండ్, యునైటెడ్ కింగ్డం, అమెరికాలలో జరిగిన సర్వేల ఫలితాలు దాదాపు పైన పేర్కొన్న వాటివలె ఉన్నాయి. దక్షిణ కొరియాలోని సోల్ నగరంలో కాలేజీకి వెళ్ళే వయస్సున్న

యువతుల మీద సర్వే జరిగింది జరిగిన మానభంగాల పరిమాణం పైన పేర్కొన్నంత అధికంగా లేదుగాని, మానభంగ ప్రయత్నాలు మాత్రం పైన పేర్కొన్న రేటుననే ఉన్నాయి

కెనడాలో 1993 వ సంవత్సరంలో కాలేజీ విద్యార్థినుల మీద సర్వే జరిగింది 1,835 మంది విద్యార్థినులు సాక్ష్యమిచ్చారు. తమ డేటింగ్ ప్రియులే తమను మానభంగం చేశారని 81 శాతం మంది చెప్పారు జరిగిన అత్యాచారపు కేసులలో 23.3 శాతం వరకూ మానభంగ ప్రయత్నమో, మానభంగం చేయటమో జరిగింది 1991వ సంవత్సరంలో న్యూజిలెండ్‌లో ఒక సర్వే జరిగింది. 387 మంది సైకాలజీ విద్యార్థినులు సాక్ష్యమిచ్చారు. వారిలో 14.1 శాతం మంది మానభంగానికి గురయినట్లు తేలింది మొత్తం అత్యాచారపు కేసులలో 25.3 శాతంలో మానభంగమో, మానభంగ ప్రయత్నమో జరిగాయి. 1992 వ సంవత్సరంలో యునైటెడ్ కింగ్డంలో ఇంకొక సర్వే జరిగింది. ఇందులో 22 యూనివర్శిటీలకు చెందిన 1,476 మంది విద్యార్థినులు పాల్గొన్నారు వారిలో 17.1 శాతం మంది తాము మానభంగానికి గురయినట్లు చెప్పారు. మొత్తం అత్యాచార ప్రయత్నాలలో 19.4 శాతం వరకూ మానభంగ ప్రయత్నమో, మానభంగమో జరిగిన సందర్భాలున్నాయి. అమెరికాలో 1987లో జరిగిన సర్వేలో 32 కాలేజీలకు చెందిన 3,187 మంది విద్యార్థినులు పాల్గొన్నారు. తమ పధ్నాలుగవ యేట నుండి మానభంగాలకు గురవుతున్నట్లు 15.4 శాతంమంది చెప్పారు. మానభంగమో, మానభంగ ప్రయత్నమో జరిగిన కేసులు, మొత్తం అత్యాచార ప్రయత్నాలలో 27.5 శాతం వరకూ ఉన్నట్లు తేలింది. 1992లో జరిగిన మరొక సర్వేలో దేశం అంతటినుండి 18-22 సంవత్సరాల వయస్సుగల యువతులను సాక్ష్యమివ్వటానికి ఎన్ను కొన్నారు. తమకు 21 సంవత్సరాల వయస్సు నిండక పూర్వమే మానభంగానికి గురయినట్లు, తెల్లజాతి యువతులలో 12.7 శాతం మంది, నల్లజాతి వారిలో 8శాతం మంది చెప్పారు. దక్షిణ కొరియాలోని సోల్ నగరంలోని మహిళల మీద జరిగిన సర్వేలో 2,270 మంది పాల్గొన్నారు. వారిలో 7.7 శాతం మంది తాము మానభంగానికి గురయినట్లు చెప్పారు. మొత్తం జరిగిన అత్యాచార నేరాలలో మానభంగమో, లేక మానభంగ ప్రయత్నమో జరిగినవి 21.8 శాతం వరకూ ఉన్నట్లు తేలింది. తేడాలేవయినా ఉంటే ఆయా దేశాల చట్టాలు ఇస్తున్న మానభంగ నిర్వచనం వల్ల ఉండవచ్చు. కాని యువతులు పాశ్చాత్య దేశాలవారు గనుక విషయాన్ని దాచకుండానే చెప్పారని విశ్వసించవచ్చు

యుద్ధకాలంలో సైనికులు పశుప్రవృత్తితో మానభంగాలకు దిగటం చరిత్ర అంతటా కనుపిస్తుంది ఇటీవలి కాలంలో బోస్నియా, కంబోడియా, లైబీరియా, పెరూ, సోమాలియా, ఉగాండా, రువాండా, జయర్ దేశాలలో మానభంగాలు మూక ఉమ్మడిగా జరగటాన్ని మనం చూస్తున్నాం. 1992వ సంవత్సరం జనవరి మధ్యకాలంలో దాదాపు ఇరవై వేలమంది బోస్నియన్ మహిళలు సెర్బియన్ల చేతిలో మానభంగానికి గురయినట్లు బోస్టన్ నగరం నుండి వెలువడుతున్న బోస్టన్ గ్లోబ్ దిన పత్రిక 13-2-1996 సంచికలో రిపోర్టు చేసింది. ముస్లిం మహిళలను రేప్ కాంపులలో బంధించి సెర్బియన్ సైనికులు పలుమార్లు వారిపై అత్యాచారం జరిపారు సెర్బియన్ బిడ్డలను ముస్లిం మహిళలు కనాలని వారి అభిలాషట! ఆ అంశాన్ని న్యూస్ వీక్ పత్రిక జనవరి4, 1993 సంచికలో ప్రచురించింది. శత్రు సంతానాన్ని కనటం ఎంత కష్టమో మనసున్న వారందరకూ తెలుస్తుంది. యుద్ధకాలంలో మానభంగాలు, సెక్సు పరమైన పలురకాల అత్యాచారాలు జరగటం వింతైన విషయం కాదు. యుద్ధాలు కొన్నేండ్ల విరామం తర్వాత జరుగుతాయి గనుక ఆ రకమైన అత్యాచారాలు కూడా కొంత కాలం పాటయినా జరగవు. ఇటీవలి కాలంలో అంతర్యుద్ధాలు, సాయుధ పోరాటాలు పెరిగిపోతున్నాయి. ఇందువల్ల ఇదివరకు కొన్నేండ్ల వ్యవధి తర్వాత స్త్రీలపై జరిగే మూక ఉమ్మడి అత్యాచారాలు ఇపుడు నిత్యకృత్యమైనాయి.

ఇక ముక్కు పచ్చలారని బాలికలపై, యువతులపై జరిగే అత్యాచారాల విషయాన్ని చూద్దాం. ఈ అంశం మీద లభిస్తున్న పరిశోధనా సమాచారం తక్కువగా ఉన్నది. లభిస్తున్న సమాచారాన్ని బట్టి ఈ వర్గాల మీద జరుగుతున్న అత్యాచార పరిమాణం అధికంగానే ఉన్నట్లు కనుపిస్తున్నది. అమెరికాలో జరిగిన పరిశీలనల ప్రకారం, స్త్రీలలో 27 నుండి 62 శాతం మంది వరకూ పద్దెనిమిది సంవత్సరాలవయస్సు నిండక పూర్వమే సెక్సు పరమైన అత్యాచారాలకు లోనయినట్లు తెలుస్తున్నది. స్త్రీలలో ముగ్గురకొక్కరు, పురుషులలో ఇద్దరిలో

## పురిటిలో స్త్రీ శిశు హత్యల పెరుగుదల

పురుటిలోనే స్త్రీ శిశు హత్యల సంఖ్య పెరుగుతూ ఉండటం యెడల, జాతీయ మానవ హక్కుల కమిషన్, తన ఆందోళనను ప్రకటించింది. బీహారుకు చెందిన సంఘ సేవా సంస్థ "అదితి", ఈ రాష్ట్రంలో స్త్రీ శిశు హత్యలు అధికంగా జరుగుతున్నట్లు రిపోర్టు చేసింది. కతిహార్ నగరంలోనూ, బ్లాకులోనూ, కాన్పులు చేయిస్తున్న దాయీలు, 38 మంది ఒక్కొక్కరూ మాసానికి మూడు నుండి నాలుగు వరకూ స్త్రీ శిశువులను చంపుతున్నట్లు అంగీకరించారు. పూర్ణియా నగరంలోనూ, భవానీపూర్ బ్లాకులోనూ కాన్పులు చేయిస్తున్న దాయీలు - నలభై మంది తాము నెలకు ఇద్దరు - ముగ్గురు స్త్రీ శిశువులను చంపినట్లు ఈ సంస్థ ప్రతినిధులకు తెలియజేశారు. సీతామరికి చెందిన ధన్‌బాద్ బ్లాకులోని పదిమంది దాయీలు మాసానికి ఒకటి లేక రెండు స్త్రీ శిశుహత్యలను నిర్వహించినట్లు వెల్లడించారు. "అదితి" అంచనాల ప్రకారం బీహారు రాష్ట్రంలో కాన్పులు చేయించే దాయీలు 5,30,000 మంది వరకూ ఉన్నారు. దాయీల సంఖ్యనుబట్టి, వారు చేస్తున్న స్త్రీశిశుహత్య ఎంత పరిమాణంలో జరుగుతుండవచ్చో ఊహించవచ్చు.

స్త్రీ పురుష జనాభా పరిమాణాలు ఈప్రాంతలో స్త్రీ శిశుహత్యా పరిమాణాలకు ప్రతిబింబాల వలె కనుపిస్తున్నాయి. జనాభాలోని ప్రతి వెయ్యిమంది పురుషులకు సీతామరిలో 819 మంది, భగల్‌పూర్‌లో 739 మంది, పూర్ణియాలో 757 మంది, గుమ్లా జిల్లాలో 781 మంది మాత్రమే స్త్రీలున్నారు!

తమిళనాడు లోని మదురై, సేలం, ధర్మపురి జిల్లాలలోను, అన్నా,పెరియార్, నార్త్ ఆర్కాట్, అంబేద్కర్ జిల్లాలోని కొన్ని ప్రాంతాలలోనూ స్త్రీ శిశుహత్యలు అధికంగా జరుగుతున్నట్లు శ్రీ వి.బి ఆత్రేయ , షీలా రాణీలు, హిందూ దిన పత్రికలో (మార్చి 17, 1996) ప్రచురితమైన వారివ్యాసంలో వివరించారు.

తమిళనాడులోని మదురై జిల్లాకు చెందిన ఉస్లింపత్తి తాలూకాలోనూ, దాని పరిసర ప్రాంతాలలోనూ, విచక్షణా రహితంగా స్కానింగ్ యూనిట్లను వాడుతూ, గర్భస్థ శిశులింగ నిర్ణయాన్ని తెలుసుకొని, పుట్టబోయేది ఆడపిల్ల అని తెలిస్తే పెద్ద యెత్తున గర్భస్రావాలకు వ్యక్తులు తలపడుతున్న వైనాన్ని కుమారి ఆషా కృష్ణకుమార్ అనే సంఘ సేవిక వెల్లడించారు. వీరి రిపోర్టును ఫ్రంట్ లైన్ పక్షపత్రిక (డిశంబరు 18, 1998) ప్రచురించింది.

ఉస్లింపత్తి తాలూకా లోనూ, దాని పరిసర గ్రామాలలోనూ, ప్రాథమిక వైద్య సదుపాయాలు కూడా లేని గ్రామాలలోనూ, స్కానింగ్ యూనిట్లు ఉన్నట్లు ఇవి లాభదాయకంగా వ్యాపారం కొనసాగిస్తున్నట్లు ఆ సంఘసేవిక వివరించారు. ఈ ప్రాంతంలో పదమూడు వరకూ ఆ యూనిట్లున్నట్లు, దానికి 40 కిలోమీటర్ల దూరంలో ఉన్న మదురైనగరంలో ఇవి వందకు మించి ఉన్నట్లు ఆవిడ వెల్లడించారు. ఇవన్నీ చట్టాన్ని ధిక్కరించి వ్యాపారం చేస్తున్నట్లుకూడా కుమారి ఆషా రిపోర్టు చేశారు.

తాము చూసిన ఇద్దరు లేడీ డాక్టర్లు, రోజుకు నాలుగైదు గర్భస్రావాలను చేస్తున్నట్లు - తమకు చెప్పినట్లు కూడా ఈవిడ రిపోర్టు చేసింది. ఇవిగాక, వీరికంటే కొంచెం తక్కువ డబ్బు తీసికొని నర్సు వృత్తిలో నున్న స్త్రీలు, రిటైరయిన నర్సులు కూడా గర్భస్రావాలను చేయిస్తున్నట్లు కూడా కుమారి ఆషా వివరించారు.

బాహాటంగా, విచ్చల విడిగా స్త్రీ శిశుహత్యలు జరుగుతున్నా, 1994 లో అమలులోనికి వచ్చిన ప్రీ నేటల్ డయాగ్నొస్టిక్స్ (రెగ్యులేషన్ అండ్ ప్రివెన్షన్) ఆక్టు, కుంభకర్ణ నిద్రలో ఉండి తన్మయత్వాన్ని అనుభవిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా జిల్లాలకు చెందిన కొన్ని సంపన్న ప్రాంతాలలో కూడా అల్ట్రాసౌండ్ స్కానింగ్ యూనిట్ల వాడకం పెద్ద యెత్తుననే జరుగుతున్నట్లు వినవస్తున్నది. ఆ వివరాలను తెలిపే రిపోర్టు ఏది లభించలేదు. మహిళా సంఘ కార్యకర్తలు అలోచించదగిన విషయమిది.

ఒక్కరు, శైశవ దశలో గాని యవ్వన దశలో గాని సెక్సు పరమైన అత్యాచారానికి గురయినట్లు బార్బొడోస్ లో జరిగిన సర్వే ఫలితాలు వెల్లడిస్తున్నాయి కెనడా ప్రభుత్వం నియమించిన కమిషన్, ఆదేశంలో జరిగిన అత్యాచారాలను అంచనావేసింది. ఆ అంచనాల ప్రకారం ఆడపిల్లలలో నలుగురకు ఒక్కరు చొప్పునా, మగపిల్లలలో పదుగురకు ఒక్కరు చొప్పునా పదిహేడేండ్లు నిండకముందే సెక్సు పరమైన అత్యాచారానికి గురయినారు.

ఈ వయస్సు పిల్లలలో కనుపిస్తున్న సుఖరోగాలను బట్టి (లైంగిక సంబంధం వల్ల వచ్చే రోగాలు) కూడా, వీరి మీద జరుగుతున్న అత్యాచార పరిమాణాన్ని ఊహించవచ్చు. చిన్న పిల్లలలో కనుపిస్తున్న సుఖ వ్యాధుల మీద నైజీరియాలో రెండు సర్వేలు జరిగాయి. 1988 వ సంవత్సరంలో జరియాలో ఒక సర్వే జరిగింది సుఖ రోగ చికిత్సకు వెళుతున్న స్త్రీలలో ఐదు సంవత్సరాలకన్న తక్కువ వయస్సున్న పిల్లలు పదహారు శాతం వరకూ ఉన్నారు; ఆరు నుండి పదిహేను సంవత్సరాల వయస్సున్నవారు ఆరు శాతం మేర కున్నారు.! ఇబాదాన్ నగరంలో జరిగిన సర్వేకూడా ఇలాంటి బాధాకరమైన అంశాలనే వెల్లడించింది. ఆ నగరంలో సుఖరోగాలకు చికిత్స పొందుతున్న స్త్రీ రోగులలో 22 శాతం మంది వరకూ పది సంవత్సరాలలోపు వయస్సు వారున్నారు. పెరూలోని లిమా నగరంలోని మెటర్నిటీ హాస్పిటల్ వారొక సర్వేను నిర్వహించారు. పిల్లలను కన్న 12 నుండి 16 సంవత్సరాల మధ్యవయస్కులలో నూరింట 90 మంది మానభంగానికి గురయినట్లు సర్వేలో తేలింది చెరచిన పురుషులు వారి తండ్రో, మారు తండ్రో, లేక అతి సన్నిహిత బంధువోనట! కోస్టారికాలో జరిగిన సర్వే ఫలితాలు కూడా ఇలాగే ఉన్నాయి. గర్భవతులయిన పదిహేను సంవత్సరాలు - అంతకు తక్కువ వయస్సున్న పిల్లలలో నూరింట తొంభై మందిని వారి అత్యంత సమీప బంధువులే చెరిచారు.

భిన్న సంస్కృతులకు చెందిన పలు ప్రాంతాల నుండి లభిస్తున సమాచారం ప్రకారం, మానభంగాలకు గురవతున్న వారిలో నూరింట 40 నుండి 58 మంది వరకూ పదిహేను సంవత్సరాలలోపు వయస్సు వారే ఉన్నారు. పది - పదకొండు సంవత్సరాల వారు కూడా వీరిలో ఉన్నారు. వీరిలో అత్యధిక సంఖ్యాకులను వారి కుటుంబ సభ్యులో లేదా వీరికి బాగా తెలిసిన వారో మానభంగం చేశారు. కోర్టుల నుండీ, స్త్రీ సంక్షేమ సంస్థల నుండీ వెలువడుతున్న సమాచారం ప్రకారం, అత్యాచారానికి గురయిన వారిలో నూరింట అరవై మంది మీద అత్యాచారం జరిపిన వ్యక్తులు బాధితులకు చిరపరిచితులే. మానభంగం జరిగినట్లు తెలియగానే, ఎవరో బయటివారు చేసి ఉంటారని అనుకొంటాం కాని ఇది పొరపాటని ఈ సంఖ్యా వివరాలు తెలియజేస్తున్నాయి.

### కొన్ని దుష్ట సంప్రదాయాలు

ఆడపిల్లలను వేధిస్తున్న మరో సమస్య లింగ వివక్ష. పలు సంస్కృతులలోనూ, పలు సమాజాల లోనూ పురుషునికి ప్రాధాన్యత లభిస్తున్నది: స్త్రీకి లభిస్తున్నది దిగువ స్థానమే. కుటుంబ ఆర్థిక పరిస్థితులు అనుకూలంగా లేని పరిస్థితులలో, పోషణ, ఆరోగ్య రక్షణ వంటి వాటిలో మగ పిల్లలకు దక్కుతున్నంత ప్రాధాన్యత ఆడపిల్లలకు లభించదు.

కొన్ని దేశాలలో మగబిడ్డలే కావాలన్న బలమైన కోరిక వల్ల, ఆడపిల్లల యెడల విముఖతను పెంచుకొంటున్నారు

ఇలాంటి సందర్భాలలో పుట్టిన ఆడపిల్లను పురుటిలోనే చంపటం లేదా పుట్టబోయేది ఆడపిల్ల అని పరీక్షలో నిరూపిత మయితే గర్భస్రావానికి పాల్పడటం జరుగుతున్నది. ఇది సాధ్యం గానప్పుడు, పుట్టిన బిడ్డను పురిటిలోనే చంపుతున్నారు. లింగ వివక్షా ప్రదర్శన వల్ల క్రమంగా పురుష జనాభా కంటే స్త్రీ జనాభా తగ్గుతూ ఉండటాన్ని, దీని ఇతర దుష్ఫలితాలను ఇంతకు పూర్వమే చూచాం.

కొన్ని సంప్రదాయాలు కూడా మహిళల ప్రాణాలను తోడేస్తున్నాయి. సంప్రదాయంతో పాటు వీటి మీద పురుషాధిక్యతా ప్రభావం కూడా ఉన్నది. వీటిలో ప్రధానంగా వివరించవలసినవి

1. "జెనిటల్ మ్యూటిలేషన్"

2. యుక్త వయస్సు రాకుండానే ఆడపిల్లకు పెండ్లి చేయటం (బాల్యవివాహం)

3. పురుషులకు ఆకర్షణీయంగా, ఆమోదయోగ్యంగా కనుపించటం కోసం లావు తగ్గాలని ప్రయత్నించటం; అతి ప్రమాదకరమైన కాస్మెటిక్ సర్జరీకి వెళ్ళటం

4. డయటింగ్ చేయటం. (ఇది అభివృద్ధి చెందిన

దేశాలలో అధికంగా ఆచరణలో ఉన్నది)

జెనిటల్ మ్యూటిలేషన్‌ను ముస్లిం మతాచారంగా ఆఫ్రికన్ ముస్లింలు చెబుతుంటారు. పాశ్చాత్యులు కూడా ఇలాగే చెబుతున్నారు. ఖురాన్‌లోగాని, మహమ్మద్ ప్రవక్త ప్రవచనాలలోగాని, దీన్ని గురించి స్పష్టంగా చెప్పిన సందర్భం లేదని ఈ సాహిత్యాన్ని చదివిన పండితులు తేల్చారు. అలాంటి సూచన ఉండి ఉంటే, పాకిస్తాన్, అల్జీరియా, కువైట్, ఇరాక్, సౌదీ అరేబియా, ఇతర గల్ఫ్ దేశాలలో ఈ ఆచారాన్ని ఎందుకు పాటించటం లేదు అని వీరు ప్రశ్నిస్తున్నారు. జెనిటల్ మ్యూటిలేషన్‌ను ఏ మతమూ ప్రబోధించటం లేదు.

కొన్ని కెల్టిక్ తెగలలోనూ, కాప్టిక్ క్రిస్టియన్లలోనూ, ఇపుడు ఇజ్రాయెల్ లో ఉంటున్న ఇథియోపియన్ ఫలాషా జ్యూస్ లోనూ ఈ సంప్రదాయం ఉంది. కెల్టు జాతి వారు క్రిస్టియన్ మతం పుచ్చుకొన్న తర్వాత కూడా ఆ సంప్రదాయపు పాటింపును బలపరిచారు. పురుష సంపర్కానికి స్త్రీ తాపత్రయ పడకుండా చేయటానికి "స్వచ్ఛత" పేరిట క్రైస్తవ మత గురువులు దీనిని అనుమతించ సాగారు. స్త్రీని బందీగా ఉంచుకోవటానికి పురుషాహంకారం పన్నిన పన్నాగ రూపమే ఆ పశుప్రక్రియ. దీనిని సమర్థించటానికి ఇంతకు మించిన ఆధారాలేవీ లభించటం లేదు. సుడాన్ సర్జన్ డాక్టర్ నహీద్ తౌబియా గత పాతికేండ్లగా ఆదేశంలో మహిళా హక్కుల సాధనకు పనిచేస్తున్నారు. జెనిటల్ మ్యూటిలేషన్‌ను వారిలా వర్ణించారు: "ఆపరేషన్లో ప్రధానంగా అధిక స్పర్శశక్తిని గలిగిన భాగాలను కత్తితో గీకుతారు. యోని ద్వారాన్ని చిన్నదిగా చేయటానికి చర్మాన్ని మడిచికుట్లు వేస్తారు. ఇది స్త్రీకి సెక్సు సుఖాన్ని నిరాకరించటమే అవుతుంది; ఆవిడ చర్మంతోనే ఆవిడకు "పాతివ్రత్యపు బెల్టును" రూపొందించి, దానితో ఆవిడ పునరుత్పత్తి శక్తికి తాళం వేస్తున్నారు."

ఈ ఆచారం అమలులో ఉన్నచోట్ల, ఈ ఆపరేషన్ చేయించుకోని వారిని కన్యాత్వం కోల్పోయిన వారిగా పరిగణిస్తున్నారు; ఇలాంటి వారిని ఎవరూ పెండ్లి చేసికోరు. వీరి కన్యాత్వాన్ని శంకిస్తారు. ఇటీవలి కాలంలో కొన్ని దేశాలలోనే కాకుండా, అంతర్జాతీయంగా కూడా దీని యెడల విముఖత ప్రబలు తున్నది. కొన్ని దేశాలు దీనిమీద నిషేధాన్ని కూడా విధించాయి.

స్త్రీ "కన్యాత్వ రక్షణకు" ఆచరణలో నున్న మరొక మార్గం బాల్యవివాహం; మగవారి వయస్సు అధికంగా ఉన్నా; ముక్కుపచ్చలారని పిల్లలను వారికి కట్టి వేయటానికి వెనుకాడటం లేదు. బాల్య వివాహాలు క్రమంగా తగ్గుతున్నాయి. కాని పదిహేను సంవత్సరాల వయస్సు నిండకుండానే జరిగే పెండ్లిండ్లు ఇంకా అధికంగానే ఉన్నాయి.

లేత వయస్సులోనే పెండ్లయిన యువతులు, శరీరం చూలుకు తగినట్లు యెదగ కుండానే గర్భవతులై పిల్లలను కనవలసి వస్తున్నది. ఇందువల్ల వారికి అబ్‌స్టేరిక్ ఫిశ్చులా వచ్చే ప్రమాదం అధికంగా ఉంటుంది.

## కొన్ని స్వయం హింసారూపాలు

ఇక మహిళలు తాము కొని తెచ్చుకొంటున్న కొన్ని ప్రమాదాలను చూద్దాం. ఇందులో ఒకటి బరువు(లావు) తగ్గాలన్న తాపత్రయంతో, ఆరోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టకుండా ఆహార నియమాలను పాటించటం. అమెరికాలోనూ, యూరోపియన్ దేశాలలోనూ జరిగిన సర్వేల ప్రకారం, ఆ ప్రాంత యువతులలో ప్రతి వంద - లేక రెండువందల మందిలో ఒక్కరి చొప్పున "ఎనోరెక్జియా"తో బాధపడుతున్నారు. (ఎనోరెక్జియా అంటే ఆకలి తగ్గి పోవటం లేదా ఆకలి కాకపోవటం) ఇది ఒక రకమైన రోగమని వైద్యులు చెబుతున్నారు. ఈ రోగం ప్రధానంగా అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాలకూ, జపాన్‌కు మాత్రమే పరిమితమైంది. తిండి తగ్గిస్తూ వీలయినంత త్వరగా బరువు తగ్గటానికి యువతులూ, స్త్రీలు ప్రయత్నిస్తుంటారు. ఆహార నియమం, క్రమంగా ఉపవాసంగా మారి, మనిషి చిక్కి శల్యమయిపోతుంది. జీవిత కార్యకలాపాలకు దూరమవుతారు కాలరీల కొలమానంతో ఆహార పదార్థాలను కొలిచి తినటం, అధికంగా వ్యాయామం చేస్తూండటం, అద్దంలో తనరూపాన్ని ( లావు ఎంత తగ్గాను అని తెలుసుకోవటానికి) చూచుకోవటం అనేది వారికి నిత్యకృత్యమవుతుంది. మానసికంగా ఆ పరిధికి వారు బందీలయి పోతారు.

రెండవది బులీమియా. వీరికి అనుక్షణం నోరాడుతూ ఉండవలసిందే. తినకుండా ఉండలేరు. వీరికి జిహ్వా చాపల్యం అధికం. తిన్నది అరగదని తెలుసు గనుక విరేచనానికి మందులు వాడతారు. లేదా వాంతి చేసుకుంటూ ఉంటారు.

వీరిలా చేస్తూ తాను ఎంతలావు, బరువు తగ్గిందీ చూసుకొంటూ ఉంటారు. వీరికి లావు, బరువు తగ్గాలని ఉంటుంది కాని వారు తినకుండా ఉండలేరు. ఇదీ వీరి సమస్య. అమెరికాలో జరిగిన సర్వేల ప్రకారం ఆదేశంలో హైస్కూలుకు, కాలేజీలకు వెళుతున్న యువతులలో నూరింట ముగ్గురు నుండి ఐదుగురి వరకూ బులీమియాతో బాధపడుతున్నారు. ఈ అంచనా ప్రకారం అమెరికాలో కొన్ని లక్షలమంది యువతులు, మహిళలు బులీమియాతో బాధపడుతున్నట్లు స్పష్టమవుతున్నది. బులీమియా, ఎనొరెక్షియా నెర్వొజాకు గురవుతున్న వారి సంఖ్య పాశ్చాత్య దేశాలన్నిటిలోనూ పెరుగుతున్నది. సెక్సు దృష్ట్యా, కల్చరల్ ధోరణుల దృష్ట్యా అందంగా కనుపించటానికి సన్నబడాలి అన్న తాపత్రయపు పెరుగుదలకు సమానంగా, పైన పేర్కొన్న రోగ పీడితుల సంఖ్య కూడా పెరుగుతున్నది.

అంద చందాల తాపత్రయంలో పడిన యువతులనూ, స్త్రీలను ప్రమాదాలకు గురి చేస్తున్న మరొక అనుబంధాంశం కాస్మెటిక్ సర్జరీ. ఈ ధోరణి కూడా పాశ్చాత్యదేశాలలోనే అధికంగా ఉన్నది. ఈ రకపు సర్జరీ వల్ల తరచూ ప్రమాదాలు కూడా సంభవిస్తున్నాయి. తమ చనుకట్టు ఆకర్షణీయంగా కనుపించేటంత పెద్దదిగా లేదని కొందరు స్త్రీలు ఆపరేషన్లు చేయించుకొంటున్నారు. అమెరికాలో ఇలాంటి ఆపరేషన్లు చేయించు కొన్నవారు ఇరవై లక్షల మంది ఉన్నట్లు అంచనా. ఒక్కొక్క ఆపరేషను ఫీజు నాలుగువేల డాలర్లు! చిన్నదిగా ఉన్న చనులను పెద్దవిగా చేయటానికి, వాటి లోపల "సిలికాన్" సంచిని పెట్టికుట్టి వేస్తారు. ఈ సిలికాన్ క్రమంగా క్షీణించి, చనుకట్టు కాన్సరును కలుగ జేస్తున్నట్లు వైద్యపరీక్షలు నిర్ధారణ చేశాయి. కాస్మెటిక్ సర్జరీలో దీని వాడకం మీద విపరీతమైన వివాదం చెలరేగింది. ఇందువల్ల అమెరికా ప్రభుత్వం కాస్మెటిక్ సర్జరీలో సిలికాన్ వాడుకను నిషేధించింది. కాన్సరు వల్ల చనులను తొలగించ వలసివచ్చిన సందర్భాలలో వాటి పునర్నిర్మాణంలో మాత్రం సిలికాన్ వాడకాన్ని అనుమతించారు. సిలికాన్ వాడకంతో చనుకట్టును పెద్దదిగా చేయించుకొన్న వారికి, చనుకట్టుకు వచ్చే కాన్సరును పసి గట్టటానికి పరీక్షలు చేయటంలో ఇబ్బందులు ఎదురవుతున్నాయి. సిలికాన్ వాడకం వల్ల శరీరం యొక్క రోగ నిగ్రహశక్తి తగ్గి, కొన్ని రకాల రోగాలు వచ్చే అవకాశాలున్నట్లు కూడా పరిశోధనలు రుజువు చేశాయి.

## కుటుంబంలో స్త్రీ హింస

స్త్రీ అనుభవించవలసి వస్తున్న హింసా రూపాలను, వాటి పరిమాణాన్ని గురించి ఇంతవరకూ చూశాం. స్థూలంగా చెప్పుకొంటే తాను ప్రవేశించిన ఇంట్లోనే తన వారి చేతిలోనే ఆమె ఎలాంటి హింసను అనుభవిస్తున్నదో చూద్దాం.

కుటుంబంలోని మహిళ - ఆమె భార్య, తల్లి, చెల్లెలు, వదిన, కోడలు-ఇలా ఏ పాత్రనయినా నిర్వహిస్తూ ఉండవచ్చు. పురుషుని వలె ఆమె సమాజంలో నివసిస్తున్న ప్రేయసి, లేక మాజీ ప్రేయసి లేక విడాకులు తీసుకొన్న మాజీ భార్యకూడా అయి ఉండవచ్చు. స్త్రీ, తాను నిర్వహిస్తున్న పాత్ర యేదైనా, హింసకు గురి కావలసిందే. ఇదొక సామాజిక సూత్రంగా రూపొందింది. కుటుంబ పరిధిని దాటి మరి కొంచెం దూరం చూస్తే, వారి సమీప బంధువులు, ఇంట్లో వేతనానికి పనిచేసే మహిళలు కనుపిస్తారు. ఈ తరగతి మహిళలు కూడా హింసకు గురి కావలసిందే. కుటుంబంలోని పురుషులు - తండ్రి, భర్త, మామ, పిన తండ్రి, మేనమామ, సోదరుడు, మారు తల్లి కొడుకు, ప్రేమికుడు, మాజీ ప్రేమికుడు, ఇలాంటి పాత్రలలో దేనినయినా వారు నిర్వహిస్తూ ఉండవచ్చు - వీరంతా స్త్రీ హింసకు పాల్పడేవారే. వీరు స్త్రీని బాధించటానికి భిన్న పద్ధతులను అవలంబిస్తూంటారు. ఆ హింసా రూపాలను స్త్రీ అనుభవించవలసి ఉంటుంది.

స్వగృహంలోనే స్త్రీ అనుభవిస్తూండే హింసా కాండ మీద పలువురు సర్వేలను నిర్వహించారు. ఆవిడను శారీరకంగా హింసించటం అనేది సర్వత్రా కనుపిస్తున్నట్లు సర్వేయర్లు వెల్లడించారు. శక్తినంతా ఉపయోగించి అకస్మాత్తుగా నెట్టటం., పిడికిలి బిగించి పొడవటం, ఉమ్మి వేయటం, తన్నటం, వెంట్రుకలు పట్టుకొని ఈడ్వటం, దొరికిన సాధనంతో కొట్టటం, లేక పొడవటం, గొంతు నులమటం, కాల్చటం, లాఠీతో కొట్టటం, కత్తితో పొడవటం, ఏసిడ్ పోయటం, లేకపోతే మరిగే నీటిని మీద కుమ్మరించటం, తుపాకి దొరికితే కాల్చటం - స్త్రీ అనుభవిస్తున్న హింస యొక్క పలు రూపాలివి. ఈ హింసవల్ల స్త్రీ శరీరం గీరుకుపోవటం దగ్గర నుండి ఆవిడ హత్య వరకూ ఏదయినా సంభవించవచ్చు. తొలుత చిన్న విషయం మీద వివాదం అంకురించి, అది క్రమంగా తీవ్రమై పురుషుడు స్త్రీని చితకబాదేవరకూ వెళ్ళవచ్చు. కొట్టటంతో

సంతృప్తి పడలేక కొందరు పురుషులు ఆవిడమీద సెక్సు పరమైన హింసకు కూడా ఒడిగట్టవచ్చు. ఈ హింస ఎంతటి వెగటును కలిగించే స్థితికైనా వెళ్లవచ్చు. దెబ్బలు తినవలసి వచ్చేది చూలాలయితే, ఆవిడ పొట్టమీద కొట్టటం మగవారికి ఇష్టం. ఇందువల్ల ఆవిడకు గర్భస్రావం జరుగవచ్చు.

ఎముకలు విరగ గొట్టే ప్రక్రియకు పూనుకోక పోయినా, కొందరు మగవారు స్త్రీని మానసికంగా చిత్రవధ చేయగలరు. తిట్టటం, నిందించటం చులకనగా మాట్లాడటం, స్త్రీని వంటరిగా వదలటం, ఆవిడతో మాట్లాడటం మానివేయటం, ఆవిడ అనుభవిస్తున్న శారీరక, ఆర్థిక వసతులను అందకుండా చేయటం, తన మిత్రులతో గాని, బంధువులతోగాని, ఆఖరుకు పుట్టింటి వారితో గాని మాట్లాడే వీలు లేకుండా చేయటం, తన బిడ్డలముందు, కుటుంబీకుల ముందూ, మిత్రుల ముందు ఆవిడను గేలిచేస్తూ మాట్లాడటం, "కొడతాను, తంతాను, చంపేస్తాను" అంటూ, బెదిరిస్తూ ఉండటం, విడాకులిచ్చి, మరోపెండ్లి చేసుకొంటానని ప్రకటిస్తూండటం, కట్టుకొన్నవారు ఏ అమెరికాలోనో నివసిస్తున్న వారయితే "రేపే ఫ్లైట్ ఎక్కిస్తా" నని బెదిరించటం – స్త్రీ అనుభవించవలసి ఉండే మానసిక హింస యొక్క కొన్ని రూపాలివి. కొందరు స్త్రీతో సెక్సు సంపర్కం మానివేసి ఆమెను బాధించే ప్రయత్నం చేస్తారు. మరి కొందరు సెక్సు పరమైన హింసకు కూడా పూనుకోవచ్చు. భార్య రూపవతైతే, ఆవిడను మరెవరో ఎగవేసుకు పోతారన్న భయంతో ఆమెకు రంకు నంటగడుతూ బాధించటం ప్రారంభించేవారూ ఉంటారు.

ఈ హింసాచర్యలను సంక్షిప్తంగా శారీరక హింస, మానసిక హింస, సెక్సు హింస అని మూడు రకాలుగా విభజించవచ్చు, ఎవరి "విధివ్రాలు ప్రకారం" వారికవి సంప్రాప్తిస్తుంటాయి.

స్వగృహాన్ని స్వర్గసీమగా వర్ణిస్తూంటాం. స్వేచ్ఛ, సుఖం ఇచ్చట లభిస్తాయని ప్రతి కుటుంబ సభ్యుడు భావిస్తాడు. ఇంటిలో లేని భద్రత, సుఖం మనకు బయట లభించదు. కుటుంబీకులంతా కలిసికట్టుగా ఉంటే గృహం స్వర్గసీమ వలె ఉంటుంది. సందేహం లేదు. ఆధునిక నాగరికత ఆకాశపు టంచులను అంటుతున్నా, స్వగృహమే స్త్రీకి నరక సీమగా తయారువుతున్నది. ఆవిడ మాన ప్రాణాలకు రక్షణలేని స్థితి ఏర్పడుతున్నది. కుటుంబీకులందరి కంటే భార్య పాత్రధారిణి అత్యధికంగా హింసను అనుభవిస్తున్నది. తన జీవితాన్ని స్వర్గధామం చేయగలరని నమ్మి ఎవరిని పరిణయమాడిందో ఆ పురుషుడే ఆవిడ పాలిట యముడవుతున్నాడు. గుడిసెలలో ఉండే పేదలు, అనాగరికులు, నిరక్షరాస్యులు మాత్రమే ఇలాంటి హింసకు పాల్పడతారని అనుకోవటం పొరపాటు; సంపన్నులు కూడా ఇందుకు అతీతులు కాదు. ఉదాహరణకు సారా పెర్గూసన్ ఉదంతాన్ని చూడవచ్చు. ఈవిడ, బ్రిటిష్ రాజ కుటుంబానికి చెందిన రెండవ ఎలిజబెత్ కుమారుడు ప్రిన్స్ ఏండ్రూను పెండ్లి చేసుకొన్నది. ఇపుడు విడాకులు తీసుకొన్నది. ఆవిడకు మాజీ భర్త ఒకరు ఉన్నారు. ఆ భర్తతో ఆవిడ కాపురం చేస్తున్న రోజులలో తనడైరీని అతడు చూడగోరాడట. అందుకు తాను అంగీకరించనందున చితకబాదాడనీ, అందువల్ల తన దండచేతులు గీరుకు పోయాయని, 1996 వ సంవత్సరం నవంబరు మాసంలో అమెరికాలో ఒక దిన పత్రికా ప్రతినిధికి చెప్పింది. స్త్రీ హింసకు చొరరాని ఇల్లంటూ లేదు! కుటుంబంలోని ఆడపిల్లలు సెక్సు హింసకు గురవుతుంటారు; అలాగే స్త్రీలు కూడా కుటుంబీకుల చేతిలో సెక్సు హింసనో, పీడననో అనుభవించే అవకాశాలున్నాయి. వేతన చెల్లింపు ప్రాతిపదిక మీద ఇంట్లో పనికి వచ్చే స్త్రీలకు కూడా ఇలాంటి ప్రమాదాలుంటాయి. కోడళ్ళ మీద అత్తల వేధింపు, తిట్టటం, కొట్టటం వంటివి జరుగుతూ ఉంటాయి. ఈ వేధింపులోనూ, హింసలోనూ, ఆ అభాగ్యురాలి ఆడబిడ్డలూ, బావమరదులు, అత్తమామలూ భాగస్తులుగా కనుపిస్తూంటారు.

దేశపు సామాజిక, ఆర్థికాభివృద్ధి మీద స్త్రీ హింస అధిక ప్రభావాన్ని చూపుతుంది. ఇప్పటికే ఉన్న అనారోగ్య నివారణ వసతుల మీద ఈ హింస అత్యధిక భారాన్ని వేస్తున్నది. ఈ విషయాన్ని గమనించిన దేశాలు, ఇప్పటికే ఈ హింసా పరిమాణపు తగ్గింపుకు పనిచేస్తున్నాయి. జెనిటల్ మ్యూటిలేషన్‌ను ఆపాలన్న ఆందోళన, క్రమంగా దాని తీవ్రతను తగ్గిస్తున్న సూచనలు కనుపిస్తున్నాయి. భర్త, భార్యమీద అమలు జరుపుతున్న హింసాకాండ, స్త్రీకి సంభవిస్తున్న మానభంగ ప్రమాదాలు, బంధుత్వ రీత్యా వరుసలు కలియనివారు స్త్రీ మీద అత్యాచారాలకు దిగటం వంటివి ఇంకా తీవ్ర సమస్యలుగానే ఉన్నాయి. ఇవి పెరిగే సూచనలే అధికంగా

కనుపిస్తున్నాయి.

ఈ హింసా ప్రభావం దిగువ అంశాల మీద అధికంగా కనుపిస్తున్నది .

1 దేశపు సాంఘిక, ఆర్థికాభివృద్ధి:

2. స్త్రీల చూలు, కాన్పు కాలపు ఆరోగ్యము.

3 కుటుంబ నియంత్రణ,

4. సుఖరోగాలు, ఎయిడ్స్ వ్యాప్తి నిరోధం:

5. పిల్లల సంక్షేమం,

## సామాజిక, ఆర్థికాభివృద్ధి మీద స్త్రీ హింసా ప్రభావం

స్త్రీ హింస ఆవిడ సృజనాత్మక శక్తుల అభివృద్ధిని నిరోధిస్తుంది. ఆర్థికాభివృద్ధి సాధనకు అవరోధాలను కల్పిస్తుంది కుటుంబ నియంత్రణం, క్షీణిసున్న పరియావరణ రక్షణ, దారిద్ర్య భారపు తగ్గింపు, వంటి అభివృద్ధి కార్యక్రమాలు స్త్రీల సహకారం లేకుండా, జయప్రదంగా అమలు జరిగే వీలులేదన్న అంశాన్ని అన్ని సమాజాలు గుర్తిస్తున్నాయి. తన మీద అమలు జరుగుతున్న హింసాకాండకు భయకంపిత అవుతున్న స్త్రీ, ఈ కృషిలో సంపూర్తిగా పాల్గొన లేకపోతున్నది శారీరకంగా, మానసికంగా కృంగిపోతున్నది.

**విద్యార్జనా, వేతనార్జనా శక్తుల తగ్గుదల :** స్త్రీ హింసను అనుభవించవలసి రావటం చేత, స్త్రీ విద్యార్జనా శక్తి తగ్గుతుంది. ఈ విషయాలను ఇటీవల అమెరికాలో జరిగిన పరిశోధనలు రుజువు చేశాయి. హింసకుగురైన స్త్రీల సాలుసరి సంపాదన, దీనికి గురి గాని వారికంటే మూడు నుండి ఇరవైశాతం వరకూ తక్కువగా ఉంటున్నట్లు బెట్యా హైమన్ అనే అమెరికన్ రిశర్చి స్కాలర్ 1993లో నిరూపించారు." ఎకనామిక్ కాన్సిక్వెన్సెస్ ఆఫ్ ఛైల్డ్ సెక్సువల్ ఎబ్యూస్ ఇన్ ఉమెన్" అన్న తన థీసిస్‌లో, స్త్రీ ఆర్జన తగ్గుదల పరిమాణం ఆవిడ అనుభవించిన సెక్సు హింస యొక్క స్వభావాన్ని బట్టి, ఆవిడను బాధించిన వారి సంఖ్యానుబట్టి నిర్ణయమవుతుందని వీరు సూచించారు. తమ సమీపబంధువులే (వరుసకలియని కారణంగా ఆవిడను పరిణయమాడటానికి వీలులేనివారు) అత్యాచారానికి పాల్పడిన సందర్భాలలో బాధితురాలి మీద ఆ దుశ్చర్యప్రభావం పరోక్షంగా కనిపిస్తుంది. విద్యాభ్యాసంలో వెనుకబడటం, శారీరక మానసిక ఆరోగ్యాలు దెబ్బతినటం ఈ దుష్ఫలిత రూపాలుగా హైమన్ వివరించారు. తాము ఇందుకు పూర్వం ఎరుగని వారివల్ల అత్యాచారానికి గురయినపుడు దీని ప్రభావం సంపాదన మీద ప్రత్యక్షంగా కనుపిస్తుందని సూచించారు. "భయంకరమైన ఆ అనుభవం తర్వాత యువతులు బయటి ప్రపంచం అతి ప్రమాదకరమైనదని భావిస్తూ, ఆ ప్రపంచానికి సంబంధించిన కార్యకాలపాల విషయంలో తాము"క్షేమకరము" అని అనుకొన్న పరిధిని దాటిపో సాహసించరు" అని ఈ రిశర్చి స్కాలర్ సూచించారు. ఇలాంటి బాధితుల సృజనాత్మక శక్తులు సమాజాని కుపకరించవు. అందువల్ల సమాజం నష్టపడుతుంది.

**సామాజిక సేవలో స్త్రీ పాత్రానిరోధం :** సమాజ సేవకు నడుము గట్టిన మహిళలను, దాని నుండి విరమింప చేయటానికి ఎంత నీచపు చర్యలకైనా పురుషులు పాల్పడుతున్న సందర్భాలు కూడా ఉన్నాయి. ఐక్యరాజ్యసమితి ప్రేరణతో మెక్సికోలో జరిగిన ఒక సర్వేలో, పురుషులు బెదిరించటం వల్లనే, మహిళలు నిర్వహిస్తున్న ఒక సేవా సంస్థ మూత బడినట్లు వెల్లడైంది. తమ భార్యలు ఇలాంటి కార్యక్రమాలలో పడితే తమ ఆధిక్యత దెబ్బతింటుందని భయపడి, వారు సతులను బాధించ నారంభించారు ; కొట్టారు. తమిళనాడులో 1992 లో జరిగిన ఇటువంటి ఉదంతాన్ని యునైటెడ్ నేషన్స్ ఫండ్ ఫర్ ఉమెన్‌కు చెందిన రొక్సానా కరిల్లో తమ పరిశోధక పత్రంలో వివరించారు. మద్రాసు నగరంలోని కొందరు మహిళలు (వర్కింగ్ ఉమన్స్ ఫోరం) పరస్పర సహాయం కోసం రివాల్వింగ్ లోన్ ఫండ్‌ను ప్రారంభించారు. వీరిని తమ భర్తలు ఇంట్లో వేధించటం ప్రారంభించటం వల్ల ఈ ఫండ్ నిర్వహణ మూతబడింది. పాపు న్యూగినీకి చెందిన లారిఫార్మ్ కమిషన్ ప్రిన్సిపల్ ప్రాజెక్ట్ ఆఫీసర్ డాక్టర్ క్రిస్టీన్ బ్రాడ్లే ఆప్రాంతంలో జరుగుతున్న ఇలాంటి అంశాన్ని తాము వ్రాసిన ఒక పరిశీలనా పత్రంలో ఇలా వర్ణించారు: " భర్తకు ఇష్టం లేని సమావేశాలకు భార్య హాజరు గావటం ప్రమాదకరంగా తయారైంది. పాపు న్యూగినీలో తమ భార్యలు సమావేశాలకు హాజరుగాకుండా, గదిలో వేసి తాళం వేస్తున్నారు. ఈ అవరోధాన్ని తప్పించుకొని ఆవిడ సమావేశానికి హాజరుగావటానికి బస్సు ఎక్కినపుడు భర్త కంటబడితే, అతడు ఆవిడను వాహనం నుండి ఈడ్చుకు వచ్చి ఇంట్లో బడవేస్తాడు; పొరపాటున

మహిళ సమావేశానికి హాజరయితే, భర్త ఆవిడను సమావేశం నుండి లాక్కొచ్చి ఇంట్లో బంధిస్తాడు

గీతారావు గుప్తా, కాంచన్ మాధుర్‌లు (1992) కూడా రాజస్థాన్ లో సామాజిక సేవలో నున్న మహిళల మీద జరిగిన దురాగతాలను వెల్లడించారు. రాజస్థాన్‌లో ప్రభుత్వం ప్రారంభించిన మహిళా అభ్యుదయ కార్యక్రమాలు, ప్రజారంజకంగా రూపొందాయి. ఈ కార్యక్రమం క్రింద బాల్య వివాహాల నిరోధానికి కూడా కృషి జరుగుతున్నది. ఈ ఉద్యమం ప్రజలను ప్రభావితం చేయ నారంభించింది. ఇది గిట్టని ఛాందసులు కొందరు, దానికి నాయకత్వం వహిస్తున్న మహిళ మీద, భర్తముందే అత్యాచారం (మానభంగం) జరిపారు. "నీ భార్యను ఇకముందు ఈ కార్యక్రమంలో పాల్గొనకుండా చూచుకో లేకపోతే ఇదే పలుమార్లు జరుగుతుంది; జాగ్రత్త" అని హెచ్చరించారు. దీనితో హడలిపోయిన మహిళా కార్య కర్తలు పనిచేయటం మానివేసినట్లు వీరు వెల్లడించారు

మహిళల సంఘ సేవా కార్యాచరణ కుదింపు : ఇలాంటి హింసా చర్యలకూ, అత్యాచారాలకు భయపడి మహిళలు తమ కార్య కలాపాలను భర్తకు ఇష్టమయిన మేరకు కుదించుకోవటం సహజం. డాక్టర్ క్రిస్టిన్ బ్రాడ్లే సూచించినట్లు మహిళలు హింసను అనుభవించటానికి ఎంతగా భయపడతారో, హింసను అనుభవించవలసి వస్తుంది అన్న బెదిరింపులకు కూడా అంతగా భయపడతారు. ఆ భయం వల్ల వీరు తమను తామే ఖైదు చేసుకొంటున్నారు. పాపు న్యూగినీలో ఉపాధ్యాయినులు, తమ భర్తలు ఆగ్రహిస్తారన్న భయంతో, ప్రమోషన్లు కూడా కోరటం లేదని ఎం.ఎ.గిబ్బన్ రిపోర్టు చేశారు.

కుటుంబీకులు గాకుండా బయటివారు బాధించినా, స్త్రీ స్థితి ఇలాగే ఉంటున్నది. సామాజిక కార్యకలాపాలలో వారు పాల్గొనటానికి సాహసించరు. అమెరికాలోని షికాగో, ఫిలడల్ఫియా, శాన్ ఫ్రాన్సిస్కో నగరాలలోని ఆరు ప్రాంతాలలో సర్వేలు జరిగాయి. తాము బయటకు వెళ్ళిన యాభైశాతం సందర్భాలలో మానభంగానికి గురయ్యే ప్రమాదమున్నట్లు మహిళలు చెప్పారు. ఈ భయంతోనే తమ నిత్యకృత్యాలను వీలయినంత మేరకు కుదించుకొంటున్నట్లు, సర్వేలో పాల్గొన్న మహిళలలో సగం మంది చెప్పారు. కొన్ని ప్రాంతాలకు పోమని, కొన్ని సందర్భాలలో అసలే బయటకు వెళ్లమనీ వారు చెప్పారు. సర్వేలో పాల్గొన్న పురుషులలో నూరింట తొంభై మంది, తాము భయం లేకుండా తిరుగుతున్నట్లు చెప్పారు. దక్షిణ కొరియా రాజధాని సోల్ నగరంలో ఒక పత్రిక సర్వేను నిర్వహించింది. అన్నింటి కంటే తమను అధికంగా భయకంపితులను చేస్తున్నది సెక్సు హింసేనని మహిళలు వెల్లడించారు. సుమారుగా 2,300 మంది మహిళలు పాల్గొన్న మరొక సర్వేలో నూరింట 94 మంది, తాము పెరిగి పోతున్న సెక్సు పరమైన అత్యాచారాలను చూచి భయపడుతున్నట్లు చెప్పారు; ఈ భయం వల్ల తాము ఎంతగానో ఆందోళితుల మవుతున్నామనీ. ఆ భయంతోనే తమ కార్యకలాపాలను కుదించుకొంటున్నామనీ నలభైశాతం మంది చెప్పారు.

మానభంగ ప్రమాద భయం పోషణా లోపాలకు దారిదీయవచ్చు : అభివృద్ధి చెందుతున్న దేశాలలో మహిళలను పొంచి ఉన్న ఈ సెక్సు హింస, అత్యాచార ప్రమాదం వారి అభివృద్ధికి ఆటంకంగా తయారవుతున్నది ఇథియోపియా నుండి సుడాన్‌కు వలసపోయిన కాందిశీకుల మీద యునైటెట్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం ఒక సర్వేను జరిపించింది. మానభంగ భయం వల్ల అచ్చటి నిర్వాసితులు పోషణా లోపానికి గురవుతున్నట్లు ఈ సర్వేలో వెల్లడైంది. పొయ్యిలోకి పుల్లల సేకరణకు తాము మూడు నుండి మూడున్నర గంటల వరకు పొలాలు, అడవులు పట్టుకు తిరగాలనీ, ఆ లోపల తాము మానభంగానికి గురయ్యే ప్రమాదమున్నదని మహిళలు చెప్పారు. అందువల్ల ఎక్కువ సార్లు పుల్లలకు పోవటం లేదని, పిల్లలకోసం కూడా, కొన్ని సందర్భాలలో వంట కూడా చేయలేక పోతున్నట్లు వారు చెప్పారు. ఇందువల్ల పిల్లలూ, పెద్దలూ కూడా పస్తులుండవలసి వస్తున్నది. గుజరాత్‌లో పనిచేస్తున్న మహిళా ఆరోగ్య కార్యకర్తలు మానభంగ ప్రమాదానికి భయపడి గ్రామాలకు వంటరిగా వెళ్ళటం మానుతున్నట్లు ఒక సర్వే వెల్లడించింది.

జరుగుతున్న అత్యాచారాలు, లెక్కకు అందిన వాటికంటే మిక్కుటంగానే ఉంటున్నాయి. ఇచ్చట పేర్కొన్నవి మచ్చుకు కొన్ని మాత్రమే. హింసా చర్యలు స్త్రీల సృజనాత్మక శక్తుల ప్రదర్శనను ఎలా అడ్డగిస్తున్నాయో, అందువల్ల సామజికాభివృద్ధి ఎంతగా కుంటు పడగలదో ఇవి సూచిస్తున్నాయి.

## చూలాలి ఆరోగ్యంపై హింసా ప్రభావం

కోడలు చూలాలని తెలిసిన తర్వాత ఇంతవరకూ ఆవిడను రాచి రంపాన పెడుతున్న అత్తకూడా ఆవిడ ఆరోగ్య రక్షణకు తాపత్రయ పడుతుంది. సామాజికులు కూడా చూలాలిని గౌరవిస్తారు. కాని కొందరు భర్తలు మాత్రం వీరి మీద అత్యాచారాలు జరపటానికీ, హింసించటానికీ వెనుదీయరని సర్వేలు వెల్లడిస్తున్నాయి. అమెరికాలోని బాల్టిమోర్, హూస్టన్ నగరాలలోని అల్పాదాయ వర్గాలు నివసించే ప్రాంతాలలో ఒక సర్వే జరిగింది. చూలాండ్రలోని ఆరుగురిలో ఒక్కరి వంతున భర్త చేతిలోదెబ్బలు తింటున్నట్లు ఈ సర్వే వెల్లడించింది. ఈ సర్వే ఫలితాలను అమెరికన్ మెడికల్ అసోసియేషన్ జర్నల్ ప్రచురించింది. ఈ సర్వేలో మొత్తం 681 మంధి పాల్గొన్నారు. వీరిలో తెల్లవారు, నల్లవారు, దక్షిణ అమెరికా నుండి వచ్చిన వారున్నారు. దెబ్బలకు గురయిన వారిలో అరవైశాతం మంది, తమను భర్తలు చూలు కాలంలో రెండుమూడు సార్లు కొట్టినట్లు చెప్పారు. దెబ్బలకు గురికాని చూలాలు, చూలుకాలపు మూడవ భాగ ప్రారంభకాలం నుండీ వైద్య సలహా సదుపాయాన్ని అనుభవిస్తున్నది. దెబ్బలు తింటున్న చూలాండ్రకు ఈ అవకాశం లభించక పోవటం అనేది చాలా అధికంగా ఉంటున్నది. దెబ్బలు తినని చూలాలి కంటే, దెబ్బలకు గురయిన చూలాలికి గర్భస్రావ ప్రమాదం రెండు రెట్లు అధికంగా ఉంటుందని మరొక సర్వే నిరూపించింది; పుట్టేబిడ్డ బరువు ఆరోగ్య సూత్ర నియమం ప్రకారం ఉండవలసిన దానికంటే తక్కువగా ఉండటం అనేది నాలుగు రెట్లు అధికమని కూడా ఇది సూచించింది. బిడ్డ యొక్క తొలి సంవత్సర జీవితంలో, బరువు అతి ముఖ్యమైన అంశం. బరువు తక్కువున్న పిల్లలకు సంవత్సరం లోపల మరణించే ప్రమాదం పొంచి ఉంటుంది.

మెక్సికో సిటీ ప్రాంతంలో 342 మంది చూలాండ్రను ఎన్నుకొని సర్వే జరిపారు. వీరిలో ఇరవై శాతంమంది తమ భర్తలు తమ పొట్టమీద కొట్టినట్లు చెప్పారు. శాన్హోజే, కోస్టారికా ప్రాంతాలలో ఒక సర్వే జరిగింది. భర్తల చేతిలో దెబ్బలు తినలేక కోర్టు రక్షణను కోరిన వారిలో 80మంది ఈ సర్వేలో పాల్గొన్నారు. వీరిలో 49 శాతం మంది తమను చూలుకాలంలో కూడా భర్త కొడుతున్నట్లు చెప్పారు. దెబ్బలు తినటం వల్లనే తమకు గర్భస్రావం జరిగినట్లు 75 శాతం మంది చెప్పారు. అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రజలు పోషణా లోపానికి గురవుతున్నారు. వీరికి వైద్య చికిత్సా సదుపాయాలు కూడా అవసరాలకు తగినంతగా ఉండటం లేదు. పైగా వీరు అధికంగా శారీరక శ్రమను చేస్తారు. ఇలాంటి వాతావరణంలో దెబ్బలు తినవలసి వచ్చిన చూలాలు అభివృద్ధి చెందిన దేశాలలోని చూలాలికంటే అధికంగా నష్టపడుతుంది.

హింస వల్ల సంభవించే బాలింతల మరణాలు, ముఖ్యంగా అవివాహితలయిన బాలింతల మరణాలు పరిగణించదగిన పరిమాణంలోనే ఉంటున్నాయి. బంగ్లాదేశ్‌లోని మత్లబ్ రాణా ప్రాంతంలో ఒక సర్వే జరిగింది. 1976-1986 సంవత్సరాల మధ్య సంభవించిన మొత్తం 1,139 పురుటి చావుల్లో నూరింట ఆరింటికి, మానభంగమో, వివాహం కాకుండా చూలు రావటమో, భర్త కొట్టటమో లేక కట్న సమస్యో కారణమని సర్వేయర్లు నిర్ధారణ చేశారు. గర్భస్రావానికి అనాగరిక పద్ధతులను అవలంబించి నందు వలన సంభవించిన మరణాలను కూడా కలిపితే, ఆ మరణాల పరిమాణం 21.5 శాతానికి పెరుగుతుందని వీరు అంచనా వేశారు. ఇలా చూసినపుడు కారణాలు భిన్నంగా కనుపించినా, దానిలో పూసలలో దారంలా నడిచేది అవమాన భారము: పెండ్లి గాకుండా గర్భవతి అయినందుకు సంఘం నిరసిస్తుందన్నభయం. ఈ ప్రాంతంలో మరణించిన 15-44 సంవత్సరాల మధ్యవయస్సు మహిళలలో భర్తలు కొట్టటం వల్లనో, ఆత్మహత్యా ప్రయత్నంలోనో మరణించిన వారు 12.3 శాతం మంది ఉన్నారు. గర్భస్రావ ప్రయత్నంలో మరణించిన వారికంటే వీరి సంఖ్య అధికంగా ఉన్నది.

అమెరికాలోని షికాగో నగరంలో జరిగిన పరిశీలనలో, బుద్ధిపూర్వకంగా గాయపరచటం వల్ల సంభవిస్తున్న బాలింత మరణాలు గణనీయంగా ఉంటున్నట్లు స్పష్టమైంది. కుక్ కౌంటీ మెడికల్ ఎక్జామినర్ వ్రాసిన రికార్డులను పరిశీలకులు చూచారు. 1986 వ సంవత్సరం జనవరి మాసానికి, 1989వ సంత్సరం డిసెంబరు మాసానికి మధ్యనున్న కాలంలో సంభవించిన బాలింత మరణాలకు, వారిని శారీరకంగా గాని, మానసికంగాగాని గాయపరచటమే ప్రధాన కారణమని స్పష్టమైంది; మరణించిన బాలింతలలో ఈ కారణం వల్ల

మరణించిన వారు నూరింట 46 మంది వరకూ ఉన్నారు; వీరిలో 57 శాతం మంది భర్తలు కొట్టిన దెబ్బల వల్ల మరణించగా, తొమ్మిది శాతం మంది ఆత్మహత్య చేసుకొన్నట్లు పరిశీలకులు నిర్ధారించారు.

హింసకు నిలయమైన సామాజిక, రాజకీయ వాతావరణంలో నివసించే చూలాండ్రకు, ఇలాంటి బాధలు లేని వాతావరణంలో ఉంటున్న చూలాండ్ర కంటే, కాన్పు సంబంధమైన ప్రమాదాలు అధికంగా ఉంటాయని మరొక పరిశీలన రుజువు చేసింది. చిలీలోని శాంటియాగో నగరంలో ఎన్నికైన 161 మంది మహిళల మీద పరిశీలన జరిగింది. ఆదాయము, విద్యా ప్రమాణమూ, పోషణాలోపం, చూలాలు అవసరమైనంత మేరకు బరువు పెరగటం, పొగత్రాగే అలవాటు, పరిసరాల మీద నున్న విరక్తి, జీవితంలో జరిగిన సంఘటనలు, జీవితంలోని అనిశ్చిత పరిస్థితి, మానసిక ఆందోళన వంటి వాటి వలన ఎంతమేరకు చూలాలికి నష్టం జరిగే అవకాశమున్నదో చూచి, దానిని తొలగించి, ఆవిడ నివసిస్తున్న ప్రాంతంలోని హింసాయుత వాతావరణం మాత్రమే ఆవిడ మీద కలుగ జేయగల దుష్ట ప్రభావ పరిమాణాన్ని పరిశీలకులు అంచనా వేశారు. కాన్పుకు ముందు చూలాలికి వాంతులు రావటం, నెలలు నిండ కుండానే పురుటి నొప్పులు రావటం, గర్భవిచ్ఛిత్తి ప్రమాదం సంభవించటం, అధిక రక్తపోటు రావటం వంటి బాధలు, ప్రశాంత వాతావరణంలో జీవిస్తున్న చూలాండ్రకంటే, హింసా పూరిత వాతావరణంలో నివసిస్తున్న చూలాండ్రకు, ఐదు రెట్లు అధికంగా ఉంటున్నట్లు పరిశీలకులు అంచనా వేశారు. హింసాయుత వాతావరణంలో జీవిస్తున్నందువల్లే, ఇలాంటి బాధలను అనుభవిస్తున్న చూలాలి వలె, భర్త లేక కుటుంబీకుల హింస వల్ల నరకప్రాయంగా మారిన ఇంట్లో నివసిస్తున్న చూలాలి మీద కూడా ఇలాంటి దుష్ప్రభావం ప్రసరించటం సహజం. ఒకటి ఇల్లు, రెండవది సమాజం. పేర్లలో భేదమున్నదే గాని, వాటిలోని వాతావరణంలో మాత్రం భేదం లేదు.

### కుటుంబ నియంత్రణంపై స్త్రీ హింసా ప్రభావం

సెక్సు హింస కుటుంబ నియంత్రణా కృషిని కూడా వమ్ము చేస్తున్నది. మగవాడికి భయపడి చాలమంది మహిళలు కుటుంబ నియంత్రణా సాధనాలను వాడటం లేదు. గర్భనిరోధక మార్గాలు తెలిస్తే తన భార్య పరపురుష సంపర్కాన్ని నిర్భయంగా సాగిస్తుందని భర్తలు భయపడుతూ ఉంటారు. ఇలాంటి దురుద్దేశ్యంతోనే గర్భనిరోధక సాధనాల వాడుకకు స్త్రీ తాపత్రయ పడుతున్నట్లు భావిస్తాడు. తన పుంసత్వ నిదర్శనం తన భార్యకు చూలు రావటంగా భావించేవారు కూడా, కుటుంబ నియంత్రణ సాధనాలను స్త్రీలు వాడకుండా జాగ్రత్త పడతారు. తన భార్య ఎంత అధిక సంతానాన్ని పొందగలిగితే తన పుంసత్వానికి అంత ప్రతిష్ఠ లభిస్తుందని వీరి భావన సంస్కృతులు భిన్నమైనా, ఈ విషయంలో మాత్రం పురుషుల అభిప్రాయాలలో ఏకత్వం కనుపిస్తుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, పేద దేశాల లోనూ కూడా, స్త్రీల కుటుంబ నియంత్రణా ప్రయత్నం పురుషుని సహకారంతోనే ఫలించగలుగుతుంది.

భర్త కోరినంత అధిక సంతానాన్ని పొందకపోతే దండనః పురుషుడు వ్యతిరేకించినపుడు, వారికి తెలియకుండా నిరోధక మార్గాలను స్త్రీలు అవలంబించ బూనటం కూడా కనుపిస్తుంది.

సెక్సు కార్యకలాపాలలోనూ, పిల్లలను కనటం లోనూ భర్తల అభీష్టానికి అనుగుణంగా ప్రవర్తించటాన్ని తప్పించు కోవటానికే భార్యలు ఇలాంటి పనులు చేస్తూంటారన్నది వాస్తవం. దీనిని చిత్రీకరించగల ఉదంత మొకటి కంపాలా (ఉగాండా)లో జరిగింది. మహిళా సేవా సంస్థ నాయకురాలు హోప్ మౌస్గియి ఈ విషయాన్ని వెల్లడించింది. ఒక యువతి భర్త, తననూ, ఉన్న ఇద్దరు పిల్లలనూ పోషించకుండా, నిత్యం కొడుతూ ఉండే వాడట. అతను పేదవాడు కాదు; సుఖంగా బ్రతకటానికి తగినంత సంపాదిస్తున్నాడు. కాని కుటుంబపోషణకు చిల్లిగవ్వ ఇవ్వడు. ఈ పరిస్థితిలో అతడితో "కాపురం చేస్తుంటే" మరి కొంతమంది పిల్లలు పుడతారు; వారిని తానే పోషించాలి అన్న భయంతో ఆ ఇల్లాలు భర్తకు తెలియకుండా గర్భనిరోధక మార్గాలను అవలంబించ సాగింది. పిల్లలను కనలేక పోతున్న దన్న కారణంగా భర్త మరింత అధికంగా హింసించ సాగాడు. గర్భనిరోధక పద్ధతులను భార్య అవలంబిస్తున్నదని తెలిసి, అగ్గై, పశువువలె ప్రవర్తించ సాగాడు. ఈ బాధను భరించలేక ఆయువతి ఇల్లువదలి పారిపోయింది.

**దుర్లభమవుతున్న భర్తల అనుమతి:** కొన్ని దేశాలలో భర్త అనుమతి పొందనిదే స్త్రీకి కుటుంబ నియంత్రణా వసతి లభించదు ఇలాంటి చోట్ల మహిళ పాట్లు వర్ణనాతీతంగా ఉంటాయి. కీన్యాలో ప్రభుత్వం కల్పించిన కుటుంబ నియంత్రణా వసతిని వాడుకొంటామని చెబితే భర్తలు హింసిస్తారని, ఇల్లాండ్రు, వారి సంతకాలను ఫోర్జరీ చేసి, అంగీకార పత్రాలను తయారు చేయనారంభించారు ఈ విషయాన్ని ఫామిలీ ప్లానింగ్ ఇంటర్నేషనల్ ఎసిస్టెన్స్ సంస్థకు చెందిన పమేలా ఒనింగో బయట పెట్టారు. మెక్సికో, పెరు దేశాలలోని ఇల్లాండ్రు, కుటుంబనియంత్రణాన్ని పాటిస్తే తమ భర్తలు హింసించటమో, వదలి వేయటమో, పరపురుష సంపర్క దోషాన్ని అంటగట్టటమో చేస్తారని భయపడుతున్నట్లు కొందరు పరిశీలకులు వెల్లడించారు. భర్తల అనుమతి పొందిన వారికే ఫామిలీ ప్లానింగ్ సేవలు లభిస్తాయన్న శాసనం ఇధియోపియాలో రద్దయిన తర్వాత కొద్ది మాసాలలోనే, కుటుంబ నియంత్రణా సాధనాల వాడుక 26 శాతం పెరిగినట్లు కొందరు పరిశీలకులు రిపోర్టు చేశారు

భర్తలంతా, కుటుంబ నియంత్రణను పాటించే ఇల్లాండ్రను ఇలా వేధిస్తారని కూడా చెప్పటానికి వీలులేదు. కుటుంబ నియంత్రణానికి మగవారు కూడా సుముఖంగా ఉన్నట్లు తెలియజేస్తున్న సర్వేలు కూడా ఉన్నాయి. భార్యా భర్తల మధ్య అవగహనా లోపం వల్ల, ఒక రకమైన భయం భార్యలో చోటు చేసుకొంటున్నది. పెండ్లికి ముందు ఒకరి నొకరు ఎరుగరు. పిల్లలు పుట్టటం ఆరంభమైన తర్వాత కూడా ఇలాంటి స్థితి కొన్ని కుటుంబాలలో కొనసాగుతున్నది. కుటుంబ నియంత్రణను పాటిస్తే, భర్త క్షమించడని ఇల్లాలు ఊహించుకోవచ్చు; ఈ అకారణ భయం వల్లనే దాని పాటింపును ఆమె విస్మరిస్తూ ఉండవచ్చు. ఊహకు, వాస్తవానికీ ఎంత అంతరం ఉన్నది! పురుషాహంకారం స్రీల మీద కొనసాగిస్తున్న హింసాకాండ, వారిని ఎటు తరుముతున్నదో ఈ వాస్తవం వెల్లడిస్తున్నది.

**పరస్పరావగాహనా లేమి :** కుటుంబ నియంత్రణ ఆమోదకరమైన అంశంగా పరిగణనలో ఉన్న చోట్ల, ఆ అవకాశాన్ని స్త్రీ వినియోగించుకోకుండా పురుషులు అడ్డు పడుతున్న సందర్భాలు కూడా ఉన్నాయి. అమెరికాలోని మెక్సికోలో జరిగిన ఒక సర్వేలో 1,539 మంది మహిళలు పాల్గొన్నారు వీరిలో 187 మంది (12 శాతం మంది) తమను పద్దెనిమిది సంవత్సరాల వయస్సు నిండక పూర్వమే, భర్తో మాజీ భర్తో, ప్రియుడో, మాజీ ప్రియుడో బెదిరించినట్లు చెప్పారు వీరిలో 12.3 శాతం మంది మగవారు తమను గర్భనిరోధక సాధనాలను కూడా వాడనీయలేదన్నారు. గర్భధారణ తమకు ఇష్టం లేకపోయినా, అది సంభవించాలని కోరే పురుషుడు, నిరోధక సాధనాలను వాడనీయ లేదని 10.7 శాతం మంది చెప్పారు.

**వద్దను కొన్నా సంభవిస్తున్న గర్భధారణ :** పసితనంలోనే సెక్సు హింసకు గురయిన వారు తమకు ఇష్టం లేకపోయినా గర్భధారణ చేయవలసిన పరిస్థితులుంటాయని కొన్ని పరిశీలనలు నిరూపిస్తున్నాయి. పసితనంలో సెక్సు హింసకు గురయిన వారు, పెద్దయిన తర్వాత తిరిగి ఇటువంటి అత్యాచారానికి గురయ్యే అవకాశం, పసితనంలో అత్యాచారానికి గురిగాని వారి కంటే 2.4 రెట్లు అధికంగా ఉంటుందని లాస్ ఏంజిలిస్ లో జరిగిన సర్వే నిరూపించింది. ఇలా రెండవ సారి, మూడవసారి అత్యాచారానికి గురయిన వారు, ఇలాంటి అనుభవాన్ని తప్పించుకొన్న వారికంటే, గర్భవతులయ్యే అవకాశం గాని, లేక గర్భస్రావానికి పాల్పడే అవకాశం గాని ఎంతో అధికంగా ఉంటుందని కూడా పరిశీలకులు నిరూపించారు.

డెబ్రా బోయర్, డేవిడ్ ఫైన్ అనే పరిశీలకులు, తాము వాషింగ్టన్ స్టేట్‌లో, 18 సంవత్సరాల లోపు వయస్సున్న యువతుల మీద జరిపిన సర్వే ఫలితాలను వ్యాసరూపంలో ప్రచురించారు (1992). పసితనంలో సెక్సు పరమైన అత్యాచారానికి గురిగావటానికీ, యవ్వన దశలో తమ అభీష్టానికి వ్యతిరేకంగా గర్భధారణ జరగటానికీ సంబంధం ఉన్నట్లు వారు నిరూపించారు. యవ్వనదశ దాటని పిల్లలు గర్భధారణను తప్పించుకోవటానికి అనువుగా అమెరికా ప్రభుత్వం గత ఇరవై సంవత్సరాలుగా, కుటుంబ నియంత్రణా సాధనాల వాడుకను ప్రోత్సహిస్తున్నది. వీటిని స్కూళ్ళలో కూడా అమ్ముతున్నారు. సెక్సు విద్యాబోధన కూడా కొన్ని చోట్ల అమలులో ఉన్నది. అయినా ఈ వయస్కులలో గర్భధారణా రేటు పడిపోవటం లేదు! పసితనంలోనే ఆడపిల్లల మీద జరిగే సెక్సు పరమైన

అత్యాచారాలకు సంబంధించిన సమస్యలను పరిష్కరించలేక పోవటం చేతనే యువతీయువకులు సెక్సు విషయంలో అత్యంత దుందుడుకు మార్గాలను అనుసరిస్తున్నారనీ, యుక్తవయస్సు రాక పూర్వమే గర్భవతులవుతున్న వారి సంఖ్య అధికంగానే ఉంటున్నదనీ వీరు సూచించారు.

## సుఖరోగాలు, ఎయిడ్స్ నిరోధం మీద స్త్రీ హింసా ప్రభావం

పురుషులు సెక్సు హింసా ప్రవృత్తిని ప్రదర్శిస్తూండటం వల్లనే, స్త్రీలు ఎయిడ్స్‌నుండి, సెక్సు సంపర్కం వల్ల సంక్రమించే ఇతర రోగాల నుండి రక్షణ పొందలేక పోతున్నారు పురుషులు ప్రదర్శించే హింసా ప్రవృత్తి వల్ల, స్త్రీ మానభంగాలకు గురవుతున్నది; తాను సంపర్కానికి అంగీకరించిన సందర్భాలలో కూడా, కుటుంబ నియంత్రణా సాధనాన్ని అతడు వాడేట్లు చేయలేక పోతున్నది కొన్ని ప్రాంతాలలో పురుషులు వాడే కుటుంబ నియంత్రణ సాధనాన్ని పరస్త్రీలోలత్వానికి, వ్యభిచారానికి సెక్సు రోగాలకూ సంకేతంగా చూస్తున్నారు. ఆ సాధనాన్ని వాడమని భార్య భర్తను కోరితే, తనను వ్యభిచారిగా భార్య భావిస్తున్నదని అతడు కోపగించే ప్రమాదం ఉన్నది. కోరిన స్త్రీల పొందును అనుభవించే తన హక్కును భార్య సవాలు చేస్తున్నదని భర్త ఆగ్రహించవచ్చు. కుటుంబక్షేమం దృష్ట్యా తన భార్య అటువంటి సలహా నిచ్చిందన్న సత్యాన్ని కోపోద్రిక్తుడయిన భర్త గుర్తించలేడు. అందువల్ల కుటుంబ నియంత్రణాన్ని తన భర్త యెదుట ప్రస్తావించగలదేమోగాని, కుటుంబ నియంత్రణా సాధనాన్ని వాడమని బలవంతం చేయటానికి స్త్రీ భయపడుతుంది.

కండోమ్ వాడుకకు పురుషుని వ్యతిరేకత : ఎయిడ్స్ వ్యాధి నిరోధానికి కండోమ్ వాడుక ఒక్కటే మార్గం. సెక్సు సంబంధం ఉన్న స్త్రీ పురుషులిద్దరకూ అవగాహన ఉన్నపుడే దీని వాడుక సాధ్యమవుతుంది. ఇలాంటి అవగాహన అధిక సంఖ్యాకులలో ఉండటం లేదు. సంప్రదాయబద్ధమైన భార్యగా జీవిస్తున్నా, తన సెక్సు మీద ఆవిడకు అధికారం ఉండటం లేదు. మెక్సికోలో, పరిశ్రమ నుండి కాంట్రాక్టు పద్ధతిన ఇంట్లో చేయగల పనులను తెచ్చుకొని చేస్తున్న మహిళల మీద సర్వే జరిగింది. తమకు ఇష్టం లేని సమయంలో కూడా తమ భర్తలు బలవంతపు సెక్సు చర్యకు పాల్పడుతున్నట్లు చాలామంది మహిళలు చెప్పారు. శ్రీలంక, ఫిలిపీన్స్, గ్వాటేమాలాలలో జరిగిన సర్వేలలో, తమ భర్తలు తిరిగి వచ్చి, తమకు ఇష్టం లేక పోయినా బలవంతంగా తమను అనుభవిస్తున్నట్లు మహిళలు చెప్పారు. గ్వాటేమాలా సర్వేలో పాల్గొన్న మహిళలు ఇచ్చిన సమాధానాలను బట్టి వారికి ఇష్టం లేక పోయినా, హింసించి లొంగదీసుకొని వారిని అనుభవిస్తూ ఉండటం అతిసామాన్యమైనట్లు సర్వేయర్లు భావించారు.

హింసా ప్రవృత్తికి, మద్యానికి అలవాటుపడిన పురుషులు సెక్సుకోసం స్త్రీని వేధించటం అనేది స్పష్టంగా కనుపిస్తున్నది. అమెరికాలో వివాహిత స్త్రీలలో నూరింట పది నుండి పధ్నాలుగురి వరకూ బలవంతపు సెక్సును అనుభవిస్తున్నారు. పురుషుల హింసకు గురవుతున్న వారిలో నలభై శాతం మంది వరకూ బలవంతంగా సెక్సును అనుభవించవలసి వస్తున్నదని జాక్విలిన్ కాంప్ బెల్, పెగ్గీ ఆల్‌ఫ్రెడ్ల సర్వే సూచిస్తున్నది. బొలివియా, ప్యూర్టోరికోలలో జరిగిన సర్వేలు భర్త చేతిలో దెబ్బలు తింటున్న మహిళలలో నూరింట 58 మంది వరకూ పురుషుల సెక్సు హింసకు గురవుతున్నట్లు వెల్లడైంది. కొలంబియాలో ఇలాంటి అభాగినుల శాతం 46 వరకూ ఉంది. ప్రపంచ వ్యాప్తంగా పరిస్థితిని పరిశీలించినపుడు, భార్యను హింసించే పురుషులు, బలవంతం చేసో, భయపెట్టో భార్యలను అనుభవించటం అతి సామాన్యమైనదని ప్రపంచ బ్యాంకు సేకరించి ప్రచురించిన సమాచారాన్ని బట్టి స్పష్టమవుతున్నది.

బాల్యంలోనే సెక్సు హింసకు గురయిన వారు వేశ్యా వాటికను చేరే ప్రమాదం : బాల్యం లోనే సెక్సు హింసకు గురయిన వారు సుఖ రోగాలకు, ఎయిడ్స్‌కు సులభంగా గురయ్యే అవకాశాలు ఉన్నాయి. సెక్సు హింసకు గురయిన వారు పడుపు వృత్తికి దిగే అవకాశాలు అధికంగా ఉన్నట్లు పలు పరిశీలనలు నిరూపించాయి. బాల్యంలో గాని, యవ్వన దశలో గాని మానభంగానికిగాని, లేదా సెక్సు అత్యాచారానికి గాని గురయిన వారు, ఇలాంటి ప్రమాదాన్ని తప్పించుకొన్నవారికంటే పడుపు వృత్తికి దిగే అవకాశం నాలుగు రెట్లు అధికంగా ఉన్నట్లు బ్రౌన్ యూనివర్సిటీకి చెందిన శాలీ

జైర్డియర్ ప్రభృతులు తాము వ్రాసిన పరిశోధనా పత్రంలో (ఎడల్ట్ సర్వైవర్స్ ఆఫ్ ఛైల్డ్‌హుడ్ సెక్సువల్ ఎబ్యూజ్) వివరించారు. ఒక్క సంవత్సరంలోనే పలువురతో సెక్సు సంబంధాలను కలిగి ఉండే అవకాశంగాని తెలియని వారితో సెక్సును అనుభవించే అవకాశం గాని రెండు రెట్లు అధికంగా ఉంటుందనీ వీరు సూచించారు. బాల్యంలో అనుభవించిన సెక్సుపరమైన అత్యాచారానుభవాన్ని తట్టుకొని మనగలిగిన వారు మద్యపానలోలురయ్యే అవకాశం రెండు రెట్లు, పద్దెనిమిది సంవత్సరాల వయస్సు నిండక పూర్వమే గర్భవతులయ్యే అవకాశం మూడు రెట్లు అధికంగా ఉంటుందని కూడా వీరు సూచించారు.

బార్బడోస్‌లో సర్వేలను నిర్వహించిన ఆంత్రపోలజిస్ట్ డాక్టర్ పెన్ హాండ్వెర్కర్ కూడా దాదాపు ఇలాంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేశారు. వీరి సర్వేలో 407 గురు స్త్రీ పురుషులు పాల్గొన్నారు. యుక్తవయస్సు రాని వారిలో సెక్సు విశృంఖలత్వానికి ప్రధాన కారణం, పసితనంలో వారు సెక్సు పరమైన అత్యాచారాన్ని అనుభవించటమేనని వీరు అభిప్రాయ పడ్డారు. చిన్న తనంలోనే వ్యక్తి తొలి సెక్సు అనుభవాన్ని పొంది ఉండటం, లేదా పసితనంలోనే సెక్సు పరమైన అత్యాచారాన్ని అనుభవించి ఉండటం వల్ల వారు పెరిగి పెద్దవారయిన తర్వాత పలువురతో సెక్సు సంబంధాలను పెంపొందించుకొనే అవకాశాలు అధికంగా ఉంటాయని హాండ్వెర్కర్ సూచించారు. పసితనంలోనే అనుభవించిన సెక్సుహింసా ప్రభావం, ఆ వ్యక్తికి 35 సంవత్సరాల వయస్సు వచ్చే వరకూ ఉంటుందని వీరు అభిప్రాయ పడ్డారు. శారీరక, మానసిక, సెక్సు హింసలకు గురయిన మగవారు కండోమ్‌ల వాడుకను నిర్లక్ష్యం చేయటం అత్యధికంగా కనుపిస్తున్నట్లు కూడా హాండ్వెర్కర్ గమనించారు.

**మాదక ద్రవ్య వాడకంతో ఎయిడ్స్ :** మాదక ద్రవ్య వాడకపు అలవాటున్న వారికి ఎయిడ్స్ సోకే ప్రమాద ముంటుందని ఇంతకు పూర్వమే రుజువైంది. బాల్యంలోనే సెక్సు హింసకు గురయినవారు, నిరాశా, నిస్పృహలకు లోనయి మాదక ద్రవ్య సేవనానికి అలవాటు పడతారు. ముఖ్యంగా బంధుత్వరీత్యా పరిణయమాడటానికి వరుస కుదరని వారి అత్యాచారానికి బాలిక గురయినపుడు, ఆమె వీటికి బానిసయ్యే అవకాశాలు అధికంగా ఉంటాయని అమెరికాలోని సౌత్ బ్రాంక్స్ నగరంలోని ఒక వైద్యశాలకు వస్తున్న బాధితుల మీద జరిపిన సర్వే నిరూపించింది. డూలీ వర్త్ 'సెక్సువల్ డిసిషన్ మేకింగ్ అండ్ ఎయిడ్స్' అన్న తమ పరిశోధనా వ్యాసంలో ఈ విషయాన్ని సాకల్యంగా చర్చించారు. మహిళలు ఎయిడ్స్‌కు గురికాకుండా ఉండాలంటే పురుషులు కండోమ్‌లను వాడేట్లు చూడాలి అనే ప్రయత్నాలు ఎలా విఫలమవుతున్నాయో వీరు వివరించారు. ఈ విషయాన్ని వారు ఒక చోట ఇలా ప్రస్తావించారు. "వివాహం చేసుకోవటానికి వరుసగాని సమీప బంధువుల వల్ల మానభంగానికి గురయిన స్త్రీలను సమాజం గేలి చేస్తుంది. వెలివేస్తుంది. బాధితురాలు అవమాన భారంతో క్రుంగిపోతుంది. తమను ఎవరూ ఆదరించటం లేదని బాధ పడుతూ ఉంటుంది. ఒక్కొక్క సారి తాను ఆదరణకు అనర్హురాలనని తనను తానే నిందించుకొంటుంది. నిస్తేజితురాలై, తాను ఇష్టగించని, అనుభవం తనకు సంప్రాప్తిస్తున్నా, రక్షణకు పెనుగులాడటం మానివేస్తుంది. ఇందువల్ల సెక్సు సంబంధాన్ని ఎవరు కోరినా, వారు నిరాకరించరు; మాదకద్రవ్య వాడక సూచనను తిరస్కరించలేరు. యాంత్రికంగా అంగీకరిస్తారు."

సమీప బంధువులచేత సెక్సు అత్యాచారాన్ని అనుభవించిన ఆడపిల్లలు, తమ శరీరాన్ని తామే ద్వేషించే స్థితికి వెళతారు. దానికి ఏమి జరిగినా, తమకు పట్టనట్లు వ్యవహరించ నారంభిస్తారని కూడా డూలీ వర్త్ సూచించారు. ఇలాంటి వారు తమ సమవయస్కుల సహవాస దోషానికి సులభంగా ఎరవుతారన్నారు. దీనిని బట్టి, పసితనంలో సెక్సు హింసకు గురిగావటానికీ, రక్తనాళాలలోనికి తీసుకొనే మాదక ద్రవ్య వాడుకకు, మద్యపానలోలత్వానికి సెక్సు విశృంఖలత్వానికి ఒడిగట్టటానికి అత్యంత సన్నిహిత సంబంధమున్నదని పలు పరిశోధనలు నిరూపిస్తున్నాయి.

**తల్లితో పాటే బిడ్డలు:** భార్యనుకొట్టే మగవాడు పిల్లలను కూడా కొట్టటం అనేది అతి సామాన్యమైన విషయం. ఈ బాధలకు లోనైన పిల్లల ప్రవర్తన సక్రమంగా ఉండదు. బొగోటా (కొలంబియా) లో జరిగిన సర్వేలో పాల్గొన్న స్త్రీలలో 74 శాతం మంది, తమ బిడ్డల ముందే తమ భర్తలు తమను కొట్టినట్లు చెప్పారు. భర్త, భార్యను కొట్టిన 49 శాతం

సందర్భాలలో పిల్లలు కూడా గాయపడినట్లు మరొక సర్వేలో నిరూపితమైంది. శాన్జోజే, కోస్టారికా ప్రాంతాలలో జరిగిన ఒక సర్వేలో 40 శాతం మంది మహిళలు తమ భర్తలు తమనే గాదు, తమ పిల్లలను కూడా కొట్టారని చెప్పారు. టెక్సాస్ ప్రాంతంలో, తమ జీవితకాలంలో ఒక్కసారైనా తమ భర్తల చేతిలో దెబ్బలు తిన్నవారిలో నూరింట 33 మంది తమ భర్తలు పిల్లలను కూడా కొట్టినట్లు చెప్పారు.

తండ్రి కొట్టటం వల్ల శరీరానికి గాయమైతే అది మాసి పోతుంది; కానివారి మనస్సు కయిన గాయం మాత్రం మానదు. ఇది కొత్త విషయం గాదు. మనస్సు గాయపడిన పిల్లలు "తమకు ఇచ్చట రక్షణన్నది లేదు" అన్న భయాందోళనలకు లోనవుతారు. వారు ఉత్తమ పౌరులుగా రూపొందటాన్ని ఈ మానసిక స్థితి నిరోధిస్తుంది. తాము ప్రత్యక్షంగా తండ్రి హింసకు గురిగాని పిల్లలు కూడా తల్లి మీద జరుగుతున్న హింసను చూస్తారు గనుక, దెబ్బలు తిన్న పిల్లలవలె మానసిక వ్యధకు గురవుతారు. ఇలాంటి దిగులుకు లోనయిన వారిలో దుడుకుతనమూ, శిక్షణా రాహిత్యము కనుపిస్తుంది. వీరికి భయంకరమైన కలలు రావచ్చు; విద్యార్జనలో వెనుకబడతారు, రోగిష్ఠులయ్యే అవకాశాలు కూడా అధికంగా ఉంటాయి. పసితనంలో హింసను అనుభవించిన వారిలోనూ లేదా హింసను

రెండవ పట్టిక

ప్రపంచ జనాభాలోని 15-44 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీల అనారోగ్య భారపు టంచనాలు

| అనారోగ్య స్వభావము | రోగ భారం వల్ల వ్యక్తుల జీవిత కాలపరిమాణంలో నష్టమవుతున్న కాలము - కోట్ల సంవత్సరాలలో |
|---|---|
| చూలు, కాన్పుకాలపు అనారోగ్యం వల్ల | 2.90 |
| సెప్సిస్ | 1.00 |
| కాన్పు కష్టంగావటం వల్ల | 0.78 |
| సుఖరోగాలు (హెచ్ ఐ వి గాక) | 1.58 |
| పెల్విక్ ఇన్ఫ్లమేటరీ డిసీజ్ | 1.28 |
| క్షయ | 1.09 |
| హెచ్ ఐ వి | 1.08 |
| హృద్రోగాలు | 1.05 |
| మానభంగము - ఇంట్లో సంభవిస్తున్న స్త్రీ హింస | 0.95 |
| అన్నిరకాల కాన్సర్లు | 0.90 |
| చనుకట్టు కాన్సరు | 0.14 |
| గర్భసంచి కాన్సరు | 0.10 |
| మోటారు వాహన ప్రమాదాలు | 0.42 |
| యుద్ధము | 0.27 |
| మలేరియా | 0.23 |

గమనిక: మానభంగము, స్త్రీ హింస అనేవి రోగాలు గావు. సుఖ రోగాలు, మానసిక రోగాలు, గాయాలు తగలటం వంటి వాటికవి కారణాలుగా ఉంటున్నాయి. మాన భంగము , స్త్రీ హింసలవల్ల స్త్రీ జీవితకాలంలో ఎంత పరిమాణం నష్టమవుతున్నది అన్న విషయ అవగాహన కోసం అంచనాలనిచ్చారు. ఇప్పుడు అధికంగా వస్తున్న క్షయ, హృద్రోగం, ఎయిడ్స్‌కు కారణమవుతున్న హెచ్ ఐ వి సోకటం, కాన్సర్ వంటి రోగాల వల్ల స్త్రీ మోయవలసివస్తున్నంతటి రోగభారాన్ని, మానభంగము, ఇంట్లో అనుభవించవలసి వస్తున్న హింసవల్ల స్త్రీ భరించవలసి వస్తున్నది అన్న విషయాన్ని ఈవివరాలు చిత్రిస్తున్నాయి.

*- వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1993 నుండి.*

ఇతరులు అనుభవించటాన్ని చూసిన వారిలోనూ, వారు పెద్ద వారయిన తరువాత వారిలో హింసాప్రవృత్తి కనుపించే అవకాశాలు అధికంగా ఉంటాయని అమెరికా, కెనడాలలో ప్రచురితమైన పరిశోధనా సాహిత్యం స్పష్టం చేస్తున్నది. (ఈ సూత్రీకరణను అంగీకరించని వారూ ఉన్నారు)

**మాతృ ఆత్మవిశ్వాసభంగం వల్ల బిడ్డలకు పోషణా సంరక్షణా లోపం:** స్త్రీ అనుభవించే హింస , బిడ్డలక్షేమాన్ని పరోక్షంగా ప్రభావితం చేస్తుంది. స్త్రీ విద్యకూ, ఆవిడ బిడ్డల చావు బ్రతుకులకూ ఉన్న ప్రత్యక్ష సంబంధాన్ని ఇంతకు పూర్వమే చూచాం బిడ్డ ఆరోగ్యాన్ని విద్య ఎలా ప్రభావితం చేస్తుంది? అక్షరాస్యత వల్ల ఆరోగ్యాన్ని గురించిన కొత్త విషయాలు గాని, ఆరోగ్యరక్షణా విధానాలు గాని వ్యక్తి లో పెరుగకపోవచ్చు కాని విద్య స్త్రీలో ఆత్మ విశ్వాసాన్ని పాదుగొల్పుతుంది. కుటుంబంలో ఆవిడ హోదా పెరుగుతుంది. "టు పవర్‌ఫుల్ స్ట్రోక్స్ ఫర్ చైల్డ్ సర్వైవల్" అన్న తమ వ్యాసంలో పీటర్ ఏడంసన్ విద్య వ్యక్తిలో ఆత్మ విశ్వాసాన్ని ఎలా పెంచుతుందో వివరిస్తూ, ఇలా చెప్పారు. "ఏఇబ్బంది వచ్చినా. ఇది తన నొసటి వ్రాలని తలవంచే స్వభావాన్ని విద్య అంతం చేస్తుంది: దాని స్థానే ఆత్మ విశ్వాసాన్ని పాదు గొలిపి, సమస్యను పరిష్కరించ వచ్చునన్న ప్రేరణను కలుగుజేస్తుంది.

**మూడవ పట్టిక**

**మానభంగము, ఇంట్లో జరిగే హింసవల్ల ప్రపంచంలోని 15-44 సం॥ల మధ్య వయస్సు స్త్రీలు నష్టపోతున్న జీవితకాలపరిమాణము (కోట్ల సం॥రాలలో)**

| హింసవల్ల స్త్రీ అనుభవించవలసి వస్తున్న అనారోగ్య స్వభావము | 15-44 సం॥ల మధ్య వయస్సుల జీవితకాల పరిమాణంలో అనారోగ్యభారం వల్ల నష్టమైన మొత్తం కాలం కోట్ల సం॥లు | నష్టమైన జీవిత కాలంలో భర్త హింస, లేకమానభంగ చర్యలవల్ల నష్టమయిన భాగపు శాతము |
|---|---|---|
| సుఖరోగాలు (హెచ్.ఐ.వి. ఇందులో లేదు) | 1.58 | 2 |
| హెచ్.ఐ.వి. | 1.06 | 2 |
| గర్భస్రావం | 0.25 | 10 |
| మానసిక వ్యధ లేక రోగము | 1.07 | |
| ఇదే జబ్బు-15-44 సం॥ మధ్య వయసు పురుషులకు | 0.54 | |
| మద్యపాన లోలత్వం | 0.09 | 10 |
| మాదక ద్రవ్య దాసత్వం | 0.11 | 10 |
| దుస్సంఘటన వల్ల సంక్రమించిన భయ విహ్వలత్వము | 0.21 | 60 |
| అనుకోకుండా వ్యక్తి గాయపడటం | 0.67 | 20 |
| ఆత్మహత్య | 0.55 | 30 |
| హత్య | 0.09 | 60 |
| కావాలని గాయపరచటం | 0.12 | 90 |
| మొత్తం | 5.80 | 6 |

గమనిక: మానసిక వ్యధ వల్ల పురుషులకంటే రెట్టింపు రోగభారాన్ని స్త్రీ అనుభవించవలసి వస్తూండటాన్ని ఈ సంఖ్యా వివరాలు చిత్రిస్తున్నాయి.

స్త్రీ, మానసికవ్యధను పురుషుని కంటే అధికంగా అనుభవించవలసి రావటం, భయాందోళనలకు గురి కావటం, ఇతరుల చేతిలో గాయపడటం, హత్యకు గురిగావటం , అత్మహత్యా ప్రయత్నానికి ఒడిగట్టటం - వీటికి, ఆవిడ మానభంగానికి లోను గావటమో, లేక కుటుంబీకుల చేతిలో హింసను అనుభవించవలసి రావటమో ప్రధాన కారణాలుగా ఈ సంఖ్యా వివరాలు నిరూపిస్తున్నాయి.

*- ప్రపంచబ్యాంకు ప్రచురించిన "వరల్డ్ డెవలప్ మెంట్ రిపోర్టు - 1993" లోని అంచనాల ఆధారంతో ఈ పట్టిక రూపొందింది.*

మార్గాంతర మున్నదనీ, సముచిత నిర్ణయాన్ని చేయ వచ్చుననీ, జీవితాన్ని మెరుగు పరచవచ్చుననీ విద్య స్త్రీని ప్రోత్సహిస్తుంది" తల్లిలో పెరిగిన ఆత్మ విశ్వాసం, స్వయంప్రతిష్ఠ పిల్లల ఆరోగ్యాన్ని ఎలా ప్రభావితం చేస్తాయో, భారతదేశం, కమరూన్, ఇండోనేషియాలలో పరిశోధనలను నిర్వహించిన మెర్సియా గ్రిఫిత్స్ స్పష్టంగా వివరించారు. ఆత్మవిశ్వాసము, స్వయం ప్రతిష్ఠ ఉన్న తల్లులు పిల్లల పోషణా విషయంలో స్వతంత్రంగా వ్యవహరించటానికి ప్రయత్నిస్తారనీ, బిడ్డకు, తల్లిపాలు చాలనప్పుడు గాని, బిడ్డ పాలుమరచిన తర్వాతగాని, వారి వయస్సుకు దగిన పోషక పదార్థాలను ఇస్తారు; బిడ్డకు జబ్బు చేయగానే అవసరమైన చికిత్సను చేయించటానికి తాపత్రయ పడతారు. బిడ్డ తనంత తాను తినకపోతే, వారికి యుక్తిననుసరించి తినిపించే ప్రయత్నం చేస్తారు. ఆత్మ విశ్వాసం గల తల్లుల బిడ్డలు సుపోషితులుగా ఉంటారు అని మెర్సియా, వివరించారు.

తల్లియొక్క ఆత్మ విశ్వాసాన్ని గాని, ఇంట్లో ఆవిడ స్వేచ్ఛను గాని భంగపరచే పరిస్థితి ఏర్పడినప్పుడు దాని దుష్ట ప్రభావం బిడ్డ ఆరోగ్యం మీద ప్రతిఫలిస్తుందని స్పష్టమవుతున్నది. ఇంట్లో భర్త చేతిలో అనుభవిస్తున్న హింస, దానికి లభిస్తున్న సామాజికామోదపు ముద్రా, తాను తన ఇంటిలోనే చెల్లని మనిషినన్న విషయాన్ని స్త్రీకి నిరంతరం గుర్తు చేస్తూంటాయి. తనకు ఏ మాత్రం స్వతంత్రం లేనపుడు, భర్త తనను అణిచి వేస్తున్నపుడు తల్లి తన బిడ్డలను ఎలా సక్రమంగా పోషించగలదు? అవసర మైనపుడు సకాలంలో వైద్య చికిత్సను ఎలా చేయించగలదు ?

హింసాపూరిత వాతావరణంలో శిశు పోషణ దెబ్బ తింటుందని పలు పరిశోధనలు ధృవపరచాయి. కర్ణాటక రాష్ట్రంలోని మూడు గ్రామాలకు చెందిన వివాహిత స్త్రీల వివరాలను పరిశోధకులు పరిశీలించారు. భార్య, ఆశించినంత కట్నాన్ని తేలేదన్న కారణంతో గాని , మద్యపానానికి అలవడిగాని భర్త, భార్యను కొడుతున్న కుటుంబాలలోని పిల్లలు పోషకాహార లోపానికి గురవుతున్నట్లు ఈ పరిశీలన వెల్లడించింది. తల్లి హింసకు గురిగాని కుటుంబాలలోని పిల్లల కంటే, ఆవిడ హింసకు గురవుతున్న కుటుంబాలలోని పిల్లలు తక్కువ తింటున్నారనీ, అధికంగా పోషణా లోపానికి గురవుతున్నారనీ పరిశోధకులు గుర్తించారు. భర్త హింసకు గురవుతున్న స్త్రీ ఇంట్లో స్వాతంత్ర్యం లేక తన బిడ్డను సక్రమంగా పోషించుకోలేక పోతున్నట్లు వారు నిర్ధారణ చేశారు. భావితరం వారు ఆరోగ్యపరంగానూ, బలిష్ఠంగానూ, అధికాయుః ప్రమాణము గలవారుగానూ ఉండాలని మనం కోరుకుంటాం. స్త్రీ హింస ఈ లక్ష్య సాధనకు అవరోధంగా నిలుస్తున్నట్లు పై అంశాలు స్పష్టం చేస్తున్నాయి.

## స్త్రీ హింస సృష్టిస్తున్న అనారోగ్య పరిమాణం

ఇటీవల వస్తున్న పరిశోధనా ఫలితాలు, సర్వేల ఫలితాలు, స్త్రీకి హింసను అనుభవించటం వల్ల సంక్రమిస్తున్న శారీరక మానసిక అనారోగ్య పరిమాణాన్ని, స్త్రీలకు అనారోగ్యం సంక్రమించటం వల్ల వైద్య చికిత్సా వ్యవస్థ మోయవలసివస్తున్న భారాన్ని వివరిస్తున్నాయి. ఇటువంటి పరిశోధిత సమాచారం ప్రస్తుతం పాశ్చాత్య దేశాల నుండే అధికంగా వస్తున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాల నుండి లభిస్తున మెడికల్, లీగల్ రిపోర్టులు కూడా ఈ పరిణామాన్ని ధృవపరుస్తున్నాయి.

పరిశోధిత సమాచారం వల్ల లభిస్తున్న హింసా పరిమాణాన్ని క్రోడీకరించి విశ్లేషించ గలిగితే ప్రపంచ వ్యాప్తంగా సంభవిస్తున్న స్త్రీ హింసా పరిమాణమెంతో, అది సృష్టిస్తున్న అనారోగ్య పరిమాణమెంతో స్పష్టమవుతుంది. ప్రపంచ బ్యాంకు 1993వ సంవత్సరంలో ప్రచురించిన "వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1993" మనకు ఈ విషయం మీద కొన్ని అంచనాల నిచ్చింది. అనారోగ్యము, అకాలమరణాలు, వ్యక్తులు వారి జీవితకాల పరిమాణంలో ఎంత భాగాన్ని కోల్పోతున్నది తెలిపే అంచనాలను ఈ రిపోర్టు ఇచ్చినట్లు ఇంతకు పూర్వమే చూచాం. ఈ రిపోర్టు ఇచ్చిన అంచనాలు, స్త్రీలు హింసను అనుభవించవలసి రావటం చేత, మానభంగాలకు, హత్యలకు, ఆత్మహత్యలకు గురవుతూ ఉండటం చేత పోగొట్టుకొన్న ఆరోగ్యప్రదమైన జీవిత మెంతో మనకు తెలియజేస్తున్నాయి. (ఈ వివరాలను రెండవ పట్టికలో చూడవచ్చు.)

అభివృద్ధి చెందిన దేశాలలో మాత్రమే జరుగుతున్న స్త్రీ హింసా పరిమాణాన్నే పరిగణనకు తీసుకొంటే, 15 - 44 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీల ప్రతి ఐదు సంవత్సరాల ఆరోగ్య ప్రదమైన జీవితానికి ఒక్క సంవత్సరం చొప్పున హింసను

అనుభవించటం వల్ల అనారోగ్యానికి గురికావలసి వస్తున్నట్లు తెలుస్తుంది! సంతానవతులు కాగల వయస్సులోని స్త్రీలు హింస మానభంగాల వల్ల మోయవలసివస్తున్న తలసరి అనారోగ్యభారపు పరిమాణాన్ని చూస్తే, ఈ పరిమాణం అభివృద్ధి చెందిన దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ సుమారుగా ఒకటిగానే ఉన్నట్లు కనుపిస్తుంది అభివృద్ధి చెందిన దేశాల స్త్రీల కంటే, అభివృద్ధి చెందుతున్న దేశాల స్త్రీలు అధిక అనారోగ్య భారాన్ని మోస్తున్నారు ఇందువల్ల, హింస, మానభంగాల వల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలలో స్త్రీలు కోల్పోతున్న ఆరోగ్యప్రదమైన జీవిత కాలం, వారనుభవిస్తున్న మొత్తం అనారోగ్య భార పరిమాణమెంత అని చూసినపుడు, అది అభివృద్ధి చెందిన దేశాల స్త్రీలనుభవిస్తున్న దానికంటే తక్కువగా ఉన్నట్లు కనుపిస్తుంది కనుక, అభివృద్ధి చెందుతున్న దేశాలలో జరుగుతున్న స్త్రీ హింస, అభివృద్ధి చెందిన దేశాలలో కంటే తక్కువగా ఉన్నట్లు భ్రమించకూడదు

జనాభా పెరుగుతున్న దేశాలలో, స్త్రీలు తమ ఆరోగ్య ప్రదమైన జీవిత కాలంలో ఐదు శాతాన్ని, హింసా, మాన భంగాలను అనుభవించటంవల్ల కోల్పోతున్నట్లు ప్రపంచ బ్యాంకు అంచనాలు తెలియ జేస్తున్నాయి. చైనాలో, అభివృద్ధి చెందుతున్న ఇతర దేశాలలో కంటే, బాలింత మరణాలు, దారిద్ర్యం వల్ల సంక్రమిస్తుండే రోగాలవల్ల అనుభవించవలసి వస్తున్న అనారోగ్య పరిమాణం తక్కువగానే ఉన్నది. అయినా, ఆదేశంలోని స్త్రీ లు అనుభవిస్తున్న హింసా, మానభంగాల వల్ల సంక్రమిస్తున్న అనారోగ్య భారం, వారి మొత్తం అనారోగ్య భారంలో పదహారు శాతం వరకు ఉంటున్నట్లు ఈ అంచనాలు సూచిస్తున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా, 15 - 44 సంవత్సరాల వయస్సు స్త్రీలు, లింగ పరమైన హింసవల్ల అనుభవించ వలసి వస్తున్న అనారోగ్యభార పరిమాణపు టంచనాను చూచినపుడు, అవి హెచ్.ఐ.వి. / ఎయిడ్స్, క్షయ, కాన్పు కాలంలో వస్తూండే సెప్సిస్, కాన్సరు, హృద్రోగాల వల్ల వారు అనుభవించవలసి వస్తున్న అనారోగ్య పరిమాణానికి దాపులో ఉన్నట్టు స్పష్టమవుతుంది. (మూడవ పట్టికను చూడండి)

స్త్రీ లు హింసకు గురిగావటం వల్ల వారు అనుభవించ వలసి వస్తున్న దీర్ఘకాలిక, స్వల్పకాలిక అనారోగ్య స్వభావాన్ని పరిమాణాలను చూద్దాం

**భర్త, సన్నిహితుల హింస వల్ల సంప్రాప్తిస్తున్న అనారోగ్యం**

భర్త బంధువుల వంటి సన్నిహితులు తమ పైన అమలు జరుపుతూండే హింసవల్ల స్త్రీలు మూడు రకాల అనారోగ్యాన్ని అనుభవించవలసి వస్తున్నది.

1 శారీరక అనారోగ్యము

2 మానసిక అనారోగ్యము.

3 హత్య లేదా ఆత్మహత్య వల్ల మరణ ప్రమాదము

శారీరక అనారోగ్యం: దెబ్బల వల్ల స్త్రీ గాయపడవచ్చు. కండరాలు వాయవచ్చు శరీరం చీరుకు పోవచ్చు. ఇందువల్ల ఆమెకు వర్ణనాతీతమైన శారీరక బాధకు గురవుతుంది. అమెరికా లోని పట్టణ ప్రాంతంలోని ఒక వైద్యశాల యొక్క ఎమర్జన్సీ విభాగంలో చేరుతున్న స్త్రీ పేషెంట్లలో నూటికి 22 నుంచి 35 మందిలో వారు హింసను అనుభవిస్తున్న సూచనలు కనుపిస్తున్నట్లు అమెరికన్ మెడికల్ అసోసియేషన్ 1992 వ సంవత్సరంలో విడుదల చేసిన రిపోర్టు వెల్లడించింది భర్తల చేతిలో దెబ్బలు తింటున్న స్త్రీలలో నూరింట 24 మందికి (నాల్గవ వంతు మందికి) వైద్య చికిత్స అవసరమవుతున్నట్లు టెక్సాస్ ప్రాంతంలో జరిగిన ఒక సర్వే వెల్లడించింది.

స్త్రీ, దెబ్బలు తినటం వల్ల చర్మం గీరుకు పోవచ్చు: కొన్ని సందర్భాలలో తెగి గాయం గావచ్చు. కండ్ల మీద దెబ్బ తగిలినపుడు అవి కమిలి వాయవచ్చు: ఎముకలు విరగవచ్చు; గాయం బయటకు కనుపించకుండా, శరీరం లోపలే నెత్తురు గడ్డ కట్టే స్థితి కూడా ఏర్పడవచ్చు. దెబ్బలు తిన్న వ్యక్తి చూలాలు అయినపుడు, ఆవిడకు గర్భవిచ్ఛిత్తి జరుగవచ్చు. చూపు పోవటం, కీళ్ళు విరగటం వంటి వాటివల్ల శాశ్వత అంగవైకల్యం సంప్రాప్తించవచ్చు; కాల్చటం, కొరకటం, కత్తితో గంట్లు పెట్టటం వంటి దుర్మార్గపు చర్యల వల్ల మచ్చలు పడి, ఆవిడ శరీరం మీద అవి శాశ్వత గుర్తులుగా మిగిలిపోవచ్చు బంగ్లాదేశ్‌లోనూ, లాటిన్ అమెరికా దేశాలలోనూ, స్త్రీ నిరాకరణను అనుభవించిన "ప్రేమికులు", కక్ష తీర్చుకోవటం కోసం ఆవిడ మీద ఏసిడ్ పోసి, కురూపినిగా మార్చే ప్రయత్నాలకు పాల్పడుతున్నట్లు రిపోర్టులు వస్తున్నాయి.

దెబ్బలు తినవలసి వచ్చిన స్త్రీకి, వదలని తలనొప్పి, పొత్తి కడుపులో నొప్పి, వళ్ళు నొప్పులు, యోనికి తరచూ ఇన్‌ఫెక్షన్ వస్తూండటం, నిద్రలేమి, ఆకలి లేకపోవటం వంటివి, జీవితాంతం బాధించేవిగా తయారు గావచ్చు. దెబ్బలు తినని స్త్రీల కంటే, దెబ్బలు తిన్న మహిళలు, అత్యంత బాధాకరమైన శారీరక, మానసిక అనారోగ్యాన్ని అనుభవించవలసి వస్తున్నట్లు, అమెరికాలో 320 మంది మీద, న్యూజీలాండ్‌లో రెండువేల మంది మహిళల మీద జరిగిన సర్వేలు నిరూపించాయి. తిన్న దెబ్బల ఫలితం, వెంటనే తీవ్ర రూపంలో కనుపించక పోయినా, కాలం గడచిన తర్వాత ఆర్థ్ రైటిస్ (కీళ్ళ నొప్పులు), అధిక రక్తపు పోటు, గుండె జబ్బుల రూపంలో కనుపిస్తుందని, అమెరికన్ మెడికల్ అసోసియేషన్ జర్నల్ లో (1992) ప్రచురితమైన ఒక మెడికల్ రిపోర్టు వెల్లడించింది.

ఇలాంటి అభాగ్యుల అనారోగ్యానికి సంబంధించిన మెడికల్ సర్వేలు, రిపోర్టులు అభివృద్ధి చెందుతున్న దేశాలలో చాలా తక్కువగా లభిస్తున్నాయి. అందువల్ల పాశ్చాత్య దేశాలలో కంటే ఈ దేశాలలో స్త్రీ హింస తక్కువగా ఉన్నదని భావించకూడదు. మహిళా సేవా సంస్థలు, పోలీసు శాఖ, వైద్య శాఖల రిపోర్టుల వంటివి, హింసా స్వభావాన్ని, వాటి పరిమాణాన్ని కొంత మేరకైనా వెల్లడిస్తున్నాయి. వీటిని బట్టి ఈ ప్రాంతాల స్త్రీలు అనుభవిస్తున్న బాధల రూపాలను నిర్ణయించవచ్చు; ఫలితాలను అంచనా వేయవచ్చు. షాంఘై నగరంలో ఆరుశాతం మంది స్త్రీలు మరణించటమో, లేక తీవ్రంగా గాయపడటమో జరగటానికి, కుటుంబంలో వారిపై జరిగిన హింసాకాండే కారణమని, ఐక్యరాజ్య సమితి ఎక్స్‌పర్ట్ గ్రూపు సమావేశంలో చైనా ప్రతినిధులు 1986లో వెల్లడించారు. 1994 వ సంవత్సరంలో ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నగరంలో ఒక సర్వేలెన్స్ మూడు మాసాలపాటు జరిగింది. ఒక వైద్యశాలలోని ఎమర్జన్సీ వార్డులకు, చికిత్సకు వస్తున్న వారిలో, కుటుంబీకుల చేతిలో దెబ్బలు తిన్నందువల్ల చికిత్సకు వస్తున్న మహిళలు 27.9 శాతం మంది ఉన్నట్లు ఈ సర్వే నిరూపించింది. పాపూ న్యూగినీలో జరిగిన ఒక సర్వేలో, భర్తల చేతిలోదెబ్బలు తిన్న మహిళలలో 18శాతం మంది, దెబ్బలవల్ల కలిగిన గాయాల చికిత్సకు వెళుతున్నట్లు రుజువైంది. "పాపు న్యూగినీలో మలేరియాకు గురయిన మహిళల స్ప్లీన్ (ప్లీహము) పెద్దదయి ఉంటుంది. ఇలాంటివారు చావటానికి ఒక్క దెబ్బ చాలు" నని, ఆ దేశపు లా కమిషన్‌కు చెందిన క్రిస్టీన్ బ్రాడ్లే అన్నారు.

**మానసిక అనారోగ్యం :** భర్తల చేతిలో దెబ్బలకు గురవుతున్న అధిక సంఖ్యాక మహిళలు, శారీరక బాధల కంటే అధికంగా మానసిక బాధలను అనుభవించవలసి వస్తున్నది. భయం, మానసికాందోళన, అలసట, పోస్ట్-ట్రమాటిక్-డిజార్డర్, నిద్రలేమి, ఆకలి మందగించటం లేక అన్నం తినబుద్ధి కాకపోవటం వంటివి దెబ్బలకు గురయిన వారిని దీర్ఘకాలంగా గాని, జీవితాంతంగాని వేధిస్తుంటాయి. ఇలాంటివారు స్వతంత్రంగా జీవించలేరు, తమంత తాము ఎలాంటి నిర్ణయమూ చేయలేరు. వీరికి, తోడు అవసరం, అండకావాలి. భర్త భార్యకు తిండి తిప్పలు సక్రమంగా అందకుండా చేయవచ్చు; చిల్లిగవ్వ కూడా ఆవిడ చేతికివ్వకుండా పోవచ్చు; పలురకాల మానసిక హింసలకు ఆవిడను గురిచేస్తూ ఉండవచ్చు. ఆస్తి మీద ఆవిడకు అధికారం లేకుండా చట్టపరమైన చిక్కులను తేవచ్చు. ఆవిడను పూర్తిగా నిరాధారినిగా చేయవచ్చు. ఇలాంటి స్థితిలో పడిన స్త్రీ, తాను మోసపోయానని కుమిలి పోతుంది; తాను సర్వస్వాన్ని కోల్పోయానని బాధ పడుతుంది; ఏ క్షణంలో ఏమి జరుగనున్నదోనని భయపడుతూ ఉంటుంది.

ఇలాంటి స్థితిలో బ్రతికే మనిషి ఆరోగ్యం దెబ్బ తినటం ఆశ్చర్యకరమైన అంశం గాదు. అమెరికాలో భర్తల చేతిలో దెబ్బలు తింటున్న మహిళలకు, దెబ్బలు తినని మహిళల కంటే మానసిక చికిత్సకు వెళ్ళవలసిన అవసరం నాలుగు లేక ఐదురెట్లు అధికంగా ఉంటుందనీ, ఇలాంటి వారు ఆత్మహత్యా ప్రయత్నానికి ఒడిగట్టే అవకాశం ఐదురెట్లు అధికమని, ఒక సర్వే తెలియజేస్తున్నది. (స్టార్క్, ఫ్లిట్‌క్రాఫ్టల సర్వే 1991). భర్త చేతిలో దెబ్బలు తింటున్న వారిలో మూడవ వంతు మంది విపరీతమైన మానసిక వ్యధకు గురవుతున్నట్లు, ఇలాంటి వారిలో అధికులు మద్యపానలోలురయ్యే అవకాశాలు అధికంగా ఉన్నట్లు మరొక పరిశోధనా వ్యాసం తెలియజేస్తున్నది. మహిళలు మద్యపానలోలురు గావటానికి అత్యంత ముఖ్య కారణం భర్తల హింసేనని బ్రెండా వి. మిల్లర్ రిపోర్టు చేశారు. మహిళలలో భర్తహింస ప్రారంభంగావటానికి ముందే

మద్యపానపు అలవాటు ఉన్నా (ఇది పాశ్చాత్య దేశాలలో అతి సామాన్యాంశం) భర్తలు వారిని బాధించ నారంభించిన తర్వాతనే వారు మద్యపానలోలురుగా తయారవుతున్నట్లు పలువురు ప్రచురించిన పరిశోధక పత్రాలు, నిర్వహించిన సర్వేల ఫలితాలు నిరూపిస్తున్నాయి

హత్యలు, ఆత్మహత్యలు : భర్త పెట్టే బాధలకు, ఇందువల్ల భార్య నిస్తేజిత గావటానికి, చివరకు ఆవిడ ఆత్మహత్యకు ఒడిగట్టటానికీ, విడదీయరాని సంబంధం ఉన్నట్లు పలు సర్వేలు నిరూపించాయి. అమెరికాలో సంభవించిన పలు సంఘటనలను పరిశీలించిన తర్వాత, "స్త్రీ ఆత్మహత్యకు ఒడిగట్టడానికి ప్రధాన కారణం భర్త బాధించటమేనని" తాము నమ్ముతున్నట్లు స్టార్క్, ఫిట్‌క్రాఫ్ట్ ప్రభృతులు "వయొలెన్స్ ఇన్ అమెరికా : ఎ పబ్లిక్ అప్రోచ్" అన్న వ్యాస సంకలనంలో ప్రచురించిన "స్పౌజల్ అబ్యూజ్" అన్న వ్యాసం స్పష్టం చేసింది. అమెరికా మహిళలలో ఆత్మహత్యా ప్రయత్నానికి ఒడిగట్టే వారిలో నాల్గవ వంతు మంది - అమెరికా పౌరులైన నల్లజాతి వారిలో సగం మంది - భర్తలు బాధిస్తుండటం వల్లనే ఇందుకు పూనుకొంటున్నట్లు ఇవాన్ స్టార్క్ 1984లో నిర్ణయించారు. ఆఫ్రికా, ఒషీనియా, దక్షిణ అమెరికా దేశాలలోని భిన్న సామాజికుల మధ్య డొరొతీ కౌంట్స్ సర్వేలను నిర్వహించారు. అందరివలె వీరు కూడా భర్తల వేధింపే భార్యలను ఆత్మహత్యలకు ప్రోత్సహిస్తున్నట్లు భావించారు. "రాజకీయంగా స్త్రీలు శక్తి హీనులు గనుక, తమ జీవితాన్ని దుర్భరం చేసిన భర్తల మీద కక్ష సాధింపు కోసం తీసుకొంటున్న చర్యగా" భార్యల ఆత్మహత్యా ప్రయత్నాలను వీరు వర్ణించారు; అంతే కాదు, దీనిని ఆయా సమాజాలు ఆమోదిస్తున్నట్లు కూడా రిపోర్టు చేశారు. ఇందుకు ఆధారాలుగా వీరు ఆఫ్రికా, పెరూ, పాపు న్యూగినీ, మెలెనీషియన్ దీవులలోని ప్రజల సాంస్కృతిక సంప్రదాయాలను చూపారు. ఫిజీ దీవులలో నివసిస్తున్న భారతీయజాతి కుటుంబీకులలో కూడా ఆత్మహత్యలు జరుగుతున్నట్లు ఆర్ హెచ్ హెనిన్ రిపోర్టు చేశారు. సంభవించిన ఆత్మహత్యలలో నూరింట నలభయ్యొకటికి భర్తలు భార్యలను వేధిస్తూ ఉండటమే కారణమని సూచించారు.

ఆత్మహత్యా ఫలిత మరణాన్ని ఏదో ఒక సాధారణ మరణంగా మనం పరిగణిస్తూ ఉంటాం. అంతేగాని ఆ వ్యక్తి మరణం వల్ల సమాజం ఎంత నష్టపడుతున్నదో ఆలోచించము ఆవిడ బలవన్మరణం వల్ల, కుటుంబానికీ, సమాజానికి వినియోగపడవలసిన కృషి నిష్కారణంగా అంతరించటాన్ని మనం గుర్తించలేకపోతున్నాం. చైనా దేశంలో, సమాజానికుపకరించవలసిన, స్త్రీల యొక్క ఆరోగ్యప్రదమైన జీవిత కాలంలో నూరింట ముప్పై వంతులు ఆత్మహత్యల మూలంగా నష్టమవుతున్నట్లు ప్రపంచ బ్యాంకు విడుదల చేసిన సమాచారం వెల్లడిస్తున్నది. చైనాలోని గ్రామీణ ప్రాంతంలో బలవద్వివాహ ప్రయత్నాల వల్లా, వధువిక్రయ ప్రయత్నం వల్లా స్త్రీల ఆత్మహత్యలు అధికమవుతున్నట్లు రిపోర్టులు వస్తున్నాయి. శ్రీలంకలో మరణిస్తున్న 15-24 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలలో ఆత్మహత్యల వల్ల మరణిస్తున్న వారి సంఖ్యా పరిమాణం, అంటురోగాల వల్ల మరణించే వారికంటే ఐదు రెట్లు, బాలింత మరణాల కంటే 55 రెట్లు అధికంగా ఉన్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ రిపోర్టులు వెల్లడిస్తున్నాయి.

భారతదేశంలో సంభవిస్తున్న స్త్రీల ఆత్మహత్యలకు కూడా ఇలాంటి కారణాలే ఉన్నట్లు ప్రచురితమైన రిపోర్టులు, సర్వేలు నిరూపిస్తున్నాయి. ఢిల్లీ నగరంలో సంవత్సర కాలం పాటు ఒక సర్వే జరిగింది. ఆ కాలంలో 46 మంది పురుషులు, 54 గురు స్త్రీలు ఆత్మహత్యవల్ల మరణించారు భార్యా భర్తల మధ్య పొత్తు కుదరకపోవటం, లేక భర్తలు, అత్త మామలు ఇల్లాలిని బాధించటం స్త్రీల ఆత్మహత్యలకు ప్రధాన కారణంగా సర్వేయర్లు నిర్ణయించారు. మద్రాసు పోలీసు శాఖవారు 1978లో రిజిస్టరు చేసుకొన్న కేసులను ఒక సర్వేయరు పరిశీలించారు. 15-20 సంవత్సరాల మధ్య వయస్కుల కేసులను వీరు పరిశీలనకు ఎన్నుకొన్నారు. ఆత్మహత్యకు పాల్పడిన వారిలో మూడింట రెండు వంతుల మంది మరణాలకు "భార్యా భర్తల మధ్య సదవగాహనాలోపము, లేదా మద్యపానం, లేక మాదకద్రవ్యాల వాడుకకు భర్త దాసుడు గావటం" కారణాలుగా నమోదయినాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ 1987లో ప్రచురించిన స్టాటిస్టికల్ రిపోర్టు ప్రకారం దాస్‌పూర్‌లో ఆత్మహత్యకు పాల్పడిన వారిలో అధికులు 15-24 సంవత్సరాల మధ్య వయస్కులనీ, భార్యా భర్తల మధ్య కీచులాటలు భార్య ఆత్మహత్యకు కారణమనీ తెలుస్తున్నది.

భార్యను భర్త చంపినా. భర్తను భార్య చంపినా. అందుకు ప్రధాన కారణం భర్త భార్యను బాధిస్తూండటమేనని పలు రిపోర్టులు సూచిస్తున్నాయి. భార్యా భర్తలు ఒకరినొకరు చంపుకోవటానికి కారణం, చాల కాలంగా భర్త భార్యను బాధిస్తూ ఉండటమేనని, అమెరికన్ జర్నల్ ఆఫ్ పబ్లిక్ హెల్త్ పత్రిక ప్రచురించిన ఒక రిపోర్టు (1989) తెలియజేస్తున్నది. భర్తలను చంపిన నేరానికి జైలు పాలయిన మహిళలలో అత్యధిక సంఖ్యాకులు భర్త చేతిలో హింసను అనుభవించవలసి రావటమే హత్యకు ప్రధాన కారణంగా పలువురు పరిశోధకులు అభిప్రాయపడినట్లు కూడా ఈ రిపోర్టు వెల్లడించింది. బ్రెజిల్ దేశంలోని పెర్నెంబుకో రాష్ట్రంలో, 1992వ సంవత్సరంలోని తొలి పదకొండు మాసాల కాలంలోను 415 మంది మహిళలు హత్యకు గురయినారు. వీరిలో నూరింట డెబ్భైమంది, వారికి అతి సన్నిహితులయిన పురుషుల చేతిలో మరణించారు. 1991వ సంవత్సరంలో ఇజ్రాయెల్ లో హత్యకు గురయిన వంద మంది మహిళలలో 42 మందిని వారి భర్తలో, ప్రియులో చంపారు. పాపు న్యూగినీలో, 1979-82 సంవత్సరాల మధ్య కాలంలో హత్యకు గురయిన స్త్రీలలోనూరింట 73 మందిని వారి భర్తలే చంపారు. అమెరికా, కెనడా, పాపు న్యూగినీ వంటి పలుదేశాలలో సంభవించిన హత్యల రీతిని పరిశీలించితే స్త్రీలు పురుషులను చంపిన సంఘటనలు కూడా కనుపిస్తాయి. పలు సంవత్సరాల కాలం పురుషుని చేతిలో బాధలు పడి, విసిగి వేసారి, ఆ బాధానివృత్తికి స్త్రీ ఆత్మ రక్షణార్థం హత్యా ప్రయత్నానికి ఒడిగట్టటమే దీనికి కారణమని పలువురు పరిశోధకులు నిర్ణయించారు.

భర్త భార్యను హింసించటానికి, చివరకు ఆమె మరణానికి కారణం కావటానికి ఉన్న సంబంధం భారత దేశంలో కూడా ధృవపడింది. భార్యలు శరీరం కాలి చావటం, వంటయింటి "ప్రమాదాలకు" లోనయి చావటం వంటి వార్తలు తరచుగా వస్తున్నాయి. కొత్తగా కాపురానికి వచ్చిన యువతిని, అదనపు కట్నం కోసం, టివి, రిఫ్రిజిరేటర్ వంటి ఖరీదయిన విలాస వస్తువుల కోసం భర్త, వారితోపాటు వారి తలిదండ్రులు కూడా బాధించటం అతి సామాన్యమయి పోయింది. ఆ యువతి వంటిమీద కిరోసిన్ పోసి, అగ్గినంటించి, ఆవిడ పొయ్యి వద్ద వంట చేస్తూ ప్రమాదానికి లోనైనట్లు ఆవిడ మరణానికి కారణాల నల్లటం అధికమైనది. 1990 వ సంవత్సరంలో భారతదేశంలో కట్నాల దాహం వల్ల మరణించిన యువతుల సంఖ్య 4,835 వరకూ ఉన్నట్లు ప్రభుత్వ అంచనాలు సూచిస్తున్నాయి. ఇది చాలా తక్కువ అంచనా అని ప్రభుత్వ వర్గాల వారే అంటున్నట్లు గోవింద్ కేల్కర్ ఒక పరిశోధనా వ్యాసంలో (1992) వెల్లడించారు. మహారాష్ట్రలోని పట్టణ ప్రాంతాలలోనూ, బొంబాయి మహానగరంలోనూ, మరణిస్తున్న 15-44 సంవత్సరాల మధ్య వయస్కులయిన మహిళలలో, ప్రతి ఐదుగురకూ ఒక్కరి చొప్పున "ప్రమాదవశాత్తూ చీరకు నిప్పంటుకోవటం వల్ల చనిపోతున్నట్లు" మాలినీ కర్కల్ బొంబాయి నుండి వెలువడుతున్న ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ పత్రికలో ప్రచురితమైన తమ రిపోర్టులో (1985) పేర్కొన్నారు. మరణిస్తున్న 15-24 సంవత్సరాల వయస్సు గల యువతులలో ఇలాంటి మరణాలకు లోనవుతున్నవారు, నాల్గింట ఒక్కరుంటారని కూడా మాలినీ అంచనా వేశారు

## స్త్రీ ఆరోగ్యంపై సెక్సు హింసా, మానభంగ ప్రభావాలు

సెక్సు హింసకుగాని, మానభంగానికి గాని గురయిన స్త్రీ నాలుగు రకాల ప్రమాదాల నెదుర్కొనవలసి రావచ్చు :

1. ఆవిడ మానసిక రోగాలకు గురిగావచ్చు;
2. సుఖరోగాలు సోకే ప్రమాదం వారికుంటుంది;
3. కోరని గర్భధారణ జరిగి శత్రుసంతానాన్ని కనవలసిన దుర్గతి పట్టవచ్చు;
4. బాధితురాలు, కన్యాత్వానికి అత్యంత అధిక విలువలనిచ్చే సమాజపు సభ్యులైయుంటే, ఆవిడ అత్యంత బాధాకరము, అవమానకరమూ అయిన పరిస్థితులను ఎదుర్కొనవలసి రావచ్చు.

**మానసిక రోగాలు :** సెక్సు హింసవల్ల స్త్రీ గాయపడవచ్చు; ఆవిడ విపరీతమైన మానసిక షాక్‌కు గురి కావచ్చు లేక రెండూ జరగవచ్చు. బంగ్లాదేశ్‌లో మానభంగ కేసులమీద ఒక సర్వే 1985లో జరిగింది. మానభంగానికి గురయిన వారిలో నూరింట ఎనభై నలుగురు తీవ్రంగా గాయపడటమో, లేక స్పృహను కోల్పోవటమో, మానసిక రోగాలకు గురిగావటమో, లేక మరణించటమో సంభవించినట్లు సర్వేలో వెల్లడైంది. మానభంగానికి గురయిన స్త్రీలు మానసిక షాక్‌కు గురిగావటంవల్ల, వీరికి పీడకలలు వస్తూంటాయి. విపరీతమైన

మానసిక వ్యధకు గురవుతారు. చేసే పని మీద శ్రద్ధ ఉండదు. విపరీతమైన కోపం వస్తుంటుంది, అవమానభారంతో కృంగిపోతూ ఉంటారు. తమను తాము నిందించుకొంటూ ఉంటారు ఈ దురాగతానికి లోనయిన వారిలో నూరింట 50నుండి 60 మంది వరకూ తీవ్రమైన సెక్సు సమస్యలకు లోనవుతారు సెక్సు అంటేనే వీరికి వణుకుపుడుతుంది సెక్సు సంపర్క కోరిక తగ్గిపోతుంది సెక్సు కార్యంలో సంతృప్తిని పొందలేరు. వారు అనుభవించే వాటిలో ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

మానభంగానికి లోనయినవారు, తమ జీవిత కాలంలో దాని ప్రభావన్నుండి తప్పించుకోలేరని పలు పరిశీలనలు వెల్లడిస్తున్నాయి ఈ దుశ్చర్య వారిని శారీరకంగా, మానసికంగా, నైతికంగా గాయపరచటమే ఇందుకు కారణం అమెరికాలో మానభంగానికి గురిగాని వారికంటే, దానికి ఎరయిన వారు తొమ్మిది రెట్లు అధికంగాను, మానభంగానికి గురిగాకుండా, తీవ్రమైన మానసిక వ్యధకు గురయిన స్త్రీలకంటే, రెండు రెట్లు అధికంగానూ ఆత్మహత్యా ప్రయత్నానికి పూనుకొనే అవకాశాలున్నట్లు డీన్ కిల్‌పాంట్రిక్ తమ పరిశోధనా పత్రంలో (1990) వివరించారు. మామూలుగా మెంటల్ షాక్‌ను అనుభవించిన మహిళల కంటే, సెక్సు హింసవల్ల మానసిక షాక్‌ను తిన్నవారు, దాని ఫలితాలను పలు రూపాలలోను, ఎక్కువ కాలమూ అనుభవించవలసి ఉంటుందని నిపుణులు సూచించారు. ఈ షాక్ దుష్ఫలితాలను ఎక్కువ కాలం అనుభివించే మానసిక రోగులలో మానభంగానికి, ఇతర రకాల సెక్సు హింసలకు గురయిన వారే అత్యధికంగా ఉన్నట్లు, అన్నింటి కంటే మానభంగ ప్రభావం ఈ విషయంలో అధికంగా ఉన్నట్లు కూడా నిపుణులు స్పష్టం చేశారు.

మానభంగానికి గురయిన స్త్రీలు, దానివల్ల సంభవించిన మెంటల్ షాక్ ఫలితాలను తమ జీవిత కాలంలో కొన్ని సంవత్సరాలపాటు అనుభవిస్తున్నట్లు వెద్య పరిశీలనలు ధృవపరచాయి. మానభంగానికి గురయిన వారిలో నూరింట అరవై మందిలో, ఇలాంటి సూచనలు, వారా దురాగతానికి లోనయిన మూడు సంవత్సరాల తర్వాత కూడా ఉన్నట్లు వైద్య పరీక్షలు నిరూపించాయి. విపరీతమైన మానసిక వ్యథ, మద్యపాన లోలత్వం, మెంటల్ షాక్ వల్ల సంభవించిన దుష్ఫలితాలు. మాదక ద్రవ్య వాడకం, ఆందోళన, ఆకలిలేకపోవటం, తిండే అరగనట్లుండటం, వ్యక్తి ప్రవర్తనలో వైవిధ్యం వంటి పది రకాల మానసిక రోగలక్షణాలు మానభంగానికి గురయిన కొన్ని సంవత్సరాల తర్వాత కూడా బాధితులలో కనిపిస్తున్నట్లు వైద్య పరీక్షలు చాటుతున్నాయి మామూలు మానసిక రోగులలో కంటే మానభంగానికి సెక్సు హింసకూ గురయిన వారిలో ఇటువంటి మానసిక రోగాలు రెండు రెట్లు అధికంగా ఉంటున్నట్లు కూడా వైద్య నిపుణులు నిర్ధారణ చేశారు

అవాంఛిత గర్భధారణ : మానభంగ పర్యంలో అవాంఛిత గర్భధారణ సంభవం. మెక్సికోలో మానభంగానికి గురయిన ప్రతి వందమంది స్త్రీలలోనూ 15 నుండి 18 మంది వరకూ గర్భధారణకు గురవుతున్నట్లు శరణాలయాల రికార్డులను బట్టి నిర్ణయించారు. కొరియా. తాయ్‌లాండ్ దేశాల అనుభవం కూడా ఇలాగే ఉన్నట్లుచాలామంది రిపోర్టు చేశారు. ఇలాంటి బాధితులకు ఇతర దేశాలలో లేని వసతులు మెక్సికోలో ఉన్నాయి. మానభంగానికి గురయిన బాధితురాలు, గర్భవిచ్ఛిత్తిని కోరుకున్నపుడు, కోర్టు పనిచేస్తున్న ఐదు రోజుల లోపల అది జరిగిపోవాలని జడ్జి ఆదేశించవచ్చునని చట్టం నిర్దేశిస్తున్నది; కనుక వైద్యశాలలో ఆవిడకు ఇందుకు అవసరమైన చికిత్స నియమిత కాలం లోపల జరిగి తీరాలి కొన్ని దేశాలలో గర్భస్రావానికి, నైపుణ్యం గల వైద్య సదుపాయాలుండవు; ఇవి ఉన్నచోట వాటి ఖర్చులు బాధితుల తలకు మించినవై యుంటాయి. కనుక వాటి ప్రయోజనాన్ని బాధితులుపొందలేరు. ఇందువల్ల వారు రెండు రకాల అవమానాలను భరించవలసి వస్తుంది.

1. మానాన్ని కోల్పోవటం, తద్వారా సమాజం దృష్టిలో "పతిత"గా నిలవవలసి రావటం;

2. నేరస్తుని బిడ్డను (శత్రు సంతానాన్ని) కనవలసి రావటం.

వివాహానికి ముందు స్త్రీ కన్యాత్వం చెడకూడదన్న సంప్రదాయాన్ని కఠినంగా పాటించే సమాజాలలో, మానభంగానికి గురయిన వారి బాధ వర్ణనాతీతంగా ఉంటుంది. ఆఫ్రికా, ఆసియా, మధ్యప్రాచ్య దేశాలలోని చాలా వాటిలో స్త్రీ కన్యాత్వానికి చాలా విలువనిచ్చే సంప్రదాయం ఉంది. ఈ

అంశం మీద విన్సెంట్‌ఫావూ, థెరిజా బ్లాకెట్‌లు బంగ్లాదేశ్‌లో, మానభంగ బాధితుల మీద 1989లోజరిపిన సర్వే, ఆ రంగంలో జరిగిన అత్యుత్తమ సర్వే అన్న పరిగణనను పొందింది. పురుషుని దౌర్జన్యం, హింసల వల్లనే స్త్రీ కన్యాత్వాన్ని కోల్పోయినా (ఇందులోతన తప్పిదమేమి లేకపోయినా), ఆ సంఘటన ఆ వ్యక్తి నైతిక జీవితంలో మాయని మచ్చగా మిగిలిపోతుందనీ, సమాజంలో ఆ వ్యక్తి తన ప్రతిష్ఠను సంపూర్తిగా కోల్పోయినట్లేనని వీరు వివరించారు. మానభంగానికి గురయినందువల్ల గాని, అవివాహితగానే గర్భవతి అయినందుకు గాని, కుటుంబీకుల చేతిలో వారు దెబ్బలు తినవలసి రావటమో, హత్యకు గురి గావటమో, లేక ఆత్మహత్యకు ఒడిగట్టటమో జరిగిన సందర్భాలను పెక్కింటిని ఈ పరిశీలకులు వెల్లడించారు. ఇరవై సంవత్సరాలలోపు వయస్సుగల వివాహిత యువతులలో, ఆత్మహత్య, లేక హత్యవల్లా, దెబ్బలు తినటం వల్లా, అనాగరిక పద్ధతిని గర్భస్రావం చేయించుకోవటం వల్లా మరణించిన వారి సంఖ్య కంటే, అవివాహితల మరణాలు 130 శాతం అధికంగా ఉన్నట్లు కూడా ఈ పరిశీలకులు రికార్డు చేశారు. మానభంగానికి గురయినందుకు, అవివాహితలుగా గర్భధారణను పొందినందుకు యువతులు హింసకు ఎంత పెద్ద యెత్తున గురవుతున్నదీ ఈ వివరాలు చిత్రిస్తున్నాయి. ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నగరంలో మానభంగానికి గురయిన స్త్రీలలో 47.1 శాతం మందిని వారి సమీప బంధువులే చంపివేసినట్లు 1993లో జరిగిన ఒక సర్వే పేర్కొన్నది.

మానభంగానికి గురయిన స్త్రీలు శారీరకంగా మానసికంగా గాయపడటమే గాదు; సెక్సు సంపర్కం వల్ల సంక్రమించగల, ఎయిడ్స్‌తో సహా పలురకాల సెక్సు రోగాలకు లేక సుఖరోగాలకు గురయ్యే ప్రమాదముంటుంది. తాయ్‌లెండ్‌కు చెందిన బాంకాక్ నగరంలో ఒక అనాథ శరణాలయంలో చేరిన బాధితులలో పదిశాతం మందికి, మానభంగానికి గురిగావటం చేత సుఖరోగాలు సోకినట్లు నిర్వాహకులు వెల్లడించారు. అమెరికాలోని వర్జీనియా స్టేట్‌కు చెందిన నార్ఫోక్ నగరంలో 1992వ సంవత్సరంలో జూలై మాసం వరకూ, రేప్‌కు గురయిన స్త్రీలలో సుమారుగా "ఒక డజను మంది"కి, సెక్సు హింసకు గురయిన పిల్లలలో ఇరవై నలుగురకు ఎయిడ్స్ సోకినట్లు, బోనీ డోటిల్ అనే వైద్యుడు ప్రపంచ బ్యాంకు పరిశీలకులకు చెప్పాడట!

### యుక్త వయస్సు రాని వారిపై అత్యాచార ప్రభావం

పిల్లలు, ఇరవై సంవత్సరాల వయస్సు నిండని యువతుల మీద అత్యాచారం జరగటం వల్ల వారు 1. మానసికంగా శారీరకంగా గాయపడతారు; 2. భావి జీవితంలో కూడా రేప్ వంటి అత్యాచారాలకు వారు లోనయ్యే ప్రమాదాలుంటాయి, 3. విరక్తి, నిస్పృహ భావాలతో వీరు మత్తు పదార్థాల సేవనానికి దాసులు గావచ్చు; దుస్సాహస కార్యాలకు దిగవచ్చు; 4 సంతానవతులు కావటానికి తగినంత వయస్సు రాకుండానే గర్భవతులయ్యే అవకాశాలు అధికమవుతాయి

శారీరక, మానసిక అనారోగ్యం : బాలికల మీదా, వయస్సు నిండని యువతుల మీదా అత్యాచారం జరిగినపుడు, ఇలాంటి అత్యాచారానికి గురయిన వారిలో ఐదవ వంతుమంది తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురవుతున్నట్లు అమెరికాలో జరిగిన పలు పరిశోధనలు నిరూపించాయి. ఈ దుష్ఫలితాలు అనేక రూపాలలో కనిపించవచ్చు వీరికి పీడకలలురావచ్చు; అత్యాచార సంఘటన కండ్ల ముందు నిరంతరం మెదులుతూ ఉండవచ్చు; మానసికంగా మనిషి మోడువారి, ఎటువంటి భావ ప్రతిచలనము వారిలో కనిపించక పోవచ్చు సెక్సు విషయంలో సహజంగా ప్రవర్తించే శక్తిని వారు కోల్పోవచ్చు. అమెరికాలోని లాస్ ఏంజిలిస్ నగర ప్రాంతంలో, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్తు వారు ఎపిడెమియోలాజికల్ కాచ్‌మెంట్ ఏరియా సర్వే పేరిట అత్యాచారానికి గురయిన వారిపై శాశ్వత ప్రాతిపదిక మీద సర్వేను నిర్వహిస్తున్నారు. పసితనంలోనే సెక్సుపరమైన అత్యాచారానికి గురయినవారు, ఇలాంటి అత్యాచారానికి గురిగాని వారికంటే ఏదో ఒక మానసిక రోగానికి గురయ్యే అవకాశం రెట్టింపు అధికంగా ఉంటుందని ఈ సర్వే రుజువు చేసింది అత్యాచారానికి గురయిన బాలికలలో 58.6 శాతం మంది మానసిక రోగానికి గురికాగా, అత్యాచారాన్ని అనుభవించని వారు 24 శాతం మంది మాత్రమే మానసిక రోగానికి గురయినారు. తండ్రి చేతిలోనో, మారు తండ్రి చేతిలోనో మానభంగానికి గురయినపుడు, ఈ దుశ్చర్య, దాని దుష్ఫలితం బాధితులను జీవితాంతం పీడించగలదని ఏంజలా

## జెనిటల్ మ్యూటిలేషన్ అంటే ?

స్త్రీల మర్మాంగ వక్రీకరణకు జరిగే ఆపరేషనును జెనిటల్ మ్యూటిలేషన్ అని అంటారు ఫోనీషియన్ల కాలం నుండీ ఇది కొన్ని సమాజాలలో సంప్రదాయంగా వస్తున్నది. హిస్టీరియా, స్త్రీలింగ సంపర్కం హస్త ప్రయోగం వంటి వాటి నివారణకు చికిత్సగా దీనిని 20వ శతాబ్దపు నలభయ్యవ యాభయ్యవ దశాబ్దాలలో ఆధునిక చికిత్సా విధానాలలో తర్ఫీదు పొందిన డాక్టర్లు ఇంగ్లండులో వాడుతూండేవారు

ఇపుడు ఈ సంప్రదాయాన్ని నామ మాత్రంగా అనుసరించేవారున్నారు. దీనిని తీవ్ర రూపంలో అమలు జేసే ఛాందసులూ ఉన్నారు. తీవ్ర రూపంలో జరిగే ఆపరేషన్‌ను జెనిటల్ మ్యూటిలేషన్ అని అంటున్నారు ఈ రకమైన ఆపరేషన్‌లో జననాంగ భాగాలను కొన్నింటిని కోసి తీసివేస్తారు ఇపుడు ఆచరణలో క్లిటోరిడెక్టమీ అని, ఇన్‌ఫిబ్యులేషన్ అని రెండు రకాలున్నాయి.

క్లిటోరిడెక్టమీ . ఈ రకమైన ఆపరేషన్లో జననాంగంలో బయటకు కనుపించే కొన్ని భాగాలను కోసి తీసివేస్తారు ఇలా యోని శీర్షాన్ని (క్లిటొరిస్) కోసి తొలగిస్తారు దీన్ని క్లిటోరిడెక్టమీ అని అంటారు సున్నా సర్కంసిషన్ అని కూడా వ్యవహరిస్తుంటారు. కొంతమంది యోని శీర్షంతో పాటు, యోని ద్వారానికి ఇరువైపులా ఉండే పెదవుల వంటి భాగాలను (లెబియా మినోరాను) తీసివేస్తారు. యోని శీర్షాన్ని పూర్తిగా తీసివేయకపోయినా, స్పర్శకు చురుకుగా స్పందించే భాగాన్ని తొలగిస్తారు. జరుగుతున్న జెనిటల్ మ్యూటిలేషన్ ఆపరేషన్లలో సుమారుగా 85 శాతం మేరకు ఇలాంటివే ఉంటాయి.

ఇన్‌ఫిబ్యులేషన్ : మొత్తం జెనిటల్ మ్యూటిలేషన్లలో ఈ తరగతికి చెందినవి పదిహేను శాతం వరకూ ఉంటాయి. దీన్ని ఫారోనిక్ సర్కంసిషన్ అని కూడా అంటారు. ఈ ఆపరేషన్లో యోని శీర్షాన్ని పూర్తిగా తొలగిస్తారు. లెబియా మినోరాను పూర్తిగా గాని, పాక్షికంగా గాని తొలగిస్తారు. లెబియా మెజోరా మీద (యోని ద్వారానికి వెలుపల సాధారణ చర్మం వంటి నిర్మాణంతో పెదవుల రూపంలో ఉండే భాగాల మీద) కత్తితో గంట్లు పెడతారు ఇపుడు ఈ రెంటినీ కలుపుతూ కుట్లు వేస్తారు, లేదా ఈ రెండు కలసి ఉండటానికి వత్తిడిని కల్పించగల క్లిప్పుల వంటి సాధనాలను వాడతారు.. ఈ భాగాలు కలిసే వరకూ ఈ వత్తిడి ఉండేట్లు చూస్తారు. వీటిని కలిపి కుట్లు వేసేటపుడు మూత్ర విసర్జనకు, రుతుస్రావానికి తగినంత వెడల్పును వదలుతారు. ఆపరేషన్ తర్వాత యోని ప్రవేశ రంధ్రం, అగ్గి పుల తల పట్టేంత గాని, లేదా చిటికెన వేలు పట్టేంత వెడల్పు మాత్రమే ఉంటుంది. సెక్సు సంపర్కానికి ఇక అవకాశం ఉండదు. పెండ్లయిన తర్వాత, సెక్సు సంపర్కానికి తగినంతగా యోని ప్రవేశద్వారాన్ని వెడల్పు చేయటం కోసం మరొక ఆపరేషన్ జరుగుతుంది. కాన్పు కాలంలో బిడ్డ తల వెలికి రావటానికి వీలుండాలి గనుక అపుడు మళ్ళీ ఆపరేషన్ చేస్తారు కాన్పు తర్వాత, భర్తకు కన్యాత్వానుభూతి గలిగించేంత మాత్రమే యోని ద్వారపు వెడల్పుండేట్లు తిరిగి కుట్టి వేస్తారు. ఇలా తరచూ కోతకూ, కుట్లవేతకూ గురవుతూండటం వల్ల ఈ భాగం సజీవచర్మం వలె గాక, ఊనిన చర్మంలా తయారవుతుంది. దీని వల్ల పలురకాల అనారోగ్యాన్ని స్త్రీ జీవితాంతము అనుభవించవలసి ఉంటుంది.

డాక్టర్ నహీద్ తౌబియా వ్రాసిన

"ఫిమేల్‌జెనిటల్ మ్యూటిలేషన్ : ఎ కాల్ ఫర్ గ్లోబల్ ఏక్షన్" అన్న రచన నుండి

## నాల్గవ పట్టిక

### సాలుకు 20 లక్షల మందికి జరుగుతున్న ఫీమేల్ జెనిటల్ మ్యూటిలేషన్

| దేశం | స్త్రీ జనాభాలో దీనికి గురయిన వారి శాతం | దీనికి గురైన మొత్తం స్త్రీల సంఖ్య 1994- అంచనా (లక్షలలో) |
|---|---|---|
| నైజీరియా | 60 | 328 |
| ఈజిప్టు | 80 | 242 |
| ఇథియోపియా | 90 | 239 |
| ఉత్తర సుడాన్ | 89 | 97 |
| కీన్యా | 50 | 68 |
| సోమాలియా | 98 | 45 |
| మాలి | 80 | 43 |
| ఐవరీ కోస్ట్ | 60 | 41 |
| బర్కినా ఫాసో | 70 | 35 |
| ఘన | 30 | 26 |
| సియరా లియోన్ | 90 | 20 |
| చాద్ | 60 | 19 |
| ఎరిట్రియా | 90 | 16 |
| గినియా | 50 | 16 |
| టాంజనీయా | 10 | 15 |
| బెనిన్ | 50 | 13 |
| కమరూన్ | 20 | 13 |
| జయర్ | 5 | 11 |
| టొగొ | 50 | 10 |
| లైబీరియా | 60 | 9 |
| నైజర్ | 20 | 9 |
| సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 50 | 8 |
| సెనెగల్ | 20 | 8 |
| గాంబియా | 89 | 5 |
| ఉగాండా | 5 | 5 |
| ద్జిబౌటి | 98 | 3 |
| గినియా - బిస్సు | 50 | 3 |
| మారిటానియా | 25 | 3 |

సాలుకు సుమారుగా ఇరవై లక్షల మంది ఆడపిల్లలు, యువతులు ఫీమేల్ జెనిటల్ మ్యూటిలేషన్‌కు గురవుతున్నట్లు యునిసెఫ్ సంస్థ నిపుణులు అంచనా వేశారు. యేటా జరుగుతున్న ఈ ఆపరేషన్లలో, నూరింట 75 వంతులు ఈజిప్టు, ఇథియోపియా, కీన్యా, నైజీరియా, సోమాలియా సుడాన్‌లలో జరుగుతున్నాయని వీరు సూచించారు. ద్జిబౌటి, సోమాలియాలలో ఆడపిల్లలలో దాదాపు అందరూ (98 శాతం మంది) దీనికి గురవుతున్నారు !

గత పది సంవత్సరాలుగా ఈ పశుత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్న ఆందోళన సత్ఫలితాల నీయటం కనిపిస్తున్నది. కొన్ని ఆఫ్రికా దేశాలలో ప్రభుత్వాలు అధికారికంగా దీనిని నిషేధించినా, సంప్రదాయవాదులు దీనిని కొనసాగిస్తూనే ఉన్నారు.

*- యునిసెఫ్ సంస్థ ప్రచురణ : ది ప్రొగ్రెస్ ఆఫ్ నేషన్స్ (1996) నుండి*

బ్రౌన్ ప్రభృతులు తమ పరిశోధనా పత్రంలో (1992) నిరూపించారు. సెక్సు అత్యాచార దుష్ఫలితాలు "ఇలా ఉంటాయి" అని స్పష్టంగా చెప్పే అవకాశాలు లేవని, అవి పలురూపాలలో కనిపించవచ్చునని వైద్యులు చెబుతున్నారు. దీని ఫలితాలు మానసికంగా చాలా కాలం కనిపిస్తాయని, అవి తరచూ శారీరక బాధలుగా కూడా కనిపించవచ్చునని చెబుతున్నారు. ఇందుకు ఉదాహరణగా వీరు, చికిత్సకు లొంగని మలుగులలోనొప్పి (క్రానిక్ పెల్విక్ పెయిన్), తలనొప్పి, ఉబ్బసం, జననాంగ సమస్యలను వీరు చూపుతున్నారు. పొట్టలో గ్యాస్ అని, పొత్తి కడుపులోనొప్పని, వైద్యులకు ఫిర్యాదు చేస్తుంటారు. వైద్య పరీక్షల్లో ఇవి ఉన్న ఆధారాలు మాత్రం కనిపించవు. ఇందువల్ల వైద్యులువారిని ఆ బాధల నుండి విముక్తులను చేయలేకపోతున్నారు. బాధితలకు బాధలు తీరకపోగా, వారు వైద్య పరీక్షలకు పెట్టే ఖర్చులు వృథా అవుతుంటాయి. పేదలకిది భరించలేని భారమవుతున్నది.

భావి జీవితంలో అత్యాచార ప్రమాదాలు : తెలిసీ తెలియని వయస్సులోనే సెక్సు పరమైన అత్యాచారానికి గురయిన వారు, భావి జీవితంలో తమను తాము రక్షించుకొనే శక్తినీ, కృతనిశ్చయాన్ని కూడా కోల్పోతున్నారు. తమ జీవిత పరిధి ఏమిటో వారికి తెలియకుండా పోతున్నది.

తమ మీద ఎలాంటి అత్యాచారం జరిగినా, దాన్ని తమ విధివ్రాలుగా భావించి రాజీపడుతున్నారు. చిన్నతనంలోనే సెక్సుపరమైన అత్యాచారానికి గురయినవారు, కాలేజీకి వెళ్ళే దశలో ఇలాంటి అత్యాచారానికి గురయ్యే అవకాశాలు అధికంగా ఉంటాయని మేరీ క్రాస్, టి.యి డెనీరోలు (1990) నిరూపించారు. జాన్ బ్రెయిరి ఒక కమ్యూనిటీలో 1984వ సంవత్సరంలో సర్వే జరిపారు. పసి తనంలో ఎలాంటి హింసకూ గురిగాని వారిలో, వారు పెద్దయిన తర్వాత, 18 శాతం మంది మాత్రమే తమ ప్రియుల చేతిలోనో, లేక భర్తల చేతిలోనో శారీరక హింసకు గురయినారు. కాని, చిన్నతనంలో సెక్సు అత్యాచారానికి గురయినవారు, పెద్దయిన తర్వాత, 49 శాతం మంది వరకూ తమ భర్తల చేతిలోనో, ప్రియుల చేతిలోనో దెబ్బలు తిన్నారని వీరి సర్వే నిరూపించింది. పసితనంలో అత్యాచారానికి గురిగాని వారిలో, పెద్దయిన తర్వాత మానభంగానికి 17శాతం మంది మాత్రమే గురయితే, పసితనంలో అత్యాచారానికి గురయిన వారిలో, పెద్దయిన తర్వాత 68 శాతం మంది మానభంగాన్ని అనుభవించవలసి వచ్చినట్లు 1986లో డి.ఇ.హెచ్. రసెల్ జరిపిన సర్వే (1986) నిరూపిస్తున్నది.

మందుమకు చర్యలు : పసితనంలో సెక్సు అత్యాచారానికి గురయిన వారు యవ్వనంలో అత్యంత మందుమకుతనాన్ని ప్రదర్శించే అవకాశాలున్నట్లు ఇటీవల జరిగిన పలు సర్వేలు నిర్ధారణ చేశాయి. ఇలాంటివారు మాదక ద్రవ్యాల వాడుకకు అలవాటు పడుతున్నారు. మత్తు పదార్థాల వాడుకకు బానిసలవుతున్నారు. పలువురితో సెక్సు సంపర్కానికి పూనుకొంటున్నారు. లైంగిక సంబంధం వల్ల రోగాల సుఖరోగాల నుండి రక్షణకూ, అవాంఛిత గర్భధారణా నివారణకూ అవసరమైన జాగ్రత్తలను కూడా వీరు తీసుకోవటం లేదు. ముఖ్యంగా పసితనంలో సెక్సు అత్యాచారానికి గురయిన మహిళలు అధికంగా మద్యపాన లోలురవుతున్నట్లు పలువురు పరిశోధకులు నిరూపించారు. మద్యపాన లోలత్వం నుండి మహిళలను మరలించే కృషిని జరుపుతున్న కేంద్రాలకు వస్తున్న వారిలో, అందరికంటే, పసితనంలో సెక్సు అత్యాచారానికి గురయినవారే అధికంగా ఉంటున్నట్లు బ్రెండా మిల్లర్ ప్రభృతులు తమ పరిశోధనా పత్రంలో వివరించారు.

తగని వయస్సులో గర్భధారణ : 1992 వ సంవత్సరంలో డెబ్రాబాయర్, డేవిడ్ ఫైన్‌లు వాషింగ్టన్ స్టేట్‌లో ఒక సర్వేను నిర్వహించారు. ఇరవై సంవత్సరాల వయస్సు నిండకుండానే గర్భవతులయిన యువతులను 530 మందిని సర్వేకు ఎన్నుకొన్నారు. వీరి జీవిత సంఘటనల పరిశీలనానంతరం, పసితనంలో సెక్సు అత్యాచారానికి గురిగావటానికీ, ఇరవై సంవత్సరాలు నిండకుండానే సంభవిస్తున్న గర్భధారణలకు అత్యంత సన్నిహిత సంబంధం ఉన్నట్లు వీరు నిర్ణయించారు. అంతేకాదు; అత్యంత సంచలనాత్మక అంశాలను కూడా వీరి సర్వే వెల్లడిస్తున్నది. పసితనంలో సెక్సు హింసకు గురికాకుండా, ఇరవై సంవత్సరాలకు లోపే గర్భవతులయిన యువతుల కంటే, సెక్సు పరమైన అత్యాచారానికి గురయిన వారు, ఒక సంవత్సరం ముందుగానే లైంగిక సంపర్కానికి దిగారు; మాదక ద్రవ్యాల

వాడుకకు. మద్యపానానికి వీరిలో అధిక సంఖ్యాకులు అలవాటు పడ్డారు; గర్భనిరోధక సాధనాల వాడుకలో నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తున్నారు; వీరి భర్తలు లేక ప్రియుల చేతిలో అధికంగా దెబ్బలు తింటున్నారు; డబ్బునో, మాదక ద్రవ్యాలనో ఇచ్చిన వారితోనో, నిలువనీడ నిచ్చినవారితోనో లైంగిక సంపర్కానికి ఇష్టపడుతున్నారు అమెరికాలో యువతులు లైంగిక సంపర్కాన్ని ప్రారంభించే సగటు వయస్సు 16.2 సంవత్సరాలుగా ఉన్నట్లు నిర్ధారించారు. కాని పసితనంలోనే సెక్సు అత్యాచారానికి గురయిన వారిలో సెక్సు సంపర్కానికి దిగుతున్న వారి సగటు వయస్సు 13.8 సంవత్సరాలే ఉంటున్నట్లు కూడా వీరు నిరూపించారు. చిన్నప్పుడు సెక్సు అత్యాచారానికి గురిగాని యువతులలో 49 శాతం మంది తొలి సెక్సు సంపర్కంలో గర్భనిరోధక సాధనాలను వాడుతూంటే, అత్యాచారానికి గురయిన వారిలో 28 శాతం మంది మాత్రమే ఇలాంటి జాగ్రత్తలను తీసుకొంటున్నట్లు కూడా సర్వేయర్లు సూచించారు.

### స్త్రీల ఆరోగ్యంపై జెనిటల్ మ్యూటిలేషన్ ప్రభావం

ఫిమేల్ జెనిటల్ మ్యూటిలేషన్‌ను ఫిమేల్ సర్కంసిషన్ అని కూడా వ్యవహరిస్తారు. ఈ రకమైన ఆపరేషన్‌కు గురయిన మహిళలు బాధాకరమైన అనారోగ్య ఫలితాలను అనుభవించవలసి ఉంటుంది. ఇన్‌ఫిబ్యులేషన్ జరిగినవారు ఇలాంటి బాధలను తీవ్రస్థాయిలో అనుభవిస్తారు. సియోరా లియోన్‌లో ఈ ఆపరేషన్‌కు గురయిన మహిళలలో నూరింట 83 మందికి దీనివల్ల సంభవించిన దుష్ఫలితాలకు చికిత్స అవసరమైనట్లు 1988వ సంవత్సరంలో జరిగిన ఒక సర్వే వెల్లడించింది. క్లిటొరిడెక్టమీగాని, ఇన్‌ఫిబ్యులేషన్ గాని చేయించుకొన్న వారికి వచ్చే కొన్ని బాధలు ఒకే రకంగా ఉంటాయి (ఈ ఆపరేషన్ విధానాలను, ఇతర వివరాలను బాక్సులో చూడవచ్చు). యోని శిర్షం (క్లిటోరిస్) యొక్క రక్తనాళాల నుండి అధికంగా రక్తం స్రవించిపోవటం, ఇన్‌ఫెక్షన్, మూత్ర విసర్జనకు అంతరాయం గలగటం, ఆపరేషన్‌కు వాడిన సాధనాలను స్టెరిలైజ్ చేయక పోవటం వల్ల టెటనస్ రావటం, లేదా రక్తం విషపూరితం గావటం వంటి వాటికి ఇందుకు ఉదాహరణలుగా చెప్పవచ్చు (ఈ ఆపరేషన్‌కు గాజుముక్కను గాని, మంగలి కత్తినిగాని, చాకు (నైఫ్) ను గాని వాడతారు). ఆపరేషన్ జరిగే ముందు, నొప్పి తెలియకుండా ఉండటానికి ఎనస్తీషియాను ఇవ్వకపోవటం వల్ల, చిన్న పిల్లలు షాక్‌కు గురవుతారు.

జననాంగానికి సంబంధించిన కొన్ని భాగాలను తొలగించినప్పటి కంటే, ఇన్‌ఫిబ్యులేషన్ జరిగినవారు దీర్ఘకాలిక బాధలకు లోనవుతారు. ఇన్‌ఫిబ్యులేషన్‌లో ఎక్కువ భాగము కోతకు గురవుతుంది; పైగా కుట్లు కుడా వేస్తారు గనుక, అధిక రక్త స్రావం జరిగే అవకాశాలుంటాయి; ఇన్ఫెక్షన్ వచ్చే అవకాశం కూడా ఎక్కువగా ఉంటుంది. యోని ద్వారపు వెడల్పును తగ్గించే విధంగా కుట్లు వేస్తారు గనుక, రుతు స్రావానికి, మూత్ర విసర్జనకు అంతరాయం యేర్పడుతుంది. మూత్రనాళానికి తరచూ ఇన్ఫెక్షన్ వచ్చే అవకాశాలుంటాయి; మూత్రాశయంలోగాని, మూత్ర విసర్జనా నాళంలో గాని రాళ్ళు ఏర్పడవచ్చు; రుతుకాలంలో వెన్ను నొప్పి వస్తుంటుంది; రుతు క్రమం తప్పుతుంది; సంతానోత్పత్తికి వినియోగపడే అవయావాలకు (రిప్రొడక్టివ్ ట్రాక్టు) తరచూ ఇన్ఫెక్షనుకు గురవుతూ ఉంటుంది. సంభవించగల ప్రమాదాలలో ఇవి కొన్నిమాత్రమే. ఈ ఇన్ఫెక్షన్ వల్ల కొన్ని సందర్భాలలో స్త్రీ సంతానోత్పత్తి శక్తిని కోల్పోవచ్చు వీలయినంత అధిక సంతానాన్ని కనాలని కోరుకొనే భర్త ఇటువంటి ఇల్లాలికి తారసపడితే ఆవిడకు గృహబహిష్కారం తప్పకపోవచ్చు; ఇది తప్పినా నిత్యం తన్నులు, తిట్లు మాత్రం తప్పవు.

ఇన్‌ఫిబ్యులేషన్ చేయించుకొన్న మహిళ బాధ, చక్రంలా పునరావృత మవుతూ ఉంటుంది. సెక్సు సంపర్కానికి తగినంత వెడల్పుగా యోని ద్వారం ఉండదు గనుక, వివాహనంతరం, కోసి దానిని తగినంత వెడల్పు చేయాలి. కాన్పు సమయంలో బిడ్డ బయటకు వచ్చే వీలుండదు గనుక, తిరిగి ఆపరేషన్ చేయాలి కాన్పు తర్వాత మళ్ళీ కుట్లు వేస్తారు. ఇలా ప్రతి కాన్పుకూ కోయటం కుట్టటం జరగాలి. యోని ద్వారం వెడల్పు తగినంత ఉండనపుడు, సెక్సు సంపర్క సమయంలో స్త్రీ బాధను అనుభవించక తప్పదు. ఇందువల్ల ఆవిడ శారీరకంగా బాధపడటమే గాక, సంపర్కమంటేనే వణికిపోయే స్థితికి వెళుతుంది. కాన్పు సమయంలో తల్లికీ, బిడ్డకూ కూడా ప్రమాదం సంభవించే అవకాశాలుంటాయి. సోమాలియాలోని ఒక వైద్యశాలలో ఇన్‌ఫిబ్యులేషన్ చేయించుకొన్న 33 మంది చూలాండ్ర కాన్పును వైద్యులు పరిశీలించారు. తల్లి గర్భం నుండి బిడ్డ వెలికి రావటానికి ఆపరేషన్‌చేయవలసి వచ్చింది.

కాన్పు సమయంలో రెండవ దశలో నొప్పులు రావటానికి. ఇలాంటి ఆపరేషన్ చేయించుకోని వారి కంటే, వీరికి ఐదురెట్లు ఎక్కువ కాలం పట్టింది. వీరిలో ఐదుగురి బిడ్డలు చనిపోయారు కాన్పు కష్టమయి, బిడ్డ బయటకు రావటానికి అంతరాయం ఏర్పడటం వల్ల 21 కేసులలో బిడ్డకు ప్రాణవాయువు అందని ప్రమాదం ఏర్పడింది. బాలింతలలో చాలా మంది. కాన్పు తర్వాత, యోని ద్వారపు వెడల్పు తగ్గింపుకు కుట్లు వేయించుకొన్నారు ఇలా ప్రతి కాన్పుకు కోయటం, కుట్లు వేయటం చేస్తూండటం వల్ల, అచ్చట చర్మం మొద్దుబారి బిరుసెక్కుతుంది

క్లిటొరిడెక్టమీ చేయించుకొన్ని వారికి, ఇన్‌ఫిబ్యులేషన్ చేయించుకొన్న వారి కున్నన్ని బాధలు ఉండకపోయినా, కొన్ని సమస్యలు వీరికీ ఉండకపోవు వీరిలో చాలా మందికి, ఇన్ఫెక్షను వచ్చే అవకాశాలుంటాయి: నొప్పి ఉంటుంది: రక్తస్రావం సంభవించవచ్చు, కోతకు గురయిన భాగాలు కొన్ని చోట్ల చీము పట్టవచ్చు. వీరు కూడా విపరీతమయిన మానసిక బాధలకు గురయ్యే అవకాశాలుంటాయి. ఇవి వారిని జీవితాంతం వెంటాడుతూ ఉండవచ్చు వీరి మానసిక సంక్షోభం ఎలా ఉండేది తెలుసుకొనటానికి జరిగిన సర్వేలు చాలా తక్కువగా ఉన్నాయి. సుడాన్‌లో ప్రఖ్యాత సంఘసేవికగా పేరొందిన సర్జన్ డాక్టర్ నహీద్ తౌబియా ఇలాంటి పేషెంట్ల బాధలను, మనోభావాలను చక్కగా గుర్తించగలిగారు. వృత్తి రీత్యా వీరు వైద్యులు ఈ సమస్య మీద తాను వ్రాసిన "జెనిటల్ మ్యూటిలేషన్ ఎ కాల్ ఫర్ గ్లోబల్ ఏక్షన్" అన్న పుస్తకంలో బాధితుల బాధలను వివరిస్తూ "పేషెంట్లు తమ శారీరక బాధలను గురించి చెబుతారు; కాని ఆ బాధా స్వభావాన్ని వివరించలేరు వారు విపరీతమైన మానసిక వ్యధను అనుభవిస్తున్నట్లు కనిపిస్తారు" అని చెప్పారు. అమెరికాలో మానభంగాలకు, ఇతర రకాల సెక్సు హింసలకు గురయిన బాధితులవలె నిస్తేజంగా వీరు కనిపిస్తారని వర్ణిస్తూ, ఒక సందర్భంలో ఇలా వ్రాశారు : ".. (సుడాన్‌లోని) బాధిత మహిళలు వేల సంఖ్యలో గైనకాలజీ డిపార్టుమెంటుకు వస్తుంటారు మలుగుల్లో ఏదో బాధగా ఉన్నదని, అది చాలా కాలంగా ఉన్నదని చెబుతారు . స్పష్టంగా దానిని వివరించలేరు. ఇలాంటి పేషెంట్లను డాక్టర్లు, వైద్యశాల సిబ్బంది "న్యూరోటిక్స్‌గా" పరిగణిస్తారు. విసుక్కొంటూరు పేషంట్ల బాధకు కారణం వైద్య పరీక్షలలో కనిపించకపోవటంతో, తమ సొమ్ము, కాలము వృథా అవుతున్నట్లు వైద్యశాల యాజమాన్యం పరిగణించుకొంటూ ఉంటుంది గంటల తరబడీ విన్నా, వారు తమ బాధలను వివరిస్తూనే ఉంటారు అలసటగా ఉన్నదంటారు నిద్ర లేదు. వెన్ను నొప్పి, తలనొప్పి ఉన్నదని చెబుతారు. మలుగుల్లో ఏదో ఒత్తిడిగా ఉన్నదని చెబుతారు: మానసికంగా వీరు కృశించినట్లు కనుపిస్తారు: వారి కంఠస్వరం నూతిలో గొంతుకలా వినిపిస్తుంది. మాటలతో వర్ణించలేని మూగబాధ వారిలో ఉన్నది. ఇది వారు సహాయాన్ని, అండనూ కోరుతూ చేసే మూగవాని ఆక్రందనవలె ఉంటుంది వారి విశ్వాసాన్ని పొందగలిగేట్లు మనం మాట్లాడగలిగితే. వారికి మూగదనం పోయి మాటలొస్తాయి: సెక్సు సంపర్కమంటే హృదయం తల్లడిల్లుతున్నదంటారు: తరచూ జననాంగాలు ఇన్ఫెక్షన్‌కు గురవుతూ ఉండటం వల్ల, గొడ్రాలనవుతానన్న భయం వారిలో కనిపిస్తుంది. తరచూ జననాంగాలకు ఇన్ఫెక్షన్ వస్తూండటం వలన, వాటికి ఏమిగానున్నదోనని భయపడిపోతుంటారు తాము ఆరోగ్యప్రదంగా ఉన్నామో లేమో నన్న విషయం వారికే తెలియని స్థితిలో ఉంటారు".

వైద్య వృత్తిలో నున్న వారెవ్వరూ, ఈ ఆపరేషను చేయారాదని హెచ్చరిస్తూ, 1982వ సంవత్సరంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ ఒక ప్రకటనను విడుదల చేసింది. అనేక సాంఘిక సంక్షేమ సంస్థలు కూడా ఇటువంటి విజ్ఞాపనలను చేశాయి. 1991వ సంవత్సరంలో బర్కీనా ఫాసోలో సంప్రదాయ విధానాల పాటింపు మీద ఐక్యరాజ్య సమితి నిర్వహించిన మానవ హక్కుల సదస్సుకు హాజరయిన ప్రతినిధులలో చాలమంది, వైద్యులు డబ్బును ఆశించి, వైద్యశాలలో సర్కంసిషన్ ఆపరేషన్‌లను చేస్తున్నట్లు వెల్లడించారు. తర్ఫీదు పొందిన వైద్యులు ఈ ఆపరేషన్లను చేయటం వల్ల దాన్ని చేయించుకొన్న మహిళలకు కొన్ని బాధలు తప్పవచ్చు. కాని, అనవసరంగా అవయవాలను కోసి తీయటం, కుట్టటం వంటివి మానవహక్కులను వమ్ము చేయటంగా భావించవలసి ఉంటుంది. కెయిరో ఫామిలీ ప్లానింగ్ అసోసియేషన్ నాయకురాలు అజీజా కమీల్ ఈ విషయం మీద మాట్లాడుతూ ఒక సందర్భంలో ఇలా చెప్పారు: "వైద్య వృత్తిలోనివారు

జెనిటల్ మ్యూటిలేషన్ ఆపరేషన్లను చేయటం వల్ల, దానికి, మరి దేనివల్లా లభించనంతటి బలం, చట్టబద్ధతా లభిస్తున్నది ఈ ఆపరేషన్‌ను ఖండించవలసిన వైద్యులే, దానిని వైద్యశాలల్లో చేయనారంభిస్తే, ఈ పద్ధతిని తొలగించే అవకాశాలే ఉండవు డాక్టర్ల కున్న మర్యాదా, అర్హతలు, అధికారాలు ఈ దుష్ట సంప్రదాయానికి సంక్రమిస్తాయి; దీనిని వ్యతిరేకించే సంఘసేవకులు తమ నిజాయితీని కోల్పోయే ప్రమాదం ఏర్పడింది "

## వైద్య చికిత్సా వ్యవస్థ మీద స్త్రీ హింసా ప్రభావం

హింస స్త్రీల ఆరోగ్యాన్ని చెడగొట్టటమే గాదు, సామాజికారోగ్యాన్ని కూడా దెబ్బతీస్తుంది ప్రపంచ స్త్రీలు అనుభవిస్తున్న అనారోగ్య భారంలో ఆరవవంతు వరకూ వారు అనుభవిస్తున్న హింసా ఫలితమేనని ప్రపంచ బ్యాంకు అంచనాలు తెలియ జేస్తున్నాయి. ఈ అనారోగ్య నివారణకు, బాధితులు సొమ్ము ఖర్చు చేయాలి; ఇప్పటికే చాలీ చాలకుండా ఉన్న నిధులతో నడుస్తున్న వైద్య చికిత్సాలయాల మీద అది అదనపు భారాన్ని వేస్తుంది. స్త్రీ, హింసను అనుభవించే అవకాశమే లేకపోతే, హింసా ఫలితంగా వారనుభవిస్తున్న అనారోగ్యానికి చికిత్స చేయవలసిన అవసరమే ఉండదు; స్త్రీలు కూడా ఆరోగ్యంగా ఉంటారు. వారి సేవలు కుటుంబానికి, సమాజానికి ఉపకరిస్తాయి. అమెరికాలోని ఒక ఆరోగ్య సంస్థ అంచనాల ప్రకారం, స్త్రీకి సంక్రమించే ఇతర రకాల అనారోగ్యం కంటే, ఆవిడ అనుభవిస్తున్న హింసా ఫలితంగా ఎక్కువ సార్లు వైద్య చికిత్సకు వెళ్ళవలసి వస్తున్నట్లు స్పష్ట మవుతున్నది. ఈ సంస్థ అధ్యయనంలో తేలిన ప్రధానాంశాలివి:

- మానభంగానికి గురిగాకుండా గాని, కుటుంబీకుల చేతిలో దెబ్బలు తినకుండా గాని ఉన్న మహిళ వైద్య చికిత్సకు సాలుకు 161 డాలర్లు మాత్రమే ఖర్చు చేయగా, పై దురాగతాలకు ఎరయిన స్త్రీ 401 డాలర్లు ఖర్చు చేయవలసి వస్తున్నది;

- హింసకు గురయిన స్త్రీ చికిత్సా ఖర్చులు రెండవ సంవత్సరంలో ఎక్కువయినాయి, నాలుగు సంవత్సరాల తర్వాత కూడా ఆవిడ ఆరోగ్యం కుదటబడలేదు,

- హింసకుగాని, మానభంగానికి గాని గురయిన మహిళలు తాము ఆరోగ్యంగా ఉన్నట్లు భావించరు. ఏదో అనారోగ్యం తమను పీడిస్తున్నట్లు భావిస్తూ ఉంటారు. చర్మము, కండ్లలో తప్ప, శరీరంలోని మిగిలిన అన్ని చోట్లా ఏదో బాధగా ఉన్నట్లు చెబుతారు. కొన్ని రకాల ప్రమాదకరమైన పనులు చేయటానికి కూడా సాహసిస్తారు

1991వ సంవత్సరంలో డా॥ వి.జె.ఫిలిట్ అధ్యయనాన్ని ఒక మెడికల్ జర్నల్ ప్రచురించింది. పసితనంలో సెక్సు హింసకు గాని, మానభంగానికి గాని గురిగాని వారిలో ఆరు శాతం మంది మాత్రం సంవత్సరానికి పదిసార్లకు మించే డాక్టరు సలహాకు, చికిత్సకు వెళ్ళారు; ఇలాంటి హింసకు ఎరయిన వారిలో 22 శాతం మంది సాలుకు పది సార్లకు మించి వైద్య చికిత్సకు వెళ్ళినట్లు ఈ అధ్యయనం సూచించింది. సెక్సు హింసకు గురయిన మహిళలు దీనికి ఎరగాని వారికంటే మూడు రెట్లు అధికంగా మానసిక చికిత్సకు వెళుతున్నట్లు లాస్ ఏంజలిస్‌లో జరిగిన మరొక సర్వే తెలియజేస్తున్నది. హింస వ్యక్తిలో మానసిక వ్యధను పెంచి, వారి సృజనాత్మక శక్తుల ప్రదర్శనను నిరోధిస్తున్నట్లు కూడా ఇది వివరించింది

స్త్రీలనుభవిస్తున్న అపార హింసా పరిమాణాన్ని, హింసా రూపాలను, స్త్రీల జీవితం మీదా, సామాజిక, ఆర్థిక వ్యవస్థల మీదా అది కలిగించగల దుష్ట ప్రభావాలను చూచాం. హింసా ప్రవృత్తికి సంబంధించిన పూర్వాపరాలనూ, హింస నుండి స్త్రీలను రక్షించవీలున్న మార్గాలను గురించి తరువాతి అధ్యాయంలో చూద్దాం.

# 17

## కన్నీటి కడలి నుండి కోమలి ఉద్ధరణకు కొన్ని మార్గాలు

కుటుంబంలో జరిగే స్త్రీ హింసకు పలు కారణాలను చెబుతుంటారు వీటిని స్థూలంగా మనం రెండు రకాలుగా వర్గీకరించవచ్చు : 1. కుటుంబంలోని వ్యక్తుల - ముఖ్యంగా భార్యా భర్తల - అభిరుచుల, ప్రవర్తనలోని వైరుధ్యము, కుటుంబ జీవన విధానము, 2. కుటుంబీకులు నివసిస్తూండే సమాజపు నిర్మాణ స్వభావము; దాని సంస్కృతి ఈ కారణాలలో స్త్రీ హింసకు ఏవి ఎంత మేరకు కారణమవుతున్నాయో చూద్దాం.

భార్యాభర్తల ప్రవర్తన, స్వభావాలకు సంబంధించిన కారణాలు హింసకు దారిదీస్తాయని కొందరు సోషియాలజిస్టులు అభిప్రాయ పడుతున్నారు. మద్యపానానికి, మాదకద్రవ్య వాడుకకు పురుషులు అలవాటుపడి ఉండటం, హింసాపూరిత వాతావరణంలో పసితనం నుండీ వారు పెరిగి ఉండటం, మానసికరోగ పీడితులైయుండటం, ఆత్మనిగ్రహశక్తి వారిలో లోపించటం - వీటిని హింసకు కారణాలని అంటున్నారు. స్త్రీ, పురుషుని రెచ్చగొట్టటం వల్ల అతడు హింసా ప్రేరితుడవుతున్నాడు; అందువల్లే ఆవిడ అతని చేతుల్లో హింసను అనుభవించవలసి వస్తున్నది. హింసించే భర్తలంటే కొందరు స్త్రీలకు మోజనీ, వారొక రకంగా దానికి అలవడ్డారని చెబుతున్నారు ఈ విధంగా భార్య హింసను బలపరచే వారు, నిరుద్యోగము, దారిద్ర్యము, వ్యక్తిగత వైఫల్యాలు, తమ అభివృద్ధికున్న ఆటంకాలు, వారి జాతి, వర్గ, మానసిక స్వభావాలు మొదలైనవి పురుషులు స్త్రీలను హింసించటానికి కారణాలుగా చెబుతున్నారు

ఇంట్లో జరిగే స్త్రీ హింసకు ఈ కారణాలను రెండవ వర్గం వారు ఆమోదించటం లేదు. సమాజ నిర్మాణంలోనే దీనికి మూలకారణమున్నదని వారు చెబుతున్నారు. భర్త భార్యను హింసించటం వ్యక్తిగత విషయం గాని, కుటుంబ వ్యవహారంగాని కాదంటూ, సమాజంలో నెలకొన్న లైంగిక, ఆర్థిక అసమానతల ప్రతిబింబంగా వీరు హింసను వర్ణిస్తున్నారు. ఈ సూత్రం ప్రకారం భర్త, భార్యను హింసించటం, అతనిలోని బలహీనతలు కారణంగావు; "పురుషున కన్నా స్త్రీ తక్కువది," "ఆవిడ విలువలేని మనిషి," "పురుషునితో సమానమైన గౌరవాన్ని పొందే అర్హతలు ఆవిడకు లేవు" అన్న పురుషుని భావమే ఇందుకు కారణం. భార్యను భర్త హింసించటాన్ని మనం సామాజిక దృష్టితో చూడాలి.

"స్త్రీ పురుషునికి లొంగి జీవించాలి; కుటుంబంలో కలతలు అకురించినపుడు, స్త్రీ హింస జరగటం సహజం" అన్న సూత్రాన్ని ఈ సమాజం ఆమోదిస్తున్నది ఆరోగ్యం, పోషణ, విద్య, ఉపాధి విషయాలలో స్త్రీ తీవ్రమైన లింగ వివక్షకు గురవుతున్నది. సాంఘిక, రాజకీయ జీవితంలో ఆవిడకు ప్రాతినిధ్యమే లేదు ఆర్థికంగానూ, లీగల్‌గాను స్త్రీలు పురుషులకు లొంగి ఉండాలి, వారి మీద ఆధారపడి జీవించాలి. భర్తకు భార్య లొంగి ఉండటాన్ని, భార్యను భర్త హింసించటాన్ని సమాజం ఆమోదిస్తున్నది. అంతేకాదు, అది అతని వ్యక్తిగత వ్యవహారంగానూ, కుటుంబ విషయం గానూ పరిగణిస్తున్నది; బయటివారి జోక్యాన్ని సమాజం గర్హిస్తున్నది. ఒకవేళ ఎవరయినా జోక్యం కలిగించుకొంటే వారు "రాజీ" మాత్రమే చేయాలి; ఇద్దరినీ కలిసుండమని చెప్పాలి. ఈ సమస్యను ఏ వంక నుండి చూచినా, స్త్రీని భయపెట్టి, లొంగదీసుకొనే పురుష ప్రయత్నంగానే, హింస కనుపిస్తుంది.

పలుసర్వేలు, పలువురు పరిశోధకులు ప్రకటించిన హింసాకారణాలను పరిశీలిస్తే, వాస్తవం వెలుగులోనికి వస్తుంది.

మద్యము, మాదక ద్రవ్యాల వాడకం: మత్తు పదార్థాల వాడకానికి, భర్తలు భార్యలను హింసించటానికి మధ్యనున్న సంబంధం మీద జరిగిన పరిశోధనలు తక్కువగా ఉన్నాయి. ఇంతవరకూ వెలువడిన పరిశోధనలు లేక సర్వేల సమాచారం ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేయటంలేదు లండన్‌లో భర్తల హింసకు గురయిన స్త్రీల మీద జరిగిన రెండు సర్వేలూ ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేయటం లేదు. ఒక సర్వేలో భర్తలు తాగినపుడు తమను కొడతారని 93 శాతం మంది ఇల్లాండ్రు చెప్పగా, రెండవ సర్వేలో 40 శాతం మంది మాత్రమే ఇలాంటి సమాధానాన్నిచ్చారు. అమెరికాకు చెందిన న్యూ హాంప్‌షైర్‌లో జరిగిన ఒక సర్వేలో, భర్త చేతిలో దెబ్బలు తిన్న వారిలో 48 శాతం మంది మాత్రమే, తాగిన స్థితిలో భర్తలు తమను కొట్టినట్లు చెప్పారు. వేరొక సర్వేలో, ఇరవైరెండు శాతం మంది స్త్రీలు మాత్రమే తమ భర్తలు తాగి ఉన్న స్థితిలో తమను హింసించినట్లు చెప్పారు. ఇలాంటి సర్వేలు ప్రధానంగా అభివృద్ధి చెందిన దేశాల నుండే లభిస్తున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఇలాంటి సమాచారం చాలా తక్కువగా లభిస్తున్నది.

మద్యపానానికి, హింసకూ సంబంధం ఉన్నదని కనుపిస్తూనే ఉన్నది. ఇచ్చట మనం పరిశీలించవలసి ఉన్నది, భార్యను కొట్టటం మీద భర్త తాగుడు ప్రభావం ఎంత ఉన్నది అన్న అంశం. పురుషులు తాగటంలో తేడాలున్నాయి. కొందరు అపుడపుడూ తాగుతారు, మరికొందరు రోజూ తాగుతారు; మరికొందరు దానికి దాసులవుతారు. తాగటంలో ఇన్ని గ్రేడ్లున్నాయి. ఏ గ్రేడులోని వారు భార్యను కొడుతున్నారు అని ఇంతకు పూర్వమే సర్వే జరిగిన చోట తిరిగి సర్వే జరిపిస్తే, ఇంతకు పూర్వము లభించిన ఫలితాలే వస్తాయని చెప్పలేము. భార్యలను కొట్టే వారిలో అధికులు తాగుడుకు దాసులైన వారని సర్వేలు సూచిస్తున్నాయి కొంతమంది తాగినపుడు భార్యలను కొట్టటమేగాకుండా, తాగనపుడు కూడా ఎందుకు కొడుతున్నారు? భార్యలను కొట్టనివారు ఎందరో తాగటం కనుపిస్తూంటుంది; తాగని వారి కుటుంబాలలోనూ స్త్రీహింస జరుగుతూనే ఉంటుంది. తాగే వారిలో స్త్రీలు కూడా ఉన్నారు. తాగిన నిషాలో ఉన్నపుడు వీరు భర్తలను గాని పిల్లలను గాని కొడుతుండటం కనుపించదు.

దీనిని బట్టి భర్త మద్యపాన ప్రభావం వల్లే భార్యను కొడుతున్నాడు అని చెప్పటానికి ఆధారం లేదు మద్యపానము, భార్యను హింసించటం అనేవి సహజీవనం చేస్తున్నాయి అని చెప్పవచ్చేమో. భార్యను కొట్టదలచిన భర్త మద్యపాన ప్రభావం వల్ల భార్యను కొట్టినా, నిషాదిగిన వెంటనే తన పశ్చాత్తాపాన్ని ప్రకటిస్తాడు. ఇప్పటికి మన కందుతున్న పరిశోధిత సమాచారం, మత్తు పదార్థాలను వాడటానికి అలవడిన పురుషులు భార్యలను కొడతారు అని తెలియజేస్తున్నది. మత్తు పదార్థాల ప్రభావం క్రింద ఉన్నారు గనుకే, వారు తమ భార్యలను కొడుతున్నారు అని మాత్రం ఈ సమాచరం సూచించటం లేదు. భార్యలను కొట్టదలచిన భర్తలు తాము వారిని కొట్టటానికి సాకుగా చూపటానికే తాగుతున్నారని భావించక తప్పటం లేదు.

స్త్రీ హింసకు అలవడిన కుటుంబంలో వ్యక్తి పుట్టి పెరగటం: వ్యక్తి తాను పుట్టిన కుటుంబంలో హింస జరగటాన్ని చూచి ఉండవచ్చు; లేదా హింసను అనుభవించి ఉండవచ్చు. చిన్న తనంలో తమ తలిదండ్రులు లేక కుటుంబీకుల చేతిలో హింసననుభవించినవారు కూడా, పెరిగిన తర్వాత హింసాపరులుగా మారే వీలున్నదన్న అభిప్రాయం కూడా ఉన్నది. చిన్న తనంలో కుటుంబంలో హింసను ఎరుగని వారి కంటే, ఈ హింసను చూచినవారు భార్యను కొట్టే

అవకాశాలు మూడురెట్లు, ఆయుధంతో వారిమీద దాడి చేసే అవకాశం పదిరెట్లు అధికంగా ఉంటుందని స్ట్రాస్ ప్రభృతులు అమెరికాలో జరిపిన సర్వే ఫలితాల ఆధారంతో అంచనా వేశారు. తన తండ్రి తల్లిని కొట్టటాన్ని, చిన్నతనంలో చూచిన వ్యక్తి తానుకూడా తన భార్యను కొడతాడని గాని, లేక తల్లిదండ్రుల చేతిలో హింసను అతడు అనుభవించి ఉంటే తానూ తన భార్యను హింసిస్తాడని గాని, హింస చక్రంలా చలిస్తూ వంశపారంపర్యంగా వస్తుందని గాని చెప్పటానికి ఆధారాలు లేవు. కనుక ఈ విషయం మీద పరిశోధన మరింత వాస్తవికంగా, లోతుగా జరగాలన్న అభిప్రాయం బలంగా ఉన్నది.

రెచ్చగొట్టే భార్య మనస్తత్వం : భార్య ప్రవర్తన భర్తను రెచ్చగొట్టేదిగా ఉండటం వల్ల ఆవిడ భర్త చేతిలో హింసకు గురవుతున్నది అన్నది మరొక అభిప్రాయం. భర్తమీద పెత్తనం చేయాలనే స్వభావం స్త్రీలో సహజంగా ఉంటుంది. తన చుట్టూ భర్తను తిప్పుకోవాలనే ఆవిడ కోరుతుంది. కయ్యానికి కాలు దువ్వటం స్త్రీలకు వెన్నతో బెట్టిన విద్య అని చెప్పేవారు కూడా లేకపోలేదు.

ఇటువంటి లక్షణాలు స్త్రీలలో ఉండవచ్చు కాని, ఇలాంటి లక్షణాలు స్త్రీలందరిలోనూ ఉంటాయని చెప్పటానికి వీలులేదు అనే వారూ ఉన్నారు. ఇంగ్లండులో జరిగిన ఒక సర్వేకు, తమ భర్తలకు విడాకులిచ్చి, మరొకరిని చేసుకొన్న 42 మంది స్త్రీలను ఎన్నుకొన్నారు. తన ప్రస్తుత భర్త తనను కొడుతున్నట్లు వీరిలో ఒక్కరు కూడా చెప్పలేదు; వీరి మాజీ భర్తలు రెండవ వివాహం చేసుకొన్న తర్వాత కూడా, పూర్వపు భార్యను హింసించినట్లే, కొత్తవారిని కూడా హింసిస్తున్నట్లు రుజువైంది. "భార్య అతిగా మాట్లాడినా, మాట్లాడక పోయినా, సెక్సీగా ఉన్నా, లేకపోయినా, పొదుపును పాటించినా పాటించకపోయినా, ఎక్కువ మంది పిల్లలను కన్నా, కనక పోయినా వీటిలో ఏదైనా భర్తను రెచ్చగొట్టగలదు. భర్త కోరికలకు అనుగుణంగా మసలటం, వారి పెద్దరికానికి తలవంచటం చేయనపుడు భార్య దండనకు గురవుతుందని చెప్పవచ్చు."

భార్య దెబ్బలు తింటూంటే ఆవిడ చర్యల వల్లే హింస ప్రజ్వలించినదని అనుకోవటం భ్రమ మాత్రమే. హింసకు కారణమైన భర్తను వదలి, ఆ నేరాన్ని బాధితురాలైన భార్యకు అంటగట్టటమే అవుతుంది. ఇది అన్యాయం.

మానసిక రోగాలు : పురుషుడు చేతగానివాడు, ఒక నిర్ణయానికి త్వరగా రాలేని వాడు, సెక్సుపరంగా సమర్థుడూ గానప్పుడు, అతని భార్య దురుసుగా, మగవాడివలె వ్యవహరించజూసినప్పుడు భర్త హింసకు దిగుతాడన్న భావం ఉన్నది. మానసిక రోగంతో బాధపడే భర్తలు భార్య హింసకు పూనుకొంటారు అని అనేవారూ ఉన్నారు. ఇది అతి కొద్ది సందర్భాలలో మాత్రమే నిజం. స్త్రీ హింసకు ఇది కారణమే గాదు అన్నది బహుజనాభిప్రాయం.

విసుగు, విరక్తి: భర్త అనుభవించవలసి వస్తున్న విసుగు, అతనిలో అంకురించిన విరక్త భావము, భార్యను హింసించటానికి అతనిని ప్రోత్సహించవచ్చునని కొందరు సిద్ధాంతీకరించారు. ఉదాహరణకు బ్రిటిష్ అసోసియేషన్ ఆఫ్ సోషల్ వర్కర్స్ 1975లో ఒక తీర్మానాన్ని చేసింది. ఆ తీర్మానంలోని ఈ భాగాన్ని చూడండి.

"కార్మికుని ఆర్థిక పరిస్థితులు, అల్ప వేతనాలు, అనువుగాని నివాసవసతి, ఇంట్లో మితిమీరినంత మంది ఉండవలసి రావటం, ఏకాకిగా వర్కరు ఉండవలసి రావటం, అనుకూలంగా లేక, పనంటేనే విరక్తి గలిగించే పని పరిస్థితులు, స్కూలు చదువును పూర్తి చేసివచ్చే వారికి ఉద్యోగ వసతి లభించే అవకాశాలుండకపోవటం, వర్కర్ల పిల్లలకు డేకేర్ సదుపాయాలు ఉండకపోవటం, తగినట్లుగా రవాణా వసతి లేకపోవటం, వర్కర్ల పిల్లలకు విశ్రాంతికి, ఆడటానికి తగిన వసతులు లభించకపోవటం వంటివి వర్కర్లలో నిస్పృహ, విసుగు అంకురించటానికి దారిదీస్తాయి. ఇంట్లో జరిగే హింసకు ఇది కారణం గావచ్చు."

వ్యక్తి ఎపుడయితే ఆర్థిక పరిస్థితుల వత్తిడికి గురవుతాడో, నిస్పృహ నిరాశలకు ఎరవుతాడో అపుడు అతనిలో హింసా ప్రవృత్తి ప్రకోపిస్తుందన్న భావాన్నిది ప్రకటిస్తున్నది. ఆర్థికంగా బలహీన వర్గాలవారు ఇలాంటి ఇబ్బందులకు గురవుతూ ఉంటారు గనుక, వీరే భార్యలను హింసిస్తుంటారు. భార్య హింస అనేది ఈ వర్గానికే పరిమితమన్న ధోరణికిది దారి తీస్తున్నది. ఆర్థిక, సాంఘిక కారణాలే భార్య హింసకు

పురుషుని పురికొల్పుతాయి అనేవారు, ఇలాంటి వత్తిడులకు, ప్రతికూలతలకు లోనవుతున్న వారంతా భార్యలను ఎందుకు హింసించటం లేదో చెప్పలేక పోతున్నారు! అన్ని వసతులూ ఉన్నవారు కూడా స్త్రీలను ఎందుకు హింసిస్తున్నారు?

దేశం అభివృద్ధి చెంది ఉండక పోవటం : ఇంత వరకూ, అభివృద్ధి చెందిన దేశాలలోని స్త్రీ హింసమీదే మనకు అధిక సమాచారం లభిస్తున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఈ పరిశోధనలు తగినంతగా విస్తరించటం లేదు. కొందరు సోషియాలజిస్టులు, దేశం అభివృద్ధి చెంది ఉండకపోవటం స్త్రీ హింసకు కారణంగా చెబుతున్నారు. చిలీ, నైజీరియా, కీన్యా, ఈజిప్టు, బంగ్లాదేశ్‌లలో ఈ విషయం మీద జరిగిన అధ్యయనాలు కొన్ని ఈ ధోరణిని ప్రదర్శిస్తున్నాయి. అభివృద్ధి చెందని దేశాలలో, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాలుండవు; పేదరికం ఉంటుంది; ప్రజలు పలురకాల అన్యాయాలకు గురవుతూ ఉంటారు, అందుచేత అభివృద్ధి లేమి, ప్రజలలో హింసా ప్రవృత్తిని పెంచుతుంది అని చెబుతున్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో భార్యాహింసను నిరోధించే కట్టుబాట్లు కొన్ని ప్రాంతాలలో ఉన్నాయి. అభివృద్ధి పురోగమిస్తున్న కొలదీ ఈ కట్టుబాట్లు సడలిపోతున్నాయి; క్రమంగా అంతరిస్తున్నాయి. గ్రామ ప్రాంతాల నుండి పట్టణాలకు ప్రజల వలస ప్రారంభమైంది. పట్టణాలలో జనాభా త్వరితగతిని పెరగటం వల్ల, వలస వచ్చిన అధిక జనాభాకు అవసరమైనంతగా వసతుల కల్పన జరగటం లేదు. వసతుల లేమివల్ల అనుభవించవలసి వచ్చే ఇబ్బందులేగాక, సరియైన జీవనోపాధి లభించకపోవటం, ఉపాధి లభించినా, వచ్చే ఆదాయం పొట్టబోసుకోవటానికి చాలీచాలకుండా ఉండటం వంటివి కూడా మనిషిలో హింసా ప్రవృత్తిని ప్రేరేపిస్తున్నాయి. కుటుంబంలోని బలహీనురాలైన భార్య ఈ హింసకు గురవుతున్నది అని చెబుతున్నారు.

ఇంతకు పూర్వమే, పైన చెప్పిన వాదానికిదొక శాఖ మాత్రమే. ఇందులో కొత్తదనం ఏమీలేదు. వసతుల లేమికి గురయి, అల్పాదాయాల వల్ల జీవనం గడవటం కష్టంగా ఉండే వారంతా భార్యలను ఎందుకు హింసించటం లేదు అనే ప్రశ్న ఈ సందర్భంలో కూడా ఉదయించటం సహజం. అంతేకాదు; అభివృద్ధి చెందిన దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, సంపన్న వర్గాల కుటుంబాలలోనూ, ఉన్నత పదవులను నిర్వహిస్తున్న వారి కుటుంబాలలోనూ భార్య హింస ఎందుకు కనుపిస్తున్నది? కనుక భార్య హింస అనేది దిగువ వర్గాల వారికి (లోక్లాస్ వారికి) మాత్రమే పరిమితమై లేదు; అన్ని వర్గాల వారిలోనూ అన్ని దేశాలలోనూ, ఇది ఉన్నది. ఇది సర్వాంతర్యామి.

సంస్కృతి - సంప్రదాయం : కొన్ని సమాజాలలో స్త్రీ హింస జరగటానికి సంస్కృతీ-సంప్రదాయాలను కారణాలుగా చూపుతున్నారు. భార్యను ఎంతగా కొడితే, భర్త ఆవిడను అంతగా ప్రేమిస్తున్నట్లు లెక్క అన్న సంప్రదాయం ఆఫ్రికాలో ఉన్నట్లు కొన్ని సర్వేలు సూచిస్తున్నాయి. భార్య ఈ "బహుమతిని" ఆశిస్తుంది; అది లభించనపుడు నిరాశా నిస్పృహలకు గురవుతుందట! భార్యకు దెబ్బలు పడటం అవసరమన్న మాట!

దక్షిణ ఆసియా దేశాలలోని కొన్నింటిలో భారతదేశంలో వలె వరకట్న సంప్రదాయం ఉంది. విలాస వస్తువులకు ఆకర్షితులయిన మగపెండ్లివారు, వీటిని పరుల సొమ్ముతో దండుకోవాలన్న తాపత్రయంతో అధిక కట్నాల వసూలుకు ఆడపెండ్లివారిని వత్తిడి చేస్తారు. పెండ్లయిన తర్వాత, తాము కోరిన అదనపు కట్న-కానుకలను పుట్టినింటి నుండి తెమ్మని వధువును వేధించనారంభిస్తారు. ఈ వేధింపులు, హింసా, వధువు హత్యకో, ఆత్మహత్యకో దారిదీస్తున్నాయి.

పెండ్లి చేసుకొన్నవారంతా ఇలా అధిక కట్నాలకు భార్యలను వేధించటం లేదు గదా అన్న ప్రశ్న ఇచ్చట కూడా ఉదయించటం సహజం.

కుటుంబ నిర్మాణంలోనే ఉన్న అసమానత: పైన పేర్కొన్న ప్రతికారణం, అనుబంధ ప్రశ్నలకు అవకాశాల నిస్తున్నది. అంతిమ సమాధానాన్నివ్వలేక పోతున్నది. పైన పేర్కొన్న రోగ కారణాల నివారణకు ఉపశమన వైద్యం ఉన్నదిగాని, శాశ్వతంగా కుదిర్చే చికిత్స కనుపించటం లేదు. అందువల్ల సోషియాలజిస్టులలోని కొందరు ఆలోచనా పరులలో సంశోధన ప్రారంభమైంది. కుటుంబంలో స్త్రీ హింసకు మూలకారణమేమిటో విచారించటానికి వీరు ప్రయత్నించసాగారు. భర్త, బయటకు కనుపించే ఏ కారణంతో

భార్యను కొట్టటానికి పూను కొంటున్నా, అతని అంతిమధ్యేయం ఆవిడను తన చెప్పుచేతలలో ఉంచుకొనే లక్ష్యసాధనకే అది జరుగుతున్నట్లు మనకు స్పష్టమవుతున్నది భార్యా భర్తృత్వ సంబంధాలలో తనది పై చేయిగా ఉండాలన్నదే పురుషుని తాపత్రయం స్త్రీ హింసకు పురుషుడు చూపే కారణాలలో ఈ సూత్రం. ఈ లక్ష్యం పూసల్లో దారంలో నడుస్తూ ఉంటుంది భర్త సంతృప్తికి అతను చెప్పినట్లు ప్రవర్తిస్తూ కూడా. తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటానికి స్త్రీ ఎపుడయినా ప్రయత్నిస్తే. అపుడు పురుషాధిక్యత పడగ విప్పుతుంది పురుషాధిక్యతా భావం త్రాచుపామంత చురుకుగా పనిచేస్తుంది. దీనిని బట్టి, స్త్రీ హింసకు మూల కారణం కుటుంబ నిర్మాణ విధానంలోనే ఉన్నదని స్పష్టమవుతున్నట్లు వీరు గ్రహించారు భార్యను హింసించే భర్త చర్యలను బలపరుస్తూ, దాన్ని వ్యక్తిగత వ్యవహారంగా గుర్తిస్తూ, ఆ పరిధిలోనికి పరుల ప్రవేశాన్ని నిషేధిస్తున్న సమాజం, ప్రస్తుత కుటుంబ నిర్మాణాన్ని అంగీకరించటమే గాదు; దాన్ని బలపరుస్తున్నది కూడా. అందువల్ల ".. భార్యను హింసించటం, పురుషుని అసహజ లక్షణం కాదు, దాని వేర్లు సమాజ నిర్మాణంలోనూ, కుటుంబ నిర్మాణంలోనూ ఉన్నాయి, సామాజిక సంస్కృతీ - సంప్రదాయాలలోనూ, సమాజంలోని లింగ వ్యవస్థలోనూ ఉన్నాయి."

ఈ వాదాన్ని కొందరు స్కాలర్లు - మరికొంచెం ముందుకు తీసుకుపోయారు. "ఆర్థిక, సాంఘిక, రాజకీయ కారణాలన్నీ కూడి, కుటుంబంలో స్త్రీ ఆర్థిక పరిస్థితిని అత్యంత నిస్సహాయ స్థితికి నెట్టివేశాయి; కుటుంబంలో ఆవిడ స్థితిని ముల్లుమీది అరిటాకులాగా చేశాయి. పురుషుని ముందే కాదు, ఆఖరుకు రాజ్యాంగ యంత్రం ముందు కూడా నిస్సహాయవలె నిలుచుండవలసి వస్తున్నది. ఇందువల్లనే, ఇంట్లో ఇల్లాలు ఎంతటి హింసకు, అవమానాలకు గురవతున్నా, సమాజం, దానికి కారకుడయిన భర్త చర్యలనే సమర్థిస్తున్నది. కుటుంబాన్ని పురుషుని ఆస్తిగాను, స్త్రీ హింసను కుటుంబ వ్యవహారంగాను, లేదా వ్యక్తిగత వ్యవహారంగానూ ఇది అంగీకరిస్తున్నది" అని చెబుతున్నారు.

ఇటీవల పలు సమాజాలలో జరిగిన సర్వేలు, పరిశీలనలు ఈ అభిప్రాయాన్నే ప్రకటిస్తున్నాయి. డేవిడ్ లెవిన్ సన్. ప్రపంచములోని నలభై సమాజాల నుండి, స్త్రీహింసకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి, హింసను ప్రోత్సహిస్తున్న కారణాలేమిటి అని పరిశోధించారు ఈ పరిశోధనా ఫలితాలను 'వయొలెన్స్ ఇన్ క్రాస్-కల్చరల్ పర్స్పెక్టివ్' అన్న పేరిట 1988లో పుస్తకంగా ప్రచురించారు. సమాజంలో హింసాప్రవృత్తి ప్రకోపించటానికి నాలుగు కారణాలను వీరు సూచించారు .

1 స్త్రీ పురుషుల మధ్య నున్న ఆర్థిక అసమానతలు.

2. హింసద్వారా వివాదాల పరిష్కార ధోరణి సమాజంతో నెలకొని ఉండటం;

3 కుటుంబంలో పురుషాధిక్యతా చలామణి. అన్ని విషయాలలోనూ నిర్ణయాధికారం గుత్తగా తనకే ఉండాలని పురుషుడు తాపత్రయపడటం.

4 స్త్రీలు విడాకులు పొందటానికున్న తీవ్రమైన అవరోధాలు కుటుంబ ఆర్థిక వనరుల మీద గుత్తాధికారాన్ని పురుషుడు చేజిక్కించుకోవటం, విడాకులను స్త్రీ తాను కోరినపుడు పొందలేకపోవటం అనేవి స్త్రీ హింసకు అత్యంత బలమైన కారణాలుగా వీరు నిర్ణయించారు.

స్త్రీ హింసను ప్రోత్సహిస్తున్న కారణాలను తొలగిస్తే తప్ప ఆవిడకు రక్షణ లభించదు. ఇది సమాజాన్నే సంస్కరించటం అవుతుంది. ఇది తక్షణమే సాధ్యమయ్యే విషయం కాదు కనుక ఇప్పటికున్న వసతులను స్త్రీ హింసా నిరోధానికి వినియోగించుకోక తప్పదు. స్త్రీల రక్షణకు కొన్ని చట్టాలు ఉన్నాయి. పౌరరక్షణకు చట్టాలు, కోర్టులున్నాయి; పోలీసు వ్యవస్థా, వైద్య వ్యవస్థా ఉన్నాయి. ఈ సాధనాలను మనం ఉపయోగించుకోవచ్చు.

స్త్రీ హింసను సంప్రదాయం గానూ, కుటుంబ వ్యవహారాలను ప్రైవేట్ విషయాలుగా భావించి, ఈ విషయాలలో ఇతరుల జోక్యాన్ని అనుమతించని సమాజం కన్నబిడ్డలే ఈ వ్యవస్థలు. బాధితలను రక్షించలేక సంప్రదాయ ప్రతిఘటన ముందు ఇవి ఎలా నామమాత్రావశిష్ట మవుతున్నాయో చూద్దాం.

### రక్షణ లభించని బాధితలు

గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో దళిత

కుటుంబానికి చెందిన ఇల్లాలిని స్థానికులు కొట్టి నందుకు, విద్యావంతురాలైన ఆవిడ కూతురు పోలీసు స్టేషన్లో రిపోర్టు నిచ్చింది. ఆ కొట్టిన వారు దీనికి కోపించి, ఆ పిల్లను సామూహికంగా మానభంగం చేయటమే గాకుండా, మద్రాసు నగరంలో పలుచోట్లకు తిప్పి, పలుసార్లు అత్యాచారాన్ని చేశారు. స్థానిక పోలీసులు, రిపోర్టు ఉన్నా, కలుగజేసుకోక పోవటం వల్ల, రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు సిబిఐ దర్యాప్తుకు ఆదేశించారు! (హిందూ - 31.5.96)

పంజాబు రాష్ట్రంలో ఒక వ్యక్తి, 1987లో స్త్రీని చెరచటమే గాకుండా ఆవిడను హత్య కూడా చేశాడు. క్రింది కోర్టు, ఆఖరుకు హైకోర్టు కూడా బలమైన సాక్ష్యాధారాలున్నా, అతనిని నిర్దోషిగా తీర్పు నిచ్చాయి. హతురాలి బంధువొకరు, సుప్రీంకోర్టులో అప్పీలు చేయగా, ఆ న్యాయస్థానం నిందితుడు నేరం చేసినట్లు రుజువులున్నాయంటూ, అతనికి యావజ్జీవ కారాగారవాస శిక్షను విధించింది. హైకోర్టు, నేరం రుజువు గానందున, కేసును డిస్మిస్ చేస్తున్నట్లు ఒక్క వాక్యపు తీర్పు నివ్వటాన్ని సుప్రీంకోర్టు బెంచి పేర్కొన్నది. న్యాయ స్ఖాలిత్యాన్ని ఆలస్యంగానైనా దిద్దగలిగినందుకు బెంచి సంతృప్తిని ప్రకటించింది. ప్రాసిక్యూషన్ వద్ద బలమైన సాక్ష్యాధారాలున్నా, కేసును సుప్రీంకోర్టులో అప్పీలు చేయనందుకు పంజాబు ప్రభుత్వాన్ని సుప్రీంకోర్టు బెంచి మందలించింది. మహిళా హక్కులను గూర్చి సర్వత్రా చెబుతూ, ఆవిడ ఆత్మ గౌరవ రక్షణకు ఏమీ చేయలేకపోవటం బాధాకరమైన అంశంగా సుప్రీంకోర్టు బెంచి పేర్కొన్నది. "స్త్రీకి తన శరీరం మీద తనకున్న హక్కును, మానభంగం చేసిన వ్యక్తి అపహరిస్తున్నాడు; అంతేగాదు; నిస్సహాయురాలైన ఆవిడ ఆత్మను కూడా హరించి, ఆవిడను అథఃపతనానికి నెడుతున్నాడు అన్న విషయాన్ని మనం మరువ రాదు" అని జడ్జిమెంటు వ్యాఖ్యానించింది.

కుమారి బన్వారీ దేవి అనే విలేజ్ లెవెల్ వర్కరును (రాజస్థాన్ ప్రభుత్వోద్యోగి) ఐదుగురు నిందితులు మానభంగం చేశారు. బాల్య వివాహాలకు వ్యతిరేకంగా పనిచేస్తూండటం వల్ల ఆవిడ వీరి ఆగ్రహానికి గురైంది. గ్రామస్థులకు ఇది యదార్థమని తెలుసు. అయినా న్యాయమూర్తి మాత్రం నమ్మలేదు! మానభంగం జరుగలేదనే మెడికల్ రిపోర్టును నమ్మారు. అంతేకాదు; నిందితులలో ఒకరైన బ్రాహ్మణుడు దళిత మహిళా సంపర్కానికి పూనుకోడు, అది అతని "పవిత్రతను" భంగపరుస్తుందన్న డిఫెన్సు వాదనను జడ్జి నమ్మారు. కుమారి బన్వారీ ఆరోపణలు "భారతీయ సంస్కృతికీ, మానవ మనస్తత్వానికీ పూర్తిగా వ్యతిరేకమైనవి" అని జడ్జి నమ్ముతూ, నిందితులు నిర్దోషులని 1995వ సంవత్సరం నవంబరు మాసంలో తీర్పు నిచ్చారు.

1995వ సంవత్సరం మే మాసంలో, హర్యానా రాష్ట్రంలోని పడనా అనే గ్రామంలో ఒక స్కూలు విద్యార్థిని మూక ఉమ్మడి మానభంగానికి గురైంది. ఆ బాలిక సోదరుడు, గ్రామంలోని ఒక యువతిని లేవదీసుకు పోగా, దానికి ప్రతీకారంగా, లేచిపోయిన బాలిక తండ్రి, ఇద్దరు బంధువులూ, బాధితురాలిని తమ ఇంటికి ఈడ్చుకు పోయి మానభంగం చేశారు. ఈ దుష్కార్యానికి, లేచిపోయిన బాలిక తల్లి కాపలాదారుగా పని చేసింది. మానభంగ ప్రయత్నమే జరిగింది గాని, మానభంగం జరుగలేదు అని మెడికల్ రిపోర్టు పేర్కొన్నది. పైగా బాధితురాలి వంటి మీద గాయాలు లేవు గనుక, ఎడిషనల్ సెషన్స్ జడ్జి నిందితులను నిర్దోషులుగా పేర్కొంటూ విడుదల చేశారు!

పంజాబు ప్రభుత్వంలో సీనియర్ ఐఎఎస్ అధికారి శ్రీమతి రూపెన్ డోయల్ బజాజ్, పోలీసు ఉన్నతాధికారి కె.పి.యస్. గిల్ తన యెడల అసభ్యకరంగా ప్రవర్తించినట్లు, 1988వ సంవత్సరం జులైలో పోలీసు రిపోర్టు నిచ్చింది. గిల్‌ను నేరస్థునిగా భావించిన కోర్టుతీర్పు 1996వ సంవత్సరం ఆగస్టు ఆరవ తేదీన గాని వెలువడలేదు! రిపోర్టును ఫైల్ చేసిన తర్వాత, కోర్టు తీర్పు వెలువడటానికి, (అదీ లోవర్ కోర్టు తీర్పు) ఎనిమిది సంవత్సరాలు పట్టింది దిగువ కోర్టులలో న్యాయం జరుగక ఆవిడ సుప్రీంకోర్టును ఆశ్రయించవలసి వచ్చింది సుప్రీంకోర్టు ఆదేశం వల్ల దిగువ కోర్టు (చీఫ్ జుడిషియల్ మెజిస్ట్రేట్) కేసును విచారణకు తీసుకోక తప్పలేదు. నిందితుడు హైకోర్టుకు, ఆపైన సుప్రీం కోర్టుకు వెళ్ళే అవకాశాలున్నాయి. చివరి తీర్పు రావటానికి ఇంకెంత కాలం పడుతుందో ఊహించవచ్చు. ఉన్నతాధికారులకే కోర్టులో న్యాయం జరగటానికి ఇన్ని ఇబ్బందులు ఎదురవుతూంటే, గ్రామీణ మహిళలకు న్యాయం ఎలా చేకూరుతుంది; ఎంత కాలాని కది వారి నాదుకొంటుంది?

**బాధించే పురుషులకే రక్షణ :** నిందితులు చట్టపు సంకెలలను ఎలా తప్పించుకొంటున్నారో చూశాం. చట్టాలు ఉన్నంత మేరకయినా బాధిత స్త్రీలను రక్షించలేక పోవటమేగాక, బాధించే పురుషుని ఎలా పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ బలపరచుతున్నాయో చూద్దాం

కొన్ని దేశాలలోని చట్టాలు బాధిత స్త్రీనే, భర్త చెరసాలలో బంధిస్తున్నాయి ఉదాహరణకు గ్వాటేమాలాలో, సివిల్ కోడ్‌లోని 114 వ ఆర్టికల్, స్త్రీ బయటకు వెళ్ళి పనిచేయటాన్ని నిరోధించే హక్కును భర్త కిస్తున్నది ఇందువల్ల భర్త చేతిలో హింసకు గురవుతున్న మహిళ బయటకు వెళ్ళి పనిచేసి స్వతంత్రంగా పొట్టబోసుకొనే అవకాశాన్ని బాధితురాలికి చట్టం నిరాకరిస్తున్నది. భర్త, భార్యను ఎంత హింసించినా, ఆవిడ అతనిని విడిచివెళ్ళే అవకాశాన్ని లేకుండా చేసింది భర్త హింస కారణంగా భార్య అతనిని విడిచి వెళ్ళే హక్కును ఈక్వెడార్ సివిల్ కోడ్ స్త్రీకి నిరాకరించింది బలవంతంగానైనా భార్యను తనతో ఉంచుకోనే హక్కును చట్టం భర్తకిచ్చింది. స్త్రీల ఆందోళన ఫలితంగా, ఈ క్లాజును 1989 లో చట్టం నుండి తొలగించారు. ఏ కారణంవల్లగాని, ఆఖరికి భార్య భర్త చేతిలో నరకయాతనను అనుభవిచవలసి వచ్చినా, విడాకులను కోరే హక్కును మహిళకు చిలీ ప్రభుత్వ చట్టం నిరాకరిస్తున్నది. ఈ విధంగా భర్త చేతిలో ప్రాణాపాయ ప్రమాదమున్న స్థితిలో కూడా, భార్య ఆ కిరాతకుని చెరనుండి విముక్తి పొందే అవకాశాన్ని బాధితకివ్వటానికి చట్టాలు నిరాకరిస్తున్నాయి.

**స్త్రీ హింసను హింసగా గుర్తించని చట్టాలు :** భార్యను భర్త ఎంతగా హింసిస్తున్నా, కొన్ని దేశాలలో చట్టాలు దానిని హింసగా గుర్తించటం లేదు! పాకిస్తాన్‌లో స్త్రీని, నిందితుడు హింసించినట్లు, నలుగురు పురుషులు సాక్ష్యమిస్తేనే చట్టం అతనిని నేరస్తునిగా గుర్తిస్తుంది మానభంగ దురాగతాన్ని "చట్టపరంగా" నిరూపించటం ఈ దేశంలో అసాధ్యం. ఈ దేశంలోని లా ఆఫ్ ఎవిడెన్స్ ప్రకారం మానభంగ కేసులో సాక్ష్యమివ్వటానికి స్త్రీలు "అనర్హులు". స్త్రీలిచ్చిన సాక్ష్యాన్ని ఇతరులిచ్చిన సాక్ష్యానికి బలమిచ్చే అంశంగా మాత్రమే చట్టం పరిగణిస్తుంది. అవివాహిత సెక్సు సంబంధం గలిగిఉండటం, వివాహిత, పర పురుష సంపర్కం – ఈ రెంటినీ, పాకిస్తాన్ ప్రభుత్వం 1979వ సంవత్సరంలో జారీచేసిన హదూద్ ఆర్డినెన్సు ప్రకారం, ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసిన నేరాలుగా పరిగణిస్తారు ఈ చట్టం మానభంగానికి గురయిన బాధితురాలికే సంకెలలు వేస్తున్నది. దురాగతానికి గురయినది వివాహిత గానివ్వు, అవివాహిత గానివ్వు వారు పర పురుష సంపర్కానికి లోనయినారు గనుక, పై ఆర్డినెన్సు ప్రకారం ప్రభుత్వ వ్యతిరేక నేరం చేసిన దోషులవుతున్నారు! ఈ ఆర్డినెన్స్ కింద 1500 మంది స్త్రీలు 1992 లో జైలు పాలయినట్టు హ్యూమన్ రైట్స్ వాచ్ సంస్థ అంచనా వేసింది

**పురుషుల వెన్ను కాచే రేప్ చట్టాలు :** కొన్ని దేశాలలో అమలులో నున్న చట్టాల ప్రకారం, మానభంగ సంఘటన నిరూపణ అతి కష్టమైన పనిగా తయారైంది. మానభంగ నిర్వచనం, దురాగతులకు పెట్టని కోటగా ఉపకరిస్తున్నది మానభంగాన్ని, స్త్రీని అగౌరవపరచటం లేక ఆవిడ వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని హరించటంగా కాక, నైతిక ప్రవర్తనకు, కుటుంబ గౌరవానికి సంబంధించిన సమస్యగా చాలా దేశాలలోని చట్టాలు నిర్వచిస్తున్నాయి. కొన్ని ఆఫ్రికా దేశాల చట్టాలు, మానభంగాన్ని స్త్రీ మీద జరిగిన అత్యాచారంగా గాక, ఆస్తిహక్కుల అపహరణంగా నిర్వచిస్తున్నాయి! లాటిన్ అమెరికాలోని పలు దేశాల్లోని చట్టాలు, ఇంతవరకు సెక్సు సంబంధాన్ని ఎరుగని స్త్రీలు, లేక బాలికలమీద జరిగిన అత్యాచారాన్ని మాత్రమే నేరంగా పరిగణిస్తున్నాయి. బ్రెజిల్, కోస్టారికా, ఈక్వెడార్, గ్వాటేమాలా దేశాలలోని చట్టాలను ఇందుకు ఉదహరించవచ్చు. చెరచిన పురుషుడు, తాను చెరచిన స్త్రీని వివాహమాడటానికి అంగీకరిస్తే, అతనిని నిర్దోషిగా చిలీ, గ్వాటేమాలాల చట్టాలు విడుదల చేస్తున్నాయి. ఈ చర్యలవల్ల ఆవిడ గౌరవానికి, కుటుంబ గౌరవానికి జరిగిన హాని మాసిపోతుందని చట్టాలు చెబుతున్నాయి.

**భర్త చేసిన మానభంగాన్ని, అమలు జరిపే హింసనూ గుర్తించని చట్టాలు :** కొన్ని దేశాలలోని చట్టాలు, భర్త భార్యను మానభంగంచేస్తే దానిని నేరంగా పరిగణించటం లేదు, ఆవిడను హింసించినా అది నేరంగా పరిగణనకు రావటం లేదు హింసించిన వారిని శిక్షించే చట్టాలు దాదాపు అన్ని దేశాలలోనూ ఉన్నాయి. కాని, భార్య మీద దురాగతానికి దిగిన భర్తను ఇవి దండించలేక పోతున్నాయి! పురుషుడు కొట్టిన దెబ్బలకు, లేక అతడు

అమలు జరిపిన హింసా చర్యలకు, స్త్రీ కనీసం ఒక వారం పాటయినా పనిచేయలేని పరిస్థితి యేర్పడినపుడే, ఆ పురుషుడు శిక్షార్హుడవుతాడని కొన్ని లాటిన్ అమెరికా దేశాల చట్టాలు నిర్దేశిస్తున్నాయి. అయితే పురుషుని హింసా చర్యవల్ల స్త్రీ గాయపడి మంచం బట్టిందని ఫోరెన్సిక్ డాక్టరు నిరూపించవలసి ఉంటుంది. గాయపడిన స్త్రీ బయటకు వెళ్ళి పనిచేయలేని స్థితి ఏర్పడినపుడు మాత్రమే ఆవిడకు చట్టపరమైన రక్షణ లభిస్తుంది. ఒంటిమీద రుజువు చేయదగిన గాయాలు కనుపించక పోయినా (కనపడని దెబ్బలను కొట్టటంలో చాలా మంది భర్తలు ఆరితేరారు. ఇలాంటి దెబ్బలు ఒంటిని హూనం చేస్తాయని అందరకు తెలుసు), మానసిక వ్యధకు గురై బాధితురాలు మంచం బట్టినా, ఆవిడకు చట్టపు రక్షణ లభించదు.

పురుషులకు అనుకూలంగా ఉన్న నేర నిర్వచనం: భారతదేశంలో ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారం, ప్రమాద కరమైన గాయం (గ్రీవస్ హర్ట్) ఏర్పడినపుడే అది శిక్షార్హమైన నేరంగా (కాగ్నిజబుల్ అఫెన్స్‌గా) పరిగణనకు వస్తుంది. మనిషి తీవ్రమైన దెబ్బలకు గురిగావటం, దెబ్బలవల్ల కంటిచూపు, వినికిడి వంటివి దెబ్బతినటం, ముఖం వికృతం గావటం వంటివి బాధితురాలి మీద కనుపిస్తేనే అది "కాగ్నిజబుల్ అఫెన్స్" అవుతుంది.

కొన్ని దేశాలలోని చట్టాలు బాధిత స్త్రీకి న్యాయం జరగకుండా చేస్తున్నాయి. భర్త హింసవల్ల స్త్రీ శరీరం మీద ఏర్పడిన గాయం, ఆవిడను మాసానికి తగ్గకుండా పని చేయలేకుండా చేయగలిగినపుడే, దానిని శిక్షార్హమైన నేరంగా బొలివియన్ పీనల్ కోడ్ నిర్దేశిస్తున్నది. పెరూలో భార్యను భర్త బాధించినట్లు రుజువైతే అతనికి పడే పెద్ద శిక్ష ముప్ఫై రోజుల సామాజిక సేవ! ఇలాంటి నామమాత్రపు శిక్షలు పడటం కూడా అరుదని ఆదేశపు క్రిమినల్ కేసులతో వ్యవహరించే న్యాయవాదులంటున్నట్లు, హ్యూమన్ రైట్స్ వాచ్‌కి చెందిన రోబిన్ కిర్క్ రిపోర్టు చేశారు.

మానభంగ నిరూపణ అసాధ్యమవుతున్న వైనం: లాటిన్ అమెరికాలోనూ, కొన్ని ఆసియా దేశాలలోనూ అమలులో ఉన్న ఫోరెన్సిక్ మెడికల్ విధానాలు మానభంగ ఆరోపణల రుజువును దాదాపు అసాధ్యంగా చేస్తున్నాయి. కోర్టులో కేసును పెట్టినపుడు, ప్రభుత్వ ఉద్యోగంలో ఉన్న ఫోరెన్సిక్ డాక్టర్లు మాత్రమే సాక్ష్యమివ్వటానికి అర్హులు. ప్రభుత్వ వైద్యశాలలు సామాన్యంగా పట్టణ ప్రాంతాలలో ఉంటాయి. రోజులో నియమిత కాలాలలో పనిచేస్తాయి; వారాంతపు శెలవులకు మూతబడతాయి కూడా. ఈ ఇబ్బందివల్ల, బాధితురాలికి న్యాయం జరగటం ఎంత కష్టమోనన్న అంశాన్ని రోబిన్ కిర్క్ చక్కగా చిత్రించారు. పెరూలోని గ్రామీణ ప్రాంతంలో గురువారం రాత్రి ఒక మహిళ మానభంగానికి గురైంది. శుక్రవారం అంతా ప్రయాణం చేసి, ఆ రోజు రాత్రికి గాని ప్రభుత్వ వైద్యశాల ఉన్న నగరాన్ని చేరలేకపోయింది. శని, ఆదివారాలు వైద్య శాలకు సెలవు. సోమవారం మాత్రమే పరీక్షకు అవకాశం ఉంటుంది. మూడు రోజుల కాలంలో మానభంగపు సూచనలు గాని, వాటి తీవ్రతగాని మాసిపోయే అవకాశాలుంటాయి. అంతేగాదు, మానభంగ కేసులను గాని, హింసకు గురవుతున్న స్త్రీల ఆరోగ్య స్థితిని గాని పరీక్షించటంలో ఫోరెన్సిక్ వైద్యులకు ప్రత్యేక తర్ఫీదు లభించదు. ఇందువల్ల బాధితురాలికి బలాన్నిచ్చే అంశాలకు వారిచ్చే రిపోర్టులలో తావుండదు. కనుక బాధితురాలికి న్యాయం జరగటం అసాధ్యమవుతున్నది.

కనుపిస్తున్న కొన్ని ఆశాజనక సూచనలు : కొన్ని దేశాలు, బాధిత స్త్రీలకు న్యాయం జరగటానికి వీలుగా క్రిమినల్ చట్టాలను సవరిస్తున్నాయి. మానభంగాన్ని, వ్యక్తి యొక్క స్వేచ్ఛను హరించటంగా నిర్వచిస్తూ మెక్సికో చట్టాన్ని సవరించింది. నేరస్తునికి విధించదగిన శిక్షాకాల పరిమితిని పెంచింది. మైనరు బాలికను చెరచినవారు, ఆవిడను పెండ్లి చేసుకోవటానికి అంగీకరిస్తే, నిర్దోషిగా వదలిపెట్టే అవకాశాన్ని లేకుండా చేసింది. అన్నింటికంటే ముఖ్యమైన అంశం, మానభంగానికి గురయిన స్త్రీ గర్భాన్ని ధరించి ఉండి, ఆవిడ కోరుకుంటే, కోర్టు పనిచేస్తున్న ఐదురోజుల లోపల ఆవిడకు గర్భస్రావపు వసతిని ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని ఆదేశించే అధికారాన్ని చట్టం జడ్జికి ఇస్తున్నది. 1991వ సంవత్సరంలో ఈ సవరణలు అమలులోనికి వచ్చాయి.

1993వ సంవత్సరంలో ఫిలిపీన్స్ ప్రభుత్వం కూడా ఆదర్శప్రాయమైన చట్టసవరణలను ప్రవేశపెట్టింది. మానభంగ

నిర్వచనాన్ని విస్తృత పరచారు మానభంగ ప్రయత్న నిరోధంలో శారీరకంగా గాయపడకపోయినా, మాటల ద్వారా ఆవిడ నిరసనను తెలుపగలిగినా, ఆ సంపర్కాన్ని మానభంగంగా చట్టం ఇపుడు గుర్తిస్తున్నది. అంతేకాదు: ఇటువంటి కేసు విచారణలో, ఆకేసుకు సంబంధించిన విషయాలు మాత్రమే ప్రస్తావనకు రావాలి. బాధితురాలి కేసును బలహీన పరచే గత చరిత్రను ఇచ్చట ప్రస్తావించ వీలులేదు 1978 వ సంవత్సరంలో హైదరాబాదు నగరంలో విచారణకు వచ్చిన రమీజాబీ మానభంగపు కేసు విషయం తెలుగువారికి గుర్తుండే ఉంటుంది మానభంగం జరుగలేదు అని నిరూపించటానికి ప్రయత్నించటం కంటే బాధితురాలు వ్యభిచారిణి అని తిరుగుబోతు అని నిరూపించటానికే నిందితుని డిఫెన్సు టీం ఆవిడ గత చరిత్రను తవ్వింది ఇందువల్ల ఫిర్యాది కేసు కోర్టులో బలహీన పడింది. వీగిపోయింది భారతీయ మహిళలు, అత్యంత సన్నిహితుల సమక్షంలో కూడా సెక్సు విషయాలను ప్రస్తావించటానికి సాహసించరు. అటువంటి స్త్రీ, పురుషులే అధిక సంఖ్యాకులుగా ఉండే కోర్టు హాలులో నిందితుడు తనను చెరచిన విధానాన్ని కనులకు కటేట్లు వర్ణించగలిగితే, ఆ అభాగ్యురాలిని "బరిదెగించిన" స్త్రీగా, "కులట"గా పరిగణిస్తారు. లీగల్ పరిభాషలో ఆవిడ "ఉమన్ ఆఫ్ ఈజీ వర్చు" అవుతుంది! తనకు జరిగిన అన్యాయాన్ని బిడియపడి వివరించలేకపోతే, "నేరాన్ని రుజువు చేయలేకపోయినందువల్ల" నిందితుడు "నిర్దోషి"గా మారిపోతాడు ! తన మీద జరిగిన అత్యాచారాన్ని రుజువు చేయగలిగినా, రుజువు చేయలేకపోయినా నష్టపడవలసి వస్తున్నది బాధితే. స్త్రీ స్థితి ఈ విధంగా అరిటాకు-ముల్లు చందంగా తయారవుతున్నది ఇలాంటి దుస్థితి బాధితలకు పట్టకుండా ఫిలిపీన్ ప్రభుత్వ చర్య నిరోధిస్తుంది. ఇలాగే పలుదేశాలు, స్త్రీలకు అనుకూలంగా చట్ట సవరణలు చేస్తున్నాయి కాని ఈ చట్టాలు సక్రమంగా అమలు జరగటం లేదు.

భారత ప్రభుత్వం బహిరంగ స్థలాలలో స్త్రీలను వేధించటాన్ని నిషేధిస్తూ చట్టాన్ని చేసింది. అంతకు పూర్వమే వరకట్న నిషేధ చట్టము, బాల్య వివాహ నిషేధ చట్టమూ ఉన్నాయి కాని వరకట్నాల కేసు కాలానుగతంగా పెరుగుతూనే ఉన్నది. బాల్య వివాహాలు జరుగుతూనే ఉన్నాయి. స్త్రీల వేధింపు అంతంగాలేదు సరికదా, పెరిగి పోతున్నది. పాకిస్తాన్ ప్రభుత్వము కట్నం కోసం స్త్రీ వంక వారిని వేధించటాన్ని నిషేధించింది బంగ్లాదేశ్ ప్రభుత్వం ఏసిడ్‌ను మనుషుల మీద పోయటాన్ని నిషేధించింది ఈ నేరాలు స్వేచ్ఛగా జరుగుతూండటమే చట్టాలు సక్రమంగా అమలు జరగటం లేదు అని చెప్పటానికి రుజువులు. చట్టాలున్నంత మాత్రాన లాభం లేదు అవి సక్రమంగా అమలు జరిగినపుడే స్త్రీ హింస తగ్గుతుంది: స్త్రీకి కొంతమేరకయినా రక్షణ లభిస్తుంది

లీగల్ సిస్టంలోని బలహీనతలెలా ఉన్నా, ఇప్పటికదే స్త్రీ హింసను ఆపగల సాధనంగా కనుపిస్తున్నది స్త్రీ హింసకు మూలకారణమైన స్త్రీ పురుషుల మధ్యనున్న ఆర్థిక అసమానతలను తొలగించి సామాజిక సంస్కృతీ సంప్రదాయాలలోనూ, పురుషుల వ్యవహారశైలిలోనూ సమూలమైన మార్పులను సాధించగలిగే వరకూ, లీగల్ అవకాశాలను స్త్రీలు వినియోగించుకోక తప్పదు. స్త్రీ హింసా నిరోధానికి, లేదా నివారణకు సివిల్ కోర్టుల నాశ్రయించటం మంచిదా, లేక క్రిమినల్ కోర్టులకు వెళ్ళాలా అన్న సమస్య న్యాయశాస్త్ర ప్రవీణులను ఎదుర్కొంటున్నది ఈ విషయంలో రెండు భిన్నాభిప్రాయాలు ప్రకటితమవుతున్నాయి.

### రాజీమార్గానుసరణ ఉచితమా?

భర్త చేతిలో భార్య హింసకు గురవుతున్నపుడు, క్రిమినల్ కోర్టును ఆశ్రయించటం వల్ల వారి భార్యాభర్తృత్వ సంబంధాలు తెగిపోవచ్చు. కనుక దానికి బదులు రాజీమార్గాలను అనుసరించటం మంచిది అనేది ఒక అభిప్రాయం. అరెస్టు, ప్రాసిక్యూషన్, శిక్ష విధింపు వంటి కర్మ కాండకు బదులు, కుటుంబ క్షేమాన్ని రక్షించే సంప్రదింపుల విధానాన్ని అనుసరించాలని, కుటుంబీకుల మానసిక వైరుధ్యాలను ఇది మాన్పి, కుటుంబ విచ్ఛిత్తిని ఆపగలదని వీరు వాదిస్తారు. ఈ విధానం పనిచేయనపుడే క్రిమినల్ కోర్టుకు వెళ్ళాలని వీరి సూచన

హింసకు పాల్పడినవారు ఇంట్లోని వారయినా, వీధిలోని వారయినా వారు పాల్పడింది స్త్రీ హింసకే కనుక ఇది క్రిమినల్

నేరము. అందుచేత భార్యను హింసించే భర్తను భిన్న ప్రాతిపదిక మీద చూడనవసరం లేదని రెండవ వర్గం వారంటారు. ఈ రెండు వాదాల ప్రాతిపదిక ఏమిటో చూద్దాం.

కుటుంబ వివాదాల పరిష్కారానికి క్రిమినల్ కోర్టులను ఆశ్రయించటం మంచిది గాదు అనేది బలమైన వాదంగా కనుపిస్తుంది. క్రిమినల్ లా నేరస్తుని శిక్షించగలదే గాని, అతనిలో పరివర్తనను తేలేదు, ఆత్మ పరిశీలనను ప్రేరేపించదు. నేరస్తుని గత జీవితమే దీనికి ప్రధానంగాని, అతని భావి జీవితం సంగతి దీనికి పట్టదు. వారి దుర్మార్గపు ప్రవర్తనను మార్చటానికిది తోడ్పడదు పోలీసులు, ప్రాసిక్యూటర్లు, జడ్జీలు సమన్వయంతో పనిచేస్తేనే గాని. చట్టము సక్రమంగా, న్యాయంగా అమలు జరుగదు కుటుంబం కుటుంబీకుల "స్వర్గ సీమ", "రక్షణ దుర్గం". భావితరాలకు జీవం పోసే "జీవగడ్డ", ముందు తరాల వారిని "ఉత్తమ పౌరులుగా" తీర్చి దిద్దే "శిక్షణాలయం" ఈ లక్ష్యానుసారం, భర్త చేతిలో ఎంతటి హింసను అనుభవించ వలసి వచ్చినా ఇల్లాలు తలవొగ్గి, కుటుంబసేవకు అంకితం గావాలి. కుటుంబ కలహంలో జోక్యం చేసుకొనే అధికారం ఇతరులకు లేదు అన్న సామాజిక సంప్రదాయపు బిడ్డలే వీరంతా. సంప్రదాయోల్లంఘనకు వారు సాహసించరు. భార్యను భర్త బాధించటం అనేది క్రిమినల్ చర్యగా వారు పరిగణించలేరు. కనుకే భార్యను హింసించిన భర్తల అరెస్టులు వెంటనే జరగటం లేదు. అదృష్టవశాత్తూ వీరంతా బాధ్యతాయుతంగా చట్ట నిర్దేశం ప్రకారం వ్యవహరించ గలిగినా, నిస్సహాయురాలైన ఇల్లాలు, సామాజికులంతా ఆమోదిస్తున్న భర్త హింసా చర్యలను రుజువు చేయటానికి తగినంత సాక్ష్యాధారాలను చూపలేదు. అది ఆవిడకు తలకు మించిన పని. కనుక నిందితుడు "నిర్దోషి"గా విడుదలవుతాడు. ఇతడు ఇల్లు చేరిన తర్వాత తనను కోర్టు కీడ్చిన ఇల్లాలి మీద కక్షగట్టి మరింత అధికంగా బాధించ నారంభిస్తాడు.

ఒకవేళ నేరం రుజువయినా, అతనికి చిన్న మొత్తపు జరిమానాను కోర్టు విధించవచ్చు; లేదా కొద్ది కాలపు జైలు శిక్ష విధించవచ్చు. దీనివల్ల కూడా బాధితురాలు మరొక బాధకు లోనవుతుంది. నేరస్తుడు జరిమానా చెల్లింపుకు కుటుంబ నిధులనేవాడాలి గదా? అతనికి జైలు శిక్షపడితే, అతడి ఆర్జన దెబ్బతింటుంది; ఇందువల్ల కుటుంబాదాయం పూర్తిగానో, పాక్షికంగానో పోతుంది. విడుదలైన తర్వాత ఆ ఉద్యోగం అతనికి ఉంటుందనే నమ్మకం లేదు. ఇందువల్ల బాధితురాలైన అతని భార్యతో సహా, పిల్లలు కూడా బాధపడవలసి వస్తుంది. అతడు జైలుకు వెళ్ళిన కొద్ది కాలము, ఇల్లాలికి హింస నుండి రక్షణ లభించవచ్చు. అతడు విడుదలై వచ్చిన తర్వాత కక్షకొలదీ తీవ్రమైన హింసకు పాల్పడే అవకాశాలు అధికంగా ఉంటాయి.

క్రిమినల్ కోర్టుల పరిష్కారాన్ని వ్యతిరేకించే వారి వాదం సూక్ష్మంగా ఇది . 1. క్రిమినల్ కోర్టుల పరిష్కారం పరిమితమైనది, అది నేరస్తునిలో మానసిక పరివర్తనను తీసుకురాలేదు; అతని పునరావాసానికి కూడా తోడ్పడదు; 2. కోర్టులు ఇపుడు వ్యవహరిస్తున్న తీరును బట్టి, స్త్రీ హింసా నివారణ ప్రధానాంశముగా న్యాయమూర్తులు ఎంచుతున్నట్లు కనుపించటం లేదు. చట్టాలకు సాంకేతిక పరమైన విశ్లేషణల నివ్వటం మీదనే వారు మనస్సును కేంద్రీకరిస్తున్నారు 3. క్రిమినల్ కోర్టుల తీర్పుల వల్ల బాధితురాలితో సహా కుటుంబీకులంతా ఇబ్బంది పడవలసి వస్తున్నది 4. సామరస్యపూర్వక పరిష్కారం సత్ఫలితాలను ఇస్తున్న సందర్భాలు అధికంగానే ఉన్నాయి కనుక క్రిమినల్ కోర్టులను ఎందుకు ఆశ్రయించాలి?

## క్రిమినల్ కోర్టు నాశ్రయించటంలోని మంచి

క్రిమినల్ కోర్టులను ఆశ్రయించటమే స్త్రీ హింసా నివారణకు మార్గమని సూచించేవారు కూడా బలమైన కారణాలను చూపుతున్నారు క్రిమినల్ కోర్టులు స్త్రీ హింసా కేసుల విషయంలో వ్యవహరిస్తున్న తీరును వీరు బలపరచటం లేదు భర్త భార్యను కొట్టటం అనే అంశాన్ని సమాజం కొన్ని తరాలుగా అంగీకరిస్తున్నది. సామాజికులుగా, న్యాయ యంత్రాంగంలో పనిచేస్తున్న జడ్జీలు, ప్రాసిక్యూటర్లు, పోలీసులు, అంతా దాన్ని నేరంగా పరిగణించరు. సంప్రదాయబద్ధతా ప్రభావమిది అందుచేత బాధితురాలి రక్షణ తమ పరమాశయంగా పెట్టుకొని వారు పనిచేయటం లేదని వీరు అంగీకరిస్తున్నారు. చట్టం యొక్క శక్తిని నేరస్తునికి చూపించాలంటారు. నిందితుని అరెస్టు చేసి, కోర్టులో విచారించి శిక్ష విధించటం వల్ల, ఇల్లాలిని బాధించటం శిక్షార్హమైన నేరంగా సమాజం అంగీకరించవలసి వస్తుంది; తాను చేసిన

పాపానికి తనకు శిక్ష పడిందని నేరస్తుడు గమనించటానికి వీలుంటుంది ఇల్లాలిని హింసించటం కుటుంబ సమస్యగాదు. వీధిలో జరిగే నేరానికిది ఏ మాత్రం తీసిపోదు అని లోకానికి ప్రదర్శిత మవుతుంది హింసకు లోనవుతున్న స్త్రీ రక్షణ ప్రధానమైనది అంతేగాని, సామరస్య పూర్వక పరిష్కారం పేరుతో బాధితురాలిని నిందితునితో కాపురానికి కట్టివేయటం ఉచితం గాదని వీరు వాదిస్తున్నారు ఇపుడు క్రిమినల్ కోర్టులనుసరిస్తున్న "తటస్థ విధానం" నిందితునకు పరోక్ష ప్రోత్సాహాన్ని ఇస్తున్నట్లు వీరు సూచిస్తున్నారు హింసకు గురయిన ఇల్లాలిని కూడా నిందితునితో సమానమైన వ్యక్తిగా కోర్టులు పరిగణిస్తుండటం అన్యాయమని వీరు వాదిస్తున్నారు సామరస్యపూర్వక పరిష్కారవాదం పురుషుడు స్త్రీని హింసంచటాన్ని ఖండించటం లేదు: దానిని ఆమోదిస్తున్నది ఈ అంశాన్ని వీరు వ్యతిరేకిస్తూ, భార్యను హింసించిన భర్త శిక్షార్హుడు: ఇక ముందు ఈ హింసా ప్రవృత్తిని నిందితుడు ప్రదర్శించకుండా ఆపాలంటే, అతనికి శిక్షపడవలసిందే అని అంటారు.

మానవుడు తన ప్రవర్తనను మార్చుకోవటానికి, చట్టానికి అనువుగా ప్రవర్తనను దిద్దుకోవటానికి చట్టం ఉపకరిస్తుందని ఈ వర్గం వారి భావన. ఈ విధంగా ఇది నేరస్తునకు శిక్ష విధించే సాధనంగా, సద్వర్తనకు మార్గదర్శిగా ఉపకరిస్తుందని చెబుతారు హింసను తాత్కాలికంగానే కాదు, శాశ్వతంగా ఆపటానికి చట్టం ఉపకరిస్తుంది. క్రిమినల్ ప్రాసీజరు అధికార బలంతో నేరస్తుని లొంగదీస్తుంది, ఇందువల్ల బాధితులకు తక్షణ రక్షణ లభిస్తుంది. మరొకసారి దోషి, అదే నేరానికి తిరిగి పాల్పడకుండా చేయగల శక్తి చట్టానికున్నదని వీరు నమ్ముతున్నారు. దీనికి ఆధారంగా పలు పరిశోధనా ఫలితాలను వీరు చూపుతున్నారు

కొన్ని ప్రయోగ ఫలితాలు

అమెరికాకు చెందిన మినియాపోలిస్ నగరంలో 1981వ సంవత్సరంలో పోలీసులు ఒక ప్రయోగాన్ని నిర్వహించారు భార్యా హింసా కేసుల పరిష్కారానికి, ఈ ప్రయోగంలో మూడు పద్ధతులను అవలంబించారు. 1. మధ్యవర్తిత్వం; 2. హింసకు పాల్పడిన పురుషుని తాత్కాలిక గృహ బహిష్కరణ 3. నిందితుని అరెస్టు. ఈ మూటిలోకి అరెస్టు, శక్తివంతంగా పనిచేయ గలిగినట్లు ప్రయోజకులు నిర్ధారణ చేశారు. సర్వేలో అతి తక్కువ సంఖ్యలో (314) బాధితులు పాల్గొన్నారు. కనుక ఇది సాధారణ స్థితిని ప్రతిబింబింపటం లేదని కొందరు అభిప్రాయ పడ్డారు

1981 వ సంవత్సరంలోనే లండన్‌లోనూ, కెనడాకు చెందిన ఒంటారియోలోనూ విస్తృత ప్రాతిపదిక మీద ప్రయోగాలు జరిగాయి. 1979, 1980 సంవత్సరాల కాలంలోని పద్దెనిమిది మాసాల కాలంలో జరిగిన హింసా చర్యలను పరిశోధనకు తీసుకొన్నారు నేరారోపణను, బాధితగాక, పోలీసులు చేయాలన్న పట్టుదలమైన ఆదేశాలున్నాయి. అంతేకాదు: పోలీసులు పెట్టిన ఛార్జిషీటును, మనసు మార్చుకొని బాధిత వ్యతిరేకించినా, కోర్టులో కేసు విచారణ ఆగదు, అలాగే ఆవిడ కేసును ఉపసంహరించమని కోరినా అది జరుగవలసిన అవసరం లేదని చట్టం నిర్దేశిస్తున్నది. ఈ పోలీసుల కార్యాచరణ విధానం భార్యాహింసను చాలా వరకు తగ్గించ గలిగినట్లు బాధితులలో మెజారిటీ వర్గం భావించింది. తర్వాత కాలంలో నమోదయిన భార్యాహింసా నేరాల సంఖ్య తగ్గటం ఈ అంశాన్ని ధృవపరచింది పోలీసులు, నిందితుల మీద కేసు పెట్టి కోర్టుకు ఈడ్వకపోతే భార్యల మీద వారి హింసా ప్రయోగ పరిమాణం అధికమవుతుందని కూడా ఈ ప్రయోగం నిరూపించింది.

ఈ అనుభవం తర్వాత, అభివృద్ధి చెందిన దేశాలలో స్త్రీ హింసను అరికట్టటానికి, పటుతరమైన చట్టాలను రూపొందించారు స్త్రీ హింసను - నేరంగా భావించి అరెస్టు చేస్తున్నారు. బాధితురాలే పోలీసులను పిలువ వలసిన అవసరం లేదు, ఇరుగు పొరుగు వారు కూడా వీరిని పిలువవచ్చు. ఈ చర్యలు 1980 తర్వాత అత్యంత ప్రజామోదాన్ని పొందుతున్నాయి. స్త్రీ హింసను అరికట్టటానికి, కేసును పూర్తిగా క్రిమినల్ చర్యగా మాత్రమే పరిగణించకూడదనీ, ఆ సమాజం యొక్క సంస్కృతిని, ఆర్థిక, రాజకీయ పరిస్థితిని కూడా పరిగణనలోనికి తీసుకోవాలని విజ్ఞులు సూచిస్తున్నారు. భర్తా భార్యల మధ్య (నిందితుడు, బాధితురాలి మధ్య) నున్నది శతృత్వ సంబంధంగాదు: వారికి మానసిక సంబంధం ఉన్నది; అలాగే వారిని ఆర్థిక సంబంధాలు కూడా బంధిస్తున్నాయి. అలాగే బాధిత స్త్రీలంతా ఒకే రకమయిన వారు కారు.; వారి సంబంధాలు, జీవన పరిస్థితులూ భిన్నంగా ఉంటాయి. వీటి

## కట్టుబాటు మీద తిరుగుబాటు

కీన్యాలోని కజియడొ పట్టణానికి చెందిన ఏగ్నిస్ సియంకాయ్ అనే ముప్పై సంవత్సరాల స్త్రీని భర్త, బేస్ బాల్ బాట్ వంటి కర్రతో కొట్టటం వల్ల ఆసుపత్రి పాలైంది. ఆవిడ గత పదమూడు సంవత్సరాలుగా భర్త చేతిలో దెబ్బలను తింటూనే ఉన్నది. ప్రాణం విసిగి, ఈ సారి భర్త మీద కోర్టులో కేసు పెట్టింది. ఆ ప్రాంతవాసులంతా "ఔరా ! ఇల్లాలి కిది తగునా?" అని ముక్కు మీద వేలువేసుకొంటున్నారట.

కీన్యాలో భర్తలు భార్యలను కొట్టటం అతి సామాన్యమైన విషయం. సమాజం భర్త చర్యను బలపరుస్తున్నది. ఇలాంటి చోట తనను కొట్టినందుకు భర్తను కోర్టు కీడ్వటం ఆశ్చర్యకరమైన అంశమైంది.

ఈవిడ కీన్యా దక్షిణ భాగంలోని మసాయ్ తెగకు చెందిన వ్యక్తి. ఈ తెగవారు స్త్రీలను ఆస్థిగా పరిగణిస్తారు. తొలుత కన్న తల్లిదండ్రులకు, తర్వాత కట్టుకొన్న భర్తకు స్త్రీ ఆస్థివంటిది. పురుషులు ఏమి చేసినా, స్త్రీలు నోరు మెదపకుండా అనుభవించి తీరాలి. భార్యను కొట్టని పురుషుని సామాజికులు చేతగాని వాని కింద జమగడతారు. బంధుత్వ సంబంధాల పెంపుకూ, మిత్రత్వపు పటిష్ఠతకూ ఆవును గాని స్త్రీని గాని ఇస్తూండటం ఈ తెగలో పాటింపులో నున్న ఆచారం. ధనిక, పేద భేదం లేకుండా అంతా దీన్ని పాటిస్తూంటారు.

ఏగ్నిస్‌ను, తన తండ్రంత వయస్సున్న వ్యక్తికిచ్చి, ప్రైమరీ స్కూలులో చదువుతున్న కాలంలోనే తండ్రి పెండ్లి చేశాడు భర్త చేతిలో దెబ్బలు తిన్న ప్రతిసారి తల్లి గారింటికి పరుగుదీసేది. "చూడమ్మా నా శరీరం మీద ఈ గాయపు మచ్చలు. మీ నాన్న నన్ను కొట్టినందువల్లనే ఇవి పడ్డాయి. భర్త కొడతాడు. మనం ఓర్చుకోవాలి, పడి ఉండాలి" అంటూ సర్ది చెబుతూ, ఆవిడను తిరిగి భర్త వద్దకు తల్లి పంపుతూండేది.

ఇంతకు పూర్వం కూడా కొందరు స్త్రీలు, భర్త కొట్టినందుకు కోర్టు కెళ్ళారు. కాని ఇరుగు పొరుగు వారు నచ్చచెప్పి కేసును ఉపసంహరింప చేస్తూ వచ్చారు. ఎలాగో ఇద్దరికీ రాజీ చేసేవారు. ఏగ్నిస్ సియంకాయ్ మాత్రం రాజీపడదలచలేదు. పైగా లాయరైన ఆవిడ సోదరుడు ఆమెకు అండగా నిలిచాడు. భర్తకు ఈ కేసులో ఐదేళ్ల జైలు శిక్షతోపాటు బెత్తపు దెబ్బలు పడే అవకాశం కూడా ఉన్నదట. మసాయ్ జాతి స్త్రీలు భర్తలను జైలు కంపటం అనేది ఇంతవరకూ జరగలేదు. తాను తన భర్తను జైలుకు పంపటానికి సిద్ధమైనందుకు ఇరుగుపొరుగు స్త్రీలంతా తనను వెలివేసినట్లు చూస్తున్నారని చెప్పింది. " నా భర్తకు శిక్ష పడవలసిందే. ఇది ఇతర పురుషులకు గుణపాఠం గావాలి" అని అంటున్నది ఏగ్నిస్ సియంకాయ్.

*- అసోసియేటెడ్ ప్రెస్ ప్రసారం చేసిన ఈ వార్తను, శాన్హొజె మెర్క్యురీ న్యూస్ పత్రిక 1997, అక్టోబరు 31వ తేదీ సంచికలో ప్రచురించింది.*

పరిగణన కూడా అవసరం. బాధిత రక్షణను గాలికి వదలి, నిందితుని శిక్షించే ప్రయత్నం మాత్రమే జరగటం వల్ల, ఆవిడకు రక్షణ లభించదు. కనుక, నిందితుని శిక్షించటంతో పాటు బాధిత రక్షణకు అవసరమైన బహుముఖ చర్యలను తీసుకోవాలి. నిందితుని మీద అరకొరగా ఛార్జిషీట్ పెడితే అతడు సులభంగా విడుదలయ్యే అవకాశాలుంటాయి. విడుదల తర్వాత భార్యను ఇనుమడించిన ఆవేశంతో హింసించే ప్రమాదాలుంటాయి. ఇందువల్ల బాధితుల విశ్వాసాన్ని పోలీసులు కోల్పోతారు. వారు విమర్శలకు గురై, నిస్పృహకు లోనయ్యే ప్రమాదమున్నది. అందువల్ల, లండన్, ఒంటోరియో పోలీసులు నిందితులను అరెస్టు చేసి కోర్టులకు లాగటాన్ని మాత్రమే మనం చూస్తే చాలదు. ఆ దేశాలలో ఆచరణలో నున్న బాధితురాండ్ర రక్షణా వ్యవస్థను గురించి కూడా తెలుసు కోవటం అవసరం. పోలీసులు, తమ ఖర్చులతో, బాధితలకు

ఆపత్కాలంలో సలహాల నిచ్చే సర్వీసును ఏర్పాటు చేశారు. ఈ సర్వీసు బాధితలకు రోజులోని 24 గంటలూ అందుబాటులో ఉంటుంది. కుటుంబకలహ విషయ నిర్వహణలో పోలీసులకు ప్రత్యేక తర్ఫీదు నిచ్చే వసతి కూడా ఏర్పాటైంది. బాధితకు లీగల్ సలహాలనే కాకుండా, మానసిక ఆందోళనా నివారణకు అవసరమైన సలహాలనిచ్చే యంత్రాంగాన్ని (ఉమెన్స్ ఎడ్వొకెసీ క్లినిక్‌ను) ఏర్పాటు చేశారు. ఇది బాధితకు ఉచిత సలహాలనిస్తుంది; ఆవిడ సొమ్ము చెల్లించనవసరం లేదు. అలాగే నిందితులలో మానసిక మార్పులు తేవటానికి, వారిని సక్రమ మార్గంలో పెట్టటానికికూడా ఏర్పాట్లున్నాయి.

భార్యా భర్తల కుటుంబ కలహ పరిష్కారానికి సంప్రదింపులనే సాధనంగా యెంచే కమ్యూనిటీలు కొన్ని చోట్ల ఇంకా ఉన్నాయి. ఇలాంటి చోట్ల క్రిమినల్ కేసుల విధానం, పనిచేయకపోవచ్చు. కనుక, ఈ క్రిమినల్ చార్జీల విధానాన్ని సందర్భోచితంగా వాడవలసి ఉంటుంది. స్త్రీ హింసా నివారణకు ఎలాంటి చర్యలను చేబట్టినా, అవి ఆయా కమ్యూనిటీల సాంస్కృతిక, సంప్రదాయ విధానాలకు అనువుగా ఉండాలనేది అతి ముఖ్యమైన అంశం. హింసకు గురవుతున్న స్త్రీ పరిస్థితిగాని, హింసకు దిగిన పురుషుని స్థితిగాని, అన్ని సందర్భాలలోను ఒకే రకంగా ఉండదు. ఈ భేదాన్ని గుర్తించటం అవసరం. ఒక్కొక్క బాధిత అవసరాలు ఒక్కొక్క రకంగా ఉంటాయన్న విషయాన్ని మరువకూడదు. కనుక భార్యా భర్తలకు సంబంధించిన కేసుల విషయంలో పట్టు విడుపుల విధానావలంబన అవసరం.

## పోలీసుల పాత్ర

ఆత్మరక్షణావసరం గలిగినపుడు, పోలీసు రక్షణకు బాధితస్త్రీ పరుగు దీయటం సహజం. పోలీసు రక్షణ బాధితులకు రోజులోని అన్ని సమయాలలోనూ లభిస్తుంది. ఇది చట్ట నిర్దేశం. పోలీసులు, వైద్యశాలలోని ఎమర్జన్సీ విభాగం తప్ప రోజులోని 24 గంటలూ సర్వీసు నిచ్చేశాఖ, మరొకటి లేదు. భార్యాభర్తల వివాదం సామాన్యంగా సాయం సమయాలలోనో, రాత్రివేళలలోనో సంభవిస్తుంది. కనుక, బాధిత స్త్రీకి రాత్రివేళల రక్షణ అవసరమవుతుంది. తొలుత ఆవిడకు అందేది పోలీసు రక్షణ. ఈ శాఖ రోజులోని 24 గంటలూ సేవలో ఉన్నా అది సక్రమంగా బాధితులను ఆదరిస్తున్నదన్న భావన మాత్రం ప్రజామణిలో లేదు. ప్రజల అసంతృప్తి మాత్రమే ఆ శాఖకు దక్కుతున్నది. కుటుంబంలో జరిగేది భార్యా భర్తల 'ప్రైవేట్ వ్యవహారం'. వారి వైవాహిక బంధానికి సంబంధించిన అంశాలు వివాదంలో ఉంటాయి. ఇందులో ఇతరుల జోక్యం తగదు అన్నది సామాజికుల భావన. కనుక పోలీసులు కూడా, కుటుంబ కలహంలో జోక్యం చేసుకోవటానికి సాహసించరు. జోక్యానికి అవసరమైన నేరారోపణకు, బలమైన ఆధారాలుండాలి. కుటుంబ విషయాల యెడల దాని సభ్యులు పాటించే రహస్యం వల్ల, పోలీసులు నిజ పరిస్థితిని అంచనా వేయలేరు. అది ఏదో చిన్న వివాదం లెమ్మని ఊరుకొంటే ఆ వివాదం హత్యకు కూడా దారి దీయవచ్చు. పెట్టిన కేసులలో నిందితుని నేరస్తునిగా రుజువు చేయలేక పోతే, అది పోలీసుల "దురాగతంగా"నో, పోలీసు శాఖ సామర్థ్యానికి మచ్చగానో మిగులుతుంది. ఇలాంటి సందేహాలతో పోలీసులు కుటుంబ కలహంలో జోక్యం చేసుకోవటానికి వెనుకాడతారు. వీధిలో జరిగే క్రిమినల్ చర్యలతో వ్యవహరించినంత చురుకుగా, కరుకుగా పోలీసులు, కుటుంబీకుల విషయాలలో వ్యవహరించరు. పోలీసులు జాగ్రత్త తీసుకొని, భార్యను హింసించిన భర్తమీద కేసు పెడతారని అనుకొందాం. కోర్టు విచారణలో, బాధిత మహిళ సాక్ష్యమివ్వటానికి నిరాకరించవచ్చు; లేదా కేసు ఉపసంహరణను కోరవచ్చు. ఇలా ఆవిడ మనస్సు మార్చుకోవటానికి పలు కారణాలుంటాయి. ఈ చిక్కులలో తల దూర్చటానికి పోలీసు అధికారులు ఇష్టపడరు. వీరుకూడా, సామాజికుల వలె,భార్యాభర్తల కలహం, కుటుంబ విషయంగా భావించి, దానిని పట్టించుకోక పోవటం కూడా సహజం; భార్యను భర్త కొట్టటాన్ని సమాజం ఆమోదిస్తున్నపుడు, వ్యక్తి పోలీసు అధికారి అయినంత మాత్రాన, ఈ సూత్రానికి అతీతుడుగా వ్యవహరించటం కష్టం.

భార్యను భర్త హింసించే కేసుల విషయంలో పోలీసుల పాత్రను చట్టాలు స్పష్టంగా నిర్దేశించటం లేదని, పలురకాల నిర్వచనాలకు అవకాశాన్నిస్తున్నాయని లీగల్ పండితులు చెబుతున్నారు. స్త్రీ హింస విషయంలో, సామాజికులకే ఏకాభిప్రాయం లేదు. భార్యను భర్త హింసించటం క్రిమినల్

నేరంగా భావించే వారున్నారు; భార్యను భర్త "దండించటం" మంచిది, అవసరము అనేవారున్నారు. కుటుంబ కలహం భార్యాభర్తలకు సంబంధించిన వ్యవహారం; పరులుజోక్యం గలిగించుకోవటం అక్రమమని నమ్మేవారూ ఉన్నారు. సమాజంలోనే ఏకాభిప్రాయం లేపుడు, అస్పష్టతకు తావులేని చట్టాలు రూపొందటం సాధ్యంగాదు. పోలీసులు కూడా ఈ కేసుల విషయంలో ఒకే విధంగా వ్యవహరించలేరు; కృత నిశ్చయంతో కూడా వ్యవహరించటం కష్టం. సామాజికులంతా ఏక కంఠంతో స్త్రీ హింసను ఖండించగలిగినపుడే ఈ అస్పష్టతలు, సాచివేత విధానాలు అంతరిస్తాయి. పోలీసులు కూడా కృత నిశ్చయంతో వ్యవహరిస్తారు.

## అవగాహనా లోపము - తర్ఫీదు లేమి

పోలీసులు పటుతరంగా వ్యవహరించలేక పోవటానికి మూడు కారణాలు ప్రధానంగా కనుపిస్తున్నాయి : 1. నిందితుని ఇంట్లో ప్రవేశించటం అతనిని అరెస్టు చేయటం, బెయిలు మీద నిందితుని విడుదల చేయటం వంటి అంశాలలో, పోలీసుల అధికారాలను చట్టాలు స్పష్టంగా నిర్దేశించక, అస్పష్టంగా ఉంటున్నాయి; సమయానుకూల నిర్వచనాలకు తావిస్తున్నాయి; 2. భార్యాభర్తల కలహంలో అవలంబించ దగిన వైఖరిని చట్టాలు స్పష్టం చేయటం లేదు. ఇందువల్ల, ఒక్కొక్క అధికారి తనకు ఉచితమని తోచిన రీతిని వ్యవహరించటానికి అవకాశాలేర్పడ్డాయి. 3. కుటుబ కలహం విషయంలో వ్యవహరించవలసిన తీరు మీదా అది సంభవించటానికి వీలున్న కారణాలను గురించి, పోలీసు ఉద్యోగులకు అవసరమైన తర్ఫీదు లభించటం లేదు. ఇందువల్ల కలహ కారణాలను గాని, బాధిత వ్యక్తి యొక్క పరిస్థితి తీవ్రతనుగాని అధికారులు గుర్తించలేక పోతున్నారు. సమస్యా తీవ్రతను గుర్తించలేనపుడు, దాని పరిష్కారానికి లభించే ప్రతి స్పందన కూడా స్వల్పంగానే ఉండటం సహజం. భార్యా భర్తల కలహ పరిష్కారం జటిలమైన సమస్య. ఒక్కొక్క సారి ఇది అతి ప్రమాదకరంగా కూడా పరిణమించవచ్చు; మనస్సున్న వారినీ సమస్య కలచి వేస్తుంది. కొన్ని దేశాలలో నిందితుల అరెస్టుకు, వారిపై కేసులు పెట్టటానికి అవగాహనా లోపం ఉండటం వల్ల అవి సక్రమంగా అమలు జరగటం లేదు. పోలీసులకు ఈ సమస్య మీద ప్రత్యేక తర్ఫీదు అవసరమని ఈ అవరోధం స్పష్టం చేస్తున్నది

ఈ సమస్యా పరిష్కారంలో విజయ సాధన అనేది, పోలీసు అధికారికి లభించిన తర్ఫీదును బట్టి, ఆ ఉద్యోగి యొక్క మానసిక పరిపక్వత, నైతిక స్థాయిని బట్టి ఉంటుంది భార్యాహింస మీద పోలీసులకు తర్ఫీదు నివ్వటం వల్ల, ఈ సమస్య మీద వీరిలో ఇపుడున్న అలసత్వం పోతుంది.

ఇది ఒక్క పోలీసు శాఖ మాత్రమే పరిష్కరించగలిగిన సమస్య కాదు; వైద్య, లీగల్, సామాజిక సేవకుల సహకారం కూడా అవసరమవుతుంది. ఇప్పటికే కొన్ని దేశాలు ఇలాంటి విధానాలను అమలు జరుపుతున్నాయి. కాని ఇది అధిక ఖర్చులతో కూడిన పని. అన్ని బాధ్యతలను, ఖర్చులను ప్రభుత్వమే భరించి, బాధితను రక్షించటం ఇందులోని వ్యూహం.

సమస్యా పరిష్కారానికి వ్యూహం ఎంత ముఖ్యమైనదో ఆ కేసుల యొక్క వివరాలను చక్కగా రికార్డు చేయటం కూడా అంత కీలకమైనదని నిపుణులు సూచిస్తున్నారు.

భార్యాభర్తల కలహం, వీధిలో జరిగే నేరాల వంటిది గాదు. బాధిత స్త్రీ, బాధిస్తున్న పురుషుని మీద ఆర్థికంగానే గాక, మానసికంగా కూడా ఆధారపడి ఉంటుందనే విషయాన్ని మనం మరువకూడదు. వారి అనుబంధాన్ని విస్మరించ కూడదు. భర్త కొట్టటం మానితే, వారితో కాపురం చేయటానికి సంసిద్ధతను చూపే స్త్రీలు అధికంగా ఉంటారు. ఇందువల్ల పోలీసు, క్రిమినల్ చట్టాలను, యాంత్రికంగా ఈ కేసుల్లో వాడటానికి వీలుండదు. అట్లని వారు ఉదాసీన వైఖరి నవలంబిస్తే, తన దాడికి తిరుగులేదని పురుషుడు చెలరేగి, భార్యాహింసను కొనసాగించే ప్రమాదం కూడా ఉంటుంది. తాను నిస్సహాయనని బాధిత స్త్రీ మానసికంగా క్రుంగి పోయే అవకాశాలుకూడా ఉంటాయి.

పోలీసు చర్యలు సమాజం యొక్క నైతిక స్థాయికి ప్రతిబింబాలని కొందరు సామాజిక శాస్త్రవేత్తలు సూచిస్తున్నారు. భార్యాహింసను సమాజం ఏక కంఠంతో ఖండిస్తేనే, పోలీసులు ఈ కేసుల విషయంలో పటుతరంగా వ్యవహరించగలరు. పోలీసులు కృత నిశ్చయంతో వ్యవహరించాలంటే వారికి సామాజికుల అండదండలే గాదు, న్యాయ వైద్య శాఖల సహకారం కూడా అవసరం. వైద్య శాఖ వారు, కేసుకు

బలాన్నిచ్చే పరీక్షా రిపోర్టులను ఇవ్వకపోయినా, న్యాయశాఖ నిందితుని చర్యలను తీవ్రమైనవిగా పరిగణించక పోయినా కేసు నిలువదు, పెట్టిన కేసులను రుజువు చేయలేని "అసమర్థత" పోలీసులకు సంక్రమిస్తుంది. కనుక, ఇలాంటి సహకారం లభించనపుడు పోలీసుశాఖ కూడా పట్టీ - పట్టనట్లు వ్యవహరించబూనటం సహజం. క్రిమినల్ న్యాయంతో సంబంధమున్న అన్ని విభాగాలు, సామాజికులు కూడా సదవగహనతో, కృతనిశ్చయంతో కృషి చేయగలిగినపుడే పోలీసులు కూడా సమయోచితంగా, సమర్థవంతంగా వ్యవహరించగలరు.

## కోర్టుల పాత్ర

భర్త చేతిలో హింసననుభవిస్తున్న స్త్రీకి, కొన్ని రకాల విముక్తిని ఇవ్వగల చట్టాలు పలుదేశాలలో అమలులో ఉన్నాయి. భర్త మీద క్రిమినల్, సివిల్ చర్యలు, విడాకులు ఇందులోని భాగాలు ఇప్పటికి అమలులో ఉన్న చట్టాల వల్ల బాధితలకు లభిస్తున్న రక్షణ ఏపాటిదో ఇంతకు పూర్వమే చూచాం. దీనిని బట్టి చట్టాలలో లోపాలున్నాయి గనుకనే, బాధిత స్త్రీలకు న్యాయం జరగటం లేదు అన్న నిర్ణయానికి రాకూడదు. సమాజంలో మార్పులు రానిదే చట్టాలు బాధితలను రక్షించలేవు, ఇది గమనించదగిన అంశం. స్త్రీ హింస లీగల్ సమస్య గాదు; ఇది సాంఘిక సమస్య, కనుక చట్టం ఒక్కటే దీనిని తొలగించలేదు. స్త్రీ యెడల సామాజిక దృక్పథమే మారాలి. చట్ట ప్రయోగం కత్తివేటు వంటిది. అది ప్రాణం పోయలేదు, ఎండిన మోడు వంటి జీవితాన్ని చిగురింప జేయలేదు; ఈర్ష్యను చంపలేదు; ప్లాన్ ప్రకారం మహిళ మీద జరిగే హింసను ఆపలేదు; అట్లని చట్టము బాధిత మహిళల రక్షణకు పనికిరాదని భావించ కూడదు. మన చట్టాలు కూడా సామాజిక సంస్కృతీ సంప్రదాయాలకు అనుగుణంగానే ఉంటాయి. స్త్రీ హింస యెడల వీరి దృక్పథం మారినపుడు, చట్టాలు కూడా న్యాయం గానే అమలు జరుగుతాయి. పోలీసుల వైఖరి, సామాజిక నైతిక భావనలను ప్రతిబింబించినట్లే చట్టాల రూపకల్పనలో కూడా ఇది ప్రతిఫలిస్తుందన్న సంగతిని మనం మరువ కూడదు.

చట్టాల ఆదేశాలకు యాంత్రిక విశ్లేషణల నిస్తూండటం వల్ల బాధితలకు న్యాయం జరుగక పోవటం అనేది పలుదేశాలలోనూ కనుపిస్తున్నది. ఈ కేసులతో వ్యవహరించే పోలీసులు, ప్రాసిక్యూటర్లు, జడ్జీలు-అంతా తమకు తోచిన పద్ధతిని వ్యవహరిస్తుంటారు 'కుటుంబంలో జరిగే వ్యవహారం భార్యాభర్తల ప్రైవేటు విషయం, దీనిలో మనం జోక్యం కలిగించుకో కూడదు" అనే భావం, వీరి ఉద్యోగ విధి నిర్వహణలో కూడా పూసలలో దారం వలె ఉంటుంది. ఇందువల్ల ప్రాసిక్యూటర్లు, ఫిర్యాదు చేసిన బాధితకు నచ్చజెప్పి, కేసును ఉపసంహరించుకొని బాధించే భర్తతో వెళ్ళమని చెప్పటం అతి సాధారణ విషయం మాటలతో చెప్పని వారు చేతలతో చెబుతారు, అంటే కేసు కొట్టివేతకు దారితీస్తారు.

బాధితకు న్యాయం జరగటం అనేది ప్రధానంగా ఆవిడ కేసును విచారించే న్యాయమూర్తి వైఖరిని బట్టి ఉంటుంది. చట్టాలలోని అంశాలు, పలు రకాల విశ్లేషణలకు అవకాశాల నిస్తుండవచ్చు. కొన్ని చోట్ల కొన్ని స్పష్టమైన ఆదేశాలనవి ఇస్తుండక పోవచ్చు ఇలాంటి సందర్భాలలో న్యాయమూర్తి తనకు తోచిన వైఖరిని అవలంబిస్తారు. భార్యా భర్తల కలహం విషయంలో భర్తల యెడల సానుభూతి ప్రదర్శన మనకు కొన్ని తరాలుగా కనుపిస్తూనే ఉన్నది. భార్య భర్త యొక్క సొత్తుగా, అతని మీద ఆధారపడి జీవిస్తున్న ప్రాణిగా పరిగణనను పొందుతున్న సమాజంలో, సానుభూతి పురుషునికే గదా లభించేది!

బాధిత స్త్రీకి న్యాయం జరగటం అనేది ఏ ఒక్క శాఖ మీదనో ఆధారపడి లేదు. ఇది పోలీసు శాఖ నుండి అంతిమ తీర్పు నిచ్చే న్యాయశాఖ వరకూ ఆధారపడి ఉంటుంది. ఈ వ్యవస్థలో స్త్రీకి న్యాయం జరగకపోవటానికి మనకు కొన్ని స్పష్టమైన కారణాలు కనుపిస్తున్నాయి:

1. లీగల్ సిస్టం యొక్క అన్ని దశలలోనూ, భార్య ఎందుకు హింసకు గురవుతున్నది, దాని ప్రభావం కుటుంబ జీవనం మీదా, సమాజం మీదా, ఆర్థిక వ్యవస్థ మీద ఎలా ఉంటుంది అనే విషయం ఎవరికీ తెలియదు. కుటుంబం అంటే అదొక ప్రైవేట్ వ్యవస్థగానూ, భార్యను భరింపబడే వ్యక్తిగానూ, పురుషుడు ఈ రంగంలో సర్వాధికారిగానూ సమాజం గుర్తిస్తున్నది. బ్రిటిష్ కొలంబియా యూనివర్శిటీకి చెందిన ప్రొఫెసర్ జాన్ హగర్ట్ చెప్పినట్లు, "కుటుంబం అనేది సభ్య సమాజానికి ప్రాణం వంటిదన్న సంప్రదాయ భావనా

వలయం నుండి జడ్జీలు బయటబడలేక పోతున్నారు అందుచేత రాజీ చేయాలనే దృక్పథంతోనే వారు వ్యవహరిస్తూంటారు "

2 న్యాయమూర్తి కేసును కొట్టి వేసినా, లేక నిందితుని నేరానికి తగిన శిక్ష విధించక పోయినా, లేక తేలిక శిక్షతో పోనిచ్చినా పోలీసులు, ప్రాసిక్యూటర్లు నిరుత్సాహపడతారు. ఇందులోని భాగస్వాములంతా కృతనిశ్చయంతోనూ, సదవగహనతోనూ పని చేయకపోవటమే ఈ పరిణామానికి కారణం. ఒక్కొక్కసారి కఠిన దండనకు తగిన ప్రాతిపదిక న్యాయమూర్తికి 'కనుపించక పోవటం' కూడా కేసు కొట్టివేతకు కారణం గావచ్చు.

3. కుటుంబ కలహానికి సంబంధించిన కేసుల పరిష్కారంలో, మామూలు క్రిమినల్ నేరాల కేసులో నిందితులకు విధించినట్లు అతి కఠినమైన శిక్షలను విధించటం కొందరు న్యాయమూర్తులకు గిట్టకపోవచ్చు. భార్యను బాధించిన నిందితునకు జైలుశిక్ష విధిస్తే, అతని కుటుంబం సంపాదనాపరుని ఆర్జనను కోల్పోతుంది; జరిమానా విధిస్తే కుటుంబం మీద ఆర్థిక భారం పెరుగుతుంది. రెండు విధాలుగా కుటుంబం, బాధిత ఇల్లాలితో సహా నష్టపడుతుంది. ఇలాంటి మానవతా దృక్పథంతో కొందరు న్యాయమూర్తులు నేరస్తునికి తేలికపాటి శిక్షను - సామాన్యంగా నామమాత్రపు జరిమానా వంటి వాటిని - విధిస్తుంటారు.

4. కోర్టు లెపుడూ కేసులతో తలమునకలుగా ఉంటాయి. అవి సంవత్సరంలో పరిష్కరించే కేసుల కంటే, క్రొత్తగా రిజష్టరయ్యేవి అధికంగా ఉంటున్న రోజులివి. అందువల్ల ఈ వత్తిడి తగ్గింపు ప్రయత్నంగా, భార్యాభర్తల వివాదకేసులలో సామాన్యంగా రాజీకి ప్రోత్సహిస్తూ ఉంటారు. ఇలాంటి సందర్భాలలో బాధిత నష్టపడే అవకాశాలుంటాయి. నిందితుని సక్రమ మార్గానికి మళ్ళించే యంత్రాంగం లేనపుడు అతడు తిరిగి భార్య హింసకు పూనుకొనే అవకాశాలే అధికంగా ఉంటాయి.

కుటుంబ విచ్ఛిత్తిని ఆపాలన్న వర్తమాన సామాజిక సూత్రమే సంప్రదింపుల ద్వారా సమస్యా పరిష్కార మార్గావలంబనకు దారిదీస్తున్నది. భార్యాభర్తలకు సయోధ్యను కుదర్చటానికి ఇది చక్కని మానవతా దృక్పథ మార్గంగా కనుపిస్తుంది సంధి కుదిర్చే వారిలోనూ, సంధి సూత్రాలకు కట్టుబడి ఉండవలసిన స్త్రీ-పురుషులలోనూ - ముఖ్యంగా స్త్రీని బాధించే పురుషునిలోనూ - రాజీపడాలన్న భావం ఉన్నపుడే, దీనివల్ల ప్రయోజనం ఉంటుంది. కాని ఇటువంటి పరిష్కారం అమలు జరగటం అరుదు. అందుకే ఈ రాజీ విధానాన్ని అధికులు వ్యతిరేకిస్తున్నారు.

ఈ రాజీ విధానంలో బలవంతుడయిన భర్తను, అతని చేతి క్రింది భార్యనూ సమానులుగా ఎంచుతున్నారు. వియ్యమయినా, కయ్యమయినా సమానులతోనే సాధ్యమన్నది లోకోక్తి. అటువంటపుడు ఈ అసమానుల మధ్య సయోధ్య సాధ్యమా? ఈ రాజీ విధానంలో భార్యను కొట్టిన భర్తకు శిక్ష లేదు; దెబ్బలు తిన్న భార్యదే తప్పిదమంతా. అంటే, భర్త కొట్టకుండా ఉండాలంటే, భార్య తన ప్రవర్తనను, వారి అభీష్టాను గుణంగా మార్చుకోవాలన్న మాట; అపుడే ఆవిడకు దెబ్బలు తప్పుతాయి! ఈ విధంగా హింసకు గురవుతున్న ఇల్లాలి బాధలు, సమస్యలు మరుగున పడిపోతున్నాయి; అప్రధానాలవుతున్నాయి. రాజీ అంటూ ఏదయినా జరిగితే, రాజీసూత్రాలను భర్త పాటిస్తాడన్న గ్యారెంటీ ఏమీ లేదు; రాజీ సూత్రాలను భర్త పాటించనపుడు, ఆవిడను హింస నుండి రక్షించే వారెవరూ ఉండరు. ఈ విధంగా ఇల్లాలు బాధితగానే ఉండి పోవలసి వస్తున్నది.

ఇటువంటి రాజీవిధానాలు ప్రధానంగా బాధించే భర్తకే ప్రయోజనకరంగా ఉంటాయి. రాజీపేరిట తన భార్య తన దగ్గరకు రావాలనే అతడు కోరతాడు. భార్య ఎలాగూ తనగూటికే వస్తుంది గనుక, రాజీ షరతులను భార్య కంటే ముందే భర్త అంగీకరిస్తాడు. ఆ సంప్రదింపులలో భర్త ముందు, షరతులను విధించే ధైర్యం భార్యకు ఉండదు. కనుక ఆవిడ తల ఊపి అతనితో వెళ్ళనిచ్చగించవచ్చు. "భర్త అధికారానికి లోబడి అతని అభీష్టం ప్రకారం భార్య నడచుకోవాలి. భార్యను బాధించిన భర్తకు భయం లేదు" అన్న సూత్రానికి ఈ రాజీ సంకేతంగా కనుపిస్తుంది.

భర్త ప్రవర్తనను దిద్దటమో, భార్యను బాధించకుండా అతనిని చట్టపరమైన మార్గాల ద్వారా నిరోధించటమో గాకుండా, ఈ రాజీ, మధ్యమార్గంగా ఉంటున్నది. ఇలాంటి "రాజీల" అమలులో చాలా సమస్యలుంటాయి. ప్రధానంగా ఇవి

బాధితకు భద్రతను కల్పించలేవు. రాజమార్గాలను అవలంబించే సంప్రదాయాలున్న సమాజాలలో ఇవి సత్ఫలితాలనీయగలవేమో? చైనాలో ప్రాంతీయ కమిటీలని ఉన్నాయి. ఇవి ఇలాంటి కేసులను పరిష్కరిస్తాయి. పాపు న్యూగినీలో విలేజ కోర్టులు ఈ పనిని చేస్తున్నాయి. ఆఫ్రికాలోని కొన్ని దేశాలలో సామాజిక కమిటీలున్నాయి. వీటి తీర్పులను సామాజికులు అంగీకరిస్తున్నారని చెబుతున్నారు. హింసా నివారణకు ఏ మార్గాన్ని అవలంబించినా, నిందితుడైన పురుషుడు తాను చేసిన నేరానికి బాధ్యునిగా చేయటం మాత్రం అవసరం; ఇల్లాలికి రక్షణ లభించాలి. నేరస్తుడయిన పురుషుని అరెస్టు జరిగితే, అతనికి శిక్షపడాలి. అపుడే భార్యకు, హింస నుండి తనకు రక్షణ లభిస్తుందనే విశ్వాసం గలుగుతుంది.

ఒక్క లీగల్ పరిష్కారాలే స్త్రీ హింసా నిరోధానికి చాలవు. లీగల్ చర్యలు జయప్రదం గావాలంటే, స్త్రీ హింస యెడల ఇపుడున్న సామాజిక దృక్పథం మారాలి. ఈ మార్పుకు ప్రభుత్వం తగిన చర్యలను చేబట్టాలి. బాధిత స్త్రీలకు రక్షణ నిచ్చే బాధ్యతను ప్రభుత్వం తీసుకోవాలి. ఈ హింసా నివారణలో పాల్గొనే అన్ని ఏజెన్సీలకు చెందిన ఉద్యోగులకు ఈ సమస్య మీద అవగహనలభించే తర్ఫీదు కార్యక్రమాలను నిర్వహించాలి. భార్య హింసకు పాల్పడిన వ్యక్తి చర్యను సామాజికులు నిరసించేట్లు అవసరమైన ప్రచారం జరగాలి. బాధితులకు అవసరమైన రక్షణను, వసతులను కల్పిస్తూ, ఈ సమస్యను పరిష్కరించవలసిన లీగల్ యంత్రాంగపు వివిధ శాఖల కార్య నిర్వహణను సమన్వయీకరించాలి. దీనికి అనువుగా సామాజిక సంక్షేమ వ్యవస్థా, వైద్య చికిత్సా వ్యవస్థ, లీగల్ వ్యవస్థకు అవసరమైన సహకారాన్ని అందజేయాలి. ఇవన్నీ పరస్పర సదవగహన, సహకార ప్రాతిపదిక మీద పనిచేసేట్లు చూడాలి

## హింసా నివారణలో వైద్య చికిత్సా రంగపు పాత్ర

మహిళలకు వైద్య చికిత్సా రంగానికి సన్నిహిత సంబంధం ఉన్నది. ఇంతటి అనుబంధం మహిళలకు మరో సంస్థతో లేదని చెప్పటం అతిశయోక్తిగాదు. గర్భనిరోధక విధానాల అవలంబన దగ్గర నుండి పిల్లలను కన్న తర్వాత కూడా మహిళలు వైద్యులను సంప్రదిస్తూనే ఉంటారు. ఉంటున్నట్లు వారు. అంతరంగిక విషయాలను ఇతరుల పరీక్షించే వైద్య సిబ్బంది ముందు నిస్సంకోచంగా వెళ్ళబోసుకోవటానికి సంకోచించరు. హ్యూస్టన్‌లోనూ, టెక్సాస్ లోని ఆగ్నేయ ప్రాంతంలోనూ ప్లాన్డ్ పేరెంట్‌హుడ్ అనే సేవా సంస్థ చురుకుగా పని చేస్తున్నది. ఈ సంస్థ సహాయార్థం వచ్చే వారిలో 8 2 శాతం మంది మాత్రమే భర్త హింసకు గురయినట్లు చెప్పారు. వైద్య సిబ్బంది దగ్గరకు వచ్చే వారిలో నూటికి 29 మంది తాము భర్త హింసతో బాధపడుతున్నట్లు చెప్పారు! భర్త గమనించకుండా, వారిని ఏకాంతంలో ప్రశ్నిస్తే ఉన్న విషయమంతా దాచుకోకుండా వైద్య సిబ్బందికి చెబుతారు. ప్రసూతి కేంద్రాలలోనూ, ఎమర్జన్సీ విభాగాలలోనూ, పేషెంట్లను సానుభూతితో ప్రశ్నించగలిగితే, వారి అంతర్యాన్ని రాబట్టటం కష్టం కాదని ఇలాంటి కార్యక్రమాలలో పాల్గొంటున్న బ్రెజీలియన్ మహిళా డాక్టర్ ఏన్. ఫ్లేవియా వెల్లడించారు.

బాధితులకు వైద్య సేవల నందించే వారు, తరచూ భర్త హింసకు గురయ్యే మహిళలకు, రాబోయే ప్రమాదాలను గురించి సకాలంలో హెచ్చరికలు చేయవచ్చు. అమెరికాలోని కొన్ని స్వచ్ఛంద సంస్థలు బాధితులను అడగటానికి కొన్ని ప్రశ్నలను రూపొందించాయి. వాటిలోనివి ఇవి కొన్ని :

- గత సంవత్సరం కంటె ఈ సంవత్సరం భర్త హింస పెరిగిందా?
- మీ ఇంట్లో తుపాకి ఉన్నదా?
- భర్త ఎపుడయినా నిన్ను చంపుతానని బెదిరించాడా?
- సెక్సు సంపర్కాన్ని నీవు కోరనపుడు, నీ అభీష్టానికి వ్యతిరేకంగా ఎపుడయినా నీ భర్త బలవంతం చేశాడా?
- నీ భర్త, బయటి వారితో కూడా పోట్లాడుతూ ఉంటాడా?
- నీ భర్త రోజూగాని, తరచుగా గాని తాగి వస్తూంటాడా?
- నీవు చూలాలుగా ఉన్నపుడు, నీ భర్త ఎపుడయినా కొట్టాడా?

ఈ ప్రశ్నలకు బాధితురాలిచ్చే సమాధానాలను బట్టి ఆవిడకు ప్రాణహాని ప్రమాదం ఏర్పడినదని వైద్య సేవకులు భావించినపుడు, జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తారు. ఈ

విధానం చాలా ప్రయోజన కరంగా ఉంటున్నది. అయితే ఇదే ప్రశ్నావళి, అన్ని సమాజాలకు వర్తించకపోవచ్చునని కూడా వీరు సూచిస్తున్నారు.

బాధితురాలి బాధలను వైద్యులు గుర్తించ గలిగినా, వారిలో అతి కొద్దిమంది మాత్రమే బాధితురాలిని సానుభూతితో అర్థం చేసుకొని, ఆవిడకు సమయానికి తగిన సలహాల నిస్తున్నట్లు అనుభవం నిరూపిస్తున్నది ఇందుకొక్క ఉదాహరణః అమెరికాలోని ఒక పట్టణ ప్రాంతంలోని వైద్య శాలలో, భర్తలు కొట్టిన దెబ్బల పర్యవసానంగా, చికిత్స కోసం వచ్చి ఎమర్జన్సీ విభాగంలో చేరిన 481 మంది పేషెంట్లలోనూ, 2.8 శాతం మంది మాత్రమే భర్తల దెబ్బల ఫలితాన్ని వారు అనుభవిస్తున్నట్లు, వైద్యులు నిర్ధారణ చేశారు! (భర్తల చేతిలో దెబ్బలు తిన్నవారంతా ఆ విషయాన్ని వైద్యులకు చెప్పలేదు) ఈ కేసుల వివరాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, పదహారు శాతం మంది పేషెంట్లు భర్తల చేత దెబ్బలు తినటం వల్ల రోగులయినారని అనుమానించే అవకాశాలున్నాయని తేలింది. పది శాతం మందిలో భర్తల దెబ్బల ఫలితాలు స్పష్టంగా నిర్ధారణ చేయగల రుజువులు కనిపించాయి! ఈ విషయాన్ని డాక్టర్. సి. వర్మా తమ పరిశోధనా పత్రంలో వివరించారు. (1989)

దక్షిణాఫ్రికాలో జోహెన్స్‌బర్గ్ సమీపంలో పెరుగుతున్న అలెగ్జాండ్రియా టౌన్‌షిప్‌లోని వైద్యశాలకు చెందిన కాజువాలిటీ విభాగానికి వచ్చిన కేసుల మీద కూడా పరిశీలనలు జరిగాయి. 1991 వ సంవత్సరం అక్టోబరు, నవంబరు మాసాలలో ఈ సర్వే జరిగింది. నూరింట డెబ్బై ఎనిమిది మంది వైద్య పరీక్షలలో, వారిని గాయపరచిన వారెవరో డాక్టర్లు వ్రాయలేదు! పేషంట్ గాయపడిన స్వభావాన్ని మాత్రమే వివరించారు. కొన్ని కేసులలో డాక్టర్లు వ్రాసిన రికార్డులోని పదజాలం ఇలా ఉంది: "గొడ్డలి వేటుకు లోనైంది"; "కత్తిపోటుకు గురైంది"; ఎవరి చేతననే అంశపు ప్రస్తావన డాక్టరు రిపోర్టులో లేదు! నిందితులను పేర్కొన్న సందర్భాలలో రికార్డులో వ్రాసిన విధానమిది :

- ముప్పై సంవత్సరాల మహిళను, ఆవిడ బోయ్‌ఫ్రెండ్ తన్నాడు; స్క్రూడ్రైవరుతో పొడిచాడు. ఆవిడ మర్మావయం మీద చీరుకు పోయిన గుర్తులున్నాయి, వాపు ఉన్నది.
- 32 సంవత్సరాల మహిళను ఆవిడ భర్త హింసించి, మానభంగం చేశాడు. స్థానిక సంప్రదాయ వైద్యుని సలహాకు వెళ్ళినపుడు, అతడు కూడా ఆవిడను చెరిచాడు.
- 32 సంవత్సరాల స్త్రీ, భర్త పెట్టే బాధలను భరించలేక, తమ బంధువుల అండ జేరటానికి పయనమై వెళుతుండగా, దారిలో ముగ్గురు ఆవిడను చెరిచారు.
- పదిహేను సంవత్సరాల చూలాలిని, వారి ప్రక్కింటి వాడు చెరిచాడు. అపుడు ఆవిడ భర్త ఊరిలో లేడు; కాంట్రాక్టు పనిమీద మరొక గ్రామంలో పని చేస్తున్నాడు.

డాక్టరు వ్రాసే వైద్య పరీక్ష రిపోర్టుకు నిందితుని నేర నిర్ధారణలో అత్యంత ప్రాముఖ్యం ఉంటుంది. నిందితుని చర్యలను అతడు స్పష్టంగా వివరించకపోతే కేసు నిలువదు. 1995 వ సంవత్సరంలో, హర్యానా రాష్ట్రపు జింద్ జిల్లా పడన గ్రామానికి చెందిన విద్యార్థిని సామూహిక మానభంగానికి గురైంది ఆవిడను పరీక్షించిన ఫోరెన్సిక్ నిపుణులు, పురుష వీర్యం నిందితుల గుడ్డల మీదనే గాక, బాధితురాలి లంగా మీద పడిన గుర్తులున్నట్లు రికార్డు చేశారు. కాని సెక్సు సంపర్కం జరిగినట్లు తమ పరీక్షలో నిర్ధారణ కాలేదనీ, మానభంగ ప్రయత్నం మాత్రమే జరిగింది అని వ్రాశారు. దీనికి తోడు, ఆవిడ ప్రతి ఘటించి ఉంటే ఆవిడ ఒంటి మీద గాయాలు గాని, గాట్లుగాని పడి ఉండేవి. ఇలాంటి సూచనలు కూడా లేవని ఆ వైద్య నిపుణులు వ్రాశారు దీని ఆధారంతోజిల్లా సెషన్సు జడ్జీ మానభంగపు ఆరోపణలు "రుజువు" కాలేదని కేసును కొట్టి వేశారు. కాని వాస్తవమేమిటో గ్రామస్తులందరకూ తెలుసు. అయినా కేసు అతి సులభంగా మాసిపోయింది! దీనిని బట్టి డాక్టరు రిపోర్టు నిందితుల నేర నిరూపణలో ఎంత కీలక పాత్రను వహిస్తుందో ఊహించవచ్చు.

మగవారి చేతిలో హింసకు గురయిన సూచనలు బాధిత మహిళలో ఎలా కనుపిస్తాయో, వాటి స్వభావమేమిటో, తెలుసుకోవటానికి, బాధితురాలికి న్యాయం జరిగేట్లుగా వైద్య పరీక్షా రిపోర్టులను వ్రాయటానికి అవసరమైన తర్ఫీదును ఫోరెన్సిక్ వైద్యులకు ఇప్పించటం అవసరం. పెన్సిల్వేనియా మెడికల్ కాలేజికి చెందిన ఎమర్జన్సీ మెడికల్ కేర్ విభాగము సిబ్బందికి ఇటువంటి తర్ఫీదును ఇప్పించారు. విభాగంలో చేరిన వారిలో భర్త చేతిలో హింసను అనుభవించటం వల్ల

వచ్చిన వారి సంఖ్యా పరిమాణం ఇంతకు పూర్వం 5.6 శాతంగా మాత్రమే ఉండేది వైద్య సిబ్బంది తర్ఫీదు తర్వాత ఈ రకపు పేషంట్ల పరిమాణం ఐదురెట్లు (5.6 నుండి 30 శాతానికి) పెరిగింది! ఈ విషయాన్ని డాక్టర్ మెక్లియర్, అన్వర్‌లు అమెరికన్ జర్నల్ ఆఫ్ పబ్లిక్ హెల్తులో రిపోర్టు చేశారు కుటుంబాలలో స్త్రీల మీద జరిగే హింసను గురించి డాక్టర్లకు, ప్రజలకు వివరించటానికి అమెరికన్ మెడికల్ అసోసియేషన్ కృషిచేస్తున్నది. 1992 వ సంవత్సరంలో స్త్రీ హింస మీద ఈ సంస్థ తన ఆధిపత్యాన నడుస్తున్న జర్నల్ ఆఫ్ అమెరికన్ అసోసియేషన్ ప్రత్యేక సంచికను కూడా వెలువరించింది

కొన్ని సందర్భాలలో బాధిత మహిళలు వైద్య సిబ్బంది చేతిలో అవమానాల పాలవుతున్నారు సిబ్బంది, బాధితుల యెడల సానుభూతిని చూపకపోగా అపహాస్యం చేయటం, చులకనగా మాట్లాడటం కనుపిస్తున్నది. ఇలాంటి మనస్తత్వం ఉన్నవారు, బాధితురాలికి న్యాయం జరగటానికి వీలుగా వైద్య పరీక్షా రిపోర్టును వ్రాయగలరని విశ్వసించలేము. భర్త చేతిలో హింసకు గురవుతున్న మహిళల బాధలను గుర్తించలేని వైద్యులు వారిని శాశ్వతంగా నరకకూపానికి నెడుతున్నారు. భర్త హింసను గుర్తించలేని వారూ, గుర్తించినా తమకెందుకు, అది వారి ఆంతరంగిక వ్యవహారమని భావించేవారూ యాంత్రికంగా చికిత్స చేస్తారు. పేషంట్ శరీరానికి గాయాలయితే కట్లు గడతారు; ఒళ్ళు నొప్పులంటే నొప్పిని చంపే మందుల నిస్తారు; మానసిక సంక్షోభంలో చిక్కు కొన్నట్లు భావిస్తే ట్రాంక్విలైజర్ల నిచ్చి పంపుతారు. ఇలాంటి వైద్యులు బాధితుల నొప్పులను చంపటానికి గాదు, ఆవిడ కేసు కోర్టులో వీగిపోవటానికి కూడా పరోక్షంగా తోడ్పడుతున్నారు; నిందితుని విడుదలకు సహాయ పడుతున్నారు.

డాక్టర్ ఇవాన్ స్టార్క్ ప్రభృతులు తాము వ్రాసిన "మెడిసన్ అండ్ పాట్రియార్చల్ విజ్‌డం" అన్న వ్యాసంలో, ఇలాంటి వైద్యుల చర్యలను తీవ్రంగా నిరసించారు. "భర్త చేతిలో బాధల ననుభవించిన, లేక హింసకు గురయిన మహిళకు రోగ చిహ్నాలను బట్టి వైద్య చికిత్స చేస్తున్న వైద్యులు ఆవిడ అనుభవించిన హింసను విస్మరిస్తున్నారు. తొలుత మెంటల్ షాక్‌తో వచ్చిన బాధితకు తమకు ఉచితమని తోచిన మందిచ్చి పంపుతారు. ఆ మందు ఆవిడ రోగాన్ని కుదర్చలేదు. అందుచేత పలుసార్లు వైద్యానికి వస్తూంటుంది కనుక ఆవిడకు ట్రాంక్విలైజర్సు ఇచ్చి పంపుతారు. ఇంకా వస్తే మానసిక రోగ చికిత్సాలయానికి పొమ్మంటారు ఇలా వీరు ఆవిడ రోగానికి మూలమైన భర్త హింసను విస్మరిస్తున్నారని" రచయితలు దుయ్యబట్టారు

ఇందుకు వైద్యులను నిందించి ప్రయోజనం లేదు. కుటుంబంలో పురుషాధిక్యతను ఆమోదిస్తూ, భర్త, భార్యను హింసించటాన్ని కుటుంబీకుల ఆంతరంగిక వ్యవహారమని భావించే సామాజికులలో వీరూ భాగమే. ఇందువల్ల భర్త భార్యను కొట్టటం, తిట్టటం, వేధించటం వీరికి నేరంగా కనుపించకపోవటం అసహజమేమీగాదు స్త్రీ సూచించే రోగ చిహ్నాల వెనుక, భర్త హింసను అనుభవించిన సాక్ష్యాధారం రోగిలో కనుపించినా ఈ విషయంలో "మన మెందుకు తల దూర్చాలి" అని వైద్యులు భావించటం పరిపాటి

ఈ అంశాన్ని అమెరికన్ మెడికల్ కౌన్సిల్‌కు చెందిన కౌన్సిల్ ఆఫ్ ఎథికల్ అండ్ జుడిషియల్ ఎఫైయిర్స్ చక్కగా విశ్లేషించింది. ఈ విశ్లేషణను, మెడికల్ అసోసియేషన్ జర్నల్ "జామ" 1992 వ సంవత్సరం జూన్ 17వ తేదీ సంచికలో ప్రచురించింది ఈ సంచిక స్త్రీ హింసా నివారణ ప్రత్యేక సంచికగా వెలువడింది. ఈ కౌన్సిల్ విశ్లేషణ వైద్య కమ్యూనిటీకి, వారు ఏ దేశానికి చెందిన వారయినా, మార్గదర్శకంగా ఉన్నది. కనుక కొంత మేరకు వివరంగా విశ్లేషణాంశాలను ఇచ్చట ఇస్తున్నాం. (ఇక ముందు ఈ సంస్థ పేరు "కౌన్సిల్" గా పేర్కొంటాం-ర॥)

భర్తల, ప్రేమికుల హింసకు గురవుతున్న స్త్రీల విషయంలో జోక్యం చేసుకోవలసిన అవసరమున్నదని వైద్య వృత్తి నైతిక నియమాలు నిర్దేశిస్తున్నాయి. "తమ వద్దకు వచ్చిన రోగికి, ఆవిడలో కనుపించే రోగ చిహ్నాలను బట్టి వైద్యం చేసి పంపటం వృత్తి ధర్మం; ఈ పరిధిని దాటటం వైద్య వృత్తి ధర్మం కాదు" అని కొందరు భావిస్తున్నారు. ఇది సక్రమమైన దృక్పథంగాదు అంటూ కౌన్సిల్, బయో ఎథిసిస్ట్ డాక్టర్సు ఎడ్మండ్ పెలెగ్రినొ, డేవిడ్ థామస్మన్‌లు వ్రాసిన "ఫర్ ది పేషెంట్స్ గుడ్: ది రెస్టోరేషన్ ఆఫ్ బెనిఫిసెన్స్ ఇన్ హెల్త్ కేర్" అనే పుస్తకంలోని, దిగువ పేర్కొన్న అంశాన్ని ఉదహరించారు:"

## "గాయాలను కాదు దాని వెనుక నున్న హింసను చూడండి"

"నేను రెసిడెన్సీ చేస్తున్న రోజులలో ముప్పైయైదేండ్ల మహిళను ఎమర్జన్సీ డిపార్టుమెంటులో చేర్చుకొమ్మని ఆదేశాలందాయి ఆ పేషెంటును చూచినపుడు, అనారోగ్యము, గాయము, హింస ఒకదానిని మరొకటి ఎలా ప్రభావితం చేయగలవో తెలిసి షాక్ తిన్నాను ఆవిడ మరొకసారి తీవ్రమైన పాంక్రియాటైటిస్‌తో బాధపడుతున్నది చనుకట్టు మీదా, భుజాల మీదా దెబ్బలు తగిలిన గుర్తులున్నాయి పొత్తి కడుపు మీదా, ప్రక్కలా చాలా మచ్చలున్నాయి. ఆ పెషెంటు తనతో ఇంతకు పూర్వపు హాస్పిటలైజేషన్‌కు సంబంధించిన రిపోర్టులను కూడా తీసుకు వచ్చింది ఆ రిపోర్టుల ప్రకారం, ఆవిడ కంటిలో రెటీనా విడివడింది; ఆవిడ శరీరం మీద మరిగేనూనె పడటం వల్ల గాయపడింది; దవడ విరిగింది; ఆవిడ పొత్తికడుపు మీద పలు కత్తి పోట్ల తాలూకూ గాయపు మచ్చలున్నాయి. తుపాకీ గుండు దెబ్బకు పాక్షిక హెపాటిక్ రిసెక్షన్ అవసరమైంది.

" ఈ రిపోర్టులలో డాక్టర్లు ఆవిడ వయస్సును మరువకుండా రికార్డు చేశారు. "పేషెంటు వయస్సు 25 సంవత్సరాలు"; "పేషెంటు వయస్సు 27 సంవత్సరాలు, పెషెంటు వయస్సు 31 సంవత్సరాలు" అంటూ ఆ రిపోర్టులలో ఆవిడ వయస్సును ఉదహరించారు. "విపరీతమైన తాగుడు, దాని వల్ల కలిగిన ఫలితాలు" అని ఆవిడను పరీక్షించిన వైద్యులు రోగ నిర్ధారణ చేశారు. రిపోర్టులను చదివిన తర్వాత అనారోగ్యాన్ని అనుభవించటానికి, గాయాలకు గురిగావటానికి, హింసను అనుభవించటానికి మధ్యనున్న సంబంధం నాకు అర్థమైంది.

" ఆవిడ దెబ్బలకు పలుసార్లు చికిత్స చేసిన డాక్టర్లు, ఆవిడ అనారోగ్య స్థితిని తాగుడుకూ, గాయాలకూ ముడివేస్తూ వచ్చారు. ఆవిడ హింసకు గురవుతూ ఉండటాన్ని విస్మరిస్తూ వస్తున్నారు. ఇంతకు పూర్వం పరీక్షించిన వారెవరూ ఈ విషయాన్ని నమోదు చేయలేదు. పేషంటు జీవితాన్ని చూడటంలోని మన దృష్టి లోపమే ఇందుకు కారణం. ఆవిడ శరీరం మీద గల గాయాల కంటే ఆవిడ అనుభవిస్తున్న హింస మనకు ప్రధానమైనది. ఆవిడకు తగిలిన గాయాల స్వభావం గాని, వాటి తీవ్రతగాని ముఖ్యాంశం గాకూడదు. ఆవిడ హింసకు దారి దీసిన సాంఘిక పరిస్థితులు మనం గమనించవలసిన ముఖ్యాంశం గావాలి.

"... జరుగుతున్న స్త్రీ హింసను చూచి డాక్టర్లు భయపడుతున్నారు; నిస్సహాయుల వలె ప్రవర్తిస్తున్నారు; నిస్తేజితులవుతున్నారు; హింసకు గురయిన అభాగిని కూడా ఇదే స్థితిలో ఉంటున్నది. జరిగిన హింసను గుర్తించకపోవటం గాని, చిహ్నాలను బట్టి చికిత్స చేయటం గాని, పేషంట్ అనారోగ్య పరిస్థితిని తక్కువగా అంచనా వేయటం గాని డాక్టరు చేయటం అంటే "కొట్టినది నేనే; ఆవిడ అనుభవించిన హింసకు నేనే కారణం" అని చెప్పకుండా దాగే హింసాపరుని అనుకరించటమే నన్న విషయాన్ని డాక్టర్లు గుర్తించాలి.

"భార్యా భర్తలు పోట్లాడుకోవటం డాక్టర్లకు తెలియనిది గాదు; మనలో చాలా మందిమి అనుభవించాం. ఒక సర్వేలో పాల్గొన్న పురుష డాక్టర్లలో 14 శాతం మంది, లేడీ డాక్టర్లలో 31 శాతం మంది, తమ జీవితంలోని ఏదో ఒకదశలో హింసను అనుభవించినట్లు సగ్ అండ్ ఇనూల సర్వే రుజువుచేసింది. కాని రెండు శాతం మంది డాక్టర్లు మాత్రమే పేషంటు హింసను అనుభవించటానిక గల కారణాలను గురించి విచారించారు! ఈ డాక్టర్లలో ఒకరు హింసను అనుభవించి మానసిక వ్యధకు తాళలేక తానే కౌన్సలింగ్‌కు వెళ్ళారు!

"హింసా నిరోధానికి వైద్యులు కృషి చేస్తున్న కొలదీ, వారి అనుభవం పెరుగుతుంది. హింసకు గురయిన పేషంట్లకు చికిత్స చేయటానికి నూతన మార్గాలను అన్వేషిస్తారు. ఆచరణ ద్వారా ఈ పరిణామం సంభవిస్తుంది. ఈ సమస్య వైద్యులకు సవాలు వంటిది. హింసా నిరోధంలో మన అనుభవం పెరుగుతున్న కొలదీ, ఈ విషయంలో మన చికిత్సా నైపుణ్యం కూడా పెరుగుతుంది; వృత్తి మీదే కాదు, మన వ్యక్తిగత జీవితాల మీద కూడా మనకు అదుపు లభిస్తుంది."

*- డాక్టర్ ఏనీ హెచ్. ఫ్లిట్‌క్రాఫ్ట్ జర్నల్ ఆఫ్ అమెరికన్ మెడికల్ అసోసియేషన్, 1992, జూన్ 17వ తేదీ సంచికకు వ్రాసిన సంపాదకీయం నుండి*

"శరీరానికి వచ్చిన రోగానికి లేక దానికి సంభవించిన గాయానికి చికిత్స చేయటం మాత్రమే వైద్యశాస్త్ర లక్ష్యంకాదు బాధిత బాధలకు కారణమైన మానసిక, సామాజిక, ఆఖరుకు వారి ఆధ్యాత్మిక భావనాంశాలను కూడా పరిగణనకు తీసుకోవలసిన అవసరం ఉన్నది. వారి బాధా నివృత్తి సమగ్రంగానూ, సంపూర్తిగానూ ఉండాలి. పేషెంట్ ఇంతకు పూర్వపు ఆరోగ్య స్థితిని సంపూర్తిగా సాధించగలగటానికీ, తనకు ఉచితమనుకొన్న జీవన విధానాన్ని వారు వీలయినంత మేరకు అనుసరించ గలగటానికి వైద్య చికిత్స తోడ్పడాలి"

బాధితలో కనుపించే రోగ చిహ్నాలను బట్టి చికిత్స చేసి పంపటం వల్ల, ఆవిడకు హింసా విముక్తి సంప్రాప్తించదు. పైగా అది అధికమవుతుందంటూ, ఒక వైద్యశాలకు చికిత్సకు వస్తున్న బాధితురాండ్రలోని ప్రతి ఐదుగురిలో ఒకరు. భర్త హింసవల్ల కలిగిన గాయాల చికిత్సకు పదకొండు సార్లుగా వస్తున్న పేషెంట్ల ఉదంతాన్ని కౌన్సిల్ ఉదహరించింది "పేషెంటుకు హాని చేయవద్దు" అనే వైద్య శాస్త్ర నైతిక సూత్రం, భర్త హింసకు గురవుతున్న స్త్రీల రక్షణ వైద్యుల ధర్మంగా నిర్దేశిస్తున్న విషయాన్ని కూడా, కౌన్సిల్ పేర్కొన్నది. బాధితల రోగ నిర్ణయంలో వైద్యులు విఫలమయితే సంభవించగల విషపరిణామాలను కౌన్సిలు ప్రస్తావించింది. బాధితలకు నొప్పులను చంపే మందులనో, ట్రాంక్విలైజర్లనో వైద్యులు ఇస్తున్న రుజువులను చూపుతూ దీనిని చికిత్సగా అనుమతించకూడదని, కౌన్సిల్ ప్రకటించింది. ఈ మందులు బాధితను ఆత్మహత్యకు ప్రోత్సహించవచ్చు; వారిని మద్యపానానికో, మాదక ద్రవ్య వాడుకకో దాసులనుగా చేయవచ్చు. అంతేగాదు; ఈ మందులు పేషంట్ చైతన్యాన్ని తగ్గించి, వారిని అధిక బాధలకు గురిచేయగల ప్రమాద మున్నదని కౌన్సిల్ హెచ్చరించింది.

బాధిత, తన రక్షణ కోసం, పోలీసుల నుండి బంధుమిత్రుల వరకూ పలువురి రక్షణను కోరి వారి రక్షణను పొందటంలో విఫలమై యుండవచ్చు. ఇలాంటి స్థితిలో తాను ఏకాకినని కృంగిపోతూ ఉంటుంది. ఇటువంటి మానసిక స్థితిలో వచ్చిన పేషంటు రోగపు మూల కారణాన్ని సక్రమంగా గుర్తించక పోవటం వల్ల, తన పేషంట్ మరింత బాధలను ఎదుర్కొనేట్లు వైద్యుడు చేస్తున్నట్లవుతుందని కౌన్సిల్ హెచ్చరించింది.

భర్తల హింసకు గురవుతున్న మహిళలు సామాన్యంగా ముందు వైద్యుల వద్దకు వస్తుంటారు కనుక వారి రక్షణకు ప్రధానంగా వైద్యులే తోడ్పడగల అవకాశాలున్నాయని కౌన్సిల్ అభిప్రాయపడింది. బాధితలు చికిత్సకు పలు వైద్య కేంద్రాలకు వస్తున్న వైనాన్ని కౌన్సిల్ వివరించింది. వైద్యశాలలోని ఎమర్జెన్సీ విభాగాలకు వచ్చే మహిళా పేషంట్లలో నూరింట 22 నుంచి 35 మంది వరకూ భర్త దెబ్బల వల్ల కలిగిన గాయాలతోనో, లేక ఆ దెబ్బల చిహ్నాలతోనో వస్తున్నారు. ప్రైమరీ హెల్తు సెంటర్లకు వచ్చే బాధితలలో పలువురు పొత్తి కడుపులో నొప్పిగా ఉన్నదనో, తలనొప్పి, నిద్రలేమి వంటి బాధలను వివరిస్తారు. ఎమర్జెన్సీకి వచ్చే మానసిక రోగులలో నూరింట ఇరవయ్యైదు మంది వరకూ భర్త హింసకు గురయిన వారే ఉంటున్నారు. వైద్య చికిత్సకు వచ్చే మానసిక రోగులలో నూరింట 64 మంది వరకూ భర్తల హింసకు గురవుతున్న వారేనని నిర్ధారణవుతున్నది గైనకాలజీ, ఆబ్‌స్టెట్రిక్స్ నిపుణుల వద్దకు వచ్చే రోగులలో కూడా ఇలాంటి బాధితలుంటున్నారు. భర్త హింసకు గురయ్యే వారిలో చూలాండ్రస్థితి అతి ప్రమాదకరంగా ఉంటుంది.

ఈ సమస్యను ఒక్క వైద్య వృత్తిలోని వారే పరిష్కరించలేరన్న మాట వాస్తవం. సాంఘిక, రాజకీయ, లీగల్ రంగాలు కూడా ఇందుకు తగిన కృషిని చేయవలసి ఉన్నది. అయినా అమెరికన్ మెడికల్ కౌన్సిల్ తన వంతు పాత్రను నిర్వహించ సమకట్టింది. భార్య హింసకు సంబంధించిన కేసుల నిర్ధారణకు అవలంబించదగిన చికిత్సా విధానాన్ని రూపొందించింది. భర్త హింసా ఫలితాలను స్త్రీమీద ధృవపరచటం అనేది స్త్రీ హింసా నిరోధానికి వైద్యులు చేయగల అతి ముఖ్యమైన కృషిగా కౌన్సిల్ భావిస్తున్నది. వైద్యుల బాధ్యతా విస్మరణకు కొన్ని ఉదాహరణలను కూడా కౌన్సిల్ ఇచ్చింది.

ఒక వైద్యశాలలోని ఎమర్జెన్సీలో చేరిన మహిళలలో ప్రతి 35 మందిలోనూ ఒక్కరు మాత్రమే భర్తల చేతిలో దెబ్బలు తిన్నట్లు వైద్యులు రోగ నిర్ధారణ చేశారు. ఈ పేషంట్ల మెడికల్ ఛార్టులను పునః పరిశీలించినపుడు, ప్రతి నలుగురిలోనూ ఒకరు హింసకు గురయినట్లు నిర్ధారణైంది!

మరొక వైద్యశాలలో, భర్తల హింసకు గురయిన పేషంట్లలో, నూరింట ఎనిమిది మందిని మాత్రమే, భర్త హింసకు గురయిన వారిగా, బాధితల వాఙ్మూలాలను బట్టి వైద్యులు నిర్ధారణ చేశారు. భర్తబాధిత పేషంట్‌ను, ఆవిడ బయటకు వెళితే, ప్రాణాపాయ ప్రమాదం ఉన్నదని వైద్యులు గుర్తించినపుడు, వారిని ఎమర్జెన్సీ నుండి విడుదల చేయకూడదని డాక్టర్ సి. వర్మా అనే పరిశీలకుడు సూచించారు. డాక్టర్స్ బెకర్, మురాద్‌లు నిర్వహించిన బాధితల సర్వేలో వెయ్యి మందిని ఇంటర్వ్యూ చేశారు. "ఏ వృత్తిలోని వారు మిమ్మలను అధికంగా ఆదుకొంటున్నారో, వారు చూపుతున్న ఆదరణ తరతమ భేదాలకు అనుగుణంగా ర్యాంకింగ్ ఇమ్మని" బాధితలను అడిగారు వారిచ్చిన ర్యాంకింగ్ క్రమం ఇలా ఉంది: బాధితుల శరణాలయాలు, లాయర్లు, స్వచ్ఛంద సేవా సంస్థల కార్యకర్తలు, పోలీసులు, మత గురువులు - చివరి వారుగా వైద్యులను పేర్కొన్నారు! ప్రథమ పాత్రను నిర్వర్తించవలసిన వైద్యులకు,- తమను తొలుత చూచే వైద్యులకు, తమ రక్షకులలో చివరి వారినిగా బాధితలు పేర్కొన్నారు! వైద్యులలో ఆత్మ పరిశీలనను ప్రేరేపించదగిన అంశమిది.

### బాధితల రోగ నిర్ణయానికి చికిత్సకూ ఉన్న అవరోధాలు

కుటుంబ కలహంలో గాయపడిన లేక హింసకు లోనయిన వారి వాస్తవ పరిస్థితిని గమనించటానికి తగిన తర్ఫీదును డాక్టర్లు పొంది ఉండకపోవటంచేత, బాధితలకు తగిన చికిత్సా విధానాలను వారు అవలంబించలేక పోతున్నారు. భార్యను భర్త "దండించటం" సహజమన్న మనస్తత్వం ఉన్నవారు ఈ విషయానికి ప్రాధాన్యత నీయకపోవటం సహజం. భర్తల లేక ప్రియుల హింసకు లోనవుతున్న స్త్రీలు, డాక్టర్ల దగ్గరకు వస్తుంటారు; తమకు ఏదో బాధగా ఉన్నదని చెబుతుంటారు. పరీక్షలో వారి బాధలకు మూలం కనుపించదు భర్త హింసకు లోనయిన స్త్రీల బాధలను గురించిన అవగహన వైద్యులకు లేకపోవటం వల్ల వారు దానిని మానసిక రోగంగానో, నరాల సంబంధమైన అనారోగ్యంగానో భావిస్తారు. భర్తల హింసలకు గురయిన పేషంట్ల హాస్పిటల్ రికార్డులను పరిశీలించితే, "న్యూరొటిక్", "హిస్టీరికల్", "ఎ క్రాక్", "ఎ హైపో కాండ్రియాక్" వంటి రోగ నిర్ధారణలు కనుపిస్తాయని కౌన్సిల్ వివరించింది.

హింసకు లోనవుతున్న స్త్రీలను గురించిన సదవగాహన సమాజంలోనే లేదు. వీటిలో అతి ప్రధానమైన వాటిని కౌన్సిల్ పేర్కొన్నది. 1. బయటి ప్రపంచంలోని ప్రమాదాలు, కుటుంబంలో ఉండవు; కనుక కుటుంబీకులకు వారి ఇల్లు కంచుకోట వంటిదన్న భావం ఉన్నది. భార్య, భర్త హింసకు లోనవుతున్న విషయం తెలియక వైద్యులు, సాధారణంగా రోగచిహ్నాలను బట్టి చికిత్స చేస్తూంటారు. భర్త హింసవల్ల కలిగిన చిహ్నాలు రోగిలో కనుపిస్తున్నా, దాన్ని ప్రధానమైన అంశంగా పరిగణించరు

2. సామాన్య కుటుంబాలలో భర్తలు భార్యలను హింసించరన్న భావం కూడా ఉన్నది. భార్యలను బాధించే భర్తలు సామాన్య జీవితంలో హింసాపరులుగా కనుపించరు. కనుక వైద్యులు కూడా హింస జరిగిందని నమ్మలేరు. హింసించిన భర్త భార్యతో వైద్యశాలకు వచ్చినా, ఆవిడ ఆరోగ్యాన్ని గురించి తాను ఎంతో ఆందోళన పడుతున్నట్లు నటిస్తాడు. తాను హింసించిన విషయం డాక్టరుకు తెలియకుండా ఉండాలనే అతడు తాపత్రయపడతాడు. భర్త ఎదుట, తాను హింసకు గురైనట్లు డాక్టరుకు చెప్పటానికి బాధిత ఇల్లాలు సాహసించదు.

3. కొన్ని తెగల వారిలోనూ, కొన్ని ఆర్థిక, సాంఘిక పరిస్థితులలో మాత్రమే స్త్రీ హింస జరుగుతూ ఉంటుందనే నమ్మకం కూడా వైద్యులలో ఉన్నది అమెరికాలో నల్లవారిలోనూ, తెల్లవారిలోనూ భార్య హింస ఉన్నది. కాకపోతే నల్లవారు రిపోర్టు చేసినంత అధికంగా తెల్లవారు బయటి వారికి చెప్పరు. ఒకే రకపు ఆర్థిక పరిస్థితులు గలిగిన కుటుంబాలలో, నల్లవారి కుటుంబాలలో కంటే తెల్లవారి కుటుంబాలలోనే స్త్రీ హింస అధికంగా జరుగుతున్నట్లు సర్వేలు నిరూపిస్తున్నాయి. అన్ని జాతులు, తెగలలోనూ, అన్ని రకాల ఆర్థిక పరిస్థితులలోనూ స్త్రీ హింస జరుగుతున్నట్లు పలు సర్వేలు నిరూపించాయి.

4. భార్యా భర్తల కలహం వారి స్వంత విషయం గనుక పరుల జోక్యం కూడదన్న భావం వైద్యులలోనూ ఉన్నది. కలహించే దంపతులకు రాజీపడమని ఇరుగు- పొరుగు వారు సలహాల నిస్తూంటారు. బాధిత ఇల్లాలికి తగిన రక్షణ

కల్పించకుండా బాధించే భర్తతో కాపురం చేయమని చెప్పటం ప్రమాదకర పరిణామాలకు దారితీయవచ్చు.

5. బాధిత స్త్రీలను వారి గతికి వారిని వదలటం ఉత్తమమన్న భావం కూడా వైద్యులలో ఉన్నది ఇందువల్లనే భర్త హింసా సూచనలు వారి శరీరంమీద కనిపిస్తున్నా, వారా విషయాన్ని పట్టించుకోరు. కాని వైద్యులు తమను దయతో, సానుభూతితో చూచి, తమ ఇబ్బందులను తెలుసుకోవాలని బాధితలు ఆశిస్తారు దయార్ద్ర హృదయంతో డాక్టరు అడుగుతూంటే బాధితలు బాధలను తప్పకుండా వెళ్ళబోసుకుంటారు. ఇది జరగాలన్న భావంతోనే వారు వైద్యులను ఆశ్రయిస్తారు

6 భర్త హింసకు భార్య గురయినపుడు, దాని బాధ్యతను సామాజికులు ఆ అభాగ్యురాలికే అంటగడతారు. ఇంట్లో జరిగే స్త్రీ హింస మీద పలురకాల అపోహలు ప్రచారంలో ఉండటమే ఇందుకు కారణం. ఇల్లాలు, పిల్లలను, సంసారాన్ని వదలి సులభంగా పోలేదు భర్తతోడి అనుబంధాన్ని తెంచుకోవడానికి వెనుకాడుతుంది. ఇల్లువిడిచిపోదలచినా ఆదరించే నాధుడు కనిపించడు స్వంత కాళ్ళమీద నిలుచుండటానికి తగినంత ఆర్థిక వనరులుండవు. ముందు కాలంలోనయినా పరిస్థితి మెరుగు పడకపోతుందా అన్న ఆశాభావంతో నిస్సహాయంగానే భర్తపంచన పడి ఉండటానికి సిద్ధపడుతుంది.

దెబ్బలు తిన్న ఇల్లాలినే నేరస్థురాలిగా పరిగణించే మనస్తత్వమే ఆవిడ చికిత్సాపర్వంలోనూ ప్రదర్శితంగావడం సహజం. భర్తను విడిచిపోవటానికి బాధిత ఇష్టపడనప్పుడు, ఆవిడకు తానేమీ చేయలేనని వైద్యుడనుకుంటాడు ఇకముందు ఇటువంటి కేసులను చూడవలసివచ్చినా, బాధితను ఆదుకోవటానికి ఉత్సాహాన్ని చూపడు.

ఈ అపోహలను మరచి, ఓర్పుతో బాధిత ఇల్లాండ్ర మొరలను వైద్యులు ఆలకించాలనీ, అవసరమైనంత సహాయాన్ని చేయాలని కౌన్సిల్ సూచించింది. తాము అవలంబించదలచిన చికిత్సా విధానానికి పేషెంట్ ఆమోదాన్ని తప్పక పొందాలి అవసరమైన ఫొటోలను, ఎక్స్‌రేలను తీయించాలి. అవసరమయితే ఇతర చికిత్సా విభాగాలకు పేషంట్‌ను పంపాలి. తాము అనుసరించే విధానాలకు తాము బాధ్యతవహిస్తామనీ, తగిన రక్షణ కల్పిస్తామని, ఈ విషయాలను ఇతరులకు తెలియజేయకుండా రహస్యంగా ఉంచుతామనీ వైద్యులు బాధితకు వివరించాలి. ఆవిడ విశ్వాసాన్ని, అంగీకారాన్ని పొందాలి పేషంట్ అంగీకరించని ఏ పనినీ వైద్యులు చేయకూడదు. ఈ నియమోల్లంఘన వల్ల బాధితకు ఇబ్బందులు రావచ్చు; ప్రమాదం కూడా సంభవించవచ్చు. కనుక పేషంట్ అభీష్టాన్ని వైద్యులు గౌరవించాలని కౌన్సిల్ సూచించింది

కుటుంబంలో జరిగే స్త్రీ హింసను అరికట్టడానికి, హింసకు లోనవుతున్న వారికి అవసరమైనంత మేరకు సహాయం చేయటానికి వైద్యవృత్తిలోని వారంతా నడుంకట్టాలని కౌన్సిల్ విజ్ఞప్తి చేసింది. బాధితల రక్షణకు, వారి పునరావాసానికి, వైద్యులు ఇతర సామాజిక సంస్థలతో కలసి కృషి చేయాలని కూడా సూచించింది.

అమెరికన్ మెడికల్ అసోసియేషన్‌కు చెందిన కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ ఎఫెయిర్స్ అమెరికాలోని స్త్రీ హింసారూపాలను, పరిమాణాన్ని అంచనావేసి, హింసకుగురయిన బాధితుల మీద దాని ఫలితాలను పరిశీలించింది. ఈ హింసా నివారణకు వైద్యులు కూడా కృషి చేయాలని భావించి, అవలంబించదగిన కొన్ని మార్గదర్శక సూత్రాలను సూచించింది. ఇవి ఇతర ప్రాంతాల వారికి కూడా మార్గదర్శకంగా ఉండగలవన్న భావనతో, ఇచ్చట వాటిని సంక్షిప్తంగా ఇస్తున్నాం.

1 హింసా సూచనలను, హింసా పరిమాణాన్ని దాని తదనంతర పరిణామాలను, దానివల్ల సంభవించగల ప్రమాదాలను గురించి వైద్యులకు తర్ఫీదునివ్వాలి. బాధితకు సంభవించగల ప్రమాదాన్ని అంచనావేయటంతోపాటు, బాధిత రక్షణ, ఆ ప్రమాదం నుండి ఆవిడ బయట బడగల మార్గాల అన్వేషణాంశాలను కూడా వైద్యులకు బోధించాలి. వీటిని పాఠ్యాంశాలుగా అండర్ గ్రాడ్యుయేట్ లెవెల్‌లో ప్రవేశపెట్టాలి, అంతటితో ఊరుకోకుండా, వృత్తిలో చేరిన వైద్యులకు రిఫ్రెషర్ కోర్సులను నిర్వహిస్తూ, ఈ విషయ పరిజ్ఞానపు [illegible] తోడ్పడాలి.

2. బాధిత మహిళ, ప్రస్తుతం అనుభవిస్తున్న హింసనేగాకుండా, గతకాలంలో ఆవిడ అనుభవించిన హింసా చరిత్రను రికార్డు చేయాలి. ఆవిడ శారీరక, మానసిక

రోగ్యాంశాలను కూడా ఆవిడ మెడికల్ హిస్టరీలో చేర్చాలి.

3. వీలయిన చోట్ల, ఇటువంటి కేసులతో వ్యవహరించటానికి డాక్టర్ల బృందాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేయాలి. ఈ బృందం, బాధితకు అవసరమైన చికిత్సను చేయటకమేకాక, ఆవిడ సమస్యా పరిష్కారానికి, ఇతర సంఘ సేవా సంస్థలతోనూ, ప్రభుత్వ యంత్రాంగంతోనూ వ్యవహరించాలి.

4. బాధిత మహిళ నివసించే కమ్యూనిటీలో ఆవిడకు అవసరమైన సహాయం అందేట్లు వైద్యులు చూడాలి. ఇందుకు వైద్యులు, శరణాలయాలు, రేప్ క్రైసిస్ సెంటర్ల వంటి వాటితో సన్నిహిత సంబంధాలను ఏర్పాటు చేసుకోవాలి. అవసరమైన లీగల్ సర్వీసులు బాధితకు లభించే మార్గాలను చూడాలి. ఇలాంటి కృషి వల్ల, బాధితకు మేలు చేకూరటమే గాక, వారికి రక్షణా మార్గాలు బాగా అవగతమవుతాయి. వైద్యుల భారం కూడా, ఈ విషయంలో తగ్గుతుంది.

5. బాధితకు సంపూర్ణ ఆరోగ్యం చేకూరటానికి తగిన చికిత్సా విధానాన్ని అవలంబించాలి. ఇక ముందు ఆమె హింసకు లోను గాకుండా అందుకు తగిన మార్గాలను పరిశీలించాలి. బాధిత తొలుత ప్రైమరీ హెల్త్ సెంటర్, ఎమర్జెన్సీ, గైనకాలజీ, సైకాలజీ విభాగాలలో దేనికి వచ్చినా, అచ్చటే ఆవిడ హింసా చరిత్రను వివరంగానూ, స్పష్టంగానూ రికార్డు చేయాలి.

6. భర్త చేతిలో హింసను అనుభవించిన ఇల్లాలు బయటి వారికి తన బాధను చెప్పదని వైద్యులు భావించటం పొరపాటు; మానవతా భావంతో పేషంటును ప్రశ్నించినపుడు ఆవిడ ఉన్న కథనంతటినీ వివరిస్తుంది. వైద్యులు ప్రదర్శించగల దయ, ఆదరణలు ఆవిడకు తొలి విడతగా స్వస్థతను చేకూర్చుతాయి.

7. హింసకు గురైన మహిళా పేషంట్ల రికార్డులలో, వారు సూచించే 'రోగ' చిహ్నాలను మాత్రమే వైద్యులు రికార్డు చేస్తున్నారు. ఇలాంటి మెడికల్ హిస్టరీ వల్ల ముందు తరాల వైద్యులకు ప్రయోజనం ఉండదు. బాధిత చెప్పే రోగసూచనలతో పాటు, హింసా చరిత్రను సవివరంగా, రికార్డు చేయాలి. ఇలాంటి రికార్డుల వల్ల, స్త్రీ హింసా నివారణకు, హింసకు గురవుతున్న మహిళల చికిత్సకూ అనుసరించ వలసిన విధానాలలో తగు మార్పులను తీసుకురావటానికి వీలుంటుంది.

## బాధితలకు శరణాలయాల ఏర్పాటు

భర్తల హింసకు గురవుతున్న స్త్రీల దుస్థితిని సమాజం పట్టించుకోక పోవటాన్ని చూచి బాధపడిన మహిళా కార్యకర్తలు కొందరు, వారి రక్షణకు నడుము కట్టారు. వారి కృషి ఫలితంగా, 1971 వ సంవత్సరంలో ఇంగ్లండులో బాధితల శరణాలయం ఏర్పడింది. భర్తల హింసకు గురవుతున్న స్త్రీల రక్షణకు ప్రపంచంలో తొలుత ఏర్పాటయిన శరణాలయం ఇదే. తొలుత దీనిని భార్యాభర్తల మధ్య చెలరేగుతున్న వివాదాల పరిష్కార లక్ష్యంతో ఏర్పాటు చేశారు. అవసరాల దృష్ట్యా క్రమంగా దానిని శరణాలయంగా మార్చారు. దీని పనిని చూసిన తర్వాత, పలు దేశాలలోని మహిళా సంస్థలు ఈ మార్గాన్ననుసరించ సాగాయి. "రేప్ క్రైసిస్ సెంటర్స్", "బాటర్డ్ ఉమెన్ షెల్టర్స్" వంటి పేర్లతో దాదాపు నలభై దేశాలలో ఇలాంటి శరణాలయాలు పని చేస్తున్నట్లు ప్రపంచ బ్యాంకు రిపోర్టులు సూచిస్తున్నాయి. ఒక్క అమెరికాలోనే వెయ్యికి పైగా ఈ సెంటర్లు పనిచేస్తున్నాయి. ఇవన్నీ సమర్థవంతంగా పని చేయటం లేదు. నిధుల కొరత ప్రధాన సమస్యగా తయారైంది. కొన్ని చోట్ల ప్రభుత్వాలు కొంత మేరకు ధన సహాయం చేస్తున్నాయి, మరికొన్ని చోట్ల పూర్తిగా స్వచ్ఛంద సేవా సంస్థలే వీటిని నిర్వహిస్తున్నాయి.

ఈ ఉద్యమం వల్ల రెండు ఫలితాలు కనుపిస్తున్నాయి. 1. హింసకు గురవుతున్న స్త్రీలకు ఆశ్రయమిచ్చి ఇవి రక్షించ గలుగుతున్నాయి. అది అత్యంత ముఖ్యమైన అంశం. 2 స్త్రీ హింసా పరిమాణాన్నీ, తీవ్రతనూ శరణాలయాలు ప్రదర్శించి చూపుతున్నాయి. ఈ ఉద్యమాన్ని హర్షించలేని వారుకూడా ఉన్నారు. ఇలాంటి శరణాలయాలు వివాహ విచ్ఛిత్తిని ప్రోత్సహిస్తున్నాయని వీరు విమర్శిస్తున్నారు. ఇప్పటికే నిర్వహణలో నున్న శరణాలయాల పని తీరు మీద పలు పరిశోధనా పత్రాలు వెలువడ్డాయి. కాని ఇవేవి వీటిని విమర్శించలేదు; పైగా హర్షించాయి. భర్త హింసకు గురవుతున్న స్త్రీకి, తనను ఆదుకొనేవారు కరువయినపుడు, శరణాలయం ఆవిడకు ఆశ్రయం ఇస్తున్నది. ఆశ్రయమిచ్చే బంధు మిత్రులున్న వారెవరూ శరణాలయాలకు రారు. వీటికి వచ్చేవారు, తమ

వైవాహిక బంధం ఇక నిలిచే అవకాశం లేదు అన్న అంశం రుజువయిన తర్వాతే వస్తారు. అంతేగాని, శరణాలయం ఉన్నది గనుక రారు, అని పరిశోధకులు తేల్చి చెబుతున్నారు

ఈ శరణాలయాలు ఎలా పని చేస్తున్నాయి అనే అంశం మీద తగినంతగా పరిశోధనా సమాచారం లభించటం లేదు ఇందువల్ల, వీటి ఏర్పాటు వల్ల స్త్రీహింస ఎంత మేరకు తగ్గింది, శరణాలయం నుండి బాధిత వెళ్ళిపోయిన తర్వాత ఆవిడ జీవితం ఎలా సాగుతున్నది అన్న విషయ నిర్ణయానికి వీలుండటం లేదు శరణార్థి, తాను స్వతంత్రంగా బ్రతకాలన్న కృత నిశ్చయంతో వచ్చినపుడు, ఆవిడకు హింసనుండి శాశ్వత విముక్తి లభించే అవకాశాలుంటాయి ఇలాగాక, కొంతకాలం ఇచ్చట తల దాచుకొని, తిరిగి భర్తను చేరినపుడు, శరణాలయంలో తలదాచుకొన్న "పాపానికి" ఆవిడ అధిక హింసకు గురిగావచ్చు ఇందువల్ల శరణాలయపు తోడ్పాటు నిష్ఫలమవుతుంది.

శరణాలయం బాధితకు స్వర్గం లాంటిదని చెప్పవచ్చు. ఇల్లు నరకమైనపుడే కదా ఆవిడ విముక్తికి తాపత్రయ పడేది! ఇచ్చట ప్రాణ రక్షణ లభిస్తుంది. ఆత్మగౌరవంతో, నిర్భయంగా జీవించవచ్చు. అవసరమైన సమాచారం, సలహాలు, సపోర్టు లభిస్తాయి. శరణాలయ నివాసం బాధిత జీవితాన్నే మార్చవచ్చునని ఒక పరిశోధకుడు నిరూపించాడు. శరణాలయంలో బాధిత చేరినపుడు, వారిని ఈ పరిశోధకుడు ఇంటర్వ్యూ చేశాడు; వారు శరణాలయం నుండి వెళ్ళిపోయిన తర్వాత కూడా ఇంటర్వ్యూ చేశారు. అన్ని రకాల బాధితలకూ శరణాలయాలు ప్రయోజనకరంగా ఉన్నట్లు వీరు సూచించారు. చాలా మంది బాధిత స్త్రీలు, ఇక తమ వివాహబంధం నిలిచేదిగాదు అన్న విషయ నిర్ధారణ తర్వాతనే శరణాలయంలో తలదాచుకోవటానికి వస్తారు; వచ్చిన తర్వాత వారికి ధైర్యం వచ్చి, స్వతంత్రంగా బ్రతకాలనే నిర్ణయానికి వస్తున్నారు; వెళ్ళిపోయిన బాధితలు స్వతంత్రంగా బ్రతుకుతున్నట్లు పరిశోధకులు గమనించారు. మరికొందరు మహిళలు, "నీవు హింసించటం మానకపోతే, మన వివాహబంధం తెగిపోతుంది సుమా" అని భర్తలకు తెలియజెప్పడానికి, వారి శరణాలయ వాసం హెచ్చరికగా ఉపకరిస్తున్నదని వీరు సూచించారు. ఇచ్చటికి వచ్చిన బాధిత స్త్రీలకు, సపోర్టు, సహాయం, తోటి బాధితలతో స్నేహం లభిస్తాయి. ఇందువల్ల క్రమంగా వారిలో హింసవల్ల అంకురించిన అవమాన భారం, తాము ఏకాకులమన్న నిస్పృహ తొలగిపోతాయి.

ఈ శరణాలయాలు పురుషుల ఆగ్రహానికి ఎపుడయినా గురిగావచ్చు కనుక వీటి ఉనికి రహస్యంగా ఉండటం అవసరమన్న భావన కూడా ఉన్నది.శరణాలయాల నిర్వాహకులకూ పోలీసులకు సదవగహన ఉండటం అవసరం. కెనడాలోని శరణాలయాలకు పోలీసుల రక్షణ లభిస్తున్నది.

స్త్రీ హింస బహుముఖ సమస్యనీ, దీని పరిష్కారానికి బహుముఖ కృషి అవసరమని ఇంతకు పూర్వమే చెప్పాం. శరణాలయాలు పనిచేస్తున్నాయి గనుక, తాము ఈ రంగాన్ని గూర్చి ఆలోచించవలసిన అవసరం లేదు అని ఇతరవిభాగాల వారు భావించకూడదు. ఇది శరణాలయాలు మాత్రమే పరిష్కరించగల సమస్య గాదు.

### హింసకు పాల్పడుతున్న పురుషుల సంస్కరణ

భార్యలను హింసించే పురుషుల హింసా ప్రవృత్తి నివారణకు అభివృద్ధి చెందిన కొన్ని దేశాలలో ముఖ్యంగా అమెరికా, కెనడా దేశాలలో-సంస్కరణా కేంద్రాల నిర్వహణ జరుగుతున్నది. ఇవి ప్రధానంగా కమ్యూనిటీల చొరవతో నడుస్తున్నాయి. కొన్ని కేంద్రాలు, శరణాలయాల అనుబంధ సంస్థలుగా కూడా పనిచేస్తున్నాయి.

భార్యను హింసించిన పురుషుడు, పశ్చాత్తాపంతో, భార్య హింసను మానేట్లు చేయటం ఈ కేంద్రాల లక్ష్యం. కోర్టులు నిందితుని జైలుకు పంపితే, అతడు జైలులో నేరస్తులతో కలసి జీవించవలసి ఉంటుంది ఇందువల్ల అతనిలోని హింసాప్రవృత్తి బలపడుతుందేగాని తగ్గదు. ఇలాంటి వాతావరణం నుండి విడుదలై వచ్చిన వ్యక్తి, భార్యను కొట్టటం ప్రారంభించడని విశ్వసించలేము. కనుక, అతని మానసికస్థితిలో మార్పుతెచ్చి అతనిని సంస్కరించటాన్ని ఈ సంస్థలు లక్ష్యంగా పెట్టుకొని పనిచేస్తున్నాయి. ఆరునెల్ల జైలు శిక్షను అనుభవించేట్లు చేయటం కంటే, ఈ సంస్కరణా కేంద్రంలో వీరిని ఆరు మాసాలుంచటం ప్రయోజనకరమని చెబుతున్నారు.

నైతికంగా చూచినపుడు, వీటి ఏర్పాటు సమర్థ నీయంగా కనుపిస్తుంది. వీటిని నడపటం అనుకొన్నంత తేలికయినది కాదు. ఇవి స్వచ్ఛంద సేవా సంస్థలు. నిధుల కొరత వీటి ప్రధాన సమస్య. అవసరాలకు తగినన్ని, లేక

ప్రాంతీయ అవసరాల ప్రకారం వీటి ఏర్పాటు సాధ్యమయ్యే పనికాదు. ఉన్నవయినా, పట్టణ ప్రాంతాలలో మాత్రమే పని చేస్తున్నాయి. ఇది ఇటీవలె ప్రారంభమైన సంస్కరణా కార్యక్రమం. దీనిని ఎలా నిర్వహిస్తే ప్రయోజనకరంగా ఉంటుంది అనే అంశం ఇంకా సమగ్ర రూపాన్ని పొందలేదు. సంస్కరణ కోసం ఇచ్చే తర్ఫీదు ఎలా ఉండాలి అన్న విషయం ఇంకా అస్పష్టమైన దశలోనే ఉన్నది. అనుభవాన్ని బట్టి ఈ విషయంలో మార్పులు - చేర్పులూ చేస్తూ, వాటి నిర్వహణను కొనసాగించటం ఉచితమనేది సాధారణాభిప్రాయం.

మన సమాజం, కుటుంబంలో పురుషునికి ఆధిక్యత నిస్తూ, స్త్రీని అసమానురాలిగా చూస్తున్నది. కుటుంబాన్ని పవిత్రమైన నిర్మాణంగా ఎంచి, భార్యాభర్తల మధ్య పరుల జోక్యాన్ని గర్హిస్తున్నది. భార్యను "అదుపులో" పెట్టే అధికారం పురుషునికున్నదని నమ్ముతున్నది. పోలీసులు, ప్రాసిక్యూటర్లు, న్యాయమూర్తులు, వైద్యులు, సంఘసేవకులు - అంతా ఆ సమాజ సభ్యులే. అందువల్ల వీరంతా, ఏ వర్గానికి చెందిన వారయినా, భర్త భార్యను హింసించటాన్ని ఆమోదిస్తూ ఉండవచ్చు; లేదా తమకు పట్టనట్లు మిన్నకుండవచ్చు. "మౌనం అర్ధాంగీకారం" అన్న లోకోక్తి ఊరికే పుట్టలేదు.

ఈ అంధకారం నుండి వీరి విముక్తి కోసం, స్త్రీ హింసను గురించిన విజ్ఞాన ప్రచారం అవసరమని నిపుణులు సూచిస్తున్నారు. ఇంతకు పూర్వం ప్రస్తావించినవన్నీ స్వల్ప కాలిక పరిష్కార మార్గాలు మాత్రమే. సామాజికులను విజ్ఞాన వంతులను చేయటం శాశ్వత పరిష్కారానికి ఒక మార్గం. సామాజిక నిర్మాణంలోనే స్త్రీ పురుషుల అసమానతా భావం ఉన్నది. ఈ వ్యవస్థా నిర్మాణాన్ని మార్చినపుడే స్త్రీ హింస కనుమరుగవుతుందని కొందరి సూచన. లింగపరమైన అసమానతలను సంప్రదాయం నుండిగాక, విద్యా బోధనవల్ల కూడా పౌరులు నేర్చుకొన్నారు; కనుక విద్యా బోధనాంశాలలో స్త్రీ పురుష సమానత్వాంశాలను చేర్చితే, సామాజికులలో క్రమంగా మార్పు రావచ్చునన్న అభిప్రాయం కూడా ఉన్నది. విద్యాబోధన లోని అన్ని దశలలోనూ, స్త్రీ హింసా నిషేధావసరాన్ని సూచించే అంశాలను చేర్చాలని వీరిసూచన. వయోజనులకు కూడా ఇలాంటి విద్యా కార్యక్రమ నిర్వహణను సూచిస్తున్నారు.

సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో స్త్రీ పురుష సమానత్వాన్ని బోధించే అంశాలను ప్రైమరీ విద్యాస్థాయిలోనే ప్రవేశపెట్టాలి. కుటుంబ జీవితాంశాలు వచ్చినపుడు, స్త్రీ హింసా నివారణాంశాన్ని కూడా అందులో చేర్చాలి. వివాదాలను సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకొనే మనస్తత్వాభివృద్ధికి తగిన అంశాలకు కూడా తావుండాలి. భార్యా భర్తల వివాదంలో హింస చెలరేగటాన్ని గర్హించేట్లు బోధనాంశాలుండాలని వీరు సూచిస్తున్నారు.

బోధనా సాహిత్యం, ఆయా దేశాల, సమాజాల సాంస్కృతిక విధానాలను బట్టి రూపొందించాలి. ఉదాహరణకు బ్రెజిల్ దేశంలో, ప్రాథమిక విద్య వరకు చదువు కొన్నవారు కూడా చదివి అర్థం చేసుకోవటానికి వీలయిన చిన్న చిన్న పుస్తకాలను ప్రచురిస్తున్నారు; కొన్ని దేశాలలో పోస్టర్లను రూపొందిస్తున్నారు; కార్టూన్ల ద్వారా ప్రచారం చేస్తున్నారు కీన్యాలో, పోస్టర్లను బస్సులు, రైళ్ళ వంటి వాహనాల మీద, బహిరంగ స్థలాలలో, విద్యాలయాలలో అతికిస్తున్నారు. మలేషియా కూడా ఇలాంటి విధానాన్ని అవలంబిస్తున్నది. చైనాలో బహిరంగ స్థలాలలో బోర్డులు పెట్టి, వాటి మీద, స్త్రీ హింసను నిరసించే పోస్టర్లను అంటించటంతోపాటు, హింసకు గురవుతున్న మహిళలు అవసరమైన సహాయాన్ని పొందటానికి అనుసరించవలసిన మార్గాలను కూడా వివరిస్తున్నారు. కొన్నిదేశాలలో వయోజన విద్యాకేంద్రాలను ఈ ప్రచారానికి వినియోగిస్తున్నారు. మరికొన్ని దేశాలలో వీధి నాటక ప్రదర్శనల ద్వారా విజ్ఞాన ప్రచారాన్ని చేస్తున్నారు. తమిళనాడులో "సెంటర్ ఫర్ సైన్స్, టెక్నాలజీ అండ్ డెవలప్‌మెంట్" అనే సంస్థ ఇలాంటి కార్యక్రమాన్ని చేబట్టింది. స్త్రీ శిశు జనన నివారణకు గర్భస్రావానికి పూనుకోవటాన్ని, పురుటిలో స్త్రీ శిశువును చంపటాన్ని, పురుషుని కంటే స్త్రీ తక్కువదన్న భావాల తొలగింపుకు ఈ సంస్థ గ్రామ సీమల్లో, నగర కేంద్రాల్లో వీధినాటకాల ప్రదర్శనలను నిర్వహిస్తున్నది. లాయర్లు, ప్రాసిక్యూటర్లు, న్యాయమూర్తులు, పోలీసులు, వైద్యులు, నర్సులు, ఉపాధ్యాయులు, సంఘ సేవకుల వంటి వారికి కూడా ఈ విషయాలలో రిఫ్రెషర్ కోర్సుల నిర్వహణ ప్రయోజనకరంగా ఉంటుంది.

పత్రికలు, టివీలు పటుతరమైన ప్రచార సాధనాలు. ఇవి పురుషాధిక్యతను ప్రచారం చేస్తూ, స్త్రీని విలాస వస్తువుగా

చిత్రించే ప్రకటనలకు, రచనలకు అవకాశమిస్తున్నాయి. బలమైన ప్రచార సాధనాలు గనుక, ఇవి పురుషాధిక్యతను నిరసిస్తూ, స్త్రీ పురుష సమానత్వాన్ని కూడా ప్రచారం చేయగలవు కావలసిందల్లా సామాజికాభివృద్ధి బాధ్యతా గుర్తింపు మాత్రమే ఈ బాధ్యతను గుర్తించి, ప్రచార సాధనాలు వ్యవహరించ గలిగితే మహిళా లోకానికెంతో మేలు చేకూరుతుంది. స్త్రీ. హింసకు లోనయినపుడు, దానిని పాఠకులకు ఆసక్తి దాయకమైన అంశంగా మార్చి, లాభించటానికి బదులు, బాధితకు సానుభూతి సూచకంగానూ, ఆవిడ కేసును బలపరచేదిగానూ, ఆవిడ అనుభవించిన హింసావమానాలను గర్హించదగిన అంశాలుగానూ రిపోర్టు చేయాలి. స్త్రీ హింసను నిరసించే వ్యాఖ్యలకు ప్రచారాన్నివ్వాలి. ప్రచార సాధనాలు ఇలా వ్యవహరిస్తే, పాఠకులలో స్త్రీల ఇమేజ్ పెరుగుతుంది అమలు జరుగుతున్న స్త్రీ హింస యెడల నిరసన పెరుగుతుంది.

## రావలసిన సామాజిక మార్పులు

హింసకు గురవుతున్న స్త్రీల రక్షణకు తీసుకొనే తాత్కాలిక చర్యలకు, అవి పేరుకు తాత్కాలికంగా కనుపించినా, వాటివల్ల దీర్ఘకాలిక ప్రయోజనం కూడా ఉంటుందన్న అంశాన్ని మరువకూడదు స్త్రీ రక్షణకు తీసుకొనే ఏ కార్యక్రమమైనా, అవాంతరాలను ఎదుర్కొనవలసే ఉంటుంది. "భార్యాభర్తల మధ్య అంకురించిన వివాదం వారి స్వవిషయం, ఇతరులు దీనిలో జోక్యం చేసుకోకూడదు" అన్న సామాజిక సూత్రమే స్త్రీ జనోద్ధరణకు తొలి అవరోధం. భర్త తనను కొట్టాడు అని వీధిలో చెప్పటానికి చాలా మంది ఇల్లాండ్రు సిగ్గుపడతారు. కనుక భర్త హింసను గురించి వారు ఇతరులకు చెప్పరు. "ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా వ్యవహరించబట్టే గదా దెబ్బలు తినవలసి వచ్చింది; ఆయన చెప్పినట్లు వింటే దెబ్బలు తప్పుతాయి గదా" అన్న భావంతో, ఆత్మను చంపుకొని జీవించటానికి వీరు సిద్ధపడతారు. ప్రజలతో నేరుగా సంబంధం ఉండే అధికార వర్గం-పోలీసులు, లాయర్లు, జడ్జీలు, వైద్యులు ఇత్యాది వర్గాల వారు, పురుషాధిక్యతనూ, భార్యను భర్త దండించటాన్ని ఆమోదించే సంస్కృతికి వారసులు గనుక, "ఆవిడ ఏదో చేసి ఉంటుంది; అందుకే భర్త కొట్టాడు" అని పురుషుని చర్యను కొందరు సమర్థించగా, "ఎందుకయినా మంచిదని" కొందరు బుద్ధిమంతులు మౌనం వహిస్తారు! ఆర్.యి. దొబాష్, ఆర్.దొబాష్‌లు తాము వ్రాసిన "వయొలెన్స్ ఎగెయిన్స్ట్ ఉమెన్: ఎ కేస్ ఎగెయిన్స్ట్ పాట్రియార్కీ" అన్న పుస్తకంలో ఒక చోట ఈ అంశం మీద ఇలా వ్యాఖ్యానించారు "బాధిత యొక్క మిత్రులు, ఇరుగు-పొరుగు భర్త హింసను సమర్థిస్తారు. ఆవిడ వైద్యుని దగ్గర కెళితే, వారు తొలగిన కీళ్ళను సరిజేస్తారు. వారు గాయాలకు కుట్లు వేసి కట్టుకడతారు. అంతకు మించి వారు అడుగుదాటరు భార్యను భర్త కొట్టటాన్ని, వారి మధ్య సదవగాహనా లోపంగా సంఘ సేవకుడు నిర్వచిస్తాడు. పోలీసులు, కోర్టుల అధికారులు ఈ విషయాలలో తల దూర్చటానికి ఇచ్చగించరు. ఈ హింసకు కారకుడు ఒక్క వ్యక్తే; కాని దాని బాధ్యత అతని పరిధిని మించి ఉంటున్నది. స్త్రీ హింసకు గురవుతూ ఉండటానికీ, కొన్ని సందర్భాలలో ఆవిడ మరణానికీ ఈ సామాజికులంతా బాధ్యులే".

ఈ బాధ్యతను సమాజం ఆమోదించాలి. సమస్యను రచ్చకెక్కించాలి. ప్రజాభిమానాన్ని చూరగొన గలిగిన నాయకులు వేదికల నెక్కాలి. హింసకు గురవుతున్న మహిళల ఇరుగు-పొరుగువారినీ బంధుమిత్రులనూ, బాధితకు రక్షణ నిచ్చేట్లు ప్రోత్సహించాలి. ప్రభుత్వం కూడా ఈ సమస్యా పరిష్కారానికి అవసరమైన ఏర్పాట్లను చేయాలి.

ఇలాంటి చర్యలు స్త్రీ మీద జరిగే హింసా పరిమాణాన్ని తగ్గించగలవేమో గాని, దాన్ని పూర్తిగా తొలగించలేవు. కనుక స్త్రీకి పురుషునితో సమానమైన హోదాను, సమాజంలోనూ, కుటుంబంలోనూ కల్పించాలి. స్త్రీదాస్యానికి మూలమైన సాంఘిక, ఆర్థిక నిర్మాణాలను పడగొట్ట గలిగినపుడే, కుటుంబంలోనూ, సమాజంలోనూ స్త్రీ పురుష సమానత్వ సాధన సాధ్యమవుతుంది.

తన ఇంటిలోనే ఇల్లాలు హింసకు గురిగావటం అనేది బహుముఖ సమస్య; కనుక దీనిని ఏ ఒక్కరో, లేక ఏ ఒక్క చర్యో పరిష్కరించలేదు. దీని పరిష్కారం కూడా బహుముఖంగా, పరస్పర సహకార, సమన్వయాలతో జరగాలి. ఈ లక్ష్య సాధన సిద్ధించే వరకూ ఉపశమన కార్యక్రమావలంబన తప్పదు.

భర్తలు లేక ప్రేమికుల చేతిలో శారీరక మానసిక హింసను అనుభవించ వలసి రావటమే గాక, వారి వల్ల సుఖరోగాల సుడిగుండంలో స్త్రీ పడవలసి వస్తున్న దయనీయ పరిస్థితినిక వివరిస్తాం.

# 18

## సుఖరోగాల సుడిగుండంలో స్త్రీలు

పలు కారణాల వల్ల 15-44 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలకు సంక్రమిస్తున్న మొత్తం రోగభారంలో పద్ధెనిమిది శాతం వరకూ కాన్పు కారణం వల్ల సంభవిస్తుంటే, పదహారు శాతం మేరకు సుఖరోగాలు, ఎయిడ్స్ వల్ల సంభవిస్తున్నదని ప్రపంచబ్యాంకు తయారు చేసిన అంచనాలు సూచిస్తున్నాయి. ఇన్ఫెక్షన్ వల్ల వచ్చే మరే ఇతర రోగమూ, ఇంత అనారోగ్య భారాన్ని స్త్రీలకు సంక్రమింపజేయటం లేదు.

స్త్రీకి తన తనువు మీద అదుపు దప్పినపుడు సుఖరోగాలు విశృంఖలత్వాన్ని ప్రదర్శించటంలో ఆశ్చర్యం లేదు. లైంగిక సంపర్క విషయాలలో పురుషులు ప్రదర్శిస్తున్న బాధ్యతా రాహిత్యం, వారి విశృంఖలత్వం వల్ల స్త్రీలకు ఈ రోగాలు అధికంగా సోకుతున్నాయి. ఇవి చాలవన్నట్లు నివారణకు లొంగని ఎయిడ్స్‌కు కూడా పురుషుల కంటే స్త్రీలు అధికంగా గురవుతున్నారు.

భారతదేశంలో చూలాంద్ర, బాలింతల మరణాలు, శిశు మరణాలు అధికంగా ఉన్నట్లు చూచాం. ప్రజారోగ్య రక్షణకు ప్రాధాన్యత లభించవలసిన అవసరాన్ని చూశాం ఇలాంటి కార్యభారం సమాజంపై ఉండగా పులిమీద పుట్రవలె హ్యూమన్ ఇమ్యునోడిఫిషియన్సీ వైరస్ (హెచ్.ఐ.వి.) ఒకటి వచ్చి పడింది. ఈ వైరస్ కారణంగా వచ్చే రోగాన్ని ఎక్వైర్డ్ ఇమ్యునోడిఫిషియన్సీ సిండ్రోమ్ (ఎయిడ్స్) అని పిలుస్తున్నారు. ఇది నివారణ సాధ్యం గాని రోగం.

ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రీసెర్చి విడుదల చేసిన సమాచారం ప్రకారం, చూలాలికి హెచ్.ఐ.వి. సోకినట్లు రుజువయి నపుడు, ఆవిడ గర్భంలోని పిండానికిది సోకవచ్చు. ఇటువంటి చూలాంద్ర గర్భస్థ శిశువులలో (పిండం దశలో) నూరింట ఇరవై నుండి ముప్పై మందికి ఈ రోగం వచ్చే అవకాశాలున్నాయి. పెద్దలకు ఈ వైరస్ సోకిన తర్వాత అది సమగ్రరూపాన్ని తీసుకోవటానికి ఏడెనిమిది సంవత్సరాలు పట్టవచ్చు. తల్లి గర్భంలోనే ఈ వైరస్‌కు గురయిన బిడ్డలు, పుట్టిన తర్వాత రెండు సంవత్సరములు నిండక పూర్వమే నూరింట యాభై మంది వరకూ మరణించవచ్చు; నూరింట తొంభై మంది ఐదు సంవత్సరాలు నిండక పూర్వమే మరణించవచ్చునని ఇండియన్ మెడికల్ కౌన్సిల్ సమాచారం

తెలియజేస్తున్నది

ఇది బహు సమస్యాత్మకమైన రోగం. దొంగవంటిది ఇది తనంత తానుగా రోగ సూచనలను కనుపింపచేయదు. తరచుగా స్త్రీలకు సంక్రమించే ఇతర రోగాల ముసుగును వేసుకొంటుంది కనుక సాధారణ ప్రజానీకం, ఈ రోగం తమకు సోకిన విషయాన్ని గుర్తించే వీలులేదు ఈ రోగపు గుర్తింపుకు ఆధునిక వసతులున్న లేబొరేటరీ లుండాలి ఇలాంటివి లేనిచోట్ల రోగ చిహ్నాలను బట్టి చికిత్స చేస్తున్నారు తమ శరీరంలో వస్తున్న మార్పులను గమనించి రోగి, రోగ నిర్ణయ చికిత్సలకు వెళతారు. ఈ రోగం ప్రధానంగా సెక్సు సంపర్కం వల్ల వ్యాపిస్తుంది ఇది స్త్రీల నుండి పురుషుల కంటే, పురుషుల నుండి స్త్రీలకు సోకే అవకాశాలు రెండున్నర రెట్లు అధికమని నిపుణులు నిర్ధారించారు. స్త్రీల జననాంగ నిర్మాణ స్వభావం ఈ వైరస్ సులభంగా సోకటానికి వీలుగా ఉంటుంది. స్త్రీలు ఎటువంటి పరిస్థితులలో సంతానాన్ని కంటున్నారు అన్న అంశం కూడా దీనికి తోడవుతున్నది

క్షయవ్యాధిని ఇంతవరకూ నివారించదగిన రోగంగానే వైద్యులు పరిగణిస్తున్నారు. ఇపుడు చికిత్సకు వాడుతున్న మందులలో చాలా వాటికి లొంగని కొత్త రకం క్షయను అమెరికన్ వైద్యులు గుర్తించారు. ఈ రోగ కారక జీవులను, మైకోబాక్టీరియం టుబర్‌కులోసిస్‌కు చెందిన వర్గంగా (స్ట్రెయిన్‌గా) గుర్తించారు. న్యూయార్కు నగరంలోని కొన్ని వైద్యశాలలలో జరిగిన పరిశీలనా అంశాలను అమెరికన్ మెడికల్ అసోసియేషన్ వారపత్రిక 1996వ సంవత్సరం అక్టోబరు మాసంలో ప్రచురించింది. దీని ప్రకారం ఒకే వయస్సుకు చెందిన క్షయరోగులలో నూరింట 44 మంది రోగనిర్ణయం జరిగిన మూడున్నర సంవత్సరాల లోపుననే మరణించారు. మందులకు లొంగని ఈ రకపు క్షయ, ఇతరుల కంటే, హెచ్.ఐ.వి. సోకిన వారికి అధికంగా వస్తున్నట్లు, అధిక మరణాలు కూడా వీరిలోనే సంభవిస్తున్నట్లు తేలింది

అమెరికాలో ఆధునిక వైద్య చికిత్సా సదుపాయాలున్నాయి. ప్రజల జీవన ప్రమాణస్థాయి కూడా, అభివృద్ధి చెందుతున్న దేశాలలో కంటే అధికంగా ఉన్నది. అయినా ఇంత పరిమాణంలో సంభవిస్తున్న క్షయరోగుల మరణాలు ఆ దేశ వైద్య వర్గాలను కలవర పరుస్తున్నాయి. దేశంలోని మొత్తం రోగుల సంఖ్యలో నూరింట పదిహేనుమంది క్షయతో బాధపడుతున్నట్లు అంచనా వేస్తున్నారు 1990వ సంవత్సరంలో ఈ రోగం ప్రపంచంలో డెబ్బై లక్షల మందికి వచ్చినట్లు, వారిలో ఇరవై లక్షల మంది మరణించినట్లు రిపోర్టులు వచ్చాయి. 20వ శతాబ్దాంతానికి క్షయరోగుల మరణాలు మరింత అధికమయ్యే సూచనలున్నట్లు జర్నల్ ఆఫ్ అమెరికన్ మెడికల్ అసోసియేషన్ రిపోర్టు సూచిస్తున్నది ప్రపంచంలో సంభవిస్తున్న మరణాలలో ఆరుశాతం వరకూ క్షయ రోగమే కారణమనీ, మరణిస్తున్న వారిలో ఐదు సంవత్సరాలకు మించి వయస్సున్న వారి మరణాలకు, అన్ని రకాల అంటు రోగాల కంటే క్షయే ప్రధాన కారణమయినట్లు కూడా ఈ పత్రిక రిపోర్టు తెలియజేస్తున్నది. ఆగ్నేయ ఆసియాలోను, సబ్-సహారన్ ఆఫ్రికాలోనూ క్షయరోగం, ఇతర ప్రాంతాలలో కంటే అధికంగా సోకుతున్నది. ఇచ్చట మనకు ఆందోళనను కలిగించే రెండు విషయాలు కనుపిస్తున్నాయి (1) అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, పేదదేశాలలోనూ క్షయరోగం అధికులకు సోకుతున్నది. (2) ఇది చాలదన్నట్లు, హెచ్.ఐ.వి/ఎయిడ్స్ కూడా ఈ ప్రాంతంలో త్వరితగతిని వ్యాపిస్తున్నది. మనిషి ప్రాణాన్ని తప్పక తీయగల రోగమిది. (3) ఎయిడ్స్‌తో బాధపడే రోగులకు మందులకు లొంగని ఈ క్షయ సోకటం వల్ల వారు త్వరగా మరణించే అవకాశాలు ఉన్నాయి. ఎయిడ్స్ రోగికి కొత్తరకం క్షయ వచ్చినపుడు, దానికి చికిత్స జరుగని సందర్భాలలో, ఆ రోగి ఎయిడ్స్ వల్ల కంటే ముందుగానే, క్షయరోగ కారణంగా మరణిస్తున్నట్లు అమెరికన్ పరిశోధకులు గమనించారు. అమెరికాలోని ఈ పరిణామాలు భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాల వారిని, పేద దేశాల ప్రజలను భయకంపితులను చేస్తున్నాయి. ఇటువంటి పరిస్థితులలో ఎయిడ్స్ త్వరితగతిని వ్యాపించే అవకాశాలుండడం ఎంతటి ప్రమాదకర పరిణామమో ఊహించవచ్చు.

## తాజా అంచనాలు

**ప్రపంచంలో 1997లో ఎయిడ్స్ రోగులు, పిన్నలు పెద్దలు కలిసి మూడు కోట్ల ఐదు లక్షల మంది !**

| మండలం | రోగుల సంఖ్య |
|---|---|
| ఉత్తర అమెరికా | 8,60,000 |
| కరిబియన్ ప్రాంతం | 3,10,000 |
| లాటిన్ అమెరికా | 13,00,000 |
| పశ్చిమ యూరపు | 4,80,000 |
| తూర్పు యూరపు, మధ్య ఆసియా | 1,90,000 |
| తూర్పు ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 4,20,000 |
| దక్షిణ, ఆగ్నేయ ఆసియా | 58,00,000 |
| ఆస్ట్రేలియా, న్యూజిలెండ్ | 12,000 |
| ఉత్తర, పశ్చిమ ఆఫ్రికా ప్రాంతం | 2,10,000 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 2,10,00,000 |
| ప్రపంచం మొత్తం | 3,05,82,0000 |

*గమనిక :- యుఎన్ఎయిడ్స్, ప్రపంచ ఆరోగ్య సంస్థలు ప్రచురించిన "రిపోర్టు ఆన్ ది గ్లోబల్ హెచ్ఐవి / ఎయిడ్స్ ఎపిడెమిక్ (1998)" నుండి ఫ్రంట్ లైన్ పత్రిక ప్రచురించిన వివరాలు.*

ఎయిడ్స్‌ను కొత్తగా గుర్తించిన రోజులలో ఇది స్వలింగ సంపర్కం వల్ల వస్తుందని భావించారు. తర్వాత ఇది భిన్న లింగ సంపర్కం వల్ల కూడా రాగలదని నిరూపితమైంది. మహిళలకు, ముఖ్యంగా సంతానవతులు కాగలవారికిది అతి ప్రమాదకరమైన అంశంగా తయారు కాగల అవకాశాలున్నాయని శాస్త్రవేత్తలు ఊహించారు. ఇపుడు స్త్రీలే, పురుషుల కంటే అధికంగా ఈ రోగానికి గురవుతున్న విషయం రుజువైంది.

ఎయిడ్స్‌ను గుర్తించినప్పటి నుండి నేటి వరకూ సుమారుగా కోటిన్నర మంది పిన్నలు, పెద్దలు ఈ రోగానికి ఎరయినట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనాలు తెలియ జేస్తున్నాయి. 20వ శతాబ్దాంతానికి ఈ రోగుల సంఖ్య మూడు నుండి నాలుగు కోట్లకు పెరిగే అవకాశాలు ఉన్నట్లు కూడా ఈ సంస్థ అంచనా వేసింది. సుమారుగా ఐదు లక్షల మంది పిల్లలకు, తల్లుల నుండి ఈ రోగం సంక్రమించినట్లు కూడా ప్రపంచ ఆరోగ్య సంస్థ భావిస్తున్నది.

ప్రస్తుతం ప్రపంచంలో యాభై లక్షల మంది వరకూ మహిళా రోగులుండవచ్చునని ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేస్తున్నది. ఒక్క 1993వ సంవత్సరంలోనే సుమారుగా పది లక్షల మందికి మించే మహిళలు ఈ రోగానికి గురయినట్లు, 20వ శతాబ్దాంతానికి ప్రపంచలో మహిళా ఎయిడ్స్ రోగుల సంఖ్య కోటిన్నరను మించగలదని కూడా ఈ సంస్థ అంచనాలు తెలియ జేస్తున్నాయి. అంతేకాదు; వీరిలో 40 లక్షల మంది మరణించే అవకాశాలు కూడా ఉన్నట్లు ప్రకటించారు. హెచ్.ఐ.వి. సోకినట్లు నిర్ధారణైన స్త్రీ పురుషులు (పిన్నలు, పెద్దలు) ప్రపంచలో కోటి ఎనభై లక్షల మంది ఉన్నారనీ, వీరిలో మూడవ వంతు మంది సంతానవతులు కాగల వయస్సులోని స్త్రీలనీ ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేసింది (1993). ఒక్కసారి కాలుజారినా, ఈ వైరస్ సోకే అవకాశం, పురుషులలో కంటే స్త్రీలలో రెట్టింపు ఉంటుందని ఎయిడ్స్ వైద్య నిపుణులొకరు సూచించారు.

స్త్రీ పురుష సంపర్కం (సెక్సు సంపర్కం) వల్లనే ఈ రోగం ప్రధానంగా వ్యాపిస్తున్నట్లు అభివృద్ధి చెందిన దేశాలలో రికార్డైంది. స్వలింగ సంపర్కం వల్లా, మాదకద్రవ్యపు ఇంజక్షన్లను తీసుకొంటూ ఉండడం వల్ల కూడా ఎయిడ్స్‌ను తేగల వైరసు, ఒకరి నుండి మరొకరికి వ్యాపిస్తూండటం కూడా అధికంగానే ఉన్నట్లు గమనించారు. ఈ రోగం ప్రధానంగా స్త్రీ పురుష సెక్సు సంపర్కం ద్వారానే వ్యాపిస్తున్నట్లు ప్రపంచ ఆరోగ్యసంస్థ స్పష్టం చేసింది. 1992వ సంవత్సరంలో, అమెరికా స్త్రీలలో ఈ రోగ వ్యాప్తి, ఇలాగే జరిగింది. స్కాట్లండ్ అనుభవం కూడా దీనినే ధృవపరిచింది. మాదక ద్రవ్యపు ఇంజక్షను వల్ల పురుషునికి సోకిన హెచ్ఐవి వైరస్, వారి ద్వారా స్త్రీలకు సోకుతూండటం గమనించినవలసిన అంశం. దీనిని బట్టి స్వలింగ సెక్సు సంపర్కం కంటే, మాదక ద్రవ్య ఇంజక్షనులు తీసుకొనే పురుషుల తోడి సెక్సు సంపర్కం, స్త్రీలకు మరింత ప్రమాదకరమని రుజువవుతున్నది.

### 1997వ సంవత్సరాంతానికి హెచ్ఐవి/ఎయిడ్స్ రోగవ్యాప్తి ప్రపంచవ్యాప్త అంచనాలు

| | | |
|---|---|---|
| 1 1997వ సంవత్సరంలో కొత్తగా రోగం సోకినవారు | మొత్తం<br>పెద్దలు<br>స్త్రీలు<br>15 సం॥లోపు పిల్లలు | 58,00,000<br>52,00,000<br>21,00,000<br>5,90,000 |
| 2. హెచ్.ఐ.వి/ఎయిడ్స్‌తో జీవిస్తున్న రోగులు | మొత్తం<br>పెద్దలు<br>స్త్రీలు<br>15 సం॥లోపు పిల్లలు | 3,06,00,000<br>2,94,00,000<br>1,22,00,000<br>11,00,000 |
| 3. రోగపు రాక ప్రారంభమైనప్పటి నుండి సంభవించిన మొత్తం మరణాల సంఖ్య | మొత్తం<br>పెద్దలు<br>స్త్రీలు<br>15 సం॥లోపు పిల్లలు | 1,17,00,000<br>90,00,000<br>39,00,000<br>27,00,000 |
| 4 రోగం ప్రారంభమైనప్పటి నుండి, తల్లిదండ్రులు దానితో మరణించటం వల్ల అనాథలైన పిల్లలు | | 82,00,000 |

- *యుఎన్ఎయిడ్స్, ప్రపంచ ఆరోగ్య సంస్థలు ప్రచురించిన "రిపోర్టు ఆన్ ది గ్లోబల్ హెచ్ఐవి/ఎయిడ్స్ ఎపిడెమిక్ (1998)" నుండి ఫ్రంట్ లైన్ పత్రిక ప్రచురించిన తాజా సమాచారం.*

అన్ని దేశాలలో కంటే సబ్-సహారన్ ఆఫ్రికా ప్రాంతంలో ఈ రోగం అత్యంత ఉన్నత స్థాయిలో ఉన్నట్లు ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనాలు తెలియజేస్తున్నాయి. 1992వ సంవత్సరంలో ఈ ప్రాంతంలో పదిహేను లక్షల మంది ఎయిడ్స్ రోగులుండ వచ్చునని, మరొక డెబ్భై లక్షల మందికి హెచ్ఐవి సోకే అవకాశా లున్నాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా వేసింది. ఈ ప్రాంతంలో ఈ వైరసు వ్యాప్తికి స్త్రీ పురుష సెక్సు సంపర్కమే ప్రధాన కారణంగా నిర్ధారణ చేశారు. ఈ రోగం వస్తున్న స్త్రీ పురుషుల సంఖ్య దాదాపు సమంగా ఉన్నట్లు కూడా ఈ సంస్థ రికార్డు చేసింది. తూర్పు, మధ్య, పశ్చిమ, ఆఫ్రికా ప్రాంతాల జనాభాలో 1990వ సంవత్సరం నాటికే, నూరింట ఒకరికి హెచ్ఐవి సోకినట్లు అంచనా వేశారు. ఇందువల్ల, ఈ ప్రాంతపు ప్రజల జీవన కాల పరిమాణం, ఇప్పటి వలె యాభై సంవత్సరాలుగా ఉండవచ్చుననీ, ఇది పెరిగే అవకాశాలు లేవని ప్రపంచ ఆరోగ్య సంస్థ భావిస్తున్నది.

లాటిన్ అమెరికా, కరిబియన్ దేశాలలో, బ్రెజిల్‌లోని పట్టణ ప్రాంతాలలో వైరసు అంటు ప్రబలంగా ఉన్నట్లు కూడా ప్రపంచ ఆరోగ్యసంస్థ అంచనాలు తెలియజేస్తున్నాయి. ఈ ప్రాంతంలో హెచ్ఐవి సోకినవారు పదిలక్షల మంది వరకూ ఉండవచ్చునని సంస్థ అంచనా వేసింది.

ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలో హెచ్ఐవి/ఎయిడ్స్ వ్యాప్తి త్వరితగతిని జరుగుతున్నట్లు కూడా ప్రపంచ ఆరోగ్యసంస్థ రిపోర్టులు సూచిస్తున్నాయి. పురుషులలో కంటే ఇది స్త్రీలలో అధికంగా వ్యాపిస్తున్నట్లు, పైగా ఈ రోగ పీడితులంతా పెండ్లయి భర్తలతో కాపురం చేస్తున్నవారే అయి ఉండటం గమనార్హమైన అంశం. ఈ ప్రాంతంలోని అన్ని దేశాలలో కంటే భారతదేశంలోనూ, తాయ్‌లాండ్‌లోనూ ఈ వైరస్ అధికంగా వ్యాపిస్తున్నట్లు, ప్రపంచ ఆరోగ్య సంస్థ భావిస్తున్నది.

అందరికంటే యువతులకు హెచ్ఐవి సులభంగా సోకే అవకాశాలున్నట్లు అనుభవం నిరూపించింది. ప్రపంచంలో రోజుకు సగటున మూడువేల మంది స్త్రీలకు హెచ్ఐవి వైరస్ సోకుతున్నట్లు, రోజుకు ఐదువందల మంది చొప్పున స్త్రీలు ఎయిడ్స్ వల్ల మరణిస్తున్నట్లు యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం అంచనా వేసింది వీరిలో నూరింట 75 మంది వరకూ 15-25 సంవత్సరాల మధ్య వయస్కులు!

ఈ సంస్థ (యుఎన్‌డిపి) నాలుగు ఆఫ్రికా దేశాలలోనూ, రెండు ఆసియా దేశాలలోనూ నిర్వహించిన సర్వేలో తేలిన ఫలితాలలోని కొన్ని అంశాలివి :

- తాయ్‌లాండ్ దేశంలో, 15-25 సంవత్సరాల మధ్య వయస్సు స్త్రీలకు, ఇంతకంటే అధిక వయస్సున్న స్త్రీల కంటే హెచ్.ఐ.వి. అధికంగా సోకుతున్నది.
- యుగాండా జనాభాలోని 15-25 సంవత్సరాల మధ్య

## భారతదేశంలో హెచ్.ఐ.వి / ఎయిడ్స్

ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రచురించిన రిపోర్ట్ ఆన్ ది గ్లోబల్ హెచ్ఐవి/ఎయిడ్స్ ఎపిడెమిక్ (జూన్ 1998) రిపోర్టు ప్రకారం భారతదేశంలో నలభై లక్షల మంది ఎయిడ్స్ రోగులున్నారు. దేశ జనాభాలో ఈ రోగుల సంఖ్య నూటికి ఒకరి కంటే తక్కువగా ఉన్నట్లు కనిపించినా, ప్రపంచంలోని అన్ని దేశాలలో కంటె మన దేశంలోని రోగుల సంఖ్య అధికంగా ఉన్నదన్నది యదార్థం.

హెచ్ఐవి/ఎయిడ్స్ రోగుల అంచనాకు, ఎవరికి ఉచిత మనిపించిన విధానాన్ని వారు అవలంబిస్తున్నారు. ఇవి సుమారైన అంచనాలే గాని ఖచ్చితమైన సంఖ్యా వివరాలు గావు అంచనాకు అనుసరించిన విధానాన్ని బట్టి లభిస్తున్న సమాచారం ఉంటున్నది కనుక అన్ని సంస్థల అంచనాలు ఒకే విధంగా ఉండటం లేదు.

నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ అంచనాల ప్రకారం ఈ రోగం/మన దేశ జనాభాలో నూటికి 122 మందికి చొప్పున సోకుతున్నది. (జూన్ 1998 అంచనాలు). తమిళనాడులో 1997-98వ సంవత్సరంలో ముగిసిన ఎయిడ్స్ సర్వేను చెన్నైకి చెందిన ఒక సేవా సంస్థ పలు వైద్య సంస్థల సహకారంతో జరిపింది. తమిళనాడు రాష్ట్రంలో ఉన్న 15-45 సంవత్సరాల మధ్య వయస్కులయిన రెండున్నర కోట్ల జనాభాలోని నాలుగున్నర లక్షల మందికి, హెచ్ఐవి ఇన్‌ఫెక్షన్ సోకినట్లు సర్వే ఫలితాలు సూచించాయి. ఈ రాష్ట్ర జనాభాలోని 24,25,000 మందికి సుఖరోగాలు, 13,25,000 మందికి హెపటైటిస్-బి ఇన్‌ఫెక్షన్ సోకినట్లు కూడా సర్వే వెల్లడించింది

**ఆంధ్రప్రదేశ్‌లో...**

ఆంధ్రప్రదేశ్‌లో వెయ్యింట పదకొండు మందికి హెచ్ఐవి ఇన్‌ఫెక్షన్ ఉన్నట్లు రాష్ట్ర ప్రభుత్వానికి చెందిన ఇన్స్‌పెక్టర్ ఆఫ్ డ్రగ్ కంట్రోల్ అడ్మినిస్ట్రేషన్ శ్రీ కె. జగన్నాధరావు వెల్లడించినట్లు, 14-12-98 తేదీ హిందూ దినపత్రిక రిపోర్టు చేసింది నాలుగు లక్షల తొంభై ఎనిమిది వేల మందికి పరీక్షలు నిర్వహించగా, వారిలో 5,100 మందికి హెచ్ఐవి సోకినట్లు నిర్ధారణైనట్లు శ్రీ జగన్నాధరావు వివరించారు. భారతదేశంలో ముప్ఫై రెండు లక్షల మంది మీద పరీక్షలు నిర్వహించగా డెబ్భై యొక్క వేలమందికి హెచ్ఐవి సోకినట్లు నిర్ధారణయినట్లు వీరు వెల్లడించారు. దీని ప్రకారం దేశంలో వెయ్యిమంది జనాభాలో ఇరవై ముగ్గురకు ఈ వైరస్ సోకినట్లు తెలుస్తుందన్నారు. హెచ్ఐవి వ్యాప్తి దృష్ట్యా బ్లడ్‌బ్యాంకుల మీద సర్వేలెన్స్ నిర్వహిస్తున్నట్లు కూడా వీరు చెప్పారు. పేషంటుకు రక్తం ఇవ్వవలసి వచ్చిన స్థితిలో, ఆ రక్తానికి హెచ్ఐవి అంటినదో లేదో తెలుసుకొనేందుకు పరీక్షలు జరిగాయో లేదో, రోగి, వారి బంధువులు తెలుసుకోవాలి.

వయస్సు యువకులలో కంటే యువతులలో ఎయిడ్స్ రోగగ్రస్తుల సంఖ్య రెండు రెట్లు అధికంగా ఉన్నది.

- రువాండాలోని చూలాంద్రలో నూరింట 25 మందికి, 17 సంవత్సరాల వయస్సు యువతులలో నూరింట 17 మందికి హెచ్ఐవి సోకినట్లు వైద్యపరీక్షలు రుజువు చేశాయి.

ప్రపంచ వ్యాపిత ఎయిడ్స్ ప్రోగ్రాంను నిర్వహిస్తున్న ప్రపంచ ఆరోగ్య సంస్థ నిపుణులు డాక్టర్ మిషెల్ మెర్సన్, స్త్రీలకు హెచ్ఐవి అధికంగా సోకుతూండటానికి మూడు ముఖ్యమైన కారణాలున్నట్లు సూచించారు :

(1) వీరి జననాంగ నిర్మాణం హెచ్ఐవి సులభంగా సోకటానికి అనువుగా ఉన్నది. సెక్సు సంపర్క సమయంలో, వీరి జననాంగంలోని మృదువుగాను, తేమగాను ఉండే జననాంగ ఉపరితలం (మ్యూకోసల్ సర్ఫేస్) లోని అత్యధిక భాగం స్పర్శకు లోనవుతుంది. సెక్సు సంపర్క సమయంలో యోనిలో స్రవించే ద్రవంలో కంటే పురుష వీర్యంలో హెచ్ఐవి సాంద్రత (కాన్సెంట్రేషన్) అధికంగా ఉంటుంది. దీనికి తోడు పురుషవీర్యం కొద్దికాలం యోనిలో ఉంటుంది. ఇందువల్ల స్త్రీ నుండి పురుషుని కంటే, పురుషుని నుండి స్త్రీకి ఈ వైరస్ సోకే అవకాశాలు అధికంగా ఉంటాయి. సుఖరోగాలు కూడా వీరికే అధికంగా సోకుతూ ఉండటానికి కూడా కారణం ఇదే.

(2) అంటురోగాలు సంప్రాప్తించగల పరిస్థితులలో స్త్రీలు "సంసారం" చేయవలసి వస్తూండటం మరొక కారణం స్త్రీలు సామాన్యంగా తమకంటే అధిక వయస్కులను పెండ్లి చేసుకొంటూ ఉంటారు. వివాహానికి పూర్వమే పురుషులకు పలువురు స్త్రీలతో సంపర్కానుభవం ఉండి ఉండవచ్చు ఇందువల్ల హెచ్ఐవి గాని, ఇతర సుఖరోగాలు గాని వారికి సోకి ఉండే అవకాశాలున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో స్త్రీల కాన్పులు కష్టం గావటం, అధిక రక్తస్రావంవల్ల ప్రాణాపాయం సంభవించే అవకాశాలేర్పడుతూ ఉండటం అతి సామాన్య విషయమైంది ఇందువల్ల ఇటువంటి ప్రమాదకర పరిస్థితులలో వీరికి రక్తం ఇవ్వవలసిన అవసరం కలుగుతూ ఉంటుంది ఈ రక్తం ద్వారా హెచ్ఐవి వీరికి సోకే అవకాశాలుంటాయి

(3) సంసారంలో స్త్రీ జీవితం అరిటాకు వంటిది సెక్సు సంపర్క విషయంలో ఎపుడూ పురుషునిదే పై చేయిగా ఉండటం లోకవిదితం. వీరు కోరినట్లు వ్యవహరించటం ఇల్లాలి "ధర్మం"గా పితృస్వామిక సమాజం శాసిస్తున్నది ఉపాధి లభించక, పొట్ట గడవక పడుపువృత్తికి పాల్పడవలసిన దుస్థితిని స్త్రీలు అనుభవించ వలసి వస్తుంది. తమకు రోగపు అంటు సోకకుండా "కండోమ్‌ను వాడండి" అని మగవారికి సూచించే హక్కు పొట్టకోసం, కుటుంబ పోషణ కోసం మానాన్ని అమ్ముకొనే స్త్రీకే కాదు, పురుషుడు కోరే "వంశోద్ధారకు" లను ప్రసాదించగల "ధర్మపత్ని"కి కూడా లేదు. ఇందువల్ల కూడా స్త్రీలకు హెచ్ఐవి సోకే అవకాశాలు అధికంగా ఉంటున్నాయి.

బాల్య వివాహాలు పలు సమాజాలలో సహజమైనాయి. యుక్తవయస్సు రాకముందే ఆడపిల్లలు బయటివారి వల్లనే కాదు, బంధువుల చేతిలోనూ మానభంగాలకు గురవుతున్నారు. కాలగతిని ఈ ప్రవృత్తి పెరుగుతున్న సూచనలు కనుపిస్తున్నాయి. స్త్రీ అభీష్టానికి వ్యతిరేకంగా గాని, త్వరగా పూర్తి చేసుకు పారిపోవాలన్న నేరస్తుని తొందరపాటు వల్ల గాని జరిగే సెక్సు సంపర్కంలో, స్త్రీ యోనిలో ద్రవం స్రవించకపోవచ్చు. పలుసార్లు సంపర్కానికి లోను గావలసివచ్చిన సందర్భాలలో కూడా ఇది సంభవించవచ్చు. ఇటువంటి పరిస్థితిలో జరిగిన సెక్సు సంపర్కం వల్ల, స్త్రీకి విపరీతమైన బాధ గలుగుతుంది ఇందువల్ల స్త్రీ జననాంగం రోగగ్రస్థమయ్యే అవకాశాలు అధికంగా ఉంటాయి. స్త్రీలు అంగీకరించినా, తాము కోరినట్లు సంపర్కం జరిగే అవకాశాలు కూడా ఉండటం లేదు ఇందువల్ల కూడా వీరికి హెచ్ఐవి అంటుప్రమాదం అధికంగా ఉంటున్నది. హెచ్ఐవి వ్యాప్తి ప్రమాదం అధికమయిన తర్వాత, పరస్త్రీల పొందును కోరేవారు, ముక్కుపచ్చలారని పిల్లల కోసం ఆరాట పడటం అధికమైంది కన్యలలో ఈ వైరసు అంటు ఉండదని వీరి భావన ఇందువల్ల కూడా కన్యలకు ఈ రోగపు అంటు ప్రమాదం పెరిగింది

ఎయిడ్స్ మీద జరిగిన, ఒక యు యన్ డి పి సర్వే కాలంలో, "రోగపు అంటు ఉన్నదని తెలిసినపుడు, మీరు సెక్సు సంపర్కాన్ని ఎందుకు నిరాకరించరు?" అని సర్వేయర్లు స్త్రీలను అడిగారట. "మా సెక్సు మీద భర్తలకు సర్వాధికారం ఉన్నపుడు, మేము ఎలా నిరాకరించగలం?" అని చాలామంది మహిళలు జవాబిచ్చారు! భర్త కోరికను తీర్చకపోతే, తమను భర్తలు వదలి వేస్తారని వీరు భయపడుతున్నారట. భర్తలతో 'కండోమ్' వాడుకను ప్రస్తావించటానికి కూడా ఇల్లాండ్రు భయపడుతున్నట్లు సర్వేయర్లు పేర్కొన్నారు.

స్త్రీ జననాంగంలో పుండ్లు, వాపు ఉండటం, తెల్లబట్ట, ఎర్రబట్ట వంటివవుతూ ఉండటం కూడా హెచ్ఐవి ఉన్నవారి నుండి లేని వారికి అధికంగా సోకే అవకాశాలుగా నిపుణులు సూచిస్తున్నారు. పైన పేర్కొన్న పరిస్థితులు రోగపు అంటు సోకటం వల్ల గానీ, సెక్సు సంపర్క సంబంధాల కొనసాగింపు వల్ల గానీ, సంప్రదాయపూర్వకంగా జరిగే ఫిమేల్ సర్కంసిషన్ వల్ల గానీ సంభవించవచ్చు.

ఎయిడ్స్ వల్ల మరొక ప్రమాదం కూడా ఉన్నది. ఏ పాపం ఎరుగని పసికందులకు కూడా ఇది సోకవచ్చు. తల్లి గర్భంలో పిండంగా ఉన్నపుడు గాని, కాన్పు సందర్భంలో గాని, తల్లి చనుబాలు కుడిచే కాలంలో గాని ఇది బిడ్డకు సంక్రమించవచ్చు. హెచ్ఐవి సోకిన చూలాండ్రకు పుట్టే బిడ్డలలో నూరింట 33 మందికి ఈ వైరసు సోకవచ్చునని నిపుణులు సూచిస్తున్నారు. ఆఫ్రికాలో 1993వ సంవత్సరాంతానికి, హెచ్ఐవి సోకిన బిడ్డలు పదిలక్షల మంది వరకూ పుట్టి ఉంటారని అంచనా. 20వ శతాబ్దాంతానికి ఇలాంటి బిడ్డల సంఖ్య రెండు నుండి మూడు కోట్ల వరకూ ఉండవచ్చునని భావిస్తున్నారు.

కొన్ని పరిస్థితులలో, అభివృద్ధి చెందిన దేశాలలో

## హెచ్ ఐ వి / ఎయిడ్స్

హ్యూమన్ ఇమ్యునోడిఫిషియన్సీ వైరస్ (హెచ్ఐవి) ఇన్ఫెక్షన్ తెల్ల కణాలను క్రమంగా చంపుతూ ఉంటుంది. ఇందువల్ల ఎక్వయిర్డ్ ఇమ్యునోడిఫిషియన్సీ సిండ్రోమ్ (ఎయిడ్స్) వస్తుంది. దీని ఫలితంగా శరీరపు రోగ నిగ్రహశక్తి తగ్గి, పలురకాల రోగాలు వచ్చే అవకాశాలేర్పడతాయి.

**వ్యాప్తి మార్గాలు :-** ఈ వైరసులు గానీ, అవి ఉన్న జీవ కణాలు (సెల్స్) గాని ఉన్న రక్తము, వీర్యము, యోనిలో స్రవించే ద్రవాలు, మెదడు ఉపరితలం మీద ప్రసరిస్తుండే ద్రవము (సెరెబ్రోస్పైనల్ ఫ్లూయిడ్) చనుబాలు వంటి ద్రవాల ద్వారా హెచ్ఐవి వ్యాపిస్తుంది. ఈ వైరసు, కన్నీరు, మూత్రము, లాలాజలములలో కూడా ఉంటుంది. కాని తొలుత పేర్కొన్న ద్రవాలలో కంటే వైరసు సాంద్రత వీటిలో తక్కువగా ఉంటుంది.

- సెక్సు సంపర్క సమయంలో, నోరు, యోని, పురీష నాళము - వీటి ఉపరితలాన్ని కప్పి ఉండే సన్నగాను, మృదువుగానూ, తడిగానూ ఉండే పొర (మ్యూకస్ మెంబ్రేన్) కు, వైరసులున్న ద్రవాలు సోకటం వల్ల, వైరస్ ఇన్ఫెక్షన్ ఉన్నవారి నుండి లేనివారికి సోకుతుంది. మ్యూకస్ మెంబ్రేన్ చిరిగి, లేక దెబ్బతిని ఉన్నపుడు ఈ వైరసు మరింత సులభంగా సోకుతుంది.

- పేషెంట్‌కు అత్యవసర సమయాలలో రక్తం ఇవ్వవలసి రావచ్చు. ఇలా వారికిచ్చే రక్తంలో హెచ్ఐవి ఉంటే, దీని ద్వారా ఆ పేషంటుకు ఇది సోకుతుంది. హెచ్ఐవి ఉన్నవారు వాడిన ఇంజక్షన్ సూదులను వాడినా, అవి ప్రమాదవశాత్తూ గుచ్చుకొన్నా, ఇది లేని వారికి సంక్రమిస్తుంది.

- తల్లికి హెచ్ఐవి సోకి ఉంటే, అది కాన్పుకు ముందుగానీ, కాన్పు జరిగే సమయంలో గానీ ఆవిడ బిడ్డకు సోకవచ్చు. చనుబాల ద్వారా కూడా అది బిడ్డకు సంక్రమిస్తుంది.

*(తరువాయి ప్రక్క పేజీలో)*

కూడా హెచ్ఐవి అధికంగా సోకే అవకాశాలున్నాయని చెబుతున్నారు అమెరికాలోని డిసీజ్ కంట్రోల్ అండ్ ప్రివెన్షన్ సంస్థలో నమోదైన సంఖ్యా వివరాలు ఈ అంశాన్ని నిరూపిస్తున్నాయి. హెచ్ఐవి సోకుతున్న రేటు న్యూజెర్సీలోని న్యూవార్క్‌లో 1.4 శాతము, ఫ్లోరిడాలోని మియామిలో 1.7 శాతము, న్యూయార్కు నగరంలో 2.3 శాతము, బోస్టన్ నగరంలో 3.3 శాతం ఉన్నట్లు 1991-92వ సంవత్సరంలో నమోదైంది! ఫ్రాన్సులోని పారిస్ నగరంలోని కొన్ని ప్రసూతి వైద్యశాలల రికార్డులను బట్టి ఈ వైరసు సోకుతున్న రేటు ఒక్క శాతాన్ని చేరినట్లు తెలియవస్తున్నది.

ఈ రోగానికి అధిక సంఖ్యలో ఎరవుతున్న వారు వేశ్యలు. వారి ఆర్థిక పరిస్థితులే వారిని ఇందుకు గురి చేస్తున్నాయి. కొన్ని ఆసియా దేశాలలో వేశ్యావృత్తిలో వున్న వారిలో నూరింట డెభ్భై మంది వరకూ ఈ వైరసుకు గురయినట్లు ఐక్యరాజ్యసమితి అంచనాలు తెలియజేస్తున్నాయి. "ఆసియా దేశాల నుండి మాత్రమే గాక, పలు విదేశాల నుండి వస్తున్న లక్షలాది టూరిస్టుల కోసం పనిచేస్తున్న అతి శక్తివంతమైన సెక్సు పరిశ్రమగా పడుపు వృత్తి కొన్ని ఆసియా దేశాలలో వర్ధిల్లుతున్నది. ఒక్కొక్క వేశ్య రోజుకు సగటున ఐదుగురు విటులను అలరించవలసి ఉంటుందని అంచనా. ఇందువల్ల విటుల నుండి వేశ్యలకూ, వేశ్యల నుండి విటులకు, ఈ విటుల నుండి వారి సతీమణులకు లేక ప్రేమికులకు హెచ్ఐవి వ్యాపించే అవకాశాలు అత్యధికంగా ఉంటున్నాయి.

"ఈ అంటురోగం వల్ల వేశ్యలు ఎన్నో బాధలను ఎదుర్కొన వలసి వస్తున్నది. ఈ రోగం వల్ల మరణ ప్రమాదం కూడా ఉంటున్నదని వారు భయపడుతున్నారు. అట్లని ఈ వృత్తిని వదలివేస్తే, తమ పోషణకు, తమ మీద ఆధారపడిన పిల్లలను, తల్లిదండ్రులను, ఇతర వయోవృద్ధులను

హెచ్ఐవి వ్యాపించ వీలులేని సందర్భాలు :-

- రోగితో చేతులు కలపటం (షేక్‌హేండ్), కౌగిలింతలు
- రోగి అంటుకొన్న భోజన పదార్థాలను గానీ, భోజనం చేసిన పళ్ళేరాలను గానీ వాడటం
- రోగి వాడుతున్న బాత్‌రూం, నీటి పంపు, టెలిఫోన్ వంటి వాటి వాడకం
- హెచ్ఐవి పేషెంటుకు రక్తదానం చేయటం
- రోగి ఈదిన నీటికొలనులో ఈదటం
- రోగిని కుట్టిన ఏ దోమో, వైరసు అంటులేని వారిని కుట్టటం
- రోగి చీదటం, దగ్గటం
- రోగిని అంటుకున్న పశువులు, కుక్కలు, పిల్లుల వంటి ఇండ్లలో ఉండే జంతువుల ద్వారా.
- రోగి ఉన్న ఇంట్లో నివసించటం వల్లా, వారితో కలిసి పనిచేయటం వల్లా, వారి సరసన కూర్చోవటం వల్లా హెచ్ఐవి రోగి నుండి వైరసు, లేని వారికి సోకే వీలులేదు

కానీ, రోగి రక్తం అంటటానికి అవకాశాలున్న టూత్ బ్రష్‌లు, షేవింగ్ సెట్లు, రేజర్లు, క్లిప్పర్సు వంటి వాటిని ఇతరులు వాడకూడదు.

*కనుక హెచ్ఐవి రోగిని చూచి భయపడనవసరం లేదు. కలసి జీవించకుండా దూరం చేసుకోనవసరం లేదు కొన్ని గ్రామాలలో ఈ రోగులను గ్రామం నుండి తరిమివేయటం, వెలి వేయటం వంటివి జరుగుతున్నది. ఇలా జరుగనవసరం లేదు.*

చికిత్స :- ఇటీవల పలురకాల మందులు వస్తున్నాయి. వాటి ఖరీదు అత్యధికంగా ఉంటున్నది. ఈ మందుల వాడుక వల్ల రోగం నయం గావటం లేదు; కానీ రోగి జీవితాన్ని పొడిగించటం, అతని శారీరక, మానసిక శక్తులు నీరసించకుండా చేయటం మేరకు ఇవి వినియోగపడుతున్నాయి ఈ మందుల వాడకం వల్ల కొన్ని కొత్త అనారోగ్య సమస్యలు (సైడ్ ఎఫెక్ట్స్) కూడా అంకురిస్తున్నాయి. దీని నివారణ మాత్రం ఇంతవరకూ సాధ్యం గాలేదు.

## వ్యాప్తి నిరోధక మార్గాలు :-

- రోగం సోకనివారు, సోకినవారితో సెక్సు సంపర్కం నుండి విరమించటం ఉత్తమం. ఒకవేళ అందుకు పూనుకుంటే 'కండోమ్' వంటి రక్షణ విధానాలను వాడాలి.
- రోగులు సెక్సు సంపర్కానికి పూనుకోకూడదు. అందుకు పూనుకుంటే 'కండోమ్' వంటి రక్షణా సాధనాలను వాడాలి. వీరు రక్తదానం గానీ, తమ శరీరానికి సంబంధించిన హృదయం, కిడ్నీ వంటి వాటిని గానీ దానం చేయకూడదు. స్త్రీ రోగులు చూలు రాకుండా చూసుకోవాలి. తనకు రోగమున్న విషయాన్ని, రోగి తన సెక్సు భాగస్వామికి చెప్పాలి
- మాదకద్రవ్య వాడకందారులు ఒకరు వాడిన ఇంజక్షన్ సూదిని మరొకరు వాడకూడదు.
- డాక్టర్లు, డెంటిస్టులు రోగికి సంబంధించిన ద్రవపదార్థాలు తమ శరీరానికి అంటే అవకాశం లేకుండా లేటెక్స్ గ్లౌసును వాడాలి. ఈ రోగులకు వాడిన ఇంజక్షన్ సూదులను, ఇతరులకు గుచ్చు కోకుండా జాగ్రత్తగా పారవేయాలి.

పోషించటానికి ఇంతటి ఆదాయాన్నిచ్చే మరొక ఉపాధి లభించే అవకాశాలు వీరికి లేవు. 'కండోమ్'ల వాడుక వల్ల తమకు హెచ్ఐవి నుండి రక్షణ లభిస్తుందని చాలామందికి తెలుసు. విటులు 'కండోమ్' వాడుకను అంగీకరించరు. 'కండోమ్' లేకుండానే రతిసుఖం అధికంగా ఉంటుందన్న భావంతో వారు, అధిక రుసుం చెల్లించయినా, ఇందుకు అంగీకరించే వేశ్యలనే ఎన్నుకొంటున్నారు.

"ఈ పరిస్థితిని ఒక ఆసియా మహిళ ఇలా వివరించింది: "ఎప్పుడో ఒకరోజు ఎయిడ్స్ నన్ను రోగగ్రస్తురాలినిగా చేయగలదు. నేను పనిచేయని నాడు నా కుటుంబీకులకు తినటానికి తిండి కూడా ఉండదు, ఇందువల్ల అందరం రోగగ్రస్థులమవుతాం" ("ఉమెన్ : లుకింగ్ బియాండ్ 2000" అన్న ఐక్యరాజ్యసమితి ప్రచురణ నుండి)

అభివృద్ధి చెందిన దేశాలలో కూడా పేద వర్గాలకు చెందిన స్త్రీలే దీనికి అధికంగా ఎరవుతున్నారు. అమెరికాలో ఇటీవలి కాలంలో జరిగిన సర్వే ఈ విషయాన్ని ధృవపరచింది. హెచ్ఐవి సోకిన మహిళలలో నూరింట 73 మంది నల్లజాతివారు, లాటిన్ అమెరికా నుండి వలసవచ్చినవారూ ఉన్నారు. ఈ జాతుల పురుషులలో నూరింట 43 మందికి మాత్రమే ఈ వైరసు సోకింది.

హెచ్ఐవికి గురవుతున్న వారిలో పురుషుల కంటే అధికంగా స్త్రీలున్నారు. పితృస్వామిక సమాజంలో నిరాదరణకు గురవుతూ, ఎటువంటి స్వాతంత్ర్యాన్నీ అనుభవించలేని మహిళలూ, విధివశాత్తూ దారిద్ర్యపు కోరలలో చిక్కిన వారిలో అధికులూ, ఈ రోగానికి ఎరవుతున్నట్లు పై సమీక్ష స్పష్టం చేస్తున్నది.

భారతదేశంలో....

భారతదేశంతో సహా, అభివృద్ధి చెందుతున్న పలు దేశాలలో హెచ్ఐవి ప్రధానంగా స్త్రీ పురుష సెక్సు సంపర్కం ద్వారా వ్యాపిస్తున్నట్లు రుజువైంది. జర్నల్ ఆఫ్ అమెరికన్ మెడికల్ అసోసియేషన్, 1997వ సంవత్సరం, డిశంబరు 17వ తేదీ సంచికలో ప్రచురితమైన రిపోర్ట్సు, భారతదేశంలో ఎయిడ్స్ వ్యాప్తి మీద వెల్లడిస్తున్న అంశమిది: "హెచ్ఐవి సోకినవారు ఆసియాలో నలభై లక్షల మంది వరకూ ఉన్నారు. వందకోట్ల జనాభా ఉన్న *భారతదేశంలో, ఆసియా ఖండంలోని మరే ఒక్క దేశంలోనూ లేనంతమంది ఈ వైరస్ సోకినవారున్నారు.* ఇటువంటి రోగులు ప్రస్తుతం ఇరవయ్యైదు లక్షల మంది నుండి ముప్ఫై అయిదు లక్షల మంది వరకూ ఉండవచ్చు. బొంబాయి, పూనా, మద్రాసు, వెల్లూరు తదితర నగరాలలో 1990వ సంవత్సరంలో, ఫీమేల్ సెక్స్ వర్కర్లలో (వేశ్యావృత్తిలో జీవిస్తున్నవారిలో) నూరింట పది మందికి మాత్రమే హెచ్ఐవి సంక్రమించింది. 1996వ సంవత్సరానికి ఈ వైరసుకు గురయిన వారి సంఖ్యా పరిమాణం 40-50 శాతానికి పెరిగింది. ఈ నగరాలలోని సుఖరోగ నివారణ చికిత్సా కేంద్రాలకు వస్తున్న పురుషులలో, ఇరవై నుండి ముప్ఫై శాతం మందికి హెచ్ఐవి సోకింది."

పైన పేర్కొన్న రిపోర్టు రచయితలు పూనాలోని రెండు సెక్సు రోగ చికిత్సా కేంద్రాలకు, 1993వ సంవత్సరం మే, 1996వ సంవత్సరం జూన్ మాసం మధ్య కాలంలో వచ్చిన స్త్రీ పురుష సుఖరోగులలో 6,495 మందికి హెచ్ఐవి నిర్ధారణ పరీక్షలను జరిపారు. వీరిలో 23 శాతం మందికి హెచ్ఐవి సోకినట్లు పరీక్షలు రుజువు చేశాయి. సెక్సువర్కర్లలో 45 శాతం మందికి, పురుష సుఖరోగులలో 21 శాతం మందికి, సెక్సు వర్కర్లు గాని స్త్రీలలో 14 శాతం మందికి హెచ్ఐవి సోకినట్లు నిర్ధారణైంది. దీనినిబట్టి, *భారతదేశంలో సాలుకు నూరింట పదిమంది సుఖరోగులకు హెచ్ఐవి సోకుతున్నట్లు పరిశోధకులు అంచనా వేశారు.* సెక్సు వర్కర్ల కంటే సెక్సు వర్కర్లు కాని స్త్రీలు, వయస్సులో చిన్నవారు. అత్యధికులు వివాహితలు, కుటుంబాలలో నివసిస్తున్నారు. హెచ్ఐవి సులభంగా సోకటానికి వీలున్న జననాంగాల మీద అల్సర్లను కలుగజేయగల సుఖరోగాలు, సెక్సువర్కర్లలోని 42.7 శాతం మందిలో కనుపిస్తే, సెక్సు వర్కర్లు గాని వారిలో 60 శాతం మందికి ఈ రకపు సుఖరోగాలున్నాయి! ఈ నాన్-సెక్సువర్కర్లలో నూరింట 92 మంది ఒక్కరితో కాపురం చేస్తున్నారు. అయినా వీరికి హెచ్ఐవి సోకటం అనేది మనం గమనించవలసిన అంశం. సెక్సు వర్కర్లకు పలువురితో సెక్సు సంబంధాలుంటాయి. గనుక వారిలో అత్యధికులకు ఈ వైరసు సోకటం సంభవమే. ఈ విషయం మీద రిపోర్టు రచయితల విశ్లేషణను చూడండి : "నాన్-సెక్సు వర్కర్లు,

సెక్సును అమ్ముకొనే వారు కారు; వారు జాగ్రత్తగానే ఉంటారు. సెక్సు విశృంఖలత్వం వారిలో కనుపించదు. అయినా వారిలో హెచ్ఐవి కనుపించటం ఆందోళనను కలిగిస్తున్నది. వీరి సెక్సు పార్ట్‌నర్స్‌లో అధికులకు సుఖరోగాలున్నాయి. తాము ఒక్క పురుషునితో మాత్రమే సంసారం చేస్తున్నాం గనుక, మాకు ఇటువంటి ప్రమాదాలుండ వని ఈ అభాగినులు భ్రమించారు.

*"జననాంగాలకు అల్సర్లను కలుగజేసే రోగాలున్నపుడు వారికి హెచ్ఐవి సోకే అవకాశాలు, అవి లేని వారి కంటే, నాలుగు రెట్లు అధికంగా ఉంటాయి. అల్సర్లు కలుగజేయని సుఖరోగా లున్నవారికి, ఈ వైరసు సోకే అవకాశం రెండు నుండి మూడు రెట్లు మాత్రమే అధికంగా ఉంటుంది."*

## స్త్రీలకు సుఖరోగ బాధలు

మన దేశంలో సుఖరోగాల వ్యాప్తి అధికంగా ఉన్నది. జననాంగాలలో అల్సర్లను కలుగజేయగల రోగాలు ప్రధానమైనవిగా కనుపిస్తున్నాయి. సుఖరోగుల మీద తగినంత సమాచారం కూడా మనదేశంలో లభించటం లేదు. సెక్సును గురించి బహిరంగంగా మాట్లాడటం కూడా తప్పుగా పరిగణించే సమాజం మనది. పాశ్చాత్య దేశాలలో లభించినంతటి సమాచారం ఈ విషయం మీద మన దేశంలో లభించటం కష్టమై పోయింది. సర్వేలలో కూడా ప్రజలు వాస్తవాలను వెల్లడించటం కష్టం. కనుక సర్వేలలో లభించే సమాచారం కూడా అరకొరగానూ, అపనమ్మక మైనదిగానూ ఉంటున్నది. ఇందువల్ల పరిశీలనకు ప్రధానంగా వైద్యశాలల రికార్డుల మీద ఆధారపడుతున్నారు. వాస్తవ మనుకొన్న కొన్ని అంశాలను ఆధారంగా తీసుకొని, ఉండగల వాస్తవాలను ప్రధానంగా ఊహిస్తున్నారు. ఇందువల్ల ఈ విషయం మీద వెలువడుతున్న విశ్లేషణలు, తుది పలుకులు కావు.

సుఖరోగాలలో అధిక భాగం స్త్రీలలో రోగ సూచనలను కనుపింపచేయవు. స్త్రీ మర్మాంగ నిర్మాణం ఇందుకు కారణంగా వైద్యులు చెబుతున్నారు. ఇందువల్ల తనలో రోగమున్నా, లేదనే స్త్రీ భ్రమిస్తూ ఉంటుంది. మర్మావయవంలో ఏదయినా అసౌకర్యం ఉన్నట్లు తోచినా, అది జీవితంలోని భాగంగా యెంచి, మిన్నకుండటం ఇల్లాండ్ర లక్షణమైంది. సుఖరోగాలలో, ఏది ఎలాంటి సూచనలను ప్రదర్శించేది స్త్రీలకు తెలియదు; ఇలాంటి సూచనలు ఏవయినా కనుపిస్తే వెంటనే వైద్యచికిత్సకు వెళ్ళాలని కూడా వారికి తెలియదు. ఒకవేళ అనుమానించగలిగినా, "దీన్ని నీవు ఎచ్చట నుండి తెచ్చావు" అని భర్త తనకు వ్యభిచారనేరాన్ని అంటగట్టే ప్రమాదమున్నదని ఇల్లాలు భయపడుతుంది. వర్తమాన కాలంలో, వైద్య విద్యాబోధనలో కూడా ఈ రోగాలకు తగినంత ప్రాధాన్యత లభించటం లేదు. ఈ శాస్త్రంలోని నిపుణులకు వైద్యశాస్త్రంలోని ఇతర శాఖల వారికి లభిస్తున్నంత గౌరవస్థానం లభించటం లేదు. అందువల్ల ఈ రోగాలలో స్పెషలిస్టులుగా తర్ఫీదు పొందేవారి సంఖ్య తక్కువగా ఉంటున్నది. ఇందువల్ల పట్టణాలలో నిపుణులు ఉండవచ్చు గాని, గ్రామీణ ప్రాంతాలలో సామాన్యంగా కనుపించరు. ఇందువల్ల "నాటు" వైద్యులకు మంచి గిరాకీ లభిస్తున్నది. వివాహితలు గానీ, వ్యభిచారిణులు గానీ, ఈ రోగాల నుండి రక్షించుకొనే అవకాశాలు లేవు. వారు పురుషుల కోరిక ప్రకారం నడుచుకొని తీరవలసిందే. (ఈ విషయాన్ని ఇంతకు పూర్వమే వివరించాం.) ఈ పరిస్థితుల మూలంగా సుఖరోగాల వల్ల పురుషుల కంటే స్త్రీలు అధికంగా బాధపడవలసి వస్తున్నది.

స్త్రీలకు సుఖరోగాలు సోకే ప్రమాదం అధికంగా ఉండటం చాలదన్నట్లు, జననాంగ సముదాయం అంటు రోగాలకు (రీప్రొడక్టివ్ ట్రాక్ట్ ఇన్ఫెక్షన్స్‌కు) గురయ్యే ప్రమాదం పొంచి ఉంటుంది. ఇన్ఫెక్షన్ మూలంగా జననాంగాలలో వాపు వస్తూ ఉంటుంది. జననాంగాన్ని ఆరోగ్యప్రదంగా ఉంచుకోలేకపోవటం, కాన్పుకు కాన్పుకు మధ్య తగినంత కాలవ్యవధి లేకపోవటం, కాన్పు కావటంలో ఇబ్బందులు ఎదురవుతూ ఉండటం, గర్భస్రావ ప్రయత్నం, ఐయుడి వంటి గర్భనిరోధక సాధనాల వాడకం ఇత్యాదులు ఈ పరిస్థితికి దారిదీయవచ్చు. సెక్సు సంపర్కం వల్ల కూడా ఇన్ఫెక్షన్ రావచ్చు. అనీమియా, స్త్రీ సంతానాన్ని కనే కాలంలో ఆరోగ్యప్రదమయిన జీవితాన్ని గడపలేకపోవటం, రోగ సూచనలను ప్రారంభ దశలోనే గుర్తించలేకపోవటం, వాడకానికి పరిశుభ్రమైన నీరు, నివాసానికి ఆరోగ్యప్రదమైన పరిసరాలు లభించకపోవటం కూడా ఈ రోగాలకు కారణాలు. జననాంగాలు రోగగ్రస్థమైనపుడు చూలు, కాన్పు కాలాలలో కొన్ని అవాంఛనీయ పరిణామాలు సంభవిస్తాయి. ఇంతకు పూర్వమే

చెప్పినట్లు జననాంగాల ఇన్ఫెక్షన్ సుఖరోగాలకు మార్గం సుగమం చేస్తుంది. సుఖరోగాలు, హెచ్ఐవి సులభంగా సోకటానికి దారితీస్తాయి. ఇందువల్ల సుఖరోగాలు, పురుషుల కంటే స్త్రీలను ఎక్కువగా బాధిస్తాయి. స్త్రీలు వీటికి ఎరగావటం వల్ల సమాజం అధికంగా నష్టపడుతుంది. కనుక చూలు, ప్రసవ దశలలో స్త్రీకి ఎంత పటుతరమైన రక్షణను కోరతామో, అంతటి పటిష్టమైన రక్షణ, వారిని సుఖరోగాల నుండి, హెచ్ఐవి నుండి రక్షించటానికి అవసరం. ఈ సమస్యా పరిష్కారానికి సమగ్ర దృష్టి అవసరం. కనుక పైన పేర్కొన్న అనారోగ్య పరిస్థితులకు, సమాజంలో ఆవిడ అనుభవిస్తున్న పరతంత్రతా, లింగ వివక్షా అధికంగా తోడ్పడు తున్నాయి. పరతంత్రగా, మిడిమిడి జ్ఞానంతో, అనారోగ్యంతో జీవించవలసి రావటం చేత, స్త్రీ అత్యంత అననుకూల పరిస్థితిని ఎదుర్కొనవలసిన వస్తున్నది. దీనికి దారిద్ర్యం కూడా తోడైతే, ఆవిడ జీవన పరిస్థితి అత్యంత దయనీయంగా మారుతుంది. దారిద్ర్యం స్త్రీలను అనాథలనుగానో, వేశ్యలుగానో మార్చిన సందర్భాలు కోకొల్లలుగా కనుపిస్తాయి. ఈ పరాధీనతే ఆవిడ పాలిట పెనుభూతమై సుఖరోగాలకూ, హెచ్ఐవి (ఎయిడ్స్)కు అప్పగిస్తున్నది ఆవిడ సెక్సే ఆవిడ పాలిటి శాపంలా పరిణమిస్తు న్నది. ఈ వైనాన్నిపుడు పరిశీలించుదాం.

## సమాజంలో సెక్సు

మన సమాజంలో సెక్సును గురించి బహిరంగంగా ప్రసంగించటానికి సర్వత్రా నిరసన వ్యక్తమవుతుంది. ఇది అసభ్య ప్రవర్తన కింద జమ. ఇది చాటుమాటు వ్యవహారం. ఇందువల్ల యువతీ యువకులకు తెలియవలసినంతగా సెక్సును గురించి తెలియని దశలో వివాహాలవుతాయి. దాంపత్య సంబంధాలను అతిక్రమించి స్త్రీ గాని, పురుషుడు గాని పరులతో సెక్సు సంబంధాలను ఏర్పరచుకోవటం వల్ల సుఖరోగాల వ్యాప్తికి అవకాశాలున్నాయన్న విషయం అందరకూ తెలుసు. పురుషునకు గాని, స్త్రీకి గాని ఎందరితో సెక్సు సంబంధాలున్నాయి అన్న విషయం ఇతరులకు తెలియటం కష్టం. ఈ స్థాయీ పరిమాణం తెలిసినపుడు, దేశంలో వ్యాపిస్తున్న సుఖరోగాల పరిమాణాన్ని అంచనా వేసే వీలుంటుంది. కనుక లభిస్తున్న స్వల్ప ఆధారాలతోనే సామాజిక శాస్త్రవేత్తలు, వైద్యనిపుణులు సుఖరోగ పరిమాణ విచారణ చేస్తున్నారు.

స్త్రీ సెక్సు పొందు కోసం పరోక్షంగా ఎంతగా ప్రాకులాడు తున్నా, పురుషులు, బయటికి మాత్రం దానిని మహా వినాశకరమైన దానిగా వర్ణించారు. అది "లజ్జాకరమైనది" "అసభ్యకరమైనది", "వినాశకరమైనది" అని కూడా మనకు చెప్పారు. స్త్రీ సెక్సును భస్మాసుర హస్తంగా కూడా వర్ణించారు. తండ్రి "వంశోద్ధరణకు", వారిని "పున్నామ నరకం నుండి తప్పించటానికి", వారు మర ణించినపుడు "తలకొరివి పెట్టగల దిక్కుగా" పరిగణించే పురుష సంతానాన్ని కని భర్తకివ్వటం ఒక్కటే స్త్రీ సెక్సు యొక్క "పరమ పవిత్ర" లక్ష్యంగా నిర్ణయించారు. ఆవిడ పరహస్తగతం గాకుండా కట్టుదిట్టమైన సాంఘిక సంప్రదాయ శృంఖలాలను సృష్టించారు. అవసరమనుకొన్నపుడు తమ విలాసానికి, లేక ప్రయోజనానికి వాడుకొంటూ, స్త్రీని తమ చేతిలో కీలుబొమ్మను చేసుకొన్నారు.

సంప్రదాయం నిర్దేశిస్తున్న ధర్మాలయిన - వంశోద్ధారకులను కనటం, గృహనిర్వహణ, ఇంటిలోని పిన్నలు, పెద్దలకు సేవలు చేసి తరించటం ఆవిడ బాధ్యత. ఈ భావాలను ఆవిడకు చిన్నప్పటి నుండి నూరిపోస్తారు. స్త్రీ పురుషునితో సమానురాలు కాదన్నట్లు వ్యవహరిస్తారు. చదువు సంధ్యలు, పోషణాది అంశాలలో లింగభేదాన్ని తల్లిదండ్రులే ప్రదర్శించనారంభిస్తారు. ఇందువల్ల స్త్రీ పోషణా లోపానికి, చిన్ననాటి నుండి గురవుతూ ఉంటుంది. చదువులేక, బయటి ప్రపంచంతో సంబంధం లేక కూపస్థ మండూకంలా తయారవుతుంది. బయటి ప్రపంచంలో కాలిడటానికి, స్వతంత్రంగా వ్యవహరించటానికి భయపడ నారంభిస్తుంది. రజస్వలానంతరం ఆవిడకు పరులతో సంబంధాలు తెగిపోతాయి. ఆవిడ కదలికలపై కన్నవారూ, తోబుట్టువులు నిఘా వేసి ఉంచుతారు. అవయవాలు కప్పేట్లు దుస్తులు వేసుకోవాలి; పరపురుషులతో "ఇకఇకలు, పకపకలు" కూడదు. పురుషుల ముందు సిగ్గును ప్రదర్శించాలి. వీలయినంత వరకు పరుల దృష్టిలో పడకూడదు. మెట్టినింటికి పోయిన తర్వాత కూడా ఆవిడ ఈ సూత్రాలను పాటించవలసే ఉంటుంది. ఇందువల్ల భయకంపిత మనస్తత్వం ఆవిడను ఆవహిస్తుంది. సెక్సు సంబంధిత అంశాలను భర్తతోనే కాదు, కన్నతల్లికి కూడా చెప్పటానికి భయపడుతుంది. ఈ విషయంలో కుటుంబీకులు తనను సక్రమంగా అర్థం చేసుకోలేరని

భయపడుతూ ఉంటుంది. సెక్సు పరమైన అన్ని అసౌకర్యాలను, అనారోగ్యాన్ని దాచుకొంటుంది

ఇచ్చట ఒక వైపరీత్యం మనకు కనిపిస్తుంది. సెక్సును గురించి స్త్రీ సిగ్గును, భయాన్నీ, పాతివ్రత్య ధర్మాన్నీ పాటించాలని చాటే మన సంప్రదాయం, పడకటింట్లో, భర్తలను అలరించటానికి "రంభవలె" ప్రవర్తించాలని సూచిస్తున్నది! పురుషాధిపత్యం కొనసాగుతున్న మన సమాజం స్త్రీ పురుషులకు భిన్నమైన నీతి సూత్రాలను నిర్దేశిస్తున్నది పాతివ్రత్య ధర్మాన్ని పాటించడం స్త్రీ విధి, ఈ ధర్మాన్ని తప్పిన భార్య. భర్త ఆగ్రహానికి గురవుతుంది. సామాజికుల దృష్టిలో చులకనవుతుంది సంప్రదాయం పురుషులకు కూడా ఏకపత్నీ వ్రతాన్ని నిర్ణయించింది ఇది నామ మాత్రం గానే అమలు జరుగుతున్నది. వీరు ఈ ధర్మాన్ని అతిక్రమించినా, సమాజం పట్టించుకోదు; దాన్ని "పురుష లక్షణం" గా భావిస్తుంది! ఈ విధంగా సమాజం, పురుషుల ఏకపత్నీవ్రత భంగానికి రక్షణ కల్పిస్తున్నది; దానిని గౌరవిస్తున్నది.

పరస్త్రీ లోలత్వం కొందరకు వ్యసనం; మరి కొందరు ఉద్యోగ రీత్యా, దూరప్రాంతాలలో భార్యను వదలిఉండే కాలంలో ఇందుకు తాపత్రయపడతారు. భార్య రుతుస్రావపు రోజులలో, చూలు, కాన్పు కాలాలలో, ఆవిడ బాలింతగా ఉండే కాలంలో, ఆవిడ పుట్టినింటికి పోయిన రోజులలో, పూజలు, వ్రతాలు చేస్తున్న కాలంలో, ఇల్లాలు సంతానాన్ని కనలేకపోయినపుడు, ఇంటి పనులతో అలసి ఆవిడ సెక్సు మీద శ్రద్ధను ప్రదర్శించలేకపోయినపుడు, ఆవిడ తాను కోరినట్లుగా పడకటింట్లో అలరించలేకపోవటం చేతా, తనకు సెక్సును అందించటంలో వైవిధ్యాన్ని ప్రదర్శించలేక పోయినందుకు పురుషుడు పరస్త్రీల పొందుకు పోతుంటాడు. ఈ కారణాలు, రచయిత ఏకపక్షంగా చెబుతున్నవి కావు. సుఖరోగాలతో వైద్యచికిత్సకు వెళ్ళినపుడు, వైద్యులకు ఈ 'రసికులు' చెప్పిన కారణాలివి. భర్తకు సంతృప్తి కలిగేట్లుగా సెక్సు సుఖాన్ని ఇవ్వలేకపోయినా, వారు కోరినంత సంతానాన్ని కనలేక పోయినా, భర్త కుటుంబ గౌరవాలను ఇనుమడింప చేసేట్లు ప్రవర్తించలేకపోయినా, భర్త ఏకపత్నీవ్రత సూత్రాన్ని ఉల్లంఘించ వచ్చు! ఇది ఇల్లాలికి ముప్పులా పరిణమించవచ్చు.

భారతీయ సంప్రదాయంలో కన్యాత్వానికున్న విలువ అంతింత గాదు బిడ్డ కన్యాత్వానికి భంగం జరుగకుండా తలి దండ్రులు అత్యంత జాగరూకతతో వ్యవహరిస్తారు ఎందుకయినా మంచిదని ముక్కుపచ్చలారని వయసులోనే పెళ్ళి చేసి తమ బాధ్యత తీరిందని నిట్టూర్పు విడుస్తారు. మగపిల్లలకు ఇలాంటి నియమం లేదు. సుఖరోగాల నివారణ వైద్య చికిత్సలకు వచ్చే వారిలో ఇరవై సంవత్సరాల వయస్సు కూడా నిండనివారు నూరింట పన్నెండు నుండి 25 మంది వరకూ ఉన్నట్లు పలువురు రిపోర్టు చేశారు! దీనిని బట్టి యువకులు వివాహానికి పూర్వమే ఏ పరిమాణంలో సెక్సు సంపర్కానికి పూనుకొంటున్నారో ఊహించవచ్చు. పేద కుటుంబాలకు చెందిన యువతులు పొట్ట పోసుకోవటం కోసం కూలికి పోక తప్పదు ఇలాంటి వారు పొరపాటు వల్ల కాలు జారవచ్చు: లేదా కొన్ని రకాల బలవంతాలకూ, ప్రేరేపణలకూ గురికావచ్చు. సెక్సును గురించి, సుఖ రోగాలను గురించి వారికి ఏ మాత్రమూ తెలియకపోవటం చేత, సుఖరోగాలకో, అవాంఛిత గర్భధారణకో వారు గురవుతూంటారు. గ్రామీణ, అటవీ, గిరిజన ప్రాంతాలలో ఇలాంటివి అధికంగా జరుగుతున్నట్లు పత్రికలలో వస్తుండే రిపోర్టులను బట్టి తెలియ వస్తున్నది. ఈ ప్రాంతాలకు వెళ్ళే వర్తకులు, ఫారెస్టు కాంట్రాక్టర్లు యువతులకు ఆశపెట్టి అనుభవించ జూస్తారు. పేద కుటుంబాలకు చెందిన యువతులు వీరి వలలో చిక్కే అవకాశాలున్నాయి. చివరకు కొందరు వేశ్యావాటికలకు వెళ్ళవలసిన ప్రమాదాలను కూడా ఎదుర్కొంటూ ఉంటారు. గర్భస్రావాలను జరిపించే నాటు వైద్యులు ఈ అమాయకులను దోచుకుంటూ ఉంటారు.

ఉమ్మడి కుటుంబజీవనం (జాయింట్ ఫామిలీ అని అంటారు), కొంతమేరకు వివాహిత స్త్రీలకు సన్నిహిత బంధువు లతో, ఒక్కొక్కసారి బంధుత్వ సంబంధం రీత్యా సెక్సు సంపర్కం నిషిద్ధమైన వారితో కూడా సెక్సు సంపర్కావకాశాలను కల్పిస్తున్నది. మేనరికపు సంబంధాలను చేసుకొనే ఆచారమున్న కుటుంబాలలో, వరుసలు కలిసిన యువతీ యువకులకు వివాహానికి పూర్వమే సెక్సు సంబంధాలు ఏర్పడే అవకాశాలు కూడా ఉంటాయి. ఇలాంటి పరిస్థితులలో స్త్రీలకు సుఖరోగాలు వచ్చే ప్రమాదాలుంటాయి.

వివాహానంతరం కూడా పురుషులు పరస్త్రీ సంపర్కానికి పోతూండటం అతి సామాన్యమైన విషయం. ఇందువల్ల, వారి భార్యల ఆరోగ్యానికి ప్రమాదం అధికంగా సంభవించే అవకాశాలున్నాయి. సుఖరోగ చికిత్సకు వైద్యశాలలకు వచ్చే రోగుల సగటు వయస్సు 16 నుండి 18 సంవత్సరాల వరకూ ఉంటుందని అంచనా వేశారు. వారిలో అత్యధికులు వివాహానికి పూర్వమే సెక్సు అనుభవాన్ని గడించారు. అంతేకాదు; ఇటువంటి పేషంట్ల లో నూరింట 30 నుండి 40 మంది వరకూ రెండుసార్లకు మించి చికిత్సకు రావటం కనుపించింది! వైద్యశాలలకు చికిత్స కోసం వచ్చే రోగులలో ముప్పై సంవత్సరాల లోపు వయస్సువారు నూరింట 80 నుండి 90 మంది వరకూ ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు.

పురుషులలో తొలి సెక్సు అనుభవాన్ని డబ్బిచ్చి కొనేవారున్నారు. డబ్బు ఇవ్వకుండా తెలిసినవారి దగ్గర, ఇరుగు పొరుగు యువతుల దగ్గర, బంధువర్గాల వారి వద్ద పొందుతున్న సందర్భాలు కూడా ఉన్నాయి. వీరికి వేశ్యలే ప్రధాన వనరులు. వేశ్యల నుండి ప్రధానంగా సెక్సు రోగాలు వీరికి వస్తున్నాయి. గ్రామీణ ప్రాంతం, పట్టణ ప్రాంతం అన్న భేదం లేకుండా ఈ వ్యాసంగం సర్వత్రా కొనసాగుతున్నది. కనుక దీని పరిమాణ స్థాయి ఈ రచనలో ఉదహరించిన దానికంటే ఎన్నో రెట్లు అధికంగా ఉంటుందని భావించవలసి ఉంటుంది.

సుఖరోగుల, సుఖరోగాల విచారణలో నిమగ్నమైన పరిశీలకులు, ఈ విషయంలో కూడా ఉత్తర దక్షిణ భారతాల మధ్య తేడాలున్నట్లు గమనించారు. చికిత్సకు వస్తున్న దక్షిణ భారత ప్రాంత సుఖరోగులలో, నూరింట 65 మంది నుండి 92 మంది వరకూ, తమకు రోగం వేశ్యల నుండి వచ్చినట్లు చెబుతున్నారు. ఈ రోగులలో నూరింట 55 నుండి 63 మంది వరకూ వివాహితులే. సమీప బంధువుల తోడి సంపర్కం ద్వారా రోగాలు వచ్చినట్లు చెబుతున్నవారు నూరింట ఐదుగురికి మించి లేరు.

ఉత్తర భారతదేశంలో వేశ్య వద్దకు వెళుతున్న వారు మొత్తం సుఖరోగులలో 35 నుండి 65 శాతం వరకూ ఉన్నట్లు అంచనా వేస్తున్నారు. నూరింట 11 నుండి 21 మంది వరకూ, సమీప బంధువుల నుండి (డబ్బు ఇవ్వకుండా పొందిన సంపర్కం ద్వారా) రోగం వచ్చినట్లు చెప్పారు. ఢిల్లీ ప్రాంతంలో జరిగిన ఒక పరిశీలనలో, నూరింట 53 మంది రోగులు, తమకు సుఖరోగం వేశ్యావృత్తిలో లేని వారి నుండే వచ్చినట్లు చెప్పారు, 47 మంది మాత్రం తమకు రోగం వేశ్యల నుండి వచ్చినట్లు చెప్పారు

ఉత్తర భారతంలో మరో విశేషం కూడా కనుపించింది. సుఖరోగ చికిత్సకు వైద్యశాలలకు వస్తున్న వారిలో వివాహిత స్త్రీలు కూడా గణనీయమైన పరిమాణంలో ఉంటున్నారు! పంజాబ్ లోని పాటియాలాలో జరిగిన ఒక సర్వేలో స్త్రీ సుఖరోగులలో నూరింట 35 మంది తమకు రోగం తాము ఎరిగిన మిత్రుల నుండి లేక బంధువుల నుండి వచ్చినట్లు చెప్పారు; ఇరవై మంది మాత్రం తాము ఎరిగిన వారి సంబంధం వల్ల వచ్చిందన్నారు! పురుష రోగులలో నూరింట 51 మంది తమకు రోగం వేశ్యల నుండి వచ్చినట్లు చెప్పారు, 14 మంది మాత్రం, తమ బంధువులు లేక మిత్రులయిన స్త్రీల నుండి వచ్చినట్లు వెల్లడించారు; తొమ్మిది మంది మాత్రం తాము ఎరిగున్నవారి నుండి వచ్చినట్లు చెప్పారు. నూరింట 28మంది స్త్రీ రోగులు తమకీ రోగం తమ భర్త ద్వారా వచ్చినట్లు చెప్పారు! తమ భార్యలనుండి ఈ రోగం తనకు వచ్చినట్లు భర్తలు చెప్పినట్లు ఒక్క పరిశీలన కూడా వెల్లడించ లేదు!

వివాహం కాక పూర్వము, వివాహానంతరము జరిగే వ్యభిచారం (డబ్బిచ్చి చేసేది, ఉచితంగా అనుభవించేది కలిపి) అంతా చాలా వరకూ రహస్యంగా కొనసాగుతూ ఉంటుంది. పాశ్చాత్య దేశాలలో వలె మనదేశంలో సెక్సు సంబంధాలను గురించి మాత్రమే కాదు, ఆఖరుకు సెక్సు విషయాలను గురించి కూడా ఇతరులకు తెలిసేట్లు మాట్లాడరు. కనుక లభిస్తున్న కొద్ది సమాచారంతో, ఉండగల పరిస్థితులను, వీలయినంత వాస్తవంగా ఊహించి అంచనా వేయటానికి మాత్రమే వీలవుతున్నది. వైద్యశాలలో పేషెంట్లు చెప్పేదంతా (ముఖ్యంగా స్త్రీలు) వాస్తవం కాదు. దాపరికం ఉంటుంది. రెండవది వైద్యశాలలన్నీ పట్టణ ప్రాంతాలలో ఉంటాయి. గ్రామాలలో ఈ రోగాలకు గురైన వారు, చిట్కా వైద్యాలకు పూనుకొంటారు; లేదా నాటు వైద్యుల వద్దకు పోతారు. నాటువైద్యులకు లొంగని దశలోనే వైద్యశాలలకు చికిత్స కోసం వెళతారు. ఇందువల్ల కూడా, ఈ రోగాల వ్యాప్తి పరిమాణం స్పష్టంగా మనకు తెలియదు; అలాగే రోగులలో

స్త్రీ పురుష సంఖ్యా పరిమాణ భేదాలు కూడా గుర్తించటం కష్టమవుతుంది. వైద్యశాలలకు వచ్చే వారిలో చాలామంది రెండుసార్లకంటే ఎక్కువ సార్లే రోగగ్రస్తులై యుంటారు. ఏదో ఒక ప్రాంతంలోని ఒక కమ్యూనిటీని ఎన్నుకొని, ఆ కమ్యూనిటీ సభ్యుల మీద సర్వేలు నిర్వహించినపుడు సదవగాహనకు తగిన ఫలితాలు లభిస్తాయి. వ్యభిచార పరిమాణాన్నీ, సుఖరోగగ్రస్తుల సంఖ్యా పరిమాణాన్నీ వాస్తవానికి దగ్గరగా అంచనా వేసే వీలుంటుంది

సుఖరోగ నివారణ చికిత్సకు వైద్యశాలలకు వస్తున్న పురుషులలో సగానికి మించే వివాహిత పురుషులు ఉంటున్నారు: వైద్యశాలలకు వస్తున్న స్త్రీ సుఖరోగులలో నూరింట 75 మంది వివాహిత స్త్రీలుంటున్నారు! సుఖరోగ నివారణ చికిత్సకు వస్తున్న పురుషులలో నాల్గవవంతు మంది విద్యార్థులో, పంథొమ్మిది సంవత్సరాల వయస్సులోపు యువకులో ఉంటున్నారు వివాహిత పురుషులలో సగం మందికి, వివాహానికి పూర్వమే సెక్సు సంపర్కానుభవం ఉంటున్నది! పురుష సుఖరోగులలో నూరింట 70 మంది వరకూ గ్రామీణ ప్రాంతం వారుంటున్నారు. వీరంతా పొట్ట పోసుకోవటం కోసం, ఇల్లాండ్రను గ్రామాలలో వదలి నగరాలకు వలస వచ్చినవారే! ట్రక్ డ్రైవర్లు, రిక్షావాలాలు, పోలీసుల వంటి అల్పాదాయ వర్గాలకు చెందినవారు కూడా ఈ తరగతులలో ఉంటున్నారు ఈ వర్గీకరణకు మాత్రం ఉత్తర, దక్షిణ భారతాలన్న భేదం వర్తించటం లేదు

దక్షిణ భారతంలోని పురుష సుఖరోగులకు, బంధువులు, తెలిసినవారూ, స్నేహితురాండ్ర వంటి వారితో కంటే, వేశ్యలతోనే అధికంగా సెక్సు సంబంధాలున్నట్లు భావించవలసి వస్తున్నది. ఉత్తర భారతంలో కంటే దక్షిణ భారతంలో పట్టణ నాగరికత విస్తృతంగా కనుపిస్తున్నది. ఇందువల్ల వేశ్యల సముదాయం కూడా ఈ ప్రాంతాల్లో అందరూ గమనించదగినట్లుగా ఉంటున్నది. కనుక ఇది ఇచ్చటి 'రసికులకు' రాచబాటగా తయారైంది.

పొట్టకూటికి పేదవర్గాల పురుషులు నగరాలకు ప్రాకినట్లే, స్త్రీలు కూడా పూట గడవక పట్టణాలకు వచ్చి వేశ్యావృత్తి లోకి దిగుతున్నారు. కొందరు మోసపోయి వృత్తిలోకి వెళుతున్నారు; కొందరు అన్ని వనరులు అంతరించటం వల్ల, విధి లేక ఈ వృత్తిని చేపడుతున్నారు పేదరికంతో పాటే ఈ వృత్తిలో చేరేవారి సంఖ్య కూడా పెరుగుతున్నది

సెక్సు రోగాల నివారణ చికిత్సకు వచ్చిన రోగులు వెల్లడిస్తున్న అంశాల ప్రాతిపదిక మీద ఆధారపడిన ఊహాచిత్ర మిది ఈ వివరాలను రాబట్టటానికి, పైన పేర్కొన్నట్లు కమ్యూనిటీ ప్రాతిపదిక మీద సర్వే జరగాలి. కాని అటువంటి సర్వేలు అతి తక్కువగా మాత్రమే జరిగాయి డా॥ రాణీ బాంగ్ ప్రభృతులు 1988వ సంవత్సరంలో, మహారాష్ట్రలోని రెండు జిల్లాల లోని గ్రామీణ ప్రాంతాలలో కమ్యూనిటీ ప్రాతిపదిక మీద స్త్రీల జననాంగ రోగాల మీద సర్వే జరిపారు. ఈ సర్వేయర్లు ఆ ప్రాంతంలో స్త్రీ లందరికి జననాంగ పరీక్షలను నిర్వహించారు వివాహితలు కాని స్త్రీలలో నూరింట 46 7 మందికి సెక్సు సంపర్కానుభవం ఉన్నట్లు తేలింది! ఆ ప్రాంతంలో గిరిజన జనాభా అధికంగా ఉన్నట్లు సర్వేయర్లు చెప్పారు గిరిజన ఆచారం, స్త్రీలకు అధిక స్వేచ్ఛనిస్తూండడం వల్ల ఇది సంభవించిందా? లేక అది సహజంగా ప్రబలిన సెక్సు విశృంఖలత్వమా అన్న విషయాన్ని సర్వేయర్లు స్పష్టీకరించలేదు. ఇంగ్లీషు చదువుకొని, తమ గదులను స్త్రీల సెక్సును ప్రముఖంగా ప్రకటించే చిత్రాలతో అలంకరించిన నాగరికుల మీద, మన దేశంలోని ఒక మహా నగరంలో సర్వే జరిగింది. ఈ సర్వేను ఒక రచయిత 1992వ సంవత్సరంలో వ్రాసిన వ్యాసంలో ఉదహరించారు. ఈ సర్వేలో పాల్గొన్న పురుషులలో నూరింట 80 మంది, తమకు వివాహం కాక పూర్వం నుండి సెక్సు సంపర్కానుభవం ఉన్నట్లు చెప్పారు! నూరింట యాభయ్యేదు మంది, వివాహానంతరం కూడా పరస్త్రీ సంపర్కానికి వెళుతున్నట్లు చెప్పారు!

ఈ వివరణంతా, రంకు జరుగుతున్న విధానాలను వివరించి పాఠకులను ఊరించటానికి కాదు. కుటుంబంలో చలామణీ అవుతున్న పురుషాధిక్యత, స్త్రీని ఎలా లొంగదీసుకుని, ఆవిడను రోగాలు పాలు చేస్తున్నదీ వివరించటానికి, ఈ వివరా లను పూర్వరంగంగా చిత్రించవలసి వచ్చింది. చూలు, కాన్పు స్త్రీకి అత్యంత ప్రమాదకరమైన దశలు. సంతానోత్పత్తి కోసం, స్త్రీకి సంపూర్ణ జననాంగ ఆరోగ్యం ఉండటం అవసరం. అటువంటి వారికి, తమ భర్తల ద్వారా సంక్రమిస్తున్న సుఖరోగాలు ఎంత ప్రమాదకారులో వివరించే క్రమంలో, ఈ

పూర్వ రంగ పరిచయం అవసరమైంది.

విటుడిచ్చే డబ్బు నాసించి, వేశ్య, విటుని 'కండోమ్' వాడుక వల్ల తనకు లభించే రక్షణను వదులుకోక తప్పటం లేదు. తత్ఫలితంగా ఆవిడ సుఖరోగాల నిలయంగా మారుతున్నది. భర్త అంగీకరించనందున, తనకు సుఖరోగమున్న సంగతిని అతడు చెప్పనందునా, ఇల్లాలు కూడా 'కండోమ్' వాడుక రక్షణను కోల్పోతున్నది. ఈ విషయంలో ఇరు వర్గాల వారూ పరాధీనులే. కాని ఇల్లాలి స్థితి మరింత దయనీయంగా కనిపిస్తున్నది ఈవిడ ఆర్థికంగానే కాదు, నిలువ నీడకూ, సామాజిక రక్షణకూ పురుషాధి పత్యానికి లోబడి బ్రతుకవలసి వస్తున్నది సంతానం కనటంలో వేశ్యకు లేని బాధ్యత ఇల్లాలికున్నది సంతానాన్ని కనలేనినాడు ఆవిడకు గృహ బహిష్కారం సంప్రాప్తించే ప్రమాదం పొంచి వుంటుంది. తన తనువు మీదే అదుపును కోల్పోయిన ఇల్లాలు, భర్త తెచ్చే సుఖరోగాల భారాన్ని మోస్తూ సంతానాన్ని కనవలసి రావటం చేత, ఆవిడ ఆరోగ్యం అత్యంత ప్రమాదకర పరిస్థితిలో చిక్కుకొంటున్నది. ఈ విధంగా సెక్సు సంపర్క వ్యవహారాలలో పురుషులు అనుభవిస్తున్న స్వేచ్ఛ, సమాజపు ఆమోద ముద్రను పొందుతున్న వారి 'మగతనం', ఇల్లాలి పరిస్థితిని శారీరకంగా, మానసికంగా కూడా కృంగదీస్తున్నది. ఈ వైనాన్నిపుడు పరిశీలించుదాం.

## సుఖరోగ వ్యాప్తి మార్గాలు

సుఖరోగాలకు ఒక నిధి ఉన్నట్లు, అచ్చటి నుండి ఇవి పంపకమవుతున్నట్లు సామాజికుల భావన. ఆ నిధే పొట్టకూటికి సెక్సును అమ్ముకునే వర్గపు స్త్రీలు. వీరిని పలు ప్రాంతాలలో పలుపేర్లతో పిలుస్తూ ఉంటారు. (వేతనార్జనకు పనిచేసే స్త్రీల వలె, వీరు తమ సెక్సు మీద సొమ్మును సంపాదిస్తున్నారు గనుక, వీరినిపుడు సోషియాలజిస్టులు, పరిశోధకులు "సెక్సు వర్కర్లు" గా పేర్కొంటున్నారు.) ఏకపత్నీ వ్రతానికి ఎపుడయితే ముప్పు వాటిల్లిందో అపుడే ఈ రోగాలకు బీజాలు పడ్డాయి. ఒక స్త్రీ గాని, లేక పురుషుడు గాని సెక్సు సంపర్క భాగస్వాములను మార్పు చేసుకొంటున్న పరిమాణం మీద ఈ రోగాల వ్యాప్తి ఆధారపడి ఉంటుంది. ఇలాంటి మార్పిడులు కాలం గడుస్తున్నకొలదీ అధికమవుతున్నాయి. అందువల్ల ఈ రోగాల బీజాలు దినదిన ప్రవర్థమానమవుతూ పలువురిని ప్రభావితం చేస్తున్నాయి. అంతరింపచేయటానికి వీలులేని అంటురోగాలుగా ఇవి తయారైనాయి. ఇపుడు హెచ్ఐవి ఒకటి వచ్చిపడటంతో, పరిస్థితి, ముఖ్యంగా స్త్రీలకు - మరింత ప్రమాదకరంగా తయారైంది. (ఈ విషయాన్నింతకు ముందే చర్చించాం)

సుఖరోగ వైద్యశాలలకు వచ్చే పేషెంట్లలో నూరింట 40 నుండి 60 మంది వరకూ తమకు సుఖరోగం వేశ్యల నుండి సంక్రమించినట్లు చెబుతున్నారు. పట్టణాలలోని వేశ్యలు, సాధారణంగా ఒక్క రాత్రికి ఏడు నుండి ఎనిమిది మంది వరకూ విటులను స్వీకరిస్తారని సాధారణపు అంచనా. పురుషులకు, వివాహితులకు గాని, అవివాహితులకు గాని, సులభంగా లభించేది వేశ్యాసంపర్కం. సెక్సు భాగస్వాముల మార్పిడి పెద్ద యెత్తున జరిగేచోటు వీరి గమ్యం గావటంతో, పెద్దయెత్తున సుఖరోగాలు వ్యాపిస్తున్నాయి. అంతేకాదు; ఏ పాపమూ ఎరుగని ఈ 'శృంగార' పురుషుల ఇల్లాండ్రు ఈ రోగాలకు ఎరవుతున్నారు.

తమ వద్దకు పలువురు విటులు వస్తూంటారు; ఇందువల్ల తమకు సుఖరోగాలు అంటే ప్రమాదమున్నదని వేశ్యలకు తెలుసు అయినా, రోగం రాకుండాను, అది వస్తే నివారణకు తగిన జాగ్రత్తలను వీరు ఎందుకు తీసుకోరు అన్న ప్రశ్న ఉదయించటం సహజం. వీరు దరిద్రులు; పూట గడవని వారు; వారికున్న సెక్సు పరిజ్ఞానం అత్యల్పం. చికిత్సకు వెళ్ళ దలచినా అవసరమైనంత ఆర్థిక స్థోమత ఉండదు; పోనీ ఈ అదృష్టం లభించితే, చికిత్సాకాలంలో సెక్సు సంపర్కం నిషిద్ధం. ఎన్ని రోజులు, పస్తులుండకుండా ఈ నిషేధాన్ని ఆవిడ పాటించగలదు? కొన్ని సందర్భాలలో, వేశ్యా గృహంలో బందీలుగా జీవించే వారికి ఈ పాటి స్వేచ్ఛ కూడా ఉండదు.

వేశ్యల దయనీయ స్థితిని, తాయ్‌లాండ్‌లో కొందరు వృత్తిలోని వారిని ఇంటర్వ్యూ చేసిన బర్మా జర్నలిస్టు హనిన్ పైనీ రచనలో ఈ భాగాన్ని చూస్తే, వారి దయనీయ స్థితి అర్థమవుతుంది: "....కండోమ్ వాడుక వల్ల సుఖరోగాలు అంటక పోవచ్చు; కాని అవి వచ్చే అవకాశాలు కూడా అధికమవుతాయని వీరు (సెక్సు వర్కర్లు) భావిస్తున్నారు. కొందరు మహిళలు కండోమ్ వాడుకను అంగీకరిస్తున్నారు. కాని విటులు వీరికి తక్కువ రేట్లిస్తున్నారు. ఒక సెక్సు వర్కరు

## "ఇతరులకు అంటగల సుఖరోగమున్న వ్యక్తికి పరిణయమాడే హక్కు లేదు"

ఇతరులకు అంటే అవకాశం గల సుఖరోగమున్న వ్యక్తికిగానీ, నపుంసకత్వం ఉన్న వ్యక్తికి గాని, ఆ లోపనివారణ జరిగే వరకూ, వివాహమాడే వారి హక్కును అమలు జరిపే వీలు లేదు అని 1998వ సంవత్సరం, నవంబరు 16వ తేదీన సుప్రీం కోర్టు చరిత్రాత్మకమైన తీర్పునిచ్చింది.

వైద్యవృత్తిలో నున్న నాగాలాండ్‌కు చెందిన డాక్టరొకరికి, ఎయిడ్స్ ఉన్నట్లు, వైద్య పరీక్షలలో వెల్లడైంది ఈ విషయాన్ని, పరీక్షను జరిపిన సంస్థ, తాను వివాహమాడబోతున్న యువతి తల్లిదండ్రులకు తెలిజేయటం వల్ల, ఆ సంబంధం చెడిపోయింది "పేషెంట్ ఆరోగ్య పరీక్షా ఫలితాలను ఇతరులకు తెలిజేయకూడదు" అన్న వృత్తి ధర్మాన్ని అతిక్రమించి, ఎయిడ్స్ పరీక్షను జరిపిన సంస్థ తనకు నష్టం కలిగించింది కనుక ఆ సంస్థతో తనకు పరిహారం ఇప్పించాలని ఈ డాక్టర్ (ఎయిడ్స్ పేషంటు) సుప్రీంకోర్టుకు ఫిర్యాదు చేశారు అతని వాదనను నిరాకరిస్తూ సుప్రీంకోర్టు ఈ తీర్పు నిచ్చింది

"ఎయిడ్స్ వంటి భయంకరమైన రోగంతో బాధపడుతున్న వ్యక్తి, తనకు ఆ రోగమున్నదని తెలిసి కూడా, వివాహమాడి, ఆ రోగాన్ని భార్యకు సంక్రమింప చేయటం వల్ల, ఇండియన్ పీనల్ కోడ్‌లోని సెక్షన్ 269, సెక్షన్ 270ల క్రింద నేరం చేసినవాడవు తాడు" అని సుప్రీంకోర్టు బెంచ్ ప్రకటించింది. (బాధ్యతా రహితంగా, ఒక వ్యక్తి జీవితానికి ప్రమాదరకరమైన రోగవ్యాప్తికి పూనుకోవటం సెక్షన్ 269 కింద, దురుద్దేశ్యంతో, ఒక వ్యక్తి జీవితానికి ప్రమాదకరమైన రోగాన్ని వ్యాపింపజేయబూనటం సెక్షన్ 270 క్రింద శిక్షార్హమైన నేరంగా పరిగణనకు వస్తుంది.)

ఫిర్యాది వివాహమాడటం వల్ల, అతనికున్న రోగం అతని భార్యకు సోకుతుంది. ఇది ఆవిడ మనుగడకు ప్రమాదకరమైనది. ఇలాంటి పనిని వ్యక్తి చేయటం నేరం మాత్రమే కాదు, పైన పేర్కొన్న ఇండియన్ పీనల్ కోడ్‌లోని రెండు సెక్షన్లు, వివాహ మాడకుండా ఉండే బాధ్యతను ఫిర్యాది మీద ఉంచుతున్నాయి అని బెంచి పేర్కొన్నది.

ఈ కేసులో కాబోయే వధూవరులిద్దరి ప్రాథమిక హక్కులు సంఘర్షణకు తలపడుతున్నాయి. ఫిర్యాది యొక్క రోగ పరీక్షా ఫలితాలను బయటపెట్టడం ద్వారా, వైద్య పరీక్షను నిర్వహించిన సంస్థ, అతని వ్యక్తిగత రహస్యాన్ని రచ్చకీడ్చి, వారి ప్రాథమిక హక్కును భంగపరచింది. ఆరోగ్యప్రదమైన జీవితాన్ని అనుభవించటం ప్రాథమిక హక్కుగా గలిగిన వధువును, ఎయిడ్స్ రోగమున్నట్లు నిర్ధారణైన వ్యక్తిని వివాహమాడమని ఆదేశించడం వల్ల, ఆవిడ ప్రాథమిక హక్కుకు భంగం వాటిల్లుతుంది ఈ స్థితిలో ఎవరి ప్రాథమిక హక్కును రక్షించాలి? ఇది బెంచ్ ఎదుర్కొన్న సమస్య. ప్రజల నైతిక ప్రవర్తన, ప్రజా సంక్షేమాల అభివృద్ధికి తోడ్పడగల హక్కును మాత్రమే కోర్టు అమలు జరిపించాలని బెంచి అభిప్రాయ పడింది. ఈ కారణం చేతనే నైతిక సూత్రాలను విస్మరించకూడదని చెబుతూ, న్యాయ మూర్తులు మట్టిబొమ్మల వలె కూర్చుండకూడదని, విచక్షణా జ్ఞానంతో వ్యవహరించాలని కూడా బెంచి హితవు చెప్పింది

ఎయిడ్స్ రోగుల యెడల సానుభూతిని ప్రదర్శించాలని, మానవులుగా వారు మర్యాదలను పొందదగినవారని, కనుక వారిని వెలివేయటం తగదని, సమాజంలో జీవించే హక్కు వారికున్నదని, ఈ రోగ కారణంగా, ప్రభుత్వోద్యోగాలను వారి కివ్వ నిరాకరించటం తగదని న్యాయమూర్తులు ప్రకటించారు.

*ఎయిడ్స్ రోగులతోడి సెక్సు సంపర్కాన్ని నిరోధించాలని, ఇలాంటి సంబంధాల వల్ల అతి భయంకరమైన ఈ రోగం ఇతరులకు సోకుతుందని చెబుతూ, ఇలాంటి పనిని రోగి చేయటానికి తాము తోడ్పడజాలమని న్యాయమూర్తులు స్పష్టం చేశారు.*

దాచుకొంటుంది. రోగ దుష్ఫలితాలు ఆవిడను ఎంత దూరమైనా తరుమవచ్చు. దీనికి తోడు, పురుషులలో అధికుల కుంటున్న సెక్సు పరిజ్ఞానం కూడా అల్పం. సుఖరోగాల లక్షణాలు కూడా వారికి స్పష్టంగా తెలియవు. తాము తెచ్చిన రోగాలను తెలిసో, తెలియకో, అమాయకురాం(డ్రయిన ఇల్లాం(డ్రకు సం(క్రమింప జేస్తూంటారు. ఈ దుష్ఫలితాన్ని వారు అనుభవించక తప్పదు.

## సకాలంలో చికిత్స జరుగనపుడు....

సకాలంలో నివారణా చికిత్స జరుగనపుడు రోగం జననాంగ పైభాగాలకు ప్రాకుతుంది. యోనిలో ప్రవేశించిన రోగబీజాలు, గర్భసంచి ముందు భాగానికి (సెర్విక్సుకు), అటు తర్వాత, గర్భసంచికి అండం రావటానికి మార్గం కల్పిస్తున్న ఫెలోపియన్ ట్యూబ్సుకు, తర్వాత అండోత్పత్తి జరిగే ఓవరీస్‌కు వ్యాపించి, పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్‌కు దారితీయవచ్చు. ఇందువల్ల పొత్తికడుపులో నొప్పి వస్తూంటూంది; ఇది మందులకు లొంగదు. ఈ నొప్పిని గురించి స్పష్టంగా వైద్యులకు పేషెంటు వివరించి చెప్పలేకపోవటం చేత, వారు సామాన్యంగా నొప్పిని చంపే మందులను ఇస్తుంటారు. ఈ సుఖరోగులలో సంభవిస్తున్న ఈ పరిణామాలు, పిండం గర్భంలోనే చనిపోవటానికి, లేదా పుట్టినబిడ్డ ఆరోగ్య సూత్రాల ప్రకారం ఉండవలసిన దాని కంటే తక్కువగా ఉండటానికి, లేదా నెలలు నిండకుండా ప్రసవం జరగటానికి, స్త్రీకి ఇక మీదట సంతానప్రాప్తికి యోగ్యత లేకుండా చేయటానికి, నిస్సత్తువకూ దారి దీయవచ్చు. గర్భసంచి యొక్క మెడ వంటి ముందు భాగపు (సెర్విక్స్) జీవకణాలు, జీవశాస్త్ర నియమాలను ఉల్లంఘించి త్వరితగతిని పెరుగనారంభించటం వల్ల సెర్వికల్ డిస్‌ప్లాసియా సంభవించవచ్చు; ఇది కాన్సరుకు, చివరకు మరణానికి కూడా దారితీయవచ్చు.

భర్తకు వంశోద్ధారకుని కని ఇవ్వటం భార్య యొక్క "పవిత్ర బాధ్యత" గా సమాజం నిర్దేశిస్తున్నది. ఇటువంటి స్థితిలో ఇల్లాలు సంతానవతి కాలేకపోయినపుడు, ఆవిడకు సంభవించగల ప్రమాదం ఎటువంటిదో ఊహించవచ్చు. జననాంగ సముదాయం రోగగ్రస్థమైనపుడు గర్భధారణ జరిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. గర్భధారణ జరిగితే, నెలలు నిండకుండానే కాన్పు జరుగవచ్చు లేదా గర్భస్రావం జరగవచ్చు. వంశోద్ధారకుడు అవతరించాలి కనుక, స్త్రీ గర్భధారణను కోరుతూనే ఉంటుంది; తన ఆరోగ్యాన్ని చూచుకొనే వీల ఉండదు. ఇందువల్ల ఆవిడ శరీరస్థితికి మించిన గర్భధారణలు సంభవించటం పరిపాటి. ఇంతకు పూర్వమే జననాంగానికున్న రోగం, ప్రతి కాన్పుకూ పెరుగుతూ, చివరకు ముదిరి విపరీత పరిణామాలకు దారితీయవచ్చు. కాన్పులలో అధికభాగం, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో, అనారోగ్య పరిస్థితులల్లో, సంప్రదాయంగా వృత్తిని అనుసరిస్తున్న మంత్రసాని లేక దాయీల చేతుల మీదుగా జరుగుతూ ఉంటాయి వీరి చేతులు పరిశుభ్రంగా (రోగపు అంటు లేకుండా) ఉండవు, కాన్పు జరుగుతున్న పరిస్థితి గమనింపుకు యోనిలో తరచూ చేయిబెట్టి చూస్తూంటారు. లేదా ఏదయినా స్టెరిలైజ్ చేయని పరికరాలు వాడుతూ ఉంటారు. ఇందువల్ల కొత్త ఇన్ఫెక్షన్ సోకే అవకాశాలుంటాయి; పాత ఇన్ఫెక్షన్ తీవ్రమవు తుంది. కాన్పుల మధ్య కాలవ్యవధిని కోరి, ఏ ఇల్లాలయినా ఐయుడిని వేయించుకొని ఉంటే, దాని ప్రభావం వల్ల గర్భసంచి ముందు భాగం వాపుకు గురయ్యే వీలుంటుంది. ఇది పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్‌కు దారితీస్తుంది. ఐయుడి వేయించుకోవ టానికి పూర్వమే ఇన్ఫెక్షన్ ఉన్నపుడు, అది ఐయుడి వేయించు కోవటం వల్ల తీవ్రమవుతుంది; ఈ రోగపు అంటు జననాంగంలోని అన్ని భాగాలకు విస్తరిస్తుంది. గర్భస్రావ ప్రయత్నం కూడా, అనాగరిక, అపరిశుభ్ర పరిస్థితులలో జరిగినపుడు, జననాంగ సముదాయం ఇన్ఫెక్షనుకు గురవుతుంది.

## మనదేశంలో కనుపిస్తున్న ప్రధాన సుఖరోగాలు

మన దేశంలోని వైద్యశాలలకు చికిత్స కోసం వస్తున్న సుఖరోగ కేసులను బట్టి, దేశంలో కనుపిస్తున్న మొత్తం సుఖరోగాలలో సిఫిలిస్, గనోరియా, షంక్రాయిడ్, లింఫోగ్రాన్యులోమా వెనిరియం, గ్రాన్యులోమా ఇన్‌గ్వినల్ రోగాలు, మూడవ వంతు నుండి సగభాగం వరకూ ఉంటున్నట్లు అంచనా వేస్తున్నారు. మనదేశంలో కనుపిస్తున్న ఇతర సుఖరోగాలలో జెనిటల్ వార్ట్స్, జెనిటల్ హెర్ప్స్, నాన్‌గొనొకొకల్ యురెథ్రైటిస్, కాండిడయసిస్ ముఖ్యమైనవిగా పరిగణనకు వస్తున్నాయి. క్లమీడియా, ట్రైకోమొనియాసిస్ వంటి ఇతర సుఖరోగాలు కొన్ని ఉన్నాయి.

సుఖరోగ చికిత్స కోసం వైద్యశాలలకు వస్తున్న స్త్రీ

రోగుల కంటే, పురుష రోగుల సంఖ్య చాలా అధికంగా కనుపిస్తున్నది మన దేశంలో సుఖరోగ చికిత్స వసతుల లేమినీ, స్త్రీలు ఈ చికిత్సా కేంద్రాలకు రావటానికున్న సాంఘిక అవరోధాలను దృష్టిలో పెట్టుకొని చూసినపుడు, పురుషుల కంటే స్త్రీలే అధిక సంఖ్యాక రోగులుగా మనకు కనుపిస్తారు. సుఖరోగం సోకిన స్త్రీ నుండి, రోగం సోకని పురుషునకు అది సోకటం కంటే, సుఖరోగం లేని స్త్రీకి, రోగం సోకిన పురుషుని నుండి అది అంటటం అత్యంత సమర్ధవంతమైన మార్గమని వైద్య నిపుణులు సూచిస్తున్నారు దీనినిబట్టి కూడా సుఖరోగాలు పురుషుల కంటే స్త్రీలకే అధికంగా సోకుతున్నట్లు భావించవలసి వస్తున్నది

సిఫిలిస్ :- భారతదేశంలో అతి సాధారణంగా కనుపిస్తున్న సుఖరోగం సిఫిలిస్ మొత్తం సుఖరోగులలో నలభై శాతం మంది సిఫిలిస్ రోగులుంటున్నట్లు అంచనా వేస్తున్నారు. సెక్సు సంపర్కం ద్వారా సంక్రమించే ఈరోగం ఒక రకమైన బాక్టీరియా వల్ల వస్తున్నది. మన శరీరంలో తడిగాను, మృదువుగాను ఉండే పొరకు ఈ బాక్టీరియా సోకిన కొద్దిగంటలలో రక్తం ద్వారా శరీరమంతటికీ ప్రాకగల శక్తి దీనికున్నది. చూలాలికి సిఫిలిస్ సోకినపుడు, అది ఆవిడ గర్భంలోని పిండానికి కూడా సంక్రమిస్తుంది. ఇందువల్ల బిడ్డ కొన్ని శారీరక లోపాలతో పుడుతుంది. ఇతర సమస్యలు కూడా దీనివల్ల అంకురించవచ్చు.

ఇన్ఫెక్షన్ వచ్చిన వారం నుండి పదమూడు వారాల లోపు రోగచిహ్నాలు కనుపిస్తాయి రోగ చిహ్నాల ప్రదర్శనకు సగటున మూడు లేక నాలుగు వారాలు పట్టవచ్చునని చెబుతున్నారు. ఇది దశల వారీగా పెరుగుతూ వుంటుంది. ప్రైమరీ, సెకండరీ, లేటెంట్, టెర్షియరీ అని నాలుగు దశలున్నాయి. తొలి రెండు- మూడు దశలలో ఈ రోగ నివారణ సాధ్యమనీ, అటు తర్వాత ఇది గుండెకు, నాడీమండలానికి విస్తరించి చికిత్సకు లొంగదు; చివరకు ప్రాణాపాయాన్ని కూడా కలిగించగలదనీ వైద్యులు సూచిస్తున్నారు.

ఈ రోగం సోకిన స్త్రీలకు మర్మావయవ ద్వారం పరిసరాల లోనూ, యోని లోనూ పుండ్లు (అల్సర్లు) వస్తాయి. తొలుత ఒకటి కనుపించి, అటు తర్వాత వీటి సంఖ్య పెరుగవచ్చు. పుండ్ల నుండి రక్తం రాదు; నొప్పి కూడా ఉండదు అందుచేత ఇలాంటివి ఉన్న విషయాన్ని స్త్రీలలో దాదాపు సగం మంది గుర్తించలేరు. పైగా మూడు నుండి పన్నెండు వారాల లోపులో ఈ అల్సర్లు మానినట్లు కనుపిస్తాయి. అందువల్ల రోగం పోయిందని వ్యక్తి భ్రమించే అవకాశాలున్నాయి.

చండీగడ్‌లో 1987లో రోగుల సంఖ్యను అంచనావేసే ప్రయత్నం జరిగింది దీనిలో పురుషులు, స్త్రీలు దాదాపు ఒకే పరిమాణంలో ఉన్నట్లు తేలింది. సెక్సు రోగాలతో వచ్చే వారిలో, ఈ రోగుల సంఖ్య, స్త్రీలలోనూ, పురుషుల లోనూ కూడా అధికంగా ఉండటం కనుపించింది. పురుష రోగులలో నూరింట 48 మందికి రోగం ప్రైమరీ దశలోనూ, 40 మందికి సెకండరీ దశలోనూ, పదిమందికి లేటెంట్ దశలోనూ ఉన్నట్లు తేలింది స్త్రీ రోగులలో నూరింట ఏడుగురిలో మాత్రమే ప్రాథమిక దశలో నున్న సిఫిలిస్ కనుపించింది. ప్రాథమిక దశలో ఈ రోగం స్త్రీలలో రోగసూచనలను కనుపింపచేయదని ఇంతకు పూర్వమే చెప్పాం. కనుకే ప్రాథమిక ఇన్ఫెక్షన్ ఉన్న స్త్రీ రోగుల సంఖ్య తక్కువగా కనుపించింది. రెండవ దశలో ఈ రోగం బాగా కనుపిస్తుంది. కనుకే సెకండరీ దశలో నున్న సిఫిలిస్ నూరింట 76 మంది స్త్రీ పేషెంట్లలో కనుపించింది; పధ్నాలుగురిలో సిఫిలిస్ లేటెంట్ దశలో ఉన్నది.

పురుషులలో ఈ రోగ సూచనలు ఇన్ఫెక్షన్ యొక్క తొలి దశలోనే కనుపిస్తాయి. అయినా ప్రైమరీ, సెకండరీ దశలలో సిఫిలిస్ ఉన్న రోగుల పరిమాణాలు దాదాపు సమంగానే ఉన్నాయి. ఇందుకు కారణం, వారు విచక్షణారహితంగా ఏంటి బయొటిక్ మందులను (ముఖ్యంగా పెన్సిలిన్‌ను) వాడుతూండటమే కారణమని పరిశీలకులు భావించారు. పేషెంటే మందు తీసుకోవటం చేతగాని, లేక గ్రామంలోని "రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్" పేరిట వైద్యం చేసే 'నాటు' డాక్టర్లతో చికిత్స చేయించు కోవటం వల్ల గాని, మందును వాడవలసిన మోతాదులలో వాడకపోవటం చేత గాని, పేషంటులో రోగ సూచనలు బయటకు కనుపించకుండా పోతాయి. ఇందువల్ల రోగం నయమైనట్లు పేషెంటు భ్రమిస్తాడు. కాని, కొద్దిరోజుల తర్వాత అది తిరిగి కనుపిస్తుంది.

ఢిల్లీలోని స్త్రీలు అధికంగా వినియోగించుకొంటున్న

ఒక వైద్యశాలలో 1984లో ఒక సర్వే జరిగింది. ఈ వైద్యశాలకు వచ్చిన సుఖరోగులలో నూరింట 55.6 మంది సిఫిలిస్ రోగులున్నారు ప్రైమరీ సిఫిలిస్ వీరిలో 4 4 శాతం మందిలోనూ, సెకండరీ సిఫిలిస్ 17 శాతం మందిలోను కనుపించింది. సెకండరీ సిఫిలిస్ ఉన్న మొత్తం రోగులలోని ప్రతి పురుషునకూ 2.18 మంది స్త్రీలుండడం గమనించదగిన విషయం.

అలహాబాదులో 1990వ సంవత్సరంలో జరిగిన మరొక సర్వేలో, సిఫిలిస్‌తో వచ్చే రోగులలో నూరింట 40 మందికి సెకండరీ సిఫిలిస్ ఉన్నట్లు 4.4 మందికి మాత్రమే ప్రాథమిక సిఫిలిస్ ఉన్నట్లు రికార్డైంది. తమిళనాడులోని తిరునల్వేలిలో పది సంవత్సరాలపాటు ఒక సర్వే జరిగింది. మొత్తం సుఖరోగులలో నూరింట 31 మంది సిఫిలిస్ రోగులున్నారు. సిఫిలిస్‌తో బాధ పడుతున్న స్త్రీ రోగులలో, 21-30 సంవత్సరాల మధ్య వయస్కులు ముప్పై శాతం మంది వరకూ ఉన్నారు!

ఢిల్లీలోని ఒక స్త్రీల వైద్యశాలకు వస్తున్న పేషెంట్లలో లేటెంట్ దశలో ఉన్న సిఫిలిస్‌తో బాధపడుతున్నవారు అధికంగా ఉన్నట్లు కనుపించారు. 70వ దశాబ్దంలో ఈ తరగతి పేషంట్లు 38 శాతము, 80వ దశాబ్దంలో 53 శాతము ఉన్నట్లు అంచనా వేశారు. లేటెంట్ దశలోని సిఫిలిస్ ఉన్న రోగులు ఇంతకు పూర్వం జరిగిన సర్వేలలో ఇంతటి అధిక పరిమాణములో కనుపించ లేదు. ఈ వర్గపు రోగులు మొత్తం సిఫిలిస్ రోగులలో నూరింట 92 మంది వరకూ ఉన్నట్లు శ్రీనగర్ లో జరిగిన ఒక సర్వే వెల్లడించింది.

స్త్రీకి సిఫిలిస్ ఇన్ఫెక్షన్ వచ్చిన తర్వాత, వారికది ఇబ్బంది కరమైన అనారోగ్య పరిస్థితిని కల్పించటానికి చాలాకాలం - కొన్ని సంవత్సరాల కాలం కూడా - పట్టవచ్చు. ఇది పలురకాల దుష్ఫలితాలకు దారితీయగలదు. గర్భస్థ శిశువుకు ఈ రోగం సంక్రమించటం ఈ దుష్ఫలితాలలో ఒకటి. ఢిల్లీలోని ఒక వైద్యశాలలో మూడు శాతం కేసులలో ఇలా జరిగింది. ఒక వైద్యశాలలో కొందరు పరిశీలకులు 1968 నుండి 1988వ సంవత్సరం వరకూ - ఇరవై సంవత్సరాల కాలం చూలాండ్రలో సిఫిలిస్ ప్రభావాన్ని గమనించారు. వందమంది చూలాండ్రకు, ఈ రోగ సూచనలున్నవారు ఏడుగురి నుండి ఇరవై ముగ్గురు వరకూ ఉన్నట్లు పరీక్షలు రుజువు చేశాయి. సిఫిలిస్ ఉన్న రోగులకు చూలు వచ్చినపుడు, వారి గర్భస్థ శిశువుకు, పిండం ఏర్పడిన వెంటనే గానీ, 7 మాసాలు నిండిన తర్వాత గాని ఆ రోగం సోకే అవకాశాలుంటాయి. ఈ రోగం వల్ల సంభవించే దుష్ఫలితాలు ఇంత మాత్రమే కాదు; ఇంకా ఉన్నాయి. గర్భస్రావం జరుగవచ్చు, నెలలు నిండకుండానే కాన్పు రావచ్చు; లేదా పుట్టిన బిడ్డ బరువు ఆరోగ్యసూత్రాల ప్రకారం ఉండవలసిన దానికంటే తక్కువగా ఉండవచ్చు. క్లమీడియా, గనోరియా, బాక్టీరియల్ వెజైనైటిస్, లేదా ట్రైకోమోనియాసిస్ వంటి జననాంగ సంబంధిత రోగాల కంటే ఈ సిఫిలిస్ సుఖరోగం, ఈ విషయాలలో అత్యంత దుష్ఫలితాలను చూపగలదని స్పష్టమైంది మనదేశంలో సిఫిలిస్ ఉన్న చూలాండ్రలో నూరింట 27 మంది నుండి 50 మందికి గర్భస్రావం జరుగుతున్నట్లు రికార్డులు సూచిస్తున్నాయి హెచ్ఐవి సోకిన వారిలో నూరింట 60 నుండి 65 మంది వరకూ సిఫిలిస్ పేషెంట్లున్నట్లు సర్వేలలో తేలింది. ఎయిడ్స్ రాకకిది బాటలు వేయగలదన్న అంశాన్నిది రుజువు చేస్తున్నది.

గనోరియా :- మన దేశంలో సిఫిలిస్ తర్వాత విస్తారంగా కనుపిస్తున్న మరొక సుఖరోగం గనోరియా. ఇది పురుషులలో కంటే స్త్రీలలోనే అధికంగా ఉంటుంది. కాని సుఖరోగ వైద్యశాలకు వస్తున్న గనోరియా పేషెంట్ల సంఖ్యను చూస్తే, స్త్రీల కంటే పురుషులే అధికంగా ఉంటున్నట్లు కనుపిస్తారు. పురుషులలో ఈ రోగపు ప్రభావం, ఇన్ఫెక్షన్ వచ్చిన వెంటనే తెలుస్తుంది. చాలామంది స్త్రీలలో ఇలా రోగ ప్రభావం వెంటనే కనుపించదు. ఇందువల్ల తమకే రోగమూ లేదన్న భ్రమలో వారు పడతారు. ఇందువల్లే అన్నీ తెలిసిన స్త్రీలు కూడా సకాలంలో చికిత్సకు వెళ్ళటం లేదు.

గనోరియా కూడా సెక్సు సంపర్కం ద్వారానే వస్తుంది ఇది కూడా బాక్టీరియా మూలంగా వ్యాపిస్తున్నది. మూత్రనాళపు లోపలి పొరకు, సెర్విక్స్‌కు రోగకారక బాక్టీరియా సోకుతుంది. బాక్టీరియా రక్తంలో చేరి శరీరంలోని ఇతర భాగాలకు ప్రాకుతుంది. ముఖ్యంగా చర్మాన్ని, కీళ్ళను ఆశ్రయిస్తుంది. స్త్రీలలో ఈ బాక్టీరియా, జననాంగ సముదాయానికి సోకుతుంది. మలుగుల లోని తేమగా ఉండే మెత్తని పొరకు (మ్యూకస్ మెంబ్రేన్‌కు) విస్తరిస్తుంది. జననాంగాలు రోగపీడితం గావటం చేత పునరుత్పత్తి సమస్యలు (సంతానప్రాప్తికి సంబంధించిన

సమస్యలు) అంకురిస్తాయి.

రోగకారక బాక్టీరియా సోకిన 7 నుండి 21 రోజుల లోపల రోగ సూచనలు స్త్రీలలో కనుపిస్తాయి. కొన్ని వారాల పాటే గాదు, కొన్ని మాసాల పాటు కూడా రోగ సూచనలు చాలామందిలో కనుపించకపోవటం అనేది అతి సాధారణ విషయం. పురుషునకు గనోరియా సోకినపుడు, అది స్త్రీ సెక్సు భాగస్వామికి ఉండవచ్చు నన్న విషయం బయటపడుతుంది అపుడు ఆవిడకు చికిత్స చేయవలసి వస్తుంది కొందరు స్త్రీలలో ఈ రోగం తీవ్రమైన ప్రభావాన్ని కూడా చూపవచ్చు తరచూ మూత్ర విసర్జనావసరం గలుగవచ్చు; మూత్రవిసర్జన కాలంలో బాధ గలుగుతుంది యోని నుండి డిశ్చార్జి అవుతూంటుంది. జ్వరం కూడా వస్తూండవచ్చు స్త్రీ యొక్క సెర్విక్సు, యోని, ఓవరీస్ నుండి గర్భసంచిలోనికి అండం రాకకు వీలు కల్పిస్తున్న ఫెలోపియన్ ట్యూబ్సుకు, ఓవరీస్‌కు, మూత్రనాళపు లోపలి పొరకు రోగపు అంటు సోకటం వల్ల మలుగుల్లోపల నొప్పిగా ఉంటుంది. సంపర్క సమయంలో యోని కండరాల బిగువు తగ్గి మెత్తగా ఉన్నట్లు అనిపిస్తుంది. యోని నుండి వెలికివస్తున్న చీము, సెర్విక్సు నుండి గానీ, మూత్రనాళపు లోపల పొరనుండి గాని లేదా యోని ద్వార సమీపంలో ఉండే గ్రంథుల నుండి గాని వస్తూండవచ్చు. రోగి శరీరం నుండి రోగ ఫలితంగా వస్తున్న ద్రవం కంటికి అంటితే దాని వెలుపలి భాగాలకు ఇన్ఫెక్షన్ సోకుతుంది. చూలాలికి ఈ రోగం వుంటే, ప్రసవ సమయంలో అది బిడ్డకు సోకే అవకాశా లున్నాయి ఈ రోగం సోకిన బిడ్డ కనులు వాచి ఉంటాయి; అవి పుసిగడుతూ కూడా ఉంటాయి. పెద్దలలో కూడా ఇలాంటి సూచనలు కనుపించవచ్చు; కాని సామాన్యంగా ఒక్క కంటికే రోగపు ఇన్ఫెక్షన్ రావటం సాధారణంగా కనుపిస్తుంది. గనోరియా నివారణ సాధ్యమైనది. తీవ్రమైన అనారోగ్య సమస్యలుత్పన్నం గావటం గనోరియా రోగులలో అరుదుగా మాత్రమే సంభవిస్తుంది. ఆ స్థితిలో కూడా రోగి ప్రాణం తీయగలిగినంతటి పరిస్థితి ఎదురు గావటం అరుదు

గనోరియా, స్త్రీ నుండి పురుషుల కంటే, పురుషుల నుండి స్త్రీలకు సోకటం సులభమని వైద్య నిపుణులు సూచిస్తున్నారు. ఒక్కసారి జరిగిన సెక్సు సంపర్కం వల్లనే ఈ రోగం ఉన్నవారి నుండి లేనివారికి సోకే అవకాశాలు ఇరవై నుండి ముప్పై శాతం వరకూ ఉంటాయని సర్వేయర్లు అంచనా వేశారు

గనోరియా కూడా, రోగికి హెచ్ఐవి సోకటానికి అధికంగానే తోడ్పడుతుంది ఇలాంటి దుష్ఫలితాలు కనుపించకుండా ఉండాలంటే, ఈ రోగ నివారణకు వీలైనంత త్వరగా చికిత్స చేయించుకోవటం అవసరం ఇంతకు పూర్వమే చెప్పినట్లు, రోగపు అంటు తగలగానే, రోగ సూచనలు స్త్రీలలో కనుపించవు ఇందువల్ల వెంటనే చికిత్స చేయించుకోవటం సాధ్యం గావటం లేదు. గనోరియా యొక్క ఈ స్వభావం వల్లనే, సొమ్ముకు సెక్సు నమ్ముకొనేవారు (ముఖ్యంగా సెక్సు వర్కర్లు) ఈ రోగానికి ఆశ్రయంగా తయారవుతున్నారు.

మనదేశంలో పురుషులలో ఈ రోగం అధికంగానే కనుపిస్తున్నది మొత్తం సుఖరోగులలో ఈ రోగుల సంఖ్య నాల్గవ వంతు వరకూ ఉండవచ్చునని కొన్ని అంచనాలు తెలుపు తున్నాయి. పరస్త్రీల సెక్సును కోరే వివాహితులు, అవివాహితులు కూడా, ప్రధానంగా సెక్సు వర్కర్ల నుండి ఈ రోగాన్ని పొంది, దానిని తమ ఇల్లాండ్రకు పంచుతున్నారు. గనోరియా రోగం పాలవుతున్న వారిలో నూరింట యాభైమంది వరకూ 15-24 సంవత్సరాల మధ్య వయస్కులని కొన్ని రిపోర్టులు సూచిస్తున్నాయి. 15-30 సంవత్సరాల మధ్యవయస్కులను పరిగణనకు తీసుకొంటే, మొత్తం గనోరియా రోగులలో వీరు నూరింట 80 మంది వరకూ ఉంటారని అంచనా. వీరిలో నూరింట 30 నుండి 39 మంది వరకూ రెండవసారి ఈ రోగానికి గురయిన వారుంటున్నారు! ఈ అంచనాలను బట్టి, ఈ రోగానికి లోనవుతున్న పురుషులలో వివాహితులు, అవివాహితులు చెరి నగం మేరకు ఉండవచ్చునని అనిపిస్తున్నది. వివాహితులు, తమ భార్యలకు, అవివాహితులు తమకు కాబోయే సతీమణులకు ఈ రోగాన్ని ఎంత పెద్ద యెత్తున పంచగల అవకాశాలున్నాయో ఈ రోగగ్రస్థ పరిణామాలను బట్టి ఊహించవచ్చు. అంతేకాదు; ఈ రోగం స్త్రీలలో త్వరగా తన ప్రభావాన్ని చూపలేదని కూడా చూచాం. తనకు ఆ రోగం ఉన్నదని తెలియక ఇల్లాలు ఆ రోగాన్ని తిరిగి భర్తకు అంటించగల అవకాశాలు కూడా అపారంగా ఉన్నాయి. ఢిల్లీలోని ఒక వైద్యశాలలో రెండు గ్రూపుల పరిశీలకులు (1981లో ఒకరు, 1985లో మరొక గ్రూపువారూ)

సర్వేలు నిర్వహించారు. డబ్బు చెల్లించనవసరం లేకుండా తమ స్నేహితురాండ్రు, లేక తెలిసినవారు, బంధువర్గంలోని స్త్రీల తోడి సంపర్కం వల్ల తమకు గనోరియా వచ్చినట్లు 1981వ సంవత్సరంలో జరిగిన సర్వేలో గనోరియా పేషెంట్లలో నూరింట 21 మంది చెప్పారు; 1985వ సంవత్సరంలో జరిగిన సర్వేలో ఇదే విషయాన్ని 39 మంది వెల్లడించారు.

పురుషులు, డబ్బు చెల్లించి సెక్సు వర్కర్ల నుండి తెచ్చు కున్న రోగం, వారి ఇల్లాండ్రకు సోకి, తిరిగి అది వారికే సోకుతున్న వైనాన్ని ఈ సర్వే వివరాలు చిత్రిస్తున్నాయి ఈ రోగం టేబుల్ టెన్నిస్‌లో (పింగ్‌పాంగ్‌లో) బంతిలా ఎలా చేతులు మారుతున్నదీ గమనించవచ్చు. ఇటీవల ఒక అవాంఛనీయ పరిణామమొకటి కనుపిస్తున్నది. ఏంటీబయోటిక్ మందుల రాక తర్వాత, ఈ రోగులు తామే మందులను కొని వాడుతున్నారు. ఇలా విచక్షణా రహితంగా ఈ తరగతి మందుల వాడకం వల్ల, ఈ మందులను నిగ్రహించి మనగల శక్తి, రోగ బీజాలకు అబ్బుతున్నది. ఇది మరొక ప్రమాదకర పరిణామం.

ఈ రోగపు అనర్థాల దృష్ట్యా, స్త్రీలు దీన్ని వీలయినంత త్వరగా పసిగట్టి చికిత్స చేయించుకోవటం అవసరం. ఈ చికిత్సను, భార్యాభర్తలు లేక సెక్సు సంబంధాలను కొనసాగిస్తున్న స్త్రీ పురుషు లిద్దరూ చేయించుకోవటం అవసరం. కుటుంబంలో స్త్రీ పరాధీన కనుక, ముఖ్యంగా పురుషులు ఈ విషయంలో బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. పురుషులు ఈ రోగ నివారణ చికిత్సకు వైద్యశాలలకు వెళ్ళినపుడు, తమతో తమ భార్యలను తీసుకు వెళ్ళటం లేదు; వైద్యులు ఈ మేరకు సూచించినా, వారి నుండి ప్రయోజనకరమైన ప్రతిస్పందన కనుపించటం లేదు. గనోరియా నివారణ చికిత్సకు వైద్యశాలలకు వచ్చే స్త్రీలలో 14-25 సంవత్సరాల మధ్య వయస్కులే అత్యధికులుగా ఉంటున్నారు. దీనినిబట్టి ఎంత చిన్నతనంలో వివాహాలై, స్త్రీల సెక్సు సంపర్కం ప్రారంభమవుతున్నదో, అది ఎంతటి ప్రమాదాలకు దారి దీస్తున్నదో ఊహించవచ్చు.

వైద్యశాలలో చికిత్సకు వస్తున్న వారంతా పట్టణప్రాంత వాసులే అయి ఉంటారు. గ్రామ ప్రాంతాల వారు ఇంకెంతమంది లెక్కలోనికి రాకుండా ఉంటారో ఊహించవలసిన విషయమే. ఇందువల్ల ఈ రోగం ఎంతమేరకు స్త్రీలలో ఉంటున్నదీ అంచనా వేయటానికి వీలుండటం లేదు ఈ రోగులను గుర్తించటానికి, కాల నియమం ప్రకారం ఆరోగ్య పరీక్షలకు ప్రసూతి వైద్యశాలలకు వచ్చే చూలాండ్రను పరీక్షించటం ఉత్తమ మార్గమని వైద్య నిపుణులు సూచిస్తున్నారు. గనోరియా రోగసూచనలు నేరుగా కనుపించకపోయినా, తెల్లబట్ట ఉన్నా, లేక పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ రోగాల తాలూకూ చిహ్నాలు కనుపిస్తున్నా, తప్పకుండా పరీక్షలు జరపటం వల్ల గనోరియా ఉనికిని పసిగట్టవచ్చునన్నది వైద్య నిపుణుల అభిప్రాయం. చండీగఢ్‌లో ప్రసూతి పరీక్షలకు వస్తున్న చూలాండ్రలో రెండు శాతం మందిలో గనోరియా ఉన్నట్లు వైద్యులు గుర్తించినట్లు ఒక పరిశీలకుడు రిపోర్టు చేశారు, వారణాసిలో జరిగిన వేరొక పరిశీలనలో ఒక్క శాతం స్త్రీలలో ఈ రోగ సూచనలు కనుపించినట్లు వెల్లడైంది.

అమెరికాలో ప్రతి చూలాలి మీదా గనోరియా నిర్ధారణ కోసం పరీక్షలు జరపటం వైద్యుల విధిగా నిర్దేశించారు. మన దేశంలో కూడా ఇలా చేయటం ఉచితమా కాదా అన్న అంశం మీద ఇంతవరకూ ఏకాభిప్రాయం వ్యక్తం కావటం లేదు. వాద ప్రతివాదాలేమయినప్పటికీ, స్త్రీలు అత్యంత దురదృష్టకరమైన పరిస్థితులలో తమ ఆరోగ్యాన్ని రక్షించుకోవలసి వస్తున్నదన్నది యదార్థం. కుటుంబంలో ఏ చెడు జరిగినా, అందుకు స్త్రీయే కారణమన్న ముద్ర ఏనాడో పడింది. దీనికి తోడు, స్త్రీ యొక్క సెక్సు ఆరోగ్యాన్నీ, చూలు, కాన్పుకు సంబంధించిన ఆరోగ్యాన్ని అనుసంధించి పరీక్షలను నిర్వహించి, వైద్య చికిత్సలు జరిపే వసతులు మనకు లేవు. ఉన్నవి కొద్ది అయినా, అవి సామాన్యులకు గగన కుసుమాలుగా తయారైనాయి. సుఖరోగ చికిత్సలు జరిగే వైద్యశాలలకు ఇల్లాండ్రు పోసాహసించరు. పురుషులలో కూడా, ఆర్థిక స్థోమత లేని పేదలే ఈ వైద్యశాలలకు వెళతారు. శక్తిమంతులు ప్రైవేట్ వైద్యుల దగ్గరకు వెళతారు. సుఖరోగ వైద్యశాలలలో చక్కగా రోగ నిర్ధారణ చేయగల లేబొరెటరీ వసతులు చాలా తక్కువగా ఉన్నాయి. ఈ పరీక్షలకు అధిక మొత్తంలో సొమ్ము ఖర్చవుతుంది. ఇలాంటి పరీక్షలను నిర్వహించగల సిబ్బంది కూడా మనదేశంలో తక్కువగానే ఉన్నది. ప్రసూతి వైద్యశాలలలో గాని, సాధారణ వైద్యశాలలలో గాని, సుఖరోగ నిర్ధారణ వసతులు దాదాపు లేవు. అవివాహితలు ప్రసూతి ఆరోగ్య కేంద్రాలకు వెళ్ళరు గనుక, వారికి సుఖరోగ

నివారణా చికిత్స అచ్చట లభించదు. సుఖరోగ చికిత్సా కేంద్రాలకు వీరు వెళ్ళరు; వెళితే పరువుపోతుందని భయం

స్త్రీల వైద్యశాలలు, ప్రసూతి వైద్యశాలలు ప్రధానంగా పట్టణ ప్రాంతాలలో కేంద్రీకృతమై యుండటం వల్ల, మనదేశం లోని స్త్రీలలో అత్యధికులు, వాటి సర్వీసులను వినియోగించు కోలేకపోతున్నారు. వీటిలో పరీక్షలను చేయించుకోవటానికి ఎవరైనా వెళ్ళినా, చూలు యొక్క చివరిదశలో వెళుతున్నారు. ఇలా వెళ్ళినవారు కూడా పరీక్షలను చూలు వరకే పరిమితం చేసుకొంటున్నారు. వెన్నునొప్పి, పొత్తికడుపులో బాధ వంటి వేవయినా ఉన్నా, చికిత్సకు వెళ్ళటం లేదు ప్రసూతి వైద్యశాలలు, స్త్రీల ప్రత్యేక వైద్యశాలలు, కుటుంబ నియంత్రణా కేంద్రాల వారు కూడా, చూలుకు సంబంధించిన పరీక్షలకే ప్రాధాన్యత నిస్తున్నారు సుఖరోగ నిర్ధారణా పరీక్షలను విధిగా చేయటం లేదు. చూలాలికి హెచ్ఐవి సోకిన విషయ నిర్ధారణకు ఈ విధానం పెద్ద ప్రతిబంధకంగా తయారైంది. ఈ దశలో హెచ్ఐవి సోకినట్లు నిర్ధారించగలిగితే, అవసరమయిన ముందు జాగ్రత్తలను పేషెంటుకు సూచించే అవకాశాలుంటాయి పట్టణ ప్రాంతీయులకు వైద్య చికిత్సా వసతులు దాపులో ఉంటాయి. కనుక స్త్రీలు ప్రభుత్వ స్త్రీల వైద్యశాలలకు, ప్రసూతి వైద్యశాలలకూ సులభంగా వెళ్ళగలుగుతున్నారు స్త్రీలు ఈ తరగతి వైద్యశాలలకు వెళ్ళినట్లే, పురుషులు ప్రభుత్వ సుఖరోగ చికిత్సా కేంద్రాలకు వెళతారు. ఇలా వెళ్ళేవారి వర్గ స్వభావాన్ని మనం గుర్తించటం అవసరం. వీరిలో అధికులు గ్రామ ప్రాంతాల నుండి పొట్టచేతబట్టుకొని వలస వచ్చినవారు; నిరక్షరాస్యులు; ఆర్థికంగా, సాంఘికంగా వెనుకబడినవారు అంతేగాదు; ప్రభుత్వ సుఖరోగ చికిత్సా కేంద్రాలకు వస్తున్న పురుష రోగులకు, ప్రభుత్వ స్త్రీల వైద్య శాలలకు వస్తున్న స్త్రీ రోగులు, వారి భార్యలో, లేక సెక్సు భాగస్వామిని లో అయి ఉండటం గమనించవలసిన విషయం!

జెనిటల్ హెర్ప్స్ :- జననాంగాల మీద అల్సర్లను (పుండ్లను) కలుగజేసే సుఖరోగాలలో జెనిటల్ హెర్ప్స్ ఒకటి. చికిత్సకు లొంగక, దీర్ఘకాలం తన ప్రభావాన్ని చూపగల శక్తి దానికున్నది. ఒకసారి ఈ రోగం వచ్చి, అది నయమైనట్లు కనుపించినా, వారి సెక్సు భాగస్వాములకు ఈ రోగపు అంటుసోకే అవకాశా లుంటాయి. స్త్రీల మీద దీర్ఘకాలిక ప్రభావాన్నిది చూపగలదు. ఇది అతి ప్రమాదకరమైన సుఖరోగం. ఇతర అల్సరు కారకాలయిన సుఖరోగాల వలె, ఇది కూడా సెర్విక్సు కాన్సరు రాకకు మార్గం సుగమం చేస్తుంది. అల్సర్లను కలుగజేయగల ఇతర సెక్సు రోగాల కంటే, జెనిటల్ హెర్ప్స్ వల్ల హెచ్ఐవి సోకే ప్రమాదం ఏడు రెట్లు అధికంగా ఉన్నట్లు వైద్యనిపుణులు సూచిస్తున్నారు.

జెనిటల్ హెర్ప్స్ సెక్సు సంపర్కం ద్వారా వ్యాపిస్తుంది హెర్ప్స్ సింప్లెక్స్ వైరస్ దీని వ్యాప్తికి కారణం. ఈ వైరసులో, హెచ్ యస్ వి-1, హెచ్ యస్ వి-2 అని రెండు రకాలున్నాయి. ఈ రెండవ రకం సామాన్యంగా సెక్సు సంపర్కం ద్వారా వ్యాపిస్తుంది ఇది జననాంగాలను ఆశ్రయిస్తుంది. మొదటి వైరసు సామాన్యంగా నోటికి సోకుతుంది. అట్లని ఇది జననాంగాలను సోకదని భ్రమించనవసరం లేదు. ఇవి రెండూ, కనురెప్పలకు కూడా సోకవచ్చు. హెర్ప్స్ వైరసు వల్ల అంకురించిన పుండ్ల మీద (ఇంగ్లీషులో వీటిని "సోర్స్" అని అంటున్నారు) బాక్టీరియా ఇన్ఫెక్షన్ సాధారణంగా రాదు; కాని బాక్టీరియా వల్ల వచ్చే సిఫిలిస్, షంక్రాయిడ్ వంటి సెక్సు రోగాలు, ఇంతకు పూర్వమే ఉన్న వారికి మాత్రం పుండ్ల మీద ఈ రోగాల తాలూకు బాక్టీరియా కనుపిస్తుంది

స్త్రీల మర్మాంగం మీదా (వల్వా మీద), యోని ముందు భాగంలోనూ, దాని లోపల, గర్భసంచి ముందు భాగం - సెర్విక్స్ మీదా - బొబ్బలొస్తాయి. ఇంతకు ముందే హెచ్ఐవి సోకటం వల్ల రోగి రోగ నిగ్రహశక్తి బలహీనపడి ఉన్నట్లయితే, వారికి హెర్ప్స్ వల్ల పుండ్లు అధికంగా వస్తాయి. శరీరమంతటికీ ఇవి విస్తరించే అవకాశాలుంటాయి. ఇవి మామూలుగా ఉండవలసిన కాలం కంటే ఎక్కువ కాలమే - వారాలు గావచ్చు - ఇంకా అధిక కాలం కూడా గావచ్చు - ఉంటాయి. ఈ రోగం, చికిత్సకు సులభంగా లొంగదు.

ప్రాథమిక ఇన్ఫెక్షన్ సూచనలు, అది వచ్చిన నాలుగు రోజుల నుండి ఏడు రోజుల లోపల కనుపిస్తాయి. ప్రారంభదశలో దురద బుట్టినట్లు, గిలిగింతలు బెట్టినట్లు ఉంటుంది. శరీర భాగము కందినట్లు కనుపిస్తుంది. తర్వాత సన్నని బొబ్బలొస్తాయి; అవి నొప్పిగా ఉంటాయి. ఒక ప్రాంతంలోని బొబ్బలు చితికి అంతా గుండ్రని పుండులా తయారవుతుంది. ఇవి కూడా నొప్పిగా ఉంటాయి; కొద్దిరోజుల

తర్వాత పుండ్లమీద చెక్కు గడుతుంది. మూత్ర విసర్జన కష్టమనిపిస్తుంది: గజ్జలలో బిళ్ళలు కట్టడం వల్ల నడచినపుడు నొప్పనిపిస్తుంది. పదిరోజులలో పుండ్లు మాని, ఆ ప్రాంతంలో మచ్చబడుతుంది. తొలుత వచ్చిన పుండ్ల నొప్పి అధికంగా ఉంటుంది; కొంచెం ఎక్కువ కాలం ఉంటుంది. సోర్సు కూడా ఎక్కువ ప్రాంతాల్లో వస్తాయి. అటు తర్వాత వచ్చేవి ఇంత అధికంగా బాధించవు. ఈ సూచనలు కనుపించినపుడు జ్వరం రావచ్చు, రోగభారం శరీరాన్ని ఆవహిస్తుంది.

జెనిటల్ హెర్ప్స్ చికిత్సకు లొంగే రోగం కాదు. చికిత్స వల్ల పుండ్లు రావటం తగ్గుతుంది. చికిత్స మూలంగా ఎక్కువ సార్లు పుండ్లు పడకుండా చూడవచ్చు. రోగసూచనలు కనుపించిన వెంటనే చికిత్స ప్రారంభిస్తే లాభకరంగా ఉంటుంది. ప్రారంభ దశలో చికిత్సను ప్రారంభించినా, రోగం తిరుగబెట్టదన్న నమ్మకం లేదు; జీవితంలో ఎపుడో ఒకసారి ఈ రోగానికి గురై, ఇపుడు రోగ సూచనలు కనుపించని వారి ద్వారా కూడా ఇది వారి సెక్సు భాగస్వాములకు సోకే అవకాశాలుంటాయన్న విషయాన్ని మరువ కూడదు. ఈ రోగమున్న పురుషులు, తమకు రోగం లేదన్న భ్రమతో దీనిని వారి భార్యలకు సంక్రమింపజేసే అవకాశాలున్నాయి.

స్త్రీకి ఒకసారిది వచ్చినపుడు, సకాలంలో చికిత్స చేయించుకోనపుడు, ముదిరి చికిత్సకు లొంగని పరిస్థితి ఏర్పడవచ్చు. స్త్రీల సాంఘిక ఆర్థిక పరిస్థితులు వారికి సకాలంలో చికిత్స చేయించుకొనే అవకాశా న్నీయటం లేదు. ఈ రోగంతోనే సెక్సు సంపర్కానికి పూనుకొంటూ ఉండటం వల్ల ఈ రోగపు వ్యాప్తి పెరుగుతుంది. భార్య నుండి భర్తకు, భర్త నుండి భార్యకూ వస్తూంటుంది. జెనిటల్ హెర్ప్స్ ఉన్న మహిళకు చూలు వచ్చినపుడు అది కొన్ని అవాంఛనీయ పరిణామాలకు దారిదీయవచ్చు. పిండం దశలోనే బిడ్డ మరణించ వచ్చు; లేదా నెలలు నిండకుండానే కాన్పు కావచ్చు; లేదా పుట్టిన బిడ్డ బరువు, ఆరోగ్య నియమాల ప్రకారం ఉండవలసినంత ఉండకపోవచ్చు. గర్భస్థ దశలో గాని, లేక పుట్టిన తర్వాత పురుటి కాలంలో గాని, బిడ్డకు ఈ రోగం సోకే అవకాశాలు 30 నుండి 50 శాతం వరకూ ఉండవచ్చునని కొందరు పరిశీలకులు సూచించారు. జనన కాలంలో జెనిటల్ హెర్ప్స్ బిడ్డకు సోకే అవకాశాలుంటాయి. జెనిటల్ హెర్ప్స్ రోగులలో సామాన్యంగా స్త్రీ పురుషులు సమాన సంఖ్యా పరిమాణాలలో ఉంటున్నట్లు కొందరు సూచించారు. కాని దక్షిణ భారతంలోని ఒక ప్రాంతంలో 1989వ సంవత్సరంలో జరిగిన ఒక పరిశీలనలో, పురుష రోగుల సంఖ్య కంటే స్త్రీ రోగుల సంఖ్య అధికంగా ఉన్నట్లు కనుపించింది. జెనిటల్ హెర్ప్స్ పేషంట్లలో నూరింట 39 మందికి యోని కాన్సరు వచ్చే అవకాశాలున్నట్లు ఒక పరిశీలనలో తేలింది. ఈ రోగం తమకు లేదు అని అనుకొంటున్న స్త్రీలను పరీక్షించినపుడు, నూరింట 42 మందిలో ఈ రోగకారక వైరసు (హెర్ప్స్ వైరస్) ఉన్నట్లు రుజువైంది. సాధారణంగా ఈ రోగం అధిక సంఖ్యాక స్త్రీలలో ఉంటున్నట్లు, లభిస్తున్న పరిశీలనా సమాచారాన్ని బట్టి అంచనా వేస్తున్నారు. రోగవ్యాప్తిని గురించిన వాస్తవిక అంచనాలను రూపొందించటానికి తగిన సమాచారం లభించటం లేదు.

నాన్-గొనొకొకల్ యురెథ్రైటిస్, క్లమీడియల్ సెర్విసైటిస్ :- ఈ రెండు సుఖరోగాలు సాధారణంగా క్లమీడియా ట్రైకోమైటిస్ రోగజీవుల వల్ల సంక్రమిస్తాయి. గనోరియాకు కారణమవుతున్న రకపు బాక్టీరియా ఈ రోగాలకు కారణం కాదు అని సూచించ టానికి "నాన్-గొనొకొకల్" అన్న పదాన్ని వాడుతున్నారు. క్లమీడియా అనేది చిన్నసైజు బాక్టీరియా. ఇది జీవకణంలో చేరి, సంతతిని పెంచుకొంటుంది.

క్లమీడియా సోకిన వ్యక్తితో సెక్సు సంపర్కం జరిగిన నాలుగు నుండి 28 రోజులకు, రోగం ఇంతకు పూర్వం లేని వారిలో, రోగసూచనలు కనుపించ నారంభిస్తాయి. ఈ బాక్టీరియా ఇన్ఫెక్షనుకు గురయిన స్త్రీలలో అత్యధిక సంఖ్యాకులలో రోగసూచనలు బయటికి కనుపించవు. రోగసూచనలు కనుపించిన వారిలో ఈ లక్షణాలుంటాయి : తరచూ మూత్ర విసర్జనావసరం కలుగుతుంది; విసర్జన కాలంలో బాధ కలుగుతుంది. పొత్తి కడుపులో నొప్పిగా ఉంటుంది; సెక్సు సంపర్క సందర్భంలో నొప్పిగా ఉంటుంది. యోని నుండి పసుపురంగు మ్యూకస్, చీము వస్తూంటుంది. గనోరియా సోకినప్పటి కంటే, క్లమీడియా సోకినపుడు సెర్విక్స్‌కు చీము అధికంగా పడుతుంది.

సెర్విక్స్ నుండి వస్తున్న డిశ్చార్జిని లాబొరేటరీలో పరీక్షించటం ద్వారా రోగ నిర్ణయం చేయవచ్చు. క్లమీడియా ట్రైకోమైటిస్‌ను కల్చర్ చేయటం కష్టమైన పని; రోగ నిర్ణయానికి

ఇతర పద్ధతుల అవలంబన వల్ల ఖర్చులధికమవుతాయి. ఈ రోగ నిర్ణయాన్ని చేయగల లేబొరేటరీ వసతులు కూడా తక్కువగా ఉన్నాయి అందువల్ల రోగ సూచనలను బట్టి చికిత్స చేస్తూంటారు

సకాలంలో నివారణకు చికిత్స జరుగనపుడు నాలుగు వారాల లోపుననే, ఈ రోగులలో నూరింట 60 నుండి 70 మందిలో రోగచిహ్నాలు కనుమరుగవుతాయి. క్లమీడియల్ ఇన్ఫెక్షన్ వల్ల కొన్ని సమస్యలుత్పన్నం గావచ్చు ఈ రోగం సంక్రమించిన స్త్రీలు చికిత్స చేయించుకోనపుడు, బాక్టీరియా ఫెలోపియన్ ట్యూబ్స్‌కు ప్రాకి, వాటి వాపుకు కారణమవుతుంది, నొప్పి కూడా ఉంటుంది. బాక్టీరియా చర్యవల్ల స్త్రీకి ఇక మీదట సంతానప్రాప్తికి అవకాశం ఉండకపోవచ్చు; లేదా ఎక్టోపిక్ ప్రెగ్నెన్సీ రావచ్చు (పిండం గర్భసంచిలో గాక వేరొకచోట నిక్షిప్తం గావచ్చు) రోగసూచనలు కనుపించనందువల్ల నివారణా చికిత్స జరుగని సందర్భాలలో ఎదురుకాగల ప్రమాదమిది ఇందువల్ల పేషంట్ తీవ్రమైన బాధకు గురికావచ్చు; చికిత్సకు సొమ్ము కూడా అధికంగా ఖర్చవుతుంది

చికిత్స చేయించుకొన్న నూరింట ఇరవై మందిలో రోగం తిరిగి కనుపించవచ్చు. చికిత్స పూర్తిగాక పూర్వమే సెక్సు సంపర్కానికి దిగితే, వారి సెక్సు భాగస్వామికిది సంక్రమించే అవకాశాలుంటాయి ఈ ప్రమాద నివారణకే, సెక్సు భాగస్వాములలో ఏ ఒకరికి ఈ రోగపు ఇన్ఫెక్షన్ వచ్చినా, ఇరువురకూ చికిత్స చేస్తారు. ఈ రోగం, చికిత్స వల్ల సంపూర్తిగా నివారణవుతుంది.

ఈ రోగం ఉన్న చూలాండ్రకు నెలలు నిండకుండా కాన్పు రావచ్చు; పుట్టిన బిడ్డ బరువు ఉండవలసిన సాధారణ బరువు కంటే తక్కువగా ఉండవచ్చు; చనిపోయిన బిడ్డ పుట్టవచ్చు; గర్భ స్రావం జరిగే అవకాశాలుంటాయి; కాన్పు తర్వాత బాలింతకు జ్వరంవస్తూండవచ్చు, గర్భంలోని పిండానికి ఈ రోగం సంక్రమించ వచ్చు. ఈ విషయాలలో గనోరియా కంటే క్లమీడియా అధిక ప్రభావాన్ని చూపగలదని వైద్యులు చెబుతున్నారు. చూలాలికి క్లమీడియా సోకినపుడు తల్లి గర్భంలోని పిండం చనిపోవటానికి గాని, బిడ్డ పుట్టిన నాలుగు వారాల లోపుననే చనిపోయే అవకాశాలు గాని పదిరెట్లు అధికంగా ఉంటాయని కొందరు నిపుణులు సూచించారు. చూలాలికి క్లమీడియా ఉన్నపుడు ఆవిడకు పుట్టే బిడ్డకు న్యుమోనియా వచ్చే అవకాశాలుంటాయని చెప్పటానికి ఆధారాలున్నాయి. ఈ రోగపు అంటు ఉన్నవారు ఐయుడిని వాడుతున్నపుడు పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ రోగాలు వచ్చే అవకాశాలు అధికమవుతాయి ఐయుడిని వాడుతున్న వారిలో, దీనిని వాడని వారిలో కంటే, క్లమీడియా సోకటం కూడా అధికంగా ఉన్నట్లు కనుపిస్తున్నది

1992లో ఢిల్లీలో జరిగిన ఒక సర్వేలో ఆరు శాతం మంది క్లమీడియా రోగులలో రోగం తీవ్రస్థాయిలో నున్నట్లు, 29 శాతం మందిలో ఇది ముదిరినట్లు రుజువైంది. దేశంలోని సుఖరోగ చికిత్సా కేంద్రాలకు వస్తున్న పురుష రోగులలోని ఇరవై నుండి ముప్పై శాతం మందికి క్లమీడియా ట్రైకోమైటిస్ సోకినట్లు, వీరి స్త్రీ సెక్సు భాగస్వామినులకు కూడా ఈ రోగం ఉన్నట్లు రిపోర్టులు తెలియజేస్తున్నాయి. ఆర్థికంగానూ, సాంఘికంగానూ వెనుకబడిన వర్గాల వారిలో ఈ పరిస్థితి అధికంగా ఉన్నట్లు కూడా రిపోర్టులు వెల్లడిస్తున్నాయి దీనిని బట్టి, ఈ రోగపు అంటువల్ల ఎందరు స్త్రీలు ఎంతటి బాధలను అనుభవిస్తూండవచ్చో ఊహించవచ్చు; వారు అనుభవిస్తున్న అధిక బాధలకు ఇది చీమ అంతటి సూచిక మాత్రమే.

సుఖరోగాలు రాకుండా నిరోధించటానికి పురుషులు కండోమ్‌లను వాడటం అవసరమని చూచాం. ఈ రోగాల నిరోధానికి కూడా వీటి వాడుక తోడ్పడుతుందని వేరుగా చెప్పనవసరం లేదు సిఫిలిస్, షంక్రాయిడ్, హెర్ప్స్ వంటి సుఖరోగాలు జననాంగం మీద పుండ్లను కలుగజేస్తాయి. ఇలా పుండ్లను కలుగజేసే సుఖరోగాలున్న వారికి హెచ్ఐవి సోకటం సులభమని ఇంతకు పూర్వమే చెప్పాం. క్లమీడియా, గనోరియా, ట్రైకోమొనియాసిస్ వంటి సుఖరోగాలు ఇలా పుండ్లను కలుగ జేయవు. కనుక, ఇవి ఉన్నందువల్ల హెచ్ఐవి సోకదని భ్రమించ కూడదు. ఈ రోగాలు కూడా హెచ్ఐవి రాకకు మార్గం సుగమం చేయగలవన్న విషయాన్ని విస్మరించకూడదు. ఈ రెండు వర్గాలకు చెందిన సుఖరోగాలలో ఏది ఉన్నా, హెచ్ఐవి సోకే అవకాశాలు, ఇతర సుఖరోగాలున్నప్పటి కంటే, మూడు నుండి ఐదు రెట్ల వరకూ అధికంగా ఉంటాయని వైద్య నిపుణులు హెచ్చరిస్తున్నారు.

జెనిటల్ వార్ట్స్ :- పెపిల్లోమా వైరసుల వల్ల ఈ సుఖరోగం సంక్రమిస్తుంది. ఈ వైరసు సెక్సు సంపర్కం ద్వారా, ఉన్నవారి నుండి లేనివారికి సోకుతుంది. ఈ వైరసు సోకటం వల్ల, స్త్రీల మర్మాంగం మీదా (వల్వా మీద), యోని గోడల మీదా, సెర్విక్సు మీదా జెనిటల్ వార్ట్స్ (పులిపురల వంటివి) అంకురిస్తాయి. ఇవి కంటికి కనుపించని ప్రదేశాలలో కూడా వస్తాయి గనుక, మహా ప్రమాద కారులుగా తయారవుతాయి. హెచ్ఐవి వంటి శరీర రోగ నిరోధక శక్తిని బలహీనపరచే రోగాలున్న వారికి, అత్యంత ప్రమాదాన్ని కలిగిస్తాయి. పెపిల్లోమా వైరసు - 16, 18 రకాల వల్ల సెర్విక్సు కాన్సరు వస్తుంది. ఈ రెండు రకాల, వైరసులతో పాటు, దీనికి చెందిన ఇతర రకాల వైరసుల వల్ల యోనికి, కంటికి కనుపించే మర్మాంగ భాగాలకు (వల్వాకు) కూడా కాన్సరు వచ్చే అవకాశాలు ఉంటాయి. తొలి సెక్సు సంపర్కం నాటికి స్త్రీ వయస్సు ఎంత తక్కువగా ఉంటే అంత అధికంగానూ, స్త్రీకి ఎంత ఎక్కువ మంది పురుషులతో సెక్సు సంబంధాలుంటే అంత అధికంగానూ, వారికి కాన్సరు వచ్చే అవకాశాలుంటాయి.

జెనిటల్ వార్ట్స్ సామాన్యంగా మనిషి శరీరంలో నులివెచ్చగాను, తేమగానూ ఉండే ప్రాంతాలలో వస్తాయి. వైరసు సోకిన మాసం నుండి ఆరు మాసాల లోపల ఈ మచ్చలు కనుపించ నారంభిస్తాయి. ఇవి ప్రారంభదశలో మెత్తగా, తేమగా, ఎరుపు లేక గులాబి రంగులో ఉంటాయి. ఇవి క్రమంగా పెరుగుతూ, దగ్గరలో ఉన్నవన్నీ కలసి ఒకటవుతాయి. వీటి ఉపరితలం, కాలిఫ్లవర్ ఉపరితలంలా కనుపిస్తుంది చూలాలికి జెనిటల్ వార్ట్స్ సోకితే, మామూలు స్త్రీల కంటే, వీరిలో ఈ మచ్చలు త్వరగా పెరుగుతాయి. ఎయిడ్స్ వంటి రోగ నిగ్రహశక్తిని నీరసింపజేసే రోగాలున్న వారి శరీరం మీద కూడా ఇవి త్వరితగతిని పెరుగుతాయి.

జెనిటల్ వార్ట్స్‌ను కలుగజేసే వైరసు కొందరిలో రోగ కారకం గాదు. కాని అది రోగకారకమయినపుడు వారినది జీవితాంతం వేధించే అవకాశాలుంటాయి. పెపిల్లోమా వైరస్ కాన్సరుకారకం గనుక, ఇది సోకినవారు ఆందోళనకు గురవుతారు. చికిత్స కోసం సొమ్మును అధికంగా ఖర్చు చేయవలసి వస్తుంది. ప్రపంచంలో వస్తున్న సెర్విక్సు కాన్సరుకు ఈ వైరసే ప్రధాన కారణంగా పరిగణిస్తున్నారు. స్త్రీలను చంపుతున్న చనుకట్టు కాన్సరు, జీర్ణకోశ కాన్సరు, ఊపిరితిత్తుల కాన్సరు తర్వాత అధిక మరణాలకు దారి తీస్తున్నది, ఈ వైరసుల వల్ల వస్తున్న సెర్విక్సు కాన్సరని నిపుణులు నిర్ధారణ చేశారు

పెపిల్లోమా వైరసులో 60 నుండి 80 రకాల వరకూ ఉన్నాయని, వీటిలో 15 రకాలు కాన్సరు కారకాలని నిపుణులు నిర్ధారణ చేశారు. వీటిలో కొన్ని రకాలను పసిగట్టటం కష్టసాధ్యంగా ఉన్నది ఒకవేళ వైరసును పసిగట్టగలిగినా, అది ఏ రకానికి చెందినదీ, అది కాన్సరు కారకమా కాదా అని నిర్ధారణ చేయగల పరీక్షా విధానాలు లేవు. ఈ వైరసులు శరీరం లోని ద్రవపదార్థాల ద్వారా కంటే, శరీరస్పర్శ ద్వారానే సంక్రమించే అవకాశాలు అధికంగా ఉంటాయి. ఇందువల్ల కండోమ్‌ల వాడుక దీని వ్యాప్తిని నిరోధించలేదని భావిస్తున్నారు.

అమెరికాలోని యూనివర్సిటీ ఆఫ్ వాషింగ్టన్‌లో 600 మంది విద్యార్థినుల మీద 1991వ సంవత్సరం నుండి ఒక సర్వేను నిర్వహిస్తున్నారు. వీరిలో ఇరవై శాతం మందికి తొలి సెక్సు సంపర్కం వల్లనే ఈ వైరసు సోకినట్లు సర్వే నిర్ధారణ చేసింది. ఇలా వైరసు తొలుత సోకిన వారిలో నూరింట 90 మందికి రెండు సంవత్సరాల లోపుననే ఈ వైరసులో మరో రకం సంక్రమించింది. జెనిటల్ వార్ట్స్ కంటికి కనుపించిన వారు వెంటనే చికిత్సకు వెళతారు. యోని లోపల, సెర్విక్సుకు సోకిన విషయం తెలియని వారు అధికంగా నష్టపడుతున్నారు.

### జననాంగాలకు వచ్చే ఇతర ఇన్ఫెక్షనులు

సెక్సు సంపర్కం ద్వారా స్త్రీల జననాంగాలకు సోకగల కొన్ని సుఖరోగాలను గురించి ఇంతవరకూ చూచాం. ఇపుడు వాటికి రాగల ఇతర రకాల ఇన్ఫెక్షన్లను గురించి తెలుసుకొందాం. ఏదయినా బాక్టీరియా వల్ల గాని, లేదా మరే ఇతర కారణాల వల్ల గాని వాపు వస్తూండటం ఈ వర్గపు ఇన్ఫెక్షన్ల లక్షణం. ఇవి సెక్సు సంపర్కం ద్వారా గాని, మరొక మార్గం గుండా గాని స్త్రీకి సోకే అవకాశాలుంటాయి. ఈ రోగాలు సోకటం వల్ల జననాంగ ఆరోగ్యం చెడుతుంది. వీటిని, వీలయినంత త్వరగా చికిత్స చేయించుకొని నివారించుకోవటం అవసరం. లేకపోతే అవి ముదురుతాయి. ఇందువల్ల యోని కాన్సరు రావచ్చు; లేదా హెచ్ఐవి కూడా

సోకే ప్రమాదముంటుంది. ఈ రోగాలకు బ్యాక్టీరియా లేక పరాన్నజీవులు కారణమవుతాయి. తెల్లబట్ట అవుతూండటం ఈ రోగాలకు ప్రధాన సూచన. తెల్లబట్ట అవుతూండటం అనేది భారతీయ స్త్రీలలో అతి సాధారణ విషయంగా తయారైంది. ముఖ్యంగా ఇది సెక్సు సంపర్కంలో పాల్గొనే వయస్సులో కనుపిస్తుంది సెక్సు సంబంధమైన ఆరోగ్యాన్ని సక్రమంగా రక్షించుకోకపోవటం వీటి రాకకు ప్రధాన కారణం. సెక్సు అవయవాల ఆరోగ్య రక్షణావసరం గాని, విధానం గాని తెలియకపోవటం, పరిశుభ్రమైన నీరు వాడుకకు లభించక పోవటం, రుతుస్రావపు కాలంలో పరిశుభ్రమైన గుడ్డలను లేదా పాడ్స్‌ను వాడకపోవటం, వారి భర్తలు లేక సెక్సు భాగస్వాములు జననాంగ పారిశుధ్యాన్ని పాటించకపోవటం వంటివి ఈ రోగాల రాకకు దారితీస్తాయి ఐయుడిలను కుటుంబ నియంత్రణకు వాడటం, అనారోగ్య పరిస్థితులలో గర్భస్రావం చేయించుకోవటం, నిర్ణీత ప్రదేశాలలో బ్యాక్టీరియా మితిమీరి పెరగటం, పోషణాలోపం వంటివి కూడా ఈ రకపు ఇన్ఫెక్షన్ల రాకకు దారితీస్తాయి

జననాంగాలలో వాపును గలిగించే రోగాలలో ట్రైకోమొనియాసిస్, కాండిడయసిస్‌లు ముఖ్యమైనవని వైద్య నిపుణులు సూచిస్తున్నారు. మొదటిది సెక్సు సంపర్కం ద్వారా వస్తుంది. రెండవది సాధారణంగా సెక్సు సంపర్కం ద్వారా వచ్చేది గాదని వైద్యుల అభిప్రాయం.

ట్రైకోమొనియాసిస్ :- ఒక పరిశీలనలో కొందరు పరిశోధకులు, 1988లో మన దేశంలోని ఒక వైద్యశాలకు చెందిన గైనకాలజీ, సుఖరోగ విభాగాలకు వస్తున్న రోగుల కేసులను పరిశీలించారు స్త్రీ రోగులలో తెల్లబట్ట అవుతూండటానికి ట్రైకోమొనియాసిస్, కాండిడయసిస్‌లు ప్రధాన కారణాలుగా వీరు గుర్తించారు. ఈ రోగులలోని సగం మందిలో రోగ సూచనలు బయటకు కనుపించ లేదు! పదమూడు శాతం మందిలో ఈ రెండు ఇన్ఫెక్షన్లూ ఉన్నాయి రోగులలో కనుపించిన రోగలక్షణాలలో అధిక వైవిధ్యం ఉన్నది. కొందరిలో రోగతీవ్రత తక్కువగా ఉంటే, మరి కొందరిలో రోగం ముదిరి ఉండటం కనుపించింది. కొందరకు ఇన్ఫెక్షన్ ఇటీవలె సోకి ఉంటే మరి కొందరిలో చాలా కాలంగా రోగం ఉన్నది. స్త్రీ కవుతున్న బట్టను (డిశ్చార్జిని) మాత్రమే పరిగణనకు తీసుకోవటంతో పాటు, ఆ అభాగిని యొక్క సాంఘిక జీవన స్థితిగతులను కూడ పరిశీలించాలి: అపుడే ఆవిడ బాధకు కారణాలు గోచరిస్తాయని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు

మనదేశంలోని చూలాంద్రలో ట్రైకోమొనియాసిస్ ఇన్ఫెక్షన్ ఉండటం అతి సాధారణమైంది ఈ రోగాన్ని చికిత్సతో నివారించకపోతే, నెలలు నిండకుండానే కాన్పు కావచ్చు; లేదా పుట్టిన బిడ్డ బరువు ఉండవలసిన దానికంటే తక్కువగా ఉండ వచ్చు. కాన్పు కాలంలో ఈ రోగం పుట్టే బిడ్డకు రావచ్చు బిడ్డకు పురుటిలోనే న్యుమోనియా రావటానికి కూడా ఈ రోగపు అంటు కారణం కావచ్చునని వైద్యులు సూచిస్తున్నారు సిఫిలిస్ రోగపు అంటు ఉన్నవారిలో చాలామందికి, ట్రైకోమొనియాసిస్ రోగం కూడా ఉన్నట్లు, సుఖరోగ వైద్యశాలకు వస్తున్న రోగుల పరిశీలనలో ధృవపడింది

ట్రైకోమొనియాసిస్, ట్రైకోమొనాస్ వెజినాలిస్ అనే ఏకకణ జీవి వల్ల స్త్రీల యోనికి, మూత్ర విసర్జనానాళం లోపల సోకుతుంది. ఇది సెక్సు సంపర్కం ద్వారా ఒకరి నుండి మరొకరికి వస్తుంది కాని పురుషులలో రోగచిహ్నాలు, అరుదుగా మాత్రమే కనుపిస్తాయి. సంతానవతులు కాగల వయస్సులోని స్త్రీలలో నూరింట ఇరవై మందిలో ఎపుడో ఒకసారి ఇది కనుపిస్తూ ఉంటుందని నిపుణులు సూచించారు ఈ ఇన్ఫెక్షన్ సోకిన స్త్రీ యోని నుండి, కొంచెం ఆకుపచ్చ ఛాయ కలిగిన పసుపురంగు బట్ట అవుతూ ఉంటుంది. కొందరిలో ఇది అతి కొద్దిగానే అవుతూండవచ్చు. జననాంగ వెలుపలి భాగంలో దురదగాను, మంటగాను ఉంటుంది. సెక్సు సంపర్క సందర్భంలో బాధ కలుగవచ్చు. రోగ తీవ్రత అధికంగా ఉన్నవారిలో మర్మాంగమంతా వాచి ఉంటుంది; మూత్ర విసర్జనకాలంలో బాధ కలుగుతుంది; తరచూ మూత్రవిసర్జనావసరం ఉంటుంది మూత్రకోశానికి ఇన్ఫెక్షన్ సోకిందా అన్న అనుమానం కలుగువచ్చు.

పురుషులలో రోగచిహ్నాలు కనుపించనపుడు, తమకు తెలియకుండానే, వారికున్న రోగాన్ని, వారి సెక్సు భాగస్వాములకు సంక్రమింపజేసే అవకాశాలుంటాయి. ఇందువల్ల ఈ ఇన్ఫెక్షన్ స్త్రీల నుండి పురుషుల కంటే, పురుషుల నుండి స్త్రీలకు సోకటం అధికంగా ఉంటున్నది.

పురుషుల నుండి స్త్రీలకు కాండిడయసిస్ సోకే అవకాశాలు 50 శాతము, ట్రైకోమొనియాసిస్ సోకే అవకాశాలు 60 శాతము, క్లమీడియా సోకే అవకాశాలు 55 శాతము అధికంగా ఉన్నట్లు అంచనా వేస్తున్నారు కండోమ్‌ల వాడుక ద్వారా రోగవ్యాప్తిని నిరోధించే అవకాశాలు అధికంగా ఉన్నాయి.

మనదేశంలో జరిగిన ఒక సర్వే ప్రకారం, ట్రైకో మొనియాసిస్, కాండిడయసిస్‌లు రెండూ ఉన్న స్త్రీల నుండి, వారి పురుష సెక్సు భాగస్వాములలో, కండోమ్‌లను వాడిన వారిలో 14.6 శాతం మందికి మాత్రమే ఇన్ఫెక్షన్ సోకింది; ఇలా కండోమ్ లను వాడని పురుషులలో 86 శాతం మందికి ఇన్ఫెక్షను వచ్చింది. పురుషుల కండోమ్‌ల వాడుక వల్ల స్త్రీల నుండి వారికి ఈ రోగాలు రాకుండా ఉండటమే గాక, వారికున్నపుడివి స్త్రీలకు సోకకుండా కూడా ఉంటాయి దీన్ని ఇద్దరకూ మేలు జరిగే మార్గంగా గుర్తించటం మంచిది. ఇందులో పురుషుల తోడ్పాటు అతి ముఖ్యమైనది.

జెనిటల్ కాండిడయసిస్ :- జెనిటల్ కాండిడయసిస్ అనేది ఫంగస్ (ఈస్ట్) ఇన్ఫెక్షన్ ఇది స్త్రీ యోనికి సోకుతుంది. దీనిని "త్రష్" అని కూడా అంటారు. ఈ యీస్టు శరీరం మీదా, ప్రేవుల్లో సహజంగా ఉంటుంది. ఈ ప్రాంతాల నుండి ఇది జననాంగాలకు ప్రాకవచ్చు. ఇది సాధారణంగా సెక్సు సంపర్కం ద్వారా రాదు. కాండిడయసిస్ మూలంగా వెజైనైటిస్ వస్తుంది. ఏంటిబయోటిక్ మందులను అతిగా వాడటం, కుటుంబనియంత్రణకు తినే మాత్రల వాడకం, ఇతర కొన్ని రకాల మందుల వాడకం వల్ల, యోనిలోని సహజ పరిస్థితులలో మార్పు వస్తుంది. ఈ మార్పు కాండిడయసిస్ యీస్టు పెరుగుదలకు అనుకూలంగా ఉంటుంది. రుతుక్రమం ఆగని వారిలోనూ, చూలాంద్రలోనూ, డయాబెటిస్ రోగులలో కాండిడయసిస్ సాధారణంగా కనుపిస్తూ ఉంటుంది.

ఇది సోకిన వారికి, యోనిలోనూ, దాని ముందు భాగంలోనూ దురదగానూ, అసౌకర్యం గాను ఉంటుంది. యోని నుండి డిశ్చార్జి కూడా ఉంటుంది. యోని వెలుపలి భాగం, దాని పరిసరాలు కంది వాయవచ్చు. చర్మం బిరుసెక్కి చిట్లవచ్చు

వెజైనైటిస్, వల్వైటిస్ :- యోని లోపలి పొర మీద వాపు రావటాన్ని వెజైనైటిస్ అని, మర్మాంగపు వెలుపలి భాగం మీద (వల్వా మీద) వాపు రావటాన్ని వల్వైటిస్ అని అంటారు. యోని, వల్వాలు రెండూ వాచిన పరిస్థితిలో దాన్ని వల్వోవెజైనైటిస్ అని అంటున్నారు.

ఈ పరిణామాలు సంభవించినపుడు యోని నుండి డిశ్చార్జి అవుతూంటుంది. దీనికి ఇన్ఫెక్షను కారణం గావచ్చు. కణుతులు ఏర్పడటం, కణాలు అధికంగా పెరుగుతూండడం, హార్మోనల్ మార్పులు, రేడియేషన్ థెరపీ, కొన్ని రకాల మందుల వాడకం ఇత్యాదులు ఈ పరిస్థితులకు దారితీస్తాయి. జననాంగాల పారిశుధ్యాన్ని పాటించకపోవటం వల్ల బాక్టీరియా గాని, ఫంగస్ గాని పెరుగవచ్చు ఫిశ్చులా ఉన్నవారికి వెజైనైటిస్ వచ్చే అవకాశాలున్నాయి.

యోని నుండి డిశ్చార్జి అవుతూండటం, వీటి రాకకు సూచన డిశ్చార్జి అధికంగా ఉండే అవకాశాలున్నాయి. దీనికి దుర్గంధం ఉంటుంది, ఆకుపచ్చ ఛాయ ఉన్న పసుపురంగు ఉండవచ్చు. కొన్ని సందర్భాలలో రక్తపుఛాయ కూడా ఉండవచ్చు.

స్త్రీలో రోగనిగ్రహశక్తి తగ్గటం వల్ల కూడా ఈ రోగాలు రావచ్చునని వైద్య పరిశీలనలు వెల్లడిస్తున్నాయి. 1990వ సంవత్సరంలో ఒక సుఖరోగ వైద్యశాలకు వచ్చిన పేషెంట్ల మీద జరిగిన పరిశీలన ఈ అంశాన్ని ధృవపరచింది. తెల్లబట్టతో వచ్చిన వారిలో నూరింట యాభైమందికి ఇదే కారణంగా కనుపించింది. జననాంగపు వాపు కనుపించటం అనేది అతి సాధారణాంశమైంది. బెంగాలులో జరిగిన సామూహిక పరీక్షలలో, పరీక్షకు వచ్చిన స్త్రీలలో నూరింట 77మందిలో తెల్లబట్ట, పొత్తికడుపులో నొప్పి, నడుము నొప్పి ఉండటాన్ని పరిశీలకులు గమనించారు. వైద్య పరీక్షలలో ఇలాంటి రోగులలో నూరింట 60 మందిలో జననాంగాల వాపుండటం కనుపించింది. మరొక వైద్య చికిత్సా కేంద్రంలో జరిపిన పరిశీలనలో కూడా ఇటువంటి ఫలితాలే కనుపించాయి. ఇచ్చట జరిగిన పరీక్షల్లో, నూరింట 27 మంది ఆరోగ్యంగా ఉన్నారు. మిగిలిన 73 మందిలోనూ ఏదో ఒక రకమైన వాపు జననాంగంలో ఉండటం కనుపించింది. రాణీ బాంగ్ ప్రభృతుల మహారాష్ట్రలోని రెండు జిల్లాలకు చెందిన గ్రామీణ సామూహిక పరిశీలనలను గురించి ఇంతకు పూర్వమే ప్రస్తావించాం.

పరీక్షలకు వచ్చిన స్త్రీలలో నూరింట 92 మందిలో ఏదో ఒక జననాంగ రోగమున్నట్లు లేబొరెటరీ పరీక్షలు నిర్ధారణ చేశాయి. అంతేకాదు, ఒక్కొక్క స్త్రీకి సగటున 3 6 రోగాలున్నాయట! ఈ రోగాలు కాక, నూరింట 62 మందిలో బాక్టీరియల్ వెజైనైటిస్ ఉన్నట్లు తేలింది; ఇరవై నాలుగు మందిలో ఏదో ఒక రకమైన పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్, 14మందిలో ట్రైకోమొనియాసిస్ ఉన్నట్లు రుజువైంది!

ఐయుడి :- ఐయుడి ని (ఇంట్రా యుటరీన్ డివైజ్) గర్భ నిరోధక సాధనంగా వాడిన వారిలో కూడా యోని వాపు వస్తుంది. ఈ సాధనాన్ని వేయించుకొన్న స్త్రీలలో నూరింట 30 నుండి 54 మందిలో, దాన్ని వేయించుకొన్న తర్వాత తొమ్మిది మాసాల కాలంలో వాపు కనిపించటాన్ని పరీక్షలు ధృవపరచాయి. దీని ధారణాకాలం ఎంత అధికంగా ఉంటే, వారి రోగతీవ్రత కూడా అంతగా పెరుగుతున్నది.

ఒక్క సంవత్సరం ఐయుడిని వాడిన వారిలో నూరింట 63 మందికి వాపు తీవ్రస్థాయికి చేరినట్లు కొన్ని పరిశీలనలు వెల్లడించాయి. దీనిని వేయించుకొన్న వారిలో నూరింట 70 మంది, తెల్లబట్ట కావటం ప్రారంభమైన కారణం వల్ల గాని, రుతు క్రమం తప్పటం, నడుమునొప్పి వస్తూండటం వల్లగాని, దీనిని తీసివేయించుకొన్నట్లు మరొక పరిశీలనలో తేలింది. ఈ బాధలకు తట్టుకోలేక, వాటికి నివారణా మార్గాలను సూచించగల దిక్కులేక, స్త్రీలు ఐయుడి వాడకాన్ని వ్యతిరేకిస్తున్నారు. మన దేశంలో సాలుకు యాభై లక్షల మంది వరకూ వీటిని వేయించు కొంటున్నట్లు ప్రభుత్వ అంచనాలు తెలుపుతున్నాయి. దీనిని బట్టి సంభవించగల దుష్ఫలితపు పరిమాణాన్ని ఊహించవచ్చు.

గర్భస్రావం :- కుటుంబ నియంత్రణకు వాడుకలో నున్న మరొక మార్గం గర్భస్రావం. ఇది అనాగరిక పరిస్థితులలో జరిగినపుడు వాపును తేగల రోగాలకు దారితీస్తున్నది. స్త్రీల జననాంగ ఆరోగ్యాన్ని చెడగొట్టి జీవితాంతం బాధితలనుగా చేస్తున్నది; కొన్ని సందర్భాలలో అకాల మరణాలకు కూడా దారి తీస్తున్నది. గుట్టుగా జరిగే గర్భస్రావాలలో అత్యధిక భాగం, ప్రమాదకరంగా పరిణమిస్తున్నాయి. గర్భస్రావం చేయించుకొన్నవారి జననాంగాలు దెబ్బతినటం, సెప్సిస్ రావటం వంటి ప్రమాదాలు అతి సామాన్య మైనాయి మూలాంద్రు, బాలింతల మరణాలలో గర్భస్రావపు మరణాలు నూరింట 75 వంతుల వరకూ ఉంటున్నట్లు కూడా కొందరు అంచనా వేస్తున్నారు. గర్భస్రావాన్ని నిపుణులతో, ఆరోగ్యప్రదమైన పరిసరాలలో చేయించుకోకపోవటం వల్ల ఇలాంటి అవాంఛనీయ పరిణామాలు సంభవిస్తున్నాయి. ఇందుకు వసతులు తగినంతగా లేకపోవటం, పేషంట్ల ఆర్థిక పరిస్థితులు, వారి సాంఘిక జీవన స్థితిగతులు కారణమవు తున్నాయి. ఈ విషయాలేమైనా, జననాంగ సంబంధమైన రోగాల పెంపుకు, అనాగరిక పద్ధతిలో జరిగే గర్భస్రావాలు విరివిగా తోడ్పడుతున్నాయనటంలో అతిశయోక్తి లేదు.

సుఖరోగాలు, స్త్రీలకు ఎంత ప్రమాదకారులో ఎలా అవి వారికి సంక్రమిస్తున్నాయో చూచాం. ఎయిడ్స్‌తో సహా పలు సుఖ రోగాలు, స్త్రీల నుండి పురుషుల కంటే, పురుషుల నుండి స్త్రీలకు సంక్రమించటం అధికంగా ఉన్నట్లు చూచాం. బాక్టీరియా వల్ల గాని, వైరసు వల్ల గాని వచ్చే సుఖరోగాల వల్ల, పురుషుల కంటే స్త్రీలు అధికబాధలకు లోనవుతున్నారు. ఈ రోగాలు సోకటం వల్ల, గర్భధారణ శక్తి పోతున్నది; పిండం గర్భసంచిలో కాకుండా ఇతర చోట్ల ఏర్పడే అవకాశాలున్నాయి; గర్భస్రావం జరుగవచ్చు; నెలలు నిండకుండానే కనవలసి రావచ్చు; పుట్టే బిడ్డ బరువు ఉండవలసిన దానికంటే తక్కువ వుండవచ్చు; పుట్టే బిడ్డకు తల్లికున్న రోగం అంటవచ్చు. పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ రోగాలు రావచ్చు; గర్భసంచికి కాన్సరు వచ్చే అవకాశాలు కూడా ఉంటాయి. వీటి వల్ల ఆవిడ బహుముఖంగా నష్టపోతున్నది; కొన్ని సందర్భాలలో జీవితాంతం అనారోగ్యంతో బాధపడవలసి కూడా వస్తుంది. పురుషునకున్న రోగం తనకు రాకుండా ఉండటానికి అతనితో కండోమ్‌ను వాడించగల శక్తి స్త్రీకి లేదు. భర్త నుండి రోగం సంక్రమించే అవకాశాలున్నట్లు తెలిసినా, సెక్సు సంపర్కాన్ని నిరాకరించే అధికారం గాని, శక్తిగాని స్త్రీకి లేదు. ఎట్టి పరిస్థితుల లోనూ, పురుషుని కోరికకు ఎదురుచెప్పే అవకాశాలు ఉండటం లేదు. సంతానం కనవలసిన బాధ్యత ఉన్నందువల్ల స్త్రీకి కాన్పులు,

## ఒకటవ పట్టిక
## పూనాలోని సుఖరోగ చికిత్సా కేంద్రాలకు వస్తున్న సెక్సు వర్కర్లు, సెక్సు వర్కర్లు కాని స్త్రీల జీవన, ప్రవర్తనా స్వభావాలు

| వ్యక్తుల వివరాలు | సెక్సు వర్కర్లు | | సెక్సువర్కర్లు కానివారు | |
|---|---|---|---|---|
| | సంఖ్య | శాతము | సంఖ్య | శాతము |
| సర్వేలో పాల్గొన్న మొత్తం స్త్రీలు | 525 | 100 | 391 | 100 |
| **వారి వయస్సు** | | | | |
| 20 సం॥ల లోపువారు | 35 | 6.7 | 93 | 23.8 |
| 20-29 సం॥ల వారు | 294 | 56.0 | 207 | 52.9 |
| 30 సం॥లకు పైబడినవారు | 196 | 37.3 | 91 | 23.3 |
| **విద్యాస్థాయి** | | | | |
| చదువు రానివారు | 411 | 78.3 | 151 | 38.6 |
| సెకండరీ స్థాయి | 90 | 17.1 | 164 | 41.9 |
| ఉన్నతవిద్య నభ్యసించినవారు | 24 | 4.6 | 76 | 19.4 |
| **వైవాహిక స్థితి** | | | | |
| అవివాహితలు | 208 | 39.6 | 6 | 1.5 |
| వివాహితలు | 162 | 30.9 | 365 | 93.4 |
| వితంతువులు/ విడాకులు పొందినవారు | 155 | 29.5 | 20 | 5.1 |
| కుటుంబాలతో జీవిస్తున్నవారు | 70 | 13.3 | 37.1 | 94.9 |
| ప్రస్తుతం వేతవార్జనలో ఉన్నవారు | 518 | 98.7 | 150 | 38.4 |

| వ్యక్తుల వివరాలు | సెక్సు వర్కర్లు | | సెక్సువర్కర్లు కానివారు | |
|---|---|---|---|---|
| | సంఖ్య | శాతము | సంఖ్య | శాతము |
| సెక్సుపార్ట్నర్ల సంఖ్య | | | | |
| ఒకరు | 4 | 0.8 | 360 | 92.1 |
| 2 నుండి 9 వరకు | 9 | 1.7 | 29 | 7.4 |
| 10 నుండి 99 వరకు | 18 | 3.4 | 2 | 0.5 |
| 100 నుండి 999 వరకు | 88 | 16.8 | 0 | 0.0 |
| 1000 కి మించి | 406 | 77.3 | 0 | 0.0 |
| గత 3 మాసాలలో వారి సెక్సుపార్ట్నర్ల సంఖ్య | | | | |
| ఎవరూ లేరు | 17 | 3.2 | 38 | 9.7 |
| ఒక్కరు మాత్రం | 16 | 3.1 | 347 | 88.8 |
| ఇద్దరకు మించి | 492 | 93.7 | 6 | 1.5 |
| ప్రస్తుతం గర్భవతులు | 25 | 5.0 | 61 | 16.2 |
| ప్రస్తుతం కుటుంబ నియంత్రణా విధానాలను పాటిస్తున్నవారు | 299 | 57.3 | 131 | 33.5 |
| గత 3 మాసాలలో కండోమ్ వాడుక | | | | |
| అసలు వాడని వారు | 85 | 16.8 | 322 | 91.5 |
| అప్పుడప్పుడు వాడుక | 304 | 60.0 | 25 | 7.1 |
| నిత్యవాడుక | 118 | 23.3 | 5 | 1.4 |
| ప్రస్తుతం పొగతాగే అలవాటు | 118 | 22.5 | 49 | 12.6 |

గమనిక :- డబ్బుకు సెక్సును అమ్ముకొనే వారిని 'సెక్సువర్కర్లు' గాను, డబ్బు తీసుకొనని వారిని 'సెక్సు వర్కర్లు కాని వారుగాను' (నాన్-సెక్స్ వర్కర్లుగాను) వర్గీకరించారు.

*– అమెరికన్ మెడికల్ అసోసియేషన్ వారి వారపత్రిక "జమా" 1997 డిశంబరు 17వ తేదీ సంచిక నుండి*

### రెండవ పట్టిక

### పూనాలోని సుఖరోగచికిత్సా కేంద్రాలకు వస్తున్న సెక్సువర్కర్లు, సెక్సు వర్కర్లు కాని స్త్రీలకు సోకిన సుఖరోగాలు, ఆ రోగాల స్వభావము ఆయా రోగాలను అనుభవిస్తున్న స్త్రీలు.

| ఆయా రోగాలను అనుభవిస్తున్న వ్యక్తుల వివరాలు | సెక్సు వర్కర్లలో ఆయా రోగాలున్న స్త్రీలు | | సెక్సువర్కర్లు కానివారిలో ఆయా రోగాలున్న స్త్రీలు | |
|---|---|---|---|---|
| | సంఖ్య | శాతము | సంఖ్య | శాతము |
| జననాంగాలకు అల్సర్లను కలుగజేసే రోగాలు గాని సెర్విసైటిస్ లేదా వెజైనైటిస్ లేనివారు | 301 | 57 3 | 137 | 35 0 |
| ఈ రోగాలలో ఒకటిమించి ఉన్నవారు | 224 | 42 7 | 254 | 64.9 |
| సెర్విసైటిస్ | 64 | 12 2 | 56 | 14 3 |
| గనోరియా | 53 | 10 1 | 52 | 13 3 |
| వెజైనైటిస్ | 101 | 19 2 | 100 | 25 6 |
| జెనిటల్ అల్సర్ డిసీజ్ | 102 | 19 4 | 159 | 40 7 |
| షంక్రాయిడ్ | 60 | 11.4 | 80 | 20 5 |
| సిఫిలిస్ | 29 | 5.5 | 59 | 15 1 |
| హెర్పిస్ | 9 | 1.7 | 26 | 6.7 |

| ఆయా రోగాలను అనుభవిస్తున్న వ్యక్తుల వివరాలు | సెక్సు వర్కర్లలో ఆయా రోగాలున్న స్త్రీలు | | సెక్సువర్కర్లు కానివారిలో ఆయా రోగాలున్న స్త్రీలు | |
|---|---|---|---|---|
| | సంఖ్య | శాతము | సంఖ్య | శాతము |
| పెల్విక్ ఇన్‌ఫ్లమేటరీ డిసీజ్ | 75 | 14 3 | 20 | 5 1 |
| జెనిటల్ వార్ట్స్ | 11 | 2 1 | 16 | 14.1 |
| జీవితకాలంలో ఏ సుఖరోగమయినా సోకినవారు | 312 | 60 0 | 139 | 35.6 |
| జీవితకాలంలో ఒక్కసారయినా అల్సర్లను కలుగజేయగల రోగాలు సోకినవారు | 248 | 47 8 | 116 | 29 7 |
| జీవితంలో ఎపుడయినా తెల్లబట్ట లేక ఎర్రబట్ట అయినవారు | 184 | 35.4 | 73 | 18.7 |
| జీవితంలో ఎపుడయినా జెనిటల్ వార్ట్స్ సోకినవారు | 11 | 2 1 | 5 | 1 3 |
| సుఖరోగులయిన సెక్సు పార్ట్‌నర్స్ ఉన్నవారు | 13 | 2 5 | 44 | 11.3 |
| పరిశీలనకు ఎన్నుకొన్న స్త్రీ సుఖరోగుల సంఖ్య | 525 | | 391 | |

గమనిక :- డబ్బుకు సెక్సును అమ్ముకొనేవారిని 'సెక్సువర్కర్లు'గాను, డబ్బు తీసుకోనివారిని సెక్సువర్కర్లు కానివారుగాను వర్గీకరించారు.

*- జర్నల్ ఆఫ్ అమెరికన్ మెడికల్ అసోసియేషన్ (జమా) 1997వ సంవత్సరం డిశెంబరు 17వ తేదీ సంచిక నుండి*

గర్భస్రావాల వల్ల పలురకాల అనారోగ్యం వస్తున్నది. ఇది చాలదన్నట్లు జననాంగాలకు రోగాలు రాగల ప్రమాదం ఉండనే ఉన్నది.

### అంతరించవలసిన పురుషుల సెక్సు విశృంఖలత్వం

స్త్రీ కన్యాత్వానికి మన సమాజం అధిక విలువ నిస్తున్నది. దీన్ని కాపాడటానికే యుక్తవయస్సు రాకపోయినా ఆడపిల్లలకు పెండ్లిండ్లు చేసి తమ భారాన్ని తల్లిదండ్రులు దింపుకోవటానికి తాపత్రయపడుతున్నారు. భర్త యొక్క ఏకపత్నీవ్రతము, భర్త, అత్తమామల రక్షణ ఆవిడకు పెట్టని కోటలుగా ఉంటాయని ఆ ఇల్లాలు భ్రమిస్తుంది. ఆ కోటలోనే ఆవిడను సుఖరోగాలు చుట్టుముడుతున్నాయి. ఇందుకు 'అయినవారే' కారకులవుతున్నారు. పురుషులు, వివాహానికి

పూర్వం, తరువాత, సుఖరోగ నిరోధక మార్గాలను అవలంబించకుండా పరస్త్రీ సంపర్కానికి పాల్పడుతున్నారు. వారు తెచ్చే రోగాలు వారి ఇల్లాండ్రకు సంక్రమిస్తున్నాయి.

ఈ అంశాలనిపుడు సంఖ్యా పరిమాణ రూపంలో చూద్దాం. పూనాలోని రెండు సుఖరోగ చికిత్సా కేంద్రాలలో 1993-1996 సంవత్సరాల మధ్య కాలంలో జరిగిన సర్వేను గురించి ఇంతకు ముందే ప్రస్తావించాం. ఈ పరిశీలకులు 525 మంది సెక్సు వర్కర్లను, 391 మంది సెక్సు వర్కర్లు కానివారిని సర్వేకు ఎన్నుకొన్నారు. సొమ్ముకు సెక్సును అమ్ముకొనే వారిని "సెక్సు వర్కర్లు" గాను, సెక్సుకు సొమ్ము తీసుకోని వారిని "సెక్సు వర్కర్లు కానివారు" గానూ సర్వేయర్లు పరిగణించారు వారి సాధారణ జీవితానికి, సెక్సు జీవితానికి సంబంధించిన వివరాలు మొదటి పట్టికలో ఉన్నాయి. సర్వేయర్లు పరిశీలనకు ఎన్నుకొన్న, "సెక్సు వర్కర్లు కాని వారిలో" నాల్గింట మూడు వంతుల మంది 30 సంవత్సరాల వయస్సు లోపువారే ఉన్నారు. వీరిలో నూరింట 89 మంది ఒకే పురుషునితో "కాపురం" చేస్తున్నారు. దాదాపు సగం మంది సెకండరీ విద్యాస్థాయి వరకూ చదువుకొన్నారు.

సెక్సు వర్కర్లు, సెక్సు వర్కర్లు కాని వారిలో ఎంత మందికి ఏయే సుఖరోగాలున్నాయో, రెండవ పట్టిక సూచిస్తున్నది. జననాంగాలకు అల్సర్లను (పుండ్లను) కలుగజేసే రోగాలు, సెర్విసైటిస్, వెజైనైటిస్‌లో ఒకటికి మించి ఉన్నవారు సెక్సు వర్కర్లలో 42.7 శాతం మంది ఉంటే, ఒకే పురుషునితో జీవిస్తున్న "సంసారులు" అనదగిన సెక్సు వర్కర్లు కాని వారిలో 64.9 శాతం మంది ఉన్నారు. సెక్సువర్కర్లలో జననాంగానికి అల్సర్లు కలుగ జేయగల రోగమున్నవారు 19.4 శాతం మంది ఉండగా, "సంసారుల"లో 40.7 శాతం మంది ఉన్నారు! రోగాలవారీగా పరిశీలిస్తే, సెక్సువర్కర్లలో కంటే సంసారులలోనే అధికులకు సెక్సు రోగాలు ఉన్న విషయం స్పష్టమవుతున్నది. "సంసారుల"లో జీవితకాలంలో ఒక్క సారయినా సుఖరోగం సోకినవారు 35.6 శాతం మంది, ఒక్కసారయినా అల్సర్లను కలిగించే సుఖరోగం సోకినవారు 29.7 శాతం మంది ఉన్నారు! రెండవ పట్టికలోని రోగుల వివరాలను పరిశీలించి చూస్తే, మానాన్ని అమ్ముకొని బ్రతుకుతున్న సెక్సు వర్కర్ల కంటే, ఒక్కరితో "కాపురం" చేస్తున్న సెక్సువర్కర్లు కాని "సంసారుల" జీవితం మెరుగ్గా లేదనిపిస్తుంది!

> **"కాబోయే వధూవరులు ఎయిడ్స్ రోగ నిర్ణయ పరీక్షలను చేయించుకోవటం ఉచితం"**
>
> ఎయిడ్స్ రోగం అధికంగా వ్యాపిస్తున్న జిల్లాలలో తూర్పు గోదావరి కూడా ఒకటి. రాజమండ్రిలోని ఒక మల్టీ స్పెషాలిటీస్ హాస్పిటల్‌కు రోజూ వందలాది రోగులు చికిత్సకు వస్తూంటారు.
>
> ఈ రోగులలో, ఎయిడ్స్ రోగమున్నవారిని రోజుకు ఇద్దరి నయినా తాము గుర్తించగలుగుతున్నట్లు, ఈ హాస్పిటల్ అధినేత డాక్టర్ గన్ని భాస్కర్ చెప్పారు. ఎయిడ్స్ రోగం ఆటంబాంబు కంటే ప్రమాదకరమైనదని వర్ణిస్తూ, కాబోయే వధూవరులు, వివాహం జరగటానికి ముందే, ఎయిడ్స్ రోగ నిర్ణయ పరీక్షలను, విధిగా చేయించుకోవటం మంచిదని వీరు సూచించారు.
>
> అవివాహితలు, ఇటీవలే పెండ్లయిన యువతులు అధిక సంఖ్యలో తమ వైద్యశాలకు గర్భవిచ్ఛిత్తికి వస్తున్నారనీ వీరిలో అధికులకు హెచ్‌ఐవి సోకిన రుజువులు కనుపించటం ఆందోళన కరంగా ఉన్నదని వైద్యశాల అధినేత చెప్పారు. ఈ పరిణామాన్ని అత్యంత భాధాకరమైన విషయంగా వారు వర్ణించారు.
>
> *- హిందూ దినపత్రిక 1-12-1998న ప్రచురించిన రాజమండ్రి రిపోర్టర్ రిపోర్టు నుండి*

ఈ అంశం మీద సర్వేయర్ల విశ్లేషణ గమనించదగినదిగా ఉన్నది : "స్త్రీ పురుషులు తమ సెక్సు ప్రవర్తనను గురించి మాట్లాడు కోవటాన్ని భారతీయ సంస్కృతి ప్రోత్సహించటం లేదు. వివాహానంతరం, ఏకపత్నీత్వాన్నీ, ఏకభర్తృత్వాన్నీ మన సంస్కృతి నిర్దేశిస్తున్నది; స్త్రీపురుషులు వివాహానంతరం పరులతోడి సెక్సు సంబంధాలను పెట్టుకోవటాన్ని నిషేధిస్తున్నది. వివాహం జరిగేంత వరకూ కన్యాత్వాన్ని స్త్రీ కాపాడుకోవాలని కూడా మన సంస్కృతి నిర్దేశిస్తున్నది. కండోమ్‌ల వాడుకను

గురించి గాని, సెక్సు భాగ స్వాముల సంఖ్యను పరిమితం చేసుకోవటాన్ని గురించి గాని పురుషులతో చర్చించే అవకాశాలు స్త్రీలకు అత్యల్పంగా ఉన్నాయి ఈ విషయపు అంచనాలకు తగినంత సమాచారం లభించటం లేదు అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఇప్పటి పరిస్థితి ఇది! సెక్సు వర్కర్లు కానివారు సెక్సుకు సంబంధించిన వివరాలను చెప్పటానికి ఇష్టపడరు మేము తీసుకొనిన శాంపుల్స్‌లో సెక్సు వర్కర్లు 525 మంది ఉండగా, సెక్సు వర్కర్లు కానివారు అందులో సగం మేరకుండటమే ఇందుకు నిదర్శనం నగరాల శివార్లలో నివసిస్తూ, పలువురు పరస్త్రీల తోడి సెక్సు సంబంధాలున్న భర్తలతో కాపురం చేస్తున్న అల్పాదాయ వర్గాలకు చెందిన స్త్రీలకు ప్రతినిధులుగా, "మేము సెక్సు వర్కర్లం కాదు" అని చెప్పుకొన్న మా శాంపుల్‌లోని స్త్రీలు కనిపిస్తున్నారు." (జర్నల్ ఆఫ్ అమెరికన్ మెడికల్ అసోసియేషన్ వారపత్రిక "జమ" 1997వ సంవత్సరం డిశంబరు 17వ తేదీ సంచిక)

ఈ వ్యాఖ్యలో కొండంత సత్యమున్నది ఈ విధంగా తనను భయకంపితను చేస్తున్న సుఖరోగాలకు, జననాంగ ఇన్ఫెక్షన్లకూ, భర్త బాధ్యతా రహిత సెక్సు ప్రవర్తనకూ, అధికార దర్పానికీ మధ్య, అడకత్తెరలోని పోకచెక్కవలె ఇల్లాలు నలిగి పోతున్నది. ఈ సర్వే నగర శివార్లలో నివసిస్తున్న అల్పాదాయ వర్గాల వారి పరిస్థితులకు సూచికగా పరిశోధకులు చెప్పారు సంపన్నవర్గాల వారి పరిస్థితి ఎలా ఉన్నది? అశేష ప్రజానీకం నివసిస్తున్న గ్రామీణ ప్రాంత పరిస్థితి ఏమిటి? ఈ విషయాల మీద మనకు సామూహిక సర్వేల ఫలితాలు ఏవీ అందుబాటులో లేవు. రాణీ బాంగ్ ప్రభృతులు, తాము మహారాష్ట్రలోని గిరిజన ప్రాంతంలో సామూహిక పరీక్షలను నిర్వహించి ఫలితాలను 1989వ సంవత్సరంలో "హై ప్రివలెన్స్ ఆఫ్ గైనొకలాజికల్ డిసీజెస్ ఇన్ రూరల్ ఇండియా" అన్న పేరిట ప్రచురించిన వ్యాసంలో వివరించారు. ఈ వ్యాసం పేరులో "రూరల్ ఇండియా" అని ఉన్నా, అది గిరిజన ప్రాంతంలో జరిగిన సర్వే కనుక దాని ఫలితాలు, గ్రామీణ భారతానికి వర్తింపవని అంటున్నారు. పైన మేము పేర్కొన్న పూనా సర్వే గాని, రాణీ బాంగ్ మహారాష్ట్రలో జరిపిన సర్వే గాని అఖిల భారత స్థితికి సంకేతంగా కూడా చెప్పలేము ప్రస్తుత సామాజిక పరిస్థితికివి కొలమానాలు గాకపోయినా, మన సమాజ పురోగమన దిశను చూపుతున్న దిక్సూచిగా ఈ రెండు సర్వేల ఫలితాలను చెప్పవచ్చు.

స్త్రీ, సుఖరోగ పీడన పెరుగుతుండగా, ఇది చాలదన్నట్లు, ప్రభుత్వం కూడా, కుటుంబ నియంత్రణ మేరకే తన బాధ్యతను పరిమితం చేసుకొన్నట్లు కనుపిస్తున్నది. ఐయుడి వంటి కుటుంబ నియంత్రణా సాధనాల వల్ల స్త్రీలకు సంక్రమిస్తున్న అనారోగ్యపు బాధల నివారణా మార్గాలను చూపేవారు ప్రజలకు కనుపించటం లేదు. పైగా వాటి వాడుక వల్ల స్త్రీల జననాంగ ఆరోగ్యం బాగా దెబ్బ తింటూ, ఎయిడ్స్ వంటి రోగాలు సులభంగా రావటానికి దారిదీస్తున్నది స్త్రీకి సమగ్ర ఆరోగ్యరక్షణను ఇవ్వగల వైద్య చికిత్సా కేంద్రాలు మనకు లేవు మనదంతా పాక్షికధోరణి!

సుఖరోగ చికిత్సకు అవకాశాలు ఉన్నంత మేరకయినా సంతృప్తికరంగా లేవు. కొన్ని రోగాల నిర్ధారణకు అవసరమైన సాంకేతిక పరికరాలు, లాబొరెటరీ వసతులు, చివరకు చికిత్సా నిపుణులు కూడా అవసరాలకు తగినంతగా లేకపోవటం గమనించదగిన అంశము. సుఖరోగాలంటే చిలిపి రోగాలన్న అలసత్వం తాండవిస్తున్నది అవి స్త్రీల ఆరోగ్యాన్ని ఎలా నాశనం చేస్తున్నాయో గమనించదగినంత శ్రద్ధగాని, బాధ్యతా ప్రదర్శన గాని సామాజికులలో కనుపించటం లేదు. సామాజికులకే లేని ఆసక్తి, ప్రభుత్వానికి ఉంటుందని ఆశించటం పొరపాటు ములుకోలపోటు పడందే అది కదలదన్నది అందరకూ తెలుసు.

సెక్సురోగాల చికిత్స అధ్యయనానికి కాలానుగతంగా విలువ తగ్గిపోతున్నది. ఏ కోర్సు దొరకని వారికిది ఆశ్రయంగా తయారైంది. బోధనాంశాలలో దీనిమీద చిన్నచూపు కూడా ఉన్నది. చికిత్సా వసతుల కల్పనలో ప్రభుత్వం అనుసరించే అలసత్వం కూడా, ఈ ధోరణికి అనువుగానే ఉన్నది. ఈ పరిస్థితులను నాటు వైద్యులు చక్కగా స్వలాభానికి వినియోగించుకొంటున్నారు. తెలిసీ తెలియని చికిత్సలు చేస్తూ, వీరు పేషెంటుకు మేలు కంటే కీడునే అధికంగా చేస్తున్నారు.

ఎయిడ్స్‌కు కారణమవుతున్న హెచ్ఐవి వ్యాపిస్తున్న కాలంలో, ఇలాంటి పరిస్థితి దేశంలో నెలకొనటాన్ని చూచి, స్త్రీలే కాదు, దేశ శ్రేయోభిలాషులంతా హడలిపోతున్నారు స్త్రీల జననాంగ ఆరోగ్య పరిరక్షణకు సమగ్ర చికిత్సా వసతులను కల్పించవలసిన సమయం మించిపోయింది ఇపుడయినా ప్రభుత్వం ఇందుకు కృషి చేయటం అవసరం.

స్త్రీల ఆరోగ్య రక్షణలో సామాజికులకు బాధ్యత ఉన్న విషయాన్ని మనం మరువకూడదు. సుఖ రోగాలను గురించి, హెచ్ఐవి ని గురించి విశేష విజ్ఞాన ప్రచారం జరగాలి. ముఖ్యంగా పురుషులకు ఈ ప్రచారం అవసరం. స్త్రీల ఆరోగ్యం చెడటానికి, తమ బాధ్యతెంతో గుర్తించటానికి వారు ఆత్మ పరిశీలన చేసుకోవాలి. స్త్రీల జననాంగ ఆరోగ్యానికి రక్షణ, పురుషుల (భర్తల) సహకారం లేకుండా లభించదు.

పుట్టినప్పటి నుండి, జీవితంలోని పలు దశలలో ఎదురవుతున్న అవరోధాలను, అనారోగ్యాన్ని, ప్రాణగండాలను గడచి గట్టెక్కిన స్త్రీలలో అధికులకు, వైధవ్యం ప్రాప్తించే అవకాశాలుంటాయి. ఈ దశ అత్యధికులకు అత్యంత బాధాకరంగా, మానసిక చిత్రహింసగా పరిణమించవచ్చు. ఈ వైనాన్నిపుడు చూద్దాం.

# 19

## గాలిలో దీపంలా ఉన్న వితంతువు జీవితం

రాజస్థాన్‌లో 1987వ సంవత్సరంలో రూప్ కన్వర్ సతీసహగమనం జరిగింది. పెద్దల బలవంతం వల్లనే రూప్ కన్వర్ ఈ చర్యకు పాల్పడవలసి వచ్చినట్లు స్పష్టంగా బయట బడటంతో, దేశంలో గగ్గోలు బయలు దేరింది. పత్రికలు ఈ ఉదంతాన్ని ప్రముఖంగా ప్రచురించటంతో పాటు, ఈ చర్యను తీవ్రంగా నిరసించాయి. అన్ని వర్గాల వారు ఈ చర్యను ఖండించారు. ఈ ప్రతిస్పందన ఆహ్వానించ దగినది. దురాగతాలకు ప్రజా ప్రతిస్పందన పెల్లుబక వలసిందే. భారతీయ జనాభాలో పదవ వంతు వరకూ ఉన్న వితంతువులు, నిత్యయాతనలకు గురవుతున్నా, ప్రజా ప్రతి స్పందన కనుపించక పోవటం వింతగానే కనుపిస్తున్నది. చివరకు, స్త్రీ జనోద్ధరణకు పనిచేస్తున్న మహిళా సంఘాలు కూడా వీరి సమస్యను అంతగా పట్టించుకోక పోవటం ఆశ్చర్యకరంగా కనుపిస్తున్నది. ప్రజలకే పట్టని సమస్యకు ప్రభుత్వం ప్రతిస్పందిస్తుందని ఆశించటం, ఎండమావులలో నీటిని వెదకటం వంటిది అవుతుంది. సతీసహగమనం జరిగినపుడు వ్యక్తమైన ప్రజాందోళన వంటిది, కోట్లాది వితంతువులు అనుభవిస్తున్న ఆర్థిక, సాంఘిక, మానసిక బాధల యెడల కూడా వ్యక్తం గావాలి. దురదృష్టవశాత్తూ వీరి సమస్యలు ఎవరికీ పట్టినట్లు కనుపించటం లేదు. పరిశోధకులు కూడా వీరి సమస్యలను ఛాయా మాత్రంగా చూచారే తప్ప, వారి బాధామయ జీవితపు లోతులను చూడలేకపోవటం విచారకరం. వితంతువుల ఆర్థిక, సాంఘిక, మానసిక బాధలను వ్యక్తం చేయగల పరిశోధనా పత్రాలు అతి తక్కువగా మాత్రమే వెలువడ్డాయని చెప్పబూనటం అతిశయోక్తి గాబోదు. సంప్రదాయ నియమాల అమలు వల్ల వితంతువులు పడుతున్న బాధలను వర్ణించటం మేరకే దాదాపు పరిశోధకులంతా పరిమితమైనారు. ఉదాహరణకు ఈ పరిశోధకులు వ్యక్తం చేసే భావాలు ఎలా ఉంటాయో చూడండి :

"సంప్రదాయ నియమాలను తు చ. తప్పకుండా పాటించే కుటుంబాలలో వితంతువు జీవితం ఎంతోబాధాకరంగా ఉంటుంది. ఆవిడ నేలమీదనే నిద్రించాలి. అతి సామాన్యమైన భోజనాన్ని రోజుకు ఒక్క పూట మాత్రమే చేయాలి. తేనె, మాంసము, ఆఖరుకు ఉప్పుకూడా ఆవిడకు నిషిద్ధమే. వితంతువు నగలను పెట్టుకోకూడదు, రంగుదుస్తులను ధరించ కూడదు; సువాసన ద్రవ్యాలను వాడకూడదు. మధ్యయుగంలో వీరు తప్పక తల వెంట్రుకలను తీయించుకోవలసి ఉండేది.

ఆచరణలో వితంతువు సన్యాసి వలె జీవించ వలసి ఉండేది. పునర్జన్మ సిద్ధించినపుడు, పోయిన భర్తనే తిరిగి చేబట్టటానికి వితంతువు ఈ లోకంలోని అన్ని వసతులను, ఆశలను వదలుకొని, ఆ 'శుభ' దినానికి ఎదురు చూస్తూ జీవించాలి. గతించిన భర్త పేరిట క్రతువులు చేస్తూ, వారి మేలుకు ప్రార్థనలు జరుపుతూ జీవించాలి ఈ నియమాలను వితంతువు ఉల్లంఘిస్తే, ఆవిడ పునర్జన్మించిన తర్వాత చాలా బాధలు పడవలసి ఉంటుంది. అంతేగాదు; ఇహలోకంలో జీవిస్తున్న భార్య యొక్క సంప్రదాయోల్లంఘన వల్ల, పరలోకంలోని ఈ వితంతువు భర్త ఆత్మ క్షోభిస్తుంది. తన భార్య చేసిన తప్పిదాలకు, పునర్జన్మలో వారి భర్త బాధలు పడవలసి ఉంటుంది తనకన్న బిడ్డలకు తప్ప, పరులకు వితంతువు అశుభకరమైన వ్యక్తిగా పరిగణనకు వస్తుంది. శుభకార్యాలకు ఆవిడ వెళ్ళకూడదు వితంతువు ఎదురు రావటాన్ని కూడా సామాజికులు అశుభకరంగా పరిగణిస్తారు. భర్త మరణించిన తర్వాత, ఆవిడ వారి భర్త కుటుంబీకుల మధ్యే జీవించాలి. పుట్టింటికి పోకూడదు సంప్రదాయ సూత్రాలను వితంతువు ఉల్లంఘించకుండా ఆవిడ కుటుంబీకులు, కులస్తులు జాగ్రత్తగా చూస్తూంటారు. ఆఖరుకు ఇంటి పనివారు కూడా ఆవిడ ప్రవర్తన మీద ఒక కన్ను వేసి ఉంచుతారు" (ఎ.ఎల్ బాషం వ్రాసిన "ది వండర్ దట్ వజ్ ఇండియా" నుండి).

వితంతువు పాటించ వలసిన సంప్రదాయాలు తెలిసినంతగా మనకు ఆవిడ జీవిత బాధలు తెలియటం లేదు. పూర్వకాలంలో వితంతు క్షేమానికి ప్రదర్శించి నంతటి శ్రద్ధకూడా ఆధునిక యుగంలో కనుపించక పోవటం ఆశ్చర్యకరంగా కనుపిస్తుంది. వితంతువులు పడుతున్న బాధ, అది వారికే పరిమిత మైనదిగా సామాజికులు భావిస్తున్నారే గాని, దాన్ని సామాజిక సమస్యగా వారు గుర్తించటం లేదు వితంతువుల సమస్యల పరిష్కారం, వారి బాధా నివృత్తికి మాత్రమే జరగాలని భావించటం పొరపాటు. వీరి బాధల సృష్టికి కారణమవుతున్న సామాజిక సమస్యల నివారణకు, నిరోధానికి కూడా కృషి జరుగవలసి ఉన్నది. కనుక వితంతువుల సమస్యలు సృష్టించగల సామాజిక సమస్యలెలా ఉంటాయో చూద్దాం.

వైధవ్యం సంప్రాప్తించిన వెంటనే స్త్రీ జీవన స్థాయి (ఆర్థిక, నైతిక, సామాజిక స్థాయి) పడిపోతుంది. జీవన మాధుర్యం అంతరిస్తుంది. ఆవిడ జీవితంలో, అనిశ్చిత స్థితి తాండవించ నారంభిస్తుంది ఈ స్థితి ఆవిడకు సంక్రమించటం అనేది, ఏ పరిస్థితులలో ఆవిడకు భర్త వియోగం సంభవించింది అన్న అంశం మీద ఆధారపడి ఉంటుంది. భారతీయ మహిళలలో అత్యధికులకు, వారి జీవిత కాలంలోని ఏదో ఒక దశలో వైధవ్య ప్రాప్తికి అవకాశాలుంటాయి.

2. వృద్ధాప్యం వల్లనో, లేక ఇక్కట్ల వల్లనో, జీవనం గడవని రోజులలో అండగా ఉంటారన్న ఆశతో కుమారులను కనాలని (పుత్ర సంతానానికి) స్త్రీ, పురుషుని కంటే అధికంగా తాపత్రయ పడుతుంది. స్త్రీ జీవితంలో అనిశ్చిత పరిస్థితి ఏర్పడటంలో, వైధవ్యానికి వృద్ధాప్యం కూడా తోడవుతున్నట్లు కనబడుతున్నది. అరవై సంవత్సరాల వయసును మించిన మహిళలలో అత్యధిక సంఖ్యాకులు వితంతువులుగా ఉండటం ఈ సందర్భంలో గమనించ వలసిన అంశం. ఈ విధంగా వైధవ్యానికీ, అధిక సంతాన ప్రాప్తిని స్త్రీ కోరటానికి సంబంధం ఏర్పడుతున్నది.

3. వైధవ్యప్రాప్తికి, ఆడపిల్లల యెడల లింగ వివక్షా పూరిత అనాదరణ ప్రదర్శితం గావటానికి సంబంధం ఉన్నది. పని చేయలేని దశలో అండగా ఉంటారన్న ఆశతో, ఒక్క కుమారునైనా కనాలని పురుషుల కంటె స్త్రీలు అధికంగా తాపత్రయ పడుతున్న అంశాన్ని పలువురు పరిశోధకులు నిరూపించారు. అంతేగాదు; ఆడపిల్లల యెడల వివక్షను ప్రదర్శించటంలో, వారి తల్లులు కూడా తండ్రులతో సహకరిస్తున్న విషయాన్ని కూడా వీరు రుజువు చేశారు ఈ రెండు విషయాలకు పొందిక కుదరని సందర్భం కనుపించటం అపురూపమే.

4. వైధవ్యప్రాప్తికి, పిన్న వయసులోనే పిల్లలు వేతనార్జనకు వెళ్ళవలసి రావటానికి సంబంధం ఉన్నది. భర్త పోవటంతో సంపాదించి తెచ్చే మగ దిక్కు కరువవుతుంది. పొట్ట పోతకు తగినంత సంపాదననీయగల పని వితంతువుకు దొరకటం కష్టం. వితంతువు పరాయి మగ వారితో కలిసి పని చేయటాన్ని, ఆఖరుకు గడప దాటి వెళ్ళటాన్ని కూడా అనుమతించని సంప్రదాయం కొన్ని కమ్యూనిటీలలో ఉన్నది. ఇటువంటి ఇబ్బందుల వల్ల కన్నతల్లే తన ముద్దు బిడ్డలను వేతనార్జనకు లేబర్ మార్కెట్‌కు పంపవలసి వస్తుంది. వారు ఇందుకు

అంగీకరించనపుడు, బలవంతంగా నైనా పంపుతుంది. వారు చేయవలసిన పని వారి వయసుకు మించినదైనా, వారు చేయదగని పనైనా, పని పరిస్థితులు ఎంత నికృష్టంగా ఉన్నా, వారికి లభించేది ఎంతటి అల్పవేతన మయినా, ఇల్లు గడవని స్థితిలో, గత్యంతరం లేక వితంతువు, కన్న బిడ్డలను పనికి పంపుతున్నది. ఇది పసిబిడ్డల భవిష్యత్తుకు ఎంత హానికరమో ప్రత్యేకంగా వివరించ నవసరం లేదు.

5. ఇప్పటికే పలు రకాల వివక్షలకు, ప్రతికూలతలకు గురవుతున్న స్త్రీకి, వైధవ్య ప్రాప్తి వల్ల వీటి బాధా తీవ్రత అధిక మవుతుంది. పితృస్వామిక వారసత్వ సంప్రదాయం వల్ల తండ్రి ఆస్థి పురుష వారసులకే దక్కుతూండటం, వివాహానంతరం పుట్టి నింటిని వదలి మెట్టినింటికి నివాసాన్ని మార్చుకొన వలసి రావటం, చేయవలసిన పనులకు "స్త్రీల పని", "పురుషుల పని" అని ముద్రలు పడి ఉండటం వంటివి, స్త్రీ జీవితంలో కొన్ని రకాల అననుకూలతలను సృష్టించుతూండటాన్ని ఇంతకు పూర్వమే వివరించాం. ఇవిగాక మరికొన్ని అదనంగా ఉన్న విషయం పాఠకులకు తెలుసు. వైధవ్య ప్రాప్తి వల్ల తోటి స్త్రీల నుండి వేరుబడి ఉండవలసి రావటం, పలు పరిమితులకు లోబడి జీవిస్తూ వంటరితనాన్ని అనుభవించవలసి రావటం, రేప్ నుండి హత్య వరకూ పలు రకాల ప్రమాదాలకు గురయ్యే అవకాశా లుండటం వల్ల ఆవిడ జీవితం బాధాపూరితంగా తయారవుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, ఇప్పటికే స్త్రీ అనుభవిస్తున్న లింగపరమైన అసమానతా పరిమాణ భారం మరికొంచెం పెరుగుతుంది. ఈ విధంగా స్త్రీ విమోచనోద్యమానికి అది పరిష్కరించ వలసిన మరొక సమస్య అంకురిస్తుంది.

వితంతువుల సమస్య ఇంతటి జటిలమైనదైనా, స్వాతంత్ర్య సాధనానంతరం కూడా ఇది పాలసీ నిర్ణేతల కంటబడక పోవటం ఆశ్చర్యకరంగా కనుపిస్తుంది. సంఘసేవకులు, స్త్రీ జనోద్ధరణకు అంకితమైన సంస్థలూ దీనినొక తీవ్రమైన సమస్యగా గుర్తించక పోవటం దురదృష్టకరం. సమాజంలోని స్త్రీ పురుష అసమానతా ఫలితాల మీద అపారంగా సాహిత్యం వెలువడుతున్నది. పలువురు ప్రముఖులు ఈ అంశాల మీద ప్రకటనలు చేస్తూంటారు. అయినా స్త్రీ నేటికీ నిరాదరణకు గురవుతూనే ఉన్నది; భారత దేశానికి సంబంధించినంతవరకూ వైధవ్య సమస్య ప్రధానంగా స్త్రీలకు సంబంధించినది గానే ఉన్నది. భార్యా వియోగాన్ని పొందిన పురుషుల కంటే, భర్తలను కోల్పోయిన స్త్రీల సంఖ్య మూడు రెట్లకు మించే ఉంటుంది. వైధవ్య ప్రాప్తి వల్ల స్త్రీ అనుభవించ వలసి నంతటి బాధలను, భార్యా వియోగాన్ని పొందిన పురుషుడు అనుభవించ నవసరం లేదు. కోరితే పునర్వివాహాన్ని చేసుకొని సుఖపడగలడు. వైధవ్య ప్రాప్తి వల్ల స్త్రీ అనుభవించ వలసి వస్తున్న బాధలను, భార్యా వియోగాన్ని పొందిన పురుషుడు కూడా అనుభవించ వలసి ఉంటే, వితంతు సమస్య ఇంతటి నిరాదరణకు గురయి ఉండేదిగాదు. జీన్ డ్రేజ్, అమార్త్య సేన్‌లు ఒక సందర్భంలో చెప్పినట్లు "పెను విప్లవం వచ్చి ఉండేది"; మీడియా కూడా తీవ్రంగానే ప్రతిస్పందించి ఉండేది.

## వృద్ధాప్యంలో.....

వయసు మళ్ళిన తర్వాత వితంతువులు అనుభవించవలసి వస్తున్న బాధలను కొన్ని పరిశోధనా ఫలితాలు వెల్లడిస్తున్నాయి. (ఈ అంశం మీద కూడా మన దేశంలో వెలువడిన సమాచారం అరకొరగానే ఉన్నది). మన దేశపు వితంతు జనాభాలో అత్యధికులు 60 సంవత్సరాల వయసును మించిన వారే జీవితంలోని ఇతర దశలలో కంటే వృద్ధాప్యంలో స్త్రీ అధిక బాధలను అనుభవించ వలసి ఉంటుందనేది అందరకూ తెలిసిన విషయమే. గౌరవాన్ని, ఆదరణను పొందదగిన వృద్ధురాలు, కాటికి కాళ్లు చాచుకొన్న దశలో కూడా ప్రశాంత జీవితానికి నోచుకోలేదు; ఈవిడ తీవ్రమైన నిరాదరణకు గురవుతున్నది.

వెలువడిన పరిశోధనా సాహిత్యం ఇతర వివరాలతో పాటు, మనకు రెండు రకాల సమాచారాన్నిస్తున్నది: 1. వృద్ధాప్య కాలంలో వితంతువుకు లభిస్తున్న కుటుంబీకుల ఆదరణ ఎంత? 2. అధిక సంతానాన్ని (ముఖ్యంగా పుత్ర సంతానాన్ని) కోరటానికి, అరిటాకు వంటి ఆవిడ ప్రమాద భరిత జీవన పరిస్థితికి ఉన్న సంబంధం ఏమిటి?

భారతదేశంలో, ఎదిగిన కుమారుల అండే వృద్ధాప్యంలో స్త్రీకి ప్రధానంగా లభించటం కనుపిస్తున్నది. కుమారులు తల్లిని ఆదరించని సందర్భాలు చాలా తక్కువగా కనుపిస్తాయి.

వృద్ధాప్యం లో ఆదుకొనే వారుండాలనే స్త్రీలు అధిక సంతాన ప్రాప్తిని కోరు కొంటారు. ఇచ్చట ఆసక్తి దాయకమైన అంశమొకటి మనకు కనుపిస్తుంది. పుత్ర సంతానం కావాలని, పురుషుని కంటే స్త్రీ అధికంగా కోరుతుంది. ఈ విషయాన్ని మన దేశంలోని గ్రామీణ ప్రాంతాలలో జరిగిన పలుపరిశీలనలు వెల్లడిస్తున్నాయి. వృద్ధాప్యంలో కుమారులు తమను ఆదుకొంటారన్న ఆశే వీరి నిందుకు ప్రోత్సహిస్తున్నట్లు పరిశోధకులు సూచించారు. కనుక పరిమిత సంతానంతో స్త్రీ సంతృప్తి పడాలంటే, ఆవిడ ఆదరణకు తగిన రక్షణను ప్రభుత్వం కల్పించవలసి ఉంటుంది. ఇటువంటి రక్షణ లభిస్తుందన్న నమ్మకం స్త్రీకి కలిగినపుడు, కన్న కూతుళ్ళ యెడల ప్రదర్శితమవుతున్న లింగవివక్షా పాటింపులో ఆవిడ భాగస్వామిని గావలసిన అవసరం ఉండదు

## వితంతు జీవితంలో మరో పర్వం

భారత దేశంలో వెలువడిన పరిశోధనా సమాచారంలో సతీసహగమనం మీద కూడా కొంత వివరణ ఉన్నది కొందరు స్త్రీలు తాము కోరి ఇందుకు పాల్పడినా, మరికొందరు బంధువుల బలవంతం వల్లా, వితంతువుగా జీవించటంలో ఉన్న బాధలకు భయపడి సహగమనానికి తయారవుతున్నట్లు కనుపిస్తున్నది. ఎ.ఎస్. ఆల్టేకర్ "ది పొజిషన్ ఆఫ్ ఉమెన్ ఇన్ హిందూ సివిలిజేషన్" అన్న రచనలోని దిగువ భాగాన్ని జీన్ డ్రేజ్ "విడోస్ ఇన్ రూరల్ ఇండియా" అన్న తమ పరిశోధనా పత్రంలో ఉదహరించారు "ప్రధానంగా యవ్వన దశలో వైధవ్యం ప్రాప్తించిన స్త్రీలు, సంతానం లేని వారూ, తమ భర్తలతో తామూ చనిపోదలచు తున్నట్లు కనుపిస్తుంది. భర్త మరణానంతరం వితంతువుగా జీవించటం వల్ల అనుభవించ వలసి ఉండే బాధలే వీరి నిందుకు పురికొల్పుతున్నాయి. భర్త మరణానంతరం బ్రహ్మచర్యాన్ని పాటించవలసి రావటం కష్టంగా ఉండటం వల్ల, జీవించటం కంటె, భర్తతో పాటు మరణించటానికే చాలామంది వితంతువులు సిద్ధమవుతున్నారు. ఇందువల్లనే సతీసహగమన సంప్రదాయం సాధారణాంశమైంది".

కొంత మంది వితంతువులు, కాశీయాత్రలకు వెళ్ళి అచ్చటే స్థిరపడుతూండటం కనుపిస్తుంది. ఈ అంశం మీద వెలువడిన కొన్ని పరిశోధనా పత్రాలు వీరి దయనీయ పరిస్థితిని చిత్రిస్తున్నాయి లౌకిక ప్రపంచం మీద మమకారం పోయి, ఆధ్యాత్మిక చింతనతో వీరు కాశీకి వెళుతున్నట్లు అనుకొంటూంటాం. ఇందులో సంపూర్ణ సత్యం లేదని కొందరు పరిశోధకులు నిరూపించారు. ఇద్దరు పరిశోధకులు వెల్లడించిన అంశాలను ఇచ్చట వివరిస్తాం :

ఎ.పి మిట్టల్ అనే పరిశోధకులు 1981వ సంవత్సరంలో కాశీలో నివసిస్తున్న వితంతువుల మీద నిర్వహించిన సర్వేలో 395 మంది పాల్గొన్నారు. తమ సన్నిహిత బంధువులు తమను సక్రమంగా చూడక నిరాదరించటం వల్ల, మనసు విరిగి కాశీకి వచ్చినట్లు వీరిలో 256 మంది (అరవై శాతం మంది) చెప్పారు; దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించ వలసి రావటం, ఈ స్థితిలో కూడా కుటుంబీకుల ఆదరణ లభించక పోవటం వల్ల 98 మంది (25 శాతం మంది) కాశీకి వచ్చి స్థిర పడినట్లు చెప్పారు. ఈ 395 మందిలోనూ ముప్పై ముగ్గురు మాత్రం (ఎనిమిది శాతం మంది మాత్రం) పైన పేర్కొన్నటువంటి బాధలను అనుభవించ నవసరం లేక పోయినా, ఆధ్యాత్మిక చింతనతో కాశీకి వచ్చి స్థిరపడినట్లు చెప్పారు.

రెండవ సర్వే ఎన్. ఘోషాల్ 1989వ సం॥రంలో నిర్వహించినది. వీరి సర్వేలో పాల్గొన్న వారిలో 88 శాతం మంది జాయంట్ కుటుంబాల నుండి వచ్చిన వారున్నారు. తమ భర్తలు జీవించి ఉన్న కాలంలో అత్తమామలు తమను బాగానే చూచినట్లు చెప్పారు. భర్తల మరణానంతరం తమను వారు క్రూరంగా హింసించ నారంభించనట్లు వీరిలో 72 శాతం మంది చెప్పారు.

ఈ వివరణలను బట్టి, భర్త మరణాంతరం స్త్రీ సహగమనానికి పాల్పడటానికి, వైధవ్య ప్రాప్తి తర్వాత జీవితం దుర్భరంగా ఉండటమే కారణమని స్పష్టమవుతున్నది. సతీ సహగమనాన్ని, భారతీయ వితంతువు అనుభవించ వలసి వస్తున్న దుర్భర బాధలకు, దీనిని రేఖారూప చిత్రణగా మాత్రమే మనం స్వీకరించ వలసి ఉంటుంది.

## వితంతు పునర్వివాహాలు

వితంతు జనాభా పరిమాణపు టంచనాలను పరిశీలించే ముందు, వితంతు పునర్వివాహాలు దేశంలో జరుగుతున్న

## మారుమనుము నాణ్యతకు మచ్చుతునక

పునియాదేవి అనే పద్ధెనిమిది సంవత్సరాల వితంతువుకు ఎనిమిది సంవత్సరాల వయసున్న ఆవిడమరది ధేమన్ చౌదరికి మారుమనుము చేశారు. వీరిది బీహార్ రాష్ట్రంలోని లక్ష్మన్‌పూర్ బేత్ గ్రామం కులవృత్తి రీత్యా వీరు మత్స్యకారులు. ఈ వార్తను 1998వ సంవత్సరం, డిశంబరు 28 వ తేది సంచికలో "ది వీక్" అనే ఇంగ్లీషు వార పత్రిక ప్రచురించింది.

"నీకు వివాహమైనదటగా" అని వీక్ పత్రికా ప్రతినిధి ధేమన్ చౌదరిని అడిగాడు. "అంటే ఏమిటి?" అని ఆపిల్లవాడు ఎదురు ప్రశ్న వేశాడు తర్వాత ఇలా చెప్పాడు. "అదేమిటో నాకు తెలియదు. ఒకరోజు మా వదిన పాపటిలో సింధూరం పెట్టాను. వెంటనే ఆవిడ విపరీతంగా ఏడ్చింది". "మనదవాధాం గ్రామం వెళ్ళావా" అని పత్రికా ప్రతినిధి మరో ప్రశ్న వేశాడు. ( ఈగ్రామం బేత్ గ్రామానికి 30 కిలో మీటర్ల దూరంలో ఉన్నది. ఇచ్చటి శివాలయంలో ఈ మారుమనుము (పునర్వివాహం) జరిగింది. "వెళ్ళాను అమ్మ, వదినలతోకలిసి" అని చౌదరి అన్నాడు. "ఎందుకు వెళ్ళావు" అని పత్రికా ప్రతినిధి అడిగాడు. "జిలేబీలు తినటానికి, బిళ్ళంగోడు ఆడటానికి" అన్నాడు చౌదరి. "నీవు మీ వదిన తలలో పేలు ఏరావటగదా" అని పత్రికా ప్రతినిధి అడిగాడు. చౌదరి నవ్వుతూ "అదేం లేదు; ఆవిడ తలమీద సింధూరం పెట్టాను; అంతే" అన్నాడు చౌదరి.

ఈ పత్రికా ప్రతినిధి వివరించిన వధువు పునియా మనోభావాలను చదవండి. "ధేమన్ నాకంటే పదిసంవత్సరాలు చిన్నవాడు, అతనిని నా తమ్ముని వలె చూస్తున్నాను. ఇలాంటి వాడిని పెండ్లి చేసుకొన్నందుకు నేను సిగ్గుపడుతున్నాను ఇలాంటి వాడిని భర్తగా స్వీకరించమని ఒక రోజు భగవంతుడు శాసిస్తాడని నేను ఎన్నడూ ఊహించలేదు "

వరునకు పసిదనం పోలేదు. వివాహమంటే ఏమిటో తెలియదు. తనకంటే పది సంవత్సరాలు వయసులో చిన్న వాడు, తన తమ్ముని వలె ఆవిడ చూచుకొంటున్నది. అటువంటి పిల్లవాడిని భర్తగా చేబట్టటం పునియాకు ఇష్టంలేదు. ఇది దురదృష్టకర పరిణామంగా ఆవిడ భావిస్తున్నది.

మరి ఇలాంటి మారుమనుము ఎందుకు జరిగింది?

పునియా కాపురానికి రావటానికి నిర్ణయించిన ముహూర్తానికి పదిహేను రోజుల ముందే ఆవిడ భర్త, భూస్వాముల గూండాలు సాగించిన మారణ కాండలో మరణించారు. ఆవిడ వితంతువుగా కాపురానికొచ్చింది. పునియా తల్లిదండ్రులు ఆవిడకు పునర్వివాహం చేయనిశ్చయించారు. ఈవిడ వివాహం మరొకరితో జరిగితే, ఆవిడకు ప్రభుత్వం పరిహారంగా ఇచ్చిన రెండు లక్షల రూపాయలు ఆవిడతో పోతాయని పునియా అత్తగారు భయపడింది. ఆ సొమ్మును తామే అనుభవించటానికి వీలుగా పూనియాను తన చిన్నకుమారునకు చేసింది (భర్త మరణానంతరం, వారి వితంతువును వారి సోదరులు మారుమనుము చేసుకొనే ఆచారం వీరి కులంలో ఉన్నది).

ఆగ్రామంలో మరో పునర్వివాహం కూడా జరిగింది ఈ విషయాన్ని కూడా ఈ వారపత్రికా ప్రతినిధి రిపోర్టు చేశాడు. దేవంతీ దేవి భర్త, గూండాల ఊచకోతలో మరణించాడు, అతని పేరు రాజ్‌కుమార్ అతని తమ్ముడు రాజేష్ కు ఈవిడను బలవంతంగా చేశారు. అతనికి ఇంతకు పూర్వమే వివాహమైంది. అతని భార్యకు కూడా ఈ మారుమనుము జరగటం ఇష్టంలేదు. "కుటుంబ శ్రేయస్సు" దృష్ట్యా ఈమారుమనుము జరిగినట్లు, రాజేష్ తమ్ముడు చెప్పాడు. ఇద్దరు భార్యలను చేసుకోవటం తప్పేమీగాదన్నాడు. కొంత మంది మంత్రులకు కూడా ఇద్దరు భార్యలున్నట్లు చెప్పి ఈ పునర్వివాహాన్ని అతడు సమర్థించాడు. పునర్వివాహానంతరం, కార్యంకూడా జరుగకుండానే దేవంతీ తల్లిగారింటి కెళ్ళి పోయింది

వీరు చెప్పిన కుటుంబ "శ్రేయస్సు" లోని రహస్యం ఏమిటి? దేవంతీ దేవికి, పరిహారంగా ప్రభుత్వమిచ్చిన రెండు లక్షల రూపాయలు కుటుంబం నుండి పోకుండా కాపాడు కోవటమే ఈపునర్వివాహ లక్ష్యమని పత్రికా ప్రతినిధి వివరించారు.

వితంతువుకు పునర్వివాహం జరిగిందని సంతోషించటం గాదు; ఆ వివాహం వల్ల వితంతువుకు లభించిన భర్త ఎటువంటి వాడు, ఆవిడ సుఖపడగల అవకాశాలున్నాయా లేవా అని విచారించమన్నాడు ప్రొఫెసర్ జీన్ డ్రేజ్.

తీరును గురించి కొంత తెలుసు కోవటం అవసరం.

దేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించటానికి ముందు కాలంలో, సంఘ సంస్కర్తలకు, వితంతు పునర్వివాహాలు జరిపించటం ముఖ్యమైన సేవా కార్యక్రమాలలో ఒకటిగా ఉండేది. కందుకూరి వీరేశలింగం పంతులు గారి వితంతు సేవానిరతిని ఎరుగని తెలుగు వారుండరు. క్రమానుగతంగా ఈ కార్యక్రమం నీరసించి పోయింది. దీనినొక సమస్యగా, ఇపుడు కూడా పరిగణిస్తున్నవారు బహు తక్కువ మంది ఉంటారు. వితంతు పునర్వివాహం ఒక సమస్యే గాదు అన్న భావం ప్రబలంగా ఉన్నది. జరుగుతున్న పునర్వివాహాలు పట్టణ ప్రాంతపు విద్యాధికులకే ప్రధానంగా పరిమితమైనాయి గ్రామీణ ప్రాంతాలలో ఇవి అతి తక్కువగా జరుగుతున్నాయన్న భావం కూడా ఉన్నది

సంఘ సంస్కర్తలు వితంతు పునర్వివాహ సమస్యను వదలి వేసినా ఈ అంశం మీద పరిశోధిత సమాచారం క్రమానుగతంగా వస్తూనే ఉన్నది. కొందరు పరిశోధకులు అందరి కంటే "ముందుకు" పోయి, వితంతు పునర్వివాహాలు విస్తృత ప్రాంతాలలో జరుగుతున్నట్లు చెబుతున్నారు వీరు వివాహాల సంఖ్యా పరిమాణాలను చూస్తున్నారే గాని, వాటి స్వభావాన్ని నిశితంగా పరిశీలించినట్లు కనుపించటం లేదు.

వితంతు పునర్వివాహాలను కొన్ని కులాల వారూ, తెగల వారూ అనుమతిస్తుండగా, మరి కొందరు వ్యతిరేకిస్తున్నారు ఈ పరిస్థితి దేశవ్యాప్తంగా కనుపిస్తున్నది. ఈ "అనుమతించటం" లేక "వ్యతిరేకించటం" అనేది, జరుగుతున్న పునర్వివాహాల నిజ పరిస్థితిని తెలియ జేయటం లేదు వితంతువు తన సంపూర్ణాంగీకారంతోనే దానికి తయారవుతున్నదా? ఈ పునర్వివాహం వెనుక నున్న సామాజికుల లేక కులపెద్దల, లేక కుటుంబీకుల బలవంతపు పాత్ర ఏమిటి అన్న అంశాలను మనం చూడటం అవసరం. ఈ విషయం మీద వెలువడిన పరిశోధిత సమాచారాన్ని, సాకల్యంగా పరిశీలించిన జీన్ డ్రేజ్ కొన్ని వాస్తవాలను తేల్చి చూపారు.

మన దేశంలోని కొన్ని ప్రాంతాలలో, ప్రధానంగా ఉత్తర భారతంలో, కొన్ని తెగలవారూ, కులాలవారూ, వితంతువు తన భర్త యొక్క కనిష్ఠ సోదరుని పెండ్లి చేసుకొనే ఆచారాన్ని (మారు మనుమును) పాటిస్తున్నారు గ్రామ సీమలలో జరిగే పునర్వివాహాలలో అత్యధిక భాగం ఈ తరగతికి చెందినవేనని జీన్ డ్రేజ్ నిర్ధారణ చేశారు. ఈ రకపు వివాహాలలో వితంతువు అంగీకారంతో ప్రమేయం ఉండదనీ, ఆవిడ ఏడుస్తున్నా, బలవంతంగా వితంతువును వరుని సరసన మంచంమీద కూర్చుండబెట్టి, కొంగులు ముడివేసి వివాహం జరిగినట్లు కుల పెద్దలు ప్రకటిస్తారు అని కొందరు పరిశోధకులు వివరించిన అంశాన్ని డ్రేజ్ ఉదహరించారు. ఈ సంప్రదాయం ప్రకారం గ్రామ సీమలలో జరిగే పునర్వివాహాలలో అత్యధిక భాగం వితంతువు అంగీకారం లేకుండానే జరుగు తున్నట్లు వీరు చెప్పారు

వైధవ్య ప్రాప్తి నాటికి స్త్రీ వయసు, ఆవిడ సంతానవతా కాదా అనే అంశాలు వితంతువు పునర్వివాహాన్ని ప్రభావితం చేస్తున్నట్లు డ్రేజ్ నిర్ధారణ చేశారు. ఈ అంశాల నిర్ధారణకు ఎస్.ఎన్. అగర్వాలా సేకరించిన సమాచారాన్ని డ్రేజ్ ఆధారంగా తీసుకొన్నారు.

అగర్వాలా 1958, 1963 సంవత్సరాల మధ్య కాలంలో కొన్ని వేల మంది వితంతువుల పునర్వివాహాల సమాచారాన్ని సేకరించారు. ఢిల్లీ జిల్లాలో 1,447, పంజాబ్ లోని రోటక్ జిల్లాలో 2,903, ఉత్తరప్రదేశ్‌కు చెందిన మధురా జిల్లాలో 2,382, ఇదే రాష్ట్రానికి చెందిన షహరాన్‌పూర్ జిల్లాలో 3,526 మంది వితంతువుల పునర్వివాహాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించారు. ఈ సమాచారపు ఆధారంతో డ్రేజ్ రెండు పట్టికలను రూపొందించారు. ఈ పట్టికలను ఈ అధ్యాయంలో ఒకటవ, రెండవ పట్టికలుగా ఇచ్చాం.

పునర్వివాహం చేసుకొన్న వితంతువులలో పిన్న వయస్కులు, లేదా సంతానహీనులు అత్యధికులుగా ఉన్నట్లు ఈ పట్టికలలోని సమాచారం నిరూపిస్తున్నది. పుత్ర సంతానం ఉన్నవారు పునర్వివాహానికి తలపడటం చాలా తక్కువగా ఉన్నట్లు వీరు నిరూపించారు. వీరి విశ్లేషణ వల్ల మనకు రెండు అంశాలు స్పష్టమవుతున్నాయి.

1. భర్త మరణించే నాటికి సంతానం ఉన్నవారూ, లేదా ఇరవై సంవత్సరాల వయసును మించిన వారిలో అధికులు మాత్రమే భర్త సోదరునే వివాహం చేసుకోక పోవటం కనుపిస్తున్నది. ఇటువంటి వివాహాన్ని నిరాకరించ గల శక్తిగాని,

### ఒకటవ పట్టిక
### ఢిల్లీ, రోటక్, మథుర, సహరాన్పూర్ గ్రామీణ ప్రాంతాలలో పునర్వివాహం చేసుకొన్న వితంతువుల సంఖ్య, వివాహం నాటికి వారి వయసు

| వైధవ్య ప్రాప్తి నాటికి వయసు (సంII) | వితంతువులలో వివాహం చేసుకొన్న వారి శాతము | | | |
|---|---|---|---|---|
| | ఢిల్లీ | రోటక్ | మథుర | సహరాన్పూర్ |
| 15 సంIIలకు లోపు | 94(39) | 100 | 86 | 88 |
| 15-19 | 88(39) | 92 | 72 | 78 |
| 20-24 | 67(27) | 86 | 39 | 56 |
| 25-29 | 24(10) | 52 | 31 | 29 |
| 30-34 | 18(5) | 26 | 26 | 18 |
| 35-39 | 14(4) | 4 | 4 | 11 |
| 40-44 | 0(0) | 2 | 3 | 2 |
| 45-ఆపైన | 0(0) | 1 | 2 | 1 |
| అన్ని వయసుల వారు | 38(15) | 25 | 19 | 34 |

వివరణ : రెండవ కాలంలో బ్రాకెట్లలో ఉన్న సంఖ్యలు తమ భర్త సోదరినిగాక ఇతరులను వివాహమాడిన వారి శాతాలను తెలియజేస్తాయి

*- అగర్వాలా సర్వే సమాచారం ఆధారంతో డ్రేజ్ రూపొందించిన పట్టిక*

### రెండవ పట్టిక
### ఢిల్లీ, రోటక్, మథుర, సహరాన్పూర్ గ్రామీణ ప్రాంతాలలో తమకున్న సంతాన సంఖ్య ప్రాతిపదిక మీద వివాహమాడిన వితంతువుల పరిమాణ శాతాలు

| వితంతువు యొక్క జీవించి ఉన్న సంతానపు సంఖ్య | వితంతువులలో వివాహం చేసుకొన్న వారి శాతము | | | |
|---|---|---|---|---|
| | ఢిల్లీ | రోటక్ | మథుర | సహరాన్పూర్ |
| 0 | 72(36) | 76(6) | 49 | 86 |
| 1 | 43(5) | 28(2) | 30 | 33 |
| 2 | 23(3) | 25(1) | 9 | 25 |
| 3 | 17(10) | 9(0) | 4 | 14 |
| 4 | 18(0) | 8(0) | 2 | 12 |
| 5కు మించి | 6(3) | 0(0) | 2 | 5 |

వివరణ : వివాహమాడిన వారిలో, తమ భర్త సోదరుని గాకుండా ఇతరులను చేసుకొన్న వితంతువుల పరిమాణ శాతాలను బ్రాకెట్లలోని సంఖ్యలు తెలియజేస్తాయి.

*- అగర్వాలా సర్వే సమాచారం ఆధారంతో డ్రేజ్ రూపొందించిన పట్టిక*

మూడవ పట్టిక

1961-1981 సం॥ల మధ్యకాలంలో రాష్ట్రాల వారీ వైధవ్య ప్రాప్తి పరిమాణాలు

| రాష్ట్రాలు | గ్రామీణ స్త్రీ జనాభాలో వితంతువుల శాతం | | | గ్రామీణ పురుష జనాభాలో భార్యా వియోగాన్ని పొందిన పురుషుల శాతం | | |
|---|---|---|---|---|---|---|
| | 1961 | 1971 | 1981 | 1961 | 1971 | 1981 |
| ఆంధ్రప్రదేశ్ | 13.9 | 11 9 | 10.5 | 3 6 | 2.9 | 2.4 |
| తమిళనాడు | 13.1 | 11.3 | 10 4 | 3.4 | 2.8 | 2 6 |
| కర్ణాటక | 12.8 | 10.8 | 9.9 | 3.4 | 2 5 | 2.1 |
| పశ్చిమ బెంగాల్ | 13.0 | 10.2 | 9.5 | 2 9 | 2 5 | 1.5 |
| మహారాష్ట్ర | 12.0 | 9.8 | 9.3 | 3.4 | 2.4 | 2.1 |
| ఒరిస్సా | 12.1 | 9.1 | 9.2 | 2.9 | 2.4 | 2.5 |
| కేరళ | 9.8 | 8.8 | 8 9 | 1.8 | 1 2 | 1.2 |
| మధ్యప్రదేశ్ | 11.2 | 9 0 | 8.0 | 4.0 | 3.4 | 2.9 |
| హిమాచల్‌ప్రదేశ్ | - | 8.7 | 7.7 | - | 4.0 | 3.0 |
| బీహార్ | 11.1 | 8.8 | 7.5 | 4.1 | 3 4 | 2.9 |
| రాజస్థాన్ | 9.5 | 7.9 | 7.2 | 4.2 | 3.3 | 2.0 |
| గుజరాత్ | 9.0 | - | 7.0 | 3.3 | 2.6 | 2.3 |
| ఉత్తరప్రదేశ్ | 9.0 | 7.8 | 6.5 | 5.6 | 4.9 | 4.1 |
| జమ్ము-కాశ్మీర్ | 8.1 | 6.6 | 5.7 | 5.2 | 4.2 | 3.6 |
| పంజాబ్ | 7.2 | 5.6 | 5.5 | 5.0 | 3.6 | 3 1 |
| హర్యానా | - | 5.2 | 4.9 | - | 3.4 | 2.8 |
| భారతదేశం | 11.0 | 9.0 | 8.2 | 3.9 | 3 2 | 2.7 |

*- జీన్ డ్రేజ్ వ్రాసిన విడోస్ ఇన్ రూరల్ ఇండియా అన్న రచన నుండి.*

భారతీయ జనాభా లెక్కల సమాచారం ఆధారంతో రచయిత ఈ పట్టికను రూపొందించారు

తమకు ఇచ్చ వచ్చిన వరుని చేబట్టగల స్వేచ్ఛ గాని పునర్వివాహం చేసుకొన్న వితంతువులలో అత్యధికులకు ఉన్న రుజువులు కనుపించటంలేదు.

2. పునర్వివాహాన్ని చేసుకొన్న వితంతువులలో అతి కొద్ది మంది మాత్రమే, భర్త సోదరుని గాక బయటివారిని చేసుకొంటు న్నారు. (ఇలాంటి వారికి లభించే వరులు అనారోగ్య పీడితులో, అవిటి వారో, సంపాదన లేని వారో అయి ఉండటం అతి సామాన్యంగా కనుపిస్తుంది. ఈ విషయ విచారణ కూడా జరగాలని డ్రేజ్ పరిశోధకులకు సూచించారు) ఈ అంశాలకు సంబంధించిన వివరాలను కూడా ఒకటవ రెండవ పట్టికలలో చూడవచ్చు.

ఈ విశ్లేషణానంతరం డ్రేజ్ ఈ విధంగా చెప్పారు . "అగర్వాలా పరిశీలనలు ఢిల్లీ గ్రామీణ ప్రాంతానికి, ఉత్తర ప్రదేశ్, పంజాబులకు సంబంధించినవి. కనుక అఖిల భారత పరిస్థితినివి చిత్రించవని భావించే అవకాశాలున్నాయి. భారత దేశంలోని ఇతర ప్రాంతాలలో కూడా పరిస్థితి ఇలాగే ఉన్నట్లు పలువురు జరిపిన పరిశోధనలు నిరూపిస్తున్నాయి. 1954-55 సంవత్సరాల మధ్య కాలంలో కుముదినీ దండేకర్ పశ్చిమ భారతంలో పెద్ద ఎత్తున నిర్వహించిన సర్వే, 1965వ సంవత్సరంలో బి.ఆర్. దూబె మధ్యప్రదేశ్‌లో నిర్వహించిన సర్వే ఇటువంటి ఫలితాలనే సూచించాయి. ఈ రెండు రాష్ట్రాలలో కూడా వైధవ్యం ప్రాప్తించిన నాటికున్న స్త్రీ వయస్సు,

నాల్గవ పట్టిక

1961, 1971, 1981 సంవత్సరాల గ్రామీణ వితంతువుల వయసు వారీ సమాచారం

| వయసు వారీ వర్గాలు | ఆయాసంవత్సరాలలో, ఆయా వయసు వర్గపు వితంతు జనాభా శాతాలు | | |
|---|---|---|---|
| | 1961 | 1971 | 1981 |
| 0-9 | 0.0 | 0 0 | 0.0 |
| 10-14 | 0.1 | 0 1 | 0.1 |
| 15-19 | 0.4 | 0.3 | 0.3 |
| 20-24 | 11 | 0.8 | 0.7 |
| 25-29 | 2.3 | 1.7 | 14 |
| 30-34 | 4.1 | 3 2 | 2.5 |
| 35-39 | 5.7 | 4.7 | 3.9 |
| 40-44 | 9.6 | 8.1 | 6.7 |
| 45-49 | 10 4 | 9 1 | 8 3 |
| 50-54 | 15.7 | 14 6 | 13.3 |
| 55-59 | 9.9 | 10.4 | 9.5 |
| 60-64 | 16.7 | 18.4 | 19.4 |
| 65-69 | 7.5 | 9.3 | 10.7 |
| 70సం॥లు అంతకు మించిన వారు | 16.4 | 19.2 | 23.2 |
| మొత్తం | 100.0 | 100.0 | 100.0 |

గమనిక · 30 సంవత్సరాల వయసు దాటిన తర్వాత వైధవ్య ప్రాప్తి అవకాశాలు స్త్రీలకు అధికంగా ఉండటాన్ని చూడవచ్చు.

*- జీన్ డ్రేజ్ రచన నుండి*

ఆవిడకు సంతానం లేకుండా ఉండటం అనేవి ఎంత బలంగా ఆవిడ పునర్వివాహాన్ని ప్రభావితం చేస్తున్నాయో ఈ రెండు సర్వేల ఫలితాలు చక్కగా చిత్రించాయి.

"వైధవ్యం ప్రాప్తించిన స్త్రీ తన భర్త యొక్క సోదరుని వివాహమాడటం అనే ఆచారాన్ని ఉత్తర భారతంలో కంటే దక్షిణ భారతంలో తక్కువగా పాటిస్తున్నారు. దక్షిణ భారతాన్ని మొత్తంగా పరిగణనకు తీసుకొన్నపుడు, ఈ రకమైన పునర్వివాహాలు, ఉత్తర భారతంలో కంటే తక్కువగా జరుగుతున్నాయి. పునర్వివాహ పరిస్థితిని దేశం మొత్తంగా చూచినపుడు, పునర్వివాహ విషయంలో వితంతువుకు లభిస్తున్న స్వేచ్ఛ, అగర్వాలా అధ్యయనంలో కనుపించిన దాని కంటె అధికంగా ఉన్నట్లు మాత్రం కనుపించదు. పునర్వివాహం విషయంలో స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ షెడ్యూల్డ్ కులాల వారిలోనూ, కొన్ని హిందూయేతర కమ్యూనిటీలలోనూ - ముఖ్యంగా గిరిజనులలోనూ - ఉన్న రుజువులు లభిస్తున్నాయి" (జీన్ డ్రేజ్ వ్రాసిన "విడోస్ ఇన్ రూరల్ ఇండియా").

ఇరవయ్యవ శతాబ్దపు 50-60 దశాబ్దాల అనంతరం, స్త్రీ విమోచనోద్యమ ఫలితంగా పునర్వివాహాల సంఖ్య పెరిగి ఉంటుందని భావించే అవకాశాలున్నాయి. ఈ వివాహాలను, ఈ కాలంలో మూడు అంశాలు ప్రభావితం చేసినట్లు కనుపిస్తుంది:

1. వివాహ కాలం నాటికి ఉంటున్న వధువు వయసు పెరిగింది. ఇందువల్ల, సంతానవతి గావటానికి ముందు ఆవిడకు వైధవ్యం ప్రాప్తించే అవకాశాలు తగ్గాయి,

## ఐదవ పట్టిక

## 1981వ సంవత్సరంలో వివిధ మండలాలలో ఉన్న వితంతువుల వయసు వారీ వర్గపు శాతాలు

| వయసు గ్రూపు | ఆయా మండలాల గ్రామీణ స్త్రీ జనాభాలో ఉన్న వయసు వారీ వర్గాల వితంతు జనాభా శాతాలు | | | | | |
|---|---|---|---|---|---|---|
| | పశ్చిమోత్తర భారతం | మధ్య పశ్చిమం | ప్రాచ్య భారతం | దక్షిణ భారతం | అఖిల భారతం | |
| | | | | | స్త్రీలు | పురుషులు |
| 0-9 | 0.0 | 0 0 | 0.0 | 0.0 | 0 0 | 0.0 |
| 10-14 | 0.04 | 0.04 | 0.03 | 0.03 | 0.03 | 0.03 |
| 15-19 | 0.2 | 0.3 | 0 3 | 0.2 | 0.2 | 0.1 |
| 20-24 | 0.5 | 0.7 | 0.9 | 0 9 | 0.7 | 0.5 |
| 25-29 | 1.0 | 1 5 | 2.0 | 2 0 | 1 6 | 1.0 |
| 30-34 | 2.1 | 2 9 | 3.6 | 4.3 | 3.2 | 1.6 |
| 35-39 | 3.6 | 5.0 | 6.3 | 7.0 | 5.5 | 2.3 |
| 40-44 | 7.9 | 9.6 | 12.3 | 13.7 | 10.8 | 3.8 |
| 45-49 | 10.0 | 14.0 | 18.1 | 19.8 | 15.5 | 5.0 |
| 50-54 | 24 1 | 27.5 | 32.2 | 34.2 | 29.4 | 8 0 |
| 55-59 | 20.1 | 30.6 | 32.7 | 40.6 | 30.5 | 9.8 |
| 60-64 | 48.7 | 55.3 | 58.1 | 61.3 | 55.6 | 14.9 |
| 65-69 | 44.0 | 59.8 | 61.5 | 66.8 | 57.6 | 17.8 |
| 70సం॥లు అంతకు మించిన వారు | 70.5 | 78.5 | 78.3 | 83.4 | 77.2 | 27.8 |
| అన్ని వయస్సుల వారు | 6.5 | 8.3 | 8.5 | 10.0 | 8.2 | 2.7 |

వివరణ :

1. చివరి కాలంలోని వివరాలు, భార్యావియోగాన్ని పొందిన పురుషుల వివరాలను తెలియజేస్తున్నాయి. మొత్తం గ్రామీణ పురుష జనాభాలో, ఈ వర్గపు పురుషుల శాతాలనివి సూచిస్తున్నాయి.
2. వివిధ మండలాలలో చేరిన రాష్ట్రాలు :

పశ్చిమోత్తర భారతం : హర్యానా, హిమాచల్ ప్రదేశ్, జమ్ము-కాశ్మీర్, పంజాబ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్

మధ్యపశ్చిమం : గుజరాత్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్

ప్రాచ్యభారతం : బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్

దక్షిణ భారతం : ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, కేరళ, తమిళనాడు

*– భారతీయ జనాభా లెక్కల సహాయంతో జీన్ డ్రేజ్ రూపొందించిన పట్టిక*

## ఆరవ పట్టిక
## 1981వ సంవత్సరంలో దేశంలోని వితంతు జనాభా : రాష్ట్రాల మధ్య తారతమ్యం

| రాష్ట్రాలు | మొత్తం స్త్రీ జనాభాలో వితంతు జనాభా శాతం | ప్రతి వెయ్యి మంది పురుషులకూ ఉన్న స్త్రీ సంఖ్య | భార్యావియోగాన్ని పొందిన ఒక్కొక్క పురుషునకు ఉన్న భర్తృవియోగాన్ని పొందిన స్త్రీలు (వితంతువులు) | దేశ గ్రామీణ ప్రాంతపు వితంతు జనాభాలో, ఈ రాష్ట్రంలోని వారి శాతం | వివాహకాలంలో స్త్రీ-పురుషుల వయసు మధ్య నున్న వ్యత్యాసం (సం॥లు) |
|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 10 5 | 975 | 4 3 | 10.5 | 5.7 |
| తమిళనాడు | 10 4 | 977 | 3.9 | 8.2 | 5.8 |
| కర్ణాటక | 9 9 | 963 | 4.6 | 6.4 | 6.7 |
| పశ్చిమ బెంగాల్ | 9 5 | 911 | 6.0 | 9 1 | 6.5 |
| మహారాష్ట్ర | 9.3 | 937 | 4.3 | 9.3 | 5.4 |
| ఒరిస్సా | 9 2 | 981 | 3.7 | 5.3 | 5.1 |
| కేరళ | 8.9 | 1032 | 7 7 | 4.6 | 5.5 |
| మధ్యప్రదేశ్ | 8.0 | 941 | 2.6 | 8.0 | 4.0 |
| హిమాచల్‌ప్రదేశ్ | 7 7 | 973 | 2.5 | 0 8 | 4.7 |
| బీహార్ | 7.5 | 946 | 2.5 | 11.1 | 4.9 |
| రాజస్థాన్ | 7.2 | 919 | 2.4 | 4.6 | 4.2 |
| గుజరాత్ | 7 0 | 942 | 2.9 | 4.0 | 3.6 |
| ఉత్తరప్రదేశ్ | 6.5 | 885 | 1.4 | 13.8 | 4.3 |
| జమ్ము-కాశ్మీర్ | 5 7 | 892 | 1 4 | 0.6 | 5.0 |
| పంజాబ్ | 5 5 | 879 | 1 6 | 1.5 | 3.3 |
| హర్యానా | 4 9 | 870 | 1 5 | 1.1 | 3.9 |
| భారతదేశం | 8 2 | 934 | 2.9 | 100.0 | 5.0 |

వివరణ : మూడవ, ఆరవ కాలంలోని వివరాలు, గ్రామీణ, పట్టణ ప్రాంత భేదం లేకుండా మొత్తం దేశానికి సంబంధించినవి. భారతదేశపు అంచనాలలో అస్సాం రాష్ట్రపు వివరాలు లేవు.

*- జనాభా లెక్కలు, ఇతర పరిశోధిత సమాచారపు ఆధారంతో జీన్‌డ్రేజ్ రూపొందించిన పట్టిక*

2. స్త్రీలలో విద్యావ్యాప్తి పెరిగింది; వారు క్రమంగా చైతన్యవతులవుతున్నారు. సాంఘిక కట్టుబాట్లు క్రమంగా సడలి పోతున్నాయి. ఇందువల్ల భర్త సోదరుని, వితంతువు వివాహమాడటం అనేది తగ్గింది,

3. పునర్వివాహం చేసుకొన్న స్త్రీని చిన్నచూపు చూసే ధోరణి సమాజంలో బలపడటం కనుపిస్తున్నది. "తక్కువ" కులాల వారు సంపన్నులయిన తర్వాత, "అగ్ర" వర్ణాల వారి కంటె సంప్రదాయ నియమాల పాటింపుకు అధికంగా ప్రాకులాడుతూండటం కనుపిస్తున్నది. ఇంతకు పూర్వమే వేరొక చోట చెప్పినట్లు ఇది "సాన్స్క్రిటైజేషన్" ప్రభావం. "అగ్ర" వర్ణాల వారిలో పునర్వివాహ విషయంలో పట్టింపులు సడలుతూండగా, ఈ వర్గాల వారిలో ఇవి బలపడుతున్నాయి!

మొదటి రెండు పరిణామాలు స్త్రీకి పునర్వివాహం విషయంలో స్వేచ్ఛ నీయటానికి తోడ్పడుతూండగా, మూడవది ఆ స్వేచ్ఛను హరించేదిగా తయారవుతున్నది

## గ్రామీణ ప్రాంతంలో వితంతువుల జనాభా

భారత దేశపు వితంతువుల జనాభా, 1981వ సంవత్సరపు అంచనాల ప్రకారం, నాటికున్న మొత్తం స్త్రీల జనాభాలో ఎనిమిది శాతం వరకూ ఉండవచ్చు నని డ్రేజ్ అంచనా వేశారు. ఈ జనాభా పరిమాణ శాతం పన్నెండు వరకూ ఉండవచ్చునని ప్రొఫెసర్ మారీ భట్, ఆర్. కన్నగ్గిలు అంచనా వేశారు. ఇదే సంవత్సరంలో భారతదేశ పురుష జనాభాలో పది శాతం మేరకు వ్యవసాయ కూలీలుంటారని చెప్పి, దేశపు వితంతువుల జనాభా దాదాపు దీనికి సమంగా ఉండవచ్చునని డ్రేజ్ పోలికలు చూపారు.

భారత దేశపు గ్రామీణ స్త్రీ జనాభాలో, 1981వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, వితంతువుల జనాభా 8 2 శాతం వరకూ ఉంటుంది. (మూడవ పట్టికను చూడండి) ఇదే సంవత్సరపు గ్రామీణ పురుష జనాభాలో, భార్యావియోగాన్ని పొందిన పురుష జనాభా (విడోయర్స్ జనాభా) 2 7 శాతం మాత్రంగానే ఉన్నది! వితంతు జనాభాలో ఇది మూడవ వంతు కంటె కూడా తక్కువగా ఉన్నది! జనాభాను రాష్ట్రాల ప్రాతిపదిక మీద చూసినా వితంతు జనాభా, భార్యా వియోగాన్ని పొందిన పురుష జనాభా కంటే అధికంగా ఉన్నది. ఇందుకు మనకు మూడు కారణాలు కనుపిస్తున్నాయి.

1. బిడ్డలను కనే వయసు దాటిన తర్వాత (ప్రధానంగా 35 సంవత్సరాల వయస్సును దాటిన తర్వాత) పురుషుల కంటె స్త్రీలు ఎక్కువ కాలం జీవించ గలుగుతున్నారు. ఈ దశలో స్త్రీ జీవశక్తి తన ఆధిక్యతను ప్రదర్శించ గలుగుతున్నది. (నాల్గవ పట్టికను చూడండి).

2. వివాహ సమయంలో పురుషుల వయసు స్త్రీల వయసు కంటె అధికంగా ఉంటున్నది. అఖిల భారత ప్రాతిపదిక మీద చూచినపుడు, ఈ వ్యత్యాస పరిమాణం, సగటున సుమారుగా ఐదు సంవత్సరాల వరకూ ఉంటున్నది. ఇందువల్ల పురుషునకు భార్యా వియోగం సంభవించటం కంటె, స్త్రీకి భర్తృ వియోగం సంభవించగల అవకాశాలు అధికంగా ఉంటున్నాయి.

3. వితంతువుల పునర్వివాహానికి చాలా పరిమితులు, అవరోధాలు ఉన్నాయి. భార్యా వియోగాన్ని పొందిన పురుషులు పునర్వివాహం చేసుకోవటం అతి సామాన్య విషయమైంది. కొందరు పురుషులు మరణించిన భార్యకు దినం చేసిన మరునాడే పెండ్లి చేసుకోవటం కూడా కనుపిస్తున్నది.

వితంతువుల జనాభా కాలానుగతంగా తగ్గుతున్న సూచనలున్నాయి. జనాభా లెక్కల ప్రకారం 1911వ సంవత్సరంలో, మొత్తం స్త్రీ జనాభాలో వితంతువుల జనాభా 17.3 శాతం వరకూ ఉన్నది 1931 వ సంవత్సరం వచ్చే సరికి, ఇది 15 5 శాతానికి, 1961వ సంవత్సరానికి 11 శాతానికి, 1981వ సంవత్సరానికి 8 2 శాతానికి తగ్గి పోయింది. (మూడవ పట్టికను చూడండి) ఈ పరిణామాన్ని పలువురు పరిశోధకులు ధృవపరచారు ప్రజల జీవన కాల ప్రమాణం దేశ వ్యాపితంగా పెరగటం, వివాహ కాలానికుండే స్త్రీ పురుషుల వయసు క్రమాను గతంగా పెరుగుతూండటం, వధూవరుల వయసు మధ్య నున్న, వ్యత్యాసం క్రమంగా తగ్గుతూండటం ఇందుకు కారణాలుగా చెబుతున్నారు. వితంతువుల పునర్వివాహాలు పెరగటం కూడా ఒక కారణంగా చెబుతున్నారు. కాని ఈ అంశాన్ని అందరూ అంగీకరించటం లేదు. కొన్ని కులాలు, తెగల వారిలో ఇవి పెరిగినా, మరికొన్ని కులాలు, తెగల వారు వీటిని వ్యతిరేకిస్తూండటం వల్ల, వితంతు వివాహాల పెరుగుదల ఊహించినంత అధికంగా లేదు అని వీరంతా భావిస్తున్నారు.

నాల్గవ, ఐదవ పట్టికలలో వితంతువుల జనాభా వయసుకు సంబంధించిన వివరాలున్నాయి. 1981వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం గ్రామీణ వితంతువులలో సగం మందికి పైగా 60 సం॥రాల వయసును మించిన వారే ఉన్నారు. నాల్గవ వంతు మంది వయసు 70 సంవత్సరాలకు మించి ఉన్నది. 25 సం॥రాలు, అంతకు తక్కువ వయసున్న వారు నూటికి ఒక్కరున్నారు. 1981వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, అరవై సంవత్సరాల వయసును మించిన స్త్రీల జనాభాలో అత్యధికులు వితంతువు లుగా ఉండటం గమనించదగిన అంశం. అంతేకాదు; కాలాను గతంగా వృద్ధ వితంతువుల సంఖ్యా పరిమాణం త్వరితగతిని పెరుగుతూ ఉండటం కూడా కనుపిస్తున్నది. ఇందువల్ల వృద్ధు లయిన స్త్రీల సమస్యలూ, వితంతువుల సమస్యలూ పెనవేసుకు పోతున్నాయి. ఇటువంటి పరిణామం భార్యా వియోగాన్ని పొందిన పురుషులను నామ మాత్రంగానే ప్రభావితం చేస్తున్నది. భార్యా వియోగాన్ని పొందిన మొత్తం పురుష జనాభాలో 70 సంవత్సరాల వయసును మించిన వారు 28 శాతం మంది

మాత్రమే ఉండటం ఇందుకు నిదర్శనం. ఈ వయసు వితంతువులు మొత్తం వితంతు జనాభాలో 78 శాతం వరకూ ఉన్నారు ఇది అఖిల భారతపరిస్థితి.

## వితంతు జనాభా పరిమాణంలో ప్రాంతీయ భేదాలు

వితంతు జనాభా పరిమాణాలలో దేశంలోని రాష్ట్రాల మధ్య భేదాలు కనుపిస్తున్నాయి. ఆరవ పట్టికలోని వివరాలను పరిశీలిస్తే దక్షిణాది రాష్ట్రాలలో (ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలో) వితంతు జనాభా పరిమాణ శాతం దేశపు సగటును మించి ఉండటం కనుపిస్తుంది. వితంతువుల సంఖ్యా పరిమాణ శాతం దక్షిణాది రాష్ట్రాలలో కంటె ఉత్తర భారత రాష్ట్రాలలో తక్కువగా ఉన్నట్లు కూడా కనుపిస్తుంది. పశ్చిమోత్తర భారతంలో ఈ పరిమాణ శాతం దేశంలోని ఇతర ప్రాంతాలలో కంటే కూడా తక్కువగా ఉన్నట్లు స్పష్టమవుతుంది. భార్యావియోగాన్ని పొందిన పురుష జనాభా శాత పరిమాణాలు కూడా ఇదే ధోరణిని వ్యక్తం చేస్తున్నాయి దక్షిణాది రాష్ట్రాలలో, భార్యావియోగాన్ని పొందిన ప్రతి పురుషునకూ, 3.9 నుండి 7.7 మంది వరకూ వితంతువులుండగా, ఉత్తరాది రాష్ట్రాలలో వీరి సంఖ్య 1.4 నుండి 1.7 వరకు మాత్రమే ఉన్నది. పంజాబు, హర్యానా, ఉత్తరప్రదేశ్, జమ్ము-కాశ్మీర్ రాష్ట్రాలలో ఈ పరిమాణ భేదం ప్రముఖంగా కనుపిస్తున్నది. ఈ పరిమాణ భేదాలు ఉత్తరాది దక్షిణాది రాష్ట్రాల మధ్య అధికంగా ఉండటానికీ, దక్షిణాది రాష్ట్రాల మధ్యా, పశ్చిమోత్తర భారతంలోని హర్యానా, హిమాచల్ ప్రదేశ్, జమ్ము-కాశ్మీర్, పంజాబ్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాల మధ్య మరింత అధికంగా ఉండటానికి కారణమేమిటో చూద్దాం. (ఈ విషయానికి సంబంధించినంత వరకు దక్షిణ భారతం అంటే ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్రాలుగానూ, దేశంలోని మిగిలిన భాగాన్ని ఉత్తర భారతం గాను పరిగణించాం.)

ప్రజల జీవనకాల ప్రమాణాన్ని (లైఫ్ ఎక్స్‌పెక్టెన్సీని - దీన్నికముందు "ఆయుర్దాయం"గా పేర్కొంటాం), సామాన్యంగా దేశపు సగటుగానో లేక స్త్రీ పురుషులకు వేరు వేరుగానో చెబుతూంటారు. ఈ విషయంలో కూడా ప్రాంతీయ భేదాలున్నాయి. ఉత్తరభారతంలో కంటే దక్షిణ భారతంలోని స్త్రీల ఆయుర్దాయం అధికంగా ఉన్నది. ఉత్తర ప్రదేశ్ ప్రాంత స్త్రీకి 42-43 సంవత్సరాల వయసు నిండిన తర్వాత, ఆవిడకు వైధవ్యం ప్రాప్తించే అవకాశాలు తక్కువగా ఉంటాయి. ఉత్తరప్రదేశ్‌లోని స్త్రీల కంటె, కేరళలోని స్త్రీల ఆయుర్దాయం 24 సంవత్సరాలు అధికంగా ఉంటుందని అంచనా వేస్తున్నారు. అంతేకాదు; ఆ రాష్ట్రంలోని పురుషుల ఆయుర్దాయం కంటే స్త్రీ ఆయుర్దాయం అధికంగా ఉన్నది. ఇందువల్ల ఉత్తరప్రదేశ్‌కు చెందిన 42-43 సంవత్సరాల వయసు నిండిన స్త్రీకి వైధవ్య ప్రాప్తి నుండి లభించగల రక్షణ కేరళ స్త్రీకి లభించటంలేదు.

ఉత్తర భారత దక్షిణ భారత ప్రాంతాల ప్రజల ఆయుర్దాయ పరిమాణ భేదాలు, వైధవ్య ప్రాప్తిలోని ప్రాంతీయ భేదాలను సమగ్రంగా చిత్రించటం లేదు. నిర్ణీత వయసు గ్రూపు వారిని పరిగణనకు తీసుకొంటే. వైధవ్య ప్రాప్తి పరిమాణం ఉత్తర భారతంలో కంటె దక్షిణ భారతంలో చాలా ఎక్కువగా ఉన్నట్లు కనుపిస్తుంది. అరవై సంవత్సరాల వయసు వచ్చే వరకూ, పశ్చిమోత్తర భారత స్త్రీ కంటె దక్షిణాది ప్రాంత స్త్రీకి వైధవ్యం ప్రాప్తించే ప్రమాదం రెట్టింపు అధికంగా ఉంటుంది. (ఐదవ పట్టికలోని వివరాలను చూడండి) అరవై సంవత్సరాల లోపు వయసు పశ్చిమోత్తర ప్రాంత స్త్రీలలో ఇరవై శాతం మందికి వైధవ్యం సంప్రాప్తించగా, దక్షిణ భారతంలో ఇంతకు రెట్టింపు మందికి (40.6 శాతం మందికి) వైధవ్యం ప్రాప్తించినట్లు స్పష్టమవుతున్నది. దక్షిణ భారత ప్రజల ఆయుర్దాయం కంటె పశ్చిమోత్తర ప్రాంత ప్రజల ఆయుర్దాయం తక్కువగా ఉండటమే ఇందుకు కారణమని చెప్పి దీనిని సమర్థించే అవకాశాలు లేవు. దక్షిణ భారత పురుషుల ఆయుర్దాయం కంటే పశ్చిమోత్తర భారత పురుషుల ఆయుర్దాయం తక్కువ గనుక, ఈ ప్రాంత స్త్రీలకు వైధవ్యం ప్రాప్తించే అవకాశాలు అధికంగా ఉండాలి. కాని పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉన్నది!

వివాహ కాలానికి వధూవరుల వయో భేదం ఉత్తర భారతంలో కంటె దక్షిణ భారతంలో అధికంగా ఉన్నందువల్ల, ఉత్తర భారతంలో కంటె దక్షిణ భారతంలో స్త్రీకి వైధవ్యం ప్రాప్తించే అవకాశాలు అధికంగా ఉన్నట్లు కూడా చెప్పబూనవచ్చు ఈ వాదం కూడా సమస్యకు సమగ్ర సమాధానం గాదు. వివాహ కాలం నాటికి, స్త్రీ పురుషుల వయో పరిమాణ భేదం, అఖిల భారత సగటు కంటె, దక్షిణ భారతంలో ఒక్క సంవత్సరం మాత్రమే అధికంగా ఉన్నది.

## ఏడవ పట్టిక

### గ్రామీణ కర్ణాటకలో వివిధ రకాల కుటుంబాల సభ్యుల మాసపు తలసరి ఖర్చు అంచనాలు (1977-78)

| కుటుంబ స్వభావము | స్త్రీ సంరక్షకురాలిగా ఉన్న కుటుంబాలు | పురుషుడు సంరక్షకునిగా ఉన్న కుటుంబాలు | అన్ని రకాల కుటుంబాలు |
|---|---|---|---|
| వితంతువులున్నవి | | | |
| వితంతువు ఒక్కర్తే ఉన్నవి | 83 | - | 83 |
| వితంతువు, ఆవిడ అవివాహిత సంతానం ఉన్నవి | 56 | 72 | 59 |
| వితంతువు, వారివివాహిత కుమారుడు, వారి భార్యా బిడ్డలున్నవి | 93 | 65 | 69 |
| ఇతరాలు | 69 | 59 | 62 |
| పై అన్నికుటుంబాలు | 71 | 65 | 67 |
| వితంతువు లేని కుటుంబాలు | 87 | 84 | 84 |
| అన్ని రకాల కుటుంబాలు | 73 | 81 | 80 |

వివరణ : వివాహిత కుమారునితో వితంతువుంటున్న కుటుంబాలలో, వీరి అవివాహిత సంతానం కూడా ఉంటున్నది.

- నేషనల్ శాంపుల్ సర్వే 32వ రౌండ్ సమాచారం ఆధారంతో డ్రేజ్ రూపొందించిన పట్టిక

## ఎనిమిదవ పట్టిక

### కర్ణాటక గ్రామీణ ప్రాంతంలోని న్యూక్లియర్ (వితంతువు సంరక్షణలో నున్న) కుటుంబాలలోని వారి తలసరి ఖర్చు వివరాలు (1977-78)

| వయసులో పెద్దవాడైన పురుషుని వయసు | కుటుంబాల సంఖ్య | తలసరి ఖర్చు నెలకు రూ.లు | కుటుంబం లోని సభ్యుల సంఖ్య |
|---|---|---|---|
| 0-5 | 5 | 38 | 3.8 |
| 6-10 | 10 | 44 | 4.2 |
| 11-18 | 25 | 48 | 4.5 |
| 19-20 | 5 | 56 | 6.6 |
| 20 సం॥ మించి | 12 | 85 | 5.7 |
| పురుషుడు లేని | 12 | 61 | 2.3 |
| మొత్తం | 69 | 56 | 4.1 |

వివరణ : వితంతువు, ఆవిడ అవివాహిత సంతానం కలిసి ఉంటున్న కుటుంబాన్ని డ్రేజ్ న్యూక్లియర్ ఫామిలీగా వర్గీకరించారు.

- నేషనల్ శాంపుల్ సర్వే 32వ రౌండ్ సమాచారం ఆధారంతో డ్రేజ్ రూపొందించిన పట్టిక

పశ్చిమోత్తర భారతంలో కంటె రెండు సంవత్సరాలు అధికంగా ఉన్నది (ఆరవ పట్టికను చూడండి).

ఈ సమాధానాలన్నిటి కంటె స్త్రీ పునర్వివాహ పరిమాణపు రేటు దక్షిణ భారతంలో కంటె ఉత్తర భారతంలో అధికంగా ఉండటం గమనించవలసిన అంశం. ఇది కూడా, ఉత్తర భారతంలో వైధవ్య ప్రాప్తి పరిమాణం దక్షిణ భారతంలో కంటె తక్కువగా ఉండటానికి తోడ్పడింది. ఉత్తర భారతంలో కంటె దక్షిణ భారతంలో స్త్రీల సామాజిక పరిస్థితులు మెరుగుగా ఉన్నట్లు ఇంతకు పూర్వమే చెప్పాం. స్త్రీ జనాభ్యుదయం ఉత్తరాది కంటె మెరుగుగా ఉన్న దక్షిణ భారతంలో స్త్రీ పునర్వివాహాలు ఎందుకు తక్కువగా ఉన్నాయి అన్న ప్రశ్న ఉదయించటం సహజం. ఉత్తరాదిలో జరుగుతున్న పునర్వివాహాలలో అత్యధిక భాగం, వితంతువును భర్త యొక్క సోదరునకు, బలవంతంగానైనా, అంటగట్టే ఆచారం వల్లనే (మారు మనుము) సంభవిస్తున్నట్లు ఇంతకు పూర్వమే వివరించాం ఇటువంటి ఆచారం దక్షిణ భారతంలో కంటె ఉత్తర భారతంలో విస్తృతంగా ఉన్న వాస్తవాన్ని కూడా ప్రస్తావించాం. ఈరకపు వివాహాలు అధికంగా జరుగుతూండటం ఆప్రాంతపు వెనుకబాటు తనానికి నిదర్శనంగా కనుపిస్తున్నది. అంతేగాని ఆప్రాంతపు స్త్రీ జనాభ్యుదయపు పెంపుకు ఇది సంకేతం గాదు

ఉత్తరాది రాష్ట్రాలలో కంటె పునర్వివాహాల రేటు తక్కువగా ఉండటమే దక్షిణ భారతంలో వితంతువుల సంఖ్య ఉత్తర భారతంలో కంటె అధికంగా ఉండటానికి కారణం అన్నది కూడా సక్రమమైన సమాధానంగా కనుపించుట లేదు. ఉత్తర భారతపు రాష్ట్రాలలో జరిగే వితంతు పునర్వివాహాలలో అత్యధిక భాగం 30 సంవత్సరాల లోపు వయసు వారికే పరిమిత మైనాయి. (ఒకటవ పట్టికను చూడండి) 30 సంవత్సరాల వయసును దాటిన వితంతువులలో పునర్వివాహానికి పూనుకొంటున్న వారి సంఖ్యా పరిమాణం 26 శాతానికి మించి లేదు. ఐదవ పట్టికలోని వివరాలను పరిశీలిస్తే, మొత్తం స్త్రీ జనాభాలోని 30 సంవత్సరాల వయసును మించిన వారిలో, వితంతువుల సంఖ్యా పరిమాణ శాతం అన్ని ప్రాంతాలలో కంటె దక్షిణాది రాష్ట్రాలలో అధికంగా ఉండటం కనుపిస్తుంది. పునర్వివాహాలు అధికంగా జరగటమే వితంతువుల సంఖ్య దక్షిణ భారత రాష్ట్రాలలో కంటె ఉత్తర భారత రాష్ట్రాలలో తక్కువగా ఉండటానికి కారణమైయుంటే, ఈ వయసును దాటిన వారిని పరిగణనకు తీసుకొన్నా, ఉత్తరాది రాష్ట్రాలలో కంటె దక్షిణాది రాష్ట్రాలలో వితంతు జనాభా శాతం ఎందుకు అధికంగా ఉంటున్నది? ఈ రెండు ప్రాంతాలలోనూ స్త్రీ మనుగడకున్న అవకాశాలను పరిశీలించినపుడే ఈ భిన్నత్వానికి కారణం కనుపిస్తున్నది. ఉత్తర భారత రాష్ట్రాలలో - ముఖ్యంగా పశ్చిమోత్తర ప్రాంతాలలో - స్త్రీలు అధిక కాలం జీవించే అవకాశాలు అల్పంగా ఉన్నాయి. ఈ ప్రాంతపు స్త్రీలు ఇతర అన్ని అంశాలలోనూ ఇతర ప్రాంత వాసులతో సమంగా ఉన్నట్లు పరిగణించినా, ఈ ఒక్క లోపం వల్ల వితంతువుల సంఖ్య - ముఖ్యంగా అధిక వయసు గ్రూపుల వారి సంఖ్య - తగ్గిపోతున్నది.

ఈ విధంగా మనం పరిశీలించినపుడు స్త్రీల వైధవ్య ప్రాప్తికి, స్త్రీ జనాభా పురుష జనాభా కంటె తక్కువగా ఉండటానికి సంబంధం కనుపిస్తుంది. పురుష జనాభా కంటె స్త్రీ జనాభా తక్కువగా నున్న రాష్ట్రాలలో, వితంతువుల జనాభా కూడా తక్కువగా ఉన్నట్లు ఆరవ పట్టికలోని సంఖ్యా వివరాలు సూచిస్తున్నాయి. ఈ ప్రాంతాలలోని మొత్తం జనాభాలో పురుష జనాభా కంటె స్త్రీల జనాభా తక్కువగా ఉండటం, ఈ ప్రాంతంలో వితంతువుల జనాభా కూడా తక్కువగా ఉండటం, స్త్రీల మనుగడకు అనుకూల పరిస్థితుల లేమికి సూచికలుగా కనుపిస్తున్నాయి. (రెండవ అంశాన్ని గురించి ఇంతకు పూర్వమే "అదృశ్య స్త్రీల రహస్యం" అన్న అధ్యాయంలో వివరంగా చర్చించాం. ఉత్తర భారతంలో స్త్రీ మనుగడకు ప్రతికూల పరిస్థితులు అధికంగా ఉండటమే అచ్చట స్త్రీ జనాభా, పురుష జనాభా కంటె తక్కువగా ఉండటానికి కారణంగా రుజువు చేశాం). పురుషులతో సమంగా జీవించే అవకాశాలు స్త్రీలకు లేని చోట, వితంతువులకు ఈ అవకాశాలుంటాయని ఆశించలేము. దీనికితోడు, వైధవ్య ప్రాప్తి తర్వాత వారు లోగడ అనుభవించిన దానికంటే తీవ్రమైన ప్రతికూల పరిస్థితుల నెదుర్కొనవలసి వస్తుంది ఇందువల్లనే వితంతువుల మరణాల రేటు, ఉత్తర భారతంలో, దక్షిణ భారతంలో కంటె అధికంగా ఉంటున్నది.

## తొమ్మిదవ పట్టిక

### పలాన్‌పూర్‌లో 1983-84 సం॥లో, సంపాదనాపరులైన పురుషులు కుటుంబంలో లేకుండా జీవితాన్ని గడుపుతున్న వితంతువులు : వివిధ సంవత్సరాల వారీ ఆదాయపు పోలికలు

| వితంతువు పేరు | ఆయా సంవత్సరాలలో జరిగిన సర్వే కాలంలో, ఆయా వితంతువుల కుటుంబాల వారి తలసరి ఆదాయపుటంచనాలు (సంవత్సరానికి - రూపాయలలో) | | | | | 1957-1975 సం॥లు సగటు ఆదాయం మీద 1983-84 సంవత్సరపు ఆదాయ పరిమాణ శాతము |
|---|---|---|---|---|---|---|
| | 1957-58 | 1962-63 | 1974-75 | 1957-75 సం॥ల సగటు | 1983-84 | |
| చంపా | 189 | 387 | 273 | 283 | 314 | 111 |
| లీలావతి | 125 | 215 | 227 | 189 | 129 | 68 |
| లక్ష్మి | 250 | 200 | 184 | 211 | 109 | 52 |
| అష్రఫీ | 221 | 335 | 396 | 317 | 117 | 37 |
| రంప్రూజీ | 197 | 48 | 399 | 215 | 80 | 37 |
| కమ్లి | 199 | 652 | 251 | 367 | 133 | 36 |
| రాంకలి | 278 | 219 | అంచనాలు లభించలేదు | 240 | 39 | 16 |
| ఈ ఏడుగురు వితంతువుల సగటు ఆదాయం | 208 | 294 | 288 | 261 | 132 | 51 |
| పలాన్‌పూర్‌లోని అన్ని కుటుంబాలు | 161 | 162 | 275 | 199 | 194 | 97 |

వివరణ : 1. అన్ని సంవత్సరాల రూపాయి విలువలను డ్రేజ్ 1957-58 సంవత్సరాల విలువకు సవరించారు.
2.1983-84 సంవత్సరాలకు పూర్వం జరిగిన సర్వే కాలాలలో ఈవితంతువులు తమ భర్తలతోనో, లేక వివాహితులైన తమ కుమారులతో కలిసి జీవిస్తున్నారు.
3. 1983-84 సంవత్సరపు అంచనాలు డ్రేజ్ సర్వే వల్ల లభించినవి. మిగిలిన సంవత్సరాల అంచనాలు పలాన్‌పూర్‌లో జరిగిన సర్వేల సమాచారం నుండి డ్రేజ్ సేకరించారు.

*- డ్రేజ్ వ్రాసిన విడోస్ ఇన్ రూరల్ ఇండియా నుండి*

## పదవ పట్టిక

### బంగ్లాదేశ్‌లో వయసువారీ వర్గీకరణ ప్రాతిపదిక మీద వితంతువుల, ముత్తైదువుల మరణాల రేట్లు

| వితంతువుల వయసు గ్రూపు | వర్గపు ప్రతి వంద సంవత్సరాల జీవిత కాలానికి సంభవిస్తున్న మరణాల సంఖ్య | | | | |
|---|---|---|---|---|---|
| | ముత్తైదువులు | వితంతువులు అందరు | కుటుంబ సంరక్షకులుగా వితంతువున్నపుడు | కుమారుల సంరక్షణలో వితంతువున్నపుడు | కుటుంబ సంరక్షకు రాలిగా గాని కుమారుని సంరక్షణలో గాని వితంతువు లేనపుడు |
| 45-54 | 0.89 | 1.36 | 1.68 | 1.15 | 1.63 |
| 55-59 | 1.78 | 2.06 | 2.21 | 2.13 | 1.23 |
| 60-64 | 3.10 | 3.83 | 2.42 | 3.86 | 5.84 |
| 65-69 | 3.81 | 5.56 | 5.20 | 5.15 | 8.27 |
| 70-79 | 9.43 | 9.99 | 8.63 | 9.88 | 11.67 |
| 80సం॥లు ఆపైన | 9.38 | 17.50 | 15.04 | 17.66 | 18.52 |
| మొత్తం | 1.87 | 5.29 | 3.75 | 5.37 | 7.59 |

- బంగ్లాదేశ్‌లో మత్లబ్ సర్వే కోసం రెహ్మాన్ ప్రభృతులు రూపొందించిన ఈ పట్టికను మార్తా ఆల్టర్ చెన్ తాము వ్రాసిన విడోహుడ్ అండ్ వెల్ బీయింగ్ ఇన్ రూరల్ నార్త్ఇండియా అన్న వ్యాసంలో ఇచ్చారు.

## పదకొండవ పట్టిక

**1981వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, మొత్తం జనాభాలోను, వివాహిత జనాభాలోనూ ఉన్న వితంతువుల శాతాలు**

| రాష్ట్రము | మొత్తం జనాభాలో వితంతువుల శాతం | | వివాహిత జనాభాలో వితంతువుల శాతం | |
|---|---|---|---|---|
| | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు |
| ఆంధ్రప్రదేశ్ | 10.2 | 2 1 | 17.7 | 4.5 |
| బీహారు | 7 3 | 2.7 | 12.9 | 5 7 |
| గుజరాత్ | 7 0 | 2.0 | 13 4 | 4.6 |
| హర్యానా | 5.0 | 2.6 | 9.5 | 6.0 |
| హిమాచల్ ప్రదేశ్ | 7.6 | 2.9 | 14.6 | 6.7 |
| జమ్ము-కాశ్మీర్ | 5 7 | 3.2 | 11.7 | 7.8 |
| కర్ణాటక | 9.5 | 1.8 | 18.3 | 4.5 |
| కేరళ | 9.1 | 1.1 | 18 5 | 3.0 |
| మధ్యప్రదేశ్ | 7.8 | 2.7 | 13.8 | 5.7 |
| మహారాష్ట్ర | 8 7 | 1.8 | 16 0 | 4.0 |
| ఒరిస్సా | 9.0 | 2.3 | 17 3 | 5.3 |
| పంజాబ్ | 5.4 | 2.8 | 10.9 | 6.7 |
| రాజస్థాన్ | 7.1 | 2.6 | 12.7 | 5.4 |
| తమిళనాడు | 10 0 | 2.3 | 18.4 | 5.1 |
| ఉత్తరప్రదేశ్ | 6.4 | 3.8 | 11 3 | 8.1 |
| పశ్చిమబెంగాల్ | 9.2 | 1.4 | 17.9 | 3.4 |
| భారతదేశం | 8 0 | 2.4 | 14.8 | 5.4 |

గమనిక · ఈ పట్టికలో "పురుషులు" అన్న కాలాల క్రింద ఇచ్చిన వివరాలు, భార్యావియోగాన్ని పొందిన పురుషుల శాత పరిమాణాలను తెలియ చేస్తున్నాయి.

– ప్రొఫెసర్ పి ఎన్. మారీభట్ వ్రాసిన "విడోహుడ్ అండ్ మోర్టాలిటీ ఇన్ ఇండియా" నుండి

కనుకనే ఈప్రాంతాలలోని వితంతు జనాభాశాతం తక్కువ గా ఉంటున్నది. ఇట్లని దక్షిణ భారతం లోని స్త్రీలు పురుషుల తోడి సమాన ప్రతి పత్తిని అనుభవిస్తున్నట్లు భావించ నవసరం లేదు. ఇతర ప్రాంతాలలోని లింగ పరమైన అసమానతలను దక్షిణ భారత స్త్రీలు కూడా, తరతమ భేదాలతో అనుభవిస్తున్నారు.

ఈ విశ్లేషణ వల్ల దిగువ పేర్కొన్న సత్యాలు మనకు కనుపిస్తున్నాయి :

గత రెండు-మూడు దశాబ్దాల నుండి వితంతువుల జనాభా పరిమాణం తగ్గుతున్న సూచనలు కనుపిస్తున్నాయి. స్త్రీ పురుషుల ఆయుర్దాయ పరిమాణపు పెరుగుదల ఇందుకు తోడ్పడిందని చెప్పవచ్చు.

2. ఉత్తరాది రాష్ట్రాలలో కంటె దక్షిణాది రాష్ట్రాలలో వైధవ్యప్రాప్తి రేటు అధికంగా ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ఇందుకు పలు కారణాలను సూచించవచ్చు. వాటిలో కొన్నివి: ఉత్తరాదిలో కంటె దక్షిణాదిన స్త్రీ మనుగడ అవకాశాలు మెరుగుగా ఉండటం; ఉత్తర భారతంలో కంటె దక్షిణ భారతంలో వధూవరుల వయో భేదం అధికంగా ఉండటం;

పన్నెండవ పట్టిక

భార్యాభర్తల వయోభేదము, 1961-81 సంవత్సరాల మధ్య కాలంలో సంభవించిన 45 సం॥ల వయసును మించిన ప్రతి భార్యా మరణానికి, సంభవించిన భర్తల మరణాలు

| రాష్ట్రాలు | భార్యాభర్తల వయోభేదపు సగటు (సం॥లు) | | | ప్రతి ఒక్క భార్య మరణానికి సంభవిస్తున్న భర్తృ మరణాలు | |
|---|---|---|---|---|---|
| | 1961 | 1971 | 1981 | 1961-71 | 1971-81 |
| ఆంధ్రప్రదేశ్ | 10.5 | 9.7 | 8 1 | 2.9 | 2 9 |
| అస్సాం | 9 3 | 11.4 | - | 2.4 | - |
| బీహార్ | 6.3 | 6.7 | 6.0 | 1 9 | 19 |
| గుజరాత్ | 6.7 | 6 2 | 5.2 | 2.6 | 2.6 |
| హర్యానా | - | 7.2 | 5.8 | - | 2.1 |
| హిమాచల్‌ప్రదేశ్ | - | 9 7 | 8.3 | - | 2.0 |
| జమ్మూ-కాశ్మీర్ | 9.9 | 9 0 | 7 5 | 2.3 | 2.0 |
| కర్ణాటక | 11.6 | 10.8 | 9 1 | 2.8 | 2.9 |
| కేరళ | 9.1 | 8.6 | 7.9 | 3.4 | 3.5 |
| మధ్యప్రదేశ్ | 7.4 | 7.2 | 6 1 | 2.4 | 2.4 |
| మహారాష్ట్ర | 9.9 | 9.0 | 7.4 | 3 4 | 3.0 |
| ఒరిస్సా | 8.0 | 7.5 | 7.3 | 2.1 | 2.1 |
| పంజాబ్ | - | 6.1 | 5.2 | - | 2.3 |
| రాజస్థాన్ | 7.9 | 7.1 | 6 0 | 2 9 | 2.8 |
| తమిళనాడు | 9.5 | 8.9 | 8.2 | 2.2 | 2.2 |
| ఉత్తరప్రదేశ్ | 6.3 | 6.4 | 5.5 | 2.0 | 2.1 |
| పశ్చిమబెంగాల్ | 12.0 | 10.5 | 9.8 | 3.4 | 3.1 |
| మహాపంజాబ్ | 7.8 | 6.9 | 5.8 | 2.4 | 2.2 |
| భారతదేశం | 8.4 | 8.1 | 7.0 | 2.5 | 2.5 |

*- 1961, 1971, 1981 జనాభా లెక్కల ఆధారంతో ప్రొఫెసర్ మారీ భట్ రూపొందించిన పట్టిక*

ఉత్తర భారతంలో వితంతు పునర్వివాహాలు, దక్షిణ ప్రాంతాలలో కంటె అధికంగా జరుగుతూండటం; దక్షిణ భారతంలో కంటె ఉత్తర భారతంలో వితంతువుల మరణాల రేటు అధికంగా ఉండటం.

3. స్త్రీ వయసు పెరిగిన కొలదీ వితంతు జనాభా కూడా పెరగటం కనుపిస్తుంది. వయసు ముదిరేవరకూ జీవించగల భారత స్త్రీకి వైధవ్యం ప్రాప్తించే అవకాశాలు అత్యధికంగా ఉన్నాయి.

4. వయసు ముదిరిన పురుషులలో భార్యా వియోగ పరిమాణం ఇంత అధికంగా లేదు. పురుష జనాభాలో భార్యా వియోగాన్ని పొందిన వారిశాతం, 1991వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం రెండున్నర మేరకి ఉన్నది; వితంతువుల

కంటె, భార్యావియోగాన్ని పొందిన పురుషులలో అత్యధికులు పునర్వివాహాలు చేసుకొంటూ ఉండటంవల్ల, వితంతువుల సంఖ్యా పరిమాణం కంటె, భార్యా వియోగాన్ని పొందిన వారి సంఖ్యా పరిమాణం తక్కువగా ఉంటున్నది

దీనిని బట్టి భారత దేశంలో జీవిత భాగస్వామిని కోల్పోవటం అనేది ప్రధానంగా స్త్రీల సమస్యగా తయారయినట్లు స్పష్టమవుతున్నది భర్తృవియోగాన్ని పొందటం వల్ల వితంతువు అనుభవించవలసి వస్తున్న బాధలను, భార్యా వియోగాన్ని పొందిన పురుషులు కూడా అనుభవించ వలసి వస్తే, వితంతువుల సమస్య ఇంతటి నిరాదరణకు గురయి ఉండేదిగాదు. ఇది ప్రధానంగా స్త్రీ సమస్యే గనుక, ఇతర మహిళా సమస్యల వలె ఎవరికీ పట్టనిదైంది

## వైధవ్యప్రాప్తితో దాపురించే దారిద్ర్యం

వైధవ్య ప్రాప్తితో స్త్రీ జీవితం అస్తవ్యస్త మవుతుంది. భర్త ఆస్థిని అనుభవించే అవకాశాలు అంతరించవచ్చు. జీవన వ్యవస్థలో సంక్షుభిత పరిస్థితులు ఏర్పడవచ్చు ఆర్థికంగా వితంతువు అత్యంత ప్రమాదకరమైన పరిస్థితిలో పడవచ్చు. భర్తృ మరణానంతరం వారి వితంతువు ఇంతటి ప్రమాదకరమైన పరిస్థితులలో చిక్కుకొన్నా, పరిశోధనా సాహిత్యంలో ఆవిడ అనుభవించ వలసిన దారిద్ర్య పరిమాణాన్ని, దాని రూపాలను వివరించ గల పత్రాలు దాదాపు కరువుగావటం విచారకరమైన విషయం ఇందువల్ల వితంతువుల సమస్యల ప్రాధాన్యతే వెలుగుకు రావటం లేదు. కనుకే రాజకీయ నాయకులకే గాదు, స్త్రీజనోద్ధారకులకు కూడా ఇది పట్టని సమస్యగా తయారైంది

అతి కొద్దిమంది పరిశోధకులు మాత్రమే భర్తృ మరణానంతరం వితంతువు ఎదుర్కొన వలసిన ఆర్థిక ఇబ్బందులను వివరించ గల పరిశోధనా పత్రాలను ప్రచురించారు. మీడ్ కెయిన్ 1981వ సంవత్సరంలోనూ, కాడ్వెల్ ప్రభృతులు 1988వ సంవత్సరంలోనూ, జీన్ డ్రేజ్ 1990వ సంవత్సరంలోనూ ప్రచురించిన పరిశోధనా పత్రాలు భారతీయ వితంతువుల ఆర్థిక పరిస్థితులను చిత్రించ ప్రయత్నించాయి. 1991 వ సంవత్సరంలో మార్తా ఆల్టర్ చెన్, 1995వ సంవత్సరంలో మార్తా, డ్రేజ్‌లు ప్రచురించిన పత్రాలు భారతీయ గ్రామీణ వితంతువుల ఆర్థిక, సాంఘిక జీవన విధానాలను వివరిస్తున్నాయి మీడ్ కెయిన్ భారత దేశంలోని మూడు గ్రామాలలోనూ, బంగ్లాదేశ్‌కు సంబంధించిన ఒక గ్రామంలోనూ సర్వే నిర్వహించారు. యవ్వన దశలో వైధవ్యం సంప్రాప్తించిన స్త్రీలు, పురుష సంతానం లేని వితంతువులు భర్త ఆస్థిని దక్కించుకోలేక పోయిన దీన స్థితిని వీరు చిత్రించారు.

జీన్ డ్రేజ్, నేషనల్ శాంపుల్ సర్వే సంస్థ కర్ణాటకలో నిర్వహించిన సర్వేలోని కుటుంబ ఖర్చులకు సంబంధించిన సమాచారాన్ని వినియోగించుకొని, వితంతువులు అనుభవించ వలసి వస్తున్న దారిద్ర్య పరిమాణాన్ని చిత్రించటానికి ప్రయత్నించారు. ఈ సర్వేలో కుటుంబంలోని ఒక్కొక్క సభ్యుని తలసరి ఖర్చులను పరిగణనకు తీసుకోకుండా, కుటుంబం మొత్తానికి ఎంత ఖర్చువుతున్నది అన్న అంశాన్ని, పరిగణనకు తీసుకొన్నారు ఇందువల్ల కుటుంబపు ఆదాయ వినియోగంలో, ఎవరి కెంత ఖర్చవుతున్నది అన్న అంశపు నిర్ధారణ సాధ్యంగాలేదు. వ్యక్తిగత ఖర్చులను ఇచ్చి ఉన్నట్లయితే, పోషణ, ఆరోగ్య సంరక్షణాది విషయాలలో ఎంతటి వివక్షకు వితంతువు గురవుతున్నది అన్న విషయ నిర్ధారణకు వీలుండేది. ఈ కారణం వల్ల డ్రేజ్ ఈ సర్వే ఫలితాలతో సంతృప్తి పడలేదు. పి.వి. శ్రీనివాస్ తో కలిసి ఈ అంశం మీద మరో పరిశోధనా పత్రాన్ని 1998లో ప్రచురించారు.

డ్రేజ్ పరిశోధనా కృషివల్ల నిర్ధారణైన వాటిలోని ముఖ్యాంశాల నిచట సంక్షిప్తంగా ఇస్తున్నాం :

1. పురుషుని సంరక్షణలో ఉన్న కుటుంబ సభ్యుల తలసరి ఖర్చుకంటె, స్త్రీ సంరక్షణలోని కుటుంబ సభ్యుల తలసరి ఖర్చు పదిశాతం తక్కువగా ఉన్నది. వితంతువు లేని కుటుంబాలలోని సభ్యుల తలసరి ఖర్చు కంటె, వితంతువున్న కుటుంబాలలోని వారి తలసరి ఖర్చు 25 శాతం తక్కువగా ఉన్నది

2. వితంతువున్న అన్ని రకాల కుటుంబాల కంటె, వితంతువుల సంరక్షణలో నున్న న్యూక్లియర్ కుటుంబం అతి పేదదిగా కనుపిస్తున్నది. (వితంతువు, ఆవిడ అవివాహిత సంతానంతో ఉన్న కుటుంబాన్ని డ్రేజ్ "న్యూక్లియర్" కుటుంబంగా పేర్కొన్నారు.) అన్ని రకాలకు చెందిన కుటుంబాలలోని సభ్యుల తలసరి సగటు ఖర్చు మాసానికి 80 రూపాయలుండగా, న్యూక్లియర్ కుటుంబ సభ్యుల తలసరి

## పదమూడవ పట్టిక

## 1961-71, 9171-81 సం॥ల మధ్య సంభవించిన 45 సం॥ల వయసును మించిన వితంతువుల మరణాలు, భార్యా వియోగాన్ని పొందిన పురుషుల మరణాలు

| రాష్ట్రం | ప్రతిఒక్క ముత్తైదువు మరణానికి సంభవిస్తున్న వితంతు మరణాలు | | | భార్యబ్రతికుండగా సంభవించిన ప్రతిపురుష మరణానికి సంభవిస్తున్న భార్యావియోగాన్ని పొందిన పురుషుల మరణాలు | | | వితంతు మరణాలు మైనస్, భార్యావియోగాన్ని పొందిన పురుష మరణాలు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1961-71 | 1971-81 | సగటు | 1961-71 | 1971-81 | సగటు | 1961-71 | 1971-81 | సగటు |
| ఆంధ్రప్రదేశ్ | 1.51 | 1.74 | 1.63 | 1.78 | 2.03 | 1.91 | -0.27 | -0.29 | -0.28 |
| అస్సాం | 0.88 | - | - | 2.40 | - | - | -1.52 | - | - |
| బీహారు | 1.79 | 1.89 | 1.84 | 2.15 | 2.25 | 2.20 | -0.36 | -0.36 | -0.36 |
| గుజరాత్ | 1.73 | 1.77 | 1.75 | 1.63 | 1.63 | 1.63 | 0.10 | 0.14 | 0.12 |
| హర్యానా | - | 2.06 | - | - | 1.69 | - | - | 0.37 | - |
| హిమాచల్‌ప్రదేశ్ | - | 1.26 | - | - | 2.13 | - | - | 0.87 | - |
| జమ్ము-కాశ్మీర్ | 1.57 | 1.49 | 1.53 | 1.52 | 1.68 | 1.60 | 0.05 | -0.19 | -0.07 |
| కర్ణాటక | 1.51 | 1.31 | 1.41 | 1.94 | 1.89 | 1.92 | -0.43 | -0.58 | -0.51 |
| కేరళ | 1.80 | 1.52 | 1.66 | 1.82 | 1.48 | 1.65 | -0.02 | 0.04 | 0.01 |
| మధ్యప్రదేశ్ | 1.64 | 1.64 | 1.64 | 1.81 | 1.75 | 1.78 | -0.17 | -0.11 | -0.14 |
| మహారాష్ట్ర | 2.00 | 1.66 | 1.83 | 1.75 | 1.82 | 1.79 | 0.25 | -0.16 | 0.04 |
| ఒరిస్సా | 2.02 | 1.24 | 1.63 | 2.15 | 1.93 | 2.04 | -0.13 | -0.69 | -0.41 |
| పంజాబు | - | 2.32 | - | - | 1.43 | - | - | 0.89 | - |
| రాజస్థాన్ | 2.08 | 1.65 | 1.87 | 1.56 | 1.53 | 1.55 | 0.52 | 0.12 | 0.32 |
| తమిళనాడు | 1.43 | 1.48 | 1.46 | 2.05 | 2.10 | 2.08 | -0.62 | -0.62 | -0.62 |
| ఉత్తరప్రదేశ్ | 2.24 | 2.30 | 2.27 | 1.81 | 1.75 | 1.78 | 0.43 | 0.55 | 0.49 |
| పశ్చిమబెంగాల్ | 2.22 | 1.42 | 1.82 | 1.57 | 2.41 | 1.99 | 0.65 | -0.99 | -0.17 |
| మహాపంజాబ్ | 2.47 | 2.07 | 2.27 | 1.53 | 1.60 | 1.57 | 0.94 | 0.47 | 0.71 |
| భారతదేశం | 1.87 | 1.77 | 1.82 | 1.78 | 1.82 | 1.80 | 0.09 | -0.05 | 0.02 |

వివరణ : 1. అస్సాం సంఖ్యా వివరాలలో మేఘాలయ, మిజోరాంల అంచనాలు కలిసి ఉన్నాయి.

2. మహాపంజాబు వివరాలలో, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్, చండీగఢ్ వివరాలు కలిసి ఉన్నాయి

- ఆయా సంవత్సరాల జనాభా లెక్కల ఆధారంతో ప్రొఫెసర్ మారీభట్ రూపొందించిన పట్టిక

ఖర్చు 56 రూపాయలు మాత్రం గానే ఉన్నది. (ఏడవ పట్టికను చూడండి).

3 న్యూక్లియర్ కుటుంబాల కంటె, (వితంతు సంరక్షణలో నున్న కుటుంబాలకంటే కూడా) పురుషుల సంరక్షణలోని కుటుంబాలలో వితంతువులున్న కుటుంబాలు పేదవిగా కనుపిస్తున్నాయి. స్త్రీల సంరక్షణ కింద ఉన్న కుటుంబాల కంటె, పురుషుల సంరక్షణ కింద ఉన్న కుటుంబాలు పెద్దవి (వీటిలోని కుటుంబ సభ్యుల సంఖ్య అధికంగా ఉన్నది) కుటుంబాదాయం తక్కువగా ఉండటానికి తోడు, ఆకుటుంబంలో వితంతు వుండటమే గాక, పోషించ వలసిన సభ్యుల సంఖ్యకూడా ఎక్కువగా ఉన్నది ఇవి పేదవిగా కనుపించటానికిదే కారణమై యుంటుంది.

అన్ని రకాల కుటుంబాల కంటె న్యూక్లియర్ కుటుంబాలు పేదవి. ఈ కుటుంబాలన్నిటి దారిద్ర్య భారం ఒకే రకంగా లేదు; తర తమ భేదాలున్నాయి. కొన్ని కుటుంబాలు, మరికొన్నిటి కంటె అధిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నట్లు డ్రేజ్ నిరూపించారు. (ఎనిమిదవ పట్టికను చూడండి) పద్ధెనిమిది సంవత్సరాలు - అంతకంటె తక్కువ వయసున్న మగపిల్లలున్న కుటుంబాలు, ఇంతకంటే అధిక వయసున్న మగపిల్లలున్న కుటుంబాల కంటె పేదవన్న అంశాన్ని ఈ పట్టికలోని వివరాలు నిరూపిస్తున్నాయి. పద్ధెనిమిది సంవత్సరాలు - అంతకంటె తక్కువ వయసున్న మగపిల్లలున్న కుటుంబాల సభ్యుల మాసవారీ తలసరి సగటు ఖర్చు 48 రూపాయలుండగా, ఇంతకంటె అధిక వయసున్న మగవారున్న కుటుంబాల సభ్యుల తలసరి సగటు మాసవారీ ఖర్చు 85 రూపాయల వరకూ ఉండటాన్ని పట్టికలోని వివరాలు సూచిస్తున్నాయి. వయసొచ్చిన మగపిల్లలు సంపాదనా పరులవుతారు. ఇందువల్ల వీరున్న కుటుంబాల ఆదాయం, మొదటి వర్గపు కుటుంబాల ఆదాయం కంటె ఎక్కువగా ఉండటం సహజం. అందుచేతనే ఈ కుటుంబాలు మొదటి వర్గపు కుటుంబాల కంటె అధిక సొమ్మును ఖర్చు చేయగలుగుతున్నారు.

ఈ వివరాలు వితంతువుల ఆర్థిక నిస్సహాయ స్థితిని స్పష్టంగా చిత్రిస్తున్నాయి. నేషనల్ శాంపుల్ సర్వే వారు కర్ణాటక, గుజరాత్, మహారాష్ట్ర గ్రామీణ ప్రాంతాలలో సేకరించిన వ్యవసాయ కమతాల పరిమాణాలను, వాటి మీద వస్తున్న ఆదాయ పరిమాణాలను ఇస్తూ, వితంతువులకు వ్యవసాయ భూములున్నపుడు, వారి దారిద్ర్య బాధా తీవ్రత తగ్గుతుందన్న అంశాన్ని డ్రేజ్ నిరూపించారు

వీరు ఇంతటితో సంతృప్తి చెందకుండా, ఉత్తరప్రదేశ్‌కు చెందిన పలాన్‌పూర్ గ్రామంలో తాము నిర్వహించిన సర్వే ఫలితాల నిస్తూ, వితంతువు దారిద్ర్య భారాన్ని చిత్రించ ప్రయత్నించారు. తమ సర్వే ఫలితాలతో పాటు ఇంతకు పూర్వం కొందరు పరిశోధకులు సేకరించిన సర్వే సమాచారాన్ని కూడా జోడించి, భర్త మరణానంతరం, వితంతువు ఆదాయం తగ్గుతుందన్న వైనాన్ని చక్కగా చిత్రించారు. ( ఈవివరాలను తొమ్మిదవ పట్టికలో చూడవచ్చు). ఈపట్టికలో పేర్కొన్న ఇల్లాండ్ర భర్తలు మూడవ, నాల్గవ సర్వేలు జరుగుతున్న కాలంలో మరణించారు భర్తలు పోగానే వితంతువుల ఆదాయం ఎంత త్వరగా పడిపోయిందో పట్టికలోని సంఖ్యా వివరాలు చిత్రిస్తున్నాయి వస్తున్న ఆదాయం అకస్మాత్తుగా పడిపోతే ఏ కుటుంబమయినా బాధపడవలసి వస్తుందన్నది అందరూ ఎరిగిన విషయమే. ఇక భర్తలు మరణించిన తర్వాత, వారి వితంతువులు బాధపడతారు అని ప్రత్యేకంగా వివరించ నవసరంలేదు.

నీలా ముఖర్జీ 1991, 1992 సంవత్సరాల కాలంలో పశ్చిమ బెంగాలులోని మూడు గ్రామాలలో ఈ అంశంమీద పరిశీలనలు జరిపారు. ఏకాకిగా నివసించవలసి వచ్చిన వితంతువులు, అవివాహిత సంతానంతో జీవితాన్ని గడుపుతున్న వితంతువులు, ఇతర రకాల వితంతువుల కంటె పేదలుగా ఉన్నట్లు వీరి పరిశీలనలు రుజువు చేశాయి.

భర్త మరణానంతరం వారి వితంతువు, ఆవిడ కన్నబిడ్డలు బాధలు పడవలసి వస్తుంది అన్న విషయాన్ని ఈ పరిశీలనలు నిరూపిస్తున్నాయి. పట్టికలలో కనుపించే సంఖ్యా సమాచారం, భర్త మరణానంతరం వితంతువు పలు రకాల ఆర్థిక ఇబ్బందులను పడవలసి వస్తుందన్న విషయాన్ని మాత్రమే చిత్రిస్తున్నాయి. ఆవిడ అనుభవించవలసి వస్తున్న అదృశ్య బాధలనివి చూపలేక పోతున్నాయి. ఎవరికీ కొరగాని వ్యక్తిగా, కుటుంబీకులకు పట్టని ఏకాకిగా, సామాజికులకు అపశకున సూచికగా ఆవిడ జీవించ వలసి వస్తున్నది. అర్ధాకలితో, జీర్ణ వస్త్రాలతో, నివాసయోగ్యం గాని నివాస వసతిలో, రక్షణ

## తల్లులవలె అధికంగా మరణిస్తున్న వితంతువుల సంతానం

వితంతువుల అధిక మరణాల ప్రభావం వారి సంతానం మీద కూడా కనుపిస్తున్నది. స్త్రీ వైధవ్యప్రాప్తి యొక్క మరో ఫలితమిది. ముప్ఫైసంవత్సరాల లోపు వయసు వితంతువుల సంతాన మరణాలరేటు, ఇదే వయసు గ్రూపుకు చెందిన ముత్తైదువుల సంతాన మరణాలరేటు కంటే ఇరవైశాతం అధికంగా ఉన్నట్లు ప్రొఫెసర్ మారీ భట్, ఇరుదయ రాజన్ లు జరిపిన పరిశీలనలు వెల్లడించాయి ఇతర ఆసియా దేశాలలోనూ ఈ మరణాల రేటు 15 నుండి 50 శాతం వరకూ అధికంగా ఉన్నట్లు ఐక్యరాజ్యసమితి రిపోర్టులు సూచిస్తున్నాయి.

వితంతువుల సంతాన మరణాలరేట్లు మన దేశంలోని అన్ని రాష్ట్రాలలోనూ ఒకే పరిమాణంలో లేవు. వయసు ముదిరిన వితంతువుల మరణాల రేట్ల కవి భిన్నంగా ఉన్నాయి. దక్షిణ భారతంలో వితంతువుల పిల్లల మరణాలరేట్లు తమ తల్లుల మరణాలరేట్ల కంటె ఇరవెయ్యైదు శాతానికి మించి ఉండగా, ఉత్తరభారతంలో, ముఖ్యంగా పంజాబ్, హర్యానా; ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో ఇవి పదిశాతం కంటె కూడా తక్కువగా ఉన్నాయి. దక్షిణ భారతంలో వితంతువుల మరణాల రేట్లకంటె వారిపిల్లల మరణరేట్లు అధికంగా ఉండగా, ఉత్తర భారతంలో వితంతువుల మరణ రేట్లకంటే వారి సంతానపు మరణాల రేటు తక్కువగా ఉన్నది! వయసుముదిరిన వితంతువుల మరణాల రేట్లు, దక్షిణ భారతంలో కంటే, ఉత్తరభారతంలో, వారి సంతానపు మరణ రేట్లు కంటే కూడా అధికంగా ఉన్నాయి. ఇందుకు కారణమేమిటి?

ఉత్తర భారతంలో జాయింట్ కుటుంబాలు ఇంకా అధికంగానే ఉన్నాయి. ఇదొక సంప్రదాయంగా వస్తూనే ఉన్నది. భర్త మరణించిన స్త్రీని, వారి సోదరుడు భార్యగా స్వీకరించే సంప్రదాయపు పాటింపు కూడా విస్తృత ప్రాంతంలో ఉన్నది. ఇందువల్ల, వితంతువు సంతానానికి, వయసులోనున్న వితంతువులకూ తగినంత ఆదరణ లభిస్తున్నది. ఈ కారణం వల్లే ఇరువురి మరణాల రేట్లు తక్కువగా ఉంటున్నాయి.

దక్షిణ భారతంలో ఇందుకు భిన్నమైన సంప్రదాయం ఆచరణలో నున్నది. ఈ ప్రాంతంలో జాయంట్ కుటుంబాలు దాదాపు అంతరించాయి. ఇందువల్ల భర్త మరణానంతరం పిల్లల పోషణ, సంరక్షణా భారాలను, వితంతువు భరించవలసి వస్తున్నది. భర్తమరణానంతరం జీవితం అస్తవ్యస్తమైపోయి దారిద్ర్యపు బాధను అనుభవించ వలసి వస్తున్న వితంతువు, పిల్లలకు తగిన పోషణను, రక్షణనూ ఇవ్వలేక పోతున్నది. అందువల్లనే వితంతువు సంతాన మరణరేట్లు దక్షిణ భారతంలో అధికంగా ఉంటున్నాయి.

వయసు ముదిరిన దశలో, ఉత్తర భారతంలో, వితంతువును భర్త సోదరుడు కూడా భార్యగా స్వీకరించడు. తానుగాని, తన కుమారుడు గాని కుటుంబ సంరక్షకునిగా లేక పోయినపుడు, వితంతువు మరొకరి పంచన, జాయంట్ కుటుంబమున్నచోట్ల, వాటిలో బ్రతక వలసివస్తుంది. ఈ దశలో వితంతువు సంరక్షణకు తగినంత శ్రద్ధను కుటుంబీకులు ప్రదర్శించరు. కనుక వయసు ముదిరిన వితంతువుల మరణాలు, నిరాదరణ కారణంగా, యవ్వనదశలో కంటే అధికంగా ఉంటున్నాయి.

భారత దేశంలో వితంతువుల సమస్యలను అధ్యయనం చేసేవారు యవ్వనదశలో నున్న వితంతువులకు, వయసు ముదిరిన వితంతువులకు మధ్యనున్న ఈ తేడాను దృష్టిలో ఉంచుకోవాలి.

- (ప్రొఫెసర్ పి. యన్ మారీ భట్ వ్రాసిన "విడోహుడ్ అండ్ మోర్టాలిటీ ఇన్ ఇండియా" వ్యాసపు ఆధారంతో,

కరువై, ప్రేమాదరణలకు దూరమై వితంతువు జీవించ వలసి వస్తున్నది (వితంతువులలోనూ అదృష్ట వంతులుండకపోరు; కాని అధికుల స్థితి దయనీయంగా ఉంటుందని చెప్పటమే మా లక్ష్యం)

దిగజారిన జీవన పరిస్థితులు ఆవిడను అనారోగ్యంపాలు చేస్తున్నాయి. పిండి కొలది రొట్టె అన్నారు పెద్దలు. జీవితం సుఖప్రదంగా ఉంటే, ఆవిడ రోగపీడిత గానవసరం లేదు; అకాల మరణం ఆవిడ జీవన సమస్యా పరిష్కార మార్గంగా మార నక్కర లేదు.

## వితంతువుల అకాల మరణాలు

ఈ దుస్థితికి దారిదీస్తున్న కారణాల నిర్ణయానికి కొన్ని పరిశీలనలు జరిగాయి. బంగ్లాదేశ్‌లో జరిగిన కొన్ని పరిశీలనలలో ముత్తైదువుల మరణాల రేట్లను వితంతువుల మరణాల రేట్లతో పోల్చి చూసే ప్రయత్నం జరిగింది. మత్లబ్ సర్వేలెన్సుసిస్టం కింద బంగ్లాదేశ్‌లో 1974-1982 సంవత్సరాల మధ్యకాలంలో రెహ్మాన్ ప్రభృతులు జరిపిన సర్వేలో 45 సంవత్సరాల వయసుదాటిన వితంతువుల మరణాల రేట్లను పరిశీలించి చూచారు. (ఈ వివరాలను పదవ పట్టికలో చూడవచ్చు) ఇదే వయసు గ్రూపులోని ఇతర స్త్రీల కంటె, వితంతువుల గ్రూపులోని వారి మరణాల రేట్లు అధికంగా ఉండటాన్నీ సంఖ్యా వివరాలు సూచిస్తున్నాయి. ఏకాకిగా జీవిస్తున్న వితంతువులూ, తమ కుమారుల రక్షణలోగాక ఇతరుల పంచన జీవిస్తున్న వితంతువులూ మరణించే అవకాశాలు, ఇతర వితంతువుల కంటె అధికంగా ఉంటున్నట్లు కూడా ఈ పరిశీలనా ఫలితాలు రుజువు చేశాయి. కుటుంబంలో కుమారుడుండటం, లేదా వితంతువే కుటుంబ సంరక్షకురాలిగా ఉండటం సంభవించిన సందర్భాలలో వితంతువుల మరణాల రేట్లు తక్కువగా ఉన్నట్లు, ఇటువంటి వసతికి నోచుకోక, ఇతరుల సంరక్షణలో బ్రతుక వలసి వచ్చినపుడు, వారి మరణాల రేట్లు అధికంగా ఉంటున్నట్లు ఈ సర్వే రుజువు చేసింది.

ధార్వాడ్‌లోని పాప్యులేషన్ రిశర్చి సెంటర్‌కు చెందిన ప్రొఫెసర్ పి.యన్ మారీ భట్ 1961, 1971, 1981 సంవత్సరాల జనాభా లెక్కల ఆధారంతో ఈ అంశాన్ని, తాము వ్రాసిన "విడోహుడ్ అండ్ మొర్టాలిటీ ఇన్ ఇండియా" అన్న పరిశోధనా పత్రంలో రుజువు చేశారు.

భారత దేశపు జనాభాకు సంబంధించిన విషయాలను పరిశీలించేటపుడు, ప్రాంతీయ భేదాలను విస్మరించ కూడదు పదకొండవ పట్టికలో భారతదేశ జనాభాలో వితంతు జనాభా శాతాలను, వివాహిత స్త్రీ-పురుషుల జనాభా పరిమాణ శాతాలను చూడవచ్చు. దక్షిణ భారతానికి చెందిన ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలోని మొత్తం స్త్రీ జనాభాలో వితంతువుల జనాభా తొమ్మిది నుండి పదిశాతం వరకూ ఉన్నది. ఉత్తర భారతానికి చెందిన ఉత్తరప్రదేశ్, హర్యానా, పంజాబు, రాజస్థాన్ రాష్ట్రాలలో వితంతు జనాభా మొత్తం స్త్రీ జనాభాలో ఐదు నుండి ఏడు శాతం వరకు మాత్రమే ఉన్నది. మొత్తం వివాహిత స్త్రీ జనాభాలో వితంతు జనాభా శాత పరిమాణంలో కూడా ఇలాంటి ప్రాంతీయ భేదాలున్నాయి.

ఈ ప్రాంతీయ భేదాలను జీన్ డ్రేజ్ గుర్తించిన విషయాన్ని ఇంతకు పూర్వమే ప్రస్తావించాం. ఉత్తర భారతంలో జీవన పరిస్థితులు వితంతువుల మనుగడకు అనుకూలంగా లేకపోవటం చేత వారి మరణాల రేటు దక్షిణ భారతంలో కంటె అధికంగా ఉన్నట్లు వారు సూచించారు. ప్రొఫెసర్ మారీ భట్ ఈ విషయాన్ని మరింత వివరంగా పరిశీలించి తేల్చిన సంఖ్యా సమాచారం ఈ దృక్పథాన్ని బలపరుస్తున్నది.

ఉత్తర భారతంలో, భార్యాభర్తల మధ్య వయోభేదం, దక్షిణ భారతంలో కంటె తక్కువగా ఉన్నది. ఇందువల్లనే ఉత్తర భారతంలో వితంతు జనాభా దక్షిణ భారతంలో కంటె తక్కువగా ఉన్నది అని భావించటానికి అవకాశాలున్నాయి. వివాహిత స్త్రీ పురుషుల (భార్యా భర్తల) మరణ రేట్లను కూడా ఈ అంశం ప్రభావితం చేయగలదని ప్రొఫెసర్ మారీ భట్ సూచించారు.

పన్నెండవ పట్టికలోని వివరాలను పరిశీలిస్తే భార్యాభర్తల మధ్యనున్న వయో భేదం అన్ని రాష్ట్రాలలోనూ, 1961వ సంవత్సరం తర్వాత క్రమానుగతంగా తగ్గటం కనుపిస్తుంది. అఖిల భారత స్థాయిలో 1961వ సంవత్సరంలో 8.4 సంవత్సరాలుగానున్న వయో భేదం, 1981వ సంవత్సరం వచ్చే సరికి ఏడు సంవత్సరాలకు తగ్గింది. కాని భార్యాభర్తల మరణాల నిష్పత్తి మాత్రం మారలేదు. 45 సంవత్సరాల వయసును దాటిన స్త్రీ యొక్క భర్త మరణించే అవకాశం, వారి భార్య

మరణించే అవకాశం కంటె రెండున్నర రెట్లు అధికంగా ఉన్నట్లు ప్రొఫెసర్ భట్ ఇచ్చిన అంచనాలు సూచిస్తున్నాయి దీనికి మరొక విధంగా కూడా చెప్పవచ్చు. స్త్రీకి 45 సంవత్సరాల వయసు నిండిన తర్వాత, తాను మరణించటం కంటే, ఆవిడ భర్త మరణించే అవకాశాలు (ఆవిడకు వైధవ్యం ప్రాప్తించే అవకాశం) రెండున్నర రెట్లు అధికంగా ఉన్నది. జనాభా లెక్కల సేకరణ జరిగిన 1961-1971 సంవత్సరాల మధ్యకాలంలో గాని, 1971-1981 సంవత్సరాల మధ్యగాని ఈ పరిమాణంలో మార్పులేదు. ఆనిష్పత్తి 2.5 స్థిరంగా ఉన్నది. భార్యాభర్తల వయో భేదం 1961-1981 సం॥ల మధ్యకాలంలో తగ్గినట్లు కనుపించినా, ఈ నిష్పత్తి ఎందుకు మారలేదు? వయసు ముదిరిన దశలో మరణాల రేట్ల తగ్గుదల పురుషులలో కంటె స్త్రీలలో అధికంగా ఉండటమే కారణమని ప్రొఫెసర్ మారీ భట్ సూచించారు. దక్షిణ భారత రాష్ట్రాలలో భార్యకు 45 సంవత్సరాల వయసు దాటిన తర్వాత, ఆవిడ మరణించటం కంటె, ఆవిడ భర్త మరణించే అవకాశాలు మూడు రెట్లు అధికంగా ఉన్నాయి. ఉత్తరాది రాష్ట్రాలలో ఈ అవకాశం రెండు రెట్లు మాత్రమే అధికంగా ఉన్నది. ఉత్తర భారతంలో కంటె స్త్రీల మనుగడ అవకాశాలు దక్షిణ భారతంలో అధికంగా ఉండటమే ఈ భేదానికి కారణమని కూడా ప్రొఫెసర్ మారీ భట్ సూచించారు.

ముత్తైదువుల కంటె వితంతువుల మరణాల రేటు అధికంగా ఉన్నట్లు కూడా ప్రొఫెసర్ మారీ భట్ నిర్ధారణ చేశారు. (వారి నిర్ధారణకు మూలమైన సంఖ్యా వివరాలను పదమూడవ పట్టికలో చూడవచ్చు).

అఖిల భారత ప్రాతిపదిక మీద చూచినపుడు వితంతువుల మరణాల రేటు ముత్తైదువుల మరణాల రేటు కంటె 82 శాతం అధికంగా ఉన్నట్లు ప్రొఫెసర్ భట్ అంచనా వేశారు. భార్య బ్రతికున్న వివాహిత పురుషుల కంటె, భార్యావియోగాన్ని పొందిన పురుషుల మరణాల రేటు కూడా ఇంత అధికంగా (80 శాతం అధికంగా) ఉన్నట్లు వీరు నిర్ధారణ చేశారు. 1961-1971 సం॥రాల మధ్యకాలంలోనూ, 1971-1981 సంవత్సరాల మధ్యకాలంలోనూ ఈ వత్యాస పరిమాణం దాదాపు ఇలాగే ఉన్నది. ముత్తైదువుల మరణాల రేటు కంటే వితంతువుల మరణాలరేటు 1961-1971 సంవత్సరాల మధ్యకాలంలో 87 శాతము, 1971-1981 సంవత్సరాల మధ్యకాలంలో 77 శాతము అధికంగా ఉన్నది. భార్యా బ్రతికున్న పురుషుల మరణాల రేటు కంటె, భార్యావియోగాన్ని పొందిన పురుషుల మరణాల రేటు 1961-1971 సంవత్సరాల మధ్యకాలంలో 78 శాతము, 1971-1981 సంవత్సరాల మధ్యకాలంలో 82 శాతము అధికంగా ఉన్నది.

రాష్ట్రాల వారీ పరిస్థితిని చూచినపుడు ఈ రేట్లలో వ్యత్యాసాలు కనుపిస్తాయి. పంజాబు, హర్యానా, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో చనిపోతున్న ప్రతి ముత్తైదువుకు ఇద్దరు చొప్పున వితంతువులు చనిపోతున్నారు దక్షిణ భారతంలోని ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలో ఈ నిష్పత్తి 1.4 నుండి 1.7 వరకూ ఉన్నది. అఖిల భారత ప్రాతిపదికమీద చూచి నపుడు, అధిక మరణాల విషయంలో వితంతువులతో సమంగా భార్యావియోగాన్ని పొందిన పురుషులు కనుపించినప్పటికి, రాష్ట్రాల వారీగా చూచినపుడు ఇందుకు భిన్నమైన పరిస్థితి కనుపిస్తుంది. ఉత్తర భారతానికి చెందిన పంజాబు, హర్యానా, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో వితంతువుల మరణాల రేట్ల కంటె భార్యా వియోగాన్ని పొందిన పురుషుల మరణాల రేటు తక్కువగా ఉన్నది! దక్షిణ భారతంలో స్త్రీలకు వైధవ్యం సంప్రాప్తించే అవకాశాలు ఉత్తర భారతంలో కంటే అధికంగా ఉన్నట్లు కనుపించినా, ఉత్తర భారతంలో కంటె వితంతువుల మనుగడ అవకాశాలు దక్షిణ భారతంలో అధికంగా ఉన్నాయి. ఇందువల్లనే పదవ పట్టికలోని సమాచారంలో దక్షిణ భారతంలో వైధవ్యాన్ని పొందిన స్త్రీల సంఖ్యా పరిమాణం, ఉత్తర భారతంలో కంటె అధికంగా ఉన్నట్లు కనుపిస్తున్నది.

భార్య బ్రతికున్న ప్రతి పురుషుని మరణానికి భార్యా వియోగాన్ని పొందిన పురుషులు సగటున ఇద్దరి చొప్పునా, ప్రతి ముత్తైదువు మరణానికి వితంతువులు సగటున 1.5గురు చొప్పున పాశ్చాత్యదేశాలలో చనిపోతూండటాన్ని ప్రస్తావిస్తూ, ఇందుకు సంబంధించిన భారతదేశపు స్త్రీ-పురుషుల సగటు (1.8) ఈ అంచనాలకు దాదాపు సమంగా ఉన్నట్లు ప్రొఫెసర్ మారీ భట్ సూచించారు. భార్య బ్రతికున్న భర్తల కంటె, భార్యా వియోగాన్ని పొందిన భర్తల మరణాలు అధికంగా ఉండటాన్ని చూచి, వైవాహిక జీవనం స్త్రీల కంటె పురుషులకే అధికాయురారోగ్యాలను ప్రసాదిస్తున్నదా అన్న ఆలోచన

పొటమరిస్తున్నట్లు కూడా ప్రొఫెసర్ భట్ చెప్పారు

భారత దేశాన్ని మొత్తంగా పరిగణనకు తీసుకొని ఈ విషయాన్ని చూచినపుడు, ఈ నిష్పత్తి పరిమాణంలో స్త్రీ పురుషుల మధ్య భేదం లేదన్న అంశాన్నీ, ఉత్తర దక్షిణ భారతాల మధ్య భేదాలుండటాన్నీ ఇంతకు పూర్వమే చూచాం. దక్షిణ భారతంలో భార్యావియోగాన్ని పొందిన పురుషులకు మనుగడ అవకాశాలు తక్కువగా ఉంటే, ఉత్తర భారతంలో వితంతువులకీ అవకాశాలు అల్పంగా ఉన్నాయి

జాయంటు కుటుంబాలుండటం లేక ఉండక పోవటం అనేది ఈ విషయాన్ని ప్రభావితం చేస్తున్నట్లు ప్రొఫెసర్ భట్ అభిప్రాయపడుతున్నారు ఉత్తర భారతంలో దక్షిణ భారతంలో కంటె జాయంట్ కుటుంబాలు అధికంగా ఉన్నాయి. జాయంట్ కుటుంబంలో భార్యావియోగాన్ని పొందిన పురుషపెద్దలకు అధిక మర్యాద లభిస్తుంది. కుటుంబీకులు వారిని సగౌరవంగా చూస్తారు. కుటుంబ సంరక్షకులుగా వితంతువుగాని, లేక ఆవిడ కుమారులు గాని ఉండని సందర్భాలలో, వితంతువుకు ప్రేమాదరణలు కొరవడతాయి. ఇందువల్లనే ఉత్తర భారతంలో, భార్యావియోగాన్ని పొందిన పురుషుల కంటె వితంతువుల మరణాలు అధికంగా సంభవిస్తున్నాయి

దక్షిణ భారతంలో నూక్లియర్ ఫామీలీల ప్రాబల్య మధికం ఈ రకపు కుటుంబాలలో భార్యా వియోగాన్ని పొందిన పురుషులకు అంతగా ఆదరణ లభించదు. కుటుంబ సంరక్షకులుగా వితంతువు గాని, లేక ఆవిడ కుమారులుగాని ఉన్న కుటుంబాలలో వితంతువు యొక్క మనుగడ, భార్యా వియోగాన్ని పొందిన పురుషుల కంటె అత్యంతానుకూలంగా ఉంటుందని ప్రొఫెసర్ మారీ భట్ వివరించారు

బంగ్లాదేశ్‌లో 1974-1982 సంవత్సరాల మధ్యకాలంలో మత్లబ్ సర్వేలెన్స్‌సిస్టం కింద రెహ్మాన్ ప్రభృతులు నిర్వహించిన సర్వే ఫలితాలను పేర్కొంటూ, ప్రొఫెసర్ మారీ భట్ ఇలా వ్రాశారు: "బంగ్లాదేశ్‌లో ముత్తైదువుల మరణాల కంటె వితంతువుల మరణాలు 50 శాతం అధికంగా ఉన్నట్లు రెహ్మాన్ ప్రభృతులు వెల్లడించారు. అఖిల భారత పరిస్థితిని బంగ్లాదేశ్ పరిస్థితితో పోల్చి చూస్తే వితంతువుల మరణాలకు సంబంధించినంతవరకూ రెండు దేశాల పరిస్థితి దాదాపు ఒకే విధంగా ఉన్నట్లు స్పష్టమవు తున్నది. ఉన్న భేదమల్లా, బంగ్లాదేశ్ పరిశీలనలు పరిశోధకులు సేకరించిన అల్పసంఖ్యాక వితంతువుల ఆధారంతో జరిగితే, భారతీయ పరిశీలన, పరోక్ష పద్ధతిలో, కోట్లాది మంది మీద, విస్తృత ప్రాతిపదికమీద జరిగింది. అయినా ఫలితాలు ఒకే అంశాన్ని రుజువు చేస్తున్నాయి"

వితంతువుల ఈ దుస్థితికి దారిదీస్తున్న కారణాలేమిటో చూద్దాం.

## వితంతువుల మనుగడకున్న అవరోధాలు

వితంతువుల జీవన దుస్థితికి ఎన్ని కారణాలనైనా చూపవచ్చు. వీటిలో ప్రధానమైన అంశాల నిచట వివరిస్తాం.

1. పుట్టినింటిని శాశ్వతంగా వదలి మెట్టినింట జీవించ వలసి రావటం.

2. వారసత్వంగా రావలసిన భర్త ఆస్తిని దాన ధర్మ విక్రయాది హక్కులతో అనుభవించే అవకాశాలు అత్యధిక సంఖ్యాకులకు లభిస్తుండకపోవటం.

3. పునర్వివాహానికి ప్రతిబంధకాలుండటం.

4. సామాజిక సపోర్టు, అవసరాలకు తగినంతగా లభిస్తూండక పోవటం.

వితంతువులకు సంబంధించినంత వరకూ, దేశ మంతటా గాని, దేశంలోని కొన్ని ప్రాంతాలలో గాని, నిర్ణీత ప్రాంతంలోని కొన్ని మండలాలలో గాని ఈ పరిస్థితులు ఒకే రకంగా లేవు. ఈ విషయంలో భిన్న మతాల వారి మధ్యా, కులాలు, తెగల మధ్యా కూడా భేదాలున్నాయి. ఇచ్చట ప్రధానంగా హిందూ సంప్రదాయాన్ని పాటిస్తున్న వారి పరిస్థితిని మాత్రమే వివరిస్తున్నాం. హిందూ సంప్రదాయానికి దాదాపు దాపులో ఉండే కులాల లేక తెగల వారికి కూడా ఈ నిర్ధారణలు వర్తిస్తాయి. కొన్ని నిర్ధారణలు హిందువులందరకూ సమంగా వర్తించని సందర్భాలు కూడా ఉంటాయి "అగ్రవర్ణం"గా పరిగణనను పొందుతున్న బ్రాహ్మణులకు "అస్పృస్యులు"గా వర్గీకరణను పొందుతున్న వారికి మధ్య ఈ విషయాలలో అంతరం అధికంగా ఉంటుంది. అగ్ర వర్ణాల వారిలో వితంతువులు పలు పరిమితులకు లోబడి జీవించ వలసి ఉంటుంది. బ్రాహ్మణేతరులలో ఈ పాటింపులు ఇంత కఠినంగా అమలు జరుగవు. బ్రాహ్మణులలో వితంతువుల తల

వెంట్రుకలు తీయించటం విధిగా జరుగుతూండగా, అస్పృశ్యులనబడే వారిలో పునర్వివాహం (మారుమనువు) సునాయాసంగా జరుగుతూంటుంది.

పెండ్లయిన వెంటనే స్త్రీ మెట్టినింటివారి ఆస్థిగా మారటం, పుట్టిన గ్రామాన్ని వదలి మెట్టినింటిని శాశ్వత నివాసంగా చేసుకొన వలసిరావటం, భర్త ఆస్థికి మాత్రమే వారసురాలయ్యే అవకాశాలు ఉండటం వల్ల స్త్రీ పరాధీనవుతున్నది. స్త్రీ పురుష అసమానత్వానికి ఈ అంశాలే జీవంపోస్తున్నాయి. స్త్రీల బాధలకు ఇవే మూల కారణాలుగా కనుపిస్తాయి. ఈ పరిణామా లన్నింటి సంకేతమే పవిత్ర పదంగా మనం వాడుతున్న "కన్యాదానం". కట్న కానుకలను కన్య నెత్తికెత్తి ఆవిడను మెట్టినింటికి సాగనంపే ఆచారానికి, సంప్రదాయబద్ధతను ఈ "కన్యాదానం" కల్పిస్తున్నది; ఈ దురాగతానికి మేలిముసుగు వేస్తున్నది.

ఈ సంప్రదాయమే వితంతు జీవితాన్ని నరకప్రాయం చేయటానికి బీజాలను వేస్తున్నది కన్యాదానం, కులాంతర వివాహాల నిషేధం, పునర్వివాహ నిషేధం, కట్నకానుకల చెల్లింపుల ఆచారం, తాము కన్న బిడ్డలే అయినా, ఆడపిల్లల కంటే మగపిల్లలను అధికులుగా చూడటం వంటివి స్త్రీ స్వాతంత్ర్యాపహరణకు తోడ్పడుతున్నాయి; స్త్రీల పాలిటి శృంఖలాలుగా పని చేస్తున్నాయి. ఈ దురాగతాల అమలులో ఇవన్నీ పరస్పర బల వర్ధకాలుగా తమ వంతు పాత్రను నిర్వహిస్తున్నాయి.

మెట్టినింటి కాపురం : వివాహానంతరం స్త్రీ నివాసం, తానెరుగని కొత్తయింటికి (మెట్టినింటికి) మారుతుంది. ఉన్నవూరికి, కన్నవారికి, తోబుట్టువులకు దూరమవుతుంది. పుట్టినింటికి చుట్టం చూపుగా వచ్చి పోతూండటం తప్ప (అదీ మెట్టినింటి వారు దయదలచి అనుమతిస్తేనే), ఇతర అన్ని సంబంధాలు, అనుబంధాలు అంతరిస్తాయి. ఆవిడ పూర్తిగా మెట్టినింటి వారి ఆస్థి అయిపోతుంది. ఒంటరి తనంతో, భయం భయంగా కొత్త చోట, తెలియనివారితో కలిసి జీవించ వలసి ఉంటుంది. ఆవిడ లీగల్, సాంఘిక పరిస్థితులలో మార్పులొస్తాయి. అదృష్టం చాలక అత్తగారి ఆరడులు మొదలైతే జీవితమే నరకప్రాయ మవుతుంది.

వైవాహిక జీవన ప్రారంభం తరువాత వచ్చే ఈమార్పులు, వితంతువుగా ఆవిడ జీవించ వలసి వచ్చినపుడు, వాటి దురాగతాన్ని మరింత స్పష్టంగా ప్రకటిస్తాయి. వైధవ్యప్రాప్తి తర్వాత, భర్త అండపోయినా, తల్లి దండ్రుల పంచన గాని, సోదరుల రక్షణలో గాని చేరే అవకాశాలుండవు. (అతితక్కువ మందికి ఇవి లభిస్తున్నాయి). ఎన్ని ఇబ్బందులను అనుభవించ వలసి వచ్చినా మెట్టినింటే ఉండాలి. ఆస్థిలేని భర్తలకు చెందిన వితంతువులు కూడా , ఆగ్రామాన్ని సామాన్యంగా విడిచిపో సాహసించరు.

మార్తా ఆల్టర్ చెన్, 1991-1992 సంవత్సరాల కాలంలో పశ్చిమ బెంగాల్, బీహారు, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో, రాష్ట్రానికి రెండు గ్రామాల చొప్పున మొత్తం 14 గ్రామాలలోని 562 మంది వితంతువుల మీద సర్వేను నిర్వహించారు. వీరు సేకరించిన సమాచారం ప్రకారం, భర్త మరణానంతరం వీరి నివాస ప్రదేశాలకు సంబంధించిన వివరాలను పధ్నాలుగవ పట్టికలో చూడవచ్చు. వైధవ్యం ప్రాప్తించిన వారిలో అత్యధికులు భర్తగారి గ్రామంలో ఉంటున్నట్లు, అల్పసంఖ్యాకులు మాత్రమే పుట్టిన ఊరికి తరలి వెళ్ళినట్లు పట్టికలోని సంఖ్యా వివరాలు సూచిస్తున్నాయి. ఉత్తర భారతంలో నూరింట ఆరుగురు వితంతువులు మాత్రమే పుట్టిన గ్రామానికి వెళ్ళగా, దక్షిణ భారతంలో వితంతువులలో దాదాపు సగంమంది (48 శాతం మంది) పుట్టిన ఊరిలో నివసిస్తూండటం గమనించదగిన అంశం. ఉత్తర, దక్షిణ భారత ప్రాంత వితంతువుల మనుగడ పరిస్థితులలో ఉన్న భేదాలలో ఇదొకటి. ఉత్తర భారతంలో, వివాహానంతరం, స్త్రీ పుట్టినింటికి పూర్తిగా దూరంగా ఉండాలి; దక్షిణ భారతంలో ఇటువంటి పట్టింపులు లేవు. కాని అతి తక్కువ మంది వితంతువులకే పుట్టినింటి వారి ఆదరణ లభిస్తున్న అంశాన్ని మనం మరువకూడదు. జీవితం బాధాకరంగా ఉన్నదని మెట్టిన గ్రామాన్ని వదలి పోతే, వారసత్వంగా రావలసిన భర్త ఆస్థిని అనుభవించే హక్కు, అవకాశాలు కూడా అంతరించే ప్రమాదం ఉంటుంది. కనుక వితంతువు భర్తగారి గ్రామాన్ని వదలి పోవటానికి ఇష్టపడదు. ఈ సూత్రానికీ కొన్ని మినహాయింపు లున్నాయి.

పధ్నాలుగవ పట్టిక
భర్తల మరణానంతరం వారి వితంతువుల నివాస ప్రదేశాలు

| నివాస స్థలము | అఖిల భారతం | దక్షిణభారతం | ఉత్తర భారతం |
|---|---|---|---|
| దివంగత భర్త గ్రామంలో | 66 | 44 | 89 |
| పితృగ్రామంలో | 27 | 48 | 6 |
| ఇతర గ్రామాలలో | 6 | 8 | 4 |

గమనిక . ఈ పట్టికలోని అంకెలు శాతాలను సూచిస్తాయి

*- మార్తా చెన్, జీన్ డ్రేజ్‌లు వ్రాసిన రీసెంట్ రిసెర్చి ఆన్ విడోస్ ఇన్ ఇండియా అన్న వ్యాసంలోని పట్టిక దీనికాధారం*

వైధవ్యప్రాప్తి తర్వాత వితంతువు నివాస మెచ్చుట అన్న విషయం, ఆవిడకు లభించగల భర్త ఆస్థి, ఆవిడ సంతానవతా కాదా, వైధవ్యప్రాప్తి కాలానికి ఆవిడ వయః పరిమాణం వంటి వాటి మీద ఆధారపడి ఉంటుంది. భర్తకు పంట పొలాలు, ఇల్లు వంటి చిరాస్తులుండటం లేకపోవటం వంటి వాటి మీద ఇది అధికంగా ఆధారపడి ఉంటుంది. వితంతువుకు పుత్రసంతాన మున్నప్పుడు, భర్త ఆస్థి కుమారునకు దక్కక పోవచ్చునన్న భయంతో వితంతువు తలిదండ్రులు ఆవిడను మెట్టినింటనే ఉండటానికి ప్రోత్సహిస్తారు. అత్తమామలు గిట్టని వారయినపుడు, చనిపోయిన సోదరుని ఆస్థిని కాజేయాలన్న దుష్టతలంపు మృతుని సోదరులకు ఉన్నపుడు వారు వితంతువును తరిమి వేయటానికో, ఆఖరుకు చంపటానికో ప్రయత్నించే అవకాశాలుంటాయి. "మంత్రగత్తె" అని ముద్రవేసి వితంతువును చంపిన సంఘటనలను పలువురు సోషియాలజిస్టులు రిపోర్టు చేశారు.

వితంతువుకు సంతానం లేనపుడు (ప్రధానంగా పుత్ర సంతానం లేనపుడు) వారసత్వంగా ఆవిడకు రావలసిన భర్త ఆస్థిని సంగ్రహించటానికి భర్త సోదరులూ, అత్తమామలు ఆవిడ పుట్టినింటికి పోవటాన్ని ప్రోత్సహిస్తారు. వితంతువు యవ్వన దశలో నున్న వ్యక్తి గనుక, సెక్సు పరంగా తప్పటడుగు వేస్తుందేమో, అందువల్ల తమ పరువు పోతుందన్న భయంతో కూడా మెట్టినింటి వారు ఆవిడను, 'సాగనంపటానికి' ప్రయత్నిస్తారు. ఇలాంటి భయమే తలిదండ్రులను పీడించినపుడు, లేదా వారు నిరుపేద లయినపుడు ఆవిడ తమ వద్దకు రాకుండా జాగ్రత్త పడతారు. అత్తగారింటనే ఉండమని చెబుతారు. వైధవ్యప్రాప్తి తర్వాత స్త్రీ నివాస మెచ్చుట అనే విషయాన్ని ప్రభావితం చేయగల అంశాలిలా చాలా ఉన్నాయి ఇందుకు ఏ ఒక్క కారణాన్నో చెప్పలేము. లొతికా సర్కార్, నారయణ్ బెనర్జీలు చెప్పినట్లు "కుటుంబీకుల ఆలోచనా విధానం, సామాజికుల ప్రాబల్యం, కుల పెద్దలమీది విశ్వాసం, భర్త ఇంటనే ఉండి పోవటం వితంతువు ధర్మమన్న సంప్రదాయం, వారసత్వంగా సంక్రమించగల భర్త ఆస్థి, వితంతువుకున్న సంతానం, ఆవిడ వయసు, పుట్టినింటి వారి ఆర్థిక పరిస్థితులు, పుట్టినింటి వారి నుండి లభించగల ఆదరణ, రక్షణ వంటివి, భర్త మరణానంతరం వితంతువు నివాస మెచ్చుట అన్న అంశాన్ని నిర్ణయిస్తాయి". (విడోస్ ఇన్ ఎ ట్రైబల్ సెట్టింగ్ ఇన్ రూరల్ వెస్ట్ బెంగాల్" నుండి 1994వ సంవత్సరంలో వీరు సర్వేను నిర్వహించారు)

భర్త ఆస్థిమీద వారసత్వపు హక్కులు : భర్త మరణానంతరం, వారి వితంతువుకు వారసత్వంగా భర్త ఆస్థి నుండి వాటా లభిస్తుందన్న నమ్మకం చాలా మంది గ్రామీణుల కున్నది స్త్రీలలో చాలా మంది ఇటువంటి భ్రమలో ఉన్నారు. కాని అతికొద్ది మందిని మాత్రమే ఈ అదృష్టం వరిస్తున్నది. వ్యవసాయ భూములకు సంబంధించినంత వరకూ ఇది పరమ సత్యం వారసత్వంగా కొంత భూమి లభించినా, దాని మీది హక్కులు కూడా వీరికి పరిమితంగానే ఉంటాయి. అత్తమామలు లేదా బావమరదుల దురాగతం మూలంగా వారసత్వంగా లభించిన భర్త యొక్క ఆస్థిని అనుభవించే అవకాశాలు కూడా కొంతమంది వితంతువులకు లభించటం లేదు. ఈ పరిస్థితికి పూర్తిగా భర్త యొక్క దాయాదులే కారణం కాదు. వారసత్వాన్ని నిర్దేశించే చట్టాలు లింగ వివక్షను ప్రదర్శిస్తూండటం, లేదా న్యాయమూర్తులు పురుషాధిక్యతా భావ విముక్తులయి ఉండక పోవటం కూడా కొంత మేరకు కారణమవుతున్నది

భారత దేశం బ్రిటిష్ వారి కాలనీ కాకపూర్వం, వ్యవసాయ కమతాలతో సహా ఆస్తుల వారసత్వ విషయ పరిష్కారం, మత, కుల, కమ్యూనిటీ, కుటుంబ సంప్రదాయాల ప్రాతిపదికమీద జరుగుతూండేది. వారసత్వ నిర్ణయాలు పితృస్వామికంగానే గాకుండా, మాతృస్వామికంగా కూడా జరుగుతున్న ప్రాంతాలు మన దేశంలో ఉన్నాయి. ఈ పరిష్కార విధానంలో లింగవివక్షా ప్రదర్శన తీవ్రంగా ఉంటూండటంవల్ల, స్త్రీల కంటే పురుషులకే అధిక పరిమాణపు ఆస్థులు

సంక్రమిస్తూండేవి.

భారతదేశంలో వారసత్వ నిర్ణయం ప్రధానంగా పితృస్వామిక పద్ధతినే జరిగేది. హిందూ కుటుంబంలో పంటపొలాల పంపకంలో ఆడపడుచులకు, వితంతువులకు వారసత్వంగా అతి స్వల్పంగానే ఆస్థి లభించేది వంశ పారంపర్య వారసత్వాన్ని ప్రాచీన హిందూ ధర్మశాస్త్రాలు నిర్ణయిస్తున్నాయి ఇపుడు కూడా అమలులో నున్న మితాక్షర, దాయా భాగ విధానాలను ఆ శాస్త్రాల సారాంశంగా మనం చెప్పుకోవచ్చు ఇవి సుమారుగా క్రీ॥శ॥ పన్నెండవ శతాబ్ద కాలంలో రూపొంది ఉంటాయని భావిస్తున్నారు. హిందువుల ఆస్థి పంపకం కోసం, వారసత్వ నిర్ణయ చట్టాలను బ్రిటిష్ వారు వీటి ఆధారంతోనే రూపొందించారు దాయాభాగ సంప్రదాయాన్ని ప్రధానంగా బెంగాల్, అస్సాం రాష్ట్రాలలో పాటిస్తున్నారు. మిగిలిన రాష్ట్రాలలో మితాక్షర సంప్రదాయాన్ని అనుసరిస్తున్నారు.

మితాక్షర సంప్రదాయంలో, భార్యలకు, వితంతువులకు, కుమార్తెలకు వారసత్వపు ఆస్థి మీద, పోషణాదులను అనుభవించే హక్కు మాత్రమే ఉంటుంది. కట్నకానుకలతో సహా వివాహపు ఖర్చులను కుటుంబపు ఆస్థి నుండి పొందటానికి, ఆ శుభ సమయంలో బంధు మిత్రులిచ్చే బహుమతులను అందుకోవటానికి మాత్రమే కుమార్తెలకు వీలున్నది. పురుషునకు, కుమారులు, మనుమలు, ముని మనుమలు లేని సందర్భాలలో మాత్రమే, భర్త ఆస్థి నుండి కొద్ది భాగాన్ని, ఉదరపోషణ నిమిత్తం పొందే హక్కు వితంతువు కుంటుంది. ఈ ఆస్థి మీద కూడా ఆవిడకు సర్వాధికారాలుండవు. దానిని అనుభవించే హక్కు మాత్రమే ఉంటుంది. అతి నికృష్ట పరిస్థితులలో మాత్రమే ఆవిడ దానిని పరులకు దఖలు పరచవచ్చు. లేదా మత పరమైన దానధర్మాలకు వాడవచ్చు. వితంతువు పునర్వివాహం చేసుకోకూడదు. పాతివ్రత్య భంగం సంభవించకూడదు. ఈ నియమోల్లంఘన జరిగితే, వితంతువు, పైన పేర్కొన్న వసతులను కోల్పోతుంది. వారసత్వపు ఆస్థి విషయంలో వితంతువు తర్వాతే కుమార్తెలు పరిగణనకు వస్తారు. అపుడు కూడా వివాహితల కంటె అవివాహితలకే ప్రాధాన్యత లభిస్తుంది.

మితాక్షర సంప్రదాయం కంటె దాయా భాగ సంప్రదాయం వితంతువులకు అనుకూలంగా ఉన్నది. ఈ సంప్రదాయం కింద కూడా వితంతువు పాతివ్రత్య ధర్మాన్ని పాటించాలి; పునర్వివాహం నిషిద్ధం. పరిమిత హక్కులతో వారసత్వపు ఆస్థి లభిస్తుంది. మైనరు కుమారుల పక్షాన దాన్ని మేనేజ్ చేసే హక్కు మాత్రమే ఆవిడకుంటుంది. దానిని ఇతరులకు దఖలు పరచ కూడదు. కుటుంబపు జాయంట్ ఆస్థిని పంచుకొనక పూర్వమే భర్త మరణించినా, వంశపారంపర్యంగా వస్తున్న ఆస్థికి, వారి వితంతువు, కుమార్తెలు వారసులుగా పరిగణనకు వస్తారు. మితాక్షర న్యాయం స్త్రీలకు ఈ సదుపాయాన్ని ఇవ్వటం లేదు ఎంతో కొంత ఆస్థిని స్త్రీలు వారసత్వంగా పొందే అవకాశాలు మితాక్షర న్యాయంలో కంటె దాయాభాగ సంప్రదాయంలో అధికంగా ఉన్నాయి.

పైన పేర్కొన్న రెండు సంప్రదాయాలు (మితాక్షర, దాయా భాగ) "స్త్రీ ధనం" పేరిట స్త్రీలకు పరిమిత ఆస్థిమీద సర్వాధికారాల నిస్తున్నాయి. వివాహ సమయంలోగాని, ఇతర శుభకార్యాల సందర్భంలో గాని, తలిదండ్రులు, తోబుట్టువులు ప్రేమపూర్వకంగా, ఇచ్చే కానుకలు ఈ నిర్వచనం కిందకు వస్తాయి. ఏదయినా చరాస్థి లేక ఈ నిర్వచనం కిందకు వచ్చే స్థిరాస్థి, వారసత్వపు పంపకాల వల్ల స్త్రీకి లభించి ఉంటే, దాని మీద ఆవిడకు, ఇతరులకు దఖలు పరచే హక్కు లేదనీ, అనుభవించే హక్కు మాత్రమే ఉన్నదని దాయా భాగ సంప్రదాయం నిర్దేశిస్తున్నది. మితాక్షర సంప్రదాయంలో, స్త్రీకి లభించే ఇటువంటి ఆస్థి మీద సర్వహక్కు లున్నాయనీ, లేవని కూడా వాదించే అవకాశాలున్నట్లు న్యాయ శాస్త్ర ప్రవీణులు చెబుతున్నారు.

దాయాభాగ, మితాక్షర సంప్రదాయాల రెంటి కిందా, వారసత్వంగా స్త్రీకి లభించిన ఆస్థి మీద పరిమిత హక్కులు మాత్రమే ఉన్నాయి. పురుషులకు ఇలాంటి పరిమితులు లేవు; వారికి సర్వహక్కులూ ఉంటున్నాయి. జాయంట్ ప్రాపర్టీలో తన భాగాన్ని అమ్మటంలో పురుషునకు పరిమితులున్నాయి. కాని ఈ పరిమితులు లింగ పరమైనవి గావు. స్త్రీ విషయానికొచ్చేటప్పటికి లింగ పరమైన వివక్ష ప్రదర్శిత మవుతున్నది.

వారసత్వంగా స్థిరాస్థిని (ముఖ్యంగా వ్యవసాయ భూము లను) స్త్రీలు పొందటం అనేది పూర్వకాలంలో దేశమంతటా ఒక సంప్రదాయంగా ఉండి ఉండాలని బీనా అగర్వాల్

అభిప్రాయ పడుతున్నారు. దక్షిణ భారతంలో దేవాలయాలకు, ఇతర ధర్మ కార్యాలకు వితంతువు లిచ్చిన స్థిరాస్థిరూప దానాలను వీరు ఇందుకు నిదర్శనంగా భావించారు. స్త్రీలలో చైతన్య స్థాయి పెరిగి, ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభ కాలంలో, ఆస్తిహక్కుల కోసం ఆందోళన చేయనారంభించారు. ఈ ఆందోళన ఫలితంగానూ, కొందరు అభ్యుదయ కాముకులయిన న్యాయశాస్త్ర వేత్తల చొరవ వల్లా, బ్రిటిష్ ప్రభుత్వం 1937వ సంవత్సరంలో "ది హిందూ ఉమెన్స్ రైట్ టు ప్రోపర్టీ" అనే శాసనాన్ని చేసింది. ఈ చట్టం కింద వారసత్వంగా వితంతువుకు లభించగల స్థిరాస్థిలో వ్యవసాయ భూములను మినహాయించారు పుత్రికల వారసత్వపు హక్కుల ప్రస్తావనే ఈ శాసనంలో లేదు "హిందూ సక్సెషన్ ఆక్ట్ ఆఫ్ 1956" లో మాత్రం, వారసత్వపు ఆస్థిని పొందటంలో పుత్రులతో దాదాపు సమానమైన హక్కు పుత్రికలకు లభించింది ఈ చట్టం ప్రకారం హిందూ స్త్రీకి కూతురుగా, భార్యగా వారసత్వపు ఆస్థిని పొందే హక్కు లభిస్తున్నది. కూతురుగా తండ్రి ఆస్థి నుండి, వితంతువుగా భర్త ఆస్థి నుండి, తల్లిగా కుమారుని ఆస్థి నుండి భాగాన్ని పొందేహక్కు స్త్రీకి లభించింది. స్త్రీలకు ఆస్థిమీద లీగల్ హక్కును ఇవ్వటమే ఈ చట్టము ప్రధాన లక్ష్యం

చూపుల కిది మేడి పండు వంటిది స్త్రీలకు ఆస్థి హక్కులు దక్కకుండా చేయగల వసతులు కూడా దీనిలో ఉన్నాయి. ఆయా కమ్యూనిటీల పర్సనల్ లాన్ను, సంప్రదాయంగా ప్రాచీన కాలం నుండి అమలు జరుగుతూన్న న్యాయసూత్రాలను (కస్టమరీలాను) కూడా చట్టబద్ధమైనవిగా పరిగణించాలని, భారత రాజ్యాంగంలోని పదమూడవ ఆర్టికిల్ నిర్దేశిస్తున్నది. కుటుంబ సంప్రదాయం, ఆఖరుకు నిర్ణీత ప్రాంతంలో అమలులోనున్న సంప్రదాయాలకు కూడా చట్ట బద్ధత ఇందువల్ల లభిస్తున్నది ఇవన్నీ వారసత్వపు ఆస్థిని పొందటంలో స్త్రీలకు అవరోధాలను కల్పిస్తున్నాయి భర్త, విల్ వ్రాయటం ద్వారా, భార్యకు గాని, కూతురుకు గాని తన ఆస్థి దక్కకుండా చేయవచ్చు. కుమారులకు ఆస్థి ఇలా దక్కకుండా చేయగల అవకాశాలు మాత్రం లేవు. వారసత్వపు ఆస్థి స్త్రీకి లభింప చేయాలన్న లక్ష్యం, మితాక్షర న్యాయపు పాటింపు వల్ల వమ్మవుతున్నది. ఈ చట్టానికి రాష్ట్రాలు కొన్ని సవరణలను చేసినా, వాటివల్ల స్త్రీలకు జరిగిన మేలు నామ మాత్రమే.

పదిహేనవ పట్టిక

భారత గ్రామీణ ప్రాంతపు వితంతువులలో కుమార్తెలుగా, వితంతువులుగా వారసత్వపు ఆస్థిని పొందినవారు

| ప్రాంతము లేక రాష్ట్రము | సర్వేలో పాల్గొన్న వితంతువుల సంఖ్య | స్వంత భూము లున్న వీరి తలిదండ్రుల (సంఖ్య) | బిడ్డలుగా తండ్రి ఆస్థిని వారసత్వంగా పొందిన వారు | | స్వంతభూము లున్న వీరి భర్తల సంఖ్య | వారి వితంతువులుగా ఆస్థిని వారసత్వంగా పొందిన వితంతువులు | |
|---|---|---|---|---|---|---|---|
| | | | సంఖ్య | శాతము | | సంఖ్య | శాతము |
| ఉత్తర భారతం | 262 | 229 | 18 | 8 | 193 | 98 | 51 |
| బీహారు | 71 | 70 | 2 | 3 | 57 | 16 | 28 |
| రాజస్థాన్ | 49 | 42 | 2 | 5 | 39 | 27 | 69 |
| ఉత్తరప్రదేశ్ (పర్వతప్రాంతం) | 50 | 50 | 1 | 2 | 45 | 23 | 51 |
| పశ్చిమబెంగాల్ | 92 | 67 | 13 | 19 | 52 | 32 | 62 |
| దక్షిణ భారతం | 283 | 241 | 43 | 18 | 87 | 45 | 52 |
| ఆంధ్రప్రదేశ్ | 79 | 77 | 12 | 16 | 37 | 18 | 49 |
| కేరళ | 104 | 65 | 28 | 43 | 15 | 10 | 167 |
| తమిళనాడు | 100 | 99 | 3 | 3 | 35 | 17 | 49 |
| అన్ని ప్రాంతాలు | 545 | 470 | 61 | 13 | 280 | 143 | 51 |

*- బీనా అగర్వాల్ వ్రాసిన "విడోస్ వెర్సస్ డాటర్స్ ఆర్ విడోస్ ఏజ్ డాటర్స్" అన్న వ్యాసం నుండి.*

మార్తా చెన్ 1991వ సంవత్సరంలో పశ్చిమ బెంగాల్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలోని ఎనిమిది గ్రామాలలో సర్వేను నిర్వహించారు. ఈ సమాచారం ఆధారంతో బీనా అగర్వాల్ ఈ పట్టికను రూపొందించారు.

కుటుంబం యొక్క సాధారణ ఆస్థినే ఈచట్టం ప్రధానంగా పరిగణనకు తీసుకొన్నది వ్యవసాయ భూముల విషయాన్ని ఈ అంశానికి జోడించి స్పష్టీకరించ లేదు. వ్యవసాయ భూముల మీద చట్టాలను చేసే అధికారాన్ని కేంద్రం రాష్ట్ర ప్రభుత్వాలకు వదలి వేసింది రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్న టెనెన్సీ చట్టాలు వ్యవసాయ భూముల మీద వ్యక్తుల హక్కులను నిర్దేశిస్తున్నాయి. హిందూ ఉమెన్స్ రైట్ టు ప్రోపర్టీ ఆక్టు - 1937 వ్యవసాయ భూములకు వర్తించటంలేదు. భూసంస్కరణల అమలు దృష్ట్యా రాష్ట్ర ప్రభుత్వాలు జారీ చేసిన టెనెన్సీ చట్టాలు, భూకమతాల కేంద్రీకరణ నిరోధానికి ఉపకరిస్తున్నాయి. వారసత్వంగా వ్యవసాయ భూములను స్త్రీలు పొందటానికివి ఉపకరించటంలేదు.

ఇందువల్ల వ్యవసాయ భూముల మీది అధికారాలను నిర్దేశిస్తున్న టెనెన్సీ చట్టాలు గాని, ఇతర శాసనాలుగాని స్త్రీల కంటె పురుషులకే అధిక ప్రయోజనాన్ని చేకూర్చుతున్నాయి. లింగ వివక్ష ఇచ్చట స్పష్టంగా కనుపిస్తున్నది. టెనెన్సీ చట్టాలనూ, వ్యవసాయ భూములకు సంబంధించిన కొన్ని ఇతర చట్టాలను భారత రాజ్యాంగంలోని తొమ్మిదవ షెడ్యూల్‌లో చేర్చారు ఈ చట్టాలలోని అంశాలు "పౌరుల ప్రాథమిక హక్కులకు భంగకరంగా ఉన్నాయి" అన్న వాదంతో, వీటిని కోర్టులో సవాలు చేసే అవకాశాలు లేవు. భూస్వాములు, తమ అదనపు భూములు పోకుండా రక్షించుకొనే ప్రయత్నాన్ని నిరోధించే లక్ష్యంతో టెనెన్సీ చట్టాలను తొమ్మిదవ షెడ్యూల్‌లో చేర్చారు. ఈ చట్టాలవల్ల నష్టపడుతున్న స్త్రీ, లింగవివక్షా ప్రదర్శనా ప్రాతిపదిక మీదనైనా, తమకు జరుగుతున్న అన్యాయ నివారణకు కోర్టులో వీటిని సవాలు చేసే అవకాశాలు లేకుండా పోయాయి.

ఇపుడున్న చట్టాల వల్ల స్త్రీలకు వారసత్వంగా లభిస్తున్న వ్యవసాయ భూమి ఎంత తక్కువయినా, అది వితంతువులకు జీవనాధారంగా వినియోగపడుతున్నది. ఆ భూమిని భర్త వంక దాయాదులు కాజేయకుండా చట్టబద్ధమైన రక్షణ కొంత మేరకయినా లభిస్తున్నది. వితంతువులకు భర్త ఆస్థి సంక్రమించా లన్న భావానికి కాలక్రమేణా బలం చేకూరుతున్నది. అయినా, అధిక సంఖ్యాక వితంతువులకు ఇంకా ప్రయోజనం కనుపించటం లేదు. తండ్రికున్న ఆస్థి నుండి వారసత్వపు వాటాగా వ్యవసాయ భూములను పొందుతున్న కుమార్తెల సంఖ్యా పరిమాణం, భర్తల ఆస్థి నుండి వాటాను పొందుతున్న వితంతువుల కంటె కూడా తక్కువగా ఉండటం గమనించ వలసిన అంశం. (15వ పట్టికను చూడండి). ఇందుకు కారణాలేమిటో చూద్దాం.

లౌతికా సర్కార్, నారాయణ్ బెనర్జీలు 1994వ సంవత్సరం ఆగస్టు మాసంలో పశ్చిమ బెంగాల్‌కు చెందిన బంకూరా జిల్లాలోని రెండు బ్లాకులలో 36 గురు వితంతువుల జీవన స్థితి గతులను పరిశీలించారు వీరిలో గిరిజనులూ, అగ్రవర్ణాలవారూ ఉన్నారు స్థానిక సంప్రదాయం ప్రకారం వితంతువులకు లభిస్తున్న ఆస్థి వివరాల సేకరణకు వీరు ప్రయత్నించారు. పశ్చిమబెంగాల్ లాండ్ రిఫార్మ్స్ ఆక్టు హిందువులకు, గిరిజనులకు కూడా, కుటుంబపు ఆస్థిలో స్త్రీ, పురుషులకు సమాన హక్కులున్నట్లు నిర్దేశిస్తున్నా, స్థానిక సంప్రదాయాల పాటింపుల వల్ల వితంతువులకు భర్త ఆస్థిలో వాటా దక్కటం లేదని వీరు వెల్లడించారు. స్థానిక సంప్రదాయం ప్రకారం కుమారులు మేజర్లయ్యే వరకూ, ఆస్థికి సంరక్షకురాలిగా మాత్రమే వితంతువు వుంటున్నది; కుమారులు మేజర్లుగా ఉన్న సందర్భాలలో, వారి పోషణ, సంరక్షణలలో వితంతువయిన తల్లి ఉండాలి. "పుత్ర సంతానం లేని వితంతువు జీవితం ప్రమాద భరితంగా ఉంటున్నది; సాధారణంగా వీరికి భర్త ఆస్థిలో వాటా లభించటంలేదు" అని వీరు వివరించారు. వారసత్వపు ఆస్థి వితంతువుకు లభించిన సందర్భాలలో, దాన్ని అనుభవించే అవకాశాలు కూడా తక్కువగా ఉన్నట్లు వీరు కనుగొన్నారు. అత్తమామల దుర్మార్గపు ధోరణి వల్ల గాని, లేదా భర్త గారి సోదరుల అత్యాశవల్ల గాని, వారసత్వంగా రావలసిన ఆస్థిలోని వాటా వితంతువులకు దక్కటం లేదు.

ఈ పరిశోధకులు తమ పరిశీలనా సారాంశాన్నిలా వివరించారు. "అభ్యుదయ కరమైన శాసనమున్నా, చట్ట పరంగా సంక్రమించిన ఆస్థి హక్కును స్త్రీ అమలు జరుప లేకపోతున్నది; భర్త జీవించి ఉండగా గాని, వారి మరణానంతరం గాని, ఇది సాధ్యం గావటం లేదు. వారసత్వపు ఆస్థి మీద అధికారంగాని, దాని ఫలసాయాన్ని అనుభవించే అవకాశంగాని పూర్తిగా లేక పోవటమో, అరుదుగా పోషణా

వసతి మాత్రమే లభించటమో కనుపిస్తున్నది. వారసత్వపు ఆస్థి మీద శాసన బద్ధమైన హక్కున్నా, ఆ ఆస్థి ఆవిడ స్వాధీనంలో ఉండటం అనేది అరుదుగా కనుపిస్తున్నది. శాసన బద్ధమైన హక్కు తనకున్నట్లుగా వితంతువు నిరూపించగలిగినా, ఆ ఆస్థిని అనుభవించగల శక్తి మరొకరి చేతిలో ఉంటున్నది."

శోభా నందవన, రమేష్ నందవనలు గుజరాత్‌లోనూ, సీమా మిశ్రా, ఈనాక్షి గంగూలి తకరల్‌లు బీహారులోనూ, నీలం గోరే మహారాష్ట్రలోనూ, చంద్రా భండారి రాజస్థాన్‌లోనూ, బేలా భాటియా బీహారులోనూ సేకరించిన వితంతువుల జీవన గాధలు ఈ విషయాలను చక్కగా చిత్రిస్తున్నాయి

భర్త ఆస్థి వారసత్వంగా తమకు రావాలని కోర్టులో ఫిర్యాదు చేసిన వితంతువుల గాధలను నీలం గోరే సేకరించారు. ఒక వితంతువు, ఈ 'పాపానికి' అత్తగారి చేతిలో దెబ్బలు తినవలసి వచ్చింది, అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని గ్రామం విడిచి పారిపోయింది ఈ వితంతువు అత్తమామలు ఆవిడ కుమారుని చేరదీసి అతని ద్వారా ఆస్థి మీద పెత్తనాన్ని సంపాదించ గలిగారు. రెండవ వితంతువు కోర్టు వ్యాజ్యం ద్వారా వారసత్వపు ఆస్థిని సాధించ గలిగింది; కాని ఆవిడ కుమారుడు, ఆ ఆస్థిని స్వాధీనం చేసుకొని తల్లిని అనాధను చేశాడు!

రాజస్థాన్‌లో భర్త చనిపోయిన పన్నెండవ రోజుననే వితంతువును అత్తమామలు, ఆవిడ బావమరదులు తన్ని, తరిమివేశారు. మరొక స్త్రీకి పన్నెండవ యేటనే వైధవ్యం సంప్రాప్తించగా, ఆవిడ తల్లి పంచన చేరింది ఆ తల్లి పేదరాలు కావటం చేత, పోషించ లేక పునర్వివాహం చేసింది. ఆవిడకు పుత్ర సంతానం గలిగితే, ఆస్థి తమకు దక్కదని, ఆవిడ భర్త దాయాదులు, ఆవిడ భర్తను చంపివేశారు.

మహారాష్ట్రలో ఒక యువతిని ఆవిడ సోదరుడు, మూడు వందల రూపాయల కన్యాశుల్కాలనికి ఆశపడి ఆవిడను అమ్మినంత పని చేశాడు. పెండ్లయిన నాటి నుండి ఆవిడ భర్త చేతిలో దెబ్బలు తింటుండేది. భర్త మరణానంతరం బావమరదులు, తోటికోడండ్రు బాధించసాగారు. విధిలేక, ఆస్థి హక్కును కూడా వదులు కొని ఆవిడ ఒక సంఘసేవిక సహాయంతో అనాధ శరణాలయాన్ని చేరింది.

బీహారులో ఒక యువతికి పదహారవ యేట పెండ్లయింది. పెండ్లయిన ఎనిమిదవ రోజుననే వైధవ్యం ప్రాప్తించింది. మామగారి అభిమానం వల్ల ఆవిడ పాతిక సంవత్సరాలు మెట్టినింట మర్యాదగా బ్రతుక గలిగింది. ఆయన మరణానంతరం ఆవిడకు కష్టాలు దాపురించాయి. మరది, తోటి కోడలు ఆవిడను కొట్టటం, తిట్టటం ప్రారంభించారు. ఆవిడకు వారసత్వంగా లభించిన భర్త ఆస్థిని తమ పేర పెట్టమని మరది వత్తిడి చేయ సాగాడు ఆమె నిరాకరిస్తూ వస్తున్నది. ఒక రోజు మరది, తోటికోడలు కలసి, మరిగిన నీటిలో కారం కలిపి ఆవిడమీద పోశారు. మరొక రోజు తోటికోడలు ఆవిడను కిందపడవేసి, గుండెల మీద కూర్చుని కుత్తుకకోయ ప్రయత్నించింది. అదృష్టవశాత్తు ఆవిడ ఆర్తనాదాన్ని విన్న ఇరుగు పొరుగు వారు వచ్చి కాపాడారు. ఆవిడ మరిది మీద కేసు పెట్టగా కోర్టు అతనికి శిక్ష విధించింది. అరవైవేల రూపాయల వరకూ లంచాలు బెట్టి అతడు నిర్దోషిగా పై కోర్టు నుండి జడ్జిమెంటును తెచ్చుకో గలిగాడు! గవర్నమెంటు అధికారుల వల్ల వితంతువులకు రక్షణ లభించదని తనకు జీవితానుభవం బోధించినట్లు ఆవిడ చెప్పుకొన్నది.

వితంతువుకు వారసత్వంగా రావలసిన ఆస్థిని అపహరించటానికి, దాయాదులు ఎంతటి దురాగతాలకు పాల్పడగలరో, ఈ జీవన గాధలు మనకు వివరిస్తున్నాయి. చట్టపరంగా లభించిన వారసత్వపు ఆస్థిని వితంతువులు అనుభవించలేక పోవటానికి గల కారణాలను ప్రదర్శించే సజీవ చిత్రాలివి.

పునరావాస కార్యక్రమాలలో కూడా వితంతువులకు అన్యాయం జరుగుతున్నట్లు బేలా భాటియా అనే సంఘసేవిక వెల్లడించారు. ఇందుకు ఉదాహరణగా, సర్దార్ సరోవర్ ప్రాజెక్టు నిర్వాసితుల పునరావాస కార్యక్రమంలో జరుగుతున్న అన్యాయాలను వివరించారు. "1980వ సంవత్సరానికి పూర్వం భర్తను కోల్పోయిన స్త్రీలను, కుటుంబ సంరక్షకులుగా గుర్తించము; వారిని మరొకరి సంరక్షణలో నున్న వారిగా మాత్రమే పరిగణిస్తాము" అని అధికారులు ప్రకటించారు. ఇలాంటి స్త్రీలకు, వారి పేరిట పట్టా భూములున్నా, వారికి పుత్రసంతానం లేనపుడు, ఇతర నిర్వాసితుల వలె పరిహారంగా వేరొక చోట భూములను పొందే అర్హత కూడా వీరికి లేదని అధికారులు

నిర్ణయించారు. కొన్ని సందర్భాలలో మైనరు కుమారులకు, వారి తల్లికి వేరు వేరు చోట్ల పునరావసం కల్పిస్తున్నారు! ఇందువల్ల, కుమారునకు తల్లి దూరమవుతున్నది. పరిహారం లభించని వితంతువులు, కుమారులకు దూరంగా ఉండవలసి వస్తున్న వితంతువులు ఎలా జీవించాలి అని బేలా భాటియా ప్రశ్నిస్తున్నారు.

గరిష్ఠ భూపరిమితి చట్టాల కింద లభించే అదనపు భూముల పంపకంలో కూడా స్త్రీలకు పరిగణన లభించటం లేదు. వారిని పురుషుల రక్షణలో జీవిస్తున్న వారిగానే అధికారులూ, రాజకీయ నాయకులు పరిగణిస్తున్నారు.

ఆస్థికి సంబంధించిన వారసత్వ విషయాలలో వితంతువులు కూడా, తోటి సామాజికుల భావాలనే (సంప్రదాయ బద్ధతనే) ప్రకటిస్తున్నట్లు సోషియాలజిస్టుల పరిశీలనలు, సర్వేలు సూచిస్తున్నాయి. భర్త మరణానంతరం, వారి ఆస్థి మీద వారి వితంతువుకు వారసత్వపు హక్కు ఉన్నట్లు వీరు గుర్తిస్తున్నారు. తమకు ఏవయినా ఆస్థి హక్కులుంటే, అవి పుట్టినింటగాక, మెట్టినింట మాత్రమే ఉంటున్నాయని వీరు భావిస్తున్నారు. వితంతువుగాని, మరే స్త్రీ గాని, పుట్టినింట తమకు ఆస్థి హక్కులున్నాయని భావించటం లేదు.

బీహారులోని రెండు ముజఫర్‌పూర్ జిల్లా గ్రామాలలో వితంతువుల మీద సర్వేలను నిర్వహించిన సీమా మిశ్రా, ఈనాక్షి గంగూలి తకరల్‌లు తమ అనుభవాలను సమీక్షిస్తూ ఇలా వ్రాశారు: "భర్త ఆస్థి మీద తమకు హక్కున్నట్లు వీరు (వితంతువులు - ర॥) విశ్వసిస్తున్నారు. అయినప్పటికీ ఆ ఆస్థిని వితంతువులు అనుభవించ గలగటం అనేది దిగువ విషయాల మీద ఆధారపడి ఉంటున్నది : వితంతువు వయసు, ఆవిడ సంతానవతా కాదా అన్న అంశము, వారి సంతానం మగ పిల్లలా లేక ఆడపిల్లలా అన్న విషయము, పుట్టినింటి వారి ఆర్థిక సాంఘిక పరిస్థితి, అత్తమామల ధోరణి లేక స్వభావము, భర్త మరణానికి పూర్వమే కుటుంబపు ఆస్థి విభజన జరిగిందా లేదా అన్న అంశము, వితంతువు పునర్వివాహానికి పూనుకొన్నదా ఆవిడ ఎచట నివశిస్తున్నది (పుట్టినింటనా మెట్టినింటనా) అన్న అంశం.

"సంక్షిప్తంగా చెప్పాలంటే విషయమిది. భర్త మరణ కాలానికి కుమారులు మేజర్లైన సందర్భంలో, వారసత్వంగా వచ్చే ఆస్థి కుమారుల స్వాధీన మవుతుంది. వితంతువు, కుమారులు మైనర్లుగా ఉన్నంత కాలము, ఆస్థి మీద మేనేజ్‌మెంట్ చేస్తూ అనుభవిస్తూ ఉంటుంది. పుత్ర సంతానం లేనపుడు, లేక ఆడపిల్లలు మాత్రమే ఉన్నపుడు భర్త ఆస్థిని అనుభవించే హక్కును వితంతువు అతి కష్టం మీద మాత్రమే సంపాదించ గలుగుతున్నది. సంతానవతి గానపుడు ఈ అవకాశం వితంతువుకు లభించటం అరుదు". (విడోస్ అండ్ ప్రోపర్టీ రైట్స్ . ఎ స్టడీ ఆఫ్ టు విలేజెస్)

పుట్టినింటి వారి ఆస్థిలో తమకూ వాటాను పొందే హక్కున్నట్లు స్త్రీ లెవరూ (కుమార్తెలు గాని, వితంతువులు గాని) నమ్మటం లేదని సీమా మిశ్రా ప్రభృతులు గుర్తించారు. ఆడపిల్ల, పెండ్లి చేసుకొని మరొకరింటికి తరలి పోవలసి ఉంటుంది గనుక, పుట్టినింటి వారి ఆస్థిలో భాగాన్ని కోరే హక్కు తనకు లేదని భావిస్తున్నది. తగిన వరుని చూచి, ప్రతిష్ఠ, సంపద గలిగిన కుటుంబీకులకు బిడ్డనిచ్చి కట్నకానుకలు సమర్పించటమే తలిదండ్రుల ఆస్థి నుండి తమకు లభిస్తున్న వాటాగా పుత్రిక భావిస్తున్నది. కట్నాల నివ్వటానికి పెండ్లి ఖర్చులకు తలిదండ్రులు ఆస్తుల నమ్ముతూ ఉండటాన్ని దీనికి నిదర్శనంగా ఆవిడ పరిగణిస్తున్నది. కూతురు ఎంతటి ముద్దుల మూటయినా, ఆవిడకు తమ ఆస్థిలో వాటాను ఇవ్వాలని తలిదండ్రులు భావించటం లేదు బిడ్డ కూడా, ఆస్థిలో వాటా నిమ్మని అడగదు. పుట్టినింటి వారి ఆస్థిలో తమకు కూడా వాటాను పొందే హక్కున్నదని అతి కొద్దిమంది ఆడపిల్లలకు మాత్రమే తెలుసు. తాను ఆస్థిలో వాటా నిమ్మని కోరటం అంటే తన సోదరులను పేదలనుగా చేయటమే నని ఆడబిడ్డ భావిస్తుంది. ఒకవేళ కూతురుగా, తలిదండ్రుల ఆస్థిలో వాటాను పొందదలచినపుడు, ఆవిడ దాన్ని సాధించటానికి కోర్టుకు పోవలసి ఉంటుంది. ఇందుకు తలపడితే, జీవితాంతము తాను పుట్టినింటికి దూరంగా ఉండవలసి వస్తుందన్న విషయం ప్రతి కూతురుకు తెలుసు. ఇందువల్ల ఆడపిల్లలు తలిదండ్రుల ఆస్థిలో భాగం పొందగోరి కోర్టుకు పోసాహసించరు. భర్త ఆస్థిలో వారసత్వపు వాటాను పొందటానికి నానా బాధలు పడవలసి వస్తున్న వితంతువులు కూడా, కూతుళ్ళకు కుటుంబ ఆస్థిలో వాటానివ్వటాన్ని వ్యతిరేకిస్తున్నట్లు సీమా మిశ్రా ప్రభృతులు వెల్లడించారు!

పురుషాధిక్యతను పెంచి పోషిస్తున్న సంప్రదాయం స్త్రీలకు ఎలా ముకుతాళ్ళను వేస్తున్నదో ఈ విషయాలు చిత్రిస్తున్నాయి.

కష్టమవుతున్న కుటుంబ పోషణ

భర్త మరణానంతరం, కుటుంబ ఆర్థిక పరిస్థితులు అస్తవ్యస్తమై, కుటుంబ పోషణకు వితంతువులు నానా బాధలు పడవలసి వస్తుంది పిల్లలు చిన్నవారై నపుడు ఆవిడ బాధలు మరింత పెరుగుతాయి

గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయ భూములున్నవారు, వాటిని దున్నుకు జీవితం గడప జూస్తారు లేనివారు కూలి-నాలి చేసుకొని జీవిస్తారు ఉన్న కమతాన్ని స్వయంగా మేనేజ్ చేయగల వితంతువులు చాలా తక్కువగా ఉంటారు. ఇలా చేయలేని వారు పొలాన్ని కౌలుకిచ్చుకొంటారు కొన్ని కులాలలో, వితంతువు పొలం పోవటం, పరాయి మగవారితో మాటాడటం తప్పుగా పరిగణిస్తారు. ఇందువల్ల భర్త మరణానంతరం పొలాన్ని స్వయంగా చేసుకోవటం వీలుగాదు. స్త్రీలకు వ్యవసాయ రుణాలు మంజూరు గావటానికి ఇబ్బందులుంటాయి. వ్యవహార జ్ఞానం లేక కూడా వీరు రుణాలను పొందలేరు. పర పురుషులతో వ్యవహరించగల శక్తి కూడా చాలామంది వితంతవుల కుండదు. ఈ పరిస్థితిని ఒక వితంతువు జీన్ డ్రేజ్‌కు వివరించిన వైనాన్ని వినండి. "...... గ్రామ సీమలలో, భర్త మరణానంతరం భర్త పాత్రను వితంతువు నిర్వహించటం చాలా కష్టం. వ్యవసాయ పనులను చేయించాలంటే పర పురుషులతో వ్యవహరించ వలసి ఉంటుంది. కూలిరేట్ల సంగతిని తెలుసుకోవాలి. మనుషులను కూలికి రప్పించుకో గలగాలి. అధికారులతో కూడా మాట్లాడవలసిన అవసరం ఉంటుంది ఇంతవరకూ పర పురుషులతో వ్యవహరించి యెరుగని స్త్రీ ఒక్కసారి ఈపనిని చేయటం చాలా కష్టం.... . ఇంత వరకూ తలిదండ్రులు, సోదరులు, భర్తతో తప్ప పరులతో

పదహారవ పట్టిక

పలాన్పూర్‌లో, మేజర్లయిన పురుషులు లేని వితంతు కుటుంబాల ఆదాయాలు

(వనరుల వారీ ఆదాయాలు – సాలుకు రూ.లలో - 1983-84)

| వితంతువు పేరు | సేద్యం | పొలం మీదికౌలు | పాల అమ్మకం | వితంతువు కూలి సంపాదన | పిల్లల సంపాదన | | మొత్తం కుటుంబాదాయం | కుటుంబపు తలసరి ఆదాయం రూ.లు |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | రూ.లు | కుటుంబపు మొత్తం సంపాదనలో దీని శాతం | | |
| చంపా | 0 | 138 | 0 | 112 | 4,707 | 95 | 4,958 | 1,653 |
| కమ్లా | 0 | 0 | 0 | 0 | 3,509 | 100 | 3,509 | 702 |
| లీలావతి | 2,696 | 0 | 714 | 0 | 0 | 0 | 3,410 | 682 |
| అష్రఫి | 0 | 830 | 1,631 | 0 | 0 | 0 | 2,461 | 615 |
| లక్ష్మి | 0 | 535 | 868 | 0 | 905 | 39 | 2,308 | 577 |
| రామ్‌రాజి | 0 | 390 | 210 | 0 | 1,495 | 71 | 2,103 | 421 |
| రామ్‌కలి | 0 | 0 | 0 | 204 | 0 | 0 | 204 | 204 |
| మొత్తం | 2,696 | 1,901 | 3,423 | 316 | 10,616 | 56 | 18,953 | |

– జీన్ డ్రేజ్ వ్రాసిన "విడోస్ ఇన్ రూరల్ ఇండియా" నుండి

మాటాడి యెరుగని స్త్రీ పరపురుషుని యెదుట నిలిచి ఎలా మాటాడ గలదు? ఎలా బేరసారాలు నిర్వహించగలదు? అసలు వారి ముఖం ఎలా చూడగలదు?"

వారసత్వంగా కొంత భూమినైనా భర్త ఆస్థి నుండి వాటాగా పొందటం వితంతువుకు కష్టంగా ఉంటున్న పరిస్థితిని చూచాం. అతి కష్టం మీద, అదృష్టవశాత్తు లభించిన కమతాన్ని స్వయంగా సేద్యం చేయించటానికి వితంతువు కిన్ని ఇబ్బందులున్నాయి స్వయంగా చేసుకోలేక పొలాన్ని కౌలుకిస్తే బాధించటానికి కౌలుదారీ చట్టాలున్నాయి! ఉన్న కమత మూడిపోవచ్చు, లేదా కౌలుదారుకు ఫలసాయం నుండి ఇవ్వవలసి వచ్చే వాటా పరిమాణం పెరుగవచ్చు. ఇందువల్ల వితంతు కుటుంబ పోషణ ఇబ్బందులలో పడవచ్చు.

స్వయం ఉపాధిని చేబట్టాలంటే తగినంత చదువు లేక పోవటం, వ్యవహార జ్ఞానం తగినంత లేకపోవటం అవరోధాలుగా ఉంటున్నాయి. అనారోగ్య భారం వల్ల పనిచేసే శక్తి తగ్గిపోతూ ఉంటుంది ఇలాంటి పనులు చేయలేనివారు కూలి-నాలి చేసుకొంటారు; లేదా ఇతరుల ఇండ్లలో పనివారలుగా ఉంటారు. చేతనయిన పనిని చేసి కుటుంబాన్ని పోషించే తాపత్రయంలో ఉంటారు. కుటుంబ పోషణకు వితంతువులు ఇన్ని ఇబ్బందులను ఎదుర్కొనవలసి ఉంటుంది గనుక పిల్లలను కూలి పనికి పంపుతారు. కొందరు వితంతువులకు, తమ సంపాదన కంటె పిల్లల సంపాదన అధికంగా ఉండటం కూడా సంభవమే. ఈ అంశాన్ని డ్రేజ్ తమ పలాన్పూర్ సర్వేతో రుజువు చేశారు. (వివరాలను 16వ పట్టికలో చూడవచ్చు) పట్టికలో పేర్కొన్న ఏడుగురు వింతువులలో నలుగురి మొత్తం కుటుంబాదాయంలో, పిల్లలు తెస్తున్నదే సగానికి మించి ఉన్నది! మొత్తం కుటుంబాదాయంలో పిల్లలు తెస్తున్న ఆదాయ పరిమాణం ఎంత కీలక మయినదో ఈ సంఖ్యా వివరాలు సూచిస్తున్నాయి.

పిల్లలు తెస్తున్న ఆదాయం వల్ల నయినా కుటుంబీకు లంతా పొట్టబోసుకో గలుగుతున్నారు గదా అని సంతృప్తి జెందే అవకాశాలు లేవు. ఇలాగయినా, ఏదో ఒక వృత్తికి పిల్లలు అలవాటు పడుతున్నారు గదా అని సంతసించలేము. పిల్లలు తమ వయసుకు మించిన పనిని చేయవలసి ఉంటుంది, చదువు సంధ్యలుండవు; తగినంత విశ్రాంతి వారికి లభించదు పని పరిస్థితులు వారి ఆరోగ్యానికి భంగకరంగా కూడా ఉండవచ్చును. పసితనపు జీవితానందాన్ని, స్వేచ్ఛను వారు అనుభవించే అవకాశాన్ని వితంతు కుటుంబ దారిద్ర్యం దోచి వేస్తున్నది. బాల కార్మికుల నియామకాలను నిషేధించే చట్టాలు, వారి సమస్యను పరిష్కరించ లేవని జీవితం రుజువు చేసింది వారు కుటుంబ పోషణలో నిర్వహిస్తున్న ఘనమైన పాత్రాప్రాధాన్యత మరుగున బడి, ఇలాంటి చట్టాలకు విశేష ప్రచారం లభిస్తున్నది. వితంతువుల ఉద్ధరణకు తగిన కార్యక్రమాన్ని, ప్రభుత్వాలు చేబట్టినపుడే వితంతువులకు చేయూత లభించటంతో పాటు, బాల కార్మికులకు విముక్తి కూడా లభిస్తుంది

## కొరవడుతున్న సామాజిక సపోర్టు

వితంతువుల నివాసానికీ, ఆస్థి హక్కులకు, ఉపాధికి ఉన్న అవరోధాలను పరిశీలించాం. ఈ పరిమితుల వల్ల, మరొకరి ఆర్థిక సహకారము, సామాజిక సపోర్టు లేకుండా వితంతువు మనుగడ సాగించటం కష్టమన్న విషయం స్పష్టమవుతున్నది.

భారతదేశపు గ్రామీణులు దయామయులనీ, ఇరుగు పొరుగు వారికి ఎటువంటి ఇబ్బంది వచ్చినా ఆదుకొంటారన్న భావం "నాగరికులలో" ఉన్నది. విదేశీయులలో ఈ భావం బలంగా ఉన్నది ఉత్తర భారతంలోని మూడు రాష్ట్రాలలో వితంతువుల జీవన పరిస్థితుల మీద సర్వేను నిర్వహించిన జీన్ డ్రేజ్ ఇదంతా భ్రమే నంటూ, విషయాన్నిలా వివరించారు:

"భారత దేశ గ్రామాలలో ఒక రకమైన "నైతిక ఆర్థిక వ్యవస్థ" ఉన్నదనీ, వితంతువులు, ఇతర రకాల నిస్సహాయులకు తోడ్పడటానికిది ఉపకరిస్తుందనే భావం (కనీసం భారత దేశం వెలుపలైనా) ఉన్నది. ఇటువంటి వ్యవస్థ ఏదయినా వాస్తవంగా ఉన్నదా అన్నది వివాదాస్పదమైన అంశము. కాని ఇపుడు మాత్రం అటువంటి వ్యవస్థను కనుగొనటం అతికష్టమైనపని

"ఈ విషయం మీద మరి కొంచెం ముందుకెళ్లి ఒక మాటను చెప్పదలచాను. ఉత్తర భారతంలో పరోపకార భావంతో (ప్రతిఫల మాసించకుండా) కుటుంబాల మధ్య పరస్పర వస్తు

మార్పిడి గాని, ద్రవ్యమార్పిడిగాని జరగటం అరుదుగా మాత్రమే కనుపిస్తున్నది.... కుటుంబాల మధ్య ఏదయినా వస్తు మార్పిడి జరిగితే, అది ప్రతిఫలమాసించి మాత్రమే జరుగుతున్నది "వారు మనకే మిచ్చారో అంత మేరకే వారికి మనం ప్రతిఫలంగా ముట్ట చెప్పాలి" అన్న మనోగతమైన అంచనాలు ప్రతి కుటుంబానికీ ఉంటాయి "మనం వారికి ఇంత" ఖరీదయినది ఇచ్చాం గనుక "అంత ఖరీదయిన" వస్తువులు మనకు రావలసి ఉన్నది అని ఆశిస్తూంటారు. అంతేగాని ఒక కుటుంబం మరొక కుటుంబానికి 'బహుమతి' గానో, లేక 'కానుకగానో' ఇచ్చేదంటూ ఏమీ ఉండదు.

"ఇదే సూత్రం అత్యంత సమీప బంధు కుటుంబాలకు కూడా వర్తిస్తుంది తండ్రి నుండి వేరుబడిన వివాహిత

పదిహేడవ పట్టిక

వితంతువులు ఎవరితో కలిసి నివసిస్తున్నారు అన్న అంశ నిర్ణయానికి జరిగిన సర్వేల ఫలితాలు : ఆయా సర్వేలలో తేలిన వితంతువుల సంఖ్యా పరిమాణాలు

| వితంతువులు ఎవరితో నివసిస్తున్నారు? | బోస్, సక్సెనాల సర్వే (1964) | బోస్, సేన్ల సర్వే (1966) | హర్లాన్ సర్వే (1968) | లాల్ సర్వే (1972) | కెయిన్ ప్రభృతుల సర్వే (1979) | మార్తాచెన్ సర్వే (1994) |
|---|---|---|---|---|---|---|
| వంటరిగా ఉంటున్నవారు | 1 | - | 4 | 1 | 20 | 343 |
| కుమారులతో ఉంటున్నవారు | 242 | 305 | 13 | 71 | 41 | 136 |
| తలిదండ్రులతో ఉంటున్నవారు | - | 5 | 0 | 2 | 2 | 17 |
| సోదరులతో ఉంటున్నవారు | - | 2 | 0 | 3 | 1 | 9 |
| కోడలితో ఉంటున్నవారు | - | - | 1 | - | 1 | 9 |
| అత్తమామలతో ఉంటున్నవారు | - | 4 | 0 | 1 | 1 | 8 |
| బావమరదులతో ఉంటున్నవారు | - | 20 | 0 | 3 | 2 | 8 |
| ఇతర బంధువులతో ఉంటున్నవారు | 16 | 12 | 0 | 7 | 0 | 14 |
| బంధువులుగాని వారితో ఉంటున్నవారు | 0 | 1 | 0 | 0 | 0 | 2 |
| సర్వేలో పాల్గొన్న మొత్తం వితంతువుల సంఖ్య | 259 | 349 | 18 | 88 | 70 | 545 |

వివరణ

1. బోస్, సక్సెనాల సర్వే (1964) రాజస్థాన్‌లోని 78 గ్రామాలలో జరిగింది 55 సంవత్సరాల వయసు పైబడిన 259 మంది వితంతువులను తమ సర్వేకు వీరెన్నుకొన్నారు.
2 బోస్, సేన్ల సర్వే (1966) రాజస్థాన్‌లోని 349 మంది వితంతువుల మీద జరిగింది
3. లాల్ సర్వే (1972) రాజస్థాన్ లోని మూడు పంచాయితీలలోని 88 మంది వితంతువుల మీద జరిగింది.
4. కెయిన్ ప్రభృతుల సర్వే (1979) బంగ్లాదేశ్‌లోని కార్‌గోపాల్పూర్ గ్రామీణ జనాభా లెక్కల ఆధారంతో జరిగింది
5. హర్లాన్ సర్వే (1968) పంజాబులోని, వయసు ముదిరిన వితంతువుల మీద జనాభా లెక్కల సమాచారం ఆధారంతో జరిగింది.
6. చెన్ సర్వే (1994) భారత దేశం లోని ఏడు రాష్ట్రాలలోని 14 గ్రామాలకు చెందిన 562 మంది వితంతువుల మీద జరిగింది మొదటి ఐదు కాలముల లోని సంఖ్యా సమాచారాన్ని జీన్ డ్రేజ్ సేకరించారు. ఈ వివరాలను వారు తాము వ్రాసిన "విడోస్ ఇన్ రూరల్ ఇండియా"లో ఇచ్చారు.

– ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ పత్రిక సెప్టెంబరు 30, 1995 సంచికలో "రీసెంట్ రిశర్చి ఆన్ విడోస్ ఇన్ ఇండియా" అన్న మకుటంతో ప్రచురితమైన మార్తా చెన్, జీన్ డ్రేజ్‌ల వ్యాసం ఈ పట్టికకు ఆధారం.

కుమారుడు వేరు కాపురం పెడతాడు, వారు ఒకరి కొకరు సహాయం చేయటం అనేది అరుదుగా మాత్రమే జరుగుతుంది. తండ్రి శారీరకంగా చేతగాని స్థితిలో ఉండగా, వారిపొలాన్ని కొడుకు సేద్యం చేసినా, దానిని కౌలు చెల్లింపు ప్రాతిపదిక మీదనే చేస్తాడు! ఒకరి పొలంలో మరొకరు పని చేయటానికి పోయినా, అది వేతన చెల్లింపు ప్రాతిపదిక మీదనే జరుగుతుంది! వేరుబడిన అన్నదమ్ముల మధ్య వైరం కనుపించటం అతిసామాన్యం" (జీన్ డ్రేజ్ వ్రాసిన "విడోస్ ఇన్ రూరల్ ఇండియా").

భారత దేశంలోని వితంతువులలో అత్యధికులు కుమారుల సంరక్షణలో జీవిస్తున్నారు వితంతువులే, మైనర్లయిన బిడ్డలతో కుటుంబ సంరక్షకులుగా ఉన్న కుటుంబాలు కూడా అధికంగానే ఉన్నాయి తామే కుటుంబ సంరక్షకులుగా ఉన్న వితంతువులూ, లేదా కుమారుల సంరక్షణలో నున్నవారూ కలిసి, మొత్తం వితంతువుల జనాభాలో నూరింట యనభై మందికి మించే ఉంటారని మార్తా చెన్ అంచనా వేశారు ఉత్తరప్రదేశ్, గుజరాత్, పశ్చిమ బెంగాల్ రాష్ట్ర గ్రామాలలో సర్వేలను నిర్వహించిన డ్రేజ్ కూడా ఇలాగే అంచనా వేశారు. ఈ మూడు రాష్ట్రాలలోనూ సర్వేలో పాల్గొన్న వితంతువులలో నూరింట 87 మందిలో కొంతమంది వితంతువులు వంటరిగా ఉంటున్నారు; కొందరు మైనర్లయిన పిల్లలతో కుటుంబాలు నడుపుతున్నారు; మరికొందరు కుమారుల సంరక్షణలో ఉన్నారు. వీరిలో నూరింట 56 మంది కుమారుల సంరక్షణలో ఉంటున్నారు.

తమ సర్వే ఫలితాలతో సంతృప్తి చెందని జీన్ డ్రేజ్, లోగడ ఈ అంశం మీద జరిగిన సర్వే ఫలితాలను పరిశీలించి చూచారు. (వివరాలను 17వ పట్టికలో చూడవచ్చు) డ్రేజ్ పరిశీలనలో తేలిన ప్రధానాంశాలివి .

ఎ బి బోస్, పి సి. సక్సేనాలు 1964వ సంవత్సరంలో రాజస్థాన్‌లో జరిపిన సర్వేలో పాల్గొన్న 259 మంది వితంతువుల లోనూ 242 మంది (93.44 శాతంమంది) కుమారులతో నివసిస్తున్నట్లు తేలింది. ఎ.బి.బోస్. ఎం.ఎల్.ఎ.సేన్‌లు జరిపిన మరొక రాజస్థాన్ సర్వేలో పాల్గొన్న 349 మంది వితంతువులలోనూ 305 మంది(నూరింట 87 మంది) కుమారులతో నివసిస్తున్నారు. 1972వ సంవత్సరంలో ప్రకటితమైన ఎస్ లాల్ రాజస్థాన్ సర్వేలో పాల్గొన్న 88 మంది వితంతువులలో 71 మంది (నూరింట 80 మంది) కుమారుల సంరక్షణలో నున్నట్లు తేలింది ఎం కెయిన్ ప్రభృతులు బంగ్లాదేశ్‌లో 1979లో జరిపిన సర్వేలో పాల్గొన్న మొత్తం 70 మంది వితంతువులలో, నూరింట 57 మంది కుమారులతో కలిసి జీవిస్తున్నారని రుజువైంది. మార్తా చెన్ సర్వేలో పాల్గొన్న 545 మంది వితంతువులలో నూరింట 88 మంది వంటరిగానో, లేక కుమారుల సంరక్షణలోనో ఉంటున్నట్లు తేలింది.

ఇదంతా ఉత్తర భారత ప్రాంతీయ సమాచారం గనుక దక్షిణ భారతానికి వర్తించదని భావించ నవసరం లేదు. నేషనల్ శాంపుల్ సర్వే వారు 1977-78 సంవత్సరాలలో కర్ణాటకలో జరిపిన సర్వే ఫలితాలను జీన్ డ్రేజ్ పరిశీలించారు. కుమారులతో నివసిస్తున్న వితంతువుల సంఖ్యా పరిమాణం, రాష్ట్రంలోని మొత్తం వితంతువుల జనాభాలో 63 శాతం వరకూ ఉన్నట్లు ఈ సర్వే ఫలితాలు సూచిస్తున్నాయి.

వితంతువు ఏకాకిగా జీవిస్తున్న కుటుంబాలు గ్రామీణ ప్రాంతాలలోని మొత్తం కుటుంబాలలో ఎన్ని ఉంటాయి, ఇలా ఏకాకులుగా జీవిస్తున్న వితంతువులు, మొత్తం వితంతువుల జనాభాలో ఎంత మంది ఉంటారు, కుమారులున్నా, ఎంత మంది వితంతువులు ఏకాకులుగా ఉంటున్నారు అన్న విషయ నిర్ణయానికి జీన్ డ్రేజ్ ప్రయత్నించారు లభించిన సమాచారాన్ని పరిశీలించిన తర్వాత, గ్రామీణ ప్రాంతంలోని మొత్తం కుటుంబాలలో, స్త్రీలు ఏకాకులుగా జీవిస్తున్నవి, రెండున్నర శాతం వరకూ, వితంతువులు ఏకాకులుగా ఉంటున్నవి రెండు శాతం వరకూ ఉండవచ్చునని వీరు అంచనా వేశారు. గ్రామీణ ప్రాంతంలో, 1981వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, మొత్తం వితంతువులలో, ప్రతి పన్నెండు మందికి ఒకరి చొప్పున ఒంటరిగా జీవిస్తున్న వారు ఉండ వచ్చునని అంచనా వేశారు. సమాచార సేకరణలోని లోపాల వల్ల సమగ్ర సమాచారం లెక్కలలోనికి వచ్చి ఉండక పోవచ్చునని అభిప్రాయపడుతూ, ఏకాకులుగా నివసిస్తున్న వితంతువులు మొత్తం వితంతువులలో, పది మందికి కనీసం ఒకరి చొప్పునయినా ఉంటారని డ్రేజ్ అభిప్రాయ పడ్డారు.

60 సంవత్సరాల వయసును మించిన వితంతువుల విషయ పరిశీలన వచ్చినపుడు, వీరిలో ఏకాకులుగా జీవిస్తున్న వారి సంఖ్యా పరిమాణం ఇంతకంటే అధికంగా ఉండవచ్చునని డ్రేజ్ అంచనా వేశారు. 60 సంవత్సరాల వయసును మించిన వితంతువులలో నూరింట 15 మంది నుండి 20 మంది వరకూ ఏకాకులుగా జీవిస్తూండవచ్చునని డ్రేజ్ అభిప్రాయపడ్డారు.

పుత్రసంతానం లేనందు వల్ల ఎందరు వితంతువులు ఏకాకులుగా జీవించ వలసి వస్తున్నదో అంచనా వేయటానికి కూడా డ్రేజ్ ప్రయత్నించారు. నేషనల్ శాంపుల్ సర్వే సమాచారం ప్రకారం, భారత గ్రామీణ ప్రాంతాలలో అరవై సంవత్సరాల వయసును మించిన స్త్రీలలో పన్నెండు శాతం మందికి జీవిస్తున్న కుమారులు లేరు. పుత్ర సంతానం లేని వితంతువులు మళ్ళీ పెండ్లి చేసుకొని ఉంటారని అనుకొన్నా, ఈ వయసు గ్రూపు వితంతువుల సంఖ్యా పరిమాణం కూడా పన్నెండు శాతం వరకూ ఉండవచ్చునని డ్రేజ్ భావించారు. ఇలా పలు విధాలుగా సమస్యను పరిశీలించిన తర్వాత, 60 సంవత్సరాల వయసును మించిన వితంతువుల జనాభాలో, జీవించి ఉన్నపుత్రులు లేక పోవటం చేత ఏకాకులుగా జీవిస్తున్న వారు పన్నెండు శాతం వరకూ ఉంటారని డ్రేజ్ అభిప్రాయ పడ్డారు.

కుమారుల సంరక్షణకు నోచుకోని మొత్తం వితంతువుల సంఖ్యా పరిమాణపుటంచనా వీరికి సాధ్యంగాలేదు. వితంతువులయిన తల్లుల మనుగడను పట్టించుకొని కుమారులుండటం సాధ్యమేనని అంగీకరిస్తూ, ఇలా కుమారుల సంరక్షణను పొందలేక పోయిన వితంతువుల సంఖ్య అల్పంగానే ఉండవచ్చునని డ్రేజ్ భావించారు. కుమారుల అండకు నోచుకోని వితంతువుల జీవన గాథలు హృదయ విదారకంగా ఉన్నట్లు కూడా డ్రేజ్ వెల్లడించారు. గ్రామీణ దారిద్ర్యం పెరుగుతూండటం వల్లా, కుటుంబ సభ్యుల మధ్య మమకారాలు తగ్గుతూండటం వల్లా, అనాథలుగా ఉండవలసి వస్తున్న వితంతు మాతృమూర్తుల సంఖ్య కాలానుగుణంగా పెరుగవచ్చునని కూడా డ్రేజ్ అభిప్రాయ పడ్డారు. "కుమారులున్నారు ఆదుకోవటానికి, ఆ వితంతు మాతృమూర్తికి ఏమికొరత" అని సమాజంగాని, ప్రభుత్వం గాని వీరియెడల శ్రద్ధను ప్రదర్శించక పోవటం, ఆ అనాథల బాధల ఇనుమడింపుకు తోడ్పడుతుందని డ్రేజ్ హెచ్చరించారు. ఇదొక సాంఘిక సమస్యగా రూపొందించగల అవకాశాలున్నట్లు సూచించారు.

వైధ్యవ్య ప్రాప్తి తర్వాత వితంతువు తన మనుగడకు పుట్టినింటికి పోవటం అతి తక్కువగా మాత్రమే జరుగుతుంది అత్తమామల పంచన బ్రతకటం అరుదుగా కనిపిస్తుంది. కర్ణాటకలో 1977-78 సంవత్సరాల కాలంలో జరిగిన నేషనల్ శాంపుల్ సర్వే ముప్పై రెండవ రౌండ్‌లో, సర్వేకు ఎన్నుకొన్న 338 మంది వితంతువులలో 17 గురు (ఐదు శాతం మంది) తలిదండ్రులతో ఉంటుండగా, ఒక్కరు మాత్రమే (0.3 శాతం మంది మాత్రమే) అత్తమామలతో ఉంటున్నారు. అత్తమామల అండ లభించిన వితంతువులను అదృష్టవంతులుగా వర్ణించవచ్చు. అత్తమామల పంచన వితంతువులు అతి తక్కువగా మాత్రమే చేరుతూండటానికి, సెక్సు పరమైన వేధింపులతో సహా, పలురకాల ఇబ్బందులను పడవలసి ఉండటవేు కారణమని పలువురు పరిశీలకులు అభిప్రాయపడ్డారు. తన బ్రతుకు దెరువుకు వితంతువు, అత్తమామల పంచన జేరటం కంటే, కోడలి సేవలు, సపోర్టు అవసరమయ్యే అత్తమామలు ఆవిడను తమతో ఉండనీయటం అధికంగా జరుగుతున్నట్లు కూడా పలువురు సోషియాలజిస్టులు అభిప్రాయ పడ్డారు

తలిదండ్రులు, తోబుట్టువులు, కుమారులు, కూతుళ్ళ నుండి వితంతువులకు లభిస్తున్న ఆదరణెంతో చూద్దాం.

వివాహానంతరం ఆడపిల్ల మెట్టినింటికి వెళ్ళిన తర్వాత, పుట్టినింటితో ఆవిడ సంబంధాలు బలహీన పడటమో, తెగిపోవటమో జరుగుతుంది.

కోడలు తన తలిదండ్రులకు సహాయం చేయటాన్ని అత్తమామలు, భర్త అంగీకరించరు. అదనపు కట్నం తెమ్మని పోరకుండా ఉంటే అదే పదివేలు. పండగలకు వివాహాది శుభకార్యాలకు వివాహితైన బిడ్డ పుట్టింటికి వెళితే, తలిదండ్రులు, సోదరులు ఎవరయినా బహుమానాలివ్వటం తప్ప, ఆవిడతో వీరికి నిత్యసంబంధాలంటూ ఉండవు. వైధవ్య ప్రాప్తి తర్వాత సంతానవతులు గాని వారు తప్ప, సంతానవతులంతా మెట్టినింటనో, లేక భర్తగారి గ్రామంలోనో

ఉంటారు. భర్త మరణానంతరం కూతురు ఇబ్బందులు పడుతుందన్న ఆందోళనతో, తలిదండ్రులు ఆవిడను తీసుకొచ్చుకో గోరినా, ఇందువల్ల, వారసత్వంగా రావలసిన భర్త ఆస్థి చేజారిపోయే అవకాశాలున్నపుడు, ఇబ్బందులు పడవలసి వచ్చినా భర్త గ్రామంలోనే ఉండమని వారు ఆవిడకు చెబుతారు. వితంతువు కూడా ఇలాగే భావిస్తుంది. కూతురును రప్పించుకోవలసిన అవసరం ఉన్నా, కొందరకు దారిద్ర్య బాధ అవరోధంగా ఉంటుంది.

కుటుంబంలోని స్త్రీలు, ఆడపిల్లలు లింగ వివక్షా పాటింపు వల్ల నష్టపడుతున్న తీరును ఇంతకు పూర్వమే వివరించాం. వితంతువుల విషయంలో ఈ లింగవివక్షా ప్రదర్శన తీవ్రరూపం దాల్చవచ్చు వితంతువున్న కుటుంబాల ఆదాయం, వితంతువు లేని కుటుంబాల ఆదాయం కంటే చెప్పదగినంత తక్కువగా ఉండటం లేదని డ్రేజ్ పరిశీలనలు నిరూపించాయి. ఆదాయపరిమాణ భేదం ఈరెండు వర్గాలకు చెందిన కుటుంబాల మధ్య లేదు గనుక, ముత్తైదువులకు లభిస్తున్నంత పోషణ, ఆరోగ్య రక్షణ, ఆకుటుంబంలోనే ఉంటున్న వితంతువుకు కూడా లభిస్తూండాలని మనం భావిస్తాం. అయినపుడు, ముత్తైదువుల మరణాల రేటు కంటే వితంతువుల మరణాల రేటు అధికంగా ఉంటున్నది! ఇదొక విచిత్రమైన పరిస్థితిగా కనుపించవచ్చు. కాని వాస్తవంగా ఇందులో చిత్రం ఏమీలేదు. విషాదం మాత్రమే ఉన్నది. కుటుంబంలోని వితంతువుకు, ఇతరకుటుంబీకులకు లభిస్తున్నంత పోషణా, ఆరోగ్య రక్షణా లభించక పోవటమే దీని వెనుకనున్న "రహస్యం". కుటుంబ సంరక్షకురాలిగా నున్న వితంతువుల కంటే, ఇతరుల సంరక్షణలో నున్న వితంతువుల మరణాల రేటు అధికంగా ఉంటున్నట్లు, రెహ్మాన్, మెన్‌కిన్‌లు 1990వ సంవత్సరంలోనూ, రెహ్మాన్, ఫాస్టన్, మెన్‌కిన్‌లు 1992వ సంవత్సరం లోనూ బంగ్లాదేశ్‌లో జరిపిన సర్వేలు నిరూపించాయి. ( ఈ విషయాన్నింతకు పూర్వమే వివరించాం. సంఖ్యా వివరాలకు పదవ పట్టికను చూడండి.) కుటుంబంలో సక్రమమైన పోషణ, ఆరోగ్య రక్షణా వితంతువుకు లభిస్తూ ఉండక పోవటమే, ముత్తైదువుల కంటే వీరు అధికంగా మరణిస్తున్నారని ఇతర పరిశోధకులు కూడా నిరూపించారు.

ఈ దుష్ఫలితానికి గల కారణాలను తెలుసుకోవటానికి పలువురు పరిశోధకులు ప్రయత్నించారు వితంతువు పోషణా, ఆరోగ్య రక్షణా సరళిని దిగువ పేర్కొన్న మూడు అంశాలు ప్రభావితం జేస్తున్నట్లు వీరు భావిస్తున్నారు ·

1. వితంతువు పోషణా, సంరక్షణా కుటుంబానికి లాభకరమా కాదా?

2. తగినంత పోషణ, ఆరోగ్య రక్షణ వితంతువుకు లభించవలసిన అవసరంపై కుటుంబీకుల, ముఖ్యంగా కుటుంబపు పెద్ద అభిప్రాయం (వితంతువు యెడల వారికి మమకారం, గౌరవం, కృతజ్ఞతా భావాలు ఉండటం, లేక పోవటం అనేఅంశాలు దీనిని ప్రభావితం చేస్తాయి)

3. వితంతువు కుటుంబాన్ని విడిచి వెళితే, దానికి సంభవించగల నష్టపరిమాణమెంత?

కుటుంబీకులంతా పనులకు పోయినపుడు వితంతువు, ఇంటిలో ఉండి, వంటావార్పూ చూస్తూ, పిల్లల సంరక్షణాభారాన్ని వహిస్తూ ఉంటే ఆవిడకు కుటుంబీకులు విలువనిస్తారు. వితంతువు, తన తల్లి, లేక సోదరి గనుక ఆవిడను సంరక్షించ వలసిన బాధ్యత తన మీద ఉన్నది అని గుర్తించిన కుటుంబయజమాని, ఆవిడను సగౌరవంగా చూస్తాడు; సంరక్షిస్తాడు. వితంతువు కూలి-నాలి చేస్తూ డబ్బు సంపాదించి తెస్తున్నా, లేక ఆవిడకు ఆస్థి ఉండటంవల్ల దాని మీద వచ్చే ఫలసాయంవల్ల కుటుంబం లాభిస్తున్నా, ఆవిడను బాగానే చూస్తారు. ఆవిడ మరణానంతరం ఆవిడ ఆస్థి తమకు వస్తుందని వారసులు ఆశపడతారు. ఈరెండు అర్హతలూ ఉన్న వితంతువును కుటుంబం విడిచి పోనీరు. ఆవిడను మర్యాదగానే చూస్తారు.

వితంతువు క్షేమంగా ఉండాలంటే, ఆవిడకు జీవన భద్రత యేర్పడాలంటే, ఆవిడకు ఆస్థి ఉండటం అత్యవసరం అని ఈ పరిణామాలు సూచిస్తున్నాయి. ఇచ్చట పేర్కొన్న ఆర్థిక కారణాలే గాక కుటుంబీకులతో ఒకరి మీద మరొకరికున్న గౌరవం, మమకారం, సదభిప్రాయం, వ్యక్తిగత బాధ్యతల గుర్తింపు కంటే, స్పష్టంగా లేక సంఖ్యా రూపంలో నిరూపించ వీలులేని అంశాలూ, అన్ని సందర్భాలలోనూ, అందరకూ అన్వయించ వీలు లేని అంశాలు కూడా ఈ విషయ నిర్ణయంలో తమ ప్రభావాన్ని కొంత మేరకు చూపుతాయి.

ఉదాహరణకు అత్తా కోడండ్ర సంబంధాన్ని చూద్దాం. తనకు ఆస్థి ఉన్నది గదా అని వితంతువైన అత్తగారు కోడలిని రాచిరంపాన బెడుతూంటే, ఆకోడలు అత్తగారిని ఇంటినుండి గెంటివేయవచ్చు గదా? అటువంటి తల్లిమీద కుమారునకు మాత్రం ఏపాటి గౌరవముంటుంది? దురుసుగా వ్యవహరించే లక్షణం కొందరికుండవచ్చు ఇటువంటి పరిస్థితులలో ఆస్థి ఉన్న వితంతువులు కూడా ఆదరణను కోల్పోతున్నారు. ఇలాంటి సందర్భాలు చాలా తక్కువగా మాత్రమే ఉంటాయి. కాని అత్యధిక సంఖ్యాక వితంతువుల జీవనం దయనీయంగా ఉంటున్న మాట వాస్తవం. వీరికి జీవన భద్రతను కల్పించ వలసిన బాధ్యత వారి సమీప బంధువులకే గాక, సమాజానికి, ప్రభుత్వానికి కూడా ఉన్నది. ఇపుడు అమలులోనున్న వితంతు పెన్షనుల వంటి స్కీముల అమలు వారికి కొంత మేరకయినా భద్రతను కల్పించగలదు. ఈ కొద్ది పాటి సహాయము వితంతువులకు అందుతున్న వైనాన్ని పరిశీలించుదాం

## వితంతువుల పెన్షన్ పథకాలు

ఇటీవలి కాలంలో పలురాష్ట్ర ప్రభుత్వాలు వితంతువులకు పెన్షన్ స్కీములను అమలు పరచటం కనుపిస్తున్నది. ఇవి ఇస్తున్న పెన్షన్ మొత్తాలు ఒకే పరిమాణంలో ఉండటంలేదు. ఇస్తున్న పెన్షన్లు మాసానికి యాభై రూపాయల నుండి వందరూపాయల వరకూ ఉంటున్నాయి. కొన్ని పథకాలు, నిర్ణీత కాలంలో వృత్తికి సంబంధించిన తర్ఫీదును వితంతువు పొందలేక పోతే, పెన్షన్ పొందటానికి ఆవిడను అనర్హురాలిగా పరిగణిస్తున్నారు.

దీనివల్ల లభిస్తున్న ఫలితం ఎంత తక్కువగా ఉన్నప్పటికీ, కనీస సహాయవసతి ఉన్నది అన్న విషయం కూడా చాలా మంది వితంతువులకు తెలియదు. వితంతువులలో అత్యధికులు గ్రామీణులు గావటం, దీనికి నిరాక్షరాస్యత, వ్యవహారజ్ఞాన లేమి కూడా తోడుగావటం ఇందుకు కారణం. గుజరాత్ రాష్ట్రంలోని నాలుగు గ్రామాలలో వితంతువుల మీద సర్వేను నిర్వహించిన వర్షా భగత్ గంగూలి మాటలలో ఈ పరిస్థితిని చూడండి. "మేము నిర్వహించిన సర్వేలోనూ, మహిళా సమ్మేళనాలలోనూ పాల్గొన్న మహిళలందరూ ఇలాంటి స్కీము వితంతువులకు ఉన్నట్లే తమకు తెలియదన్నారు. గ్రామాలకు వచ్చే గ్రామ సేవకులు సంపన్నుల ఇండ్లకు మాత్రమే వెళ్ళి మాట్లాడతారనీ, సామాన్యులను వీరు చూడరనీ తెలిసింది. ఇందువల్ల అల్పాదాయ వర్గాల వారికి ఈ స్కీమును గురించి తెలియదు. వితంతువులకు ఈ స్కీమును గురించి తెలియజెప్పటానికి పత్రికా ముఖంగా ప్రకటనలు వెలువడటం లేదు". (సోషల్ సెక్యూరిటీ ఆఫ్ ఉమెన్ ఇన్ గుజరాత్ అన్న వ్యాసం)

ఈ స్కీము ద్వారా పెన్షన్‌ను పొందటానికి, నిరక్షరాస్యులు వ్యవహారజ్ఞానం కూడా లేని పేద వితంతువులు పడవలసి వస్తున్న బాధలను, అనేక బాధలు పడి చివరకు పెన్షను పొందటానికి అర్హతను పొందినా, ఆ పెన్షన్ సక్రమంగా రాక పోవటమో, లేక వస్తూ మధ్యలోనే ఆగిపోవటమో జరుగుతున్న సందర్భాలను కె.వి. ఈశ్వర ప్రసాద్, తమిళనాడు స్కీము మీద వ్రాసిన వ్యాసంలో వివరించారు వ్యాసం చివరనున్న సమీక్షాభాగం ఈ పరిస్థితిని ఇలా వివరించింది.

" ఈ స్కీము లో చాలా లోపాలున్నాయి. వాటిలో కొన్నివి:

"1. పెన్షన్‌ను పొందటానికి వితంతువు కుండవలసిన అర్హతల నిర్దేశం చాలా కఠినంగా ఉన్నది. వితంతువు పెన్షన్‌కోసం పెట్టుకొన్న అర్జీని అంగీకరించటం కంటే, దానిని సులభంగా నిరాకరించటానికే ఇవి వినియోగపడుతున్నాయి. నిరాధారియైన వితంతువు నిజస్థితిని నిర్ణయించే సూత్రాలు న్యాయంగా లేవు. కుమారుడు, మనుమడు, ఇతర సంపాదనా పరులు అర్జీదారైన వితంతువును సంరక్షిస్తున్నారా, లేక వారు వేరుగా ఉంటున్నారా అన్న విషయ విచారణకే వీలుండటం లేదు. పైన పేర్కొన్న ముగ్గురిలో, ఏ ఒక్కరు వితంతువుకున్నా, వారు ఆవిడను పోషిస్తూండక పోయినాసరే, ఆవిడ పెన్షన్ పొందటానికి అనర్హురాలిగా రూల్సు నిర్దేశిస్తున్నాయి!

"2. పేదరాలైన వితంతువు అర్జీని దాఖలు చేయటం, అవసరమైన సాక్ష్యాధారాలను చూపటం వంటివి చేయటం, ఆవిడకు తలకుమించిన పనులవుతున్నాయి. ఈ పనులను పూర్తి చేయటానికి చాలా కాలం పడుతుండటం వల్ల, ఈ కాలంలో కూలి చేసుకోవటం ద్వారా లభించగల సంపాదనను ఈ పేదరాలు పోగొట్టుకోవలసి వస్తున్నది. అర్జీపెట్టిన తర్వాత దాని పరిష్కారానికి చాలా కాలం పడుతున్నది. అదృష్టవశాత్తు పెన్షన్ శాంక్షనయినా, నిధులు లేకపోవటం అన్న కారణంతో,

పెన్షన్‌ను పొందుతున్న మరొక వితంతువు మరణించే వరకూ ఈ వితంతువుకు పెన్షన్‌ను చెల్లించటం లేదు. క్యూలో నిలుచుండి ఆ అశుభ ఘడియలకు వేచి ఉండవలసి వస్తున్నది!

" 3 పెన్షన్ చెల్లింపు ప్రారంభమైన తర్వాత వితంతువు బాధలు తీరినట్లు కాదు. ఆవిడ మరొక రకమైన బాధను అనుభవించ వలసి ఉంటుంది పెన్షన్ రూల్సుకు వ్యతిరేకంగా ఏమీ జరగటం లేదని, అధికారులు కోరినపుడల్లా ఆవిడ రుజువులు చూపవలసి ఉన్నది. ఇలా చేయలేని పక్షంలో పెన్షన్‌ను ఉపసంహరిస్తున్నారు" (పెన్షన్ స్కీమ్ ఫర్ విడోస్ ఇన్ తమిళనాడు)

ఈ విషయాన్ని శ్రీ ప్రసాద్ వేరొకచోట ఇలా వివరించారు "వితంతువు తాను బ్రతికున్నట్లు, అదే గ్రామంలో నివసిస్తున్నట్లు, తనకు పోషకు లెవ్వరూ లేనట్లు నియమిత కాలపరిమితిలోపల నిరూపించ వలసి ఉంటుంది. తాలూకా ఆఫీసుకు వితంతువు సాలుకు రెండు సార్లయినా వెళ్ళిరావలసి ఉంటుంది.... ఈ నియమోల్లంఘన వల్ల పెన్షన్ ఉపసంహరణ ప్రమాదం ఉంటుంది

" ఏకారణం చేతనయినా పెన్షన్ ఆగిపోతే అది తిరిగి వచ్చేట్లు చేసుకోవటం చాలా కష్టం. అదొక సంగ్రామం వంటిది. పెన్షన్‌ను పొందటం, తర్వాత దానిని నిలుపుకోగలగటం అనేది వితంతువుకు ఒక పోరాటం వంటిది. బ్రతుకే ఒక పోరాటమైన వితంతువుకు, పెన్షన్‌ను పొందటం, పొందిన దానిని పోకుండా చూచుకోవటం ఇంతకంటే తీవ్రమైన పోరాటంగా తయారైంది"

ఈ "పోరాట" రూపం గుజరాత్‌లో ఎలా ఉన్నదో వర్షా గంగూలి మాటలలో చదవండి :

"అప్లికేషన్ ఫారాలు తాలూకా లేక జిల్లా స్థాయి కార్యాలయాలలో మాత్రమే లభిస్తున్నాయి. వితంతువు, ఆ ఫారాలకోసం, ఈ కేంద్రాలకు పనిగట్టుకొని పోవాలి. ఫారాలను సంపాదించిన తర్వాత తాను నిరక్షరాస్యురాలు గనుక, దాన్ని పూరించటానికి మరొకరి సహాయాన్ని అర్థించాలి. అటుతర్వాత తన ఫోటో తీయించుకొని, ఆఫోటో కాపీని, అవసరమైన ఇతర సర్టిఫికెట్లను "ఎటెస్ట్" చేయించుకోవాలి. ఫొటోలు తీయించుకునే అవకాశాలు గ్రామాలలో ఉండవు. ఇందుకు దాపులోని పట్నానికి పోవాలి ఫోటోతీయించుకొన్నా, దాన్ని వెంటనే ఫోటోగ్రాఫర్ ఇవ్వడు. రెండు మూడు రోజులు ఆగి రమ్మంటాడు. ఇందువల్ల మరొక సారి ఆ పట్నానికి ఆవిడ వెళ్ళ వలసి ఉంటుంది అవసరమైన సర్టిఫికెట్లను గ్రామాధికారి నుండి గాని, గ్రామ సర్పంచ్ నుండి గాని సంపాదించాలి. ఇవి సులభంగా లభించేవిగావు; నాలుగైదుసార్లు వారిచుట్టు తిరగాలి. అన్ని నిర్దేశితపనులను ముగించిన తర్వాత, దరఖాస్తును పోస్టులో పంపాలి లేదా తానే స్వయంగా తాలూకా ఆఫీసులో ఇచ్చిరావాలి. ఈ పనులన్నింటికి ఎంతో కాలవ్యవధి పడుతుంది; సొమ్ము ఖర్చవుతుంది ఈ రెండూ కొరవడిన వితంతువు బాధను ప్రత్యేకంగా వివరించనవసరం లేదు ఇంత కష్టపడి దరఖాస్తును పంపుకొన్నా, ఫలితం దక్కగలదన్న గ్యారెంటీ లేదు. ఇలాంటి అనిశ్చిత పరిస్థితులలో, అమూల్యమైన తన కాలవ్యవధిని ఖర్చు చేసి, ఆర్థిక భారాన్ని భరించి వితంతువు, పెన్షన్ కోసం అప్లికేషన్‌ను పెట్టటానికి సాహసించలేదు. అధికారులు ఒక సారి దరఖాస్తును నిరాకరిస్తే, మరొక సారి దరఖాస్తును పంపగల యోగ్యతను ఆ వితంతువు కోల్పోతుంది". (సోషల్ సెక్యూరిటీ ఆఫ్ విడోస్ ఇన్ గుజరాత్)

దరఖాస్తు చేయటం, తత్ఫలితంగా పెన్షన్‌ను పొందటంలో ఇన్ని ఇబ్బందులుండటం వల్లనే ప్రయోజనాన్ని పొందుతున్న వితంతువుల సంఖ్య నామమాత్రంగా ఉన్నది. తమిళనాడులో 1991-1992 వ సంవత్సరంలో 1, 91,140 మంది వితంతువులు ప్రయోజనం పొందినట్లు ఇందుకు రాష్ట్రప్రభుత్వానికి 20,59,000 రూపాయలు ఖర్చయినట్లు ఆరాష్ట్ర ప్రభుత్వ అంచనాలు తెలుపుతున్నాయని ఈశ్వరప్రసాద్ వెల్లడించారు. ఈ లబ్ధిదారులంతా వితంతువులు మాత్రమే గాదు; వికలాంగులు, అనాధ స్త్రీలు కూడా ఉన్న విషయాన్ని ఈశ్వరప్రసాద్ ప్రత్యేకంగా పేర్కొన్నారు.

గుజరాత్‌లో 1994-1995 వ సంవత్సరంలో, ఆ రాష్ట్ర ప్రభుత్వ అంచనాల ప్రకారం వితంతువులు, విడాకులను పొందిన స్త్రీలు, అనాధలు అందరూ కలిసి మొత్తం 7,323 మంది ఈ స్కీము కింద ప్రయోజనాన్ని పొందారు. ప్రభుత్వం ఇందుకు ఆ సంవత్సరంలో 1,22,28,140 రూపాయలను ఖర్చు చేసింది. ఈ విషయాన్ని ప్రభుత్వం నుండి సేకరించి తమ వ్యాసంలో ఇచ్చిన వర్షా గంగూలి, ఈ స్కీము కింద

పెన్షన్‌ను పొందటానికి అర్హులైన 14,72,724 మంది స్త్రీలల్లో, వెయ్యింట ఐదుగురకు మాత్రమే ప్రయోజనం చేకూరినట్లు అంచనా వేశారు ఈ రాష్ట్రంలో పెన్షన్, మాసానికి రెండువందల రూపాయల వరకూ ఇస్తున్నారు. బడ్జెట్ సొమ్ము మిగిలే అవకాశాలున్నపుడు మాసానికి 1,300 రూపాయలు ఇచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి

మన దేశంలో పెన్షన్ స్కీమును ఆదర్శ ప్రాయంగా నిర్వహిస్తున్న ఘనత కేరళ రాష్ట్రానికి దక్కుతుంది సుమారుగా 2,60,000 మంది వితంతువులకు పెన్షన్ లభిస్తున్నట్లు ఇఖ్బల్ గులాతి, లీలా గులాతీలు అంచనా వేశారు ఈ రాష్ట్రంలో మూడు రకాల పెన్షన్ స్కీములున్నాయి వితంతువులకు, అనాథలకు కలిపి ఒకటి, వ్యవసాయ కూలీలకు మరొకటి, వికలాంగులకు, మనఃస్థిమితంలేని వారికి వేరొకటి అమలులో ఉన్నాయి చివరి రెండు స్కీములలో కూడా వితంతువులుండే అవకాశాలున్నాయి ఈ అంశాన్ని కూడా పరిగణనకు తీసుకొనే, గులాతీ ప్రభృతులు 2,60,000 మంది వితంతువులు పెన్షన్ స్కీముల వల్ల ప్రయోజనం పొందుతున్నట్లు అంచనా వేశారు రాష్ట్రంలోని పేద వితంతువులలో నూరింట అరవై మంది వరకూ (57.5 శాతం మంది వరకూ) పెన్షన్ పొందుతున్నట్లు వీరు అంచనా వేశారు. గ్రామీణ వితంతువులలో నలభైశాతం మంది మాత్రమే ఈ స్కీముల ప్రయోజనాన్ని పొందగలుగుతున్నట్లు వీరు పేర్కొన్నారు.

పావర్టీ లైన్‌కు (దారిద్ర్య రేఖకు) దిగువ నున్న వితంతువులందరనూ (వృద్ధులు, యువతులు అన్న భేదం లేకుండా) పరిగణనకు తీసుకొంటే, వీరి సంఖ్య సుమారుగా ఎనిమిదిన్నర లక్షల వరకూ ఉంటుందనీ, వీరందరకూ ఒక్కొక్కరికి నెలకు వందరూపాయల చొప్పున పెన్షన్ చెల్లించవలసి వస్తే సాలుకు నూటరెండుకోట్ల రూపాయల వరకూ ఖర్చవుతుందని గులాతీలు అంచనా వేశారు. ఇది రాష్ట్రపు మొత్తం సంపదోత్పత్తిలో 0.75 శాతము, 1991-1992 వ సంవత్సరపు రాష్ట్ర ప్రభుత్వపు మొత్తం ఖర్చులో 3.4 శాతం వరకూ మాత్రమే ఉంటుందని వీరు అంచనా వేశారు. రాష్ట్ర ప్రభుత్వం, పదవీ విరమణ చేసిన తన సిబ్బందికి యేటాఇస్తున్న పెన్షన్ మొత్తంలో, పేదవితంతువుల కివ్వవలసివచ్చే పెన్షన్, ఐదవవంతు కంటె తక్కువుంటుందని గులాతి ప్రభృతులు చెబుతూ, వితంతువులకు పెన్షన్ సౌకర్యపు వసతిని ఏర్పాటు చేయటానికి నిధులు కొరవడినట్లు చెప్పటం అర్థరహితమన్నారు. కేరళ అనుభవ ప్రాతిపదిక మీద చూస్తే, భారత దేశంలోని పేద వితంతువు లందరకూ పెన్షన్ వసతిని కల్పించటం అసాధ్యంగాదన్నారు. కేరళ కంటె సంపన్న రాష్ట్రాలు, వితంతువుల పెన్షన్ స్కీములనమలు జరపటంలో వెనుకబడి ఉండటం కూడా గమనార్హమైన అంశంగా వీరు పరిగణించారు

ఇదే విషయాన్ని, మద్రాస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డెవలప్ మెంట్ స్టడీస్‌కు చెందిన ఎస్. గుహన్ బలపరుస్తూ, 1994 వ సంవత్సరం మార్చిమాసంలో బెంగుళూరులో జరిగిన వితంతువుల సదస్సులో మాట్లాడుతూ కొన్ని సంఖ్యా వివరాలనిచ్చారు. దేశంలోని మొత్తం వితంతు జనాభాలో, యాభై సంవత్సరాల వయసును మించిన వారిలో ఇరవైశాతం మందికి, ఇరవైనుండి అరవై సంత్సరాల మధ్య వయస్కులయిన సంపాదనా పరులు (పురుషులు) మరణించిన సందర్భాలలో, వారి మీద ఆధారపడి జీవిస్తున్న వారి వితంతువులకు నెలకు వందరూపాయల చొప్పున పెన్షన్ చెల్లింపుకు, సాలుకు తొమ్మిదివందల కోట్ల రూపాయలు ఖర్చవుతుందని వీరు అంచనా వేశారు. 1994 వ సంవత్సరపు అంచనాల ప్రకారం భారత జాతీయోత్పత్తి తొమ్మిదిలక్షల కోట్లని, ఇందులో పైన పేర్కొన్న వారికి పెన్షన్ ఇవ్వవలసివచ్చే మొత్తం తొమ్మిదివందల కోట్లు - కేవలం 0.1 శాతమని (వెయ్యింట ఒక్క రూపాయనీ) చెప్పారు.

నిధుల కొరత పేరిట పేదవితంతువుల పెన్షన్‌కు తగినంతగా నిధులు కేటాయించక పోవటం అనుచితమన్న విషయాన్నీ అంశాలు బట్టబయలు చేస్తున్నాయి. నేతలకు ఈ విషయం మీద ఆసక్తి లేకపోవటం చేతనే, పెన్షన్ స్కీములు నామమాత్రంగా, ఎన్నికలయెరగా తయారైనాయి సాంఘిక సంక్షేమానికి, సమాజ కళ్యాణానికీ కృతనిశ్చయంతో పనిచేయలేనివారి పాలనలో మనమున్నాం. కనుక వితంతువుల సంక్షేమ సాధనకు కూడా ఉద్యమాలు నడవక తప్పదు.

ఇలాంటి నిస్సహాయ స్థితిలో నున్న వితంతువుకు, వారసత్వపు ఆస్తి ఎంతమేరకు లభించినా, అది వారికి వరప్రసాదమే అవుతుంది. కనుక వీరికి ఆస్తిహక్కులు, ముఖ్యంగా వ్యవసాయ భూముల మీద హక్కులు లభించటానికున్న అవరోధా లేమిటో చూద్దాం.

## వ్యవసాయ భూముల మీద ఆస్థి హక్కులు

పితృ స్వామిక సమాజంలో కూతురుగా తలిదండ్రుల ఆస్థిలో వాటాను పొందే అవకాశాలు స్త్రీకి లేవు. చట్టం ఇస్తున్న అవకాశాన్ని కూడా కూతురుగా స్త్రీ వినియోగించుకో లేని స్థితిలో ఉన్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. పుత్రసంతానం లేని దంపతులు, బాలకుని దత్తత తీసుకొంటే, వారి ఆస్థి కుమార్తెలకు రావటానికి బదులు ఆ దత్తకుమారునకు పోతుంది కనుక పుత్రసంతానంలేని దంపతుల పుత్రికలకు, వారసత్వపు ఆస్థి లభించే అవకాశాలుండటం లేదు. ఇలాంటి అవరోధాల మూలంగానే, తలిదండ్రుల ఆస్థి నుండి వారసత్వంగా వాటాను పొందుతున్న పుత్రికల సంఖ్య చాలా తక్కువగా ఉంటున్నట్లు ఇంతకు పూర్వమే వివరించాం. (ఈ అధ్యాయంలోని పదిహేనవ పట్టికను చూడండి) సేద్య భూములున్న కుటుంబాలలోని పదమూడు శాతం మంది పుత్రికలకు మాత్రమే తలిదండ్రుల ఆస్థి నుండి వాటాలభించగా, భర్తల ఆస్థినుండి 51 శాతం మంది వితంతువులకు వారసత్వపు వాటాగా పొలం లభించటాన్ని ఈ పట్టిక ప్రదర్శిస్తున్నది. స్త్రీ, భర్త ఆస్థి నుండి వాటాను పొందటం మాత్రమే చాలదు; ఆవిడజీవితం ప్రమాదాలలో చిక్కుకోకుండా ఉండాలంటే, తలిదండ్రుల ఆస్థినుండి వాటాను తీసుకొని, మెట్టినింటికెళ్ళటం ఉత్తమమని కుమారి బీనా అగర్వాల్ అభిప్రాయపడుతున్నారు. అత్తమామలు, బావమరదులు మంచివారు గానపుడు, వితంతువుకు భర్త ఆస్థి నుండి వాటా దక్కటం అనేది అనుమానాస్పదమైన విషయం. ఇలా ఆస్థి దక్కనపుడు వితంతువు జీవితం బాధామయ మవుతుంది. ఈ విధంగా స్త్రీ బాధపడకుండా ఉండాలంటే తల్లి దండ్రుల ఆస్థి నుండి ఆవిడకు వాటా లభించటం అవసరమని వీరు భావిస్తున్నారు. నమ్మకంగా ఆస్థి లభించగల అవకాశాలు మెట్టినింటిలో కంటే పుట్టినింటిలోనే అధికంగా ఉంటాయి గనుక ఇదే స్త్రీ రక్షణకు ఉత్తమ మార్గంగా వీరెంచారు.

జీన్ డ్రేజ్ వీరి అభిప్రాయంతో ఏకీభవించ లేక పోతున్నారు. తలిదండ్రుల ఆస్థినుండి వాటాను తీసుకొంటే, అన్నదమ్ములు పేద వారయిపోతారని ఆడపిల్ల భయపడుతుంది. వాటా నివ్వటానికి వీరు అంగీకరించనపుడు ఆవిడ కోర్టుకు వెళ్ళటానికి సాహసించదు. ఇలాంటి ఆస్థి విభజన వల్ల కమతాలు చిన్న ఖండాలవుతాయి, ఆర్థికంగా ఇవి లాభదాయకంగా ఉండకపోవచ్చు. మెట్టినింట ఉంటూ పుట్టిన వూరిలోని పొలాన్ని అజమాయిషీ చేయటం కష్టం అందుచేత భర్త ఆస్థి నుండి వాటా లభించటాన్ని స్త్రీ కోరుకొంటుంది ఇదే ఉత్తమ మార్గమని డ్రేజ్ అభిప్రాయ పడుతున్నారు. భర్త మరణానంతరం, పుత్రసంతానం ఉన్నాసరే, లభించగల వాటా మీద సర్వ హక్కులూ వితంతువు కుండటం అవసరమని మహిళా ఉద్యమ కార్యకర్తలలో అధికులు అభిప్రాయ పడుతున్నారు

ఇప్పటి పరిస్థితులలో, భర్త ఆస్థిమీద వారసత్వపు హక్కున్నది అన్న అంశం, స్త్రీకి వైధవ్య ప్రాప్తి తర్వాతే గుర్తుకు వస్తున్నట్లు కనుపిస్తున్నది పుత్ర సంతానమున్న సందర్భాలలో, వారి గార్డియన్‌గా ఆ ఆస్థి మీద మేనేజిమెంటు చేసే హక్కు మాత్రమే తల్లికి లభిస్తున్నది. ఆవిడ బావ మరదులు స్వార్థపరులయినపుడు, ఈపాటి హక్కులను కూడా వితంతువు అనుభవించే అవకాశాలుండటం లేదు. వితంతువు సంతాన హీనురాలయినపుడు, ఈ మాత్రపు కొద్ది అవకాశం కూడా లభించటం లేదు. పుత్రసంతానం లేక, ఆడపిల్లలే ఆవిడకున్నపుడు కూడా భర్త ఆస్థి ఆవిడ చేజారిపోయే ప్రమాదాలున్నాయి

భర్త నుండి వేరుబడిన స్త్రీలకు, భర్త వదలి వేసిన వారికి ఈపాటి పరిమిత ఆస్థిహక్కులు కూడా లభించటం లేదు. వీరి జీవన పరిస్థితి దయనీయంగా ఉంటుంది.

ఇలాంటి ప్రమాదాల నుండి స్త్రీలకు రక్షణ లభించాలంటే, ఉమ్మడి ఆస్థి నుండి భర్తకు వాటాలభించగానే దానికి, ఇద్దరి పేరిట జాయింట్ పట్టాను పుచ్చుకోవటం అవసరమని మహిళోద్యమ కారులు అభిప్రాయ పడుతున్నారు; ప్రభుత్వం భూములను పంచేటపుడు, లేక ఇండ్ల స్థలాలను మంజూరు చేసేటపుడు, వాటిని కూడా భార్యా భర్తల పేరిట రిజిస్టరు చేయాలని కోరుతున్నారు. ఇప్పటివలె, కుటుంబ పెద్దగా (రక్షకునిగా) పురుషుని పేరున ఇవ్వటం ఇక జరగరాదని వీరు కోరుతున్నారు. కుటుంబాలలో వస్తున్న మార్పులకు అనుగుణంగా, లాండ్ రికార్డులను తిరుగవ్రాస్తూ, అర్హతలున్న చోట్ల స్త్రీల పేర్లను పట్టాదారులుగా నమోదు చేస్తూ ఉండాలని

వీరు సూచిస్తున్నారు

బెంగుళూరులో 1994 వ సంవత్సరం మార్చి మాసంలో జరిగిన వితంతువుల సమ్మేళనం స్త్రీలకు లభించవలసిన ఆస్తిహక్కుల విషయంలో దిగువ సూచనలను చేసింది ·

1. భర్త మరణానంతరం వీలయినంత త్వరగా వారి ఆస్థి వారి భార్య పేరిట నమోదుగావాలి. ఇందుకు వితంతువు మహజర్లు పంపుకొనే పనిలేకుండా యధావిధిగా ఇది జరగాలి. లాండ్ రికార్డులలో ఆ వితంతువు పేరిట పట్టాను మార్చాలి.

2. భర్త మరణకాలానికి పూర్వం, కుటుంబం యొక్క జాయంట్ ఆస్తి పంపకాలు జరిగి ఉండక పోయినపుడు, వారి మరణానంతరం అది త్వరగాజరగాలి దీన్ని జరిపించే బాధ్యతను అందుకు సంబంధించిన తహసీల్దారు తీసుకోవాలి

3 పైన పేర్కొన్న సూచనల ప్రకారం ల్యాండ్ రికార్డును తిరుగ వ్రాయాలి.

4 ప్రభుత్వ భూముల పంపకాలు జరిగినపుడు స్వంతకమతాలు లేని వితంతువులకు ప్రాధాన్యత నీయాలి.

5. భార్యా భర్తలిద్దరూ జీవించి ఉన్న కాలంలో ప్రభుత్వం భూమి పంపకాలను నిర్వహిస్తే ఆ పంపకంలో, కుటుంబ సంరక్షకునిగా భర్త పేరిట పొలం లభించినా, అది భార్యా భర్త లిద్దరి పేరిట రిజస్టరుగావాలి.

6 వితంతువులకు ఆస్థి హక్కులనిస్తున్న ఆధునిక శాసనాలను తప్పకుండా అమలు జరపాలి.

7 హిందూ సక్సెషన్ ఆక్టు 1956, పురుషుడు తన ఆస్థిని, విల్‌వ్రాయటం ద్వారా తాను కోరిన వారికి సదరు ఆస్థిని సంక్రమింపజేయగల అవకాశాలున్నాయి. పురుషునకున్న ఈ హక్కును రద్దు చేయాలి.

8. రాష్ట్రాల టెనెన్సీ చట్టాలలో, వితంతువుల ఆస్థిహక్కులకు భంగం గలిగించే అంశాలను తొలగించాలి.

9 భూసంస్కరణ చట్టాలలో స్త్రీలకు, ముఖ్యంగా వితంతువులకు వ్యతిరేకంగా ఉన్న అంశాలను తొలగించాలి.

10. పురుషుడు, ఒకరి కంటే ఎక్కువ మంది భార్యలను చేబట్టినపుడు, మొదటి భార్యకే భర్త ఆస్థిలో వాటా లభిస్తుంది; మిగిలిన భార్యలకు ఏమీ దక్కదు; అలాగే భర్త చనిపోయిన తర్వాత భర్త సోదరుని వారి వితంతువు వివాహం చేసుకొనే సంప్రదాయం వల్ల, మొదటి భర్త ఆస్థి నుండి ఆవిడకు వారసత్వంగా రావలసిన ఆస్థి వాటా దక్కకుండా పోతున్నది. ఇటువంటి సందర్భాలలో ప్రభుత్వం జోక్యం చేసుకొని, వితంతువుకు వాటాలభించేట్లు చూడాలి.

11. స్త్రీలకు చట్టాలిస్తున్న ఆస్థి హక్కులను మహిళలకు తెలియ జెప్పటానికి విశేష ప్రచారం జరగాలి. తమకున్న ఆస్థిహక్కులను అమలుజరుపుకోవటానికి, అవసరమైన లీగల్ సహాయాన్ని వారికి అందించాలి.

భర్త మరణానంతరం స్త్రీ జీవితం ఎంత బాధాకరంగా తయారుగా గల అవకాశాలున్నాయో చూచాం. ప్రజలెన్నుకొన్న ప్రభుత్వమూ, సామాజికులు ప్రేక్షకప్రాయంగా తయారైనారు వంద సంవత్సరాలకు పూర్వం (1894 వ సంవత్సరం అక్టోబరు 27 తేదీన) స్వామి వివేకానంద మద్రాసులోనున్న తమ ప్రియ శిష్యుడు అలసింగ పెరుమాళ్‌కు వాషింగ్టన్ నుండి జాబు వ్రాస్తూ "వితంతువు కన్నీటిని తుడువ లేని, అనాథ శిశువు నోటికి ఒక అన్నం ముద్దను అందించ లేని భగవంతుని మీద గాని, మతం మీద గాని నాకు నమ్మకం లేదు" అన్నారు. ("కంప్లిట్ వర్క్స్ ఆఫ్ స్వామి వివేకానంద" ఐదవ సంపుటం, 50వ పేజి) వంద సంవత్సరాల తర్వాత కూడా వితంతువు కన్నీరొలుకుతూనే ఉన్నది. తుడిచేవారు కరువయినారు. ఇదే కాలంలో సాంకేతిక నైపుణ్యం గగనపుటంచుల నంటగల స్థాయికి పెరిగింది. సంపద పర్వత ప్రాయంగా పెరుగుతున్నది అయినా ఈ అనాథల బాధలు మాత్రం తీరటం లేదు. వీరి బాధలు తీరనిది నిధులు లేకకాదు; మానవత్వం కొరవడటం వల్లనే ఇలా జరుగుతున్నది. వితంతువుల పెన్షన్ సాధనకు ప్రారంభంగావలసిన ఉద్యమం, వారసత్వపు ఆస్థి హక్కుల సాధనవరకూ సాగవలసిందే.

సామాజికులు వితంతువుల బాధలను అర్థం చేసుకోవాలి. వితంతువులు కూడా తమ బాధలకు కారణాలను తెలుసుకోవాలి. ఉద్యమ నిర్వహణ ద్వారా ప్రభుత్వం మీద వత్తిడి తేవాలి. ఇది జరుగనపుడు ప్రభుత్వం తనంత తానుగా సమస్యా పరిష్కారానికి పూనుకోదు. సంప్రదాయం పేరిట సమాజం విధిస్తున్న ఆంక్షల నుండి, వైధవ్య ప్రాప్తి వల్ల

సంక్రమించిన ఆర్థిక బాధలనుండి వితంతువు ఒక్కర్తే, ఇతరుల సపోర్టు లేకుండా విముక్తిని పొందలేదు ఇందుకు సామూహిక చర్య అవసరం. అదే ఉద్యమ నిర్వహణ

వైధవ్యప్రాప్తి వల్ల కోల్పోయిన గౌరవ మర్యాదల పునః సాధన జరుగకుండా, ఆర్థిక వనరేదో ఒకటి ఏర్పడితే చాలదు. అది అర్థస్వాతంత్ర్యం మాత్రమే అవుతుంది. భౌతిక వనరుల సాధనతో పాటు, ఆవిడ సామాజిక స్థాయీ, గౌరవం కూడా తోటి స్త్రీల స్థాయికి పెరగాలి.

గ్రామ సీమలలో కూడా మార్పులొస్తున్నాయి. స్త్రీలలో విద్యా వ్యాప్తి పెరుగుతున్నది దీనివల్ల వారి చైతన్య స్థాయి పెరగటంతో పాటు, స్వయం కృషి వల్ల జీవించగల శక్తి కూడా స్త్రీలకు లభిస్తున్నది. ఇది ఆశాజనక పరిణామం. ప్రస్తుత పరిస్థితులలో ఈ పరిణామ మొక్కటే స్త్రీలకు శ్రీరామ రక్ష.

వితంతువుల సమస్యను వారికి సంప్రాప్తించిన దురదృష్టంగా, వారివ్యక్తిగత సమస్యగా భావించకూడదు. ఇదొక సాంఘిక సమస్యగా ఎలా పరిణమిస్తున్నదో గుర్తించాలి. వితంతువుల సంక్షేమ రక్షణను సమాజం, ప్రభుత్వము తమ విధిగా పరిగణించాలి

# 20

## కాటికి కాళ్ళుచాచినా కడతేరని కష్టాలు

కౌన్పుతో ప్రారంభమయ్యే ఆడపిల్ల ఏడుపు, ఆవిడ శవం కాటిలో కాలేవరకూ కొనసాగుతూన్నట్లే కనబడుతుంది. పుట్టగానే అమ్మ ఆదరణ కోసం ఏడుస్తుంది. వృద్ధాప్యంలో తానింతగా ప్రేమించి, పెంచిన బిడ్డల ఆదరణ పొందలేక పోయానే అని విలపిస్తుంది. ఆవిడ కన్నీటిని చివరకు మృత్యుదేవత తుడిచి వేస్తుంది - శాశ్వతంగా! ఈ పరిణామ క్రమాన్ని ఇంతవరకు వివరిస్తూ వచ్చాం ఇప్పుడు ఈ చరమ దశను గురించి ప్రస్తావిస్తాం.

స్త్రీ మీద వస్తున్న పరిశోధనా సాహిత్యము వారి జీవితంలోని యవ్వనదశ నుండి, మాతృత్వ దశవరకు ప్రధానంగా పరిమితమై యుంటున్నది. ఇటీవలికాలంలో స్త్రీ పురుష అసమానతలకు అధిక ప్రాధాన్యత లభిస్తున్నది. కన్న కూతుళ్ళకు పెండ్లిచేసి, వారిని అత్తవారింటికి పంపటం, ఎదిగిన కుమారులకు పెండ్లయి కొత్త కోడండ్రు సంసారానికి రావటం జరిగిన తరువాత అత్తగా ఆవిడ కోడండ్రను "రాచి రంపాన పెట్టటము", అదనపు కట్నం కోసం కోడండ్రను బాధించటం, వారు తప్పటడుగులు వేసి కుటుంబ గౌరవాన్ని "చెడగొట్ట కుండా" కాపలాగాయటము, దంపతులు కనవలసిన సంతానపు సంఖ్యను కనవలసిన అదనునూ తానే నిర్ణయించ ప్రయత్నించటం వంటి విషయాల చిత్రణకే ఇపుడు వస్తున్న సాహిత్య మంతా, ప్రధానంగా పరిమితమై యుంటున్నది. "అత్తా ఒకింటి కోడలే" నన్న సామెత ఉండనే ఉన్నది. తాను కోడలిగా అత్త చేతిలో అనుభవించిన బాధలను కోడలితో అనుభవింప చేయటంలో ఆనందాన్ని పొందుతున్నట్లు సోషియాలిజిస్టులు కొందరు చెపుతుంటారు. ఈ విధంగా స్త్రీ జీవిత చిత్రణ, ఆవిడ అత్తగారయ్యే వరకే పరిమితమై ఉంటున్నది. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, బెంగాల్ సామాజిక పరిస్థితుల మీద తాము వ్రాసిన పరిశోధనా పత్రములో సారాలాంబ్ ఒక సందర్భంలో ఇలా చెప్పారు."......సాంస్కృతిక దృక్పధము నుండి స్త్రీ అంటే ఏమిటి? పిల్లలను కనడం, తల్లిగా వారిని పెంచటం, ఇంటి పనులు చేయటం మాత్రమే మనం స్త్రీ జీవిత పరిశీలనలను ఆవిడ జీవితం లోని యవ్వన దశనుండి మాతృత్వ దశవరకే పరిమితం చేస్తున్నాము." (ప్రొఫెసర్ సిల్వియా వటుక్ తాము వ్రాసిన ఒక వ్యాసంలో ఈ విషయాన్ని ఉదహరించారు. )

యువదంపతుల జీవితనాటకంలో వయసు ముదిరిన

స్త్రీ, విలన్ పాత్రధారిగా మిగిలిపోతున్నది. జీవితంలోని దయనీయమైన దశను గడచి అత్తగారయ్యేటప్పటికి, స్త్రీ, తన కొడుకుల/కోడండ్ర ప్రేమాభిమానాలను - అవి ఆవిడకు అత్యవసరమైనవిగా తయారైనకాలంలో - పొందతగని వ్యక్తిగా చిత్రితమవుతున్నది. అటుతర్వాతి దశలో - వృద్ధాప్యంలో - ఆవిడ దయనీయమైన జీవన స్థితి ఎవరికీ పట్టని అంశమవుతున్నది. సినిమాలు, కథా రచయితలే గాదు, సోషియాలజిస్టులు కూడా ఇటువంటి దృక్పథాన్ని అవలంబిస్తూండటం అధికంగా కనుపిస్తున్నది భారతీయ జనాభాలో వృద్ధులసంఖ్య పెరుగుతుండటం మీద సోషియాలజిస్టులు ఆందోళనను వ్యక్తం చేస్తున్నారు. కాని, ఈ జనాభాలోని స్త్రీల జీవన విధానాలు, వారి ఆర్థిక, ఆరోగ్య పరిస్థితులు, వారు పడవలసి వస్తున్న శారీరక, మానసిక బాధల పరిశీలనకు మాత్రం అధికులు పూనుకోవటం లేదు. ఇటీవలె ఈలోపం గుర్తింపుకు వస్తున్న సూచనలు కనుపిస్తున్నాయి.

వృద్ధాప్యంలో స్త్రీ జీవన పరిస్థితులలో వచ్చే మార్పులను గమనించటానికి, ఆవిడ పుట్టినప్పటినుండి, వయసు పెరుగుదలతో పాటు, సాంఘిక జీవనంలోనూ, కుటుంబ జీవనంలోనూ వస్తున్న మార్పులను కూడా తెలుసుకోవటం అవసరం. మనసంప్రదాయ బద్ధత ఆవిడ జీవితాన్ని అధికంగా ప్రభావితం జేస్తున్న విషయాన్ని ఇంతకు పూర్వమే పలుసందర్భాలలో వివరించాం

భారతీయ స్త్రీ, శిశువుగా భూమి మీద పడిన తర్వాత పెరిగి యవ్వనదశకు వస్తుంది; యుక్తవయసురాగానే వివాహమై మెట్టినింటి కెళుతుంది; సంతానవతి అవుతుంది. ఈ బిడ్డలు యెదిగిన తర్వాత వారికి వివాహాలు చేస్తుంది. పుత్రికలు పుట్టినింటిని వదలి మెట్టినింటికి పోగా, కోడళ్ళు ఇంట ప్రవేశిస్తారు. క్రమంగా ఈవిడకు వయసు ముదురుతుంది. ఈ దశలో వైధవ్య ప్రాప్తికి అవకాశాలుంటాయి. భారతీయ స్త్రీలలో అధికుల జీవనచక్రమిలా ఉంటుందని చెప్పవచ్చు

## స్త్రీ జీవితంలోని మూడు ప్రధానదశలు

ప్రొఫెసర్ సిల్వియా వటుక్ భారతీయ స్త్రీ జీవితంలో ప్రధానంగా మూడు దశ లుంటాయని చెప్పారు. ఇందులోని మొదటి దశలో ఎదిగిన కుమారులకు వివాహాలవుతాయి; కొత్త కోడలు ఇంట అడుగిడుతుంది. క్రమంగా మనుమలు మనుమరాండ్రు వస్తారు. ఈ పరిణామాలు సంక్రమించగల వయఃపరిమాణంలో స్త్రీల మధ్య తేడాలుండవచ్చేమో గాని, పరిణామక్రమం మాత్రం అందరకూ ఇలాగే ఉంటుంది స్త్రీ జీవితంలోని ఈ దశను ప్రొఫెసర్ సిల్వియా "మాధ్యమిక దశ" గా పేర్కొన్నారు

వయసు ముదిరిన తర్వాత స్త్రీ చేరే రెండవ దశను "వృద్ధాప్యంలోని తొలిదశ" గా (ఎర్లి ఓల్డేజ్‌గా) వీరు పేర్కొన్నారు. ఈ దశలో స్త్రీ శారీరకంగా నీరసించదు ఇంకా పని చేయగల స్థితిలో ఉంటుంది. కాని, కుటుంబ వ్యవహారాలలో ఆవిడ పాత్ర నీరసించనారంభిస్తుంది. ఎదిగిన కుమారుడు, కోడలు కాపురాన్ని నడుపుతూంటారు కుమారులు వేరుబడితే, భర్త బ్రతికుంటే వారితోనో వారు మరణించి ఉంటే ఏకాకిగానో జీవితం గడపక తప్పదు. శరీరం క్రమంగా నీరసిస్తూ, కుమారుల ఆదరణకు ఆక్రోశించే దశలో స్త్రీకి ఈ స్థితి సంప్రాప్తమవుతుంది.

స్త్రీ జీవితంలోని మూడవ దశను వీరు "ఓల్డ్ ఓల్డ్ ఏజ్"అన్నారు. స్త్రీ డెబ్భయ్యవ పడిలో బడిన తర్వాత ఈ జీవన దశ ప్రారంభ మవుతుంది. ఈకాలానికి ఆవిడమనుమలు కూడా సంతానవంతులుగావచ్చు. ముని మనుమలు, ముని మనుమరాండ్రు అవతరిస్తారు. పోషణకు, సంరక్షణకు ఆవిడ ఒకరిమీద ఆధారపడక తప్పని స్థితి ఇది. విధిలేక, ఆవిడ కొడుకు పంచనో, లేక కూతురు పంచనో చేరటానికి తాపత్రయ పడుతుంది.

పితృస్వామికం అమలులోనున్న దేశాలలో జీవనపథంలో స్త్రీ పయనిస్తున్న కొలదీ, ఆవిడజీవితంలో అభివృద్ధి కరమైన మార్పులొస్తాయని సోషియాలజిస్టులు అభిప్రాయపడుతున్నారు. పితృస్వామిక సమాజంలో కన్యాత్వానికి, వివాహానంతరం పాతివ్రత్యానికి అధిక ప్రాధాన్యత లభిస్తుంది. ఈ రెండు దశలలోనూ సెక్సుపరంగా స్త్రీ "అప్రతిష్ఠాకరమైన" పనులు చేయకుండా కుటుంబంలోని పెద్దవారయిన స్త్రీ, పురుషులు అవసరమైన అన్ని జాగ్రత్తలను తీసుకొంటారు. ఇందువల్ల యువతి తోటి సామాజికులతో కలిసి స్వేచ్ఛగా తిరిగే అవకాశాలుండవు. ఈ పరిస్థితులలో స్త్రీ, భర్త అడుగు జాడలో నడవవలసి ఉండటమే గాక, కుటుంబంలోని పెద్దలు చెప్పినట్లు నడుచుకోవలసి ఉంటుంది.

ఇటువంటి సామాజిక పరిస్థితులలో జీవిస్తున్న స్త్రీ, సంతానోత్పత్తి ఆగిపోయి, అందచందాలు వెనుకడుగు వేయటం ప్రారంభమైన తర్వాత, ఆవిడ సెక్సు పరంగా "అప్రతిష్ఠాకరమైన" పనులు చేసే ప్రమాదం "తగ్గుతుంది". ఇందువలన వయసు పెరుగుతున్న కొలదీ, ఆవిడకు అధిక సామాజిక స్వేచ్ఛలభిస్తుంది. భర్త కూడా ఆవిడ సలహాలకు విలువనిచ్చే స్థితి వస్తుంది. ఈ దశలో స్త్రీ, కొడుకులు, కోడండ్రు, మనుమలు మనుమరాండ్రతో కాలంగడుపుతూ, కుటుంబీకులందరి మన్ననలనూ పొందుతూ, మకుటంలేని రాణివలె కుటుంబంలో వెలుగొందుతూ ఉంటుంది ఇంటిపనినంతా కోడండ్రు చేస్తుండగా, ఆవిడకు కొంత విశ్రాంతి లభించ నారంభిస్తుంది. ఇరుగు పొరుగు వారు కూడా ఆవిడ పెద్దరికాన్ని ఆహ్వానిస్తారు; అంగీకరిస్తూంటారు. సామాజిక కార్యకలాపాలలోనూ, సంప్రదాయ ఉత్సవాలలోనూ పదుగురుతో పాలు పంచుకొంటూ గౌరవప్రదంగా జీవితాన్ని గడుపుతూంటుంది ఇంతకుపూర్వం వరకూ పోషణ, ఆరోగ్య రక్షణాది విషయాలలో అనుభవించవలసి వచ్చిన లింగపరమైన వివక్ష నుండి విముక్తి లభిస్తుంది. కుటుంబ వనరుల వాడకంలో కూడా ఆవిడ స్వేచ్ఛను అనుభవిస్తూంటుంది ఇందువల్లనే, స్త్రీ జీవితంలోని ఈ దశను ప్రొఫెసర్ సిల్వియా "అత్యున్నతమైనది" గా వర్ణించారు

### జీవితంలో అధోగతి

వృద్ధాప్య ప్రారంభం తర్వాత స్త్రీ జీవితంలో అధోగతి ప్రారంభమవుతుంది. శారీరక శక్తి ఉడగటం వల్ల పనిచేయలేని దశకు వస్తుంది. మొండిరోగాలు చుట్టు ముడతాయి. ఆవిడను ఎవరూ పట్టించుకోరు. ఇందువల్ల, మానసిక శాంతికి, శారీరక సహాయానికి కుమారుల అండదండలకూ, ప్రేమాభిమానాలను పొందటానికి అర్రులు చాస్తుంది; ఆరాటపడుతుంది. ఈ లక్ష్యంతోనే పుత్రసంతాన ప్రాప్తికి, పురుషునికంటె, స్త్రీ అధికంగా ఆరాటపడుతుంది. ఎందరకు (వృద్ధులకు) పుత్రసంతానం లేకుండా ఉంటున్నది అన్న అంశపు నిర్ధారణ కష్టమే. అరవై సంవత్సరాల వయసును మించిన స్త్రీలలో నూరింట పదినుండి పన్నెండు మందికి పుత్రసంతానం ఉండటం లేదు అని జీన్ డ్రేజ్ అంచనా వేశారు. ప్రొఫెసర్ సిల్వియా అంచనాలు ముప్ఫై శాతం వరకూ ఉన్నాయి. పుత్రసంతానం ఉన్న స్త్రీలలో ఎందరకు కుమారుల సంరక్షణ లభిస్తున్నది? ఈవిషయానికి సంబంధించిన అంచనాలు కూడా ఒకే రకంగా లేవు. పలువురు పరిశోధకులు వేస్తున్న అంచనాల ప్రకారం యాభయ్యైదు నుండి యనభై మంది వరకూ వృద్ధాప్యంలోని స్త్రీలు, పుత్ర సంరక్షణలో ఉంటున్నట్లు అంచనా వేస్తున్నారు. మిగిలిన వారు భర్తలతోనో వారు మరణించి ఉంటే ఇతర సమీప బంధువుల వద్దో లేక ఏకాకులుగానో జీవితం గడుపుతున్నారు.

కుమారుల సంరక్షణలో ఉంటున్న వారందరకూ సకలసేవలూ, పోషణ, ఆరోగ్య రక్షణా లభిస్తుందన్న నమ్మకంలేదు. వంటరి తనం వారిని బాధించటం లేదు అని చెప్పలేం. అదృష్టవశాత్తు, వారి నిత్యావసరాలు తీరగల అవకాశాలున్నా, కుటుంబంలో ఎవరికీ పట్టని వ్యక్తిగా, వంటరి తనాన్ని అనుభవించవలసి వచ్చే అవకాశాలున్నాయి. కుమారులు పేదవారు గావటం చేత, వారు తల్లిని పోషించలేని స్థితిలో ఉండవచ్చు. ఇందువల్ల కూడా ఆవిడ నిరాదరణకు గురిగావచ్చు. కుమారులు సంపన్నులైనా, నిత్యవ్యాసంగపు వత్తిడులవల్ల, తల్లి బాగోగులను చూచే కాలవ్యవధి కరువై ఏ నర్సునో ఆవిడ పరిచర్యలకు నియమించవచ్చు; ఆవిడ ఆరోగ్యం బాగుండక పోయిన సందర్భాలలో నర్సింగ్‌హోంలో చేర్పించవచ్చు. ఈ స్థితిలో, అన్నీ జరుగుతున్నా, వృద్ధమాత వంటరితనాన్ని అనుభవించవలసి రావచ్చు. ఆదర్శపూర్వకమైన సేవలు ఆవిడకు లభించే అవకాశాలుండక పోవచ్చు. కుమారులు ఉద్యోగరీత్యా దేశంలోని దూర ప్రాంతంలోనో, మరో దేశంలోనో ఉంటూండటం వల్ల వారి ఆదరణా, సేవలూ వృద్ధమాతకు లభించే వీలుండక పోవచ్చు. ఇలాంటి కారణాల వల్ల, పుత్రసంతానం ఉన్నవారు కూడా ఇటువంటి అవరోధాల వల్ల జవసత్వాలుడిగిన దశలో అండకు తాపత్రయ పడవలసి వస్తున్నది, జరుగుబాటు లేక బాధపడవలసి వస్తున్నది.

ఈ యెడబాటు, నిరాదరణలు చాలవన్నట్లు, చికిత్సకు లొంగని మొండిరోగాల పీడన కూడా ప్రారంభమవుతుంది. కాన్సరు, గుండె జబ్బులు, కీళ్ళ నొప్పులు, డయాబిటిస్, (చక్కెర వ్యాధి) వంటి వాటినిందుకు ఉదహరించవచ్చు వీరు సులభంగా గాయపడే ప్రమాదముంటుంది. మానసిక వ్యాధులు కూడా సంక్రమించే ప్రమాదముంటుంది. చూపు, వినికిడి తగ్గుతాయి. ఎముకలు బలహీన పడతాయి. పోషణ సక్రమంగా

ఉండదు గనుక అనీమియా కూడా దాపురించ వచ్చు. (వృద్ధాప్య దశలోని స్త్రీ ఆరోగ్య పరిస్థితిని వేరొక అధ్యాయంలో వివరంగా పరిశీలించాం) మొండి రోగాలకు తగిన చికిత్సావసతులు కూడా గ్రామీణ ప్రాంతంలో అతి తక్కువగా ఉంటాయి. సదుపాయాలున్న చోట్ల, చికిత్స ఖర్చులను భరించగల ఆర్థిక స్థోమత కూడా ఉండాలిగదా!

## ఆదరణ కోసం ఆక్రోశం

గ్రామీణ జనాభా పట్టణాలకు ఎగబ్రాకటం త్వరితగతిని పెరుగుతున్నది. కుటుంబ వ్యవస్థ మారుతున్నది. జాయంట్ కుటుంబాలు త్వరితగతిని అంతరిస్తున్నాయి కుటుంబీకుల మధ్య మమకారాలు అడుగంటుతున్నాయి. మమకారమంతా డబ్బు, సెక్సు, అందచందాలు, విలాసాల మీద కేంద్రీకృతమై ఉన్నది. స్త్రీ జీవితాంతం బాధలను అనుభవిస్తూనే ఉన్నది. పుట్టిన దగ్గరనుండి పోషణాలోపాన్ని అనుభవిస్తుంది; అధిక పనిభారాన్ని మోస్తుంది; అధిక సంతానాన్ని కనక తప్పదు. సమాజంలోనూ, కుటుంబంలోనూ గౌరవం ఉండదు. ఆత్మగౌరవాన్ని కూడా చంపుకోవలసిన దుస్థితి కూడా దాపురించవచ్చు. ఈ బాధామయ జీవనం స్త్రీని, శారీరకంగానే గాక మానసికంగా కూడా కృంగదీస్తుంది. కుటుంబీకుల నిరాదరణకు వైధవ్యప్రాప్తి కూడా తోడయితే, మూలిగే నక్కమీద తాటికాయబడిన చందమవుతుంది. ఇటువంటి పరిస్థితులలో చిక్కిన వృద్ధులను రక్షించవలసిన బాధ్యతను

### మొదటి పట్టిక
### భారతదేశపు మొత్తం జనాభాలో అరవై సంవత్సరాల వయసును మించిన వారి శాత పరిమాణాలు (1981)

| రాష్ట్రము | పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 6.30 | 6.41 | 6.35 |
| బీహారు | 6.34 | 6.22 | 6.29 |
| గుజరాత్ | 5 37 | 5.78 | 5.57 |
| హర్యానా | 6.94 | 5.58 | 6.30 |
| కర్ణాటక | 6.19 | 6.22 | 6.21 |
| కేరళ | 7.10 | 7.86 | 7.48 |
| మధ్యప్రదేశ్ | 5.43 | 6.61 | 6.00 |
| మహారాష్ట్ర | 6.05 | 6.54 | 6.28 |
| ఒరిస్సా | 6.95 | 6.45 | 6.19 |
| పంజాబు | 8.27 | 7.12 | 7.73 |
| రాజాస్తాన్ | 5.24 | 5.38 | 5.31 |
| తమిళనాడు | 6.51 | 6.25 | 6.37 |
| ఉత్తరప్రదేశ్ | 6.71 | 6.29 | 6.51 |
| పశ్చిమ బెంగాలు | 5.17 | 5.44 | 5.37 |
| భారతదేశము | 6.40 | 6.58 | 6.49 |

*- 1981 వ సంవత్సరపు జనాభా లెక్కల ఆధారంతో శ్రీమతి లీలా గులాతి రూపొందించిన పట్టిక*

### రెండవపట్టిక
### మొత్తం జనాభాలో 60 సంవత్సరాలకు మించిన వయసుగల జనాభా అంచనాలు

| దేశము/ రాష్ట్రాలు | 1991 | 2001 | 2011 | 2016 |
|---|---|---|---|---|
| భారతదేశము | 6 7 | 6.7 | 7.6 | 8.3 |
| ఆంధ్రప్రదేశ్ | 6 7 | 7.4 | 9.3 | 10.5 |
| అస్సాం | 5.2 | 4 6 | 4.0 | 4 0 |
| బీహారు | 6 2 | 6.1 | 6 7 | 7.4 |
| గుజరాత్ | 6 4 | 6.2 | 6 9 | 7.7 |
| హర్యానా | 7 7 | 7 0 | 6 8 | 7 5 |
| కర్ణాటక | 6.9 | 7 1 | 8 6 | 9.8 |
| కేరళ | 8 8 | 9 7 | 11.6 | 13.1 |
| మధ్యప్రదేశ్ | 6.6 | 6 5 | 6.9 | 7.2 |
| మహారాష్ట్ర | 6 9 | 7.1 | 8.0 | 8.8 |
| ఒరిస్సా | 7.1 | 7.3 | 8 3 | 9.0 |
| పంజాబు | 7.8 | 7 2 | 7 0 | 7.5 |
| రాజస్తాన్ | 6.1 | 6.4 | 7.2 | 7.6 |
| తమిళనాడు | 7.4 | 8.4 | 11.5 | 13.1 |
| ఉత్తరప్రదేశ్ | 6.8 | 6.6 | 6.8 | 7.1 |
| పశ్చిమ బెంగాల్ | 6.0 | 6.6 | 8 3 | 9.3 |

*ఇవి అషీష్ బోస్ రూపొందించిన అంచనాలు "ఇండిపెండెంట్ కమిషన్ ఆన్ హెల్త్ ఇన్ ఇండియా" రిపోర్టు నుండి.*

సమాజము, ప్రభుత్వం స్వీకరించక తప్పదు. వారి సంక్షేమాన్ని సాంఘిక భద్రతను ప్రభుత్వం చూడవలసి ఉంటుంది

ఈ భారం ఎంత పరిమాణంలో ఉంటుందో చూద్దాం. భారతదేశ జనాభాలో, అరవై సంవత్సరాల వయసును దాటిన వృద్ధులు 1961వ సంవత్సరంలో, మొత్తం జనాభాలో 5 60 శాతం మంది ఉండగా, వీరి సంఖ్యాపరిమాణం 1991 వ సంవత్సరానికి 6 35 శాతానికి పెరిగింది. ( అధ్యాయంలోని మొదటి పట్టికలో 1981వ సంవత్సరంలో ఉన్న వృద్ధుల జనాభా శాతాల నిచ్చాం . రెండవ పట్టిక లో వృద్ధుల జనాభా, 2016 సంవత్సరానికుండగల, సంఖ్యా పరిమాణాల నిచ్చాం)

1961 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం రెండు కోట్లా నలభై లక్షలుగా ఉన్న వృద్ధుల జనాభా 1991వ సంవత్సరానికి ఐదుకోట్లా నలభై లక్షలకు పెరిగింది. 20వ శతాబ్దాంతానికిది పదిన్నర కోట్లకు పెరుగవచ్చునని లీలా గులాతీ అంచనా వేశారు. స్త్రీ జనాభాలోనూ, పురుష జనాభాలోనూ, అరవై సంవత్సరాల వయసును దాటిన వారి శాతపరిమాణాలు దాదాపు సమంగానే ఉన్నాయి. మొత్తం వృద్ధులలో, స్త్రీల సంఖ్యా పరిమాణం, పురుషుల సంఖ్యా పరిమాణం కంటే తక్కువుంటుందని లీలా గులాతీ సూచించారు. 1991 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం ప్రతి వంద మంది పురుషులకూ 94 మంది స్త్రీలుండవచ్చునని వీరు అంచనా వేశారు. పురుషుల జనాభా కంటే స్త్రీ జనాభా తక్కువగా ఉన్నది గనుక, వృద్ధులలోనూ స్త్రీ పురుష జనాభా పరిమాణాలు ఇలాగే ఉండవచ్చునని వీరు భావిస్తున్నారు.

వితంతువుల సంఖ్యా పరిమాణాన్ని చూచినపుడు మాత్రం, వృద్ధులలో భార్యా వియోగాన్ని పొందిన పురుషుల కంటే, వితంతువులే అధిక సంఖ్యాకులుగా ఉంటారు. భార్యా వియోగాన్ని పొందిన పురుషులు మొత్తం పురుష జనాభాలో 19.4 శాతం మంది ఉండగా, వితంతువులు (మొత్తం స్త్రీ జనాభాలో) 64 శాతానికి మించే ఉన్నారు డెబ్భైసంవత్సరాలకు పైబడిన వితంతువులు ఈ వర్గపు వయసు గ్రూపులో, 77.6 శాతం మంది వరకూ ఉన్నారని లీలా గులాతీ సూచించారు వృద్ధాప్యము, వైధవ్యమూ స్త్రీలను బాధించినంత అధికంగా పురుషులను బాధించడం లేదు. వృద్ధులయిన స్త్రీలలో అత్యధికులకు స్వంత వనరులు లేకా, ఆదరణ లేకా అవస్థలు పడుతున్నారు ఈ స్త్రీ జనోద్ధరణ భారం అధికంగానే ఉంటుంది

ఆర్థిక సరళీకరణ, గ్లోబలైజేషన్ జరుగుతున్న వర్తమానకాలంలో ప్రభుత్వాలు సంక్షేమ కార్యక్రమ బడ్జెట్లకు కోతలు బెడుతున్నాయి. ప్రజల జీవిత కాలప్రమాణం క్రమంగా పెరుగుతూండటం వల్ల, వృద్ధుల జనాభా కాలానుగతంగా పెరుగుతూ ఉంటుంది. (రెండవ పట్టికను చూడండి) వృద్ధుల సంరక్షణా భారం కూడా ఇందుకు అనుగుణంగా పెరుగవలసి ఉంటుంది. ఈ భారాన్ని ఎన్ని రాష్ట్ర ప్రభుత్వాలు భరించగలవో, ఎంత మేరకు భరించగలవో ఊహించటం కూడా కష్టమే.

పుట్టినది మొదలు కాటికి పయనమయ్యేవరకూ స్త్రీ కన్నీరొలుకుతూనే ఉండటానికి గల కారణాలేమిటో వివరంగా పరిశీలించాం. ఆవిడ కన్నీరొలుకుతూనే ఉండటానికి దారిద్ర్య దేవత ఎంతమేరకు కారణమో, దానిఫలితమేమో, ఇక చూద్దాం

# 21

## పేదరికంతో పెనుగులాట

ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఇరవయ్యైదు ట్రిలియన్ డాలర్ల (25,000,000,000,000) స్థాయిని దాటినా దారిద్ర్యం సమాజాన్ని విడిచిపోలేదు. సామాజికుల మధ్య అసమానతలు పెరుగుతూనే ఉన్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో, రోజుకు ఒక్కడాలరు-అంతకు తక్కువ ఆదాయం గలవారు నూట ముప్ఫైకోట్ల మంది ఉన్నారు. రోజుకు ఒక్క డాలరు ఆదాయానికి తక్కువున్న వారిని దారిద్ర్యరేఖకు దిగువనున్న వారిగా పరిగణిస్తున్నారు. వీరిలో యాభయ్యొకటిన్నర కోట్లమంది దక్షిణాసియా ప్రాంతంలోఉన్నారు! దక్షిణ ఆసియా, ఆగ్నేయ ఆసియా, పసిఫిక్ ప్రాంతాలలో 95 కోట్లమంది ఉన్నారు! సబ్-సహారన్ ఆఫ్రికాలో 22 కోట్ల మంది ఉంటారని అంచనా వేశారు. సోవియట్ యూనియన్‌లోనూ, తూర్పుయూరపులోనూ కమ్యూనిస్టు పాలన పతనం కావటం, పెట్టుబడిదారీ విధానానికి ఆర్థిక వ్యవస్థను మరలించటం వల్ల ఇచ్చట కూడా అల్పాదాయ వర్గాల వారి సంఖ్య పెరిగింది. ఆదాయరీత్యా చూచినపుడు పేదలుగా పరిగణించదగిన వారు పారిశ్రామిక దేశాలలో పదికోట్ల మంది వరకూ ఉండగలరట; మూడుకోట్లా డెబ్భైలక్షల మంది వరకూ నిరుద్యోగులున్నారు.

దారిద్ర్యం వల్ల అందరికంటే అధికంగా బాధపడేది పసిపిల్లలు, స్త్రీలు, వయోవృద్ధులు. పసిబిడ్డలు పెరిగే వయసులో పోషణాలోపానికి, అనారోగ్యానికి గురిగావటం వల్ల వారిలో శారీరక, మానసిక వికాసం దెబ్బదిని వారి భావి జీవితం ప్రమాద భరితము, కష్టమయము అయ్యే అవకాశం పొంచి ఉంటుంది.

పేదలలో అత్యధిక సంఖ్యాకులు స్త్రీలు: పేదరికం వల్ల అధికంగా బాధపడేది కూడా వీరే. వీరికి ఆస్థి హక్కులుండవు. సృజనాత్మక శక్తుల అభివృద్ధికి నోచుకోలేదు గనుక అధికాదాయ ఆర్జనకు వెళ్ళే అవకాశాలు లేవు ఉదర పోషణకు చెమటోడ్చి పని చేయాలి. ఇదిగాక, గృహనిర్వహణ, పిల్లలను కనటం, పెంచటం అనే భారం ఉండనే ఉన్నది. ఇలా స్త్రీ శారీరక, మానసిక వత్తిడులకు, ఆందోళనకు గురవుతూంటుంది. ఆపదలో ఆదుకొనే ఆస్థులు (శారీరక, భౌతిక) కూడా లేకపోవటం వల్ల ఆవిడ పేదరికం నుండి బయటబడే అవకాశాలు కూడా తక్కువగా ఉంటాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో చూలు -కాన్పులకు సంబంధించిన మరణాలు పారిశ్రామిక దేశాలలో కంటే పది నుండి వందరెట్ల

వరకూ అధికంగా ఉంటూండటం పేదరికంలో జీవిస్తున్న స్త్రీల దయనీయ స్థితికి ప్రతిబింబం

దారిద్ర్యం అంటే......

దారిద్ర్యానికి పలువర్గాల వారు పలురకాల నిర్వచనాల నిస్తున్నారు. ప్రపంచ బ్యాంకు, ఆదాయ ప్రాతిపదిక మీద పేదలను వర్గీకరించింది. నియమిత ఆదాయాని కంటే తక్కువ ఆదాయం గలవారిని, దారిద్ర్యరేఖకు దిగువనున్న వారుగా నిర్వచించింది బ్యాంకు నిర్వచనం ప్రకారం, అభివృద్ధి చెందుతున్న దేశాలలో, 1985 వ సంవత్సరపు డాలరు విలువ ప్రాతిపదిక మీద రోజుకు ఒక్క డాలరు, లేక అంతకంటే తక్కువ ఆదాయం గలవారిని, దారిద్ర్య రేఖకు దిగువనున్న వారుగా బ్యాంకు నిర్వచించింది. లాటిన్ అమెరికాకు ఈ ఆదాయ పరిమితిని రెండు డాలర్లుగా నిర్ణయించింది. తూర్పు యూరపు, మాజీ సోవియట్ యూనియన్ దేశాలకు, 1990 వ సంవత్సరపు డాలరు కొనుగోలు శక్తి ప్రాతిపదిక మీద నాలుగు డాలర్ల ఆదాయ పరిమితిని నిర్ణయించింది. అమెరికా జీవన ప్రమాణ ప్రాతిపదిక మీద, పారిశ్రామిక దేశాల ఆదాయపరిమితిని, 1985వ సంవత్సరపు డాలరు విలువ ప్రాతిపదిక మీద, రోజుకు 14.40 డాలర్లుగా ప్రపంచ బ్యాంకు నిర్ణయించింది ఇంతకంటే తక్కువ ఆదాయాన్ని పొందుతున్న వారిని దారిద్ర్య రేఖకు దిగువనున్న వారిగా పరిగణిస్తున్నారు. ఈ వర్గీకరణే ఇప్పటికీ ప్రధానంగా వాడుకలో ఉన్నది

రెండు పూటలా ఆకలి ఆర్పు కొంటేనే చాలదు; మానవ జీవితానికి కొన్ని కనీస వసతులయినా ఉండాలి గదా అన్నారు మరొక వర్గంవారు. ఆహారంతో పాటు, విద్య, ఆరోగ్య, నివాస వసతులుండాలి అని వీరు సూచిస్తున్నారు; మనిషికి ఉద్యోగ వసతి, సమాజంలో గౌరవ ప్రదమైన మనుగడ సాగించే వీలుండాలన్నారు. ఈ దృక్పథాన్ని "బేసిక్ నీడ్స్ పర్‌స్పెక్టివ్" అన్నారు.

మూడవది 'కేపబులిటీ పర్‌స్పెక్టివ్". మనిషి యొక్క కొన్ని కనీస అవసరాలయినా తీరాలని ఈవర్గం వారు సూచిస్తున్నారు. శరీర అవసరాలకు తగిన పోషణ, అవసరానికి తగిన దుస్తులు, నిలువ నీడా, అనారోగ్యం రాకుండా తగిన రక్షణ సదుపాయాలు మనిషికి లభించాలి. వీటితోపాటు సామాజిక జీవనంలో అందరితో సమాన భాగస్వామ్యం లభించాలి. ఇలాంటి వసతులను మానవుడు అనుభవించే వీలుండక పోవటం దారిద్ర్యం క్రిందకు వస్తుందని ఈ వర్గీయులు భావిస్తున్నారు. ఇది మొదటి రెండు నిర్వచనాలకూ వ్యతిరేక మయినది గాదు, కాని దారిద్ర్య నిర్వచనంలో మరికొన్ని అంశాలను చేర్చి ఆ నిర్వచనానికి విస్తృత ప్రాతిపదికను కల్పించారు.

అన్ని ప్రాంతాలకు అన్వయించేట్లు దారిద్ర్యాన్ని నిర్వచించటం కష్టమైన పని. ఇది జటిలమైన సమస్య. కనుక, సులభమని, దరిద్రుల గుర్తింపుకు ఆదాయ దారిద్ర్యాన్నే ప్రస్తుతం అధికంగా వాడుతున్నారు మనిషి ఆకలితో బాధపడకుండా ఉంటేనే చాలదు, మానవుడు జీవితంలో బాధపడేది, ఒక్క ఆకలితోనే కాదుగదా? పలురకాలుగా అతడు ఇబ్బందులు పడుతూంటాడు అవకాశాలు లేక వ్యక్తి జీవితం వికసించక పోవచ్చు ఉదాహరణకు ఒక వ్యక్తి జీవితాన్ని తీసుకొందాం ఆ వ్యక్తి ఆరోగ్యం బాగుండవచ్చు; ఎక్కువ కాలం జీవించగలగవచ్చు అతడు అక్షరాస్యుడు కాలేకపోవటంవల్ల, అజ్ఞానాంధకారంలో జీవిస్తాడు; వెలువడుతున్న భావ పరంపరను జీర్ణించుకోలేడు; మనోవికాసాన్ని పొందలేడు. మరోవ్యక్తి విద్యావంతుడై యుండవచ్చు; ఆరోగ్య ప్రదంగా జీవించటానికి తగిన పరిస్థితులు లభించక రోగిష్టిగా బ్రతుకవలసి రావచ్చు; ఏ అంటురోగానికో గురయి, అకాల మరణం పాలుగావచ్చు. విద్య, ఆరోగ్య సంపదలు గలిగిన అదృష్టవంతునకు విషయ నిర్ణయాధికారం లేక, సామాజిక నడవడికకు దూరంగా ఉండవలసిరావచ్చు. తన జీవితాన్ని ప్రభావితం చేయగల అంశాలలో కూడా ఆ వ్యక్తి జోక్యం కలిగించుకొనే అధికారాన్ని, లేదా అవకాశాన్ని పొందటానికి నోచుకొనకపోయి ఉండవచ్చు. అభివృద్ధికి అవసరమైన వనరులూ, అవకాశాలూ అందక పోవటాన్ని, ఆదాయ ప్రాతిపదిక మీద గీసే దారిద్ర్యరేఖ మనకు చిత్రించి చూపలేదు. ఆదాయ దారిద్ర్యాన్నే గాక, మానవ జీవనాభివృద్ధి కున్న అవకాశాలను వ్యక్తి అనుభవించటానికి వీలులేని పరిస్థితిని కూడా దారిద్ర్యంగానే భావించాలని, అర్ధశాస్త్ర నిపుణులలోని ఒక వర్గం వారు సూచిస్తున్నారు. ఈ విషయ నిర్ణయంలోని కీలకాంశాలను

"హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1997 " ఇలా వివరించింది.

"మానవుడు ఆరోగ్య ప్రదంగా దీర్ఘకాలం జీవించగలిగి ఉండటం, విద్యావంతుడై యుండటం, అభిలషణీయమైన జీవన వ్యయ ప్రమాణాన్ని అనుభవించ గలుగుతూండటం మాత్రమే దారిద్ర్య నిర్ణయంలో కీలకాంశాలు గావు. రాజకీయ స్వాతంత్ర్యం ఉండటం, ఇతర మానవ హక్కులను అనుభవించగల రక్షణా సదుపాయాలుండటం, ఆత్మగౌరవానికి సంబంధించిన పలు అవకాశాల అందుబాటు, వాటికి తగిన రక్షణ ఉండటం - ఏడమ్ స్మిత్ చెప్పినట్లు " సిగ్గుపడ నవసరం లేకుండా వ్యక్తి పదుగురలో తలయెత్తుకు తిరుగగల అవకాశాలుండటం" - వంటి అదనపు వసతులు, అవకాశాలు కూడా మానవునకు లభించాలి. మానవ జీవనాభివృద్ధి (హ్యూమన్ డెవలప్‌మెంట్) అంటే, ఈ విధంగా పొంద దగిన అవకాశాలను విస్తరించు కొంటూ పోతూండటం, దానితో పాటు మానవ జీవన శ్రేయో ప్రమాణాన్ని పెంచుకొంటూ పోతూండటం అవుతుంది.

"హ్యూమన్ డెవలప్‌మెంట్‌కు అర్థం, అభిలషణీయమైన జీవన అవకాశాలను అనుభవించే వసతుల పెంపు అయినపుడు, ఆరోగ్య ప్రదమూ, సృజనాత్మకమూ అయిన దీర్ఘకాలిక జీవితకాల ప్రమాణాన్ని అనుభవించే అవకాశాలు వ్యక్తికి లేకుండా పోవటం, గౌరవ ప్రదంగా జీవించటానికి తగిన జీవన పరిస్థితులకు వారు నోచుకోక పోవటం, స్వేచ్ఛ, గౌరవము, హోదా, ఆత్మాభిమానము కొరవడటం, ఇతరుల మన్ననను, మర్యాదలను పొందలేక పోవటం వంటి పరిస్థితుల సృష్టి, హ్యూమన్ డెవలప్‌మెంట్‌కు అవసరమైన కీలకావకాశాల నిరాకరణే అవుతుంది "

ఈ దారిద్ర్య నిర్వచనం ప్రకారం, వ్యక్తి పొట్ట బోసుకోవటానికి తగినంత ఆదాయం లేకపోవటం వలె, వారు అకాల మరణాల పాలవుతూ ఉండటం, అనారోగ్యంతో జీవించవలసి రావటం, నిలువనీడ లేకుండా పోవటం, చదువుకొనే అవకాశాలను పొందలేక పోవటం, తన జీవితాన్ని ప్రభావితం చేయగల సామాజిక, ఆర్థిక, రాజకీయ విధాన నిర్ణయాలలో పాలుపంచుకొనే వీలుండకపోవటం, వ్యక్తిగత భద్రత లోపించటం, పరియావరణ పాడుబడి పోతూండటం వంటి అంశాలు కూడా దారిద్ర్య సూచికలుగా పరిగణనకు వస్తాయి. పైన పేర్కొన్న వసతులు ఎన్ని లోపిస్తే, ఎంతగా లోపిస్తే, మానవ దారిద్ర్య పరిమాణం అంతగా పెరుగుతుంది, వ్యక్తి జీవితం అంత అధికంగా బాధామయమవుతుంది.

పై నిర్వచనం ప్రకారం మానవ దారిద్ర్యానికి దారిదీస్తున్న అంశాల నిపుడు క్రమంగా పరిశీలించుదాం.

అకాలమరణం : తక్కువ వయస్సులోనే వ్యక్తి మరణించ వలసి రావటాన్ని, హ్యూమన్ పావర్టీగా యు యన్ డి పి నిపుణులు భావించారు కనీసం డెబ్భై సంవత్సరాల వయస్సు వచ్చే వరకయినా జీవించకుండా, నలభై సంవత్సరాల లోపుననే మరణించటాన్ని వ్యక్తి జీవిత కాలాపహరణంగా వీరు పరిగణించారు: అభివృద్ధి చెందుతున్న దేశాల జనాభాలో ఐదవ వంతు మంది ఈ వయస్సు వచ్చేవరకయినా జీవించటంలేదు. అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలో సంభవిస్తున్న జనాభా మరణాల కంటే ఇవి ఐదురెట్లు అధికంగా ఉన్నాయి! తూర్పు ఆసియా ప్రాంతపు జనాభాలో నలభై సంత్సరాల వయస్సు లోపుననే మరణించే జనాభా పరిమాణం పదిశాతాన్ని మించి లేదు. సబ్-సహారన్ ఆఫ్రికాలో ఈ వయస్సు లోపుననే మరణించే జనాభా, మొత్తం జనాభాలో 30 శాతం వరకూ ఉన్నట్లు యు యన్ డి పి నిపుణులు అంచనా వేశారు.

అధిక అకాల మరణాలకు తోడు పిల్లల మరణాలు అధికంగా ఉండటం కూడా మానవ దారిద్ర్యానికి ఒక సంకేతమే. సబ్-సహారన్ ఆఫ్రికాలో ప్రతి వెయ్యి జననాలకూ శిశు మరణాలు 150 వరకూ ఉంటున్నాయి. దక్షిణ ఆసియా ప్రాంతంలో ఈ మరణాలు ప్రతివెయ్యి జననాలకూ 112 వరకూ ఉంటున్నాయి. ఇది తూర్పు ఆసియా ప్రాంత శిశుమరణాలరేటు కంటే మూడు రెట్లు, పారిశ్రామిక దేశాల రేటు కంటే ఆరురెట్లు అధికం!

చూలాంత్ర, బాలింతల మరణాలు (మెటర్నల్ మరణాలు), అతి కొద్ది పెట్టుబడితో చాలావరకూ నిరోధించ గలిగినవే; అయినా అశ్రద్ధా ప్రదర్శన వల్ల అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, పేద దేశాలలోనూ ఇవి అధికంగానే సంభవిస్తున్నాయి. యునెసెఫ్ సంస్థ ప్రకటించిన తాజా అంచనాల ప్రకారం, ప్రపంచంలో సాలుకు, 5,85,000

ఒకటవ పట్టిక
ప్రపంచంలోని వివిధ మండలాలలో హ్యూమన్ పావర్టీ

| ప్రాంతము లేక మండలము | చావుబ్రతుకుల మధ్య పెనుగులాట | | | విద్య | | వ్యక్తిగత భద్రత | | ఆదాయం | | దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నవారు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తం జనాభాలో, 40 సం॥ల వరకు జీవించే అవకాశం లేని వారి శాతం 1990 | మొత్తం జనాభాలో వైద్య చికిత్సా వసతి లభించని వారి శాతము 1990-1995 | మొత్తం జనాభాలో రక్షిత నీటిసరఫరా అందని వారి శాతం 1990-1995 | పెద్దవారిలో నిరక్షరాస్యుల శాతం 1995 | ఐదవ తరగతిని కూడా చేరలేని పిల్లల శాతం 1990-1995 | ఆయాప్రాంతాలలో తలదాచుకొంటున్న కాందిశీకుల సంఖ్య వేలలో (1995) | ప్రకృతిసిద్ధమైన ప్రమాదాలలో చనిపోయిన లేక దెబ్బతిన్న సాలుసరి సగటు జనాభా (వేలలో) 1980-1993 | ప్రాంతీయ జనాభాలోని అట్టడుగు ఇరవైశాతం పేదల తలసరి సగటు జాతీయోత్పత్తి (డాలర్లలో) 1980-1994 | ప్రాంతీయ జనాభాలో అత్యున్నత స్థానంలో నున్న 20 శాతం ధనికుల తలసరి సగటు జాతీయోత్పత్తి (డాలర్లలో) 1980-1994 | మొత్తం జనాభాలో దారిద్ర్య రేఖకు దిగువ నున్న వారి శాతం 1993 |
| అభివృద్ధి చెందుతున్న అన్నిదేశాలు | 18.0 | 20 | 29 | 29.6 | 25 | 1,16,70 | 11,89,50 | 768 | 6,194 | 32 |
| పారిశ్రామిక దేశాలు | 5.2 | - | - | - | 2 | 27,47 | 6,63 | 4,810 | 32,198 | - |
| ప్రపంచం | 16.4 | - | - | - | 23 | 1,44,17 | 11,96,13 | 1,787 | 12,747 | - |
| అరబ్బు దేశాలు | 15.5 | 13 | 24 | 43.2 | 9 | 30,21 | 12,18 | - | - | 4 |
| తూర్పుఆసియా | 8.9 | 12 | 32 | 17.8 | 12 | 2,90 | 23,74 | 748 | 5,342 | 26 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 10.8 | - | 25 | 13 4 | 27 | 1,28 | 43,98 | 932 | 12,391 | 24 |
| దక్షిణ ఆసియా | 19 9 | 22 | 18 | 49.6 | 39 | 33,42 | 7,60,86 | 586 | 2,833 | 43 |
| దక్షిణ ఆసియా (భారతదేశంలేకుండా) | 21.0 | 42 | 17 | 54.1 | 42 | 30,68 | 1,28,15 | 778 | 3,459 | - |
| ఆగ్నేయాసియా, పసిఫిక్ | 15.1 | 15 | 35 | 12.3 | 16 | - | 49,88 | 1,253 | 8,269 | 14 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 31.9 | 47 | 49 | 42.2 | 29 | 49,89 | 84,85 | - | - | 39 |
| వెనుకబడిన దేశాలు | 31.6 | 51 | 43 | 50.4 | 43 | 47,10 | 19,61 | - | - | - |
| ఉత్తర అమెరికా | 3.9 | - | - | - | - | 7,90 | 50 | 5,817 | 50,769 | - |
| తూర్పుయూరపు, రష్యన్ ఫెడరేషన్ | 8.2 | - | - | - | 3 | 7,54 | 2,88 | 1,509 | 9,959 | |
| పశ్చిమ, దక్షిణ యూరపు | 3.3 | - | - | - | 2 | 11,46 | 1,78 | 6,156 | 36,088 | |
| ఒ ఇ సి డి దేశాలు | 5.2 | - | - | - | 6 | 20,57 | 4,96 | 5,764 | 39,274 | |
| యూరోపియన్ యూనియన్ | 3.2 | - | - | - | 2 | 10,87 | 1,78 | 5,780 | 36,137 | |
| నార్డిక్ దేశాలు | 2 9 | - | - | - | 8 | 1,15 | - | 6,179 | 34,666 | |

- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - *1997*

రెండవ పట్టిక
అభివృద్ధి చెందుతున్న దేశాలలో హ్యూమన్ పావర్టీ వివరాలు (సంఖ్యలు - కోట్లలో)

| ప్రాంతము లేక దేశాల సముదాయము | పెద్ద వారిలో నిరక్షరాస్యుల సంఖ్య - 1995 | వైద్య చికిత్సా వసతులు అందని వారు 1990-95 | రక్షితనీటి సరఫరా అందని వారు 1990-96 | పోషణాలోపానికి గురవుతున్న 5 సం॥ల లోపు పిల్లలు 1990-96 | ప్రతి లక్షసజీవ శిశుజననాలకు సంభవిస్తున్న మెటర్నల్ మరణాలు 1990 | 40 సం॥ల వయసు నిండకుండానే మరణించే అవకాశాలు గల జనాభా 1990 |
|---|---|---|---|---|---|---|
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | 84.20 | 76.60 | 121 30 | 15 80 | 471 | 50.70 |
| అభివృద్ధిలో వెనుకబడిన దేశాలు | 14.30 | 24.10 | 21.80 | 3 40 | 1030 | 12 30 |
| అరబ్బు దేశాలు | 5 90 | 2.90 | 5.40 | 0 50 | 380 | 2 60 |
| తూర్పు ఆసియా | 16.70 | 14.40 | 39.80 | 1 70 | 95 | 8 10 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 4 20 | 5 50 | 10 90 | 0.50 | 190 | 3 60 |
| దక్షిణ ఆసియా | 40.70 | 26.40 | 23.00 | 8.20 | 554 | 18 40 |
| అగ్నేయ ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 3.80 | 6.90 | 16.20 | 2.00 | 447 | 5.20 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 12.20 | 20.5 | 24.90 | 2.80 | 971 | 12.40 |

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1997 నుండి*

మెటర్నల్ మరణాలు సంభవిస్తున్నాయి. సంభవిస్తున్న ఒక్కొక్క మెటర్నల్ మరణానికి ముప్ఫై మంది చొప్పున చూలు-కాన్పు కారణంగా వారు గాయపడటమో, ఇన్‌ఫెక్షన్‌కు గురిగావటమో జరుగుతున్నది. ఇందువల్ల వీరిలో అత్యధికులు జీవితాంతం అనారోగ్యపు బాధను అనుభవించవలసి రావటమో, అశక్తులు గావటమో, వెసికో - వెజైనల్ ఫిస్చులా వంటి అసౌకర్యము, అనారోగ్య ప్రదము మాత్రమే గాక, సిగ్గుదీసే గాయాలకు లోనుగావటమో జరుగుతున్నది. చూలు, కాన్పు కారణాల వల్ల ప్రపంచ వ్యాప్తంగా, సాలుకు కోటిన్నర మంది చొప్పున స్త్రీలు అనారోగ్యం పాలవుతూ ఉండవచ్చునని యునెసెఫ్ అంచనాలు తెలియజేస్తున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రతి లక్ష సజీవ జననాలకూ, 471 చొప్పున మెటర్నల్ మరణాలు సంభవిస్తున్నాయి. అభివృద్ధి చెందిన దేశాల మెటర్నల్ మరణాల రేటు కంటే ఇది పదిహేను రెట్లు అధికం! సబ్-సహారన్ ఆఫ్రికా లో ప్రతిలక్ష సజీవ జననాలకూ మెటర్నల్ మరణాలు 971 వరకూ సంభవిస్తున్నాయి! తూర్పు ఆసియా ప్రాంతపు ఈ మరణాల రేటు కంటే ఇది పదిరెట్లు అధికం! వీటిలో అత్యధికం నిరోధించదగిన మరణాలన్న విషయాన్ని మనం గుర్తుంచు కొంటే ఎందరు అభాగినుల జీవితకాలం అశ్రద్ధ, అనాదరణల వల్ల అకాలంగా ముగుస్తున్నదో అర్థమవుతుంది.

1994 వ సంవత్సరపు అంచనాల ప్రకారం, అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాల ప్రజల జీవితకాల ప్రమాణం 74-75 సంవత్సరాలుండగా, అభివృద్ధి చెందుతున్న ప్రజల జీవితకాల ప్రమాణం 62 సంవత్సరాలు మాత్రమే ఉన్నది. సబ్-సహారన్ ఆఫ్రికా ప్రజల జీవితకాల ప్రమాణం 50 సంవత్సరాలు మాత్రంగానే ఉండిపోయింది. లాటిన్ అమెరికా ఈ విషయంలో ఇంతగా వెనుకబడి లేదు. ఆ ప్రాంత ప్రజల జీవితకాల ప్రమాణం 69 సంవత్సరాల వరకూ ఉన్నది.

ఆరోగ్య రక్షణ : వైద్య చికిత్సతో నివారించదగిన ఇన్ఫెక్షన్ల వల్లా, పరాన్న జీవుల మూలంగా సంక్రమించే అనారోగ్య కారణంగా, (విరేచనాలు, దద్దు-మసూచి, మలేరియా, క్షయ వంటి రోగాల వల్ల) అభివృద్ధి చెందుతున్న దేశాలలో యేటా కోటి డెబ్భై లక్షల మంది మరణిస్తున్నారు. ప్రపంచంలో ఉన్న 3 కోట్లా 5 లక్షల మంది ఎయిడ్స్ రోగులలో నూరింట తొంభై మంది అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉన్నారు.

వీరిలో మూడింట రెండు వంతుల మంది (రెండు కోట్ల మంది) సబ్-సహారన్ ఆఫ్రికాలో ఉన్నారు. వీరిలో పురుషులలో కంటే స్త్రీలే అధిక సంఖ్యాకులు

రోగం వచ్చినపుడు సకాలంలో తగిన వైద్య చికిత్స లభించని రోగి, జీవితాంతం రోగిష్ఠిగా బ్రతుకవలసి రావచ్చు. లేదా అకాల మరణం పాలుగావచ్చు అభివృద్ధి చెందుతున్న దేశాలలో యనభైకోట్ల మంది ప్రజలకు వైద్య చికిత్సా సదుపాయాలు లభించటం లేదని యు యన్ డి పి నిపుణులు అంచనా వేశారు పేద దేశాలలో 51 శాతం మంది జనాభాకు, అభివృద్ధి చెందుతున్న దేశాలలో 21 శాతం మందికి వైద్య చికిత్సా సదుపాయాలు అందటం లేదని వివరించారు ఇలాంటి దురదృష్టవంతులలో ఇరవయ్యారు కోట్ల నలభై లక్షల మంది దక్షిణ ఆసియాలోనే ఉన్నారు! అభివృద్ధి చెందుతున్న దేశాలలోని వంద కోట్ల మంది ప్రజలకు రక్షిత నీటి సరఫరా సదుపాయం లేదు అనారోగ్యం ప్రబలటానికి, రక్షిత నీటి సరఫరా లేమి ముఖ్య కారణాలలో ఒకటి. (2వ పట్టికను చూడండి)

వైద్య చికిత్సా వసతులను పురుషులు వినియోగించు కొన్నంత అధికంగా స్త్రీలు వినియోగించుకోలేక పోతున్న వైనాన్ని ఇంతకు పూర్వమే వివరించాం. కనుకే పురుషుల కంటే అధిక అనారోగ్య భారాన్ని స్త్రీలు మోయవలసి వస్తున్నట్లు కూడా పేర్కొన్నాం.

**నివాస వసతి :** అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రజలలో వందకోట్ల మందికి పైగా, నివాస వసతి లేకుండానో, నామమాత్రపు వసతి కిందో జీవిస్తున్నారు. అరవై కోట్ల మంది అనారోగ్య ప్రదమైన పరిసరాలలో జీవిస్తున్నారు. ఉన్న నివాస వసతి ఎంత నాసిదయినా, దాని తొలగింపు జరిగే ప్రమాదం తొంగి చూస్తూంటుంది. ఇది అదనపు అసౌకర్యం తలదాచుకొనే నీడలేనివారు ప్రపంచంలో పదికోట్ల మంది ఉంటారని అంచనా. వీధులలో జీవించే పిల్లలు, ఒక్క బ్రెజిల్ దేశంలోనే రెండు లక్షల మంది ఉన్నట్లు అంచనా! అభివృద్ధి చెందుతున్న దేశాలలోని ప్రజలలో రెండు వందల కోట్ల మంది అనారోగ్యకరమైన పరిసరాలలో జీవిస్తున్నారు. ఇలాంటి జనాభా, ఈ ప్రాంతపు జనాభాలో అరవై శాతం వరకూ ఉండవచ్చునని యు యన్ డి పి నిపుణులు అంచనా వేశారు.

**విద్యాబుద్ధులు :** అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రజలలో 84 కోట్ల మంది నిరక్షరాస్యులుగా ఉన్నట్లు అంచనా వేస్తున్నారు. వీరిలో 53 కోట్ల ఎనభైలక్షల మంది స్త్రీలు! పేద దేశాల స్త్రీ జనాభాలో 61 శాతం మంది, అభివృద్ధి చెందుతున్న దేశాల స్త్రీ జనాభాలో 38 శాతం మంది నిరక్షరాస్యులుగా ఉన్నారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలోని నిరక్షరాస్యులలో సగం మంది (40 కోట్ల డెబ్భై లక్షల మంది) దక్షిణాసియా వాసులే!

అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రైమరీ స్కూలుకు వెళ్ళి చదువవదగిన వయస్సు పిల్లలలో పదికోట్ల మంది బడికి వెళ్ళటం లేదు. వీరిలో సగం మంది దక్షిణాసియా ప్రాంతంలోనే ఉన్నారు! సెకండరీ స్కూలుకు పోదగిన వయస్సు పిల్లలలో (అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పిల్లలలో) ఇరవయ్యేడు కోట్ల మంది బడిలో చదవటం లేదు.

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పట్టణప్రాంత స్త్రీ జనాభాలో నూరింట 38 మంది మాత్రమే నిరక్షరాస్యులు కాగా, గ్రామీణ ప్రాంత స్త్రీలలో నూరింట 66 మంది వరకూ నిరక్షరాస్యులుగా ఉన్నారు. విద్యార్జనా విషయంలో స్త్రీ లెదుర్కొన వలసి వస్తున్న అవరోధాలను ఇంతకు ముందే వివరంగా చూచాం.

**రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాలలో :** ఈ రంగాలలో స్త్రీలకు పురుషులతోడి సమానమైన స్థానం ఇంకా లభించలేదు. రాజకీయ రంగం పురుషుల గుత్తసొత్తుగా ఉండటాన్ని ఇంతకు పూర్వమే చూచాం. పార్లమెంటు ప్రాతినిధ్యంలో పదమూడు శాతం, కాబినెట్ మంత్రి పదవులలో ఏడుశాతం మాత్రమే స్త్రీలకు లభిస్తున్నది. ఇంతకంటే అధిక పరిమాణపు స్త్రీ ప్రాతినిధ్యం స్థానిక సంస్థలలో కనుపిస్తున్నది.

విషయ నిర్ణయాధికారం గల పదవులు, మేనెజీరియల్, పరిపాలనా సంబంధమైన పదవుల పంపకంలో కూడా స్త్రీలకు నామ మాత్రపు వాటా లభిస్తూండటాన్ని ఇంతకు పూర్వమే చూచాం.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో వేతనార్జనలో పాల్గొంటున్న స్త్రీలు, వేతనార్జనలో పాల్గొంటున్న పురుషులలో సగభాగం కూడా లేరు. ట్రేడ్ యూనియన్లలో కూడా, తమ సభ్యత్వ సంఖ్యా పరిమాణానికి దీటుగా, స్త్రీలకు నాయకత్వ స్థానాలు లభించని విషయాన్ని కూడా ఇంతకు పూర్వమే

వివరించాం.

వ్యక్తిగత భద్రత : ఏ కొలమానంతోనూ పరిమాణాన్ని చూపవీలులేని అంశమిది. హింసా, నేరప్రవృత్తి సమాజంలో పెరిగిపోతున్న రోజులివి. వీటికెరయ్యేవారు ప్రధానంగా పేదలు. అందులోనూ, స్త్రీలు, పిల్లలు అధిక సంఖ్యాకులుగా ఉంటున్నారు. 1970-1980 సంవత్సరాల మధ్య కాలంలో ప్రపంచంలో, సాలుకు ఐదు శాతం చొప్పున నేరాల రేటు పెరిగింది: ఇది ఈ కాలపు జనాభా పెరుగుదల రేటుకు రెండున్నర రెట్లధికం!

కొన్ని దేశాలలో - ప్రధానంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, పేద దేశాలలోనూ, కొన్ని మాజీ కమ్యూనిస్టు దేశాలలోనూ అంతః కలహాలు, సాయుధ పోరాటాలు, మురాలు, తెగలు, మతవర్గాల మధ్య వైషమ్యాలు పెరుగుతున్నాయి 1995 వ సంవత్సరంలో ముప్పై సాయుధ

మూడవ పట్టిక

1994వ సంవత్సరాంతానికి, వివిధ దేశాలలో కాందిశీకులుగా మారిన జనాభా

| దేశము లేక దేశాల సముదాయము | కాంది శీకులు లేక నిర్వాసితులు | హెచ్ డి ఐ విలువ లేక స్కోరు |
|---|---|---|
| హ్యూమన్ డెవలప్ మెంట్ అధికంగా ఉన్న దేశాలు | ఎవరూ లేరు | 90 |
| హ్యూమన్ డెవలప్‌మెంట్ మధ్యస్థస్థాయిలో నున్న దేశాలు | | 65 |
| ఇరాక్ | 7,02,000 | 60 |
| అజర్‌బెయిజాన్ | 2,99,000 | 67 |
| ఆర్మీనియా | 2,02,000 | 68 |
| హ్యూమన్ డెవలప్‌మెంట్ అల్పస్థాయిలో నున్నదేశాలు | | 40 |
| ఆఫ్ఘనిస్తాన్ | 27,44,000 | 30 |
| రువాండా | 22,57,000 | 33 |
| లైబీరియా | 7,95,000 | 31 |
| సోమాలియా | 5,36,000 | 22 |
| సుడాన్ | 3,97, 000 | 36 |
| బురుండి | 3,89,000 | 28 |
| అంగోలా | 2,84,000 | 28 |
| సియరాలియోన్ | 2,75,000 | 22 |
| మొజాంబిక్ | 2,34,000 | 26 |
| చాద్ | 2,11,000 | 30 |
| మయన్మార్ | 2,04,000 | 45 |
| ఈ దేశాల మొత్తం | 92,59,000 | |
| ఇతర దేశాలు (కాందిశీకుల సంఖ్య రెండు లక్షల కంటే తక్కువ వున్న దేశాలవారు) | 52,29,000 | - |
| కాందిశీకుల మొత్తం సంఖ్య | 1,44,88,000 | - |

*- యునైటెడ్ నేషన్స్ హైకమిషనర్ ఫర్ రెఫ్యూజీస్ తయారు చేయించిన అంచనాల ఆధారంతో హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1996 ఇచ్చిన సమాచారం దీనికి ఆధారం*

పోరాటాలు జరిగాయి. వీటిలో ఒక్కటి కూడా రెండు దేశాల మధ్య జరిగింది లేదు. ఇవన్నీ అంతర్యుద్ధాలో, వేర్పాటు వాదులు ప్రారంభించిన సాయుధ పోరాటాలో, లేక తెగలు, మురాలు మధ్య రేగిన సంఘర్షణలో, ప్రభుత్వాన్ని వశం చేసుకోవటానికో, దేశంలోని భూభాగం మీద ఆధిపత్య సాధనకో, ఒక తెగ మరొక తెగను తునుమాడటానికో జరిగాయి ఇలాంటి పోరాటాలలో, గత ఐదు సంవత్సరాల కాలంలోనూ పదిలక్షల మందయినా చనిపోయి ఉంటారని అంచనా వేస్తున్నారు.

ఇలాంటి పోరాటాల వల్ల పౌరులు అధికంగా నష్టపడతారు. పేద కుటుంబాలకు ఇది వెన్ను విరిగే దెబ్బ వంటిది వెనుక జరిగిన యుద్ధాలు, నిర్మాణ యుతమైన రెండు సైన్యాల మధ్య జరిగేవి. అందువల్ల పౌరనష్టాలు అల్పంగా ఉండేవి. కంబోడియా, రువాండా దేశాలలో జరుగుతున్న సాయుధ పోరాటాలలో చనిపోయిన వారిలో, నూరింట తొంభై మంది పౌరులే. వీరిలోనూ స్త్రీలు, పిల్లలు అత్యధికులు.

ఇలాంటి యుద్ధాలు ప్రధానంగా పేదదేశాలలోనూ, మాజీ కమ్యూనిస్టు దేశాలలోనూ జరుగుతున్నాయి. ఈ పోరాటాల వల్ల కాందిశీకులుగా పారిపోయిన ప్రజలు తలదాచుకొంటున్నదీ పేద దేశాలలోనే! అందువల్ల కాందిశీకులుగా మారిన పేదలకు పునరావాసం లభించే అవకాశాలు లేవు; పైగా వీరు బాధలను అధికంగా అనుభవించవలసి వస్తుంది

1995 వ సంవత్సరాంతానికి ఇలాంటి కారణాల వల్ల కాందిశీకులుగా ఇతర దేశాలకు వలసపోయిన జనాభా కోటిన్నర వరకూ ఉంటుందని అంచనా; రెండున్నర కోట్ల మంది వరకూ, ఉన్న ఊరు విడిచి, దేశంలోని మరో ప్రాంతానికి తరలి పోయారు. మరొక లక్షమంది, కాందిశీకులనదగిన స్థితికి దిగజారారట. ఇలాంటి జనాభాలో, స్త్రీలు, పిల్లలూ కలసి యనభై శాతం మంది వరకూ ఉంటారని అంచనా. (హ్యూమన్ డెవలప్‌మెంట్ లో వెనుకబడిన దేశాలలో ఈ ప్రమాదం అధికంగా ఉండటాన్ని మూడవ పట్టికలో చూడవచ్చు.)

స్త్రీలకు ఈ బాధలు చాలవన్నట్లు సమాజంలోనూ, కుటుంబంలోనూ హింసను అనుభవించవలసి వస్తున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలోని వివాహిత స్త్రీలలో, వారి జీవితకాలంలో భర్త చేతిలో దెబ్బలు తిన్నవారు కనీసం మూడవ వంతు మంది వరకూ ఉంటారని అంచనా వేస్తున్నారు. భారతదేశంలో సంభవిస్తున్న కట్నపు చావులు జగత్ప్రసిద్ధిని పొందాయి. భావి పౌరులుగా అభివృద్ధి చెందవలసిన బాలబాలికలు పలురకాల హింసలను అనుభవించవలసి వస్తున్నది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని 10-14 సంవత్సరాల మధ్య వయస్సు పిల్లలలో ఏడున్నర కోట్ల మంది ఉదరపోషణకు పని చేస్తున్నారు. కొందరు కట్టుబానిసలుగా ఉండగా, మరికొందరు అతి ప్రమాదభరితమైన పనులను చేస్తున్నారు; బాలికలలో కొందరు పడుపువృత్తికి పోతున్నారు. ఇలాంటి అభాగ్యులలో నాలుగున్నర కోట్ల మంది ఆసియాలోనూ, రెండున్నర కోట్ల మంది ఆఫ్రికాలోనూ ఉన్నట్లు అంచనా వేశారు వీరిలోనూ బాలుర కంటే, బాలికలే అధికులుగా ఉంటున్నారు.

పాడువడుతున్న పరియావరణ : పరియావరణ క్రమానుగతంగా క్షీణిస్తూండటం, ఆ ప్రాంత ప్రజల దారిద్ర్యపు పెంపుకు కారణమవుతున్నది. ఇందువల్ల, ఆడవుల మీద ఆధారపడి జీవించే ప్రజలు, ముఖ్యంగా పేదలు, అధికంగా దారిద్ర్యపు బాధను అనుభవించవలసి వస్తున్నది. ఇలాంటి జనాభా, అభివృద్ధి చెందుతున్న దేశాళలో యాభైకోట్ల వరకూ ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు. అభివృద్ధి చెందిన దేశాలలో సాలుకు 80 లక్షల నుండి కోటి ఎకరాల వరకూ అడవుల విస్తీర్ణం తగ్గుతున్నట్లు అంచనా వేస్తున్నారు. అడవులు అంతరిస్తూండటం వల్ల పశు గ్రాసానికి, వంట చెరకుకూ, కొరత ఏర్పడుతున్నది. వాననీరు నేలలో తగినంత ఇంకక, భూగర్భ జలసంపద తరిగిపోతున్నది; పలు ప్రాంతాలలో నీటి కొరత పెరుగుతున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో 1970వ సంవత్సరంలో లభించిన తలసరి నీటిలో, ఇపుడు మూడవ వంతు మాత్రమే లభిస్తున్నది. అరబ్బు దేశాలలో నీటి కొరత తీవ్రంగా ఉన్నది.

పరియావరణ క్షీణించటం వల్ల పేదలు ఎంతగా నష్టపడతారో ఎన్.ఎస్.జోదా సర్వేలు స్పష్టంగా నిరూపిస్తున్నాయి.

## నాల్గవ పట్టిక
## గ్రామ సివార్లలోని ఉమ్మడి భూముల మీద గ్రామస్థులనుభవిస్తున్న లాభాలు

| రాష్ట్రము . సర్వేకు తీసుకొన్న జిల్లాల, గ్రామాల సంఖ్య | లాభాలనను భవిస్తున్న కుటుంబాల వర్గీకరణ | గ్రామ ఉమ్మడి భూముల నుండి లభిస్తున్న సప్లయిలు, పని, ఆదాయం ఇత్యాదులు | | | | |
|---|---|---|---|---|---|---|
| | | కుటుంబం వాడె మొత్తం వంట చెరకులో ఉమ్మడి భూముల నుండి లభిస్తున్నదాని శాతం | కుటుంబంవాడే పశుగ్రాసంలో ఉమ్మడి భూముల నుండి లభిస్తున్న దాని శాతం | కుటుంబానికి లభిస్తున్న పని దినాల సంఖ్య | కుటుంబానికి లభిస్తున్న ఆదాయం | కుటుంబానికి లభిస్తున్న మొత్తం ఆదాయంలో ఉమ్మడి భూముల నుండి లభిస్తున్నదాని శాతం |
| ఆంధ్రప్రదేశ్ | పేదలు | 84 | - | 139 రోజులు | రు 534 | 17 |
| ఒక జిల్లాలోని రెండుగ్రామాలు | ఇతరులు | 13 | - | 35 రోజులు | రు 62 | 1 |
| గుజరాత్ | పేదలు | 66 | 82 | 196రోజులు | రు 774 | 18 |
| ఒక జిల్లా, రెండు గ్రామాలు | ఇతరులు | 8 | 14 | 80రోజులు | రు 185 | 1 |
| కర్ణాటక | పేదలు | - | 83 | 185రోజులు | రు.649 | 20 |
| ఒక జిల్లా, రెండు గ్రామాలు | ఇతరులు | - | 29 | 34 రోజులు | రు.170 | 3 |
| మధ్యప్రదేశ్ | పేదలు | 74 | 79 | 183రోజులు | రు.733 | 22 |
| రెండుజిల్లాలు, నాలుగు గ్రామాలు | ఇతరులు | 32 | 34 | 52రోజులు | రు.386 | 2 |
| మహారాష్ట్ర | పేదలు | 75 | 69 | 128రోజులు | రు 557 | 14 |
| 3 జిల్లాలు, ఆరు గ్రామాలు | ఇతరులు | 12 | 27 | 42రోజులు | రు 177 | 1 |
| రాజాస్థాన్ | పేదలు | 71 | 84 | 165రోజులు | రు 770 | 23 |
| రెండుజిల్లాలు, నాలుగు గ్రామాలు | ఇతరులు | 23 | 38 | 61రోజులు | రు.413 | 2 |
| తమిళనాడు | పేదలు | - | - | 137రోజులు | రు.738 | 22 |
| ఒక జిల్లా, రెండు గ్రామాలు | ఇతరులు | - | - | 31 | రు 164 | 2 |

వివరణ :

1. 1982-86 సంవత్సరాల మధ్య కాలంలో గ్రామీణ సర్వేల ద్వారా సేకరించిన సమాచారం ఈ పట్టికకు ఆధారం.
2. <u>పేదలు :</u> వ్యవసాయ కూలీ కుటుంబాలవారూ, రెండు హెక్టార్ల కంటే తక్కువ మెట్ట భూవసతి ఉన్న కుటుంబాలను పేదవిగా వర్గీకరించారు. "ఇతరులు" అని ఉన్న వర్గీకరణలో ధనిక రైతులు కూడా ఉన్నారు.
3. <u>పనిదినాలు :</u> ఉమ్మడి భూములలోని ఉత్పత్తుల సేకరణకు పని చేసిన రోజులను "పని దినాలు"గా పరిగణించారు.

*- ఎన్. ఎస్. జోదా వ్రాసిన "కామన్ ప్రాపర్టీ రిసోర్సెస్" అన్న ప్రపంచ బ్యాంకు ప్రచురణ నుండి.*

(వీరు ఎకనమిస్టుగా కొంత కాలం ఇక్రిశాట్‌లో పనిచేశారు.) గ్రామ సివార్లలోని ఉమ్మడి భూములలో, చిట్టడవుల ఉత్పత్తుల మీద పేదలు ఎంతగా ఆధారపడుతున్నదీ, వీరు సంఖ్యా పూర్వకంగా చిత్రించారు. 1982-86 సంవత్సరాల మధ్య కాలంలో, మన దేశంలోని 21 జిల్లాలలోని అల్పవర్షపాత ప్రాంతంలోని 82 గ్రామాలలో సర్వేలను నిర్వహింపజేశారు. సర్వేయర్లుగా స్థానికులనే నియమించారు. ఆప్రాంత వాసులు గనుక, వాస్తవాలను చక్కగా రికార్డు చేయగలరన్న భావంతో వీరిలా చేశారు. ఈ సర్వే సమాచారపు వివరాలను నాల్గవ పట్టికలో చూడవచ్చు. పేదలు, తమకు అవసరమైన వంట చెరకులో నూరింట 70 నుండి 84 వంతుల మేరకూ, పసుగ్రాసంలో 70 నుండి 82 శాతం మేరకూ, ఉమ్మడి భూముల నుండి సేకరిస్తున్నారు. వీరు సేకరిస్తున్న అటవీ ఉత్పత్తుల విలువ, కుటుంబానికి సాలుకు 534 రూపాయల

నుండి 774 రూపాయల వరకూ ఉంటున్నది. మొత్తం కుటుంబాదాయంలో ఇది 14 నుండి 23 శాతం వరకూ ఉంటున్నది. గ్రామ సివార్లలోని చిట్టడవులు అంతరిస్తేనే పేదలు ఇంతగా నష్టపోతున్నపుడు, ఇంతకంటే అధిక ఉత్పత్తి నీయగల అడవుల అంతరింపు, వీరికి ఎంతహాని చేయగలదో ఊహించటం కష్టంగాదు. పరియావరణ క్షీణత దారిద్ర్యపు

## పేదజనాభా అంచనా

తలసరి ఆదాయ ప్రాతిపదిక మీద, దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారి సంఖ్యను తేల్చటం కష్టం గాదు. యు యన్ డి పి నిపుణులు రూపొందించిన అంచనాలను ఐదవ పట్టికలో చూడవచ్చు. 1987 వ సంవత్సరంలో అభివృద్ధి చెందుతున్న దేశాలలో, 120 కోట్లుగా ఉన్న పేదల జనాభా,

ఐదవ పట్టిక
అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆదాయ దారిద్ర్య వివరాలు

| ప్రాంతము లేక దేశాల సముదాయము | దారిద్ర్య రేఖకు దిగువనున్న జనాభా పరిమాణ శాతము | | మొత్తం పేదలలో ఆయా ప్రాంతాలలో నున్న వారి శాతం | | మొత్తం పేదల సంఖ్య కోట్లలో 1993 |
|---|---|---|---|---|---|
| | 1987 | 1993 | 1987 | 1993 | |
| అరబ్బు దేశాలు | 5 | 4 | 1 | 1 | 1.10 |
| తూర్పు ఆసియా, ఆగ్నేయ ఆసియా, పసిఫిక్ ప్రాంతాలు | 30 | 26 | 38 | 34 | 44.60 |
| తూర్పుఆసియా, ఆగ్నేయ ఆసియా పసిఫిక్ ప్రాంతాలు (చైనా లేకుండా) | 23 | 14 | 10 | 7 | 9.40 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 22 | 24 | 7 | 9 | 11.00 |
| దక్షిణ ఆసియా | 45 | 43 | 39 | 39 | 51.50 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 38 | 39 | 15 | 17 | 21.90 |
| అభివృద్ధి చెందుతున్న దేశాలు | 34 | 32 | 100 | 100 | 130.10 |

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1997 నుండి*

పెంపుకు తోడ్పడుతుందన్న అంశాన్ని డాక్టర్ జోదా పరిశీలనలు స్పష్టంగా చిత్రిస్తున్నాయి. వంట చెరకు, పసుగ్రాసము, కుటుంబావసరాలకు అవసరమైన నీటిసేకరణ స్త్రీల బాధ్యతగా ఉండటం పలుదేశాలలో అతి సామాన్యంగా కనుపిస్తుంది. పరియావరణ క్షీణతవల్ల స్త్రీల మీద ఎంతటి అధిక పనిభారం పడుతుందో ఊహించవచ్చు.

హ్యూమన్ పావర్టీ పరిమాణ నిర్ణయంలో పైన పేర్కొన్న వివిధ అంశాలు ఎలాంటి పాత్రను నిర్వహిస్తున్నదీ చూచాం. హ్యూమన్ పావర్టీని అనుభవిస్తున్న వారిలో పురుషుల కంటే స్త్రీలే అధిక సంఖ్యాకులన్న అంశం కూడా రుజువైంది. పేదరికంలో కూరుకు పోయిన వారు ఎందరో అంచనా వేయటానికిపుడు ప్రయత్నిద్దాం.

1993వ సంవత్సరానికి 130 కోట్లకు పెరిగినట్లు వారు అంచనా వేశారు మొత్తం పేదలలో నూరింట 39 మంది దక్షిణాసియాలో ఉండటం గమనించదగిన అంశం (భారతదేశం ఈ మండలంలోనే ఉన్నది).

తూర్పు యూరపు దేశాలలోనూ,రష్యన్‌ఫెడరేషన్‌కు చెందిన రిపబ్లిక్కులలోనూ, ఆదాయ ప్రాతిపదిక మీద చూచినపుడు పేదల సంఖ్య పెరిగినట్లు కనుపిస్తుంది. 1988-1994 సంవత్సరాల మధ్య కాలంలో, రోజుకు నాలుగు డాలర్లు అంతకంటే తక్కువ ఆదాయంగల పేదల జనాభా, నాలుగు శాతం నుండి 32 శాతానికి పెరిగింది; ఈ కాలంలో దారిద్ర్యరేఖకు దిగువనున్న జనాభా కోటి నలభై లక్షల నుండి, పదకొండు కోట్ల తొంభైలక్షలకు పెరిగింది. 1993-1994 వ సంవత్సరంలో ఒక్క రష్యాలోనే దారిద్ర్యరేఖకు దిగువనున్న

జనాభా ఆరుకోట్ల మేర కుంటుందని అంచనా వేశారు. రష్యన్ ఫెడరేషన్, తూర్పు యూరపు మాజీ కమ్యూనిస్టు దేశాలలోని పేదలలో వీరి సంఖ్యా పరిమాణం సగం మేర కుంటుంది. ఇది చాలదన్నట్లు ఉచిత వైద్య చికిత్స, విద్య వంటి సాంఘిక భద్రతా సదుపాయాలు అంతరించటం వల్ల పేదల మీద మరింత భారం పడింది.

బ్రతకటానికి తగినంత ఆదాయం ఉండటం మాత్రమే చాలదు; వ్యక్తి "మానవుని" గా జీవించటానికి తగిన వసతులుండాలని యు యన్ డి పి నిపుణులు భావించి, ఈ మానవతా దారిద్ర్యాన్ని సూచించే ఇండెక్సును (సూచీని) రూపొందించారు. హ్యూమన్ డెవలప్‌మెంట్ ఇండెక్సును రూపొందించటానికి స్వీకరించిన, దీర్ఘ జీవితకాల ప్రమాణము, విజ్ఞానం, గౌరవ ప్రదమైన జీవన స్థాయిని (లివింగ్ స్టాండర్డ్) కూడా తీసుకొని, కొద్ది మార్పులు, చేర్పులతో ఈ అంశాలను హ్యూమన్ పావర్టీ ఇండెక్సు తయారీకి వాడారు 1. నలభై సంవత్సరాల లోపుననే మరణించే అవకాశాలు గల జనాభా సంఖ్యను, 2. నిరక్షరాస్యుల శాతాన్ని తీసుకొన్నారు. 3. మూడవ అంశంగా గౌరవ ప్రదమైన జీవన ప్రమాణస్థాయిని తీసుకొన్నారు. ఆరోగ్యసేవలు, రక్షిత నీటి సరఫరా అందని జనాభా శాతాన్ని, ఐదు సంవత్సరాలలోపు వయస్సు పిల్లలలో పోషణాలోపానికి గురవుతున్న వారి శాతాన్ని తీసుకొన్నారు. పరిమాణపుటంచనాలకు వీలులేని రాజకీయ స్వాతంత్ర్యం, విధాన నిర్ణయాలలో సముచిత పాత్రా నిర్వహణావకాశాల లేమి, వ్యక్తిగత భద్రతా లేమి, సామాజిక జీవనంలో అందరితో

ఆరవపట్టిక

కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాల హ్యూమన్ పావర్టీ ఇండెక్సు, ర్యాంకింగ్

| దేశము | హెచ్ పి ఐ విలువ శాతం | హెచ్ పి ఐ ర్యాంకు |
|---|---|---|
| దక్షిణ ఆసియా దేశాలు | | |
| శ్రీలంక | 20.7 | 22 |
| భారతదేశము | 36.7 | 47 |
| భూటాన్ | 46.3 | 62 |
| పాకిస్తాన్ | 46.8 | 64 |
| బంగ్లాదేశ్ | 48.3 | 67 |
| ఇతర ఆసియా దేశాలు | | |
| చైనా | 17.5 | 18 |
| ఫిలిపీన్స్ | 17.7 | 19 |
| ఇండొనీషియా | 20.8 | 23 |
| వియత్నాం | 26 2 | 33 |
| మయన్మార్ | 31.2 | 40 |
| కొన్ని ఆఫ్రికా దేశాలు | | |
| కీన్యా | 26.1 | 32 |
| అల్జీరియా | 28.6 | 37 |
| ఘనా | 32.6 | 43 |
| ఈజిప్టు | 34.8 | 44 |
| రువాండా | 37.9 | 48 |
| టాంజనియా | 39.7 | 50 |
| జైర్ | 41.2 | 52 |
| ఉగాండా | 41.3 | 53 |
| నైజీరియా | 41.6 | 54 |
| మొరాకో | 41.7 | 55 |
| సుడాన్ | 47 2 | 57 |
| ర్యాంకింగ్‌లో చివరి దేశాలు | | |
| గినియా | 50.0 | 71 |
| మొజాంబిక్ | 50.1 | 72 |
| కంబోడియా | 52.5 | 73 |
| మాలి | 54.7 | 74 |
| ఇధియోపియా | 56.2 | 75 |
| బర్కినా ఫాసో | 58.3 | 76 |
| సియారా లియోన్ | 59.2 | 77 |
| నైజర్ | 66.0 | 78 |
| ర్యాంకింగ్‌లో అగ్రస్థానంలో ఉన్నదేశాలు | | |
| ట్రినిడాడ్-టోబాగో | 4.1 | 1 |
| క్యూబా | 5.1 | 2 |
| చిలీ | 5.4 | 3 |
| సింగపూర్ | 6.6 | 4 |
| కోస్టారికా | 6.6 | 5 |

-హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - *1997*

సమమైన పాలు పంచుకొనలేకపోవటం, జీవనాధారమైన వనరులకు ప్రమాద మేర్పడటం వంటి కొన్ని అంశాలను ఈ సూచీని రూపొందించటానికి వారు పరిగణనకు తీసుకోలేదు మానవతా దారిద్ర్యపు పెంపుకు ఇవి తోడ్పడేవే అయినా, పరిమాణ నిర్ణయం వీలుగానందున వీటిని వారు హ్యూమన్ పావర్టీ ఇండెక్సు తయారీకి తీసుకోలేదు. హ్యూమన్ డెవలప్‌మెంట్ ఇండెక్సు సామాజికుల అందరి అభివృద్ధిని సూచిస్తే, హ్యూమన్ పావర్టీ ఇండెక్సు, సమాజంలోని అట్టడుగు వర్గాల జీవనాభివృద్ధి స్థాయిని సూచిస్తుందని ఈ నిపుణులు పేర్కొన్నారు

అభివృద్ధి చెందుతున్న 78 దేశాలకు హ్యూమన్ పావర్టీ ఇండెక్సును (హెచ్ పి ఐ ని) వీరు తయారు చేశారు హెచ్ పి ఐ విలువలు ఆయా దేశాల మానవతా దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న ప్రజల సంఖ్యా పరిమాణపు శాతంగా కూడా సూచించారు. తయారయిన 78 దేశాల హెచ్ పి ఐ లోనూ ట్రినిడాడ్-టొబాగో, క్యూబా, చీలీ, సింగపూరు, కోస్టారికాల సూచీ పదికి లోపుగానే ఉన్నది. దీనిని, ఆదేశాల ప్రజలలో హ్యూమన్ పావర్టీని అనుభవిస్తున్న జనాభాశాతం పదిశాతానికి తక్కువగా ఉన్నట్లు పరిగణించాలన్నారు. సూచీసంఖ్య పెరుగుదల ఆయాదేశాలలో మానవతా దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారి సంఖ్యాధిక్యతగా మనం పరిగణించాలి మచ్చుకు కొన్ని దేశాల హెచ్ పి ఐ ని అరవపట్టికలో చూడవచ్చు.

ఈ డెబ్భైయ్యెనిమిది దేశాలలోని సగం దేశాలలో, మూడవవంతు మంది ప్రజలు హ్యూమన్ పావర్టీని అనుభవిస్తున్నారు చైనా, కోస్టారికా, కీన్యా, పెరూ, ఫిలిపీన్స్, జింబాబ్వే వంటి దేశాలు ఆదాయపు దారిద్ర్యం కంటే హ్యూమన్ పావర్టీని అధికంగా తొలగించ గలిగాయి.

హ్యూమస్ పావర్టీ ఒకే దేశంలోని వివిధ ప్రాంతాలలో భిన్న పరిమాణాలలో ఉండటం కూడా కనిపిస్తుంది. ఉదాహరణకు భారతదేశం స్థితిని చూడవచ్చును. దేశపు హెచ్ పి ఐ ఇండెక్సు 36.7 శాతం ఉన్నది. కాని కేరళలో ఇది 15 శాతంగా మాత్రమే ఉన్నది దేశంలో సంపన్న రాష్ట్రంగా పేరొందిన పంజాబుకు ఇండెక్సు 37 శాతంగా ఉన్నది. ఒరిస్సా ఇండెక్సు 41 శాతంగానూ, రాజస్థాన్ ఇండెక్సు 52 శాతంగానూ, బీహారు ఇండెక్సు 54 శాతంగానూ ఉండటం ఆశ్చర్యకరం గాదు. హ్యూమన్ డెవలప్‌మెంట్‌కు, దారిద్ర్యపు తొలగింపుకు ఆయా రాష్ట్ర ప్రభుత్వాల కృషీ లోపానికిది ప్రతిబింబం

మానవతా దారిద్ర్యాన్ని బాగా తగ్గించిన దేశంగా పేరొందిన చైనా, హెచ్ పి ఐ ఇండెక్సు 17.5 శాతంగా ఉన్నా, ఆదేశంలోని మారుమూల ప్రాంతాలలో ఇది అధికంగా (యాభైశాతాన్ని మించి కూడా) ఉండటం కనుపిస్తున్నది.

దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమాల అమలులో, ఒకే రకమైన కార్యక్రమం తదేక దీక్షతో నిరంతరాయంగా అమలు జరుగుతూండక పోవటం, పురోగమన సాధనలో పలుప్రాంతాల మధ్య వ్యత్యాసాలుంటూండటం, ఆదాయ వ్యత్యాసాలు పెరుగుతూ ఉండటం వంటి కారణాల వల్ల దారిద్ర్యం పెరిగి పోతున్నది, ధనికులకు -పేదలకు, గ్రామీణులకు -పట్టణ వాసులకు, స్త్రీలకు-పురుషులకు మధ్య, అభివృద్ధి చెందిన-అభివృద్ధి చెందని దేశాల మధ్య ఒకేదేశంలోని పలు ప్రాంతాల మధ్య అసమానతలు పెరిగిపోతున్నాయి

స్త్రీ పురుషుల మధ్య ఆదాయ వ్యత్యాసాలున్నాయి. హ్యూమన్ డెవలప్‌మెంట్ లోనూ తీవ్రమైన వ్యత్యాసాలున్నాయి. (వేరొక అధ్యాయంలో ఇచ్చిన జి డి ఐ, జి ఇ ఎం స్కోర్లను పరిశీలించి చూడండి). పురుషులలో కంటే స్త్రీలలో నిరక్షరాస్యత అధికంగా ఉండటం, విద్య, వైద్య చికిత్సా సదుపాయాల వినియోగంలో స్త్రీ పురుషుల మధ్య వ్యత్యాసాలుండటం, విధాన నిర్ణయాలలో స్త్రీలకు సముచిత పాత్ర లభించక పోవటం వంటి పలురకాల అసమానతలను పలు అధ్యాయాలలో సాకల్యంగా పరిశీలించాం. స్త్రీ పురుష అసమానతలు ఎంత అధికంగా ఉంటే స్త్రీలు అనుభవించవలసి వచ్చే హ్యూమన్ పావర్టీ కూడా అంత అధికంగా ఉండటం సహజం. దారిద్ర్యం- అది ఆదాయ పూర్వకమైనది గావచ్చు, మానవతా పూర్వకమైనది గావచ్చు - ఏ ప్రాంతంలో అధికంగా ఉంటే, స్త్రీలు దానిని పురుషుల కంటే అంత అధికంగా అనుభవిస్తున్నట్లు చెప్పవచ్చు. దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారిలో స్త్రీ లెందరు, పురుషు లెందరు అన్న సంఖ్యా పూర్వక చిత్రణ కష్టమే. ఇలాంటి సంఖ్యావివరాలు లభించటమే కష్టంగా ఉన్నది. దారిద్ర్యానికి కారణమైన పరిస్థితుల భారాన్ని ఎవరు అధికంగా భరిస్తున్నారో వారే అధికంగా దారిద్ర్యాన్ని

## ఏడవ పట్టిక
## వివిధ దేశాలకు స్త్రీల పిల్లల హ్యూమన్ పావర్టీ సూచికలు

| దేశం పేరు | చావుబ్రతుకుల మధ్య పెనుగులాట | | | విద్యార్జన | | | | | | రాజకీయ ప్రాతినిధ్యం | ఆదాయం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మెటర్నల్ మరణాలరేటు ప్రతి లక్ష శిశు జననాలకు-1990 | పుట్టిన సం॥లోపునే మరణిస్తున్న పిల్లల సంఖ్య వేలల్లో - 1995 | 5సం॥లోపు వయసువారిలో బరువుతక్కువున్న పిల్లల శాతము 1990-1996 | స్త్రీలలో నిరక్షరాస్యుల శాతము (1995) | ప్రతి 100 మంది పురుష నిరక్షరాస్యులకు స్త్రీ నిరక్షరాస్యుల సంఖ్య 1995 | ప్రైమరీ విద్యాలయంలో చేరుతున్న ప్రతి వంద మంది బాలురకు, దానిలో చేరుతున్న బాలికలు - 1995 | సెకండరీ విద్యాలయంలో చేరుతున్న ప్రతి వందమంది బాలురకూ, దానిలో చేరుతున్న బాలికలు - 1993-1995 | మొత్తం బాలబాలికలలో బడికి పోని వారి శాతం | 10-14 సం॥ల మధ్య వయస్సులలో శ్రామికులుగా పనికి పోతున్న పిల్లల శాతం - 1995 | పార్లమెంటరీ ప్రాతినిధ్యం సభలోని ప్రతివంద మంది పురుషులకు స్త్రీ సభ్యులు-1996 | మొత్తం స్త్రీ జనాభాలో శాతం లెక్కించి ఇంటి పనులు చేస్తున్నవారి శాతం - 1990 | శాస్త్రజ్ఞులకు ప్రతివంద మంది పురుష శాస్త్రజ్ఞులకు శాస్త్రజ్ఞులైన స్త్రీలు - 1995 |
| **హెచ్‌డిఐ లోని తొలిపదిర్యాంకు దేశాలు** | | | | | | | | | | | | |
| కెనడా | 6 | 5 | - | - | - | - | 101 | 4 | - | 19 | 80 | 80 |
| ఫ్రాన్స్ | 15 | 10 | - | - | - | - | 105 | 1 | - | 6 | 82 | 76 |
| నార్వే | 6 | 1 | - | - | - | - | 100 | 1 | - | 39 | 67 | 82 |
| అమెరికా | 12 | 61 | - | - | - | - | 100 | 4 | - | 11 | 76 | 80 |
| ఐస్‌లెండ్ | - | - | - | - | - | - | | | - | 25 | - | 83 |
| నెదర్లెండ్స్ | 12 | 2 | - | - | - | - | 104 | 7 | - | 28 | 91 | 65 |
| జపాన్ | 18 | 11 | - | - | - | - | 101 | 0 | - | 8 | 82 | 66 |
| ఫిన్లెండ్ | 11 | 1 | - | - | - | - | 101 | 1 | - | 34 | 38 | 86 |
| న్యూజిలెండ్ | 25 | 1 | - | - | - | - | 104 | 1 | - | 29 | 66 | 77 |
| స్వీడన్ | 7 | 1 | - | - | - | - | 100 | 1 | - | 40 | 67 | 90 |
| **కమ్యూనిస్టుదేశాలు** | | | | | | | | | | | | |
| క్యూబా | 95 | 3 | - | 5 | 123 | 101 | 115 | 4 | - | 23 | 5 | 61 |
| చైనా | 95 | 17.22 | 16 | 27 | 269 | 98 | - | 1 | 11.6 | 21 | - | 87 |
| వియత్‌నాం | 160 | 1,57 | 45 | 9 | 251 | 80 | - | - | 9.1 | 19 | - | 94 |

(ఏడవ పట్టిక తరువాయి)

| దేశం పేరు | చావుబ్రతుకుల మధ్య పెనుగులాట | | | విద్యార్జన | | | | | | రాజకీయ ప్రాతినిధ్యం | ఆదాయం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మెటర్నల్ మరణాలరేటు (ప్రతి లక్ష శిశు జననాలకు) | పుట్టిన సం॥లోపునే మరణిస్తున్న పిల్లల సంఖ్య వేలల్లో - 1995 | 5సం॥లోపు వయసువారిలో బరువుతక్కువున్న పిల్లల శాతము - 1990-1996 | స్త్రీలలో నిరక్షరాస్యుల శాతము (1995) | ప్రతి 100 మంది పురుష నిరక్షరాస్యులకు స్త్రీ నిరక్షరాస్యుల సంఖ్య - 1995 | ప్రైమరి విద్యాలయంలో చేరుతున్న ప్రతి వంద మంది బాలురకు, దానిలో చేరుతున్న బాలికలు - 1995 | సెకండరి విద్యాలయంలో చేరుతున్న ప్రతి వందమంది బాలురకూ, దానిలో చేరుతున్న బాలికలు 1993-1995 | మొత్తం బాలబాలికలలో బడికి పోని వారి శాతం | 10-14 సం॥ల మధ్య వయస్సులలో శ్రామికులైన పిల్లల శాతం - 1995 | పార్లమెంటరీ ప్రాతినిధ్యం వహించే ప్రతివంద మంది పురుషులకు స్త్రీ సభ్యులు-1996 | మొత్తం స్త్రీ జనాభాలో వేతనం లేకుండా ఇంటి పనులు చేస్తున్నవారి శాతం - 1990 | వేతనార్జన చేస్తున్న ప్రతివంద మంది పురుషులకు వేతనార్జన చేస్తున్న స్త్రీలు - 1995 |
| **దక్షిణ ఆసియా దేశాలు** | | | | | | | | | | | | |
| శ్రీలంక | 140 | 11 | 38 | 13 | - | 100 | - | - | 2 4 | 5 | 56 | 54 |
| భారతదేశం | 570 | 36,71 | 53 | 62 | 181 | 78 | - | - | 14.4 | 7 | - | 50 |
| బంగ్లాదేశ్ | 850 | 5,37 | 67 | 74 | 146 | 88 | 54 | 38 | 30 1 | 9 | 6 | 76 |
| పాకిస్తాన్ | 340 | 8,19 | 38 | 76 | 151 | 68 | - | - | 17 7 | 3 | 33 | 38 |
| నేపాల్ | 1,500 | 1,45 | 49 | 86 | 146 | 58 | - | - | 45 2 | 5 | 55 | 68 |
| భూటాన్ | 1,600 | 16 | 38 | 72 | 164 | 25 | - | - | 55 3 | 2 | - | 66 |
| **హెచ్‌డిఐ ర్యాంక్‌లో దిగువనున్న కొన్ని దేశాలు** | | | | | | | | | | | | |
| నైజీరియా | 1000 | 790 | 36 | 53 | 161 | 78 | - | - | 25 8 | - | 46 | 55 |
| జైర్ | 870 | 386 | 34 | 32 | 241 | 90 | 62 | 39 | 29.6 | 5 | - | 76 |
| యెమెన్ | 1,400 | 123 | 39 | - | - | 49 | - | - | 20.1 | 1 | 69 | 39 |
| అంగోలా | 1,500 | 133 | - | - | - | - | - | - | 27 1 | 10 | - | 84 |
| యుగాండా | 1,200 | 235 | 23 | 50 | 190 | 91 | - | - | 45 3 | 18 | 74 | 90 |
| ఇథియోపియా | 1,400 | 625 | 48 | 75 | 137 | 29 | - | - | 42 3 | - | 67 | 91 |
| రువాండా | 1,300 | 71 | 29 | 48 | 160 | 106 | 78 | 24 | 41.7 | 17 | 70 | 93 |
| సియరా లియోన్ | 1,800 | 75 | 29 | 82 | 150 | 100 | - | - | 15.5 | 6 | 74 | 54 |

- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1997

## ఎనిమిదవ పట్టిక
## ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో స్త్రీల, పిల్లల హ్యూమన్ పావర్టీ

| దేశం పేరు | చావుబ్రతుకుల మధ్య పెనుగులాట | | | విద్యార్జన | | | | | | రాజకీయ ప్రాతినిధ్యం | ఆదాయం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మెటర్నల్ మరణాలరేటు ప్రతి లక్ష శిశు జననాలకు 1990 | ప్రతి సంవత్సరం లోపునే మరణించే పసిపిల్లల సంఖ్య వేలల్లో 1995 | 5సం॥లోపు వయసువారిలో బరువు తక్కువున్న పిల్లల శాతము 1990-1996 | స్త్రీలలో నిరక్షరాస్యుల శాతము (1995) | ప్రతి 100 మంది పురుష నిరక్షరాస్యులకు స్త్రీ నిరక్షరాస్యుల సంఖ్య 1995 | ప్రాథమిక విద్యాలయాలలో చేరుతున్న ప్రతి 100 మంది బాలురకు-బాలికలు 1993-1995 | సెకండరీ విద్యాలయాలలో చేరుతున్న ప్రతివంద మంది బాలురకు-బాలికలు 1993-1995 | మొత్తం బాలబాలికలలో ప్రాథమిక పాఠశాలకు పోనివారి శాతం 1993-1995 | 10-14 సం॥ల మధ్య వయస్సులలో శ్రామికులుగా పని చేస్తున్న పిల్లల శాతం | పార్లమెంటులో స్త్రీ ప్రతినిధ్యము ప్రతి వందమంది పురుషులకు స్త్రీలు 1996 | మొత్తం స్త్రీ జనాభాలో కేవలం చేసేది ఇంటిపనులను చేసేవారి శాతం | శ్రామికులుగా ఉన్న ప్రతి 100మంది పురుషులకు శ్రామికులైన స్త్రీలు 1995 |
| అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలు | 471 | 74.04 | 31 | 38 | 159 | 88 | - | 9 | 16 | 12 | 48 | 67 |
| పారిశ్రామిక దేశాలు | 31 | 2.06 | - | - | - | - | - | 5 | - | 4 | 75 | 75 |
| ప్రపంచం | 416 | 76.10 | - | - | - | - | - | 8 | 15.8 | 13 | 57 | 68 |
| అరబ్బుదేశాలు | 380 | 4.75 | 16 | 56 | 176 | 91 | 92 | 15 | 10.4 | 4 | 40 | 37 |
| తూర్పు ఆసియా | 95 | 8.83 | 16 | 26 | 249 | 102 | - | 1 | 11.5 | 20 | 80 | 86 |
| తూర్పు ఆసియా (చైనాలేకుండా) | 99 | 22 | - | 5 | 235 | - | - | 8 | - | 9 | 80 | 71 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 190 | 4.24 | 11 | 15 | 119 | 93 | - | 13 | 10.9 | 10 | 38 | 50 |
| దక్షిణ ఆసియా | 554 | 27.00 | 50 | 63 | 157 | 77 | - | 15 | 15.2 | 7 | 29 | 51 |
| దక్షిణ ఆసియా (భారతదేశం లేకుండా) | 520 | 8.65 | 43 | 65 | 154 | 77 | - | - | 20.4 | 6 | 29 | 54 |
| ఆగ్నేయ ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 447 | 6.18 | 36 | 16 | 198 | 66 | - | - | 11.3 | 12 | 63 | 73 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 971 | 22.59 | 31 | 51 | 155 | 79 | - | 37 | 32.7 | 2 | 57 | 74 |
| వెనుకబడిన దేశాలు | 1039 | 21.77 | 42 | 61 | 155 | 75 | - | 45 | 52.6 | 9 | 43 | 76 |
| ఉత్తర అమెరికా | 12 | 33 | - | - | - | - | 101 | 4 | - | 12 | 76 | 80 |
| తూర్పు యూరప్, రష్యన్ ఫెడరేషన్ | 63 | 1.37 | - | - | - | - | - | 8 | - | 8 | - | 82 |
| పశ్చిమ, దక్షిణ యూరప్ | 14 | 23 | - | - | - | - | 102 | 3 | - | 18 | 71 | 66 |
| ఓ ఇ సి డి దేశాలు | 34 | 2.13 | - | - | - | - | 102 | 4 | - | 13 | 68 | 69 |
| యూరోపియన్ యూనియన్ | 13 | 27 | - | - | - | - | 103 | 3 | - | 16 | 71 | 67 |
| నార్డిక్ దేశాలు | 8 | 2 | - | - | - | - | 101 | 1 | - | 37 | 67 | 86 |

- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1997

అనుభవిస్తారు అన్న సూత్ర ప్రాతిపదిక మీద, స్త్రీలే పురుషుల కంటే అధిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు అని చెప్పటానికి సందేహించనవసరం లేదు. పురుషుల తోడి సమానత్వాన్ని స్త్రీలు అనుభవించలేక పోతున్నారు గనుక, వారే పురుషుల కంటే అధిక దారిద్ర్యాన్ని అనుభవిస్తూండటం యదార్థం; దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారిలో పురుషుల కంటే స్త్రీలే సంఖ్యా పూర్వకంగా అధికులుగా ఉన్నారు ఇటువంటి అంచనాలకు వీలుగా, యు యన్ డి పి నిపుణులు, స్త్రీలు, పిల్లల హ్యూమన్ పావర్టీకి సంబంధించిన కీలకమైన అంచనాల నిచ్చారు వాటిని ఏడవ, ఎనిమిదవ పట్టికలలో చూడవచ్చు

కేపబులిటీ పావర్టీ :

యు యన్ డి పి నిపుణులు రూపొందించిన కేపబులిటీ పావర్టీ మెషర్ (సి పి యం) ఈ సందర్భంలో పరిశీలించదగినది. ఈ సూచీ నిర్మాణానికి వీరు మూడు అంశాలను పరిగణనకు తీసుకొన్నారు ·

1 సుపోషణ, ఆరోగ్య రక్షణ దీని ప్రాతినిధ్యానికి, ఐదు సంవత్సరాల లోపు వయస్సు పిల్లలలో, ఆరోగ్యసూత్రాల రీత్యా ఉండవలసిన దానికంటే తక్కువ బరువున్న పిల్లల సంఖ్యను తీసుకొన్నారు. ఇలాంటి పిల్లలలో మగపిల్లల కంటే ఆడపిల్లలే అధిక సంఖ్యాకులుగా ఉన్న విషయం పాఠకులకు తెలుసు

తొమ్మిదవ పట్టిక

మొత్తం జనాభాలో కేపబులిటీ పావర్టీలోనూ, ఆదాయ దారిద్ర్యంలోనూ ఉన్న పేదల శాతాలు

| దేశము | మొత్తం జనాభాలో కేపబులిటీ పావర్టీలో నున్న పేదల శాతం | మొత్తం జనాభాలో ఆదాయ దారిద్ర్యంలో నున్న పేదలశాతం |
|---|---|---|
| బంగ్లాదేశ్ | 76.9 | 47.5 |
| భారతదేశము | 61.5 | 25.4 |
| పాకిస్తాన్ | 60.8 | 34 0 |
| గినియా-బిస్సు | 56.6 | 49 0 |
| మొరాకో | 49.7 | 13.1 |
| ఉగాండా | 45 9 | 55 0 |
| ఇండొనీషియా | 42.3 | 16.7 |
| ఘనా | 39 3 | 35.9 |
| కీన్యా | 33.8 | 37.0 |
| ట్యూనీషియా | 29.9 | 14.1 |
| పెరూ | 25 7 | 32.0 |
| జింబాబ్వే | 22.3 | 25 5 |
| థాయ్‌లాండ్ | 21.1 | 21.8 |
| శ్రీలంక | 19.3 | 22.4 |
| చైనా | 17.5 | 10 9 |
| వెనుజులా | 15.2 | 31.3 |

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1996*

పదవ పట్టిక
అభివృద్ధి చెందుతున్న దేశాలలోని మొత్తం కుటుంబాలలో స్త్రీలు నిర్వాహకులుగానున్న కుటుంబాల శాతం (1992)

| మండలం | కుటుంబాల శాతం |
|---|---|
| ఆసియా | 9 |
| ఆసియా (చైనా, భారతాలు లేకుండా) | 14 |
| లాటిన్ అమెరికా, కరిబియన్ | 17 |
| దూరప్రాచ్యము, ఉత్తర ఆఫ్రికా | 17 |
| సబ్-సహారన్ ఆఫ్రికా | 31 |
| అన్ని మండలాలు కలిపి | 12 |
| అన్ని మండలాలు కలిపి (చైనా, భారతాలు లేకుండా) | 20 |
| వెనుకబడిన దేశాలు | 23 |

*- ఇంటర్నేషనల్ ఫండ్ ఫర్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంట్ సంస్థ వారి సమాచారం ఆధారంతో*
*ఉమెన్ ఇన్ ఎ ఛేంజింగ్ గ్లోబల్ ఎకానమీ ప్రచురించిన పట్టిక*

2. క్షేమకరమైన ప్రసవాన్ని పరిగణనకు తీసుకొన్నారు. ఇందుకు, తర్ఫీదు పొందిన వైద్య సిబ్బంది సహాయం లేకుండా జరుగుతున్న కాన్పుల సంఖ్యను తీసుకొన్నారు.

3. అక్షరాస్యత, విజ్ఞానార్జనను మూడవ అంశంగా స్వీకరించారు. ఇందుకు స్త్రీలలోని నిరక్షరాస్యుల సంఖ్యాపరిమాణాన్ని తీసుకొన్నారు. ఈ అంశాలన్నీ ప్రధానంగా స్త్రీల మనుగడను ప్రభావితం చేసేవే గనుక, ఈ సూచికను (సి పి యం ను) ప్రధానంగా స్త్రీల కేపబులిటీ పావర్టీ మెషర్‌గా మనం స్వీకరించవచ్చునని యు యన్ డి పి నిపుణులు సూచించారు.

ప్రపంచ బ్యాంకు ఆదాయ ప్రాతిపదిక మీద రూపొందించిన హెడ్ కౌంట్ పావర్టీ ఇండెక్సును, తాము రూపొందించిన కేపబులిటీ పావర్టీ మెషర్‌నూ కొన్ని దేశాలకు వీరిచ్చారు. ఈ సంఖ్యా వివరాలను తొమ్మిదవ పట్టికలో చూడవచ్చు.

జాతీయాదాయ ప్రాతిపదిక మీద చూచినపుడు, అభివృద్ధి చెందుతున్న దేశాలలోని జనాభాలో నూరింట 21 మంది దారిద్ర్య రేఖకు దిగువనున్నట్లు తెలుతున్నది సి పి యం సూచీ ప్రకారం ఈ పరిమాణం 37 శాతంగా కనుపిస్తున్నది. ఈ విషయాన్నే మరొక విధంగా కూడా చెప్పవచ్చు అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రజలలో తొంభై కోట్ల మంది దారిద్ర్యరేఖకు దిగువనున్నారు. సి పి యం సూచీ ప్రకారం, జీవన సామర్ధ్యానికి నోచుకోనివారు (కేపబులిటీ పూర్) నూట అరవై కోట్ల మంది ఉన్నారు. వీరంతా ప్రధానంగా స్త్రీలైయుండటం గమనించదగిన విషయం

దక్షిణ ఆసియాలోని చాలా దేశాలలో ఆదాయ దారిద్ర్యం కంటే, కేపబులిటీ పావర్టీ అధికంగా ఉన్నట్లు సిపియం సూచీ వెల్లడిస్తున్నది బంగ్లాదేశ్‌లో ఐదున్నర కోట్ల మంది ఆదాయ దారిద్ర్యాన్ని అనుభవిస్తుండగా, కేపబులిటీ దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న వారు తొమ్మిది కోట్లమంది వరకూ ఉన్నారు. పాకిస్తాన్లో ఆదాయ దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నవారు, మొత్తం జనాభాలో మూడవ వంతు మంది ఉండగా, కేపబులిటీ దారిద్ర్యానికి లోనయినవారు ఐదింట మూడు వంతులకు మించి (అరవై రెండు శాతం మంది) ఉన్నారు. భారత దేశంలో ఆదాయ దారిద్ర్యానికి లోనయినవారు, మొత్తం జనాభాలో నాల్గవ వంతు మంది ఉండగా, కేపబులిటీ పావర్టీని అనుభవిస్తున్న వారు అరవై రెండు శాతం మంది వరకూ ఉన్నారు. శ్రీలంకలో మాత్రం ఆదాయ దారిద్ర్యం కంటే, కేపబులిటీ దారిద్ర్యం తక్కువగా ఉంది!

పదకొండవ పట్టిక
స్త్రీలు సంరక్షకులుగానున్న కుటుంబాల శాతం

| మండలం | 1970 | 1980 | 1990 |
|---|---|---|---|
| ఆఫ్రికా | 18.4 | 20.6 | 18.2 |
| ఆసియా, పసిఫిక్ ప్రాంతం | 15.3 | 23.1 | - |
| లాటిన్ అమెరికా | 24.1 | 27.6 | 20.8 |
| తూర్పు యూరపు | - | 23.1 | - |
| పశ్చిమ యూరపు | - | 23.7 | 31.2 |

*- యునైటెడ్ నేషన్స్ సెక్రెటేరియట్‌కు చెందిన డివిజన్ ఫర్ ఎడ్వాన్స్‌మెంట్ ఆఫ్ ఉమెన్ వారి సమాచారం ఆధారంతో ఉమెన్ ఇన్ ఎ ఛేంజింగ్ గ్లోబల్ ఎకానమీ ఇచ్చిన పట్టిక*

పన్నెండవ పట్టిక
కొన్ని పారిశ్రామిక దేశాలలోని పిల్లలలో దారిద్ర్యరేఖకు దిగువనున్న వారి శాతం (1990-1992)

| దేశంపేరు | తలిదండ్రులిద్దరు ఉన్నకుటుంబాల లోని పిల్లలు | తల్లి సంరక్షకు రాలిగా నున్న కుటుంబాల లోని పిల్లలు |
|---|---|---|
| స్వీడన్ | 2.2 | 5.2 |
| డెన్మార్క్ | 2.5 | 7 3 |
| ఫిన్లెండ్ | 1 9 | 7.5 |
| బెల్జియం | 3 2 | 10.0 |
| ఇటలీ | 9.5 | 13 9 |
| నార్వే | 1.9 | 18.4 |
| నెదర్లెండ్స్ | 3.1 | 39.5 |
| కెనడా | 7.4 | 50.2 |
| ఆస్ట్రేలియా | 7.7 | 56.2 |
| అమెరికా | 11.1 | 59.5 |

*- యునిసెఫ్ ప్రచురించిన ది ప్రోగ్రెస్ ఆఫ్ నేషన్స్ - 1996 నుండి*

స్త్రీల కుటుంబ నిర్వహణ : దారిద్ర్యము

పురుషుల కంటే స్త్రీలు అధిక దారిద్ర్యాన్ని అనుభవిస్తారు, లేక దారిద్ర్యాన్ని అనుభవించే వారిలో పురుషుల కంటే స్త్రీలే అధిక సంఖ్యాకులు అన్న విషయ నిర్ధారణకు, స్త్రీల ఆధిపత్యాన నడిచే కుటుంబాల పరిస్థితిని కూడా రుజువుగా చూపవచ్చు. (మొత్తం కుటుంబాలలో, స్త్రీలు నిర్వాహకులుగా ఉన్నవాటి పరిమాణాలను పదవ, పదకొండవ పట్టికలు సూచిస్తున్నాయి)

కుటుంబ నిర్వాహకులుగా స్త్రీలున్న కుటుంబాలు, వారి దారిద్ర్య స్థితి గతుల మీద, 1979-1989 సంవత్సరాల మధ్య జరిగిన 66 సర్వే ఫలితాలను ఇంటర్నేషనల్ రిశర్చి సెంటర్ ఫర్ ఉమెన్ కు చెందిన నిపుణులు పరిశీలించారు. పురుషుల ఆధిపత్యాన నడిచే కుటుంబాల కంటే, స్త్రీల ఆధ్వర్యాన నడిచే కుటుంబాలే అధిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నట్లు ఈ సర్వేలలోని 44 ధృవపరచాయి. మిగిలినవి ఇలాంటి స్పష్టమైన సూచనను చేయలేక పోయాయి. పురుషుల అధీనంలో నడిచే కుటుంబాల కంటే స్త్రీల ఆధిపత్యాన నడిచే కుటుంబాలకు దారిద్ర్యంలో చిక్కే ప్రమాదం అధికంగా ఉన్నది అన్న విషయంలో మాత్రం పైన పేర్కొన్న సర్వేలన్నీ ఏకాభిప్రాయాన్ని ప్రకటించాయి.

ఈ పరిణామం అభివృద్ధి చెందుతున్న లేక పేద దేశాలలో కంటే, అభివృద్ధి చెందిన దేశాలలో అధికంగా కనుపిస్తున్నది.

యునిసెఫ్ ప్రచురించిన 1990-92 సంవత్సరకాలపు అంచనాలు ఈ విషయాన్ని రుజువు చేస్తున్నాయి ఈ అంచనాలను పన్నెండవ పట్టికలో చూడవచ్చు యునెసెఫ్ ప్రకటించిన సమాచారం ప్రకారం, పారిశ్రామికంగా అభివృద్ధయిన అన్ని దేశాలలోనూ, స్త్రీలు నిర్వహిస్తున్న కుటుంబాలు దారిద్ర్యంలో చిక్కే ప్రమాదం అధికంగా ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ఆస్ట్రేలియా, కెనడా, అమెరికా దేశాలలో, స్త్రీలు నిర్వహిస్తున్న కుటుంబాలకు చెందిన పిల్లలలో సగం మందికి మించే దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు. ఆస్ట్రేలియా, నార్వే, అమెరికా దేశాలలో దారిద్ర్యాన్ని అనుభవిస్తున్న మొత్తం పిల్లలలో సగం మందికి మించే, స్త్రీలు నిర్వహిస్తున్న కుటుంబాలలో ఉన్నారు. అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలలోని స్త్రీలు నిర్వహించే కుటుంబ దారిద్ర్యాన్ని గురించి యునిసెఫ్ పేర్కొన్న అంశాలు గమనార్హమైనవి :

" 1960 వ సంవత్సరం తర్వాత, తల్లి లేకపోవటం చేత తండ్రిగాని, తండ్రి లేకపోవటంచేత తల్లిగాని నిర్వహించే కుటుంబాల సంఖ్య (సింగిల్ పేరెంట్ ఫామిలీస్ సంఖ్య) పెరుగ నారంభించినట్లు దీర్ఘకాలిక ప్రాతిపదిక మీద జరిగిన సర్వేలు రుజువు చేశాయి. ఈపరిణామపు ప్రధాన ఫలితం, దారిద్ర్యరేఖకు దిగువన జీవిస్తున్న తల్లులు, పిల్లల సంఖ్య పెరగటం అమెరికాలో తల్లిదండ్రు లిద్దరూ ఉన్న కుటుంబాలలోని పిల్లల కంటే, తల్లి నిర్వహించే కుటుంబాల లోని పిల్లలు, జాతీయ దారిద్ర్యరేఖకు దిగువనుండే అవకాశం ఐదురెట్లు అధికంగా ఉన్నది". (ది ప్రోగ్రెస్ ఆఫ్ నేషన్స్ - 1996)

గ్రామ సీమలలో .......

పట్టణ ప్రాంతాలలో కంటే, గ్రామీణ ప్రాంతాలలో దారిద్ర్యబాధ అధికమని, దారిద్ర్యరేఖకు దిగువనున్న జనాభా

కూడా అధికమని అందరకూ తెలుసు. ఇద్రిస్ జజెయిర్, మెహిద్దీన్ ఆలంఘీర్, థెరిజా పినాకియోలు, తాము వ్రాసిన "ది స్టేట్ ఆఫ్ వరల్డ్ రూరల్ పావర్టీ. ఏన్ ఇంక్వయిరీ ఇన్ టు ఇట్స్ కాజెస్ అండ్ కాన్సిక్వెన్సెస్" అన్న పుస్తకంలో గ్రామీణ పేద జనాభాకు సంబంధించిన సంఖ్యాపరమైన అంచనాల నిచ్చారు ప్రపంచంలోని గ్రామీణ స్త్రీలలో యాభయ్యైదు కోట్ల మంది దారిద్ర్యరేఖకు దిగువనున్నట్లు వీరంచనా వేశారు 1970 వ సంవత్సరం తర్వాత, పేద స్త్రీల జనాభా యాభైశాతం పెరిగితే, పేదలయిన పురుషుల జనాభా 30 శాతం మాత్రమే పెరిగినట్లు వీరు సూచించారు. స్త్రీలకు ఉత్పత్తి వనరులు లేకపోవటం, ప్రభుత్వ సర్వీసులు వీరికి అందకపోవటం, పరపతి సౌకర్యం లేకపోవటం, పరియావరణ పాడుబడుతూండటం, పురుషులు పట్టణ ప్రాంతాలకు పనిని వెదుక్కొంటూ వలసపోవటం వల్ల కుటుంబ పోషణాభారం స్త్రీల మీద పడటం, సాయుధ పోరాటాలు, తెగల తగవులూ విస్తరిస్తూండటం వల్ల కాందిశీకులుగా సర్వస్వం విడిచి పారిపోవలసి రావటం వంటి పలుకారణాలు, గ్రామీణ స్త్రీలు దారిద్ర్యాన్ని అధికంగా అనుభవించ వలసి రావటానికి దారిదీస్తున్నాయి.

### ఆపత్కాలంలో ఆదుకొనే ఆస్థులు

దరిద్రుల జీవితం నిత్యపోరాటం వంటిది. అది అంత త్వరగా ముగిసేది గాదు; విశ్రాంతిని కూడా ఇచ్చేది గాదు. దరిద్రులు ఈ జీవన సమరంలో మునిగి ఉండగా వారి చుట్టూ ఉన్న ప్రపంచం మారుతూంటుంది. ఈ మార్పుల వల్ల వారికి అవరోధాలు ఏర్పడవచ్చు. జీవన సమరంలో కొందరు బ్రతికి బయట బడగలిగితే, మరి కొందరు దీనిలోంచి బయట పడలేకపోవచ్చు. ఇంతకు ముందు పేదలుగా ఉన్నవారిలో కొందరు పేదరికం నుండి బయటబడగా, కొత్తవారు ఆ సుడి గుండంలో చిక్కు కొంటూ ఉంటారు; ముందు తరం వారికది వారసత్వంగా సిద్ధిస్తుంది.

ఆస్థులున్నవారు ఇటువంటి అవాంతరాల నుండి బయట పడటం, అవి లేనివారి కంటే సులభం. ఆస్థి ఆపత్కాలంలో ఆదుకొంటుంది. ఆస్థి అంటే పొలం, ఇల్లు, బంగారం, రొఖ్ఖరూపంలోని సంపద ఇవన్నీ అని అనుకొంటాం. ఇవన్నీ ఆర్థిక పరమైనవి, ఎకనామిక్ ఎసెట్స్. ఇవి గాక సాంఘిక, పరియావరణ, వ్యక్తిగత ఆస్థులు అనేవి కూడా ఉన్నాయని అర్థశాస్త్ర నిపుణులు చెబుతున్నారు. ఆఖరుకు కాలవ్యవధి (టైం) ని కూడా ఆస్థి లేక పెట్టుబడిగా నిర్వచిస్తున్నారు.[1]

ఇరుగు-పొరుగు వారితో నమ్మకంగా, సఖ్యతతో మెలగటం, అవసరమైనపుడు తనకు చేతనైన సహాయాన్ని ఇతరులకు చేయటం వల్ల, వారి విశ్వాసాన్ని చూరగొనవచ్చు. ఇలాంటి వారికి ఆపద సంభవిస్తే, ఇరుగు-పొరుగు వారు ఆదుకోవటానికి ప్రయత్నిస్తారు తనకు ఆపత్కాలంలో సహాయం చేయటానికి, ఇతరులను ప్రోత్సహించ గలిగిన శక్తిని, ఆ వ్యక్తి యొక్క సాంఘిక పెట్టుబడిగా పరిగణిస్తున్నారు.

భర్త చెప్పుచేతలలో మనవలసిన ఇల్లాలికి, ఆర్థిక పరమైన ఆస్థులుండటం గాని, భర్త కున్న ఆస్థి, డబ్బు వంటి వాటిమీద అధికార ముండటం గాని అరుదన్న విషయాన్ని ఇంతకు పూర్వమే చూచాం. అస్వతంత్రయైన స్త్రీ పైన వివరించిన సామాజిక పెట్టుబడిని కూర్చు కొనగలదని మనం ఆసించలేం. తానే అస్వతంత్ర అయినపుడు, ఆవిడ ఎవరికి చేయి అందించ గలదు? విశ్వకవి రవీంద్రనాధ్ ఠాకూర్ సృష్టించిన మృణాల్ ఇందుకు చక్కని ఉదాహరణ. వారు వ్రాసిన ఒక చిన్న కథలో ("ఎ వైఫ్స్ లెటర్") సమాజంలోనే గాదు, తన ఇంటిలో ఇల్లాలి అస్వతంత్రత ఎంతటిదో వీరు చక్కగా చిత్రించారు. గ్రామీణ యువతైన మృణాల్‌ను పట్టణంలోని సంపన్న కుటుంబీకులు తమ కుమారునకు చేసుకొంటారు. అత్తమామలు, భర్త ఆవిడను ఆదరంగా చూస్తారు. ఆవిడ సౌందర్యవతే గాక, తెలివి తేటలు, ఇంగిత జ్ఞానము కూడా గల మనిషి. మృణాల్ అత్తింటి వారికి బంధువయిన యువతిని, ఆవిడ వ్యతిరేకించినా, ఒక పిచ్చి వాడికిచ్చి పెండ్లి చేయటానికి ప్రయత్నాలు జరుగుతుంటాయి. ఆ యువతి, మృణాల్ పంచన జేరి, ఆఖరుకు దాసీగా నైనా సరే, ఈ ప్రమాదాన్ని తప్పించుకో గోరుతుంది. మృణాల్ కు కూడా ఆవిడను రక్షించాలని ఉంటుంది. మృణాల్ ఆ పిల్లను రక్షించటానికి విశ్వప్రయత్నం చేస్తుంది. కాని కుటుంబీకుల సహకారం లభించక, రక్షణా కార్యంలో కృతకృత్యురాలు కాలేకపోతుంది. తప్పని పెండ్లిని తప్పించు కోవటానికి ఆ అభాగ్యురాలు ఆత్మహత్య చేసుకొంటుంది. తన వైఫల్యంతో

## పేదరికానికి ప్రతిరూపంగా మారిన స్త్రీ

ప్రపంచంలో ఉన్న మొత్తం పేదల జనాభాను 130 కోట్లుగా అంచనా వేస్తున్నారు. వీరిలో నూరింట డెబ్భై మంది వరకూ స్త్రీలున్నారు! పేదరికానికి ప్రతిరూపంగా స్త్రీ రూపొందింది

సామాజిక ఆర్థికవనరుల వినియోగావకాశాలు తగినంతగా స్త్రీలకు లభించక పోవటమే ఈ దుస్థితికి మూలకారణం వీరి దారిద్ర్యం క్రమానుగతంగా పెరుగుతున్నది. గ్రామ సీమలలో జీవిస్తున్న పేద స్త్రీల జనాభా గత ఇరవైసంవత్సరాలలో యాభైశాతం పెరిగింది పెరుగుతున్న పేదరికం స్త్రీలనే అధికంగా ముంచెత్తుతున్నది.

పేదరికం, ఒక్క అభివృద్ధి చెందుతున్న లేక పేద దేశాలకే పరిమితమైనదని భ్రమించనవసరం లేదు. పారిశ్రామిక దేశాల స్త్రీలనూ ఇది విడిచి పెట్టలేదు. ఇందుకు ఉదాహరణగా అమెరికాను చూడవచ్చు. ఇరవయ్యవ శతాబ్దంలోని తొలి నలభై దశాబ్దాలకాలంలో, మొత్తం పేదల జనాభాలో స్త్రీల జనాభా నలభై శాతంగా ఉన్నది 1980 వ సంవత్సరం వచ్చేసరికి మొత్తం పేదలలో స్త్రీల జనాభా అరవైరెండు శాతానికి పెరిగింది.

లేబర్ మార్కెట్లో రాజ్యమేలుతున్న లింగవివక్ష, సామాజిక సంక్షేమ కార్యక్రమాల అమలులో తగినంత ప్రాధాన్యత స్త్రీలకు లభించక పోవటం, కుటుంబంలో తగిన హోదా, అధికారము స్త్రీకి లేకపోవటం ఈ దుస్థితికి కారణం.

*-హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1995 నుండి*

మనసు విరిగిన మృణాల్, సర్వ సుఖాలు లభిస్తున్నా, ఇక ఒక్క క్షణం కూడా అత్తవారింట్లో ఉండలేక వెళ్ళి పోతుంది. తన దురదృష్టం కొలదీ అందచందాలు, ఇంగితజ్ఞానము లభించాయని వాపోతుంది.

ఠాకూర్ దీనిని వంద సంవత్సరాలకు పూర్వం వ్రాసినా, ఇది ఈ నాటి కథ కాదనలేనంత వాస్తవంగా ఉంది. ఇలాంటి జీవితాన్ని గడప వలసిన ఇల్లాలు, ఇరుగు-పొరుగు వారికి తలలో నాలుకలా మెలిగే అవకాశా లెక్కడ ఉన్నాయి? ఇందువల్ల అర్థశాస్త్రవేత్తలు చెప్పిన సాంఘిక పెట్టుబడిని కూడ స్త్రీ కూర్చుకోలేక పోతున్నది. వ్యక్తిగత చొరవతో కూడబెట్టుకోగలిగిన ఈ సంపదకు కూడా ఆవిడ నోచుకోలేదు

పరియావరణ క్షీణిస్తూండటం వల్ల, ఇంతకు పూర్వం లభిస్తున్న సహజ సంపద అంతరిస్తూండటం చేత, పేదరికపు భారం పెరుగుతున్నది. వంట చెరకు, పశు గ్రాసం, కుటుంబావసరాలకు నీటిని సేకరించటానికి ఎక్కువ కష్టపడవలసి వస్తున్నది. ఇది శారీరకంగానే కాక, కాలవ్యవధి దృష్ట్యా కూడా భారమవుతున్నది.

చిరాస్థి, డబ్బుగాక వ్యక్తిగత ఆస్థి అంటూ ఒకటున్నట్లు అర్థశాస్త్ర నిపుణులు చెబుతున్నారు. వ్యక్తియొక్క సృజనాత్మక శక్తుల పెంపు, పటిష్ఠమైన ఆరోగ్య భాగ్యము ఈ తరగతికి చెందే ఆస్థి లేక సంపద. స్త్రీల సృజనాత్మక శక్తుల పెంపు, ఆరోగ్య రక్షణ వంటి విషయాలలో వారు ఎదుర్కొన వలసిన అవరోధాలను గురించి ఇంతకు పూర్వమే వివరించాం. కనుక ఈ వ్యక్తిగత ఆస్థి విషయంలోనూ స్త్రీ పేదరాలిగా మిగిలిపోయింది. రాజకీయ రంగంలోనూ, తన జీవితాన్ని ప్రభావితం చేసే అంశాలకు సంబంధించిన పాలసీ నిర్ణయంలోనూ ఆవిడకున్న నామమాత్రపు భాగస్వామ్యాన్ని గురించి కూడా వివరించాం. దారిద్ర్యాన్ని ప్రతిఘటించటానికి, ఆ సాగరాన్ని దాటటానికి అవసరమైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక, వ్యక్తిగత పెట్టుబడులు స్త్రీకి ఈ విధంగా కొరవడుతున్నాయి.

అంతేకాదు; ఆఖరుకు ప్రకృతి ఇస్తున్న కాలవ్యవధి కూడా ఆవిడకు కొరవడుతూండటం గమనించదగిన అంశం. రోజుకు ఉన్న ఇరవై నాలుగు గంటల కాలము, కొందరకు మితిమీరిన వనరైతే, మరి కొందరకు ఎటూ చాలని కాలవ్యవధిగా ఉంటున్నది. పిల్లలను కనటం, వారి పోషణ, సంరక్షణ, భర్త, అత్త మామలకు అవసరమైన సేవలను చేయటం, గృహ నిర్వహణ వంటి బాధ్యతలను నిర్వహించే వ్యక్తికి 24 గంటల కాలం చాలదు దీనికి తోడు, వేతనార్జన, లేక కుటుంబ వృత్తిలో పాల్గొనటం కూడా అవసరమైన

ఇల్లాలికి, కాలవ్యవధి మరింతగా కొరవడుతుంది కుటుంబానికి అవసరమైన మొత్తం పనిలో స్త్రీ నూరింట 53 వంతులను చేస్తుండగా పురుషుడు 47 వంతులను చేస్తున్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. తలకు మించిన పనిని ఇల్లాలు చేయవలసి వచ్చినపుడు ఇల్లాలు భర్తమీద గాక, తన పిల్లల మీద సహాయానికి ఆధారపడుతుంది. ఇంటి పనిలో దిగవలసిరావటం చేత పిల్లల చదువు-ముఖ్యంగా ఆడపిల్లల చదువు ఎలా నష్టపడుతున్నదీ చూచాం

ఇంటి దాపులో నీటివనరుంటే, కొంతకాలం కలసి వస్తుంది. పనికి పోవలసిన స్థలం ఇలాగే ఇంటికి దాపులో ఉంటే, రాక-పోకల కాలం కలిసివస్తుంది. అడవులు అంతరిస్తూండటం వల్ల, వంట చెరకు, పశు గ్రాసాల సేకరణకు ఎంత అధిక కాలాన్ని ఖర్చు చేయవలసి వస్తున్నదీ చూచాం. పరియావరణ చెడుతున్న కొలదీ ఆవిడకు కాలవ్యవధి కొరత పెరుగుతూ ఉంటుంది. ప్రభుత్వాలు సాంఘిక సేవల మీద పెట్టే ఖర్చులను తగ్గించు కొంటున్న కొలదీ పేదరాలికి కాల వ్యవధి కొరత పెరుగుతూంటుంది. కరెంటు, నీటివంటి వాటి సరఫరా వసతి, గ్రామంలో విద్య, వైద్య చికిత్సా వసతుల కల్పన పేదరాలికి ఎంత కాలవ్యవధిని పొదుపు చేయగలవో ఊహించటం కష్టంకాదు. దారిద్ర్య కూపం నుండి ఉద్ధరించలేక పోయినా, ఇటువంటి వసతులు వారికి చేయూతగానైనా తోడ్పడతాయి. ప్రకృతి ఇస్తున్న కాలవ్యవధి కూడా పనిభారం వల్ల పేదలకు తగినంత పెట్టుబడిగా ఉపకరించటం లేదు.

పైన పేర్కొన్న ఆస్థులలో ఒకటి తరిగితే దాని వల్ల రెండవది బలహీనపడవచ్చు. ఆర్థిక మాంద్యం వచ్చి, నిరుద్యోగం ప్రబలితే, కుటుంబంలో కలతలు రేగుతాయి; స్త్రీ హింస కూడా ప్రారంభం గావచ్చు. ఆర్థిక ఇబ్బందులను దాటటానికి పిల్లల శ్రమ మీద అధికంగా ఆధారపడవలసి రావచ్చు. ఈ భారాన్ని మోయటానికి పిల్లలు ఇష్టపడక ఎదురు తిరగవచ్చు. వీరు అటు చదవక, ఇంటి పనిచేయక, తిరుగుబోతులుగా మారవచ్చు. వారిని అదుపు చేసే కాలవ్యవధి కూడా తలిదండ్రులకుండదు గనుక, వారి జీవితమే చెడవచ్చు. పరియావరణ చెడుతున్న కొలదీ, ప్రకృతి సిద్ధంగా లభించే సంపద తరగటమేగాకుండా కాలవ్యవధి మీద కలిగే వత్తిడిని, పెరిగే పనిభారాన్ని గురించి ఇంతకు పూర్వమే చూచాం.

అంతరిస్తున్న ఆస్థుల పరిమాణము, వైవిధ్యం పెరుగుతున్న కొలదీ, అనుభవించవలసి వచ్చే దారిద్ర్యం కూడా బలపడుతూ ఉంటుంది ఈ పరిణామాలు ఆగనపుడు అది శాశ్వతమవుతుంది: భావితరం వారికి తలిదండ్రులు మిగిల్చి పోగల "ఆస్థి" పేదరికమే అవుతుంది.

పేదరికంలో చిక్కిన శ్రీదేవి విముక్తికి రూపొందించే కార్యక్రమంలో, పైన పేర్కొన్న వనరులు లేక పెట్టుబడుల మధ్య నున్న అవినాభావ సంబంధాన్ని మరువకూడదు. అలాగే సంపద సేకరణకు స్త్రీ పురుషు లవలంబిస్తున్న విధానాల లోని తేడాలను కూడా మరువకూడదు. దారిద్ర్యాన్ని అనుభవించటంలో స్త్రీ పురుషుల మధ్య నున్న భిన్నత్వాన్ని కూడా మరువకూడదు.

స్త్రీ పురుష సమానత్వ సాధన జరుగకుండా దారిద్ర్యపు తొలగింపు అసాధ్యం. కనుక దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమంలో స్త్రీ పురుష సమానత్వ సాధనా లక్ష్యం విధిగా ఉండాలి. ఇందుకు దిగువ పేర్కొన్న చర్యలను తీసుకోవాలని యు యన్ డి పి నిపుణులు సూచించారు :

1. బాలిక పుట్టిన దగ్గర నుండి ఆవిడ మనుగడకు అవసరమైన రక్షణా చర్యలను తీసుకోవాలి. పెంపకం, ఆరోగ్యం, విద్యార్జనా విషయాలలో ఇపుడు కనుపిస్తున్న అన్ని రకాల వివక్షనూ అంతమొందించాలి;

2. పురుషులతో సమానమైన హక్కులను స్త్రీల కివ్వాలి. భూమి మీద హక్కులివ్వాలి; పరపతి సౌకర్యాన్ని పొందే అధికార ముండాలి; వివక్షకు తావులేని ఉద్యోగావకాశాలు ఉండాలి.

3. స్త్రీ హింస దారిద్ర్యపు అదృశ్యరూపం. ఇది సర్వత్రా తాండవిస్తున్నది. దీనిని అంతమొందించటానికి పటుతరమైన చర్యలను తీసుకోవాలి.

స్త్రీ-పురుష సమానత్వ సాధనకు తీసుకొనే ప్రతి సృజనాత్మక చర్యా, దారిద్ర్యపు తొలగింపు కృషికి బలాన్నిస్తుంది. దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమాలు స్త్రీల హక్కులను రక్షించలేకపోతే, సమాజమే బలహీనపడుతుంది.

# 22

## స్త్రీ-పురుష అసమానతా పరిమాణాల నిర్ణయానికి కొన్ని కొలమానాలు

మానవ సృజనాత్మక శక్తుల అభివృద్ధికి సామాజికు లందరకూ సమానావకాశాలు లభించాలి. సమాజంలో సగభాగంగా ఉన్న స్త్రీలను ఈ అభివృద్ధి ప్రభావితం చేయలేనపుడు వారిని పురుషుల తోటి సమాన స్థాయికి ఉద్ధరించలేనపుడు, అది ఒక్క వర్గం వారికే ఉపకరిస్తుంది; స్త్రీల యెడల వివక్షా ప్రదర్శనకు నిదర్శనంగా నిలిచి ఉంటుంది సాంకేతికాభివృద్ధి శరవేగంతో పురోగమిస్తున్నా, ఆధునిక నాగరికత త్వరితగతిని విస్తరిస్తున్నా, ఆభివృద్ధి అవకాశాలు పురుషులతో సమంగా స్త్రీలకు లభించకపోవటం, ఈ అభివృద్ధి క్రమం మీద మచ్చగా మిగిలిపోతున్నది. ఇది స్త్రీలకు జరుగుతున్న అన్యాయంగా ప్రదర్శితమవుతున్నది.

దురదృష్టవశాత్తూ, ఏ సమాజంలోనూ (అది అభివృద్ధి చెందినదైనా, వెనుకబడినదైనా) స్త్రీలకు పురుషులతోడి సమానమైన అవకాశాలను అనుభవించటానికి తగిన పరిస్థితులు లేవు. ఈ విషయంలో అసమానతలు క్రమంగా తగ్గుతున్నా, అవసరమైన మేరకు అవి తగ్గటంలేదు, అందువల్ల ఇది ఇంకా "అసమాన ప్రపంచం" గానే ఉన్నది. స్త్రీ పురుష అసమానతలు ఏ దేశంలో ఎంత పరిమాణంలో ఉన్నదీ, స్థూలంగానైనా సూచించే సూచికలను యు.ఎన్.డి.పి. నిపుణులు రూపొందించారు. ఏ దేశాలు, స్త్రీ పురుష సమానత్వ సాధనలో ఏ స్థాయిలో ఉన్నదీ, ఈ పరిస్థితిని చక్కదిద్దటానికి ఎంత కృషిని చేయవలసి ఉంటుంది అన్న అంశాల అవగాహనకు ఈ సూచికలు వినియోగపడతాయి. వాటి నిచట సంక్షిప్తంగా తెలియజేస్తాం.

### అభివృద్ధి సూచికలు

మానవ అభివృద్ధి లేక మానవ జీవనాభివృద్ధిని చిత్రించే సూచికను తొలుత వీరు రూపొందించారు; దీన్ని "హ్యూమన్ డెవలప్‌మెంట్ ఇండెక్స్" అన్నారు. దీని సంక్షిప్తనామాన్ని "హెచ్ డి ఐ"గా సూచించారు. ఈ సూచీ తయారీకి మానవ జీవితకాల పరిమాణాన్నీ, విద్యార్జనా స్థాయిని, స్వయంపోషణకు అవసరమైన ఆదాయార్జనా పరిమాణాన్ని ప్రాతిపదికగా తీసుకొన్నారు. మనిషి వీలయినంత అధిక కాలం జీవించగలగటమే గాదు, ఆ జీవిత కాలం ఆరోగ్య ప్రదంగానూ, సుఖమయంగానూ ఉండాలి. విద్యార్జన అంటే ఏదో చదవటం గాదు; ఉద్యోగార్హత సంపాదనతోపాటు, విజ్ఞానార్జన కూడా జరిగి ఉండటం వ్యక్తి యొక్క మనోవికాసానికి అవసరం.

సుఖంగా జీవించటానికి తగినంత ఆదాయాన్ని కూడా వ్యక్తి ఆర్జించే అవకాశాలుండాలని ఈ నిపుణులు భావించారు. పైన పేర్కొన్న అంశాలకు వాటి ప్రాధాన్యతలకు తగినట్లు విలువలు గట్టారు. ఆ విలువల ప్రాతిపదిక మీద దేశాలకు స్కోరును తయారు చేశారు ఆయా దేశాలు ప్రచురించిన అధికార సమాచారాన్ని ఆధారంగా చేసుకొని, యు ఎన్ డి పి నిపుణులు ఈ సూచీని రూపొందించారు.

ఆరోగ్యప్రదము, సుఖమయము అయిన జీవితాన్ని మానవుడు గడపగల అవకాశాలున్న దేశానికి సూచీ సంఖ్య ఒకటయినపుడు, అంతకంటే నాసిగా ఉండే జీవితాన్ని అనుభవిస్తున్న దేశ ప్రజల సూచీ సంఖ్య ఒకటి కంటే తక్కువగా ఉంటుంది ఒకటి కంటే తక్కువగా ఉండే సంఖ్యను ఫ్రాక్షన్ అని అంటారు. 1/2, 1/4, 1/8 వంటి వాటిని ఇందుకు ఉదహరించవచ్చు. దశాంశ పద్ధతిలో కూడా వీటిని సూచించవచ్చు ఉదాహరణకు 0.50, 0.25, 0.13. వీటిని అర్థం చేసుకోవటం సామాన్యులకు కొంచెం కష్టంగావచ్చు. కనుక వీరి సౌలభ్యం కోసం, మానవ జీవితం అత్యుత్తమంగా ఉన్న దేశానికి, సూచీగా, యు ఎన్ డి పి నిపుణులు సూచించిన ఒకటి సంఖ్యకు బదులు, మేము వంద లేక నూరును (100ను) స్వీకరించాం. ఇంత కంటె తక్కువ సూచీ ఉన్న దేశాల ఫ్రాక్షన్లను దీనికి అనుగుణంగా సవరించి సంపూర్ణ సంఖ్యలుగా (50, 25, 13 వలె) ఇచ్చాం. నూరు పాయింట్లున్న సూచీ లేక స్కోరు, అభిలషించదగిన అభివృద్ధికి కొలమాన మైనపుడు, నిర్ణీత దేశానికి 50 పాయింట్ల సూచీ లేక స్కోర్ లభించినపుడు, ఆశించదగిన అభివృద్ధిలో సగభాగాన్ని మాత్రమే ఆ దేశం సాధించింది అన్న అంశం సులభంగా అర్థమవుతుంది.

సమాజంలోని పురుషుల జీవన స్థాయి కంటే స్త్రీల జీవన స్థాయి, జీవన పరిస్థితులు నాసిగా ఉన్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. జీవితకాల పరిమాణం, విద్యార్జనా స్థాయి, ఆదాయార్జనా స్థాయీ పరిమాణాలలో స్త్రీ పురుషుల మధ్యనున్న భేదాల పరిమాణాన్ని ప్రాతిపదికగా తీసుకొని ఈ నిపుణులు స్త్రీల అభివృద్ధిని సూచించే మరొక సూచికను రూపొందించారు. దీన్ని "జెండర్-రిలేటెడ్ డెవలప్‌మెంట్ ఇండెక్స్" అన్నారు. "జి డి ఐ" అన్న సంక్షిప్త నామాన్ని దీనికిచ్చారు. సమాజంలో చలామణీలో నున్న స్త్రీ పురుష అసమానతల పరిమాణ సూచికగా కూడా మనం దీనిని స్వీకరించవచ్చు మానవ సృజనాత్మక శక్తుల అభివృద్ధి విషయంలో స్త్రీలు అనుభవిస్తున్న వెనుకబాటు తనానికిది కొలమానం యు ఎన్ డి పి నిపుణులు ఈ సూచికను 130 దేశాలకు తయారు చేసి, 1995వ సంవత్సరం రిపోర్టులో ఇచ్చారు.

స్త్రీలు అనుభవిస్తున్న అసమానతలలో, జెండర్-రిలేటెడ్ డెవలప్‌మెంట్ ఇండెక్సు చిత్రించలేని కొన్ని అంశాలు కూడా ఉన్నాయి. ఈ సూచీ, స్త్రీ ఆర్థికార్జనా స్థాయిని చిత్రించగలుగుతున్నది గాని, కుటుంబీకుల మధ్య దాని పంపకం ఎలా జరుగుతున్నది అన్న విషయాన్ని గాని, దీని వల్ల లభించే పోషణలో, దీనిని సంపాదించిన స్త్రీకి ఎంత వాటా గిడుతున్నది అన్న విషయాన్ని గాని ఇది చిత్రించలేకపోతున్నది కొన్ని కుటుంబాలలో, తాను సంపాదించిన ఆదాయవాడకం మీద కూడా ఆ స్త్రీకి అధికారం ఉండకపోవచ్చు తాను సంపాదించక పోయినా, భర్త మంచివాడు కావటం చేత, తన సంపాదనను కుటుంబానికి వాడే అవకాశాన్నతడు తన భార్యకు ఇచ్చి ఉండవచ్చు పరిగణించ దగినంతటి ఆదాయాన్ని స్త్రీ కుటుంబానికిస్తున్నా, ఆ కుటుంబంలో ఆవిడకు కనీస గౌరవం కూడా లభించక, పరాధీనగా బ్రతుక వలసిన స్థితి దాపురించవచ్చు. ఇటువంటి అసమానతలను, స్త్రీలనుభవిస్తున్న అననుకూలతలను ఈ సూచిక చిత్రించలేక పోతున్న విషయాన్ని నిపుణులు పాఠకులకు గుర్తు చేశారు.

ఈ జి డి ఐ సూచికలో తొలి నాలుగు స్థానాలను, నార్డిక్ దేశాలుగా వ్యవహరితమవుతున్న స్వీడన్, ఫిన్లండ్, నార్వే, డెన్మార్క్ దేశాలు ఆక్రమిస్తున్నాయి. ప్రథమ స్థానంలో ఉన్న స్వీడన్‌కు జిడిఐ సూచిక 92గా ఉండగా, నాల్గవ స్థానంలోని డెన్మార్క్‌కు సూచిక 90గా ఉన్నది. ఈదేశాల ప్రభుత్వాలు స్త్రీపురుష సమానత్వ సాధనను ఒక రాజకీయ లక్ష్యంగా పెట్టుకొని వ్యవహరిస్తూండటమే ఈ అభివృద్ధి స్థాయికి నిదర్శనమని యు యన్ డి పి నిపుణులు సూచించారు.

బహమాస్, సింగపూర్, ఉరుగ్వే, థాయ్‌లెండ్ వంటి అభివృద్ధి చెందుతున్న కొన్ని దేశాలు, ర్యాంకింగ్‌లో 33వ స్థానానికి ఎగువనే ఉండటం గమనార్హం. శ్రీలంక 66 పాయంట్లతో 58వ స్థానములోనూ, 40 పాయంట్లతో

భారతదేశము 99వ స్థానములోనూ, 36 పాయింట్లతో పాకిస్తాన్ 103వ స్థానంలోనూ ఉన్నాయి కమ్యూనిష్టు పాలిత దేశాలలో జిడిఐ స్థాయి, వీటికంటే చాలా అధికంగా ఉన్నది. డెబ్బైమూడు పాయింట్లతో క్యూబా 47వ స్థానంలో ఉండగా, 58 పాయింట్లతో చైనా 71వ స్థానంలోనూ, 54 పాయింట్లతో వియత్నాం 74వ స్థానంలోనూ ఉన్నాయి.

ఈ ర్యాంకింగులో అట్టడుగున ఉన్న ఆఫ్ఘనిస్థాన్ సియెరా లియోన్, మాలి, నైజర్, బర్కీనా ఫాసోలు అభివృద్ధిలో వెనుకబడి ఉండటం చేత, వీటి మానవ జీవిత అభివృద్ధి స్థాయి కూడా తక్కువగా ఉన్నది ఇందువల్ల, ఈ దేశాల స్త్రీలు రెండు రకాల నష్టాలకు గురవుతున్నారు. అభివృద్ధిలేమి వల్ల సంక్రమించిన వెనుకబాటుతనం చాలదన్నట్లు, జరిగిన కొద్ది అభివృద్ధిలోనూ న్యాయమైన భాగాన్ని లింగ వివక్ష మూలంగా స్త్రీలు అనుభవించ లేకుండా ఉన్నారు

మానవ జీవన అభివృద్ధి (హెచ్ డి ఐ) సూచీకి సంబంధించిన ర్యాంకింగ్ కంటే, జెండర్-రిలేటెడ్ డెవలప్‌మెంట్ సూచీ (జిడిఐ) మెరుగ్గా ఉండటం అనేది, అభివృద్ధి చెందిన దేశాలలో మాత్రమేగాక, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ కనుపిస్తుండటం గమనించదగిన అంశం. అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలుగా గుర్తింపు పొందిన స్వీడన్, డెన్మార్క్, ఫిన్లండ్, నార్వేలతోపాటు, తూర్పు యూరపులోని పోలెండ్, హంగరీ, జెక్‌రిపబ్లిక్, స్లవాకియాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలుగా వర్గీకరణను పొందుతున్న బార్బడోస్, మలేషియా, శ్రీలంక, తాయ్‌లెండ్, జమైకా, క్యూబా దేశాలు ఇలాంటి స్థానంలో ఉండటం విశేషాంశం. ఈ దేశాలన్నీ, స్త్రీ పురుష భేదం లేకుండా, విద్య, ఆరోగ్యాభివృద్ధి సాధనకు అధికంగా పెట్టుబడులు పెట్టి, కార్య సాధనకు కృషిచేశాయి. ఇందువల్ల స్త్రీల సృజనాత్మక శక్తుల అభివృద్ధికి, వారి ఆదాయార్జనా శక్తి పెంపుకూ మార్గం సుగమమైంది. ఇతర దేశాలలో కంటే ఈ దేశాలలో స్త్రీ జనోద్ధరణకు అధిక కృషి జరిగినట్లు యు యన్ డి పి నిపుణులు అభిప్రాయ పడ్డారు. దేశ ఆదాయ స్థాయిగాని, రాజకీయ భావాలు, విధానాలు గాని, సంస్కృతీ, సంప్రదాయాలు గాని, దేశం యొక్క అభివృద్ధి స్థాయీ దశలుగాని, స్త్రీజనోద్ధరణకు ఆటంకాలుగావనీ, కావలసినదల్లా, పాలకుల రాజకీయ పరమైన కృతనిశ్చయమని ఈ పరిణామం సూచిస్తున్నట్లు ఈ నిపుణులు నిర్వచించారు

కొన్ని అభివృద్ధి చెందిన దేశాలు, హెచ్ డి ఐ ర్యాంకింగ్‌లో పైన ఉన్నా, జి డి ఐ ర్యాంకింగ్‌లో దిగువ స్థానాలలో ఉండటం కనుపిస్తుంది తొంభయ్యైదు పాయింట్లతో హెచ్ డి ఐ ర్యాంకింగ్‌లో 27వ స్థానంలోనున్న లెగ్జెంబర్గ్, జి డి ఐ ర్యాంకింగ్‌లో 35వ స్థానంలో ఉన్నది. తొంభై నాలుగు పాయింట్లతో, హెచ్ డి ఐ ర్యాంకింగ్‌లో నాల్గవ స్థానాన్ని ఆక్రమించ గలిగిన నెదర్లెండ్స్, జి డి ఐ ర్యాంకింగ్‌లో 85 పాయింట్లతో 20వ స్థానంలో నిలిచింది! హెచ్ డి ఐ ర్యాంకింగ్‌లో తొమ్మిదవ స్థానంలో ఉన్న స్పెయిన్, జిడిఐ ర్యాంకింగ్‌లో 34వ స్థానంలో ఉన్నది. ఈ నాలుగు దేశాలలోనూ, విద్య, ఆరోగ్య విషయాలలో స్త్రీ పురుషుల మధ్య చెప్పదగిన వ్యత్యాసం లేదు. పురుషుల సంపాదన కంటే స్త్రీల సంపాదన తక్కువగా ఉండటంవల్ల జి డి ఐ సూచికలో ఇవి దిగువ స్థానాలకు వెళ్ళినట్లు నిపుణులు సూచించారు. పురుషుల కంటే తక్కువమంది స్త్రీలు వేతనార్జనకు వెళుతూండటం, పురుషుల వేతనార్జనకంటే, స్త్రీల ఆర్జన తక్కువగా ఉండటం, ఈ పతన కారణంగా వీరు వివరించారు జి డి ఐ ర్యాంకింగ్‌లో ప్రధమ స్థానాన్ని అలంకరించిన స్వీడన్‌లో పురుషుల ఆర్జనలో స్త్రీల ఆర్జన 71 శాతం వరకూ ఉండగా పైన పేర్కొన్న దేశాలలో ఇది 23 నుండి 41 శాతం మధ్యలో మాత్రమే ఉన్నట్లు వీరు చూపారు.

అభివృద్ధి చెందిన దేశాలు, విద్య, ఆరోగ్య పోషణాది విషయాలలో స్త్రీ పురుషుల స్థాయీ భేదాలను చాలా వరకూ అంతరింప చేశాయి. అందుచేత సృజనాత్మక శక్తుల అభివృద్ధి విషయంలో స్త్రీ పురుష స్థాయీ భేదం బాగా తగ్గింది. అందువల్ల స్త్రీ పురుష సమానత్వ సాధనా సమస్య, ఈ దేశాలలో ఈ రంగాల నుండి ఇపుడు ఆర్థిక రాజకీయ రంగాలకు మళ్ళింది.

లాటిన్ ఆమెరికా దేశాలలో హెచ్ డి ఐ సూచీ కంటే జి డి ఐ సూచీ పది నుండి ఇరవై శాతం వరకూ తక్కువగా ఉన్నది. జీవనాభివృద్ధిలో పురుషుల కంటే స్త్రీలు అధిక అసమానతలను అనుభవిస్తూండటానికి నిదర్శనంగా దీనిని నిపుణులు భావించారు. కరిబియన్ ప్రాంతంలో ఈ అసమానతలు, లాటిన్ అమెరికాలో కంటే తక్కువగా ఉండటం కనుపిస్తుంది. హెచ్ డి ఐ కంటే జి డి ఐ బహమాస్‌లో ఏడు

శాతము, క్యూబాలో ఆరు శాతము, బార్బడోస్‌లో రెండు శాతం మాత్రమే తక్కువగా ఉండటాన్ని ఇందుకు నిదర్శనంగా నిపుణులు చూపారు.

అభివృద్ధిలో స్త్రీ పురుష అసమానతలు లాటిన్ అమెరికాలో కంటే సబ్-సహారన్ ఆఫ్రికాలో తక్కువగా ఉన్నాయి. విద్య, ఆరోగ్య పోషణాది విషయాలలో, సబ్-సహారన్ ఆఫ్రికాలో జరిగిన అభివృద్ధే తక్కువగా ఉన్నది అందువల్ల అభివృద్ధిలో స్త్రీ పురుష అసమానతల తీవ్రత కూడా తక్కువగా ఉన్నది. ఈ ప్రాంతపు దేశాల హెచ్ డి ఐ కంటే జి డి ఐ పరిమాణం పదిశాతం కంటే తక్కువగా మాత్రమే ఉన్నది.

ఆసియాలో కూడా వీటి పరిమాణ భేదం, చాలా దేశాలకు పదిశాతం కంటే తక్కువగానే ఉన్నది. ఇది ఎక్కువగా ఉన్న దేశాలలో దక్షిణ కొరియా (12 శాతము) పాకిస్తాన్ (25 శాతము) చెప్పదగినవి.

అరబ్బు దేశాలలో ఈ సూచికల పరిమాణ భేదం 20 శాతం కంటే అధికంగానే ఉన్నది. ఈ దేశాలలో ఇటీవలి కాలంలో మానవ జీవన అభివృద్ధి వేగం పెరిగినా, స్త్రీ పురుష అసమానతల తీవ్రత చెప్పదగినంతగా తగ్గలేదు. ఈ ప్రాంత దేశాలలో ట్యునీషియా పరిస్థితి మెరుగుగా ఉన్నది. ఈ దేశపు హెచ్ డి ఐ కంటే జి డి ఐ 16 శాతం మాత్రమే తక్కువగా ఉన్నది. ఈ భేదం లిబియాలో 30 శాతం, సౌదీ అరేబియాలో 33 శాతమూ ఉన్నది.

(ఇతర దేశాల స్కోర్లను, అధ్యాయం చివరనున్న పట్టికలో చూడవచ్చు)

ఈ విశ్లేషణల ప్రాతిపదిక మీద యు యన్ డి పి నిపుణులు కొన్ని నిర్ణయాలకు వచ్చారు :

1. పురుషునితో సమానమైన స్థానాన్ని, స్త్రీకి, ప్రపంచంలోని ఏ సమాజమూ ఇవ్వటంలేదు. జెండర్-రిలేటెడ్ డెవలప్‌మెంట్ సూచీ (జి డి ఐ) ఈ విషయాన్ని ధృవ పరుస్తున్నది. స్త్రీ పురుష సమానత్వమున్నపుడు, ఈ సూచీ ప్రకారం స్కోర్ వంద పాయింట్లుండాలి. ఏ దేశానికీ ఇంతటి స్కోర్ రాలేదు. అన్ని దేశాల కంటే అత్యధిక స్కోరును (92) స్వీడన్ సాధించింది. యు యన్ డి పి నిపుణులు 130 దేశాలకు జిడిఐ స్కోరును తయారు చేశారు. ఈ దేశాల సగటు స్కోర్ 60 పాయింట్లుగా మాత్రమే ఉన్నది దీనిని బట్టి స్త్రీ పురుష సమానత్వ సిద్ధికి ఇంకా సాధించవలసింది అధికమేనని స్పష్టమవుతున్నది. (ఇప్పటికి సాధించింది, నూరింట 60 వంతులు, ఇంకా సాధించవలసింది 40 వంతులున్నది.) యు యన్ డి పి నిపుణులు, జిడిఐ స్కోర్‌ను రూపొందించిన 130 దేశాలలోని 45 దేశాల స్కోరు యాభై కంటే తక్కువగానే ఉన్నది. ఈ దేశాలలో ప్రజల జీవన స్థాయీ ప్రమాణమే తక్కువగా ఉండటానికి తోడుగా, స్త్రీ పురుష అసమానత కూడా అధికంగా ఉన్నట్లు, ఈ విధంగా స్త్రీలు రెండు రకాల అననుకూలతలను అనుభవించవలసి వస్తున్నట్లు వీరు అభిప్రాయ పడ్డారు. జి డి ఐ స్కోర్, ఈ నూట ముప్ఫై దేశాలలోని 32 దేశాలలో మాత్రమే 80 పాయంట్ల వరకూ ఉన్నది. దీనిని బట్టి అభిలషించదగిన స్థాయిలో స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించగలిగింది అతికొద్ది దేశాలేనని వీరు నిర్ణయించారు.

2. స్త్రీ పురుష సమానత్వ సాధనా పరిమాణం, దేశం యొక్క అభివృద్ధి స్థాయి మీద ఆధారపడి లేదు. దేశ ప్రజల తలసరి జాతీయాదాయ పరిమాణాన్ని, జి డి ఐ స్కోరుతో చూచినపుడు, ఈ విషయం స్పష్టమవుతుందన్నారు. సౌదీ అరేబియా ప్రజల తలసరి ఆదాయంలో, ఐదవ వంతు తలసరి ఆదాయం మాత్రమే గలిగిన చైనా, జి డి ఐ ర్యాంకింగ్‌లో, ఈ దేశం కంటే పై స్థానంలో ఉండటాన్ని ఈ నిపుణులు ఉదహరించారు. జి డి ఐ స్కోర్ 58తో చైనా 71 ర్యాంకులో ఉండగా, 51 స్కోర్‌తో సౌదీ అరేబియా పది ర్యాంకులు దిగువ స్థానంలో (81) ఉన్నది. చైనా కంటే కూడా పేదదనదగిన క్యూబా 72 స్కోర్‌తో 47 ర్యాంకును సాధించటాన్ని మనం గమనించాలి. స్పెయిన్ ప్రజల తలసరి ఆదాయంలో తాయ్‌లెండ్ ప్రజల తలసరి జాతీయదాయం సగముంటుంది. అయినా, ఎనభై జి డి ఐ స్కోరుతో తాయ్‌లెండ్ 33వ ర్యాంకులో ఉండగా, స్పెయిన్ దానికంటే దిగువ స్థానంలో (34) ఉన్నది. సిరియా, పోలెండ్ ప్రజల తలసరి జాతీయాదాయాలు దాదాపు సమంగా ఉన్నాయి. అయినా, 84 జిడిఆర్ స్కోరుతో పోలెండ్ 22వ ర్యాంకులో ఉండగా, సిరియా 57 స్కోర్‌తో 72వ స్థానంలో (చైనాకంటే కూడా ఒక స్థానం దిగువలో) ఉన్నది. దేశ అభివృద్ధి దశ, సంపన్నత

ఏ స్థాయిలో ఉన్నా, తలుచుకొంటే స్త్రీ పురుష సమానత్వ సాధన సాధ్యమేనని, ఈ పోలికల ఆధారంతో నిపుణులు స్పష్టం చేశారు. ఈ కార్యసాధనకు అవసరమైనది రాజకీయ పరమైన దీక్షా, కృత నిశ్చయంగాని, అపార ధనరాసులు మాత్రమే కాదన్నారు.

3. స్త్రీ పురుష సమానత్వ సాధనా కృషి కొనసాగుతూనే ఉన్నది గత రెండు దశాబ్దాల కాలంలోనూ దీని సత్ఫలితాలు కనుపిస్తున్నాయి. స్త్రీ జనాభ్యుదయం కనుపిస్తున్నది. కాని సాధించిన దానికంటే సాధించవలసిందే అధికంగా ఉన్నది అని ఈ నిపుణులు స్పష్టం చేశారు 1970వ సంవత్సరం నుండి దేశాల జి డి ఐ స్కోర్ పెరగటం కనుపిస్తున్నది ఈ విషయంలో అభివృద్ధిని సాధించ నారంభించిన యే ఒక్క దేశమూ వెనుకంజ వేయక అభివృద్ధి పథంలో పయనిస్తూండటాన్ని గమనించ దగిన అంశంగా నిపుణులు గుర్తించారు. దేశాలు సాధిస్తున్న అభివృద్ధి స్థాయి ఒకే విధంగా లేదు. తీవ్రమైన హెచ్చు తగ్గులున్నాయన్నారు. యు యన్ డి పి నిపుణులు 79 దేశాలకు, 1970, 1990 సంవత్సరాలకు జి డి ఐ సూచీని తయారు చేసి, ఆయా దేశాల కార్యసాధనా పరిమాణాలను పోల్చి చూచారు. ఈ దేశాలన్నిటి జి డి ఐ సగటు స్కోర్ 1970వ సంవత్సరంలో 43 పాయింట్లుగా ఉన్నది, 1990వ సంవత్సరానికి 64కు పెరిగింది. ఈ రెండు దశాబ్దాల కాలంలోనూ స్కోర్ 48శాతం పెరిగింది పారిశ్రామిక దేశాల సగటు జి డి ఐ స్కోర్ 1970వ సంవత్సరంలో 69గా ఉన్నది, 1990వ సంవత్సరానికి 87కు పెరిగింది. ఈ రెండు దశాబ్దాల కాలంలోనూ పెరిగిన జిడిఐ స్కోర్ పరిమాణం 28 శాతంగా తేల్చారు. అభివృద్ధి చెందిన దేశాల సగటు స్కోర్ 1970లో 35 పాయింట్లుగా ఉన్నది, 1990వ సంవత్సరానికి 56కు పెరిగింది. ఈ దేశాలు ఈ రెండు దశాబ్దాల కాలంలోనూ 62 శాతం మేరకు అభివృద్ధిని సాధించాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలు, అతి తక్కువ స్థాయీ దశ నుండి అభివృద్ధి సాధనను ప్రారంభించటం వల్ల, ఇవి సాధించిన అభివృద్ధి రేటు పారిశ్రామిక దేశాల అభివృద్ధి రేటు కంటే అధికంగా కనుపిస్తున్నట్లు నిపుణులు సూచించారు.

ఈ ఇరవై సంవత్సరాల కాలంలోనూ, మహిళ ఆర్జన పరిమాణపు పెరుగుదల వల్ల, కేవలం మూడు దేశాల (స్వీడన్, ఫిన్లండ్, నార్వే) జి డి ఐ స్కోర్ మాత్రమే పెరిగింది. మరికొన్ని పారిశ్రామిక దేశాలలోనూ ఇలా జరిగింది. కాని అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ, వెనుక బడిన దేశాలలోనూ, విద్య, ఆరోగ్య వసతుల పెరుగుదల వల్లనే ప్రధానంగా జి డి ఐ స్కోరు పెరిగింది ఇందుకు అరబ్బు దేశాల అనుభవాన్ని ఉదాహరణగా చెప్పవచ్చు. అరబ్బు దేశాలలో 1970లో స్త్రీల ఆర్జన, పురుషుల ఆర్జనలో ఎనిమిదింట ఒక్క వంతుగా ఉండేది; 1990వ సంవత్సరం వచ్చేసరికి ఇది నాల్గింట ఒక్క వంతుకు మాత్రమే పెరిగింది. సౌదీ అరేబియాలో, ఆ దేశపు జి డి ఐ పెరుగుదలకు, విద్యావసతుల పెరుగుదల 43 శాతము, జీవితకాల పరిమాణపు పెరుగుదల 33 శాతము మేరకు కారణంకాగా, స్త్రీల ఆదాయార్జన పెరుగుదల జి డి ఐ పెరుగుదలకు 24 శాతం మాత్రమే కారణమైంది. లాటిన్ అమెరికా, కరిబియన్, తూర్పు ఆసియా, దక్షిణ ఆసియా దేశాలలోనూ స్త్రీల విద్యా, వైద్య వసతుల పెరుగుదలే జి డి ఐ స్కోరు పెరుగుదలకు ప్రధాన కారణంగా కనుపిస్తున్నది. సబ్-సహారన్ ఆఫ్రికా దేశాల జి డి ఐ స్కోర్ చాలా తక్కువగా ఉంది ర్యాంకింగ్‌లో కూడా ఈ ప్రాంతపు దేశాలు అట్టడుగున ఉన్నాయి.

## గగన కుసుమాలుగా ఉన్న కీలక పదవులు

నార్డిక్ దేశాలవలె, ఇతర పారిశ్రామిక దేశాలు, తొంభైకి మించిన జి డి ఐ స్కోరును సంపాదించలేక పోవటానికి, ఆ దేశాలలో, ఆర్థిక, రాజకీయ, విధానాల నిర్ణయాలలో స్త్రీలకు పురుషులతో సమానమైన పాత్ర లభించక పోవటమే కారణమని ఇంతకు పూర్వమే చూచాం ప్రపంచంలోని పలు ప్రాంతాలలో ఈ రంగాలలో స్త్రీల ప్రాతినిధ్యం ఎంత తక్కువగా ఉన్నదీ ఇంతకు పూర్వమే విపులంగా వివరించాం. స్త్రీలకు లభిస్తున్న ఈ ప్రాతినిధ్య పరిమాణపుటంచనాను సూచించటానికి, యు యన్ డి పి నిపుణులు, "జెండర్ ఎంపవర్‌మెంట్ మెషర్" అన్న మరొక సూచీని రూపొందించారు. దీన్ని "జి ఇ ఎమ్" అన్న సంక్షిప్తనామంతో కూడా వ్యవహరిస్తున్నారు. ఈ సూచీని రూపొందించటానికి వీరు మూడు అంశాలను ఆధారంగా తీసుకొన్నారు. 1. స్త్రీల ఆర్థిక ఆదాయ ఆర్జనా శక్తి; 2. ఆర్థిక విధానాల నిర్ణయంలో స్త్రీల ప్రాతినిధ్యము, ప్రొఫెషనల్, మేనెజీరియల్ స్థాయీ ఉద్యోగాలలో వారివాటా;

3. రాజకీయ రంగంలోనూ, మంత్రి మండలిలోనూ స్త్రీల ప్రాతినిధ్య పరిమాణము.

స్త్రీల అర్థికార్జనాశక్తిని జి డి ఐ, సూచీని రూపొందించటానికి కూడా ఈ నిపుణులు పరిగణనకు తీసుకొన్నారు. ఈ సందర్భంలో (జి డి ఐ రూపకల్పనలో) వారు, స్త్రీ అర్జనా శక్తిని, ఆవిడ విద్యాస్థాయి, ఆరోగ్యస్థాయి పెరుగుదలకు, కుటుంబ వనరుల పంపకంలో ఆవిడకు లభించే వాటా, అధికార పరిమాణాల నిర్ణయ సూచీగా వాడుకొన్నారు జి ఇ యం సూచీ రూపకల్పనలో దీనిని స్త్రీ యొక్క ఆర్థికాధికార పరిమాణ సూచీగా వాడారు. తాను సంపాదనాపరురాలైనపుడు, స్త్రీకి తన ఇచ్ఛ వచ్చిన రంగంలో తన సృజనాత్మక శక్తుల ప్రదర్శనకు తగిన ఉద్యోగ స్థానాలను ఎన్నుకొన గలుగుతుంది. సమాజంలోనూ, కుటుంబంలోనూ ఆర్థిక పరమైన హోదాను ఆవిడ పొందగలుగుతుంది.

రెండవ అంశం కింద, ప్రొఫెషనల్, మేనెజీరియల్, పరిపాలనా సంబంధమైన ఉన్నత స్థాయి పోస్టులలో స్త్రీల ప్రాతినిధ్య పరిమాణాన్ని పరిగణనకు తీనుకొన్నారు. పరిపాలన, మేనెజీరియల్ పోస్టులలో ఉన్నవారికి, విధాన నిర్ణయాధికారాలుంటాయి. ప్రొఫెషనల్, టెక్నికల్ రంగాలలోని ఉన్నత పదవులలో ఉన్నవారికి వృత్తిరీత్యా ఉన్నతస్థాయి పదవులకు వెళ్ళగల అవకాశాలుంటాయి. ఇటువంటి పదవులకు వెళ్ళకుండా స్త్రీలను నిరోధిస్తున్న "గ్లాస్ సీలింగ్" ను గురించి ఇంతకు పూర్వమే వివరించాం. ఇలాంటి అవరోధాలవల్ల, స్త్రీల సృజనాత్మక శక్తులు వారి అభివృద్ధికి వినియోగపడటం లేదు; అవి సామాజికాభివృద్ధికి కూడా ఉపకరించటంలేదు.

మూడవ అంశం రాజకీయ రంగంలో స్త్రీలకు లభిస్తున్న స్థానం. పురుషుల తోటి సమానమైన స్థానం, రాజకీయరంగంలో గాని, రాజకీయ నిర్ణయాలు చేయగలిగిన మంత్రి వర్గ పదవుల పంపకంలో గాని, స్త్రీలకు లభించని విషయాన్ని కూడా ఇంతకు పూర్వమే వివరించాం. ఈ రంగాలలో స్త్రీలకు లభిస్తున్నది నామమాత్ర ప్రాతినిధ్యమే. పార్లమెంటు ఎగువ, దిగువ సభలలో స్త్రీలకు లభిస్తున్న ప్రాతినిధ్య పరిమాణాన్ని ఈ సూచీ నిర్మాణానికి నిపుణులు స్వీకరించారు. ఈ మూడు అంశాలను సమానమైనవిగా పరిగణించి, వాటికి సమానమైన స్కోరును (విలువను) ఇచ్చారు. స్త్రీ పురుషులిరువురకూ ఈ రంగాలలో సమాన ప్రాతినిధ్యం ఉండాలన్నదే తమ అభిప్రాయం గాని, సరిగ్గా తాము సూచించినట్లే ఉండాలని అన్ని దేశాలకూ తాము సూచించటం లేదని యు యన్ డి పి నిపుణులు ప్రకటించారు. ఆయాదేశాల సంస్కృతీ సంప్రదాయానుసారం ఈ విషయంలో మార్పులు జరుగవచ్చునని వారు భావించారు. ఇలాంటి అధికారం ఆయా దేశాల ప్రజలదిగా తాము గుర్తిస్తున్నట్లు కూడా వారు స్పష్టం చేశారు.

ఈ సూచీ రూపకల్పనలో కూడా, ఆదర్శప్రాయమూ, వాంఛనీయమూ అయినంత ప్రాతినిధ్యం స్త్రీల కివ్వగలిగిన దేశానికి స్కోరును ఒకటిగా నిర్ణయించారు ఒకటి కంటే స్కోరు ఎంత తక్కువగా ఉంటే, ఆ దేశం అంతగా ఈ విషయంలో వెనుకబడినట్లుగా భావించారు. మేము జి డి ఐ సూచీ విషయంలో వలె, ఆదర్శప్రాయమైన స్కోరును వందగా పరిగణించి, అంతకంటే తక్కువ పరిమాణాన్ని పదుల స్థానం వరకూ పరిపూర్ణ సంఖ్యలుగా ఇస్తున్నాం.

జి.ఇ.యం సూచీని యు ఎస్ డి పి నిపుణులు 116 దేశాలకు తయారుచేసి 1995వ సంవత్సరం రిపోర్టులో ప్రచురించారు. స్వీడన్ 76 స్కోరుతో ప్రథమ ర్యాంకులోనూ, 75 స్కోరుతో నార్వే రెండవ ర్యాంకులోనూ, 72 స్కోరుతో ఫిన్లండ్ మూడవ ర్యాంకులోనూ, 68 స్కోరుతో డెన్మార్కు నాల్గవ ర్యాంకులోనూ నిలిచాయి స్త్రీ పురుష సమానత్వ సాధనలో ఆదర్శప్రాయమైన కృషిని చేస్తున్న నార్డిక్ దేశాలు, ఈ విషయంలో కూడా తమ ఘనతను చాటుకొంటున్నాయి. రాజకీయ రంగంలోనే గాకుండా, ప్రొఫెషనల్, మేనెజీరియల్, టెక్నికల్ పదవుల పంపకంలోనూ స్త్రీలకు కనీసం మూడవ వంతు స్థానాలనైనా ఇవ్వాలి అన్న వాంఛనీయ పరిమాణ స్థాయిని ఈ దేశాలు దాటిపోయి ఉండటం గమనించదగిన అంశము. ఆర్థికంగానూ, సాంకేతికంగానూ అగ్రగామిగా పేరొందిన అమెరికా 62 స్కోరుతో ఎనిమిదవ ర్యాంకులో ఉన్నది!

కొన్ని అభివృద్ధి చెందుతున్న దేశాలు, తమకంటే సంపన్నమైన, అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాల కంటే కూడా ఉన్నత స్థానంలో ఉండటం కనుపిస్తున్నది. బార్బడోస్

(12వ ర్యాంకు), బహమాస్ (14వ ర్యాంకు), క్యూబా (16వ ర్యాంకు), కోస్టారికా (22వ ర్యాంకు), చైనా (23వ ర్యాంకు), గుయానా (25వ ర్యాంకు), ఫిలిపీన్స్ (28 వ ర్యాంకు), కొలంబియా (29వ ర్యాంకు) దేశాలను ఇందుకు ఉదాహరణగా చూపవచ్చు.

క్యూబా వంటి చిన్న, పేదదేశం, 52 స్కోరుతో 16వ ర్యాంకులో ఉండగా, 48 స్కోరుతో యునైటెడ్ కింగ్డం, 44 స్కోరుతో జపాన్, 43 స్కోరుతో ఫ్రాన్స్ దేశాలు దానికి దిగువ ర్యాంకులో ఉండటం గమనార్హం

ఈ నూట పదహారు దేశాలలోనూ, కేవలం తొమ్మిది దేశాల స్కోరు మాత్రమే అరవై కంటే అధికంగా ఉన్నది! 24 దేశాల స్కోరు 25 కంటే తక్కువగా ఉన్నది. స్త్రీవిద్య, ఆరోగ్యం, పోషణ, ఆర్జనాది అంశాలలో అభివృద్ధిని సాధించ గలిగిన కొన్ని దేశాలు, జి ఇ యం విషయంలో చాలా వెనుకబడి ఉన్నాయి. ఇవి సాధించవలసింది చాలా ఉన్నదని యు యన్ డి పి నిపుణులు స్పష్టం చేశారు. కొన్ని దేశాల జి.ఇ.యం. స్కోరు వాటి హెచ్ డి ఐ స్కోర్ కంటే చాలా తక్కువగా ఉన్నది. కొన్ని దేశాల జిడిఐ స్కోరు కంటె జిఇయం స్కోరు తక్కువగా ఉన్నది. (ఈ విషయాలను ఈ అధ్యాయంలోని పట్టికలో చూడవచ్చు) ఇందుకు ఉదాహరణగా అభివృద్ధి చెందిన దేశాలయిన ఫ్రాన్స్, జపాన్, గ్రీస్, యునైటెడ్ కింగ్డం, ఐర్లెండ్, స్పెయిన్ దేశాలను చూపవచ్చు. ఫ్రాన్స్ జి డి ఐ స్కోరు 90 ఉండగా, దీని జి ఇ యం స్కోరు 43 మాత్రంగానే ఉన్నది. గ్రీస్ జి డి ఐ స్కోర్ 83 కాగా, దాని జి ఇ యం స్కోర్ 34 మాత్రంగానే ఉన్నది! గ్రీస్ దేశపు పార్లమెంటులో స్త్రీల ప్రాతినిధ్యం ఆరుశాతంగానే ఉన్నది. పరిపాలనా సంబంధమైన పోస్టులలో పది శాతమే స్త్రీలకు లభించాయి! వేతనార్జనలో వీరివాటా 22 శాతమే. ఫ్రాన్సు, జపాను దేశాలలోనూ పరిస్థితి ఇలాగే ఉన్నట్లు యు యన్ డి పి నిపుణులు సూచించారు. టర్కీ జి ఇ యం స్కోర్ 23 మాత్రమే. రెండు శాతపు పార్లమెంటు సీట్లు, నాలుగు శాతం పరిపాలన, మేనేజీరియల్ పోస్టులు మాత్రమే స్త్రీలకు లభించటం ఈ తక్కువ స్కోరుకు కారణమని నిపుణులు సూచించారు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో దక్షిణ కొరియా, కువైట్, యునైటెడ్ అరబ్ అమీరేట్స్, మారిషస్ దేశాలలో కూడా, వాటి జి డి ఐ స్కోరు కంటే జి ఇ యం స్కోరు తక్కువగా ఉన్నది.

భారతదేశం 1970వ సంవత్సరంలో ఉన్న 25 జిడిఐ స్కోరును, 1990వ సంవత్సరానికి 40కి పెంచుకొన్నది. 1994వ సంవత్సరంలో స్త్రీల పార్లమెంటరీ ప్రాతినిధ్యం 7.3శాతం వరకే ఉన్నది. 1992వ సంవత్సరం అంచనాల ప్రకారం, దేశంలోని పరిపాలనా, మేనేజీరియల్ పోస్టులలోని 2 3శాతం మాత్రమే స్త్రీలకు లభించాయి. ప్రొఫెషనల్, టెక్నికల్ పోస్టులలో 20 5 శాతం వరకూ స్త్రీలకు లభించాయి. వేతనార్జనలో 19.2 శాతం మాత్రమే స్త్రీలకు లభిస్తున్నది. ఇందువల్ల దేశపు జి ఇ యం స్కోరు 23తో 101వ ర్యాంకులో (అట్టడుగున) ఉండి పోయింది. నేపాల్ 32 స్కోరుతో 73వ స్థానంలోనూ, శ్రీలంక 29 స్కోరుతో 79వ స్థానంలోనూ ఉండటం గమనార్హం.

దేశాలకు లభించిన జి ఇ యం ర్యాంకును, ఆయా దేశాల తలసరి సగటు జాతీయోత్పత్తితో పోల్చితే, స్త్రీ జనాభ్యుదయపు వెనుకబాటుతనం మరింత స్పష్టంగా కనుపిస్తుంది. తలసరి జాతీయోత్పత్తి సగటు 20,520 డాలర్లుగా గలిగి, హెచ్‌డిఐ ర్యాంకింగులో ప్రథమస్థానమాక్రమించగలిగిన కెనడా, జి ఇ యం స్కోరు 66తో ఐదవ స్థానంలో ఉన్నది. ప్రపంచంలోనే అత్యధిక సగటు తలసరి జాతీయోత్పత్తి 23,760 డాలర్లుగా గలిగిన అమెరికా, హెచ్ డి ఐ ర్యాంకింగ్‌లో ద్వితీయ స్థానంలో నిలువ గలిగినా, జి ఇ యం ర్యాంకింగులో 62 స్కోరుతో ఎనిమిదవ స్థానంలో నిలిచింది. సంపదోత్పత్తిలో ఈ దేశాలు అత్యున్నత స్థానాలను అలంకరించగలిగినా, స్త్రీపురుష సమానత్వ సాధనా విషయంలో ఇవి సాధించవలసింది ఇంకెంతో ఉన్నట్లు ఈ పోలికలు ధృవపరుస్తున్నాయి.

నూతన ఆర్థిక విధానాన్ని అవలంబిస్తూ, "ఆసియా పులులు"గా పేరు తెచ్చుకొన్న కొన్ని దేశాలలో కూడా పరిస్థితి ఇలాగే ఉన్నది. ఆ దేశాల ప్రజల తలసరి జాతీయోత్పత్తి ర్యాంకు కంటే జి ఇ యం స్కోరు ర్యాంకు తక్కువగా ఉన్నది. ఉదాహరణకు తలసరి జాతీయ ఆదాయపుటంచనాల విషయంలో, ప్రపంచ దేశాల ర్యాంకింగ్‌లో 16వ స్థానంలో నిలిచిన సింగపూరు, జిఇయం ర్యాంకింగులో 35వ స్థానంలో ఉన్నది. తలసరి జాతీయోత్పత్తి అంచనాలలో 38వ స్థానంలో నిలిచిన దక్షిణ కొరియా, జి ఇ యం ర్యాంకింగులో 90వ

స్థానంలో ఉన్నది. ప్రపంచ సంపన్న దేశాలలో ఒకటిగా పేరొంది, ఆసియా దేశాలలో అగ్రగామిగా ఉన్న జపాన్, తలసరి జాతీయోత్పత్తి ర్యాంకింగ్‌లో ఎనిమిదవ స్థానంలో నిలిచినా, జి ఇ యం ర్యాంకింగ్‌లో, క్యూబా, చైనా, గుయానాల వంటి పేద దేశాల కంటే దిగువన, 27వ స్థానంలో నిలిచి ఉండటం గమనార్హం! దక్షిణ కొరియా, జపాన్ దేశాలలో ఆర్థిక విధానాల నిర్ణయాత్మక అధికారం గల స్థానాలలోనూ, రాజకీయ రంగంలోనూ, పార్లమెంటరీ వ్యవస్థలోనూ స్త్రీలకు అత్యల్పస్థానం లభిస్తుండటమే ఈ వెనుకబాటు తనానికి మూలకారణం.

పలు మెడిటరేనియన్ దేశాల స్థితీ, కొన్ని అరబ్బు దేశాలస్థితి కూడా ఇలాగే ఉన్నది. జి ఇ యం సూచీ తయారీకి తీసుకొన్న 116 దేశాలలోనూ ఆరబ్ అమిరేట్స్ ఒకటి. ఈ దేశాల తలసరి జాతీయోత్పత్తి ర్యాంకింగ్‌లో యునైటెడ్ ఆరబ్ అమిరేట్స్ మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్నా, జి ఇ యం ర్యాంకింగులో మాత్రం 93వ స్థానంలో నిలిచింది. ఈ దేశంలో పరిపాలన, మేనేజీరియల్ పోస్టులలో రెండుశాతం మాత్రమే స్త్రీలున్నారు; వేతనార్జనలో ఏడుశాతం మాత్రమే స్త్రీలకు లభిస్తున్నది అందుచేతనే జి ఇ యం ర్యాంకింగ్‌లో ఈ దేశం దిగువ స్థానానికి పడిపోయింది.

ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ, సంపన్న, పేద అన్న భేదం లేకుండా, స్త్రీ పురుష సమానత్వ సాధనకు చేయవలసింది చాలా ఉన్నదని పై పోలికలు స్పష్టం చేస్తున్నాయి ఆర్థిక రాజకీయ రంగాలలో సంపన్న దేశాల స్త్రీలకు కూడా, తమ ఇచ్ఛవచ్చిన స్థానాల నిర్వహణకు అవసరమైన స్వేచ్ఛ ఇంకా లభించటం లేదు పార్లమెంటరీ ప్రాతినిధ్యం విషయంలోనూ, పరిపాలన, మేనేజీరియల్ పోస్టుల నిర్వహణా విషయాలలోనూ, పురుషుల తోడి సమానావకాశాలు స్త్రీలకు లేవు. ఒక దేశం ఎంత సంపన్నమైనదయినా, ఆర్థిక, రాజకీయాధికార విషయాలలో మాత్రం, స్రీలు సముచిత పాత్రను నిర్వహించే అవకాశాలు లేవు. అధికార చలాయింపులో గాని, విధాన నిర్ణయాలు చేసే విషయంలోగాని స్త్రీలింకా "మైనారిటీ" వర్గీయులుగానే మిగిలిపోయారు! యు యన్ డి పి నిపుణుల కొలమానాలు నిగ్గుదేల్చిన సత్యమిది.

## ప్రాంతాలవారీగా, దేశాలవారీగా స్త్రీ పురుష అభివృద్ధిలోని అసమానతా సూచికలు

| ప్రాంతము / దేశము | హెచ్ డి ఐ స్కోరు (1994) | జి డి ఐ స్కోరు (1994) | జి ఇ యం స్కోరు (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ హెచ్ డి ఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిడిఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిఇయం స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) |
|---|---|---|---|---|---|---|
| సబ్-సహారన్ ఆఫ్రికా | 84 5 | 75.2 | 53 1 | - | - | - |
| మారిషస్ | 83.1 | 75.2 | 41 9 | 98 | 100 | 79 |
| దక్షిణ ఆఫ్రికా | 71.6 | 68 1 | 53.1 | 85 | 91 | 100 |
| బోట్స్వానా | 67.3 | 65 2 | 45.5 | 80 | 87 | 86 |
| జింబాబ్వే | 51 3 | 50.3 | 42.9 | 61 | 67 | 81 |
| కాంగో | 50.0 | - | 21.7 | 59 | - | 41 |
| కమరూన్ | 46.8 | 44.4 | 33.9 | 55 | 59 | 64 |
| లెసోతో | 45.7 | 44 6 | 45 0 | 54 | 59 | 85 |
| జయర్ | 38 1 | - | 21.1 | 45 | - | 40 |
| జాంబియా | 36.9 | 36.2 | 30 3 | 44 | 48 | 57 |
| టోగొ | 36.5 | 34.2 | 18 2 | 43 | 45 | 34 |
| మారిటానియా | 35.5 | 34.1 | 17.7 | 42 | 45 | 33 |
| సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 35 5 | 33.8 | 20.5 | 42 | 45 | 39 |
| మాలావి | 32.0 | 31.0 | 25.5 | 38 | 41 | 48 |
| మొజాంబిక్ | 28 1 | 26 2 | 43.0 | 33 | 35 | 81 |
| మాలి | 22.9 | 21 8 | 23.9 | 27 | 29 | 45 |
| బర్కీనా ఫాసో | 22.1 | 20.6 | 31.8 | 26 | 27 | 60 |
| సియరా లియోన్ | 17.6 | 15.5 | 27.3 | 21 | 21 | 51 |
| తూర్పు ఆసియా | 91.4 | 85.2 | 48 1 | - | - | - |
| హాంకాంగ్ | 91.4 | 85.2 | - | 100 | 100 | - |
| దక్షిణ కొరియా | 89.0 | 82.6 | 30.2 | 97 | 97 | 63 |
| మంగోలియా | 66.1 | 65.0 | - | 72 | 76 | - |
| చైనా | 62.6 | 61.7 | 48.1 | 68 | 72 | 100 |

## ప్రాంతాలవారీగా, దేశాలవారీగా స్త్రీ పురుష అభివృద్ధిలోని అసమానతా సూచికలు

| ప్రాంతము / దేశము | హెచ్ డి ఐ స్కోరు (1994) | జి డి ఐ స్కోరు (1994) | జి ఇ యం స్కోరు (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ హెచ్ డి ఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిడిఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిఇయం స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) |
|---|---|---|---|---|---|---|
| దక్షిణ ఆసియా | 91.4 | 82.5 | 48.1 | - | - | - |
| ఇరాన్ | 78.0 | - | 25 1 | 100 | - | 76 |
| శ్రీలంక | 71.1 | 69.4 | 30.7 | 91 | 100 | 93 |
| మాల్దీవ్స్ | 61.1 | 60 0 | 33.0 | 78 | 86 | 100 |
| భారత దేశము | 44.6 | 41.9 | 22 8 | 57 | 60 | 69 |
| పాకిస్తాన్ | 44.5 | 39.2 | 18.9 | 57 | 56 | 57 |
| ఆసియా పసిఫిక్ప్రాంతం | 90.0 | 85.3 | 45 9 | - | - | - |
| సింగపూర్ | 90.0 | 85.3 | 42.3 | 100 | 100 | 92 |
| ఫీజీ | 86.3 | 76.3 | 32 9 | 96 | 90 | 72 |
| తాయ్‌లెండ్ | 83.3 | 81.2 | 41.7 | 93 | 95 | 91 |
| మలేషియా | 83.2 | 78.2 | 42 2 | 92 | 92 | 92 |
| ఫిలిపీన్స్ | 67.2 | 65.0 | 45.9 | 75 | 76 | 100 |
| పాపూ న్యూగిని | 52.5 | 50.8 | 23.2 | 53 | 55 | - |
| అరబ్బు దేశాలు | 87.0 | 76.9 | 33.3 | - | - | - |
| బెహ్రీన్ | 87.0 | 74.2 | - | 100 | 97 | - |
| యునైటెడ్ అరబ్ అమీరేట్స్ | 86.6 | 72 7 | 23.7 | 100 | 95 | 71 |
| కువైట్ | 86.6 | 76.9 | 33.3 | 97 | 100 | 100 |
| లెబొనాన్ | 79 4 | 70.8 | - | 91 | 92 | - |
| సౌదీ అరేబియా | 77.4 | 58.1 | - | 87 | 84 | - |
| ట్యూనీషియా | 74.8 | 66.8 | 26.0 | 86 | 87 | 78 |
| అల్జీరియా | 73.7 | 61.4 | 28.2 | 85 | 80 | 85 |
| ఈజిప్టు | 61.4 | 55.5 | 27.8 | 71 | 72 | 83 |
| మొరాకో | 56.6 | 51.5 | 30.3 | 65 | 67 | 91 |
| ఇరాక్ | 53.1 | 43.3 | - | 61 | 56 | - |
| సుడాన్ | 33.3 | 30.6 | 22.5 | 38 | 40 | 68 |
| లాటిన్ అమెరికా-కరిబియన్ | 90.7 | 88.5 | 60.2 | - | - | - |
| వెనుజులా | 86.1 | 79.2 | 39.4 | 95 | 89 | 66 |
| మెక్సికో | 85.3 | 77.0 | 47.3 | 94 | 87 | 79 |
| కొలంబియా | 84.8 | 81.1 | 45.5 | 94 | 92 | 76 |
| బ్రెజిల్ | 78.3 | 72.8 | 37.7 | 86 | 82 | 63 |

## ప్రాంతాలవారీగా, దేశాలవారీగా స్త్రీ పురుష అభివృద్ధిలోని అసమానతా సూచికలు

| ప్రాంతము / దేశము | హెచ్ డి ఐ స్కోరు (1994) | జి డి ఐ స్కోరు (1994) | జి ఇ యం స్కోరు (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ హెచ్ డి ఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిడిఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిఇయం స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) |
|---|---|---|---|---|---|---|
| క్యూబా | 72.3 | 69.9 | 52.3 | 80 | 79 | 87 |
| డొమినికన్ రిపబ్లిక్ | 71.8 | 65.8 | 42.4 | 79 | 74 | 69 |
| పెరు | 71.7 | 65.6 | 41.6 | 79 | 74 | 69 |
| పెరాగ్వే | 70.6 | 64.9 | 34.1 | 78 | 79 | 57 |
| గుయానా | 64.9 | 61.5 | 46.9 | 72 | 69 | 78 |
| ఎల్ సాల్వడార్ | 59.2 | 56.3 | 42.9 | 65 | 64 | 71 |
| హాండూరాస్ | 57.5 | 54.4 | 41.7 | 63 | 62 | 69 |
| గ్వాటెమాలా | 57.2 | 51.0 | 47.6 | 63 | 58 | 79 |
| నికరాగ్వా | 53.0 | 51.5 | - | 58 | 58 | - |
| హెయిటీ | 53.8 | 33.2 | 34.5 | 37 | 37 | 57 |
| అభివృద్ధి చెందుతున్న ఇతర దేశాలు | | | | | | |
| సైప్రస్ | 90.7 | 83.7 | 37.5 | 99 | 95 | 62 |
| టర్కీ | 77.2 | 73.7 | 25.0 | 84 | 83 | 42 |
| అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలు | 91.4 | 88.5 | 60.2 | - | - | - |
| తూర్పు యూరప్, రష్యా ఫెడరేషన్ | 88.6 | 86.6 | 51.0 | - | - | - |
| స్లోవానియా | 88.6 | 86.6 | - | 100 | 100 | - |
| జెక్ రిపబ్లిక్ | 88.2 | 85.9 | - | 100 | 99 | - |
| హంగరీ | 85.7 | 83.7 | 51.0 | 97 | 97 | 100 |
| పోలెండ్ | 83.4 | 81.8 | 43.3 | 94 | 94 | 85 |
| రష్యన్ ఫెడరేషన్ | 79.2 | 77.8 | - | 89 | 90 | - |
| బల్గేరియా | 78.0 | 77.2 | 48.7 | 88 | 89 | 95 |
| రొమేనియా | 74.8 | 73.3 | - | 84 | 85 | - |
| టర్క్‌మినిస్తాన్ | 72.3 | 71.2 | - | 82 | 82 | - |
| కజక్‌స్తాన్ | 70.9 | 69.8 | - | 80 | 81 | - |
| ఉక్రెయిన్ | 68.9 | 68.1 | - | 78 | 79 | - |
| ఉజ్ బెకిస్తాన్ | 66.2 | 65.5 | - | 75 | 76 | - |
| జార్జియా | 63.7 | 63.0 | - | 72 | 73 | - |
| తజకిస్తాన్ | 58.0 | 57.5 | - | 65 | 66 | - |
| ఓఇసిడి దేశాలు | 96.0 | 93.9 | 79.5 | - | - | - |

## ప్రాంతాలవారీగా, దేశాలవారీగా స్త్రీ పురుష అభివృద్ధిలోని అసమానతా సూచికలు

| ప్రాంతము / దేశము | హెచ్ డి ఐ స్కోరు (1994) | జి డి ఐ స్కోరు (1994) | జి ఇ యం స్కోరు (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ హెచ్ డి ఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిడిఐ స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) | ఈ ప్రాంతపు గరిష్ఠ జిఇయం స్కోరులో ఈ దేశపు స్కోరు శాతం (1994) |
|---|---|---|---|---|---|---|
| కెనడా | 96.0 | 93.9 | 70.0 | 100 | 100 | 100 |
| ఫ్రాన్స్ | 94.6 | 92.6 | 45.2 | 99 | 99 | 57 |
| నార్వే | 94.3 | 93.4 | 79.5 | 98 | 100 | 100 |
| అమెరికా | 94.2 | 92.8 | 67.1 | 98 | 99 | 84 |
| నెదర్లాండ్స్ | 94.0 | 90.1 | 66.0 | 98 | 96 | 83 |
| జపాన్ | 94.0 | 90.1 | 46.5 | 98 | 96 | 58 |
| ఫిన్లెండ్ | 94.0 | 92.5 | 71.9 | 98 | 99 | 90 |
| న్యూజిలెండ్ | 93.7 | 91.8 | 71.8 | 98 | 98 | 90 |
| స్వీడన్ | 93.6 | 93.2 | 78.4 | 97 | 99 | 99 |
| స్పెయిన్ | 93.4 | 87.4 | 54.2 | 97 | 93 | 68 |
| ఆస్ట్రియా | 93.2 | 89.2 | 66.7 | 97 | 95 | 84 |
| బెల్జియం | 93.2 | 89.1 | 59.1 | 97 | 95 | 74 |
| ఆస్ట్రేలియా | 93.1 | 91.7 | 65.9 | 97 | 98 | 83 |
| యునైటెడ్ కింగ్డం | 93.1 | 89.6 | 54.3 | 97 | 95 | 68 |
| స్విట్జర్లండ్ | 93.0 | 87.4 | 64.2 | 97 | 93 | 81 |
| డెన్మార్క్ | 92.7 | 91.6 | 72.8 | 97 | 98 | 92 |
| జర్మనీ | 92.4 | 88.6 | 66.1 | 96 | 92 | 72 |
| ఇటలీ | 92.1 | 86.7 | 57.3 | 96 | 92 | 72 |
| పోర్చుగల్ | 89.0 | 85.0 | 55.6 | 93 | 91 | 70 |
| హంగరీ | 85.7 | 83.7 | 51.0 | 89 | 89 | 64 |
| మెక్సికో | 85.3 | 77.0 | 47.3 | 89 | 82 | 60 |
| పోలెండ్ | 83.4 | 81.8 | 43.3 | 87 | 87 | 54 |
| టర్కీ | 77.2 | 73.7 | 25.0 | 80 | 79 | 31 |
| ఇతర పారిశ్రామిక దేశాలు | | | | | | |
| ఇజ్రాయెల్ | 91.3 | 87.2 | 47.5 | 95 | 93 | 60 |
| మాల్టా | 88.7 | 77.3 | - | 92 | 82 | - |
| పారిశ్రామిక దేశాలు | 96.0 | 93.9 | 79.5 | - | - | - |

గమనిక : బోల్డుగా కనుపించే సంఖ్యలు ఆ ప్రాంతపు గరిష్ఠ స్కోరుకు సంకేతాలు

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1997 నుండి*

# 23

## మారుతున్న ప్రపంచంలో మారవలసిన మహిళల స్థానం

ప్రపంచంలో ఏ సమాజంలోనూ హోదాలోగాని, ఉన్న అవకాశాలను వినియోగించు కోవటంలో గాని స్త్రీకి పురుషునితో సమానమైన స్థానం లభించటం లేదు. కొన్ని సమాజాలలో స్త్రీకి వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని అనుభవించే అవకాశాలు కూడా కరువైనాయి. ఇందువల్ల ఆమెకు సామాజిక, కుటుంబ అభివృద్ధికి ఎంత కృషి చేసినా, ఆ కృషి ఫలితం గుర్తింపుకు రావటం లేదు; పైగా ఆ కృషి ఫలితంలో తనకు న్యాయంగా గిట్టవలసిన వాటా కూడా రావటం లేదు. ఈ స్త్రీ- పురుష అసమానత్వానికి బహుముఖాలున్నట్లు ఇంతకు పూర్వమే వివరించాం.

స్త్రీల యెడల ప్రదర్శితమవుతున్న అన్ని రకాల వివక్ష అంతరించాలి అని, "కన్వెన్షన్ ఆన్ ది ఎలిమినేషన్ ఆఫ్ ఆల్ ఫార్మ్స్ ఆఫ్ డిస్క్రిమినేషన్ ఎగైన్స్టు ఉమెన్" చేసిన తీర్మానాన్ని 1979 వ సంవత్సరంలో ఐక్యరాజ్య సమితి ఆమోదించింది. ఇది విప్లవాత్మకమైన తీర్మానం. దీన్ని 41 దేశాలు ఆమోదించలేదు; ఆరు దేశాలు సంతకాలయితే చేశాయి; దానికి కట్టుబడి ఉంటామని మాత్రం ప్రకటించలేదు; 43 దేశాలు కొన్ని మినహాయింపులతో అంగీకరించాయి. ఇలా దాదాపు తొంభై దేశాలు, ఇంకా స్త్రీ పురుష సమానత్వాన్ని సూత్రప్రాయంగా నైనా అంగీకరించటం లేదు! ఈ తీర్మానాన్ని ఆమోదిస్తూ సంతకాలు చేసిన దేశాలలో కొన్ని, ఆ తీర్మాన ఆదేశాలను అమలు పరచటానికి ఉత్సాహాన్ని చూపటం లేదు. ఆచరణ ఎలా ఉన్నా, సూత్రరీత్యా కూడా స్త్రీ-పురుష సమానత్వానికి ఆమోదం లభించటం ఇంకా కష్టంగానే ఉన్నది. దీనికి పూర్వమే, 1948 వ సంవత్సరంలో ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల రక్షణ మీద ఆమోదించిన తీర్మానపు అమలు కూడా ఇలాగే ఉన్నది.

సర్వజనీన మానవ హక్కుల ప్రకటనను (దీన్ని "యూనివర్సల్ డిక్లరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్" అని ఇంగ్లీషులో పేర్కొన్నారు) ఐక్యరాజ్య సమితి పారిస్‌లో జరిపిన సమావేశంలో 1948 వ సంవత్సరం డిశంబరు 10 వ తేదీ తెల్లవారుఝామున మూడు గంటలకు ఆమెదించింది. మానవ హక్కులను స్త్రీ పురుష భేదం లేకుండా అందరూ అనుభవించాలని ఆ తీర్మానం పేర్కొన్నది. ఇందులో విద్య, వైద్యం, ఉపాధి, సమాన జీవనావకాశాలు, వ్యక్తిగత ప్రతిష్ఠ, గౌరవం, భద్రత, స్వాతంత్ర్యం వంటి వాటిని అందరూ అనుభవించటంతో పాటు సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక

జీవనంలో సమానంగా పాల్గొనే అవకాశాలు అందరకూ లభించాలి అనే అంశాలు కూడా ఉన్నాయి ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ స్త్రీల హక్కుల రక్షణ పేరిట ఆమోదించిన పలుతీర్మానాలున్నా, పురుషులతోడి సమానావకాశాలు, సమాజంలో ఆర్థిక, సాంస్కృతిక జీవనంలో సమాన ప్రతిపత్తి స్త్రీలకు ఇంకా గగన కుసుమాలు గానే ఉన్నాయి.

మంత్రాలకు చింతకాయలురాలవన్నది ఏనాడో రూపొందించిన సామెత. స్త్రీ పురుష సమానత్వ సాధనా సమస్య కూడా ఇంత జటిలమైనదే. అంత సులభంగా పరిష్కరించ వీలయినది కాదు. సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక విధానాలలో సమూలమైన మార్పులు వచ్చినపుడే స్త్రీ పురుష సమానత్వ సాధన సాధ్యమవుతుంది మన ఆలోచనా విధానాలే మారాలి. స్త్రీ అంటే వంటింటి కుందేలనే భావం సామాజికులలో అంతరించాలి. సామాజికాభివృద్ధికి స్త్రీల సృజనాత్మక శక్తుల వినియోగం కూడా అవసరమే నన్న భావం సామాజికులలో అంకురించాలి. అపుడే స్త్రీలకు పురుషులతోడి సమానావకాశాలు లభిస్తాయి; ఇపుడు చలామణీ అవుతున్న, పురుషాధిక్యత అంతరిస్తుంది. ఇది జరిగినపుడే దారిద్ర్యం, నిరక్షరాస్యత, అనారోగ్యం వంటి జాడ్యాల నుండి స్త్రీలకు మాత్రమే గాదు, ప్రజలందరకూ విముక్తి కలుగుతుంది. మానవ సృజనాత్మక శక్తుల వికసనానికీ, లోక కళ్యాణానికీ, స్త్రీ పురుష సమానత్వ సాధన అవసరం. ఇందుకు ప్రభుత్వాలు కార్యదీక్షను ప్రదర్శించటం అవసరం . దీనికి తోడుగా రాజకీయ ఉద్యమాలు కూడా నడవాలి. అపుడే ఈ కార్యసాధన సాధ్యమవుతుంది.

## సమానత్వ సాధనకు రాజకీయోద్యమం

స్త్రీ పురుష సమానత్వ సాధనకు రాజకీయ ఉద్యమం సాగాలని చెబుతున్న దానిని బట్టి, ఇంత కాలమూ స్త్రీలు చేతులు ముడుచుకు కూర్చున్నారని భ్రమించకూడదు. స్త్రీ విముక్తి ఉద్యమం పద్ధెనిమిదవ శతాబ్దంలోనే ప్రారంభమైంది. కాలగతిని అది బలాన్ని పుంజుకొన్నది. పంథొమ్మిదవ శతాబ్దంలో మహిళా ఉద్యమం గణనీయమైన విజయాలను సాధించింది పలుదేశాలలో జరిగిన ఉద్యమాలకు సమన్వయం కుదిరి ఉండకపోవచ్చు. వివిధ దేశాలలోని ఉద్యమస్థాయిలో తర తమ భేదాలుండవచ్చు. ఈ అంశాలలో ఎన్ని భేదాలున్నా, వాటి ఏకైక లక్ష్యం స్త్రీల పురోగతి; సమాజ కళ్యాణం.

మహిళా ఉద్యమం ప్రారంభమైన కాలంలో వారు దేశంలో నడుస్తున్న రాజకీయ ఉద్యమాలలో పాల్గొన నారంభించారు. వాటిలో సాంఘిక ఉద్యమాలున్నాయి; రాజకీయ ఉద్యమాలున్నాయి 19 వ శతాబ్దంలో బానిసత్వ విధానపు తొలగింపుకు అమెరికాలో జరిగిన ఉద్యమంలో స్త్రీలు చురుకుగా పాల్గొన్నారు. కార్మికుల జీవన పరిస్థితులను మెరుగు పరచటానికి, ఇంగ్లండులో జరిగిన కార్మికోద్యమంలో స్త్రీలు పెద్ద యెత్తున పాల్గొన్నారు. పంథొమ్మిదవ శతాబ్దాంత కాలం నుండి, పలు వలసదేశాలలో జరిగిన విమోచనోద్యమాలలో స్త్రీలు చురుకుగా పాల్గొన్నారు. రాజకీయ ఉద్యమాలలో పాల్గొనటం వల్ల వారి చైతన్యం, అవగాహనా స్థాయి పెరిగాయి. తామెవరో, తమ స్థితి ఏమిటో వారికి బాగా తెలిసింది. ఈ అనుభవం, అవగాహన వారిని స్త్రీల కోర్కెల సాధనకు, ముఖ్యంగా స్త్రీ పురుష సమానత్వ సాధనకు ప్రోత్సహించాయి. పంథొమ్మిదవ శతాబ్ద మధ్యకాలానికి స్త్రీ పురుష సమానత్వ సాధనా నినాదం మహిళా ఉద్యమ లక్ష్యంగా మారింది, పౌరసత్వం, ఓటింగ్, ఆస్తి, విద్య, వైద్యము, ఉపాధి, వేతనం వంటి విషయాలలో పురుషులతోడి సమానత్వ సాధనకు పలు ఉద్యమాలను, పలుదేశాల మహిళలు నడిపారు. ప్రపంచ శాంతి పరిరక్షణ, పర్యావరణ రక్షణ వంటి ప్రపంచ సమస్యల పరిష్కారంలో కూడా శ్రద్ధనూ, చొరవనూ ప్రదర్శించ గలిగిన దశకు మహిళా ఉద్యమం ఎదిగింది. ఈ మార్పు ప్రధానంగా 1950 వ సంవత్సరం నుండి కనుపిస్తున్నది. నూటయాభై సంవత్సరాలుగా ఉద్యమం సాగుతున్నా, ఇంకా మహిళలకు అన్ని రంగాలలోనూ పురుషుల తోడి సమానావకాశాలు లభించటం లేదు.

నాగరికత పెంపుతో, దేశ పారిశ్రామిక, ఆర్థికాభివృద్ధి పురోగమనంతో ఈ అసమానతలు అంతరిస్తాయన్న భావం, మిధ్యగా మారిపోయింది. అభివృద్ధి ఎంత ఉన్నత స్థాయికి పెరిగినా, ఈ సమానత్వం ఇంకా కుందేటి కొమ్ముగా ఉండటం కనుపించసాగింది. 20వ శతాబ్దపు డెబ్భయ్యవ దశాబ్దం నుండి, ఈ అంశపు పునరాలోచన ప్రారంభమైంది. 1970 వ సంవత్సరంలో ఎస్తర్ బొసెరప్ వ్రాసిన "ఉమెన్స్ రోల్ ఇన్ ఎకనామిక్ డెవలప్ మెంట్" అన్న పుస్తక ప్రచురణ ఈ అంశం

మీద వెలువడిన తొలి స్పష్టమైన అవగాహనగా భావిస్తున్నారు. సమాజంలోని స్త్రీ పురుషుల పని స్వభావాన్ని, పనిభారాన్ని, పని విభజనను వివరిస్తూ జరుగుతున్న అభివృద్ధి వల్ల స్త్రీ పురుషులు సమంగా లాభించటం లేదన్న అంశాన్ని స్పష్టంగా వీరు నిరూపించారు. ఆధునీకరణ, ఆర్థికాభివృద్ధి ఫలితాలు స్త్రీ పురుషులకు సమంగా లభిస్తాయని ఇంతవరకూ ఉన్న భావాన్ని ఈవిడ సవాలు చేశారు. ఆర్థికాభివృద్ధి తన పయనంలో స్త్రీలను వదలి వేయటమేగాక, వారికి ఆర్థికావకాశాలు లభించ కుండానూ, స్వాతంత్ర్యం దక్కకుండాను చేసినట్లు ఎస్టర్ వివరించారు

ఈ పుస్తక ప్రచురణ తర్వాత, అంతర్జాతీయ సంస్థల ఆర్థిక సహకారంతో కొన్ని దేశాలలో మహిళాభివృద్ధి ప్రాజెక్టుల నిర్వహణ జరిగింది. స్త్రీల వృత్తి విద్య, చూలు - కాన్పు, పరపతి సౌకర్యం వంటి సమస్యల మీద ఇవి పని చేశాయి. వీటి పనివల్ల ఆ ప్రాజెక్టు పరిధిలోని స్త్రీల స్థితి కొంతమేరకు బాగుపడింది. కాని, ప్రపంచ వ్యాపితంగా ఉన్న ఈ సమస్యా పరిష్కారానికి ఈ ప్రాజెక్టుల నిర్వహణ ఒక్కటే పరిష్కార మార్గం కాదని ఆచరణలో రుజువైంది. వర్తమాన సమాజంలో విద్య, ఆరోగ్యం, ఉపాధి, వేతనం, ఆస్తిహక్కులు, విడాకుల హక్కులు, రాజకీయ రంగ ప్రవేశం వంటి పలు అంశాలలోనూ స్త్రీ పురుష అసమానతలున్నాయి. ఈ సమాజ నిర్మాణ స్వభావము, దాని ఆలోచనలను ప్రభావితం చేసే సంప్రదాయాలు మారకుండా ఈ సమానత్వ సాధన సాధ్యం గాదు. ఇల్లాలు అంటే ఇంటి పనులు చేస్తూ, అక్షరాల "గృహిణి" గా మనుగడ సాగించే వ్యక్తి అనే భావం సామాజికులలో స్థిరపడిపోయింది. ఇది కొన్ని తరాలుగా వస్తున్న భావన. స్త్రీల అభివృద్ధికి అంటూ కొన్ని ప్రాజెక్టులను నిర్వహిస్తే వారి స్థితి బాగుపడదు అది కొంత మేరకు, కొందరకు మాత్రం ఉపశమనాన్ని కూర్చగలదేమోగాని, అసలు సమస్యను పరిష్కరించలేదు. పురుషాధిక్యత పోవాలి; స్త్రీని వారి సమానులుగా ఉద్ధరించాలి. ఇది ప్రధానంగా వ్యక్తి గత హక్కులకు, అభిరుచులకూ, స్వేచ్ఛకూ సంబంధించిన అంశం. దీని పరిష్కారానికి సమాజాన్నే సంస్కరించాలి అన్న అంశం రుజువైంది. ఈ విధంగా స్త్రీ పురుష సమానత్వ సాధనా సమస్య సమాజానికే సవాలుగా తయారైంది.

అన్ని దేశాలకూ అన్వయించదగిన స్త్రీ-పురుష సమానత్వ సాధనా కార్యక్రమ రూపకల్పనకు తాపత్రయ పడకూడదు. రూపొందించే కార్యక్రమం ఆయా దేశాల సంస్కృతి, సంప్రదాయం, దేశపు అభివృద్ధి స్థాయి వంటి వాటిని బట్టి భిన్నంగా ఉండవలసి ఉంటుంది. కాని దిగువ పేర్కొన్న మూడు అంశాలు మాత్రం ప్రతి దేశపు కార్యక్రమంలోనూ ఉండాలి .

1. స్త్రీ-పురుష సమానత్వాన్ని, రాజ్యాంగ బద్ధమైన హక్కుగా నిర్దేశించాలి. స్త్రీ-పురుష సమానత్వ సాధనను నిరోధించే లీగల్, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అవరోధాలను తొలగించాలి; ఇందుకు అవసరమైన శాసనాలను రూపొందించి, కృతనిశ్చయంతో అమలు జరపాలి.

2. అందరి అభివృద్ధికి అవకాశాలుండాలి అనేది ఏదో ఒక వర్గాన్ని దయదలచి ఇచ్చే అవకాశంగా ఉండకూడదు. అది మానవ హక్కు. ప్రతివారికీ లభించాలి. మార్పుకు మారు పేరుగా స్త్రీని గుర్తించాలి. మార్పువల్ల వచ్చే లాభాలను స్త్రీలు కూడా పురుషులతో సమంగా అనుభవించే అవకాశాలుండాలి. స్త్రీల సృజనాత్మక శక్తుల వికాసం, దేశ ఆర్థికాభివృద్ధి సాధనకు అవసరం అన్న అంశానికి గుర్తింపు లభించాలి.

3. అమలు జరిగే అభివృద్ధి కార్యక్రమం, పురుషులతో సమంగా స్త్రీలూ లాభించేట్లుండాలి. వ్యక్తిగత అభివృద్ధి సాధనకు పురుషులతోడి సమానావకాశాలు స్త్రీలకు లభించాలి. ఈ విషయంలో సంస్కృతీ భిన్నత్వపు పాటింపుకు ప్రాధాన్యత నీయకూడదు.

స్త్రీ పురుష సమానత్వ సాధనకు అనుసరించ దగిన పంచసూత్ర కార్యక్రమాన్ని యు యన్ డి పి నిపుణులు రూపొందించారు. దీనిలోని ముఖ్యాంశాల నిచట చూద్దాం :

### 1. చట్టపరమైన అసమానతల తొలగింపు

నియమితకాల ప్రాతిపదిక మీద స్త్రీ పురుష సమానత్వ సాధనకు అవరోధంగా ఉన్న చట్టాలను, సమానత్వ సాధనకు అనువుగా సంస్కరించాలి. (ఈ కార్య సాధనకు పది లేక పదిహేను సంవత్సరాల కాలవ్యవధిని నిర్ణయించవచ్చు).

ఇంతకు పూర్వం జరిగిన యుద్ధాలలో సైనిక మరణాలు అధికంగా ఉండేవి. పౌర మరణాలు తక్కువగా ఉండేవి ఇటీవలి కాలంలో పరిస్థితులు మారుతున్నాయి. సాయుధ పోరాటం అంటూ ప్రారంభమైతే, సైనికుల కంటే పౌరులు అధిక ప్రాణ, ఆస్థి నష్టాలకు గురవుతున్నారు. అందరి కంటే స్త్రీలు అధికంగా ఈ బాధలను అనుభవించవలసి వస్తున్నది. స్త్రీలు ప్రధానంగా అత్యాచారాలకు, హింసకూ లోనవుతున్నారు. ఇలాంటి చర్యలను ప్రపంచం లోని అన్ని దేశాలు శిక్షార్హమైన నేరాలుగా ప్రకటించి, దోషులను శిక్షించటానికి వీలుగా శాసనాలను చేయాలి ఇలాంటి నేరాల విచారణను అంతర్జాతీయ ట్రిబ్యునల్‌కు నివేదించాలి.

చట్టాలు తమకు ఇస్తున్న హక్కు లేమిటో అసంఖ్యాక మహిళలకు తెలియదు. దాదాపు అన్ని దేశాలలోనూ ఇలాంటి పరిస్థితి ఉన్నది. కనుక ఈ విషయాలను వారికి తెలియచేయగల అంతర్జాతీయ సేవా సంస్థ నొక దానిని ఏర్పాటు చేయాలి. దానికి "వరల్డ్ ఉమెన్స్ వాచ్" వంటి పేరును పెట్టవచ్చు. ఈ సంస్థ నిర్వహించే కార్యక్రమంలో ఇతర అంశాలతో పాటు దిగువ పేర్కొన్న విషయాలు కూడా ఉండటం మంచిది.

- దేశపు చట్టాలు స్త్రీ-పురుషులకు సమంగా వర్తించని వైనాన్ని బట్టబయలు చేయాలి
- దేశంలో కనుపిస్తున్న ముఖ్యమైన స్త్రీ పురుష అసమానతల స్వరూపాన్ని వివరించే రికార్డును దేశాల వారీగా తయారు చేయాలి.
- స్త్రీ పురుష సమానత్వ సాధనకు దేశాలలో జరిగే ఉద్యమాలను ప్రోత్సహించాలి పలుదేశాల సంస్థల మధ్య సహకార సమన్వయాల ఏర్పాటుకు కృషి చేయాలి. ఇలాంటి కృషివల్ల, సమస్యలు రచ్చకెక్కుతాయి అమాయకులైన స్త్రీలు చైతన్యవంతు లవుతారు

## 2. సాధించవలసిన సామాజిక మార్పులు

గృహనిర్వహణకే రోజుకున్న ఇరవైనాలుగు గంటల కాలము ఇల్లాలికి చాలని పరిస్థితిని చూచాం. ఇలాంటి స్థితిలో ఆవిడ ఉద్యోగాన్ని చేపట్టటం అంటే ఎంతటి పనిభారాన్ని మోయటమో వేరుగా వివరించ నవసరంలేదు. ఈ పని భారం ఆవిడ వృత్తి పరంగా ఎదగటాన్ని, రాజకీయ రంగంలో గాని, వ్యాపార రంగంలో గాని తన శక్తి యుక్తులకు తగినట్లు ఎదగటాన్ని నిరోధిస్తున్నది. పిల్లలను కనటం, పెంచటం, కుటుంబీకులకు సేవలు చేయటం వంటివి సామాజిక పునరుత్పత్తి కార్యక్రమాలు. సమాజం అభివృద్ధి

### మానవ జీవనాభివృద్ధికి స్త్రీ-పురుష సమానత్వం జీవగ్రర

స్త్రీ-పురుష సమానత్వ సాధన అనేది ఏదో ఒక సాంకేతిక లక్ష్య సాధనగాదు. అదొక సమగ్ర రాజకీయ లక్ష్యసాధన. ఈ కార్య సాధనకు చాలా కాలం పడుతుంది. ఈ లక్ష్యసాధనతో సాంస్కృతిక, సాంఘిక, రాజకీయ, ఆర్థికాంశాలు పూర్తిగా మారిపోతాయి. ఈ లక్ష్య సాధనకు పూర్తిగా మారిన ఆలోచనా విధానం అవసరమవుతుంది. ఈ ఆలోచనా విధానంలో సంప్రదాయ భావాలకు చోటుండదు. స్త్రీ గనుక కొన్ని అవకాశాలను కోల్పోవలసి రావటం, లేదా పురుషుడు గనుక కొన్ని అవకాశాలను గుత్తగా వినియోగించుకొనే అవకాశాలుండటం అనేది ఉండదు. సామాజిక మార్పు సాధనలో, అందరూ (స్త్రీలు-పురుషులు) సమాన పాత్రధారులుగా ఉంటారు. అభివృద్ధి సాధనా ఫలితాలు, ఏ ఒక్క గ్రూపువారికో గాక, స్త్రీ-పురుషు లందరకూ సమంగా లభించాలన్నది లక్ష్యంగా ఉంటుంది.

సామాజిక వనరుల వినియోగపు హక్కు, అందుకు అవకాశాలూ, స్త్రీ, పురుషులకు సమంగా లభించాలి. ప్రజల దారిద్ర్యపు తొలగింపుకు నిరక్షరాస్యతా నిర్మూలనకూ, అనారోగ్యపు తొలగింపుకూ ఇది అత్యవసరం. మానవజీవనాభివృద్ధి సాధనకు స్త్రీ-పురుష సమానత్వ సాధన అత్యవసరం.

- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు - 1995

చెందటానికి ఇవన్నీ అవసరమైన కార్యక్రమాలే. ఈ పనులను పూర్తిగా ఇల్లాలికే వదలి, పురుషుడు ఈ బాధ్యతా నిర్వహణను, తప్పించుకోవటం, కుటుంబానికి, సమాజానికి నష్టకరం. కనుక, ఇల్లాలి పనిభారాన్ని తగ్గించటానికి, గృహనిర్వహణాభారంలో వీలయినంత అధిక భాగాన్ని పంచుకోవటానికి పురుషులు ముందుకు రావాలి.

గృహనిర్వహణలో పురుషుల భాగస్వామ్యం : ఈ అవసరాలను గుర్తించి కొన్ని అభివృద్ధి చెందిన దేశాలు మెటర్నిటీ లీవ్ ను పేరెంటల్ లీవ్‌గా మార్చాయి. కాన్పు తర్వాత, భార్యా భర్తలలో ఎవరయినా ఒకరు ఈ సెలవును తీసుకోవచ్చు ఈ శెలవును తీసుకొని కొందరు తండ్రులు (పురుషులు) శిశు సంరక్షణా బాధ్యతను నిర్వహించక పోవటాన్ని గమనించి, నార్వే ప్రభుత్వం, నియమిత కాలం పాటు తండ్రి పేరెంటల్ లీవ్‌ను విధిగా తీసుకోవాలి అని చట్టపరమైన నిర్దేశాలను జారీచేసింది. కుటుంబ సంబంధమైన పనులను చూచుకోవటానికి వీలుగా కొన్ని నార్డిక్ దేశాలు, ఇటువంటి అవసరాలున్నవారు పనికాలంలో కొద్ది భాగాన్ని వాడుకొనే వీలును కల్పించాయి. ఉదాహరణకు ఫిన్లండ్, స్వీడన్ దేశాల అనుభవాన్ని చూడవచ్చు. నాలుగు సంవత్సరాల లోపు పిల్లలున్న తల్లిదండ్రులలో ఒకరు, పని కాలంలోని రెండు గంటలను తగ్గించుకొని, శిశు సంరక్షణా బాధ్యతా నిర్వహణకు ఇంటికి వెళ్ళవచ్చునని ఫిన్లండ్ 1976 వ సంవత్సరంలో శాసనం చేసింది స్వీడన్ పది సంవత్సరాల లోపు వయస్సు పిల్లలున్న తల్లి దండ్రులు ఇలాంటి వసతిని అనుభవించే అవకాశాలను కల్పించింది.

గృహనిర్వహణా బాధ్యతలకు అనువుగా పనికాలపు సవరింపు : రోజుకు ఏడులేక ఎనిమిది గంటల పనిని ఉద్యోగి చేయవలసి ఉంటుంది. ఏక బిగువున ఈ పని చేస్తుండటం కంటే, ఇంటి పనులను చేయటానికి అనువుగా పని కాలాన్ని సవరించగలిగితే స్త్రీ-పురుష ఉద్యోగులకు ఇబ్బంది లేకుండా ఉంటుంది ఈ భావాన్నే ఫ్లెక్సిబుల్ వర్క్ షెడ్యూల్‌గా వ్యవహరిస్తున్నారు. ఈ విధానపు అవలంబన వల్ల సంస్థలకు ఎలాంటి నష్టమూ ఉండదు స్వీడిష్ ప్రభుత్వం ఉద్యోగి అవసరాన్ని బట్టి పార్ట్‌టైం పనిని చేయటానికి కూడా అవకాశాన్ని కల్పిస్తున్నది. ఫుల్‌టైం ఉద్యోగి, ఇంటి అవసరాల దృష్ట్యా పార్ట్‌టైంకు మారినా, వారు కోరినపుడు తిరిగి ఫుల్‌టైం ఉద్యోగిగా పనిచేసే అవకాశాన్ని ప్రభుత్వం గ్యారెంటీ చేసింది. జర్మనీ, జపాన్ ప్రభుత్వాలు కూడా ఉద్యోగులకు ఫ్లెక్సిబుల్ టైం వసతి నిస్తున్నాయి ఉద్యోగి ఇంటి వద్దే ఆఫీసు పనిని చేసే సదుపాయాన్ని కూడా కొన్ని వ్యాపార సంస్థలు కల్పిస్తున్నాయి.

ఆస్థి వారసత్వము, విడాకులకు సంబందించిన చట్టాల సవరణ : పురుషునితో సమానమైన సంపాదనా పరురాలుగా స్త్రీకి గుర్తింపు లభిస్తున్నపుడు, పైన పేర్కొన్న మూడు విషయాల లోనూ స్త్రీకి చట్టబద్ధమైన హక్కు లుండాలనటం అత్యాశ కాదు శాసనాలను జారీ చేసినంత మాత్రాననే స్త్రీలకు హక్కులు సంక్రమించని స్థితిని ఇంతకు పూర్వమే చూచాం. వీటి అమలుకు తగిన మహిళా ఉద్యమ నిర్మాణం కూడా అవసరం.

### 3. రాజకీయ ఆర్థిక రంగాలలో పురుషుల తోడిసమానత్వం

రాజకీయ ఆర్థిక రంగాలలో పురుషుల తోడి సమాన ప్రాతినిధ్యాన్ని ప్రతిదేశము కల్పించాలి. ఈ గమ్యానికి స్త్రీ లింకా చాలా దూరంగా ఉన్నట్లు ఇంతకు పూర్వమే వివరించాం. ఈ సమానత్వ సాధనకు కాల నియమ ప్రాతిపదిక మీద ప్రభుత్వాలు కృషి చేయాలి. ఈ కార్యసాధనకు రాజకీయ పరమైన దీక్ష అవసరం. స్త్రీ ప్రాతినిధ్యం మొత్తంలో సగభాగంగా ఉండాలా, మూడవ వంతుగా ఉండాలా అన్నది ఇంకా చర్చనీయ దశలోనున్నది. కాని ఇప్పటికే నార్డిక్ దేశాలు మూడవ వంతు పరిమాణాన్ని మించి పోయాయి. సమాజంలో విస్తృత ప్రాతిపదిక మీద జరిగే రాజకీయ ఆర్థిక మార్పుల వల్ల మాత్రమే స్త్రీలకు మూడవ వంతు ప్రాతినిధ్యమైనా లభించే వీలుంటుంది.

### 4. అభివృద్ధి అవకాశాల లభ్యతకు ప్రత్యేక కార్యక్రమం

స్త్రీ జనోద్ధరణకు, విద్య, పరపతి అవకాశాల పెంపు అతి ముఖ్యమైనవి. ఇలాగే సంతాన ప్రాప్తి విషయంలో కూడా స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలి.

స్త్రీ విద్య : ఇతర కార్యక్రమాల మీద కంటే స్త్రీ విద్యావ్యాప్తి మీద పెట్టిన పెట్టుబడికి అధిక ప్రతిఫలం లభిస్తుంది. స్త్రీ విద్యావంతురాలు గావటం వల్ల ఆవ్యక్తి

మాత్రమే గాక, ఆవిడ కుటుంబం, సమాజం కూడా లాభిస్తాయి. కుటుంబాని కంటే కూడా సమాజానికి అధిక ప్రయోజనం చేకూరుతుంది. స్త్రీ విద్యావంతురాలయినపుడు, ఆ విద్యా వారసత్వం తరువాతి తరాల వారికి కూడా సంక్రమించే అవకాశాలు అధికంగా ఉంటాయి. (స్త్రీ విద్యా ప్రయోజనాన్ని గురించి వేరొక అధ్యాయంలో వివరంగా చర్చించాం)

**సంతాన ప్రాప్తి మీద అదుపు :** తాను ఎపుడు కనాలి, ఎందరను కనాలి అనే విషయ నిర్ణయావకాశాలు స్త్రీలకే ఉండాలి. ఇందువల్ల స్త్రీకి తన కాలవ్యవధి మీద అధికారం లభిస్తుంది. ఎపుడు కనాలి, ఎందరను కనాలి అనే అంశాన్ని తానే నిర్ణయించు కొంటుంది. ఈ నియంత్రణ వల్ల లభించిన కాలవ్యవధిని తనకు ఉచితమని తోచిన పనులకు వినియోగించు కొంటుంది. సామాజిక జీవనంలో స్వేచ్ఛగా పాల్గొనే అవకాశాన్ని పొందుతుంది. కనుక, దీనిని వారి హక్కుగా గుర్తించి అమలు జరపాలి.

**పరపతి సౌకర్యాన్ని పొందే అవకాశాలు :** అల్పాదాయ వర్గాల స్త్రీలు దారిద్ర్యం నుండి బయటబడే ప్రయత్నం చేయటానికి, పొట్టపోసుకోవటానికి పరపతి సౌకర్యం లభించటం అవసరం స్వంత వ్యాపారాలను ప్రారంభించే స్త్రీలకు ప్రోత్సాహకరంగా ఉండటానికి పరపతి సౌకర్యం లభించాలి.

### 5. రాజకీయ ఆర్థిక రంగాలలో స్త్రీలకు అధికావకాశాలు

అన్ని దేశాలు, ఆయాదేశాల ఆర్థిక, రాజకీయ రంగాలలో స్త్రీలకు కూడా సముచిత ప్రాతినిధ్యం లభించేట్లు చూడాలి.

**అత్యవసర సామాజిక సేవలు :** మానవులు మానవులుగా బ్రతకటానికి అవసరమైన విద్యార్జనా వసతులను, ప్రాథమిక ఆరోగ్యరక్షణ, వైద్య చికిత్సా వసతులను, ప్రజలు త్రాగటానికి రక్షిత నీటి సరఫరా ఏర్పాటును, కుటుంబ నియంత్రణా సర్వీసులను, పేదలకు పోషకాహార కార్యక్రమాల నిర్వహణనూ ప్రభుత్వాలు విధిగా చేపట్టాలి.

**చూలు-కాన్పు కాలంలో ఆరోగ్య రక్షణ :** చూలు-కాన్పు కాలపు మరణాలు అధికంగా ఉండటాన్ని, ఈ కాలపు ఆరోగ్య రక్షణాలేమి వల్ల అధిక సంఖ్యాక స్త్రీలు జీవితాంతం అనారోగ్యాన్ని అనుభవిస్తూండటాన్ని ఇంతకు పూర్వమేచూచాం స్త్రీల ఈ రోగ భారపు తగ్గింపుకు ప్రభుత్వాలు ప్రత్యేక శ్రద్ధను తీసుకోవాలి.

**ప్రతి వారికి బ్రతుకు దెరువు :** దారిద్ర్య నిర్మూలనకు ప్రతివారికి సంపాదనావకాశాలు లభించేట్లు చూడాలి. అట్లని అందరకూ ప్రభుత్వాలు ఉద్యోగాల నీయాలని భావించ నవసరంలేదు. స్వయంఉపాధికి అవకాశమిచ్చే ఏర్పాట్లను చేయవచ్చు. ప్రతివారూ లేబర్ మార్కెట్‌కు రావటానికి తగిన అర్హతలను సంపాదించటానికి ప్రభుత్వాలు తోడ్పడాలి.

**దారిద్ర్య భారపు తగ్గింపు :** దారిద్ర్య నిర్మూలన అతి స్వల్పకాలంలో జరిగేది కాదు. కాని, దాని భారాన్ని తగ్గించే అవకాశాలున్నాయి. కాల నియమ ప్రాతిపదిక మీద ఇందు కుపకరించే కార్యక్రమాలను ప్రభుత్వాలు చేబట్టాలి.

స్త్రీ జనోద్ధరణకు అనుసరణీయమైన కార్యక్రమాలలో ఇవి కొన్ని మాత్రమే. అవసరాన్ని బట్టి, ప్రభుత్వాల ఆర్థిక స్థోమతను బట్టి కార్యసాధనకు అవసరమైన కార్యక్రమాలను అమలు జరపాలి. స్త్రీ పురుష సమానత్వ సాధనా గమ్యాన్ని చేరటానికి అవసరమైన ప్రతి పనిని ప్రభుత్వాలు దీక్షతో అమలు జరపటం అవసరం.

# 24

## ఉపసంహారం

ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక పునర్వ్యవస్థీకరణ జరుగుతున్నది. స్త్రీలు కూడా, ఉన్న విద్యావనతుల నుపయోగించుకొని ఆర్థికవ్యవస్థలో ప్రధాన భాగస్వామినులుగా తయారవుతున్నారు. అట్లని ఇంతకు పూర్వం స్త్రీలు సంపదోత్పత్తిలో కీలకపాత్రను నిర్వహించలేదని భావించకూడదు కాని వారి శ్రమఫలితానికి తగినంత గుర్తింపు అన్ని సందర్భాలలోనూ లభించటం లేదనటం మాత్రం నిజం. ఆర్థిక పునర్వ్యవస్థీకరణ క్రమంలో కొన్ని క్రొత్త ధోరణులు తలయెత్తుతున్నట్లు ఇంతకు పూర్వమే చూచాం. ఫార్మల్ సెక్టార్లోమార్పులొస్తున్నాయి. ఇన్‌ఫార్మల్ సెక్టార్ విస్తరిస్తున్నది. ఈ రెంటి నడుమ ఇంటర్మీడియేట్ సెక్టార్ అంటూ మరొకటి అవతరించింది. పార్ట్ టైం పని, ఇంటివద్దనే ఉంటూ చేసే కాంట్రాక్టు పనుల వంటివి కూడా లభిస్తున్నాయి. లేబర్ మార్కెట్ పనివిధానాన్ని నియమిత పరచే చట్టాలు, ఇంతవరకూ ఉన్నవి, క్రమంగా సరళీకరణను పొందుతూండటమో, అంతరించటమో జరుగుతున్నది. ఈ విధంగా లేబర్ మార్కెట్‌కు చట్టాల సంకెలలు విడివడుతున్నాయన్నమాట. ఈ పరిణామాలు స్త్రీలకు కొన్ని సవాళ్ళను విసురుతున్నాయి.

మారుతున్న ఫార్మల్ సెక్టార్ స్వభావం : ఆర్థిక సంక్షోభము, అంతర్జాతీయ మార్కెట్లో పెరుగుతున్న పోటీ, వ్యాపార రంగంలో అమలు జరుగుతున్న సరళీకరణవిధానాలు, అభివృద్ధి చెందిన దేశాలలో శరవేగంతో పురోగమిస్తున్న ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ, ఇతర ఆధునిక సాంకేతిక విధానాలు సంప్రదాయ రంగ (ఫార్మల్ సెక్టార్) స్వభావాన్ని మార్చివేస్తున్నాయి. మాజీ కమ్యూనిస్టు దేశాలలోనూ, అభివృద్ధి చెందుతున్న దేశాలలోనూ ప్రభుత్వరంగంలోని లాభసాటిగాని పరిశ్రమలు ప్రైవేట్ రంగ పరమవుతున్నాయి; లేదా అంతరిస్తున్నాయి. ప్రపంచ మార్కెట్లో పోటీని తట్టుకోవటానికి తగిన మార్పులను ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెడుతున్నారు. ఈ మార్పుల వల్ల పురుషుల కంటే స్త్రీలు అధిక నిరుద్యోగ భారాన్ని అనుభవించ వలసి వస్తున్నది. ఈ రెండు వర్గాల దేశాలు ఆర్థిక పునర్వ్యవస్థీకరణ కొరకు, విదేశీ రుణాలకు, పెట్టుబడులకూ ప్రాకులాడుతున్నాయి

విదేశీపెట్టుబడులతో ఎక్స్‌పోర్టు జోన్సు ఏర్పాటు, తద్వారా ఎగుమతి సరుకుల ఉత్పత్తి పెరుగుదల వల్ల తమకు ఉపాధి అవకాశాలు పెరుగుతాయని స్త్రీలు ఆశించటం

సహజం స్త్రీల సృజనాత్మక శక్తుల పెంపుదల కూడా ఈ మార్పులతో జరిగినపుడే వారి ఉపాధి అవకాశాలు పెరుగుతాయి, ఈ మార్పుల ప్రయోజనాలను వారు అనుభవించగలుగుతారు ఇది జరుగనపుడు, ఈ మార్పులవల్ల స్త్రీలకు లభించే ప్రయోజనం తాత్కాలికమే అవుతుంది. పారిశ్రామికాభివృద్ధి జరుగుతున్న కొలదీ, దానికి వినియోగించే సాంకేతిక ఉత్పత్తి స్థాయి కూడా పెరుగుతూండటం సహజం అవసరమైనంత సాంకేతిక వృత్తినైపుణ్యం స్త్రీలకు లభించనపుడు, ఉత్పత్తి విధానంలో వస్తున్న మార్పుల వల్ల, ఇంతవరకూ అల్ప వేతనాలకు లభిస్తున్న స్త్రీల శ్రమ అవసరం పరిశ్రమలకు ఇక ముందు ఉండదు. ఈ దశలో తగినంత సాంకేతిక వృత్తినైపుణ్యం ఉన్న వర్కర్సు అవసరమవుతారు ఇందువల్ల స్త్రీలు ఎగుమతి పరిశ్రమలలో ఉద్యోగాలను కోల్పోతున్నారు; వీరు అసంఘటిత రంగాన్ని ఆశ్రయించక తప్పటం లేదు. ఇప్పటికే కావలసినంత సిబ్బంది ఉన్న ఈ రంగం, వీరికి అల్పవేతనాల నిచ్చి వారి శ్రమను కారు చౌకగా వినియోగించుకొంటున్నది.

అభివృద్ధి చెందిన దేశాలలో కంప్యూటర్లను ప్రవేశపెట్టటం, సంస్థ నిర్వహణ, ఉత్పత్తి ఖర్చుల తగ్గింపుకు అవలంబిస్తున్న విధానాలు (దీనిని డౌన్ సైజింగ్ అని వ్యవహరిస్తునారు) సర్వీసెస్ సెక్టార్‌ను కూడా ప్రభావితం చేస్తున్నాయి. కంప్యూటర్లను ప్రవేశపెట్టటం, డౌన్ సైజింగ్‌కు తోడు, విదేశాలలో పరిశ్రమలను ఏర్పాటు చేయటం వంటి విధానాల అవలంబన వల్ల, ఈ వర్గపు దేశాలలో దిగువ స్థాయి ఉద్యోగాలు అంతరిస్తున్నాయి. ఈ పరిణామాల దెబ్బను తట్టుకోవాలంటే, స్త్రీలు, తమకున్న శక్తియుక్తులతో పాటు, వృత్తి పరమైన సాంకేతిక స్థాయిని కూడా పెంచుకొవాలి. ఇందుకు అవసరమైన వసతులు అభివృద్ధి చెందిన దేశాలలో ఉన్నాయి. ఈ దేశాల స్త్రీల విద్యాస్థాయి కూడా అధికంగా ఉన్నది కనుక, కృతనిశ్చయం గలిగిన ఈ దేశాల మహిళలకు ఈ మార్పులను తట్టుకొని ఉద్యోగాలను నిలుపుకోవటం అంత కష్టమైన పనిగాదు.

మధ్యయూరపులోనూ, తూర్పు యూరపులోనూ ఉన్న మాజీ కమ్యూనిస్టు దేశాలలో ఉత్పత్తి వనరులు ప్రైవేట్ రంగానికి మారుతున్నాయి. ఉపాధి రంగంలో, ఇతర దేశాలలో ఉన్నంత లింగ వివక్ష ఈ దేశాలలో లేదు అయినా ప్రభుత్వ రంగం అంతరిస్తూ, ప్రైవేట్ రంగం అవతరించి విస్తరిస్తున్నందువల్ల, పురుషుల కంటే స్త్రీలు అధిక నిరుద్యోగాన్ని అనుభవించవలసి వస్తున్నది. విధిలేక, స్త్రీలు క్రమంగా ఉన్నతోద్యోగాల నుండి దిగువస్థాయి గుమాస్తా ఉద్యోగాలకు జారిపోతున్నారు ఈ ప్రాంతపు దేశాల స్త్రీలు మూడురకాలుగా సవాళ్ళను ఎదుర్కొనవలసివస్తున్నది 1. లేబర్ మార్కెట్లో పురుషులతో పోటీచేసి ఉద్యోగాలను సంపాదించటానికి తగిన వృత్తినైపుణ్యాన్ని మహిళలు సంపాదించవలసి ఉంటుంది; 2 మారుతున్న ఆర్థిక వ్యవస్థతో పురుషులతో సమానమైన స్థానాన్ని పొందటానికి వారు కృషిచేయవలసి ఉంటుంది, 3 వారు వేతనార్జనలో ఉండటానికి వెన్నుదన్నుగా నిలిచిన కార్మిక సంక్షేమ వసతులు (ఉచిత డేకేర్ సెంటర్ల వంటి వసతులు) అంతరించకుండా చూసుకోవలసి ఉంటుంది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో స్త్రీలు ఇప్పటికే టీచింగ్, మెడిసిన్, లీగల్ వృత్తులలో ఉన్నారు ఆర్థిక స్థోమత గలవారు వ్యాపార రంగంలో కూడా ప్రవేశిస్తున్నారు కాని అసంఖ్యాక స్త్రీలు గుమాస్తాలుగా, కార్మికులుగా జీవిస్తున్నారు. స్త్రీల సృజనాత్మక శక్తుల అభివృద్ధికి అవకాశాలు తగినంతగా లేకపోవటంచేతా, ఉన్నంతమేరకు అవి అందరకూ అందుబాటులో ఉండకపోవటం చేతా, స్త్రీలు, ఉద్యోగావకాశాల వినియోగంలో పురుషులకంటే వెనుకబడిపోతున్నారు. ఈ స్థితి కొంతకాలంపాటు కొనసాగే అవకాశాలున్నాయి.

ఈ అననుకూలతలు చాలవన్నట్లు, ఆర్థిక పునర్వ్యవస్థీకరణ, సరళీకరణ విధానాల అమలువల్ల స్త్రీలు వాడకందార్లుగానూ, వృత్తిలోని కార్మికులుగానూ నష్టపడుతున్నారు. నిత్య జీవితావసర వస్తువుల ధరల పెరుగుదల వల్ల కుటుంబ ఖర్చులు పెరిగిపోతున్నాయి. ప్రభుత్వాలిచ్చే సబ్సిడీల కోతవల్ల విద్య, ఆరోగ్యము, ఇతర సంక్షేమ ఖర్చులు కూడా పెరుగుతున్నాయి. (ఈ విషయంలో అన్ని దేశాలవారికంటే, మాజీ కమ్యూనిస్టు దేశాల స్త్రీలు అధికంగా నష్టపడ్డారు) ఇటువంటి పరిస్థితులలో ఇల్లు గడవక స్త్రీలు అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్‌కు వచ్చి దొరికిన పనినల్లా చేబట్టక తప్పటం లేదు. ఈ పరిణామం వల్ల లేబర్ మార్కెట్‌కు వచ్చే స్త్రీల సంఖ్య పెరుగుతున్నది. మాజీ

కమ్యూనిస్టు దేశాలలో ఉత్పత్తి వనరుల ప్రైవేటీకరణవల్లా, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రభుత్వరంగము క్రమంగా కుదించుకుపోతూ ఉండటం వల్లా, సంస్థల నిర్వహణా ఖర్చుల తగ్గింపుకు అమలు జరుగుతున్న డౌన్ సైజింగ్ వంటి సంస్కరణల అమలువల్లా నిరుద్యోగం పెరుగుతున్నది. పురుషుల కంటే స్త్రీలు అధికంగా నిరుద్యోగులవుతున్నారు.

ఉన్నత స్థాయి విద్యాభ్యాసం, లేబర్ మార్కెట్లో పురుషులతో ఉపాధి సంపాదనకు పోటీబడటం, ప్రభుత్వాలిస్తున్న సబ్సిడీల కోత, సంక్షేమ కార్యక్రమాల రద్దు లేక వాటి కుదింపు వంటి వాటి వల్ల ఏర్పడిన సంక్షుభిత పరిస్థితులలో సంసార సాగరాన్నీదటం - ఈ సందర్భంలో స్త్రీలెదుర్కొనవలసి వస్తున్న సవాళ్ళు.

2. ఇంటర్మీడియేట్ సెక్టార్ అవతరణ : ఫార్మల్ సెక్టార్ (సంప్రదాయ రంగం) కుదించుకుపోతూ ఉండగా, అసంఘటిత రంగం త్వరితగతిని విస్తరిస్తూ అధిక సంఖ్యాక స్త్రీలను ఆకర్షిస్తూండగా, ఈ రెంటి నడుమ ఇంటర్మీడియేట్ సెక్టారొకటి అవతరించింది. ఉన్నతస్థాయి సాంకేతిక విధానం దీనికి పునాది. ఈ రంగానికి త్వరితగతిని విస్తరించగల శక్తి ఉన్నట్లు భావిస్తున్నారు. అకౌంటెంట్స్, ఇన్సూరెన్స్ ఏజెంట్స్, లీగల్, ఫైనాన్షియల్ కన్సల్టెంట్స్, మార్కెటింగ్ ఏజెంట్స్, కంప్యూటర్ స్పెషలిస్టులు, కన్సల్టెంట్స్ - ఈ పరిశ్రమకు ప్రధానాంగాలు.

ఈ రంగానికి చెందిన పారిశ్రామిక విభాగంలోనూ, సర్వీసెస్ విభాగాలలోనూ మహిళా ఉపాధికి అవకాశాలుంటున్నాయి. దీనివల్ల అభివృద్ధి చెందిన దేశాల స్త్రీలకు మాత్రమే గాక, అభివృద్ధి చెందుతున్న దేశాల మహిళలకు కూడా ఉపాధి అవకాశాలు పెరుగుతాయని చెబుతున్నారు. ఈ వృత్తులలో ప్రవేశానికి, ఉన్నతస్థాయి విద్యార్జన, వృత్తిపరమైన ట్రెయినింగ్ అవసరం. ఇలాంటి అవకాశాలు లభించిన మహిళలు స్వంత వ్యాపారాలను ప్రారంభించటం కూడా కనుపిస్తున్నది. ఉన్నతస్థాయి విద్యార్జన కంటే, వ్యాపార సంస్థలను నడుపగల నైపుణ్య సాధన, లభిస్తున్న నూతనావకాశాలవల్ల లాభించగలగటం అనేవి స్త్రీలకు ముఖ్యమైన సవాళ్ళుగా కనుపిస్తున్నాయి.

3. అసంఘటిత రంగ విస్తరణ : అసంఘటిత రంగం త్వరితగతిని విస్తరిస్తున్నది. లేబర్ లాల సడలింపు ఈ రంగానికి విపరీతమైన స్వేచ్ఛనిస్తున్నది. కార్మికుల, ఉద్యోగుల ఉపాధి భద్రతను మార్కెట్ పరిస్థితులు నిర్ణయిస్తాయి. ఇందువల్ల కార్మికుల పని పరిస్థితులు, ఉపాధి గ్యారంటీ విషయాలలో సంఘటిత రంగానికి, అసంఘటిత రంగానికి ఇంతకుపూర్వం ఉన్న భేదం అంతరిస్తున్నది. ఆర్థిక సరళీకరణ, ఆర్థిక పునర్వ్యవస్థీకరణలను అమలు జరుపుతున్న అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రస్తుతం అసంఘటిత రంగమే స్త్రీలకు అధిక ఉపాధి అవకాశాలనిస్తున్నది. ఉద్యోగ భద్రత, కనీస వేతన సాధన, పని పరిస్థితులను మెరుగుపరచుకోగలగటం అనేవి ఈ రంగంలో స్త్రీలనెదుర్కొంటున్న సవాళ్ళు.

లేబర్ మార్కెట్ స్వేచ్ఛ :- లేబర్ రెగ్యులేషన్ చట్టాల సవరణ, లేక ఉపసంహరణ లేక లేబర్ లాల సరళీకరణ వంటివి ఇపుడు పెద్దయెత్తున జరుగుతున్నాయి. ఇందువల్ల కార్మికుల హక్కులు హరించుకుపోతున్నాయి. ఉద్యోగ భద్రత, కనీస వేతనం వంటివి క్రమంగా కనుమరుగవుతున్నాయి. రోజువారీ కూలీలు గానో, పార్ట్‌టైం వర్కర్లుగానో, కాంట్రాక్టు పనివారుగానో లేక తాత్కాలిక ఉద్యోగులుగానో స్త్రీలుండవలసి వస్తున్నది.

వేతనాల నిర్ణయంలోనూ, ఉద్యోగాలనీయటంలోనూ ప్రదర్శితమయ్యే లింగ వివక్షా తీవ్రతను ఎదుర్కొనవలసిరావటం అనేవి ఈ రంగంలో స్త్రీలు ఎదుర్కొనవలసి ఉన్న సవాళ్ళు.

స్త్రీలు ఈ సవాళ్ళను ఎదుర్కొనటానికి ట్రేడ్ యూనియన్లు, ప్రజా సంస్థలు, వారికి అండగా నిలవటం అవసరం. మారుతున్న ఆర్థిక విధానాలకు, సంస్థల నిర్వహణా విధానంలో వస్తున్న మార్పులకు తగినట్లుగా స్త్రీలు వృత్తిపరమైన నైపుణ్యాన్ని పెంచుకొనవలసి ఉంటుంది. ప్రభుత్వాలు కూడా లేబర్ మార్కెట్ రెగ్యులేటరీ విధానాలనవలంబిస్తూ స్త్రీల ఉపాధిని, పని పరిస్థితులను అదుపు చేయటం అవసరం; లేబర్ మార్కెట్లో తాండవిస్తున్న లింగ వివక్షను తొలగించటానికి కృత నిశ్చయంతో పనిచేయాలి.

## నూతన సాంఘిక విప్లవం

స్త్రీల ఆర్థిక రంగ ప్రవేశం వల్ల చరిత్రాత్మక సాంఘిక

విప్లవం ప్రారంభమైంది. పారిశ్రామిక విప్లవంతో సమానమైనదిగా దీనిని వర్ణించవచ్చు. పారిశ్రామిక విప్లవం తర్వాతనే స్త్రీలు పనిచేయు నారంభించారా? ఇంతకు పూర్వం ఎన్ని తరాల నుండి వారు పనిచేయటం లేదు? ఇలాంటి ప్రశ్నలుదయించటం సహజం. మన అమ్మలు, అమ్మమ్మలు, నాయనమ్మలు వారి పూర్వీకులు పనిచేశారు. వారు ఇంట్లో ఉండి పనిచేశారు. ఉన్న కుటుంబ కమతానికి కట్టుబడ్డారు. జాయంట్ ఫామిలీలుండటం వల్ల తల్లి పనులకు వెళ్ళినా, మిగిలిన కుటుంబీకులు వారి పిల్లలను చూచేవారు. ఇపుడు "పని" అంటే ఇలాంటిది గాదు; ఇల్లు విడిచి వేరొక చోటకు పోయి పనిచేయవలసి వస్తున్నది. నేడు జాయింట్ ఫామిలీలు లేవు; అంతరించాయి; లేక అంతరిస్తున్నాయి. న్యూక్లియర్ ఫామిలీలు (భార్యాభర్తలు, వారి సంతానానికి మాత్రమే పరిమితమైనవి) అవతరించాయి. భార్యాభర్తలు వేతనార్జనకు వెళ్ళినపుడు పిల్లల క్షేమాన్ని చూచే వారుండటం లేదు. తాము పనులకు వెళ్ళి తిరిగి వచ్చే సరికి ఇంటి పనులను చేసి పెట్టేవారు కూడా ఎవరూ ఉండటం లేదు. ఉద్యోగం నుండి ఇంటికి వచ్చిన తర్వాత ఇంటి పనులను ఇల్లాలే చేసుకోవలసి వస్తున్నది. పిల్లల అవసరాలను కూడా తల్లే తీర్చవలసి ఉంటున్నది. ఇందువల్ల ఇల్లాలి శ్రమభారం రెట్టింపైంది. ఆఫీసుపని ఒక షిఫ్టు అనుకొంటే, ఇంటిపని రెండవ షిఫ్టు పనైంది. ఈ విప్లవం తెచ్చిన కొత్త పరిణామమిది. రెండు షిఫ్టుల పనిని చేయటంలోని ఇల్లాలి పెనుగులాట, కుటుంబ జీవనాన్ని, ముఖ్యంగా ఆవిడ వైవాహిక జీవనాన్నీ, పిల్లల పెంపకాన్నీ తీవ్రంగా ప్రభావితం చేస్తున్నది. మారిన పరిస్థితులలో జీవన యాత్రను సాగించటం ఆవిడకు పెద్ద సవాలుగా తయారైంది.

ఈ సాంఘిక విప్లవం రావటానికి పారిశ్రామిక విప్లవం బాటలు వేసింది. ఈ రెండు విప్లవాలు స్త్రీ పురుషులను సమంగా ప్రభావితం చేయలేదు; వారిలో మార్పులను కూడా ఒకే కాలంలో తీసుకొని రాలేదు. పారిశ్రామికీకరణ విస్తరణతో, గ్రామసీమలలో వ్యవసాయం మీద ఆధారపడి జీవిస్తున్న పురుషులు పారిశ్రామిక కేంద్రాలకు వలస పోసాగారు. పరిశ్రమలలోనో, వ్యాపార రంగంలోనో ఉపాధిని సంపాదించి పట్టణాలలో స్థిరపడ నారంభించారు. భర్త వేతనార్జనకు వెళ్ళగా, ఇంటిపట్టు నుండి ఇంటి పనులను చేసుకొంటూ, పిల్లల పోషణ - సంరక్షణా భారాన్ని వహిస్తూ, భర్త మనశ్శాంతితో ఉద్యోగ విధులను నిర్వహించటానికి తగిన సేవలను ఇల్లాలు చేస్తూండేది. ఇంటి పనులలో వేటినీ చేయవలసిన అవసరం భర్తకు లేకుండా ఇల్లాలు గృహ నిర్వహణా బాధ్యతలను, తానొక్కర్తే, నిర్వహిస్తూండేది ఇలాంటి సేవలనుచేస్తూ, భర్త వృత్తిలో చక్కగా పనిచేస్తూ, ఉన్నత పదవులకు యెదగటానికి ఇల్లాలు తోడ్పడుతూ ఉండేది. ఇల్లాలికి సంబంధించినంత వరకూ గ్రామ సీమల నివాసం పట్టణ ప్రాంతానికి మారింది; జాయింట్ ఫామిలీలు పోయి న్యూక్లియర్ ఫామిలీలు అవతరించాయి. నివాస స్థలం మారిందేతప్ప ఇల్లాలి జీవన విధానంలో చెప్పదగిన మార్పేదీ రాలేదు. ఈ పరిణామ క్రమంలో, పురుషుల జీవన సరళి మారిందిగాని, స్త్రీల జీవన విధానంలో చెప్పదగిన మార్పు రాలేదు. ది బాండ్స్ ఆఫ్ ఉమన్ హుడ్ అన్న తమ రచనలో నాన్సీ కాట్ ఈ విషయాన్నిలా వివరించారు: "పంధొమ్మిదవ శతాబ్ద కాలమంతా, పురుషులతో పోల్చితే, ఇంతకు పూర్వపు జీవన విధానానికే మహిళలు కట్టుబడి ఉన్నారు; మార్పు ఏదీ రాలేదు. వారి వైవాహిక జీవన విధానాలను పోల్చి చూచినపుడు, స్త్రీలలో కంటే పురుషులలో అధిక మార్పు లొచ్చినట్లు కనుపిస్తుంది."

### త్వరితగతిని మారుతున్న స్త్రీల జీవన విధానం

నూతన విప్లవ పురోగమన కాలంలో స్త్రీల జీవన విధానంలో త్వరితగతిని మార్పు వస్తున్నది. సర్వీసెస్ రంగం త్వరిత గతిని విస్తరిస్తూండటంతో, వారికి వేతనార్జనావకాశాలు పెరుగుతున్నాయి. దీనికి తోడు కుటుంబ పోషణకు భార్యా భర్త లిరువురూ వేతనార్జనకు వెళ్ళి తీరవలసిన రోజులొచ్చాయి. స్త్రీల విద్యార్జనావకాశాలు కూడా పెరిగాయి. ఇందులో వారు ఉన్నత విద్యాభ్యాసానికి కూడ వెళుతున్నారు. ఇంతకు పూర్వం వలె అదుపు లేని సంతానప్రాప్తిని అనుభవించటం లేదు. అవసరమెరిగి సంతానప్రాప్తిని నియమిత పరచుకొంటున్నారు. ఇంతకు పూర్వం, జీవిత కాలంలోని శక్తి ఉన్న కాలమంతా పిల్లలను కనటం, పెంచటం వంటి పనులకే ప్రధానంగా సరిపోయేది. నియమిత సంతాన ప్రాప్తి వల్ల వారికి చాలా వరకు కాలవ్యవధి కలసి వస్తున్నది. ఇందువల్ల స్త్రీలు అధిక సంఖ్యలో లేబర్ మార్కెట్‌కు వెళుతున్నారు. నాటి పురుషుల

వలె, నేటి స్త్రీలు పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థలలో ప్రవేశిస్తున్నారు. గ్రామ సీమలలోని పురుషులను పారిశ్రామిక విప్లవం పారిశ్రామిక కేంద్రాలకు పెకలించుకుపోయినట్లే, నేటి పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థ స్త్రీలను అధికంగా ఆకర్షిస్తున్నది. నాడు పురుషులు సంప్రదాయ జీవనం నుండి నూతన జీవనావలంబనకు ప్రాకులాడినట్లే, నేడు స్త్రీలు కూడా తమ సంప్రదాయ జీవన విధానంలో మార్పులను చేసుకొనవలసి వస్తున్నది. ఇంతవరకూ ఇంటి పట్టున ఉంటూ ఇంటి పనులను చేసుకొంటూ, పిల్లలను చూసుకొంటూ, వేతనార్జనకు వెళుతున్న భర్తకు అవసరమైన సేవల నందిస్తూ ఉన్న ఇల్లాలు, ఇపుడు ఈ శ్రమ భారాన్నంతటినీ మోస్తూ, వేతనార్జనకు వెళ్ళి రోజుకు ఎనిమిది గంటల చొప్పున పనిచేసి రావలసి వస్తున్నది. వేతనార్జనే ఒక షిఫ్టు పనయితే, నిర్వహణా భారం దృష్ట్యా గృహ నిర్వహణ, శిశు సంరక్షణ రెండవ షిఫ్టు పనై కూర్చుంది! (గృహనిర్వహణ, శిశు సంరక్షణ హోల్‌టైం పని కంటే కూడా భారమైనదన్న విషయం ఇల్లాండ్రందరకూ తెలుసు. మొత్తం పనిచేసే కాలం దృష్ట్యా చూసినా, ఇంటి పట్టున ఇల్లాలున్నా, భర్త కంటే ఆవిడ అధిక కాలం పని చేస్తున్న విషయాన్ని సంఖ్యా సమాచారంతో సహా ఇంతకు పూర్వమే వివరించాం.) పురుషుడు ఒక్క షిఫ్టు పనిని చేస్తూండగా, స్త్రీ రెండు షిఫ్టుల పనిని చేయవలసి వస్తున్నది. అంతేకాదు; వేతనార్జనకు వెళ్ళే భర్తకు అవసరమైన అన్ని వసతులను ఇల్లాలు కల్పిస్తున్నది. కాని తానే వేతనార్జనకు వెళ్ళ నారంభించినపుడు, ఆవిడకు ఇటువంటి సహాయాన్నెవరూ చేయటం లేదు. ఉద్యోగ నిర్వహణలో రాణించటానికి పురుషునకు లభించిన సహకారం, సపోర్టు, వేతనార్జనకు వెళుతున్న ఇల్లాలికి లభించటం లేదు!

వేతనార్జనకు వెళుతున్న స్త్రీ, ఇంటి పట్టున ఉండే ఇల్లాలి కంటే తాను గొప్పదానినని అనుకోవటం ఆశ్చర్యకరమైన అంశం గాదు. రొఖ్ఖరూప సంపాదన ప్రతిష్ఠాకరమైన విషయమైంది. కుటుంబంలో ఇల్లాలి కిది ఒక హోదాను కల్పించింది. ఆవిడ వేతనార్జన "ప్రయోజన కరమైన" పనిగా కనుపించసాగింది. ఇట్లని వర్కింగ్ ఉమన్ జీవితం స్వర్గధామమైనట్లు భావించ నవసరం లేదు; ఆవిడా సమస్యల చక్రబంధంలో చిక్కింది.

## ప్రమాదంలో చిక్కిన వర్కింగ్ ఉమన్ వైవాహిక బంధం

వేతనార్జనకు వెళుతున్న వర్కింగ్ ఉమన్ హోదా, అధికారం కుటుంబంలో పెరిగినా, ఈ పరిణామం నుండే ఆవిడ స్థానాన్ని బలహీనపరచే అవకాశాలు కూడా అంకురించాయి. ఇంతవరకు సంప్రదాయ ఇల్లాలి వలె ఇంటి పనులను చేస్తూ, శిశు సంరక్షణా భారాన్ని మోస్తూ, వేతనార్జనకు వెళుతున్న భర్తకు అవసరమైనన్ని వసతులను కూర్చుతూ ఉన్న స్త్రీ, తానే వేతనార్జనకు వెళుతున్నపుడు, ఇటువంటి సహాయాన్ని తనకు చేసేవారు కరువైనారు. రెండు షిఫ్టుల పనిని తానే చేసుకొనవలసి వచ్చింది. వారాంతపు సెలవు పేరిట ఆఫీసు పని నుండి ఒక రోజో, రెండు రోజులో విముక్తి లభించినా, వారం రోజులూ పేరుకుపోయిన ఇంటి పనులను చేయవలసి రావటం వల్ల ఆ "సెలవు" రోజులు శిక్షగా పరిణమిస్తున్నాయి. ఈ విధంగా వర్కింగ్ ఉమన్ రెండు షిఫ్టుల పని మధ్య అడకత్తెరలో పోకచెక్కవలె నలిగి పోవలసి వస్తున్నది. గృహ నిర్వహణలో పాలు పంచుకొమ్మని భర్తను కోరక తప్పటం లేదు. "ఈ పని పురుషుడు చేయదగినది గాదు; స్త్రీ చేయవలసినది" అని సంప్రదాయం సూచిస్తున్నది. ఆడవారి పనిగా దీనికి ముద్రపడింది. కనుక ఈ పనులను చేయటం పురుషునకు "పరువు తక్కువ"! ఇలాంటి స్థితిలో ఇంటి పనులలోనూ, పిల్లల పెంపకంలోనూ పాలు పంచుకొమ్మని ఇల్లాలు భర్తను అడగవలసి రావటం, వారి మధ్య పొరుపుకూ, మనస్పర్థలకు, ఒక్కొక్క సందర్భంలో ఘర్షణకూ కారణమవుతున్నది. ఈ వివాదం ముదిరితే వైవాహిక బంధమే ప్రమాదంలో పడే అవకాశాలు ఉన్నాయి.

వైవాహిక సంప్రదాయాన్ని "ఆర్థిక వనరుల పునః పంపక సాధనం"గా హెయిడీ హార్ట్‌మన్ అనే అమెరికన్ అర్థశాస్త్రవేత్త నిర్వచించారు. భర్త భార్యను పోషించటాన్ని, ఆవిడ తనకు పిల్లలను కన్నందుకు, వారిని పోషించి పెంచినందుకు భర్త ఇస్తున్న పారితోషికంగా పేర్కొన్నారు. పంథొమ్మిదవ శతాబ్దపు చివరి పాతిక సంవత్సరాల కాలంలోనూ, ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభకాలంలోనూ పురుష కార్మికులు "ఫామిలీ వేజ్"ని పొందటానికి కార్మిక సంఘాలు ఆందోళన చేశాయి. తమ భార్యా బిడ్డల పోషణకు తగినంతగా తమ వేతనం ఉండాలన్నది వీరి డిమాండు. స్త్రీలు కుటుంబ

పోషణా, సంరక్షణలకు బాధ్యులుగారు గనుక, పురుషులతో సమాన పనిని స్త్రీ చేసినా, స్త్రీ కార్మికుల కంటే తమకే అధిక వేతనం రావాలని పురుష కార్మికులు ఆందోళన చేశారు. ఇందువల్ల, స్త్రీ కార్మికులకు పురుష కార్మికులతో సమానమైన హోదాగాని, వేతనంగాని లభించటం లేదు. వేతన సమానత్వం లేకపోవటం చేత స్త్రీ పురుషుల ఆర్థిక పరిస్థితులు భిన్నంగా ఉండక తప్పటం లేదు. ఈ కారణం చేతనే లేబర్ మార్కెట్లో కూడా, సమాజంలోవలె "లోవర్‌క్లాస్", "అప్పర్ క్లాస్" అనే వర్గాలు అవతరించాయి!. "స్త్రీలు లోవర్ క్లాస్ వారు, పురుషులు అప్పర్ క్లాస్ వారూ అయినారు. వీరి ఆర్థిక ఆదాయ వ్యత్యాసాలను "సవరించే" "ఉపకరణంగా" వైవాహిక బంధం తయారైంది!

స్త్రీ పురుషుల ఆర్థిక వనరుల "పునఃపంపకపు టేర్పాటు" విడాకుల వల్ల విచ్ఛిన్న మయ్యే ప్రమాద మేర్పడింది. విడాకులను పొందిన తర్వాత కూడా పురుషుడు ఫామిలీవేజ్‌ని పొందుతూనే ఉంటాడు కాని భార్యాబిడ్డలకు దాని పంపకం మాత్రం జరగటం లేదు. "భార్యా భర్తలు సమరస భావంతో కాపురం చేయలేకపోతే విడాకులను తీసుకోవచ్చు; ఎవరి మార్గాన్ని వారు స్వేచ్ఛగా ఎన్నుకోవచ్చు" అని చెబుతూంటారు. ఇది వీనులకు విందుగా ఉంటుంది. కాని దీనివల్ల ఎవరు లాభిస్తున్నారు, ఎవరు నష్టపడుతున్నారు అన్న అంశాన్ని విస్మరిస్తున్నారు. స్త్రీలకు సంబంధించినంత వరకూ, ప్రధానంగా పెంచి పెద్దజేయవలసిన పిల్లలున్న స్త్రీలకు సంబంధించి నంతవరకూ, ఇది మేడి పండు వంటిదే.

విడాకులను పొందిన స్త్రీల ఆర్థిక పరిస్థితుల క్షీణతకు మూడు కారణాలు కనుపిస్తున్నాయి :

1. పిల్లల పోషణ, సంరక్షణా, స్త్రీల బాధ్యతగా సమాజం పరిగణిస్తూండటం;

2. విడాకులను తీసుకొన్న తర్వాత పిల్లల తండ్రి వారి పోషణా భారంలో పాలు పంచుకోకపోవటం;

3. పురుషుని కంటే స్త్రీ వేతనం (సంపాదన) తక్కువగా ఉండటం. ఈ కారణాల వల్ల స్త్రీ, వారి బిడ్డలు దారిద్ర్యంలో కూరుకుపోతూ ఉండగా పురుషుని స్థితిలో మార్పు నామమాత్రంగా ఉంటుంది. స్త్రీ కంటే పురుషుని పునర్వివాహ సంభవం అధికం గనుక, వారి జీవితం మెరుగు పడటానికి అవకాశాలు అధికంగా ఉంటాయి. ఇందువల్ల వీరిద్దరి మధ్యా అసమానతలు పెరుగుతూంటాయి. అమెరికా అనుభవాన్ని తీసుకొంటే జరిగే వివాహాలలో సగభాగం విడాకులతో అంతమవుతాయని సర్వేలు తెలియజేస్తున్నాయి వివాహితులలో సగం మంది స్త్రీలు దారిద్ర్యంలో కూరుకుపోయే అవకాశాలు అధికంగా ఉన్నట్లు స్పష్టమవుతున్నది. కనుకే ఆవిడ అణిగిమణిగి ఉందయినా వైవాహిక బంధం తెగకుండా చూచుకోవటానికి తాపత్రయ పడుతుంది ప్రొఫెసర్ అమార్త్య సేన్ ప్రతిపాదించిన "సహకారం - సంఘర్షణా" సూత్రానికిది చక్కని ఉదాహరణ. ఆధునిక సమాజంలో పురుషాధిక్యత కాల క్రమేణా బలహీన పడటానికి బదులు, రూపం మార్చుకొని అది రాజ్యం చేస్తూండటానికిది రుజువు వివాహబంధం నుండి విడాకుల వల్ల స్త్రీ ముఖ్యంగా సంతానమున్న స్త్రీ, బయట పడగలిగినా, ఈ ప్రక్రియ ఆవిడ పీడనకే అధికంగా వినియోగపడుతున్నది.

వేతనార్జన వల్ల కుటుంబంలో తనకు పెరిగిన హోదా, అధికారాన్ని చూచి ఉత్సాహపడుతున్న యువతి, ఆ రంగంలోని ఉన్నత పదవులకు చేరాలని తాపత్రయపడటాన్ని అత్యాశని చెప్పలేం. తనకు భర్తతోడి సమాన ప్రతిపత్తి లభించాలనీ, ఇంటి పనులలో భర్తకూడా పాలు పంచుకోవాలనీ ఇల్లాలు ఆశించటంలో తప్పులేదు. కాని ఇదే భార్యాభర్తల మధ్య వివాదాంశమై వారి వైవాహిక బంధానికే ప్రమాదాన్ని తెచ్చి పెడుతున్నది. స్త్రీ ఆశిస్తున్న దానికీ, ఆవిడకు లభిస్తున్న దానికి మధ్య ఎంత వ్యత్యాసం ఉన్నది! కనుకే, ఇంతకు పూర్వం విడాకులను తీసుకొని, బాధల పాలయిన తోటి స్త్రీల అనుభవాన్ని గమనించిన స్త్రీలు, ఆ బాధలు తమను చుట్టుముట్టకుండా ఉండాలని కోరటం సహజం కనుకే, ఇంటి పనిలో భర్త పాలు పంచుకోక పోయినా ఫరవాలేదు; వైవాహిక బంధం తెగకుండా ఉంటే చాలునన్న తాపత్రయంతో, బండెడు చాకిరీని రెండవ షిఫ్టులో చేయటానికే తలొగ్గుతున్నారు.

ఇచ్చట రెండు శక్తులు పరస్పర విరుద్ధంగా పనిచేయటం మనకు కనుపిస్తుంది. వేతనార్జనకు వెళుతున్న ఇల్లాలికి ఇంటిపనులు, పిల్లల పెంపకం మరొక షిఫ్టు పనిగా తయారవుతున్నాయి. రెండు షిఫ్టుల పనిని చేయలేక, ఇంటి

పనిలో పాలు పంచుకొమ్మని ఇల్లాలు భర్తను కోరక తప్పటం లేదు. భర్త సహృదయుడయినపుడు, ఈ పరిణామం కుటుంబంలో స్త్రీ పురుష సమానత్వానికి మార్గం సుగమం చేస్తుంది మగవారు మారటాన్నిది ప్రోత్సహిస్తుంది.

కాని మరొక శక్తి ఈ పరిణామ క్రమానికి వ్యతిరేకంగా పని చేస్తున్నది ఇంటి పనిలోనూ, పిల్లల పెంపకంలోనూ పాలు పంచుకోవటానికి భర్త అంగీకరించక పోయినపుడు, ఇల్లాలు వారిని బలవంతం చేయటానికి భయపడుతుంది. ఎంత భారమయినా, రెండవ షిఫ్టు పనిని తానే చేసుకు పోవటానికి సిద్ధపడుతుంది ఇందువల్ల, వృత్తి పరంగా ఆవిడ ఉన్నత పదవులకు ఎదగటం కష్టమవుతున్నది. అధిక వేతనార్జన గగనకుసుమ మవుతున్నది. ఇందువల్లనే, నూతన ఆర్థిక సాంఘిక విప్లవం ఇస్తున్న అవకాశాలను స్త్రీ వినియోగించుకోలేక పోతున్నది. ఆధునిక అణిచివేతకు తల ఒగ్గక తప్పటం లేదు. నూతన విప్లవ పురోగమనానికిది అవరోధంగా తయారైంది. ఇంటి పనిలో పాలు పంచుకోనొల్లని భర్తలకు విడాకులు రక్షణ కవచమైంది. ఈ కారణం వల్ల కూడా స్త్రీ పురుష వేతన వ్యత్యాసం క్రమంగా పెరుగుతున్నది

## వర్కింగ్ ఉమన్‌కు "పెట్టుబడి" కొరత

వేతనార్జనలో నున్న వ్యక్తికి వారు పురుషులైనా, స్త్రీలైనా ఇంట్లో లభించే సహకారము, సపోర్టు వారి వృత్తిపరమైన ఎదుగుదలకు ఎంతగానో తోడ్పడతాయి. వేతనార్జనకు వెళుతున్న ఇల్లాలు, తాను వృత్తిలో వెనకబడుతూ కూడా భర్త అభివృద్ధిని కోరి చేస్తున్న బండెడు చాకిరీ, ఇస్తున్న సహకారం సామాన్య దృష్టికి గోచరించదు. అది అమూల్యమైనదయి కూడా అదృశ్యంగానే ఉంటున్నది. ఉద్యోగాలు చేసే వ్యక్తులకు ఇంట్లో లభించే సపోర్టు, వ్యాపారికి మూలధనం వంటిది. కంపెనీ ఎగ్జిక్యూటివు అంతటి ఉన్నతోద్యోగంలో ఉన్న స్త్రీకి కూడా ఈ రకమైన సపోర్టు లభించక ఇబ్బంది పడుతూ ఉండటం కనుపిస్తుంది. ఒక సర్వేలో పాల్గొన్న స్త్రీ ఎగ్జిక్యూటివు, "నాకూ ఒక పెండ్లాం ఉంటే ఎంత బాగుండును" అని అనుకుంటూ ఉంటానని చెప్పారట! పంధొమ్మిదవ శతాబ్దంలో ఆర్థికరంగంలో ప్రవేశించిన పురుషులకు ఇల్లాండ్రు వారి కవసరమైనంత సహాయాన్ని చేశారు. వారిపుడు "ప్రయోజకులుగా" రాణిస్తున్నారు. ఇటువంటి అవకాశాలు స్త్రీలకు లభిస్తున్న ఈ కాలంలో వారికే ఇటువంటి సహాయము, సపోర్టులు కరువైనాయి. నూతన విప్లవం ఈ విధంగా స్త్రీ పురుషుల మధ్య అసమానతలను సృష్టించింది. ఇందువల్ల నిర్దయా ప్రపంచంలో ఇల్లు కూడా స్వర్గసీమ గాకుండా పోతున్నది.

నూతన విప్లవానికి కారణం ఆర్థిక పరిణామాలయినా, దాని ప్రభావం వైవాహిక బంధం మీద ఈ విధంగా కనుపిస్తున్నది. వేతనార్జనకు వెళ్ళే ఇల్లాలు అధిక పనిభారాన్ని మోయవలసి రావటం వల్ల ఆవిడ ఆరోగ్యం దెబ్బతినే అవకాశాలుంటాయి. ఇంతకంటే పెద్ద ప్రమాదం మరొకటి పొంచి ఉన్నది. బాధిత ఇల్లాలు భర్త ఎడల నిష్కల్మషమైన ప్రేమాభిమానాలను ప్రదర్శించ లేదు. సహాయం చేయని భర్త యెడల వైముఖ్యం ఆవిడలో ప్రవేశిస్తుంది అసంతృప్తి ఆరోగ్యప్రదమైన మనసులో చేరి, అతి ప్రమాదకరమైన కాలుష్యంగా పనిచేయనారంభిస్తుంది. ఈ మానసిక కాలుష్యం అంత సులభంగానూ, త్వరగానూ విరిగేది గాదు.

కొందరు ఇల్లాండ్రు, భర్త ఇంటిపనిలో పాలు పంచుకో నందుకు కూడా అంతగా బాధపడరు; సర్దుకు పోవటానికే ప్రయత్నిస్తారు. ఈ ఔదార్యప్రదర్శనకు వారు మరొకరకమైన మానసిక హింసను అనుభవించవలసి వస్తున్నది. కుటుంబంలో విలువలేని వ్యక్తిగా వారు తమను తాము నిందించుకొంటూంటారు. తమ వలె, తమ బిడ్డలు (ఆడపిల్లలు) కూడా బాధలు పడవలసి వస్తుందేమో నని ఆందోళన పడతారు. పైసా పారితోషికం గిట్టని గృహ నిర్వహణకు సమాజంలో విలువలేకుండా పోయిందే అని విచారిస్తారు. "విలువలేని" పనిని చేస్తూ, తాము, విలువలేని వ్యక్తులుగా జీవించవలసి వస్తున్నదే అని వ్యధపడతారు.

## మగవారు మారాలి

ఈ సమస్యల పరిష్కారానికి, నూతన విప్లవ పరిపూర్తికి పురుషులు మారటం అవసరం. ఇంటిపనిలో సగభాగాన్నైనా వారు పంచుకోవాలి. అంతేకాదు; మార్క్సిస్టు పితామహులలో ఒకరైన ఫ్రెడరిక్ ఏంగెల్స్ 1884వ సంవత్సరంలోనే చెప్పినట్లు "ప్రైవేట్ డొమెస్టిక్ వర్క్" ను "పబ్లిక్ ఇండస్ట్రీ" గా మార్చటం అవసరం.

## ఇంటిపని సామాజిక పరిశ్రమగా మారాలి

సమిష్టి ఆస్థిగా నున్న ఆలమందలూ గొర్ల మందలూ ఏ కాలంలో, ఏ విధంగా, ఒక్కొక్క కుటుంబపు స్వంత ఆస్థులుగా మారాయో ఈనాటి వరకూ తెలియదు. అనాగరిక సమాజపు కాలంలోనే ఈ పరిణామం సంభవించి ఉండాలి. నూతన సంపదకు మూలకారణమైన మందలూ, ఇతర వస్తువులూ కుటుంబంలో విప్లవాత్మక పరిణామాలను సృష్టించాయి. పోషణకు సంపాదించటం అనేది ఎల్లపుడూ పురుషుని బాధ్యత గానే ఉండేది అతడే ఉత్పత్తి చేసేవాడు; ఉత్పత్తి సాధనాలు అతని అదుపులో ఉండేవి. పశుల మందలు జీవనాధారమైన ఆస్థులుగా రూపొందాయి. తొలుత వాటిని మచ్చిక చేసిందీ, పోషించి పెంచిందీ పురుషుడే. అందువల్ల ఆలమందలు అతని స్వంత ఆస్థయినాయి. అవి వ్యాపార మార్పిడికి అనువయిన సరుకులయినాయి. వాటిని మారకం ఇచ్చి, బానిసలను కొనేవాడు. ఉత్పత్తిలో కుటుంబ పోషణకు పోగా మిగిలిన అదనపు సరుకు పురుషుని కంట్రోలులో ఉండేది. దానిని అనుభవించటం వరకే స్త్రీలకు అవకాశముండేది; కాని ఆ ఆస్థిలో ఆవిడకు భాగము ఉండేది గాదు. "కిరాతక" యోధుడు, వేటగాడు, ఇంట్లో ప్రథమ స్థానాన్ని స్త్రీకిచ్చి ద్వితీయ స్థానంలో తాను ఉండటంతో సంతృప్తి చెందాడు. "సౌమ్యుడైన" గొర్ల కాపరి,తన సంపద బలంతో ప్రథమ స్థానానికి చొచ్చుకుపోయి స్త్రీని ద్వితీయస్థానానికి నెట్టివేశాడు. ఆవిడ ఫిర్యాదు చేయలేక పోయింది. కుటుంబపు శ్రమ పంపక విధానం, స్త్రీ పురుషుల మధ్య ఆస్థి పంపకాన్ని నియమిత పరచింది... కుటుంబపు వెలుపల పని విభజన మారటం వల్ల కుటుంబంలో, వ్యక్తుల మధ్య ఇంతవరకూ ఉన్న సంబంధం తారుమారైంది. ఇంతవరకూ గృహ నిర్వహణా బాధ్యతలను నిర్వహిస్తూ, ఇంటి పెద్దగా వ్యవహరించటానికి స్త్రీకి తోడ్పడిన కారణమే, ఇపుడు పురుషుని సర్వాధికారినిగా చేసింది.కుటుంబ పోషణకు పురుషుడు చేసే శ్రమతో పోల్చినపుడు, స్త్రీ చేస్తున్న ఇంటిపని విలువలేనిదైంది; ప్రాధాన్యతను కోల్పోయింది. పురుషుని శ్రమ కుటుంబ సర్వస్వమై, స్త్రీ శ్రమకు విలువ లేకుండా పోయింది. సామాజికోత్పత్తిలో స్త్రీలు పాలుపంచుకోకుండా ప్రైవేట్ వ్యవహారంగా పరిగణనకు వస్తున్న ఇంటిపనులు చేయటానికే పరిమితమైనంత కాలము వారు ఈ స్థితిలో ఉండవలసిందే. విస్తృత ప్రాతిపదిక మీద, సామాజిక స్థాయి ఉత్పత్తిలో స్త్రీలు పాల్గొనే అవకాశాలు లభించి, గృహ నిర్వహణకు వారు ప్రదర్శించవలసిన శ్రద్ధ కనీస స్థాయికి పడిపోయినపుడు మాత్రమే స్త్రీ విముక్తి సాధ్యమవుతుంది. పెద్దయెత్తున ఆధునిక పారిశ్రామికోత్పత్తి జరుగుతున్నందున ఇది సాధ్యమవుతుంది. అసంఖ్యాక స్త్రీల ప్రవేశానికీ పరిణామం దారి దీయటమే కాదు; ఇది సంభవించటం; అవసరం. అంతేకాదు; ఈ పరిణామం ఇంటి పనిని (డొమెస్టిక్ వర్కును) సామాజిక పరిశ్రమగా (పబ్లిక్ ఇండస్ట్రీగా) మార్చటానికి దారిదీస్తుంది.

*-" ది ఆరిజిన్ ఆఫ్ ది ఫామిలీ ప్రైవేట్ ప్రాపర్టీ అండ్ ది స్టేట్" అన్న రచనలో ఫ్రెడరిక్ ఏంగెల్స్*

ఇందుకు తొలి ప్రయత్నం సోవియట్ యూనియన్లో జరిగింది. ఈ విధానపు అమలు వల్ల పారిశ్రామిక, ఆర్థిక రంగాలలో స్త్రీలు పాల్గొనటం గణనీయంగా పెరిగింది గాని, ఇంటిపనుల పంపకం దంపతుల మధ్య జరుగవలసి నంత న్యాయంగా మాత్రం జరుగలేదని పలుపురు సోషియాలజిస్టులు రిపోర్టు చేశారు. వేతనార్జనకు వెళ్ళటమే స్త్రీ విముక్తిగా యెంచారే తప్ప, భార్యాభర్తల మధ్య ఇంటిపనుల పంపకానికి తగినంత ప్రాధాన్యత లభించలేదు. పురుషాధిక్యతా భావం చావలేదు. ఆ దేశంలో విడాకుల సంఖ్య క్రమంగా పెరుగుతూ పోతూండటానికి, గృహ నిర్వహణ, పిల్లల పెంపకపు బాధ్యతల అసమాన పంపకమే ప్రధాన కారణమని కొందరు రిపోర్టు చేశారు.

భార్యాభర్త లిద్దరూ వేతనార్జనకు వెళ్ళే కుటుంబాల రక్షణకు ప్రభుత్వం కంకణం కట్టుకోవాలి. వైవాహిక బంధాలు సురక్షితంగా ఉండటానికి, సంసారాలు స్వర్గసీమలుగా వెలుగొందటానికి అవసరమైన చర్యలను సమాజం తీసుకోవాలి.

విడాకుల సంఖ్యను కనీస పరిమితికి తగ్గించగలిగినపుడు ఇందువల్ల నష్టపోయే పిల్లల సంఖ్య కూడా తగ్గుతుంది. భావి జీవితంలో వారు ప్రమాదాలలో చిక్కుకొనే అవకాశాలు తగ్గుతాయి. ఇల్లాలు కన్నీరు బెట్టవలసిన అవసరం ఉండదు. ప్రభుత్వానికే కాదు; పారిశ్రామిక వ్యాపార సంస్థలు కూడా కార్మిక శ్రేయోకార్యక్రమాలను చిత్తశుద్ధితో అమలు జరపాలి. ఇందువల్ల ఉద్యోగులు విధులకు గైరు హాజరు తగ్గుతుంది. ఇద్దరు వ్యక్తులు ఒకే ఉద్యోగంలో పాలు పంచుకోవటం (జాబ్ షేరింగ్ అని ఇంగ్లీషులో వ్యవహరిస్తున్నారు), ఇంటి పనులను చక్కబెట్టుకోవటానికి తగినట్లు ఉద్యోగ విధి నిర్వహణా కాలంలో మార్పులను చేసుకోవటానికి (దీన్ని ఫ్లెక్స్ టైం అని అంటున్నారు), పార్ట్ టైం పనికి తగిన వసతిని కల్పించవచ్చు. ఉద్యోగుల బిడ్డల కోసం డే కేర్ సెంటర్ల నిర్వహణావసరాన్ని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

ఇలాంటి వసతుల ఏర్పాటు అసంభవమనీ, ఇది ఊహాజనిత భావమని తోసివేయ నవసరం లేదు. ఎనిమిది గంటల పనిదినము, స్త్రీలకు ఓటింగు హక్కు ఒకనాడు ఊహాజనితాలు గానే కనుపించాయి. కాని కాలక్రమేణా ఇవి ఆచరణలోని కొచ్చాయి. అలాగే ఇలాంటి కార్యక్రమాలు కూడా ఆచరణలోనికి రావాలి. వచ్చి తీరతాయి కొంచెం కాలవ్యవధి పడితే పట్టవచ్చు. ఇలాంటి మార్పులు రావటం, ఉద్యోగినికి ఎంత అవసరమో, సంస్థల యజమానులకూ అంత అవసరం. ఇది ఏ ఒక్క వ్యవస్థో చేయగల కార్యం కాదు. ప్రభుత్వమూ, వ్యాపార, పారిశ్రామిక సంస్థలూ, సమాజమూ, ట్రేడ్ యూనియన్లూ తగిన కార్యక్రమరూప కల్పనకూ, దీని అమలుకూ పూనుకోవాలి

బయటి సహాయం ఎంత లభించినా ఇంటిలోని వ్యక్తుల సహాయానికి దీటుగా ఉండదు. వేతనార్జనకు వెళుతున్న భార్యాభర్తలు ఇంటిపనిని, పిల్లల పెంపకపు బాధ్యతలను సహృదయంతో సమంగా పంచుకొంటున్నపుడు, వారి వైవాహిక జీవనం ఆనందమయంగా ఉంటుంది. ఈ విషయాన్ని, జరిగిన పలు సర్వేలు నిరూపించాయి. ఇలాంటి దంపతులు "ఆడపని", "మగపని" అన్న తేడాలు చూడకుండా ఎవరికి చేతనయిన పనిని, వారికున్న కాల వ్యవధిని బట్టి చేసుకుంటూ పోతారు. సమరస భావము, ఇచ్చి పుచ్చుకోలు స్వభావము వారి ఆనందమయ జీవనానికి మూలమవుతుంది. ఇచ్చిపుచ్చుకోళ్ళు, విలువైన బంగార వస్తువులే అయి ఉండనవసరం లేదు. కలసి కట్టుగా సమరస భావంతో ఎవరకు చేతనైన పనిని వారు చేయటమే భార్యాభర్తలు ఇచ్చిపుచ్చుకొనే బహుమానాలు, కానుకలు. ఇలా మారిన పురుషుని చేబట్ట గలిగిన స్త్రీ అదృష్టవంతురాలు. ప్రభుత్వమూ, సమాజము ఇటువంటి జీవన విధానాన్ని ప్రోత్సహించాలి. ఈ ఆదర్శాన్ని, పెద్దలను చూచి పిన్నలు పాటిస్తారు. ఇలా మగవారు మారగలిగినపుడు వేతనార్జనకు వెళ్ళే దంపతుల కుటుంబ జీవనంలో ఇంటిపని, పిల్లల సంరక్షణ ఇల్లాలికి రెండవ షిఫ్టుపనిగా మారదు. అది భార్యాభర్తల మధ్య కలతలకూ, తగువులాటకూ దారిదీయదు. వారి జీవనం ప్రేమ పూరితంగా ఉంటుంది.

"జనాభాలో సగభాగంగా ఉన్న స్త్రీల సృజనాత్మక శక్తులను అభివృద్ధి పరచి, వాటిని సామాజికోత్పత్తికి వినియోగించటం అవసరం. ఈ విషయ విస్మరణ వల్ల గత రెండు దశాబ్దాల కాలంలోనూ అభివృద్ధిలో మందగింపు కనుపిస్తున్నది... మానవుల ఉత్పత్తి శక్తి నంతటినీ విడుదల చేసి దానిని వినియోగించుకొన్నపుడే మనం మానవాభివృద్ధిని సాధించగలుగుతాం మన అభివృద్ధి కృషి స్త్రీల అభివృద్ధికి వినియోగపడనపుడు, ఆ అభివృద్ధే ప్రమాదంలో చిక్కే అవకాశముంటుంది" అని యు యన్ డి పి హెచ్చరించింది.

ఈ సామాజిక సూత్రాన్నే సుమతి శతక కర్త వెయ్యి సంవత్సరాలకు పూర్వమే నీతి సూత్రంగా చెప్పారు :

"................ . .................

........... . ................ . ....

*కలకంఠి కంట కన్నీ*

*రొలికిన సిరి యింట నుండ నొల్లదు.......*"

స్త్రీని బాధించే ఏ సమాజమూ బాగుపడదు. కనుక స్త్రీలను జాలిదలచి మగవారు మారనవసరం లేదు. ప్రేమ పూరిత వైవాహిక జీవనం కోసం, సకల సంపదల కోసం, తమ బిడ్డల బంగారు భవిష్యత్తుకోసం, సమాజ కళ్యాణం కోసం మగవారు మారాలి.

సర్వేజనా స్సుఖినోభవంతు



# అనుబంధము

అభివృద్ధిలో వివిధ వర్గీకరణల క్రిందకు వచ్చే దేశాల పేర్లను, ప్రపంచంలోని వివిధ భౌగోళిక మండలాలలో నున్న దేశాల పేర్లను ఆయా వర్గీకరణానుసారంగా ఇచ్చాం. ఇంగ్లీషు అక్షర క్రమంలో వ్రాసియున్న ఈ దేశాల పేర్లను అదే వరుస క్రమంలో ఇచ్చాం. కనుక దానిని ర్యాంకింగ్‌గా గాక, దేశాల పేర్ల పట్టికగా మాత్రమే పరిగణించాలి.

**అభివృద్ధి చెందిన లేక పారిశ్రామిక దేశాలు**

ఆల్బేనియా
ఆర్మేనియా
ఆస్ట్రేలియా
ఆస్ట్రియా
అజర్‌బెయిజాన్
బెలరూస్
బల్గేరియా
కెనడా
క్రొయేషియా
జెక్ రిపబ్లిక్
డెన్మార్క్
ఎస్టోనియా
ఫిన్లండ్
ఫ్రాన్స్
జార్జియా
జర్మనీ
గ్రీస్
హంగరీ
ఐస్లెండ్
ఐర్లెండ్
ఇజ్రాయెల్
ఇటలీ
జపాన్
కజకిస్తాన్
కిర్ఘిజ్‌స్తాన్
లట్వియా
లిథూనియా
లెగ్జెంబర్గ్
మెసిడోనియా
మాల్టా
మాల్డోవా
నెదర్లెండ్స్
న్యూజీలెండ్
నార్వే
పోలెండ్
పోర్చుగల్
రొమేనియా
రష్యన్ ఫెడరేషన్
స్లొవాకియా
స్లొవేనియా
స్పెయిన్
స్వీడన్
స్విట్జర్లండ్
తజికిస్తాన్
ఉక్రెయిన్
యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా
ఉజెబికిస్తాన్

**అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాలు**

ఆఫ్ఘనిస్తాన్
అల్జీరియా
అంగోలా
అర్జెంటీనా
బహమాస్
బెహరీన్
బంగ్లాదేశ్
బార్బడోస్
బెలిజీ
భూటాన్
బొలివియా
బ్రెజిల్
బ్రౌనీ దారుస్సలాం
బర్కీనా ఫాసో
బురుండీ
కంబోడియా
కమరూన్
కేప్‌వెర్డీ
సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్
చాద్
చిలీ
చైనా
కొలంబియా

కమరూన్
కాంగో
కోస్టారికా
ఐవరీకోస్ట్
క్యూబా
సైప్రస్
డ్జిబౌటీ
డొమినికా
డొమినికన్ రిపబ్లిక్
ఈక్వెడార్
ఈజిప్ట్
ఎల్ సాల్వెడార్
ఈక్విటోరియల్ గినీ
ఎరిట్రియా
ఇథియోపియా
ఫీజీ
గబొన్
గాంబియా
ఘనా
గ్రెనెడా
గ్వాటెమాలా
గినీ
గినియా బిస్సు
గుయానా
హెయిటీ
హొండూరాస్
ఇండియా
ఇండొనీషియా
ఇరాన్
ఇరాక్
జమైకా
జోర్డాన్
కీన్యా
దక్షిణ కొరియా
ఉత్తర కొరియా
కువైట్
లావోస్
లెబొనాన్
లెసోతో
లైబీరియా
లిబియా
మెడగాస్కర్
మాలావి
మలేషియా
మాల్దీవ్స్
మాలి
మారిటానియా
మెక్సికో
మంగోలియా
మొరాకో
మొజాంబిక్
మయన్మార్
నమీబియా
నేపాల్
నికరాగ్వా
నైజర్
నైజీరియా
ఓమన్
పాకిస్తాన్
పనామా
పాపూ న్యూగినీ
పెరాగ్వే
పెరూ
ఫిలిపీన్స్
క్వాటార్
రువాండా
సెయింట్ కిట్స్ అండ్ నెవిస్
సెయింట్ లూసియా
సెయింట్ విన్సెంట్
సౌదీ అరేబియా
సెనెగల్
సెషలిస్
సియారా లియోన్
సింగపూర్
సాలొమన్ దీవులు
సోమాలియా
దక్షిణ ఆఫ్రికా
శ్రీలంక
సుడాన్
సురినామ్
స్వాజీలాండ్
సిరియా
టాంజనియా
తాయ్‌లాండ్
టొగొ
ట్రినిడాడ్ అండ్ టొబాగో
ట్యునీషియా
టర్కీ
ఉగాండా
యునైటెడ్ అరబ్ అమీరేట్స్

ఉరుగ్వే
వెనుజులా
వియత్నాం
యమెన్
జైర్
జాంబియా
జింబాబ్వే

**అభివృద్ధిలో వెనుకబడిన దేశాలు**

ఆఫ్ఘనిస్తాన్
అంగోలా
బంగ్లాదేశ్
బెనిన్
భూటాన్
బర్కీనా ఫాసో
బురుండీ
కంబోడియా
కేప్ వెర్డి
సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్
చాద్
కమరూస్
డ్జిబౌటీ
ఈక్విటోరియల్ గినీ
ఎరిట్రియా
ఇథియోపియా
గాంబియా
గిని
గినియా-బిస్సు
హెయిటీ
లావోస్
లెసోతో
లైబీరియా
మెడగాస్కర్
మాలావి
మాల్దీవ్స్
మాలి
మారుటానియా
మొజాంబిక్
మయన్మార్
నేపాల్
నైజర్
రువాండా
సియారా లియోన్
సోలొమన్ దీవులు
సోమాలియా
సుడాస్
టాంజనియా
టొగో
ఉగాండా
యెమెన్
జైర్
జాంబియా

---

## వివిధ భౌగోళిక మండలాలలోని దేశాలు

**సబ్-సహారన్ ఆఫ్రికా**

అంగోలా
బెనిన్
బోట్స్‌వానా
బర్కీనా ఫాసో
బురుండీ
కమరూన్
కేప్ వెర్డి
సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్
చాద్
కమరూస్
కాంగో
ఐవరీ కోస్ట్
ఈక్విటోరియల్ గిని
ఎరిట్రియా
ఇథియోపియా
గబాన్
గాంబియా
ఘనా
గిని
గినియా-బిస్సు
కీన్యా
లెసోతో
లైబీరియా
మెడగాస్కర్
మాలావి
మాలి
మారిటానియా
మారిషస్
మొజాంబిక్

నమీబియా
నైజర్
నైజీరియా
రువాండా
సెనెగల్
సెషలిస్
సియారా లియోన్
దక్షిణ ఆఫ్రికా
స్వాజీలాండ్
టాంజనియా
టాగో
ఉగాండా
జైర్
జాంబియా
జింబాబ్వే

**అరబ్బు దేశాలు**

అల్జీరియా
బెహరీన్
డ్జిబౌటీ
ఈజిప్టు
ఇరాక్
జోర్డాన్
కువైట్
లెబొనాన్
లిబియా
మొరాకో
ఓమన్
క్వాటార్
సౌదీ అరేబియా
సోమాలియా
సుడాన్
సిరియా
ట్యూనీషియా
యునైటెడ్ ఆరబ్ అమిరేట్స్
యెమెన్

**తూర్పు ఆసియా**

చైనా
ఉత్తర కొరియా
దక్షిణ కొరియా
మంగోలియా
జపాన్

**ఆగ్నేయ ఆసియా, పసిఫిక్ దేశాలు**

బ్రౌనీ దారుస్సలాం
కంబోడియా
ఫీజీ
ఇండోనీషియా
లావోస్
మలేషియా
మయన్మార్
పాపూ న్యూగినీ
ఫిలిపీన్స్
సింగపూర్
సాలొమన్ దీవులు
తాయ్‌లాండ్
వియత్నాం

దక్షిణ ఆసియా

అఫ్ఘనిస్తాన్
బంగ్లాదేశ్
భూటాన్
భారతదేశము
ఇరాక్
మాల్దీవ్స్
నేపాల్
పాకిస్తాన్
శ్రీలంక

ఒషీనియా

ఆస్ట్రేలియా
న్యూజీలెండ్

**లాటిన్ అమెరికా, కరిబియన్**

అర్జెంటీనా
బహమాస్
బార్బడోస్
బెలిజీ
బొలివియా
బ్రెజిల్
చీలీ
కొలంబియా
కోస్టారికా
క్యూబా
డొమినీషియా
డొమినికన్ రిపబ్లిక్
ఈక్వెడార్
ఎల్ సాల్వెడార్
గ్రెనెడా
గ్వాటేమాలా
గుయానా
హెయిటీ
హండూరాస్
జమైకా

మెక్సికో
నికరాగ్వా
పనామా
పెరాగ్వే
పెరూ
సెయింట్ కిట్స్ అండ్ నెవిస్
సెయింట్ లూసియా
సెయింట్ విన్సెంట్
సురినాం
ట్రినిడాడ్ అండ్ టొబాగో
ఉరుగ్వే
వెనిజులా

ఉత్తర అమెరికా
యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా
కెనడా

తూర్పు యూరపు

కామన్వెల్త్, ఆఫ్
ఇండిపెండెంట్ స్టేట్స్
ఆల్బేనియా
ఆర్మేనియా
బెలరూస్
బల్గేరియా
క్రొయేషియా
జెక్ రిపబ్లిక్
ఎస్టోనియా
హంగరీ
కజకస్తాన్
కిర్ఘిజ్‌స్తాన్
లట్వియా
లిథూనియా
మెసిడోనియా
మాల్డోవా
పోలెండ్
రొమేనియా
రష్యన్ ఫెడరేషన్
స్లొవాకియా
స్లొవేనియా
తజకిస్తాన్
టర్క్‌మినిస్తాన్
ఉక్రెయిన్
ఉజెబెకిస్తాన్

పశ్చిమ, దక్షిణ యూరపు
ఆస్ట్రియా
బెల్జియం
డెన్మార్క్
ఫిన్లండ్
ఫ్రాన్స్
జర్మనీ
గ్రీస్
ఐస్‌లెండ్
ఐర్లెండ్
ఇటలీ
లెక్జెంబర్గ్
మాల్టా
నెదర్లెండ్స్
నార్వే
పోర్చుగల్
స్పెయిన్
స్వీడన్

ఓయిసిడి దేశాలు*
ఆస్ట్రేలియా
ఆస్ట్రియా
బెల్జియం
కెనడా
జెక్ రిపబ్లిక్
డెన్మార్క్
ఫిన్లండ్
ఫ్రాన్స్
జర్మనీ
గ్రీస్
హంగరీ
ఐస్‌లెండ్
ఐర్లెండ్
ఇటలీ
జపాన్
లెగ్జెంబర్గ్
మెక్సికో
నెదర్లెండ్స్
న్యూజీలెండ్
నార్వే
పోలెండ్
పోర్చుగల్
స్పెయిస్
స్వీడన్
స్విట్జర్లెండ్
టర్కీ
యునైటెడ్ కింగ్డం
యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా

నార్డిక్ దేశాలు
డెన్మార్క్
ఫిన్లెండ్
ఐస్లెండ్
నార్వే
స్వీడన్

ఆర్గనైజేషన్ ఫర్ ఎకనామిక్ కో ఆపరేషన్ అండ్ డెవలప్‌మెంట్‌కు "ఓ యి సి డ" సంక్షిప్తనామం

*- హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 1998 నుండి*